శ్రీమద్రామాయణాంతర్గత

# యుద్ధకాండము

ఆంధ్రతాత్పర్యసహితము.



వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్సు

భరద్వాజాశ్రమం ప్రాప్య వవందే నియతో మునిమ్,
ఇత్యాది శ్రూయతాం నృణాం యావత్పట్టాభిషేచనమ్.
సర్వకార్యాణి సిద్ధ్యంతి పాపరాశిశ్చ నశ్యతి.

---

స్మార్తాదీనాం సర్వేషాం శ్రీమద్రామాయణపారాయణాదౌ
కర్తవ్యపూజావిధానమ్.

---

ఆచమ్య, ప్రాణానాయమ్య. మమోపాత్త...శుభే శోభనే ముహూర్తే అస్యాం శుభతిథౌ శ్రీసీతాలక్ష్మణభరతశత్రుఘ్నహనుమత్సమేత శ్రీరామచంద్రదేవతా ప్రీత్యర్థం యావచ్ఛక్తి ధ్యానావాహనాదిషోడశోపచారపూజాం కరిష్యే, ఆదౌ నిర్విఘ్నేన పరిసమాప్త్యర్థం గణాధిపతిపూజాం కరిష్యే. తదంగత్వేన కలశపూజాం కరిష్యే. కలశపూజాం గణపతిపూజాం చ కృత్వా, వైదేహీసహితం సురద్రుమతలే హైమే మహామంటపే మధ్యేపుష్పకమాసనే మణిమయే వీరాసనే సుస్థితమ్, అగ్రే వాచయతి ప్రభంజనసుతే తత్త్వం మునిభ్యః పరం వ్యాఖ్యాంతం భరతాదిభిః పరివృతం రామం భజే శ్యామలమ్. తత శ్రీమతో శ్లోకోపరి శ్రీరామధ్యానావాహనాదినైవేద్యాంతపూజా విధేయా. శ్రీరామచంద్రదేవతాభ్యాం నమః. ధ్యానావాహనాదిషోడశోపచారపూజాం చ కృత్వా.

---

శ్రీమద్రామాయణపారాయణారంభక్రమః.

సద్గురుసకాశాల్లబ్ధోపదేశో వక్ష్యమాణరీత్యా శ్రీరామాయణపారాయణం కుర్యాత్ - దేశకాలౌ సంకీర్త్య—

అస్య శ్రీరామాయణమహామంత్రస్య వాల్మీకిర్భగవాన్ ఋషిః - అనుష్టుప్ఛందః - శ్రీసీతాలక్ష్మణభరతశత్రుఘ్నహనుమత్సమేతశ్రీరామచంద్రో దేవతా - రాం బీజం - శ్రీం శక్తిః-మం కీలకం - మమ శ్రీసీతాలక్ష్మణభరతశత్రుఘ్నహనుమత్సమేతశ్రీరామచంద్రప్రసాదసిద్ధ్యర్థే పారాయణజపే వినియోగః-రాం అంగుష్ఠాభ్యాంనమః - రీం తర్జనీభ్యాం స్వాహా - రూం మధ్యమాభ్యాం వషట్-రైం అనామికాభ్యాం హుం-రౌం కనిష్ఠికాభ్యాం వౌషట్-రః కరతలకరపృష్ఠాభ్యాంఫట్ - రాం హృదయాయ నమః-రీం శిరసే స్వాహా - రూం శిఖాయై వషట్-రైం కవచాయ హుం-రౌం నేత్రత్రయాయ వౌషట్ - రః అస్త్రాయ ఫట్. లోకత్రయేణ దిగ్బంధః. ధ్యానమ్.—

కాలాంభోధరకాంతికాంత మనిశం వీరాసనాధ్యాసినం
ముద్రాం జ్ఞానమయీం దధాన మపరం హస్తాంబుజం జానుని,
సీతాంపార్శ్వగతాం సరోరుహకరాం విద్యున్నిభాం రాఘవం
పశ్యంతం మకుటాంగదాదివివిధాకల్పోజ్జ్వలాంగం భజే.

## అథ మానసికపూజా.

లం పృథివ్యాత్మనే శ్రీరామచంద్రపరబ్రహ్మణే గంధం సమర్పయామి-హం ఆకాశాత్మనే శ్రీరామచంద్రపరబ్రహ్మణే పుష్పం సమర్పయామి - యం వాయ్వాత్మనే శ్రీరామచంద్రపరబ్రహ్మణే ధూపమాఘ్రాపయామి - రం అగ్న్యాత్మనే శ్రీరామచంద్రపరబ్రహ్మణే దీపం దర్శయామి - వం అమృతాత్మనే శ్రీరామచంద్రపరబ్రహ్మణే అమృతోపహారం సమర్పయామి - సం సర్వాత్మనే శ్రీరామచంద్రపరబ్రహ్మణే సర్వోపచారపూజా

స్సమర్పయామి-ఇతి మానసికపూజా.

మూలమన్త్రః—ధర్మాత్మా సత్యసంధశ్చ రామో దాశరథిర్యది, పౌరుషే చాప్రతిద్వంద్వశ్శరైనం జహి రావణిమ్.

ఇతి యథాశక్తి జపిత్వా శ్రీరామాయణపారాయణం కుర్యాత్. అనంతరం పునః ధ్యానం మానసికపూజాం హృదయాదిన్యాసం చ కుర్యాత్-శ్లోకత్రయేణ దిగ్విమోకః.
గుహ్యాతిగుహ్యగోప్తా త్వం గృహాణాస్మత్కృతం జపం,
సిద్ధిర్భవతు మే దేవ! త్వత్ప్రసాదా ద్రఘూద్వహ!.

శ్రీవైష్ణవానాం

శ్రీమద్రామాయణపఠనోపక్రమానుసంధేయక్రమః.

ప్రథమతః 'శ్రీశైలేశ' (శ్రీమాన్వేంకట)ఇత్యాదిస్వస్వసంప్రదాయనిర్వాహకాచార్యానుసంధానం, తతః 'లక్ష్మీనాథే'త్యారభ్య 'ప్రణతోఽస్మి నిత్య'మిత్యంతం, అనంతరం శ్రీశైలపూర్ణవిషయం, 'పితామహ'స్యేతి శ్లోకమారభ్య శ్రీభాష్యకారగద్యస్వాచా(ర్యాది)ర్యపర్యంతవిషయాస్సాంప్రదాయికశ్లోకా అనుసంధేయాః యద్వా శ్రీధరాదిస్వాచార్యపర్యంతాః ప్రతివ్యక్తిశ్లోకా అనుసంధేయాః. తతః—
కూజంతం రామ రామేతి మధురం మధురాక్షరమ్,
ఆరుహ్య కవితాశాఖాం వందే వాల్మీకికోకిలమ్.
వాల్మీకే ర్మునిసింహస్య కవితావనచారిణః,
శృణ్వన్ రామకథానాదం కో న యాతి పరాం గతిమ్.
యః పిబన్ సతతం రామచరితామృతసాగరమ్,
అతృప్త స్తం మునిం వందే ప్రాచేతస మకల్మషమ్.

గోష్పదీకృతవారాశిం మశకీకృతరాక్షసమ్,
రామాయణమహామాలారత్నం వందేఽనిలాత్మజమ్.
అంజనానందనం వీరం జానకీశోకనాశనమ్,
కపీశ మక్షహంతారం వందే లంకాభయంకరమ్.
మనోజవం మారుతతుల్యవేగం జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠమ్, వాతాత్మజం వానరయూథముఖ్యం శ్రీరామదూతం శిరసా నమామి.
ఉల్లంఘ్య సింధోస్సలిలం సలీలం యశ్శోకవహ్నిం జనకాత్మజాయాః, ఆదాయ తేనైవ దదాహ లంకాం నమామి తం ప్రాంజలి రాంజనేయమ్.
ఆంజనేయమతిపాటలాననం కాంచనాద్రికమనీయవిగ్రహమ్,
పారిజాతతరుమూలవాసినం భావయామి పవమాననందనమ్.
యత్ర యత్ర రఘునాథకీర్తనం తత్ర తత్ర కృతమస్తకాంజలిమ్,
బాష్పవారిపరిపూర్ణలోచనం మారుతిం నమత రాక్షసాంతకమ్.
వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే,
వేదః ప్రాచేతసా దాసీ త్సాక్షా ద్రామాయణాత్మనా.
తదుపగతసమాససంధియోగం సమమధురోపనతార్థవాక్యబద్ధమ్, రఘువరచరితం మునిప్రణీతం దశశిరసశ్చ వధం నిశామయధ్వమ్. శ్రీరాఘవం దశరథాత్మజమప్రమేయం సీతాపతిం రఘుకులాన్వయరత్నదీపమ్, ఆజానుబాహుమరవిందదళాయతాక్షం రామం నిశాచరవినాశకరం నమామి.
వైదేహీసహితం సురద్రుమతలే హైమే మహామంటపే
మధ్యేపుష్పకమాసనే మణిమయే వీరాసనే సుస్థితమ్,
అగ్రే వాచయతి ప్రభంజనసుతే తత్త్వం మునిభ్యః పరం

వ్యాఖ్యాంతం భరతాదిభిః పరివృతం రామం భజే శ్యామలమ్.
తతో యథాశక్తి శ్రీకోశోపరి భగవదారాధనం కర్తవ్యమ్.

---

పారాయణసమాపనక్రమః.

ఏవమేతత్పురావృత్త మాఖ్యానం భద్ర మస్తు వః,
ప్రవ్యాహరత విస్రబ్ధం బలం విష్ణోః ప్రవర్ధతామ్.
లాభ స్తేషాం జయ స్తేషాం కుత స్తేషాం పరాభవః,
యేషా మిందీవరశ్యామో హృదయే సుప్రతిష్ఠితః.
కాలే వర్షతు పర్జన్యః పృథివీ సస్యశాలినీ,
దేశోఽయం క్షోభరహితో బ్రాహ్మణా స్సంతు నిర్భయాః.
కావేరీ వర్ధతాం కాలే (౨) కాలే వర్షతు వాసవః,
శ్రీరంగనాథో జయతు శ్రీరంగశ్రీశ్చ వర్ధతామ్.
స్వస్తిప్రజాభ్యః పరిపాలయంతాం న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః, గోబ్రాహ్మణేభ్యశ్శుభమస్తు నిత్యం లోకాస్సమస్తా స్సుఖినో భవంతు.
మంగళం కోసలేంద్రాయ మహనీయగుణాబ్ధయే,
చక్రవర్తితనూజాయ సార్వభౌమాయ మంగళమ్.
వేదవేదాంతవేద్యాయ మేఘశ్యామలమూర్తయే,
పుంసాం మోహనరూపాయ పుణ్యశ్లోకాయ మంగళమ్.
విశ్వామిత్రాంతరంగాయ మిథిలానగరీపతేః,
భాగ్యానాం పరిపాకాయ భవ్యరూపాయ మంగళమ్.
పితృభక్తాయ సతతం భ్రాతృభి స్సహ సీతయా,
నందితాఖిలలోకాయ రామభద్రాయ మంగళమ్.
త్యక్తసాకేతవాసాయ చిత్రకూటవిహారిణే,
సేవ్యాయ సర్వయమినాం ధీరోదారాయ మంగళమ్.

సౌమిత్రిణా చ జానక్యా చాపబాణాసిధారిణే,
సంసేవ్యాయ సదా భక్త్యా స్వామినే మమ మంగళమ్.
దండకారణ్యవాసాయ ఖండితామరశత్రవే,
గృధ్రరాజాయ భక్తాయ ముక్తిదాయాస్తు మంగళమ్.
సాదరం శబరీదత్తఫలమూలాభిలాషిణే,
సౌలభ్యపరిపూర్ణాయ సత్త్వోద్రిక్తాయ మంగళమ్.
హనుమత్సమవేతాయ హరీశాభీష్టదాయినే,
వాలిప్రమథనాయాస్తు మహాధీరాయ మంగళమ్.
శ్రీమతే రఘువీరాయ సేతూల్లంఘితసింధవే,
జితరాక్షసరాజాయ రణధీరాయ మంగళమ్.
ఆసాద్య నగరీం దివ్యా మభిషిక్తాయ సీతయా,
రాజాధిరాజరాజాయ రామభద్రాయ మంగళమ్.
మంగళాశాసనపరై ర్మదాచార్యపురోగమైః,
సర్వై శ్చ పూర్వై రాచార్యై స్సత్కృతాయాస్తు మంగళమ్.
తతః పితామహస్యైతాన్యారభ్య స్వాచార్యాంతశ్లోకా స్వాచార్యాది భగవత్పర్యంతావా శ్లోకాః అనుసంధేయాః.

---

## శ్రీస్మార్తమధ్వాదీనాం శ్రీమద్రామాయణ పఠనోపక్రమానుసంధేయక్రమః.

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్,
ప్రసన్నవదనం ధ్యాయే త్సర్వవిఘ్నోపశాంతయే.
వాగీశాద్యా స్సుమనస స్సర్వార్థానా ముపక్రమే,
యం నత్వా కృతకృత్యా స్స్యు స్తం నమామి గజాననమ్.
తతః శ్రీమచ్ఛంకరాచార్యాది గురుపరంపరాఽనుసంధేయా.

దోర్భిర్యుక్తాచతుర్భిస్స్ఫటికమణిమయామక్షమాలాందధానా
హస్తేనైకేన పద్మం సిత మపి చ శుకం పుస్తకం చాపరేణ,
భాసాకుందేందుశంఖస్ఫటికమణినిభా భాసమానాఽసమానా
సా మే వాగ్దేవతేయం నివసతు వదనే సర్వదా సుప్రసన్నా.
కూజంతం రామరామేతి మధురం మధురాక్షరమ్,
ఆరుహ్య కవితాశాఖాం వందే వాల్మీకికోకిలమ్.
వాల్మీకే ర్మునిసింహస్య కవితావనచారిణః,
శృణ్వన్ రామకథానాదం కో నయాతి పరాం గతిమ్.
యః పిబన్ సతతం రామచరితామృతసాగరమ్,
అతృప్తస్తం మునిం వందే ప్రాచేతస మకల్మషమ్.
గోష్పదీకృతవారాశిం మశకీకృతరాక్షసమ్,
రామాయణమహామాలారత్నం వందేఽనిలాత్మజమ్.
అంజనానందనం వీరం జానకీశోకనాశనమ్,
కపీశ మక్షహంతారం వందే లంకాభయంకరమ్.
ఉల్లంఘ్య సింధోః సలిలం సలీలం యశ్శోకవహ్నిం జనకాత్మజాయాః, ఆదాయ తేనైవ దదాహ లంకాం నమామి తం ప్రాంజలి రాంజనేయమ్.
ఆంజనేయ మతిపాటలాననం కాంచనాద్రికమనీయవిగ్రహమ్,
పారిజాతతరుమూలవాసినం భావయామి పవమాననందనమ్.
యత్రయత్ర రఘునాథకీర్తనం తత్రతత్ర కృతమస్తకాంజలిమ్,
బాష్పవారిపరిపూర్ణలోచనం మారుతింనమత రాక్షసాంతకమ్.
మనోజవం మారుతతుల్యవేగం జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠమ్, వాతాత్మజం వానరయూథముఖ్యం శ్రీరామదూతం శిరసా నమామి.

యః కర్ణాంజలిసంపుటై రహరహస్సమ్యక్పిబత్యాదరా
ద్వాల్మీకే ర్వదనారవిందగళితం రామాయణాఖ్యం మధు,
జన్మవ్యాధిజరావిపత్తిమరణై రత్యన్తసోపద్రవం
సంసారం స విహాయ గచ్ఛతి పుమా న్విష్ణోః పదం శాశ్వతమ్.
తదుపగతసమాససంధియోగం సమమధురోపనతార్థవాక్య
బద్ధమ్, రఘువరచరితం మునిప్రణీతం దశశిరసశ్చ వధం నిశామ
యధ్వమ్.
వాల్మీకిగిరిసంభూతా, రామసాగరగామినీ,
పునాతి భువనం పుణ్యా రామాయణమహానదీ.
శ్లోకసారసమాకీర్ణం సర్గకల్లోలసంకులమ్,
కాండగ్రాహమహామీనం వందే రామాయణార్ణవమ్.
వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే,
వేదః ప్రాచేతసా దాసీత్ సాక్షా ద్రామాయణాత్మనా.
వైదేహీసహితం సురద్రుమతలే హైమే మహామంటపే
మధ్యేపుష్పక మాసనే మణిమయే వీరాసనే సుస్థితమ్,
అగ్రే వాచయతి ప్రభంజనసుతే తత్త్వం మునిభ్యః పరం
వ్యాఖ్యాంతం భరతాదిభిః పరివృతం రామం భజే శ్యామలమ్.
వామే భూమిసుతా పురశ్చ హనుమా న్పశ్చా త్సుమిత్రాసుత
శ్శత్రుఘ్నో భరతశ్చ పార్శ్వదళయోర్వాయ్వాదికోణేషుచ,
సుగ్రీవశ్చ విభీషణశ్చ యువరాట్ తారాసుతో జాంబవా
న్మధ్యే నీలసరోజకోమలరుచిం రామం భజే శ్యామలమ్.
నమోఽస్తు రామాయ సలక్ష్మణాయ దేవ్యైచ తస్యై జనకా
త్మజాయై, నమోఽస్తు రుద్రేంద్రయమానిలేభ్యో నమోఽస్తు
చంద్రార్కమరుద్గణేభ్యః.

తతః శ్రీకోశోపరి శ్రీరామావాహనాది నైవేద్యాంతపూజా విధేయా. పారాయణావసానే చ పునఃపూజా కర్తవ్యా.

---

పారాయణసమాపనసమయానుసంధేయక్రమః.

స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః, గోబ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం లోకా స్సమస్తా స్సుఖినో భవంతు.
కాలే వర్షతు పర్జన్యః పృథివీ సస్యశాలినీ,
దేశోఽయం క్షోభరహితో బ్రాహ్మణా స్సంతు నిర్భయాః.
అపుత్త్రాః పుత్త్రిణ స్సంతు పుత్త్రిణ స్సంతు పౌత్త్రిణః,
అధనా స్సధనా స్సంతు జీవంతు శరదాం శతమ్.
చరితం రఘునాథస్య శతకోటిప్రవిస్తరమ్,
ఏకైక మక్షరం ప్రోక్తం మహాపాతకనాశనమ్.
శృణ్వన్రామాయణం భక్త్యా యః పాదం పద మేవ వా,
స యాతి బ్రహ్మణ స్స్థానం బ్రహ్మణా పూజ్యతే సదా.
రామాయ రామభద్రాయ రామచంద్రాయ వేధసే,
రఘునాథాయ నాథాయ సీతాయాఃపతయే నమః.
య న్మంగళం సహస్రాక్షే సర్వదేవనమస్కృతే,
వృత్రనాశే సమభవ త్త త్తే భవతు మంగళమ్.
య న్మంగళం సుపర్ణస్య వినతాఽకల్పయ త్పురా,
అమృతం ప్రార్థయానస్య త త్తే భవతు మంగళమ్.
మంగళం కోసలేంద్రాయ మహనీయగుణాత్మనే,
చక్రవర్తితనూజాయ సార్వభౌమాయ మంగళమ్.
అమృతోత్పాదనే దైత్యాన్ ఘ్నతో వజ్రధరస్య యత్,
అదితి ర్మంగళం ప్రాదా త్త త్తే భవతు మంగళమ్.

త్రీ న్విక్రమాన్ ప్రక్రమతో విష్ణో రమితతేజసః,
యదాసీ న్మంగళం రామ! త త్తే భవతు మంగళమ్.
ఋతవ స్సాగరా ద్వీపా వేదా లోకా దిశ శ్చ తే,
మంగళాని మహాబాహో! దిశంతు తవ సర్వదా.
కాయేన వాచా మనసేంద్రియై ర్వా బుద్ధ్యాఽఽత్మనావా ప్రకృతే స్స్వభావాత్, కరోమి యద్యత్సకలం పరస్మై నారాయణాయేతి సమర్పయామి.

---

## శ్రీగాయత్రీ రామాయణమ్.

తపస్స్వాధ్యాయనిరతం తపస్వీ వాగ్విదాం వరమ్,
నారదం పరిపప్రచ్ఛ వాల్మీకి ర్మునిపుంగవమ్. ౧
స హత్వా రాక్షసా న్సర్వా న్యజ్ఞఘ్నా న్రఘునందనః,
ఋషిభిః పూజిత స్సమ్య గ్యథేంద్రో విజయీ పురా. ౨
విశ్వామిత్ర స్స ధర్మాత్మా శ్రుత్వా జనకభాషితమ్,
వత్స రామ ధనుః పశ్య ఇతి రాఘవ మబ్రవీత్. ౩
తుష్టావాస్య తదా వంశం ప్రవిశ్య స విశాంపతేః,
శయనీయం నరేంద్రస్య తదాసాద్య వ్యతిష్ఠత. ౪
వనవాసం హి సంఖ్యాయ వాసాంస్యాభరణాని చ,
భర్తారమనుగచ్ఛంత్యై సీతాయై శ్వశురో దదౌ. ౫
రాజా సత్యం చ ధర్మం చ రాజా కులవతాం కులమ్,
రాజా మాతా పితా చైవ రాజా హితకరో నృణామ్. ౬
నిరీక్ష్య స ముహూర్తం తు దదర్శ భరతో గురుమ్,
ఉటజే రామ మాసీనం జటావల్కలధారిణమ్. ౭
యది బుద్ధిః కృతా ద్రష్టుం మగస్త్యం తం మహామునిమ్,
అద్యైవ గమనే బుద్ధిం రోచయస్వ మహాయశాః. ౮

భరతస్యార్యపుత్రస్య శ్వశ్రూణాం మమ చ ప్రభో,
మృగరూపమిదం వ్యక్తం విస్మయం జనయిష్యతి. ౯
గచ్ఛ శీఘ్ర మితో రామ సుగ్రీవం తం మహాబలమ్,
వయస్యం తం కురు క్షిప్ర మితో గత్వాఽద్య రాఘవ. ౧౦
దేశకాలౌ ప్రతీక్షస్వ క్షమమాణః ప్రియాప్రియే,
సుఖదుఃఖసహః కాలే సుగ్రీవవశగో భవ. ౧౧
వంద్యాస్తే తు తపస్సిద్ధా స్తపసా వీతకల్మషాః,
ప్రష్టవ్యాశ్చాపి సీతాయాః ప్రవృత్తిం వినయాన్వితైః. ౧౨
స నిర్జిత్య పురీం శ్రేష్ఠాం లంకాం తాం కామరూపిణీమ్,
విక్రమేణ మహాతేజా హనుమాన్ మారుతాత్మజః. ౧౩
ధన్యా దేవాః సగంధర్వాః సిద్ధాశ్చ పరమర్షయః,
మమ పశ్యంతి యే నాథం రామం రాజీవలోచనమ్. ౧౪
మంగళాభిముఖీ తస్య సా తదాసీ న్మహాకపేః,
ఉపతస్థే విశాలాక్షీ ప్రయతా హవ్యవాహనమ్. ౧౫
హితం మహార్థం మృదుపూర్వసంహితం వ్యతీతకాలాయతి
సంప్రతిక్షమమ్, నిశమ్య తద్వాక్యముపస్థితజ్వరః ప్రసంగవా
నుత్తరమేత దబ్రవీత్. ౧౬
ధర్మాత్మా రక్షసాం శ్రేష్ఠ స్సంప్రాప్తోఽయం విభీషణః,
లంకైశ్వర్యం ధ్రువం శ్రీమా నయం ప్రాప్నోత్యకంటకమ్.
మహా వజ్రపాతాశనిసన్నిపాతా న్న చుక్షుభే నాపి చచాల రా
జా, స రామబాణాభిహతో భృశార్త శ్చచాల చాపం చ
ముమోచ వీరః. ౧౭
యస్య విక్రమ మాసాద్య రాక్షసా నిధనం గతాః,
తం మన్యే రాఘవం వీరం నారాయణ మనామయమ్. ౧౮

న తే దదృశిరే రామం దహంత మరివాహినీమ్,
మోహితాః పరమాస్త్రేణ గాంధర్వేణ మహాత్మనా. ౨౦
ప్రణమ్య దేవతాభ్యశ్చ బ్రాహ్మణేభ్యశ్చ మైథిలీ,
బద్ధాంజలిపుటా చేద మువాచాగ్నిసమీపతః. ౨౧
చలనా త్పర్వతేంద్రస్య గణా దేవాశ్చ కంపితాః,
చచాల పార్వతీ చాపి తదాశ్లిష్టా మహేశ్వరమ్. ౨౨
దారాః పుత్రాః పురం రాష్ట్రం భోగాచ్ఛాదనభాజనమ్,
సర్వమేవావిభక్తం నో భవిష్యతి హరీశ్వర. ౨౩
యామేవ రాత్రిం శత్రుఘ్నః పర్ణశాలాం సమావిశత్,
తామేవ రాత్రిం సీతాఽపి ప్రసూతా దారకద్వయమ్. ౨౪
ఇదం రామాయణం కృత్స్నం గాయత్రీబీజసంయుతమ్,
త్రిసంధ్యం యః పఠే న్నిత్యం సర్వపాపైః ప్రముచ్యతే. ౨౫

గాయత్రీరామాయణం సంపూర్ణమ్.

---

## దేవతాప్రార్థనా.

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్,
ప్రసన్నవదనం ధ్యాయే త్సర్వవిఘ్నోపశాంతయే.
రామాయ రామభద్రాయ రామచంద్రాయ వేధసే,
రఘునాథాయ నాథాయ సీతాయాః పతయే నమః.

---

## వాల్మీకిప్రార్థనా.

కూజంతం రామరామేతి మధురం మధురాక్షరమ్,
ఆరుహ్య కవితాశాఖాం వందే వాల్మీకికోకిలమ్.
వాల్మీకే ర్మునిసింహస్య కవితావనచారిణః,
శృణ్వ న్రామకథానాదం కో న యాతి పరాం గతిమ్.

---

## ఆంజనేయప్రార్థనా.

అంజనానందనం వీరం జానకీశోకనాశనమ్,
కపీశ మక్షహంతారం వందే లంకాభయంకరం,
గోష్పదీకృతవారాశిం మశకీకృతరాక్షసం,
రామాయణమహామాలారత్నం వందేఽనిలాత్మజమ్.
మనోజవం మారుతతుల్యవేగం
జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠమ్,
వాతాత్మజం వానరయూథముఖ్యం
శ్రీరామదూతం శిరసా నమామి.

---

## శ్రీరామాయణప్రశంసా.

శ్రీమద్భ్రిష్టా తదేవ బీజ మమలం యస్యాబ్ధుకాదశ్చిన్మయః
శాఖైః స్సప్తభి రన్వితోఽతివితతో బుష్యాలవాలోదితః,
పత్రైః స్తత్త్వసహస్రకై స్సువిలసచ్ఛాఖాశతైః షడ్భి
శ్చాత్మప్రాప్తిఫలప్రదో విజయతేరామాయణ స్స్వస్తరుః.
యః కర్ణాంజలిసంపుటై రహరహ స్సమ్యక్పిబత్యాదరా
ద్వాల్మీకే ర్వదనారవిందగలితం రామాయణాఖ్యం మధు,
జన్మవ్యాధిజరావిపత్తిమరణై రత్యంతసోపద్రవం
సంసారం స విహాయ గచ్ఛతి పుమా న్విష్ణోః పదంశాశ్వతమ్.
వాల్మీకిగిరిసంభూతా రామాంభోనిధిసంగతా,
శ్రీమద్రామాయణీ గంగా పునాతు భువనత్రయం.

---

శ్రీః

# శ్రీమద్రామాయణే-యుద్ధకాణ్డే

## ప్రథమస్సర్గః

శ్రుత్వా హనుమతో వాక్యం యథావదభిభాషితమ్,
రామః ప్రీతిసమాయుక్తో వాక్య ముత్తర మబ్రవీత్. ౧

"కృతం హనుమతా కార్యం సుమహద్భువి దుర్లభమ్,
మనసాఽపి యదన్యేన న శక్యం ధరణీతలే. ౨

న హి తం పరిపశ్యామి య స్తరేత మహార్ణవమ్,
అన్యత్ర గరుడా ద్వాయో రన్యత్ర చ హనూమతః. ౩

దేవదానవయక్షాణాం గన్ధర్వోరగరక్షసామ్,
అప్రధృష్యాం పురీం లఙ్కాం రావణేన సురక్షితామ్. ౪

ప్రవిష్ట స్సత్త్వ మాశ్రిత్య శ్వసన్కో నామ నిష్క్రమేత్,
కో విశేత్సుదురాధర్షాం రాక్షసైశ్చ సురక్షితామ్. ౫

యో వీర్యబలసమ్పన్నో న సమ స్స్యాద్ధనూమతః,
భృత్యకార్యం హనుమతా సుగ్రీవస్య కృతం మహత్. ౬

స్వయం విధాయ స్వబలం సదృశం విక్రమస్య చ,

శ్రీ ర స్తు

# యుద్ధకాండ తాత్పర్యము

## ప్రథమ సర్గము.

రాముఁడు హనుమంతుఁడు విన్నవించిన వృత్తాంతము నంతయు విని పరమసంతుష్టుఁడై పరమప్రియవార్తను వినినప్పుడు చెప్పినవానికి యేమాటం జెప్పవలయునో అట్టిమాటం జెప్పెను. ౧

హనుమంతుఁడు మిక్కిలియు గొప్పకార్యమును జేసినాఁడు. ఇట్టి కార్యము మఱియెవ్వనికిని జేయ నశక్యమగుటయేగాక మనసునం దలఁచుట కేని యలవిగాదు. ౨

గరుత్మంతుఁడును వాయుదేవుఁడును ఈ హనుమంతుఁడు దక్క మఱియెవ్వని మహాసముద్రంబు దాఁటంగలవాని నే నెచ్చటను జూడ లేదు. ౩

దేవతలకును దానవులకును యక్షులకును గంధర్వులకును నురగములకును రాక్షసులకును జేఁజూడ నలవిగానిదియు రావణరక్షితంబునగు లంకాపురి బ్రవేశించియు నెవ్వఁడు బలంబు నవలంబించి ప్రాణంబుతో మరల రాఁ గలఁడు ? ౪

ప్రవేశించి మరలివచ్చుట యట్లుండుఁగాక ! హనుమంతునంతటి బల పరాక్రమశాలి కాఁడేని యెవ్వఁడును దురాధర్షంబును రాక్షసులచే సురక్షితంబునగు లంకాపురిం బ్రవేశించుటకే శక్తుఁడు కాఁడు. ౫

హనుమంతుఁడు తనకు సుగ్రీవుఁ డాజ్ఞాపించిన మహాకార్యంబును సాధించి యతఁడు తనకుఁ జెప్పకపోయినను దనవిక్రమంబున కనురూపంబుగా నశోకవనభంగాదిపౌరుషకార్యంబులనుం గావించెను. ౬

యోహి భృత్యో నియుక్తస్సన్ భర్త్రా కర్మణి దుష్కరే. ౭
కుర్యా త్త దనురాగేణ త మాహుః పురుషోత్తమమ్,

నియుక్తో యః పరం కార్యం న కుర్యా న్నృపతేః ప్రియమ్. ౮
భృత్యో యుక్త స్సమర్థశ్చ త మాహు ర్మధ్యమం నరమ్,

[భృత్యస్తు యః పరం కార్యం న కుర్యా న్నృపతేః ప్రియమ్,
భృత్యోఽభృత్య స్సమర్థోపి తమాహు ర్మధ్యమం నరమ్.]

నియుక్తో నృపతేః కార్యం న కుర్యా ద్య స్సమాహితః. ౯
భృత్యో యుక్త స్సమర్థశ్చ త మాహుః పురుషాధమమ్,

తన్నియోగే నియుక్తేన కృతం కృత్యం హనూమతా. ౧౦
న చాత్మా లఘుతాం నీత స్సుగ్రీవ శ్చాపి తోషితః,

అహం చ రఘువంశశ్చ లక్ష్మణశ్చ మహాబలః. ౧౧
వైదేహ్యా దర్శనేనాద్య ధర్మతః పరిరక్షితాః,

ఇదంతు మమ దీనస్య మనో భూయః ప్రకర్షతి. ౧౨
యదిహాస్య ప్రియాఖ్యాతు ర్న కుర్మి సదృశం ప్రియమ్,

ఏభృత్యుఁడు స్వామి తన కాజ్ఞాపించిన దుష్కరకార్యంబు గావించి స్వామిభక్తిచే ఆకార్యమున కనుకూలముగా నితరకార్యములనుకూడఁ జేయునో ఆతఁ డుత్తమభృత్యుఁడని చెప్పెదరు.

ఎవ్వఁడు ఉత్సాహవంతుఁడును సమర్థుఁడునై తనయేలిక యాజ్ఞాపించినకార్యమును మాత్రముచేసి యందు కనుకూలంబును ఏలికకుఁ బ్రియకరంబునగు నితరకార్యమును "చెప్పినకార్యమును జేసితిని. ఇంక మన కేమి!" యని చేయకుండునో అతఁడు మధ్యమభృత్యుఁ డందురు. ౮

(ఏభృత్యుఁడు సమర్థుఁడైనను ఏలిక తన కాజ్ఞాపించిన కార్యమును మాత్రముచేసి యాకార్యంబున కనుకూలంబును ఏలికకుఁ బ్రియకరంబునగు నితరకార్యంబును "చెప్పినకార్యమును జేసితిమి. ఇంక మన కేమి!" యని చేయకుండునో, అతఁడు చెప్పినకార్యముచేయుటవలన భృత్యుఁడు నగును; స్వామి కధికసంతోషంబు గలుగునట్లు తదనుకూలేతరకార్యంబు చేయకపోవుటవలన నభృత్యుఁడు నగును. కావున నతని మధ్యమభృత్యుఁ డందురు.)

ఎవ్వఁడు ఎచ్చరికగలవాఁడు నుత్సాహవంతుఁడును సమర్థుఁడునై యుండియు తనకాజ్ఞాపించిన కార్యమునైనను చేయకుండునో ఆతఁడు అధమభృత్యుఁ డందురు. ౯

అట్లుహనుమంతుఁడు తనకాజ్ఞాపించినకార్యంబు సాధించుటయేగాక తదనుకూలంబులగు నశోకవనభంగము నక్షాదిసంహారము లంకాదహనము మొదలగు ననేకకార్యములు చేసినాఁడు; కావునఁ దనకును లాఘవంబు గలిగించుకొనలేదు. సుగ్రీవునకును మిక్కిలియుఁ సంతోషంబు గలుగఁజేసినాఁడు. ౧౦

ఇప్పుడీహనుమంతుఁడు సీతంజూచివచ్చుటచేత నేనును మహాబలుండగు లక్ష్మణుఁడును రఘువంశంబునఁ బుట్టినవార లందఱు ఆత్మహత్యాదోషంబునొందక ధర్మంబునొంది సుఖంబునయుండున ట్లేర్పడినది. ౧౧

ఇప్పు డిట్టిప్రియవార్తం జెప్పిన యీహనుమంతునకుం దగునట్లు ప్రియంబు సేయకున్నానే యనునదిమాత్రము నామనంబునకు మిక్కిలియుం దుఃఖంబు గలిగించుచున్నది. ౧౨

ఏష సర్వస్వభూతో మే పరిష్వఙ్గో హనూమతః. ౧౩
మయా కాల మిమం ప్రాప్య దత్త స్తస్య మహాత్మనః,”

ఇత్యుక్త్వా ప్రీతిహృష్టాఙ్గో రామ స్తం పరిషస్వజే. ౧౪
హనూమన్తం మహాత్మానం కృతకార్య ముపాగతమ్,

ధ్యాత్వా పున రువాచేదం వచనం రఘునన్దనః. ౧౫
హరీణామీశ్వరస్యైవ సుగ్రీవస్యోపశృణ్వతః,
“సర్వథా సుకృతం తావ త్సీతాయాః పరిమార్గణమ్. ౧౬
సాగరం తు సమాసాద్య పున ర్నష్టం మనో మమ,

కథం నామ సముద్రస్య దుష్పారస్య మహామ్భసః. ౧౭
హరయో దక్షిణం పారం గమిష్యన్తి సమాగతాః,
యద్యప్యేష తు వృత్తాన్తో వైదేహ్యా గదితో మమ. ౧౮
సముద్రపారగమనే హరీణాం కిమివోత్తరమ్,”

ఇత్యుక్త్వా శోకసమ్భ్రాన్తో రామ శ్శత్రునిబర్హణః. ౧౯
హనూమన్తం మహాబాహు స్తతో ధ్యాన ముపాగమత్,

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే ప్రథమస్సర్గః. ౧.

---

## ద్వితీయస్సర్గః.

తం తు శోకపరిద్యూనం రామం దశరథాత్మజమ్,
ఉవాచ వచనం శ్రీమాన్ సుగ్రీవ శ్శోకనాశనమ్. ౧
“కిం త్వం సన్తప్యసే వీర! యథాన్యః ప్రాకృత స్తథా,

సీతను నన్నును మాయిద్దఱినిం గాపాడి మహోపకారంబుఁ జేసినట్టి మహాపరాక్రమశాలియగు హనుమంతునకు ఏమియొసంగిన దీరును? సర్వస్వం బొసంగినఁగాని తీరదు; కావున నిట్టికాలంబున నిమ్మహాత్మునకు నేనొసఁగు నాలింగనంబె సర్వప్రదానంబగుఁగాక. అని రాముఁడుచెప్పెను. ౧౩

రాముఁ డిట్లు చెప్పి సంతోషంబుచేఁ బులకాంకితదేహుఁడై సీతాదేవిం జూచివచ్చినట్టి మహాపరాక్రమశాలియగు హనుమంతుఁ గవుఁగిలించి కొనెను. ౧౪

రాముఁడు కొంచె మాలోచించి మరల వానరాధీశ్వరుఁడగు సుగ్రీవుఁడు వినుచుండఁగానే యీమాటం జెప్పెను. ౧౫

సీతను వెదకువిషయమునందు మాత్రము అన్నివిధంబులను మంచిప్రయత్నమేచేసి కార్యసాధనము నొందితిమి; సముద్రంబు దలంచినంతనె నామనసునకు మిక్కిలియుం భయంబు గలుగుచున్నది. ౧౬

వానరులందఱు నొక్కటిగాఁజేరి దాఁటఁగూడని మహాసముద్రంబు దాఁటి దానిదక్షిణపుగట్టు నెట్లు పొందఁగలరు? ౧౭

నాప్రియురాలగు సీతాదేవి కీవిషయమందు సమాధానము చెప్పఁబడియేయున్నది. అయినను వానరులు సముద్రముదాఁటుట కేమి యుపాయమున్నది? చెప్పుము. అని రాముఁడు చెప్పెను. ౧౮

శత్రువులఁ జంపువాఁడును మహాబాహుండునగు రాముఁడు హనుమంతుంజూచి యిట్లు చెప్పి పరమదుఃఖితుఁడై చింతింపుచుండెను. ౧౯

ఇది మొదటిసర్గము.

---

## రెండవసర్గము.

అంత శ్రీమంతుఁడగు సుగ్రీవుఁడు దుఃఖితుఁడైయున్న దశరథపుత్రుఁడయిన రాముంజూచి యతనిదుఃఖంబు పోవునట్లు ఈమాటం జెప్పెను. ౧

పరాక్రమశాలివగు రాముఁడా! ప్రాకృతునియట్లు నీవును బరితపించుచు

మైవం భూ స్త్యజ సన్తాపం కృతఘ్న ఇవ సౌహృదమ్. ౨

సన్తాపస్య చ తే స్థానం నహి పశ్యామి రాఘవ!,
ప్రవృత్తావుపలబ్ధాయాం జ్ఞాతే చ నిలయే రిపోః. 3
మతిమాన్ శాస్త్రవిత్ప్రాజ్ఞః పణ్డితశ్చాసి రాఘవ!,
త్యజేమాం పాపికాం బుద్ధిం కృత్వాత్మేవార్థదూషణీమ్. ౪

సముద్రం లఙ్ఘయిత్వా తు మహానక్రసమాకులమ్,
లఙ్కా మారోహయిష్యామో హనిష్యామశ్చ తే రిపుమ్. ౫
నిరుత్సాహస్య దీనస్య శోకపర్యాకులాత్మనః,
సర్వార్థా వ్యవసీదన్తి వ్యసనం చాధిగచ్ఛతి. ౬

ఇమే శూరా స్సమర్థాశ్చ సర్వే నో హరియూథపాః,
త్వత్ప్రియార్థం కృతోత్సాహాః ప్రవేష్టు మపి పావకమ్. ౭

ఏషాం హర్షేణ జానామి తర్క శ్చాస్మిన్ దృఢో మమ,

విక్రమేణ సమానేష్యే సీతాం హత్వా యథా రిపుమ్. ౮
రావణం పాపకర్మాణం తథా త్వం కర్తు మర్హసి,

సేతు రత్ర యథా బద్ధ్యే ద్యథా పశ్యేమ తాం పురీమ్. ౯
తస్య రాక్షసరాజస్య తథా త్వం కురు రాఘవ!,
దృష్ట్వా తాం తు పురీం లఙ్కాం త్రికూటశిఖరే స్థితామ్. ౧౦
హతం చ రావణం యుద్ధే దర్శనాదవధారయ,

న్నావేల? ఇట్లుండవలదు; కృతఘ్నుఁడు స్నేహంబును వదలునట్లు దుఃఖంబును విడువుము. ౨

సీతాదేవివృత్తాంతంబును శత్రువుండు స్థలంబును దెలిసినపిదప నీకు దుఃఖముగలుగుట కెంతమాత్రము కారణము నాకుఁ దోఁచలేదు. ౩

నీవు భవిష్యత్సమాచారంబు నాలోచించువాఁడవు; నీతిశాస్త్రంబుఁ దెలిసినవాఁడవు; ఊహాపోహలయందు సమర్థుఁడవు; పండితుఁడవు; యోగియగువాఁడు మోక్షప్రాప్తిబాధకంబగు బుద్ధి విడుచునట్లు నీవీయుత్సాహబాధకబుద్ధిని విడువవలయును. ౪

మేము మహామకరాదులచే నిండినసముద్రంబును దాఁటి లంకాపురికోటలపై కెక్కి నీశత్రువును రావణునిం జంపెదము. ౫

ఎల్లప్పుడును దుఃఖంబు నవలంబించి యుండువానికి దుఃఖంబువలన దైన్యంబుగల్గి దాన నుత్సాహనాశంబును, అందువలన సమస్తకార్యహానియుఁ గల్గును; అంతనతనికి దుఃఖంబుమాత్రమే గాక గొప్పయాపదయుం సంభవించును.

శూరులును ఉపాయంబులం బండితులునగు మనవానరశ్రేష్ఠులందఱును నీసంతోషంబునకై యగ్నిహోత్రముఁ దెచ్చుటకైనను సిద్ధులై యున్నారు. ౭

ఈవానరుల సంతోషంబుజూడఁగా వీరల కట్టియుత్సాహంబు గలదని నాకుఁ దెలిసియున్నది; ఈవిషయమునందు నేను జెప్పునది యథార్థము.

నేను బరాక్రమంబునఁ బాపిష్ఠుఁడగు శత్రువును రావణుంజంపి సీతాదేవిం దెచ్చునట్లు నీవును మిక్కిలియు నుత్సాహంబు నవలంబించి యుండవలయును. ౮

రాముఁడా! సముద్రంబునందు సేతువుగట్టునట్లును మనము రాక్షసేశ్వరుఁడగు రావణుని లంకాపట్టణంబును జూచునట్లును నీ వాలోచింపుము.

త్రికూటపర్వతశిఖరంబునఁ బ్రతిష్ఠితమయియున్న యాలంకాపట్టణముఁ జూచినం జాలును. అంత రావణుఁడు యుద్ధంబునం జంపఁబడినట్టే నిశ్చయింపవచ్చును. ౧౦

అబద్ధ్వా సాగరే సేతుం ఘోరే తు వరుణాలయే. ౧౧
లఙ్కా నమర్ద్దితుం శక్యా సేన్ద్రై రపి సురాసురైః,
సేతు ర్బద్ధ స్సముద్రే చ యావ ల్లఙ్కాసమీపతః. ౧౨
సర్వం తీర్ణం చ వై సైన్యం జితమిత్యుపధారయ,
ఇమే హి సమరే శూరా హరయః కామరూపిణః. ౧౩
శక్తా లఙ్కాం సమానేతుం సముత్పాట్య సరాక్షసామ్,
తదలం విక్లబా బుద్ధీ రాజన్! సర్వార్థనాశినీ. ౧౪
పురుషస్య హి లోకేఽస్మిన్ శోక శ్శౌర్యాపకర్షణః,

యత్తు కార్యం మనుష్యేణ శౌణ్డీర్య మవలమ్బతా. ౧౫
అస్మిన్కాలే మహాప్రాజ్ఞ! స త్త్వ మాతిష్ఠ తేజసా,

శూరాణాం హి మనుష్యాణాం త్వద్విధానాం మహాత్మనామ్.
వినష్టే వా ప్రణష్టే వా శోకస్సర్వార్థనాశనః,

త్వం తు బుద్ధిమతాం శ్రేష్ఠ స్సర్వశాస్త్రార్థకోవిదః. ౧౬
మద్విధై స్సచివైస్సా ర్థ మరిం జేతుం మిహార్హసి,

నహి పశ్యామ్యహం కంచి త్త్రిషు లోకేషు రాఘవ!. ౧౭
గృహీతధనుషో య స్తే తిష్ఠే దభిముఖో రణే,
వానరేషు సమాస క్తం న తే కార్యం విపత్స్యతే. ౧౮
అచిరాద్ద్రక్ష్యసే సీతాం తీర్త్వా సాగర మక్షయమ్,
తదలం శోక మాలమ్బ్య క్రోధమాలమ్బ భూపతే!. ౨౦
నిశ్చేష్టాః క్షత్రియా మన్దా స్సర్వే చణ్డస్య బిభ్యతి,

భయంకరంబగు సముద్రంబునందు సేతువుగట్టక దేవేంద్రసహితులగు దేవాసురులయినను లంకాపురిం దేఱి చూడఁజాలరు. ౧౧

లంకనఱకు సముద్రంబున సేతువుగట్టిన క్షణంబుననే యీవానరసైన్యం బంతయుం సముద్రంబుదాఁటి జయంబునుం బొందినదని యెంచుకొనుము.

యుద్ధంబునందు శూరులును గామరూపులునగు నీవానరులు లంకాపట్ట ణమును రాక్షసులతోఁగూడఁ బెల్లగించి తెచ్చుటకును శక్తులైయున్నారు.

రాజా! అందువలన సమస్తకార్యంబులను నశింప జేయునట్టి యీదుఃఖంబును వదలుము. లోకంబునం దంతటఁ బురుషుఁడు దుఃఖమునొందునేని అతని శౌర్యము నశించును.

మహాపండితుఁడవగు రామూఁడా! శౌర్యమే ప్రధానముగాఁ గలపురు షుఁడు దేని వదలకుండవలయునో అట్టిధైర్యంబును బరాక్రమంబును అవలం బించియుండుము. ౧౫

నీయట్టిశూరులునుమహాత్ములునగుపురుషులు అగపడకుండుదానివిషయ మయిగాని నశించినదానివిషయమయిగాని ఏవిషయమందును ఎంతమాత్రము దుఃఖము నొందగూడదు. అట్లుదుఃఖము నొందిరేనిసమస్తకార్యంబులును జెడును.

నీవు సమస్తబుద్ధిమంతులలోను నుత్తముఁడవు. సమస్తములయినశాస్త్రా ర్థమును దెలిసినవాఁడవు; మఱియుఁ నాయట్టి సహాయులంగూడి యిప్పుడు శత్రువును వధింపుము. ౧౬

రామూఁడా! యుద్ధంబున నీవు ధనువుధరించియుండఁగా నీయెదుట నిలువంజాలినవాఁడు ముల్లోకంబులం దెవ్వఁడును నాకగపడలేదు. ౧౭

వానరులపైనుంచియుండు నీకార్యము ఎంతమాత్రము చెడదు. ఇంక ననంతంబగు సముద్రంబుదాఁటి శీఘ్రంబుననే సీతాదేవిం జూడఁగలవు. ౧౮

రామూఁడా! అట్లు కావున ఇంతవఱకు దుఃఖం బవలంబించినది చాలు ను. ఇంక దుఃఖంబు విడువుము. క్రోధంబు నవలంబింపుము. క్షత్రియుంలు

లఙ్ఘనార్థం చ ఘోరస్య సముద్రస్య నదీపతేః. ౨౧
సహాస్మాభిరిహోపేత స్సూక్ష్మబుద్ధి ర్విచారయ,
లఙ్ఘితే తస్య తై స్సైన్యం జిత మిత్యుపధారయ. ౨౨

ఇమే హి హరయ శ్శూరా స్సమరే కామరూపిణః,
తానరీన్విధమిష్యన్తి శిలాపాదపవృష్టిభిః. ౨౩
కథంచి త్సన్తరిష్యామ స్తే వయం వరుణాలయమ్,
హతమిత్యేవ తం మన్యే యుద్ధే సమితినన్దన!. ౨౪

కిముక్త్వా బహుధా చాపి సర్వథా విజయీ భవాన్,
నిమిత్తాని చ పశ్యామి మనో మే సమ్ప్రహృష్యతి." ౨౫

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే - ద్వితీయస్సర్గః. ౨.

తృతీయస్సర్గః.

సుగ్రీవస్య వచ శ్శ్రుత్వా హేతుమ త్పరమార్థవిత్,
ప్రతిజగ్రాహ కాకుత్స్థో హనూమన్త మథాబ్రవీత్. ౧

"తపసా సేతుబన్ధేన సాగరోచ్ఛోషణేన వా,
సర్వథా సుసమర్థోఽస్మి సాగరస్యాస్య లఙ్ఘనే. ౨

నిరుద్యోగులగుదురేని మందభాగ్యులగుదురు. భయంకరుఁడగువాని కందఱును భయపడుదురు. ౨౦

భయంకరంబగు సముద్రంబుదాఁటు నుపాయంబును సూక్ష్మబుద్ధివగు నీవు మమ్ముఁగూడి యిచ్చటనే యాలోచింపుము. ౨౧

నాసైన్యంబంతయుం సముద్రంబు దాఁటి లంకం జేరునేని సిద్ధముగా జయమునొందినట్లే యెంచుకొనుము. ౨౨

యుద్ధంబున శూరులును గామరూపులునగు నీవానరులు రాళ్లను వృక్షంబులను గురిపించి రాక్షసుల నందఱను గీటణంగింతురు. ౨౩

యుద్ధోత్సుకుఁడవగు రాముఁడా! సేతువుచేతనే కాదు, మఱి యేయుపాయముచేనైనను సముద్రంబు దాఁటుదుము; రావణుఁడు హతుఁడయ్యెనని యే తలంచెదను. ౨౪

పెక్కుమాటలుచెప్పి యేమి ప్రయోజనము! అన్నివిధంబులను నీ కవశ్యము జయమే కలుగును: అట్లు నాకు శుభనిమిత్తంబులు దోఁచుచున్నవి. నామనంబును మిక్కిలియుం సంతోషంబునొందియున్నది. అని సుగ్రీవుఁడు రామునితోఁ జెప్పెను. ౨౫

ఇది రెండవసర్గము.

## మూఁడవసర్గము.

పరమార్థవేత్తయగు రాముఁడు సుగ్రీవుఁడు చెప్పిన యుక్తియుక్తంబగుమాటనువిని దాని కొప్పుకొని యంత హనుమంతుంజూచి యిట్లని చెప్పెను. ౧

తపంబుచేసికాని సేతుబంధంబు గావించిగాని సముద్రంబు నెండించుటచేతఁగాని యేవిధంబుననయినను ఈసముద్రంబు దాఁటుటకు మిక్కిలియుం సమర్థుఁడనై యున్నాను. ఇంక నీవిషయమునందేమియు చింతయక్కఱ లేదు. ౨

కతి దుర్గాణి దుర్గాయా లఙ్కాయా బ్రూహి తాని మే,
జ్ఞాతు మిచ్ఛామి తత్సర్వం దర్శనాదివ వానర!. ౩
బలస్య పరిమాణం చ ద్వారదుర్గక్రియామపి,
గుప్తికర్మ చ లఙ్కాయా రక్షసాం సదనాని చ. ౪

యథాసుఖం యథావచ్చ లఙ్కాయా మసి దృష్టవాన్,
సర్వ మాచక్ష్వ తత్త్వేన సర్వథా కుశలో హ్యసి." ౫

శ్రుత్వా రామస్య వచనం హనూమాన్మారుతాత్మజః,
వాక్యం వాక్యవిదాం శ్రేష్ఠో రామం పున రథాబ్రవీత్. ౬

శ్రూయతాం సర్వ మాఖ్యాస్యే దుర్గకర్మవిధానతః,
గుప్తా పురీ యథా లఙ్కా రక్షితా చ యథా బలైః. ౭
రాక్షసాశ్చ యథా స్నిగ్ధా రావణస్య చ తేజసా,
పరాం సమృద్ధిం లఙ్కాయా స్సాగరస్య చ భీమతామ్. ౮
విభాగం చ బలౌఘస్య నిర్దేశం వాహనస్య చ,
ఏవ ముక్త్వా హరిశ్రేష్ఠః కథయామాస తత్త్వతః. ౯

"హృష్టప్రముదితా లఙ్కా మత్తద్విపసమాకులా,
మహతీ రథసమ్పూర్ణా రక్షోగణసమాకులా. ౧౦
వాజిభిశ్చ సుసమ్పూర్ణా సా పురీ దుర్గమా పరైః,

దృఢబద్ధకవాటాని మహాపరిఘవన్తి చ. ౧౧
ద్వారాణి విపులా న్యస్యా శ్చత్వారి సుమహాన్తి చ,

హనుమంతుఁడా! ప్రవేశింప నలవిగానట్టి లంకాపురి కెన్ని దుర్గంబు లున్నవి? వాని నాకుం జెప్పుము; మఱియు సైన్యపరిమాణంబును, ద్వారంబున నెవ్వరును బ్రవేశింపకుండునట్లు గావించియున్న రక్షణంబును, ప్రాకారాట్టాలకాది సన్నివేశంబును రాక్షసులగృహంబులను వీనినంతయుఁ బ్రత్యక్షముగాఁ గంటంజూచినట్లు చక్కఁగాఁ దెలిసికొనఁగోరుచున్నాను. ౩,౪

నీవు అనాయాసంబున లంకలోఁ నంతయుఁ జూచియున్నావు; దాని నంతయుం నిప్పుడు సవిస్తరముగా నాకుం జెప్పుము; అన్నిటికిని నీవు సమర్థుఁడవు. అని రాముండు హనుమంతునితోఁ జెప్పెను. ౫

మాటలాడం దెలిసినవారిలోఁ నుత్తముఁడును వాయుదేవుని కుమారుఁడు నగు హనుమంతుఁడు రాముండాన తిచ్చినమాటనువిని రాముని జూచి మరల నిట్లని చెప్పెను. ౬

లంకాపురియందు దుర్గవిధానంబునను సైన్యంబులచేతను రక్షింపఁబడియుండువిధంబును రాక్షసులకు రావణునియందుం గలస్నేహంబును రావణుని ప్రభావంబును లంకయందలి సర్వసమృద్ధిని సముద్రంబుభయంకరముగానుండుటను లంకయందు సైన్యసంఖ్యాసన్నివేశాదిక్రమంబును రథగజతురగాదివిభాగంబును అంతయుం జెప్పెదను వినుఁడు. ౭,౮

వానరోత్తముఁడగు హనుమంతుఁడు ఈ ప్రకారముచెప్పి యథార్థముగా లంకాసన్నివేశక్రమం బంతయుఁ జెప్ప నారంభించెను. ౯

లంకాపురిలోని జనులందఱును మహాసంతోషముతో నున్నారు, ఆపట్టణము మిక్కిలియు విశాలమయినది; అందు రథంబులు నేనుఁగులు గుఱ్ఱంబులు నిండియున్నవి; రాక్షసులు లెక్క లేకయున్నారు; శత్రువులకు దానిం బ్రవేశింప నలవిగాదు. ౧౦

లంకాపట్టణమునకు దృఢముగా నాఁటులు మొదలగువానిచే బంధింపఁబడినతలుపులుగలవియుఁ బెద్దగడియమ్రానులుగలవియు విశాలంబులును మిక్కిలియు నున్నతంబులునగు నాలుగుద్వారంబులు గలవు. ౧౧

తత్రేషూపలయన్త్రాణి బలవన్తి మహాన్తి చ. ౧౨
ఆగతం పరసైన్యం తు తత్ర తైః ప్రతిహన్యతే,

ద్వారేషు సంస్కృతా భీమాః కాలాయసమయాః శితాః. ౧౩
శతశో రచితా వీరైః శతఘ్న్యో రక్షసాం గణైః,

సౌవర్ణశ్చ మహాంస్తస్యాః ప్రాకారో దుష్ప్రధర్షణః. ౧౪
మణివిద్రుమవైడూర్యముక్తావిరచితాన్తరః,

సర్వతశ్చ మహాభీమాః శీతతోయవహాః శుభాః. ౧౫
అగాధా గ్రాహవత్యశ్చ పరిఖా మీనసేవితాః,

ద్వారేషు తాసాం చత్వారః సఙ్క్రమాః పరమాయతాః. ౧౬
యన్త్రైరుపేతా బహుభిర్మహద్భిర్గృహపఙ్క్తిభిః,

త్రాయన్తే సఙ్క్రమాస్తత్ర పరసైన్యాగమే సతి. ౧౭
యన్త్రైస్తైరవకీర్యన్తే పరిఖాసు సమన్తతః,

ఏకస్త్వకమ్ప్యో బలవాన్ సఙ్క్రమస్సుమహాదృఢః. ౧౮
కాఞ్చనైర్బహుభిః స్తమ్భైర్వేదికాభిశ్చ శోభితః,
స్వయం ప్రకృతి మాపన్నో యుయుత్సూ రామ! రావణః. ౧౯

ఆద్వారంబులందు బలిష్ఠంబులును విపులంబులునగు బాణమోచక యంత్రంబులును శిలామోచకయంత్రంబులును ఉన్నవి; శత్రుసైన్యం బచ్చటికి వచ్చినప్పుడు ఆయంత్రంబులు బాణంబులను శిలలను గురిపించి యాసైన్యంబు నంతయు నశింపఁజేయును. ౧౨

ఆద్వారంబులందుఁ బరాక్రమశాలురగు రాక్షసులు భయంకరంబులును నొక్కమాఱు ప్రయోగించిన నూర్గురం జంపునవియునగు నినుపగుదియలు సిద్ధంబుగా నుంచియున్నారు ౧౩

అలంకాపురిచుట్టును సువర్ణమయంబును అచ్చటచ్చట నలంకారార్థము పద్మరాగప్రవాళవైడూర్యముక్తాఫలములచే నిర్మితంబులగు ప్రదేశములు గలదియు నత్యున్నతంబును దాఁటఁగూడనిదియునగు ప్రాకారముగలదు. ౧౪

ఆప్రాకారముచుట్టును మహాభయంకరములును స్పృశింపనుంగూడ నలవిగాకుండునంతటి చల్లనినీళ్లుగలవియు మిక్కిలియు లోఁతుగలవియు మొసళ్లను మహామీనంబులును గలవియు సుందరంబులునగు నగడ్తలున్నవి.

ద్వారంబులసమీపమునందు ఆయగడ్తలకు నాలుగుప్రక్కలను నాలుగుదారునిర్మితసంచారమార్గము లున్నవి. అందుఆపలకల నెత్తివేయవలసినప్పుడెత్తివేయుటకును, జనులు సంచరించుటకై మరల నగడ్తలపై వేయవలసినప్పుడు వేయుటకును గొప్పయంత్రంబులును మఱియు నచ్చటఁ గావలియుండు భటులగృహంబులును ఉన్నవి. ౧౬

అచ్చట నాదారునిర్మితసంచారమార్గములు శత్రుసైన్యములు వచ్చినప్పుడుమాత్రము పట్టణమును రక్షించుచున్నవి. ఎట్లనఁగా నాయంత్రములు ఆగడ్తలయందంతటను ఈమార్గభూతములయియుండు పలకలను ఎత్తివేయుచున్నవి. అంత శత్రువులు ఆగడ్తను దాఁటుటకు లేదు. ౧౭

అందు ఒకసంచారమార్గముమాత్రము మిక్కిలి దృఢంబై బలిష్ఠంబై పెక్కుబంగారుస్తంభములతోను దిన్నెలతోనుం బ్రకాశించుచున్నది. ౧౮

రాముఁడా! రావణుఁడునిశ్చలంబగుమనంబుగల్గి జాగరూకుఁడై యేమ

ఉత్థిత శ్చాప్రమత్తశ్చ బలానామనుదర్శనే,

లఙ్కా పున ర్నిరాలమ్బా దేవదుర్గా భయావహా. ౨౦
నాదేయం పార్వతం వాన్యం కృత్త్రిమం చ చతుర్విధమ్,

స్థితా పారే సముద్రస్య దూరపారస్య రాఘవ!. ౨౧
నౌపథోపిచ నాస్త్యత్ర నిరాదేశశ్చ సర్వతః,

శైలాగ్రే రచితా దుర్గా సా పూర్దేవపురోపమా. ౨౨
వాజివారణసమ్పూర్ణా లఙ్కా పరమదుర్జయా,

పరిఘాశ్చ శతఘ్న్యశ్చ యన్త్రాణి వివిధాని చ. ౨౩
శోభయన్తి పురీం లఙ్కాం రావణస్య దురాత్మనః,

అయుతం రక్షసామత్ర పూర్వద్వారం సమాశ్రితమ్. ౨౪
శూలహస్తా దురాధర్షా స్సర్వే ఖడ్గాస్త్రయోధినః,

నియుతం రక్షసా మత్ర దక్షిణం ద్వార మాశ్రితమ్. ౨౫
చతురఙ్గేణ సైన్యేన యోధా స్తత్రా ప్యనుత్తమాః,
ప్రయుతం రక్షసా మత్ర పశ్చిమద్వార మాశ్రితమ్. ౨౬
చర్మఖడ్గధరా స్సర్వే తథా సర్వాస్త్రకోవిదాః,

ఱక శత్రువులు లేకున్నను శత్రువులుండునప్పుడువలె యుద్ధముసేయు నుత్సాహంబునఁ బ్రతిదినంబును సైన్యంబులఁ జక్కఁగాఁ జూచుకొనుచుండును.

మఱియు లంకాపురి త్రికూటపర్వతంబుపై నుండుటచేఁ బైకిఁబోవుట కాధారము లేదు. అచ్చటికి వెళ్లుటకు దేవతలకైన నలవిగాదు. మఱియు నాలంక చూపరులకు భయంబు గల్గించుచున్నది. జలదుర్గంబును బర్వతదుర్గంబును వనదుర్గంబును బ్రాకారపరిఖావృతంబగు కృత్రిమదుర్గంబును అను నాలుగుదుర్గంబులును లంకాపురి కున్నవి. ౨౦

రాముఁడా! లంకాపట్టణము అతివిశాలంబగు సముద్రము నావగలిట్టున నున్నది; ఈసముద్రంబును దాఁటుటకు నోడమార్గంబును లేదు; మఱియు నిచ్చటివారికి అచ్చటివారివార్త దెలియు నుపాయంబును లేదు; కావున లంకకు జలదుర్గమున్నది. ౨౧

దేవపురీసమానమగు నాలంకాపట్టణము పర్వతాగ్రంబున నున్నదై హయగజంబులచే సంపూర్ణమయి యెవ్వరికిని జయింప నలవిగాకున్నది; పర్వతాగ్రంబుననుండుటచేఁ బర్వతదుర్గంబును వనదుర్గంబునుం గలదు ౨౨

అగడ్తలచేతను శతఘ్నులచేతను బాణశిలామోచకాది నానావిధయంత్రములచేతను దురాత్ముఁడగు రావణుని లంకాపట్టణము మిక్కిలియుఁ బ్రకాశించుచున్నది. ౨౩

ఈలంకయందుఁ బూర్వద్వారంబున బదివేలరాక్షసులున్నారు; వారలందఱు శూలపాణులు; యుద్ధంబున నెదిరింపనలవిగానివారలు; యుద్ధంబున ముందునిలిచి ఖడ్గంబులం బోరువారలు. ౨౪

లంకయందు దక్షిణద్వారంబునఁ జతురంగసైన్యముతోఁగూడ లక్షమందిరాక్షసు లున్నారు; వారలును మిక్కిలియుఁ సమర్థులు. ౨౫

లంకాపశ్చిమద్వారంబునఁ బదిలక్షలరాక్షసు లున్నారు. వారలందఱును జర్మకవచంబులను ఖడ్గంబులనుదాల్చి సమస్తాస్త్రంబులుం దెలిసి వెల్గుచుందురు. ౨౬

స్యర్బుదం రక్షసా మత్రా పుత్తరద్వార మాశ్రితమ్. ౨౭
రథిన శ్చాశ్వవాహాశ్చ కులపుత్త్రా స్సుపూజితాః,

శతశోఽథ సహస్రాణి మధ్యమం స్కన్ధ మాశ్రితాః. ౨౮
యాతుధానా దురాధర్షా స్సాగ్రకోటిశ్చ రక్షసామ్,
తే మయా సఙ్క్రమా భగ్నాః పరిఖాశ్చావపూరితాః. ౨౯
దగ్ధా చ నగరీ లఙ్కా ప్రాకారాశ్చావసాదితాః,

బలైకదేశః క్షపితో రాక్షసానాం మహాత్మనామ్. ౩౦

యేన కేనచ మార్గేణ తరామ వరుణాలయమ్,
హతేతి నగరీ లఙ్కా వానరై రవధార్యతామ్. ౩౧
అఙ్గదో ద్వివిదో మైన్దో జామ్బవా న్పనసో నలః,
నీల స్సేనాపతి శ్చైవ బలశేషేణ కిం తవ. ౩౨

ప్లవమానా హి గత్వా తాం రావణస్య మహాపురీమ్,
సపర్వతవనాం భిత్త్వా సఖాతాం సప్రతోరణామ్. ౩౩
సప్రాకారాం సభవనా మానయిష్యన్తి రాఘవ,
ఏవ మాజ్ఞాపయ క్షిప్రం బలానాం సర్వసఙ్గ్రహమ్. ౩౪
ముహూర్తేన తు యుక్తేన ప్రస్థాన మభిరోచయ."

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే తృతీయస్సర్గః. ౩.

లంకాపురియుత్తరద్వారంబున నూఱుకోటులరాక్షసు లున్నారు; అందు గొందఱు రథికులును గొందఱశ్వసాదులును గొందఱు గజసాదులును గానున్నారు; వారలు సత్కులంబునం బుట్టినవారును రావణునకు విశ్వాసనీయులై రావణునిచే మిక్కిలియు గౌరవింపఁబడుచుండురు. ౨౭

మఱియు దురాధర్షులగు రాక్షసులు నూఱునూఱులుగాను వేనవేలంగాను గోటులుగాను పట్టణమధ్యమస్థానంబున నున్నవారు. ౨౮

నే నాయగడ్తలమీఁది సంచారమార్గంబులను బగులఁగొట్టితిని; ఆయగడ్తలను బూడ్చి వేసినాను; ఆలంకానగరి నంతయు దహించితిని; ఆప్రాకారంబులను బగులఁగొట్టితిని; ఇప్పు డంతకష్టములేదు. ౨౯

నేను మఱియు రావణునిసైన్యములోఁ గొంతభాగమయిన మహాపరాక్రమశాలులగు రాక్షసులం జంపియున్నాను. ౩౦

ఏయుపాయముచేనైనను సముద్రంబును దాఁటవచ్చును; ఇంక వానరులు లంకానగరమును హతము గావించిరనియే నిశ్చయింపుము. ౩౧

మిగతసేనతో మనకుఁ గార్యములేదు; అంగదుఁడును ద్వివిదుఁడును మైందుఁడును జాంబవంతుఁడును బనసుఁడును నలుఁడును సేనానాయకుఁడగు నీలుఁడును ఉన్నారు; వీరలే చాలును. ౩౨

రాముఁడా! వీరలు ఆకాశమార్గంబునంబోయి పర్వతంబులతోను వనంబులతోను బహిర్ద్వారములతోను ప్రాకారములతోను గృహంబులతోను లంకాపట్టణంబుఁ బెల్లగించి యిచ్చుటకిఁ దేఁగలరు. ౩౩

సైన్యంబులలో నన్నింటికిని సారభూతులగు నంగదాదులకు శీఘ్రముగా నిట్లానతిమ్ము. యాత్రాయోగ్యంబగు ముహూర్తంబునఁ బయనంబగునట్లు సంఘటింపుము. అని హనుమంతుఁడు రామునకుఁ జెప్పెను. ౩౪

ఇది మూఁడవసర్గము.

---

## చతుర్థస్సర్గః.

శ్రుత్వా హనుమతో వాక్యం యథావ దనుపూర్వశః,
తతోఽబ్రవీ న్మహాతేజా రామ స్సత్యపరాక్రమః. ౧
"యాం నివేదయసే లఙ్కాం పురీం భీమస్య రక్షసః,
క్షిప్ర మేనాం మథిష్యామి సత్య మేతద్బ్రవీమి తే. ౨

అస్మి న్ముహూర్తే సుగ్రీవ! ప్రయాణ మభిరోచయే,
యుక్తో ముహూర్తో విజయః ప్రాప్తో మధ్యం దివాకరః. ౩

అస్మి న్ముహూర్తే విజయే ప్రాప్తే మధ్యం దివాకరే,
సీతాం హృత్వా తు మే జాతు క్వాసౌ యాస్యతి యాస్యతః

సీతా శ్రుత్వాఽభియానం మే ఆశామేష్యతి జీవితే,
జీవితాన్తేఽమృతం స్పృష్ట్వా పీత్వా విషమివాతురః. ౪

ఉత్తరా ఫల్గునీ హ్యద్య శ్వస్తు హస్తేన యోక్ష్యతే,
అభిప్రయామ సుగ్రీవ! సర్వానీకసమావృతాః. ౫

నిమిత్తాని చ ధన్యాని యాని ప్రాదుర్భవన్తి చ,
నిహత్య రావణం సీతా మానయిష్యామి జానకీమ్. ౬
ఉపరిష్టాద్ధి నయనం స్ఫురమాణ మిదం మమ,
విజయం సమనుప్రాప్తం శంసతీవ మనోరథమ్." ౭

## నాలుగవసర్గము.

మహాతేజుఁడును సత్యపరాక్రముఁడు నగురాముఁడు హనుమంతుఁడు చెప్పినమాటనంతయుఁ గ్రమముగా విని హనుమంతునిజూచి ఇట్లని చెప్పెను.

నీ విపుడు భయంకరుఁడగు రావణునిపట్టణమగు నే లంకం జెప్పుచున్నావో దాని శీఘ్రముగా నే హతము గావించెదను; సత్యము నీకుం జెప్పుచున్నాను. అని రాముఁడు హనుమంతునితోఁ జెప్పెను. ౨

సుగ్రీవుఁడా! ఈ ముహూర్తమునందే ప్రయాణము సేయవలయునని కోరుచున్నాను; ఇప్పుడు సూర్యుఁడు దివామధ్యము నొందియున్నాఁడు; ఈయభిజిన్ముహూర్తము ప్రయాణమునకు యుక్తమయినది; జయంబు గల్గించునది. ౩

సూర్యుఁడు మధ్యంగతుఁడై యుండునప్పుడు విజయావహంబగు నీయభిజిన్ముహూర్తంబున నేను బ్రయాణమగుదు నేని సీత నపహరించిన రావణుఁడు ఎచ్చటికిఁబోయి తప్పించుకొనఁగలఁడు? అతఁ డెచ్చటికిఁబోయినను విడువక వధింతును. ౪

విషంబుఁ ద్రాఁగినవాఁడు పీడితుఁడై చావంబోవునంతటికాలంబున నమృతస్పర్శంబునొంది కొంచెము జీవనశక్తినొందునట్లు సీతాదేవి నాప్రయాణంబునువిని జీవితాశం బొందఁగలదు. ౫

సుగ్రీవుఁడా! నేఁడుత్తరఫల్గునీనక్షత్రము; పునర్వసూనక్షత్రంబునఁ బుట్టిన నాకు ఇది సాధనతార యగుచున్నది. రేపుహస్తనక్షత్రము అది నాకు నైధనతారయగును; కావున సమస్తసైన్యంబులంగూడి నేఁడే పయనమయ్యెదము. ౬

మఱియుం శుభసూచకంబులగు నిమిత్తంబులును బ్రాదుర్భవించుచున్నవి; అవశ్యము రావణుని వధించి జనకమహారాజుకూఁతురయిన సీతం దెచ్చెదను. నానేత్రము మీఁదుగా స్ఫురించుటం జేసి యవశ్యము నామనోరథము సిద్ధించునని తెలుపుచున్నది. అని రాముఁడు చెప్పెను. ౭

తతో వానరరాజేన లక్ష్మణేన చ పూజితః,
ఉవాచ రామో ధర్మాత్మా పునరప్యర్థకోవిదః. ౯

"అగ్రే యాతు బలస్యాస్య నీలో మార్గ మవేక్షితుమ్,
వృత శ్శతసహస్రేణ వానరాణాం తరస్వినామ్. ౧౦
ఫలమూలవతా నీల! శీతకాననవారిణా,
పథా మధుమతా చాఽఽశు సేనాం సేనాపతే! నయ. ౧౧

దూషయేయు ర్దురాత్మానః పథి మూలఫలోదకమ్,
రాక్షసాః పరిరక్షేథా స్తేభ్య స్త్వం నిత్య ముద్యతః. ౧౨

నిమ్నేషు వనదుర్గేషు వనేషు చ వనౌకసః,
అభిప్లుత్యాభిపశ్యేయుః పరేషాం నిహితం బలమ్. ౧౩

యచ్చ ఫల్గు బలం కించి త్తద త్రైవోపయుజ్యతామ్,
ఏతద్ధి కృత్యం ఘోరం నో విక్రమేణ ప్రయుజ్యతామ్. ౧౪

సాగరౌఘనిభం భీమ మగ్రానీకం మహాబలాః,
కపిసింహాః ప్రకర్షన్తు శతశోఽథ సహస్రశః. ౧౫
గజశ్చ గిరిసఙ్కాశో గవయశ్చ మహాబలః,
గవాక్షశ్చాగ్రతో యాన్తు గవాం దృప్తా ఇవర్షభాః. ౧౬

యాతు వానరవాహిన్యా వానరః ప్లవతాం వరః,
పాలయ న్దక్షిణం పార్శ్వ మృషభో వానరర్షభః. ౧౭

అంతట గార్యంబులఁబండితుఁడును ధర్మాత్ముఁడు నగురాముఁడు వానరరాజుఁడగు సుగ్రీవుఁడును లక్ష్మణుఁడును దాను జెప్పినమాటల నభినందింప మరల నిట్లని చెప్పెను. ౯

నీలుఁడు బలవంతులగు లక్షవానరులంగూడి మార్గంబుఁజూచుటకై సేనకుముందు నడచుఁగాక. అని రాముఁడు సుగ్రీవునితోఁ జెప్పెను. ౧౦

సేనానాయకుఁడవగు నీలుఁడా! అధికముగా ఫలమూలంబులుగలదియుఁ జల్లనియడవులును నీళ్లును గలదియుం మధుపూర్ణంబునగు మార్గంబున శీఘ్రముగా సేనం దీసికొనిపొమ్ము. ౧౧

దురాత్ములగురాక్షసులు మార్గంబున మూలఫలంబులను జలంబులను జెఱచివేయుదురు; నీవు ఏమఱక సావధానుఁడవై వార లట్లు సేయకుండునట్లు రక్షింపుచుండుము. ౧౨

ఒకవేళ శత్రువులు పల్లపునేలలయందును జలదుర్గస్థానంబులందును అడవులయందును సమయముఁజూచి మనలం బ్రహరించుటకై సైన్యంబు లుంచియుందురు; వానరు లచ్చోటచ్చోట నాకాశంబున కుద్గమించి యట్టిస్థలంబుల శత్రుసైన్యంబు లున్నవో లేవో చూడవలయును. ౧౩

కొంచెము నిస్సారమయిన బల మున్నయెడల దాని నిచ్చటనే యుంప యోగార్థమయియుంచుఁడు; మనది గొప్పకార్యము కావున నందఱును బరాక్రమంబు నవలంబించి యుండవలయును. ౧౪

మహాబలశాలులగు వానరశ్రేష్ఠులు నూఱునూఱులుగాను వేనవేలుగాను గుంపులుగూడి యగ్రసేనతోఁ గూడి ముందునడతురుగాక. ౧౫

పర్వతాకారుఁడగు గజుఁడును మహాబలుఁడగు గవయుఁడును గవాక్షుఁడును గర్వితంబులగు నాఁబోతులు గోవులముందటం బోవునట్లు సేనకుముందు నడతురుగాక. ౧౬

ఎగురువారిలో నుత్తముఁడును వానరశ్రేష్ఠుఁడునగు ఋషభుఁడు వానరసేన దక్షిణపార్శ్వమును బాలించుచువచ్చుఁగాక. ౧౭

గన్ధహస్తీవ దుర్ధర్ష స్తరస్వీ గన్ధమాదనః,
యాతు వానరవాహిన్యా స్సవ్యం పార్శ్వ మధిష్ఠితః. ౧౮
యాస్యామి బలమధ్యేఽహం బలౌఘ మభిహర్షయన్,
అధిరుహ్య హనూమన్త మైరావత మివేశ్వరః. ౧౯
అఙ్గదేనైష సంయాతు లక్ష్మణ శ్చాన్తకోపమః,
సార్వభౌమేన భూతేశో ద్రవిణాధిపతి ర్యథా. ౨౦

జామ్బవాంశ్చ సుషేణశ్చ వేగదర్శీ చ వానరః,
ఋక్షరాజో మహాసత్త్వః కుక్షిం రక్షన్తు తే త్రయః." ౨౧

రాఘవస్య వచః శ్రుత్వా సుగ్రీవో వాహినీపతిః,
వ్యాదిదేశ మహావీర్యాన్వానరాన్వానరర్షభః. ౨౨
తే వానరగణా స్సర్వే సముత్పత్య యుయుత్సవః,
గుహాభ్యశ్శిఖరేభ్యశ్చ ఆశు పుప్లువిరే తదా. ౨౩
తతో వానరరాజేన లక్ష్మణేన చ పూజితః,
జగామ రామో ధర్మాత్మా ససైన్యో దక్షిణాం దిశమ్. ౨౪
శతై శ్శతసహస్రైశ్చ కోటీభి రయుతై రపి,
వారణాభైశ్చ హరిభి ర్యయౌ పరివృత స్తదా. ౨౫

తం యాన్త మనుయాతి స్మ మహతీ హరివాహినీ,

దృప్తాః ప్రముదితా స్సర్వే సుగ్రీవేణాభిపాలితాః. ౨౬
ఆప్లవన్తః ప్లవన్తశ్చ గర్జన్తశ్చ ప్లవఙ్గమాః,
క్ష్వేళన్తో నినదన్త స్తే జగ్ము ర్వై దక్షిణాం దిశమ్. ౨౭

మత్తగజముంబోలె దుర్ధర్షుఁడును బలవంతుఁడునగు గంధమాదనుఁడు వానరసేన యెడమప్రక్కను బాలించుచు వచ్చుఁగాక. ౧౮

నేను దేవేంద్రుఁడైరావతము నారోహించునట్లు హనుమంతునిపై నారోహించి సైన్యంబులకుత్సాహంబు గల్గించుచు సైన్యమధ్యంబున వచ్చెదను.

యక్షనాథుఁడగు కుబేరుఁడు సార్వభౌమంబను నుత్తరదిగ్గజంబు నెక్కిపోవునట్లు అంతకతుల్యుఁడగు నీలక్ష్మణుఁడును అంగదు నారోహించి వచ్చునుగాక. ౨౦

ఋక్షరాజుఁడును మహాబలుఁడు నగుజాంబవంతుఁడును సుషేణుఁడును వేగదర్శియుం వీరుమువ్వురును సేనాపశ్చాద్భాగమును రక్షింతురుగాక. అని రాముఁడు చెప్పెను. ౨౧

వానరోత్తముఁడును వానరసేనాధీశ్వరుఁడునగు సుగ్రీవుఁడు రాముఁడు చెప్పినమాటను విని మహాపరాక్రమశాలులగు వానరులకుఁ బయనముకండని యాజ్ఞాపించెను. ౨౨

అప్పుడు వానరులందఱును యుద్ధోత్సాహులయి గుహలనుండియుఁ బర్వతశిఖరంబులనుండియుం వృక్షంబులనుండియు నెగిరి గంతులువేసిరి. ౨౩

అంత ధర్మాత్ముఁడగురాముఁడు వానరరాజుండగు సుగ్రీవునిచే లక్ష్మణునిచేఁ బూజితుఁడై వానరసైన్యంబుఁగూడి దక్షిణపుదిక్కునుబట్టి పోయెను.

అప్పుడు రాముఁడు నూఱునూఱులుగాను లక్షలులక్షలుగాను కోటులు కోటులుగాను బదివేలుపదివేలుగాను నుండువానరులచేఁ బరివేష్టితుఁడై పోయెను. ౨౫

అప్పుడు రాముఁడు పోవుచుండఁగా ఆయనను గొప్పవానరసేన వెంబడించి నడచినది.

ఆవానరులు గర్వితులయి సంతుష్టులయి సుగ్రీవపాలితులయి యెగురుచు గంతులువేయుచు నఱచుచు సింహనాదంబులు గావించుచుఁ బరుగులిడుచు సుగంధిఫలంబులఁ దినుచుఁ జేనియలం ద్రావుచు విలాసార్థము పుష్ప

భక్షయన్త స్సుగన్ధీని మధూని చ ఫలాని చ,
ఉద్వహన్తో మహావృక్షా న్మఞ్జరీపుఞ్జధారిణః. ౨౮
అన్యోన్యం సహసా దృష్ట్వా నిర్వహన్తి క్షిపన్తిచ,
పతన్త శ్చాక్షిప న్త్యన్యే పాతయన్త్యపరే పరాన్. ౨౯

"రావణో నో నిహన్తవ్య స్సర్వే చ రజనీచరాః,"
ఇతి గర్జన్తి హరయో రాఘవస్య సమీపతః. 30
పురస్తా దృషభో వీరో నీలః కుముద ఏవచ,
పన్థానం శోధయన్తి స్మ వానరై ర్బహుభి స్సహ. 31

మధ్యే తు రాజా సుగ్రీవో రామో లక్ష్మణ ఏవచ,
బహుభి ర్బలిభి ర్భీమై ర్వృతా శ్శత్రునిబర్హణాః. 3౨

హరి శ్శతవలి ర్వీరః కోటీభిర్దశభి ర్వృతః,
సర్వా మేకో హ్యవష్టభ్య రరక్ష హరివాహినీమ్. 33
కోటిశతపరీవారః కేసరీ పనసో గజః,
అర్క శ్చాతిబలః పార్శ్వ మేకం తస్యాభిరక్షతి. 3౪

సుషేణో జామ్బవాం శ్చైవ ఋక్షైశ్చ బహుభి ర్వృతౌ,
సుగ్రీవం పురతః కృత్వా జఘనం సంరరక్షతుః. 3౫

తేషాం సేనాపతి ర్వీరో నీలో వానరపుఙ్గవః,
సమ్పతన్పతతాం శ్రేష్ఠ స్తద్బలం పర్యపాలయత్. 3౬

మంజరీశోభితంబులగు పెద్దవృక్షంబులఁ బట్టుకొనుచు దక్షిణదిక్కునకుం బోయిరి. ౨౮

అప్పుడు వానరులు గర్వితులయి బలంబునఁ గొందఱు ఇతరులం బైకెత్తిరి; కొంద ఱితరులం బడఁద్రోసిరి; కొందఱు పడఁద్రోయఁబడి యశక్తులు కావునఁ బడఁద్రోసినవారల నాక్షేపించిరి; శక్తులగువారలు కొందఱు తమ్ముఁ బడఁ ద్రోసినవారల మరలఁ బడఁద్రోసిరి. ౨౯

"మనము రావణుని రాక్షసుల నందఱను జంపివేయవలయు" నని యిట్లు వానరులు రామునిసమీపమునందు గర్జించుచుండిరి. ౩౦

పరాక్రమశాలియగు ఋషభుఁడనువాఁడును నీలుఁడును కుముదుఁడును పెక్కువానరులంగూడి సేనకు ముందు నడచి మార్గఁబు శోధింపు చుండిరి. ౩౧

శత్రువులఁ జంపువారలగు వానరరాజు సుగ్రీవుఁడును రాముఁడును లక్ష్మణుఁడును బలవంతులును భయంకరాకారులునగు పెక్కువానరులచేఁ బరివేష్టింపఁబడిన వారలై సేనామధ్యంబునఁ బోయిరి. ౩౨

వీరుఁడగు శతవలియను వానరుఁడు, పదికోట్లవానరవీరులచేఁ బరివేష్టితుఁడై యొక్కఁడే వానరసేన నంతయు రక్షించుచుండెను. ౩౩

కేసరియుఁ బనసుఁడును గజుఁడును మహాబలుఁడునగు నరుక్కుఁడును ఒక్కొకరు నూఱుకోటులవానరులతోఁగూడి వానరసేన యొక పార్శ్వంబును రక్షింపుచుండిరి. ౩౪

సుషేణుఁడును జాంబవంతుడును ఋక్షసైన్యంబుచేఁ బరివేష్టితులయి సుగ్రీవుని ముందట నుంచుకొని వానరసేన పశ్చిమభాగమును రక్షింపుచుండిరి. ౩౫

వానరసేనానాయకుఁడును బరాక్రమవంతుఁడును వానరోత్తముఁడును ఉత్పతనశక్తిగలవారలలో నుత్తముఁడునగు నీలుఁడు నాలుగుప్రక్కలం దిరుగుచు వానరసేనను రక్షింపుచుండెను. ౩౬

దరీముఖః ప్రజఙ్ఘశ్చ రమ్భోఽథ రభసః కపిః,
సర్వతశ్చ యయు ర్వీరా స్త్వరయ న్తః ప్లవఙ్గమాన్. 3౭

ఏవం తే హరిశార్దూలా గచ్ఛన్తో బలదర్పితాః,
అపశ్యం స్తే గిరిశ్రేష్ఠం సహ్యం ద్రుమలతాయుతమ్. 3౮
సరాంసిచ సుఫుల్లాని తటాకాని వనాని చ,

రామస్య శాసనం జ్ఞాత్వా భీమకోపస్య భీతవత్. 3౯
వర్జయ న్నగరాభ్యాశాం స్తథా జనపదానపి,
సాగరౌఘనిభం భీమం తద్వానరబలం మహత్. ౪౦
ఉత్ససర్ప మహాఘోషం భీమఘోష ఇవార్ణవః,
తస్య దాశరథేః పార్శ్వే శూరా స్తే కపికుఞ్జరాః. ౪౧
తూర్ణ మాపుప్లువు స్సర్వే సదశ్వా ఇవ చోదితాః,

కపిభ్యా ముహ్యమానౌ తౌ శుశుభాతే నరోత్తమౌ. ౪౨
మహద్భ్యా మివ సంస్పృష్టౌ గ్రహాభ్యాం చన్ద్రభాస్కరౌ,

తతో వానరరాజేన లక్ష్మణేన చ పూజితః. ౪3
జగామ రామో ధర్మాత్మా ససైన్యో దక్షిణాం దిశమ్,
త మఙ్గదగతో రామం లక్ష్మణ శ్శుభయా గిరా. ౪౪
ఉవాచ పరిపూర్ణార్థః స్మృతిమాన్ ప్రతిభానవాన్,

"హృతా మవాప్య వైదేహీం క్షిప్రం హత్వాచ రావణమ్. ౪౫
సమృద్ధార్థ స్సమృద్ధార్థా మయోధ్యాం ప్రతియాస్యసి,

మఱియుఁ బరాక్రమవంతులగు శరీముఖుఁడును బ్రజంఘుఁడును రంభుఁడును రభసుండును నాలుగుప్రక్కలఁ దిరుగుచు వానరుల నందఱను బ్రోత్సాహపఱచుచుఁ బోయిరి. 32

ఆవానరోత్తములు ఇట్లు బలగర్వితులయి పోవుచు దూరంబుననుండి వృక్షంబులతోను లతలతోను ఒప్పుచున్నపర్వతశ్రేష్ఠంబగు సహ్యాపర్వతంబును మఱియు ఫుల్లపద్మకల్హారంబులగు సరస్సులను దటాకంబులను వనంబులనుం జూచిరి. 38

సముద్రంబుఁబోలె ననంతంబయియున్నదియుం భయంకరంబునగు నావానరసేన భయంకరకోపుఁడగు రామునాజ్ఞకు భయపడి నగరంబులపైఁగాని గ్రామంబులపైఁగాని పడక మహాధ్వనిగలుగ మహాఘోషంబగు సముద్రంబుకరణిం బోయినది. 39, 40

రామునకు ఉల్లాసంబుగల్గించుటకై యతనిసమీపంబున శూరులగువానరోత్తములు చోదితంబులగు నుత్తమాశ్వంబులకైవడి శీఘ్రంబునం బరుగెత్తిరి. 41

పురుషశ్రేష్ఠులగు రామలక్ష్మణులు హనుమదంగదులపై నుండుటంజేసి బృహస్పతిశుక్రులతో సంబంధించిన చంద్రసూర్యులంబోలెఁ బ్రకాశించిరి. 42

అట్లు ధర్మాత్ముఁడగు రాముఁడు వానరరాజుఁడగు సుగ్రీవుఁడును లక్ష్మణుఁడును బూజింప వానరసేనంగూడి దక్షిణపుదిక్కునకుం బోయెను. 43

జ్ఞాపకశక్తిగలవాఁడును మిక్కిలియుఁ బ్రతిభగలవాఁడునగు అంగదునిపైఁ గూర్చుండియున్నలక్ష్మణుఁడు పరిపూర్ణమనోరథుఁడై హనుమంతునిపై నున్నరాముంజూచి మంగళవాక్యంబున నిట్లని చెప్పెను. 44

నీవు శీఘ్రంబుగా రావణుంజంపి మరల సీతాదేవింబొంది సమృద్ధమనోరథుఁడవై యట్లు సమృద్ధార్థంబయియున్న యయోధ్యానగరంబునకుఁ బోఁగలవు. 45

మహాన్తిచ నిమిత్తాని దివి భూమౌచ రాఘవ!. ౪౬
శుభాని తవ పశ్యామి సర్వాణ్యేవార్థసిద్ధయే,

అనువాతి శుభో వాయుస్సేనాం మృదుహిత స్సుఖః. ౪౭
పూర్ణవల్గుస్వరా శ్చేమే ప్రవదన్తి మృగద్విజాః,

ప్రసన్నాశ్చ దిశ స్సర్వా విమలశ్చ దివాకరః. ౪౮

ఉశనాశ్చ ప్రసన్నార్చి రను త్వాం భార్గవో గతః,
బ్రహ్మరాశి ర్విశుద్ధశ్చ శుద్ధాశ్చ పరమర్షయః. ౪౯
అర్చిష్మన్తః ప్రకాశన్తే ధ్రువం సర్వే ప్రదక్షిణమ్,

త్రిశఙ్కు ర్విమలో భాతి రాజర్షి స్సపురోహితః. ౫౦
పితామహవరోఽస్మాక మిక్ష్వాకూణాం మహాత్మనామ్,

విమలే చ ప్రకాశేతే విశాఖే నిరుపప్లవే. ౫౧
నక్షత్రవర మస్మాక మిక్ష్వాకూణాం మహాత్మనామ్,
నైరృతం నైరృతానాం చ నక్షత్ర మభిపీడ్యతే. ౫౨
మూలో మూలవతా స్పృష్టో ధూప్యతే ధూమకేతునా,

సర్వం చైతద్వినాశాయ రాక్షసానాముపస్థితమ్. ౫౩
కాలే కాలగృహీతానాం నక్షత్రం గ్రహపీడితమ్,
ప్రసన్నాస్సురసాశ్చాపో వనాని ఫలవన్తి చ. ౫౪
ప్రవాన్త్యభ్యధికం గన్ధాన్యథర్తు కుసుమా ద్రుమాః,

రాముఁడా! ఆకాశంబునందును భూమియందును గొప్పశుభనిమిత్తంబు లేవిగలవో అవియన్నియు నిప్పుడు ప్రాదుర్భూతంబులయి నీకార్యసిద్ధిని సూచించుచున్నవి. ౪౬

వాయువు హితకరంబయి సుఖకరంబయి భావిమంగళంబు సూచించుచు మెల్లమెల్లఁగా సేనవెంబడి వీచుచున్నది. మృగంబులును బక్షులును మధురంబుగా ధ్వనించుచున్నవి. ౪౭

దిక్కులన్నియుఁ బ్రసన్నములయియున్నవి. సూర్యుఁడు విమలుఁడై యున్నాఁడు. ౪౮

సమస్తవేదవేత్తయుఁ బరిశుద్ధుఁడునగు భార్గవుఁడు శుక్రుఁడు ప్రసన్నతేజుఁడై నీకు వెనుకఁ బ్రకాశించుచున్నాఁడు; మఱియుఁ బరిశుద్ధులగు సప్తర్షులు కాంతిమంతులయి ధ్రువునకుఁ బ్రదక్షిణంబుగాఁ దిరుగుచుఁ బ్రకాశించుచున్నారు. ౪౯

మహాత్ములు నిక్ష్వాకువంశ్యులునగు మనకుఁ బ్రధానకూటస్థుఁడును రాజర్షియునగు త్రిశంకుమహారాజును విశ్వామిత్రసృష్టసప్తర్ష్యంతర్గతవసిష్ఠునితోఁగూడి నిర్మలుఁడై ప్రకాశించుచున్నాఁడు. ౫౦

మహాత్ములగు మనయిక్ష్వాకువంశ్యుల నక్షత్రమయిన విశాఖానక్షత్రము దుష్టగ్రహాసంబంధము లేక నిర్మలమయి ప్రకాశించుచున్నది. ౫౧

ఇదిగాక నిర్‌ృతిదైవత్యంబగు రాక్షసులనక్షత్రమయిన మూలానక్షత్రము సమీపంబున నున్న ధూమకేతువుచే స్పృశింపఁబడి తపింపఁజేయఁబడినదై మిక్కిలియుఁ బీడితమగుచున్నది. ౫౨

ఇదంతయు రాక్షసుల వినాశంబునకే పుట్టినవి; ఏలయనఁగా మృత్యుగ్రస్తులగువారినక్షత్రంబు ఆట్టి యంత్యకాలంబున దుష్టగ్రహపీడితంబగును.

మఱియు నీళ్లు స్వచ్ఛములయి మంచిరుచిఁగలిగియున్నవి, వనంబులు ఫలపూర్ణంబు లయియున్నవి; వృక్షములన్నియు ఋతుమర్యాద నతిక్రమించక చక్కఁగాఁ బుష్పించి సుగంధంబుల గుబాళించుచున్నవి. ౫౪

వ్యూఢాని కపిసైన్యాని ప్రకాశన్తేఽధికం ప్రభో!. ౫౫
దేవానా మివ సైన్యాని సఙ్గ్రామే తారకామయే,

ఏవ మార్య! సమీక్ష్యైతా న్నిమిత్తాని ప్రభాషితం మర్హసి." ౫౬

ఇతి భ్రాతర మాశ్వాస్య హృష్ట స్సౌమిత్రి రబ్రవీత్,

అథావృత్య మహీం కృత్స్నాం జగామ మహతీ చమూః. ౫౭
ఋక్షవానరశార్దూలై ర్నఖదంష్ట్రాయుధైర్వృతా,
కరాగ్రై శ్చరణాగ్రైశ్చ వానరై రుత్థితం రజః. ౫౮
భీమ మన్తర్దధే లోకం నివార్య సవితుః ప్రభామ్,
సపర్వతవనాకాశాం దక్షిణాం హరివాహినీ. ౫౯
ఛాదయన్తీ యయౌ భీమా ద్యామివామ్బుదసన్తతిః,

ఉత్తరన్త్యాం చ సేనాయాం సతతం బహుయోజనమ్. ౬౦
నదీస్రోతాంసి సర్వాణి సస్యన్దు ర్విపరీతవత్ ,

సరాంసి విమలామ్భాంసి ద్రుమాకీర్ణాంశ్చ పర్వతాన్. ౬౧
సమాన్భూమిప్రదేశాంశ్చ వనాని ఫలవన్తి చ,
మధ్యేన చ సమన్తాచ్చ తిర్యక్చాధశ్చ సాఽవిశత్. ౬౨

సమావృత్య మహీం కృత్స్నాం జగామ మహతీ చమూః,

ప్రభుఁడవగురాముఁడా! వ్యూహములుగా నేర్పఱుపఁబడియున్న యీవానరసైన్యంబులు మున్ను తారకాసురయుద్ధంబున (లేక చంద్రుఁడు బృహస్పతిభార్యను దారం గొనిపోయినప్పుడు తన్నిమిత్తకంబగు యుద్ధంబునందు) దేవసైన్యంబులుంబోలె మిక్కిలియుఁ బ్రకాశించుచున్నవి. ౧౧

పూజ్యుఁడవగు రాముఁడా! ఇట్లు ఈ శుభనిమిత్తంబుల నన్నింటినిం జూచి సంతోషంబు నొందియుండుము అని లక్ష్మణుఁడు రామునికిం జెప్పెను. ౧౬

లక్ష్మణుఁడు సంతుష్టుఁడై యీప్రకారము అన్నయగు రాము నాశ్వాసించెను.

అట్లు నఖదంతాయుధులగు నాఋక్షవానరుల మహాసేన భూమినంతయుం వ్యాపించి పోవుచుండెను. ౧౭

వానరులహస్తములచేతను పాదములచేతను రేఁగినదుమ్ముసూర్యునిప్రకాశము నావరించి యందఱకును భయముగల్గునట్లు లోకమంతయుం వ్యాపించినది.

భయంకరాకారమగు నావానరసేన మేఘసమూహము ఆకాశము నావరించునట్లు పర్వతములతోను వనంబులతోను ఆకాశంబులతోనుం గూడిన దక్షిణభూమినంతయుం నావరించుచుఁ బోయెను. ౧౯

అప్పుడు ఆవానరసేన నదులను నిరంతరముగా దాఁటుచుండుటచే నీళ్లు పోవుటకు వీలులేక నిలిచియుండుటంజేసి దాఁటికాఁగానే విపరీతప్రవాహము వచ్చినట్లు బహుయోజనంబులవఱకుఁ బాఱినవి. ౬౦

ఆవానరులు స్వచ్ఛములగు నీళ్లుగలసరస్సులను చల్లనినీళ్లుగలవి గావున వానిలోదిగి దాఁటిరి; వృక్షబహుళంబులగు పర్వతంబులు వచ్చినప్పుడు కొంచె మడ్డముగాఁబోయి దాఁటిరి; సమభూములలో నంతటను వ్యాపించి నడచిరి; ఫలవంతంబులగు వనంబులు వచ్చినప్పుడు ఫలంబు లందుకొని దిన వచ్చునని చెట్లక్రిందుగాఁ బోయిరి. ౬౧, ౬౨

గొప్పదగు నావానరసేన యిట్లు భూమినంతయు వ్యాపించిపోవుచుండిన ది.

తే హృష్టమనస స్సర్వే జగ్ము ర్మారుతరంహసః. ౬౩
హరయో రాఘవస్యార్థే సమారోపితవిక్రమాః,
హర్షవీర్యబలోద్రేకాన్ దర్శయన్తః పరస్పరమ్. ౬౪
యౌవనోత్సేకజాన్ దర్పా న్వివిధాం శ్చక్రు రధ్వని,

తత్ర కేచి ద్ద్రుతం జగ్ము రుత్పేతుశ్చ తథాఽపరే. ౬౫
కేచిత్కిలకిలాం చక్రు ర్వానరా వనగోచరాః,
ప్రాస్ఫోటయంశ్చ పుచ్ఛాని సన్నిజఘ్నుః పదాన్యపి. ౬౬
భుజాన్విక్షిప్య శైలాంశ్చ ద్రుమానన్యే బభఞ్జిరే,

ఆరోహ న్తశ్చ శృఙ్గాణి గిరీణాం గిరిగోచరాః. ౬౭
మహానాదా న్విముఞ్చన్తి క్ష్వేళామన్యే ప్రచక్రిరే,
ఊరువేగైశ్చ మమృదు ర్లతాజాలాన్యనేకశః. ౬౮
జృమ్భమాణాశ్చ విక్రాన్తా విచిక్రీడు శ్శిలాద్రుమైః,
శతైశ్శతసహస్రైశ్చ కోటిభిశ్చ సహస్రశః. ౬౯
వానరాణాం సుఘోరాణాం శ్రీమ త్పరివృతా మహీ,
సా స్మ యాతి దివారాత్రం మహతీ హరివాహినీ. ౭౦
హృష్టా ప్రముదితా సేనా సుగ్రీవేణాభిరక్షితా,

వానరా స్త్వరితం యాన్తి సర్వే యుద్ధాభినన్దినః. ౭౧
ప్రమోక్షయిషవ స్సీతాం ముహూర్తం క్వాపి నాసత,

తతః పాదపసమ్బాధం నానామృగసమాయుతమ్. ౭౨
సహ్యపర్వత మాసేదు ర్మలయం చ మహీధరమ్,
కాననాని విచిత్రాణి నదీః ప్రస్రవణాని చ. ౭౩

వాయుదేవునకుంబోలె మహావేగంబుగల యావానరులు రామకార్యంబు నిమిత్తమయి పరాక్రమంబు నవలంబించి సంతుష్టాంతఃకరణులయి పోయిరి.

ఆవానరులు మార్గమునందు ఒండొరులకుఁ దమతమసంతోషపరాక్రమబలాతిశయములం జూపుకొనుచు యౌవనబలంబునం గలుగునట్టి నానావిధచేష్టలం జేసిరి. ౬౪

అందుఁ గొందఱు వానరులు శీఘ్రముగాఁ బోయిరి; కొంద ఱెగిరిరి; కొందఱు కిలకిలయని యఱచిరి. ౬౫

మఱికొందఱు వానరులు తోఁకలను నేలంగొట్టిరి; కొందఱు పాదంబులను నేలంగొట్టిరి; కొందఱు చేతులుచాఁచి వృక్షంబులను విఱిచిరి పర్వతంబులఁ బగులఁగొట్టిరి. ౬౬

పర్వతవాసులగు వానరులు కొందఱు పర్వతశిరంబులపై నెక్కి పెద్దకేకలు వేసిరి. కొందఱు సింహనాదంబులు గావించిరి. ౬౭

కొందఱు ఊరువేగంబున లతాసమూహంబుల మర్దించిరి; మఱికొందఱు విజృంభించి పరాక్రమించి వృక్షంబులను ఱాళ్లను దీసికొని యాటలాడిరి. ౬౮

భయంకరాకారులగు వానరులు నూఱులు నూఱులుగాను వేనవేలుగాను లక్షలక్షలుగాను గోటులుకోటులుగాను భూమిని వ్యాపించియుండిరి.

గొప్పదగు నావానరసేన రామసహితమయి పరమసంతోషంబు నొంది పులకాంకితమయి సుగ్రీవపాలితమయి రేయుంబవలును బయనముచేయుచుండినది. ౭౦

వానరులందఱు యుద్ధంబునందలి యుత్సాహంబున మిక్కిలియు శీఘ్రముగాఁ బోయిరి; సీతాదేవిని ఎప్పుడెప్పుడు విడిపింతుమో యని కొంచెము సేపైనను ఎచ్చటను నిలువరైరి. ౭౧

అంత నావానరులు వృక్షములచే నిండినదియు నానావిధమృగసంయుతంబునగు సహ్యపర్వతంబును అట్లు మలయపర్వతంబును బొందిరి. ౭౨

రాముఁడు సహ్యమలయపర్వతంబులందలి నానావిధవనంబులగు వివిధ

పశ్యన్నతియయౌ రామ స్సహ్యస్య మలయస్య చ,
వకుళాం స్తిలకాం శ్చూతా నశోకాన్ సిన్ధువారకాన్. ౭౪
కరవీరాంశ్చ తినిశాన్ భఞ్జన్తిస్మ ప్లవఙ్గమాః,

అఙ్కోలాంశ్చ కరఞ్జాంశ్చ ప్లక్షన్యగ్రోధతిన్దుకాన్. ౭౫
జమ్బూకామలకా న్నీపా న్భఞ్జన్తిస్మ ప్లవఙ్గమాః,

ప్రస్తరేషు చ రమ్యేషు వివిధాః కాననద్రుమాః. ౭౬
వాయువేగప్రచలితాః పుష్పై రవకిరన్తి తాన్,
మారుత స్సుఖసంస్పర్శో వాతి చన్దనశీతలః. ౭౭
షట్పదై రనుకూజద్భి ర్వనేషు మధుగన్ధిషు,

అధికం శైలరాజ స్తు ధాతుభి స్సువిభూషితః. ౭౮
ధాతుభ్యః ప్రసృతో రేణు ర్వాయువేగవిఘట్టితః,
సుమహా ద్వానరానీకం ఛాదయామాస సర్వతః. ౭౯
గిరిప్రస్థేషు రమ్యేషు సర్వత స్సమ్ప్రపుష్పితాః,
కేతక్య స్సిన్ధువారాశ్చ వాసన్త్యశ్చ మనోరమాః. ౮౦
మాధవ్యో గన్ధపూర్ణాశ్చ కున్దగుల్మాశ్చ పుష్పితాః,
చిరిబిల్వా మధూకాశ్చ వఞ్జుళాః ప్రియకా స్తథా. ౮౧
స్ఫూర్జకా స్తిలకా శ్చైవ నాగవృక్షాశ్చ పుష్పితాః,
చూతాః పాటలయ శ్చైవ కోవిదారాశ్చ పుష్పితాః. ౮౨
ముచులిన్దార్జునా శ్చైవ శింశుపాః కుటజా స్తథా,
ధవా శ్శాల్మలయ శ్చైవ రక్తాః కురవకా స్తథా. ౮౩
హిన్తాలా స్తినిశా శ్చైవ చూర్ణకా నీపకా స్తథా,

లను సెలయేఱులను జూచుచుఁ బోయెను. ౭౩

వానరులు మార్గంబున చంపకవృక్షములను బొట్టుగుచెట్లను మామిడిచెట్లను అశోకవృక్షంబులను తెల్లవావిలిచెట్లను గన్నేరుచెట్లను వేమిచెట్లను అంత నంతఁ జూచుచుఁ బోయిరి. ౭౪

వానరులు మార్గంబున ఊడుగచెట్లను క్రానుగుచెట్లను జువ్విచెట్లను మఱ్ఱిచెట్లను తుమ్మికిచెట్లను నేరెడుచెట్లను, ఉసిరిగచెట్లను అంత నంతఁ జూచుచుఁ బోయిరి. ౭౫

రమణీయంబులగు శిలలయందున్న నానావిధవన్యవృక్షంబులు వాయువేగంబునకుఁ జలించి యావానరులపై పూలు గురిపించినవి. ౭౬

అప్పుడు మధుపూర్ణంబులగు సుగంధివనంబులందు భృంగంబులు ఝుంకరించుచు వెంటఁదగుల మందమారుతంబు సుఖస్పర్శంబయి చందనశీతలంబయి వీచినది. ౭౭

పర్వతశ్రేష్ఠంబగు సహ్యంబును మిక్కిలియుం ధాతుభూషితం బయినది. ౭౮

ఆవానరుల త్రొక్కుడువలన ధాతువులందుఁ బుట్టినపరాగము గాలిచెబ్బకు రేఁగి యావానరసైన్యము నంతయుఁ గప్పినది. ౭౯

అచ్చటఁ గొండనెత్తములందంతటను జక్కఁగాఁ బుష్పించియుండు మొగిలిపొదలను తెల్లవావిలిచెట్లును మనోహరంబులగు గురివెందచెట్లును మాధవీలతలును దుంపరాశ్మ చెట్లును మొల్లచెట్లును కానుగుచెట్లును ఇప్పచెట్లును పొగడచెట్లును వేఁగిసచెట్లును తుమికిచెట్లును బొట్టుగచెట్లును నాగకేసరవృక్షములును మామిడిమ్రాఁకులును కలిగొట్టుమ్రాఁకులును కోవిదారంబులును ఖర్జూరంబులును నర్జునంబులును శింశుపావృక్షంబులును అడవిమల్లెలును చంద్రమ్రాఁకులును శాల్మలివృక్షంబులును ఎఱ్ఱగోరంటలను శ్రీతాళపుమ్రాఁకులును వేమివృక్షంబులును ఉసిరిగమ్రాఁకులును గదంబవృక్షంబులును నల్లపువ్వుల యిరుగుడుమ్రాఁకులును ఉలిమిరిమ్రాఁకులును ఊడుగుమ్రాఁకులును మెట్టతామ

నీలాశోకాశ్చ వరణా అఙ్కోలాః పద్మకా స్తథా. ౮౪
ప్లవమానైః ప్లవఙ్గైస్తు సర్వే పర్యాకులీకృతాః,
వాప్య స్తస్మి న్గిరౌ శీతాః పల్వలాని తథైవ చ. ౮౫
చక్రవాకానుచరితాః కారణ్డవనిషేవితాః,
ప్లవైః క్రౌఞ్చైశ్చ సఙ్కీర్ణా వరాహమృగసేవితాః. ౮౬
ఋక్షై స్తరక్షుభి స్సింహై శ్శార్దూలైశ్చ భయావహైః,
వ్యాళైశ్చ బహుభి ర్భీమై స్సేవ్యమానా స్సమన్తతః. ౮౭
పద్మై స్సౌగన్ధికైః ఫుల్లైః కుముదై శ్చోత్పలై స్తథా,
వారిజై ర్వివిధైః పుష్పై రమ్యా స్తత్ర జలాశయాః. ౮౮
తస్య సానుషు కూజన్తి నానాద్విజగణా స్తథా,

స్నాత్వా పీతోదకా న్యత్ర జలే క్రీడన్తి వానరాః. ౮౯
అన్యోన్యం ప్లావయన్తిస్మ
శైల మారుహ్య వానరాః,
ఫలా న్యమృతగన్ధీని మూలాని కుసుమాని చ. ౯౦
బుభుజు ర్వానరా స్తత్ర పాదపానాం మదోత్కటాః,
ద్రోణమాత్రప్రమాణాని లమ్బమానాని వానరాః. ౯౧
యయుః పిబన్తో హృష్టా స్తే మధూని మధుపిఙ్గళాః,

పాదపానవభఞ్జన్తో వికర్షన్త స్తథా లతాః. ౯౨
విధమన్తో గిరివరా న్ప్రయయుః ప్లవగర్షభాః,
వృక్షేభ్యోఽన్యే తు కపయో నర్దన్తో మధుదర్పితాః. ౯౩
అన్యే వృక్షా న్ప్రపద్యన్తే ప్రపతన్త్యపి చాపరే,

రలును పుష్పితంబులగు నీవృక్షంబులన్నియుం వానరుల కోలాహలంబునకుఁ బర్యాకులంబు లయినవి. ౮౦-౮౪

ఆసహ్యపర్వతమునందు శీతలంబగు జలముగలవియుం జక్రవాకకారండవశోభితంబులును నీరుకాకులును క్రౌంచంబులును ఇవిమొదలగుపక్షులచే నొప్పుచున్నవియు వరాహాదిజలగోచరమృగసేవితంబులునగు నదబావులును ఋక్షంబులును సివంగులును సింహంబులును శార్దూలంబులును దుష్టగజంబులును మొదలగు భయంకరమృగంబులతోఁ గూడినవనంబులును వికసించిన కమలంబులును చెంగలువలును తెల్లకలువలును నల్లకలువలును మొదలగు జలజాతపుష్పంబులతో నొప్పుచున్న జలాశయంబులును ఇవన్నియుం నావానరులచేఁ జెఱుపఁబడినవి. ౮౫

అప్పుడాసైన్యముంజూచి సహ్యపర్వతసానువులందలి నానావిధపక్షులు కూయుచుండినవి.

వానరులు సహ్యపర్వతంబునందలి సరస్సులందు స్నానంబుగావించి నీళ్లుద్రావి యొక్కరిపై నొకరు నీళ్లుపోసుకొనుచుఁ గ్రీడించిరి. ౮౯

వానరు లంతఁ బర్వతంబు నారోహించి మదమోహితులయి అమృతంబువంటిఫలంబులను గడ్డలను పుష్పంబులను భుజించిరి. ౯౦

తేనెకుంబోలె గోరోచనపువన్నెగల యీవానరులు అచ్చటచ్చట వ్రేలుకాడుచున్న తూమెఁడుతేనియగల తేనెతెట్టెలను యథేచ్ఛముగాఁ ద్రాగుచుఁ బరమసంతోషంబునఁ బోయిరి. ౯౧

వానరోత్తములు వృక్షంబుల విఱుచుచు లతలను ఆకర్షించుచు గొప్ప పర్వతంబులను బగులఁగొట్టుచుఁ బోయిరి. ౯౨

కొందఱు వానరులు తేనెద్రావుటచే మదించి యఱచుచు వృక్షంబులు లేనిచోట నడచిరి; కొందఱు వృక్షముల నారోహించిరి; కొందఱు వృక్షంబులనుండి నేలకు దుమికిరి. ౯౩

బభూవ వసుధా తై స్తు సమ్పూర్ణా హరియూథపైః. ౯౪
యథా కలమకేదారైః పక్వై రివ వసున్ధరా,
మహేన్ద్ర మథ సమ్ప్రాప్య రామో రాజీవలోచనః. ౯౫
అధ్యారోహ న్మహాబాహు శ్శిఖరం ద్రుమభూషితమ్,

తత శ్శిఖర మారుహ్య రామో దశరథాత్మజః. ౯౬
కూర్మమీనసమాకీర్ణ మపశ్య త్సలిలాకరమ్,

తే సహ్యం సమతిక్రమ్య మలయం చ మహాగిరిమ్. ౯౭
ఆసేదు రానుపూర్వ్యేణ సముద్రం భీమనిస్వనమ్,
అవరుహ్య జగామాశు వేలావన మనుత్తమమ్. ౯౮
రామో రమయతాం శ్రేష్ఠ స్ససుగ్రీవ స్సలక్ష్మణః,

అథ ధౌతోపలతలాం తోయౌఘై స్సహసోత్థితైః. ౯౯
వేలా మాసాద్య విపులాం రామో వచన మబ్రవీత్,
ఏతే వయ మనుప్రాప్తా స్సుగ్రీవ! వరుణాలయమ్. ౧౦౦
ఇహేదానీం విచిన్తా సా యా నః పూర్వం సముత్థితా,

అతః పర మతీరోఽయం సాగరస్సరితాం పతిః. ౧౦౧
నచాఽయ మనుపాయేన శక్య స్తరితు మర్ణవః,
తదిహైవ నివేశోఽస్తు మన్త్రః ప్రస్తూయతా మితి. ౧౦౨
యథేదం వానరబలం పరం పార మవాప్నుయాత్,

ఇతీవ స మహాబాహు స్సీతాహరణకర్శితః. ౧౦౩
రామ స్సాగర మాసాద్య వాస మాజ్ఞాపయ త్తదా,

వానరోత్తములచేత నిండియుండుభూమి వరిపైరులచే నిండినభూమి వలె నొప్పుచుండినది. ౯౪

అంత మహాబాహుఁడును కమలంబులవంటి కన్నులుగలవాఁడునగు రాముఁడు మహేంద్ర పర్వతంబుఁ జేరి నానావృక్షసమూహాలంకృతంబగు దాని శిఖరంబు నారోహించెను. ౯౫

అంత దశరథకుమారుఁడగు రాముఁడు మహేంద్రశిఖరంబు నారోహించి తాఁబేళ్లతోను మత్స్యంబులతోను నిండియున్న సముద్రంబుఁ జూచెను. ౯౬

ఆవానరులు అట్లు సహ్యపర్వతంబును మలయపర్వతంబును దాఁటి భయంకరారావంబగు సముద్రంబు సమీపించిరి. ౯౭

ఇతరులకు సంతోషముగలిగించువారలలో నుత్తముఁడైనరాముఁడు సుగ్రీవలక్ష్మణులంగూడి పర్వతంబుడిగ్గి సముద్రంబుఁ జూచుకౌతుకంబున శీఘ్రముగా సముద్రతీరవనంబునకుఁ బోయెను. ౯౮

అంత రాముఁడు వేగవంతంబులగు తరంగంబులచే ధౌతంబులగు ఱాళ్లుగల సముద్రతీరంబుఁ జేరి సుగ్రీవునింజూచి యిట్లని చెప్పెను. ౯౯

సుగ్రీవుఁడా! ఇదిగో! మనము సముద్రంబునొద్దకు వచ్చితాము.

మును పే మనము చేసియుంటిమే ఆయాలోచనము నిప్పుడు చేయవలసినది.

ఇంక నదీపతియగు సముద్రంబేకాని తీరంబులేదు. ౧౦౧

ఉపాయంబులేక యీసముద్రంబు దాఁట నలవిగాదు.

అట్లుకావున నిచ్చటనే విడియుందము; ఈవానరసైన్యము సముద్రంబు నవ్వలిగట్టుచేరున ట్లాలోచనము సేయవలయును. అని రాముఁడు సుగ్రీవునితోఁ జెప్పెను. ౧౦౨

సీతాహరణంబునఁ బరమదుఃఖితుఁడైయున్న మహాబాహుఁడగు రాముఁడు సముద్రంబుఁ జేరినపిమ్మట నచ్చట విడియుటను గుఱించి యీ

సర్వా స్సేనా నివేశ్యన్తాం వేలాయాం హరిపుఙ్గవ!. ౧౦౪

సమ్ప్రాప్తో మన్త్రకాలో నః సాగరస్యాస్య లఙ్ఘనే,

స్వాం స్వాం సేనాంసముత్సృజ్య మాచ కశ్చి త్కుతో వ్రజేత్.
గచ్ఛన్తు వానరా శ్శూరా జ్ఞేయం ఛన్నం భయం చ నః,

రామస్య వచనం శ్రుత్వా సుగ్రీవ స్సహలక్ష్మణః. ౧౦౬
సేనాం న్యవేశయ త్తీరే సాగరస్య ద్రుమాయుతే,
విరరాజ సమీపస్థం సాగరస్య తు తద్బలమ్. ౧౦౭
మధుపాణ్డుజలః శ్రీమా న్ద్వితీయ ఇవ సాగరః,

వేలావన ముపాగమ్య తత స్తే హరిపుఙ్గవాః. ౧౦౮
వినివిష్టాః పరం పారం కాఙ్క్షమాణా మహోదధేః,
తేషాం నివిశమానానాం సైన్యసన్నాహనిస్వనః. ౧౦౯
అన్తర్ధాయ మహానాద మర్ణవస్య ప్రశుశ్రువే,
సా వానరాణాం ధ్వజినీ సుగ్రీవేణాభిపాలితా. ౧౧౦
త్రేధా నివిష్టా మహతీ రామస్యార్థపరాఽభవత్,

సా మహార్ణవ మాసాద్య హృష్టా వానరవాహినీ. ౧౧౧
వాయువేగసమాధూతం పశ్యమానా మహార్ణవమ్,

ప్రకార మాజ్ఞాపించెను. ౧౦౩

వానరశ్రేష్ఠుఁడవగు సుగ్రీవుఁడా! మనసేనల నన్నిఁటిని సముద్రతీరంబున విడియ నియమింపుము. ౧౦౪

ఈసముద్రంబు దాఁటు నుపాయంబును గుఱించి యాలోచించు నవసరంబు మనకుఁ గలిగినది.

ఎవ్వఁడును దనసేనను వదలి యెచ్చటికిని బోఁగూడదు. ౧౦౫

శూరులగువానరులు అంతటను దిరుగుచుండవలయును; ఛిద్రంబన్వేషించి మనలం బ్రహరించుటకై శత్రువు లెచ్చటనైనను దాఁచుకొనియుందురు. అని రాముఁడు సుగ్రీవునితోఁ జెప్పెను.

సుగ్రీవుఁడు రామునిమాటను విని లక్ష్మణునితోఁగూడ నానావృక్షసంయుతంబగు సముద్రతీరంబునందు వానరసేనను విడియ నియమించెను.

సముద్రసమీపంబున విడిసియున్న మధువర్ణులగు నావారులసేన కాంతిమంతంబగు మధువర్ణంబయిన రెండవసముద్రంబుకరణిఁ బ్రకాశించుచుండినది. ౧౦౬

ఆవానరశ్రేష్ఠులు సముద్రతీరవనముఁబొంది యంత సముద్రంబు నవ్వలితీరంబుఁ జేరంగోరుచు నచ్చటచ్చట విడిసిరి. ౧౦౭

అచ్చట నావానరసేన విడియుటవలనఁ గలిగినధ్వని సముద్రధ్వనిని గూడ నణఁచి చెలఁగినది. ౧౦౮

సుగ్రీవపాలితంబగు నాగొప్పవానరసేన వానరు లొక్కతట్టును గోలాంగూలంబు లొక్కతట్టును భల్లూకంబు లొక్కతట్టునుగా నిట్లు మూఁడు ప్రకారంబులవిడిసి రామునికార్యంబుగావింపనుద్యుక్తయయి పరమోత్సాహంబున నుండినది. ౧౧౦

ఆవానరసేన మహాసముద్రంబుఁ బొంది వాయువేగంబునకుఁ బెల్లుబ్బి తరంగంబులం జెలంగుచున్న మహాసముద్రముం జూచుచు సంతోషంబు నొందినది. ౧౧౧

దూరపార మసమ్బాధం రక్షోగణనిషేవితమ్. ౧౧౨
పశ్యన్తో వరుణావాసం నిషేదు ర్హరియూథపాః,
చణ్డనక్రగ్రహం ఘోరం క్షపాదౌ దివసక్షయే. ౧౧౩
హసన్త మివ ఫేనౌఘై ర్నృత్యన్త మివ చోర్మిభిః,
చన్ద్రోదయసముద్ధూతం ప్రతిచన్ద్రసమాకులమ్. ౧౧౪
చణ్డానిలమహాగ్రాహైః కీర్ణం తిమితిమిఙ్గిలైః,
దీప్తభోగై రివాకీర్ణం భుజఙ్గై ర్వరుణాలయమ్. ౧౧౫
అవగాఢం మహాసత్త్వై ర్నానాశైలసమాకులమ్,
సుదుర్గం దుర్గమార్గం త మగాధ మసురాలయమ్. ౧౧౬

మకరై ర్నాగభోగైశ్చ విగాఢా వాతలోళితాః,
ఉత్పేతుశ్చ నిపేతుశ్చ ప్రవృద్ధా జలరాశయః. ౧౧౭
అగ్నిచూర్ణ మివావిద్ధం భాస్వరామ్బు మహోరగమ్,
సురారివిషయం ఘోరం పాతాళవిషమం సదా. ౧౧౮
సాగరం చామ్బరప్రఖ్య మమ్బరం సాగరోపమమ్,
సాగరం చామ్బరం చేతి నిర్విశేష మదృశ్యత. ౧౧౯

సమ్పృక్తం నభసా ప్యమ్భ స్సమ్పృక్తం చ నభోఽమ్భసా,
తాదృగ్రూపే స్మ దృశ్యేతే తారారత్నసమాకులే. ౧౨౦

దురవస్థితంబగు నావలెగట్టుగలదియు నక్షోభ్యంబగు రాక్షససమూహంబుచే సేవింపఁబడినదియు వరుణునియునికిపట్టగు ఎట్టిమృగంబులైనఁ బట్టుకొనఁజాలిన మొసళ్లుగలదియు సంధ్యాకాలంబునందు భయంకరంబగు చూపట్టునదియు తెల్లనినురుఁగులచే నవ్వునట్లు దోఁచునదియుఁ దరంగంబుల నర్తనంబు గావించునట్లు గా నగుపడునదియుఁ జంద్రోదయకాలంబున మఱియుఁ బెల్లుబ్బి ప్రతిబింబితంబులగు చంద్రబింబంబుల నొప్పుచున్నదియు మహావాతంబునకుంబోలె వేగంబుగల మొసళ్లతోను దిమితిమింగిలంబులతోను నిండియుండునదియు ఫణాస్థితమణులచే వెలుంగుచున్న సర్పంబుల నొప్పుచున్నదియు మఱియు శింశుమారాదిమహాజంతువులచే వ్యాపింపఁబడినదియు జలంబులముణింగియున్న నానావిధపర్వతంబులుగలదియు జొరరానిదియు మార్గరహితంబగు మిక్కిలియు లోఁతుగలదియు నసురాలయంబగు నాసముద్రంబును జూచి వానరోత్తములు దీని నెట్లు దాఁటఁగలమని దుఃఖంబునొందిరి. ౧౧౬

గొప్పగొప్పతరంగములు మకరంబులతోను సర్పంబులతోను వాయువేగచలితంబులయి పెల్లుబ్బి యత్యున్నతంబులయి యెగిరిపడుచుండినవి. ౧౧౭

రాత్రికాలంబునందుఁ జంద్రకిరణసంపర్కంబునంజేసి సముద్రంబునందలి జలబిందువులు అగ్నికణంబులఁబోలె బ్రకాశించుచుండును; ఆకాశంబునందును అట్లు నక్షత్రంబులు ప్రకాశించుచుండును. సముద్రంబు మహానాగంబులుగలది, ఆకాశంబును నాగంబులుగలదే. సముద్రంబున నసురు లుందురు, ఆకాశంబునను అసురులుందురు. సముద్రంబు భయంకరంబైనది, ఆకాశంబును భయంకరంబైనది. సముద్రంబు పాతాళంబువలె గంభీరంబుగనుండినది, ఆకాశంబునట్టిదే. కావున నిప్పుడు సముద్రం బాకాశంబువలెనుండినది, ఆకాశంబు సముద్రంబువలె నుండినది ఇది సముద్రంబనియు నిది యాకాశంబనియు నెంతమాత్రము భేద మగపడలేదు. ౧౧౮, ౧౧౯

సముద్రమునందలిజలము ఆకాశమువలె నుండినది, ఆకాశంబు జలంబువలెనుండినది. కావున నాయాకాశసముద్రంబులు రెండును ఒక్కటివలె

సముత్పతితమేఘస్య వీచిమాలాకులస్య చ,
విశేషో న ద్వయో రాసీ త్సాగరస్యామ్బరస్య చ. ౧౨౧
అన్యోన్యస్య మాహతా స్సక్తా స్సస్వను ర్భీమనిస్వనాః,
ఊర్మయ స్సిన్ధురాజస్య మహాభేర్య ఇవాహవే. ౧౨౨
రత్నౌఘజలసన్నాదం విష క్త మివ వాయునా,
ఉత్పత న్త మివ క్రుద్ధం యాదోగణసమాకులమ్. ౧౨౩
దదృశు స్తే మహోత్సాహా వాతాహతజలాశయమ్,
అనిలోద్ధత మాకాశే ప్రవల్గ న్త మి వోర్మిభిః. ౧౨౪

తతో విస్మయ మాపన్నా దదృశు ర్హరయ స్తదా,
భ్రాన్తోర్మిజలసన్నాదం ప్రలోలమివ సాగరమ్. ౧౨౫

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే చతుర్థస్సర్గః. ౪.

---

పఞ్చమస్సర్గః.

సా తు నీలేన విధివత్స్వారక్షా సుసమాహితా,
సాగరస్యోత్తరే తీరే సాధు సేనా నివేశితా. ౧

మైన్దశ్చ ద్వివిదశ్చోభౌ తత్ర వానరపుఙ్గవౌ,
విచేరతు శ్చ తాం సేనాం రక్షార్థం సర్వతో దిశమ్. ౨
నివిష్టాయాం తు సేనాయాం తీరే నదనదీపతేః,
పార్శ్వస్థం లక్ష్మణం దృష్ట్వా రామో వచన మబ్రవీత్. 3
శోకశ్చ కిల కాలేన గచ్ఛతా హ్యపగచ్ఛతి,
మమ చాపశ్యతః కాన్తా మహన్యహని వర్ధతే. ౪

నొక్కటి భేదము లేకుండ నుండినవి. ౧౨౦

మేఘసమూహంబుతో నొప్పుచున్న యాకాశమునకును తరంగసంఘాకులం బగు సముద్రంబునకును ఎంతమాత్రము భేద మగపడలేదు. ౧౨౧

సముద్రంబునందలి యలలు ఒకటిచే నొకటి కొట్టఁబడినవై యంతరంబునందు పెద్దభేరులంబోలె భయంకరారావంబున ధ్వనించుచుండినవి.

రత్నంబులతోను జలంబులతోను మహాధ్వనిగల్గి వాయుహతంబయి యాకాశంబున కుద్గమించుకైవడి కోపంబునొందియుండు చాడ్పునం జూపట్టుచు జలజంతుగణసంకులంబై వాయువేగంబునకు లేచు తరంగంబులధ్వనిచే మాటలాడునట్లు గాన్పించుచున్న సముద్రంబును మహోత్సాహశాలులగు నానానరులు చూచిరి. ౧౨౩, ౧౨౪

అంత నప్పుడు వానరులు నానావిధంబుగాఁ దరంగంబు లుద్గమింప మహాధ్వనింబొల్చు నుద్భ్రాంతంబయినట్లు చూపట్టుచున్న సముద్రంబుఁజూచి యాశ్చర్యంబు నొందిరి. ౧౨౫

ఇది నాలుగవసర్గము.

---

## ఐదవసర్గము.

వానరసేనానాయకుఁడగు నీలుఁడు చక్కఁగా రక్షకుల నేర్పఱిచి నిర్భయంబుఁ గావించి సముద్రోత్తరతీరంబునందు నీతిశాస్త్రోక్తప్రకారంబునఁ జక్కఁగా సేనానివేశనంబు గావించెను. ౧

అప్పు డచ్చట మైందుఁడును ద్వివిదుఁడును నీవానరోత్తము లిర్వురును రక్షణార్థమయి వానరసేన యన్నిప్రక్కలను దిరుగుచుఁ గాచియుండిరి.

అట్లు సైన్యరచనంతయుఁ విడిసినంత నే రాముఁడు తనపార్శ్వభాగంబునఁ గొలిచియున్న లక్ష్మణుంజూచి యిట్లని చెప్పెను. 3

దుఃఖము కొంతకాలము గడవగా నశించును, నాకుఁ బ్రియురాలిఁ జూడకుండుటచేఁ గలిగినదుఃఖముమాత్రము అంతకంతకు వృద్ధిఁబొందుచున్నది.

4

న మే దుఃఖం ప్రియా దూరే న మే దుఃఖం హృతేతి వా,
వీతదేవానుశోచామి వయోఽస్యా హ్యతివర్తతే. ౫

వాహి వాత యతః కాన్తా తాం స్పృష్ట్వా మామపి స్పృశ,
త్వయి మే గాత్రసంస్పర్శ శ్చన్ద్రే దృష్టిసమాగమః. ౬

తన్మే దహతి గాత్రాణి విషం పీత మివాశయే,
హానాథేతి ప్రియా సా మాం హ్రియమాణా యదబ్రవీత్. ౭

తద్వియోగేన్ధనవతా తచ్చిన్తా విపులార్చిషా,
రాత్రిం దివం శరీరం మే దహ్యతే మదనాగ్నినా. ౮

అవగాహ్యార్ణవం స్వప్స్యే సౌమిత్రే! భవతా వినా,
కథంచిత్ప్రజ్వల న్కామ స్సమాం సుప్తం జలే దహేత్. ౯

బహ్వేత త్కామయానస్య శక్య మేతేన జీవితుమ్,
యదహం సా చ వామోరూ రేకాం ధరణి మాశ్రితౌ. ౧౦

ప్రియురాలు దూరంబున నున్నదని నాకు దుఃఖములేదు; రాక్షసుఁడు గొనిపోయెనని యయినను నాకు దుఃఖములేదు. ఏల యనఁగా నచ్చటికిఁబోయి యారాక్షసుం జంపి మరలఁ బ్రియురాలిం బడయవచ్చునుగదా! అయితే ఇప్పుడు ఆబిడ యౌవనము వ్యర్థముగాఁ బోవుచున్నదే! అనియే నాకు దుఃఖము గలుగుచున్నది. అని రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పెను. ౫

వాయుదేవుఁడా! నాప్రియురాలుండుస్థలంబున సంచరింపుము. అచ్చట నాబిడను స్పృశింపుము. ఆబిడదేహము దాఁకివచ్చిన నిన్ను స్పృశించుటవలన నా కాబిడదేహముఁ దాఁకినట్లు సంతోషము గలుగును. కావున నాబిడ దేహస్పర్శము నాకుఁ గలుగుట నీయధీనముగా నున్నది. అట్లు ప్రియురాలి ముఖంబువలెనుండు చంద్రుంజూచి ప్రియురాలిమొగంబుఁ జూచినట్లు సంతోషంబు నొందవలసియున్నది కావున నాకుఁ బ్రియురాలిముఖంబుఁ జూచుట చంద్రుని యధీనముగా నున్నది. ౬

సమస్తభోగంబులను బరిత్యజించి నావెంట నడచివచ్చినట్టి ప్రియురాలు రావణునిచేఁ గొనిపోఁబడునప్పుడు తాను బాతివ్రత్యాగ్నిచే నతని నీఱుసేయ సమర్థురాలయినను నాయందుండు భక్తిచే నన్నే గతిఁగా దలంచి "అయ్యో! నాథుఁడా" అని చెప్పినమాట నాహృదయంబుననుండి త్రాఁగఁబడిన విషంబుకైవడి దేహంబంతయు దహింపఁబడుచున్నది. ౭

మన్మథుండను నగ్నిహోత్రము ఆప్రియావియోగంబే యింధనములుగా నాబిడను జింతించుటయే జ్వాలలుగా నాదేహంబంతయుఁ రేయుంబవలును దహించుచున్నది. ౮

లక్ష్మణుఁడా! నేను నిన్నువిడిచి సముద్రంబునఁబడి పరుండెదను. నేను నీళ్లలోఁ బరుండియుందునేని ప్రజ్వలించుచున్న యీమన్మథుఁడు నన్ను దహింపఁజాలఁడు. ౯

నేనును సుందరములయిన తొడలుగల యాసీతయును ఒక్కభూమియందుండుటయే యిప్పటి కధికముగానున్నది. కావున భూమియందే మనతో

కేదారస్యేవ కేదారస్సోదకస్య నిరూదకః,
ఉపస్నేహేన జీవామి జీవన్తీం యచ్ఛృణోమి తామ్. ౧౧

కదాను ఖలు సుశ్రోణీం శతపత్త్రాయతేక్షణామ్,
విజిత్య శత్రూన్ద్రక్ష్యామి సీతాం స్ఫీతా మివ శ్రియమ్. ౧౨

కదాను చారుబిమ్బోష్ఠం తస్యాః పద్మ మివాననమ్,
ఈషదున్నమ్య పాస్యామి రసాయన మివాతురః. ౧౩

తస్యాస్తు సంహతౌ పీనౌ స్తనౌ తాళఫలోపమౌ,
కదాను ఖలు సోత్కమ్పౌ శ్లిష్యన్త్యా మాం భజిష్యతః. ౧౪

సా నూన మసితాపాఙ్గీ రక్షోమధ్యగతా సతీ,
మన్నాథా నాథహీనేవ త్రాతారం నాధిగచ్ఛతి. ౧౫

కథం జనకరాజస్య దుహితా సా మమ ప్రియా,
రాక్షసీ మధ్యగా శేతే స్నుషా దశరథస్య చ. ౧౬
కదాఽవిక్షోభ్య రక్షాంసి సా విధూయోత్పతిష్యతి,
విధూయ జలదాన్నీలాన్ శశిరేఖా శరత్స్వివ. ౧౭

స్వభావతనుకా నూనం శోకేనానశనేన చ,
భూయ స్తనుతరా సీతా దేశకాలవిపర్యయాత్. ౧౮

కదాను రాక్షసేన్ద్రస్య నిధాయోరసి సాయకాన్,
సీతాం ప్రత్యాహరిష్యామి శోకముత్సృజ్య మానసమ్. ౧౯

పాటు బ్రతికియున్నదిగదా యని దీనిచేత మాత్రము జీవించియుండఁగలను.

సీత బ్రతికియున్నదని వినుచున్నాను కావున దీనిచేత నీళ్లుగలచేని లేమతాఁకుడుచే నెండకుండునట్లు జీవించియుందును. ౧౧

నేను శత్రువులజయించి సుందరంబులయిన పిఱుఁదులుగలదియుఁ గమలంబులంబోలె విశాలసుందరంబులయిన నేత్రంబులుగలదియునగు సీతను లక్ష్మినింబోలె నెప్పుడు చూడఁగలను? ౧౨

సుందరంబులగు దొండపండువంటి పెదవులుగలదియుఁ గమలంబు వంటిదియునగు సీతముఖమును గొంచెము పైకెత్తి రోగి రసాయనంబు ద్రావు నటుల నధరామృతంబు నెప్పుడు ద్రావుదును? ౧౩

సీత నన్నుఁ గవుఁగిలించుకొనఁగాఁ బరస్పరసంహతంబులును మాంసలంబులును దాళఫలంబువంటివియుఁ నగు నాబిడస్తనంబులు సకంపంబులయి యెప్పుడు నామేను సోఁకఁగలవు? ౧౪

నల్లనికడకండ్లుగలదియుఁ బతివ్రతయునగు నాసీత రాక్షసులచేతఁ జిక్కి నాథుఁడను నేనుండియు ననాథవలె రక్షకుంగానక పరితపించుచున్నది. నిశ్చయము. ౧౫

ఆసీతాదేవి జనకమహారాజుకూఁతురయ్యు నాప్రియురాలయ్యు దశరథమహారాజు కోఁడలునయ్యు రాక్షసస్త్రీలనడుమం జిక్కియున్నదేమి? ౧౬

శరదృతువునందుఁ జంద్రరేఖ నల్లనిమేఘంబులం ద్రోసిపుచ్చి బయలువెడలునట్లు సీత యెప్పుడు అవిక్షోభ్యులగు రాక్షసులం బాఱఁదోలి నా యెదుట నుదయింపఁగలదు? ౧౭

స్వభావంబుననే కృశదేహయయినసీత యిప్పుడు దేశకాల వైపరీత్యంబునంజేసి దుఃఖంబునను ఉపవాసంబులచేతను మఱియుఁ మిక్కిలి కృశించియుండఁగలదు. ఇది నిశ్చయము. ౧౮

నేను రాక్షసేశ్వరుఁడగు రావణునివక్షస్థలంబున బాణంబుల నాటి మరల సీతంబొంది యెప్పుడు మనోదుఃఖంబు విడువఁగలను? ౧౯

కదాను ఖలు మాం సాధ్వీ సీతా సురసుతోపమా,
సోత్కణ్ఠా కణ్ఠమాలమ్బ్య మోక్ష్యత్యానన్దజం పయః. ౨౦

కదా శోక మిమం ఘోరం మైథిలీవిప్రయోగజమ్,
సహసా విప్రమోక్ష్యామి వాసశ్శుక్లేతరం యథా. ౨౧
ఏవం విలపత స్తస్య తత్ర రామస్య ధీమతః,
దినక్షయా న్మన్దరుచి ర్భాస్కరోఽస్త ముపాగమత్. ౨౨
ఆశ్వాసితో లక్ష్మణేన రామ స్సన్ధ్యా ముపాసత,
స్మరన్కమలపత్త్రాక్షీం సీతాం శోకాకులీకృతః. ౨౩

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే పఞ్చమ స్సర్గః. ౫.

---

## షష్ఠ స్సర్గః.

లఙ్కాయాం తు కృతం కర్మ ఘోరం దృష్ట్వా భయావహమ్,
రాక్షసేన్ద్రో హనుమతా శక్రేణేవ మహాత్మనా. ౧
అబ్రవీద్రాక్షసాన్ సర్వాన్హ్రియా కించిదవాఙ్ముఖః,

ధర్షితా చ ప్రవిష్టా చ లఙ్కా దుష్ప్రసహా పురీ. ౨
తేన వానరమాత్రేణ దృష్టా సీతా చ జానకీ,

ప్రాసాదో ధర్షిత శ్చైత్యః ప్రవరా రాక్షసా హతాః. ౩
ఆవిలా చ పురీ లఙ్కా సర్వా హనుమతా కృతా,

కిం కరిష్యామి భద్రం వః కిం వా యుక్త మనన్తరమ్. ౪
ఉచ్యతాం న స్సమర్థం చ యత్కృతం సుకృతం భవేత్,

పతివ్రతయు దేవకన్యాసమానురాలునగు సీతాదేవి పరమకౌతుకంబున నన్నుఁ గంఠంబునం గవుఁగిలించుకొని ఆనందబాష్పంబుల నెప్పుడు విడువఁగలదు ? ౨౦

భయంకరంబగు నీ సీతావిరహదుఃఖంబును మలినవస్త్రంబునుంబోలె శీఘ్రంబున నెప్పుడు విడువఁగలను? అని రాముఁడు విలపించెను. ౨౧

అచ్చట బుద్ధిమంతుఁడగు రాముఁ డట్లు విలపించుచుండఁగానే సూర్యుఁడు మందకాంతియయి యస్తమించె నంత సంధ్యాకాలం బయ్యెను.

అంత లక్ష్మణునిచే నాశ్వాసితుఁడై కమలపత్రంబులుంబోలె విశాలంబులగుకండ్లుగల సీతం దలంచుచు దుఃఖితుఁడై సంధ్యావందనంబుఁ గావించెను. ౨౩

ఇది యైదవసర్గము.

---

## ఆఱవసర్గము.

అంత నచ్చట రాక్షసేశ్వరుఁడగు రావణుఁడు దేవేంద్ర సదృశమహాపరాక్రమశాలియగు హనుమంతుఁడు లంకయందుఁ గావించిన మహాభయంకరకార్యంబుఁ జూచి సిగ్గుచేఁ గొంచెము దలవాంచి రక్షసుల నందఱం జూచి యిట్లని చెప్పెను. ౧

ఒకకోఁతి యంతవాఁ డాహనుమంతుఁడు శత్రువులకు దుష్ప్రవేశంబగు లంకాపట్టణమును నిర్లక్ష్యముగాఁ బ్రవేశించి జనకునికొమార్తెను సీతం జూచియుఁ బోయినాఁడు. ౨

హనుమంతుఁడు చైత్యప్రాసాదంబును బగులఁగొట్టెను. ఉత్తములగు రాక్షసులఁ బెక్కండ్రం జంపెను, లంకాపట్టణంబునంతయు దహించి వ్యాకులంబు గావించెను. ౩

ఇంక మన మేమిచేయవలెను, మనహితంబును జేసినచో గార్యసిద్ధిగలిగించునదియుం నగు నుపాయం బెద్ది? వచింపుఁడు, దానిం జేసెదను, మీకు మంగళము గలుగుఁగాక. ౪

మన్త్రమూలం హి విజయం ప్రాహురార్యా మనస్వినః. ౫
తస్మా ద్వై రోచయే మన్త్రం రామం ప్రతి మహాబలాః,

త్రివిధాః పురుషా లోకే ఉత్తమాధమమధ్యమాః. ౬
తేషాం తు సమవేతానాం గుణదోషౌ వదామ్యహమ్,

మన్త్రిభి ర్హితసంయుక్తై స్సమర్థై ర్మన్త్రనిర్ణయే. ౭
మిత్రై ర్వాఽపి సమానార్థై ర్బాన్ధవై రపి వా హితైః,
సహితో మన్త్రయిత్వా యః కర్మారమ్భాన్ప్రవర్తయేత్. ౮
దైవే చ కురుతే యత్నం తమాహుః పురుషోత్తమమ్,
ఏకోఽర్థం విమృశే దేకో ధర్మే ప్రకురుతే మనః. ౯
ఏకః కార్యాణి కురుతే త మాహు ర్మధ్యమం నరమ్,

గుణదోషా వనిశ్చిత్య త్యక్త్వా దైవవ్యపాశ్రయమ్. ౧౦
కరిష్యామీతి యః కార్యముపేక్షే త్స నరాధమః,

యథేమే పురుషా నిత్య ముత్తమాధమమధ్యమాః. ౧౧
ఏవం మన్త్రా హి విజ్ఞేయా ఉత్తమాధమమధ్యమాః,
ఐకమత్య ముపాగమ్య శాస్త్రదృష్టేన చక్షుషా. ౧౨
మన్త్రిణో యత్ర నిరతా స్త మాహు ర్మన్త్ర ముత్తమమ్,

బహ్వ్యోఽపి మతయో భూత్వా మన్త్రిణా మర్థనిర్ణయే. ౧౩
పున ర్య త్రైకతాం ప్రాప్తా స్స మన్త్రో మధ్యమః స్మృతః,

మహాబలశాలులగు రాక్షసులారా! ధీరులగు పెద్దలు మంత్రముచేతనే జయముసిద్ధించునని చెప్పెదరు. కావున రామునివిషయమయి మంత్రము సేయఁగోరుచున్నాను. ౫

లోకంబున బురుషులు ఉత్తములు మధ్యములు నధములు నని మూఁడు విధములు, వారలభేదము తెలియుట కష్టము కాఁబట్టి నేను వారలగుణ దోషంబులఁ జెప్పెదను. ౬

ఎవ్వఁడు ఆలోచించుటయందు సమర్థులగు తనహితముగోరు మంత్రులతోఁగాని తనదుఃఖంబునకు దుఃఖించువారును దనసుఖంబునకు సంతోషించు వారునయిన యట్టి స్నేహితులతోఁగాని తన మేలుఁగోరునట్టి బంధువులతో గాని చక్కఁగా నాలోచించి శక్తివంచనలేక కార్యంబుల నారంభించుచు దైవమునందును భారము వేసియుండునో అతఁడు త్తమపురుషుఁడు. ౭, ౮

ఎవ్వఁడు తానొక్కఁడే యాలోచనము చేసి యొక్కఁడుగానే దైవము నాశ్రయించి యొక్కఁడుగానే కార్యంబులం జేయునో, అతఁడు మధ్యమ పురుషుఁడని యందురు. ౯

ఎవ్వఁడు ఆలోచింపక మంచిచెడులను నిశ్చయింపక దైవమును సరకు సేయక చేసెదనని కార్యము నారంభించి తుదముట్టం గానంపక యుపేక్ష సేయునో అతఁ డధమపురుఁడు. ౧౦

ఎట్లు పురుషులు ఉత్తమమధ్యమాధములని మూఁడువిధములగునట్లు మంత్రములును ఉత్తమ మధ్యమాధమము లని మూఁడు విధములు. ౧౧

మంత్రులందఱు నైకమత్యంబునొంది శాస్త్రజ్ఞానయుక్తంబగు దృష్టితోఁ బరస్పరాసక్తులయి యేమంత్రంబుసేయుదురో అది యుత్తమమంత్రం బందురు. ౧౨

ఏమంత్రమునందు కార్యనిర్ణయవిషయమయి మంత్రులకుఁ బరస్పర మతభేదములుగలిగి యాపిమ్మటఁ దుదకు ఐకమత్యముగలుగునో అది మధ్యమ మంత్రం బందురు. ౧౩

అన్యోన్యం మతి మాస్థాయ యత్ర సమ్ప్రతిభాష్యతే. ౧౪
నచైకమత్యే శ్రేయోఽస్తి మన్త్రస్సోఽధమ ఉచ్యతే,

తస్మాత్సుమన్త్రితం సాధు భవన్తో మతిమత్తమాః. ౧౫
కార్యం సమ్ప్రతిపద్యన్తామేతత్కృత్యం మతం మమ,

వానరాణాం హి వీరాణాం సహస్రైః పరివారితః. ౧౬
రామోఽభ్యేతి పురీం లఙ్కా మస్మాక ముపరోధకః,
తరిష్యతి చ సువ్యక్తం రాఘవస్సాగరం సుఖమ్. ౧౭
తరసా యుక్తరూపేణ సానుజ స్సబలానుగః,
సముద్రముచ్ఛోషయతి వీర్యేణాన్య త్కరోతి వా. ౧౮

అస్మిన్నేవం గతే కార్యే విరుద్ధే వానరై స్సహ,
హితం పురే చ సైన్యే చ సర్వం సమ్మన్త్ర్యతాం మమ. ౧౯

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే షష్ఠస్సర్గః. ౬.

---

## సప్తమస్సర్గః.

ఇత్యుక్తా రాక్షసేన్ద్రేణ రాక్షసా స్తే మహాబలాః,
ఊచుః ప్రాఞ్జలయ స్సర్వే రావణం రాక్షసేశ్వరమ్. ౧
ద్విషత్పక్ష మవిజ్ఞాయ నీతిబాహ్యా స్త్వబుద్ధయః,
రాజన్! పరిఘశక్త్యృష్టిశూలపట్టససఙ్కులమ్. ౨
సుమహన్నో బలం కస్మా ద్విషాదం భజతే భవాన్,

ఏమంత్రమునందు మంత్రులు భిన్నభిన్నాభిప్రాయంబులఁ బొంది తమతమయభిప్రాయంబును వదలక వాదింపుచుందురో మఱియు నైకమత్యంబునొందవలె నను ప్రీతియు లేకయుందురో అది యధమమంత్రంబని చెప్పఁబడుచున్నది. ౧౪

అందువలన మిగుల బుద్ధిమంతులగు మీరలు శాస్త్రప్రకారంబున నైకమత్యంబుతోఁ జక్కఁగా నాలోచించి చేయఁదగినకార్యమును నిర్ణయింపుఁడు, ఇది నాకుఁ గావలసినది. ౧౫

రాముఁడు పరాక్రమశాలులగు వేలకొలఁది వానరులంగూడి మనల బాధించుటకై లంకాపురికి వచ్చుచున్నాఁడు. ౧౬

రాముఁడు తమ్ముని సైన్యమును సుగ్రీవాదులనుంగూడి తనశక్తిచే సుఖంబుగా సముద్రంబు దాటఁగలఁడు. ఇది స్పష్టము. ౧౭

రాముఁడు పరాక్రమంబున సముద్రమును ఎండించినను ఎండించును, లేక సేతుబంధాదులు గావించి యయినను దాటివచ్చును. ౧౮

నేను చెప్పినట్లు రాముఁడు వానరులతోవచ్చి లంక నుపరోధించు పక్షమున మనకును వానరులకును విరోధముగలుగును అప్పటికి నాపట్టణంబునకును సైన్యంబునకును మేలుకలుగు నుపాయం బంతయు నాలోచింపుఁడు. అని రావణుఁడు రాక్షసులతోఁ జెప్పెను. ౧౯

ఇది యాఱవసర్గము.

## ఏడవసర్గము.

నీతిబాహ్యులును బుద్ధిహీనులును మహాబలశాలులునగు నారాక్షసులందఱు రావణుఁడు చెప్పినది విని శత్రుబలంబుదెలియక రాక్షసాధీశ్వరుఁడగు రావణుంజూచి చేమోడ్పుగీలించి యిట్లని చెప్పిరి. ౧

రాక్షసరాజుఁడవగు రావణుఁడా! గదలును ఈఁటెలును ఖడ్గంబులును శూలంబులును అడ్డకత్తులును మెండుగాఁగల యనంతంబగు మనసైన్యంబు

త్వయా భోగవతీం గత్వా నిర్జితాః పన్నగా యుధి. 3

కైలాసశిఖరావాసీ యక్షై ర్బహుభి రావృతః,
సుమహ త్కదనం కృత్వా వశ్య స్తే ధనదః కృతః. ౪
స మహేశ్వరసఖ్యేన శ్లాఘ్యమాన స్త్వయా విభో!,
నిర్జిత స్సమరే రోషా ల్లోకపాలో మహాబలః. ౫

వినిహత్య చ యక్షౌఘాన్విక్షోభ్య చ విగృహ్యచ,
త్వయా కైలాసశిఖరా ద్విమానమిదమాహృతమ్. ౬

మయేన దానవేన్ద్రేణ త్వద్భయా త్సఖ్య మిచ్ఛతా,
దుహితా తవ భార్యార్థే దత్తా రాక్షసపుఙ్గవ. ౭

దానవేన్ద్రో మధుర్నామ వీర్యోత్సిక్తో దురాసదః,
విగృహ్య వశమానీతః కుమ్భీనస్యాస్సుఖావహః. ౮

నిర్జితా స్తే మహాబాహో నాగా గత్వా రసాతలమ్,
వాసుకి స్తక్షక శ్శఙ్ఖో జటీ చ వశ మాహృతాః. ౯

అక్షయా బలవన్తశ్చ శూరా లబ్ధవరాః పునః,
త్వయా సంవత్సరం యుద్ధ్వా సమరే దానవా విభో!. ౧౦
స్వబలం సముపాశ్రిత్య నీతా వశ మరిన్దమ!,

బున్నదే; నీవేల దుఃఖపడుచున్నావు? ౨

నీవు పాతాళంబున భోగవతికిఁజని యుద్ధంబునఁ బన్నగుల జయించి నావు. 3

కైలాసపర్వతంబుననున్న యక్షరాజేఁడగు కుబేరుఁడు అనేక యక్షులంగూడి మహాయుద్ధంబుచేసి తుదకు నీకు వశ్యుఁడయ్యె. ౪

ప్రభుఁడవగు రావణుఁడా! ఈశ్వరునకు స్నేహితుఁడని వినుతికెక్కిన వాఁడును మహాబలుఁడును లోకపాలుఁడునగు నాకుబేరునింగూడ నీవు యుద్ధంబునందు జయించినావు. ౫

నీవు పెక్కండ్రయక్షులఁజంపియు నానావిధంబులం గలంచియు బద్ధులంగావించియుఁ గైలాసశిఖరంబునుండి యీపుష్పకవిమానంబు దెచ్చి నావు. ౬

రాక్షసశ్రేష్ఠుఁడవగు రావణుఁడా! దానవనాథుఁడగు మయుఁడు నీకు భయపడి నీస్నేహంబుఁ గోరి నీకు భార్యగాఁ దనకూఁతురు మందోదరి నొసంగెను. ౭

పరాక్రమముచే గర్వితుఁడును దురాధర్షుఁడును నీభగినికుంభీనసికిఁ బ్రియుఁడునగు దానవనాథుఁడయిన మధువును యుద్ధంబుగావించి వశీకరించు కొంటివి. ౮

మహాబాహుఁడవగు రావణుఁడా! నీవు పాతాళంబునకుఁబోయి వాసుకిని దక్షకుని శంఖుని జటిని ఈనాగేంద్రులను జయించి వశ్యులఁ జేసి కొనియున్నావు. ౯

శత్రువుల నడఁగఁద్రొక్కంజాలిన ప్రభుఁడవగు రావణుఁడా! చూర్ణ ముగావించినను మరల లేచునట్టి నాశరహితులును బలవంతులును శూరు లును బ్రహ్మనుగూర్చి తపస్సుగావించి వరంబులుపడసి యున్నవారలునగు కాలకేయులను దానవులు తమయూవచ్ఛక్తిని నీతో నొక్కసంవత్సరంబు యుద్ధముచేసి తుదకు నీకు వశ్యులయిరి. ౧౦

మాయాశ్చాధిగతా స్తత్ర బహవో రాక్షసాధిప!. ౧౧

శూరాశ్చ బలవన్తశ్చ వరుణస్య సుతా రణే,
నిర్జితా స్తే మహాబాహో! చతుర్విధబలానుగాః. ౧౨

మృత్యుదణ్డమహాగ్రాహం శాల్మలిద్రుమమణ్డితమ్,
కాలపాశమహావీచిం యమకిఙ్కరపన్నగమ్. ౧౩
అవగాహ్య త్వయా రాజ! న్యమస్య బలసాగరమ్,
జయశ్చ విపులః ప్రాప్తో మృత్యుశ్చ ప్రతిషేధితః. ౧౪

సుయుద్ధేన చ తే సర్వే లోకా స్తత్ర విలోళితాః,
క్షత్రియై ర్బహుభి ర్వీరై శ్శక్రతుల్యపరాక్రమైః. ౧౫
ఆసీ ద్వసుమతీ పూర్ణా మహద్భి రివ పాదపైః,
తేషాం వీర్యగుణోత్సాహై ర్న సమో రాఘవో రణే. ౧౬

ప్రసహ్య తే త్వయా రాజ! న్హతాని పరమదుర్జయాః,

తిష్ఠ వా కిం మహారాజ! శ్రమేణ తవ వానరాన్. ౧౭
అయ మేకో మహాబాహు రిన్ద్రజి త్క్షపయిష్యతి,

అనేన హి మహారాజ! మాహేశ్వర మనుత్తమమ్. ౧౮
ఇష్ట్వా యజ్ఞం వరో లబ్ధో లోకే పరమదుర్లభః,

శక్తితోమరమీనం చ వినికీర్ణాన్త్రశైవలమ్. ౧౯

రాక్షసేశ్వరుఁడవగు రావణుఁడా! మఱియు నాకాలకేయులన్నవా ముపలన నానావిధమాయలనుంగూడ నేర్చియున్నావు. ౧౧

మహాబాహుఁడవగు రావణుఁడా! మఱియు నీవు శూరులును మహాబలశాలులును జతురంగసైన్యసమేతులు నగు వరుణపుత్రులను యుద్ధంబున జయించియున్నావు. ౧౨

రాక్షసరాజుఁడవగు రావణుఁడా! నీవు యమదండంబే భయంకరనాకరంబుగా శాల్మల్యాయుధంబులే వృక్షంబులుగా యమపాశంబే మహాతరంగంబుగా యమకింకరులే పన్నగంబులుగా సముద్రంబుపోల్కిం బొల్చునట్టి యమసైన్యంబుఁజొచ్చి యుద్ధంబున యముం బాఱఁదోలి అధికంబగు విజయంబునొందినావు. ౧౩, ౧౪

అచ్చట నీవుచేసిన యుద్ధంబునకు లోకంబులన్నియుఁ జలించినవి.

దేవేంద్రునకుంబోలె మహాపరాక్రమంబుగల క్షత్రియులు పెక్కండ్రు మహావృక్షంబులుంబోలె భూమియంతయు నిండియుండిరి. ౧౫

రాముఁడు పరాక్రమగుణోత్సాహంబుల యుద్ధమునందు వారలకు సమానుఁ డెంతమాత్రము కాఁడు. ౧౬

రాక్షసరాజుఁడగు రావణుఁడా! అట్టిదుర్జయులగు నారాజులనే నీవు వధించియున్నావే; ఇంక రాముఁడు నీ కెంతమాత్రము?

మహారాజుఁడవగు రావణుఁడా! నీవు ఊరకయే యుండుము; నీవు శ్రమపడనేల? మహాబాహుఁడగు నీయింద్రజిత్తు ఒక్కఁడే వానరుల నందఱను నశింపఁజేయఁగలఁడు. ౧౭

మహారాజుఁడవగు రావణుఁడా! ఈయింద్రజిత్తు మహేశ్వరుంగుఱించి యుత్తమంబగు యాగంబుగావించి లోకమునందు పరమదుర్లభంబగు వరంబు నొందెను. ౧౮

ఈయింద్రజిత్తుశక్తితో మరాద్యాయుధంబులే మత్స్యంబులుగా త్రే

గజకచ్ఛపసమ్బాధ మశ్వమణ్డూకసఙ్కులమ్,
రుద్రాదిత్యమహాగ్రాహం మరుద్వసుమహోరగమ్. ౨౦
రథాశ్వగజతోయౌఘం పదాతిపులినం మహత్,
అనేన హి సమాసాద్య దేవానాం బలసాగరమ్. ౨౧
గృహీతో దైవతపతి ర్లఙ్కాం చాపి ప్రవేశితః,
పితామహనియోగాచ్చ ముక్త శ్శమ్బరవృత్రహా. ౨౨
గత స్త్రివిష్టపం రాజన్! సర్వదేవనమస్కృతః,

త మేవ త్వం మహారాజ! విసృజేన్ద్రజితం సుతమ్. ౨౩
యావ ద్వానరసేనాం తాం సరామాం నయతి క్షయమ్,

రాజ! న్నాపదయుక్తేయ మాగతా ప్రాకృతా జ్జనాత్. ౨౪
హృది నైవ త్వయా కార్యా త్వం వధిష్యసి రాఘవమ్.

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే సప్తమ స్సర్గః. ౭.

## అ ష్ట మ స్స ర్గః.

తతో నీలామ్బుదనిభః ప్రహస్తో నామ రాక్షసః,
అబ్రవీ త్ప్రాఞ్జలి ర్వాక్యం శూర స్సేనాపతి స్తదా. ౧

దేవదానవగన్ధర్వాః పిశాచపతగోరగాః,
న త్వాం ధర్షయితుం శక్తాః కిం పున ర్వానరా రణే. ౨

గుల్మే శైవలంబుగా నేనుఁగులే తాఁబేళ్లుగా ఖడ్గంబులే కప్పలుగా రుద్రాదిత్యులే భయంకరమకరంబులుగా వసువాయువులే మహాగజంబులుగా రథాశ్వగజంబులే జలసమూహంబుగాఁ బదాతిసైన్యంబే యిసుకదిబ్బలుగా మహాసముద్రంబుకరణి నతిభయంకరంబై క్రాలు దేవసైన్యంబుఁ జొచ్చి దేవేంద్రుం బట్టి బంధించి లంకకుం గొనివచ్చెఁగదా! ౧౯, ౨౧

రాక్షసరాజుఁడవగు రావణుఁడా! అంత బ్రహ్మదేవు నానతిం జేసి దేవేంద్రు విడిచి పుచ్చితివి; అంత నతఁడు సమస్తదేవతలుం గొలువ దేవాలయంబున కేగెను. ౨౨

మహారాజుఁడవగు రావణుఁడా! అట్టి నీకొడుకు నింద్రజిత్తునే పంపుము; రామునితోఁగూడిన నావానరసేననంతయుం నెంతలోపల వధించి పుచ్చునో చూడుము. ౨౩

రాక్షసరాజుఁడవగు రావణుఁడా! క్షుద్రుఁడగు నీహనుమంతునివలన నసంభావితంబుగా సంభవించిన యాపదకు భయపడకుండుము; దీని మనంబున నుంచకుము; నీవు తప్పక రాముని వధింపఁగలవు. అని రాక్షసులు రావణునితోఁ జెప్పిరి. ౨౪

ఇది యేడవసర్గము.

## ఎనిమిదవసర్గము.

అంత నప్పుడు శూరుఁడును రాక్షససేనానాయకుఁడును నీలమేఘంబువంటి మేనుగలవాఁడునగు ప్రహస్తుఁడను రాక్షసుఁడు రావణుంజూచి చేమోడ్పుగీలించి యిట్లని విన్నవించెను. ౧

దేవతలేమి దానవులేమి గంధర్వులేమి పిశాచంబులేమి పక్షులేమి నాగంబులేమి యుద్ధంబున నీ కెదురు నిలువంజాలరు; ఇంక వానరులనఁగా నెంతమాత్రము? ౨

సర్వే ప్రమత్తా విశ్వస్తా వఞ్చితాః స్మ హనూమతా,
న హి మే జీవతో గచ్ఛే జ్జీవన్ స వనగోచరః. ౩

సర్వాం సాగరపర్యన్తాం సశైలవనకాననామ్,
కరో మ్యవానరాం భూమి మాజ్ఞాపయతు మాం భవాన్. ౪

రక్షాం చైవ విధాస్యామి వానరా ద్రజనీచర!,
నాగమిష్యతి తే దుఃఖం కించి దాత్మాపరాధజమ్. ౫

అబ్రవీ చ్చ సుసఙ్క్రుద్ధో దుర్ముఖో నామ రాక్షసః,
ఇదం నక్షమణీయం హి సర్వేషాం నః ప్రధర్షణమ్. ౬

అయం పరిభవో భూయః పుర స్యా న్తఃపురస్య చ,
శ్రీమతో రాక్షసేన్ద్రస్య వానరేణ ప్రధర్షణమ్. ౭

అస్మి న్ముహూర్తే హ త్వైకో నివర్తిష్యామి వానరాన్,
ప్రవిష్టాన్ సాగరం భీమ మమ్బరం వా రసాతలమ్. ౮

తతోఽబ్రవీ త్సుసఙ్క్రుద్ధో వజ్రదంష్ట్రో మహాబలః,
ప్రగృహ్య పరిఘం ఘోరం మాంసశోణితరూషితమ్. ౯

కిం వో హనుమతా కార్యం కృపణేన తపస్వినా,

మనమందఱమును మనల నెవ్వరు ఎదిరింపఁజాలరని మదించి విస్రబ్ధుల మయియుంటిమి; కావున హనుమంతుఁడు కటాలునవచ్చి యట్టిమోసము చేసి పోవుట కవకాశము గల్గెను; లేనియెడల నేను జీవించియుండునపుడు ఆవానరుఁ డిచ్చటనుండి ప్రాణంబులతో నెట్లు పోఁగలఁడు? ౩

నన్నాజ్ఞాపింపుము; నాలుగుసముద్రంబులలోపల నున్న యీభూమండలమునందంతయుఁ బర్వతంబులనేమి వనంబులనేమి మహారణ్యంబులనేమి యుండునట్టివానరుల నందఱఁజంపి ఇఁక భూమిలో వానరులే లేకుండు నట్లు గావించెదను. ౪

రావణుఁడా! నేను నీకు లంకాపురంబును రక్షించుచుండెదను; నీవు గావించిన సీతాహరణంబునకు ఈవానరు లెంతమాత్రము నీకు దుఃఖము గలుగఁజేయఁజాలరు. అని ప్రహస్తుఁడు రావణునికిఁ జెప్పెను. ౫

అంత దుర్ముఖుఁడను రాక్షసుఁడు మహాకోపంబునొంది యిట్లని చెప్పెను.

హనుమంతుఁడు మనకందఱకు నిట్టి యవమానంబు గావించినాఁడు; ఇదిమాత్రము క్షమింపఁదగినది కాదు. ౬

వానరమాత్రుఁ డొకఁడువచ్చి మనపట్టణంబును మఱియు నంతఃపురంబును అవమానించుటయు శ్రీమంతుఁడగు రావణునిఁగూడ నవమానించుటయు ఎంతమాత్రము క్షమింపరాదు. ౭

నేనొక్కఁడనె యిప్పుడేపోయి వానరులనందఱను భయంకరంబగు సముద్రంబుఁ జొచ్చినను ఆకాశంబున కుద్గమించినను పాతాళంబున దాఁగినను విడువక వధించి వచ్చెదను. అని దుర్ముఖుఁడు రావణునికిఁ జెప్పెను. ౮

అంత అధికబలవంతుఁడగు వజ్రదంష్ట్రుఁడు మిక్కిలియుఁ గోపము నొందినవాఁడై భయంకరంబును మాంసముచేతను నెత్తురుచేతను బూయఁబడినదియునగు నినుపగుదియను దీసికొని బలికెను. ౯

సుగ్రీవలక్ష్మణసహితుఁడగు దుర్ధర్షుఁడయిన రాముఁడుండఁగా భయం

రామే తిష్ఠతి దుర్ధర్షే ససుగ్రీవే సలక్ష్మణే. ౧౦

అద్య రామం ససుగ్రీవం పరిఘేణ సలక్ష్మణమ్,
ఆగమిష్యామి హత్వైకో విక్షోభ్య హరివాహినీమ్. ౧౧
ఇదం మమాపరం వాక్యం శృణు రాజ! న్యదీచ్ఛసి,

ఉపాయకుశలో హ్యేవ జయే చ్ఛత్రూ నతన్ద్రితః. ౧౨
కామరూపధరా శ్శూరా స్సుభీమా భీమదర్శనాః,
రాక్షసా వై సహస్రాణి రాక్షసాధిపనిశ్చితాః. ౧౩
కాకుత్స్థ ముపసంగమ్య బిభ్రతో మానుషం వపుః,
సర్వే హ్యసమ్భ్రమా భూత్వా బ్రువన్తు రఘుసత్తమమ్. ౧౪
ప్రేషితా భరతేన స్మ భ్రాత్రా తవ యవీయసా,
స హి సేనాం సముత్థాప్య క్షిప్ర మే వోపయాస్యతి. ౧౫

తతో వయ మిత స్తూర్ణం శూలశక్తిగదాధరాః,
చాపబాణాసిహస్తాశ్చ త్వరితా స్తత్ర యామహ. ౧౬
ఆకాశే గణశః స్థిత్వా హత్వా తాం హరివాహినీమ్,
అశ్మశస్త్రమహావృష్ట్యా ప్రాపయామ యమక్షయమ్. ౧౭
ఏవం చే దుపసర్పేతా మనయం రామలక్ష్మణౌ,
అవశ్య మపనీతేన జహతా మేవ జీవితమ్. ౧౮

కౌమ్భకర్ణి స్తతో వీరో నికుమ్భో నామ వీర్యవాన్,
అబ్రవీ త్పరమక్రుద్ధో రావణం లోకరావణమ్. ౧౯

సర్వే భవన్త స్తిష్ఠన్తు మహారాజేన సఙ్గతాః,

బున రాత్రికాలంబున రహస్యంబుగా వచ్చిపోయిన శోచనీయుండగు నీహను
మంతునితో మీకేమి కార్యమున్నది? ౧౦

నే నిప్పు డొక్కండ నేపోయి రాముని సుగ్రీవునితోను లక్ష్మణుని
తోనుంగూడ పరిఘంబుచే జంపి వానరసేననంతయుం గలంచి వచ్చెదను. ౧౧

రాక్షసరాజుండగు రావణుండా! నేను మఱియొక్కమాటం జెప్పె
దను; ఇష్టముగలజేని వినుము.

ఏమఱక యుపాయంబుననే శత్రువులను జయింపవలెను. ౧౨

రాక్షసరాజే దవగు రావణుండా! కామరూపులును శూరులును భయం
కరాకారులునగు రాక్షసులు వేనవేలుగా మనుష్యదేహము ధరించి రామునొద్ద
కుంబోయి తొట్రుపాటులేక రామునింజూచి యిట్లని చెప్పవలెను. ౧౩, ౧౪

మేము సీతమ్ముఁడు భరతునిచే బంపఁబడి వచ్చినాము.

ఆభరతుఁడు సేనం బిలుచుకొని శీఘ్రముననే వచ్చుచున్నాఁడు. అని
రామునితోఁ జెప్పవలెను. ౧౫

అంత మేము శూలశక్తిగదలను ధనుర్బాణఖడ్గంబులను ధరించి యిచ్చ
టనుండి శీఘ్రంబుగా నచ్చటికిఁ బోయెదము. ౧౬

మేము గుంపులుగుంపులుగా నాకాశంబుననుండి ఱాళ్లు ఆయుధంబు
లును గురిపించి ఆవానరసేననంతయుం యమలోకంబు నొందించెదము. ౧౭

ఈప్రకారంబు మనము సేయుదుమేని ఇట్లు సంకటంబునొంది రామ
లక్ష్మణులు ఆవశ్యము ప్రాణంబులను విడుతురు. అని వజ్రదంష్ట్రుఁడు
చెప్పెను. ౧౮

అంత శూరుఁడును మహాపరాక్రమశాలియునగు కుంభకర్ణపుత్రుఁడు
నికుంభుఁడను రాక్షసుఁడు పరమకుపితుఁడై లోకంబుల నేడ్పించునట్టి రావణుం
జూచి యిట్లని చెప్పెను. ౧౯

మీరలందఱు మహారాజుండగు రావణుతోఁగూడ నిచ్చటనే యూరక

అహా మేకో హనిష్యామి రాఘవం సహలక్ష్మణమ్. ౨౦
సుగ్రీవం చ హనూమన్తం సర్వా నేవచ వానరాన్,
తతో వజ్రహను ర్నామ రాక్షసః పర్వతోపమః. ౨౧
క్రుద్ధః పరిలిహ న్వక్త్రం జిహ్వయా వాక్య మబ్రవీత్,

స్వైరం కుర్వన్తు కార్యాణి భవన్తో విగతజ్వరాః. ౨౨

ఏకోఽహం భక్షయిష్యామి తాన్ సర్వాన్ హరియూథపాన్,
స్వస్థాః క్రీడన్తు నిశ్చిన్తాః పిబన్తో మధు వారుణీమ్. ౨౩

అహా మేకో వధిష్యామి సుగ్రీవం సహలక్ష్మణమ్,
అఙ్గదం చ హనూమన్తం రామంచ రణకుఞ్జరమ్. ౨౪

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డేఽష్టమ స్సర్గః. ౮.

---

## నవమస్సర్గః.

తతో నికుమ్భో రభస స్సూర్యశత్రు ర్మహాబలః,
సుప్తఘ్నో యజ్ఞహా రక్షో మహాపార్శ్వో మహోదరః. ౧
అగ్నికేతు శ్చ దుర్ధర్షో రశ్మికేతుశ్చ రాక్షసః,
ఇన్ద్రజిచ్చ మహాతేజా బలవా న్రావణాత్మజః. ౨
ప్రహస్తోఽథ విరూపాక్షో వజ్రదంష్ట్రో మహాబలః,
ధూమ్రాక్ష శ్చాతికాయశ్చ దుర్ముఖశ్చైవ రాక్షసః. ౩
పరిఘా న్పట్టిసా న్ప్రాసాన్ శక్తిశూలపరశ్వథాన్,
చాపాని చ సబాణాని ఖడ్గాంశ్చ విపులాన్ శితాన్. ౪

యుందురుగాక.

నే నొక్కఁడనేపోయి రామలక్ష్మణులను సుగ్రీవుని హనుమంతుని వానరుల నందఱను వధించివచ్చెదను. అని నికుంభుఁడు చెప్పెను. ౨౦

అంతట బర్వతాకారుఁడగు వజ్రహనుఁడను రాక్షసుఁడు కోపంబు నొంది, భీషణస్వరణంబున నోరూర వాలుకచే నోరంతయు నాకుకొనుచు నీమాటం జెప్పెను. ౨౧

మీరలందఱు నిర్భయంబుగా యథేచ్ఛం దోఁచినకార్యంబు సేసికొనుఁడు. ౨౨

నే నొక్కఁడనే యావానరోత్తముల నందఱను భక్షించి వేసెదను.

మీర లేచింతయు లేనివారలై మద్యంబుఁ ద్రాగుచు స్వస్థంబుగా క్రీడించుచుందురుగాక. ౨౩

నే నొక్కఁడనేపోయి సుగ్రీవుని లక్ష్మణుని అంగదుని హనుమంతుని రణపండితుఁడగు రాముని అందఱను వధించివచ్చెదను. అని వజ్రహనుఁడు చెప్పెను. ౨౪

ఇది యెనిమిదవసర్గము.

---

## తొమ్మిదవసర్గము.

అంత నికుంభుఁడును రభసుండును మహాబలశాలియగు సూర్యశత్రుఁడును సుప్తఘ్నుఁడును యజ్ఞహుఁడును మహాపార్శ్వుఁడును మహోదరుఁడును దుర్ధరుఁడగు నగ్నికేతుఁడును రశ్మికేతుఁడును మహాతేజుఁడును మహాబలశాలియును రావణపుత్రుఁడునగు నింద్రజిత్తును బ్రహస్తుఁడును విరూపాక్షుండును మహాబలుండగు వజ్రదంష్ట్రుఁడును ధూమ్రాక్షుఁడును నతికాయుండును దుర్ముఖుఁడును వీరలందఱు పరిఘంబులను బట్టిసంబులను బ్రాసంబులను శక్తులను శూలంబులను గండగొడ్డళ్లను ధనుర్బాణంబులను నిశితంబులగు మహాఖడ్గంబులను ధరించి లేచి పరమకుపితులయి తేజంబున వెలుఁగుచు రావణుంజూచి యిట్లని చెప్పిరి. ౧-౫

ప్రగృహ్య పరమక్రుద్ధా స్సముత్పత్య చ రాక్షసాః,
అబ్రువన్రావణం సర్వే ప్రదీప్తా ఇవ తేజసా. ౫
అద్య రామం వధిష్యామ స్సుగ్రీవం చ సలక్ష్మణమ్,
కృపణం చ హనూమన్తం లఙ్కా యేన ప్రధర్షితా. ౬
తా న్గృహీతాయుధాన్ సర్వా న్వారయిత్వా విభీషణః,
అబ్రవీ త్ప్రాఞ్జలి ర్వాక్యం పునః ప్రత్యుపవేశ్యతాన్. ౭

అ ప్యుపాయై స్త్రిభి స్తాత! యోఽర్థః ప్రాప్తుం న శక్యతే,
తస్య విక్రమకాలాం స్తా న్యుక్తా నాహు ర్మనీషిణః. ౮

ప్రమత్తే ష్వభియుక్తేషు దైవేన ప్రహృతేషు చ,
విక్రమా స్తాత! సిధ్య న్తి పరీక్ష్య విధినా కృతాః. ౯

అప్రమత్తం కథం తం తు విజిగీషుం బలే స్థితమ్,
జితరోషం దురాధర్షం ప్రధర్ష యితు మిచ్ఛథ. ౧౦

సముద్రం లఙ్ఘయిత్వా తు ఘోరం నదనదీపతిమ్,
కృతం హనుమతా కర్మ దుష్కరం తర్కయేత వా. ౧౧

బలా న్యపరిమేయాని వీర్యాణిచ నిశాచరాః,
పరేషాం సహసాఽవజ్ఞా న కర్తవ్యా కథంచన. ౧౨

మన మిప్పుడేపోయి రామలక్ష్మణులను సుగ్రీవుని లంకాపురిం జేఱిచిన నీచుండగు హనుమంతుని వధించి వచ్చెదము. అని నికుంభాదిరాక్షసులుచెప్పిరి.

అంత విభీషణుఁడు ఆయుధధారులై ప్రయాణసన్నద్ధులై యున్ననికుంభాదిరాక్షసులను నిలిపి మరలఁ గూర్చుండఁబెట్టి చేమోడ్పుగీలించి రావణుం జూచి యిట్లని చెప్పెను. ౭

నాయనా! సామదానభేదంబుల మూఁడుపాయంబులచేత నేది యసాధ్యమో దానివిషయమయ్యె దండోపాయంబుఁ బ్రయోగింపవలయునని పండితులుచెప్పుచున్నారు. కాఁబట్టి మన మిప్పుడు సామదానభేదంబులఁ బ్రయోగింపవలయుఁగాని దండంబునకుఁ గాలముగాదు. ౮

విషయాసక్తులయి యేమఱియుండువారలు శత్రువులచే నాక్రాంతులు దైవంబుప్రతికూలంబు గాఁగలవారలు మొదలగు వారలయందు నీతిశాస్త్రోక్తప్రకారమునఁ జక్కఁగాఁ బరీక్షించి ప్రయోగింపఁబడునేని దండంబు సఫలమగును; మఱియొక్కచోఁ బ్రయోగింపఁబడినపక్షములందు ఎంతమాత్రము సిద్ధింపదు. ౯

రాక్షసులారా! రాముఁ డట్టివాఁడుకాఁడు. ఎంతమాత్రము నేమఱుపాటులేనివాఁడు. విజిగీషుఁడు బలవంతుఁడు అకాలంబునఁ గోపంబుఁ దెచ్చుకొనువాఁడుకాఁడు. కావున నతని నెదిరింప నలవిగాదు. అట్టివానిని గూడ నెదిరింప నెట్లు కోరెదరు. ౧౦

హనుమంతుఁడు భయంకరంబయిన యమ్మహాసముద్రంబును దాఁటి యెవ్వరికినిం జేయనలవిగాని కార్యంబులఁ జేసినాఁడే! ఇట్లు ఎవ్వనికేని దలంపనకైనను వచ్చునా? కావున రామునకు దైవంబును బ్రతికూలంబుగాదు.

రాక్షసులారా! శత్రువులబలంబులుఁ బరాక్రమంబులు గొలతలేనివి; మీ రాలోచింపక తటాలునఁ దక్కువయని చెప్పవలదు. ౧౧

కించ రాక్షసరాజస్య రామే ణాపకృతం పురా,
ఆజహార జనస్థానా ద్యస్య భార్యాం యశస్వినః. ౧౩

ఖరో య ద్యతివృత్తస్తు రామేణ నిహతో రణే,
అవశ్యం ప్రాణినాం ప్రాణా రక్షితవ్యా యథాబలమ్. ౧౪

అయశస్య మనాయుష్యం పరదారాభిమర్శనమ్.
అర్థక్షయకరం ఘోరం పాపస్య చ పునర్భవమ్, ౧౫
ఏతన్నిమిత్తం వైదేహీ భయం న స్సుమహ ద్భవేత్,
ఆహృతా సా పరిత్యాజ్యా కలహార్థే కృతేన కిమ్. ౧౬

న నః క్షమం వీర్యవతా తేన ధర్మానువర్తినా,
వైరం నిరర్థకం కర్తుం దీయతా మస్య మైథిలీ. ౧౭

యావ న్న సగజాం సాశ్వాం బహురత్నసమాకులామ్,
పురీం దారయతే బాణై ర్దీయతా మస్య మైథిలీ. ౧౮

యావ త్సుఘోరా మహతీ దుర్ధర్షా హరివాహినీ,
నావస్కందతి నో లంకాం తావ త్సీతా ప్రదీయతామ్. ౧౯
వినశ్యేద్ధి పురీ లఙ్కా శూరా స్సర్వే చ రాక్షసాః,
రామస్య దయితా పత్నీ స్వయంచ యది దీయతే. ౨౦

ప్రసాదయే త్వాం బన్ధుత్వా త్కురుష్వ వచనం మమ,
హితం తథ్య మహం బ్రూమి దీయతా మస్య మైథిలీ. ౨౧

మఱియు రాముఁడు మున్ను రాక్షసేశ్వరుఁడగు రావణుఁడు ఖరాదు లంజంపి యపకారము గావించినాఁడు. కావున రావణుఁడు యశస్విని యగు రామునిభార్యను జనస్థానంబునుండి తెచ్చెను. అని యందురు. ౧౩

ఖరుని రాముఁడు యుద్ధంబునఁ జంపినాఁడనుటయే కదా! ఖరుఁడే మొదట నూరకున్న రామునిం జంపఁబోయినాఁడు కాన నతనిం జంపుట రాముని యపరాధము! తప్పుకాదు. తమశక్తికొలఁది దమతమ ప్రాణంబులను రక్షించుకొనవలసినదేకదా! ౧౪

పరదారగమనము అపకీర్తిగల్గించును. ఆయుఃక్షయంబుఁ జేయును. ధన నాశంబు గావించును. మహాపాపంబులను గల్గించును. ౧౫

ఈకారణముచేత మనకు సీతవలన మహాభయంబు సంభవించును.

సీతం దెచ్చినాము. మరల నాబిడను రామున కీయవలసినది. కలహంబు గల్గించునది యెంతమంచిదైనను ఏమి ప్రయోజనము? ౧౬

మహాపరాక్రమశాలియుం ధర్మంబు దప్పక నడచువాఁడునగు నారా మునితో నిష్ప్రయోజనమయిన వైరము పెట్టుకొనుట మనకు యుక్తము కాదు; రామునకు సీత నిచ్చివేయుము. ౧౭

రాముఁడు వచ్చి ఏనుగులతోను గుఱ్ఱంబులతోనుఁ గూడినదియుం బహురత్నసమాకీర్ణంబునగు లంకాపురిని బాణంబుల విదారించుటకుమున్నే రామునకు సీత నొసంగుము. ౧౮

అతిభయంకరంబును దురాధర్షంబునగు వానరసైన్యమువచ్చి మనలంకా పురిం జుట్టుముట్టి నిరోధించుటకుమున్నే రామునకు సీత నిచ్చివేయుము. ౧౯

రాముని ప్రియభార్య నాయనకు మనముగానే యివ్వమేని మనలం కాపట్టణమంతయుం నాశము నొందును; మఱియుం శూరులగు రాక్షసులందఱు నాశంబు నొందుదురు. ౨౦

నీవు నా కన్నవగుటవలన నిన్ను వేఁడుకొనుచున్నాను; నేను చెప్పు నట్లు చేయుము; నేను హితకరంబును యథార్థంబు నగుదానిం జెప్పుచు

పురా శరత్సూర్యమరీచిసన్నిభా
న్నవాగ్రపుఙ్ఖాన్ సుదృఢా న్నృపాత్మజః,
సృజ త్యమోఘా న్విశిఖా న్వధాయ తే
ప్రదీయతాం దాశరథాయ మైథిలీ. ౨౨
త్యజస్వ కోపం సుఖధర్మనాశనం
భజస్వ ధర్మం రతికీర్తివర్ధనమ్.
ప్రసీద జీవేమ సపుత్త్రబాన్ధవాః
ప్రదీయతాం దాశరథాయ మైథిలీ. ౨3

విభీషణవచ శ్శ్రుత్వా రావణో రాక్షసేశ్వరః,
విసర్జయిత్వా తాన్ సర్వా న్ప్రవివేశ స్వకం గృహమ్. ౨౪

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే నవమస్సర్గః ౯.

---

దశమస్సర్గః.

తతః ప్రత్యుషసి ప్రాప్తే ప్రాప్తధర్మార్థనిశ్చయః,
రాక్షసాధిపతే ర్వేశ్మ భీమకర్మావిభీషణః. ౧
శైలాగ్రచయసఙ్కాశం శైలశృఙ్గ మి వోన్నతమ్,
సువిభక్తమహాకక్ష్యం మహాజనపరిగ్రహమ్. ౨
మతిమద్భిర్మహామాత్రై రనురక్తై రధిష్ఠితమ్,
రాక్షసై శ్చాప్తపర్యాప్తై స్సర్వతః పరిరక్షితమ్. 3
మత్తమాతఙ్గనిశ్వాసై ర్వ్యాకులీకృతమారుతమ్,
శఙ్ఖఘోషమహాఘోషం తూర్యనాదానునాదితమ్. ౪
ప్రమదాజనసమ్బాధం ప్రజల్పితమహాపథమ్,
తప్తకాఞ్చననిర్యూహం భూషణోత్తమభూషితమ్. ౫

న్నాను. రామునకు సీత నిచ్చివేయుము. ౨౧

రాచకొమరుఁడగు రాముఁడు ఇంకమీఁద శరత్కాలసూర్యకిరణంబులుంబోలె నతితీక్ష్ణంబులును నూతనాగ్రపుంఖంబులును మిక్కిలియు దృఢంబులును అమోఘంబులునగు బాణంబులను నీవధంబునకై విడువఁగలఁడు; కావున రామునకు సీత నొసంగుము. ౨౨

కోపంబు సుఖంబును ధర్మంబును నశింపఁజేయును. దానివిడువుము. సంతోషంబును గీర్తిని వృద్ధిఁబొందించునట్టి ధర్మంబు నవలంబింపుము. అనుగ్రహించి నేను జెప్పినట్లు గావింపుము. అట్లు సేయుదువేని మనము కొడుకులు బంధువులతోఁగూడి సుఖంబుగా బ్రతికియుండవచ్చును. రామునకు సీత నొసంగుము, అని విభీషణుఁడు రావణునకుం జెప్పెను. ౨౩

రాక్షసనాథుఁడగు రావణుఁడు విభీషణుఁడు పల్కినమాట నాలకించి యాసభికుల కందఱకును సెలవిచ్చి తానును స్వగృహంబునకుం బోయెను. ౨౪

ఇది తొమ్మిదవసర్గము.

---

## పదియవసర్గము.

అంతఁ బ్రాతఃకాలం బయినపిమ్మటఁ బరాక్రమవంతుఁడును గాంతిమంతుఁడగు విభీషణుఁడు ధర్మార్థంబుల నిశ్చయించుకొని రావణునికి హితంబుఁ జెప్పుట యనెడు భయంకరకార్యంబు సేయందలంచి పర్వతశిఖరంబువలెనున్న పెక్కుశిఖరంబులుగలదియుఁ బర్వతశిఖరంబువలె నత్యున్నతంబై యున్నదియుఁ జక్కఁగా విభక్తంబులగు పెద్దతొట్టికట్లుగలదియుఁ బండితజనాధిష్ఠితంబును బుద్ధిమంతులును స్వామిభక్తిగలవారును గార్యంబుల నిర్వహించుటయందు సమర్థులునగు ప్రధానులచే నంతతను రక్షింపఁబడుచున్నదియు మదపుటేనుఁగుల నిట్టూర్పులకుఁ దిరుగుడు నొందువాయువు గలదియుఁ బ్రాతఃకాలశంఖధ్వనులచేత మృదంగాది వాద్యధ్వనులచేతను నిబిడంబయియున్నదియు స్త్రీలచే నిండియున్నదియుఁ గలకలధ్వనిచే నాకులం-

గన్ధర్వాణా మివావాస మాలయం మరుతామివ,
రత్నసఞ్చయసమ్బాధం భవనం భోగినా మివ. ౬

తం మహాభ్ర మి వాఽఽదిత్య స్తేజోవిస్తృతరశ్మిమాన్,
అగ్రజ స్యాలయం వీరః ప్రవివేశ మహాద్యుతిః. ౭

పుణ్యా న్పుణ్యాహఘోషాంశ్చ వేదవిద్భి రుదాహృతాన్.
శుశ్రావ సుమహాతేజా భ్రాతు ర్విజయసంశ్రితాన్. ౮

పూజితాన్ దధిపాత్రైశ్చ సర్పిర్భి స్సుమనోక్షతైః,
మన్త్రవేదవిదో విప్రాన్దదర్శ సుమహాబలః. ౯

స పూజ్యమానో రక్షోభి ర్దీప్యమాన స్స్వతేజసా,
ఆసనస్థం మహాబాహు ర్వవన్దే ధనదానుజమ్. ౧౦

స రాజదృష్టి సమ్పన్న మాసనం హేమభూషితమ్,
జగామ సముదాచారం ప్రయు జ్యాచారకోవిదః. ౧౧

స రావణం మహాత్మానం విజనే మన్త్రిసన్నిధౌ,
ఉవాచ హిత మత్యర్థం వచనం హేతునిశ్చితమ్. ౧౨

ప్రసాద్య భ్రాతరం జ్యేష్ఠం సా న్త్వే నోపస్థితక్రమః,
దేశకాలార్థసంవాదీ దృష్టలోకపరావరః. ౧౩

బగు రాజమార్గంబుగలదియు మంచిబంగారముచేఁ జేయఁబడిన మదపుటేనుఁగు గలదియు నుత్తమభూషణంబులచే నలంకృతంబైనదియుఁ గంధర్వలోకంబువలె నృత్తగీతవాద్యాదిముఖరితంబై యొప్పుచున్నదియు దేవనగరంబుపగిది సర్వైశ్వర్యసంపన్నంబై యున్నదియు "భోగిభవనంబు బోలె నానావిధంబులం బ్రకాశించుచుండునదియు నన్నుయగు రాక్షసేశ్వరుఁడు రావణునకు నివాసస్థానంబునగు రాజగృహంబును దేహకాంతియె కిరణంబులుగా సూర్యుఁ డాకాశంబుఁ బ్రవేశించునట్లు ప్రవేశించెను. ౧-౭

మహాతేజుఁడగు విభీషణుండు అచ్చట రావణునకు విజయంబుగలుగుటకై వేదవేత్తలగు రాక్షసు లుచ్చరించునట్టి పుణ్యంబులగు పుణ్యాహమంత్రంబులధ్వనిని వినెను. ౮

మహాబలుఁడగు నవ్విభీషణుఁడు పెరుఁగు నేయి పుష్పములు నక్షతలు మొదలగువానిచేతఁ బూజింపఁబడిన మంత్రబ్రాహ్మణవేత్తలగు బ్రాహ్మణులం జూచెను. ౯

మహాబాహుఁడగు నవ్విభీషణుండు రాక్షసులు గొనియాడఁ దేజమున వెలుంగుచు లోనికిం బోయి సింహాసనగతుఁడై యున్న కుబేరానుజుఁడగు రావణునకు నమస్కారంబు జేసెను. ౧౦

విభీషణుండు సాంప్రదాయకాచారంబులం జక్కఁగాఁ దెలిసినవాఁడు కావున నప్పుడు తాను జేయవలసినట్లు జయశబ్దప్రయోగంబు గావించి రావణుండు నేత్రసంజ్ఞచేఁ జూపిన కాంచనాలంకృతంబగు నాసనంబునం గూర్చుండెను. ౧౧

అంత నవ్విభీషణుండు మంత్రులుతప్ప మఱియెవ్వరును లేనప్పుడు మహాపరాక్రమశాలియగు రావణుంజూచి మిక్కిలియు హితకరంబును దేశకాలయుక్తులచే సునిశ్చితంబు నగుమాటం జెప్పెను. ౧౨

ఎప్పటి కెచ్చట నేమిచేయుట యుక్తమో దానినంతయు నెఱిఁగినవాఁడును లోకమునందలి మంచిచెడులు దెలిసినవాఁడునగు నవ్విభీషణుండు స్తోత్రాదులచేఁ గ్రమంబుగా నన్నను బ్రసన్నుం జేసికొని తిన్నగా నిట్లని చెప్పెను.

యదా ప్రభృతి వైదేహీ సమ్ప్రాప్తేమాం పురీం తవ,
తదా ప్రభృతి దృశ్యన్తే నిమిత్తాన్యశుభాని నః. ౧౪
సస్ఫులిఙ్గ స్సధూమార్చి స్సధూమకలుషోదయః,
మన్త్రసన్ధుక్షితో ఽప్యగ్ని ర్న సమ్యగభివర్ధతే. ౧౫

అగ్నిష్ఠే ష్వగ్నిశాలాసు తథా బ్రహ్మస్థలీషు చ,
సరీసృపాణి దృశ్యన్తే హవ్యేషు చ పిపీలికాః. ౧౬

గవాం పయాంసి స్కన్నాని విమదా వీరకుఞ్జరాః,
దీన మశ్వాః ప్రహేషన్తే న చ గ్రాసాభినన్దినః. ౧౭

ఖరోష్ట్రాశ్వతరా రాజ! న్భిన్నరోమా స్స్రవన్తి నః,
న స్వభావేఽవతిష్ఠన్తి విధానై రపి చిన్తితాః. ౧౮

వాయసా స్సఙ్ఘశః క్రూరా వ్యాహరన్తి సమన్తతః,
సమవేతాశ్చ దృశ్యన్తే విమానాగ్రేషు సఙ్ఘశః. ౧౯

గృధ్రాశ్చ పరిలీయన్తే పురీ ముపరి పిణ్డితాః,
ఉపపన్నాశ్చ సన్ధ్యే ద్వే వ్యాహర న్త్యశివం శివాః. ౨౦

క్రవ్యాదానాం మృగాణాంచ పురద్వారేషు సఙ్ఘశః,
శ్రూయన్తే విపులా ఘోషా స్సవిస్ఫూర్జథునిస్వనాః, ౨౧

తదేవం ప్రస్తుతే కార్యే ప్రాయశ్చిత్తమిదం క్షమమ్,
రోచతే యది వైదేహీ రాఘవాయ ప్రదీయతామ్. ౨౨

సీత మనపట్టణంబునకు వచ్చినది మొదలు మనకు అశుభసూచకంబు
లగు పెక్కునిమిత్తంబు లగుపడుచున్నవి. ౧౪

అగ్నిహోత్రము సమంత్రకంబుగా వ్రేల్వఁబడియు నగ్నికణంబులతోఁ
గూడి పొగగల్గి కొంచెముగా లేచుచున్నదేకాని చక్కఁగాఁ బ్రజ్వరిల్లుట
లేదు. ౧౫

పొయ్యిలయందును అగ్నిహోత్రగృహంబులందును వేదాధ్యయన
స్థలంబులందును సర్పంబు లగుపడుచున్నవి. మఱియు హోమంబుసేయనుంచి
యుండు హవిస్సులకుఁ జీమ లెక్కుచున్నవి. ౧౬

ఆవులపాలు ఎండిపోవుచున్నవి; మదపుటేనుఁగులు మదహీనంబులయి
యున్నవి; గుఱ్ఱములు దీనముగా నఱచుచున్నవి; ఆహారంబునుం గూడఁ గొనుట
లేదు. ౧౭

రాక్షసరాజుఁడవగు రావణుఁడు! మనగాడిదలును ఒంటెలును కంచర
గాడిదలును రోమంబులువీడఁ గన్నీళ్లుగాఱ రోదనంబుసేయుచున్నవి; నానా
విధచికిత్సలు గావించినను ఎప్పటియట్లు కాఁజాలకున్నవి. ౧౮

క్రూరంబులగుకాకులు గుంపులుగూడి ఎచ్చటఁజూచినను అఱచుచు
విమానశిఖరంబులందు గుంపులుగుంపులుగా నగపడుచున్నవి. ౧౯

గద్దలు గుంపులుకట్టి పట్టణంబునయింటింటిపైనను నిలుచుచున్నవి; నక్క
లు సంధ్యాకాలంబుల రెంటియందును పట్టణసమీపంబునకు వచ్చి యమంగళం
బుగా నఱచుచున్నవి. ౨౦

మఱియు కుక్కలు మొదలగు క్రూరమృగంబులును బట్టణద్వారంబులందు
గుంపులుగట్టి పిడుగుమ్రోఁతవంటి ధ్వనితో నఱచుచున్నవి. ౨౧

అట్లు కావున దానికిఁ దగునట్లు లంకాదహనాదులు సంభవించియే
యున్నవి. దానికిఁదగిన ప్రాయశ్చిత్తము నాకుఁ దోఁచియున్నది. రామునకు
సీత నొసంగుఁగాక. ౨౨

ఇదం చ యది వా మోహా ల్లోభాద్వా వ్యాహృతం మయా,
తత్రాపిచ మహారాజ! న దోషం కర్తు మర్హసి. ౨౩
అయంచ దోష స్సర్వస్య జన స్యా స్యోపలక్ష్యతే,
రక్షసాం రాక్షసీనాంచ పురస్యాన్తః పురస్యచ. ౨౪
శ్రావణే చాస్య మన్త్రస్య నివృత్తా స్సర్వమన్త్రిణః,
అవశ్యంచ మయా వాచ్యం య ద్దృష్ట మపి వా శ్రుతమ్. ౨౫
సమ్ప్రధార్య యథాన్యాయం తద్భవాన్ కర్తు మర్హతి,"
ఇతి స్మ మన్త్రిణాం మధ్యే భ్రాతా భ్రాతర మూచివాన్. ౨౬
రావణం రాక్షసశ్రేష్ఠం తథ్య మేత ద్విభీషణః.
హితం మహార్థం మృదు హేతుసంహితం
వ్యతీతకాలాయతి సమ్ప్రతిక్షమమ్,
నిశమ్య తద్వాక్య ముపస్థితజ్వరః
ప్రసఙ్గవా నుత్తర మేత దబ్రవీత్!. ౨౭
"భయం న పశ్యామి కుతశ్చి దప్యహం
న రాఘవః ప్రాప్స్యతి జాతు మైథిలీమ్,
సురై స్సహేన్ద్రై రపి సంగతః కథం
మ మాగ్రతః స్థాస్యతి లక్ష్మణాగ్రజః." ౨౮
ఇతీద ముక్త్వా సురసైన్యనాశనో
మహాబల స్సంయతి చణ్డవిక్రమః,
దశాననో భ్రాతర మాప్తవాదినం
విసర్జయామాస తదా విభీషణమ్.

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే దశమ స్సర్గః. ౧౦.

మహారాజుండవగు రావణుండా! నేను దీనిని మోహంబువలననో లేక లోభంబువలననో చెప్పినాను; దీని దోషంబుగాఁ దలంపవలదు. ౨౩

ఈదుశ్శకున నాదిదోషము సమస్తరాక్షసులకును రాక్షసస్త్రీలకును అంతఃపురస్త్రీలకును బట్టణంబునందుండు వారల కందఱకును దెలిసియున్నది. ౨౪

మంత్రులందఱు నీకు భయపడి నీదాక్షిణ్యమునకై యీసంగతిం జెప్పరు. నేను తమ్ముఁడ నగుటచేఁ జూచినది విన్నది యంతయుం నవశ్యము చెప్పవలయును. ౨౫

నీవు న్యాయప్రకారముగ నాలోచించి నిశ్చయించి యీప్రకారము సేయుము. అని విభీషణుండు రావణునితోఁ జెప్పెను.

తమ్ముఁడగు విభీషణుండు అన్నయు రాక్షసశ్రేష్ఠుఁడునగు రావణుం జూచి మంత్రులనడుమ నీప్రకారముగా హితకరంబగుమాటం జెప్పెను ౨౬

ఆరావణుండు హితకరంబును గొప్పప్రయోజనంబుగలదియుం మృదులంబును యుక్తియుక్తంబును భూతకాలంబునందును భవిష్యత్కాలంబునందును వర్తమానకాలంబునందును మేలుగలిగించునదియునగు విభీషణుండు చెప్పినమాటనువిని మహాకోపంబునొంది తనపట్టువదలక యిట్లని బదులు చెప్పెను. ౨౭

నాకు ఎవ్వనివలనను భయంబులేదు. నాచేఁ జిక్కినసీతను రాముఁ డెంతమాత్రమునుం బొందఁజాలఁడు. దేవేంద్రునితోఁగూడ దేవతలు సహాయులయి తోడ్పడినను రాముఁడు యుద్ధంబున నాయెదుట నిలువఁజాలఁడు. అని రావణుండు విభీషణునకుం జెప్పెను. ౨౮

దేవసైన్యమును నశింపఁజేయువాఁడును మహాబలుఁడును యుద్ధంబున భయంకరపరాక్రముఁడునగు రావణుఁడు ఈప్రకారముచెప్పి హితవాదియగు తమ్ముఁడైన విభీషణునకు సెలవొసంగెను. ౨౯

ఇది పదియవసర్గము.

---

## ఏ కా ద శ స్స ర్గః.

స బభూవ కృశో రాజా మైథిలీకామమోహితః,
అసంమానాచ్చ సుహృదాం పాపం పాపేన కర్మణా. ౧

అతీతసమయే కాలే తస్మిన్వైయుధి రావణః,
అమాత్యైశ్చ సుహృద్భిశ్చ ప్రాప్తకాల మమన్యత. ౨
స హేమజాలవితతం మణివిద్రుమభూషితమ్,
ఉపగమ్య వినీతాశ్వ మారురోహ మహారథమ్. ౩

తమాస్థాయ రథశ్రేష్ఠం మహామేఘసమస్వనమ్,
ప్రయయౌ రాక్షసశ్రేష్ఠో దశగ్రీవ స్సభాం ప్రతి. ౪

అసిచర్మధరా యోధా స్సర్వాయుధధరా స్తథా,
రాక్షసా రాక్షసేన్ద్రస్య పురస్తా త్సమ్ప్రతస్థిరే. ౫
నానావికృతవేషాశ్చ నానాభూషణభూషితాః,
పార్శ్వతః పృష్ఠత శ్చైనం పరివార్య యయు స్తతః. ౬

రథైశ్చాతిరథా శ్శీఘ్రం మత్తైశ్చ వరవారణైః,
అనూత్పేతు ర్దశగ్రీవ మాక్రీడద్భి శ్చ వాజిభిః. ౭

గదాపరిఘహస్తాశ్చ శక్తితోమరపాణయః,
పరశ్వధధరా శ్చాన్యే తథాఽన్యే శూలపాణయః. ౮

## పదునొకండవసర్గము.

పాపిష్ఠుఁడగు నారావణుఁడు సీతామోహంబునను విభీషణాదులు సీత నిమ్మని యనాదరణంబు సేయుటవలనను ప్రహస్తాదులు విభీషణునిమాటకు నోరకుండుటవలన వారలయభిప్రాయంబును అదే యని చెప్పుటవలనను తాను జేసిన పాపకృత్యంబువలనను మఱియుఁ గృశుండయ్యెను. ౧

అట్లాదినము గడచినపిమ్మట రావణుఁడు యుద్ధంబువిషయమయి మంత్రులతోను స్నేహితులతోను ఆలోచింపఁ దలంచెను. ౨

తన్నును సారథిని గుఱ్ఱంబును గాపాడుకొనుచుఁ బదునొకండువేల మంది విలుకాండ్రతోఁ బోరంజాలినట్టి యీరావణుఁడు బంగారుకిటికీలుగల దియుం రత్నంబులచేతను బగడంబులచేతను అలంకృతంబును జక్కఁగా వివిధ గతుల శిక్షింపఁబడిన గుఱ్ఱంబులుగలదియునగు రథంబునొంది ప్రదక్షిణంబు గావించి యారోహించెను. ౩

రాక్షసోత్తముఁడగు రావణుఁడు మేఘగర్జనంబువంటి ధ్వనిగల యుత్త మంబగు నారథంబు నారోహించి యాలోచనంబుసేయు గృహంబునకుఁ బోయెను. ౪

కొందఱు డాలును గత్తియుం ధరించి కొందఱు నానాయుధపాణు లయి రాక్షసేశ్వరుఁడగు రావణునిముందు నడచిరి. ౫

అంతఁ గొందఱు రాక్షసులు నానావిధంబులయిన వికృతవేషంబులు గలవారలై నానావిధభూషణాలంకృతులయి యీరావణునిపార్శ్వభాగంబులను వెనుకను బరివేష్టించి పోయిరి. ౬

అంత నతిరథులగు రాక్షసులు కొందఱు రథంబుల నారోహించి కొందఱు మదపుటేనుఁగుల నెక్కియుఁ గొందఱు నానావిధగతులం గ్రీడించు గుఱ్ఱంబుల నధిరోహించియుం రావణునివెంబడిఁ బోయిరి. ౭

కొందఱు గదలను బరిఘంబులను దాల్చియుఁ గొందఱు శక్తితో మరంబులంగొనియుఁ గొందఱు గండగొడ్డళ్ళు పట్టుకొనియుఁ గొందఱు శూలం బులు ధరించియుఁ బోయిరి. ౮

తత స్తూర్యసహస్రాణాం సఞ్జజ్ఞే నిస్వనో మహాన్,
తుముల శ్శఙ్ఖశబ్దశ్చ సభాం గచ్ఛతి రావణే. ౯
స నేమిఘోషేణ మహాన్ సహసాఽభినినాదయన్,
రాజమార్గం శ్రియా జుష్టం ప్రతిపేదే మహారథః. ౧౦
విమలం చాతపత్రాణాం ప్రగృహీత మశోభత,
పాణ్డురం రాక్షసేన్ద్రస్య పూర్ణ స్తారాధిపో యథా. ౧౧
హేమమఞ్జరిగర్భే చ శుద్ధస్ఫటికవిగ్రహే,
చామరవ్యజనే చాస్య రేజతు స్సవ్యదక్షిణే. ౧౨

తే కృతాఞ్జలయ స్సర్వే రథస్థం పృథివీస్థితాః,
రాక్షసా రాక్షసశ్రేష్ఠం శిరోభి స్తం వవన్దిరే. ౧౩
రాక్షసైః స్తూయమాన స్స న్జయాశీర్భి రరిన్దమః,
ఆససాద మహాతేజా స్సభాం సువిహితాం శుభామ్. ౧౪

సువర్ణరజతస్థూణాం విశుద్ధస్ఫటికాన్తరామ్,
విరాజమానో వపుషా రుక్మపట్టోత్తరచ్ఛదామ్. ౧౫
తాం పిశాచశతై ష్షడ్భి రభిగుప్తాం సదా శుభామ్,
ప్రవివేశ మహాతేజా స్సుకృతాం విశ్వకర్మణా. ౧౬

తస్యాం తు వైడూర్యమయం ప్రియకాజినసంవృతమ్,
మహ త్సోపాశ్రయం భేజే రావణః పరమాసనమ్. ౧౭

తత శ్శశాసేశ్వరవ ద్దూతా న్లఘుపరాక్రమాన్,

అంత రావణుఁడు సభకుఁబోఁగానే వేలకొలఁది వాద్యములధ్వను లును శంఖంబులశబ్దంబును దుములంబై చెలంగినది. ౯

పూజ్యంబగు నామహారథంబు నేమిధ్వని దిక్కులం బ్రతిధ్వనులు పిక్కటిల్లఁ దటాలున గాంతిమంతంబగు రాజమార్గంబు బ్రవేశించెను. ౧౦

అప్పుడు ఆ రాక్షసులచేఁ బట్టఁబడిన రాక్షసేశ్వరుఁడగు రావణుని స్వచ్ఛంబగు శ్వేతచ్ఛత్రంబు నిండుచంద్రుఁడుంబోలె వెలుఁగుచుండినది. ౧౧

బంగారుపూఁగుత్తి నడుమంగలవియు శుద్ధస్ఫటికంబులుంబోలె స్వచ్ఛం బులునగు వింజామరలు రావణుని సవ్యదక్షిణపార్శ్వంబులం బ్రకాశించు చుండినవి. ౧౨

అచ్చట రాక్షసులందఱు క్రింద నిలుచుండి చేతులు మొగుడ్చుకొని రథంబుననున్న రాక్షసోత్తముఁడగు రావణునకు నమస్కారంబు గావించిరి.

శత్రువుల నడఁగఁద్రొక్కంజాలిన మహాప్రభావుఁడగు రావణుఁడు రాక్షసులచే "జయ జయ" అను శబ్దంబుచేతను ఆశీర్వచనంబులచేతను గొనియాడంబడుచు చక్కఁగా నిర్మింపఁబడి సుందరంబయియుండు సభం జేరెను. ౧౪

మహాతేజుఁడగు నారావణుండు దేహకాంతిచే వెలుఁగుచు బంగారు తోను వెండితోనుఁ జేయఁబడిన స్తంభంబులుకలదియుఁ స్వచ్ఛస్ఫటికమయం బగు మధ్యప్రదేశంబుగలదియుఁ గాంచనమయంబగు నాస్తరణంబుగలదియు విశ్వకర్మచే బహుసుందరంబుగా నిర్మింపఁబడినదియు నాఱువందల పిశా చంబులచే రక్షింపఁబడుచున్నదియు మిక్కిలియు సుందరంబునగు నాసభం బ్రవేశించెను. ౧౫, ౧౬

రావణుఁ డచ్చట వైడూర్యమణితోఁ జేయఁబడినదియుఁ బ్రియకచ ర్మాస్తీర్ణంబును దిండుతోఁ గూడినదియు గొప్పదియునగు నుత్తమసింహా సనంబుపైఁ గూర్చుండెను. ౧౭

అంత నారావణుఁడు శీఘ్రంబుగా నడవఁగల దూతలంజూచి "మన

"సమానయత మే క్షిప్ర మిహైతా న్రాక్షసా" నితి. ౧౮
'కృత్య మస్తి మహ జ్జాతం సామర్థ్య మిహ నో భవేత్'

రాక్షసా స్తద్వచ శ్శ్రుత్వా లఙ్కాయాం పరిచక్రముః. ౧౯
అనుగేహ మవస్థాయ విహారశయనేషు చ,
ఉద్యానేషుచ రక్షాంసి చోదయన్తో హ్యభీతవత్. ౨౦

తే రథా న్రుచిరా నేకే దృప్తా నేకే పృథ గ్ఘయాన్,
నాగా నన్యేఽధిరురుహుర్జగ్ముశ్చైకే పదాతయః. ౨౧

సా పురీ పరమాకీర్ణా రథకుఞ్జరవాజిభిః,
సమ్పతద్భి ర్విరురుచే గరుత్మద్భి రి వామ్బరమ్. ౨౨

తే వాహనా న్యవస్థాప్య యానాని వివిధాని చ,
సభాం పద్భిః ప్రవివిశు స్సింహా గిరిగుహా మివ. ౨౩

రాజ్ఞః పాదౌ గృహీత్వాతు రాజ్ఞా తే ప్రతిపూజితాః,
పీఠే ష్వన్యే బ్రుసీ ష్వన్యే భూమౌ కేచి దుపావిశన్. ౨౪

తే సమేత్య సభాయాం వై రాక్షసా రాజశాసనాత్,
యథార్హ ముపతస్థుస్తే రావణం రాక్షసాధిపమ్. ౨౫
మన్త్రిణశ్చ యథాముఖ్యా నిశ్చయార్థేషు పణ్డితాః,
అమాత్యాశ్చ గుణోపేతా స్సర్వజ్ఞా బుద్ధిదర్శనాః. ౨౬

కిప్పుడు గొప్పపని యొకటి వచ్చియున్నది; దాని నిర్వహించుకొనవలెను. కావున మీరలు నాయొద్ద కారాక్షసులను శీఘ్రముగాఁ దోడ్కొనిరండు" అని యాజ్ఞాపించెను. ౧౮

ఆరాక్షసులు రావణునిమాటను విని నిర్భయంబుగా గృహంబులం జొచ్చి విహారశయనంబులందును ఉద్యానవనంబులందును బడిక్రీడించుచున్న రాక్షసులనుంగూడ లేపి రావణు నాజ్ఞ దెలుపుచు నిట్లు లంకయందుఁ బ్రతిగృహంబునుం దిరిగిరి. ౧౯-౨౦

అంత నారాక్షసులు దూతలవలన రావణు నాజ్ఞనువిని కొందఱు సుందరంబులగురథంబులను కొందఱు గర్వించియున్న మహావేగంబులగు గుఱ్ఱంబులను మఱికొందఱు గజంబులను ఆరోహించిపోయిరి; కొందఱు కాళ్లతో నడచిపోయిరి. ౨౧

ఉత్తమంబగు నాలంకాపురియట్లు గుంపులుగుంపులుగానిండుకొనియున్న రథంబులు యేనుఁగులు గుఱ్ఱంబులుఁ గల్గియుండుటవలనఁ బక్షిసంఘంబులతోఁగూడిన యాకాశంబుపగిదిఁ బ్రకాశించుచుండినది. ౨౨

అంత నారాక్షసులు రథంబులు మొదలగువాహనంబులను ద్వారంబుననే నిలిపి సింహంబులు గిరిగుహం బ్రవేశించునట్లు పాదంబులతోనే సభం బ్రవేశించిరి. ౨౩

ఆరాక్షసులు రాక్షసరాజుఁడగు రావణునిపాదంబులకు నమస్కారంబు గావించి యతనిచే బూజితులయి కొందఱు కాంచనాసనంబులందును కొందఱు శ్రోత్రియరాక్షసులు దర్భాసనంబునందును కొందఱు నేలయందును గూర్చుండిరి. ౨౪

ఆరాక్షసులు అట్లు రాజాజ్ఞవలన సభకువచ్చి వారివారి యోగ్యతకుఁ దగినట్లు రాక్షసేశ్వరుఁడగు రావణుని సమీపంబునం గూర్చుండిరి. ౨౫

అచ్చటఁ గార్యంబులు నిశ్చయించుటయందుఁ బండితులగు ముఖ్యులయిన మంత్రులును గుణవంతులును సర్వజ్ఞులును బుద్ధిచే నెట్టిరహస్యమునైని

సమేయు స్తత్ర శతశ

శ్శూరా శ్చ బహవ స్తదా,
సభాయాం హేమవర్ణాయాం సర్వార్థస్య సుఖాయ వై. ౨౭
రమ్యాయాం రాక్షసేన్ద్రస్య సమేయు స్తత్ర సఙ్ఘశః.
తతో మహాత్మా విపులం సుయుగ్యం
వరం రథం హేమవిచిత్రితాఙ్గమ్,
శుభం సమాస్థాయ యయౌ యశస్వీ
విభీషణ స్సంసద మగ్రజస్య. ౨౮
స పూర్వజాయావరజ శ్శశంస
నామాథ పశ్చా చ్చరణౌ వవన్దే,
శుకః ప్రహ స్తశ్చ తథైవ తేభ్యో
దదౌ యథార్హం పృథగాసనాని. ౨౯
సువర్ణనానామణిభూషణానాం
సువాససాం సంసది రాక్షసానామ్,
తేషాం పరార్ధ్యాగరుచన్దనానాం
స్రజశ్చ గన్ధాః ప్రవవు స్సమన్తాత్. ౩౦

న చుక్రుశు ర్నానృత మాహ కశ్చి
త్సభాసదో నాపి జజల్పు రుచ్చైః,
సంసిద్ధార్థా స్సర్వ ఏవోగ్ర వీర్యా
భర్తు స్సర్వే దదృశు శ్చాననం తే. ౩౧
స రావణ శ్శస్త్రభృతాం మనస్వినాం
మహాబలానాం సమితౌ మనస్వీ,

కనుఁగొనువారునగు నమాత్యులును గుంపులుగుంపులుగాఁ గ్రమంబునం గూర్చుండిరి. ౨౭

అప్పుడు శూరులును అనేకులు సమస్తకార్యంబులును జక్కఁగా నాలోచించుటకై కాంచనవర్ణంబును సుందరంబునగు రావణుని సభయందు గుంపులుగుంపులుగాఁ జేరిరి. ౨౮

అంత మహోత్సాహుఁడును మహాయశశ్శాలియునగు విభీషణుఁడు విశాలంబును మంచిగుఱ్ఱంబులుగట్టినదియుం బంగారముచేనలంకరింపఁబడినదియు నుత్తమంబును సుందరంబునగు రథంబు నారోహించి అన్నయగు నారావణునిసభకుఁ బోయెను. ౨౯

అంతఁ దమ్ముఁడగు నవ్విభీషణుఁడు అన్నయగు రావణునకుఁ బ్రవర చెప్పి పాదంబులకు నమస్కరించెను. అట్లె శుకుఁడును బ్రహస్తుఁడును నమస్కరించిరి. అంత రావణుండు వారలమువ్వురకును వేర్వేఱ వారివారియోగ్యతకుఁ దగునట్లు ఆసనంబుల నొసంగెను. ౩౦

ఆసభయందు నానావిధసువర్ణభూషణంబులును మంచివస్త్రంబులును దాల్చినవారలును ఉత్తమంబులగు నగరుచందనంబులం బూసికొనియుండు వారలును నానావిధపుష్పమాలికలు ధరించియున్నవారలునగు నారాక్షసుల మేనిపుష్పమాలికలును జవనాదులును అంతటను సుగంధంబులు గుబాళించుచుండినవి. ౩౦

సభికులు ఎవ్వరు గఱపకుండిరి. ఎవ్వఁడు నబద్ధమాడలేదు. ఎవ్వరును గట్టిగా మాటలాడలేదు. అందఱును సిద్ధార్థులయి మహాపరాక్రమశాలులయి యుండిరి. అప్పుడు ప్రభుఁడగు రావణునిముఖంబు అందఱకును జూడఁదగి యుండెను. ౩౧

ధీరమయినమనస్సుగలవాఁడగు నారావణుఁడు ఆసభయందు ఆయుధధారులను ధీరహృదయులును బలవంతులగు నారాక్షసులనడుమ వసువులనడుమ

తస్యాం సభాయాం ప్రభయా చకాశే
మధ్యే వసూనామివ వజ్రహస్తః. ౩౨

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే ఏకాదశస్సర్గః. ౧౧.

---

## ద్వాదశస్సర్గః.

స తాం పరిషదం కృత్స్నాం సమీక్ష్య సమితింజయః,
ప్రచోదయామాస తదా ప్రహస్తం వాహినీపతిమ్. ౧
"సేనాపతే! యథా తే స్యుః కృతవిద్యా శ్చతుర్విధాః,
యోధా నధికరక్షాయాం తథా వ్యాదేష్టు మర్హసి." ౨

స ప్రహస్తః ప్రణీతాత్మా చికీర్ష న్రాజశాసనమ్,
వినిక్షిప ద్బలం సర్వం బహి రన్తశ్చ మన్దిరే. ౩
తతో వినిక్షిప్య బలం పృథ జ్నగరగుప్తయే,
ప్రహస్తః ప్రముఖే రాజ్ఞో నిషసాద జగాద చ. ౪
"నిహితం బహి రన్తశ్చ బలం బలవత స్తవ,
కురుష్వావిమనాః క్షిప్రం యదభిప్రేత మస్తు తే." ౫

ప్రహస్తస్య వచః శ్రుత్వా రాజా రాజ్యహితే రతః,
సుఖేప్సు స్సుహృదాం మధ్యే వ్యాజహార స రావణః. ౬

"ప్రియాప్రియే సుఖం దుఃఖం లాభాలాభౌ హితాహితే,
ధర్మకామార్థకృచ్ఛ్రేషు యూయ మర్హథ వేదితుమ్. ౭

సర్వకృత్యాని యుష్మాభి స్సమారబ్ధాని సర్వథా,

దేవేంద్రుఁడుంబోలెఁ దనదేహకాంతిచేఁ బ్రకాశించుచుండెను. ౩౭

ఇది పదునొకండవసర్గము.

## పండ్రెండవసర్గము.

అప్పుడు యుద్ధమునందు జయశాలియగు రావణుఁడు ఆసభనంత యుం గని సేనానాయకుఁడగు ప్రహస్తుంజూచి యిట్లని యాజ్ఞాపించెను. ౧

సేనానాయకుఁడ వగు ప్రహస్తుఁడా! సమస్తాయుధవిద్యలను నేర్చిన వారలును రథికహస్తిపకసాదిపదాతిభేదంబులం జతుర్విధులునగుయోధులు పట్ట ణంబు నిప్పటికన్ననధికంబుగా రక్షించుటయందు జాగరూకు లయియుండు నట్లాజ్ఞాపింపుము. అని రావణుఁడు ప్రహస్తున కాజ్ఞాపించెను. ౨

ఆప్రహస్తుఁడు వినయంబున రాజాజ్ఞ సేయంగోరి సైన్యమంతయుం నాగృహంబులోపలను వెలుపలను ఉంచెను. ౩

అంతఁ బట్టణరక్షణంబునకై వేఱుగా సైన్యంబునిలిపి ప్రహస్తుఁడు రావణునిసమ్ముఖంబునకువచ్చి కూర్చుండి యిట్లని విన్నవించెను. ౪

బలవంతుఁడవగు నీసైన్యంబును లోపలను వెలుపలను అంతటను గావలి యుంచియున్నాను; ఇఁక నీకేమి సేయవలెనని యున్నదో దాని స్వస్థంబుగా శీఘ్రంబునం జేసికొనుము. అని ప్రహస్తుఁడు రావణునితోఁ జెప్పెను.

రాజ్యంబునకు హితము చేయుటయం దాసక్తుండయిన రాక్షసరాజుఁ డగురావణుఁడు ప్రహస్తుఁడు చెప్పినమాటను విని సుఖంబుఁగోరి స్నేహితుల నడుమ నిట్లనిచెప్పెను. ౬

ధర్మకామార్థంబులలో సంకటంబు గల్గినప్పుడు ప్రియాప్రియంబు లను సుఖదుఃఖంబులను లాభనష్టంబులను మంచిచెడులను దెలిసికొనుటకు మీరు సమర్థులరు. ౭

అన్నికార్యంబులను మీరలు చక్కఁగా నాలోచించి నిశ్చయించి

మన్త్రకర్మనియుక్తాని న జాతు విఫలాని మే. ౮
ససోమగ్రహనక్షత్రై ర్మరుద్భి రివ వాసవః,
భవద్భి రహ మత్యర్థం వృతశ్శ్రియ మవాప్నుయామ్. ౯

అహం తు ఖలు సర్వాన్వ స్సమర్థయితు ముద్యతః,
కుమ్భకర్ణస్య తు స్వప్నా న్నేమ మర్థ మచోదయమ్. ౧౦

అయం హి సుప్త ష్షణ్మాసా న్కుమ్భకర్ణో మహాబలః,
సర్వశస్త్రభృతాం ముఖ్య స్స ఇదానీం సముత్థితః. ౧౧

ఇయంచ దణ్డకారణ్యా ద్రామస్య మహిషీ మయా,
రక్షోభి శ్చరితా ద్దేశా దానీతా జనకాత్మజా. ౧౨
సా మే న శయ్యా మారోఢు మిచ్ఛత్యలసగామినీ,
త్రిషు లోకేషు చాన్యా మే న సీతాసదృశీ మతా. ౧౩
తనుమధ్యా పృథుశ్రోణీ శారదేన్దునిభాననా,
హేమబిమ్బనిభా రమ్యా మాయేవ మయనిర్మితా. ౧౪

సులోహితతలౌ శ్లక్ష్ణౌ చరణౌ సుప్రతిష్ఠితౌ,
దృష్ట్వా తామ్రనఖౌ తస్యా దీప్యతే మే శరీరజః. ౧౫

హుతాగ్నే రర్చిసఙ్కాశా మేనాం సౌరీ మివ ప్రభామ్,

ఉన్నసం వదనం వల్గు విపులం చారులోచనమ్. ౧౬
పశ్యం స్తథాఽవశ స్తస్యాః కామస్య వశ మేయివాన్,
క్రోధహర్షసమానేన దుర్వర్ణకరణేన చ. ౧౭

యారంభించినకార్య మేదైనను నాకు సఫలంబు గాకుండినదిలేదు. ౮

దేవేంద్రుఁడు చంద్రసూర్యగ్రహంబులతోను నక్షత్రంబులతోను దేవతలతోనుంగూడి జయలక్ష్మినొందునట్లు నేనుమిమ్ముఁగూడి జయలక్ష్మికోరెదను. ౯

నేను మీకందఱకును ఇదివఱకే కొంతదూర మీసంగతిఁ దెలిపియున్నాను. కుంభకర్ణునకుమాత్రము అతఁడు నిద్రించుచుండుటవలన నీసంగతిం జెప్పలేదు. ౧౦

మహాబలుఁడును ఆయుధధారులయందఱిలోను శ్రేష్ఠుఁడునగు నీకుంభకర్ణుఁడు ఆఱుమాసంబులు నిదురించియుండినాఁడుగదా! అతఁడిప్పుడు వచ్చినాఁడు. ౧౧

జనకమహారాజుపుత్రియు రామునిప్రియురాలునగు నీసీతను రాక్షసులు సంచరించునట్టి దండకారణ్యంబుననుండి దెచ్చియున్నాను. ౧౨

మందగామినియగు నాసీత నేనెంతప్రార్థించినను నాపై వలపుగొనకున్నది. ముల్లోకంబులయందును సీతవంటి మఱియొక్క స్త్రీ యెదియులేదు.

ఆసీత సన్ననడుమును బెద్దపిఱుఁదులును శరత్కాలచంద్రబింబము వంటి మోమును బంగారుప్రతిమవంటి మేనునుంగల్గి సరిలేనిసౌందర్యంబున మెఱయుచు మయనిర్మితంబగు మాయపగిది నత్యాశ్చర్యంబు గల్గించుచున్నది.

మిక్కిలియు నెఱ్ఱనియడుగులుగలవియు మృదులంబులును సమంబులును ఎఱ్ఱనిగోళ్లుగలవియునగు నాసీతాదేవి పాదంబులం జూడఁజూడ నాకు మన్మథబాధ యెచ్చుచున్నది. ౧౪

హుతాగ్నిజ్వాలవలె సూర్యకాంతియుంబోలినున్న యీసీతం జూడఁజూడ నాకు మన్మథబాధ మఱియు నెచ్చుచున్నది.

ఉన్నతంబగు ముక్కుగలదియు సుందరంబును విశాలంబును రమణీయంబులగు నేత్రంబులతో నొప్పుచున్నదియునగు నాసీతాదేవిముఖంబును జూడఁజూడ నేను బరవశుఁడనై మన్మథునకు లోబడుచున్నాను. ౧౬

కోపంబువచ్చినను సంతోషంబుగల్గినను దుఃఖంబుసంభవించినను

శోకసన్తాపనిత్యేన కామేన కలుషీకృతః,

సా తు సంవత్సరం కాలం మా మయాచత భామినీ. ౧౮
ప్రతీక్షమాణా భర్తారం రామ మాయతలోచనా,
తన్మయా చారునేత్రాయాః ప్రతిజ్ఞాతం వచ శ్శుభమ్. ౧౯
శ్రాన్తోఽహం సతతం కామా ద్యాతో హయ ఇవాధ్వని,

కథం సాగర మక్షోభ్య ముత్తర న్తి వనౌకసః. ౨౦
బహుసత్త్వసమాకీర్ణం తౌ వా దశరథాత్మజౌ,

అథవా కపినై కేన కృతం నః కదనం మహత్. ౨౧
దుర్జ్ఞేయాః కార్యగతయో బ్రూత యస్య యథామతి,

మానుషాన్మే భయం నాస్తి తథాపి తు విమృశ్యతామ్. ౨౨
తదా దేవాసురే యుద్ధే యుష్మాభి స్సహితో జయమ్,
తే మే భవన్తశ్చ తథా

సుగ్రీవప్రముఖా న్హరీన్. ౨౩
పరే పారే సముద్రస్య పురస్కృత్య నృపాత్మజౌ,
సీతాయాః పదవీం ప్రాప్తౌ సమ్ప్రాప్తౌ వరుణాలయమ్. ౨౪
అదేయాచ యథా సీతా వధ్యౌ దశరథాత్మజౌ,
భవద్భి ర్మన్త్ర్యతాం మన్త్ర స్సునీతం చాభిధీయతామ్. ౨౫
నహి శక్తిం ప్రపశ్యామి జగత్యన్యస్య కస్యచిత్,
సాగరం వానరై స్తీర్త్వా నిశ్చయేన జయో మమ. ౨౬

సంతాపంబువచ్చినను విడువక బాధించువాఁడును దేహము తెల్లఁబాఱునట్లు సేయువాఁడునగు మన్మథుఁడు నన్నుఁ గలంచుచున్నాఁడు. ౧౭

దీర్ఘములయిన కండ్లుగల యాసీతాదేవి తన పెనిమిటి రాముఁడువచ్చునో యేమోయని నన్నొకసంవత్సరంబు గడువడిగియున్నది. ౧౮

సుందరాక్షియగు నాసీత చెప్పిన యామాటకు నే నొప్పుకొంటిని. ౧౯

మార్గంబు నడచినగుఱ్ఱంబువలె నేను ఈమన్మథునిచేఁ బడి పడి యలసియున్నాను.

అక్షోభ్యంబును తిమితిమింగిలాది మహాజంతువులతో నిండియుండునదియునగు మహాసముద్రంబును వానరు లెట్లు దాఁటఁగలరు? ఆరామలక్ష్మణులుగాని యెట్లు దాఁటఁగలరు. ౨౦

ఒకవేళ దాఁటుదురనియే తలంతము. ఒక్కవానరుఁ డంతటివాఁడే మనతో నింతదూరము యుద్ధముచేసి పోయెనే; కార్యగతుల నెఱుంగుట కష్టము; కావున మీరలు మీమీబుద్ధికిఁ దోఁచినట్లు చెప్పుఁడు. ౨౧

అప్పుడు మీసాహాయ్యంబున దేవాసురయుద్ధంబున నే జయంబు పొందినాను; అప్పుడు సహాయులయిన మీరలు నట్లే యున్నారలు; కావున నాకు మనుష్యునివలన నేమిభయము? అయినను చక్కఁగా నాలోచింపుఁడు. ౨౨

అచ్చట సముద్రోత్తరతీరంబున రామలక్ష్మణులు సీతయుండు స్థలంబు తెలిసికొని సుగ్రీవాదివానరులం గూడుకొని సముద్రంబునొద్దఁ జేరియున్నారు. ౨౩, ౨౪

సీతాదేవి నొసంగకయే దశరథుని కుమారులగు రామలక్ష్మణులం జంపునట్లుమీరలు చక్కఁగా నాలోచించి నిశ్చయించియుపాయంబువచింపుఁడు.

వానరులను సహాయులుగా నుంచుకొని సముద్రంబుదాఁటి యిచ్చటికి వచ్చుటకుఁ బ్రపంచంబున నెవ్వండును సమర్థుఁడుగాఁడు; కావున నిశ్చయంబుగా నాకే జయంబుగల్గును. అని రావణుఁడు చెప్పెను. ౨౫

తస్య కామపరీతస్య నిశమ్య పరిదేవితమ్,
కుమ్భకర్ణః ప్రచుక్రోధ వచనం చేద మబ్రవీత్. ౨౭
యదా తు రామస్య సలక్ష్మణస్య
ప్రసహ్య సీతా ఖలు సా ఇహాఽహృతా,
సకృత్సమీక్ష్యైవ సునిశ్చితం తదా
భజేత చిత్తం యమునేవ యామునమ్. ౨౮
సర్వ మేత న్మహారాజ! కృత మప్రతిమం తవ,
విధీయేత సహాస్మాభి రాదా వే వాస్య కర్మణః. ౨౯

న్యాయేన రాజకార్యాణి యః కరోతి దశానన!,
న స సన్తప్యతే పశ్చా న్నిశ్చితార్థమతి ర్నృపః. ౩౦

అనుపాయేన కర్మాణి విపరీతాని యాని చ,
క్రియమాణాని దుష్యన్తి హవీంష్యప్రయతే ష్వివ. ౩౧

యః పశ్చా త్పూర్వకార్యాణి కర్మాణ్యభిచికీర్షతి,
పూర్వంచాపరకార్యాణి న సవేద నయానయౌ. ౩౨

చపలస్య తు కృత్యేషు ప్రసమీక్ష్యాధికం బలమ్,
క్షిప్ర మన్యే ప్రపద్యన్తే క్రౌఞ్చస్య ఖ మివ ద్విజాః. ౩౩

త్వయేదం మహదారబ్ధం కార్య మప్రతిచిన్తితమ్,

అట్లు మన్మథావిష్టుఁడగు యా రావణుఁడు చెప్పినమాటనువిని కుంభకర్ణుండు మహాకోపంబునొంది యీమాటం జెప్పెను. ౨౭

నీవు నీయంతనే యాలోచించి రాముని భార్యయగు సీతను బలాత్కారముగా నిచ్చటికిఁ దేకమును పే మాతో నాలోచించియుందువేని అప్పుడు యమునానది యామునపర్వతంబు నొందునట్లు మనస్సు నిశ్చయంబునొంది యుండును. ఇప్పు డాలోచించుటంతయుఁ గతజలసేతుబంధనమువంటిది. ౨౮

మహారాజుఁడవగు రావణుఁడా! ఇప్పు డాలోచించుటంతయు సీతం దీసికొనివచ్చుటకు మొదటనే మాతో నాలోచించియుందువేని మిక్కిలియు జక్కఁగా నుండును. ౨౯

రావణుఁడా! ఎవ్వఁడు కార్యంబు నారంభించుటకుమున్నే చక్కఁగా న్యాయంబు నాలోచించి యటువిమ్మట రాజకార్యంబుల నారంభించునో అట్టి ప్రతికార్యంబునందును నిశ్చితబుద్ధిగల రాజు నీ యట్లు వెనుకఁ బరితాపంబు నొందఁడు. ౩౦

మంచికార్యములయినను ఉపాయముచేఁ జేయకున్నచో నిష్ఫలంబు లగుటయేగాక అపాత్రులకుఁ బెట్టినయన్నమువలె దోషంబునుం గలుగఁ జేయును. ౩౧

మఱియు నెవ్వఁడు వెనుకఁ జేయవలసిన కార్యములను ముందుచేసి ముందు చేయవలసినవానిని వెనుకఁ జేయఁగోరునో అతఁడు మంచిచెడులు దెలిసినవాఁడు కాఁడు. ౩౨

చక్కఁగా నాలోచింపక చపలుఁడై కార్యములు చేయువాని కధికబలమున్నయెడల శత్రువులు రంధ్రాన్వేషణము సేయుచుండి వాఁడు చపలము నొందునప్పుడు ఇది సమయమని తటాలున హంసలు ఎగిరి దాఁటరాని క్రౌంచపర్వతమును దానియందు కుమారస్వామిశక్తిచేఁ గావించినరంధ్రమూలమున దూఱి దాఁటిపోవునట్లు వానిం బరాజితుని జేయుదురు. ౩౩

నీ వెంతమాత్రంబు నాలోచింపక మిక్కిలియు నపాయకరంబగు

దిష్ట్యా త్వాం నావధీ ద్రామో విషమిశ్రమి వాఽఽమిషమ్. ౩౪

తస్మా త్త్వయా సమారబ్ధం కర్మ హ్యప్రతిమం పరైః,
అహం సమీకరిష్యామి హత్వా శత్రూం స్త వానఘ!. ౩౫

అహ ముత్సాదయిష్యామి శత్రూం స్తవ విశాంపతే!,

యది శక్రవివస్వన్తౌ యది పావకమారుతౌ. ౩౬
తావహం యోధయిష్యామి కుబేరవరుణా వపి,
గిరిమాత్రశరీరస్య మహాపరిఘయోధినః. ౩౭
నర్దత స్తీక్ష్ణదంష్ట్రస్య బిభీయా ద్వై పురన్దరః,

పున స్త్వాం స ద్వితీయేన శరేణ నిహనిష్యతి. ౩౮
తతోఽహం తస్య పాస్యామి రుధిరం కామ మాశ్వస,

వధేన వై దాశరథే స్సుఖావహం
జయం తవాఽఽహర్తు మహం యతిష్యే,
హత్వా చ రామం సహ లక్ష్మణేన
ఖాదామి సర్వా న్హరియూథముఖ్యాన్. ౩౯
రమస్వ కామం పిబ చాగ్ర్యవారుణీం
కురుష్వ కార్యాణి హితాని విజ్వరః,
మయా తు రామే గమితే యమక్షయం
చిరాయ సీతా వశగా భవిష్యతి." ౪౦
ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే ద్వాదశస్సర్గః. ౧౨.

నీ సీతాహరణకార్యంబు గావించివావు; మాభాగ్యవశంబున విషమిశ్రంబగు మాంసమువలె నెవ్వరికిని దెలియనట్లు రాముఁడిదివఱకు నిన్నుఁ జంపకున్నాఁడు.

పాపరహితుఁడవగు రావణుఁడా! అట్లగుటం జేసి నీవు కోరిచేసినట్టి యదనృతంబును నేనుదక్క మఱియెవ్వరికిని అసాధ్యంబునగు నీ కార్యంబును నేను నీశత్రువులం జంపి నీకు సాధించి యిచ్చెదను. ౩౫

రాక్షసరాజుఁడవగు రావణుఁడా! నేను నీశత్రువుల నందఱిం జంపెదను.

వారలు ఇంద్రసూర్యులయినను అగ్నివాయువులయినను కుబేరవరుణు లయినను వారలతో నేను యుద్ధముచేసెదను. ౩౬

నేను పర్వతం బంతటిదేహంబుతో గొప్పయినుపగుదియం దాల్చి భయంకరంబులగు కోఱలతో సింహనాదంబులు సేయుచు యుద్ధంబునకుఁ బోఁగా దేవేంద్రుఁడు గూడ భయపడి పాఱిపోవును. ౩౭

ఆరాముఁడు నాపై నొకబాణమువేసి రెండవబాణంబు వేయునంత లోపలనే నేను ఆరాముని రక్తంబుఁ ద్రావెదను; నీ వూఱడిల్లి స్వస్థంబుగా నుండుము. ౩౮

నేను రాముంజంపి నీకు సుఖకరంబగు జయంబుగల్గునట్లు ప్రయత్నంబుఁ జేసెదను; అట్లు రామలక్ష్మణులం జంపి వానరశ్రేష్ఠులనందఱను భక్షించెదను. ౩౯

నీవు యథేచ్ఛగాఁ గ్రీడింపుము. మంచిమద్యంబును ద్రాఁగుము. నీకిష్టములయిన కార్యంబులం జేసికొనుచుండుము. నేను బోయి రాముం జంపెదను. అంత సీత బహుకాలము నీయధీనయయి యుండఁగలదు. అని కుంభకర్ణుఁడు రావణునితోఁ జెప్పెను. ౪౦

ఇది పండ్రెండవసర్గము.

---

## త్రయోదశస్సర్గః.

రావణం క్రుద్ధ మాజ్ఞాయ మహాపార్శ్వో మహాబలః,
ముహూర్త మనుసఞ్చిన్త్య ప్రాఞ్జలి ర్వాక్య మబ్రవీత్. ౧

యః ఖల్వపి వనం ప్రాప్య మృగవ్యాళ సమాకులమ్,
నపిబే న్మధు సమ్ప్రాప్తం స నరో బాలిశో భవేత్. ౨

ఈశ్వరస్యేశ్వరః కోఽస్తి తవ శత్రునిబర్హణ!,
రమస్వ సహ వైదేహ్యా శత్రూనాక్రమ్య మూర్ధసు. ౩
బలాత్కుక్కుటవృత్తేన వర్తస్వ సుమహాబల!,
ఆక్రమ్యాఽక్రమ్య సీతాం వై తాం భుఙ్క్ష్వ చ రమస్వ చ. ౪

లబ్ధకామస్య తే పశ్చాదాగమిష్యతి యద్భయమ్,
ప్రాప్త మప్రాప్తకాలం వా సర్వం ప్రతిసహిష్యసి. ౫

కుమ్భకర్ణస్సహాస్మాభి రిన్ద్రజిచ్చ మహాబలః,
ప్రతిషేధయితుం శక్తా స్సవజ్ర మపి వజ్రిణమ్. ౬
ఉపప్రదానం సాన్త్వం వా భేదం వా కుశలైః కృతమ్,
సమతిక్రమ్య దణ్డేన సిద్ధి మర్థేషు రోచయ. ౭

ఇహ ప్రాప్తా న్వయం సర్వాన్ శత్రూం స్తవ మహాబల!,
వశే శస్త్రప్రతాపేన కరిష్యామో న సంశయః. ౮

ఏవ ముక్త స్తదా రాజా మహాపార్శ్వేన రావణః,

## పదుమూడవసర్గము.

మహాబలశాలియగు మహాపార్శ్వుఁడు రావణుఁడు కుంభకర్ణుని మాటలకుఁ గోపంబునొందినాఁడని తెలిసికొని కొంచెముసేపు అతనిఁ బ్రసన్నుం జేయ నుపాయం బాలోచించి చేతులు మొగుడ్చుకొని యిట్లని చెప్పెను. ౧

ఎవ్వఁడు తేనియత్రాఁగవలెనని మృగంబులతోను సర్పంబులతోను నిండియుండు నడవికింబోయి యచ్చట నెట్టకేలకుఁ దేనియసంపాదించి దానిం ద్రాఁగకుండునో అతఁడు మూఢుఁడు; అట్లు నీవు సీతాసమాగమంబుఁ గోరి యతిప్రయాసంబుల సీతం దీసికొనివచ్చియు నూరకుండఁదగదు. ౨

శత్రువులం జంపునట్టి రావణుఁడా! నీవే యీశ్వరుఁడవే; నిన్నదుగు వాఁ డెవ్వఁడు? శత్రువుల తలలు ద్రొక్కి సీతంగూడి క్రీడింపుము. ౩

మహాబలుఁడవగు రావణుఁడా! సీత యొప్పకున్నను కుక్కుటంబు పగిది బలాత్కారంబున సీతనాక్రమించి పలుమాఱుక్రీడించి సంతోషంబు నొందుము. ౪

ఇట్లు నీవు కోర్కె నెరవేర్చుకొన్నపిమ్మట నీ కేదైనభయము సంభవించునేని యదివచ్చిన రానిమ్ము. లేక రాఁబోవునది గానున్న నుండనిమ్ము. నీకేదియుం లక్ష్యములేదు. ౫

కుంభకర్ణుఁడును మహాబలుఁడగు నింద్రజిత్తును వీర లిరువురే మమ్ముం గూడి వజ్రాయుధంబుధరించి దేవేంద్రుండువచ్చినను బ్రహరింపఁజాలుదురు.

యుద్ధంబు సేయఁ జేతఁగానివార లేర్పఱచిన దానంబునుగాని సామమునుగాని భేదంబునుగాని యీమూఁడుపాయంబులను విడిచి దండోపాయంబుననే కార్యసిద్ధినొందుము. ౭

మహాబలుఁడవగు రావణుఁడా! మేము నీశత్రువులు ఇచ్చటికి రాఁగానే వారలనందఱను శస్త్రబలంబున నీకు వశీకృతులం గావించెదము; సందేహము లేదు. అని మహాపార్శ్వుఁడు రావణునితోఁ జెప్పెను. ౮

రాక్షసరాజుఁడగు రావణుఁడు అప్పుడు మహాపార్శ్వుఁడు చెప్పిన

తస్య సమ్పూజయ న్వాక్య మిదం వచన మబ్రవీత్. ౯
మహాపార్శ్వ! నిబోధ త్వం రహస్యం కించి దాత్మనః,
చిరవృత్తం తవాఖ్యాస్యే యదవాప్తం మయా పురా. ౧౦

పితామహస్య భవనం గచ్ఛన్తీం పుఞ్జికస్థలామ్,
చఞ్చూర్యమాణా మద్రాక్షు మాకాశేఽగ్నిశిఖా మివ. ౧౧

సా ప్రసహ్య మయా భుక్తా కృతా వివసనా తతః,
స్వయమ్భూభవనం ప్రాప్తా లోళితా నళినీ యథా. ౧౨

తస్య తచ్చ తదా మన్యే జ్ఞాత మాసీ న్మహాత్మనః,
అథ సఙ్కుపితో దేవో మా మిదం వాక్య మబ్రవీత్. ౧౩

అద్యప్రభృతి యా మన్యాం బలా న్నారీం గమిష్యసి,
తదా తే శతధా మూర్ధా ఫలిష్యతి న సంశయః. ౧౪

ఇత్యహం తస్య శాపస్య భీతః ప్రసభమేవ తామ్,
నారోపయే బలా త్సీతాం వైదేహీం శయనే శుభే. ౧౫
సాగరస్యేవ మే వేగో మారుత స్యేవ మే గతిః,
నైత ద్దాశరథి ర్వేద హ్యాసాదయతి తేన మామ్. ౧౬
యస్తు సింహ మివాసీనం సుప్తం గిరిగుహాశయే,
క్రుద్ధం మృత్యు మివాఽసీనం ప్రబోధయితు మిచ్ఛతి. ౧౭

న మత్తో నిశితా న్బాణాన్ ద్విజిహ్వా నివ పన్నగాన్,

మాటనువిని సంతోషించి యతనిం బొగడుచు నీమాటం జెప్పెను. ౯

మహాపార్శ్వుఁడా! నాయం దొక్క రహస్యం బున్నది నీవెఱింగి యుండుము; మున్ను నేనొకటి చేసియున్నాను; బహుకాలమయినది; చెప్పెదను వినుము. ౧౦

నే నొకప్పుడు నాభియంబున దాఁగిదాఁగి బ్రహ్మదేవునింటికిఁ బోవుచు నాకాశంబున నగ్నిజ్వాలవలె వెలుఁగుచున్న పుంజికస్థలయను నప్సరసమిన్నం గంటిని. ౧౧

అంత నే నాపుంజికస్థలను బలాత్కారంబున దిగంబరఁగాఁజేసి భోగించితిని. అంత నది వాడినతామరతూఁడువలె దీనయయి బ్రహ్మదేవునొద్దకుఁ బోయినది. ౧౨

మహాత్ముఁడగు నాబ్రహ్మదేవునకు ఆసంగతి తెలిసినట్లు తోఁచుచున్నది.

అంత బ్రహ్మదేవుఁడు మహాకోపంబునొంది నన్నుఁగూర్చి యీమాటం జెప్పెను. ౧౩

ఇదిమొదలు నీ విట్టు పరస్త్రీని బలాత్కారంబునం బొందుదువేని యప్పుడె నీతల నూఱువ్రయ్యలయి పగులంగలదు; సందేహంబులేదు. అని బ్రహ్మదేవుండు చెప్పెను. ౧౪

నేను బహుకష్టంబున నాశాపంబునకు భయపడియే సీతను బలాత్కారంబునం బొందకున్నాను. ౧౫

సముద్రంబునకుంబోలె వేగంబును వాయువునకుంబోలె గమనంబును నాకున్నదని రాముఁడు తెలియఁడు; కావున నే నాపైకి వచ్చుచున్నాఁడు. ౧౬

ఆరాముఁడు పర్వతగుహాయందు నిదురించుచున్న సింహంబును నిద్ర లేపునట్లు, నిద్రపోయియున్న మృత్యువును మేలుకొల్పునట్లు ఊరకున్న యతికోపనుఁడగు నన్ను కావలెనని పురికొల్పుచున్నాఁడే అతఁ డెట్టివాఁడు? విమియఁ దెల్విలేనివాఁడు. ౧౭

ఇదివఱ కెన్నఁడును రాముఁడు యుద్ధంబున సర్పంబులుంబోలెఁ దీక్ష్ణం

రామగ పశ్యతి సఙ్గ్రామే తేన మా మభిగచ్ఛతి. ౧౮

క్షిప్రం వజ్రోపమై ర్బాణై శ్శతధా కార్ముకచ్యుతైః,
రామ మాదీపయిష్యామి ఉల్కాభి రివ కుఞ్జరమ్. ౧౯
తచ్చాస్య బల మాదాస్యే బలేన మహతా వృతః,
ఉదయన్ సవితా కాలే నక్షత్రాణా మివ ప్రభామ్. ౨౦

న వాసవేనాపి సహస్రచక్షుషా
యుథాఽస్మి శక్యో వరుణేన వా పునః,
మయా త్వియం బాహుబలేన నిర్జితా
పురీ పురా వైశ్రవణేన పాలితా. ౨౧

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే త్రయోదశ స్సర్గః ౧౩.

## చతుర్దశస్సర్గః.

నిశాచరేన్ద్రస్య నిశమ్య వాక్యం
స కుమ్భకర్ణస్య చ గర్జితాని,
విభీషణో రాక్షసరాజముఖ్య
మువాచ వాక్యం హిత మర్థయుక్తమ్. ౧
“వృతో హి బాహ్వన్తరభోగరాశి
శ్చిన్తావిష స్స్మితతీక్ష్ణదంష్ట్రః,
పఞ్చాఙ్గులీ పఞ్చశిరోఽతికాయ
స్సీతామహాహి స్తవ కేన రాజన్!. ౨
యావన్న లఙ్కాం సమభిద్రవన్తి
వలీముఖాః పర్వతకూటమాత్రాః,

ఖులయిన నాబాణంబులంగని యెఱుంగఁడు కావుననే యిప్పుడు నామీఁదికి వచ్చుచున్నాఁడు. ౧౮

ఇంక శీఘ్రంబుగానే యేనుఁగులపైఁ గొఱివికట్టెలు వేయఁనట్లు రామునిపై వజ్రంబువంటి పెక్కుబాణంబులం బ్రయోగించెదను. ౧౯

మఱియుఁ బ్రాతఃకాలంబున నుదితుండగు సూర్యుఁడు, నక్షత్రముల కాంతిఁ బోఁగొట్టునట్లు నేను గొప్పసైన్యంబుంగూడి రాముని యావానర సైన్యంబును గూడఁ జక్కాడెదను. ౨౦

వేయికండ్లుగల దేవేంద్రుఁడుగాని వరుణుఁడుగాని యుద్ధంబున నా యెదుట నిలువలేరైరి. మఱియు నేను గుబేరునింగూడ జయించి యతనిచేఁ బాలితంబగు నీలంకాపురిం గొంటిని. ఇంక మనుష్యుఁడగు రాముఁడు నాకెంత మాత్రము? అని రావణుఁడు మహాపార్శ్వునితోఁ జెప్పెను. ౨౧

ఇది పదుమూఁడవసర్గము.

---

## పదునాలుగవసర్గము.

అంత విభీషణుఁడు రాక్షసేశ్వరుఁడగు రావణునిమాటను గుంభకర్ణుని గర్జనలను విని రావణుంజూచి హితంబును బరమార్థసంయుతంబునగు నీమాటం జెప్పెను. ౧

రాక్షసరాజుఁడవగు రావణుఁడా! వక్షస్స్థలమను పడగగలదియుఁ జింత యను విషంబుగలదియుఁ జిఱునగవనుకఱకు కోఱలుగలదియు దుఃఖవశంబునఁ దలగడగాఁ జేయఁబడిన హస్తంబునందలి యయిదువ్రేళ్లను అయిదుతలలు గలిగినదియునగు సీత యను గొప్పసర్పము నేల కోరితివి? ౨

దంతములు నఖంబులునే యాయుధంబులు గాఁగల పర్వతశిఖరాకారులగు వానరులు లంకకు రాకమున్నె సీతాదేవిని రామున కొసంగుము. 3

దంష్ట్రాయుధా శ్చైవ నఖాయుధా శ్చ
ప్రదీయతాం దాశరథాయ మైథిలీ. ౩
యావ న్న గృహ్ణన్తి శిరాంసి బాణా
రామేరితా రాక్షసపుఙ్గవానామ్,
వజ్రోపమా వాయుసమానవేగాః
ప్రదీయతాం దాశరథాయ మైథిలీ. ౪
భిత్త్వా న తావత్ప్రవిశ న్తి కాయం
ప్రాణా న్తకా స్తేఽశనితుల్యవేగాః,
శితా శ్శరా రాఘవవిప్రయుక్తాః
ప్రహ స్త! తేనైవ వికత్థసే త్వమ్. ౫
న కుమ్భకర్ణేన్ద్రజితౌ న రాజా
తథా మహాపార్శ్వమహోదరౌ వా,
నికుమ్భకుమ్భౌ చ తథాఽతికాయః
స్థాతుం న శక్తా యుధి రాఘవస్య. ౬
జీవం స్తు రామస్య న మోక్ష్యసే త్వం
గుప్త స్సవిత్రా ప్యథవా మరుద్భిః,
న వాసవస్యాఙ్కగతో న మృత్యో
ర్నభో నపాతాళ మనుప్రవిష్టః. ౭
నిశమ్య వాక్యం తు విభీషణస్య
తతః ప్రహస్తో వచనం బభాషే,
న నో భయం విద్మ న దైవతేభ్యో
న దానవేభ్యో హ్యథవా కుతశ్చిత్. ౮
న యక్షగన్ధర్వమహోరగేభ్యో
భయం న సఙ్ఖ్యే పతగోత్తమేభ్యః,

రాముఁడు వజ్రసమానంబులును వాయువునకుంబోలె వేగంబుగలదియు నగు బాణంబులు ప్రయోగించి రాక్షసోత్తముల శిరస్సులం ద్రుంచుటకు మున్నే సీతాదేవిని రామున కొసంగుము. ౪

ప్రహస్తుఁడా! ప్రాణహరంబులును పిడుగువంటి వేగంబుగలవియును తీక్ష్ణంబులునగు రామునిబాణంబులు ఇంకను నీదేహంబు భేదింపకున్నవి; కావుననే నీ విట్లాత్మస్తుతి చేసికొనుచున్నావు. ౫

కుంభకర్ణుండుగాని యింద్రజిత్తుగాని రాక్షసరాజుఁడగు రావణుఁడు గాని మహాపార్శ్వమహోదరులుగాని నికుంభుండుఁ గుంభుండుఁగాని యతికాయుండునుగాని యెవ్వరును యుద్ధంబున రాముని నెదుట నిలువకజాలరు. ౬

నీకు సూర్యుఁడు తోడువచ్చినను దేవతలందఱుఁ దోడ్పడినను నీవు దేవేంద్రుని తొడపైఁ గూర్చుండినను మృత్యువుతొడపైఁ గూర్చుండినను ఆకాశంబుఁ బ్రవేశించినను పాతాళంబుఁ జొచ్చినను రాముఁడు నిన్నుఁ బ్రాణంబుతో విడువఁడు; అవశ్యము చంపును. అని విభీషణుఁడు చెప్పెను. ౭

ప్రహస్తుఁడు విభీషణుఁడు చెప్పినమాటవిని యంత నీమాటం జెప్పెను.

దేవతలవలనఁగాని దానవులవలనఁగాని యెవ్వరివలననుగాని మాకు భయంబు లేదు. ౮

యక్షులవలనఁగాని గంధర్వులవలనఁగాని యురగంబులవలనఁగాని పక్షిసంఘంబులవలనఁగాని మాకు యుద్ధంబున నెంతమాత్రము భయంబు లేదు;

కథం ను రామా ద్భవితా భయం నో
నరేన్ద్రపుత్త్రా త్సమరే కదాచిత్. ౯
ప్రహస్తవాక్యం త్వహితం నిశమ్య
విభీషణో రాజహితానుకాఙ్క్షీ,
తతో మహాత్మా వచనం బభాషే
ధర్మార్థకామేషు నివిష్టబుద్ధిః. ౧౦
“ప్రహస్త! రాజా చ మహోదరశ్చ
త్వం కుమ్భకర్ణశ్చ యథాఽర్థజాతమ్,
బ్రవీథ రామం ప్రతి తన్న శక్యం
యథాగతిస్స్వర్గ మధర్మబుద్ధేః. ౧౧
వధస్తు రామస్య మయా త్వయా వా
ప్రహస్త! సర్వై రపి రాక్షసై ర్వా,
కథం భవే దర్థవిశారదస్య ౧౨
మహార్ణవం తర్తు మి వాప్లవస్య.
ధర్మప్రధానస్య మహారథస్య
ఇక్ష్వాకువంశప్రభవస్య రాజ్ఞః,
ప్రహస్త! దేవాశ్చ తథావిధస్య
కృత్యేషు శక్తస్య భవన్తి మూఢాః. ౧౩

తీక్ష్ణానతా యత్తవ కఙ్కపత్త్రా
దురాసదా రాఘవవిప్రముక్తాః,
భిత్త్వా శరీరం ప్రవిశన్తి బాణాః
ప్రహస్త! తేనైవ వికత్థసే త్వమ్. ౧౪

ఇంక మనుష్యుండగు రాచపిల్లకాయ రామునివలన మా కేమిభయము? అని ప్రహస్తుఁడు విభీషణునితోఁ జెప్పెను. ౯

మహాత్ముఁడును రావణుని మేలుకోరువాఁడునగు విభీషణుఁడు రాజునకుఁ గీడుగలిగించునట్టి ప్రహస్తునిమాటను విని ధర్మార్థకామంబుల మూఁడిం టినిం జక్కఁగా నాలోచించి యీమాటం జెప్పెను. ౧౦

ప్రహస్తుఁడా! నీవును రావణుఁడును మహోదరుఁడును గుంభకర్ణుఁడును జెప్పుకార్యము అధర్మిష్ఠునకు స్వర్గగమనంబు సిద్ధింపనట్లు రామునివిషయమయి యెంతమాత్రము సఫలము కానేరదు. ౧౧

ప్రహస్తుఁడా! తెప్పకొయ్యయయినను లేనివానికి మహాసముద్రంబు దాఁట నలవిగానట్లు నాకుఁగాని నీకుఁగాని రాక్షసులయందఱకుంగాని కార్యదక్షుండగు రాముని వధింప నలవిగాదు. ౧౨

ప్రహస్తుఁడా! పరమధార్మికుఁడును దన్నును సారథిని గుఱ్ఱంబులనుం గాపాడుకొనుచుఁ బదునొక్కండు వేలమంది విలుకాండ్రతోఁ బోరంజాలినవాఁడును ఖరాక్రమనిధానంబగు నిక్ష్వాకువంశంబునం బుట్టినవాఁడును అట్లు విరాధుఁడుఁ గబంధుఁడు వాలియుం మొదలగు ననేకమహావీరులను వధించినట్టి మహాపరాక్రమశాలియుఁను మహాసమర్థుఁడునుజనరంజనంబు సేయువాఁడునగు రాముని యెదుట యుద్ధంబున దేవతలుంగూడ మోహితులగుదురు; ఇంక మన మెంతమాత్రము వారలము? ౧౩

ప్రహస్తుఁడా! తీక్ష్ణంబులును గంకపక్షిఱెక్కలు గట్టినవియుఁ మహావేగంబులగుటచే దురాసదంబులునగు రామునిచేఁ బ్రయోగింపఁబడిన బాణంబులు నీదేహంబును భేదించి ప్రవేశింపఁగలవు; కావుననే నీ విట్లాత్మస్తుతి చేసికొనుచున్నావు. ౧౪

న రావణో నాతిబల స్త్రిశీర్షో
న కుమ్భకర్ణోఽస్య సుతో నికుమ్భః,
న చేన్ద్రజి ద్దాశరథిం ప్రసోఢుం
త్వం వా రణే శక్రసమం సమర్థః. ౧౫
దేవాన్తకో వాపి నరాన్తకో వా
తథాతికాయోఽతిరథో మహాత్మా,
అకమ్పన శ్చాద్రిసమానసారః
స్థాతుం న శక్తా యుధి రాఘవస్య. ౧౬
అయం హి రాజా వ్యసనాభిభూతో
మిత్రై రమిత్ర ప్రతిమై ర్భవద్భిః,
అన్వాస్యతే రాక్షసనాశనార్థం
తీక్ష్ణః ప్రకృత్యా హ్యసమీక్ష్యకారీ. ౧౭

అనన్తభోగేన సహస్రమూర్ధ్నా
నాగేన భీమేన మహాబలేన,
బలా త్పరిక్షిప్త మిమం భవన్తో
రాజాన ముత్క్షిప్య విమోచయన్తు. ౧౮

యావద్ధి కేశగ్రహణం సుహృద్భి
స్సమేత్య సర్వైః పరిపూర్ణకామైః,
నిగృహ్య రాజా పరిరక్షితవ్యో
భూతై ర్యథా భీమబలై ర్గృహీతః. ౧౯
సంహారిణా రాఘవసాగరేణ
ప్రచ్ఛాద్యమాన స్తరసా భవద్భిః,

రావణుఁడుగాని మహాబలుఁడగు త్రిశీర్షుఁడుగాని కుంభకర్ణుఁడుగాని యతనికొడుకు నికుంభుఁడుగాని యింద్రజిత్తుగాని నీవుగాని మీర లెవ్వరును శక్రసమానుఁడగు రాముని యుద్ధంబున నెదిరింప సమర్థులరుకారు. ౧౫

దేవాంతకుఁడుగాని నరాంతకుఁడుగాని పెక్కువిలుకాండ్రతో నేక కాలంబునఁ బోరంజాలినవాఁడును మహాబలుఁడునగు నతికాయుఁడునుగాని పర్వతసమానబలుఁడగు నకంపనుఁడునుగాని యుద్ధంబున రాము నెదుట నిలువంజాలరు. ౧౬

ఆలోచింపక చేయువాఁడును దీక్ష్ణస్వభావుఁడునగు నీరావణుఁడు "వాక్పారుష్యము, దండపారుష్యము, అర్థదూషణము, పానము; స్త్రీ; వేఁట, జూదము" అను నీసప్తవ్యసనంబులకులోఁబడి మంచిచెడులు దెలియక రాక్షసులకందఱకు నాశంబుగల్గించునట్టికార్యంబు సేయందలంపఁగామీరందఱు స్నేహితులని పేరుపెట్టుకొని శత్రువులకగిది నతనియెదుట నిచ్చకము లాడుచున్నారలు. ౧౭

రాక్షసరాజుఁడగు రావణునిఁ దుదిలేనిదేహంబుగలదియు వేయితలలు గలదియు భయంకరంబును మహాబలంబునగు రామవైరంబను మహాసర్పంబు చుట్టుకొనియున్నది; మీరలు సర్పంబుఁ బాఱఁద్రోలియితనివిడిపింపుఁడు. ౧౮

రాజు దుర్మార్గంబు నొందునేని రాజుచే సమస్తలాభంబులబొంది పూర్ణకాములయినమిత్రులు అందఱు నైకమత్యంబునొంది యతని మహాబలంబులగు భూతంబులచే నావిష్టుండగు పురుషుంబోలెతలవెండ్రుకలఁబట్టియీడ్చి యయినను నిగ్రహించి మంచిమార్గంబునకుఁ దేవలయును. ౧౯

మీకు సమస్తసుఖంబులుఁ గలిగించునట్టి యీరావణుఁ డిప్పుడు వినాశంబునొందుటకై లక్ష్మణుఁడను సముద్రంబున మునిఁగి రాముఁడను బడబా

యుక్త స్స్వయం తారయితుం సమేత్య
కాకుత్స్థపాతాళముఖే పతన్ సః. ౨౦
ఇదం పుర స్యాస్య సరాక్షసస్య
రాజ్ఞశ్చ పథ్యం ససుహృజ్జనస్య,
సమ్యగ్ఘి వాక్యం స్వమతం బ్రవీమి
నరేన్ద్రపుత్త్రాయ దదామ పత్నీమ్. ౨౧
పరస్య వీర్యం స్వబలంచ బుద్ధ్వా
స్థానం క్షయం చైవ తథైవ వృద్ధిమ్,
తథా స్వపక్షే ప్యనుమృశ్య బుద్ధ్యా
వదే క్షమం స్వామిహితం చ మన్త్రీ.

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే చతుర్దశస్సర్గః. ౧౪.

---

## పఞ్చదశస్సర్గః.

బృహస్పతే స్తుల్యమతే ర్వచ స్త
న్నిశమ్య యత్నేన విభీషణస్య,
తతో మహాత్మా వచనం బభాషే
తత్రేన్ద్రజి న్నైరృతయోధముఖ్యః. ౧
"కిం నామ తే తాత! కనిష్ఠవాక్య
మనర్థకం చైవ సుభీతవచ్చ,
అస్మి న్కులే యోఽపి భవే న్న జాత
స్సోఽపీదృశం నైవ వదే న్న కుర్యాత్. ౨
సత్త్వేన వీర్యేణ పరాక్రమేణ
శౌర్యేణ ధైర్యేణ చ తేజసాచ,
ఏకః కులేఽస్మి న్పురుషో విముక్తో
విభీషణ స్తాత! కనిష్ఠ ఏషః. 3

నలాగ్నిముఖంబునం బడనున్నాఁడు కావున మీరలందఱు నైకమత్యంబున నితనిం దరింపఁజేయవలయును. ౨౦

నేను జెప్పినది యీ లంకాపురమునకును రాజునకును మీకందఱకును హితంబు; నామతంబుఁ జెప్పెదను జక్కఁగా వినుఁడు; రాజపుత్రుఁడను రాము నకు ఆతనిభార్యయగు సీతాదేవి నొసంగెదము. ౨౧

మంత్రియగువాఁడు శత్రుబలంబును తనరాజుబలంబును తెలిసికొని శత్రువునకుం గలిగినసామ్యంబును వృద్ధిక్షయంబులను ఎఱింగి యట్లు తన రాజు వృద్ధిక్షయంబులను విమర్శించి యుక్తంబుగాను రాజునకు మేలుగల్గు నట్లుగాను జెప్పవలయును. అని విభీషణుండు చెప్పెను. ౨౨

ఇది పదునాలుగవసర్గము.

## పదునైదవసర్గము.

అంత నచ్చట రాక్షసశ్రేష్ఠుఁడును మహాబలుండునగు నింద్రజిత్తు బృహస్పతివలె మహాబుద్ధిశాలియగు విభీషణుఁడు చెప్పినమాటను విని తాను నీమాటం జెప్పెను. ౧

చిన్నాయనా! నీవు మహాభయంబునొంది యిట్టినిష్ప్రయోజనంబగు మాటం జెప్పితివే! ఇది యెట్టిమాట? ఈపులస్త్యవంశంబునం బుట్టినవాఁడు గూడ నిట్టి నీచఁపుమాటం జెప్పఁడు; చేయనుం జేయఁడు; నీవు చెప్ప వచ్చునా? ౨

ఈవంశమునందు మాచిన్నాయనయగు నొక్కవిభీషణుఁడు మాత్రమే బలంబును బ్రభావంబును బరాక్రమంబును శౌర్యంబును ధైర్యమును దేజం బును లేనివాఁడై పిఱికియయినాఁడు. ३

కింనామ తౌ రాక్షసరాజపుత్త్రా
వస్మాకమేకేన హి రాక్షసేన,
సుప్రాకృతేనాపి రణే నిహన్తుం
శక్యౌ కుతో భీషయసే స్మ భీరో!. ౪
త్రిలోకనాథో నను దేవరాజ
శ్శక్రో మయా భూమితలే నివిష్టః,
భయార్దితాశ్చాపి దిశః ప్రపన్నా
స్సర్వే తథా దేవగణా స్సమగ్రాః. ౫
ఐరావతో విస్వర మున్నదన్ స
నిపాతితో భూమితలే మయా తు,
వికృష్య దన్తౌ తు మయా ప్రసహ్య
విత్రాసితా దేవగణా స్సమగ్రాః. ౬
సోఽహం సురాణా మపి దర్పహన్తా
దైత్యోత్తమానా మపి శోకదాతా,
కథం నరేన్ద్రాత్మజయో ర్న శక్తో
మనుష్యయోః ప్రాకృతయో స్సువీర్యః. ౭
అథేన్ద్రకల్పస్య దురాసదస్య
మహౌజస స్తద్వచనం నిశమ్య,
తతో మహార్థం వచనం బభాషే
విభీషణ శ్శస్త్రభృతాం వరిష్ఠః. ౮
న తాత! మన్త్రే తవ నిశ్చయోఽస్తి
బాల స్త్వ మద్యాప్యవిపక్వబుద్ధిః,
తస్మా త్త్వయా హ్యాత్మవినాశనాయ
వచోఽర్థహీనం బహు విప్రలప్తమ్. ౯

రాక్షసుఁడవగు విభీషణుఁడా! రాచకొమరులగు నా రామలక్ష్మణులను మాలో నొక్క నీచరాక్షసుఁడైనను యుద్ధంబునం జంపివేయును; పిఱికివాఁడా! నీవేల యూరక భయపడెదవు? ౪

ఓయి! ముల్లోకంబులకును నాథుఁడును దేవేంద్రుఁడునగు నింద్రుని నేను నేలంబడఁద్రోసితిని; మఱియు దేవతలనందఱ గుంపులుగుంపులుగా భయంబున దిక్కులకుం బాఱునట్లు గావించినాను. ౫

నేను మహాధ్వనితో నఱచుచువచ్చిన యైరావతంబుఁబట్టి నేలం బడఁద్రోసినాను; మఱియు నాయైరావతముదంతంబులఁ బలాత్కారంబుగాఁ బెఱికి వానిచే దేవతల నందఱను భయపఱిచి పాఱఁదోలినాను. ౬

నావలన దేవేంద్రుఁడు మొదలగు సమస్తదేవతలును గర్వంబువీడిరి; నావలన అసురోత్తములుకూడ దుఃఖంబునొందుదురు; అట్టిపరాక్రమశాలినగు నేను మనుష్యులు నీచులునగు నీరాచపిల్లకాయల జయింప సమర్థుఁడఁగానా? ఇదియేమిమాట? అని యింద్రజిత్తు చెప్పెను. ౭

అంత నాయుధధారులలో నుత్తముఁడగు విభీషణుఁడు దేవేంద్రతుల్యుండును జెనకరాని మహాపరాక్రమంబు గలవాఁడునగు నయ్యింద్రజిత్తు వచనంబువిని పరమార్థయుక్తంబగు నీమాటం జెప్పెను. ౮

నాయనా! నీకు మంత్రము సేయుటయందు శక్తిలేదు. నీవు పిన్నవాఁడవు. ఇంకను నీబుద్ధి పరిపక్వముకాలేదు. కావుననే నీకేవినాశంబుగలుగునట్లు నిరర్థకంబులగు నీమాటల నెచ్చుగాఁ బ్రేలినావు. ౯

పుత్త్రప్రవాదేన తు రావణస్య
త్వ మిన్ద్రజి! న్మిత్త్రముఖోఽసి శత్త్రుః,
య స్యేదృశం రాఘవతో వినాశం
నిశమ్య మోహా దనుమన్యసే త్వమ్. ౧౦
త్వ మేవ వధ్యశ్చ సుదుర్మతిశ్చ
సచాపి వధ్యో య ఇహాఽనయత్త్వామ్,
బాలం దృఢం సాహసకం చ యోఽద్య
ప్రావేశయ న్మన్త్రకృతాం సమీపమ్. ౧౧
మూఢః ప్రగల్భో ఽవినయోపపన్న
స్తీక్ష్ణస్వభావోఽల్పమతి ర్దురాత్మా,
మూర్ఖ స్త్వ మత్యర్థసుదుర్మతి శ్చ
త్వ మిన్ద్రజి! ద్బాలతయా బ్రవీషి. ౧౨
కో బ్రహ్మదణ్డప్రతిమప్రకాశా
నర్చిష్మతః కాలనికాశరూపాన్,
సహేత బాణాన్యమదణ్డకల్పాన్
సమక్షముక్తా న్యుధి రాఘవేణ. ౧౩
ధనాని రత్నాని విభూషణాని
వాసాంసి దివ్యాని మణీంశ్చ చిత్రాన్,
సీతాంచ రామాయ నివేద్య దేవీం
వసేమ రాజ! న్నిహ వీతశోకాః. ౧౪

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే పఞ్చదశ స్సర్గః. ౧౫.

## షోడశ స్సర్గః.

సునివిష్టం హితం వాక్య ముక్తవన్తం విభీషణమ్,
అబ్రవీ త్పరుషం వాక్యం రావణః కాలచోదితః. ౧

ఇంద్రజిత్తా! ఈరావణునకు రామునివలనఁ బుత్రమిత్రకళత్రాదిసహితంబుగా వినాశంబుగల్గుటనువినియుఁ నీవజ్ఞానంబున నందుకుసమ్మతించుచున్నావు; కావున నీవు రావణునకుఁ బుత్రుఁడను పేరుపెట్టుకొని మిత్రుఁడువలె నభినయించు శత్రుఁడవైతివి. ౧౦

ఇట్లు పితృవినాశంబున కిష్టపడియున్నావు. కావున నీవు వధ్యుండవు. దుర్బుద్ధివైతివి. మఱియుఁ బాలుఁడవు, బలవంతుఁడవు, సాహసంబుసేయుట యందే ప్రియంబుగలవాఁడవు నగునిన్ను ఇచ్చటికిఁ గొనివచ్చి యాలోచన సభం బ్రవేశింపఁజేసినట్టివాఁడును వధ్యుఁడు. ౧౧

ఇంద్రజిత్తా! నీవు తెలివిలేనివాఁడవు; గర్వితుఁడవు; శిక్షితుఁడవు కావు; క్రూరంబయిన స్వభావముగలవాఁడవు; నీచబుద్ధివి; దుష్టస్వభావుఁడవు; ఆలోచన తెలియనివాఁడవు; మిక్కిలియుఁ దుర్బుద్ధివి; నీవు పిన్నవాఁడవగుటచే నేమియుఁ దెలియక ప్రేలెదవు. ౧౨

బ్రహ్మదండమువంటివియు, జ్వాలలుగలవియు, మృత్యువుంబోలెఁ జూపట్టునవియు, యమదండసమానంబులునగు రామునిచేఁ బ్రయోగింపఁబడిన బాణంబుల యుద్ధంబున నెవ్వఁడు సహింపఁగలఁడు? ౧౩

రాక్షసరాజుఁడవగు రావణుఁడా! ధనంబులను అమూల్యపదార్థంబులను భూషణంబులను దివ్యవస్త్రంబులను నానావిధరత్నంబులను సీతాదేవితోఁ గూడ రామునకు సమర్పించి మన మిచ్చట నిర్భయులమై సుఖంబుగా నుండుదము అని విభీషణుఁడు చెప్పెను. ౧౪

ఇది పదునైదవసర్గము.

## పదునాఱవసర్గము.

అట్లు చక్కఁగా మనస్సునకు వచ్చునట్లు హితవాక్యంబులు చెప్పినట్టి విభీషణునింజూచి రావణుఁడు అట్టిహితంబుఁ జెప్పినందుకు మిక్కిలియుఁ

వసే త్సహ సపత్నేన క్రుద్ధేనాఽశీవిషేణవా,
న తు మిత్రప్రవాదేన సంవసే చ్ఛత్రుసేవినా. ౨

జానామి శీలం జ్ఞాతీనాం సర్వలోకేషు రాక్షస!,
హృష్యన్తి వ్యసనేష్వేతే జ్ఞాతీనాం జ్ఞాతయ స్సదా. 3

ప్రధానం సాధనం వైద్యం ధర్మశీలంచ రాక్షస!,
జ్ఞాతయో హ్యవమన్యన్తే శూరం పరిభవన్తిచ. ౪
నిత్య మన్యోన్యసంహృష్టా వ్యసనే ష్వాతతాయినః,
ప్రచ్ఛన్నహృదయా ఘోరా జ్ఞాతయస్తు భయావహాః. ౫

శ్రూయన్తే హ స్తిభి ర్గీతా శ్శ్లోకాః పద్మవనే క్వచిత్,
పాశహస్తా న్నరా న్దృష్ట్వా శృణు తా న్గదతో మమ. ౬

నాగ్ని ర్నాన్యాని శస్త్రాణి న నః పాశా భయావహాః,
ఘోరా స్స్వార్థప్రయుక్తా స్తు జ్ఞాతయో నో భయావహాః. ౭

ఉపాయ మేతే వక్ష్యన్తి గ్రహణే నాత్ర సంశయః,

కృత్స్నా ద్భయా జ్జ్ఞాతిభయం సుకష్టం విదితం వచః ౮

గౌరవింపవలసినవాఁడయ్యు మృత్యుప్రేరితుఁడై పరుషవాక్యంబుల దూషింప సారంభించెను. ౧

సాక్షాచ్ఛత్రువుతోఁగాని కుపితంబగు సర్పముతోఁగాని సహవాసము సేయవచ్చును. స్నేహితవేషము ధరించియుండు శత్రుపక్షపాతితో మాత్రము నెప్పుడేని సహవాసము సేయరాదు. ౨

రాక్షసుఁడా! సమస్తజనులలోను ఈజ్ఞాతులస్వభావము నాకుఁ దెలియును ఈజ్ఞాతులు తమజ్ఞాతులకుఁ గష్టమువచ్చునప్పుడంతయు సంతోషంబు నొందుదురు. ౩

రాక్షసుఁడా! జ్ఞాతులు తమజాతిలోఁ బ్రధానుఁడగువానిని బండితుని ధార్మికుని శూరుని నవమానింతురు; మఱియుఁ దిరస్కరింతురు. ౪

జ్ఞాతులు ఇతరకాలములయందు ఒకరిపై నొకరు మహాస్నేహము గలిగియున్నట్లభినయించుచు మనస్సులో నొకటి బయటనొకటిగా మాటలాడుచు నెప్పుడును గీడేతలంపుచు సాపత్న్యమయంబుల ద్రోహంబు గావింతురు. కావున జ్ఞాతులవలన భయం బవశ్యము గల్గును. వారల నమ్మరాదు. ౫

పద్మవనంబను నొకయరణ్యంబునందు ఏనుఁగులు తమ్ముఁబట్టుటకై పాశంబులం గొనివచ్చిన పురుషుంజూచి కొన్నిశ్లోకంబులం జెప్పినవి. వానిం జెప్పెద వినుము. ౬

మనకు నిప్పువలన భయములేదు. ఇతరాయుధంబులవలనను భయంబు లేదు. ఈపాశంబువలనను మన కెంతమాత్రము భయంబులేదు. అయితే నిర్దయములును స్వకార్యపరములు నగునీపురుషులయొద్ద నుండునట్టి మనజాతి యేనుఁగులే మనకు భయంబు గలిగించునవి. ౭

ఈమనజ్ఞాతులే వీరికి మనలం బట్టుటకుపాయంబులు నేర్పునవి. ఇందు సందేహము లేదు.

అన్నిభయంబులకన్నను ఈజ్ఞాతులభయమే మిక్కిలియుఁ గష్టతరము. ఈసంగతి సుప్రసిద్ధమే. ౮

విద్యతే గోషు సమ్పన్నం విద్యతే బ్రాహ్మణే దమః,
విద్యతే స్త్రీషు చాపల్యం విద్యతే జ్ఞాతితో భయమ్. ౯

తతో నేష్ట మిదం సౌమ్య! యదహం లోకసత్కృతః,
ఐశ్వర్య మభిజాతశ్చ జ్ఞాతీనాం మూర్ధ్న్యవస్థితః. ౧౦

యథా పుష్కరపర్ణేషు పతితా స్తోయబిన్దవః,
న శ్లేష ముపగచ్ఛన్తి తథాఽనార్యేషు సఙ్గతమ్. ౧౧
యథా మధుకర స్తర్షా ద్రసం విన్ద న్నవిద్యతే,
తథా త్వమపి తత్రైవ తథాఽనార్యేషు సౌహృదమ్, ౧౨

యథాపూర్వం గజ స్స్నాత్వా గృహ్య హస్తేన వై రజః,
దూషయ త్యాత్మనో దేహం తథాఽనార్యేషు సఙ్గతమ్. ౧౩

యథా శరది మేఘానాం సిఞ్చతా మపి గర్జతామ్,
న భవత్యమ్బుసంక్లేద స్తథాఽనార్యేషు సౌహృదమ్. ౧౪

అన్య స్త్వేవంవిధం బ్రూయా ద్వాక్య మేత న్నిశాచర!,
అస్మిన్ముహూర్తే న భవే త్త్వాం తు ధిక్కులపాంసనమ్. ౧౫

ఇత్యుక్తః పరుషం వాక్యం న్యాయవాదీ విభీషణః,
ఉత్పపాత గదాపాణి శ్చతుర్భి స్సహ రాక్షసైః. ౧౬

ఆవులయందు సంపదయున్నది. బ్రాహ్మణులందు ఇంద్రియనిగ్రహము కలదు. స్త్రీలయందుఁ జాపలంబున్నది. అట్లు జ్ఞాతులవలన నవశ్యము భయంబు కలదు. ఇట్లు ఆయేనుఁగులు శ్లోకంబులం బఠించినవి. ౯

సౌమ్యుఁడవగు విభీషణుఁడా! అట్లు నీవు జ్ఞాతివి కావున నేను ఇట్లు లోకపూజితుఁడనై పరమైశ్వర్యంబునొంది జ్ఞాతులలో ముఖ్యుఁడనై యుండుట నీకు సమ్మతముకాదు. ౧౦

తామరాకులయందుఁబడిన జలబిందువులు ఒకటితో నొకటి చేరనట్లు దుష్టులతో నెన్నాళ్లు సహవాసముచేసినను స్నేహంబు గుదురదు. ౧౧

తుమ్మెద పుష్పంబులనుండు తేనియం ద్రావి యంత నాపుష్పంబునఁ దేనియనిచ్చినయుపకారంబు దలఁచి నిమిషంబైనను నిలువదుగదా! అట్లు నీవును నావలన సమస్తసుఖంబుల ననుభవించి నాకీడుకోరుచున్నావు దుష్టులతో స్నేహముసేయుటయంతయుం దుదకు అట్లే నిష్ఫలమగును. ౧౨

ఏనుఁగు మొదటఁ జక్కఁగా స్నానముచేసి యంతఁ దనతుండము చేతనే దుమ్ముదీసి దేహంబంతయుఁ బోసికొనునట్లు దుష్టులు మొదట బహుస్నేహముగానుండి పిమ్మట దానికి విఘాతముసేయుదురు. ౧౩

శరదృతువునందు మేఘంబు వర్షంబు గురియునట్లు ఎంతగర్జించుచుండినను నేలయందుఁ దేమయయినను గలుగకుండునట్లు దుష్టులతో నెంతస్నేహము చేసినను వారలుపకారము సేయునట్లభినయించుటయేకాని యెంతమాత్రము చేయరు. ౧౪

రాక్షసుఁడవగు విభీషణుఁడా! నీవు తమ్ముఁడవని మన్నించితిని; మఱి యొకఁడిట్టిపరుషవచనంబు లాడునేని యతఁ డీక్షణంబుననే వినాశంబు నొందునట్లు గావింతు; నీవు వంశంబుఁ జెఱుపఁబుట్టినవాఁడవు; పో! అవతల! అని రావణుఁడు విభీషణునిగూర్చి పరుషంబు లాడెను. ౧౫

న్యాయవాదియగు విభీషణుఁడు ఇట్లక్రమముగా రావణునిచేఁ బరుషవచనంబుల నవమానితుఁడై గద చేతంబూని నల్వురిరాక్షసులతో నాకాశంబున కుద్గమించెను. ౧౬

అబ్రవీచ్చ తదా వాక్యం జాతక్రోధో విభీషణః,
అన్తరిక్షగత శ్శ్రీమా న్భ్రాతరం రాక్షసాధిపమ్. ౧౭

స త్వం భ్రాతాఽసి మే రాజ! న్బ్రూహి మాం యద్యదిచ్ఛసి,

జ్యేష్ఠో మాన్యః పితృసమో న చ ధర్మపథే స్థితః. ౧౮
ఇదం తు పరుషం వాక్యం న క్షమామ్యనృతం తవ,

సునీతం హితకామేన వాక్య ముక్తం దశానన!. ౧౯
న గృహ్ణ న్త్యకృతాత్మానః కాలస్య వశమాగతాః,

సులభాః పురుషా రాజన్! సతతం ప్రియవాదినః. ౨౦
అప్రియస్య తు పథ్యస్య వక్తా శ్రోతాచ దుర్లభః,

బద్ధం కాలస్య పాశేన సర్వభూతాపహారిణా. ౨౧
న నశ్య న్త ముపేక్షేయం ప్రదీప్తం శరణం యథా,

దీప్తపావకసఙ్కాశై శ్శితైః కాఞ్చనభూషణైః. ౨౨
న త్వా మిచ్ఛా మ్యహం ద్రష్టుం రామేణ నిహతం శరైః,

శూరాశ్చ బలవన్తశ్చ కృతాస్త్రాశ్చ రణాజిరే. ౨౩
కాలాభిపన్నా స్సీదన్తి యథా వాలుకసేతవః,

అట్లు విభీషణుఁడు అంతరిక్షమునొంది ప్రతికూలంబగు రావణసహవాసంబు వదలుటయు ననుకూలంబగు రామసమాశ్రయంబు గోరుటయునను నీ రెంటివలనం గలిగిన పరమకాంతిచే వెలుంగుచు అగ్నియగు రాక్షసేశ్వరుఁడగు రావణునింజూచి కుపితుఁడై యీమాటం జెప్పెను ౧౩

రాక్షసరాజుఁడవగు రావణుఁడా! నీవు నాకు జ్యేష్ఠభ్రాతవు. కావున నీ కేమేమిచెప్పవలెనని యున్నదో ఆమాటలన్నియుఁ జెప్పుము. నేను బదులాడఁగూడదు. ౧౭

నీవు నాకు జ్యేష్ఠభ్రాతవు. తండ్రివలెఁ బూజనీయుఁడవు అయితే ధర్మమార్గంబు వదలినావు. మఱియును నామీఁద నసత్యముగా దోషంబు మోపి పరుషవచనంబుల దూషించినావు. దీనినిమాత్రము సహింపను. ౧౮

రావణుఁడా! నేను నీమేలుఁగోరి చక్కఁగా నిశ్చయించి నీకు హితకరంబగుమాటం జెప్పితిని. అయితే బుద్ధిహీనులు మృత్యువశంగతులయి హితోపదేశంబు వినరు. ౧౯

రాక్షసరాజుఁడవగు రావణుఁడా! ఎట్లయినను సంతోషంబు గల్గించుమాటలు చెప్పువారలును వినువారలును ఎల్లప్పుడును గావలసినంతమంది దొరకుదురు. అప్రియంబులగు హితవచనంబులు చెప్పువాఁడును జెప్పిన వినువాఁడును ఒక్కఁడైనను దొరకఁడు. ౨౦

సమస్తప్రాణిసంహారకారణంబగు మృత్యుపాశంబున బద్ధుఁడవై నాశంబు నొందుచున్న నిన్ను మండుచున్నగృహమునుంబోలెఁ జూచి యూరకుండఁజాలక యింతదూరము చెప్పితిని. ౨౧

రాముఁడు నిన్ను మండుచున్ననిప్పువలె వెలుంగుచున్నవియుఁ దీక్ష్ణంబులును గాంచనాలంకృతంబులునగు బాణంబులం గొట్టుచుండఁగాఁ జూడ నా కిష్టము లేదు. ౨౨

యుద్ధంబున శూరులును బలవంతులును అస్త్రవేత్తలు నగు వారలందఱు మృత్యుగ్రస్తులయినపుడు ఇసుకచేఁ జేసిన సీటికట్టనువలె నిమిషంబున మడిసిపోవుదురు. ౨౩

తన్మర్షయతు యచ్చోక్తం గురుత్వాద్ధిత మిచ్ఛతా. ౨౪

ఆత్మానం సర్వథా రక్ష పురీం చేమాం సరాక్షసామ్,

స్వస్తి తే౽స్తు గమిష్యామి సుఖీ భవ మయా వినా. ౨౫

నివార్యమాణస్య మయా హితైషిణా
న రోచతే తే వచనం నిశాచర!,
పరేతకల్పాహి గతాయుషో నరా
హితం న గృహ్ణన్తి సుహృద్భి రీరితమ్. ౨౬
ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే - షోడశ స్సర్గః. ౧౬

---

## సప్తదశస్సర్గః.

ఇత్యుక్త్వా పరుషం వాక్యం రావణం రావణానుజః,
ఆజగామ ముహూర్తేన యత్ర రామ స్సలక్ష్మణః. ౧

తం మేరుశిఖరాకారం దీప్తామివ శతహ్రదామ్,
గగనస్థం మహీస్థా స్తే దదృశు స్సర్వవానరాః. ౨

అన్నవగుటవలన నీహితంబుఁగోరి నేనే మాచెప్పినాను. అందుకు నీవు క్షమింపవలయును. ౧౪

అన్నివిధంబులను నిన్ను నీవు రక్షించుకొనుము. ఈరాక్షసులను ఈ లంకాపట్టణంబునుంగూడ రక్షించుకొనుము.

నీకు మంగళంబు గలుగుఁగాక, నేనుబోయెదను. నేనుబోయినపిమ్మట నేనులేనుగదా! ఇంక నీవు సుఖంబుగ నుండుము. ౧౫

రాక్షసుఁడవగు రావణుఁడా! నేను నీహితముఁగోరి యెంతచెప్పినను నామాటయందు నీకు రుచిపుట్టకున్నది; ఆయుస్సు గడచినవారలు చచ్చినట్టె గదా! స్నేహితులు చెప్పుహితోక్తులను వారలు వినరు. అని విభీషణుఁడు రావణునకుఁ జెప్పెను. ౧౬

ఇది పదునాఱవసర్గము.

## పదునేడవసర్గము.

రావణునితమ్ముఁడగు విభీషణుఁడు రావణునింజూచి యిట్లు పరుషవచనంబులాడి యంత ముహూర్తంబున లక్ష్మణసహితుండగు రాముఁడున్న ప్రదేశంబునకు వచ్చెను. ౧

అంత నట్లు అనలంబుననుండి చల్లనిసరస్సులోఁ బడుటకుంబోలె నతిత్వరతో వచ్చుచున్నవాఁడును ఔన్నత్యంబునను బలుపువలనను రత్నఖచితకాంగనాభరణంబులచేతను మేరుశిఖరంబుపగిది నున్నవాఁడును, ప్రతిపక్షులను బరిత్యజించి స్వపక్షంబునొందుటచే మేరుశిఖరంబునకుంబోలె స్థైర్యంబు నొందినవాఁడును అతిప్రకాశంబుతో నాకాశంబునందు సంచరించుట వలనను "రామభక్తులగువానరులు నన్ను రామునొద్దకుఁబోనిత్తురో పోనివ్వరో పోనివ్వకున్నచో నేనెటుజేయుదును" అనుభయంబున వణఁకుటవలనను మొగులుంబోలె నున్నవాఁడునగు నాకాశగతుఁడైన విభీషణుని నేలనున్న వానరు లందఱుం జూచిరి. ౨

త మాత్మపఞ్చమం దృష్ట్వా సుగ్రీవో వాహినీపతిః,
వానరై స్సహ దుర్ధర్ష శ్చిన్తయామాస బుద్ధిమాన్. ౩

చిన్తయిత్వా ముహూర్తం తు వానరాం స్తా నువాచ హ,
హనూమత్ప్రముఖాన్ సర్వా నిదం వచన ముత్తమమ్. ౪

ఏష సర్వాయుధోపేత శ్చతుర్భి స్సహ రాక్షసైః,
రాక్షసోఽభ్యేతి పశ్యధ్వ మస్మా న్హన్తుం న సంశయః. ౫

సుగ్రీవస్య వచ శ్శ్రుత్వా సర్వే తే వానరోత్తమాః,
సాలా నుద్యమ్య శైలాంశ్చ ఇదం వచన మబ్రువన్. ౬
శీఘ్రం వ్యాదిశ నో రాజ! న్వధా యైషాం దురాత్మనామ్,
నిపతన్తు హతా శ్చైతే ధరణ్యా మల్పతేజసః. ౭

తేషాం సమ్భాషమాణానా మన్యోన్యం స విభీషణః,
ఉత్తరం తీర మాసాద్య ఖస్థ ఏవ వ్యతిష్ఠత. ౮
ఉవాచ చ మహాప్రాజ్ఞ స్స్వరేణ మహతా మహాన్,
సుగ్రీవం తాంశ్చ సమ్ప్రేక్ష్య సర్వా న్వానరయూథపాన్. ౯

దుర్ధర్షుఁడగు వానరేశ్వరుఁడు సుగ్రీవుఁడు అట్లు అనలశరభసంపాతి ప్రఘసులను నల్వుర రాక్షసులఁగూడి యతిత్వరతో నాకాశంబున వచ్చుచున్న విభీషణుంజూచి బుద్ధిమంతుఁడు గావున ఇతఁడు మనరహస్యంబుల నెఱుఁగుటకు వచ్చువాఁడో లేక మనలం బ్రహరింపవచ్చువాఁడో యని వానరులతోఁగూడ నాలోచించెను. ౩

అట్లు సుగ్రీవుఁడు ఎచ్చుగా నాలోచించుట కవకాశము లేకుండుట వలనఁ గొంచెముసేపు ఆలోచించి హనుమంతుఁడు మున్నగాఁగల వానరుల నందఱం జూచి యుత్తమంబగు నీమాటం జెప్పెను. ౪

ఈరాక్షసుఁడు నల్వురురాక్షసులంగూడి సమస్తాయుధంబులు ధరించి మనలం జంపుటకై వచ్చుచున్నాఁడు. చూడుఁడు అని సుగ్రీవుఁడు వానరులతోఁ జెప్పెను. ౫

ఆవానరశ్రేష్ఠులందఱు సుగ్రీవుఁడు చెప్పినమాటవిని వృక్షంబులను బర్వతంబులను జేకొని యీమాటం జెప్పిరి. ౬

వానరరాజుఁడవగు సుగ్రీవుఁడా! ఈదురాత్ములం జంప మమ్మాజ్ఞాపింపుము. వీర లల్పతేజస్కులు మా కెంతమాత్రము? మేము వీరలంజంపి నేలం బడవైచెదము. అని వానరోత్తములు సుగ్రీవునితోఁ జెప్పిరి. ౭

అట్లు ఆవానరులు పరస్పరము మాటలాడుచుండఁగానే యవ్విభీషణుఁడు సముద్రోత్తరతీరంబుఁ జేరి యాకాశంబుననే నిలిచియుండెను. ౮

అట్లు రామశరణాగతి నొందఁదగినట్టి మహాభాగ్యశాలియగు నావిభీషణుఁడు మహాపండితుఁడు కావున "రాజు దయాళుఁడైనను అతని కంతరంగభూతులగు పురుషుల ద్వారముననే యతని శరణంబొందవలయును; మఱియు నీవానరులకు నన్నుఁ గొట్టవలెననుబుద్ధి నాయందలిద్వేషముచేఁ గల్గినది కాదు; వీరలు రామునందలిభక్తిచే నాయందు సంశయమునొంది యిట్లు చేయఁదలంచెదరు; ఇదియు నొక్కగుణమే; మఱియు రామభక్తులగు వీరలు నన్నంగీకరింపరేని రాముఁడుమాత్రమంగీకరించుటచే నాకేమి గలదు? రామాం

రావణో నామ దుర్వృత్తో రాక్షసో రాక్షసేశ్వరః,
తస్యాహం మనుజో భ్రాతా విభీషణ ఇతి శ్రుతః. ౧౦
తేన సీతా జనస్థానా ద్ధృతా హత్వా జటాయుషమ్,
రుద్ధాచ వివశా దీనా రాక్షసీభి స్సురక్షితా. ౧౧

త మహం హేతుభి ర్వాక్యై ర్వివిధైశ్చ న్యదర్శయమ్,
సాధు నిర్యాత్యతాం సీతా రామాయేతి పునఃపునః. ౧౨
సచ న ప్రతిజగ్రాహ రావణః కాలచోదితః,
ఉచ్యమానం హితం వాక్యం విపరీతఇవౌషధమ్. ౧౩
సోఽహం పరుషిత స్తేన దాసవచ్చావమానితః,
త్యక్త్వా పుత్త్రాం శ్చ దారాం శ్చ రాఘవం శరణం గతః. ౧౪

సర్వలోకశరణ్యాయ రాఘవాయ మహాత్మనే,
నివేదయత మాం క్షిప్రం విభీషణ ముపస్థితమ్. ౧౫

గీకారముగల్గినను రామభక్తాంగీకారము ముఖ్యముగాఁ గావలసినది; "కాబట్టి వీరలమూలముననే రాముం బొందెదను." అని యిట్లు ధర్మసూత్రానుసారంబున నిశ్చయించి పరమప్రాప్యుఁడగు రామునకును బురుషకారభూతులగు వానరులకును అందఱకును దనయార్తస్వరంబు వినునట్లు పేరెలుంగున సుగ్రీవాదివానరోత్తములంజూచి చెప్పెను. ౯

దురాచారుఁడును రాక్షసాధీశ్వరుఁడునగు రావణుఁడను రాక్షసుఁడొకఁడు కలఁడు; నే నతనితమ్ముఁడను; నా పేరు విభీషణుఁడు. ౧౦

మఱియు నారావణుఁడు జటాయువును జంపి జనస్థానంబుననుండి సీతం గొనివచ్చెను; అంతఁబరమదుఃఖిత యయి పరవశయయియున్న యాసీతను రాక్షసస్త్రీలం గావలియుంచి నిర్బంధంబున నుంచియున్నాఁడు; అట్లు అతఁడు రామునకుఁ జాల నపకారంబు గావించియున్నాఁడు; అతనిసంబంధముచే నాకును ఆదోషము తగిలియున్నది. ౧౧

నే నారావణునకు "సీతను రామున కొసంగు" మని యుక్తియుక్తంబులగు వాక్యంబులచేఁ బెక్కుమార్లు బోధించితిని. ౧౨

మూర్ఖుఁడు ఔషధమునుదీసికొననట్లు ఆరావణుఁడు మృత్యువశుఁడై నేను జెప్పు హితవచనంబులను వినఁడయ్యె. ౧౩

అట్లు నేను జెప్పినహితవాక్యంబు వినకుండుటయేగాక యారావణుఁడు నన్నుఁ బరుషవచనంబులు దూషించి దాసునట్లు అవమానించెను; కావున నేను బ్రయోజనాంతరవిముఖుఁడనై పరమపురుషార్థంబగు రామాశ్రయంబు నొందఁగోరి భార్యాపుత్రులంగూడఁ బరిత్యజించి రాముని శరణుచొచ్చితిని. ౧౪

సమస్తలోకశరణ్యుఁడును మహాత్ముఁడును రఘువంశంబున భక్తానుగ్రహార్థమయి యవతరించియున్నవాఁడునగు రామునకు విభీషణుఁడను నేను వచ్చియున్నానని శీఘ్రముగాఁ దెలుపుఁడు. అని విభీషణుఁడు సుగ్రీవాదులతోఁ జెప్పెను. ౧౫

ఏత త్తు వచనం శ్రుత్వా సుగ్రీవో లఘువిక్రమః,
లక్ష్మణ స్యాగ్రతో రామం సంరబ్ధ మిదమబ్రవీత్. ౧౬

రావణస్యానుజో భ్రాతా విభీషణ ఇతి శ్రుతః,
చతుర్భి స్సహ రక్షోభి ర్భవన్తం శరణం గతః. ౧౭
మన్త్రే వ్యూహే నయే చారే యుక్తో భవితు మర్హసి,
వానరాణాం చ భద్రం తే పరేషాం చ పరన్తప!. ౧౮

అన్తర్ధానగతా హ్యేతే రాక్షసాః కామరూపిణః,
శూరాశ్చ నికృతిజ్ఞాశ్చ తేషు జాతు న విశ్వసేత్. ౧౯

ప్రణిధీ రాక్షసేన్ద్రస్య రావణస్య భవే దయమ్,
అనుప్రవిశ్య సోఽస్మాసు భేదం కుర్యా న్న సంశయః. ౨౦

అథవా స్వయ మే వైష ఛిద్ర మాసాద్య బుద్ధిమాన్,
అనుప్రవిశ్య విశ్వస్తే కదాచి త్ప్రహరే దపి. ౨౧

మిత్రాటవీబలంచైవ మౌలం భృత్యబలం తథా,
సర్వమేత ద్బలం గ్రాహ్యం వర్జయిత్వా ద్విషద్బలమ్. ౨౨

అంత నీమాటను విన్నంతనే సుగ్రీవుఁడు "రాముఁడు శరణాగతవత్స లుఁడు. విభీషణుఁడు శరణాగతుఁడయ్యె ననుమాటను విన్నంతనే యతనిర క్షించును. ఈవిభీషణుఁ డేమో యపకారము సేయవచ్చినవాఁడు. పరమార్థ ముగా శరణాగతుఁడు కాఁడు. కావున ముందుగా విభీషణుని నిగ్రహింపవల యునని రామునకుఁ జెప్పవలయును" అనినిశ్చయించి "అతిస్నేహః పాపశంకీ" అనున్యాయంబున రామునిపై మహాస్నేహంబుగలవాఁడు కావున విభీషణుఁడు పరిశుద్ధుఁడైనను అతనియం దిట్లు సంశయించి శీఘ్రంబుగ రామునొద్దకుం బోయి లక్ష్మణుని ముందట రామునితో నిట్లని చెప్పెను. ౧౬

రావణునితమ్ముఁడు విభీషణుఁడనువాఁడు నల్వురిరాక్షసులతో వచ్చి నిన్ను శరణుజొచ్చినాఁడు. ౧౭

శత్రువులం దపింపఁజేయునట్టి రాముఁడా! వానరులకు మేలును, రాక్ష సుల కపాయంబును గల్గునట్లు నీ విప్పుడు కార్యాకార్యములనాలోచించుట, సేనాసన్నివేశనము, ఉపాయప్రయోగము, గూఢపురుషప్రేషణము వీనియందు జాగ్రత్తతో నుండుము. నీకు మంగళంబు గలుగుఁగాక. ౧౮

ఈరాక్షసులు కామరూపులు, అంతర్ధానంబునొంది ప్రహరించు వారలు, శూరులు, కపటోపాయంబులం బండితులు; కావున వారల నెంత మాత్రము నమ్మరాదు. ౧౯

ఈవిభీషణుఁడు రాక్షసేశ్వరుఁడగు రావణుఁడు పంపిన చారుఁడై యుండును; మనవలనం జక్కఁగా నమ్మకంబునొంది మనలకు మిత్రభేదంబు గలిగించును. సందేహము లేదు. ౨౦

అటుగాదేని బుద్ధిమంతుఁడగు నీవిభీషణుఁడు చక్కఁగా నమ్మకము నొంది సమయంబు వెదకుచుండి కొంచెము ఛిద్రంబు దొరకినప్పుడు తానే ప్రహరించును.

మిత్రసైన్యమును అడవియందుండు జనులబలంబును మూలబలంబును వేతనంబుదీసికొని జీవించుసైన్యమును ఈసైన్యంబుల నన్నింటిని గ్రహింప వచ్చును. శత్రుబలంబుమాత్రము గ్రహింపరాదు. ౨౧

ప్రకృత్యా రాక్షసేన్ద్రస్య భ్రాతాఽమిత్రస్య తే ప్రభో!,
ఆగత శ్చ రిపోః పక్షా త్కథ మస్మి న్హి విశ్వసేత్. ౨౩

రావణేన ప్రణిహితం త మవేహి విభీషణమ్,
తస్యాహం నిగ్రహం మన్యే క్షమం క్షమవతాం వర!. ౨౪

రాక్షసో జిహ్మయా బుద్ధ్యా సన్దిష్టోఽయ ముపాగతః,
ప్రహర్తుం మాయయా ఛన్నో విశ్వస్తే త్వయి రాఘవ!. ౨౫

ప్రవిష్ట శ్శత్రుసైన్యం హి ప్రాజ్ఞ శ్శత్రు రతర్కితః,
నిహన్యా దన్తరం లబ్ధ్వా ఉలూక ఇవ వాయసాన్. ౨౬

వధ్యతా మేష తీవ్రేణ దణ్డేన సచివై స్సహ,
రావణస్య నృశంసస్య భ్రాతా హ్యేష విభీషణః. ౨౭

ఏవ ముక్త్వాతు తం రామం సంరబ్ధో వాహినీపతిః,
వాక్యజ్ఞో వాక్యకుశలం తతో మౌన ముపాగమత్. ౨౮

సుగ్రీవస్య తు తద్వాక్యం శ్రుత్వా రామో మహాయశాః,
సమీపస్థా నువాచేదం హనూమత్ప్రముఖా న్హరీన్. ౨౯

యదుక్తం కపిరాజేన రావణావరజం ప్రతి,
వాక్యం హేతుమ దర్థ్యంచ భవద్భి రపి తచ్ఛ్రుతమ్. 3౦

రాముఁడా! ఈవిభీషణుఁడు స్వభావంబుననే నీశత్రువయిన రాక్షస రాజుండగు రావణునితమ్ముండు; మఱియుం శత్రుపక్షంబుననుండి వచ్చినాఁడు ఈతని నెట్లునమ్మవచ్చును? ౨౩

యుక్తవ్యాపారంబులు గలవారలలో నుత్తముఁడవగు రాముఁడా! ఈవిభీషణుఁడు రావణుఁడుపంపఁగా వచ్చినచారుండని యెఱుంగుము, కావున నితని నిగ్రహింపవలయునని తలంచెదను. ౨౪

రాముఁడా! ఈరాక్షసుఁడు రావణునిచేఁగుటిలోపాయంబునంబంపఁ బడి నీవు నమ్మినపిమ్మట మాయచే నంతర్ధానంబునొంది మనలం బ్రహరించుటకై వచ్చినాఁడు. ౨౫

బుద్ధిమంతుఁడగుశత్రువు ఎవ్వరికిని తెలియకుండునట్లు శత్రుసైన్యంబుఁ బ్రవేశించి రంధ్రంబు నన్వేషించి పెక్కుకాకులను ఒకగుడ్లగూఁబ చంపునట్లు తనశత్రువులనందఱం జంపును. ౨౬

ఈవిభీషణుఁడు క్రూరుండగు రావణునితమ్ముఁడుగదా! కావున నితనిని ఈతనిమంత్రులనల్వురనుంగూడఁ దీక్ష్ణంబుగా వధింపవలయును. అని సుగ్రీవుఁడు రామునితోఁ జెప్పెను. ౨౭

మాటలు చెప్పుటయందుఁ బండితుఁ డగువానరేశ్వరుఁడు సుగ్రీవుండు అట్లు మాటలయందు సమర్థుండగు రామునితో వేగంబుగం జెప్పి యూరకుండెను. ౨౮

మహాకీర్తిశాలియగు రాముండు సుగ్రీవుండు చెప్పినమాటనువిని యప్పుడు సమీపంబుననున్న హనుమంతుఁడు మున్నగు వానరులంజూచి యీమాటం జెప్పెను. ౨౯

వానరరాజుండగు సుగ్రీవుఁడు రావణునితమ్ముండయిన విభీషణుని గుఱించి యుక్తియుక్తంబును సప్రయోజనంబునగుమాటం జెప్పినాఁడు, అది మీరును విన్నారు. 30

సుహృదా హ్యర్థకృచ్ఛ్రేషు యుక్తం బుద్ధిమతా సతా,
సమర్థేనాపి నిర్దేష్టుం శాశ్వతీం భూతి మిచ్ఛతా. ౩౧

ఇత్యేవం పరిపృష్టా స్తే స్వంస్వం మత మతన్ద్రితాః,
సోపచారం తదా రామ మూచు ర్హితచికీర్షవః. ౩౨

అజ్ఞాతం నాస్తి తే కించి త్త్రిషు లోకేషు రాఘవ!,
ఆత్మానం సూచయన్ రామ! పృచ్ఛస్యస్మాన్ సుహృత్తయా. ౩౩

త్వం హి సత్యవ్రత శ్శూరో ధార్మికో దృఢవిక్రమః,
పరీక్ష్యకారీ స్మృతిమా న్నిసృష్టాత్మా సుహృత్సు చ. ౩౪

తస్మాదేకైకశ స్తావ ద్బ్రువన్తు సచివా స్తవ,
హేతుతో మతిసమ్పన్నా స్సమర్థాశ్చ పునఃపునః. ౩౫

ఇత్యుక్తే రాఘవాయాథ మతిమా నఙ్గదోఽగ్రతః,
విభీషణపరీక్షార్థ మువాచ వచనం హరిః. ౩౬

శత్రో స్సకాశా త్సమ్ప్రాప్త స్సర్వథా శఙ్క్య ఏవ హి,
విశ్వాసయోగ్య స్సహసా న కర్తవ్యో విభీషణః. ౩౭
ఛాదయిత్వాఽఽత్మభావం హి చర న్తి శఠబుద్ధయః,
ప్రహర న్తి చ రన్ధ్రేషు సోఽనర్థ స్సుమహా న్భవేత్. ౩౮

ఒకమిత్రుఁ డుపదేశించినపిమ్మట మఱియొకఁ డుపదేశింపఁగూడదని లేదు. కార్యసంకటంబు వచ్చినప్పుడుబుద్ధిమంతుండును సమర్థుండును శ్రేయస్కాముండునగు మిత్రుండెవ్వఁడైనను ఉపదేశించుట యుక్తము; కావున మీరలును మీకుఁదోఁచినది చెప్పుఁడు. అని రాముఁడు హనుమదాదివానరులతోఁ జెప్పెను.

ఆవానరులు రాముండుచెప్పినమాటవిని యాలస్యంబునేయక రామహితంబు సేయఁగోరినవారయి రామునింజూచి యుపచారపూర్వకంబుగాఁ దమతమమతంబులం జెప్పిరి.

రాముఁడా! ముల్లోకంబులయందును నీకుఁ దెలియని దేదియుఁలేదు, "రామునకు వానరులు స్నేహితులుగానుండిరి" అని మాకందఱకును గీర్తికలుగుటకును మమ్మందఱను గౌరవింపవలెననియుఁ మమ్మడుగుచున్నావు. 33

నీవు సత్యవ్రతుఁడవు. శూరుండవు ధార్మికుండవు. మహాపరాక్రమశాలివి. ఏకార్యమునేని పరీక్షించి చేయువాఁడవు. మఱపులేనివాఁడవు. మిత్రులయందు భారములేని పరతంత్రుండవై యుండువాఁడవు. 34

అందువలన బుద్ధిమంతులును సమర్థులునగు నీమంత్రులు క్రమంబున నొక్కొక్కరుగా యుక్తియుక్తంబుగా వారివారియభిప్రాయంబుఁ జెప్పుదురుగాక అని వానరులు రామునితోఁ జెప్పిరి. 35

ఆవానరు లిట్లుచెప్పి ముగించినవెనుక వారలలో మొదట బుద్ధిమంతుండగు నంగదుండు విభీషణునిం బరీక్షించుటనుగుఱించి రామునితో నిట్లని చెప్పెను. 36

శత్రునియొద్దనుండివచ్చినవానిని 'ఏవిధంబున నేని నమ్మరాదు, కావున మనము విభీషణునిపై నాలోచింపక నమ్మకం బుంచరాదు. 37

కుటిలబుద్ధులగువారలు తమయభిప్రాయమునుదాఁచుకొని పైకి మంచివారలువలె నటింతురు. తుదకు ఛిద్రంబుదొరికినప్పుడు ప్రహరింతురు. అట్టిచో నపాయము సంభవించును. 38

అర్థానర్థౌ వినిశ్చిత్య వ్యవసాయం భజేత హ,
గుణత స్సఙ్గ్రహం కుర్యా ద్దోషతస్తు వివర్జయేత్. ३౯

యది దోషో మహాం స్తస్మిం స్త్యజ్యతా మవిశఙ్కితమ్,
గుణాన్వాపి బహూన్ జ్ఞాత్వా సఙ్గ్రహః క్రియతాం నృప!. ४౦

శరభ స్త్వథ నిశ్చిత్య సార్థం వచన మబ్రవీత్,

క్షిప్ర మస్మి న్నరవ్యాఘ్ర! చారః ప్రతివిధీయతామ్. ४౧

ప్రణిధాయహి చారేణ యథావ త్సూక్ష్మబుద్ధినా,
పరీక్ష్య చ తతః కార్యో యథాన్యాయం పరిగ్రహః. ४౨

జామ్బవాం స్త్వథ సమ్ప్రేక్ష్య శాస్త్రబుద్ధ్యా విచక్షణః,
వాక్యం విజ్ఞాపయామాస గుణవ ద్దోషవర్జితమ్. ४३

బద్ధవైరాచ్చ పాపాచ్చ రాక్షసేన్ద్రా ద్విభీషణః,
అదేశకాలే సమ్ప్రాప్త స్సర్వథా శఙ్క్యతా మయమ్. ४४

ఏవిషయంబునందేని గుణదోషంబుల విచారించి గుణంబులుండెనేని యంగీకరింపవలయును. దోషంబులుండెనేని విడువవలయును. అట్లు ఈవిభీషణునియందలి గుణదోషంబుల నాలోచించి యతనియందు గుణంబె యుండినచో గ్రహింతము. దోషంబె యుండినచో విడుతము. ౩౯

నరేంద్రుఁడవగు రాముఁడా! అయితే ఎంతమాత్రమయిన గుణంబు గాని దోషంబు గాని లేనివాఁడు ఎవ్వఁడు లేఁడే యని యందురేమో, ఈవిభీషణుని యందు గుణంబులకన్న దోషంబులే యెచ్చుగానుండినచో నితని నిస్సందేహముగా విడువవలసినది. అట్లులేక దోషంబులకన్న గుణంబులే యెచ్చుగా నుండినచో నంగీకరింపవలయును. అని యంగదుఁడు రామునితోఁ జెప్పెను.

అంత శరభుఁడు చక్కఁగా నాలోచించి నిశ్చయించి సార్థకంబగు నీమాటం జెప్పెను.

పురుషశ్రేష్ఠుఁడవగురాముఁడా! శీఘ్రముగా నీవిభీషణునియొద్దకు ఒక గూఢపురుషునిం బంపుము. ౪౦

(గుణదోషంబులు పరీక్షించి గుణంబు లెచ్చుగానున్న నంగీకరించుట, దోషంబు లెచ్చుగానున్నం బరిత్యజించుట ఇదివలనుపడదు. ఏలయన? వానిని మనలోఁ జేర్చుకొనినకదా గుణదోషంబులు పరీక్షింపవలెను. చేర్చుకొన్నచో మన కతఁడు కీడుగావించును కావున అదిసరికాదు.) మనము విభీషణునొద్దకు సూక్ష్మబుద్ధియగుచారు నొక్కనింబంపి యతనిమాటను జక్కఁగాఁ బరీక్షించి యటుపిమ్మట నీతిశాస్త్రోక్తప్రకారంబునఁ బరిగ్రహాపరిగ్రహంబులఁ జేయవలయును అని శరభుండు చెప్పెను.

అంత బండితుండగు జాంబవంతుఁడు శాస్త్రప్రకారము నాలోచించి గుణయుక్తంబును నిర్దోషంబగునీమాటను విన్నవించుకొనెను. ౪౩

ఈవిభీషణుఁడు "నీయందు బద్ధవైరంబు గలవాఁడును పాపిష్ఠుండగు రావణునియొద్దనుండి వచ్చినాఁడు, అతఁ డిప్పు డిచ్చటికి వచ్చుటకుఁ దగిన కారణంబును లేదు. కావున నేవిధంబునఁ జూచినను అతనిపై సందేహమే తోఁచుచున్నది. అని జాంబవంతుఁడు చెప్పెను. ౪౪

తతో మైన్దస్తు సమ్ప్రేక్ష్య నయాపనయకోవిదః,
వాక్యం వచనసమ్పన్నో బభాషే హేతుమత్తరమ్. ౪౫

వచనం నామ తస్యైష రావణస్య విభీషణః,
పృచ్ఛ్యతాం మధురేణాయం శనై ర్నరవరేశ్వర!. ౪౬

భావ మస్యతు విజ్ఞాయ తత్త్వత స్త్వం కరిష్యసి,
యది దుష్టో నదుష్టో వా బుద్ధిపూర్వం నరర్షభ!. ౪౭

అథ సంస్కారసమ్పన్నో హనూమాన్ సచివోత్తమః,
ఉవాచ వచనం శ్లక్ష్ణ మర్థవ న్మధురం లఘు. ౪౮

న భవన్తం మతిశ్రేష్ఠం సమర్థం వదతాం వరమ్,
అతిశాయయితుం శక్తో బృహస్పతి రపి బ్రువన్. ౪౯

న వాదాన్నాపి సఙ్ఘర్షా న్నాధిక్యా న్నచ కామతః,
వక్ష్యామి వచనం రాజన్! యథార్థం రామ గౌరవాత్. ౫౦

అర్థానర్థనిమిత్తం హి యదుక్తం సచివై స్తవ,
తత్ర దోషం ప్రపశ్యామి క్రియా న హ్యుపపద్యతే. ౫౧

ఋతే నియోగా త్సామర్థ్య మవబోద్ధుం నశక్యతే,
సహసా వినియోగో హి దోషవా న్ప్రతిభాతి మా. ౫౨

అంత న్యాయాన్యాయంబులం బండితుఁడును జక్కఁగా మాటలాడం జాలినవాఁడునగు మైందుండును జక్కఁగా నాలోచించి యన్నిటికన్నను యుక్తియుక్తంబగు నీమాటం జెప్పెను. ౪౫

నరేంద్రోత్తముఁడ వగురాముఁడా! గూఢపురుషుఁడొక్కఁడు పోయి. రావణునిసమాచారమేమి? యని మధురవచనంబునం దిన్నఁగా నీవిభీషణుని నడుగవలయును. ౪౬

పురుషశ్రేష్ఠుఁడవగురాముఁడా! అట్లు ఈవిభీషణుని యథార్థాభిప్రాయంబు దెలిసికొని యతఁడు దుష్టుఁడో పరిశుద్ధుఁడో అందుకుఁదగినట్లుగాఁ జేయగలవు. అని మైందుండు చెప్పెను. ౪౭

అంత సమస్తశాస్త్రాభ్యాసజన్యసంస్కారసంపన్నుఁడును మంత్రులలో శ్రేష్ఠుండునగు హనుమంతుఁడు కోమలంబును అధికార్థంబును మధురంబును అల్పజనఁబునగుమాటం జెప్పెను. ౪౮

బృహస్పతిమాటలాడినను బుద్ధిమంతులలోనుత్తముండవు సమర్థుండవు మిక్కిలియుఁ జక్కఁగా మాటలాడంజాలినవాఁడవునగు నీకు అధికుండు కాఁజాలఁడు. ౪౯

రాముఁడా! నేను దర్కకౌశలంబునంగాని జయింపవలెనను స్పర్థచేఁగాని నా కతిశయంబు గలుగవలెననిగాని లేక నాయిచ్ఛవలనఁగాని చెప్పుట లేదు; అయితే రాముండు నాయందుంచు గౌరవంబుచే నాకుఁ దోఁచినట్లు యథార్థంబుగాఁ జెప్పెదను. ౫౦

గుణదోషంబుల నిర్ణయించి యాపైని స్వీకార పరిత్యాగంబులు సేయవలెనని నీమంత్రులుచెప్పిరే, దానియందు నాచే దోషంబు గనుపడుచున్నది. ఏలయన అట్టికార్యము ఉపపన్నముగాదు. ౫౧

రాచకార్యములందుఁ బ్రవేశపెట్టకున్న గుణదోషంబులు తెలియవు. గుణదోషంబులు తెలియకయె రాచకార్యంబులందుఁ బ్రవేశపెట్టుట సరికాదు. అట్లు ప్రవేశపెట్టినచో దుష్టుండయ్యేనేని చెఱచును. కావున వీని నా

చారప్రణిహితం యుక్తం యదుక్తం సచివైస్తవ,
అర్థస్యాసమ్భవాత్తత్ర కారణం నోపయుజ్యతే. ౫౩

అదేశకాలే సమ్ప్రాప్త ఇత్యయం యద్విభీషణః,
వివక్షా తత్ర మేఽస్తీయం తాం నిబోధ యథామతి. ౫౪
స ఏష దేశః కాలశ్చ భవతీతి యథాతథా,

పురుషాత్పురుషం ప్రాప్య తథా దోషగుణావపి. ౫౫
దౌరాత్మ్యం రావణే దృష్ట్వా విక్రమం చ తథా త్వయి,
యుక్తమాగమనం తస్య సదృశం తస్య బుద్ధితః. ౫౬

అజ్ఞాతరూపైః పురుషైః స రాజన్ పృచ్ఛ్యతామితి,
యదుక్తమత్ర మే ప్రేక్షా కాచిదస్తి సమీక్షితా. ౫౭

పృచ్ఛ్యమానో విశఙ్కేత సహసా బుద్ధిమాన్వచః,
తత్ర మిత్రం ప్రదుష్యేత మిథ్యా పృష్టం సుఖాగతమ్. ౫౮

గముచే గుణదోషవిచారము నసంగతము. బన్యోన్యాశ్రయదోషగ్రస్తముగా నున్నది.

చారునిబంపి రహస్యముగా నతనియభిప్రాయము దెలిసికోవలయునని శరభుండు చెప్పినాఁడే, అదియు నసంగతము. ఏలయన దూరంబున నున్న వారలయొద్దకుఁగదా రహస్యపురుషులం బంపి వారలకుఁ దెలియకుండ వారి హృదయాభిప్రాయంబుఁ గనుఁగొనవచ్చును. అతిసమీపగతుండై మనల నంద ఱను గండ్లతోఁ జూచుచున్న విభీషణునొద్దకుఁ జారుని బంపుటెట్లు? ౫౩

ఈవిభీషణుఁడు అనుచితదేశంబునను అకాలంబునను వచ్చినాఁడని జాంబవంతుఁడు చెప్పినాఁడే, ఆవిషయమందును నాకుఁ గొంచెము చెప్పవలెనని యున్నది. వినుము. ఈదేశంబును ఈకాలంబును విభీషణుండు వచ్చుటకుఁ దగినదే. సంశయములేదు. ౫౪

విభీషణుండు అధముండగురావణుని ఉత్తముఁడవగునిన్నును విమర్శించి రావణునియందలిదోషంబులను నీయందలిగుణంబులను విచారించి రావణుని యొందలిసీత నపహరించుటయు మరల నాబిడ నొసంగుమని యెంతచెప్పినను సమ్మతింపకుండుటయు మొదలగుదుర్గుణంబులను నీయందు ఖరదూషణాదిమహారాక్షససంహారము వాలిని వధించి సుగ్రీవునకురాజ్యంబు నొసంగుట మొదలగు మహాపరాక్రమంబులనుజూచి బుద్ధితో నాలోచించి రావణుని విడిచి నీ యొద్దకువచ్చుట మిక్కిలి యుక్తముగా నేయున్నది. కావున దేశకాలంబులు యోగ్యంబులుగ నేయున్నవి. ౫౫, ౫౬

రాముఁడా! తెలియనిపురుషులు కొందఱు పోయి విభీషణు నడుగవలయునని మైందుఁడు చెప్పినాఁడే, ఆవిషయమందును నాకుఁ గొంచెము సంశయమున్నది. ౫౭

తటాలున నడిగినచో బుద్ధిమంతుండగువాఁడు మనయందే మోసమందే హించి వీరలడుగుచున్నారు. "ఏమిచెప్పిన నేమిసంభవించునో" అని మాట చెప్పుటకే సంశయించును. అట్లు సంశయించి యడుగుటచే సుఖాగతుండగు

అశక్య స్సహసా రాజ! న్భావో బోద్ధుం పరస్య వై,
అన్తస్స్వభావై ర్గీతై స్తై ర్నైపుణ్యం పశ్యతా భృశమ్. ౫౯

నత్వస్య బ్రువతో జాతు లక్ష్యతే దుష్టభావతా,
ప్రసన్నం వదనం చాపి తస్మా న్మే నాస్తి సంశయః. ౬౦

అశఙ్కితమతి స్స్వస్థో న శఠః పరిసర్పతి,
న చాస్యదుష్టవాక్చాపి తస్మా న్నాస్తీహ సంశయః. ౬౧

ఆకార శ్ఛాద్యమానోఽపి న శక్యో వినిగూహితుమ్,
బలాద్ధి వివృణోత్యేవ భావ మన్తర్గతం నృణామ్. ౬౨
దేశకాలోపపన్నం చ కార్యం కార్యవిదాం వర!,
స్వఫలం కురుతే క్షిప్రం ప్రయోగే ణాభిసంహితమ్. ౬౩

ఉద్యోగం తవ సంప్రేక్ష్య మిథ్యావృత్తం చ రావణమ్,
వాలినశ్చ వధం శ్రుత్వా సుగ్రీవం చాభిషేచితమ్. ౬౪
రాజ్యం ప్రార్థయమానశ్చ బుద్ధిపూర్వ మిహాగతః,

ఏతావత్తు పురస్కృత్య యుజ్యతే త్వస్య సఙ్గ్రహః. ౬౫
యథాశక్తి మయోక్తం తు రాక్షస స్యార్జవం ప్రతి,

త్వం ప్రమాణం తు శేషస్య శ్రుత్వా బుద్ధిమతాం వర!. ౬౬

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే సప్తదశ స్సర్గః. ౧౭.

---

మంచిమిత్రుఁడునుగూడ దుష్టుండుగాఁ దోఁచును. ౫౮

రాముఁడా! అడుఁగగానే ఒకవేళ మాటలాడినను అతఁడు తన యభిప్రాయంబును దాఁచుకొనియె మాటలాడును. అందువలన ఎంతసమర్థునకైనను అట్టివానిహృదయాభిప్రాయం బెఱుంగ నలవిగాదు. ౫౯

ఈవిభీషణుఁడు మాటలాడుచున్నాఁడుగదా! ఆతనిమాటవలన ఆతనికి దుష్టాభిప్రాయంబుండునట్లు నాకుఁదోఁచలేదు. మఱియు నతనిముఖము ప్రసన్నముగా నున్నది. కావున నతనియం దెంతమాత్రము సందేహములేదు. ౬౦

దుష్టాభిప్రాయముగలవాఁడు నిస్సందేహముగా నిర్భయముగా రాఁజాలఁడు. ఈవిభీషణుఁడు ఎంతమాత్రము సందేహములేక నిర్భయముగా నున్నాఁడు; మఱియు నతనిమాటలును నిర్దోషంబుగా నున్నవి. కావున నీని యందు నాకు సందేహములేదు. ౬౧

ముఖవికారము ఎంతదాఁచినను దాఁగియుండదు; బలాత్కారంబున హృదయగతంబగుభావంబును దప్పక బయలుపఱచును. ౬౨

కార్యవేత్తలలో నుత్తముఁడవగు రాముఁడా! కార్యంబు దేశకాలంబుల ననుసరించి సరియైనపురుషులయందుఁ బ్రయోగింపఁబడునేని శీఘ్రంబుగా ఫలించును. ౬౩

ఈవిభీషణుఁడు నీవు రావణుని వధింపఁజేయుప్రయత్నంబును విని రావణుని దురాచారంబుఁజూచి నీవు వాలిం జంపి సుగ్రీవునకు వానర రాజ్యంబు నొసంగుటయుం విని రాజ్యంబుఁగోరి నీయొద్దకు వచ్చినాఁడు గాని వేఱుగాదు. ౬౪

ఇదంతయుం నిట్లున్నది కావున విభీషణుని గ్రహింపవచ్చును. ౬౫

నేను నాశక్తికొలఁది నాకుఁ దోఁచినమట్టును విభీషణుని యోగ్యతను గుఱించి చెప్పితిని.

బుద్ధిమంతులలో నుత్తముఁడగు రాముఁడా! నేను జెప్పినది విన్నావుగదా! ఇంక మిగతకార్యమును నీయిచ్ఛ. అని హనుమంతుఁడు రామునితోఁ జెప్పెను. ౬౬

ఇది పదునేడవసర్గము.

## అష్టాదశస్సర్గః.

అథ రామః ప్రసన్నాత్మా శ్రుత్వా వాయుసుతస్య హ,
ప్రత్యభాషత దుర్ధర్షః శ్రుతవానాత్మని స్థితమ్. ౧

మమాపి తు వివక్షాఽస్తి కాచి త్ప్రతి విభీషణమ్,
శ్రోతు మిచ్ఛామి తత్సర్వం భవద్భి శ్శ్రేయసి స్థితైః. ౨
మిత్రభావేన సమ్ప్రాప్తం న త్యజేయం కథంచన,
దోషో యద్యపి తస్య స్యా త్సతా మేతదగర్హితమ్. ౩

సుగ్రీవ స్త్వథ తద్వాక్యమాభాష్య చ విమృశ్య చ,
తతశ్శుభతరం వాక్య మువాచ హరిపుఙ్గవః. ౪

సుదుష్టో వా ప్యదుష్టో వా కిమేష రజనీచరః,

ఈదృశం వ్యసనం ప్రాప్తం భ్రాతరం యః పరిత్యజేత్. ౫
కో నామస భవే త్తస్య యమేష న పరిత్యజేత్,

వానరాధిపతేర్వాక్యం శ్రుత్వా సర్వా నుదీక్ష్య చ. ౬
ఈషదుత్స్మయమానస్తు లక్ష్మణం పుణ్యలక్షణమ్,
ఇతి హోవాచ కాకుత్స్థో వాక్యం సత్యపరాక్రమః. ౭
అనధీత్య చ శాస్త్రాణి వృద్ధానుపసేవ్య చ,
నశక్య మీదృశం వక్తుం యదువాచ హరీశ్వరః. ౮

అస్తి సూక్ష్మతరం కించి ద్యదత్ర ప్రతిభాతి మే,
ప్రత్యక్షం లౌకికం వాపి విద్యతే సర్వరాజసు. ౯

## పదునెనిమిదవసర్గము.

అంత మహాపండితుఁడును బూర్వపక్షంబులచేఁ గలఁతపెట్ట నలవిగాని వాఁడునగురాముండు హనుమంతుఁడు చెప్పినమాటవిని ప్రసన్నుండయి తన మనంబుననున్న యభిప్రాయంబుఁ జెప్ప నారంభించెను. ౧

నాకును విభీషణునిగుఱించి కొన్నిమాటలను జెప్పవలెననియున్నది. నా శ్రేయస్సు గోరునట్టిమీరందఱుఁ జక్కఁగా వినవలయునని కోరెదను.

అతనియం దెంతదోషంబుండినను శరణాగతుండని వచ్చినవాని నెట్టియినను విడువఁజాలను. ఈధర్మము సత్పురుషులకుఁ బూజనీయంబగునది. అని రాముండు చెప్పెను. ౩

అంత వానరశ్రేష్ఠుండగు సుగ్రీవుండు రాముఁడుచెప్పినమాట నమోదించియాలోచించి తనకు రామునందుంగల యధికపక్షపాతంబును దెలుపునట్టి యీమాటం జెప్పెను. ౪

ఈరాక్షసుండు దుష్టుండుగాని యదుష్టుండుగాని యతనితో మనకేమి ప్రయోజనము? ఇతని మన మవశ్యము విడువవలసినదే!

ఈతఁడు ఇట్టి మహాకష్టంబునొందియున్న యన్ననుఁగూడ విడిచి వచ్చినాఁడే. ఇఁక నిట్టికృతఘ్నుండు ఎవ్వనివిడువఁడు? కాఁబట్టి యితనిఁ బరిగ్రహింపఁగూడదు. అని సుగ్రీవుఁడు రామునితోఁ జెప్పెను. ౫

సత్యపరాక్రముఁడగురాముండు వానరేశ్వరుఁడయినసుగ్రీవుండుచెప్పిన మాటనువిని వానరుల నందఱుఁజూచి పుణ్యలక్షణుండగు లక్ష్మణునిపైఁ జిఱునవ్వులయం గటాక్షంబుఁ బఱపి యీమాటం జెప్పెను. ౬,౭

శాస్త్రాధ్యయనంబును వృద్ధసేవయు నెచ్చుగాఁ గావించినవానికిఁ దక్క మఱియెవ్వనికిని యిప్పుడు వానరేశ్వరుఁడగు సుగ్రీవుండుచెప్పినట్టి మాటం జెప్ప నలవిగాదు. ౮

ఈవిషయమునందుఁ బ్రత్యక్షంబును లౌకికంబునగు నొక్క సూక్ష్మధర్మము, సమస్తరాజులకును గల్గియున్నది. అది నాకు స్ఫురించుచున్నది. చెప్పెద వినుండు. ౯

అమిత్రా స్తత్కులీనాశ్చ ప్రాతిదేశ్యాశ్చ కీర్తితాః,
వ్యసనేషు ప్రహర్తార స్తస్మా దయ మిహాగతః. ౧౦

అపాపా స్తత్కులీనాశ్చ మానయన్తి స్వకాన్హితాన్,
ఏష ప్రాయో నరేన్ద్రాణాం శఙ్కనీయ స్తు శోభనః. ౧౧

యస్తు దోష స్త్వయా ప్రోక్తో హ్యాదానేఽరిబలస్యచ,
తత్ర తే కీర్తయిష్యామి యథాశాస్త్ర మిదం శృణు. ౧౨

న వయం తత్కులీనాశ్చ రాజ్యకాఙ్క్షీ చ రాక్షసః,

పణ్డితా హి భవిష్యన్తి తస్మా ద్గ్రాహ్యో విభీషణః. ౧౩

అవ్యగ్రాశ్చ ప్రహృష్టా స్తే న భవిష్యన్తి సఙ్గతాః,
ప్రణాదశ్చ మహానేష తతోఽస్య భయమాగతమ్. ౧౪
ఇతి భేదం గమిష్యన్తి తస్మా ద్గ్రాహ్యో విభీషణః,

జ్ఞాతులును ఇరుగుపొరుగురాజులును గష్టంబువచ్చినప్పుడు ప్రహరింపఁ జూతురు కావున శత్రువులని చెప్పఁబడినారు. అట్లు విభీషణుఁడు రావణు నకు జ్ఞాతి కావునఁ గష్టంబు వచ్చినప్పుడు అతనిం బరిత్యజించి యిచ్చటికి వచ్చినాఁడు. ౧౦

యోగ్యులగురాజులు, తమకిష్టులయినజ్ఞాతులను గౌరవింతురు. అట్టి యోగ్యులగురాజులుగూడ శౌర్యాదిసంపన్నుండగుజ్ఞాతిని ఎంతమాత్రము నమ్మరు. ఇంకఁ బాపిష్ఠుండగురావణుండు జ్ఞాతిని నమ్మునా? అట్లు విభీష ణుండు రావణునిచే శంకింపఁబడినవాఁడై యతనితో విరోధించి యిచ్చటికి వచ్చినాఁడుగాని వేఱుగాదు. ౧౧

శత్రుబలంబు సంగ్రహించుకొను విషయము నీ వేదోషంబు చెప్పి యున్నావో, ఆవిషయమునందును నీకు యథాశాస్త్రంబుగాఁ జెప్పెదను. వినుము. ౧౨

మనము రాక్షసులముకాము. కావున రాక్షసరాజ్యంబు గోరము. కాఁబట్టి మనయం దతనికి ద్వేషంబు గలుగదు. మఱియు మనసాహాయ్యంబున నతఁడు రాజ్యంబు పొందవలయునని యున్నాఁడు కావున మనల నతండు విడువఁడు.

అయితే రాక్షసుల కింతవిమర్శయున్నదా? అని యాక్షేపింతురు కాఁబోలు, అట్లుకాదు. రాక్షసులలోనుం గొందఱు పండితులుందురు. కావున విభీషణుం డట్టియభిప్రాయముతో వచ్చినవాఁడు కాఁబట్టి యతనిం బరిగ్ర హింపవచ్చును. ౧౩

జ్ఞాతులు ఎప్పటికిని పరస్పరము గలఁతలేక సంతుష్టులయి యొకరితో నొకరు కలసియుండరు. ఎల్లప్పుడును పరస్పరము విరోధము గలిగియుందురు. అట్లు విభీషణుఁడు విరోధించి బలిష్ఠుఁడగు రావణునకు భయపడి మనయొద్దకు వచ్చినట్టున్నదిగాని వేఱుగాదు అందుకుఁదగినట్లు ఇతనికంఠధ్వనిం జూచినను భయంబునొందినట్లె కనుపడుచున్నది. లోకవార్తయు జ్ఞాతులు ఒకరితో నొకరు కలహింపుచుందురనుట సుప్రసిద్ధముయియున్నది గదా! కావున

న సర్వే భ్రాతర స్తాత! భవన్తి భరతోపమాః. ౧౫
మద్విధా వా పితుః పుత్రా స్సుహృదో వా భవద్విధాః,

ఏవ ముక్తస్తు రామేణ సుగ్రీవ స్సహలక్ష్మణః. ౧౬
ఉత్థాయేదం మహాప్రాజ్ఞః ప్రణతో వాక్య మబ్రవీత్,
రావణేన ప్రణిహితం త మవేహి విభీషణమ్. ౧౭
తస్యాహం నిగ్రహం మన్యే క్షమం క్షమవతాం వర!,

రాక్షసో జిహ్మయా బుద్ధ్యా సన్దిష్టోఽయమిహాగతః. ౧౮
ప్రహర్తుం త్వయి విశ్వస్తే ప్రచ్ఛన్నో మయి వానఘ!,
లక్ష్మణే వా మహాబాహో! స వధ్యస్సచివైః సహ. ౧౯

రావణస్య నృశంసస్య భ్రాతా హ్యేష విభీషణః,

ఏవ ముక్త్వా రఘుశ్రేష్ఠం సుగ్రీవో వాహినీపతిః. ౨౦
వాక్యజ్ఞో వాక్యకుశలం తతో మౌన ముపాగమత్,

సుగ్రీవస్య తు తద్వాక్యం రామ శ్శ్రుత్వా విమృశ్య చ. ౨౧
తత శ్శుభతరం వాక్య మువాచ హరిపుఙ్గవమ్,
సుదుష్టో వా ప్యదుష్టో వా కిమేష రజనీచరః. ౨౨
సూక్ష్మమప్యహితం కర్తుం మమాశక్తః కథంచన,

నితఁడు భయపడి మనయొద్దకు వచ్చినాఁడు. కాబట్టి యితని బరిగ్రహింప వలెను. ౧౪

నాయనా! తోఁబుట్టువు లందఱు భరతునివంటివారలు కాఁజాలరు. తండ్రికిఁ గొడుకులును నాయట్టివారలు పుట్టరు. నీవంటి స్నేహితులును కలుగఁ జాలరు. కాబట్టి యందఱును మనయట్లె పరమధార్మికులయియుందురని తలఁపకుము. అని రాముఁడు సుగ్రీవాదులతోఁ జెప్పెను. ౧౫

మహాపండితుఁడగు సుగ్రీవుఁడు రాముఁడు తన్నును లక్ష్మణునింజూచి చెప్పినమాటను విని లేచి రామునకు నమస్కరించి యిట్లని చెప్పెను. ౧౬

యుక్తవ్యాపారములు గలవారలలో నుత్తముఁడవగు రాముఁడా! ఈ విభీషణుని రావణుండె యిచ్చటికిరహస్యముగాఁ బంపియున్నాఁడని యెఱుంగుము. కావున నతని నిగ్రహించుట యుక్తమని తలచెదను. ౧౭

పాపరహితుఁడవు మహాబాహుండవగు రాముఁడా! ఈ రాక్షసుఁడు కుటిలోపాయంబున రావణునిచేఁ బంపఁబడినవాఁడై మనము నమ్మియుండఁగాఁ బ్రచ్ఛన్నరూపంబున నిన్నుఁగాని నన్నుఁగాని లక్ష్మణుంగాని ప్రహరించుటకై యిచ్చటికి వచ్చినాఁడు. అట్లు మన మందఱము నధింపఁబడవలసి వచ్చును. ౧౮, ౧౯

విభీషణుఁడు దుష్టుఁడగు రావణుని తమ్ముండుగదా! ఇతని నెట్లునమ్మ వచ్చును? అని సుగ్రీవుండు రామునితోఁ జెప్పెను.

వానరాధీశ్వరుండును మాటలయందుఁ బండితుండునగు సుగ్రీవుండు మాటలయందుఁ బండితుండగురామునితో నీప్రకారముచెప్పి యంత నూరకుండెను. ౨౦

రాముండు సుగ్రీవుఁడు చెప్పినమాటను విని యాలోచించి యంత వానరోత్తముఁడగు సుగ్రీవుంజూచి మంగళకరంబగు నీమాటం జెప్పెను. ౨౧

ఈవిభీషణుఁడు దుష్టుండగుఁగాక లేక యదుష్టుఁడగుఁగాక. నన్నితం డేమిచేయఁగలఁడు? ఇతఁ డేవిధంబుననైనను గొంచెమయినను నాకు కీడుచేయఁజాలఁడు. ౨౨

పిశాచాన్దానవాన్యక్షాన్పృథివ్యాం చైవ రాక్షసాన్. ౨3
అఙ్గుళ్యగ్రేణ తా న్హన్యా మిచ్ఛ న్హరిగణేశ్వర!,

శ్రూయతే హి కపోతేన శత్రు శ్శరణ మాగతః. ౨౪
అర్చితశ్చ యథాన్యాయం స్వైశ్చ మాంసై ర్నిమన్త్రితః,

సహి తం ప్రతిజగ్రాహ భార్యా హర్తార మాగతమ్. ౨౫
కపోతో వానరశ్రేష్ఠ! కింపున ర్మద్విధో జనః,

ఋషేః కణ్వస్య పుత్రేణ కణ్డునా పరమర్షిణా. ౨౬
శృణు గాథాం పురా గీతాం ధర్మిష్ఠాం సత్యవాదినా,

బద్ధాఞ్జలిపుటం దీనం యాచన్తం శరణాగతమ్. ౨౭
న హన్యా దానృశంస్యార్థ మపి శత్రుం పరన్తప!,

ఆర్తో వా యదివా దృప్తః పరేషాం శరణాగతః. ౨౮
అరిః ప్రాణాన్పరిత్యజ్య రక్షితవ్యః కృతాత్మనా.

స చే ద్భయాద్వా మోహా ద్వా కామా ద్వాపి న రక్షతి. ౨౯
స్వయా శక్త్యా యథా సత్త్వం తత్పాపం లోకగర్హితమ్,

వినష్టః పశ్యత స్తస్యా రక్షిణ శ్శరణాగతః. 3౦
ఆదాయ సుకృతం తస్య సర్వం గచ్ఛేదరక్షితః,

వానరేశ్వరుఁడవగు సుగ్రీవుఁడా! ఈలంకలోని రాక్షసులను మాత్రమె కాదు. నే నిచ్చించితినేని ఈలోకంబుననుండు రాక్షసులనందఱను బిశాచంబులను దానవులను యక్షులను వీరలనందఱిం గూడ నా పెదవ్రేలి చివరచే వధించిపుత్తును. ఈవిభీషణుండు న న్నేమి చేయఁగలఁడు? ౨౩

ఒక పావురము తన శత్రు వొకఁడు తను శరణుపొందఁగానే యతనిం జక్కఁగాఁ బూజించి యతనికిఁ దన దేహమాంసము నొసంగి భుజింపుమనెను. ఈసంగతి యందఱకును దెలిసినదేకదా! ౨౪

వానరోత్తముఁడవగు సుగ్రీవుఁడా! ఆ పావురము తనభార్య నపహరించినట్టి యాబోయవాఁడు రాఁగానే యతనిం బరిగ్రహించి రక్షించెనే! ఇంక నాయట్టివాఁడు రక్షింపవలయునని చెప్పవలయునాయేమి? ౨౫

కణ్వమహాముని పుత్త్రుండును బరమర్షియును సత్యవాదియు నగు కండుమహాముని మున్ను పరధర్మబోధకంబగు నొక గాథం జెప్పియున్నాఁడు; దానిం జెప్పెదను వినుము. ౨౬

శత్రువులం దపింపఁ జేయునట్టివాఁడా! చేతులు మొగుడ్చికొని దీనుండై శరణు వేఁడుచున్న శరణాగతుని అకార్యధర్మపరిపాలనంబునకై యెంత మాత్రము వధింపఁగూడదు. ౨౭

శత్రువులలో నెవ్వఁడైన శరణాగతుండయ్యెనేని అతఁడు భీతుండు గాని గర్వితుండుగాని పండితుండగువాఁ డతని తనప్రాణంబులం బోఁగొట్టుకొనియయినను రక్షింపవలయును. ౨౮

భయంబుచేఁగాని యజ్ఞానంబుచేఁగాని కామంబునంగాని యట్లు తన శక్తివంచన లేక రక్షింపకున్నచో నతఁడు గొప్పపాపంబునొందును; లోకంబునందును నిందితుండగును. ౨౯

మఱియు శరణాగతుని రక్షింపకున్నచో నట్లుకండు నష్టకాముండై రక్షించుటలేదని చెప్పినవాఁడు చూచుచుండఁగానే యతం డిదివఱకుఁగూర్చిపెట్టుకొన్న పుణ్యంబునంతయుఁ దీసికొని పోవును. అట్లు సమస్తసంచితపుణ్యనాశంబు వాటిల్లును. ౩౦

ఏవం దోషో మహా నత్ర ప్రపన్నానామరక్షణే. 30
అస్వర్గ్యం చాయశస్యం చ బలవీర్యవినాశనమ్,

కరిష్యామి యథార్థం తు కణ్డో ర్వచన ముత్తమమ్. ౩౨

ధర్మిష్ఠం చ యశస్యం చ స్వర్గ్యం స్యా త్తు ఫలోదయే,

సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతిచ యాచతే. 33
అభయం సర్వభూతేభ్యో దదామ్యేత ద్వ్రతం మమ,

ఆనయైనం హరిశ్రేష్ఠ! దత్తమస్యాభయం మయా. 3౪
విభీషణో వా సుగ్రీవ! యదివా రావణస్స్వయమ్,

రామస్య తు వచ శ్శ్రుత్వా సుగ్రీవః ప్లవగేశ్వరః. 3౫
ప్రత్యభాషత కాకుత్స్థం సౌహార్దేన ప్రచోదితః,

కిమత్ర చిత్రం ధర్మజ్ఞ! లోకనాథ! సుఖావహ!. 3౬
య త్త్వం మార్యం ప్రభాషేథా స్సత్త్వవా న్సత్పథే స్థితః,

మమ చాప్యన్తరాత్మాఽయం శుద్ధం వేత్తి విభీషణమ్. 3౭
అనుమానాచ్చ భావాచ్చ సర్వత స్సుపరీక్షితః,

శరణాగతుల రక్షింపకున్నచో నిట్టి మహాదోషంబుగలుగును. ఇందు వలన నరకంబు గలుగుటయే కాక అపకీర్తియు బలపరాక్రమ నాశంబును సంభవించును. ౩౧

ఉక్తఫలప్రదంబును సమస్తశిష్టజనాదృతంబునగు కండుమహాముని వచనంబు నవశ్యము చేసెదను. ౩౨

అట్లాచరించుటచేఁ బ్రత్యవాయపరిహారముమాత్రమె కాదు. అధిక ధర్మంబును మహాకీర్తియుం స్వర్గప్రాప్తియు నిట్టి మహాభ్యుదయంబు గల్గును

ఒక్కమాఱు "శరణాగతుఁడను నీవాఁడను" అని చెప్పి యాచించు వాని యతనికి ఎవ్వరివలన నేమి భయంబున్నను యాభయంబు లన్నియుం దీర్చెదను. ఇది నావ్రతము. ౩౩

వానరోత్తముఁడా! ఇతఁడు యథార్థముగా విభీషణుండో మఱి యెవ్వఁడేని విభీషణవేషముతో వచ్చినాఁడో యేమో యని సంశయింపవలదు. ఇతఁడు విభీషణుఁడు కాని లేక మహాశత్రుఁడగు రావణుఁడే కాని మరల నితఁడు విభీషణుఁడుగాఁడే యని యిచ్చటఁ జెప్పరావలదు. ఇతనికి నే నభయం బొసంగితిని. తత్క్షణమే తోడ్కొనిరమ్ము. అని సుగ్రీవునితోఁ జెప్పెను. ౩౪

వానరేశ్వరుఁడగు సుగ్రీవుఁడు రాముఁడు చెప్పినమాటను విని యతనికిం గల శరణాగతులయందలి ప్రేమ కచ్చెరువొంది రామునిం జూచి యిట్లని చెప్పెను. ౩౫

ధర్మజ్ఞుఁడవు లోకనాథుఁడవు సర్వభూతంబులకును సుఖంబుగలిగించు వాఁడవు దృఢవ్రతుఁడవు సన్మార్గప్రవర్తకుఁడవు నగునీవు ఇట్లు ధర్మిష్ఠంబగు మాటం జెప్పువిషయమయి యేమి యాశ్చర్యము? ౩౬

విషుమ నుని వధింపవలసినదన్న నామనస్సునకుంగూడ విభీషణుఁడు పరిశుద్ధుఁడని తెలిసినది. నీవును హనుమంతుఁడును జెప్పినయుక్తులవలనను అతని యాకారాదులవలనను అన్నిటను నిస్సందేహముగాఁ బరీక్షించి తెలిసి కొంటిని. ౩౭

తస్మా త్క్షిప్రం సహాస్మాభి స్తుల్యో భవతు రాఘవ!. 3౮
విభీషణో మహాప్రాజ్ఞ స్సఖిత్వం చాభ్యుపైతు నః.

తత స్తు సుగ్రీవవచో నిశమ్య త
ద్ధరీశ్వరేణాభిహితం నరేశ్వరః,
విభీషణేనాశు జగామ సఙ్గమం
పతత్త్రిరాజేన యథా పురన్దరః. 3౯

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డేఽష్టాదశస్సర్గః.

---

## ఏకోనవింశస్సర్గః.

రాఘవేణాభయే దత్తే సన్నతో రావణానుజః,
విభీషణో మహాప్రాజ్ఞో భూమిం సమవలోకయన్. ౧
ఖాత్పపాతావనీం హృష్టో భక్తైరనుచరైస్సహ,

స తు రామస్య ధర్మాత్మా నిపపాత విభీషణః. ౨
పాదయోశ్శరణాన్వేషీ చతుర్భిస్సహ రాక్షసైః,
అబ్రవీచ్చ తదా రామం వాక్యం తత్ర విభీషణః. 3
ధర్మయుక్తంచ యుక్తం చ సామ్ప్రతం సమ్ప్రహర్షణమ్,

అనుజో రావణస్యాహం తేన చాప్యవమానితః. ౪
భవన్తం సర్వభూతానాం శరణ్యం శరణాగతః,
పరిత్యక్తా మయా లఙ్కా మిత్రాణి చ ధనాని చ. ౫
భవద్గతం మే రాజ్యం చ జీవితంచ సుఖానిచ,

రాముఁడా! అందువలన మహాపండితుఁడగు విభీషణుఁడు శీఘ్రంబున నిచ్చటికివచ్చి మాలో నొకఁడై యుండుఁగాక. మాకు స్నేహితుఁడును అగుఁగాక. ౩౦

అంత నరాధీశ్వరుఁడగు రాముఁడు సుగ్రీవుఁడు చెప్పినమాటనువిని యంత సుగ్రీవుఁడు పోయి విభీషణునిం బిలుచుకొనిరాగా గరుత్మంతునితో దేవేంద్రుండు చేరునట్లు రాముఁడు శీఘ్రంబున విభీషణునితోఁ జేరెను. ౩౧

ఇది పదునెనిమిదవసర్గము.

## పందొమ్మిదవసర్గము.

రాముఁ డభయంబు నొసంగఁగానే మహాపండితుఁడగు రావణుని తమ్ముఁడు విభీషణుఁడు అభిమతసిద్ధికై సంతుష్టుఁడై స్వామిభక్తులగు వనచరులతోఁగూడఁ గాల్లు ముందుగా దిగుట యనుచితమని మిక్కిలియు నవనతపూర్వకాయుఁడై నేలంజూచుచు నిట్లు ఆకాశంబుననుండి నేలకు డిగ్గెను. ౧

ధర్మాత్ముఁడగు నా విభీషణుఁడు రక్షణంబుఁగోరి నల్వురి రాక్షసులతోఁ గూడ రాముని పాదంబులం బడెను. ౨

అంత నప్పుడు విభీషణుండు రామునింజూచి ధర్మసంయుతంబును మహాయోగ్యంబునగు నీమాటం జెప్పెను. మున్నతండు సుగ్రీవాదులతోఁ జెప్పునప్పుడు ఆమాట యందఱకును శ్రుతి కటువుగానుండినదిగదా! ఇప్పుడు ఆదేమాట ఆందఱకును శ్రవణానందకరంబుగా నుండినది. ౩

నేను రావణుని తమ్ముఁడను; ఆతఁడు నన్నవమానించెను. కావున సమస్తభూతంబులకును రక్షకుఁడవగు నిన్ను శరణుబొందితిని. ౪

నేను వాసస్థానంబయిన లంకాపట్టణంబును నాస్నేహితులను నాధనంబులనుఁ బరిత్యజించి నీవే గతి యని నీయొద్దకు వచ్చినాను. ఇఁక నారాజ్యంబును నాజీవితంబును నాసుఖంబులును నీయధీనములు. అని విభీషణుఁడు రామునితోఁ జెప్పెను. ౫

తస్య తద్వచనం శ్రుత్వా రామో వచన మబ్రవీత్. ౬
వచసా సాన్త్వయిత్వైనం లోచనాభ్యాం పిబన్నివ,

అఖ్యాహి మమ తత్త్వేన రాక్షసానాం బలాబలమ్. ౭

ఏవ ముక్త స్తదా రక్షో రామేణాక్లిష్టకర్మణా,
రావణస్య బలం సర్వమాఖ్యాతు ముపచక్రమే. ౮
అవధ్యస్సర్వభూతానాం గన్ధర్వోరగరక్షసామ్,
రాజపుత్ర! దశగ్రీవో వరదానాత్స్వయంభువః. ౯

రావణానన్తరో భ్రాతా మమ జ్యేష్ఠశ్చ వీర్యవాన్,
కుమ్భకర్ణో మహాతేజా శ్శక్రప్రతిబలో యుధి. ౧౦

రామ! సేనాపతి స్తస్య ప్రహస్తో యది వా శ్రుతః,
కైలాసే యేన సఙ్గ్రామే మాణిభద్రః పరాజితః. ౧౧

బద్ధగోధాఙ్గులిత్రాణ అవధ్యకవచో యుధి,
ధనురాదాయ తిష్ఠన్ స అదృశ్యో భవతీన్ద్రజిత్. ౧౨

సఙ్గ్రామసమయవ్యూహే తర్పయిత్వా హుతాశనమ్,
అన్తర్ధానగత శ్శత్రూనిన్ద్రజి ద్ధన్తి రాఘవ!. ౧౩

మహోదరమహాపార్శ్వౌ రాక్షస శ్చాప్యకమ్పనః,
అనీకస్థాస్తు తస్యైతే లోకపాలసమా యుధి. ౧౪

రాముఁడు విభీషణునిమాటలు వినియతని మధురవచనంబుల నాస్వాదించి యత్యాదరంబునఁ గరుణారసార్ద్రంబగు కటాక్షంబునం జూచుచు నీమాటం జెప్పెను. ౬

రాక్షసుల బలాబలంబులను యథార్థముగా నాకుఁ జెప్పుము. అని రాముఁడు విభీషణునితోఁ జెప్పెను. ౭

అంత విభీషణుఁడు అక్లిష్టకర్ముఁడగు రాముఁడు చెప్పినమాటను విని రావణుని బలంబునంతయుం జెప్ప నారంభించెను. ౮

రాచకొమరుఁడవగు రాముఁడా ! రావణుఁడు బ్రహ్మదేవుని వరంబునం జేసి గంధర్వులకుఁగాని యసురులకుఁగాని రాక్షసులకుఁగాని యట్లు సమస్త భూతంబులకును అవధ్యుఁడై యెప్పుడున్నాఁడు. ౯

రావణునకుఁ దమ్ముఁడును నాకు జ్యేష్ఠుఁడునగు కుంభకర్ణుఁడు మహాపరాక్రమశాలి. మహాతేజుఁడు. యుద్ధంబున దేవేంద్రునకు సరివచ్చు బలము గలవాఁడు. ౧౦

కైలాసపర్వతంబుననున్న కుబేరసేనానాయకుఁడగు మాణిభద్రుని జయించినట్టి మహాపరాక్రమశాలియగు రావణుని సేనాపతిం బ్రహస్తుని వాను మంతుఁడు చెప్పఁగా వినియుందురుగదా ! ౧౧

రావణునికుమారుఁడగు నింద్రజిత్తు యుద్ధంబున గోధాంగుళిత్రాణంబులు ధరించి యభేద్యంబగు కవచంబు దొడిగికొని ధనువుఁదాల్చి నిలుచుండఁగానే యదృశ్యుఁ డగుచున్నాఁడు. ౧౨

రాముఁడా ! యుద్ధకాలంబులందు ఇరువాఁగునను బద్ధవ్యూహంబు లయియుండునప్పుడు ఇంద్రజిత్తు హోమంబులచే నగ్నిహోత్రుఁ దృప్తి నొందించి తత్ప్రీభావంబున అదృశ్యుఁడై శత్రువులను వధించును. ౧౩

మహోదరుఁడును మహాపార్శ్వుఁడును అకంపనుఁడును వీరలు మొదలగు రావణునిసేనాపతు లనేకు లున్నారు. వారలందఱు యుద్ధంబున లోకపాలురకు సరివత్తురు. ౧౪

దశకోటిసహస్రాణి రక్షసాం కామరూపిణామ్,
మాంసశోణితభక్షాణాం లఙ్కాపురనివాసినామ్. ౧౫
స తైస్తు సహితో రాజా లోకపాలా నయోధయత్,
సహ దేవై స్తు తే భగ్నా రావణేన మహాత్మనా. ౧౬

విభీషణవచః శ్రుత్వా రామో దృఢపరాక్రమః,
అన్వీక్ష్య మనసా సర్వమిదం వచనమబ్రవీత్. ౧౭

యాని కర్మాపదానాని రావణస్య విభీషణ!,
ఆఖ్యాతాని చ తత్త్వేన హ్యవగచ్ఛామి తాన్యహమ్. ౧౮
అహం హత్వా దశగ్రీవం సప్రహస్తం సబాన్ధవమ్,
రాజానం త్వాం కరిష్యామి సత్య మేతద్బ్రవీమి తే. ౧౯

రసాతలం వా ప్రవిశే త్పాతాళం వాపి రావణః,
పితామహసకాశం వా న మే జీవ న్విమోక్ష్యతే. ౨౦
అహత్వా రావణం సఙ్ఖ్యే సపుత్త్రబలబాన్ధవమ్,
అయోధ్యాం న ప్రవేక్ష్యామి త్రిభి స్తై ర్భ్రాతృభి శ్శపే ౨౧

శ్రుత్వా తు వచనం తస్య రామస్యాక్లిష్టకర్మణః,
శిరసా వన్ద్య ధర్మాత్మా వక్తు మేవోపచక్రమే. ౨౨

రాక్షసానాం వధే సాహ్యం లఙ్కాయాశ్చ ప్రధర్షణే,

అట్లు మాంసశోణితాహారులును కావలసినరూపంబులు దాల్పంజాలిన వారలునగు ప్రధానరాక్షసులు లంకయందుఁ బదివేలకోటు లున్నారు. ౧౪

రాక్షసరాజుఁ డగు రావణుఁడు ఆరాక్షసులంగూడియే దిక్పాలకులతోఁగూడ యుద్ధంబు గావించెను.

ఆదిక్పాలకులందఱు సమస్తదేవతలతోఁగూడ మహాపరాక్రమశాలి యగు రావణునిచేఁ బరాజితులయిరి. అని విభీషణుఁడు రామునితోఁ జెప్పెను. ౧౫

దృఢపరాక్రమశాలియగు రాముఁడు విభీషణుండు చెప్పినమాటను విని మనస్సున నంతయుం నాలోచించి, మరల విభీషణుంజూచి యీమాటం జెప్పెను. ౧౬

విభీషణుఁడా! నీ విప్పుడు చెప్పిన రావణుని మనుపటి శౌర్యకార్యంబు లన్నియును నామనస్సునకు వచ్చినవి. ౧౭

నేను ప్రహస్తునితో సమస్తబంధువులతోనుంగూడ రావణుని వధించి నిన్ను లంకారాజ్యంబునకు రాజుం గావించెదను. ఇది సత్యము. నీకుఁ జెప్పుచున్నాను. ౧౮

రావణుఁడు రసాతలలోకంబుఁ బ్రవేశించినను పాతాళంబుఁ బొచ్చినను బ్రహ్మలోకంబునకుఁ బోయినను వే నతనిం బ్రాణంబులతో విడువను.

యుద్ధంబునఁ గొడుకులతోను సైన్యంబులతోను బంధువులతోనుం గూడ రావణుని వధింపక నయోధ్యకుఁబోను. ఇది నిశ్చయము. నాముగ్గురితమ్ములమీఁద శపథము సేయుచున్నాను. అని రాముండు విభీషణునితోఁ జెప్పెను. ౨౧

ధర్మాత్ముఁడగు విభీషణుఁడు అందఱకును సంతోషకరంబులయిన కార్యంబులుగల రాముండు చెప్పినమాటలు విన్నంతనే యాయనకు సాష్టాంగముగ నమస్కరించి యిట్లని చెప్పెను. ౨౨

నేనును నాశక్తికొలఁది రాక్షసులం జంపుటయందును లంకాపురధర్ష

కరిష్యామి యథాప్రాణం ప్రవేక్ష్యామి చ వాహినీమ్. ౨౩

ఇతి బ్రువాణం రామస్తు పరిష్వజ్య విభీషణమ్,
అబ్రవీ ల్లక్ష్మణం ప్రీత
స్సముద్రా జ్జల మానయ. ౨౪

తేన చేమం మహాప్రాజ్ఞ మభిషిఞ్చ విభీషణమ్,
రాజానం రక్షసాం క్షిప్రం ప్రసన్నే మయి మానద!. ౨౫

ఏవ ముక్తస్తు సౌమిత్రిరభ్యషిఞ్చ ద్విభీషణమ్,
మధ్యే వానరముఖ్యానాం రాజానం రామశాసనాత్. ౨౬
తం ప్రసాదం తు రామస్య దృష్ట్వా సద్యః ప్లవఙ్గమాః,
ప్రచుక్రుశు ర్మహాత్మానస్సాధు సాధ్వితి చాబ్రువన్. ౨౭

అథాబ్రవీ ద్ధనూమాంశ్చ సుగ్రీవశ్చ విభీషణమ్,

కథం సాగర మక్షోభ్యం తరామ వరుణాలయమ్. ౨౮
సైన్యైః పరివృతా స్సర్వే వానరాణాం మహౌజసామ్,
ఉపాయం నాధిగచ్ఛామో యథా నదనదీపతిమ్. ౨౯
తరామ తరసా సర్వే ససైన్యా వరుణాలయమ్,

ఏవ ముక్తస్తు ధర్మజ్ఞః ప్రత్యువాచ విభీషణః. ౩౦

సముద్రం రాఘవో రాజా శరణం గన్తు మర్హతి,
ఖానిత స్సగరేణాయ మప్రమేయో మహోదధిః. ౩౧
కర్తు మర్హతి రామస్య జ్ఞాతేః కార్యం మహామతిః,

ణంబునందును సాహాయ్యంబు గావించెదను. శత్రుసైన్యంబుఁజొచ్చి యుద్ధమునుం జేసెదను. అని విభీషణుఁడు రామునితోఁ జెప్పెను. ౨౩

రాముఁడు ఈప్రకారము చెప్పుచున్న విభీషణునిం గవుఁగిలించుకొని పరమప్రీతుఁడై లక్ష్మణుంజూచి యిట్లని చెప్పెను.

కులమునకు గౌరవముగల్గించునట్టి లక్ష్మణుఁడా! నేను బ్రసన్నుఁడ నయింతిని. నీవు సముద్రంబునుండి జలముం దెచ్చి యాసముద్రజలముచే శీఘ్రంబున బండితుఁడగు నీవిభీషణుని రాక్షసరాజుఁగా నభిషేకింపుము. అని రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పెను. ౨౪, ౨౫

అంత లక్ష్మణుఁడు రామునిమాటను విని రాజాజ్ఞవలన వానరముఖ్యుల నడుమ విభీషణుని రాక్షసరాజుగా నభిషేకించెను ౨౬

వానరులందఱు రాముఁ డతిశీఘ్రంబుగా విభీషణునియందుఁ గావించిన యనుగ్రహంబుఁజూచి పరమసంతోషంబున సింహనాదంబులు నేయుచు మహాత్ముఁడగురాముని సాధువాదంబులం బ్రశంసించిరి. ౨౭

అంత నేకాంతంబున హనుమంతుఁడును సుగ్రీవుఁడును విభీషణుని యొద్దకుంబోయి యిట్లని యడిగిరి.

మనమందఱము మహాపరాక్రమశాలులగు నీవానరులసేనతోఁగూడ నక్షోభ్యంబగు నీసముద్రము నెట్లు దాఁటఁగలము? ౨౮

మనమందఱము సైన్యముతోఁగూడ నీమహాసముద్రము నెట్లు దాఁటఁగలమో ఆయుపాయంబు మాకుఁ దెలియులేదు. నీవే చెప్పవలయును. అని హనుమంతుఁడును సుగ్రీవుఁడు విభీషణు నడిగిరి. ౨౯

ధర్మజ్ఞుఁడగు విభీషణుఁడు హనుమత్సుగ్రీవులు చెప్పినమాటను విని వారల కిట్లని చెప్పెను. ౩౦

మహారాజుఁడగు రాముఁడు సముద్రుని శరణంబొందవలెను.

అప్రమేయుండగు నీసముద్రుఁడు రామునికూటస్థుఁడయిన సగరచక్రవర్తిచే వృద్ధినొందింపఁబడినవాఁడు. రాముఁడు సగరవంశంబునం బుట్టినవాఁ

ఏవం విభీషణేనోక్తో రాక్షసేన విపశ్చితా. ౩౨
ఆజగామాథ సుగ్రీవో యత్ర రామ స్సలక్ష్మణః,
తత శ్చాఖ్యాతు మారేభే విభీషణవచ శ్శుభమ్. ౩౩
సుగ్రీవో విపులగ్రీవ స్సాగరస్యోపవేశనమ్,
ప్రకృత్యా ధర్మశీలస్య రాఘవస్యాప్యరోచత. ౩౪

స లక్ష్మణం మహాతేజా స్సుగ్రీవం చ హరీశ్వరమ్,
సత్క్రియార్థం క్రియాదక్షః స్మితపూర్వ మువాచ హ. ౩౫

విభీషణస్య మన్త్రోఽయం మమ లక్ష్మణ! రోచతే,
బ్రూహి త్వం సహసుగ్రీవ స్తవాపి యది రోచతే. ౩౬
సుగ్రీవః పణ్డితో నిత్యం భవా న్మన్త్రవిచక్షణః,
ఉభాభ్యాం సమ్ప్రధార్యార్థం రోచతే యత్త దుచ్యతామ్.

ఏవ ముక్తౌ తు తౌ వీరా వుభౌ సుగ్రీవలక్ష్మణౌ,
సముదాచారసంయుక్త మిదం వచన మూచతుః. ౩౮
కిమర్థం నౌ నరవ్యాఘ్ర! న రోచిష్యతి రాఘవ!,
విభీషణేన యచ్చోక్త మస్మి న్కాలే సుఖావహమ్. ౩౯

అబద్ధ్వా సాగరే సేతుం ఘోరేఽస్మి న్వరుణాలయే,
లఙ్కా నాసాదితుం శక్యా సేన్ద్రై రపి సురాసురైః. ౪౦

విభీషణస్య శూరస్య యథార్థం క్రియతాం వచః,

జేగుటవలనఁ గృతజ్ఞుఁడగు నీసముద్రుఁడు రామకార్యమునఁగాఁదప్పక కావిం చును. అని విభీషణుఁడు హనుమత్సుగ్రీవులకుఁ జెప్పెను. 30

సుగ్రీవుఁడు పండితుఁడగు విభీషణుఁడు చెప్పినమాటను విని యంత రాముఁడును లక్ష్మణుఁడును ఉన్నస్థలంబునకు వచ్చెను. 32

అంత విశాలకంఠుఁడగు సుగ్రీవుఁడు రామునకు విభీషణుఁడు చెప్పిన సముద్రోపాసనంబును గుఱించి చెప్ప నారంభించెను. 33

అట్లు సముద్రంబును నుపాసించుటకు స్వభావముగనె పరమధార్మికుఁ డగు రాముఁడును సమ్మతించెను. 34

మహాతేజుఁడును గార్యంబులం బండితుఁడునగు రాముఁడు లక్ష్మణుని వానరనాథుఁడగు సుగ్రీవునింజూచి వారల సమ్మానించుటకొఱకు మొగంబునఁ జిఱునగవుదోఁప నిట్లని చెప్పెను. 35

లక్ష్మణుఁడా! విభీషణుఁడు చెప్పిన యాలోచనము నాకు సమ్మతముగా నున్నది. నీకును సమ్మతంబగునేని సుగ్రీవునితో నాలోచించి నాకుం జెప్పుము.

సుగ్రీవుఁడు మిక్కిలియుఁ బండితుఁడు, నీవును ఆలోచనంబునందు మిక్కిలియు సమర్థుఁడవు. మీరిద్దఱు నాలోచించి నిశ్చయించి యేది మీకు సమ్మతమో దానిం జెప్పుఁడు అని రాముఁడు లక్ష్మణసుగ్రీవులతోఁ జెప్పెను.

పరాక్రమశాలులగు నాసుగ్రీవలక్ష్మణు లిద్దఱును రాముఁ డానతిచ్చిన మాటను విని చేతులుమొగిడ్చి వినయపూర్వకంబుగా నీమాటం జెప్పిరి. 38

పురుషశ్రేష్ఠుఁడవగు రాముఁడా! వియుపాయంబును దోఁచని కాలం బున సుఖంబుగాఁ గార్యసాధకంబగు విభీషణుని యాలోచన మాకెందుకు సమ్మతము గాకుండును? 39

భయంకరంబగు నిమ్మహాసముద్రంబున సేతువు నిర్మింపక దేవేంద్ర సహితులగు దేవాసురులకైనను లంకాపురికిం బోవుట కలవిగాదు. 40

పండితుఁడగు విభీషణుఁడు చెప్పినమాట యథార్థము; ఆప్రకారము చేయుఁడు.

అలం కాలాత్యయం కృత్వా సముద్రోఽయం నియుజ్యతామ్.
యథా సైన్యేన గచ్ఛామ పురీం రావణపాలితామ్,

ఏవ ముక్తః కుశాస్తీర్ణే తీరే నదనదీపతేః. ౪౨
సంవివేశ తదా రామో వేద్యామివ హుతాశనః.

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డ ఏకోనవింశస్సర్గః. ౧౯.

---

## వింశస్సర్గః.

తతో నివిష్టాం ధ్వజినీం సుగ్రీవేణాభిపాలితామ్,
దదర్శ రాక్షసోఽభ్యేత్య శార్దూలో నామ వీర్యవాన్. ౧

చారో రాక్షసరాజస్య రావణస్య దురాత్మనః,
తాం దృష్ట్వా సర్వతో వ్యగ్రం ప్రతిగమ్య స రాక్షసః. ౨
ప్రవిశ్య లఙ్కాం వేగేన రావణం వాక్య మబ్రవీత్,
ఏష వానరఋక్షౌఘో లఙ్కాం సమభివర్తతే. 3
అగాధ శ్చాప్రమేయశ్చ ద్వితీయ ఇవ సాగరః,
పుత్రౌ దశరథస్యేమౌ భ్రాతరౌ రామలక్ష్మణౌ. ౪
ఉత్తమాయుధసంపన్నౌ సీతాయాః పదమాగతౌ,
ఏతౌ సాగర మాసాద్య సన్నివిష్టౌ మహాద్యుతీ. ౫

బల మాకాశ మావృత్య సర్వతో దశయోజనమ్,

తత్త్వభూతం మహారాజ! క్షిప్రం వేదితు మర్హసి. ౬

కాలక్షేపము సేయవలదు. మనమందఱము సైన్యముతోఁ గూడ రావణ బాహుపాలితంబగు లంకాపురిం జేరునట్లు సముద్రుని బ్రార్థింపుఁడు. అని సుగ్రీవలక్ష్మణులు రాముసకుం జెప్పిరి. ४०

లక్ష్మణసుగ్రీవులు చెప్పినమాటను విని యంత రాముఁడు సముద్రతీరం బున దర్భలుపఱిచి యందుపై వేదియం దగ్నిహోత్రుఁడువలె శయనించెను.

ఇది పందొమ్మిదవసర్గము.

---

## ఇరువదవసర్గము.

అంతఁ బరాక్రమవంతుఁడగు శార్దూలుఁడను నొకరాక్షసుఁడు వచ్చి సుగ్రీవబాహుపాలితమై సముద్రతీరంబునవిడిసియున్న వానరసేననంతయుం జూచెను. ०

దురాత్ముఁడగు రాక్షసరాజుఁడయిన రావణుని చారుఁడగు నాశార్దూలుఁడు అట్లు జాగ్రత్తతో నావానరసేననంతయుఁ గలయ నవలోకించి మరలి వేగంబున లంకకుఁబోయి రావణుఁజూచి యిట్లని చెప్పెను. ౨

అగాధంబు నప్రమేయంబునగు వానరభల్లూకసేన రెండవసముద్రంబు కరణి లంకమీఁదికి వచ్చుచున్నది. 3

దశరథమహారాజపుత్రులయిన యన్నదమ్ములు రామలక్ష్మణు లిద్దఱును ఉత్తమాయుధంబులు ధరించి సీతయుండు స్థలంబునకువచ్చుట కున్నారు. ४

మహాతేజులగు నీరామలక్ష్మణులు ఇప్పుడు సముద్రంబునొద్ద విడిసి యున్నారు. ५

వానరసేన యెటుచూచినను బదియామడలదూరమువఱకు భూమి నావరించి యున్నది.

మహారాజుఁడవగు రావణుఁడా! నేను సామాన్యముగాఁ జూచి వచ్చి నాను. శీఘ్రముగా యథార్థసంగతిం దెలిసికొనుము. ౬

తవ దూతా మహారాజ! క్షిప్ర మర్హా న్త్యవేక్షితుమ్,

ఉపప్రదానం సాన్త్వం వా భేదో వాఽత్ర ప్రయుజ్యతామ్. ౭

శార్దూలస్య వచః శ్రుత్వా రావణో రాక్షసాధిపః,
ఉవాచ సహసా వ్యగ్ర స్సమ్ప్రధార్యార్థ మాత్మనః. ౮
శుకం నామ తదా రక్షో వాక్య మర్థవిదాం వరమ్,
సుగ్రీవం బ్రూహి గత్వా త్వం రాజానం వచనా న్మమ. ౯
యథా సన్దేశ మక్లీబం శ్లక్ష్ణయా పరయా గిరా,
త్వం వై మహారాజకులే ప్రసూతో
మహాబల శ్చర్క్షరజ స్సుతశ్చ. ౧౦
న కశ్చి దర్థ స్తవ నా స్త్యనర్థ
స్తథాహి మే భ్రాతృసమో హరీశ!,

అహం యద్యహరం భార్యాం రాజపుత్రస్య ధీమతః. ౧౧
కిం తత్ర తవ సుగ్రీవ! కిష్కిన్ధాం ప్రతి గమ్యతామ్,

న హీయం హరిభి ర్లఙ్కా శక్యా ప్రాప్తుం కథంచన. ౧౨
దేవైరపి సగన్ధర్వై ర్కిం పున ర్నరవానరైః,

స తథా రాక్షసేన్ద్రేణ సన్దిష్టో రజనీచరః. ౧౩
శుకో విహఙ్గమో భూత్వా తూర్ణ మాప్లుత్య చామ్బరమ్,

మహారాజేంద్రవగు రావణుండా! నీవు శీఘ్రముగా దూతలం బంపి చక్కఁగాఁ జూచిరమ్మని యాజ్ఞాపించుము

ఈవిషయమునందు దానముగాని మంచిమాటగాని భేదోపాయముగాని ప్రయోగింపఁబడుఁగాక. అని శార్దూలుఁడు రావణునకుం జెప్పెను. ౭

రాక్షసనాథుఁడగు రావణుఁడు శార్దూలుఁడు చెప్పినమాటవిని యంత కాలవ్యంబు సేయక యెచ్చరికతోఁ జేయవలసిన కార్యంబు నిశ్చయించికొని కార్యవేత్తలలో నుత్తముఁడగు శుకుఁడగు రాక్షసుంజూచి యిట్లని చెప్పెను.

నీవు పోయి వానరరాజుఁడగు సుగ్రీవుంజూచి నేను జెప్పిపంపిన మాటలను విడువక ధైర్యంబును మృదులంబును శ్రావ్యంబు నగురీతిం జెప్పుము. ౯

వానరమహారాజుండవగు సుగ్రీవుఁడా! నీవు సత్కులంబునఁ బుట్టినవాఁడవు. నిష్కారణంబుగ వైరంబు గొనకుము. మహాబలుండవు. అల్పబలుండగురామునితో నీకేమికార్యము? మఱియు బ్రహ్మపుత్రుఁడగు ఋక్షరజసుని పుత్రుఁడవు? కావున నాకు బంధుఁడవైతివి. ఇదిగాక నీ కిందు లాభంబు లేదు. నష్టంబును లేదు. నాకును నీయన్న వాలికిని మిక్కిలి స్నేహము. కావున నీవు నాతోఁబుట్టువంటివాఁడవైతివి. నాతో వైరంబు సేయకుము. ౧౦

సుగ్రీవుఁడా! నేను రాజపుత్రుఁడగు రామునిభార్యను గొనివచ్చితినేని, వానరేశ్వరుఁడగు నీకేమిసంబంధము? నీవుబుద్ధిమంతుఁడ వాలోచించుకొనుము. నీకేమియు నక్కఱలేదు. ఊరక కిష్కింధకుఁ బొమ్ము. ౧౧

ఈలంకాపురిం బ్రవేశింప వానరులకెంతమాత్రమలవికాదు. దేవతలును గంధర్వులునుంగూడ బ్రవేశింపఁజాలరు. ఇంక మనుష్యులును వానరులును బ్రవేశింపజాలరని చెప్పవలసిన దేమియున్నది? అని సుగ్రీవునితోఁ జెప్పుము. అని రావణుఁడు శుకునితోఁ జెప్పెను. ౧౨

శుకుఁ డట్లు రాక్షసేశ్వరుఁడగు రావణుఁడు చెప్పినమాటలు విని పక్షిరూపంబుదాల్చి శీఘ్రంబున నాకాశంబున కెగిరి రాముఁడున్న సముద్రోత్తరతీరంబునకు వచ్చెను. ౧౩

స గత్వా దూర మధ్వాన ముపర్యుపరి సాగరమ్. ౧౪
సంస్థితో హ్యమ్బరే వాక్యం సుగ్రీవ మిద మబ్రవీత్,
సర్వ ముక్తం యథాదిష్టం రావణేన దురాత్మనా. ౧౫

తం ప్రాపయన్తం వచనం తూర్ణ మాప్లుత్య వానరాః,
ప్రాపద్యన్త దివం క్షిప్రం లోప్తుం హన్తుం చ ముష్టిభిః. ౧౬
స తైః ప్లవఙ్గైః ప్రసభం నిగృహీతో నిశాచరః,
గగనా ద్భూతలే చాశు పరిగృహ్యా నిపాతితః. ౧౭
వానరైః పీడ్యమానస్తు శుకో వచన మబ్రవీత్,

న దూతా న్ఘ్నన్తి కాకుత్స్థ! వార్యన్తాం సాధు వానరాః. ౧౮

య స్తు హిత్వా మతం భర్తు స్స్వమతం సమ్ప్రభాషతే,
అనుక్తవాదీ దూత స్సన్ స దూతో వధ మర్హతి. ౧౯

శుకస్య వచనం శ్రుత్వా రామ స్సపరిదేవితమ్,
ఉవాచ మావధిష్టేతి ఘ్నత శ్శాఖామృగర్షభాన్. ౨౦

స చ పత్త్రలఘు ర్భూత్వా హరిభి ర్దర్శితే భయే,
అన్తరిక్షస్థితో భూత్వా పున ర్వచన మబ్రవీత్. ౨౧

సుగ్రీవ! సత్త్వసమ్పన్న! మహాబలపరాక్రమ!,
కిం మయా ఖలు వక్తవ్యో రావణో లోకరావణః. ౨౨

అట్లు శుకుఁడు కొంచెము సముద్రంబునకుమీఁదుగా నాకాశమార్గంబున బహుదూరంబుపోయి సుగ్రీవుఁడు ఉన్నస్థలంబుఁ జేరి యాకాశంబుననే యుండి సుగ్రీవుంజూచి దురాత్ముఁడగు రావణుఁడు తనతోఁ జెప్పిపంపిన మాటలన్నియుం నొక్కటియయినను విడువక క్రమంబుగాఁ జెప్పెను.

అంత నట్టిమాటలు పలుకుచున్న శుకుంజూచి వానరులు ఆతనిఁ బిడి కిళ్లంగొట్టి రెక్కలువిఱుచుటకై శీఘ్రంబున నాకాశంబున కుద్గమించిరి.

ఆవానరులు బలాత్కారమున వారాశును నొడిసిపట్టుకొని యాకాశంబుననుండి నేలం బడఁద్రోసిరి. ౧౭

అట్లు వానరులు తన్నుఁ బీడింపఁగా శుకుఁడు రాముం జేరఁ గని యిట్లని విలపించెను.

రాముఁడా! ధార్మికులు దూతలం జంపరు. న న్నీవానరులు చంపవలెనని పట్టియున్నారు. కావున వీరలకు వలదని యాజ్ఞాపింపుము. ౧౮

ఎవ్వఁడు స్వామిచెప్పిపంపినమాటలను జెప్పక స్వామిమతంబును విడిచి స్వమతంబుఁ జెప్పునో ఆట్టిదూతను మాత్రము వధింపవలయును అని శుకుఁడు రామునితోఁ జెప్పఁగొనెను. ౧౯

అంతరాముఁడు శుకుఁడు రోదనపూర్వకముగాఁ జెప్పుకొన్నమాటను విని కరుణించి శుకుఁ గొట్టుచున్న వానరోత్తములంజూచి 'వీని వధింపవలదు' అని యాజ్ఞాపించెను. ౨౦

అట్లు వానరులు పీడించి వదలినపిమ్మట ఆశుకుఁడు కొంతభాగము విఱువఁబడుటం జేసి తేలికగానున్న రెక్కలతో నాకాశంబునొంది సుగ్రీవుం జూచి మరల నిట్లని చెప్పెను. ౨౧

మహాబలపరాక్రమశాలివి. శక్తిసంపన్నుఁడవు నగుసుగ్రీవుఁడా! లోకంబుల నేడ్పించునట్టి రావణునకు నేనేమిచెప్పవలయును? చెప్పుము. అని శుకుఁడు సుగ్రీవునితోఁ జెప్పెను. ౨౨

స ఏవ ము క్తగి ప్లవగాధిప స్తదా
ప్లవఙ్గమానా మృషభో మహాబలః,
ఉవాచ వాక్యం రజనీచరస్య
చారం శుకం తూర్ణ మదీనస త్త్వః. ౨౩
న మేఽసి మిత్రం న తథానుకమ్పో
న చోపకర్తాసి న మే ప్రియోఽసి,
అరిశ్చ రామస్య సహానుబన్ధ
స్సమేఽసి వాలీవ వధార్హ వధ్యః. ౨౪

నిహ న్మ్యహం త్వాం ససుతం సబన్ధుం
స జ్ఞాతివర్గం రజనీచరేశ,
లఙ్కాంచ సర్వాం మహతా బలేన
శీఘ్రం కరిష్యామి సమేత్య భస్మ. ౨౫
న మోక్ష్యసే రావణ! రాఘవస్య
సురై స్సహేన్ద్రై రపి మూఢ గు ప్తః,
అ న్తర్హిత స్సూర్యపథం గతో వా
తథైవ పాతాళ మను ప్రవిష్టః. ౨౬
తస్య తే త్రిషు లోకేషు న పిశాచం న రాక్షసమ్,
త్రాతార మనుపశ్యామి న గన్ధర్వం న చాసురమ్. ౨౭
అవధీ ర్యజ్జరావృద్ధ మక్షమం కిం జటాయుషమ్,

కింను తే రామసాన్ని ధ్యే సకాశే లక్ష్మణస్య వా. ౨౮
హృతా సీతా విశాలాక్షీ యాం త్వం గృహ్య న బుధ్యసే,

అట్లు వానరోత్తముఁడును మహాబలుఁడును వానరరాజుండునగు సుగ్రీవుఁడు రావణుని చారుఁడయిన శుకుఁడు చెప్పినమాటను విని యఁశనింజూచి యిట్లని చెప్పెను. ౨౨

నీవు నాకు స్నేహితుడవుకావు. కావున నీవు నాకుఁ గరుణింపఁదగిన వాఁడవుకావు. నాకు నీ వేయుపకారంబును జేసినవాఁడవుఁ గావు ప్రియుఁడవుగావు. మఱియు నాస్నేహితుఁడగు రామునకు శత్రుఁడవు. కావునను నా శత్రువగు వాలికి మిత్రుఁడవు. కావునను నీవు నాకు శత్రుఁడవు, వాలియుంబోలె వధ్యుఁడవు. ౨౩

రాక్షసాధీశ్వరుఁడగు రావణుఁడా! నేను నిన్ను నీకొడుకులను నీబంధువులను నీదాయాదులను అందఱను వధించెను. శీఘ్రింబున మహాసేనతో వచ్చి లంకాపురియంతయు నీఱుగావించెదను. ౨౪

మూఢుఁడవగు రావణుఁడా! నీకు దేవేంద్రాదులు తోడువచ్చినను నీవంతర్ధానంబు నొందపోయినను సూర్యద్వారంబునొందినను పాతాళలోకంబు నకుఁబోయినను రాముఁడు నిన్నువిడువడు. అవశ్యము వధించును. ౨౫

రామునిబారిం బడిననిన్ను ముల్లోకంబులందును పిశాచములుగాని గంధర్వులుగాని యసురులుగాని రక్షింపంజాలరు. ౨౬

నీవు జటాయువును వధించితినని నిన్ను నీవే మెచ్చుకొనుచున్నావు కాఁబోలు! అతఁడు ముసలివాఁడు, అసమర్థుఁడు. అట్టివాని వధించుట యేమి యధికము?

నీవు సీతం దెచ్చితిననిగదా విఱ్ఱవీఁగుచున్నావు. విశాలాక్షి యగు నాసీతను రాముఁడైనను లక్ష్మణుఁడైననుండునప్పుడు నపహరించితివా యేమి. వారలకు భయమువడి వార లెవ్వరును లేనప్పుడు దొంగతనముగాఁ దీసికొని

మహాబలం మహాత్మానం దుర్ధర్ష మమరై రపి. ౨౯
నబుధ్యసే రఘుశ్రేష్ఠం య స్తే ప్రాణా న్హరిష్యతి,

తతోఽబ్రవీ ద్వాలిసుత స్త్వఙ్గదో హరిసత్తమః. ౩౦

నాయం దూతో మహారాజ చారికః ప్రతిభాతి మే,
తులితం హి బలం సర్వ మనేనాత్రైవ తిష్ఠతా. ౩౧

గృహ్యతాం మాగమ ల్లఙ్కా మేతద్ధి మమ రోచతే,

తతో రాజ్ఞా సమాదిష్టా స్సముత్ప్లుత్య వలీముఖాః. ౩౨
జగృహుశ్చ బబన్ధుశ్చ విలపన్త మనాథవత్,
శుకస్తు వానరై శ్చణ్డై స్తత్ర తై స్సమ్ప్రపీడితః. ౩౩

వ్యాక్రోశత మహాత్మానం రామం దశరథాత్మజమ్,
లుప్యేతే మే బలా త్పక్షౌ భిద్యేతే చ తథాఽక్షిణీ. ౩౪

యాంచ రాత్రిం మరిష్యామి జాయే రాత్రిం చ యా మహమ్,
ఏతస్మి న్నన్తరే కాలే యన్మయా హ్యశుభం కృతమ్. ౩౫
సర్వం త్వ ముపపద్యేథా జహ్యాం చే ద్యది జీవితమ్,

నాఘాతయ త్తదా రామః శ్రుత్వా తత్పరిదేవనమ్. ౩౬
వానరా నబ్రవీ ద్రామో ముచ్యతాం దూత ఆగతః,

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే వింశస్సర్గః.

వచ్చితివే. ౨౮

నీప్రాణంబులం గొనునట్టి మహాబలుఁడును మహాత్ముఁడును దేవతలకైన చెనకరానివాఁడునగు రాము నెఱుంగవు. అని సుగ్రీవుఁడు రావణునితోఁ జెప్పుమని శుకునితోఁ జెప్పెను. ౨౯

అంత వానరశ్రేష్ఠుఁడును వాలికుమారుఁడునగు నంగదుఁడు సుగ్రీవునితో నిట్లని చెప్పెను. ౩౧

మహారాజుఁడగు సుగ్రీవుఁడా! ఈశుకుఁడు దూతకాఁడు. ఈతఁడు రావణునిచారుఁడని నాకుఁ దోఁచుచున్నవి. ఇతండు మనయెదుట నున్నట్లుండి సేనాసన్నివేశవిధమంతయుఁ గనిపించినాఁడు. ౩౧

ఇతనిం బట్టి బంధింపుఁడు. ఇతనిలంకకుఁ బోనియ్యఁగాదు. ఇది నాకుఁ దోఁచుచున్నది. అని యంగదుఁడు సుగ్రీవునకుఁ జెప్పెను.

అంత సుగ్రీవునియాజ్ఞచే వానరులు ఆకాశంబున కెగరి యనాథయుంబోలె రోదనంబుసేయుచున్న యాశుకుంబట్టి బంధించిరి. ౩౨

అంత శుకుఁడు అట్లచ్చట భయంకరాకారులగు వానరులచే బీడితుఁడై మహాత్ముఁడును దశరథకుమారుఁడునగు రాముం జేరఁ గూని విలపించెను.

నా ఱెక్కలను బలాత్కారంబున విఱిచియున్నారు! నాకండ్లం బెఱికివేయుచున్నారు. ౩౪

అనపరాధిని దూతనగు నేను అన్యాయంబున నిచ్చట వధింపఁబడుదు నేని బుట్టినది మొదలు ఇదివఱకు ఏయే పాపములం జేసియుందునో అట్టి ఘోరములైన నాపాపములన్నియుం నిన్నుఁ బొందును. అని శుకుఁడు రామునిం జేరఁ గూని విలపించెను. ౩౫

అప్పుడు రాముఁడు శుకుని రోదనంబు నాలోకించి "దూతను విడుపుఁడు" అని వానరుల కాజ్ఞాపించిశుకుని విడిపించెను. ౩౬

ఇది యిరువదవసర్గము.

---

## ఏ క విం శ స్స ర్గః.

తత స్సాగరవేలాయాం దర్భా నాస్తీర్య రాఘవః,
అఞ్జలిం ప్రాఙ్ముఖః కృత్వా ప్రతిశిశ్యే మహోదధేః. ౧
బాహుం భుజగభోగాభ ముపధాయారిసూదనః,

జాతరూపమయై శ్చైవ భూషణై ర్భూషితం పురా. ౨
వరకాఞ్చనకేయూరముక్తాప్రవరభూషణైః,
భుజైః పరమనారీణా మభిమృష్ట మనేకధా. ౩
చన్దనాగరుభి శ్చైవ పురస్తా దధివాసితమ్,
బాలసూర్యప్రతీకాశై శ్చన్దనై రుపశోభితమ్. ౪
శయనే చోత్తమాఙ్గేన సీతాయా శ్శోభితం పురా,
తక్షకస్యేవ సమ్భోగం గఙ్గాజలనిషేవితమ్. ౫
సంయుగే యుగసఙ్కాశం శత్రూణాం శోకవర్ధనమ్,
సుహృదానన్దనం దీర్ఘం నాగరా న్తవ్యపాశ్రయమ్. ౬
అస్యతా చ పున స్సవ్యం జ్యాఘాతవిగతత్వచమ్,
దక్షిణో దక్షిణం బాహుం మహాపరిఘసన్నిభమ్. ౭
గోసహస్రప్రదాతార ముపధాయ మహద్భుజమ్,
అద్య మే మరణం వాథ తరణం సాగరస్య వా. ౮
ఇతి రామో మతిం కృత్వా మహాబాహు ర్మహోదధిమ్,
అధిశిశ్యే స విధివ త్ప్రియతో నియతో మునిః. ౯

తస్య రామస్య సుప్తస్య కుశాస్తీర్ణే మహీతలే,
నియమా దప్రమత్తస్య నిశా స్తిస్రోఽతిచక్రముః. ౧౦
స త్రిరాత్రోషిత స్తత్ర నయజ్ఞో ధర్మవత్సలః,

## ఇరువదియొకటవసర్గము.

అంత శత్రుసంహర్తయగు రాముఁడు సముద్రతీరంబున దర్భలం బఱచికొని తూర్పుమొగంబుగా సముద్రంబునకుఁ జేమోడ్చి నమస్కరించి సర్పశరీరముంబోలె నతిమృదులంబగు బాహువుం దలగడగాఁ జేసికొని సముద్రమున కెదుటఁ బరుండెను. ౧

దాక్షిణ్యవంతుఁడును మహాబాహుఁడునగు రాముఁడు మున్ను బంగరు భూషణంబులచే నలంకరింపఁబడియుండినదియు, బంగారుబాహుపురులను ముక్తామయభూషణంబులను ధరించియున్న యుత్తమవనితల భుజంబులచేఁ బెక్కువిధంబులం బరామృష్టంబును జందనాగరుప్రముఖ సుగంధిగంధంబులచేతను రక్తచందనంబులచేతను గుబాళించుచుండినదియు హంసతూలికామయ శయనంబున సీతాదేవి శిరముచే నధిష్ఠితంబయి ఎంతయుఁ బ్రకాశించుచుండినదియు, గంగాజలంబునందు తక్షకకాయంబునకు సరివచ్చుచుండినదియుం యుద్ధరంగంబునఁ బగవారికి గోపురార్గళంబుంబోలె నడ్డపడి దుర్ధర్షంబై మహాదుఃఖంబు గలిగించునదియు మిత్రులకు సంతోషంబుగలిగించునదియు ఆజానులంబమానంబును భూమండలంబున కంతయు నాలంబన భూతంబును శత్రువులపై ననవరతబాణప్రయోగంబు సేయుటచే జ్యాఘాతంబునంగలిగిన కిణంబులతో నొప్పుచున్నదియుం గొప్పయినుపగుదియవలె నున్నదియుం బెక్కుమాఱులు గోసహస్రంబుల నొసంగినదియు నగు దక్షిణబాహువుం దలగడగాఁ జేసికొని "ఇంక నాకు మరణంబేని సముద్రతరణంబేని గలుగుఁగాక" యని దృఢంబుగా సంకల్పించి స్నానాదులచేఁ బరిశుద్ధుఁడయి మనోనియమంబును వాఙ్నియమంబునుఁ గలవాఁడై సముద్రంబున కెదురుగా శయనించెను.

అట్లు నియమంబుదప్పక రాముండు దర్భలుపఱచిన నేలపై శయనించియుండఁగా మూఁడురాత్రులు గడిచినవి. ౧౦

నయజ్ఞుఁడు నతిధార్మికుఁడునగు నారాముఁడు అచ్చట సముద్రతీరం

ఉపాసత తదా రామ స్సాగరం సరితాం పతిమ్. ౧౧

న చ దర్శయతే మన్ద స్తదా రామస్య సాగరః,
ప్రయతేనాపి రామేణ యథార్హ మభిపూజితః. ౧౨
సముద్రస్య తతః క్రుద్ధో రామో రక్తాన్తలోచనః,
సమీపస్థ మువాచేదం లక్ష్మణం శుభలక్షణమ్. ౧౩

అవలేప స్సముద్రస్య న దర్శయతి య త్స్వయమ్,

ప్రశమశ్చ క్షమా చైవ ఆర్జవం ప్రియవాదితా. ౧౪
అసామర్థ్యం ఫల న్త్యేతే నిర్గుణేషు సతాం గుణాః,

ఆత్మప్రశంసినం దుష్టం ధృష్టం విపరిధావకమ్. ౧౫
సర్వత్రోత్సృష్టదణ్డం చ లోక స్సత్కురుతే నరమ్,

న సామ్నా శక్యతే కీర్తి ర్న సామ్నా శక్యతే యశః. ౧౬
ప్రాప్తుం లక్ష్మణ! లోకేఽస్మి న్జయో వా రణమూర్ధని,

అద్య మద్బాణనిర్భిన్నై ర్మకరై ర్మకరాలయమ్. ౧౭
నిరుద్ధతోయం సౌమిత్రే ప్లవద్భిః పశ్య సర్వతః,
మహాభోగాని మత్స్యానాం కరిణాంచ కరా నిహ. ౧౮
భోగినాం పశ్య నాగానాం మయా ఛిన్నాని లక్ష్మణ!,

సశఙ్ఖశుక్తికాజాలం సమీనమకరం శరైః. ౧౯



రాఘవుఁడు సముద్రము మీఁదఁ గోపంబు చూపుట. 178.
తాత్పర్యము.

బున అట్లు మూఁడురాత్రులు శయనించియుండి ఆమూఁడురాత్రులును ఎడ తెగక నదీపతియగు సముద్రు నారాధింపుచుండెను. ౧౧

సముద్రుఁడును మూర్ఖుఁడగుటవలన రాముఁడు నియమంబున నెంత యారాధించినను సాక్షాత్కరింపఁడయ్యె. ౧౨

అంత రాముఁడు సముద్రంబుపైఁ గోపించి కనుఁగొనల నెఱ్ఱఁదనంబు గదుర సమీపంబునను్న శుభలక్షణలక్షితుండగు లక్ష్మణుంజూచి యిట్లని చెప్పెను. ౧౩

సముద్రుఁ డింకను రాకున్నాఁడు గదా! ఇకనిగర్వం బిట్లు నేయుం -చున్నది.

కోపము లేకుండుట అపరాధంబునోర్చుట కుటిలత లేకుండుట ప్రియం బులఁ బలుకుట ఇవి మొదలగు సత్పురుషులగుణములు. నిర్గుణులకు అసామర్థ్య కృతంబులుగాఁ దోఁచును. ౧౪

లోకమునందు జనులు, ఆత్మస్తుతిపరుఁడును నిర్దయుఁడును దుష్టుఁడును గర్వంబున నతిప్రసంగియు మంచివారని చెడువారని వివేచనంబు లేక యందఱు దండించువాఁడునగు పురుషుని గౌరవింతురుగాని శమాదులుగల సత్పురుషుని గౌరవింపరు. ౧౫

లక్ష్మణుఁడా! ఈలోకంబున బలవంతుఁడను కీర్తినిగాని పరాక్రమ వంతుఁడను యశస్సునుగాని యుద్ధరంగంబున జయంబునుగాని మంచితనముచేఁ -బొంద వలవిగాదు. ౧౬

లక్ష్మణుఁడా! ఇప్పుడు నాబాణంబులచేఁ దెగి యంతటఁ దేలుచుండు మకరంబులచే నీసముద్రం బావరింపఁబడియుండఁగలదు. చూడుము. ౧౭

లక్ష్మణుఁడా! ఇంక శీఘ్రంబున నే మహాకాయంబులగు సర్పంబుల శరీరం బులను; గజాకారములగు మత్స్యంబులను నాచే ఛేదింపఁబడి సముద్రజలంబులం బడియుండఁగాఁ జూడఁగలవు. ౧౮

ఇప్పుడు నానావిధంబులగు బాణంబులు ప్రయోగించి శంఖశుక్తికా

అద్య యుద్ధేన మహతా సముద్రం పరిశోషయే,
క్షమయా హి సమాయుక్తం మా మయం మకరాలయః. ౨౦

అసమర్థం విజానాతి ధిక్ క్షమా మీదృశే జనే,
న దర్శయతి సామ్నా మే సాగరో రూప మాత్మనః. ౨౧

చాప మానయ సౌమిత్రే! శరాం శ్చాశీవిషోపమాన్,
సాగరం శోషయిష్యామి పద్భ్యాం యాన్తు ప్లవఙ్గమాః. ౨౨

అద్యాక్షోభ్య మపి క్రుద్ధః క్షోభయిష్యామి సాగరమ్,
వేలాసు కృతమర్యాదం సహసోర్మిసమాకులమ్. ౨౩

నిర్మర్యాదం కరిష్యామి సాయకై ర్వరుణాలయమ్,
మహార్ణవం క్షోభయిష్యే మహాదానవసఙ్కులమ్. ౨౪

ఏవ ముక్త్వా ధనుష్పాణిః క్రోధవిస్ఫారితేక్షణః,
బభూవ రామో దుర్ధర్షో యుగాన్తాగ్ని రివ జ్వలన్. ౨౫

సమ్పీడ్య చ ధను ర్ఘోరం కమ్పయిత్వా శరై ర్జగత్,
ముమోచ విశిఖా నుగ్రా న్వజ్రా నివ శతక్రతుః. ౨౬

తే జ్వలన్తో మహావేగా స్తేజసా సాయకోత్తమాః,
ప్రవిశన్తి సముద్రస్య సలిలం త్రస్తపన్నగమ్. ౨౭

సహితంబును మత్స్యమకరసంకులంబునగు సముద్రంబు నంతయుం శోషిల్లం జేసెదను. ౧౯

నేను ఓర్చియుండుటచేతంగదా యీ సముద్రుండు నన్నసమర్థునింగాం దలంచి యిటు పేక్షించినాండు. ఇట్టి దుష్టునివిషయమయి ఓర్పుదగదు. ఇంకం గ్రోధంబునే వహింపవలయును. ౨౦

సామోపాయం బెంత చేసినను సముద్రుండు నాకు సాక్షాత్కరింప కున్నాండు. ౨౧

లక్ష్మణుండా! ధనుస్సును దీక్ష్ణబాణంబులను దెమ్ము. సముద్రంబు నంతయుం శోషిల్లంజేసెదను. వానరులు కాలినడకనె లంకకుం బోవుదురుగాక.

ఇప్పుడు అక్షోభ్యంబగు సముద్రంబును గ్రుద్ధుండనై క్షుభితంబు గావించెదను.

చెలియలికట్ట నతిక్రమింపకుండునదియుం దరంగసంకులంబునగు సముద్రంబు నింక శీఘ్రింబున నిర్మర్యాదంబుగా భూమియందంతయుం బ్రవహించునట్లు గావించెదను. ౨౩

సముద్రంబునందలి దానవులతోంగూడ సముద్రంబునంతయుం క్షుభితంబు గావించెదను. అని రాముండు లక్ష్మణునితోం జెప్పెను. ౨౪

ఇట్లు లక్ష్మణునకుం జెప్పి రాముండు ధనుర్బాణంబులు ధరించి పరమ కుపితుండై కండ్లు గిఱగిఱం ద్రిప్పుచుం బ్రళయకాలానలంబుకైవడి వెలుంగుచు దుర్ధర్షుండై యుండెను. ౨౫

అంత రాముండు ధనువు సజ్యంబు గావించి దృఢముష్టింబట్టి లోకంబులు భీకరంబులయి గడగడవడంక దేవేంద్రుండు పెక్కువజ్రాయుధంబులం బ్రయోగించునట్లు తీక్ష్ణంబులగు బాణంబులం బ్రయోగించెను ౨౬

అంత నాబాణంబులు మహావేగంబులయి తేజంబుచే జ్వలించుచు భయపీడితంబులగు సర్పంబులతో నొప్పుచున్న సముద్రజలంబులం బ్రవేశించి నవి. ౨౭

తోయవేగ స్సముద్రస్య సనక్రమకరో మహాన్,
సమ్బభూవ మహాఘోర స్సమారుతరవ స్తదా. ౨౮
మహోర్మిమాలావితత శ్శఙ్ఖశుక్తిసమావృతః,
సధూమపరివృత్తోర్మి స్సహసాఽసీ న్మహోదధిః. ౨౯

వ్యథితాః పన్నగా శ్చాస న్దీప్తాస్యా దీప్తలోచనాః,
దానవాశ్చ మహావీర్యాః పాతాళతలవాసినః. ౩౦

ఊర్మయ స్సిన్ధురాజస్య సనక్రమకరా స్తదా,
విన్ధ్యమన్దరసఙ్కాశా స్సముత్పేతు స్సహస్రశః. ౩౧

ఆఘూర్ణితతరఙ్గౌఘ స్సమ్భ్రాన్తోరగరాక్షసః,
ఉద్వర్తితమహాగ్రాహ స్సంవృత్త స్సలిలాశయః. ౩౨

తతస్తు తం రాఘవ ముగ్రవేగం
ప్రకర్షమాణం ధను రప్రమేయమ్,
సౌమిత్రి రుత్పత్య సముచ్ఛ్వసన్తం
మా మేతిచోక్త్వా ధను రాలలమ్బే. ౩౩

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే ఏకవింశస్సర్గః. ౨౧

---

అప్పుడు సముద్రంబునందు తరంగవేగంబు వాయువేగసంఘట్టితం బయి మొసళ్లు మొదలగువానితోఁ గూడి మహాభయంకరంబయి చూపట్టినది.

అంత శీఘ్రంబున సముద్రం బంతయును గొప్పగొప్పతరంగంబులతోఁ గూడినదై తరంగంబులచేఁ బైకిఁ దేఁబడిన శంఖశుక్తులచే సమావృతంబై జ్వాలాభీలంబులగు బాణంబుల సంబంధంబునం జేసి పొగయుచుఁ జూపరులకు భయంకరంబుగాఁ జూపట్టినది. ౨౯

సముద్రంబుననుండు సర్పములు దీప్తలోచనంబులయి ముఖంబుల విషంబు గ్రక్కుచు రామబాణపీడితంబులయి భయవిహ్వలంబులయినవి. అట్లు పాతాళంబునందుండు మహాపరాక్రమశాలులగు దానవులును రామబాణ పీడితులయిరి. ౩౦

అప్పుడు సముద్రంబున మొసళ్లు మొదలగుజలజంతువులతోఁ గూడిన వగుమహాతరంగంబులు వింధ్యమందరంబులుంబోలె నత్యున్నతంబులయి వేన వేలుగాఁ బొడమినవి. ౩౧

అంతఁ దరంగంబులు తిరుగుడునొంద సర్పంబులును రాక్షసులును సంభ్రాంతులుగా మొసళ్లు మొదలగు జలజంతువులు భీతంబులయి సంక్షోభంబు నొంద నమ్మహాసముద్రంబంతయుఁ గాంతిహీనం బయియుండినది. ౩౨

అంత లక్ష్మణుఁడు కోపం బినుమడింప నిట్టూర్పులువుచ్చుచు మఱియు నుగ్రంబగు వేగంబు వహించి యతిభయంకరంబగు శరసంధానంబు సేయం దొడంగిన రామునిఁ జూచి "ఇంక నుపేక్షింపరాదు; లోకంబులన్నియు దగ్ధంబు లగును" అని తలంచి రాముని దగ్గఱి "వలదు! వలదు! ఇంక విరమింపుము!" అని ప్రార్థించియు విరమింపకుండుటం జేసి రామునిచేతి ధనువుం బట్టు కొనెను. ౩౩

ఇది యిరువదియొకటవసర్గము.

---

## ద్వావింశస్సర్గః.

అథోవాచ రఘుశ్రేష్ఠ స్సాగరం దారుణం వచః,
అద్య త్వాం శోషయిష్యామి సపాతాళం మహార్ణవ!. ౧

శరనిర్దగ్ధతోయస్య పరిశుష్కస్య సాగర!,
మయా శోషితసత్త్వస్య పాంసు రుత్పద్యతే మహాన్. ౨

మత్కార్ముకవిసృష్టేన శరవర్షేణ సాగర!,
పారం తేఽద్య గమిష్యన్తి పద్భి రేవ ప్లవఙ్గమాః. ౩
విచిన్వన్నాభిజానాసి పౌరుషం నాపి విక్రమమ్,
నదావాలయసన్తాపం మత్తో నాధిగమిష్యసి. ౪

బ్రాహ్మేణాస్త్రేణ సంయోజ్య బ్రహ్మదణ్డనిభం శరమ్,
సంయోజ్య ధనుషి శ్రేష్ఠే విచకర్ష మహాబలః. ౫

తస్మిన్వికృష్టే సహసా రాఘవేణ శరాసనే,
రోదసీ సమ్పఫాలేవ పర్వతాశ్చ చకమ్పిరే. ౬
తమశ్చ లోక మావవ్రే దిశశ్చ న చకాశిరే,
పరిచుక్షుభిరే చాశు సరాంసి సరిత స్తథా. ౭
తిర్యక్చ సహనక్షత్రై స్సఙ్గతౌ చన్ద్రభాస్కరౌ,
భాస్కరాంశుభి రాదీప్తం తమసా చ సమావృతమ్. ౮

## ఇరువదిరెండవసర్గము.

అంత రాముఁడు అప్పటికిని సాక్షాత్కరింపకుండునట్టి సముద్రుం జూచి భయంకరంబుగా నీమాటం జెప్పెను.

సముద్రుఁడా! ఇప్పుడు నిన్ను పాతాళముతోఁగూడ శోషిల్లునట్లు గావించెదను. ౧

సముద్రుఁడా! నాబాణంబులచే జలంబంతయు నెండిపోయి జల జంతువులన్నియు దగ్ధంబు లయినపిమ్మట నీ పున్నస్థలా బంతయు నిసుకతో నిండియుండఁగలదు. ౨

సముద్రుఁడా! నేను బాణవర్షంబున నిన్ను శోషిల్లంజేసినపిమ్మట నిప్పుడు వానరులు కాలినడకనే నిన్ను దాఁటిపోఁగలరు. ౩

దానవులకు నివాసస్థానమవగు సముద్రుఁడా! నీవు నాబలంబునుగాని పరాక్రమంబునుగాని యాలోచించి కనుఁగొనఁజాలవు; మఱియు నావలనం గలుగు బాధనుంగూడఁ దెలిసికొనకున్నావు; ఈయజ్ఞానము దానవసహవాసదోషంబునఁ గలిగినదేమో తెలియదు. అని రాముఁడు సముద్రునకుం జెప్పెను. ౪

మహాబలుఁడగురాముఁడు బ్రహ్మదండసమానంబగు భయంకరశరంబు దీసి దాని బ్రహ్మాస్త్రంబుతో నభిమంత్రించి వింటంగూర్చియాకర్ణాంతము నాకర్షించెను. ౫

అట్లు రాముఁడు ధనువు నాకర్షింపఁగానే ఆకాశంబును భూమియుం బగిలినట్లుండినవి. పర్వతంబులన్నియు భయంబున గడగడ వడంకినవి. ౬

లోకంబునం దంతయుం జీఁకటి క్రమ్మినది. దిక్కులు కాంతిహీనంబు లయినవి. సరస్సులును నదులును గలంగియుండినవి.

చంద్రసూర్యులును నక్షత్రంబులును భయంబున వక్రంబుగా నడచినవి.

అప్పుడు ఆకాశంబున అధికముగాఁ జీఁకటి క్రమ్ముకొనియుండుటం

ప్రచకాశే తదాకాశ ముల్కాశతవిదీపితమ్,

అన్తరిక్షాచ్చ నిర్ఘాతా నిర్జగ్ము రతులస్వనాః. ౯
పుస్ఫురు శ్చ ఘనా దివ్యా దివి మారుతపఙ్క్తయః,

బభఞ్జ చ తదా వృక్షా ఞ్జలదా నుద్వహ న్నపి. ౧౦
ఆరుజం శ్చైవ శైలాగ్రా ఞ్ఛిఖరాణి ప్రభఞ్జనః,

దివిస్పృశో మహామేఘా స్సఙ్గతా స్సమహాస్వనాః. ౧౧
ముముచు ర్వైద్యుతా నగ్నీం స్తే మహాశనయ స్తదా,

యాని భూతాని దృశ్యాని చుక్రుశు శ్చాశనే స్సమమ్. ౧౨
అదృశ్యాని చ భూతాని ముముచు ర్భైరవస్వనమ్,

శిశ్యిరే చాపి భూతాని సన్త్రస్తా న్యుద్విజ న్తిచ. ౧౩
సంప్రవివ్యథిరే చాపి నచ పస్పన్దిరే భయాత్,

సహ భూతై స్సతోయోర్మి స్సనాగ స్సహరాక్షసః. ౧౪
సహసాఽభూ త్తతో వేగా ద్భీమవేగో మహోదధిః,

యోజనం వ్యతిచక్రామ వేలా మన్యత్ర సంప్లవాత్. ౧౫

తం తదా సమతిక్రాన్తం నాతిచక్రామ రాఘవః,
సముద్ధత మమిత్రఘ్నో రామో నదనదీపతిమ్. ౧౬
తతో మధ్యా త్సముద్రస్య సాగర స్స్వయ ముత్థితః,

జేసి సూర్యుని కిరణంబులు కొఱవులంబోలెఁ గాంతిహీనంబులయి చూపట్టు
చుండినవి. ౮

అంతరిక్షంబుననుండి మహాధ్వని గదురం బిడుగులు పడినవి. ౯

మఱియు నాకాశంబునఁ జండమారుతంబులు భయంకరంబుగా వీచి
నవి.

వాయువేగంబున ఆకాశంబునందు మేఘంబులు వ్యాపించినవి. గొప్ప
వృక్షంబులు విఱిగినవి. పర్వతశిఖరంబులును ఖండపర్వతంబులును బీడితంబు
లయినవి ౧౦

అప్పుడు మహామేఘంబులు ఆకాశంబున సంగతంబులయి మహాధ్వని
చెలఁగ వైద్యుతంబులగు నగ్నులం గ్రక్కినవి; అవి పిడుగులయి నేలంబడి
నవి. ౧౧

దృశ్యంబులగు మనుష్యాదిభూతంబులు పిడుగుమ్రోఁతను సరిగా మహా
ధ్వనిగదుర నాక్రోశించినవి; అదృశ్యంబులగు పిశాచాదిభూతంబులును భయం
కరధ్వనిం గావించినవి. ౧౨

అంత సమస్తభూతంబులును భయవిహ్వలంబులయి నేలంబడి సంభ్రాం
తంబులయి పరమదుఃఖితంబులయి భయంబునంజేసి నిశ్చలంబులయి యుండి
నవి. ౧౩

అంత శరసంధానమాత్రంబున రామవేగంబునంజేసి యాసముద్రంబు
భూతలంబులతోను సర్పంబులతోను రాక్షసులతోను గొప్పగొప్పతరంగంబు
లతోఁ గూడినదై భయంకరంబగు వేగంబు నొందినది. ౧౪

అంత సముద్రము చెలియలికట్టనుండి యామడదూరంబు వెనుకకుఁ
బోయెను. ౧౫

అప్పుడు శత్రుసంహర్తయగు రాముఁడు అట్లు వెనుకకుఁ బాఱిపోయిన
సముద్రముపై బాణప్రయోగంబు సేయఁడయ్యె. ౧౬

అంత మేరుపర్వతంబునుండి సూర్యుఁ డుదయించునట్లు సముద్ర

ఉదయన్ హి మహాశైలా న్మేరో రివ దివాకరః. ౧౭

పన్నగై స్సహ దీప్తాస్యై స్సముద్రః ప్రత్యదృశ్యత,
స్నిగ్ధవైడూర్యసఙ్కాశో జామ్బూనదవిభూషితః. ౧౮

రక్తమాల్యామ్బరధరః పద్మపత్రనిభేక్షణః,
సర్వపుష్పమయీం దివ్యాం శిరసా ధారయన్ స్రజమ్. ౧౯

జాతరూపమయై శ్చైవ తపనీయవిభూషితైః,
ఆత్మజానాంచ రత్నానాం భూషితో భూషణోత్తమైః. ౨౦

ధాతుభి ర్మణ్డిత శ్శైలో వివిధై ర్హిమవా నివ,
ఏకావలీమధ్యగతం తరళం పాటలప్రభమ్. ౨౧

విపులే నోరసా బిభ్ర త్కౌస్తుభస్య సహోదరమ్,
ఆఘూర్ణితతరఙ్గౌఘః కాళికానిలసఙ్కులః. ౨౨

ఉద్వర్తితమహాగ్రాహ స్సంభ్రాన్తోరగరాక్షసః,
(దేవతానాం సురూపాభి ర్నానారూపాభి రీశ్వరః,
గఙ్గాసింధుప్రధానాభి రాపగాభి స్సమావృతః.)
సాగర స్సముపక్రమ్య పూర్వ మామన్త్ర్య వీర్యవాన్. ౨౩
అబ్రవీ త్ప్రాఞ్జలి ర్వాక్యం రాఘవం శరపాణినమ్,

పృథివీ వాయు రాకాశ మాపో జ్యోతి శ్చ రాఘవ!. ౨౪
స్వభావే సౌమ్య! తిష్ఠన్తి శాశ్వతం మార్గ మాశ్రితాః,

తత్స్వభావో మమా ప్యేష య దగాధోఽహ మప్లవః. ౨౫
వికారస్తు భవే ద్గాధ ఏత త్తే ప్రవదా మ్యహమ్,

మధ్యంబుననుండి సముద్రాభిమానిదేవతయైన సముద్రుఁ డావిర్భవించెను. ౧౭

వైడూర్యవర్ణదేహుఁడును రక్తమాల్యాంబరధరుఁడును దామరపూరేకులుంబోలె నయనంబులుకలవాఁడును నానావిధపుష్పములు గూర్చిన దివ్యపుష్పమాలికను శిరంబునఁ దాల్చినవాఁడును జాంబూనదియందుఁ బుట్టిన బంగారుసొమ్ములచేనేమి గనులందు జన్మించిన బంగారుసొమ్ములచేనేమి నానావిధామూల్యరత్నఖచితంబులగు బంగారుసొమ్ములచేనేమి యలంకృతుఁడును నానావిధధాతువులచే నలంకృతుఁడగు హిమవంతుఁడుంబోలెఁ దేజరిల్లుచున్నవాఁడును గౌస్తుభంబు తోఁబుట్టువైన ముక్తామణిమధ్యగతంబగు దివ్యరత్నంబును విశాలవక్షస్స్థలంబునఁ దాల్చినవాఁడునగు సముద్రుఁడు మహాతరంగంబులాకాశంబు నంట మేఘవాతంబు లినుమడింప దీప్తముఖంబులగు పన్నగంబులతోఁగూడఁ జూపట్టెను. ౧౮, ౨౨

దేవతాశ్రేష్ఠుఁడగు నాసముద్రుఁడు పెద్దపెద్ద మొసళ్లు సంభ్రాంతంబులయి తిరుగ సర్పంబులును రాక్షసులును గలఁతనొంద నానావిధరూపధరలగు గంగాసింధుప్రముఖనదులచే సేవింపఁబడినవాఁడై సాక్షాత్కరించెను.

పరాక్రమవంతుండగు సముద్రుఁడు రామునొద్దకుఁబోయి తానే ముందుగా రాముఁ బిలిచి చేమోడ్పుగీలించి బాణపాణియగు రాముంజూచి యిట్లని చెప్పెను. ౨౩

ప్రసన్నుఁడవగు రాముఁడా! భూమియుం వాయువును ఆకాశమును జలంబును అగ్నియును ఈపంచభూతంబులును శాశ్వతంబగు మర్యాద నవలంబించి కాఠిన్యము తిర్యగ్గమనము అవకాశరూపత అగాధత్వము ఊర్ధ్వజ్వలనము ఈస్వస్వభావంబులను వదలకుండును. ౨౪

అందువలన మిక్కిలియు లోఁతుగలిగి దాఁట నలవి గాకుండుట నాస్వభావము; నేను దీనివదల నలవిగాదు; లోఁతు లేకుండుట నిప్పునకుఁ జల్లఁదనంబుపోలె నాకు విరుద్ధధర్మము; ఈ తత్త్వంబు నీకుఁ జెప్పితిని. ౨౫

న కామా న్న చలోభా ద్వా న భయా త్పార్థివాత్మజ!. ౨౬
గ్రాహనక్రాకులజలం స్తమ్భయేయం కథంచన,

విధాస్యే రామ! యేనాపి విషహిష్యే హ్యహం తథా. ౨౭
గ్రాహా న ప్రహరిష్యన్తి యావత్సేనా తరిష్యతి,

హరీణాం తరణే రామ! కరిష్యామి యథాస్థలమ్. ౨౮

త మబ్రవీ త్తదా రామ ఉద్యతో హి నదీపతే!,
అమోఘోఽయం మహాబాణః కస్మి న్దేశే నిపాత్యతామ్. ౨౯

రామస్య వచనం శ్రుత్వా తం చ దృష్ట్వా మహాశరమ్,
మహోదధి ర్మహాతేజా రాఘవం వాక్య మబ్రవీత్. ౩౦
ఉత్తరేణావకాశోఽస్తి కశ్చి త్పుణ్యతమో మమ,
ద్రుమకుల్య ఇతి ఖ్యాతో లోకే ఖ్యాతో యథా భవాన్. ౩౧

ఉగ్రదర్శనకర్మాణో బహవ స్తత్ర దస్యవః,
ఆభీరప్రముఖాః పాపాః పిబన్తి సలిలం మమ. ౩౨
తైస్తు సంస్పర్శనం పాపై ర్న సహే పాపకర్మభిః,
అమోఘః క్రియతాం రామ! తత్ర తేషు శరోత్తమః. ౩౩

తస్య తద్వచనం శ్రుత్వా సాగరస్య స రాఘవః,
ముమోచ తం శరం దీప్తం వీర స్సాగరదర్శనాత్. ౩౪
తేన తన్మరుకాన్తారం పృథివ్యాం ఖలు విశ్రుతమ్,

రాచకొమరుఁడవగు రాముఁడా! నేను కామమునం గాని లోభంబునం గాని భయంబునం గాని మొసళ్లు మొదలగు జంతువులచే నిండియున్న జలంబులను ఎంతమాత్రము స్తంభింపఁజాలను. ౨౬

రాముఁడా! అయితే నాచేత నైనకార్యమును మాత్రము గావించెదను; మీసేన సముద్రంబు దాఁటునపుడు గ్రాహాదిజలజంతువులు సేనను బాధింపకుండునట్లు గావించెదను. ౨౭

రాముఁడా! వానరులు సముద్రంబు దాఁటుటవిషయమును సేతుబంధము సేయుటకుఁదగిన సాహాయ్యంబుఁ గావించెదను. అని సముద్రుఁడు రామునితోఁ జెప్పెను. ౨౮

అప్పుడు రాముఁడు సముద్రుంజూచి "సముద్రుఁడా! అట్లగునేని ఆమోఘంబగు నీమహాబాణంబును శరాసనంబున సంధించినానే! దీని నెచ్చట విడుతును? చెప్పుము" అని పలికెను. ౨౯

మహాతేజుఁడగు సముద్రుఁడు రాముఁడు చెప్పినమాటనువిని కృతసంధానంబగు మహాబాణంబునుంజూచి రామునకు ఈమాటం జెప్పెను. 30

ఇచ్చటికి సమీపముగా నుత్తరదిక్కున లోకంబునందు నీవలె వినుతికెక్కినదియు మిక్కిలియు సుందరంబునగు ద్రుమకుల్యంబను నొక్కప్రదేశ మున్నది. 3౧

ఆప్రదేశంబునఁ జెంబడివాండ్రు మున్నగువార లనేకులు దొంగలు నాజలంబు త్రావుచు మహాదుష్టకార్యంబులం గావించుచున్నారు. 3౨

రాముఁడా! అట్టి పాపకర్ములగు దుష్టులస్పర్శమును నేను సహింపఁజాలను; కావున ఈయమోఘబాణంబును వారలపైఁ బ్రయోగింపుము. అని సముద్రుఁడు రామునితోఁ జెప్పెను. 33

పరాక్రమవంతుఁడగు రాముఁడు ఆసముద్రుఁడు చెప్పినమాటను విని సముద్రుని యిష్టప్రకారము అమ్మహాబాణమును ద్రుమకుల్యంబుపై విడిచెను.

రాముఁడు ఏస్థలంబుపైఁ బిడుగుంబోలె వెలుంగుచున్న బాణమును

నిపాతిత శ్శరో యత్ర దీప్తాశనిసమ ప్రభః. ౩౫
ననాద చ తదా తత్ర వసుధా శల్యపీడితా,
తస్మా ద్వ్రణముఖా త్తోయ ముత్పపాత రసాతలాత్. ౩౬
స బభూవ తదా కూపో వ్రణ ఇత్యభివిశ్రుతః,
సతతం చోత్థితం తోయం సముద్రస్యేవ దృశ్యతే. ౩౭

అవదారణశబ్దశ్చ దారుణ స్సమపద్యత,

తస్మా ద్బాణనిపాతేన త్వపః కుక్షిష్వశోషయత్. ౩౮

విఖ్యాతం త్రిషు లోకేషు మరుకాన్తారమేవ తత్,

శోషయిత్వా తతః కుక్షిం రామో దశరథాత్మజః. ౩౯
వరం తస్మై దదౌ విద్వా న్మరవేఽమరవిక్రమః,

పశవ్య శ్చాల్పరోగశ్చ ఫలమూలరసాయుతః. ౪౦
బహుస్నేహో బహుక్షీర స్సుగన్ధిర్వివిధౌషధః,

ఏవమేతై ర్గుణై ర్యుక్తో బహుభి స్సతతం మరుః. ౪౧
రామస్య వరదానాచ్చ శివః పన్థా బభూవహ,

తస్మి న్దగ్ధే తదా కుక్షౌ సముద్ర స్సరితాం పతిః. ౪౨
రాఘవం సర్వశాస్త్రజ్ఞ మిదం వచన మబ్రవీత్,

ప్రయోగించెనో ఆస్థలంబు మరుకాంతారమని ప్రసిద్ధినొందినది. ౩౫

అప్పుడు బాణపాతంబునంజేసి భూమి మహానాదంబు గావించినది. ఆదెబ్బదగిలినస్థలంబునఁ బాతాళంబుననుండి దివ్యజలం బుద్గమించినది. ౩౬

ఆకూపము వ్రణకూపమని ప్రసిద్ధినొందినది. అందుఁ బాతాళంబున నుండి యుద్గతంబయిన జలము దుర్వ్యంబై సముద్రజలంబువలె నెల్లప్పుడును నాశంబులేక చూడఁబడుచుండును. ౩౭

అట్లు బాణవేగంబున భూమి పగులునప్పుడు భయంకరంబగు ధ్వని గలిగినది.

అట్లు రాముఁడు బాణప్రయోగంబుచే ద్రుమకుల్యంబులందుఁ బల్లపు ప్రదేశంబులనుండి నాభీరాదిపాపిష్ఠులచే స్పృశింపఁబడుచున్న దుష్టజలంబుల నశింపఁజేసెను. ౩౮

జలంబులంతయును నెండిపోవుటంజేసి యాప్రదేశంబు మరుకాంతారమని ముల్లోకంబులం బేరుఁ బడసినది.

దేవతుల్యుఁడును పండితుఁడును దశరథపుత్రుండునగు రాముఁడు అట్లు సముద్రకుక్షిప్రదేశమునుండి ఆభీరాదిపాపిష్ఠుల నశింపఁజేసి యంత నమ్మరుకాంతారమునకు వరం బొసంగెను. ౩౯

ఈమరుకాంతారము పశువులకుఁ గావలసిన బాలతృణాదులుగలదై యరోగమయి ఫలమూలమధువులతోఁగూడినదై క్షీరసమృద్ధమయి సుగంధి నానావిధమూలికలుగలదై యుండఁగలదు. అని రాముఁడు మరుకాంతారము నకు వరం బొసంగెను. ౪౦

రాముని వరదానప్రభావంబున నమ్మరుకాంతారము ఇట్లు పెక్కు గుణంబులతోఁ గూడినదై యెల్లప్పుడును మనోహరప్రదేశంబై యొప్పుచుండి నది. ౪౧

అట్లు ఆద్రుమకుల్యంబంతయుఁ దగ్ధంబయిన పిమ్మట నదీపతియగు సముద్రుఁడు సమస్తశాస్త్రవేత్తయగు రామునిఁజూచి యిట్లని చెప్పెను. ౪౨

అయం సౌమ్య! నళో నామ తనుజో విశ్వకర్మణః. ౪౩
పిత్రా దత్తవర శ్శ్రీమా న్ప్రీతిమో విశ్వకర్మణా,
ఏష సేతుం మహోత్సాహః కరోతు మయి వానరః. ౪౪
త మహం ధారయిష్యామి తథా హ్యేష యథా పితా,

ఏవ ముక్త్వోదధి ర్నష్ట స్సముత్థాయ నళ స్తదా. ౪౫
అబ్రవీ ద్వానరశ్రేష్ఠో వాక్యం రామం మహాబలః,

అహం సేతుం కరిష్యామి విస్తీర్ణే వరుణాలయే. ౪౬
పితు స్సామర్థ్య మాస్థాయ తత్త్వమాహ మహోదధిః,
దణ్డ ఏవ పరో లోకే పురుషస్యేతి మే మతః. ౪౭
ధిక్ క్షమా మకృతజ్ఞేషు సాన్త్వం దాన మథాపి వా,

అయం హి సాగరో భీమస్సేతుకర్మదిదృక్షయా. ౪౮
దదౌ దణ్డభయా ద్గాధం రాఘవాయ మహోదధిః,

మమ మాతు ర్వరో దత్తో మన్దరే విశ్వకర్మణా. ౪౯
ఔరస స్తస్య పుత్త్రోఽహం సదృశో విశ్వకర్మణా,

న చా ప్యహ మనుక్తో వై ప్రబ్రూయా మాత్మనో గుణాన్.

సమర్థశ్చాప్యహం సేతుం కర్తుం వై వరుణాలయే,
స్మారితోఽస్మ్యహమేతేన తత్త్వమాహ మహోదధిః. ౫౦
కామ మద్యైవ బధ్నన్తు సేతుం వానరపుఙ్గవాః,

సౌమ్యుఁడవగు రాముఁడా! ఈనలుఁడు విశ్వకర్మ కొడుకు. విశ్వకర్మ వలన వరంబు నొందియున్నాఁడు. శిల్పవిద్యలం దండ్రికి సమానుఁడు. ౪౩

మహోత్సాహుఁ డగు నీనలుఁడు సముద్రంబునందు సేతువు నిర్మించుఁ గాక. ఆ సేతువును మునుఁగకుండ నేను ధరించెదను. ఇతఁడు తండ్రి యంతటివాఁడు. అని సముద్రుఁడు రామునితోఁ జెప్పెను. ౪౪

సముద్రుఁ డీప్రకారముచెప్పి యంత నంతర్హితుఁ డయ్యెను. అప్పుడు వానరోత్తముఁడును మహాబలుఁడు నగు నలుఁడు లేచి రామునిఁజూచి యీ మాటం జెప్పెను. ౪౫

నేను నాతండ్రి యొసంగిన సామర్థ్యంబు నవలంబించి విశాలంబగు సముద్రమునందు సేతువుం గట్టెదను; సముద్రుఁడు యథార్థముం జెప్పినాఁడు.

లోకమునందుఁ బురుషుఁడు దండోపాయమునే ప్రయోగింపవలయు నని నాయభిప్రాయము; కృతఘ్నులు గాని వారివిషయమున క్షమయుం సామదానోపాయంబులును బనికిరావు. ౪౬

భయంకరాకారుఁడగు నీసముద్రుఁడు సగరునిచే వర్ధితుం డయ్యుఁ గృతజ్ఞత లేక రాముఁడు దండించునను భయంబున సేతునిర్మాణంబునకై రామునకు స్థలం బొసంగెను. ౪౭

మందరపర్వతంబున విశ్వకర్మ నాతల్లికి వరం బొసంగెను. ౪౮

నేనా విశ్వకర్మ కౌరసపుత్త్రుఁడను; శిల్పవిద్యలందు విశ్వకర్మకు సమానుఁడను.

మఱి యెవ్వరును జెప్పువారు లేకుండునప్పుడు నేనుమాత్రము నా గుణంబులం జెప్పుకొనువాఁడను గాను. ౫౦

నేను సముద్రంబున సేతువును నిర్మింపఁగలను.

సముద్రుఁడు యథార్థంబుఁ జెప్పినాఁడు. నాకును జ్ఞాపకపఱచినాఁడు.

ఇచ్ఛయుండునేని యిప్పుడే వానరులు సేతునిర్మాణసన్నాహంబు చేయుందురుగాక. అని నలుఁడు చెప్పెను.

తతో విసృష్టా రామేణ సర్వతో హరియూథపాః. ౫౨
అభిపేతు ర్మహారణ్యం హృష్టా శ్శతసహస్రశః,
తే నగా న్నగసఙ్కాశా శ్శాఖామృగగణర్షభాః. ౫౩
బభఞ్జు ర్వానరా స్తత్ర ప్రచకర్షు శ్చ సాగరమ్,
తే సాలై శ్చాశ్వకర్ణై శ్చ ధవై ర్వంశై శ్చ వానరాః. ౫౪
కుటజై రర్జునై స్తాలై స్తిలకై స్తినిశై రపి,
బిల్వై శ్చ సప్తపర్ణై శ్చ కర్ణికారై స్సుపుష్పితైః. ౫౫
చూతై శ్చాశోకవృక్షై శ్చ సాగరం సమపూరయన్,
సమూలాంశ్చ విమూలాంశ్చ పాదపా న్హరిసత్తమాః. ౫౬
ఇన్ద్రకేతూనివోద్యమ్య ప్రజహ్రు ర్హరయ స్తరూన్,
తాలాన్ దాడిమగుల్మాంశ్చ నారికేళా న్విభీతకాన్. ౫౭
వకుళా న్ఖదిరా న్నిమ్బాన్ సమాజహ్రు స్సమన్తతః,
హస్తిమాత్రా న్మహాకాయాః పాషాణాంశ్చ మహాబలాః. ౫౮
పర్వతాంశ్చ సముత్పాట్య యన్త్రైః పరివహన్తి చ,
ప్రక్షిప్యమాణై రచలై స్సహసా జల ముద్ధతమ్. ౫౯
సముత్పతిత మాకాశ మపాసర్ప త్తత స్తతః,
సముద్రం క్షోభయామాసు ర్వానరాశ్చ సమన్తతః. ౬౦
సూత్రా ణ్యన్యే ప్రగృహ్ణన్తి హ్యాయతం శతయోజనమ్,
దణ్డా నన్యే ప్రగృహ్ణన్తి విచిన్వన్తి తథా పరే. ౬౧
దశయోజనవిస్తారం శతయోజన మాయతమ్,

అంత వానరోత్తములు రామనియోగంబునఁ బరమసంతుష్టులయి లక్ష
లక్షలుగా గుంపుచేరి యడవులకుం బోయిరి. ౫౨

అంతఁ బర్వతాకారులగు నావానరోత్తములు అడవులందు నానావిధ
వృక్షంబులం బెఱికి సముద్రంబునం జేర్చిరి. ౫౩

ఆవానరులు అట్టి మద్దిచెట్లను ఇనుమద్దిచెట్లను ఏఱుమద్దిచెట్లను
చంద్రచెట్లను వెదుళ్లను కొండమల్లెచెట్లను తాటిచెట్లను బొట్టుగుచెట్లను దిరిశ
వృక్షంబులను బిల్వవృక్షంబులను ఏడాకుల యరఁటిచెట్లను పుష్పితంబులగు
కొండగోఁగుచెట్లను మామిడిచెట్లను అశోకవృక్షంబులను దీసికొనివచ్చి సము
ద్రంబు నిండించిరి. ౫౪, ౫౫

ఆవానరోత్తములు వృక్షంబులం గొన్నిటిని సమూలంబులుగాను
గొన్నిటిని విమూలంబులుగాను బెఱికి యింద్రధ్వజంబులంబోలెఁ బైకెత్తి
సముద్రంబునం బడవైచిరి. ౫౬

ఆవానరులు తాటిచెట్లను దాడిమవృక్షంబులను టెంకాయచెట్లను
తాండ్రచెట్లను బొగడచెట్లను తుమ్మచెట్లను నింబవృక్షంబులను దీసుకొనివచ్చి
సముద్రమునం బడవైచిరి. ౫౭

మహాకాయులును మహాబలులునగు వానరులు ఏనుఁగంతటి ప్రమాణము
గల ఱాళ్లను బర్వతంబులునుం బెఱికి యంత్రంబులచే గొనిపోయిరి. ౫౮

సముద్రంబు పర్వతంబులం బడవేయుటచే జలంబు పైకెగిరి యాకా
శంబున నచ్చటచ్చట వ్యాపించినది. ౫౯

అప్పుడు వానరులు సముద్రంబునంతయు క్షుభితంబు గావించిరి. ౬౦

కొందఱు ఎచ్చుతక్కువలు గలుగకుండుటకై నూఱుయోజనంబులం
నిడుపయిన సూత్రంబులం బట్టుకొనిరి.

కొందఱు కొలతకోయ్యలం బట్టుకొనియుండిరి. మఱి కొందఱు ఎచ్చు
తక్కువలు పరీక్షించుచుండిరి. ౬౧

అట్లు నలుఁడు సముద్రంబునడుమ పదియోజనంబుల వెడల్పుగలదియుం

నళ శ్చక్రే మహాసేతుం మధ్యే నదనదీపతేః. ౬౨
వానరా శ్శతశ స్తత్ర రామ స్యాజ్ఞాపురస్సరాః,
మేఘాభైఃపర్వతాగ్రైశ్చ తృణైః కాష్ఠై ర్బబన్ధిరే. ౬౩
పుష్పితాగ్రై శ్చ తరుభి స్సేతుం బధ్నన్తి వానరాః,
పాషాణాంశ్చ గిరిప్రఖ్యా న్గిరీణాం శిఖరాణి చ. ౬౪
దృశ్యన్తే పరిధావన్తో గృహ్య వారణసన్నిభాః,
శిలానాం క్షిప్యమాణానాం శైలానాంచ నిపాత్యతామ్. ౬౫
బభూవ తుముల శ్శబ్ద స్తదా తస్మి న్మహోదధౌ,
కృతాని ప్రథమేనాహ్నా యోజనాని చతుర్దశ. ౬౬
ప్రహృష్టై ర్గజసఙ్కాశై స్త్వరమాణైః ప్లవఙ్గమైః,
ద్వితీయేన తథా చాహ్నా యోజనాని తు వింశతిః. ౬౭
కృతాని ప్లవగై స్తూర్ణం భీమకాయై ర్మహాబలైః,
అహ్నా తృతీయేన తథా యోజనాని కృతాని చ. ౬౮
త్వరమాణై ర్మహాకాయై రేకవింశతి రేవచ,
చతుర్థేన తథా చాహ్నా ద్వావింశతిరథాపిచ. ౬౯
యోజనాని మహావేగైః కృతాని త్వరితై స్తు తైః,
పఞ్చమేన తథా చాహ్నా ప్లవగైః క్షిప్రకారిభిః. ౭౦
యోజనాని త్రయోవింశ త్సువేల మధికృత్య వై,
స వానరవరః శ్రీమా న్విశ్వకర్మాత్మజో బలీ. ౭౧
బబన్ధ సాగరే సేతుం యథా చాస్య పితా తథా,

నూఱుయోజనంబుల నిడుపుగలదియగు మహాసేతువును నిర్మించెను. ౬౨

అందు నలునకుసహాయులయి పెక్కువానరులు రామునియాజ్ఞను శిరసావహించి మేఘసమానంబులగు పర్వతశిఖరంబులచేతను దృణకాష్ఠంబులచేతను సేతుబంధంబు గావించిరి. ౬౩

వానరులు పుష్పితాగ్రంబులగు వృక్షంబులనుం గూడవేసి సేతువును నిర్మించిరి.

వినుగు లంతటివానరులు కొండలంతటితాళ్ళను బర్వతశిఖరంబులనుం గొని పరుగెత్తుచు జూపరుల కచ్చెరువు గలిగించుచుండిరి. ౬౪

అప్పుడు సముద్రంబునం పెద్దపెద్దతాళ్లను వేయుటచేతను బర్వతంబులం బడవేయుటచేతను మహాధ్వనిగలిగినది. ౬౫

వినుగునుంబోలె మహాకాయులగు నావానరులు పరమసంతుష్టులయి మహావేగంబున నొక్కదినంబునం బదునాలుగుయోజనంబులదూరము సేతువును నిర్మించిరి. ౬౬

భయంకరాకారులును మహాబలులు నగువానరులు రెండవదినంబున నిరువదియోజనంబులదూరము సేతువును నిర్మించిరి. ౬౭

మహాకాయులగు నావానరులు అతివేగంబున మూఁడవదినంబునందు ఇరువదియొక్కయోజనంబుల దూరము సేతువును నిర్మించిరి. ౬౮

అంత నాలవదినంబున మహావేగులగు నవ్వానరులు మహావేగంబు వహించి యిరువదిరెండుయోజనంబులదూరము సేతువును నిర్మించిరి. ౬౯

శీఘ్రకారులగు నావానరులు ఐదవదినంబున సువేలపర్వతంబునకును ఇరువదిమూఁడుయోజనంబులదూరము సేతువునిర్మించి సేతుబంధనకార్యమును సమాప్తి నొందించిరి. ౭౦

తండ్రియుంబోలె శిల్పవిద్యలందు మహాసమర్థుఁడును శ్రీమంతుఁడును బలవంతుఁడును విశ్వకర్మపుత్రుఁడును వానరోత్తముఁడునగు నలుఁడు అట్లు సముద్రమధ్యంబున మహాసేతువును నిర్మించెను. ౭౧

స నలేన కృత స్సేతు స్సాగరే మకరాలయే. ౭౨
శుశుభే సుభగః శ్రీమాన్ స్వాతీపథ ఇవామ్బరే,

తతో దేవా స్సగన్ధర్వా స్సిద్ధాశ్చ పరమర్షయః- ౭౩
ఆగమ్య గగనే తస్థు ర్ద్రష్టుకామా స్త దద్భుతమ్,
దశయోజనవిస్తీర్ణం శతయోజనమాయతమ్. ౭౪
దదృశు ర్దేవగన్ధర్వా నలసేతుం సుదుష్కరమ్,

ఆప్లవన్తః ప్లవన్తశ్చ గర్జన్తశ్చ ప్లవఙ్గమాః. ౭౫

తదచిన్త్య మసహ్యం చ అద్భుతం రోమహర్షణమ్,
దదృశుస్సర్వభూతాని సాగరే సేతుబన్ధనమ్. ౭౬

తాని కోటిసహస్రాణి వానరాణాం మహౌజసామ్,
బధ్నన్త స్సాగరే సేతుం జగ్ముః పారం మహోదధేః. ౭౭
విశాలస్సుకృతః శ్రీమాన్ సుభూమి స్సుసమాహితః,
అశోభత మహాసేతు స్సీమన్త ఇవ సాగరే. ౭౮

తతః పారే సముద్రస్య గదాపాణిర్విభీషణః,
పరేషామభిఘాతార్థమతిష్ఠత్సచివై స్సహ. ౭౯
సుగ్రీవస్తు తతః ప్రాహ రామం సత్యపరాక్రమమ్,
హనూమన్తం త్వ మారోహ అఙ్గదం చాపి లక్ష్మణః. ౮౦

అయం హి విపులో వీర సాగరో మకరాలయః,

మకరాలయంబగు సముద్రంబున నల నిర్మితంబయిన సుందరంబును శ్రీమంతంబగు నమ్మహాసేతువు ఆకాశంబున సూర్యాదుల మధ్యమమార్గంబు నందలి మధ్యమవీథియగు స్వాతీవీథియుంబోలెఁ బ్రకాశించుచుండినది. ౭౨

అప్పుడు దేవతలును గంధర్వులును సిద్ధులును మహర్షులును యయ్యాశ్చర్యముం జూచుటకై యచ్చటికివచ్చి యాకాశంబున నుండిరి. ౭౩

దేవతలును గంధర్వులును మున్నగువారలు పదియోజనంబుల వెడల్పును నూఱుయోజనంబుల నిడుపునుంగల యతి దుష్కరంబయిన నలనిర్మితంబగు సేతువుం జూచిరి. ౭౪

వానరులు ఇటుఅటు ఎగిరిపోవుచు గర్జించుచుఁ బరమసంతోషంబున నుండిరి. ౭౫

మనంబుననైనను జింతింప నలవిగానిదియు దుస్సహంబును నాశ్చర్యకరంబును గగుర్పాటునొందించునదియునగు సముద్రసేతుబంధంబును సమస్త భూతంబులును సందర్శించినవి. ౭౬

సేతుబంధంబునందు వ్యాపృతులయియుండిన మహాపరాక్రమశాలులగు వానరులు కోటులుకోటులుగా ముందు సముద్రదక్షిణపారముం జేరిరి. ౭౭

విశాలంబును దృఢబద్ధంబును శ్రీమంతంబును మిట్టపల్లములులేనిదియు రంధ్రంబులులేనిదియు నగునమ్మహాసేతువు సముద్రంబునఁ బాపటవలెఁ బ్రకాశించుచుండినది. ౭౮

అంత విభీషణుండు గదాపాణియయి సచివులంగూడి శత్రువులు పైకొనిన వారల సంహరించుటకై సముద్రదక్షిణతీరంబునం గాచియుండెను. ౭౯

అంత సుగ్రీవుఁడు సత్యపరాక్రముఁడగు రాముంజూచి యిట్లనిచెప్పెను.

నీవు హనుమంతు నారోహింపుము; లక్ష్మణుండు అంగదు నారోహించుఁగాక. ౮౦

పరాక్రమవంతుఁడవగు రాముఁడా! మకరాలయంబగు నీసముద్రము మిక్కిలియు విశాలమయినది కావున మీరలు నడచివచ్చుట సరిగాదు.

వైహాయసౌ యువామేతౌ వానరౌ తారయిష్యతః. ౮౧

అగ్రత స్తస్య సైన్యస్య శ్రీమా న్నామ స్సలక్ష్మణః,
జగామ ధన్వీ ధర్మాత్మా సుగ్రీవేణ సమన్వితః. ౮౨
అన్యే మధ్యేన గచ్ఛన్తి పార్శ్వతోఽన్యే ప్లవఙ్గమాః,
సలిలే ప్రపత న్త్యన్యే మార్గ మన్యే న లేభిరే. ౮౩

కేచి ద్వైహాయసగతాః సుపర్ణా ఇవ పుప్లువుః,

ఘోషేణ మహతా తస్య సిన్ధోర్ఘోషం సముచ్ఛ్రితమ్. ౮౪
భీమ మన్తర్దధే భీమా తరన్తీ హరివాహినీ,
వానరాణాం హి సా తీర్ణా వాహినీ నళసేతునా. ౮౫
తీరే నివివిశే రాజ్ఞా బహుమూలఫలోదకే,

త దద్భుతం రాఘవకర్మ దుష్కరం
సమీక్ష్య దేవాస్సహసిద్ధచారణైః. ౮౬
ఉపేత్య రామం సహసా మహర్షిభి
స్సమభ్యషిఞ్చన్ సుశుభై ర్జలైః పృథక్,
జయస్వ శత్రూ న్నరదేవ! మేదినీం
ససాగరాం పాలయ శాశ్వతీ స్సమాః. ౮౭
ఇతీవ రామం నరదేవసత్కృతం
శుభై ర్వచోభి ర్వివిధై రపూజయన్.

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే ద్వావింశ స్సర్గః. ౨౨.

ఈహనుమదంగదులు మిమ్ము నాకాశగమనంబునం దీసికొనిపోయి దాఁటింపఁగలరు. అని సుగ్రీవుఁడు రామునితోఁ జెప్పెను. ౭౧

ధనుర్ధరుఁడును ధర్మాత్ముఁడును శ్రీమంతుఁడునగు రాముఁడు లక్ష్మణుని సుగ్రీవునింగూడి యాసైన్యంబున కగ్రభాగంబున నడచెను. ౭౨

అప్పుడు కొందఱు వానరులు నడుమం బోయిరి; కొందఱు పార్శ్వభాగంబుల నడచిరి; కొందఱు నడచుట కవకాశము లేక జలంబులం బడి లేచిరి; మఱికొందఱు వానరులు మార్గంబుచాలక తీరంబుననే నిలిచియుండి యటు పిమ్మటం బోయిరి. ౭౩

కొందఱు వానరులు గరుత్మంతులుంబోలె నాకాశగమనంబునం బోయిరి.

భయంకరంబగు నావానరసేన దాఁటుటచేఁ గల్గినమహాధ్వని సముద్రఘోషంబును అణఁగఁద్రొక్కెను. ౭౪

ఆవానరసేన వానరరాజుండగు సుగ్రీవునితోఁగూడ నలనిర్మితంబగు సేతువుచేఁ సముద్రంబు దాఁటి అధికముగా ఫలమూలములుగల సముద్రదక్షిణ తీరంబున విడిసినది. ౭౫

దేవతలును సిద్ధులును జారణులును మహర్షులును రామునికిం దక్క మఱియెవ్వరికినిం జేయనలవిగాని యాశ్చర్యకరంబగు నారామునికార్యంబుఁ జూచి శీఘ్రంబున రామునొద్దకువచ్చి అందఱును వేఱువేఱుగా మంగళజలంబుల రామున కభిషేకము గావించిరి. ౭౬

నరశ్రేష్ఠుఁడవగురాముఁడా! శత్రువులనందఱను జయింపుము పెద్దకాలము సముద్రాంతంబగు భూమండలము నంతయుఁ బాలింపుము అని యిట్లు యా దేవతలు మున్నగువారలు మనుష్యులచేతను దేవతలచేతను బూజితుఁడగురాముని మంగళవచనంబులం బూజించిరి. ౭౭

ఇది యిరువదిరెండవసర్గము.

---

## త్ర యో విం శ స్స ర్గః.

నిమిత్తాని నిమిత్తజ్ఞో దృష్ట్వా లక్ష్మణపూర్వజః,
సౌమిత్రిం సమ్పరిష్వజ్య ఇదం వచన మబ్రవీత్. ౧

పరిగృహ్యోదకం శీతం వనాని ఫలవన్తి చ,
బలౌఘం సంవిభజ్యేమం వ్యూహ్య తిష్ఠేమ లక్ష్మణ!. ౨

లోకక్షయకరం భీమం భయం పశ్యా మ్యుపస్థితమ్,
నిబర్హణం ప్రవీరాణామృక్షవానరరక్షసామ్. 3

వాతాశ్చ కలుషా వాన్తి కమ్పతే చ వసున్ధరా,
పర్వతాగ్రాణి వేపన్తే పతన్తి చ మహీరుహాః. ౪

మేఘాః క్రవ్యాదసఙ్కాశాః పరుషాః పరుషస్వనాః,
క్రూరాః క్రూరం ప్రవర్షన్తి మిశ్రం శోణితబిన్దుభిః. ౫
రక్తచన్దనసఙ్కాశా సన్ధ్యా పరమదారుణా,
జ్వలతః ప్రపతత్యేతదాదిత్యాదగ్నిమణ్డలమ్. ౬
దీనాదీనస్వరాః క్రూరాస్సర్వతో మృగపక్షిణః,
ప్రత్యాదిత్యం వినర్దన్తి జనయన్తో మహద్భయమ్. ౭

రజన్యామప్రకాశ స్తు సన్తాపయతి చన్ద్రమాః,

కృష్ణరక్తాంశుపర్యన్తో లోకక్షయ ఇవోదితః. ౮
హ్రస్వో రూక్షో ఽ ప్రశస్తశ్చ పరివేష స్సులోహితః,

## ఇరువదిమూఁడవసర్గము.

శుభాశుభనిమిత్తంబులు చక్కఁగాఁ దెలిసిన లక్ష్మణాగ్రజుఁడగు రాముఁడు కొన్ని నిమిత్తంబులంజూచి సంతోషంబున లక్ష్మణుం గవుఁగిలించుకొని యిట్లని చెప్పెను. ౧

లక్ష్మణుఁడా! వనము శీతోదకమును మంచిఫలంబులతోఁగూడిన వనంబులుంగల ప్రదేశంబులను వాసస్థానంబుగా నేర్పఱచుకొని సేనలనంతయు విభజించి గరుడవ్యూహంబుగాఁ దీర్చి స్వస్థంబుగా నుందము ౨

మహాపరాక్రమశాలులగు భల్లూకవానరులును రాక్షసులు అనేకులు వధింపఁబడుదురు; అట్లు జననాశకరంబగు మహాభయంబు వాటిల్లునని తోఁచుచున్నది. ౩

వాయువు భయంకరముగా వీచుచున్నది; భూమియుఁ వడఁకుచున్నది; పర్వతశిఖరంబులును గంపించుచున్నవి; వృక్షంబు లాకస్మికముగా విఱిగిపడుచున్నవి. ౪

మేఘంబులు గృధ్రశ్యేనాదివర్ణంబులయి పరుషంబులయి భయంకరధ్వనులయి భయంకరంబులయి రక్తబిందుమిశ్రంబుగా వర్షించుచున్నవి. ౫

సంధ్య రక్తచందనవర్ణంబయి యతిభయంకరముగా నున్నది; సూర్యుఁడు జ్వలించుచు నిప్పులను గురిపించుచున్నాఁడు. ౬

మృగంబులును బక్షులును దీనంబులయి భయంకరంబులయి సూర్యునకెదురు నిలుచుండి దీనస్వరంబున నఱచుచు మహాభయంబును సూచించుచున్నవి. ౭

రాత్రియందుఁ జంద్రుఁడు కాంతిహీనుఁడై సంతాపంబు గలిగించుచున్నాఁడు.

సూర్యునిచుట్టును అంతంబునందు నల్లనికిరణంబుగలదియుఁ దానికి వెనుకఁ గొంచె మెఱ్ఱనికిరణములుంగలదియుఁ నడుమ మిక్కిలియుఁ నెఱ్ఱఁగా నుండునదియుఁ హ్రస్వంబును భయంకరంబును ఇదివఱ కెన్నఁడును జూడఁబడ

ఆదిత్యే విమలే నీలం లక్ష్మ లక్ష్మణ! దృశ్యతే. ౯

రజసా మహతా చాపి నక్షత్రాణి హతానిచ,
యుగాన్త మివ లోకానాం పశ్య శంస న్తి లక్ష్మణ!. ౧౦

కాకాశ్శ్యేనా స్తథా గృధ్రా నీచైః పరిపత న్తి చ,
శివాశ్చాప్యశివాన్నాదాన్నద న్తి సుమహాభయాన్. ౧౧

శైలై శ్శూలై శ్చ ఖడ్గైశ్చ విసృష్టైః కపిరాక్షసైః,
భవిష్యత్యావృతా భూమి ర్మాంసశోణితకర్దమా. ౧౨

క్షిప్ర మద్యైవ దుర్ధర్షాం పురీం రావణపాలితామ్,
అభియామ జవే నైవ సర్వతో హరిభిర్వృతాః. ౧౩

ఇత్యేవ ముక్త్వా ధర్మాత్మా ధన్వీ సఙ్గ్రామహర్షణః,
ప్రతస్థే పురతో రామో లఙ్కా మభిముఖో విభుః. ౧౪

సవిభీషణసుగ్రీవా స్తత స్తే వానరర్షభాః,
ప్రతస్థిరే వినర్దన్తో నిశ్చితా ద్విషతాం వధే. ౧౫

రాఘవస్య ప్రియార్థం తు ధృతానాం వీర్యశాలినామ్,
హరీణాం కర్మ చేష్టాభి స్తుతోష రఘుపుఙ్గవః. ౧౬

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే త్రయోవింశ స్సర్గః. ౨౩.

నిదియుఁ బ్రలయకాలంబునందుఁ గల్గుపరివేషమువలె నున్నదియునగు పరివేషము చూపట్టుచున్నది. ౮

లక్ష్మణుఁడా! మఱియు నిర్మలంబగు సూర్యమండలంబు నడుమ నల్లని కళంకంబు గాన్పించుచున్నది. ౯

లక్ష్మణుఁడా! నక్షత్రంబులును మిక్కిలియు మలినంబులయి కాంతిహీనంబులయి లోకంబులకుఁ బ్రళయముఁ గల్గునట్లు సూచించుచున్నవి చూడుము ౧౦

కాకులను డేగలను గద్దలను మున్నగు బలవంతంబులగు పక్షులు దుర్బలపక్షులచేఁ గూలుచున్నవి; నక్కలు భయంకరంబులగు నమంగళధ్వనుల గావింపుచున్నవి. ౧౧

భూమియంతయుం వానరరాక్షసు లొండొరులపయిం బ్రయోగించుకొను పర్వతంబులచేతను శూలఖడ్గాద్యాయుధంబులచేతనుం గప్పఁబడి రక్తమాంసపూర్ణంబు గాఁగలదు. ౧౨

మన మింక జాగుసేయరాదు. ఇప్పుడే శీఘ్రంబున వానరుల నందఱఁ గూడి వేగంబున దుర్ధర్షంబగు రావణుని లంకాపురికిం బోవుదము. అని రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పెను. ౧౩

ధర్మాత్ముఁడును యుద్ధప్రియుఁడును సమర్థుఁడునగు రాముఁడు లక్ష్మణునితో నీప్రకారమునం జెప్పి ధనుర్ధరుఁడై లంకాభిముఖుఁడై వానరసైన్యంబులకు ముందటం బోయెను. ౧౪

అంత విభీషణుఁడును సుగ్రీవుఁడును మున్నుగా వానరోత్తములందఱు శత్రువధంబు విషయమయి నిశ్చితహృదయులయి సింహనాదంబులు సేయుచుం బోయిరి. ౧౫

రాముఁడు సంతోషంబుఁ గలుగవలయునని ధైర్యవంతులును పరాక్రమవంతులునగు వానరులు చేయునట్టి తోఁకలు విసరుట మొదలగు నుత్సాహచేష్టలం జూచి రాముఁడు సంతోషించెను. ౧౬

ఇది యిరువదిమూఁడవసర్గము.

## చతుర్వింశస్సర్గః.

సా వీరసమితీ రాజ్ఞా విరరాజ వ్యవస్థితా,
శశినా శుభనక్షత్రా పౌర్ణమాసీవ శారదీ. ౧

ప్రచచాల చ వేగేన త్రస్తా చైవ వసున్ధరా,
పీడ్యమానా బలౌఘేన తేన సాగరవర్చసా. ౨

తతశ్శుశ్రువు రాక్రుష్టం లఙ్కాయాం కాననౌకసః,
భేరీమృదఙ్గసఙ్ఘుష్టం తుములం రోమహర్షణమ్.

బభూవు స్తేన ఘోషేణ సంహృష్టా హరియూథపాః,
అమృష్యమాణా స్తం ఘోషం వినేదు ర్ఘోషవ త్తరమ్. ४

రాక్షసా స్తు ప్లవఙ్గానాం శుశ్రువుశ్చాపి గర్జితమ్,
నర్దతా మివ దృప్తానాం మేఘానా మమ్బరే స్వనమ్. ౫

దృష్ట్వా దాశరథి ర్లఙ్కాం చిత్రధ్వజపతాకినీమ్,
జగామ మనసా సీతాం దూయమానేన చేతసా. ౬

అత్ర సా మృగశాబాక్షీ రావణేనోపరుధ్యతే,
అభిభూతా గ్రహేణేవ లోహితాఙ్గేన రోహిణీ. ౭

దీర్ఘ ముష్ణం చ నిశ్వస్య సముద్వీక్ష్య చ లక్ష్మణమ్,
ఉవాచ వచనం వీర స్తత్కాలహిత మాత్మనః. ౮

ఆలిఖ న్తీ మి వాకాశ ముత్థితాం పశ్య లక్ష్మణ!,
మనసేవ కృతాం లఙ్కాం నగాగ్రే విశ్వకర్మణా. ౯

## ఇరువదినాలుగవసర్గము.

రామాధిష్ఠితంబయిన యావానరవీరసేన చంద్రునితో నొప్పుచున్నశుభనక్షత్రసహితంబగు శారదపౌర్ణమాసియుంబోలె నెంతయుఁ బ్రకాశించినది.

సముద్రముంబోలె నపరిచ్ఛిన్నమయిన యావానరసైన్యముచేఁ బీడింపఁబడి భూమి గడగడవడంకెను. ౨

అంత సేనానివేశఁబయినపిమ్మట వానరులకు లంకలోనుండి గగుర్పాటు నొందించునదియుఁ దుముఁలంబునగు భేరీమృదంగఁబులధ్వనియుం సైనికుల యాక్రోశంబును వినవచ్చినవి. ౩

వానరశ్రేష్ఠులు లంక యందలి ధ్వనినివిని సంతుష్టులయిరి. మఱియు నాధ్వనిని సహింపఁజాలక యంతకన్న నెచ్చుధ్వని గలుగునటుగా సింహనాదంబులు గావించిరి. ౪

రాక్షసులు గర్వంబున మేఘంబులుంబోలె గర్జించుచున్న యావానరవీరుల సింహనాదంబులను వినిరి. ౫

రాముఁడు నానావిధఁబులగు ధ్వజపతాకలచే నొప్పుచున్న లంకాపురిం జూచి మనంబున మిక్కిలియుఁ దుఃఖితుఁడై సీతాదేవిం దలఁచుకొనెను. ౬

ఈలంకాపట్టణమునందే జింకపిల్లకుంబోలె సుందరచపలనయనంబులుగల యాసీతాదేవి దుష్టగ్రహంబగు నంగారకునిచేరోహిణియుంబోలె రావణునిచే నిరోధింపఁబడుచున్నది. అని రాముఁడు మనంబునఁ దలఁచుకొనెను. ౭

పరాక్రమవంతుఁడగురాముఁడు యుద్ధయాత్రాసమయంబునఁ బ్రియురాలిం దలంచుకొని దుఃఖించుట యనుచితంబని యాతలంపును విడిచి వేఁడినిట్టూర్పులు నిగుడించి లక్ష్మణునిం జూచి తత్కాలహితంబగు వాక్యంబు నిట్లని చెప్పెను. ౮

లక్ష్మణుఁడా! ఆకాశంబును స్పృశించుచున్నట్లత్యున్నతంబును విశ్వకర్మచే నతిచమత్కారంబునఁ ద్రికూటపర్వతశిఖరంబునందు నిర్మింపఁబడినదియు నగు లంకాపురిం జూడుము. ౯

విమానైర్బహుభిర్లఙ్కా సఙ్కీర్ణా భువి రాజతే,
విష్ణోః పద మివాకాశం ఛాదితం పాణ్డురై ర్ఘనైః. ౧౦
పుష్పితై శ్శోభితా లఙ్కా వనై శ్చైత్రరథోపమైః,
నానాపతగసఙ్ఘుష్టైః ఫలపుష్పోపగై శ్శుభైః. ౧౧

పశ్య మత్తవిహఙ్గాని ప్రలీనభ్రమరాణి చ,
కోకిలాకులషణ్డాని దోధవీతి శివోఽనిలః. ౧౨

ఇతి దాశరథీ రామో లక్ష్మణం సమభాషత,

బలం చ తద్వై విభజన్ శాస్త్రదృష్టేన కర్మణా. ౧౩
శశాస

కపిసేనాయాం బలమాదాయ వీర్యవాన్,
అఙ్గద స్సహనీలేన తిష్ఠేదురసి దుర్జయః. ౧౪
తిష్ఠేద్వానరవాహిన్యా వానరౌఘసమావృతః,
ఆశ్రిత్య దక్షిణం పార్శ్వ మృషభో వానరర్షభః. ౧౫
గన్ధహస్తీవ దుర్ధర్ష స్తరస్వీ గన్ధమాదనః,
తిష్ఠే ద్వానరవాహిన్యా స్సవ్యం పార్శ్వం సమాశ్రితః. ౧౬
మూర్ధ్ని స్థాస్యామ్యహం యుక్తో లక్ష్మణేన సమన్వితః,
జామ్బవాంశ్చ సుషేణశ్చ వేగదర్శీ చ వానరః. ౧౭
ఋక్షముఖ్యా మహాత్మానః కుక్షిం రక్షన్తు తే త్రయః,
జఘనం కపిసేనాయాః కపిరాజోఽభిరక్షతు. ౧౮
పశ్చార్ధమివ లోకస్య ప్రచేతా స్తేజసా వృతః,

ఈలంకాపురి పెక్కువిమానంబులచే నావృతయయి తెల్లమేఘంబు లతోఁగూడిన యాకాశంబుపగిదిఁ బ్రకాశించుచున్నది. ౧౦

ఈలంకాపురి, మధురంబుగాఁగూయుఁ నానావిధపక్షులతోఁ గూడిన వియు, ఫలపుష్పసంపూర్ణంబునగు చైత్రరథంబువంటి సుందరవనంబులచే నెంతయుఁ నొప్పుచున్నది. ౧౧

ఫలరసాస్వాదనంబున మదించినపక్షులుగలవియుఁ మధుపానంబున మత్తంబులయి నిశ్చలంబులయిన తుమ్మెదలుకలవియుఁ బల్లవచర్వణాసక్తంబు లగు కోకిలంబులతోఁ గూడినవియుఁ నగువనంబులు చూడుము. అని రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పెను. ౧౨

ఈప్రకారంబుల దశరథకుమారుఁడగు రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పెను.

రాముఁడు నీతిశాస్త్రపద్ధతిని సైన్యంబుగంతయుం వ్యూహముగాఁ దీర్చుటకై వానరుల కిట్లని యాజ్ఞాపించెను. ౧౩

శత్రువులకు దుర్జయుఁడును మహాపరాక్రమశాలియునగు నంగదుఁడు నీలుంగూడి తనసేనం దీసికొని వానరసేన వక్షస్స్థలమున నుండునుగాక.

వానరశ్రేష్ఠుఁడగు ఋషభుఁడు తనవానరసమూహముంగూడి వానరసేనాదక్షిణపార్శ్వంబునం గాచియుండుఁగాక. ౧౫

మదపుటేనుఁగుంబోలె దుర్ధర్షుండు బలవంతుఁడునగు గంధమాదనుఁడు తనసేనంగూడి వానరసేనాసవ్యపార్శ్వంబున నుండుఁగాక. ౧౬

నేనును లక్ష్మణుఁడును సావధానులమయి శిరస్సున నుండెదము.

జాంబవంతుఁడును సుషేణుఁడును వేగదర్శియు మహాబలశాలులగు భల్లూకశ్రేష్ఠులీమువ్వురును వానరసేనా కుక్షిస్థానమును రక్షింతురుగాక. ౧౭

తేజోజాలంబుచే నావృతుఁడగు వరుణుఁడు పశ్చిమదిక్కును బాలించునట్లు వానరరాజుఁడగు సుగ్రీవుఁడు వానరసేనాపుచ్ఛభాగంబు రక్షించుఁగాక. అని రాముఁడు వానరవీరుల కాజ్ఞాపించెను. ౧౮

సువిభక్తమహావ్యూహా మహావానరరక్షితా. ౧౯
అనీకినీ సా విబభౌ యథా ద్యౌస్సాభ్రసంప్లవా,

ప్రగృహ్య గిరిశృఙ్గాణి మహతశ్చ మహీరుహాన్. ౨౦
ఆసేదు ర్వానరా లఙ్కాం విమర్దయిషవో రణే,

శిఖరై ర్వికిరా మైనాం లఙ్కాం ముష్టిభిరేవ వా. ౨౧
ఇతి స్మ దధిరే సర్వే మనాంసి హరిసత్తమాః,

తతో రామో మహాతేజాః సుగ్రీవమిదమబ్రవీత్. ౨౨

సువిభక్తాని సైన్యాని శుక ఏష విముచ్యతామ్,

రామస్య వచనం శ్రుత్వా వానరేన్ద్రో మహాబలః. ౨౩
మోచయామాస తం దూతం శుకం రామస్య శాసనాత్,
మోచితో రామవాక్యేన వానరై శ్చాభిపీడితః. ౨౪
శుకః పరమసన్త్రస్తో రక్షోధిప ముపాగమత్,

రావణః ప్రహసన్నేవ శుకం వాక్య మభాషత. ౨౫
కి మిమౌ తే సితౌ పక్షౌ లూనపక్షశ్చ దృశ్యసే.
కచ్చి న్నానేకచిత్తానాం తేషాం త్వం వశ మాగతః. ౨౬

తత స్స భయ సంవిగ్న స్తథా రాజ్ఞాఽభిచోదితః,
వచనం ప్రత్యువాచేదం రాక్షసాధిపము త్తమమ్. ౨౭

ఆవానరసేన చక్కఁగా గారుడవ్యూహంబున విభక్తంబయి వానర వీరాభిరక్షితంబయి మేఘంబులతోఁగూడిన యాకాశంబుపగిదిఁ బ్రకాశించు చుండినది. ౧౯

వానరులు పర్వతశిఖరంబులను గొప్పగొప్పవృక్షంబులనుం దీసికొని యుద్ధంబున రాక్షసుల నందఱ మర్దింపఁగోరి లంకాపురికిం బోవుటకుఁ బ్రయత్నపడిరి. ౨౦

"పర్వతశిఖరంబులచేఁగాని పిడికిళ్లచేఁగాని లంకాపురి నంతయుఁ జూర్ణంబు గావింతము" ఇట్లు ఆవానరోత్తములందఱు మనంబుల నిశ్చయించు కొనిరి. ౨౧

అటుపిమ్మట మహాతేజుఁడగు రాముఁడు సుగ్రీవుంజూచి యీమాటం జెప్పెను. ౨౨

సైన్యంబుల నంతయుం వ్యూహాకారంబుఁ దీర్చియయినదిగదా! ఇంక నీశుకుని విడిపించుము. అని రాముఁడు సుగ్రీవునితోఁ జెప్పెను.

మహాబలశాలియు వానరరాజుఁడునగు సుగ్రీవుఁడు రామునిమాటను విని రాము నాజ్ఞంజేసి రావణదూతయగు శుకుని విడిపించెను. ౨౩

అట్లు వానరులచే నానావిధంబుల బీడింపఁబడి పరమభయంబు నొంది యున్న శుకుఁడు రామవాక్యంబున విడుదల నొందినంతనే నిమిషంబైన నచ్చట నిలువక రాక్షసరాజుఁడగు రావణునొద్దకుఁ బోయెను. ౨౪

రావణుఁడు శుకుంజూచి నవ్వుచు నిట్లని చెప్పెను. ౨౫

నీ ఱెక్కలు బంధింపఁబడినవాయేమి? ఛేదింపఁబడినట్లు గాన్పించు చున్నవి. నీవు చపలచిత్తులగు నావానరుల వశంబునఁ జిక్కలేదుగదా? అని రావణుఁడు శుకునితోఁ జెప్పెను. ౨౬

అంత నాశుకుఁడు అట్లు రాక్షసరాజుండగు రావణునిచే నడుగఁబడిన వాఁడై భయంబుచేఁ దొట్రుపడుచు రావణుంజూచి యుత్తమంబగు నీమాటం జెప్పెను. ౨౭

సాగరస్యోత్తరే తీరేఽబ్రువం తే వచనం తథా,
యథా సన్దేశ మక్లిష్టం సాన్త్వయన్ శ్లక్ష్ణయా గిరా. ౨౮

క్రుద్ధైస్తై రహముత్ప్లుత్య దృష్టమాత్రైః ప్లవఙ్గమైః,
గృహీతోఽస్మ్యపి చారబ్ధో హన్తుం లోప్తుం చ ముష్టిభిః. ౨౯

నైవ సమ్భాషితుం శక్యాః సమ్ప్రశ్నోఽత్ర న లభ్యతే,
ప్రకృత్యా కోపనా స్తీక్ష్ణా వానరా రాక్షసాధిప!. ౩౦

స చ హన్తా విరాధస్య కబన్ధస్య ఖరస్య చ,
సుగ్రీవసహితో రామ స్సీతాయాః పద మాగతః. ౩౧

స కృత్వా సాగరే సేతుం తీర్త్వా చ లవణోదధిమ్,
ఏష రక్షాంసి నిర్ధూయ ధన్వీ తిష్ఠతి రాఘవః. ౩౨

ఋక్షవానరముఖ్యానా మనీకాని సహస్రశః,
గిరిమేఘనికాశానాం ఛాదయన్తి వసున్ధరామ్. ౩౩

రాక్షసానాం బలౌఘస్య వానరేన్ద్రబలస్య చ,
నైతయో ర్విద్యతే సన్ధి ర్దేవదానవయో రివ. ౩౪

పురా ప్రాకార మాయాన్తి క్షిప్ర మేకతరం కురు,
సీతాం వాస్మై ప్రయచ్ఛాశు సుయుద్ధం వా ప్రదీయతామ్.

శుకస్య వచనం శ్రుత్వా రావణో వాక్య మబ్రవీత్,
రోషసంరక్తనయనో నిర్దహన్నివ చక్షుషా. ౩౬

నేను ఇచ్చటనుండి సముద్రోత్తరతీరంబునకుఁబోయి యచ్చట సుగ్రీవునింజూచి మృదుమధురవచనంబుల ననునయింపుచు నీవు చెప్పినమాటల నంతయుం గించుమించు లేక స్పష్టముగాఁ జెప్పితిని. ౨౮

ఆవానరులు నన్నుఁజూచినంతనే పరమకుపితులై ఆకాశంబున కుద్గమించి నన్నుఁబట్టుకొని పిడికిళ్లంగొట్టి వధింప నారంభించిరి. ౨౯

రాక్షసేశ్వరుఁడవగు రావణుఁడా! ఆ వానరులతో మాటలాడుట కవకాశమే లేదు. అడుగుటకుఁగూడ నలవిగాదు. ఇఁక వారలవలనఁ బ్రత్యుత్తరము నొందు టెట్లు? వానరులు స్వభావంబుననే పరమకోపనులు; అతిక్రూరులు. ౩౦

విరాధునిఁ గబంధుని ఖరుని వధించినట్టి మహాపరాక్రమశాలియగు రాముఁడు సుగ్రీవసహితుఁడై సీతాదేవి యునికిపట్టయిన లంకాద్వీపంబునకు వచ్చినాఁడు. ౩౧

అట్టి ధనుర్ధరుఁడగు రాముఁడు సముద్రంబున సేతువునిర్మించి సముద్రంబుదాటి రాక్షసులం దృణీకరించి లంకాద్వారంబున నున్నాఁడు. ౩౨

పర్వతాకారులును మేఘాకారులునగు ఋక్షవానరులసేనలు వేనవేలుగా భూమినంతయు నావరించియున్నవి. ౩౩

రాక్షససైనికులకును వానరసైనికులకును వీరల యిర్వురకును; దేవదానవులకుంబోలె నెంతమాత్రము సంధికుదురదు. ౩౪

ఇదిగో వానరులు లంకాప్రాకారంబులపైకి రాఁబోవుచున్నారు. శీఘ్రంబున సీతనైనను రామున కొసంగుము. లేక చక్కఁగా యుద్ధంబునైనం జేయుము. ఈరెంటిలో నేదేని శీఘ్రంబునఁ గావింపుము. అని శుకుఁడు రావణునితోఁ జెప్పెను. ౩౫

రావణుఁడు శుకుఁడు చెప్పినమాటను విని కోపంబునఁ గన్నుల నెఱ్ఱఁదనంబుగదుర నిప్పులుగ్రక్కుచు నీమాటం జెప్పెను. ౩౬

యది మాం ప్రతియుద్ధ్యేరన్ దేవగన్ధర్వదానవాః,
నైవ సీతాం ప్రయచ్ఛామి సర్వలోకభయా దపి. ౩౭

కదా నామాభిధావన్తి రాఘవం మామకాశ్శరాః,
వసన్తే పుష్పితం మత్తా భ్రమరా ఇవ పాదపమ్. ౩౮
కదా తూణీశయైర్దీప్తై ర్గణశః కార్ముకచ్యుతైః,
శరై రాదీపయామ్యేన ముల్కాభిరివ కుఞ్జరమ్. ౩౯

త చ్చాస్య బల మాదాస్యే బలేన మహతా వృతః,
జ్యోతిషామివ సర్వేషాం ప్రభాముద్య న్దివాకరః. ౪౦

సాగరస్యేవ మే వేగో మారుతస్యేవ మే గతిః,
న హి దాశరథి ర్వేద తేన మాం యోద్ధు మిచ్ఛతి. ౪౧

న మే తూణీశయా న్బాణాన్ సవిషా నివ పన్నగాన్,
రామః పశ్యతి సఙ్గ్రామే తేన మాం యోద్ధు మిచ్ఛతి. ౪౨

న జానాతి పురా వీర్యం మమ యుద్ధే స రాఘవః,

మమ చాపమయీం వీణాం శరకోణైః ప్రవాదితామ్. ౪౩
జ్యాశబ్దతుములాం ఘోరా మార్తభీతమహాస్వనామ్.
నారాచతలసన్నాదాం తాం మమాహితవాహినీమ్. ౪౪
అవగాహ్య మహారఙ్గం వాదయిష్యామ్యహం రణే.
న వాసవేనాపి సహస్రచక్షుషా
యథాస్మి శక్యో వరుణేన వా స్వయమ్,

దేవగంధర్వులును దానవులును వీరలందఱు నాపైకి యుద్ధము గావింప వచ్చినను సమస్తలోకంబులును నన్ను భయపఱచినను నే నెంతమాత్రము సితి నివ్వను. ౩౭

వసంతఋతువునందుఁ బుష్పితంబగు వృక్షంబును మదించినతుమ్మెదలం ముసరుకొనునట్లు నాబాణంబులు రామునిదేహంబు నెప్పుడు పొందఁగలవు?

బహుకాలముగా యుద్ధము లేకుండుటచే నమ్ములపొదులందున్న కఱకు బాణంబులను వేనవేలుగాఁ బ్రయోగించి కొఱవికట్టెలచే నేనుఁగును బాధించునట్లు రాము నెప్పుడు బాధింపఁగలను? ౩౯

నేను రాక్షససేనాపరివృతుఁడనై ఉదితుఁడగు సూర్యుఁడు చంద్రనక్షత్రాదులకాంతిఁ బోఁగొట్టునట్లు రామునివానరసేనసంతతిని సంహరించెదను. ౪౦

నాకు సముద్రమునకుంబోలె వేగంబును వాయువునకుంబోలె గమనంబును గలదని రామునకుఁ దెలియదు కాఁబోలు; అందువలననే నాతో యుద్ధము సేయఁగోరుచున్నాఁడు. ౪౧

రాముఁడు తీక్ష్ణవిషంబులగు సర్పంబులవంటి నాతూణీరంబుల నున్న బాణంబులను యుద్ధంబున నెప్పుడును జూచినది లేదు. కావుననే నాతో యుద్ధంబు సేయవలెనని కోరుచున్నాఁడు. ౪౨

రాముఁడు యుద్ధంబున నాపరాక్రమంబుసంగతి నిదివఱకెఱుంగఁడు.

నేను యుద్ధంబున శత్రుసేనం జొచ్చి బాణకోణంబుల వాయింపఁదగి నదియును అల్లెత్రాటిధ్వనియును దుఃఖితులును భీతులును గావించురోదనంబును బాణతలంబుధ్వనియును మంద్రమధ్యమతారస్వరంబులయి చెలంగ భయంకరంబయి యొప్పుచున్నదియునగు ధనుర్వీణం గైకొని వాయించెదను. ౪౪

సహస్రాక్షుఁడగు దేవేంద్రుఁడుగాని సాక్షాద్వరుణుఁడుగాని యముఁడుగాని కుబేరుఁడుగాని నిప్పులవంటిబాణంబులం బ్రయోగించియు మహా

యమేన వా ధర్షయితుం శరాగ్నినా
మహాహవే వైశ్రవణేన వా పునః. ౪౫

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే చతుర్వింశస్సర్గః. ౨౪.

---

## పంచవింశస్సర్గః.

సబలే సాగరం తీర్ణే రామే దశరథాత్మజే,
అమాత్యౌ రావణ శ్శ్రీమా నబ్రవీ చ్ఛుకసారణౌ. ౧

సమగ్రం సాగరం తీర్ణం దుస్తరం వానరం బలమ్,
అభూతపూర్వం రామేణ సాగరే సేతుబన్ధనమ్. ౨

సాగరే సేతుబన్ధం తు న శ్రద్దధ్యాం కథంచన,
అవశ్యం చాపి సఙ్ఖ్యేయం త న్మయా వానరం బలమ్. ౩
భవన్తౌ వానరం సైన్యం ప్రవిశ్యానుపలక్షితౌ,
పరిమాణం చ వీర్యం చ యేచ ముఖ్యాః ప్లవఙ్గమాః, ౪
మన్త్రిణో యేచ రామస్య సుగ్రీవస్య చ సమ్మతాః,
యే పూర్వ మభివర్తన్తే యే చ శూరాః ప్లవఙ్గమాః. ౫
స చ సేతు ర్యథా బద్ధ స్సాగరే సలిలార్ణవే,
నివేశం యద్యథా తేషాం వానరాణాం మహాత్మనామ్. ౬
రామస్య వ్యవసాయం చ వీర్యం ప్రహరణాని చ.
లక్ష్మణస్య చ వీర్యం చ తత్త్వతో జ్ఞాతు మర్హథః. ౭
కశ్చ సేనాపతి స్తేషాం వానరాణాం మహౌజసామ్,
ఏతత్ జ్ఞాత్వా యథాతత్త్వం శీఘ్ర మాగన్తు మర్హథః. ౮

ఇతి ప్రతిసమాదిష్టౌ రాక్షసౌ శుకసారణౌ,

యుద్ధంబున నాముందఱ నిలువంజాలరై రిగదా ! అని రావణుఁడు శుకునితోఁ జెప్పెను. ४२

ఇది యిరువదినాలుగవసర్గము.

## ఇరువదియైదవసర్గము.

దశరథకుమారుఁడగు రాముఁడు వానరసేనతోఁ గూడ సముద్రంబు దాఁటివచ్చుటను విని శ్రీమంతుఁడగు రావణుఁడు తనమంత్రుల శుకసారణులం జూచి యిట్లని చెప్పెను. ౧

వానరసైన్యమంతయు దుస్తరంబగు సముద్రమును దాఁటివచ్చినది; రాముఁడు సముద్రమునం దింతకుమున్నెప్పుడు జూచియు వినియుం నెఱుంగనిసేతువును నిర్మించినాఁడు. ౨

సముద్రంబున సేతుబంధంబు గావించినారనుట నాకు నమ్మకము లేదు. మఱియు నాకు ఆవానరసైన్యముప్రకారమంతయుఁ దెలియవలయును.

మీరలు వానరులకుఁ దెలియకుండునట్లు రహస్యముగా వానరసైన్యంబుఁ జొచ్చి వానరసేనాపరిమాణమును వానరులపరాక్రమంబును అందుముఖ్యులగు వానరులెవ్వరైనదియుం రామునిమంత్రులును సుగ్రీవునిమంత్రులు నెవ్వరైనదియుం వానరసేనయందు యుద్ధంబున ముందు నిలుచు శూరులెవ్వరైనదియుం అట్టిమహాసముద్రంబున సేతువు నెట్లు నిర్మించినదియుం మహాబలులగు నవ్వానరుల నివేశస్థానములును రామునివ్యవసాయంబును బరాక్రమంబును ఆయుధంబులును లక్ష్మణునిపరాక్రమంబును ఈసంగతులంతయుం యథార్థంబుగాఁ దెలిసికొని రండు. 3-8

మహాపరాక్రమశాలులగు నవ్వానరులసేనాపతి యెవ్వఁడు? మీరలు ఈసంగతులన్నియుం యథార్థముగాఁ దెలిసికొని శీఘ్రంబున నిచ్చుటకి రావలయును. అని రావణుఁడు శుకసారణులకుఁ జెప్పెను. ౯

పరాక్రమవంతులగు నాశుకసారణులు ఇట్లు రావణునిచే నాజ్ఞాపింపఁ

హరిరూపధరౌ వీరౌ ప్రవిష్టౌ వానరం బలమ్. ౯
తత స్తద్వానరం సైన్య మచిన్త్యం రోమహర్షణమ్,
సఙ్ఖ్యాతుం నాధ్యగచ్ఛేతాం తదా తౌ శుకసారణౌ. ౧౦

సంస్థితం పర్వతాగ్రేషు నిర్దరేషు గుహాసు చ,
సముద్రస్య చ తీరేషు వనేషూపవనేషు చ. ౧౧
తరమాణం చ తీర్ణం చ తర్తుకామం చ సర్వశః,
నివిష్టం నివిశచ్చైవ భీమనాదం మహాబలమ్. ౧౨
తద్బలార్ణవ మక్షోభ్యం దదృశాతే నిశాచరౌ,

తౌ దదర్శ మహాతేజాః ప్రచ్ఛన్నౌ చ విభీషణః. ౧౩

ఆచచక్షేఽథ రామాయ గృహీత్వా శుకసారణౌ.

తస్యేమౌ రాక్షసేన్ద్రస్య మన్త్రిణౌ శుకసారణౌ. ౧౪
లఙ్కాయాః సమనుప్రాప్తౌ చారౌ పరపురఞ్జయ!,

తౌ దృష్ట్వా వ్యథితౌ రామం నిరాశౌ జీవితే తదా. ౧౫
కృతాఞ్జలిపుటౌ భీతౌ వచనం చేదమూచతుః,
ఆవామిహాగతౌ సౌమ్య! రావణప్రహితావుభౌ. ౧౬
పరిజ్ఞాతుం బలం కృత్స్నం తవేదం రఘునన్దన!,

తయో స్తద్వచనం శ్రుత్వా రామో దశరథాత్మజః. ౧౭
అబ్రవీ త్ప్రహసన్వాక్యం సర్వభూతహితే రతః,

బడి వానరరూపంబుధరించి వానరసేనం జొచ్చిరి. ౯

అంత నప్పుడు ఆశుకసారణులు అచింత్యంబును జూపరులకు గగుర్పాటు గలిగించునదియునగు నవ్వానరసేనంజూచి యచ్చెరువునొంది దాని లెక్క పెట్టంజాలరైరి. ౧౦

శుకసారణులు పర్వతశిఖరంబులందును భిన్నపర్వతప్రదేశంబులందును గుహాలయందును సముద్రతీరంబునందును వనంబులందును ఉద్యానవనంబులందును విడిసియున్నదియుం గొంతభాగము సముద్రంబుదాటియుం గొంత దాటుచును గొంతవిడిసియుం గొంతవిడియుచును ఇట్లు నానాప్రకారంబుల నున్నదియు భయంకరధ్వనిగలదియు మహాబలంబును అక్షోభ్యంబు నగు సముద్రంబువంటి వానరసేనం జూచిరి. ౧౧, ౧౨

ఆ శుకసారణులు వానరవేషంబు దాల్చి యెంత ప్రచ్ఛన్నులై యుండినను మహాతేజుఁడగు విభీషణుఁడు వారలం గనుఁగొనెను. ౧౩

అంత నవ్విభీషణుఁడు ఆ శుకసారణుల నిద్దఱంబట్టి రామునకుఁ దెలియ జేసెను. ౧౪

శత్రుపట్టణంబుల జయించునట్టి రాముఁడా! వీరలు రాక్షసేశ్వరుఁడగు రావణునిమంత్రులు శుకసారణు లనంబడుదురు; లంకాపురినుండి మనరహస్యంబులఁ దెలిసికొనిపోవుటకై వచ్చినవారలు. అని విభీషణుఁడు రామునితోఁ జెప్పెను. ౧౫

అప్పుడు ఆ శుకసారణులు రామునుంజూచి పరమదుఃఖితులయి బ్రతుకు విషయమయి యాశనువిడిచి చేమోడ్చి గీలించి భయంబున నిట్లని చెప్పిరి.

సౌమ్యుండవగు రాముఁడా! మేము మిద్దఱము రావణునియోగంబున మీసైన్యంబులనంతయుం జూచుటకై యిచ్చటికి వచ్చినాము. అని శుక సారణులు రామునితోఁ జెప్పిరి. ౧౬

సమస్తభూతంబులకు హితంబుఁగోరునట్టి దశరథకుమారుఁడగు రాముఁడు శుకసారణులు చెప్పినమాటను విని నవ్వుచు నీమాటం జెప్పెను. ౧౭

యది దృష్టం బలం కృత్స్నం వయం వా సుపరీక్షితాః. ౧౮
యథోక్తం వా కృతం కార్యం ఛన్దతః ప్రతిగమ్యతామ్,

అథ కించిదదృష్టం వా భూయ స్తద్ద్రష్టుమర్హథః. ౧౯
విభీషణో వా కార్త్స్న్యేన భూయస్సన్దర్శయిష్యతి,
న చేదం గ్రహణం ప్రాప్య భేత్తవ్యం జీవితం ప్రతి. ౨౦
న్యస్తశస్త్రౌ గృహీతౌ వా న దూతౌ వధమర్హతః,

పృచ్ఛమానౌ విముఞ్చైతౌ చారౌ రాత్రించరా వుభౌ. ౨౧
శత్రుపక్షస్య సతతం విభీషణ! వికర్షణౌ,

ప్రవిశ్య నగరీం లఙ్కాం భవద్భ్యాం ధనదానుజః. ౨౨
వక్తవ్యో రక్షసాం రాజా యథోక్తం వచనం మమ,

యద్బలం చ సమాశ్రిత్య సీతాం మే హృతవానసి. ౨౩
తద్దర్శయ యథాకామం ససైన్యస్సహబాన్ధవః,
శ్వః కాల్యే నగరీం లఙ్కాం సప్రాకారాం సతోరణామ్. ౨౪
రాక్షసం చ బలం పశ్య శరై ర్విధ్వంసితం మయా,
క్రోధం భీమమహం మోక్ష్యే ససైన్యే త్వయి రావణ!. ౨౫
శ్వః కాల్యే వజ్రవాన్వజ్రం దానవే ష్వివ వాసవః,

ఇతి ప్రతిసమాదిష్టౌ రాక్షసౌ శుకసారణౌ. ౨౬
జయేతి ప్రతినన్ద్యైతౌ రాఘవం ధర్మవత్సలమ్,
ఆగమ్య నగరీం లఙ్కా మబ్రూతాం రాక్షసాధిపమ్. ౨౭

మా సైన్యమునంతయుఁ జూచి మమ్ముఁ గాఁ జక్కఁగా బరీక్షించి రావణుఁడు చెప్పినట్లు సరియంతయుఁ సైనపిమ్మట స్వేచ్ఛగా మరల మీ లంకకుం బొండు. ౧౮

మీ కింకఁ గొంచెము చూడవలసియుండు చేని దానిని జూచుకొనుఁడు; లేక విభీషణుఁడే మీకు సైన్యమునంతయుఁ జూపును. ౧౯

మీర లిప్పుడు మా చేఁ బట్టుపడినారని జీవితవిషయమున యొంత మాత్రము భయపడవలదు; ఆయుధములేనివారలుగాని దూతలుగాని వధింపఁ గూడదు; మీరలు నిరాయుధులు కావున వధ్యులరు కారు. ౨౦

విభీషణుఁడా! వీరలు సామాద్యుపాయంబుల శత్రుపక్షంబు నాశ్రయించుచారులు అయినను అడుగుకొనుచున్నారు; కావున నీ రాక్షసుల నిద్దఱను విడిచిపెట్టుము. ౨౧

శుకసారణులారా! మీరలు లంకాపురికిఁ బోయి కుబేరుని తమ్ముఁడును రాక్షసరాజుఁడునగు రావణునింజూచి నే నిప్పుడు చెప్పిపంపుమాటలన్నియు నించుమించు లేక చెప్పవలయును. ౨౨

నీ వేబలంబు నవలంబించి నా భార్యను సీత నపహరించితివో ఇప్పుడు నీ సైన్యములను నీబంధువులనుం గూడి యాబలంబునంతయుఁ జూపుము.

రేపు ప్రాతఃకాలమున లంకాప్రాకారములను బహిర్ద్వారంబులను రాక్షససైన్యంబులను బాణంబులచే నుగ్గుచేసెదం జూడుము. ౨౪

రావణుఁడా! రేపుప్రాతఃకాలమునందు వజ్రాయుధధారియగు నింద్రుండు దానవులపై వజ్రాయుధముం బ్రయోగించునట్లు మీపై భయంకరంబగు నా కోపంబును సార్థకము చేయఁబోవుచున్నాను; జాగ్రత్తతో నుండుము; అని రావణునితోఁ జెప్పుఁడు. అని శుకసారణులతోఁ జెప్పెను. ౨౫

అశుకసారణులు రాముఁడు చెప్పినమాటలను విని ధర్మవత్సలుఁడగు రాముని జయశబ్దంబులఁ బొగడి లంకాపురికిం జోయి రాక్షసేశ్వరుఁడగు రావణునిం జూచి యిట్లని చెప్పిరి. ౨౬–౨౭

విభీషణగృహీతౌ తు వధార్హౌ రాక్షసేశ్వర!,
దృష్ట్వా ధర్మాత్మనా ముక్తౌ రామేణామితతేజసా. ౨౮

ఏకస్థానగతా యత్ర చత్వారః పురుషర్షభాః,
లోకపాలోపమాః శూరాః కృతాస్త్రా దృఢవిక్రమాః. ౨౯
రామో దాశరథిః శ్రీమాన్ లక్ష్మణశ్చ విభీషణః,
సుగ్రీవశ్చ మహాతేజా మహేన్ద్రసమవిక్రమః. ౩౦

ఏతే శక్తాః పురీం లఙ్కాం సప్రాకారాం సతోరణామ్,
ఉత్పాట్య సఙ్క్రామయితుం సర్వే తిష్ఠన్తు వానరాః. ౩౧

యాదృశం తస్య రామస్య రూపం ప్రహరణాని చ,
వధిష్యతి పురీం లఙ్కామేకస్తిష్ఠన్తు తే త్రయః. ౩౨

రామలక్ష్మణగుప్తా సా సుగ్రీవేణ చ వాహినీ,
బభూవ దుర్ధర్షతరా సేన్ద్రైరపి సురాసురైః, ౩౩

(వ్యక్తస్సేతు స్తథా బద్ధః దశయోజనవిస్తృతః,
శతయోజనమాయామః స్తీర్ణా సేనా చ సాగరమ్.

నివిష్టో దక్షిణే తీరే రామస్స చ నదీపతేః.
తీర్ణస్య తరమాణస్య బలస్యాన్తో న విద్యతే.)
ప్రహృష్టరూపా ధ్వజినీ వనౌకసాం
మహాత్మనాం సమ్ప్రతి యోద్ధుమిచ్ఛతామ్,

రాక్షసనాథుఁడవగు రావణుఁడా! మేము వానరసేనం బ్రవేశించిన వెనుక మమ్ము విభీషణుఁడు పట్టుకొని రాముని యొద్దకుఁ దీసికొనిపోయెను; ధర్మాత్ముఁడును మహానుభావుఁడునగు రాముఁడు మమ్ముఁ జూచి దయచే విడిచి పెట్టెను. ౨౮

శ్రీమంతుఁడగు రాముఁడును లక్ష్మణుఁడును విభీషణుఁడును మహాతేజుఁడును దేవేంద్రునకుంబోలెఁ బరాక్రమముఁగలవాఁడునగు సుగ్రీవుఁడును లోకపాలురవంటివారలును శూరులును అస్త్రవేత్తలును మహాపరాక్రమశాలులునగు పురుషశ్రేష్ఠులు ఈనల్వురును ఒక్కచోఁ గూడియున్నారే! ఇంక నవ్వానరసేన కేమి తక్కువ? ౨౯, ౩౦

వానరులందఱు నట్లుండుదురుగాక. ఈరామలక్ష్మణవిభీషణసుగ్రీవులు నల్వురుమాత్రమె ప్రాకారతోరణంబులతోఁగూడ నీలంకాపురినంతయుఁ బెల్లగించి కొనిపోఁగలరు. ౩౧

రామునిరూపంబును ఆయుధంబులును జూడఁగా నాలక్ష్మణవిభీషణసుగ్రీవులుగూడ ఎందుకు? రాముఁ డొక్కఁడే లంకాపురినంతయు నశింపఁ జేయఁగలఁడని తోఁచుచున్నది. ౩౨

రామలక్ష్మణులును సుగ్రీవుఁడును రక్షింపఁగా నావానరసేన ఇంద్రునితోఁగూడిన దేవాసురులకైనను ఎంతమాత్రము నెదిరింప నలవిగాకున్నది.

(అట్లు పదియోజనంబుల వెడల్పును నూఱుయోజనంబుల నిడుపునుంగల సేతువు సముద్రంబునందు స్పష్టముగాఁ గట్టఁబడినది; వానరసేనయు సముద్రంబు దాఁటినది.

రాముఁడు సముద్రదక్షిణతీరంబున విడిసియున్నాఁడు. సైన్యములు కొంతదాఁటియుఁ గొంతదాఁటుచు నున్నవి. దాని కంతమే లేదు.)

మహాబలశాలులగు వానరవీరులందఱు ఇప్పుడే యుద్ధంబు సేయంగోరుచుఁ బరమోత్సాహంబున నున్నవారలు. కావున వారలతో విరోధంబు

అలం విరోధేన శమో విధీయతాం
ప్రదీయతాం దాశరథాయ మైథిలీ. ౩౪

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే పఞ్చవింశస్సర్గః ౨౫.

---

## షడ్వింశస్సర్గః.

తద్వచః పథ్య మక్లీబం సారణేనాభిభాషితమ్,
నిశమ్య రావణో రాజా ప్రత్యభాషత సారణమ్. ౧
యది మామభియుఞ్జీరన్దేవగన్ధర్వదానవాః,
నైవ సీతాం ప్రదాస్యామి సర్వలోకభయా దపి. ౨

త్వం తు సౌమ్య! పరిత్రస్తో హరిభిర్నిర్జితో భృశమ్,
ప్రతిప్రదానమద్యైవ సీతాయా స్సాధు మన్యసే. ౩

కో హి నామ సపత్నో మాం సమరే జేతు మర్హతి,
ఇత్యుక్త్వా పరుషం వాక్యం రావణో రాక్షసాధిపః. ౪
ఆరురోహ తతః శ్రీమాన్ ప్రాసాదం హిమపాణ్డురమ్,
బహుతాలసముత్సేధం రావణో౽థ దిదృక్షయా. ౫

తాభ్యాం చరాభ్యాం సహితో రావణః క్రోధమూర్ఛితః,
పశ్యమాన స్సముద్రం చ పర్వతాం శ్చ వనాని చ. ౬
దదర్శ పృథివీదేశం సుసమ్పూర్ణం ప్లవఙ్గమైః,
తదపార మసఙ్ఖ్యేయం వానరాణాం మహద్బలమ్. ౭
ఆలోక్య రావణో రాజా పరిపప్రచ్ఛ సారణమ్,
ఏషాం వానరముఖ్యానాం కే శూరాః కే మహాబలాః. ౮

వలదు. కోపంబువిడిచి రామునకు సీతాదేవి నొసంగుము. అని శుకసారణులు రావణునితోఁ జెప్పిరి. ౧౪

ఇది యిరువదియైదవసర్గము.

## ఇరువదియాఱవసర్గము.

రాక్షసరాజుండగు రావణుండు శుకసారణులు నిర్భయుంబుగాఁ జెప్పిన హితంబగు నామాటను విని సారణుంజూచి యిట్లని బదులు చెప్పెను. ౧

దేవతలును గంధర్వులును దానవులును అందఱు నొక్కపెట్ట నాపైకి యుద్ధమునకు వచ్చినను సమస్తలోకంబులును నన్ను భయపఱచినను నే నెంత మాత్రము సీత నొసంగను. ౨

సారణుఁడా! నీవు సౌమ్యుఁడవు శూరుఁడవు కావు; వానరులచే దెబ్బలుదిని మిక్కిలియు భయంబుఁ జెందియున్నావు కావున నీవు ఇప్పుడే సీత నిచ్చివేయుట మంచిదని చెప్పుచున్నావు. ౩

నన్ను యుద్ధంబున శత్రుఁ డెవ్వఁడు జయింపఁగలఁడు? అని రావణుండు సారణునితోఁ జెప్పెను.

రాక్షసేశ్వరుఁడును శ్రీమంతుఁడు నగు రావణుఁడు ఈప్రకారంబునఁ బరుషంబుగాఁ జెప్పి వానరసైన్యంబునంతయుం జూడఁ గోరి మంచువలెఁ దెల్లగా నున్న పెక్కుతాటిచెట్లయౌన్నత్యముగల ప్రాసాదంబుపైకి నారోహించెను. ౪, ౫

రావణుండు మిక్కిలియుఁ గుపితుఁడై యా శుకసారణులం గూడి ప్రాసాదంబుపైనుండి సముద్రంబును బర్వతంబులను వనంబులనుం జూచుచు భూమియంతయుం వానరులచే నిండియుండుటం జూచెను. ౬

రాక్షసరాజుండగు రావణుండు అపారంబును లెక్కపెట్ట నలవిగానిదియునగు నావానరసేనం జూచి సారణుని ఇట్లని యడిగెను. ౭

ఈవానరోత్తములలో నెవ్వరు శూరులు? ఎవ్వరు బలవంతులు? ౮

కే పూర్వ మభివర్తన్తే మహోత్సాహాః సమన్తతః,
కేషాం శృణోతి సుగ్రీవః కేవా యూథపయూథపాః. ౯
సారణాచక్ష్వ తత్త్వేన కే ప్రధానాః ప్లవఙ్గమాః,
సారణో రాక్షసేన్ద్రస్య వచనం పరిపృచ్ఛతః. ౧౦
ఆచచక్షేఽథ ముఖ్యజ్ఞో ముఖ్యాం స్తాం స్తు వనౌకసః,
ఏష యోఽభిముఖో లఙ్కాం నర్దం స్తిష్ఠతి వానరః. ౧౧
యూథపానాం సహస్రాణాం శతేన పరివారితః,
యస్య ఘోషేణ మహతా సప్రాకారా సతోరణా. ౧౨
లఙ్కా ప్రవేపతే సర్వా సశైలవనకాననా,
సర్వశాఖామృగేన్ద్రస్య సుగ్రీవస్య మహాత్మనః. ౧౩
బలాగ్రే తిష్ఠతే వీరో నీలో నామైష యూథపః,
బాహూ ప్రగృహ్య యః పద్భ్యాంమహీం గచ్ఛతివీర్యవాన్.
లఙ్కా మభిముఖః క్రోధా దభీక్ష్ణం చ విజృమ్భతే,
గిరిశృఙ్గప్రతీకాశః పద్మకిఞ్జల్కసన్నిభః. ౧౪
స్ఫోటయత్యభిసంరబ్ధో లాఙ్గూలం చ పునఃపునః,
యస్య లాఙ్గూలశబ్దేన స్వనన్తి ప్రదిశో దశ. ౧౫
ఏష వానరరాజేన సుగ్రీవేణాభిషేచితః,
యౌవరాజ్యేఽఙ్గదో నామ త్వా మాహ్వయతి సంయుగే. ౧౬
వాలినస్సదృశః పుత్రస్సుగ్రీవస్య సదా ప్రియః,
రాఘవార్థే పరాక్రాన్త శ్శక్రార్థే వరుణో యథా. ౧౭
ఏతస్య సా మతిస్సర్వా యద్దృష్టా జనకాత్మజా,

వీరలలో అధికోత్సాహంబున యుద్ధంబున ముందు నిలుచువార లెవ్వరు?

సుగ్రీవుఁ డిం దెవ్వరిమాటలను వినును? మఱియు వీరిలో నగ్రసేనా నాయకు లెవ్వరు? ౯

సారణుఁడా! వీరిలో ముఖ్యులగువానరు లెవ్వరు? ఈసంగతులన్నియుం యథార్థంబుగా నాకుఁ జెప్పుము. అని రావణుఁడు సారణునితోఁ జెప్పెను.

వానరులలో ముఖ్యులగువానరులం దెలిసికొనివచ్చినట్టి సారణుఁడు రావణుని ప్రశ్ననువిని యంత నవ్వానరులలో ముఖ్యులగువానరులను రావణునకుఁ జెప్ప నారంభించెను. ౧౦

ఎవ్వఁడు వేనవేలయూథపులంగూడి లంకాపురాభిముఖుఁడై సింహనాదంబు సేయుచున్నాఁడో ఎవ్వనిమహానాదంబునకు లంకాపురియంతయుఁ బ్రాకారతోరణంబులతోను బర్వతవనంబులతోనుంగూడ గడగడవడంకుచున్నదో, ఎవ్వఁడు సమస్తవానరనాథుఁడును మహాబలుఁడునగు సుగ్రీవుని సేనయగ్రభాగంబున నున్నాఁడో అట్టి మహాపరాక్రమశాలియగు నీ వానరోత్తముఁడు నీలుఁడు: ఇతఁడు వానరసేనానాయకుఁడు. ౧౧-౧౩

ఎవ్వఁడు చేతులుపైకెత్తి నిలుచుండియున్నాఁడో మఱియుఁ గ్రుద్ధుఁడై లంకాపురింజూచుచు విజృంభించుచు దశదిశలం బ్రతిధ్వనులు పిక్కటిల్ల లాంగూలంబున నేలగొట్టుచున్నాఁడో అట్టి పర్వతశిఖరాకారుఁడును గమలకేసరవర్ణుఁడునగు నీవానరవీరుఁడు అంగదుఁడు. వానరరాజుండగు సుగ్రీవునిచే వానరయౌవరాజ్యంబున నభిషిక్తుఁడయినవాఁడు నీతో యుద్ధంబుసేయువలెననియున్నాఁడు. ఇతఁడు వాలికుమారుఁడు. వాలియంతటివాఁడు. దేవేంద్రుని నిమిత్తమయి వరుణుఁడుంబోలె రామునినిమిత్తమయి పరాక్రమంబుఁ జూప నిశ్చయించియున్నాఁడు. ౧౪-౧౭

రామహితంబును గోరువాఁడు వేగవంతుండునగు హనుమంతుఁడు

హనూమతా వేగవతా రాఘవస్య హితైషిణా. ౧౯
బహూని వానరేన్ద్రాణామేష యూథాని వీర్యవాన్,
పరిగృహ్యాభియాతి త్వాం స్వేనానీకేన దుర్జయః. ౨౦
అను వాలిసుతస్యాపి బలేన మహతాఽఽవృతః,
వీర స్తిష్ఠతి సఙ్గ్రామే సేతుహేతు రయం నళః. ౨౧

యే తు విష్టభ్య గాత్రాణి క్ష్వేళయన్తి నదన్తి చ,
ఉత్థాయ చ విజృమ్భన్తే క్రోధేన హరిపుఙ్గవాః. ౨౨
ఏతే దుష్ప్రసహా ఘోరా శ్చణ్డా శ్చణ్డపరాక్రమాః,
అష్టౌ శతసహస్రాణి దశకోటిశతాని చ. ౨౩
య ఏనమనుగచ్ఛన్తి వీరా శ్చన్దనవాసినః,
ఏషై వాశంసతే లఙ్కాం స్వేనానీకేన మర్దితుమ్. ౨౪

శ్వేతో రజతసఙ్కాశ శ్చపలో భీమవిక్రమః,
బుద్ధిమాన్వానరో వీర స్త్రిషు లోకేషు విశ్రుతః. ౨౫

తూర్ణం సుగ్రీవ మాగమ్య పున ర్గచ్ఛతి సత్వరః,
విభజ న్వానరీం సేనా మనీకాని ప్రహర్షయన్. ౨౬

యః పురా గోమతీతీరే రమ్యం పర్యేతి పర్వతమ్,
నామ్నా సఙ్కోచనో నామ నానానగయుతో గిరిః. ౨౭
తత్ర రాజ్యం ప్రశాస్త్యేష కుముదో నామ యూథపః,
యోఽసౌ శతసహస్రాణాం సహస్రం పరికర్షతి. ౨౮
యస్య వాలా బహువ్యామా దీర్ఘా లాఙ్గూలమాశ్రితాః,
తామ్రాః పీతా స్సితా శ్శ్వేతాః ప్రకీర్ణా ఘోరకర్మణః. ౨౯

లంకకువచ్చిసీతంజూచినాఁడే ! అందుకంతయుం నితనిబుద్ధియే కారణము. ౧౯

పరాక్రమవంతుఁడగు నీయంగదుఁడు వానరోత్తముల సైన్యముల ననేకంబులం దీసికొని తనసైన్యంబునుంగూడిదుర్జయుఁడై నీపైకివచ్చుచున్నాఁడు.

వాలికుమారుఁడగు నంగదునకు వెనుక మహాబలపరివృతుఁడై నలుఁడున్నవాఁడు. ఇతఁడే సముద్రమునందు సేతువును నిర్మించినవాఁడు. మహాపరాక్రమశాలి. ౨౧

ఎవ్వరు ఈనలుని వెంబడించియున్నారో, మఱియుం నేవానరోత్తములు దేహములు నిగుడజేసి సింహనాదంబులుసేయుచు లేచి క్రోధంబున లంకాభిముఖులయి విజృంభించుచున్నారో, ఈపదినూఱుకోటుల యెనిమిదిలక్షలవానరులు చందనవనంబున నుండువారు. మిక్కిలియుఁ బరాక్రమవంతులు. భయంకరాకారులు. అతిక్రూరులు. వీరల జయింప నలవిగాదు. ౨౨, ౨౩

ఈనలుఁడు తానొక్కఁడే తనసేనంగూడి లంకాపురిని మర్దింపఁగోరుచున్నాఁడు. ౨౪

వెండివలె తెల్లనైన దేహముగలయీవానరుఁడు శ్వేతుఁడు. ఇతఁడు మిక్కిలియు యుద్ధచపలుఁడు. భయంకరంబయిన పరాక్రమంబుగలవాఁడు. బుద్ధిమంతుఁడని ముల్లోకంబులఁ బ్రసిద్ధివహించినవాఁడు. ౨౫

శ్వేతుఁడు శీఘ్రంబున సుగ్రీవునొద్దకువచ్చి మరల వానరసేనల విభజించుచు సైనికులం బ్రోత్సాహపఱచుచు సత్వరుఁడై పోవుచున్నాఁడు. చూడుము. ౨౬

ఈతఁడు కుముదుఁడనువాఁడు. ఇతఁడు మున్ను గోమతీతీరంబున రమ్యంబును నానావిధశిఖరసమన్వితంబునగు సంకోచనంబను పర్వతంబున నుండి వానరరాజ్యంబుఁ బాలించుచుండినవాఁడు. ౨౭

ఎవ్వనికిఁ దోఁకయందలి వెండ్రుకలు మిక్కిలియుఁ బొడవులయి కొన్ని యెఱ్ఱనై కొన్నిపసుపువన్నెగలిగి కొన్ని తెల్లనిపై యిట్లు నానావిధవర్ణంబులతో నొప్పుచుండునో అట్టి యీకుముదుఁడు వేయిలక్షలవానరులం

అదీనో రోషణ శ్చణ్డ స్సంగ్రామ మభికాఙ్క్షతి,

ఏషోఽప్యాశంసతే లఙ్కాం స్వేనానీకేన మర్దితుమ్. ౩౦

యస్త్వేష సింహసఙ్కాశః కపిలో దీర్ఘలోచనః,
నిభృతః ప్రేక్షతే లఙ్కాం దిధక్ష న్నివ చక్షుషా. ౩౧
విన్ధ్యం కృష్ణగిరిం సహ్యం పర్వతం చ సుదర్శనమ్,
రాజన్! సతత మధ్యాస్తే రమ్భో నామైష యూథపః. ౩౨
శతం శతసహస్రాణాం త్రింశచ్చ హరిపుఙ్గవాః,
యమేతే వానరా శ్శూరా శ్చణ్డా శ్చణ్డపరాక్రమాః. ౩౩
పరివార్యానుగచ్ఛన్తి లఙ్కాం మర్దితుమోజసా,
యస్తు కర్ణౌ వివృణుతే జృమ్భతే చ పునఃపునః. ౩౪
న చ సంవిజతే మృత్యో ర్న చ యుద్ధా ద్విధావతి,
ప్రకమ్పతే చ రోషేణ తిర్యక్చ పున రీక్షతే ౩౫
పశ్యన్ లాఙ్గూలమపి చ క్ష్వేళతే చ మహాబలః,
మహాజవో వీతభయో రమ్యం సాల్వేయపర్వతమ్. ౩౬
రాజన్! సతత మధ్యాస్తే శరభో నామ యూథపః,
ఏతస్య బలిన స్సర్వే విహారా నామ యూథపాః. ౩౭
రాజన్ శతసహస్రాణి చత్వారింశ త్తథైవచ,
యస్తు మేఘ ఇవాకాశం మహానావృత్య తిష్ఠతి. ౩౮
మధ్యే వానరవీరాణాం సురాణా మివ వాసవః,
భేరీణామివ సన్నాదో యస్యైష శ్రూయతే మహాన్. ౩౯
ఘోషః శ్శాఖామృగేన్ద్రాణాం సంగ్రామ మభికాఙ్క్షతామ్,
ఏష పర్వత మధ్యాస్తే పారియాత్ర మనుత్తమమ్. ౪౦

దోడ్కొనివచ్చుచున్నాఁడు. ఇతఁడు భయంకరంబులగు కార్యంబులం జేయు వాఁడు. ఎంతమాత్రము దైన్యములేనివాఁడు. మిక్కిలియుఁ గోపంబుగల వాఁడు. భయంకరుఁడు. ఇతఁడు యుద్ధంబునకుఁ గాలు ద్రవ్వుచున్నాఁడు.

ఈకుముదుఁడును తనసైన్యంబులతో లంకాపురి మర్దింపవలెనని పర మోత్సాహంబున నున్నాఁడు. 3౦

రావణుఁడా! ఎవ్వఁడు సింహములంబోలెఁ గపిలవర్ణుఁడై దీర్ఘ నేత్రుఁడై లంకాపురిని దహించువాఁడువలె నిశ్చలదృష్టిం జూచుచున్నాఁడో, మఱియు శూరులును భయంకరాకారులును భయంకరపరాక్రములు నగు నీనూటపుప్పదిలక్షలమంది వానరోత్తములు లంకాపురిని మర్దింపఁగోరి యెవ్వని వెంబడించివచ్చుచున్నారో, అట్టి ఈవానరుఁడు రంభుఁడనువాఁడు. ఈతఁడు వింధ్యపర్వతంబును కృష్ణగిరిని సహ్యంబును సుదర్శనంబును ఈపర్వతంబులను అధిష్ఠించి వానరరాజ్యంబు నేలుచుండును. 3౧,3౨

రాక్షసరాజుండవగు రావణుఁడా! ఎవ్వఁడు చెవుల నిగుడఁజేయుచు మాటిమాటి కావలించుచున్నాఁడో, మఱియు గోపంబున వడఁకుచుఁ దిర్యగ్దృష్టిం జూచుచుఁ దనలాంగూలంబుఁ జూచి సింహనాదంబులు సేయుచున్నాఁడో, ఇతఁడు శరభుఁడు. ఇతఁడు మరణంబునుంగూడ సరకుసేయఁడు. యుద్ధంబుననుండి వెనుదీయఁడు. మహాబలుఁడు భయములేనివాఁడు. ఇతఁడు ఎల్లప్పుడును రమ్యంబగు సాల్వేయపర్వతంబుననుండి వానరరాజ్యం బేలును.

రాక్షసరాజుండవగు రావణుఁడా! ఈశరభునిచేతిక్రింద నలువదిలక్షల మంది వానరవీరు లున్నవారలు వారలందఱు మిక్కిలియుం బలవంతులు. 3౨

ఎవ్వఁడు పర్వతాకారుఁడై మేఘములంబోలె నాకాశము నావరించి భేరులంబోలె భయంకరముగా సింహనాదంబుసేయుచున్నాఁడో, మఱియు యుద్ధంబువిషయమై యత్యుత్సాహంబుతో నున్న వానరోత్తములనడుమ దేవతలనడుమ దేవేంద్రుంబోలె గూర్చుండియున్నాఁడో, ఈతఁడు పనసుఁడను వాఁడు. యుద్ధంబున మిక్కిలియు శూరుఁడు ఇతఁడు పారియాత్రపర్వతం

యుద్ధే దుష్ప్రసహో నిత్యం పనసో నామ యూథపః,
ఏనం శతసహస్రాణాం శతార్ధం పర్యుపాసతే. ౪౧
యూథపా యూథపశ్రేష్ఠ మేషాం యూథాని భాగశః,
యస్తు భీమాం ప్రవల్గన్తీం చమూం తిష్ఠతి శోభయన్. ౪౨
స్థితాం తీరే సముద్రస్య ద్వితీయ ఇవ సాగరః,
ఏష దర్దరసఙ్కాశో వినతో నామ యూథపః. ౪౩
పిబం శ్చరతి పర్ణాసాం నదీనా ముత్తమాం నదీమ్,
షష్టి శ్శతసహస్రాణి బల మస్య ప్లవఙ్గమాః. ౪౪
త్వా మాహ్వయతి యుద్ధాయ క్రోధనో నామ యూథపః,
విక్రాన్తా బలవన్తశ్చ యథా యూథాని భాగశః. ౪౫

యస్తు గైరికవర్ణాభం వపుః పుష్యతి వానరః,
అవమత్య సదా సర్వా న్వానరా న్బలదర్పితాన్. ౪౬
గవయోనామ తేజస్వీ త్వాం క్రోధా దభివర్తతే,

ఏనం శతసహస్రాణి సప్తతిః పర్యుపాసతే. ౪౭
ఏషై వాశంసతే లఙ్కాం స్వేనానీకేన మర్దితుమ్,

ఏతే దుష్ప్రసహా ఘోరా బలినః కామరూపిణః. ౪౮
యూథపాయూథపశ్రేష్ఠా యేషాం యూథాని భాగశః.

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే షడ్వింశస్సర్గః. ౨౬.

## సప్తవింశస్సర్గః.

తాంస్తు తేఽహం ప్రవక్ష్యామి ప్రేక్షమాణస్య యూథపాన్,
రాఘవార్థే పరాక్రాన్తా యే న రక్షన్తి జీవితమ్. ౧

బున నుండువాఁడు. ౩౯, ౪౦

ఈతని క్రింద పేఁబదిలక్షలమంది వానరోత్తములున్నారు. వారలు వేయు వేయుగా నధిక సేనలుం గలవారలు. ౪౧

ఎవ్వఁడు సముద్రతీరంబున రెండవసముద్రముంబోలె నతిభయంకరం బైయున్న వానరసేనం బ్రకాశింపఁజేయుచున్నాఁడో, ఈతఁడు వినతుఁడను వాఁడు. ఉత్తమనదియయిన పర్ణాసానదీజలంబులం ద్రావుచుఁ దత్తీరంబునం దుండువాఁడు. ౪౨, ౪౩

ఈవినతుని సేన అఱువదిలక్షలమంది వానరు లున్నారు. ౪౪

ఇతండు క్రోథనుండను వాఁడు. నిన్ను యుద్ధంబునకుఁ బిలుచుచున్నాఁడు. ఇతనియొద్దను వేయువేలఁ బరాక్రమవంతులును బలవంతులునగు వానరు లున్నారు. ౪౫

ఎవ్వఁడు బలగర్వితులగు వానరులనందఱను తృణీకరింపుచు యుద్ధోత్సాహంబున గైరికమువలె నెఱ్ఱనయిన తనదేహమును బెంచుచున్నాఁడో ఇతఁడు గవయుఁడనువాఁడు. మిక్కిలియుఁ దేజంబుగలవాఁడు. కోపంబున నీపైకి వచ్చుచున్నాఁడు. ౪౬

ఈగవయునిచేతిక్రింద డెబ్బదిలక్షలమంది వానరు లున్నారు. ౪౭

ఈగవయుఁడే తనసేనతో వచ్చి లంకాపురినంతయుం మర్దింపం గోరుచున్నాఁడు.

వీరలు యుద్ధంబున జయింప నలవిగాని వారలు. బలవంతులు. కామరూపులు. వీరలకు ఒక్కొక్కరికిని గొప్పసైన్యంబు లున్నవి. ౪౮

ఇది యిరువదియాఱవసర్గము.

## ఇరువదియేడవసర్గము.

మఱియు నెవ్వరు రామునినిమిత్తమయి యుద్ధంబుచేయుట విషయమై ప్రాణంబులనైనను సరకుసేయరో, అట్టి మహాపరాక్రమశాలులగు వానరయూథనాయకులం జూడుము? చెప్పెదను. ౧

స్నిగ్ధా యస్య బహువ్యామా వాలా లాఙ్గూల మాశ్రితాః,
తామ్రాః పీతా స్సితా శ్శ్వేతాః ప్రకీర్ణా ఘోరకర్మణః. ౨
ప్రగృహీతాః ప్రకాశన్తే సూర్యస్యేవ మరీచయః,
పృథివ్యాం చానుకృష్యన్తే హరో నామైష యూథపః. ౩
యం పృష్ఠతోఽనుగచ్ఛన్తి శతశోఽథ సహస్రశః,
ద్రుమా నుద్యమ్య సహసా లఙ్కారోహణతత్పరాః. ౪
యూథపా హరిరాజస్య కింకరా స్సముపస్థితాః,
ఏష కోటిసహస్రేణ వానరాణాం మహౌజసామ్. ౫
ఆకాంక్షతే త్వాం సంగ్రామే జేతుం పరపురం జయ,

నీలానివ మహామేఘాం స్తిష్ఠతో యాంస్తు పశ్యసి. ౬
అసితాఞ్జనసఙ్కాశా న్యుద్ధే సత్యపరాక్రమాన్,
అసఙ్ఖ్యేయా ననిర్దేశ్యా న్పరం పారమివోదధేః. ౭
పర్వతేషు చ యే కేచి ద్విషమేషు నదీషు చ,
ఏతే త్వా మభివర్తన్తే రాజ! న్నృక్షా స్సుదారుణాః. ౮

ఏషాం మధ్యే స్థితో రాజ న్భీమాక్షో భీమదర్శనః,
పర్జన్య ఇవ జీమూతై స్సమన్తా త్పరివారితః. ౯
ఋక్షవన్తం గిరిశ్రేష్ఠ మధ్యాస్తే నర్మదాం పిబన్,
సర్వర్క్షాణా మధిపతి ర్ధూమ్రో నామైష యూథపః. ౧౦
యవీయా నస్య తు భ్రాతా పశ్యైనం పర్వతోపమమ్,
భ్రాత్రా సమానో రూపేణ విశిష్ట స్తు పరాక్రమైః. ౧౧

స ఏష జామ్బవా న్నామ మహాయూథపయూథపః,
ప్రక్రాన్తో గురువర్తీ చ సమ్ప్రహారేష్వమర్షణః. ౧౨

ఎవ్వని తోఁకవెండ్రుకలు మిక్కిలియుఁ బొడవులయి యెఱ్ఱనివియుఁ బసుపువన్నెగలవియు దెల్లనివియు నిట్లు నానావిధవర్ణంబులయి విరిసి పైకెత్తఁబడి నేలం జీరాడుచు సూర్యునికిరణంబులంబోలెఁ బ్రకాశించుచున్నవో యీతఁడు హరుఁడనువాఁడు; భయంకర కర్ముఁడు. ౨, ౩

వానరరాజుండగు సుగ్రీవుని కింకరులగు వానరోత్తములు వేనవేలంగా గుంపులుగూడి వృక్షంబులంబట్టుకొని శీఘ్రంబున లంకాపురి నారోహింపఁ గోరినవారలయి యీహరుని వెంబడించుచున్నారు. చూడుము. ౪

శత్రుపురంబులం జయించునట్టిరావణుండా! ఈహరుఁడు వేయికోట్ల పరిమితిగల తనసైన్యముతోవచ్చి యుద్ధంబున నిన్ను జయింపవలెనని కోరుచున్నాఁడు. ౫

రావణుండా! నీలమేఘంబులుంబోలె నల్లనికాటుకయుంబోలె నల్లనివియు యుద్ధంబున సత్యపరాక్రమంబులును అసంఖ్యేయంబులును అనిర్దేశ్యంబులును మహాసముద్రంబువలె ననంతంబులై యున్నవియునగు నీభల్లూకంబులం జూచుచున్నావే; ఇవి పర్వతంబులందును, విషమప్రదేశంబులందును, నదీతీరంబులందును ఉండినవి; ఇవి మిక్కిలియు భయంకరంబులు. నీపైకి వచ్చుచున్నవి. ౬-౭

రాక్షసరాజుండవగు రావణుండా! ఎవ్వఁడు మేఘంబులనడుమఁ బర్జన్యుఁడుండునట్లు ఈభల్లూకంబులనడుమ నున్నాఁడో, ఈతఁడు ధూమ్రుఁడు. ఇతఁడు సమస్తభల్లూకంబులకును నాథుఁడు. నర్మదానదీజలంబులం ద్రావుచు ఋక్షవంతంబున నుండును. ౯, ౧౦

పర్వతాకారుఁ డొక్కఁడున్నాఁడు. ఇతనిం జూడుము. ఇతఁడు ధూమ్రునితమ్ముఁడు. అన్నవలె రూపంబుగలవాఁడు. పరాక్రమంబులందు మాత్రము అన్నకంటె మిగుల నధికుఁడు. ౧౧

ఇతఁడు జాంబవంతుఁడనువాఁడు. మేటియూథపులలో ముఖ్యుఁడు. మహాపరాక్రమశాలి. గురుశుశ్రూషకుఁడు. యుద్ధంబులందు మిక్కిలియు శూరుఁడు. ౧౨

ఏతేన సాహ్యం సుమహ త్కృతం శక్రస్య ధీమతా,
దైవాసురే జామ్బవతా లబ్ధాశ్చ బహవో వరాః. ౧౩

ఆరుహ్య పర్వతాగ్రేభ్యో మహాభ్రవిపులా శ్శిలాః,
ముఞ్చన్తి విపులాకారా న మృత్యోరుద్విజన్తి చ. ౧౪
రాక్షసానాం చ సదృశాః పిశాచానాం చ రోమశాః,
ఏతస్య సైన్యా బహవో విచరన్త్యగ్నితేజసః. ౧౫

యం త్వేనమభిసంరబ్ధం ప్లవమాన మివ స్థితమ్,
ప్రేక్షన్తే వానరా స్సర్వే స్థితా యూథపయూథపమ్. ౧౬
ఏష రాజన్! సహస్రాక్షం పర్యుపాస్తే హరీశ్వరః,
బలేన బలసమ్పన్నో దమ్భో నామైష యూథపః. ౧౭
యః స్థితం యోజనే శైలం గచ్ఛన్పార్శ్వేన సేవతే,
ఊర్ధ్వం తథైవ కాయేన గతః ప్రాప్నోతి యోజనమ్. ౧౮
యస్మా న్న పరమం రూపం చతుష్పాదేషు విద్యతే,
శ్రుత స్సన్నాదనో నామ వానరాణాం పితామహః. ౧౯
యేన యుద్ధం పురా దత్తం రణే శక్రస్య ధీమతా,
పరాజయశ్చ న ప్రాప్త స్సోఽయం యూథపయూథపః. ౨౦

యస్య విక్రమమాణస్య శక్రస్యేవ పరాక్రమః,
ఏష గన్ధర్వకన్యాయా ముత్పన్నః కృష్ణవర్త్మనః. ౨౧
తదా దైవాసురే యుద్ధే సాహ్యార్థం త్రిదివౌకసామ్,

యస్య వైశ్రవణో రాజా జమ్బూ ముపనిషేవతే. ౨౨
యో రాజా పర్వతేన్ద్రాణాం బహుకిన్నరసేవినామ్,

బుద్ధిమంతుఁడగు నీజాంబవంతుఁడు మున్ను దేవాసురులయుద్ధంబున దేవేంద్రునకు మిక్కిలియు సాహాయ్యంబుఁ గావించి పెక్కువరంబులం బడసి యున్నాఁడు. ౧౩

ఈజాంబవంతునిసైనికులు లెక్కలేక మహారోమంబులు గలవారై అగ్నికింబోలెఁ దేజ బుగలిగి రాక్షసులుంబోలెఁ బిశాచంబులుంబోలె నతి క్రూరులై పర్వతశిఖరంబులపైకి నారోహించి యచ్చోటనుండి మహామేఘం బులవంటి పెద్దతాళ్లను బడఁద్రోయుచున్నారు. వీరలు మృత్యువుతమంగూడ భయపడరు. ౧౪,౧౫

ఎవ్వఁడు అతికోపంబునొంది యెగురునట్లు చూపట్టుచున్నాఁడో మఱియు నెవ్వని వానరులందఱు నాశ్చర్యంబునఁ జూచుచున్నారో ఇతఁడు దంభుఁడనువాఁడు. మిక్కిలియుం బలవంతుఁడు. ఇతఁడు యుద్ధంబున దేవేంద్రునకు మిక్కిలియు సాహాయ్యంబు గావించియున్నాఁడు. ౧౬, ౧౭

ఎవ్వఁడు నడచునప్పుడు ఒకయడుగుననే యోజనదూరంబున నుండు పర్వతంబుఁ జేరునో మఱియుఁ జక్కఁగా లేచినిలిచినచో నొక యోజనదూరము పొడవుగలిగియుండునో, ఈతఁడు సన్నాదనుఁ డనువాఁడు. ఈతఁడు వానరులకుఁ బితామహుఁడు. ఇతనికన్నను బెద్దశరీరముగల మృగము చతుష్పాజ్జంతువులలో నేదియుంలేదు. ఇతఁడు మున్ను దేవేంద్రునితో యుద్ధంబుచేసినాఁడు. అప్పు డింతమాత్రమును బరాజయము నొంద లేదు. ౧౮-౨౦

ఈతఁడు దేవేంద్రునకు సరియగునపరాక్రమంబుగలవాఁడు. ఇతఁడు గంధర్వకన్యయందు అగ్నిదేవునికిఁ బుట్టినవాఁడు. ౨౧

దేవాసురయుద్ధము జరిగినప్పుడు దేవతలకు సాహాయ్యార్థమయి ఇతనిఁ బుట్టించినారు.

రాక్షసరాజుండవగు రావణుఁడా! ఈవానరోత్తముఁడు నీయన్నకుబే రునిచేఁ బాలింపఁబడునదియుం జంబూవృక్షంబుతోఁ గూడినదియుం బర్వతం

విహారసుఖదో నిత్యం భ్రాతుస్తే రాక్షసాధిప!. ౨౩
తత్రైష వసతి శ్రీమాన్బలవాన్ వానరర్షభః,
యుద్ధేష్వకత్థనో నిత్యం క్రోధనో నామ యూథపః. ౨౪
వృతః కోటిసహస్రేణ హరీణాం సముపస్థితః,
ఏషైవాశంసతే లఙ్కాం స్వేనానీకేన మర్దితుమ్. ౨౫

యో గఙ్గామనుపర్యేతి త్రాసయన్హస్తియూథపాన్,
హస్తినాం వానరాణాం చ పూర్వవైర మనుస్మరన్. ౨౬
ఏష యూథపతి ర్నేతా గచ్ఛన్ గిరిగుహాశయః,
గజాన్యోధయతే వన్యా న్గిరీం శ్చైవ మహీరుహాన్. ౨౭

హరీణాం వాహినీముఖ్యో నదీం హైమవతీ మను,
ఉశీరబీజ మాశ్రిత్య పర్వతం మన్దరోపమమ్. ౨౮
రమతే వానరశ్రేష్ఠో దివి శక్ర ఇవ స్వయమ్,
ఏనం శతసహస్రాణాం సహస్ర మనువర్తతే. ౨౯
వీర్యవిక్రమదృప్తానాం నర్దతాం బలశాలినామ్,
స ఏష నేతా చైతేషాం వానరాణాం మహాత్మనామ్. ౩౦

స ఏష దుర్ధరో రాజ! న్ప్రమాథీ నామ యూథపః,
వాతేనేవోద్ధతం మేఘం యమేన మనుపశ్యసి. ౩౧
అనీకమభిసంరబ్ధం వానరాణాం తరస్వినామ్,
ఉద్ధూత మరుణాభాసం పవనేన సమన్తతః. ౩౨

ములకన్నింటికిని రాజును నా కుబేరున కెల్లప్పుడును విహారస్థానంబై యొప్పునదియునగు హిమవత్పర్వతంబుపై నుండువాఁడు; ఇతఁడు క్రోధనుఁడు; బలవంతుఁడు; ఆత్మస్తుతిచేసికొనఁడు; యుద్ధంబుల నతిశూరుఁడు; ఇతఁడు వేయికోట్లవానరవీరులతో వచ్చియున్నాఁడు. ౨౩, ౨౪

ఈ క్రోధనుఁడు తనసైన్యముచే లంకాపురి నంతయుం మర్దింపఁగోరుచున్నాఁడు. ౨౫

ఇదిగో ఇచ్చట నొక వానరోత్తముఁ డున్నాఁడు చూడుము; ఈతఁడు మున్ను హనుమంతునితండ్రి కేసరి, మునిజనబాధకుఁడగు గజాకారుఁడైన శంబసాదనుఁడనురాక్షసుని మునినియోగంబునం జంపిననాఁటనుండి వానరులకును గజంబులకుఁ గల్గినవైరంబు దలఁచి గజంబుల కంతభయంబు గలుగఁజేయుచు గజంబులంబట్టి పర్వతంబులపైఁగొట్టుచుఁ బర్వతంబులచే గజంబులఁ బ్రహరించుచు నట్లు వృక్షంబులపై గజంబులఁగొట్టుచు వృక్షంబులచే గజంబులఁ బ్రహరించుచు నిట్లు నానావిధంబుల గజనాశంబు గావించుచు గంగానదీసమీపంబున సంచరించుచుండును. ౨౬, ౨౭

ఈ వానరోత్తముఁడు గంగానదీసమీపంబున నుశీరబీజంబను పర్వతంబున స్వర్గంబున దేవేంద్రుఁడువోలె విహరించుచుండును; ఇతఁడు సేనాముఖ్యుఁడు; ఇతనిక్రింద వేయిలక్షలవానరు లున్నారు. ౨౮, ౨౯

ఇతఁడు అట్టిమహాపరాక్రమశాలులు నుత్సాహవంతులును సింహనాదంబులు సేయుచున్నవారలును బలవంతులును వేగవంతులునగు నీ వేయిలక్షల వానరులకును నాయకుఁడు. ౩౦

రాక్షసరాజుండవగు రావణుఁడా! ఎచ్చట వాయువుచే రేఁగిన యొఱ్ఱనిదియుం నానావిధంబుల వివర్తమానంబు నగుదుమ్ము అధికముఁ జూపట్టుచున్నదో, అట్టి బలవంతులగు వానరులసేనం జూడుము; ఇది యెంతయుం సంరంభంబుతో నున్నది; ఆ సేనామధ్యంబున వాయువుచే నెగురఁగొట్టఁబడిన

వివర్తమానం బహుధా యత్రైత ద్బహుళం రజః,
ఏతేఽసితముఖా ఘోరా గోలాఙ్గూలా మహాబలాః. 33
శతం శతసహస్రాణి దృష్ట్వా వై సేతుబన్ధనమ్,
గోలాఙ్గూలం మహావేగం గవాక్షం నామ యూథపమ్. 34
పరివార్యాభివర్తన్తే లఙ్కాం మర్దితు మోజసా,
భ్రమరా చరితా యత్ర సర్వకామఫలద్రుమాః. 35
యం సూర్య స్తుల్యవర్ణాభ మనుపర్యేతి పర్వతమ్,
యస్య భాసా సదా భాన్తి తద్వర్ణా మృగపక్షిణః. 36
యస్య ప్రస్థం మహాత్మానో న త్యజన్తి మహర్షయః,
సర్వకామఫలా వృక్షా స్సదా ఫలసమన్వితాః. 37
మధూని చ మహార్హాణి యస్మి న్పర్వతసత్తమే,
తత్రైవ రమతే రాజ! న్రమ్యే కాఞ్చనపర్వతే. 38
ముఖ్యో వానరముఖ్యానాం కేసరీనామ యూథపః,

షష్టి ర్గిరిసహస్రాణాం రమ్యాగ కాఞ్చనపర్వతాః. 39
తేషాం మధ్యే గిరివర స్త్వమివానఘ! రక్షసామ్,

తత్రైతే కపిలా శ్శ్వేతా స్తామ్రాస్యా మధుపిఙ్గళాః. 40
నివసన్త్యుత్తమగిరౌ తీక్ష్ణదంష్ట్రా నఖాయుధాః,
సింహా ఇవ చతుర్దంష్ట్రా వ్యాఘ్రా ఇవ దురాసదాః. 41
సర్వే వైశ్వానరసమా జ్వలితాశీవిషోపమాః,
సుదీర్ఘాఞ్చితలాఙ్గూలా మత్తమాతఙ్గసన్నిభాః. 42
మహాపర్వతసఙ్కాశా మహాజీమూతనిస్వనాః,
వృత్తపిఙ్గళరక్తాక్షా భీమభీమ గతిస్వరాః. 43

మేఘుంబువలెనున్న యీవానరోత్తముఁడు ప్రమాథి యనువాఁడు. ౩౧, ౩౨

తెల్లనిముఖంబులుగలవియును భయంకరంబులునగు గోలాంగూలంబులు నూఱులక్షలసంఖ్యగలవి సేతుబంధము మొదలుగాఁగలుగు మహావేగుఁడును గోలాంగూలాధీశ్వరుఁడునగు గవాక్షునిం బరివేష్టించి పరాక్రమంబున లంకాపురిని మర్దించుటకై వచ్చుచున్నవి చూడుము. ౩౩, ౩౪

ఏపర్వతంబునఁ గోరినవాని నన్నిఁటి నొసంగునవియు, నెల్లప్పుడును సుగంధిపుష్పంబులు గలిగియుండుటచేఁ దుమ్మెదలతోఁ గూడినవియునగు వృక్షంబులున్నవో, ఏపర్వతసమీపంబున సూర్యుఁడు ఆపర్వతముంబోలె స్వర్ణవర్ణుఁడై యొప్పునో, ఎచ్చట బక్షులును మృగంబులును సమస్తజంతువులును బంగారువన్నెగలిగియుండునో, ఏపర్వతంబునందు మహర్షులు విడువక యెల్లప్పుడును నివసింపుచుందురో, ఎచ్చట నభిరుచ్యంబులగు ఫలంబులనొసంగునవియు నెల్లప్పుడును ఫలంబులతోఁ గూడినవియునగు వృక్షంబులును మంచి తేనియలును గలిగియుండునో, అట్టిరమణీయమగు మేరుపర్వతంబునందు వానరవీరులలో మొదటివాఁడైన యీకేసరి నివాసము సేయుచుండును. ౩౫

పాపరహితుఁడవగు రావణుఁడా! బంగారుకొండలు అఱువదివేలున్నవి; వానినడుమ రాక్షసులలో నీవు సర్వోత్తముఁడవై యుండునట్లు ముఖ్యపర్వతం బున్నది. ౩౬

ఈకపిలముఖులును ధవళముఖులును ఎఱ్ఱనిముఖముగలవారలును పింగళవర్ణములయిన ముఖములుగలవారలును, కాటుకకోఱలుగలవారలును, నఖంబులే యాయుధంబులుగాఁగల వారలును నాలుగుకోఱల సింహంబులుంబోలెఁ బెద్దపులులుంబోలె నతిభయంకరంబుగాఁ జూపట్టుచుండువారలును, నిప్పువంటివారలును, తీక్ష్ణవిషంబులగు సర్పంబులవంటివారలును, దీర్ఘములును సుందరములునగు తోఁకలుగలవారలును, మదపుటేనుఁగులుంబోలె నున్నవారలును, బర్వతాకారులును, మేఘగర్జనంబువంటి సింహనాదంబుగలవారలును, గుండ్రములును పింగళవర్ణంబులునగు నేత్రంబులుగలవారలును, భయంకరాకారులును

మర్దయ న్నీవ తే సర్వే తస్థు ర్లఙ్కాం సమీక్ష్యతే,
ఏష చైషా మధిపతి ర్మధ్యే తిష్ఠతి వీర్యవాన్. ౪౪
జయార్థీ నిత్య మాదిత్య ముపతిష్ఠతి బుద్ధిమాన్,
నామ్నా పృథివ్యాం విఖ్యాతో రాజన్! శతవలీతి యః. ౪౫

ఏ షైవాశంసతే లఙ్కాం స్వేనానీకేన మర్దితుమ్,
విక్రాన్తో బలవాన్ శూరః పౌరుషే స్వే వ్యవస్థితః. ౪౬

రామప్రియార్థం ప్రాణానాం దయాం న కురుతే హరిః,

గజో గవాక్షో గవయో నలో నీలశ్చ వానరః. ౪౭
ఏకైక ఏవ యూథానాం కోటీభి ర్దశభి ర్వృతః,
తథాఽన్యే వానరశ్రేష్ఠా విన్ధ్యపర్వతవాసినః. ౪౮
న శక్యన్తే బహుత్వాత్తు సంఖ్యాతుం లఘువిక్రమాః.
సర్వే మహారాజ! మహాప్రభావా
స్సర్వే మహాశైలనికాశకాయాః,
సర్వే సమర్థాః పృథివీం క్షణేన
కర్తుం ప్రవిధ్వస్త వికీర్ణశైలామ్. ౪౯

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే సప్తవింశస్సర్గః. ౨౭

---

## అష్టావింశస్సర్గః.

సారణస్య వచః శ్రుత్వా రావణం రాక్షసాధిపమ్,

భయంకరంబులగు గమనంబును గంతధ్వనియుం గలవారలునగు నీవానరులు ఆయిఱువదివేలబంగారుకొండలలో నుత్తమంబగుపర్వతమునందు నివసించి యుందురు. ౪౦-౪౩

వారలందఱు నీలంకాపురింజూచి యిప్పుడే మర్దింతున ట్లున్నారు.

రాక్షసరాజుండవగు రావణుండా! ఈవానరులనాయకుఁడు, వీరల నడుమ నున్నాఁడు చూడుము; ఈతఁడు మిక్కిలియుఁ బరాక్రమంబుగల వాఁడు, ఇతనిపేరు శతవలియని భూమండలంబున వినుతికెక్కియున్నది; ఇతఁడు జయంబుఁగోరి సూర్యుని నెప్పుడును బూజగావించుచుండును. ౪౪

ఇతఁ డొక్కఁడే తనసేనంగొని లంకాపురినంతయుం మర్దింపఁగోరు చున్నాఁడు. ఇతఁడు పరాక్రమవంతుఁడు. బలవంతుఁడు. శూరుఁడు. తన పౌరుషంబు వదలనివాఁడు. ౪౫

ఈశతవలి రామసంతోషార్థమయి తనప్రాణంబులనుఁగూడ నెంత మాత్రము సరకుసేయఁడు.

గజుఁడును, గవాక్షుఁడును, గవయుఁడును, నలుఁడును, నీలుఁడును వీరలు ఒక్కొకరును పదికోట్లసైన్యములోఁ గూడియున్నారు. ౪౬

అట్లు వింధ్యపర్వతవాసులు మహావేగులగు వానరోత్తము లనేకు లున్నారు. వారల లెక్కపెట్ట నలవిగాదు. ౪౭

మహారాజుండవగు రావణుండా! ఈవానరులందఱును మహాప్రభువులుం పర్వతంబులవంటి దేహముగలవారలు. క్షణమాత్రమున భూమియందలి పర్వ తంబులనన్నిటిని జూర్ణంబుగావించి తూర్పాఱఁబెట్టఁగలరు. అని సారణుఁడు రావణునితోఁ జెప్పెను ౪౮

ఇది యిరువదియేడవసర్గము.

## ఇరువదియెనిమిదవసర్గము.

అంత శుకుఁడు సారణుఁడుచెప్పినమాటల నంతయుం విని యతఁడు

బల మాదిశ్య తత్సర్వం శుకో వాక్యమథాబ్రవీత్ . ౧

స్థితాన్పశ్యసి యానేతాన్మత్తా నివ మహాద్విపాన్,
న్యగ్రోధా నివ గాఙ్గేయాన్ సాలాన్ హైమవతా నివ. ౨
ఏతే దుష్ప్రసహా రాజ! న్బలినః కామరూపిణః,
దైత్య దానవసఙ్కాశా యుద్ధే దేవపరాక్రమాః, ౩

ఏషాం కోటిసహస్రాణి నవ పఞ్చచ సప్తచ,
తథా శఙ్ఖసహస్రాణి తథా బృన్దశతాని చ. ౪

ఏతే సుగ్రీవసచివాః కిష్కిన్ధానిలయా స్సదా,
హరయో దేవగన్ధర్వై రుత్పన్నాః కామరూపిణః. ౫

యౌ తౌ పశ్యసి తిష్ఠన్తౌ కుమారౌ దేవరూపిణౌ,
మైన్దశ్చ ద్వివిదశ్చోభౌ తాభ్యాం నాస్తి సమో యుధి. ౬

బ్రహ్మణా సమనుజ్ఞాతావమృతప్రాశినావుభౌ,
ఆశంసేతే యుధా లఙ్కా మేతౌ మర్దితు మోజసా. ౭

యావేతావేతయోః పార్శ్వే స్థితౌ పర్వతసన్నిభౌ,
సుముఖోఽసుముఖ శ్చైవ మృత్యుపుత్రౌ పితు స్సమౌ. ౮
ప్రేక్షన్తౌ నగరీం లఙ్కాం కోటిభి ర్దశభి ర్వృతౌ,
యం తు పశ్యసి తిష్ఠన్తం ప్రభిన్నమివ కుఞ్జరమ్. ౯
యో బలా త్క్షోభయే త్క్రుద్ధ స్సముద్ర మపి వానరః,
ఏషోఽభిగన్తా లఙ్కాయా వైదేహ్యా స్తవ చ ప్రభో!. ౧౦

సాకల్యంబునఁ జెప్పకుండుటంజేసి తాను రాక్షసేశ్వరుఁడగు రావణునకు వానరసైన్యము నంతయుఁ జూపి యిట్లని చెప్ప నారంభించెను. ౧

రాక్షసరాజుండవగు రావణుఁడా! మదపుటేనుఁగులుంబోలె గంగా తీరంబునంబుట్టిన వటవృక్షంబులుంబోలె హిమవత్పర్వతంబునంబుట్టిన సాల వృక్షంబులంబోలె మహాకాయులయియున్న యీవానరులంజూచుచున్నావే వీరలు దుర్జయులు. బలవంతులు. కామరూపులు. దైత్యదానవులకు సరివచ్చు వారలు. యుద్ధంబున దేవతలకుంబోలెఁ బరాక్రమంబుగలవారలు. ౨,౩

ఈవానరులు తొమ్మిదివేలకోట్లును అయిదువేలకోట్లును ఏడువేల కోట్లును పెక్కువేలశంఖంబులును పెక్కునూఱులబృందంబులును ఇట్లు అనంతంబుగ నున్నారు. ౪

ఈవానరులు సుగ్రీవునిసచివులు. ఎల్లప్పుడును సుగ్రీవునితోఁగూడఁ కిష్కింధాపురి నుండువారలు. దేవగంధర్వులకుఁ బుట్టినవ రలు పుట్టినవాఁట నుండి యిచ్చకువచ్చిన రూపంబునొంద శక్తిగలవారలు. ౫

రావణుఁడా! సుందరరూపులును యౌవనవంతులునగు వీరలిద్దఱును మైందద్వివిదు లనఁబడుదురు. యుద్ధంబున వీరలకు సరివచ్చువాఁ డెవ్వఁడును లేఁడు. ౬

ఈమైందద్వివిదులు బ్రహ్మదేవు ననుజ్ఞంజేసి యమృతంబు ద్రావి యున్నారు. వీరలు తమపరాక్రమంబున యుద్ధంబున లంకాపురిని మర్దింపఁ గోరుచున్నారు. ౭

ఈమైందద్వివిదులకుఁ బ్రక్కను గొండలువలె నిద్దఱు పదికోటుల సైన్యముంగూడి లంకాపురిం జూచుచున్నారు. చూడుము వీరలు సుముఖుఁ డును దుర్ముఖుఁడుననఁబడుదురు. మృత్యువుకొడుకులు. తండ్రివంటి పరాక్రమ వంతులు. ౮

రావణుఁడా! మదపుటేనుఁగువలెనున్న యీవానరవీరుం జూచు చున్నావుగదా! ఈతఁడు కోపంబునొందినచో సముద్రంబునేని క్షోభంబు నొందించును. ఇతఁడే లంకకువచ్చి సీతంజూచి నీతో మాటలాడిపోయినవాఁడు.

ఏనం పశ్య పురా దృష్టం వానరం పున రాగతమ్,
జ్యేష్ఠః కేసరిణః పుత్త్రో వాతాత్మజ ఇతి శ్రుతః. ౧౧

హనూమా నితి విఖ్యాతో లఙ్ఘితో యేన సాగరః,
కామరూపీ హరిశ్రేష్ఠో బలరూపసమన్వితః. ౧౨
అనివార్యగతి శ్చైవ యథా సతతగః ప్రభుః,
ఉద్యన్తం భాస్కరం దృష్ట్వా బాలః కిల పిపాసితః. ౧౩
త్రియోజనసహస్రం తు అధ్వాన మవతీర్య హి,
ఆదిత్య మాహరిష్యామి న మే క్షుత్ప్రతియాస్యతి. ౧౪
ఇతి సఞ్చిన్త్య మనసా పురైష బలదర్పితః,
అనాధృష్యతమం దేవమపి దేవర్షిదానవైః. ౧౫
అనాసాద్యైవ పతితో భాస్కరోదయనే గిరౌ,
పతితస్య కపేరస్య హనురేకా శిలాతలే. ౧౬
కించి ద్భిన్నా దృఢహనో ర్హనూమా నేష తేన వై,

సత్య మాగమయోగేన మమైష విదితో హరిః. ౧౭

నాస్య శక్యం బలం రూపం ప్రభావో వాఽపి భాషితుమ్,

ఏష ఆశంసతే లఙ్కా మేకో మర్దితు మోజసా. ౧౮

య శ్చైషోఽనన్తర శ్శూర శ్శ్యామః పద్మనిభేక్షణః,
ఇక్ష్వాకూణామతిరథో లోకే విఖ్యాతపౌరుషః. ౧౯
యస్మి న్నచలతే ధర్మో యో ధర్మం నాతివర్తతే,

మున్ను నీ వితనిం జూచియున్నావు ఇప్పుడు మరల వచ్చియున్నాఁడు చూడుము. ఇతఁడు కేసరికి క్షేత్రజపుత్త్రుఁడు. వాయుదేవునకుఁ బుట్టినవాఁడు. ౧౧

ఇతని పేరు హనుమంతుఁడని యందురు. ఇతఁడె సముద్రంబు దాఁటి లంకకువచ్చినమహాప్రభావుఁడు. కామరూపి! మహాబలుఁడు. పర్వతాకారుఁడు. సర్వవ్యాపకుఁడగు వాయువువలె అనివార్యంబగు గమనముగలవాఁడు.

మున్ను ఇతఁడు బాల్యంబున నొకనాఁడాకలిగొని యప్పుడే యుదయించుచున్న సూర్యుంజూచి బలగర్వంబున "నా కాఁకలిదీఱకున్నది. సూర్యునింబట్టిభక్షించెదను" అని తలఁచి పెక్కువేలయోజనంబులు ఆకాశంబునంబోయి దేవర్షిదానవులకైనను జేరరాని సూర్యునిసమీపంబునకుఁ బోవంజాలక యుదయపర్వతంబునంబడెను. ౧౩-౧౫

దృఢంబులయిన చెక్కిలి మీఁదిభాగములుగల యీవానరుఁడు అట్లు ఉదయాచలంబున శిలాతలంబుపైఁబడఁగానే యతనిచెక్కిలిమీఁదిభాగ మొకటి కొంచెము భిన్నమయినది. కావుననే యతనికి హనుమంతుఁడని పేరు వచ్చినది. ౧౬

నమ్మకముగలవానరుఁ డొక్కఁడుచెప్పఁగా నీహనుమంతుని సంగతి యంతయుఁ నాకుఁ దెలిసినది. ఇది సత్యము. ౧౭

ఈహనుమంతుని బలముగాని యాకారముగాని ప్రభావముగాని చెప్పనలవిగాదు.

ఇతఁ డొక్కఁడే పరాక్రమంబున లంకాపురినంతయుం మర్దింపవలెననియున్నాఁడు. ౧౮

రావణుఁడా ఈహనుమంతునకు సమీపంబున శూరుఁడును, శ్యామలవర్ణుఁడును, పుండరీకనయనుఁడునగు దివ్యపురుషుఁ డొక్కఁ డున్నాఁడు. చూడుము. ఈతఁడు ఇక్ష్వాకుకులంబునఁ బుట్టినవారిలో నుత్తముఁడు నీవు

యో బ్రాహ్మ మస్త్రం వేదాంశ్చ వేద వేదవిదాం వరః. ౨౦
యో భిన్ద్యా ద్గగనం బాణైః పర్వతాం శ్చాపి దారయేత్,
యస్య మృత్యో రివ క్రోధ శ్శక్ర స్యేవ పరాక్రమః. ౨౧
యస్య భార్యా జనస్థానాత్సీతా చాపహృతా త్వయా,
స ఏష రామ స్త్వాం యోద్ధుం రాజ! న్సమభివర్తతే. ౨౨

యస్యైష దక్షిణే పార్శ్వే శుద్ధజామ్బూనదప్రభః,
విశాలవక్షా స్తామ్రాక్షో నీలకుఞ్చితమూర్ధజః. ౨౩
ఏషోఽస్య లక్ష్మణో నామ భ్రాతా ప్రాణసమః ప్రియః,

నయే యుద్ధే చ కుశలస్సర్వశాస్త్రవిశారదః. ౨౪
అమర్షీ దుర్జయో జేతా విక్రాన్తో బుద్ధిమా న్బలీ,
రామస్య దక్షిణో బాహు ర్నిత్యం ప్రాణో బహిశ్చరః. ౨౫

న హ్యేష రాఘవస్యార్థే జీవితం పరిరక్షతి,
ఏషై వాశంసతే యుద్ధే నిహన్తుం సర్వరాక్షసాన్. ౨౬
య స్తు సవ్య మసౌ పక్షం రామ స్యాశ్రిత్య తిష్ఠతి,
రక్షోగణపరిక్షిప్తో రాజా హ్యేష విభీషణః. ౨౭
శ్రీమతా రాజరాజేన లఙ్కాయా మభిషేచితః,
త్వా మేవ ప్రతిసంరబ్ధో యుద్ధాయైషోఽభివర్తతే. ౨౮

యం తు పశ్యసి తిష్ఠన్తం మధ్యే గిరిమివాచలమ్,
సర్వశాఖామృగేన్ద్రాణాం భర్తారమపరాజితమ్. ౨౯

జనస్థానంబుననుండి యపహరించిన సీతాదేవి యీతనిభార్యయే. ఇతని ధర్మంబు వదలదు. ఇతఁడును ధర్మంబును వదలఁడు. వేదవేత్తలలో నుత్తముఁడు. బ్రహ్మాస్త్రంబు మొదలుగా సమస్తాస్త్రంబులను దెలిసినవాఁడు. ఆకాశంబునైనను బాణంబుల భేదింపఁగలఁడు. పర్వతంబులనుం గూడఁ బగులఁ జేయఁగలఁడు. మృత్యువునకుంబోలె మహాకోపంబును దేవేంద్రునకుంబోలెఁ బరాక్రమంబును గలవాఁడు. ఈతఁడే రాముఁడు. నీతో యుద్ధంబు సేయుటకు వచ్చుచున్నాఁడు. ౧౯, ౨౨

ఈరాముని దక్షిణపార్శ్వంబున బంగారువంటి మేనుగలవాఁడును విశాల వక్షుఁడును కోపంబునం జేసి యెఱ్ఱనికన్నులుగలవాఁడును నల్లనివియుం వక్రములు నగు వెండ్రుకలుగలవాఁడునగు నొక్కరాజపుత్రుఁ డున్నాఁడు చూడుము. ఇతఁడు లక్ష్మణుఁడు. రామునితమ్ముఁడు. రామునకుఁ బ్రాణమువంటి ప్రియుఁడు. ౨౩

ఈ లక్ష్మణుఁడు నీతిశాస్త్రమునందును యుద్ధంబునందును మిక్కిలియుం సమర్థుఁడు. సమస్తశాస్త్రంబులును దెలిసినవాఁడు మహాకోపుఁడు. దుర్జయుఁడు. జయశీలుఁడు. పరాక్రమవంతుఁడు. బుద్ధిమంతుఁడు. బలవంతుఁడు, రాముని కుడిభుజము. మఱియుం రామునకుఁ బ్రాణంబువంటివాఁడు. ౨౫

ఈలక్ష్మణుఁడు రామునినిమిత్తమయి ప్రాణంబులనేని విడుచును. ఈతఁ డొక్కఁడే యుద్ధంబున సమస్తరాక్షసులను వధింపవలెనని యున్నాఁడు. ౨౬

ఎవ్వఁడు నలుగురురాక్షసులం గూడి రాముని సవ్యపార్శ్వంబున నున్నాఁడో ఇతఁడు రాక్షసరాజుండగు విభీషణుఁడు. ౨౭

శ్రీమంతుఁడును రాజరాజుండునగు రాముఁడు ఈవిభీషణుని లంకా రాజ్యంబునకు రాజుగా నభిషేకించినాఁడు ఇతఁడు అతిసంరంభంబున నీపైకే యుద్ధంబునకు వచ్చుచున్నాఁడు. ౨౮

ఈరామవిభీషణులనడుమఁ బర్వతంబువలె నిశ్చలుండై యున్న సర్వ వానరముఖ్యుం జూచుచున్నావుగదా! ఇతఁడు సర్వవానరరాజుండగు సుగ్రీవుఁ

తేజసా యశసా బుద్ధ్యా జ్ఞానేనాభిజనేన చ,
యః కపీ నతిబభ్రాజ హిమవా నివ పర్వతాన్. ౩౦
కిష్కిన్ధాం య స్సముధ్యాస్తే గుహాం సగహనద్రుమామ్,
దుర్గాం పర్వతదుర్గస్థాం ప్రధానైస్సహయూథపైః. ౩౧
య స్యైషా కాఞ్చనీ మాలా శోభతే శతపుష్కరా,
కాన్తా దేవమనుష్యాణాం యస్యాం లక్ష్మీః ప్రతిష్ఠితా. ౩౨
ఏతాం చ మాలాం తారాం చ కపిరాజ్యం చ శాశ్వతమ్,
సుగ్రీవో వాలినం హత్వా రామేణ ప్రతిపాదితః. ౩౩

శతం శతసహస్రాణాం కోటి మాహు ర్మనీషిణః,
శతం కోటిసహస్రాణాం శఙ్ఖ ఇత్యభిధీయతే. ౩౪
శతం శఙ్ఖసహస్రాణాం మహాశఙ్ఖ ఇతి స్మృతః,
మహాశఙ్ఖసహస్రాణాం శతం బృన్ద మి హోచ్యతే. ౩౫
శతం బృన్దసహస్రాణాం మహాబృన్ద మితి స్మృతమ్,
మహాబృన్దసహస్రాణాం శతం పద్మ మి హోచ్యతే. ౩౬
శతం పద్మసహస్రాణాం మహాపద్మ మితి స్మృతమ్,
మహాపద్మసహస్రాణాం శతం ఖర్వ మిహోచ్యతే. ౩౭
శతం ఖర్వసహస్రాణాం మహాఖర్వ మిహోచ్యతే,
మహాఖర్వసహస్రాణాం సముద్ర మభిధీయతే. ౩౮
శతం సముద్రసాహస్ర మోఘ ఇత్యభిధీయతే,
శత మోఘసహస్రాణాం మహౌఘ ఇతి విశ్రుతః. ౩౯
ఏవం కోటిసహస్రేణ శఙ్ఖానాం చ శతేన చ,
మహాశఙ్ఖసహస్రేణ తథా బృన్దశతేన చ. ౪౦
మహాబృన్దసహస్రేణ తథా పద్మశతేన చ.

డు. హిమవత్పర్వతము సమస్తపర్వతముల నతిశయించియుండునట్లు ఈతఁడు తేజంబునను యశస్సునను బుద్ధిచేతను జ్ఞానంబుచేతను గుణంబుచేతను సమస్తవానరుల నతిశయించి యున్నాఁడు. దుర్గంబును పర్వతదుర్గ పరివేష్టితంబును జుట్టును వనంబులుగలదియునగు గుహారూఢకిష్కింధయందు ముఖ్యులగుయూధపులంగూడి వాసముసేయుచుండును. ఈతని వక్షస్థలంబున నూఱు కమలములుగల కాంచనమాలిక వెలుఁగుచున్నది చూడుము. ఇది దేవతలకును గూడ దుర్లభమయినది. దీని ధరించినవాఁడు ఎల్లప్పుడును యుద్ధంబునఁ బరాజయంబునొందఁడు. రాముఁడు యుద్ధంబున వాలిని వధించి సుగ్రీవునకు ఈ కాంచనమాలయు దారయు శాశ్వతంబగు వానరరాజ్యంబును సిద్ధించునట్లు గావించెను. ౨౯, ౩౩

నూఱులక్షలు కోటియని చెప్పుచున్నారు. నూఱువేలకోట్లు శంఖమనఁబడుచున్నది. ౩౪

నూఱువేలశంఖంబులు మహాశంఖంబగుచున్నది. నూఱువేలమహాశంఖంబులు బృందమని చెప్పఁబడుచున్నది. ౩౫

నూఱువేలబృందములు మహాబృందమని చెప్పఁబడినది. మహాబృందంబులు నూఱువేలు పద్మంబగుచున్నది. ౩౬

నూఱువేలపద్మంబులు మహాపద్మంబనఁబడును. మహాపద్మంబులు నూఱువేలు ఖర్వంబనఁబడును. ౩౭

నూఱువేలఖర్వంబులు మహాఖర్వంబనఁబడుచున్నది. మహాఖర్వంబులు నూఱువేలు సముద్రంబనఁబడును. ౩౮

నూఱువేలసముద్రములు ఓఘమని చెప్పఁబడును. నూఱువేల ఓఘములు మహౌఘమనఁబడును. ౩౯

వేయికోటులును నూఱుశంఖంబులును వేయిమహాశంఖంబులును నూఱుబృందంబులును వేయిమహాబృందంబులును నూఱుపద్మంబులును వేయిమహాపద్మంబులను నూఱుఖర్వంబులును నూఱుసముద్రంబులును మహా

మహాపద్మసహస్రేణ తథా ఖర్వశతేనచ. ౪౧
సముద్రేణ శతేనైవ మహౌఘేన తథైవ చ,
ఏష కోటిమహౌఘేన సముద్రసదృశేన చ. ౪౨
విభీషణేన సచివై రాక్షసైః పరివారితః,
సుగ్రీవో వానరేన్ద్ర స్త్వాం యుద్ధార్థ మభివర్తతే. ౪3
మహాబలవృతో నిత్యం మహాబలపరాక్రమః.
ఇమాం మహారాజ! సమీక్ష్య వాహినీ
ముపస్థితాం ప్రజ్వలితగ్రహోపమామ్,
తతః ప్రయత్నః పరమో విధీయతాం
యథా జయ స్స్యా న్న పరైః పరాజయః. ౪౪

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డేఽష్టావింశ స్సర్గః. ౨౮

---

## ఏకోనత్రింశస్సర్గః.

శుకేన తు సమాఖ్యాతాం స్తా న్దృష్ట్వా హరియూథపాన్,
సమీపస్థం చ రామస్య భ్రాతరం స్వం విభీషణమ్. ౧
లక్ష్మణం చ మహావీర్యం భుజం రామస్య దక్షిణమ్,
సర్వవానరరాజం చ సుగ్రీవం భీమవిక్రమమ్. ౨
కించి దావిగ్నహృదయో జాతక్రోధశ్చ రావణః,
భర్త్సయామాస తౌ వీరౌ కథాన్తే శుకసారణౌ. 3
అధోముఖౌ తౌ ప్రణతా వబ్రవీ చ్ఛుకసారణౌ,
రోషగద్గదయా వాచా సంరబ్ధః పరుషం వచః. ౪
న తావత్సదృశం నామ సచివై రుపజీవిభిః,
విప్రియం నృపతే ర్వక్తుం నిగ్రహే ప్రగ్రహే ప్రభోః. ౫

ఘంబులును గోటిమహౌఘంబులును ఇట్లు సముద్రంబువలె ననంతంబయిన మహాసేనంగూడి విభీషణుండును ఆతనిమంత్రులగు రాక్షసులును వెంట నడవ మహాబలపరాక్రమశాలియు వానరరాజుండునగు సుగ్రీవుండు నీతో యుద్ధముసేయ వచ్చుచున్నాఁడు. ౫౦, ౪౩

మహారాజుండవగు రావణుండా! క్రూరగ్రహముంబోలె వెలుఁగుచున్న యిమ్మహాసేనంజూచి యింక మనకు జయముగలుగునట్లును శత్రువులచే నపజయము గాకుండునట్లును జక్కఁగాఁ బ్రయత్నంబు గావింపుము. అని శుకుఁడు రావణునకుఁ జెప్పెను. ౪౪

ఇది యిరువదియెనిమిదవసర్గము.

## ఇరువదితొమ్మిదవసర్గము.

అంత రావణుండు శుకుఁడు చెప్పిన వానరయూథపుల నందఱను రామునిసమీపంబుననున్న తనతమ్ముఁడగు విభీషణుని మహాపరాక్రమశాలియు రామునికుడిభుజమునయిన లక్ష్మణుని భయంకరవీర్యుఁడును సమస్తవానరరాజేండునగు సుగ్రీవుని మఱియు హనుమంతుఁడు మొదలగు మేటివానరవీరులనుంజూచి మనంబులఁ గొంచెము భయమునొంది యంతఁ బరమకుపితుండై పరాక్రమవంతులగు నాశుకసారణులం జూచి పరుషవచనంబుల బెదరించెను.

ఆరావణుండు తనకు నమస్కరించి మొగంబువంచుకొనియున్న శుకసారణులంజూచి సంరంభంబునఁ గోపముచే డగ్గుత్తికగదురఁ బరుషవాక్యంబుల నిట్లని చెప్పెను. ౪

నిగ్రహానుగ్రహంబులు సేయుటకు సమర్థుఁడగు రాజునకు ఆతనియొద్ద బ్రదుకుచుండుమంత్రులు ఇట్లు అప్రియవార్తలం జెప్పుట యెంతమాత్రము నరిగాదు. ౫

రిపూణాం ప్రతికూలానాం యుద్ధార్థ మభివర్తతామ్,
ఉభాభ్యాం సదృశం నామ వక్తు మప్రస్తవే స్తవమ్. ౬

ఆచార్యా గురవో వృద్ధా వృథా వాం పర్యుపాసితాః,
సారం యద్రాజశాస్త్రాణా మనుజీవ్యం న గృహ్యతే. ౭

గృహీతో వా న విజ్ఞాతో భారో జ్ఞానస్య వోహ్యతే,
ఈదృశై స్సచివై ర్యుక్తో మూర్ఖై ర్దిష్ట్యా ధరామ్యహమ్. ౮

కిం ను మృత్యో ర్భయం నాస్తి వక్తుం మాం పరుషం వచః,
యస్య మే శాసతో జిహ్వా ప్రయచ్ఛతి శుభాశుభమ్. ౯

అప్యేవ దహనం స్పృష్ట్వా వనే తిష్ఠన్తి పాదపాః,
రాజదోషపరామృష్టా స్తిష్ఠన్తే నాపరాధినః. ౧౦

హన్యా మహం త్విమౌ పాపౌ శత్రుపక్షప్రశంసకౌ,
యది పూర్వోపకారై స్తు న క్రోధో మృదుతాం వ్రజేత్. ౧౧

అపధ్వంసత గచ్ఛధ్వం సన్నికర్షాదితో మమ,
నహి వాం హన్తు మిచ్ఛామి స్మరా మ్యుపకృతాని వామ్. ౧౨

హతావేవ కృతఘ్నౌ తౌ మయి స్నేహపరాఙ్ముఖౌ,

ఇట్టి యుద్ధారంభసమయంబున మనకుఁ బ్రతికూలురును మన పైకి యుద్ధమునకు వచ్చినవారలునగు శత్రువులను మీ రిద్దఱు నిట్లు స్తోత్రము సేయుటయుం క్షమా? ౬

మీరలు రాజనీతిలోఁ సారభూతమైన భృత్యకార్యము దెలియ కున్నారు. కావున మీరలు ఆచార్యులను గురువులను వృద్ధులను సేవించిన దంతయు వ్యర్థము. ౭

ఒకవేళ మీరలు నీతిశాస్త్రము గట్టిచేసినను దానియర్థము తెలిసికొన లేదు. లేక యర్థము దెలిసియు దాని యనుష్ఠానము లేకుండుటవలన జ్ఞానభార మును మోయుచున్నారు కాఁబోలు.

ఇట్టి మూర్ఖులగు మంత్రులం గూడియుండుటవలన నే నెప్పుడో శత్రువులచే హతుఁడై యుండవలసినవాఁడను. దైవయోగంబున బ్రతికి యున్నాను. ౮

నే నాజ్ఞాపించిన నామాటమాత్రమువలన నే శుభముగాని యశుభము గాని గలుగునుగదా! అట్టుండఁగా మీరు మరణంబునకుఁగూడ భయపడరా యేమి? నాయెదుట నిట్టి పరుషవచనంబు లాడితిరే? ౯

అడవియందు దావానలంబుతగిలిన వృక్షంబులుగూడ క్షేమంబున నుండును. రాజకోపంబునకుఁ బాత్రులయిన యపరాధులుమాత్రము క్షేమంబు నొందఁజాలరు. ౧౦

వీరలు మున్ను నాకుఁ గావించిన యుపకారములు జ్ఞప్తికివచ్చుటవలన నాకోపము తగ్గుచుండు నేని ఇప్పుడే శత్రుపక్షంబును బ్రశంసించిన పాపిష్ఠులగు నీశుకసారణులను వధించి పుత్తును. ౧౧

మిమ్ము స్థానభ్రష్టులఁ గావించుట మంచిది. నాదగ్గఱనుండవలదు. పొండు. మీరు మున్ను పెక్కుపకారములఁ గావించినవారలు కావున మిమ్మువధింపనొల్లను ౧౨

మీరలు కృతఘ్నులరనియు నాయందు స్నేహములేనివారలనియుం

ఏవ ముక్తౌ తు సవ్రీడౌ తావుభౌ శుకసారణౌ. ౧౩
రావణం జయశబ్దేన ప్రతినన్ద్యాభినిస్సృతౌ,
అబ్రవీత్స దశగ్రీవ స్సమీపస్థం మహోదరమ్. ౧౪

ఉపస్థాపయ మే శీఘ్రం చారా న్నీతివిశారదాన్,

మహోదర స్తథో క్తస్తు శీఘ్ర మాజ్ఞాపయ చ్చరాన్. ౧౫

తత శ్చారా స్సన్త్వరితాః ప్రాప్తాః పార్థివశాసనాత్,
ఉపస్థితాః ప్రాఞ్జలయో వర్ధయిత్వా జయాశిషా. ౧౬
తా నబ్రవీ త్తతో వాక్యం రావణో రాక్షసాధిపః,
చారా న్ప్రత్యాయితాన్ శూరా న్భక్తా న్విగతసాధ్వసాన్. ౧౭

ఇతో గచ్ఛత రామస్య వ్యవసాయం పరీక్షథ,
మన్త్రి ష్వభ్యన్తరా యేఽస్య ప్రీత్యా తేన సమాగతాః. ౧౮

కథం స్వపితి జాగర్తి కిమన్యచ్చ కరిష్యతి,
విజ్ఞాయ నిపుణం సర్వ మాగన్తవ్య మశేషతః. ౧౯

చారేణ విదిత శ్శత్రుః పణ్డితై ర్వసుధాధిపైః,
యుద్ధే స్వల్పేన యత్నేన సమాసాద్య నిరస్యతే. ౨౦

చారాస్తు తే తథే త్యుక్త్వా ప్రహృష్టా రాక్షసేశ్వరమ్,

విడిచిపెట్టుటయే మిమ్ము వధించుట యగుచున్నది. అని రావణుఁడు శుక సారణులతోఁ జెప్పెను.

ఆశుకసారణు లిరువురును రావణునిమాటనువిని లజ్జనొందినవారలయి రావణుని జయశబ్దంబునంబొగడి యంతంబోయిరి. ౧౩

అంత రావణుఁడు తనసమీపంబుననున్న మహోదరుఁజూచి యిట్లని చెప్పెను. ౧౪

రాజనీతియందు మిక్కిలియుఁ బండితులయినచారులను నాయొద్దకుఁ దీసికొనిరమ్ము. అని రావణుఁడు మహోదరునకుం జెప్పెను.

మహోదరుఁడు రావణుని యాజ్ఞచొప్పున వేగులవాండ్రను రావణుని యొద్దకు రమ్మని యాజ్ఞాపించెను. ౧౫

అంతఁ జారపురుషులు రాజాజ్ఞచొప్పున వేగంబునవచ్చి చేమోడ్చి గీలించి జయజయ యని యాశీర్వాదముగావించి కొలిచియుండిరి. ౧౬

అంత రాక్షసేశ్వరుఁడగు రావణుఁడు విశ్వసనీయులును శూరులును శత్రుభియము లేనివారలు రాజభక్తిగలవారలునగు నాచారులంజూచి యిట్లని చెప్పెను. ౧౭

మీర లిచ్చటనుండి రామునొద్దకుఁ బోయి యతనివ్యవసాయం బెట్టిదనది యును నతని కంతరంగ భూతులును బ్రియులునగు మంత్రు లెవ్వరై నదియుఁ బరీక్షించి రండు. ౧౮

రాముఁడు ఎట్లు నిదురించును? ఎట్లు మేలుకొనును? మఱి యేమేమి కార్యము సేయఁదలఁచి యున్నాఁడు? ఈసంగతుల నన్నిఁటిని సామర్థ్యంబునఁ జక్కఁగాఁ దెలిసికొని రావలయును. ౧౯

బుద్ధిమంతులగు రాజులు చారునివలన శత్రువు తెఱంగంతయుం దెలిసి యుద్ధంబున ననాయాసంబుగా శత్రువును జయింతురు. అని రావణుఁడు చారులతోఁ జెప్పెను. ౨౦

అంత నాచారులు రావణునిమాటనువిని యట్లేయని యియ్యకొనిరమ

శార్దూలమగ్రతః కృత్వా తత శ్చక్రుః ప్రదక్షిణమ్. ౨౧

తత స్తే తం మహాత్మానం చారా రాక్షససత్తమమ్,
కృత్వా ప్రదక్షిణం జగ్ము ర్యత్ర రామ స్సలక్ష్మణః. ౨౨
తే సువేలస్య శైలస్య సమీపే రామలక్ష్మణౌ,
ప్రచ్ఛన్నా దదృశు ర్గత్వా ససుగ్రీవవిభీషణౌ. ౨౩
ప్రేక్షమాణా శ్చమూం తాం తు బభూవుర్భయవిక్లబాః,

తే తు ధర్మాత్మనా దృష్టా రాక్షసేన్ద్రేణ రాక్షసాః. ౨౪
విభీషణేన తత్రస్థా నిగృహీతా యదృచ్ఛయా,

శార్దూలో గ్రాహిత స్త్వేకః పాపోఽయ మితి రాక్షసః. ౨౫

మోచితస్సోఽపి రామేణ వధ్యమానః ప్లవఙ్గమైః,
ఆనృశంస్యేన రామస్య మోచితా రాక్షసాః పరే. ౨౬
వానరై రర్దితా స్తే తు విక్రాన్తై ర్లఘువిక్రమైః,
పున ర్లఙ్కా మనుప్రాప్తాః శ్వసన్తో నష్టచేతసః. ౨౭

తతో దశగ్రీవ ముపస్థితా స్తు తే
చారా బహి ర్నిత్యచరా నిశాచరాః,
గిరే స్సువేలస్య సమీపవాసినం
న్యవేదయన్ భీమబలం మహాబలాః. ౨౮

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే ఏకోనత్రింశస్సర్గః. ౨౯

సంతుష్టులయి శార్దూలునిఁ బురస్కరించుకొని రాక్షసేశ్వరుఁడగు రావణునకుఁ బ్రదక్షిణంబు గావించిరి. ౨౧

అట్లు ఆచారులు మహాపరాక్రమశాలియగు నారావణునికిఁ బ్రదక్షిణించి తత్క్షణంబ రామలక్ష్మణు లుండుస్థలంబునకుఁ బోయిరి. ౨౨

ఆచారులు పోయి మఱియొకరూపముధరించి సువేలపర్వతసమీపంబున సుగ్రీవవిభీషణసహితులయియున్న రామలక్ష్మణులం జూచిరి. ౨౩

ఆచారులు రామలక్ష్మణులను ఆవానరసేననుఁ జూచినంతనే మిక్కిలియుం భయంబునొందిరి.

ధర్మాత్ముఁడగు విభీషణుండు ఆచారులం గనుఁగొనెను. ౨౪

ఆచారులు ఆసేనయందుఁ దిరుగుచుండి ఆకస్మికముగా విభీషణునిచేఁ బట్టుకొనఁబడిరి.

అందు శార్దూలుఁడు మిక్కిలియు దుష్టుఁడని విభీషణుఁడితని వానరుల చేతికిం బట్టియిచ్చెను. ౨౫

వానరులాశార్దూలుని వధింపఁబూన రాముఁడు వాని విడిపించెను.

మఱి రాముఁడు దయచే నితర చారులనుంగూడ విడిపించెను. ౨౬

ఆచారులు అట్లు పరాక్రమవంతులును శీఘ్రవిక్రములు నగువానరులచేఁ దెబ్బలఁదిని నిట్టూర్పులుపుచ్చుచు విమనస్కులయి మరల నెట్టకేలకు లంకం జేరిరి. ౨౭

అంతఁ బరరాష్ట్రవృత్తాంతముల నెఱుంగుటకై యెల్లప్పుడును నితర దేశముల సంచారము సేయువారలును మహాబలశాలులునగు నాచారులు రావణునియొద్దకుఁ బోయి భయంకరబలుఁడగు రాముఁడు సువేలాద్రి సమీపంబున నున్నాఁడని విన్నవించిరి. ౨౮

ఇది యిరువదితొమ్మిదవసర్గము.

---

## త్రింశస్సర్గః.

తత స్తమక్షోభ్యబలం లఙ్కాధిపతయే చరాః,
సువేలే రాఘవం శైలే నివిష్టం ప్రత్యవేదయన్. ౧
చారాణాం రావణ శ్శ్రుత్వా ప్రాప్తం రామం మహాబలమ్,
జాతోద్వేగోఽభవ త్కించి చ్ఛార్దూలం వాక్య మబ్రవీత్. ౨
అయథావ చ్చ తే వర్ణో దీనశ్చాసి నిశాచరః,
నాసి కచ్చిదమిత్రాణాం క్రుద్ధానాం వశమాగతః. 3

ఇతి తేనానుశిష్టస్తు వాచం మన్దముదీరయత్,
తదా రాక్షసశార్దూలం శార్దూలో భయవిహ్వలః. ౪
న తే చారయితుం శక్యా రాజ! న్వానరపుఙ్గవాః,

విక్రాన్తా బలవ న్తశ్చ రాఘవేణ చ రక్షితాః. ౫
నాపి సమ్భాషితుం శక్యాస్సమ్ప్రశ్నోఽత్ర న లభ్యతే,

సర్వతో రక్ష్యతే పన్థా వానరైః పర్వతోపమైః. ౬
ప్రవిష్టమాత్రే జ్ఞాతోఽహం బలే తస్మి న్నచారితే,

బలాద్గృహీతో రక్షోభిర్బహుధాఽస్మి విచాలితః. ౭

జానుభి ర్ముష్టిభి ర్దన్తై స్తలై శ్చాభిహతో భృశమ్,
పరిణీతోఽస్మి హరిభిర్బలవద్భిరమర్షణైః. ౮

పరిణీయ చ సర్వత్ర నీతోఽహం రామసంసదమ్,
రుధిరాదిగ్ధసర్వాఙ్గో విహ్వలశ్చలితేన్ద్రియః. ౯

## ముప్పదవసర్గము.

అంత శార్దూలాదిచారులు రాముఁడు లెక్కలేనివానరసేనతోసువేల పర్వతప్రాంతంబున విడిసియున్నాఁడని రావణునకుం జెప్పిరి. ౧

రావణుఁడు చారులమాటలవలన మహాబలుఁడగు రాముఁడు వచ్చెనాఁడని విని కొంచెము భయమునొంది శార్దూలుంజూచి యిట్లని చెప్పెను. ౨

శార్దూలుఁడా! నీముఖకాంతి యెప్పటివలెలేదు; మిక్కిలియుం దీనుఁడవైయున్నావు; శత్రువులు క్రుద్ధులయి నిన్నేమియుఁ జేయలేదుగదా! అని రావణుఁడు శార్దూలునితోఁ జెప్పెను. ౩

అంత శార్దూలుఁడు రావణునిమాటనువిని పరమభీతుఁడై రాక్షసోత్తముఁడగు రావణునింజూచి మందవచనంబున నిట్లని చెప్పెను. ౪

రాక్షసరాజుండవగు రావణుఁడా! ఆవానరోత్తములు వేగులవాండ్రకు సాధ్యులుకారు.

వానరులు మహాపరాక్రమశాలులు మహాబలశాలులు రామరక్షితులుం గావున వారితో మాటలాడుటయు నశక్యముగానున్నది. వారలఁ బరీక్షించుట యెంతమాత్రము సాధ్యముగాదు. ౫

ఎటుచూచినను బర్వతాకారులగు వానరులు మార్గంబులం గావలియున్నారు. సేనాసైన్యంబుఁ జొచ్చితిని. ఇంక నెచ్చటను చూడంగూడలేదు. ఇంతలోపలనే నన్నుఁ గనుంగొనిరి. ౬

విభీషణసచివులగు రాక్షసులు నన్ను బలాత్కారంబునంబట్టి బహువిధంబుల నేలం బొరలించిరి. ౭

అంత బలవంతులగు నవ్వానరులు కుపితులయి నన్ను నానావిధంబులఁ బిడికిళ్లంబొడిచియుం వట్టిచేతులం గఱచి నఖచేతులం జఱచియుఁ బీడించి యాసైన్యంబంతయుం నన్నుఁ దీసికొని చుట్టించిరి. ౮

అట్లు అవ్వానరులు నన్నంతటఁద్రిప్పి నెత్తుటందడిసిన దేహముగలవాఁడనై మూర్ఛితుఁడనై ఇంద్రియంబుల స్వాధీనతదప్పి యవ్వానరులచే

హరిభి ర్వధ్యమానశ్చ యాచమానః కృతాఞ్జలిః,
రాఘవేణ పరిత్రాతో జీవామీతి యదృచ్ఛయా. ౧౦

ఏష శైలై శ్శిలాభిశ్చ పూరయిత్వా మహార్ణవమ్,
ద్వార మాశ్రిత్య లఙ్కాయా రామ స్తిష్ఠతి సాయుధః. ౧౧

గరుడవ్యూహ మాస్థాయ సర్వతో హరిభి ర్వృతః,
మాం విసృజ్య మహాతేజా లఙ్కామేవాభివర్తతే. ౧౨

పురా ప్రాకార మాయాతి క్షిప్ర మేకతరం కురు,
సీతాం వాస్మై ప్రయచ్ఛాశు సుయుద్ధం వా ప్రదీయతామ్. ౧౩

మనసా తం తదా ప్రేక్ష్య తచ్ఛ్రుత్వా రాక్షసాధిపః,
శార్దూలం సుమహ ద్వాక్య మథోవాచ స రావణః. ౧౪
యది మాం ప్రతియుధ్యేరన్ దేవగన్ధర్వదానవాః,
నైవ సీతాం ప్రదాస్యామి సర్వలోకభయా దపి. ౧౫

ఏవముక్త్వా మహాతేజా రావణః పున రబ్రవీత్,
చారితా భవతా సేనా కేఽత్ర శూరాః ప్లవఙ్గమాః. ౧౬

కీదృశాః కిం ప్రభా స్సౌమ్య! వానరా యే దురాసదాః,
కస్య పుత్త్రాశ్చ పౌత్త్రాశ్చ తత్త్వ మాఖ్యాహి రాక్షస!. ౧౭

వధింపఁబడుచు శరణంబు వేఁడుచుఁ జేతులు మొగిడ్చుకొనియున్న నన్ను యమునియొద్దకుం గొనిపోయిరి. ౯

అంత రాముఁడు నన్నుఁ గాపాడెను; ఇట్లు అదృష్టవశంబున బ్రతికి వచ్చినాను. ౧౦

ఇదిగో రాముఁడు ఱాళ్లచే మహాసముద్రంబునకుఁ గట్టంగట్టి దాఁటి వచ్చి సువేలపర్వతంబున సాయుధుఁడై యున్నాఁడు; ఇంక శీఘ్రంబున లంకాద్వారంబుఁ జేరంగలఁడు. ౧౧

మహాతేజుఁడగు రాముఁడు నన్ను విడిచిపెట్టినపిమ్మట గరుడవ్యూహమును బన్ని సమస్తవానరసమేతుఁడై యీలంకాపురికి వచ్చు ప్రయత్నంబున నుండెను. ౧౨

రాముఁడు ఇంక స్వల్పకాలంబుననే ప్రాకారంబు నావరించును; నీవు శీఘ్రమున నీరెంట నొకటి నేదేనిం జేయుము; రామునకు సీతాదేవి నేని యొసంగుము; లేక చక్కఁగా యుద్ధమైనను గావింపుము. అని శార్దూలుఁడు రావణునితోఁ జెప్పెను. ౧౩

అంత నారావణుఁడు శార్దూలునిమాటనువిని మనసున నాలోచించి యాశార్దూలుంజూచి గొప్పమాటం జెప్పెను. ౧౪

దేవతలును గంధర్వులును దానవులును ఒక్కుమ్మొగి నాపైకి యుద్ధమునకువచ్చినను నాకు సమస్తలోకంబులవలనను భయంబువాటిల్లినను నేను రామునకు సీత నివ్వను. అని రావణుఁడు శార్దూలునితోఁ జెప్పెను. ౧౫

మహాతేజుఁడగు రావణుఁడు ఈప్రకారమున శార్దూలునితోఁ జెప్పి మరల నిట్లని చెప్పెను.

నీవు వానరసేనయంతయుఁ జూచినావుగదా! అందు శూరులగువానరులెవ్వరు? చెప్పుము. ౧౬

సౌమ్యుఁడవగు శార్దూలుఁడా! అందు మహాపరాక్రమశాలులగు వానరులు ఎట్టివారలు? వారి ప్రభావ మెట్టిది? వార లెవ్వరి కొడుకులు? ఎవ్వరి మను-

తథాఽత్ర ప్రతిపత్స్యామి జ్ఞాత్వా తేషాం బలాబలమ్,
అవశ్యం బలసంఖ్యానం కర్తవ్యం యుద్ధ మిచ్ఛతామ్. ౧౮

అథైవ ముక్త శ్శార్దూలో రావణేనోత్తమ శ్చరః,
ఇదం వచన మారేభే వక్తుం రావణసన్నిధౌ. ౧౯
అథర్క్ష రజసః పుత్త్రో యుధి రాజా సుదుర్జయః,
గద్గదస్యాథ పుత్త్రోఽసౌ జామ్బవా నితి విశ్రుతః. ౨౦
గద్గదస్యైవ పుత్త్రోఽన్యో గురుపుత్త్ర శ్శతక్రతోః,
కదనం యస్య పుత్త్రేణ కృత మేకేన రక్షసామ్. ౨౧

సుషేణ శ్చాపి ధర్మాత్మా పుత్త్రో ధర్మస్య వీర్యవాన్,
సౌమ్య స్సోమాత్మజ శ్చాత్ర రాజ న్దధిముఖః కపిః. ౨౨

సుముఖో దుర్ముఖ శ్చాత్ర వేగదర్శీ చ వానరః,
మృత్యు ర్వానరరూపేణ నూనం సృష్ట స్స్వయమ్భువా. ౨౩

పుత్త్రో హుతవహస్యాథ నీల స్సేనాపతి స్స్వయమ్,
అనిలస్య తు పుత్త్రోఽత్ర హనూమానితి విశ్రుతః. ౨౪

నప్తా శక్రస్య దుర్ధర్షో బలవా నఙ్గదో యువా,
మైన్దశ్చ ద్వివిద శ్చోభౌ బలినా వశ్విసమ్భవౌ. ౨౫
పుత్త్రా వైవస్వత స్యాత్ర పఞ్చ కాలా న్తకోపమాః,
గజో గవాక్షో గవయ శ్శరభో గన్ధమాదనః. ౨౬

ములు? ఈసంగతియంతయుఁ జక్కఁగాఁ జెప్పుము. ౧౮

అట్లు నీవలన నవ్వానరులబలాబలంబు లెఱిఁగి వారలవిషయమయి చేయవలసినదానిం దెలిసికొనెదను. యుద్ధముసేయువారలు అవశ్యము శత్రుబలంబుఁ దెలుసుకొనవలయును. అని రావణుఁడు శార్దూలునితోఁ జెప్పెను.

అంత నుత్తమచారుఁడగు శార్దూలుఁడు ఇట్లు రావణుఁడు చెప్పిన మాటనువిని రావణున కిట్లని చెప్పెను. ౧౯

ఋక్షరజునికొడుకు వానరరాజుం డగుసుగ్రీవుఁడు యుద్ధంబున మిక్కిలియు దుర్జయుఁడు. జాంబవంతుఁడనువాఁడు గద్గదునికొడుకు. ౨౦

గద్గదునికొడుకు మఱియొకఁడు ధూమ్రుఁడనువాఁ డున్నాఁడు; ఎవ్వఁడు ఒక్కఁడే యుద్ధంబున నక్షాదిరాక్షసులఁ బెక్కండ్రం జంపెనో అట్టి హనుమంతుని తండ్రి కేసరియనువాఁడు బృహస్పతిపుత్త్రుఁడు. ౨౧

రాక్షసరాజుండవగు రావణుఁడా! మహాపరాక్రమశాలియు ధర్మాత్ముఁడునగు సుషేణుఁడనువాఁడు వరుణునిపుత్త్రుఁడు; సౌమ్యుఁడగు దధిముఖుఁడు చంద్రునిపుత్త్రుఁడు. ౨౨

సుముఖుఁడును దుర్ముఖుఁడును వేగదర్శియును వీర లొక్కొకరును మృత్యువె యీవానరరూపంబున బ్రహ్మదేవునిచే సృజింపఁబడియెఁ గాఁబోలు నని యనందఱు చెప్పుదురు. ౨౩

మఱియు వానరసేనానాయకుఁడగు నీలుఁడు అగ్నిహోత్రునికొడుకు; మున్ను కేసరిపుత్త్రుఁడని చెప్పఁబడిన హనుమంతుఁడు వాయుదేవుని బీజంబువలనఁ బుట్టినవాఁడు. ౨౪

దుర్ధర్షుఁడగు నంగదుఁడు దేవేంద్రుని మనుమఁడు; బలవంతులగు మైందద్వివిదులు అశ్వినీదేవతల కొడుకులు. ౨౫

గజుఁడును గవాక్షుఁడును గవయుఁడును శరభుఁడును గంధమాదనుఁడును ఈయయిదుగురు ప్రలయకాలాంతకునకు సాటివచ్చువారలు; వీరలు యమునికొడుకులు. ౨౬

దశ వానరకోట్యశ్చ శూరాణాం యుద్ధకాఙ్క్షిణామ్.
శ్రీమతాం దేవపుత్రాణాం శేషం నాఖ్యాతు ముత్సహే. ౨౭

పుత్రో దశరథ స్యైష సింహసంహననో యువా,
దూషణో నిహతో యేన ఖరశ్చ త్రిశిరా స్తథా. ౨౮
నాస్తి రామస్య సదృశో విక్రమే భువి కశ్చన,
విరాధో నిహతో యేన కబన్ధ శ్చాన్తకోపమః. ౨౯

వక్తుం న శక్తో రామస్య నరః కశ్చి ద్గుణా న్క్షితౌ,
జనస్థానగతా యేన యావన్తో రాక్షసా హతాః. ౩౦
లక్ష్మణ శ్చాత్ర ధర్మాత్మా మాతఙ్గానామివర్షభః,
యస్య బాణపథం ప్రాప్య న జీవేదపి వాసవః. ౩౧
శ్వేతో జ్యోతిర్ముఖ శ్చాత్ర భాస్కరస్యాత్మసమ్భవౌ,
వరుణస్యచ పుత్రోఽన్యో హేమకూటః ప్లవఙ్గమః. ౩౨
విశ్వకర్మసుతో వీరో నళః ప్లవగస త్తమః,
విక్రాన్తో బలవా నత్ర వసుపుత్ర స్సుదుర్ధరః. ౩౩
రాక్షసానాం వరిష్ఠశ్చ తవ భ్రాతా విభీషణః
పరిగృహ్య పురీం లఙ్కాం రాఘవస్య హితే రతః. ౩౪
ఇతి సర్వం సమాఖ్యాతం తవేదం వానరం బలమ్,
సువేలేఽధిష్ఠితం శైలే శేషకార్యే భవాన్గతిః. ౩౫

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే త్రింశస్సర్గః. ౩౦

---

## ఏకత్రింశస్సర్గః.

తత స్తమక్షోభ్యబలం లఙ్కాధిపతయే చరాః.

ఇట్లు శ్రీమంతులును దేవతలకుఁబుట్టినవారలును యుద్ధంబునందు భయములేనివారలును యుద్ధంబు గోరుచుండువారలునగు వానరులు పదికోటు లున్నారు; వీరలపేళ్లు మొదలగువానిం జెప్ప నా కలవిగాదు. ౨౭

ఎవ్వఁడు ఖరుని దూషణుని త్రిశిరునిం జంపినాఁడో అట్టి దశరథ పుత్త్రుఁడు రాముఁడు మిక్కిలియుఁ సుందరవిగ్రహుఁడు; యౌవనవంతుఁడు. ౨౮

విరాధుని యమునింబోలు కబంధునింగూడ వధించినట్టి మహాపరాక్రమశాలియగు రామునకుఁ బరాక్రమంబున సాటివచ్చువాఁడు భూలోకంబున నెవ్వఁడును లేఁడు. ౨౯

జనస్థానంబుననున్న రాక్షసుల నందఱు నొక్కఁడే వధించినట్టి మహావీరుఁడగు రామునిగుణంబుల వర్ణింప భూమియందు దేరికిని శక్యంబుగాదు. ధర్మాత్ముఁడగు లక్ష్మణుఁడును మదపుటేనుఁగువంటివాఁడు; ఇతనిబాణంబు సోఁకిన దేవేంద్రుఁడేని జీవింపఁజాలఁడు. 3౦

శ్వేతుఁడును జ్యోతిర్ముఖుఁడునగు నీయిర్వురును సూర్యపుత్త్రులు. వరుణునకు హేమకూటుఁడను మఱియొక్కపుత్త్రుఁ డున్నాఁడు. 3౧

పరాక్రమవంతుఁడగు నలుఁడు విశ్వకర్మకుఁ బుట్టినవాఁడు; మహాపరాక్రమశాలియుఁ బలవంతుఁడునగు దుర్ధరుఁడు వసుపుత్త్రుఁడు. 33

రాక్షసశ్రేష్ఠుఁడు నీ తమ్ముఁడు విభీషణుఁడు రామునివలన లంకారాజ్యాధిపత్యంబునొంది రామునకు హితంబుసేయం బూనియున్నాఁడు. 3౪

సువేలపర్వతప్రాంతంబున విడిసియున్న వానరసైన్యంబు తెఱఁగంతయుం నీ కెఱింగించితిఁగదా! ఇంకఁ జేయవలసిన కార్యముల విషయమంతయు నీ యిష్టము. అని శార్దూలుండు రావణునకుఁ జెప్పెను. 3౫

ఇది ముప్పదవసర్గము.

---

## ముప్పదియొకటవసర్గము.

అట్లు శార్దూలాదిచారులు రాముఁ డనంతవానరసేనతో సువేలశైల

సువేలే రాఘవం శైలే నివిష్టం ప్రత్యవేదయన్. ౧
చారాణాం రావణః శ్రుత్వా ప్రాప్తం రామం మహాబలమ్,
జాతోద్వేగోఽభవ త్కిఞ్చి త్సచివా నిద మబ్రవీత్. ౨
మన్త్రిణ శ్శీఘ్ర మాయాన్తు సర్వే వై సుసమాహితాః,
అయం నో మన్త్రకాలో హి సమ్ప్రాప్త ఇతి రాక్షసాః. 3
తస్య తద్వచనం శ్రుత్వా మన్త్రిణోఽభ్యాగమన్ ద్రుతమ్,
తత స్స మన్త్రయామాస సచివై రాక్షసై స్సహ. ౪

మన్త్రయిత్వా స దుర్ధర్షః క్షమం యత్సమన న్తరమ్,
విసర్జయిత్వా సచివా న్ప్రవివేశ స్వ మాలయమ్. ౫
తతో రాక్షస మాహూయ విద్యుజ్జిహ్వం మహాబలమ్,
మాయావిదం మహామాయః ప్రావిశ ద్యత్ర మైథిలీ. ౬

విద్యుజ్జిహ్వం చ మాయాజ్ఞ మబ్రవీ ద్రాక్షసాధిపః.

మోహయిష్యావహే సీతాం మాయయా జనకాత్మజామ్. ౭
శిరో మాయామయం గృహ్య రాఘవస్య నిశాచర!,
త్వం మాం సముపతిష్ఠస్వ మహచ్చ సశరం ధనుః. ౮

ఏవముక్త స్తథేత్యాహ విద్యుజ్జిహ్వో నిశాచరః,
తస్య తుష్టోఽభవద్రాజా ప్రదదౌ చ విభూషణమ్. ౯

అశోకవనికాయాం తు సీతాదర్శనలాలసః,
నైరృతానా మధిపతి స్సంవివేశ మహాబలః. ౧౦

ప్రాంతంబున విడిసియున్నాఁడని లంకారాజుండగు రావణునకుం జెప్పిరి. ౧

రావణుఁడు మహాబలుఁడగు రాముఁడువచ్చియున్నాఁడని చారులవలన విని కొంచెము భయముఁబొంది మంత్రులను జూచి యిట్లని చెప్పెను. ౨

మన మాలోచింపవలసిన సమయమువచ్చినది. కావున మంత్రులందఱు శీఘ్రంబున నెచ్చరికతో నిచ్చటికివత్తురుగాక. అని రావణుఁ డాజ్ఞాపించెను. 3

ఆ రావణు నాజ్ఞనువిని మంత్రు లందఱు శీఘ్రముగ నతని సన్నిధికి వచ్చిరి.

అంత నారావణుఁడు మంత్రులతోఁగూడఁ జక్కఁగా నాలోచించెను. ౪

దుర్ధరుఁడగు నారావణుఁడు అపలం జేయవలసినదానిఁ గుఱించి చక్కఁగా నాలోచించి మంత్రులం బొండని తనగృహంబునకుఁ బోయెను. ౫

అంత మహామాయుఁడగు నారావణుఁడు మాయలం బండితుఁడును మహాబలుఁడునగు విద్యుజ్జిహ్వుఁడను రాక్షసుం బిలిచి యతఁడు వెంటరా సీతాదేవియుండు స్థలంబునకుఁ బోయెను. ౬

రాక్షసరాజుండగు రావణుఁడు మాయలు దెలిసిన విద్యుజ్జిహ్వుం జూచి యిట్లని చెప్పెను.

మనము మాయచేసి సీతాదేవిని మోసపుత్తము. ౭

విద్యుజ్జిహ్వుఁడా! నీవు మాయచే రామునితల నొకటికల్పించి దానిని బాణసహితంబగు మహాధనుస్సుతుం దీసికొని నావెంటరమ్ము. అని రావణుఁడు విద్యుజ్జిహ్వునితోఁ జెప్పెను. ౮

అంత విద్యుజ్జిహ్వుఁడు రావణునిమాటనువిని యట్లే యని యియ్యకొనెను; అందుకు రాక్షసరాజుండగు రావణుఁడు సంతుష్టుఁడై యతనికిఁ గొప్పవిలువగల భూషణం బొకటి యొసంగెను. ౯

మహాబలశాలియుం రాక్షసరాజుండు నగురావణుఁడు సీతం జూడఁగోరి యయ్యశోకవనంబునకే పోయెను. ౧౦

తతో దీనా మదైన్యార్హాం దదర్శ ధనదానుజః,
అధోముఖీం శోకపరాముపవిష్టాం మహీతలే. ౧౧
భర్తారమేవ ధ్యాయన్తీ మశోకవనికాం గతామ్,
ఉపాస్యమానాం ఘోరాభీ రాక్షసీభిరిత స్తతః. ౧౨

ఉపసృత్య తత స్సీతాం ప్రహర్షం నామ కీర్తయన్,
ఇదం చ వచనం ధృష్ట మువాచ జనకాత్మజామ్. ౧౩

సాన్త్వ్యమానా మయా భద్రే య ముపాశ్రిత్య వల్గసే,
ఖరహన్తా స తే భర్తా రాఘవ స్సమరే హతః. ౧౪

ఛిన్నం తే సర్వతో మూలం దర్ప స్తే నిహతో మయా,
వ్యసనేనాత్మ న స్సీతే! మమ భార్యా భవిష్యసి. ౧౫

విసృజేమాం మతిం మూఢే! కిం మృతేన కరిష్యసి,
భవస్వ భద్రే! భార్యాణాం సర్వాసామీశ్వరీ మమ. ౧౬

అల్పపుణ్యే! నివృత్తార్థే! మూఢే! పణ్డితమానిని!,
శృణు భర్తృవధం సీతే! ఘోరం వృత్రవధం యథా. ౧౭

సమాయాతస్సముద్రాన్తం మాం హన్తుం కిల రాఘవః,
వానరేన్ద్రప్రణీతేన బలేన మహతా వృతః. ౧౮
సన్నివిష్ట స్సముద్రస్య పీడ్య తీరమథో త్తరమ్,
బలేన మహతా రామో వ్రజ త్యస్తం దివాకరే. ౧౯
అథాధ్వని పరిశ్రాన్త మర్ధరాత్రే స్థితం బలమ్,

అంతఁ గుబేరునితమ్ముఁడగు రావణుఁడు దుఃఖము నొందినదియు నట్టి దుఃఖము నొందఁదగనిదియు నేలం గూర్చుండి ముఖంబు వాంచి పరమదుఃఖిత యయి మనంబున భర్తయగు రాముని ధ్యానించుచున్నదియు భయంకరాకారలగు రాక్షసస్త్రీలచేత రక్షింపఁబడుచున్నదియు నగుదాని నశోకవనికయం దున్నదాని సీతాదేవిం జూచెను. ౧౧,౧౨

అంత రావణుఁడు సీతాదేవి సమీపంబునకుఁబోయి మహాసంతోష వార్తను జెప్పువాఁడువలె నభినయించుచు నాబిడం జూచి దుష్టమగు నీమాటం జెప్పెను. ౧౩

మంగళరూపిణివగు సీతా! నేనెంత వేఁడినను నీవెవ్వనియందలి మక్కువచే నొప్పుకొనకుంటివో ఆట్టి ఖరునిం జంపినవాఁడు నీపెనిమిటి రాముఁడు యుద్ధంబున హతుఁడయ్యె. ౧౪

సీతా! నీగర్వమున కుండిన యాధారమునంతయును ఛేదించితిని; నీగర్వంబు నంతయుఁ బోఁగొట్టితిని; ఇంక నాప్రార్థనయుఁగూడ నెంతమాత్రము నక్కఱ లేదు; నీదుఃఖంబుననే నీవు నాభార్యవు కాఁగలవు. ౧౫

మూఢురాలవగు సీతా! నీవింక నీబుద్ధిని విడువుము; చనిపోయినవానితో నీకేమి కార్యము? మంగళరూపిణివగు సీతా! నాభార్యలకందఱకును నీవీశ్వరివై యుండుము. ౧౬

అల్పపుణ్యురాలవు పురుషార్థరహితురాలవు బుద్ధిహీనురాలవు నీవేమియుఁ దెలియకపోయినప్పటికిని సమస్తముఁ దెలిసినట్లు గర్వించియున్నదానవు నగు సీతా! వృత్రాసురుఁడు చచ్చినట్లు నీభర్త రాముఁడు చచ్చెను; వినుము. ౧౭

రాముఁడు నన్ను వధించుటకై వానరరాజుఁడగు సుగ్రీవుఁడు గొప్ప సేనతో వెంబడింప సముద్రతీరంబునొద్దకు వచ్చినాఁడు. ౧౮

అంత రాముఁడు సూర్యాస్తమయసమయంబునందు సముద్రోత్తర తీరంబున మహాసైన్యంబుతోఁగూడ విడిసియుండెను. ౧౯

అంత నాసైన్యమంతయును దారినడచుటచే నలసి యర్ధరాత్రంబున

సుఖసుప్తం సమాసాద్య చారిత్రం ప్రథమం చరైః. ౨౦

తత్ప్రహస్తప్రణీతేన బలేన మహతా మమ,
బలమస్య హతం రాత్రౌ యత్ర రామ స్సలక్ష్మణః. ౨౧
పట్టిసా న్పరిఘాం శ్చక్రాన్ దణ్డా న్ఖడ్గా న్మహాయసాన్,
బాణజాలాని శూలాని భాస్వరా న్కూటముద్గరాన్. ౨౨
యష్టీశ్చ తోమరాన్ శక్తీ శ్చక్రాణి ముసలానిచ,
ఉద్యమ్యోద్యమ్య రక్షోభి ర్వానరేషు నిపాతితాః. ౨౩
అథ సుప్తస్య రామస్య ప్రహస్తేన ప్రమాథినా,
అసక్తం కృతహస్తేన శిర శ్ఛిన్నం మహాసినా. ౨౪

విభీషణస్సముత్పత్య నిగృహీతో యదృచ్ఛయా,
దిశః ప్రవ్రాజిత స్సర్వై ర్లక్ష్మణః ప్లవగై స్సహ. ౨౫
సుగ్రీవో గ్రీవయా సీతే! భగ్నయా ప్లవగాధిపః,
నిరస్తహనుక శ్శేతే హనూమా న్రాక్షసై ర్హతః. ౨౬

జామ్బవా నథ జానుభ్యా ముత్పత న్నిహతో యుధి,
పట్టిసై ర్బహుభి శ్ఛిన్నో నికృత్తః పాదపో యథా. ౨౭

మైన్దశ్చ ద్వివిదశ్చోభౌ నిహతౌ వానరర్షభౌ,
నిశ్వసన్తౌ రుదన్తౌ చ రుధిరేణ సముక్షితౌ. ౨౮
అసినా వ్యాయతౌ ఛిన్నౌ మధ్యే హ్యరినిషూదనౌ,

అనుతిష్ఠతి మేదిన్యాం పనసః పనసో యథా. ౨౯

సుఖనిద్రం జెందియుండునప్పుడు మొదలఁ జారులంబంపి యందలి జాడ లన్నియుఁ గనుఁగొంటిమి ౨౦

ఎందు రామలక్ష్మణులున్నారో అట్టి యీ వానరసేననంతయుఁ బ్రహస్తుఁడు గొప్పదగు నారాక్షససేనం దీసికొని వధించిపుచ్చెను. ౨౧

రాక్షసులు అడ్డకత్తులను గదలనుజివ్వచక్రంబులను పెద్దచక్రంబులను పెద్దయినుపదండములను ఖడ్గంబులను పెక్కుబాణంబులను శూలంబులను పట్టిశులను ఇనుపగుడియలను కత్తిలను స్థూలాగ్రంబులగుగదలను ఈటెలను ముసలంబులను వానరులపై వేనవేలం బ్రయోగించిరి. ౨౨, ౨౩

అంత యుద్ధంబులఁ బ్రహరించువాఁడును నేర్పరియునగు ప్రహస్తుఁడు ఎంతమాత్రమును జాగుసేయక మహాఖడ్గంబున నిదురించుచున్న రాముని శిరంబును నఱకెను. ౨౪

విభీషణుఁడాకాశంబున కుద్గమించిపో నుద్యమింప నదృష్టవశంబున నొడిసిపట్టుకొనిరి; లక్ష్మణుఁడును ఇతరవానరులుం బఱచు దిక్కునకుం బాఱిరి.

సీతా! ఇప్పుడు వానరరాజుండగు సుగ్రీవుఁడు కంఠము విఱిగిపడి యున్నాఁడు; హనుమంతుఁడు హనువుపగిలి రాక్షసులచే హతుఁడై పడి యున్నాఁడు.

మఱియుం జాంబవంతుఁడు మ్రోఁకాళ్లనుద్గమింపుఁడు రాక్షసు లతనిం బట్టి పెక్కుపట్టిసంబులచే ఖండించి వధించిరి; అతఁ డిప్పుడు నఱకఁబడి నేలంగూలిన వృక్షంబుపగిది నున్నాఁడు. ౨౫

దీర్ఘదేహులును శత్రువులం జంపువారలునగు మైందద్వివిదులను వానరోత్తముల నిద్దఱను రాక్షసులు కటిప్రదేశంబున ఖడ్గంబుచే ఖండింప వారలు నెత్తుటందోఁగుచు నిట్టూర్పులుపుచ్చుచు రోదనంబుసేయుచుఁ బ్రాణంబులు విడిచిరి: ౨౬

పనసుఁడు పనసపండువలెఁ జిత్రవిధంబుగా ఖండింపఁబడి నేలంబడి యున్నాఁడు.

నారాచై ర్బహుభిశ్ఛిన్న శ్శేతే దర్యాం దరీముఖః,
కుముద స్తు మహాతేజా నిష్కూజ స్సాయకైః కృతః. ౩౦

అఙ్గదో బహుభిశ్ఛిన్న శ్శరై రాసాద్య రాక్షసైః,
పతితో రుధిరోద్గారీక్షితౌ నిపతితాఙ్గదః. ౩౧
హరయో మథితా నాగై రథ జాలై స్తథా పరే,
శాయితా మృదితాశ్చాశ్వై ర్వాయువేగై రివామ్బుదాః. ౩౨

ప్రహృతాశ్చాపరే త్రస్తా హన్యమానా జఘన్యతః,
అభిద్రుతాం స్తు రక్షోభిస్సింహై రివ మహాద్విపాః. ౩౩
సాగరే పతితాః కేచిత్కేచిద్గగనమాశ్రితాః,
ఋక్షా వృక్షానుపారూఢా వానరీం వృత్తి మాశ్రితాః. ౩౪

సాగరస్య చ తీరేషు శైలేషు చ వనేషు చ,
పిఙ్గళా స్తే విరూపాక్షైర్బహుభిర్బహవో హతాః. ౩౫
ఏవం తవ హతో భర్తా ససైన్యో మమ సేనయా,
క్షతజార్ద్రం రజోధ్వస్త మిదం చాస్యాహృతం శిరః. ౩౬
తతః పరమదుర్ధర్షో రావణో రాక్షసేశ్వరః,
సీతాయా ముపశృణ్వన్త్యాం రాక్షసీమిద మబ్రవీత్. ౩౭
రాక్షసం క్రూరకర్మాణం విద్యుజ్జిహ్వం త్వమానయ,
యేన తద్రాఘవశిర స్సఙ్గ్రామా త్స్వయమాహృతమ్. ౩౮
విద్యుజ్జిహ్వ స్తతో గృహ్య శిర స్త త్సశరాసనమ్,
ప్రణామం శిరసా కృత్వా రావణస్యాగ్రతః స్థితః. ౩౯
తమబ్రవీ త్తతో రాజా రావణో రాక్షసం స్థితమ్,
విద్యుజ్జిహ్వం మహాజిహ్వం సమీపపరివర్తినమ్. ౪౦

దశముఖుఁడను వానరుఁడు పెక్కుబాణంబులచే వధింపఁబడి యొక గుహాం బడియున్నాఁడు. మహాపరాక్రమశాలియగు కుముదుఁడు బాణంబులచే గతప్రాణుఁడై నిశ్శబ్దంబుగా నున్నాఁడు. ౩౦

అంగదుఁడు రాక్షసులచేఁ బెక్కుబాణంబులం బ్రహరింపఁబడి నెత్తుటం దోఁగి బాహుపురులు వీడిపడ మృతుఁడై నేలంబడెను. ౩౧

పరుండి సుఖంబుగానిదురించుచున్న వానరులు కొందఱు ఏనుఁగులచేఁ ద్రొక్కఁబడి మృతులయిరి; కొందఱు కపటంబున వధింపఁబడిరి; కొందఱు వాయువేగంబుల మేఘంబులవలెగుఱ్ఱంబులచేఁ ద్రొక్కఁబడి మృతిఁబొందిరి.

మఱికొందఱు భయంబునఁ బరుగెత్తుడు రాక్షసులు, సింహంబులు మహాగజంబులంబోలె వారివెంటం దగిలి ప్రహరించి వధించిరి. ౩౩

కొందఱు వానరులు సముద్రంబునంబడిరి; కొంద ఱాకాశంబున కెగసి తప్పించుకొనిరి; భల్లూకంబులు కొన్ని నిజంబగు వానరస్వభావంబు నవలంబించి వృక్షంబుల నారోహించినవి. ౩౪

మఱియుఁ బెక్కండ్రురాక్షసులు సముద్రతీరప్రదేశంబునను బర్వతంబుల యందును వనంబులయందును వెదకివెదకి పెక్కండ్ర వానరులం జంపిరి.

ఇట్లు నాసైనికులు నీభర్తను అతనిసైన్యమునుం జంపిరి; నెత్తుటందడిసి దుమ్ముచేఁ గప్పబడియున్న రామునిశిరస్సునుగూడఁ దెచ్చియున్నారు. ౩౬

అంతఁ బరమదుర్ధర్షుఁడగు రాక్షసరాజుండు రావణుఁడు సీతాదేవి వినుచుండ సమీపంబుననున్న నొకరాక్షసినిజూచి యిట్లని చెప్పెను. ౩౭

యుద్ధరంగంబుననుండి రాముని శిర స్సిచ్చటికిఁ దెచ్చిన క్రూరకర్ముఁడగు రాక్షసుని విద్యుజ్జిహ్వుఁ దోడ్కొనిరమ్ము అని రావణుఁడు రాక్షసితోఁ జెప్పెను. ౩౮

అంత విద్యుజ్జిహ్వుఁడు ఆరామశిరస్సును ధనుస్సునుం దీసికొనివచ్చి సాష్టాంగముగ నమస్కరించి రావణుని యెదుట నిలుచుండెను. ౩౯

అంత రాక్షసరాజుండగు రావణుఁడు పెద్దనాలుకగల దనసమీపంబుననున్న విద్యుజ్జిహ్వుంజూచి యిట్లని చెప్పెను. ౪౦

అగ్రతః కురు సీతాయా శ్శీఘ్రం దాశరథేశ్శిరః,
అవస్థాం పశ్చిమాం భర్తుః కృపణా సాధు పశ్యతు. ౪౧

ఏవ ముక్తం తు తద్రక్ష శ్శిర స్తత్ప్రియదర్శనమ్,
ఉపనిక్షిప్య సీతాయాః క్షిప్రమన్తరధీయత. ౪౨

రావణ శ్చాపి చిక్షేప భాస్వరం కార్ముకం మహత్,
త్రిషు లోకేషు విఖ్యాతం సీతామిదమువాచ హ. ౪౩

ఇదం తు తవ రామస్య కార్ముకం జ్యాసమాయుతమ్,
ఇహ ప్రహస్తేనానీతం హత్వా తం నిశి మానుషమ్. ౪౪

స విద్యుజ్జిహ్వేన సహైవ తచ్ఛిరో
ధనుశ్చ భూమౌ వినికీర్య రావణః,
విదేహరాజస్య సుతాం యశస్వినీం
తతోఽబ్రవీ త్తాం భవ మే వశానుగా. ౪౫

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే ఏకత్రింశస్సర్గః. ౩౧

---

ద్వాత్రింశస్సర్గః.

సా సీతా తచ్ఛిరో దృష్ట్వా తచ్చ కార్ముక ముత్తమమ్,
సుగ్రీవప్రీతిసంసర్గ మాఖ్యాతం చ హనూమతా. ౧
నయనే ముఖవర్ణం చ భర్తు స్తత్సదృశం ముఖమ్,
కేశా న్కేశాన్త దేశం చ తం చ చూడామణిం శుభమ్. ౨
ఏతై స్సర్వై రభిజ్ఞానై రభిజ్ఞాయ సుదుఃఖితా,

శీఘ్రింబున నారామశిరస్సును సీతముందఱ నుంచుము; ఈదరిద్రురాలు తనపెనిమిటికిఁ గడపట నెట్టియవస్థ వచ్చినదో చక్కఁగాఁ జూచుఁగాక. అని రావణుఁడు విద్యుజ్జిహ్వునితోఁ జెప్పెను. ౪౧

ఆవిద్యుజ్జిహ్వుఁడు రావణునిమాటనువిని చూపరులకుఁ బ్రియంబు గల్గించునట్టి యారామశిరంబును సీతాదేవిముందఱనుంచి శీఘ్రింబున నావలికిం బోయెను. ౪౨

అంత రావణుఁడు ముల్లోకంబులం బ్రసిద్ధంబును దేజోవంతంబునగు నామహాధనుస్సును విద్యుజ్జిహ్వునిచేతనుండి తీసికొని సీతాదేవింజూచి యిట్లని చెప్పెను. ౪౩

మఱియుఁ బ్రహస్తుఁడు రాత్రికాలంబున మనుష్యుఁడగు నీరాముని వధించి యల్లెత్రాటితోఁగూడిన యతనిధనుస్సునుగూడ నిచ్చుటకిఁ దెచ్చినాఁడు; ఇదిగో చూడుము. అని రావణుఁడు సీతాదేవితోఁ జెప్పెను. ౪౪

ఆరావణుఁడు విద్యుజ్జిహ్వుఁడునుందానును ఆరామునిశిరస్సును ధనుస్సును నేలఁబడవైచి యశస్వినియగు సీతాదేవింజూచి "ఇంక నీవు నా యధీనురాలవగు" మని చెప్పెను. ౪౫

ఇది ముప్పదియొకటవసర్గము.

## ముప్పదిరెండవసర్గము.

అంత నాసీతాదేవి ఆశిరస్సును ఉత్తమంబగు నాధనుస్సునుంజూచి హనుమంతుఁడుచెప్పిన రామసుగ్రీవుల సఖ్యంబునుఁ దలఁచుకొని ఆకండ్లను ఆముఖవర్ణంబును ఆవెండ్రుకలను ఆనెత్తిని ఆచూడామణింజూచి యాగుఱుతులచే నది రామునితలవలెనే యున్నదని తెలిసికొని పరమదుఃఖితయాయి లేడియుంబోలె నుచ్చైస్స్వరంబున రోదనంబుసేయుచుఁ గైకేయినినిందించెను

విజగర్హే చ కైకేయీం క్రోశన్తీ కురరీ యథా. 3
సకామా భవ కైకేయి! హతోఽయం కులనన్దనః,
కులముత్సాదితం సర్వం త్వయా కలహశీలయా. ४

ఆర్యేణ కిం తే కైకేయి! కృతం రామేణ విప్రియమ్,
యన్మయా చీరవసన స్త్వయా ప్రస్థాపితో వనమ్. ౫

ఏవముక్త్వాతు వైదేహీ వేపమానా తపస్వినీ,
జగామ జగతీం బాలా ఛిన్నా తు కదలీ యథా. ౬
సా ముహూర్తా త్సమాశ్వాస్య ప్రతిలభ్యచ చేతనామ్,
తచ్ఛిరస్సముపాఘ్రాయ విలలాపాయతేక్షణా. ౭
హా హతాఽస్మి మహాబాహో! వీరవ్రత మనువ్రతా,
ఇమాం తే పశ్చిమావస్థాం గతాఽస్మి విధవా కృతా. ౮
ప్రథమం మరణం నార్యా భర్తు ర్వైగుణ్య ముచ్యతే,
సువృత్త! సాధువృత్తాయా స్సంవృత్త స్త్వం మ మాగ్రతః. ౯

దుఃఖాద్దుఃఖం ప్రపన్నాయా మగ్నాయా శ్శోకసాగరే,
యో హి మా ముద్యత స్త్రాతుం సోఽపి త్వం వినిపాతితః. ౧౦
సా శ్వశ్రూ ర్మమ కౌసల్యా త్వయా పుత్త్రేణ రాఘవ!,
వత్సేనేవ యథా ధేను ర్వివత్సా వత్సలాకృతా. ౧౧

ఆదిష్టం దీర్ఘ మాయు స్తే యై రచిన్త్యపరాక్రమ!,
అనృతం వచనం తేషా మల్పాయు రసి రాఘవ!. ౧౨

అథవా నశ్యతి ప్రజ్ఞా ప్రాజ్ఞ స్యాపి సత స్తవ,

కైకేయీ! నీకోర్కె యీడేఱినది; కులనందనుఁడగు రాముఁడు హతుఁడయ్యె; కలహకారిణివగు నీవు రఘువంశమునంతయుం నాశము నొందించితివి; ఇంక భరతాదులు నవశ్యము మృతులగుదురు. ౪

కైకేయీ! నీవు రాముని నారచీరలు కట్టుకొన నొసఁగి నాతోఁగూడ నడవికిఁ బంపితివే; సర్వలోకప్రియకారియగు రాముఁడు నీకట్టియపకారము నేమి గావించెను? అని సీతాదేవి విలపించెను. ౫

శోచనీయయుం బాలయునగు సీతాదేవి యిట్లు విలపించి దుఃఖభయంబులవలన గడగడవడంకుచు ఛేదింపఁబడిన యరటిచెట్టువలె నేలంబడెను. ౬

విశాలంబులగు కండ్లుగల యాసీతాదేవి యంతఁగొంతవడికిఁ దేఱి సంజ్ఞంబొంది యారామశిరస్సును మూర్కొని యిట్లని విలపించెను. ౭

అయ్యో! మహాబాహుఁడా! వీరవ్రతము నవలంబించియున్నవాఁడా! హతనైతిని; నీమరణావస్థంజూడ బ్రతికియుంటినే; విధవనైతిని. ౮

సదాచారసంపన్నుఁడవగు రాముఁడా! స్త్రీదోషంబున భర్త ముందు మరణంబునొందునని చెప్పఁబడియున్నది; అట్లుగూడ లేదే; సదాచారసంపన్నవగు నాముందట నీవు మృతిఁబొందితివే; దీని కేమి కారణము? ౯

నేను దుఃఖమునొంది దుఃఖసముద్రంబున మునిఁగియుండఁగా నిట్టి సమయంబున నన్నుఁ గాపాడవచ్చినట్టి నీవు గూడ హతుఁడవైతివే! ౧౦

రాముఁడా! నాయత్త కౌసల్య, దూడయం దతిప్రేమగల యావు దూడ మృతిఁబొందుటవలన మహాదుఃఖంబునొందునట్లు పుత్రుఁడవు నీవు మృతిఁబొందుటవలనఁ బరమదుఃఖంబు నొందునట్లు గావింపఁబడినది. ౧౧

అపరిమేయంబగు పరాక్రమముగల రాముఁడా! మున్ను నీవు బహుకాలము జీవింతువని చెప్పిన జ్యోతిషికులమాట యిప్పు డసత్యమయినది; నీవల్పాయుష్కుఁడవయితివి. ౧౨

అటుగాదేని కాలము నీకు విరుద్ధముగా నుండుటంజేసి అదియే జ్యోతి

పచత్యేనం యథా కాలో భూతానాం ప్రభవోఽవ్యయమ్.

అదృష్టం మృత్యు మాపన్నః కస్మా త్త్వం నయశాస్త్రవిత్,
వ్యసనానాముపాయజ్ఞః కుశలో హ్యసి వర్జనే. ౧౪

తథా త్వం సంపరిష్వజ్య రౌద్రయాఽతినృశంసయా,
కాళరాత్ర్యా మమాచ్ఛిద్య హృతః కమలలోచన!. ౧౫

ఉపశేషే మహాబాహో! మాం విహాయ తపస్వినీమ్,
ప్రియా మివ సమాశ్లిష్య పృథివీం పురుషర్షభ. ౧౬

అర్చితం సతతం యత్త ద్గన్ధమాల్యై ర్మయా తవ,
ఇదం తే మత్ప్రియం వీర! ధనుః కాఞ్చనభూషణమ్. ౧౭

పిత్రా దశరథేన త్వం శ్వశురేణ మమానఘ!,
సర్వై శ్చ పితృభిస్సార్ధం నూనం స్వర్గే సమాగతః. ౧౮

దివి నక్షత్రభూత స్త్వం మహత్కర్మకృతాం ప్రియమ్,
పుణ్యం రాజర్షివంశం త్వ మాత్మనస్సముపేక్షసే. ౧౯

కిం మాం న ప్రేక్షసే రాజన్! కిం మాం న ప్రతిభాషసే,
బాలాం బాల్యేన సంప్రాప్తాం భార్యాం మాం సహచారిణీమ్.

శ్శాస్త్రమునందుఁ బండితులయినవారును నీవిషయమయి బుద్ధిభ్రంశము నొందు నట్లు గావించియుండును. కాలము సమస్తభూతంబులకును గారణంబుగదా! అదియేమిచేసినను జేయవచ్చును. ౧౩

నీవు సమస్తోపాయంబులు దెలిసినవాఁడవు! నీతిశాస్త్రజ్ఞుఁడవు; ఎట్టి యుపాయంబులనేని తొలఁగించుకొన సమర్థుఁడవే; ఈవిధంబున నేమఱుపాటున నెట్లు హతుఁడవైతివి? ౧౪

తామరపూలవంటికన్నులుగల రాముఁడా! నేను విధవనుగావలసినదానను గావున నానిమిత్తమయి భయంకరాకారయు నతిక్రూరయునగు కాళరాత్రి నిన్ను హరించియుండును. ౧౫

మహాబాహుఁడవు పురుషశ్రేష్ఠుఁడవు నగులాముఁడా! దిక్కులేనిదానను నన్నువిడిచి భూమినిం బ్రియురాలం బోలె గవుఁగిలించుకొని పరుండి యున్నావు. ౧౬

పరాక్రమశాలివగురాముఁడా! నీచేతను నాచేతనుంగూడ గంధమాల్యంబుల భక్తిమెయిం బూజింపఁబడుచుండిన నాకుఁ బ్రియంబును గాంచనాలంకృతంబునగు ధనుస్సు ఇప్పుడిట్లయినదే! ౧౭

పాపరహితుఁడవగు రాముఁడా! నీవు స్వర్గంబున నామామయు నీ తండ్రియునగు దశరథమహారాజుతోను ఇంకను నీతాతలు మొదలగు నందఱిపితరులతోనుం జేరియున్నావు. ఇది నిశ్చయము. ౧౮

నీవు స్వర్గంబున విమానగతుఁడవై ఇంతకుమున్నే స్వర్గమునొందినవారలును గొప్పకార్యములు సేయువారికిఁ బ్రియులునగు నీవంశంబునఁ బుట్టిన యిక్ష్వాకువు మున్నగుపుణ్యపురుషులం జూచుచుందువు. ౧౯

రాముఁడా! చిన్నదానను జిన్నతనంబుననుండియే నీయొద్దకువచ్చిన దానను భార్యను నిన్ను విడువక నీతోఁగూడ నున్నదానను; అట్టి నేను ఇట్లు వెనువగలం బొందియుండఁగా నన్నేల కన్నెత్తిచూడవు? నాతో నేలమాటలాడవు? ౨౦

సంశ్రుతం గృహ్ణతా పాణిం చరిష్యామీతి యత్త్వయా,
స్మర తన్మమ కాకుత్స్థ! నయ మామపి దుఃఖితామ్. ౨౧

కస్మాన్మా మపహాయ త్వం గతో గతిమతాం వర!,
అస్మాల్లోకా దముం లోకం త్యక్త్వా మామపి దుఃఖితామ్.

కల్యాణై రుచితం యత్తత్పరిష్వక్తం మ యైవ తు,
క్రవ్యాదై స్తచ్ఛరీరం తే నూనం విపరికృష్యతే. ౨౩

అగ్నిష్టోమాదిభిర్యజ్ఞై రిష్టవానాప్తదక్షిణైః,
అగ్నిహోత్రేణ సంస్కారం కేన త్వం తు న లప్స్యసే. ౨౪

ప్రవ్రజ్యా ముపపన్నానాం త్రయాణా మేకమాగతమ్,
పరిప్రక్ష్యతి కౌసల్యా లక్ష్మణం శోకలాలసా. ౨౫

స తస్యాః పరిపృచ్ఛన్త్యా వధం మిత్రబలస్య తే,
తవ చాఖ్యాస్యతే నూనం నిశాయాం రాక్షసై ర్వధమ్. ౨౬
సా త్వాం సుప్తం హతం శ్రుత్వా మాం చ రక్షోగృహం గతామ్,
హృదయేన విదీర్ణేన న భవిష్యతి రాఘవ!. ౨౭

మమ హేతో రనార్యాయా హ్యనర్హః పార్థివాత్మజః,
రామస్సాగర ముత్తీర్య సత్త్వవాన్ గోష్పదే హతః. ౨౮

అహం దాశరథేనోఢా మోహా త్స్వకులపాంసనీ,
ఆర్యపుత్రస్య రామస్య భార్యా మృత్యు రజాయత. ౨౯

రాముఁడా! నీవు వివాహంబున నాహస్తంబు గ్రహించునపుడు నాతోఁగూడ నుండెదనని ప్రతిజ్ఞ చేసితివే; దాని నిప్పుడు జ్ఞప్తికిఁ దెచ్చుకొనుము; దుఃఖితనగు నన్నును దీసికొనిపొమ్ము. ౨౧

ఉత్తమగతిగలవారలలో నుత్తముఁడవగు రాముఁడా! నిన్ను విడిచి యుండుటచేఁ బరమదుఃఖితనై యున్న పరమప్రియనగు నన్నును ఎటు విడిచి యీలోకంబుననుండి పరలోకంబునకుఁ బోతివి. ౨౨

నేను మున్ను మంగళద్రవ్యంబులగు చందనాదులతో నలంకరించి యే శరీరమును గవుఁగిలించుకొనుచుంటినో అట్టి నీశరీరమిప్పుడు నక్కలు మొదలగు వానిచే నాకర్షింపఁబడుచున్నది. ౨౩

పూర్ణదక్షిణలతో నగ్నిష్టోమాదియాగంబులు గావించి యాగీయంబగు నగ్నిహోత్రంబుచే సంస్కారంబు నొందఁ దగిన నీవు ఇట్లు ఏయాగంబును జేయకమున్నే వ్యర్థముగా మృతినొందుట కేమి కారణము? ౨౪

ప్రవాసమునొందిన మువ్వురిలోను లక్ష్మణుఁ డొక్కఁడే వచ్చుటం జూచి కౌసల్యాదేవి పరమదుఃఖితయయి లక్ష్మణుని "సీతారాము లెక్కడ?" అని యడుగఁగలదు. ౨౫

ఆలక్ష్మణుఁడు అట్లడుగుచున్న కౌసల్యాదేవికి రాత్రికాలంబున రాక్షసులువచ్చి నిన్నును నీమిత్రసైన్యంబును వధించిపోయిరని చెప్పఁగలఁడు. ౨౬

రాముఁడా! ఆకౌసల్యాదేవి నీవు నిదురించియుండునప్పుడు హతుఁడవగుటను నేను రాక్షసగృహంబునం జిక్కియుండుటను విని హృదయంబు పగిలి మృతిఁబొందును. ఎంతమాత్రము జీవింపఁజాలదు. ౨౭

దుష్టురాలనగు నానిమిత్తమయి యిట్టిదుష్టవధంబునకుఁ దగనివాఁడును మహాబలశాలియు రాజపుత్రుఁడునగు రాముఁడు ఖరాదిభయంకరరాక్షసుల నందఱంజంపి అల్పుఁడును దుర్బలుఁడునగు ప్రహస్తునిచేఁ జచ్చినాఁడు. ౨౮

రాముఁడు తనకులమునకు నాశంబుగల్గించుదానననని యెఱుంగక యజ్ఞానంబున నన్ను వివాహమాడెను. అట్లు రామునకు భార్యయె మృత్యు వయ్యెను. ౨౯

నూనమన్యాం మయా జాతిం వారితం దానముత్తమమ్,
యాఽహా మద్యేహ శోచామి భార్యా సర్వాతిథేరపి. ౩౦

సాధు పాతయ మాం క్షిప్రం రామస్యోపరి రావణ!,
సమానయ పతిం పత్న్యా కురు కల్యాణముత్తమమ్. ౩౧
శిరసా మే శిరశ్చాస్య కాయం కాయేన యోజయ.
రావణానుగమిష్యామి గతిం భర్తుర్మహాత్మనః. ౩౨

ఇతి సా దుఃఖసన్తప్తా విలలాపాయతేక్షణా,
భర్తుశ్శిరో ధను స్తత్ర సమీక్ష్య చ పునఃపునః. ౩౩
ఏవం లాలప్యమానాయాం సీతాయాం తత్ర రాక్షసః,
అభిచక్రామ భర్తార మనీకస్థః కృతాఞ్జలిః. ౩౪
విజయస్వార్యపుత్త్రేతి సోఽభివాద్య ప్రసాద్య చ,
న్యవేదయదనుప్రాప్తం ప్రహస్తం వాహినీపతిమ్. ౩౫
అమాత్యైస్సహితస్సర్వైః ప్రహస్తస్సముపస్థితః,
తేన దర్శనకామేన వయం ప్రస్థాపితాః ప్రభో!. ౩౬
నూనమస్తి మహారాజ! రాజభావాత్క్షమాన్వితమ్,
కించిదాత్యయికం కార్యం తేషాం త్వం దర్శనం కురు. ౩౭

ఏతచ్ఛ్రుత్వా దశగ్రీవో రాక్షసప్రతివేదితమ్,
అశోకవనికాం త్యక్త్వా మన్త్రిణాం దర్శనం యయౌ, ౩౮
స తు సర్వం సమర్థ్యైవ మన్త్రిభిః కృత్యమాత్మనః,
సభాం ప్రవిశ్య విదధే విదిత్వా రామవిక్రమమ్. ౩౯

నేను బూర్వజన్మంబున నెవ్వరో కన్యాదానము సేయఁదలఁచి నప్పుడు దానికి విఘ్నము గావించియుందును; కావుననే ఇట్టి పరమధర్మాత్ముఁడగు రామునకు భార్యనయ్యు నీభోగకాలంబున నిట్లు రామవిరహంబునొంది దుఃఖించుచున్నాను. 30

రావణుఁడా! ఇంక శీఘ్రంబున నన్నును రామునిపైఁ బడవేయుము. ఇట్లు దంపతుల నొక్కటిగాఁ జేర్చి యుత్తమంబగు మంగళము గావింపుము.

రావణుఁడా! రాముని శిరస్సుతో నాశిరస్సును అతనిదేహముతో నాదేహమును జేర్పుము. మహాత్ముఁడగు పెనిమిటితో ననుగమనంబు గావించె దను. అని సీతాదేవి విలపించెను. 3౨

ఇట్లు విశాలంబగుకండ్లుగల యాసీతాదేవి పెనిమిటిశిరస్సును ధను స్సునుంజూచి పరమదుఃఖితయయి విలపించినది. 33

అప్పుడు సీతాదేవి యిట్లు విలపించుచుండఁగా ద్వారపాలకుఁడగు రాక్షసుండు చేమోడ్పుగీలించి రావణునొద్దకు వచ్చెను. 3౪

అంత నారాక్షసుఁడు "జయజయ" యని నమస్కరించి సవినయం బుగా సేనానాయకుఁడగు ప్రహస్తుఁడు వచ్చియున్నాఁడని చెప్పెను. 3౫

రాక్షసరాజుండవగు రావణుఁడా! ప్రహస్తుఁడు మంత్రులనందఱఁగూడి వచ్చియున్నాఁడు; అతఁడు మీదర్శనంబుఁగోరి నన్నుఁ బంపినాఁడు. 3౬

మహారాజుండవగు రావణుఁడా! గొప్పకార్య మొకటియున్నది. అది యప్పుడే చేయఁతగినదైనను మీయాజ్ఞకొఱకుఁ గనిపెట్టియున్నారు; నీవు వారలకు దర్శనం బొసంగుము. అని యారాక్షసుఁడు రావణునకుం జెప్పెను.

రావణుఁడు ఆ రాక్షసుఁడు చెప్పినమాటనువిని యశోకవనంబును విడిచి మంత్రులం జూడఁబోయెను. 3౮

ఆ రావణుఁడు రామపరాక్రమంబుఁ దెలిసికొని సభం బ్రవేశించి మంత్రులతోఁ జక్కఁగా నాలోచించి నిశ్చయించి కార్యమునంతయుఁ గావించెను. 3౯

అన్తర్ధానం తు తచ్ఛీర్షం తచ్చ కార్ముక ముత్తమమ్,
జగామ రావణ స్త్వైవ నిర్యాణసమన న్తరమ్. ౪౦
రాక్షసేన్ద్రి స్తు తై స్సార్ధం మన్త్రిభి ర్భీమవిక్రమైః,
సమర్థయామాస తదా రామకార్యవినిశ్చయమ్. ౪౧

అవిదూరస్థితాన్ సర్వా న్బలాధ్యక్షా న్హితైషిణః.
అబ్రవీత్కాలసదృశో రావణో రాక్షసాధిపః. ౪౨
శీఘ్రం భేరీనినాదేన స్ఫుటకోణాహతేన మే,
సమానయధ్వం సైన్యాని వక్తవ్యం చ న కారణమ్. ౪౩

తత స్తథేతి ప్రతిగృహ్య తద్వచో
బలాధిపా స్తే మహ దాత్మనో బలమ్,
సమానయం శ్చైవ సమాగమం చ తే
న్యవేదయ న్భర్తరి యుద్ధకాఙ్క్షిణి. ౪౪

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే ద్వాత్రింశస్సర్గః. ౩౨

## త్ర య స్త్రిం శ స్స ర్గః.

సీతాం తు మోహితాం దృష్ట్వా సరమా నామ రాక్షసీ,
ఆససాదాథ వైదేహీం ప్రియాం ప్రణయినీం సఖీమ్. ౧

మోహితాం రాక్షసేన్ద్రేణ సీతాం పరమదుఃఖితామ్,
ఆశ్వాసయామాస తదా సరమా మృదుభాషిణీ. ౨
సా హి తత్ర కృతామిత్రం సీతయా రక్ష్యమాణయా,
రక్షన్తీ రావణాదిష్టా సానుక్రోశా దృఢవ్రతా. ౩

రావణుఁడు పోయినంతనే ఆరామునితలయును ఆధనుస్సును అంతర్ధా నంబు నొందినవి. ౪౦

అప్పుడు రాక్షసేశ్వరుఁడగు రావణుఁడు భీయంకరపరాక్రములగు మంత్రులతోఁగూడ నాలోచించి రామునింగుఱించి చేయవలసినకార్యమును నిశ్చయించెను. ౪౧

మృత్యుసమానుఁడును రాక్షసేశ్వరుఁడు నగు రావణుఁడు తన సమీపంబున నున్న తనమేలుగోరునట్టి సేనాధ్యక్షులంజూచి యిట్లని చెప్పెను. ౪౨

దృఢమయిన దండముచే భేరివాయించి నాసైన్యముల నన్నింటిని రావింపుఁడు; కారణ మేమియుఁ జెప్పవలదు. అని రావణుఁడు సేనాధ్యక్షులతోఁ జెప్పెను. ౪౩

అంత నాసేనానాయకులు అట్లేయని రావణునిమాట కియ్యకొని తమ వశంబుననుండిన మహాసైన్యంబుల రావించిరి; అట్టు సైన్యంబు లన్నియు సన్నద్ధములయివచ్చి యుండుటను యుద్ధకాముఁడగు రావణునకుం జెప్పిరి. ౪౪

ఇది ముప్పదిరెండవసర్గము.

---

## ముప్పదిమూఁడవసర్గము.

అంత విభీషణభార్యయగు సరమయనురాక్షసి సీతాదేవి మోహిత యగుటంజూచి తనప్రియంరాలును స్నేహితయును చెలికత్తెయునగు సీతాదేవి యొద్దకుఁ బోయెను. ౧

పరమ రాక్షసేశ్వరుఁడగు రావణునిచే మోహపుచ్చఁబడి పరమదుఃఖిత యయియున్న సీతాదేవిని మెత్తనిమాటల నిట్లని యూఱడించెను. ౨

'అసరమ దయఁగలదియుఁ దృఢవ్రతయుఁ గావున రావణాజ్ఞచే సీతా దేవిని రక్షించుచు నాసీతాదేవి గుణంబులవలన నాబిడయందు మిక్కిలియుం స్నేహము గలదయ్యెను. 3

సా దదర్శ తత స్సీతాం సరమా నష్టచేతనామ్,
ఉపావృత్యోత్థితాం ధ్వస్తాం బడబా మివ పాంసులామ్. ౪
తాం సమాశ్వాసయామాస సఖీ స్నేహేన సువ్రతా,

సమాశ్వసిహి వైదేహి! మాభూ త్తే మనసో వ్యథా. ౫

ఉక్తా యద్రావణేన త్వం ప్రత్యుక్తశ్చ స్వయం త్వయా,
సఖీస్నేహేన తద్భీరు! మయా సర్వం ప్రతిశ్రుతమ్. ౬
లీనయా గహనే శూన్యే భయ ముత్సృజ్య రావణాత్,
తవ హేతో ర్విశాలాక్షి! న హి మే జీవితం ప్రియమ్. ౭

స సంభ్రాన్త శ్చ నిష్క్రాన్తో యత్కృతే రాక్షసాధిపః,
తచ్చ మే విదితం సర్వ మభినిష్క్రమ్య మైథిలి!. ౮
న శక్యం సౌప్తికం కర్తుం రామస్య విదితాత్మనః,
వధశ్చ పురుషవ్యాఘ్రే తస్మి న్నైవోపపద్యతే. ౯

న త్వేవ వానరా హన్తుం శక్యాః పాదపయోధినః,
సురా దేవర్షభేణేవ రామేణ హి సురక్షితాః. ౧౦

దీర్ఘవృత్తభుజశ్శ్రీమాన్మహోరస్కః ప్రతాపవాన్,
ధన్వీ సంహననోపేతో ధర్మాత్మా భువి విశ్రుతః. ౧౧
విక్రాన్తో రక్షితా నిత్య మాత్మనశ్చ పరస్యచ,
లక్ష్మణేన సహ భ్రాత్రా కుశలీ నయశాస్త్రవిత్. ౧౨
హన్తా పరబలౌఘానా మచిన్త్యబలపౌరుషః,

అంత నాసరమ శ్రమనివారణార్థమయి నేలంబోరలి దుమ్ముచేఁ గప్పఁబడియున్న యాఁడుగుఱ్ఱమువలె నున్నదియుఁ నష్టసంజ్ఞయునగు సీతంజూచె ను

మంచివ్రతములుగల యాసరమ సఖీస్నేహంబున నాసీతాదేవి నూఱడించెను.

సీతాదేవీ! ఊఱటనొందుము. మనంబునకు దుఃఖంబు దెచ్చుకొనవలదు. ౫

విశాలంబులగు కండ్లుగలదానవు భయపడు స్వభావముగల దానవునగు సీతాదేవీ! నీతో రావణుఁ డేమిచెప్పినాఁడో అందుకు బదులు రావణునితో నీవేమి చెప్పితివో అదంతయు నీపై స్నేహంబున రావణుభయంబునుంగూడ విడిచి నేనొకరహస్య ప్రదేశంబున డాఁగియుండివింటిని: నీ నిమిత్తమై నేను బ్రాణంబులనైనను సరకుసేయను. ౬, ౭

సీతాదేవీ! మఱియు నేనినిమిత్తమయి రాక్షసరాజుండగు నారావణుఁడు వేగిరపాటునంబోయెనో ఆకారణమునుఁగూడ నేనుదెలిసికొనివచ్చినాను.

రాముఁడు సమస్తంబుదెలిసినవాఁడు. అతని నిద్రాసమయంబున మోసముచేఁ జంప నలవికాదు. మఱియుఁ బురుషశ్రేష్ఠుండగు నతని వధించుటయే యసంభావితము. ౯

దేవేంద్రునిచేత దేవతలుంబోలె రామునిచేఁ జక్కఁగా రక్షింపఁబడుచున్నవారలును వృక్షంబులం బోరునట్టి మహాబలశాలులునగు వానరులం జంప నెంతమాత్రము శక్యముకాదు. ౧౦

సీతాదేవీ! దీర్ఘంబులును గుండ్రములునగు భుజములుగలవాఁడును, శ్రీమంతుఁడును, విశాలవక్షుఁడును, మహాపరాక్రమశాలియుం, ధనుర్ధరుఁడును, శోభనావయవసన్నివేశుఁడును, ధర్మాత్ముఁడును, గీర్తిమంతుఁడును, బరాక్రమవంతుఁడును, దమ్ముఁడగు లక్ష్మణునింగూడి సర్వకాల సర్వావస్థలయందును దన్ను రక్షించుకొని యితరులనుంగూడ రక్షించువాఁడును, క్షేమవంతుఁడును నీతిశాస్త్రంబుఁ జక్కఁగాఁదెలిసినవాఁడును, శత్రుసైన్యంబు లెంతయయినను

న హతో రాఘవ శ్శ్రీమాన్ సీతే! శత్రునిబర్హణః. ౧౩

అయుక్తబుద్ధికృత్యేన సర్వభూతవిరోధినా,
ఇయం ప్రయుక్తా రౌద్రేణ మాయా మాయావిదా త్వయి.౧౪

శోక స్తే విగత స్సర్వః కల్యాణం త్వా ముపస్థితమ్,
ధ్రువం త్వాం భజతే లక్ష్మీః ప్రియం ప్రీతికరం శృణు. ౧౫

ఉత్తీర్య సాగరం రామ స్సహ వానరసేనయా,
సన్నివిష్ట స్సముద్రస్య తీర మాసాద్య దక్షిణమ్. ౧౬
దృష్టో మే పరిపూర్ణార్థః కాకుత్స్థ స్సహలక్ష్మణః,
స హి తై స్సాగరాన్తస్థై ర్బలై స్తిష్ఠతి రక్షితః. ౧౭

అనేన ప్రేషితా యే చ రాక్షసా లఘువిక్రమాః,
రాఘవ స్తీర్ణ ఇత్యేవ ప్రవృత్తి స్తై రిహాహృతా. ౧౮
స తాం శ్రుత్వా విశాలాక్షి! ప్రవృత్తిం రాక్షసాధిపః,
ఏష మన్త్రయతే సర్వై స్సచివై స్సహ రావణః. ౧౯

ఇతి బ్రువాణా సరమా రాక్షసీ సీతయా సహ,
సర్వోద్యోగేన సైన్యానాం శబ్దం శుశ్రావ భైరవమ్. ౨౦
దణ్డనిర్ఘాతవాదిన్యాః శ్రుత్వా భేర్యా మహాస్వనమ్,
ఉవాచ సరమా సీతా మిదం మధురభాషిణీ. ౨౧

సన్నాహజననీ హ్యేషా భైరవా భీరు! భేరికా,
భేరీనాదం చ గమ్భీరం శృణు తోయదనిస్వనమ్. ౨౨

పరశుసేయక వధించువాఁడును, అమేయంబులగు బలపౌరుషంబులు గలవాఁడును, శత్రుసంహర్తయు జయలక్ష్మీవిరాజమానుఁడునగు రాముఁడు హతుఁడు కాలేదు. అతని నెవ్వరును వధింపఁజాలరు. ౧౧, ౧౩

దుష్టబుద్ధియు సమస్తభూతవిరోధియు మాయలం బండితుఁడును క్షుద్రుఁడునగు రావణుఁడు నిన్ను భయపఱచుటకై యీమాయం గావించినాఁడు ౧౪

నీదుఃఖంబంతయుఁ బోయినది. మంగళము నిన్నుఁ బొందఁబోవుచున్నది. నీవింక లక్ష్మిం బొందఁగలవు. ఇది నిశ్చయము. సంతోషకరంబగు నాప్రియవార్త నాలకింపుము. ౧౫

రాముఁడు వానరసేనతోఁగూడ సముద్రంబుదాఁటివచ్చి సముద్రదక్షిణతీరంబున నున్నాఁడు. ౧౬

పూర్ణకాముఁడగు రాముని లక్ష్మణునితోఁగూడ నేను జూచినాను. అతఁడు సముద్రతీరంబున వానరసైన్యంబులచే సురక్షితుఁడై యున్నాఁడు.

ఈ రావణుఁడు పంపినశీఘ్రగాములగు నారాక్షసులును రాముఁడు సముద్రంబు దాఁటివచ్చినాఁడనియే యిచ్చటికి సమాచారము దెచ్చినారు.

విశాలంబులగు కన్నులుగల సీతాదేవీ! రాక్షసేశ్వరుఁడగు నీరావణుఁడు ఆసమాచారంబువినియే యిప్పుడు మంత్రులయందఱితోను నాలోచించుచున్నాఁడు. అని సరమ సీతతోఁ జెప్పెను. ౧౯

సరమ యీప్రకారంబునఁ జెప్పుచుండునప్పుడె సీతతోఁగూడ సైనికులు సేయుం బ్రయత్నంబునఁగలిగిన భయంకరధ్వనిని వినెను. ౨౦

అంత సరమ దండఘాతంబున మ్రోఁగుచున్న భేరీమహాధ్వనిని విని సీతాదేవింజూచి మధురవచనంబుల నిట్లని చెప్పెను. ౨౧

భయపడుస్వభావముగల సీతాదేవీ! భయంకరముగా భేరిని వాయించుట సైనికుల సన్నద్ధులఁ గావించుటకుఁగదా! అట్లు గంభీరంబుగా మేఘగర్జనంబువలె ధ్వనిగలుగునట్లు భేరివాయింపఁబడుచున్నది. వినుము. ౨౨

కల్ప్యన్తే మత్తమాతఙ్గా యుజ్యన్తే రథవాజినః,
హృష్యన్తే తురగారూఢాః ప్రాసహస్తా స్సహస్రశః. ౨౩

తత్ర తత్ర చ సన్నద్ధా స్సమ్పతన్తి పదాతయః,

ఆపూర్యన్తే రాజమార్గా స్సైన్యై రద్భుతదర్శనైః, ౨౪
వేగవద్భి ర్నదద్భిశ్చ తోయౌఘై రివ సాగరః,

శస్త్రాణాం చ ప్రసన్నానాం చర్మణాం వర్మణాం తథా. ౨౫
రథవాజిగజానాం చ భూషితానాం చ రక్షసామ్,
ప్రభాం విసృజతాం పశ్య నానావర్ణాం సముత్థితామ్. ౨౬
వనం నిర్దహతో ఘర్మే యథారూపం విభావసోః,
ఘణ్టానాం శృణు నిర్ఘోషం రథానాం శృణు నిస్వనమ్. ౨౭
హయానాం హేషమాణానాం శృణు తూర్యధ్వనిం యథా,
ఉద్యతాయుధహస్తానాం రాక్షసేన్ద్రానుయాయినామ్. ౨౮
సమ్భ్రమో రక్షసా మేష తుములో రోమహర్షణః,

శ్రీ స్త్వాం భజతి శోకఘ్నీ రక్షసాం భయ మాగతమ్. ౨౯

రామః కమలపత్రాక్షో దైత్యానామివ వాసవః,
వినిర్జిత్య జితక్రోధ స్త్వా మచిన్త్యపరాక్రమః. ౩౦
రావణం సమరే హత్వా భర్తా త్వాఽధిగమిష్యతి,

విక్రమిష్యతి రక్షస్సు భర్తా తే సహలక్ష్మణః. ౩౧
యథా శత్రుషు శత్రుఘ్నో విష్ణునా సహ వాసవః,

మదపుటేనుఁగుల నలంకరించుచున్నారు. రణంబులకు గుఱ్ఱంబులఁ గూర్చుచున్నారు. గుఱ్ఱపువారలు ప్రాసహస్తులయి వేనవేలుగా సంతోషంబున విజృంభించుచున్నారు. ౨౩

అచ్చటచ్చటఁ బదాతిసైన్యంబులును సన్నద్ధంబులయి గుంపులు చేరుచున్నవి చూడుము.

వేగవంతంబులును సింహనాదంబులు సేయుచున్నవియుఁ జూపరులకాశ్చర్యంబు గలిగించునవియునగు సైన్యంబులచే జలసమూహంబుల సముద్రంబువలె రాజమార్గంబులు నిండియున్నవి. ౨౪

నిర్మలంబులగు నాయుధంబులు డాలువాలుఁ గవచంబులు రథంబులు గుఱ్ఱంబులు నేనుఁగులు రాక్షసులభూషణంబులు ఇవి యొంతయుఁ గాంతితో మెఱుఁగుచున్నవి; వీనికాంతి నానావర్ణమయి యొండకాలంబున నడవిని దహించు కార్చిచ్చు కాంతియుఁబోలె నున్నది. ౨౫, ౨౬

ఏనుఁగులకుఁ గట్టిన ఘంటలు మ్రోఁగుచున్నవి; రథంబులు పోవుటచేఁ గలుగుశబ్దమును వినుము; వాద్యధ్వనివలెనున్న గుఱ్ఱములయఱపును వినుము.

రాక్షసరాజుఁడగు రావణునిభటులు వీరరాక్షసులు ఆయుధంబులఁ బైకెత్తి పట్టుకొని తుములంబుగను జూపరులకుఁ గగుర్పాటుగల్గునట్లును సన్నాహంబు గావించుచున్నారు చూడుము. ౨౭

ఇంక నీదుఃఖంబుపోయి నీకు జయలక్ష్మిగలుగును. రాక్షసులకు భయంబు వచ్చినది. ౨౮

తామరపూఱేకులంబోలె విశాలసుందరంబులగు కన్నులుగలవాఁడును జితక్రోధుఁడును అచింత్యపరాక్రముఁడునగు రాముఁడు దైత్యుల దేవేంద్రుడుంబోలె యుద్ధంబున రావణుంజంపి నిన్నుఁ బొందఁగలఁడు. సందేహము లేదు. ౩౦

దేవేంద్రుండు విష్ణుంగూడి శత్రువులయందుఁ బరాక్రమించునట్లు నీపెనిమిటి రాముఁడు లక్ష్మణుంగూడి రాక్షసులయందుఁ బరాక్రమింపఁ గలఁడు. ౩౧

ఆగతస్య హి రామస్య క్షిప్రమఙ్కగతాం సతీమ్. 32
అహం ద్రక్ష్యామి సిద్ధార్థాం త్వాం శత్రౌ వినిపాతితే;
అశ్రూణ్యానన్దజాని త్వం వర్తయిష్యసి శోభనే. 33
సమాగమ్య పరిష్వజ్య తస్యోరసి మహోరసః,

అచిరాన్మోక్ష్యతే సీతే! దేవి తే జఘనం గతామ్. 34
ధృతా మేతాం బహూన్ మాసాన్వేణీం రామో మహాబలః,

తస్య దృష్ట్వా ముఖం దేవి! పూర్ణచన్ద్రమి వోదితమ్. 35
మోక్ష్యసే శోకజం వారి నిర్మోకమివ పన్నగీ,
రావణం సమరే హత్వా న చిరా దేవి! మైథిలి!. 36
త్వయా సమగ్రః ప్రియయా సుఖార్హో లప్స్యతే సుఖమ్.

సమాగతా త్వం వీర్యేణ మోదిష్యసి మహాత్మనా 37
సువర్షేణ సమాయుక్తా యథా సస్యేన మేదినీ

గిరవరమభితోఽనువర్తమానో
హయఇవ మణ్డలమాశు యః కరోతి,
తమిహ శరణమభ్యుపైహి దేవం
దివసకరం ప్రభవో హ్యయం ప్రజానామ్. 38

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే త్రయస్త్రింశస్సర్గః. 33.

---

చతుస్త్రింశస్సర్గః

అథ తాం జాతసన్తాపాం తేన వాక్యేన మోహితామ్,
సరమాఽహ్లాదయామాస పృథివీం ద్యౌరివామ్భసా. 1

శత్రువు వధింపఁబడినవెనుక నీవు సిద్ధార్థురాలవై రామునియంకంబు నొందియున్న నిన్ను నే నింక శీఘ్రంబునఁ జూడఁగలను. 32

మంగళరూపిణివగు సీతాదేవీ! నీవింక శీఘ్రంబునే నీశోకఁజేసి నిన్నుఁ గవుఁగిలించుకొనియుండు విశాలవక్షుఁడగు రామునివక్షస్స్థలంబున నానంద బాష్పంబుల విడువఁగలవు. 33

సీతాదేవీ! మహాబలుఁడగు రాముఁడు పెక్కుమాసంబులనుండి నీవు ధరించియున్న నీవెనుక వ్రేలాడుచుండు నీతలజడను ఇంక శీఘ్రంబుననే విడిపించును. 34

సీతాదేవీ! ఉదితంబగు పూర్ణచంద్రుంబోలినట్టి యారామునిముఖంబుఁ జూచినంతనే నీవు సర్పము కుబుసనువిడుచునట్లు దుఃఖమును విడువఁగలవు.

సీతాదేవీ! సుఖార్హుఁడగు రాముఁడు ఇంక శీఘ్రంబుననే యుద్ధంబున రావణునివధించి సంపూర్ణమనోరథుఁడై ప్రియురాలవగు నిన్నుఁగూడి సుఖంబు నొందఁగలఁడు. 36

సస్యముతోఁగూడినభూమి మంచివర్షముచే నుల్లసిల్లునట్లు నీవు మహాత్ముఁడగు రామునింగూడి యతనిపరాక్రమంబుచే నెంతయు సంతోషింపఁ గలవు. 37

ఎవ్వఁడు పర్వతోత్తమమగు మేరుపర్వతముచుట్టును దిరుగుచు గుఱ్ఱముంబోలె మండలగతిం జేయుచున్నాఁడో అట్టి సూర్యు నిప్పుడు శీఘ్రముగా శరణుపొందుము. ఈదేవుఁడు సమస్తప్రజలకును గారణభూతుఁడు కావున సమస్తశుభంబుల నొసంగును. అని సరమ సీతాదేవితోఁ జెప్పెను. 38

ఇది ముప్పదిమూఁడవసర్గము.

## ముప్పదినాలుగవసర్గము.

అట్లు సంతాపంబునొందినదియు మోహితయునగు సీతాదేవిని సరమ మధురవచనంబులచే నాకాశము భూమిని జలంబుచేతఁ జల్లఁజేయునట్లు సంతోషపఱచెను.

తత స్తస్యా హితం సఖ్యా శ్చికీర్షన్తీ సఖీవచః,
ఉవాచ కాలే కాలజ్ఞా స్మితపూర్వాభిభాషిణీ. ౨

ఉత్సహేయ మహం గత్వా త్వద్వాక్య మసితేక్షణే!,
నివేద్య కుశలం రామే ప్రతిచ్ఛన్నా నివర్తితుమ్. ౩

న హి మే క్రమమాణాయా నిరాలమ్బే విహాయసి,
సమర్థో గతిమన్వేతుం పవనో గరుడోఽపివా. ౪

ఏవం బ్రువాణాం తాం సీతా సరమాం పున రబ్రవీత్,
మధురం శ్లక్ష్ణయా వాచా పూర్వం శోకాభిపన్నయా. ౫

సమర్థా గగనం గన్తు మపి వా త్వం రసాతలమ్,
అవగచ్ఛామ్యకర్తవ్యం కర్తవ్యం తే మదన్తరే. ౬

మత్ప్రియం యది కర్తవ్యం యది బుద్ధిః స్థిరా తవ,
జ్ఞాతుమిచ్ఛామి తం గత్వా కింకరోతీతి రావణః. ౭
స హి మాయాబలః క్రూరో రావణ శ్శత్రురావణః,
మాం మోహయతి దుష్టాత్మా పీతమాత్రేవ వారుణీ. ౮

తర్జాపయతి మాం నిత్యం భర్త్సాపయతి చాసకృత్,
రాక్షసీభి స్సుఘోరాభి ర్యా మాం రక్షన్తి నిత్యశః. ౯

అంత నేకాలంబున నేదిచేయవలయునో అదంతయుఁ జక్కఁగాఁ దెలిసినదగు నా సరమ సీతాదేవికి మిక్కిలియు సంతోషము గల్గునట్లుచేసి తనస్నేహంబుఁ జూపంగోరి చిఱునగవు మొగంబునఁ దోఁప సీతాదేవితో నిట్లని చెప్పెను. ౨

నల్లనికండ్లుగల సీతాదేవీ! నేను ఎవ్వరికిని దెలియకుండునట్లు రాముని యొద్దకుఁబోయి నీవు క్షేమంబుఁ జెప్పుమన్నావని రామునకుం జెప్పి రావలె నని కోరెదను. ౩

నిరాధారంబగు నాకాశంబునందు నేను బోవుచుండఁగా నాలో సరిగా నడచుటకు వాయుగరుత్మంతులేనియు సమర్థులుకారు. అని సరమ సీతతోఁ జెప్పెను. ౪

సీతాదేవి ఇట్లు చెప్పుచున్న యాసరమంజూచి మున్ను దుఃఖంబునఁ దొట్రుపడుచుండి యిప్పుడు మనోహరంబయి యొప్పుచు నున్నవనంబున నిట్లని చెప్పెను. ౫

నీవు ఆకాశంబునకుఁగాని పాతాళంబునకుంగాని పోఁగలవు. సందియము లేదు. నావిషయమయి మఱి యెవ్వరికినిఁ జేయ నలవిగాని దానినింగూడ నీవు చేయఁగలవని నాకుఁ దెలియును. ౬

నీకు నాకోర్కె నెఱవేర్పవలెనని తలంపు స్థిరముగాఁగలదేని నీవు రావణునియొద్దకుఁబోయి యతఁ డేమిసేయుచున్నాఁడో తెలిసికొనిరమ్ము. ౭

మాయాబలంబుగలవాఁడును నిర్దయుఁడును శత్రువుల నేడ్పించువాఁడును దుష్టాత్ముఁడునగు నారావణుఁడు త్రాఁగఁబడిన మద్యంబువలె నాకు మాటి మాటికి మోహంబు గల్గించుచున్నాఁడు. ౮

ఆరావణుఁడు నాకుఁ గావలియుండు రాక్షసస్త్రీలు నన్ను భయంక రంబులగు నానావిధచేష్టలచేతను మాటలచేతను భయపఱచునట్లు చేయుం చున్నాఁడు. ౯

ఉద్విగ్నా శఙ్కితా చాస్మి న స్వస్థం చ మనో మమ,
తద్భయా చ్చాహ ముద్విగ్నా అశోకవనికాం గతా. ౧౦

యది నామ కథా తస్య నిశ్చితం వాఽపి యద్భవేత్,
నివేదయేథా స్సర్వం తత్పరో మే స్యాదనుగ్రహః. ౧౧

సా త్వేవం బ్రువతీం సీతాం సరమా వల్గుభాషిణీ,
ఉవాచ వదనం తస్యా స్స్పృశ స్తీ బాష్పవిక్లబమ్. ౧౨
ఏష తే యద్యభిప్రాయ స్తదా గచ్ఛామి జానకీ!,
గృహ్య శత్రో రభిప్రాయ ముపావృత్తాం చ పశ్యమామ్. ౧౩

ఏవ ముక్త్వా తతో గత్వా సమీపం తస్య రక్షసః.
శుశ్రావ కథితం తస్య రావణస్య సమన్త్రిణః. ౧౪

సా శ్రుత్వా నిశ్చయం తస్య నిశ్చయజ్ఞా దురాత్మనః,
పునరేవా గమత్క్షిప్ర మశోకవనికాం తదా. ౧౫

సా ప్రవిష్టా పున స్తత్ర దదర్శ జనకాత్మజామ్,
ప్రతీక్షమాణాం స్వామేవ భ్రష్టపద్మా మివ శ్రియమ్. ౧౬

తాం తు సీతా పునః ప్రాప్తాం సరమాం వల్గుభాషిణీమ్,
పరిష్వజ్య చ సుస్నిగ్ధం దదౌ చ స్వయమాసనమ్. ౧౭

ఇహాసీనా సుఖం సర్వ మాఖ్యాహి మమ తత్త్వతః,
క్రూరస్య నిశ్చయం తస్య రావణస్య దురాత్మనః. ౧౮

నేను మిక్కిలియుఁ భయంబునొంది ప్రాణసంశయమునుం బొంది యున్నాను. శాసనస్సనను నెమ్మదిలేదు. ఈయశోకవనంబున నారావణుని వలననె పరమభీతయయి యున్నాను. ౧౦

ఆరావణుఁ డేమిసేయ నిశ్చయించునో ఆవృత్తాంత మంతయుం నాకు వచ్చి చెప్పుదువేని నీయందు నాకు మిక్కిలియుఁ గృతజ్ఞతగలుగును. అని సీతాదేవి సరమతోఁ జెప్పెను. ౧౧

మధురభాషిణియగు నాసరమ ఇట్లు చెప్పుచున్న సీతాదేవింజూచి కన్నీళ్లు కాఱుచున్న యాబిడ మొగమును దడవుచు నిట్లని చెప్పెను. ౧౨

సీతాదేవీ! ఇది నీయభిప్రాయమగునేని నే నిప్పుడేపోయెదను; శత్రువుని యభిప్రాయంబు దెలిసికొని శీఘ్రంబున వచ్చెదం జూడుము. అని సరమ సీతాదేవితోఁ జెప్పెను. ౧౩

ఆసరమ సీతాదేవితో నాప్రకారమునం జెప్పి యారావణు సమీపంబు నకుఁబోయి యతఁడును మంత్రులును మాటలాడుకొనిన మాటల నన్నిఁటిని వినెను. ౧౪

నిశ్చయంబు నెఱుఁగుటయందు సమర్థురాలగు నాసరమ దురాత్ముఁడగు నారావణుఁడు గావించుకొన్న నిశ్చయంబుఁ దెలిసికొని మరల శీఘ్రంబున నశోకవనంబునకు వచ్చెను. ౧౫

ఆసరమ యిట్లశోకవనంబుఁ బ్రవేశించి తనరాకకే యెదురుచూచుచున్నదియుఁ బద్మరూపమయిన యాసనమును విడిచిన మహాలక్ష్మివలెనున్నదియు నగు జనకమహారాజపుత్రి సీతాదేవిం జూచెను. ౧౬

సీతాదేవి, మధురభాషిణియగు నాసరమ వచ్చుటంజూచి పరమసంతోషంబునొంది సస్నేహంబుగా నాబిడఁ గవుఁగిలించుకొని తానె సాదరంబుగా నాసనం బొసఁగెను. ౧౭

నీ విచ్చట సుఖంబుగాఁ గూర్చుండి నిర్దయుఁడును దురాత్ముఁడునగు రావణుని నిశ్చయంబంతయు నాకు యథార్థంబుగాఁ జెప్పుము. అని సీతాదేవి సరమతోఁ జెప్పెను. ౧౮

ఏవముక్తాతు సరమా సీతయా వేపమానయా,
కథితం సర్వమాచష్టే రావణస్య సమన్త్రిణః. ౧౯
జనన్యా రాక్షసేన్ద్రో వై త్వన్మోక్షార్థం బృహద్వచః,
అవిద్ధేన చ వైదేహి మన్త్రివృద్ధేన బోధితః. ౨౦
దీయతామభిసత్కృత్య మనుజేన్ద్రాయ మైథిలీ,
నిదర్శనం తే పర్యాప్తం జనస్థానే యదద్భుతమ్. ౨౧

లఙ్ఘనం చ సముద్రస్య దర్శనం చ హనూమతః,
వధం చ రక్షసాం యుద్ధే కః కుర్యాన్మానుషో భువి. ౨౨

ఏవం స మన్త్రివృద్ధైశ్చావిద్ధేన బహుభాషితః,
న త్వాముత్సహతే మోక్తుమర్థమర్థపరో యథా. ౨౩
నోత్సహత్యమృతో మోక్తుం యుద్ధే త్వామితి మైథిలి!,
సామాత్యస్య నృశంసస్య నిశ్చయో హ్యేష వర్తతే. ౨౪
తదేషా నిశ్చితా బుద్ధిర్మృత్యులోభాదుపస్థితా,
భయాన్నశక్తస్త్వాం మోక్తుమనిరస్తస్తు సంయుగే. ౨౫
రాక్షసానాం చ సర్వేషామాత్మనశ్చ వధేన హి,
నిహత్య రావణం సఙ్ఖ్యే సర్వథా నిశితైశ్శరైః. ౨౬
ప్రతినేష్యతి రామస్త్వామయోధ్యామసితేక్షణే!,

ఏతస్మిన్నన్తరే శబ్దో భేరీశఙ్ఖసమాకులః. ౨౭
శ్రుతో వానరసైన్యానాం కమ్పయన్ ధరణీతలమ్,

సరమ యిట్లుభీయగు సీతాదేవి చెప్పినమాటను విని రావణుఁడును ఆతని మంత్రులును మాటలాడుకొనినమాటల నంతయుఁ జెప్పెను. ౧౯

సీతాదేవీ ! రావణుని తల్లికైకయుం అవిద్ధుఁడనువృద్ధమంత్రియుం నిన్ను విడుచుటకై రాక్షసేశ్వరుఁడగు రావణునికిఁ జాలదూరము బోధించినారు

నీవు రామునకు సత్కారపూర్వకముగ సీతాదేవి నొసంగుము. అట్లివ్వవేని నీకు నాశముగలుగుననుటకు జనస్థానమునందు రాముఁడు ఖరాదిసమస్త రాక్షసులం జంపుటయే నిదర్శనము. ౨౧

సముద్రంబు దాఁటుటయుం లంకకుఁ౦దు సీతాదేవినిఁజూచుటయుం యుద్ధంబున నొక్కఁడే పెక్కురాక్షసులం జంపుటయుం నీకార్యములను హనుమంతుఁడొక్కఁడు గావించినాఁడుగదా! భూమండలంబున మఱియేపురుషుఁడు చేయఁగలఁడు? అని తల్లియు నవిద్ధుఁడును రావణునకుఁ బోధించిరి. ౨౨

ఇట్లు తల్లియును మంత్రివృద్ధుఁడగు నవిద్ధుఁడును బెక్కుభంగుల బోధించినను ఆరావణుఁడు ధనలుబ్ధుఁడు ధనమును విడువనట్లు నిన్ను విడువనొల్లఁడయ్యె. ౨౩

సీతాదేవీ! యుద్ధంబున మృతిబొందినఁగాని రావణుఁడు నిన్ను విడువఁడు; అది రావణుఁడును అతనిమంత్రులును జేసికొన్న నిశ్చయము. ౨౪

ఆరావణున కీబుద్ధి మరణముగలుగుటకే కలిగినదిగాని వేఱుగాదు.

ఈరావణుఁడు తానును రాక్షసులందఱును మరణంబు నొందకమునుపు కేవలభయంబున నిన్ను విడువనొల్లకున్నాఁడు; ౨౫

నల్లనికండ్లుగల సీతాదేవీ! రాముఁడు తప్పక యుద్ధంబున తీక్ష్ణబాణంబుల రావణుం వధించి నిన్ను యోధ్యకుఁ దోడ్కొనిపోవును. అని సరమ సీతాదేవికిఁ జెప్పెను. ౨౬

ఇట్లు సరమ సీతాదేవితోఁ చెప్పుచుండఁగానే భేరీశంఖధ్వని సమన్వితంబగు వానరసైన్యంబుల సింహనాదము భూమిం జలనంబునొందించుచు నతిభీకరంబయి వినఁబడినది. ౨౭

శ్రుత్వా తు తద్వానరసైన్యశబ్దం
లఙ్కాగతా రాక్షసరాజభృత్యాః,
నష్టౌజసో దైన్యపరీతచేష్టాః
శ్రేయో న పశ్యన్తి నృపస్య దోషైః. ౨౮

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే చతుస్త్రింశస్సర్గః. ౩౪.

---

## పఞ్చత్రింశస్సర్గః.

తేన శఙ్ఖవిమిశ్రేణ భేరీశబ్దేన రాఘవః,
ఉపయాతి మహాబాహూ రామః పరపురఞ్జయః. ౧
తం నినాదం నిశమ్యాథ రావణో రాక్షసేశ్వరః,
ముహూర్తం ధ్యానమాస్థాయ సచివానభ్యుదైక్షత. ౨
అథ తాన్ సచివాం స్తత్ర సర్వానాభాష్య రావణః,
సభాం సన్నాదయన్ సర్వామిత్యువాచ మహాబలః. ౩
జగత్సన్తాపనః క్రూరో గర్హయన్ రాక్షసేశ్వరః,
తరణం సాగరస్యాపి విక్రమం బలసంచయమ్. ౪
యదుక్తవన్తో రామస్య భవన్తస్తన్మయా శ్రుతమ్,
భవతశ్చాప్యహం వేద్మి యుద్ధే సత్యపరాక్రమాన్. ౫
తూష్ణీకానీక్షతోఽన్యోన్యం విదిత్వా రామవిక్రమమ్,
తతస్తు సుమహాప్రాజ్ఞో మాల్యవాన్నామ రాక్షసః. ౬
రావణస్య వచః శ్రుత్వా మాతుః పైతామహోఽబ్రవీత్,
విద్యాస్వభివినీతో యో రాజా రాజన్ నయానుగః. ౭
స శాస్తి చిరమైశ్వర్యమరీంశ్చ కురుతే వశే,

లంకయందుండు రావణునిసైనికులు వానరసైన్య సింహనాదంబులు విని రావణునిదోషంబులచే మరణంబుగలుగునుగాని మేలుగలుగదని నిశ్చయించి భయంబున నష్టతేజులయి దీనులయియుండిరి. ౨౮

ఇది ముప్పదినాలుగవసర్గము.

---

## ముప్పదియైదవసర్గము.

అప్పుడు మహాబాహుఁడును శత్రుపట్టణంబుల జయించువాఁడును రఘువంశమున నుద్భవించినవాఁడునగు రాముఁడు అట్లు శంఖధ్వనులతోను భేరీభాంకారములతోను లంకాపురికేతెంచెను. ౧

అంతరాక్షసనాథుఁడగు రావణుఁడు ఆరామసైన్యధ్వనిని విని కొంచెముసేపు ఆలోచించి మంత్రులంజూచెను. ౨

అంత మహాబలశాలియు లోకంబులఁ దపింపఁజేయువాఁడును నిర్దయుఁడును రాక్షసనాథుఁడు నగు రావణుఁడు మంత్రులనందఱిం బిలిచి నానావిధంబుల నిందించుచు సభయంతయుఁ బ్రతిధ్వనిచెలంగ నిట్లని చెప్పెను.

మీరలు రామునిదూత హనుమంతుఁడు గావించిన సముద్రతరణంబును బరాక్రమంబును రామునిసైన్యంబును చక్కఁగా నుగ్గడించి చెప్పినారు; ఆదంతయు విన్నాను. ४

యుద్ధంబున సత్యపరాక్రములరయ్యు రామునిపరాక్రమంబువిని యొండొరులఁజూచుకొనుచు నిరుత్సాహులరయియున్న మిమ్ముఁగూడ నెఱుఁగుదును అని రావణుఁడు చెప్పెను. ౫

అంతరావణునితల్లికిఁ బినతండ్రియును మహాపండితుఁడునగు మాల్యవంతుఁడను రాక్షసుఁడు రావణునిమాటలువిని యిట్లనిచెప్పెను. ౬

రాక్షసరాజుండవగు రావణుఁడా! ఏరాజు ఆన్వీక్షికీత్రయీవార్తాదండనీతు లనువిద్యలను నేర్చి నీతిశాస్త్రము ననుసరించి నడచునో అతఁడే

సన్ధధానో హి కాలేన విగృహ్ణంశ్చారిభి స్సహ. ౮
స్వపక్షవర్ధనం కుర్వ న్మహ దైశ్వర్య మశ్నుతే,

హీయమానేన కర్తవ్యో రాజ్ఞా సన్ధి స్సమేనచ. ౯
న శత్రు మవమన్యేత జ్యాయా న్కుర్వీత విగ్రహమ్,

త న్మహ్యం రోచతే సన్ధి స్సహరామేణ రావణ!. ౧౦
యదర్థ మభియుక్తాః స్మ సీతా తస్మై ప్రదీయతామ్,

యస్య దేవర్షయ స్సర్వే గన్ధర్వా శ్చ జయైషిణః. ౧౧
విరోధం మాగమ స్తేన సన్ధి స్తే తేన రోచతామ్,

అసృజ ద్భగవా న్పక్షౌ ద్వావేవ హి పితామహః. ౧౨
సురాణామసురాణాం చ ధర్మాధర్మౌ తదాశ్రయౌ,

ధర్మోహి శ్రూయతే పక్షో హ్యమరాణాం మహాత్మనామ్. ౧౩
అధర్మో రక్షసాం పక్షో హ్యసురాణాం చ రావణ!,
ధర్మో వై గ్రసతేఽధర్మం తతః కృత మభూ ద్యుగమ్. ౧౪
అధర్మో గ్రసతే ధర్మం తత స్తిష్యః ప్రవర్తతే,

త త్త్వయా చరతా లోకా న్ధర్మో వినిహతో మహాన్. ౧౫

బహుకాలము రాజ్యముఁ బాలించుచు; ఆతఁడే శత్రువుల నందఱను జయిం
చును. ౭

అట్టి నీతిశాస్త్రానువర్తియగు రాజు కాలము ననుసరించి తనకు దౌర్బ
ల్యముగలుగు కాలంబున శత్రువులతో సంధిచేయుచుఁ దనకుఁ బ్రాబల్యంబును
శత్రునకుఁ దౌర్బల్యంబునుఁ గలుగుకాలంబున యుద్ధంబుసేయుచు ఇట్లు
స్వపక్షంబు వృద్ధిఁబొందించుచు బహుకాలము అపరిమితంబగు నైశ్వర్యంబు
ననుభవించును. ౮

తనబలము క్షీణించుచుండునప్పుడు తనకు సమబలుఁడగు శత్రువుతో
సంధిసేయవలయును; తాను శత్రువుకన్న నధికబలుఁడగునేని శత్రువుఁదిరస్క
రించి యతనితో యుద్ధము సేయవలయును. ౯

రావణుఁడా! అట్లు నీతిశాస్త్రము నుదువుటంజేసి బలవంతుఁడగు రాము
నితో సంధిగావించుట నాయిష్టము; రామునకు మనయందు విరోధము గలుగు
టకుఁ గారణభూతయయిన సీతను రామున కిచ్చివేయుదము. ౧౦

దేవర్షులు గంధర్వులు మున్నగువారలందఱును రామునకు జయంబు
గలుగవలెనని కోరుచున్నారు; కావున నీ వతనితో విరోధంబు పెట్టుకొన
కుము; సంధిగావింప నియ్యకొనుము. ౧౧

భగవంతుఁడగు బ్రహ్మదేవుఁడు సురలకును అసురులకును రెండుపక్ష
ములఁ గల్పించెను. అట్లు ధర్మమును అధర్మమును సురలను అసురులను ఆశ్ర
యించియుండును. ౧౨

రావణుఁడా! అందు మహాత్ములగు దేవతలపక్షము ధర్మము; అసుర
రాక్షసులపక్ష మధర్మము. ౧౩

ఎప్పుడు ధర్మమువలన నధర్మమునకుఁ బరాజయముగలుగునో అప్పుడు
కృతయుగమందురు; ఎప్పుడు అధర్మమువలన ధర్మమునకుఁ బరాజయము
గల్గునో అప్పుడు కలియుగమని చెప్పుదురు. ౧౪

నీవు దిగ్విజయార్థమయి లోకంబులన్నియుఁ దిరుగునప్పుడు ధర్మం

అధర్మః ప్రగృహీత శ్చ తేనాస్మ ద్బలినః పరే,

స ప్రమాదా ద్వివృద్ధ స్తే అధర్మో గ్రసతే హి నః. ౧౬
వివర్ధయతి పక్షం చ సురాణాం సురభావనః,

విషయేషు ప్రసక్తేన యత్కిఞ్చిత్కారిణా త్వయా. ౧౭
ఋషీణా మగ్నికల్పానా ముద్వేగో జనితో మహాన్,
తేషాం ప్రభావో దుర్ధర్షః ప్రదీప్త ఇవ పావకః. ౧౮
తపసా భావితాత్మానో ధర్మస్యానుగ్రహే రతాః,
ముఖ్యై ర్యజ్ఞై ర్యజ న్త్యేతే నిత్యం తై స్తై ర్ద్విజాతయః. ౧౯

జుహ్వాత్యగ్నీంశ్చ విధివద్వేదాం శ్చోచ్చై రధీయతే,
అభిభూయ చ రక్షాంసి బ్రహ్మఘోషా నుదైరయన్. ౨౦

దిశోఽపి విద్రుతా స్సర్వా స్తనయిత్ను రివోష్ణగే,

ఋషీణా మగ్నికల్పానా మగ్నిహోత్రసముత్థితః. ౨౧
ఆదత్తే రక్షసాం తేజో ధూమో వ్యాప్య దిశో దశ,
తేషు తేషు చ దేశేషు పుణ్యేష్వేవ దృఢవ్రతైః. ౨౨
చర్యమాణం తప స్తీవ్రం సన్తాపయతి రాక్షసాన్,
దేవదానవయక్షేభ్యో గృహీతశ్చ వర స్త్వయా. ౨౩

మానుషా వానరా ఋక్షా గోలాఙ్గూలా మహాబలాః,
బలవన్త ఇహాగమ్య గర్జన్తి దృఢవిక్రమాః. ౨౪

మును విడిచి యధర్మంబును బరిగ్రహించితివి; అందువలన ధార్మికుఁడగు రాముఁడు మనకన్న బలవంతుఁడు. ౧౫

ఆయధర్మమును నీవు ప్రమాదంబున వృద్ధిఁబొందించుకొంటివి; కావున ధర్మము మనల నశింపఁజేయుచున్నది. మఱియు నాధర్మము దేవతల కనుకూలమయినది కావున వారలపక్షమునకు బలమును గలిగించుచున్నది. ౧౬

నీవు దేనివలననో విషయాసక్తుఁడవై నిప్పువంటిమహర్షులకు మిక్కిలియు మనస్తాపంబు గావించితివి; అదంతయు దేవతలకు బలమైనది. ౧౭

ఆమహర్షుల ప్రభావము మండుచున్ననిప్పువంటిది; దాని కెదురు లేదు.

ఈఋషులు ఎల్లప్పుడును తపస్సు గావించుచుఁ బరమాత్మను ధ్యానించుచు ధర్మవృద్ధియం దాసక్తులయి నానావిధోత్తమ యాగంబులచే దేవతలఁ బూజింపుచుండెదరు. ౧౯

మఱియు నీఋషులు యథావిధి నగ్నులహోమము సేయుచుండెదరు; వేదంబులఁ బఠింపుచుండెదరు; రాక్షసు లందఱుఁ బాఱిపోవునట్లు గట్టిగా వేదపారాయణము సేయుచుండెదరు. ౨౦

రాక్షసులందఱు గ్రీష్మకాలంబునందు మేఘంబులుంబోలె భయంబున దిక్కులకు బాఱుచున్నారు.

మహాతపశ్శాలులగు ఋషుల యగ్నిహోత్రములనుండి వెడలినధూమము దశదిశలు వ్యాపించి రాక్షసులతేజస్సును నశింపఁ జేయుచున్నది. ౨౧

ఆయాపుణ్యస్థలములయందు ఋషులు దృఢనియమంబులం గావించునట్టి తీవ్రతపస్సులవలన రాక్షసులు మిక్కిలియుఁ దపించుచున్నారు. ౨౨

నీవు దేవదానవయక్షులు మున్నగువారలవలన మరణములేదని వరముఁ బొందినావు. ౨౩

అప్పుడు బలవంతులును మహాపరాక్రమశాలులునగు మనుష్యులును వానరులును ఎలుఁగుగొడ్డులును గొండముచ్చులును లంకకువచ్చి గర్జించుచున్నారు! నీకు వీరివలనఁ జావులేనట్లు వరంబు లేదు. ౨౪

ఉత్పాతా న్వివిధా న్దృష్ట్వా ఘోరా న్బహువిధాం స్తథా,
వినాశ మనుపశ్యామి సర్వేషాం రక్షసామహమ్. ౨౫
ఖరాభి స్తనితా ఘోరా మేఘాః ప్రతిభయఙ్కరాః,
శోణితేనాభివర్షన్తి లఙ్కా ముష్ణేన సర్వతః. ౨౬
రుదతాం వాహనానాం చ ప్రపత న్త్యస్రబిన్దవః,
ధ్వజా ధ్వస్తా వివర్ణాశ్చ న ప్రభాన్తి యథాపురమ్. ౨౭

వ్యాళా గోమాయవో గృధ్రా వాశ్యన్తి చ సుభైరవమ్,
ప్రవిశ్య లఙ్కా మనిశం సమవాయాంశ్చ కుర్వతే. ౨౮
కాళికాః పాణ్డురై ర్దన్తైః ప్రహస న్త్యగ్రతః స్థితాః,
స్త్రియ స్స్వప్నేషు ముష్ణన్త్యో గృహాణి ప్రతిభాష్య చ. ౨౯

గృహాణాం బలికర్మాణి శ్వానః పర్యుపభుఞ్జతే,
ఖరా గోషు ప్రజాయన్తే మూషికా నకులై స్సహ. ౩౦

మార్జారా ద్వీపిభి స్సార్ధం సూకరా శ్శునకై స్సహ,
కిన్నరా రాక్షసై శ్చాపి సమీయు ర్మానుషై స్సహ. ౩౧
పాణ్డురా రక్తపాదాశ్చ విహఙ్గాః కాలచోదితాః,
రాక్షసానాం వినాశాయ కపోతా విచరన్తి చ. ౩౨

వీచీకూచీతి వాశ్యన్త్య శ్శారికా వేశ్మసు స్థితాః,

పతన్తి గ్రథితా శ్చాపి నిర్జితాః కలహైషిణః. ౩౩
పక్షిణ శ్చ మృగా స్సర్వే ప్రత్యాదిత్యం రుదన్తి చ,

నానావిధంబులగు దివ్యాంతరిక్షభౌమోత్పాతంబులు పొడమటంజూడ రాక్షసుల కందఱకు నాశంబుగలుగునని తోఁచుచున్నది. ౨౫

వికృతరూపములును భయంకరములునగు మేఘములు అత్యుగ్రంబుగా గర్జించుచు లంకయంతయుం నెత్తురును గురియుచున్నవి. ౨౬

గుఱ్ఱములు నేనుఁగులును రోదనంబుసేయుచుఁ గన్నీళ్లు విడుచుచున్నవి; ధ్వజంబులన్నియుం దుమ్ముదగిలి వివర్ణంబులయి మునుపటివలెఁ బ్రకాశింపకున్నవి. ౨౭

దుష్టములగు నక్కలును గద్దలును లంకాపురిఁ బ్రవేశించి యెల్లప్పుడును గుంపులుగుంపులుగాఁ జేరి భయంకరముగా నఱచుచున్నవి. ౨౮

నల్లని స్త్రీలు బెదరింపుమాటలుచెప్పుచు నిండ్లయందు పదార్థంబుల దొంగిలించునట్లును మఱియు నెదుటనిలిచి తెల్లనిపండ్లు బైటపడఁ బకపకనవ్వునట్లును స్వప్నములు గలుగుచున్నవి. ౨౯

పూజార్థమయి యిండ్లయందుండు హవిస్సును కుక్కలువచ్చి తినిపోవుచున్నవి; ఆవులయందు గాడిదలు పుట్టుచున్నవి; పందికొక్కులు ముంగిసలతోఁగూడఁ దిరుగుచున్నవి. ౩౦

మార్జారములు పులులతోఁ జేరుచున్నవి. ఊరఁబందులు కుక్కలతోఁ జేరుచున్నవి. కిన్నరులును రాక్షసులును మనుష్యులును ఒక్కటిగా నున్నారు.

తెలుపు నెఱుపునుగలసిన రంగుగల పాదములోఁగూడిన పావురములు దైవప్రేరితములయి రాక్షసుల వినాశంబు గలుగునని సూచింపుచుఁ దిరుగుచున్నవి. ౩౨

ఇండ్లయందు మధురసల్లాపార్థమయి పెంపఁబడినగోరువంకలు మధురముగాఁ గూయుటను విడిచి యిప్పుడు వీచే కూచి యని క్రూరధ్వనులం జేయుచున్నవి.

పక్షులును మృగంబులును ఒండొంటితోఁబోరుచు సోలియుం మరలఁ గలహంబుఁగోరి యొండొంటిపైకి, బరుగెత్తుచున్నవి. మఱియు సూర్యునిం

కరాళో వికటో ముణ్డః పురుషః కృష్ణపిఙ్గళః. 34
కాలో గృహాణి సర్వేషాం కాలే కాలేఽన్వవేక్షతే,

ఏతాన్యన్యాని దుష్టాని నిమిత్తాన్యుత్పతన్తి చ. 35
జ్ఞాత్వా ప్రధార్య కర్మాణి క్రియతా మాయతిక్షమమ్,

ఇదం వచ స్తత్ర నిశమ్య మాల్యవా
న్పరీక్ష్య రక్షోధిపతే ర్మనఃపునః,
అనుత్తమేషూత్తమపౌరుషో బలీ
బభూవ తూష్ణీం సమవేక్ష్య రావణమ్. 36

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే పఞ్చత్రింశస్సర్గః. 35.

---

షట్త్రింశస్సర్గః.

తత్తు మాల్యవతో వాక్యం హితముక్తం దశాననః,
న మర్షయతి దుష్టాత్మా కాలస్య వశ మాగతః. 1
స బద్ధ్వా భ్రుకుటీం వక్త్రే క్రోధస్య వశ మాగతః,
అమర్షా త్పరివృత్తాక్షో మాల్యవన్త మథాబ్రవీత్. 2
హితబుద్ధ్యా య దహితం వచః పరుష ముచ్యతే,
పరపక్షం ప్రవి శ్యైవ నైత చ్ఛ్రోత్రం గతం మమ. 3

మానుషం కృపణం రామ మేకం శాఖామృగాశ్రయమ్,
సమర్థం మన్యసే కేన త్యక్తం పిత్రా వనాలయమ్. 4

జూచి రోదనంబుఁ జేయుచున్నవి. 33

భయంకరాకారుఁడును ముండితశిరస్కుఁడును కృష్ణపింగళుఁడునగు పురుషునిరూపము ధరించి మృత్యువు రాక్షసుల గృహములన్నియుఁ బ్రాతస్సాయంకాలములయందుఁ జూచుచున్నాఁడు. 34

ఇవియుఁ నింకను దుష్టనిమిత్తము లనేకంబులును బుట్టుచున్నవి కాఁబట్టి చక్కఁగా నాలోచించి నిశ్చయించి ముందుకు బాధగలుగకుండునట్లు చేయుము. అని మాల్యవంతుఁడు రావణునితోఁ జెప్పెను. 35

ఉత్తములలో నుత్తమపౌరుషుఁడును బలవంతుఁడునగు నామాల్యవంతుఁడు ఇట్లు రావణునకుఁ జెప్పి యతని మొగంబుఁ జూచి యతనిమనంబుఁ జక్కఁగాఁ బరీక్షించి యతనికిఁ దనమాట యనిష్టముగాఁ దోఁచుటం దెలిసికొని యంతనూరకుండెను. 36

ఇది ముప్పదియైదవసర్గము.

---

## ముప్పదియాఱవసర్గము.

దుష్టాత్ముఁడగు రావణుఁడు మృత్యువశంగతుఁడై మాల్యవంతుఁడు చెప్పిన హితవాక్యంబును సహింపఁడయ్యె. 1

అంత నారావణుఁడు పరమకుపితుఁడై కోపంబుచే ముఖంబున బొమ ముడిపడ గ్రుడ్లు గిఱగిఱందిరుగ నామాల్యవంతుఁజూచి యిట్లని చెప్పెను. 2

శత్రువులపై స్నేహంబుచేత నితని నెట్లైన హితంబుఁ జెప్పినట్లుచెప్పి మోసపుచ్చవలయునని యహితంబును బరుషంబునగుమాటం జెప్పినావు. అయినను నేను దానిని వినను 3

మనుష్యుఁడును నీచుఁడును ఏకాకియును గోఁతులు సహాయులుగాఁ గలవాఁడును దండ్రిచే విడువఁబడినవాఁడును వనచరుఁడునగు రాముఁడు సమర్థుఁడని చెప్పినావే; అందు కేమి కారణము? 4

రక్షసా మిత్రవరం మాం చ దేవతానాం భయంకరమ్,
హీనం మాం మన్యసే కేన హ్యహీనం సర్వవిక్రమైః. ౫
వీరద్వేషేణ వా శఙ్కే పక్షపాతేన వా రిపోః,
త్వయాఽహం పరుషాణ్యుక్తః పరప్రోత్సాహనేన వా. ౬

ప్రభవన్తం పదస్థం హి పరుషం కోఽభిభాషతే,
పణ్డితః శ్శాస్త్రతత్త్వజ్ఞో వినా ప్రోత్సాహనాద్రిపోః. ౭

ఆనీయ చ వనాత్సీతాం పద్మహీనామివ శ్రియమ్,
కిమర్థం ప్రతిదాస్యామి రాఘవస్య భయాదహమ్. ౮
వృతం వానరకోటీభి స్ససుగ్రీవం సలక్ష్మణమ్,
పశ్య కైశ్చి దహోభి స్త్వం రాఘవం నిహతం మయా. ౯
ద్వన్ద్వే యస్య న తిష్ఠన్తి దైవతాన్యపి సంయుగే,
స కస్మా ద్రావణో యుద్ధే భయ మాహారయిష్యతి. ౧౦
ద్విధా భజ్యేయ మప్యేవం న నమేయం తు కస్యచిత్,
ఏష మే సహజో దోష స్స్వభావో దురతిక్రమః. ౧౧

యది తావ త్సముద్రే తు సేతు ర్బద్ధో యదృచ్ఛయా,
రామేణ విస్మయః కోఽత్ర యేన తే భయమాగతమ్. ౧౨

స తు తీర్త్వాఽర్ణవం రామ స్సహ వానరసేనయా,
ప్రతిజానామి తే సత్యం న జీవన్ప్రతియాస్యతి. ౧౩

ఏవం బ్రువాణం సంరబ్ధం రుష్టం విజ్ఞాయ రావణమ్,
వ్రీళితో మాల్యవా న్వాక్యం నోత్తరం ప్రత్యపద్యత. ౧౪

సమస్తరాక్షసులకుఁ బ్రభుఁడను సమస్తదేవతలకును భయంబుగల్గించు వాఁడను మహాపరాక్రమశాలినగు నేను దక్కువయని చెప్పినావే దేనిచేత?

సజాతీయులలో వీరుఁడుండుటను సహింపఁజాలమిచేతనో శత్రుపక్షపాతముచేతనో లేక శత్రువులు ప్రోత్సాహపఱచుటచేతనో నీవు నన్నిట్లు పరుషవచనంబు లాడితివిగాని దానికి వేఱేకారణములేదు. ౬

శత్రుప్రోత్సాహము లేకున్నచోఁ బండితుఁడును శాస్త్రంబులుదెలిసినవాఁడునగువాఁ డెవ్వఁడు రాజ్యాధికారంబున నున్నవాఁడును నిగ్రహానుగ్రహసమర్థుఁడునగు రాజునుగూర్చి పరుషవచనంబులాడును? ౭

నేను బద్మాసనంబులేని లక్ష్మీదేవివలెనున్న సీతాదేవిని వనంబుననుండి తెచ్చి మరల రామునకు భయపడి నేనేలయిత్తును. ౮

ఇంక గొన్నిదినంబులలోనే సమస్తవానరసేనాసమేతుఁడగు రాముని సుగ్రీవలక్ష్మణులతోఁగూడ నేను వధించుటఁ జూడఁగలవు. ౯

ఎవ్వనితో దేవతలుగూడ ద్వంద్వయుద్ధము సేయఁజాలరో అట్టిరావణుఁడు రామయుద్ధంబున నేల భయపడును? ౧౦

రాముఁడు బలవంతుఁడే యయినను అతనిచే శిరశ్ఛేదమరణమను బొందుదునుగాని నే నెట్టివానికిని వంగను; ఇది స్వభావమునఁ గల్గినదోషము; స్వభావమును విడువ నలవిగాదు. ౧౧

రాముఁడు సముద్రమునందు సేతువుకట్టినాఁడనిగదా నీవు భయముఁ బొందినావు! ఒకవేళ నీస్వల్పసముద్రమునందు డబ్బాటున రాముఁడు సేతువు గట్టినను అదియేమి యాశ్చర్యము? ౧౨

రాముఁడుమాత్రము వానరసేనతో సముద్రంబు దాటివచ్చి మరలఁ బ్రాణంబులతోఁ బోఁబోవుటలేదు. ఇది వాస్తవము, సత్యముచే శపథముచేసెదను. అని రావణుఁడు మాల్యవంతునితోఁ జెప్పెను. ౧౩

మాల్యవంతుఁడు ఇట్లతిసంరంభంబునఁ జెప్పుచున్నరావణుంజూచి యితఁడు కుపితుఁడయినాఁడని తెలిసికొని లజ్జితుఁడై బదులుచెప్పఁడయ్యె.

జయాశిషా చ రాజానం వర్ధయిత్వా యథోచితమ్,
మాల్యవా నభ్యనుజ్ఞాతో జగామ స్వం నివేశనమ్. ౧౫
రావణస్తు సహామాత్యై ర్మన్త్రయిత్వా విమృశ్య చ,
లఙ్కాయా మతులాం గుప్తిం కారయామాస రాక్షసః. ౧౬
స వ్యాదిదేశ పూర్వస్యాం ప్రహస్తం ద్వారి రాక్షసమ్,
దక్షిణస్యాం మహావీర్యౌ మహాపార్శ్వ మహోదరౌ. ౧౭

పశ్చిమాయా మథో ద్వారి పుత్త్ర మిన్ద్రజితం తథా,
వ్యాదిదేశ మహామాయం బహుభీ రాక్షసై ర్వృతమ్. ౧౮
ఉత్తరస్యాం పురద్వారి వ్యాదిశ్య శుకసారణౌ,
స్వయం చాత్ర భవిష్యామి మన్త్రిణ స్తా నువాచ హ. ౧౯
రాక్షసం తు విరూపాక్షం మహావీర్యపరాక్రమమ్,
మధ్యమేఽస్థాపయ ద్గుల్మే బహుభి స్సహ రాక్షసైః. ౨౦
ఏవంవిధానం లఙ్కాయాం కృత్వా రాక్షసపుఙ్గవః,
కృతకృత్యమివాత్మానం మన్యతే కాలచోదితః. ౨౧

విసర్జయామాస తత స్సమన్త్రిణో
విధాన మాజ్ఞాప్య పురస్య పుష్కలమ్,
జయాశిషా మన్త్రిగణేన పూజితో
వివేశ చా న్తఃపుర మృద్ధిమ న్మహత్. ౨౨
ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే షట్త్రింశస్సర్గః. ౩౬.

---

సప్తత్రింశస్సర్గః.

నరవానరరాజౌ తౌ స చ వాయుసుతః కపిః,
జామ్బవా నృక్షరాజశ్చ రాక్షసశ్చ విభీషణః. ౧

మాల్యవంతుఁడు యథాయోగ్యంబుగా రావణునకు జయంబుగలుగు నని యాశీర్వదించి తనయింటికిఁబోయెను. ౧౫

అంత రావణుఁడు మంత్రులతోఁగూడ విమర్శపూర్వకంబుగా నాలోచించి లంకాపురికి అసమానంబగు గుప్తికార్యంబు గావించెను. ౧౬

ఆరావణుఁడు తూర్పువాకిలియందుఁ బ్రహస్తుం గాచియుండ నాజ్ఞాపించెను. దక్షిణపువాకిలియందు మహాపరాక్రమశాలులగు మహోదర మహాపార్శ్వులనుండ నానతిచ్చెను. ౧౭

పశ్చిమద్వారంబున మహామాయుఁడును అనేకరాక్షసపరివేష్టితుఁడు నగు తనకొడుకు నింద్రజిత్తును గావలియుండ నాజ్ఞాపించెను. ౧౮

ఆరావణుఁడు ఉత్తరదిక్కునందలి ద్వారంబునందు శుకసారణులనుండుఁడని యాజ్ఞాపించి తానును అచ్చటనుండెదనని మంత్రులతోఁ జెప్పెను.

అట్లు పట్టణమధ్యంబున మహాబలపరాక్రమశాలియగు విరూపాక్షుం డనురాక్షసుని బహురాక్షససమేతంబుగా నుంచెను. ౨౦

రాక్షసశ్రేష్ఠుఁడగు రావణుఁడు ఇట్లు లంకాపురికిగుప్తికర్మసంవిధానంబు గావించి మృత్యుచోదితుఁడై తా నంతవఱకుఁ గృతార్థుఁడైనట్లు తలచుకొనియుండెను. ౨౧

అంత నారావణుఁడు లంకానగరంబునకు సమగ్రంబుగా రక్షణసంవిధానంబుసేయ నాజ్ఞాపించి మంత్రులకు సెలవీయ వారలు "జయజయ" యని రావణున కాశీర్వాదంబు నొసఁగి తమ యిండ్లకుంబోయిరి. రావణుఁడును నానావిధలక్ష్మీవిరాజమానంబగు నంతఃపురంబునకుఁ బోయెను. ౨౨

ఇది ముప్పదియాఱవసర్గము.

---

## ముప్పదియేడవసర్గము.

రామలక్ష్మణులును వానరరాజుండగు సుగ్రీవుఁడును వాయుపుత్రుఁడగు హనుమంతుఁడును ఋక్షరాజుండగు జాంబవంతుఁడును విభీషణుఁడును

అఙ్గదో వాలిపుత్త్రశ్చ సౌమిత్రి శ్శరభః కపిః,
సుషేణ స్సహదాయాదో మైన్దో ద్వివిద ఏవచ. ౨
గజో గవాక్షః కుముదో నళోఽథ పనస స్తథా.
అమిత్రవిషయం ప్రాప్తా స్సమవేతా స్సమర్థయన్. ౩
ఇయం సా లక్ష్యతే లఙ్కా పురీ రావణపాలితా,
సాసురోరగగన్ధర్వై రమరై రపి దుర్జయా. ౪
కార్యసిద్ధిం పురస్కృత్య మన్త్రయధ్వం వినిర్ణయే,
నిత్యం సన్నిహితో హ్యత్ర రావణో రాక్షసాధిపః. ౫
తథా తేషు బ్రువాణేషు రావణావరజోఽబ్రవీత్,
వాక్య మగ్రామ్యపదవ త్పుష్కలార్థం విభీషణః. ౬

అనల శ్శరభ శ్చైవ సంపాతిః ప్రఘస స్తథా,
గత్వా లఙ్కాం మమామాత్యాః పురీం పున రిహాగతాః. ౭
భూత్వా శకునయ స్సర్వే ప్రవిష్టాశ్చ రిపోర్బలమ్,
విధానం విహితం యచ్చ తద్దృష్ట్వా సముపస్థితాః. ౮

సంవిధానం యథాఽఽహు స్తే రావణస్య దురాత్మనః,
రామ! తద్బ్రువత స్సర్వం యథా తత్త్వేన మే శృణు. ౯
పూర్వం ప్రహస్త స్సబలో ద్వార మాసాద్య తిష్ఠతి,
దక్షిణం చ మహావీర్యౌ మహాపార్శ్వ మహోదరౌ. ౧౦

ఇన్ద్రజి త్పశ్చిమద్వారం రాక్షసై ర్బహుభి ర్వృతః,
పట్టిసాసిధనుష్మద్భి శ్శూలముద్గరపాణిభిః. ౧౧
నానాప్రహరణై శ్శూరై రావృతో రావణాత్మజః,

వాలికుమారుఁడగు నంగదుఁడును శరభుఁడును బంధుసహితుఁడగు సుషేణుఁడును మైందుఁడును ద్వివిదుఁడును గజుఁడును గవాక్షుఁడును కుముదుఁడును నలుఁడును పనసుఁడును వీరలు మున్నగువానరవీరులు లంకాద్వీపంబుఁ జేరిన పిమ్మట నందఱుంగూడి యిట్లని యాలోచించిరి. ౧, ౩

ఇదిగో రావణబాహుపాలితంబగు లంకాపురి యగపడుచున్నది; ఆ పట్టణము సురాసురోరగగంధర్వులకైనను జయింప నలవిగానిది. ౪

ఇందు రాక్షసేశ్వరుఁడగు రావణుఁడు విడువక సన్నిహితుఁడై యున్నాఁడు. కాఁబట్టి మనకుఁ గార్యసిద్ధియగునట్లు చక్కఁగా నాలోచింపుఁడు.

అట్లు వారలందఱు మాటలాడుచుండఁగా రావణానుజుఁడగు విభీషణుఁడు వారలంజూచి యగ్రామ్యంబులగు పదంబులుగలదియు నధికార్థంబునగు నీమాటం జెప్పెను. ౬

నామంత్రులయిన యనల శరభ సంపాతి ప్రఘసులు నల్వురును ఇప్పుడు లంకాపురికింబోయి చూచివచ్చినారు. ౭

ఆ యనలశరభసంపాతిప్రఘసులు అందఱు పక్షిరూపంబు దాల్చి శత్రుసైన్యంబులు చొచ్చి యందుఁ జేయఁబడియుండు నేర్పాటు లన్నియుఁ జూచి వచ్చినారు.

రాముఁడా! వారలు దురాత్ముఁడగు రావణుని రక్షణసంవిధానంబంతయుఁ జెప్పినారు. ఆసంగతియంతయుఁ జెప్పెదను వినుము. ౯

ప్రహస్తుఁడు సైన్యసమేతుఁడై తూర్పుద్వారంబున నున్నాఁడు; మహాపరాక్రమశాలులగు మహోదర మహాపార్శ్వులు దక్షిణద్వారంబునం గాచి యున్నారు. ౧౦

రావణపుత్రుఁడగు నింద్రజిత్తు అడ్డకత్తి ఖడ్గము ధనుస్సు శూలము ముద్గరము మొదలగు నాయుధములం దాల్చిన ప్రధానరాక్షసుల పెక్కండ్రతోను నానావిధాయుధపాణులును శూరులునగు రాక్షసభటులతోనుంగూడి పశ్చిమద్వారంబున నున్నాఁడు. ౧౧

రాక్షసానాం సహస్రైస్తు బహుభి శ్శస్త్రపాణిభిః. ౧౨
యుక్తః పరమసంవిగ్నో రాక్షసై ర్బహుభిర్వృతః,
ఉత్తరం నగరద్వారం రావణ స్స్వయమాస్థితః. ౧౩
విరూపాక్ష స్తు మహతా శూలఖడ్గధనుష్మతా,
బలేన రాక్షసై స్సార్థం మధ్యమం గుల్మమాస్థితః. ౧౪

ఏతానేవం విధా న్గుల్మాన్ లఙ్కాయాం సముదీక్ష్య తే,
మామకా స్సచివా స్సర్వే పున శ్శీఘ్ర మిహాఽగతాః. ౧౫

గజానాం చ సహస్రం చ రథానా మయుతం పురే,
హయానా మయుతే ద్వే చ సాగ్రకోటీ చ రక్షసామ్. ౧౬
విక్రాన్తా బలవన్తశ్చ సంయుగేష్వాతతాయినః,
ఇష్టా రాక్షసరాజస్య నిత్యమేతే నిశాచరాః. ౧౭
ఏకైకస్యాత్ర యుద్ధార్థే రాక్షసస్య విశాంపతే!,
పరివారస్సహస్రాణాం సహస్ర ముపతిష్ఠతే. ౧౮
ఏతాం ప్రవృత్తిం లఙ్కాయాం మన్త్రిప్రోక్తాం విభీషణః,
ఏవ ముక్త్వా మహాబాహూ రాక్షసాం స్తా నదర్శయత్. ౧౯
లఙ్కాయాం సచివై స్సర్వం రామాయ ప్రత్యవేదయత్,

రామం కమలపత్త్రాక్ష మిద ముత్తర మబ్రవీత్. ౨౦
రావణావరజః శ్రీమాన్ రామప్రియచికీర్షయా,

కుబేరం తు యదా రామ! రావణః ప్రత్యయుధ్యత. ౨౧
షష్టి శ్శతసహస్రాణి తదా నిర్యాన్తి రాక్షసాః,
పరాక్రమేణ వీర్యేణ తేజసా సత్త్వగౌరవాత్. ౨౨

రావణుఁడు నిర్భయుఁడై యాయుధపాణులగు పెక్కువేల రాక్షస భటులను పెక్కండ్రుప్రధానరాక్షసులునుంగొలువఁ దానే లంక యుత్తర ద్వారంబున నున్నాఁడు. ౧౨,౧౩

విరూపాక్షుఁడు శూలంబులును ఖడ్గంబులును ధనుస్సులును ధరించి యుండు గొప్పసైన్యంబుతోఁగూడి పెక్కురాక్షసులుగొలువ మధ్యమగుల్మం బున నున్నాఁడు. ౧౪

నామంత్రులు అనలశరభసంపాతిప్రఘసులు లంకయందు ఇట్టు సంవి ధానంబు నొందియున్న సేనలంజూచి మరల శీఘ్రంబున నిచ్చటికి వచ్చి నారు. ౧౫

గజయోధులు వేవురును రథికులు పదివేవురును గుఱ్ఱపువార లిరువది వేవురును గాల్వురు కోటిమందియుం బరాక్రమవంతులును బలవంతులును యుద్ధంబులం గ్రూరులునగు నీరాక్షసులు రాక్షసరాజుండగు రావణున కెల్ల ప్పుడును సమీపంబుననుండి సేవసేయుచుఁ బ్రియులై యుండువారలు. ౧౭

నరేంద్రుఁడవగురాముఁడా! ఈరాక్షసులలో నొక్కొకరాక్షసునకు యుద్ధమునకొఱకుఁ బదిలక్షలరాక్షసులు పరిజను లున్నారు. అని విభీషణుఁడు రామునకుఁ జెప్పెను. ౧౮

మహాబాహుఁడగు విభీషణుఁడు తనకు మంత్రులుచెప్పిన లంకా వృత్తాంతమంతయుం రామునకుఁజెప్పి యంత నామంత్రులం జూపెను. ౧౯

అంత నవ్విభీషణుఁడు తనమంత్రులచేతనుంగూడ నాలంకావృత్తాంత మంతయుం రామునియెదుటఁ జెప్పెను.

మరల శ్రీమంతుఁడగు రావణానుజుఁడు విభీషణుఁడు తామరపూరేకులంబోలె విశాలసుందరంబులగు నేత్రంబులుగల రాముంజూచి యూపైఁ జెప్పవలసినమాట నిట్లని చెప్పెను. ౨౦

రాముఁడా మున్ను రావణుఁడు కుబేరునితో యుద్ధము సేయఁబోయి నప్పుడు పరాక్రమంబునను బలంబునను తేజంబునను ధైర్యంబునను దర్పంబునను దురాత్ముఁడగు రావణునకు సమానులయినరాక్షసు లఱువదిలక్షలమందిపోయిరి.

సదృశా యేఽత్ర దర్పేణ రావణస్య దురాత్మనః,
అత్ర మన్యు ర్న కర్తవ్యో రోషయే త్వాం న భీషయే. ౨౩
సమర్థో హ్యసి వీర్యేణ సురాణా మపి నిగ్రహే,

తద్భవాం శ్చతురఙ్గేణ బలేన మహతా వృతః. ౨౪
వ్యూహ్యేదం వానరానీకం నిర్మథిష్యసి రావణమ్,

రావణావరజే వాక్య మేవం బ్రువతి రాఘవః. ౨౫
శత్రూణాం ప్రతిఘాతార్థ మిదం వచన మబ్రవీత్,
పూర్వద్వారే తు లఙ్కాయా నీలో వానరపుఙ్గవః. ౨౬
ప్రహస్తప్రతియోద్ధా స్యా ద్వానరై ర్బహుభి ర్వృతః,
అఙ్గదో వాలిపుత్రస్తు బలేన మహతా వృతః. ౨౭
దక్షిణే బాధతాం ద్వారే మహాపార్శ్వమహోదరౌ,
హనూమా న్పశ్చిమద్వారం నిపీడ్య పవనాత్మజః. ౨౮
ప్రవిశత్వ ప్రమేయాత్మా బహుభిః కపిభిర్వృతః,
దైత్యదానవసఙ్ఘానా మృషీణాం చ మహాత్మనామ్. ౨౯
విప్రకారప్రియః క్షుద్రో వరదానబలాన్వితః,
పరిక్రామతి యస్సర్వా న్లోకాన్ సన్తాపయ న్ప్రజాః. ౩౦
తస్యాహం రాక్షసేన్ద్రస్య స్వయమేవ వధే ధృతః,
ఉత్తరం నగరద్వార మహం సౌమిత్రిణా సహ. ౩౧
నిపీడ్యాభి ప్రవేక్ష్యామి సబలో యత్ర రావణః,
వానరేన్ద్ర శ్చ బలవా నృక్షరాజ శ్చ వీర్యవాన్. ౩౨
రాక్షసేన్ద్రానుజ శ్చైవ గుల్మో భవతు మధ్యమః,

ఈవిషయమునందు నామీఁదఁ గోపము సేయవలదు. నీకరోపముగలుగుటకుఁ జెప్పుచున్నానుగాని భయముగలుగుటకుఁగాదు. నీవు పరాక్రమంబున దేవతలనైనను నిగ్రహింపఁజాలినవాఁడవు. ౨3

నీవును అనంతంబగు చతురంగబలంబుతోఁ గూడియున్నావు. కావున నీవానరసైన్యమును ఉచితవ్యూహంబులం బన్ని రావణుం బరిమార్పుము. అని విభీషణుఁడు రామునితోఁ జెప్పెను. ౨౪

రావణునితమ్ముఁడు విభీషణుఁడు ఈప్రకారంబునం జెప్పుచుండఁగానే రాముఁడు శత్రువధంబుపొంటె నిట్లని చెప్పెను. ౨౫

వానరశ్రేష్ఠుఁడగునీలుఁడు పెక్కెండ్ర వానరులంగూడి లంకతూర్పు వాకిలియందుండి ప్రహస్తునకు యుద్ధం బొసంగును. ౨౬

వాలికుమారుఁడగు నంగదుఁడు గొప్పసైన్యంబుఁగూడి దక్షిణద్వారంబుననుండి మహాపార్శ్వమహోదరులతో యుద్ధంబు సేయుఁగాక. ౨౭

అప్రమేయబలసమన్వితుఁడగు వాయుపుత్త్రుఁడయిన హనుమంతుఁడు పశ్చిమద్వారంబుననుండి యుద్ధము చేయుఁగాక. ౨౮

ఎవ్వఁడు దైత్యులకును దానవులకును మహాత్ములగుఋషులకును అపకారముసేయుచు క్షుద్రవృత్తి నవలంబించి వరబలగర్వితుఁడై జనులం బీడించుచు సమస్తలోకంబులం దిరుగుచున్నాఁడో అట్టిరాక్షసరాజుండగు రావణుని నేనే వధింప నిశ్చయించినాను. ౨౯,3౦

అట్టిరావణుఁడు సైన్యసమేతుఁడై యెచ్చటనున్నాఁడో ఆయుత్తరద్వారంబున నేనును లక్ష్మణుఁడును ఉండి యుద్ధముగావించెదము. 3౧

బలవంతుఁడగుసుగ్రీవుఁడును మహాపరాక్రమశాలియగు జాంబవంతుఁడును రావణానుజుఁడగు విభీషణుఁడును మధ్యమగుల్మంబు నలంకరింతురుగాక. 3౨

న చైవం మానుషం రూపం కార్యం హరిభి రాహవే. 33
ఏషా భవతు సంజ్ఞా నో యుద్ధేఽస్మి న్వానరే బలే,
వానరా ఏవ న శ్చిహ్నం స్వజనేఽస్మి న్భవిష్యతి. 34
వయం తు మానుషే ణైవ సప్త యోత్స్యామహే పరాన్,
అహమేష సహ భ్రాత్రా లక్ష్మణేన మహౌజసా. 35
ఆత్మనా పఞ్చమ శ్చాయం సఖా మమ విభీషణః,
స రామగ కృత్యసిద్ధ్యర్థ మేవ ముక్త్వా విభీషణమ్. 36
సువేలారోహణే బుద్ధి శ్చకార మతిమా న్మతిమ్,
రమణీయతరం దృష్ట్వా సువేలస్య గిరే స్తటమ్. 37
తత స్తు రామో మహతా బలేన
ప్రచ్ఛాద్య సర్వాం పృథివీం మహాత్మా,
ప్రహృష్టరూపోఽభిజగామ లఙ్కాం
కృత్వా మతిం సోఽరివధే మహాత్మా. 38

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే సప్తత్రింశస్సర్గః. 37.

---

## అష్టత్రింశస్సర్గః.

స తు కృత్వా సువేలస్య మతిమారోహణం ప్రతి,
లక్ష్మణానుగతో రామ స్సుగ్రీవ మిద మబ్రవీత్. 1
విభీషణం చ ధర్మజ్ఞ మనురక్తం నిశాచరమ్,
మన్త్రజ్ఞం చ విధిజ్ఞం చ శ్లక్ష్ణయా పరయా గిరా. 2
సువేలం సాధు శైలేన్ద్ర మిమం ధాతుశతై శ్చితమ్,
అధ్యారోహామహే సర్వే వత్స్యామోఽత్ర నిశా మిమామ్ 3

వానరులు ఇప్పు డుండునట్లు యుద్ధంబునందు మనుష్యరూపంబు ధరించియుండరాదు. ౩౩

యుద్ధమునందు మనవానరసైన్యంబునం దీసంకేత ముండవలయును; మనజనము అని తెలియుటకు మనకు వానరులే గుఱుతుగ నుందురుగాక. ౩౪

మహాపరాక్రమశాలియగు నాతమ్ముఁడు లక్ష్మణుఁడును నేనును నీలాంగదహనుమత్సుగ్రీవులును నాస్నేహితుఁడు విభీషణుఁడును మే మేడ్వురము మాత్రము మనుష్యదేహంబున నె శత్రువులతో యుద్ధముచేసెదము. అని రాముఁడు చెప్పెను. ౩౫

బుద్ధిమంతుఁడగు రాముఁ డిట్లు కార్యసిద్ధియగునట్లు విభీషణునితోఁ జెప్పి సువేలపర్వతతటంబు మిక్కిలియు సుందరంబుగా నుండుటం జూచి యప్పర్వతంబుపై నారోహింపఁదలంచెను. ౩౬, ౩౭

అంత మహాబుద్ధిశాలియు మహాధైర్యశాలియునగు రాముఁడు పరమసంతోషంబునొంది అనంతంబగు వానరసైన్యంబు సువేలప్రాంతభూమియంతయుఁ వ్యాపించి వెంబడింప లంకమీఁదికిం బోయెను. ౩౮

ఇది ముప్పదియేడవసర్గము.

## ముప్పదియెనిమిదవసర్గము.

లక్ష్మణసహితుఁడగు రాముఁడు అట్లు సువేలపర్వతంబు నారోహింపం దలఁచి సుగ్రీవుని ధర్మవేత్తయు దనయందనురాగముగలవాఁడును ఆలోచన దెలిసినవాఁడును గార్యంబుల సమర్థుఁడును రాక్షసుఁడగుటచే నచ్చటిఛిద్రంబులఁ దెలిసినవాఁడునగు విభీషణునింజూచి మధురవచనంబున నిట్లనిచెప్పెను.

మనమందఱమును నానావిధధాతువులచే నలంకృతమయి పర్వతోత్తమమయియున్న యీసువేలపర్వతము నారోహించి యీరాత్రియంతయు నిందు నివసింతము. ౩

లక్ష్మణం చాలోకయిష్యామో నిలయం తస్య రక్షసః,
యేన మే మరణాన్తాయ హృతా భార్యా దురాత్మనా. ౪
యేన ధర్మో న విజ్ఞాతో న తద్వృత్తం కులం తథా,
రాక్షస్యా నీచయా బుద్ధ్యా యేన తద్గర్హితం కృతమ్. ౫

తస్మి న్మే వర్తతే రోషః కీర్తితే రాక్షసాధమే,
యస్యాపరాధా న్నీచస్య వధం ద్రక్ష్యామి రక్షసామ్. ౬

ఏకో హి కురుతే పాపం కాలపాశవశం గతః,
నీచేనాత్మాపచారేణ కులం తేన వినశ్యతి. ౭

ఏవం సమ్మన్త్రయన్నేవ సక్రోధో రావణం ప్రతి,
రామ స్సువేలం వాసాయ చిత్రసాను ముపారుహత్. ౮
పృష్ఠతో లక్ష్మణ శ్చైనమన్వగచ్ఛ త్సమాహితః,
సశరం చాప ముద్యమ్య సుమహ ద్విక్రమే రతః. ౯
అన్వారురోహ సుగ్రీవ స్సామాత్య స్సవిభీషణః,

హనూమా నఙ్గదో నీలో మైన్దో ద్వివిద ఏవచ. ౧౦
గజో గవాక్షో గవయ శ్శరభో గన్ధమాదనః,
పనసః కుముదశ్చైవ హరో రమ్భశ్చ యూథపః. ౧౧
జామ్బవాంశ్చ సుషేణశ్చ ఋషభశ్చ మహామతిః,
దుర్ముఖశ్చ మహాతేజా స్తథా శతవలిః కపిః. ౧౨
ఏతే చాన్యేచ బహవో వానరా శ్శీఘ్రగామినః,
తే వాయువేగప్రవణా స్తం గిరిం గిరిచారిణః. ౧౩
అధ్యారోహన్త శతశ స్సువేలం యత్ర రాఘవః,

ఏదురాత్ముఁడు మరణంబునొందుటకై నాభార్య నపహరించెనో ఎవ్వఁడు ధర్మంబుదెలియక సదాచారంబు విచారింపక కులంబు గణింపక రాక్షస సాధారణమయిన నీచబుద్ధిచే నిందింతం బగు పరభార్యాపహరణంబు గావించెనో అట్టి రావణుని నివాసస్థానమయిన లంకాపురిం గూడఁ జూతము. ౪, ౫

రాక్షసాధముఁడగు నా రావణుని పేరుచెప్పిన నాకు మిక్కిలియుం గోపముపుట్టుచున్నది. అతనియొక్కని యపరాధమువలన నిప్పుడు రాక్షసుల నందఱిం జంపవలసియున్నది. ౬

ఒక్కఁడుమాత్రమే మృత్యువశంగతుఁడై యకార్యంబు గావించెను. నీచుండగు నతని యపరాధంబుచే నతనికులంబునం బుట్టినవార లందఱు నాశంబు నొందుదురు అని రాముఁడు చెప్పెను. ౭

రాముం డట్లు చెప్పుచునే రావణునిపైఁ గలిగిన కోపముతోఁ గూడినవాఁడై చిత్రసానువగు సువేలపర్వతంబు నారోహించెను. ౮

లక్ష్మణుఁడును బరాక్రమంబునవలంబించి బాణంబులు మహాధనుస్సుం బట్టుకొని యెచ్చరికలగలవాఁడై రాముని వెంబడిం బోయెను. ౯

అంత సుగ్రీవుఁడును దనమంత్రులను విభీషణునింగూడి లక్ష్మణుని వెంబడించి యారోహించెను.

హనుమంతుఁడు నంగదుఁడు నీలుఁడు మైందుఁడు ద్వివిదుఁడు గజుఁడు గవాక్షుఁడు గవయుఁడు శరభుఁడు గంధమాదనుఁడుఁ బనసుఁడుఁ గుముదుఁడు హరుఁడు రంభుఁడు జాంబవంతుఁడు సుషేణుఁడు బుద్ధిమంతుఁడగు ఋషభుఁడు మహాతేజుఁడగు దుర్ముఖుఁడు శతవలియుం వీరలును ఇంక నితరులం పెక్కండ్రును వాయువేగులగు నావానరు లందఱు రామునివెంట నాసువేల పర్వతంబు నారోహించిరి. ౧౦. ౧౩

తే త్వదీర్ఘేణ కాలేన గిరి మారుహ్య సర్వతః. ౧౪
దదృశు శ్శిఖరే తస్య విషక్తా మివ ఖే పురీమ్,

తాం శుభాం ప్రవరద్వారాం ప్రాకారపరిశోభితామ్. ౧౫
లఙ్కాం రాక్షససంపూర్ణాం దదృశు ర్హరియూథపాః,
ప్రాకారచయసంస్థైశ్చ తదా నీలై ర్నిశాచరైః. ౧౬

దదృశు స్తే హరిశ్రేష్ఠాః ప్రాకార మపరం కృతమ్,
తే దృష్ట్వా వానరా స్సర్వే రాక్షసాన్యుద్ధకాఙ్క్షిణః. ౧౭
ముముచు ర్వివిధా న్నాదాం స్తత్ర రామస్య పశ్యతః,

తతో౽స్త మగమ త్సూర్య స్సన్ధ్యయా ప్రతిరఞ్జితః. ౧౮
పూర్ణచన్ద్రప్రదీప్తా చ క్షపా సమభివర్తతే.
తత స్స రామో హరివాహినీపతి
ర్విభీషణేన ప్రతినన్ద్య సత్కృతః,
సలక్ష్మణో యూథపయూథసంవృత
స్సువేలపృష్ఠే న్యవస ద్యథాసుఖమ్. ౧౯

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే అష్టత్రింశస్సర్గః. ౩౮.

---

## ఏకోనచత్వారింశస్సర్గః.

తాం రాత్రి ముషితా స్తత్ర సువేలే హరిపుఙ్గవాః,
లఙ్కాయాం దదృశు ర్వీరా వనాన్యుపవనాని చ, ౧
సమసౌమ్యాని రమ్యాణి విశాలా న్యాయతాని చ,
దృష్టిరమ్యాణి తే దృష్ట్వా బభూవు ర్జాతవిస్మయాః. ౨

అంత నారామాదులు శీఘ్రింబున నే యాసువేలపర్వతశిఖరంబు నారో హించి త్రికూటశిఖరాగ్రంబున నాకాశంబున వ్రేలాడున ట్లున్న లంకా పురింజూచిరి. ౧౪

వానరవీరులందఱు సుందరంబున సుందరద్వారంబును బ్రాకారాలం కృతంబును రాక్షసులచే నిండినదియు నగు లంకాపురిం జూచిరి. ౧౫

అప్పుడు నల్లనిరాక్షసులు కోటకొఱడులనుండుటవలన రెండవప్రాకా రమువలెనున్న యారాక్షసపఙ్క్తినింగూడ నవ్వానరోత్తములు చూచిరి. ౧౬

అచ్చట నావానరులందఱు నారాక్షసులంజూచి యుద్ధంబు సేయ నుత్సుకులయి రాముఁడు చూచుచుండఁగా నే నానావిధంబుల సింహనాదం బులు గావించిరి. ౧౭

అంత సూర్యుఁడు సంధ్యారాగంబునం బల్లవితుఁడై యస్తమించెను; రాత్రియుం బూర్ణచంద్రాలంకృతయయి పొడసూపినది. ౧౮

అంత వానరసేనానాయకత్వంబునొందిన యారాముఁడు విభీషణుఁడు నానావిధంబులంబూజింప లక్ష్మణునింగూడి వానరవీరసమూహపరివేష్టితుఁడై యారాత్రి సువేలపర్వతాగ్రంబున సుఖంబుగా నివసించియుండెను. ౧౯

ఇది ముప్పదితొమ్మిదవ సర్గము.

## ముప్పదితొమ్మిదవసర్గము

పరాక్రమవంతులగు నావానరశ్రేష్ఠు లట్లు రాత్రియంతయు నాసువే లాగ్రంబుననుండి తెల్లవాఱిన వెనుక లంకయందలివనంబుల నుద్యానవనంబులం జూచిరి. ౧

ఆవానరులు మిట్టపల్లములు లేనివియుఁ గ్రూరమృగంబులు లేనివియు విశాలంబులు నాయతంబులును గన్నులకుఁ బండువుగలిగించునవియు రమణీ

చమ్పకాశోకపున్నాగసాలతాలసమాకులా,
తమాలవనసంఛన్నా నాగమాలాసమావృతా. ౩
హిన్తాలై రర్జునై ర్నీపై స్సప్తపర్ణై శ్చ పుష్పితైః,
తిలకైః కర్ణికారై శ్చ పాటలై శ్చ సమన్తతః. ౪
శుశుభే పుష్పితాగ్రై శ్చ లతాపరిగతై ర్ద్రుమైః,
లఙ్కా బహువిధై ర్దివ్యై ర్యథేన్ద్రస్యామరావతీ. ౫
విచిత్రకుసుమోపేతై రక్తకోమలపల్లవైః,
శాద్వలై శ్చ తథా నీలై శ్చిత్రాభి ర్వనరాజిభిః. ౬
గన్ధాఢ్యాన్యభిరమ్యాణి పుష్పాణి చ ఫలానిచ,
ధారయ న్త్యగమా స్తత్ర భూషణానీవ మానవాః. ౭

తచ్చైత్రరథసఙ్కాశం మనోజ్ఞం నన్దనోపమమ్,
వనం సర్వర్తుకం రమ్యం శుశుభే షట్పదాయుతమ్. ౮

నత్యూహకోయష్టిమకై ర్నృత్యమానై శ్చ బర్హిభిః,
రుతం పరభృతానాం చ శుశ్రువు ర్వననిర్ఝరే. ౯

నిత్యమత్తవిహఙ్గాని భ్రమరాచరితాని చ,
కోకిలాకులషణ్డాని విహగాభిరుతానిచ. ౧౦
భృఙ్గరాజాభిగీతాని భ్రమరై స్సేవితాని చ,
కోణాలకవిఘుష్టాని సారసాభిరుతానిచ. ౧౧
వివిశు స్తే తత స్తాని వనాన్యుపవనాని చ,

యంబులునగు నాలంకయందలి వనంబుల నుపవనంబులనుం జూచి యాశ్చ ర్యంబునొందిరి. ౨

అలంకాపురి సంపెంగచెట్లును అశోకవృక్షములును బున్నాగవృక్షము లును మద్దిచెట్లును దాటిచెట్లును దమాలవృక్షములను ఏఱుమద్దిచెట్లును బుష్పితంబులగు నేడాకులరటిచెట్లును భొట్టుగుచెట్లును గొండగోగుచెట్లును గలిగొట్టుచెట్లును విచిత్రంబులగు పుష్పంబులుగలశిఖరంబులతోఁగూడినవియుం లతావేష్టితంబును దివ్యంబులును ఎఱ్ఱనికోమలంబులగు పల్లవంబులు గలవియుం నగు నానావిధవృక్షంబులును బచ్చికభూములును జలప్రాయప్రదేశంబులును జిత్రంబులగు వనరాజులుంగల్గి దేవేంద్రుని యమరావతీపురంబుంబోలెఁ బ్రకాశించుచుండినది. ౩-౬

ఆవనంబునందలివృక్షములు మనుష్యులు భూషణంబులు ధరించునట్లు మంచివాసనగలవియుం రమణీయంబులు నగుపుష్పంబులను ఫలంబులను ధరించి యుండినవి. ౭

సమస్తఋతుధర్మంబులతోనుఁగూడినదియుం రమణీయంబును దుమ్మెద లతో నొప్పుచున్నదియుం నగు నాలంక యందలివనము కుబేరుని చైత్రరథ వనంబుమాడ్కి దేవేంద్రుని నందనవనంబుకై వడిఁ బ్రకాశించెను. ౮

ఆవానరులు వననిర్ఝరంబులందు నీరుకోడులును జీకుఁగొక్కెరలును నర్తనముసేయుచుండు నెమిళ్లును గోయిలలును మధురముగాఁ గూయుచుండ నాధ్వనుల వినిరి. ౯

అంతఁ బరాక్రమవంతులు గామరూపులునగు నావానరులు పరమ సంతుష్టులయి మేనం బులకలువొడమ నెల్లప్పుడును మదించియుండుపక్షులతోఁ గూడినవియుఁ గోయిలలచే నిండినవృక్షములుగలవియు మధురంబుగాఁ గూయుచుండునట్టి భృంగములును మందపిచ్చుకలును బెగ్గురుపక్షులను మొద లగుపక్షులతో నొప్పుచుండునవియుఁ నగు నాలంకాపురిసమీపముననుండు వనం బుల నుపవనంబులఁ బ్రవేశించిరి. ౧౦-౧౨

హృష్టాః ప్రముదితా వీరా హరయః కామరూపిణః. ౧౨
తేషాం ప్రవిశతాం తత్ర వానరాణాం మహౌజసామ్,
పుష్పసంసర్గసురభి ర్వవౌ ఘ్రాణసుఖోఽనిలః. ౧౩

అన్యే తు హరివీరాణాం యూథా న్నిష్క్రమ్య యూథపాః,
సుగ్రీవేణాభ్యనుజ్ఞాతా లఙ్కాం జగ్ముః పతాకినీమ్. ౧౪
విత్రాసయన్తో విహగాం స్త్రాసయన్తో మృగద్విపాన్,
కమ్పయన్తశ్చ తాం లఙ్కాం నాదై స్తే నదతాం వరాః. ౧౫

కుర్వన్త స్తే మహావేగాం మహీం చరణపీడితామ్,

రజశ్చ సహసైవోర్ధ్వం జగామ చరణోత్థితమ్. ౧౬

ఋక్షా స్సింహా వరాహాశ్చ మహిషా వారణా మృగాః,
తేన శబ్దేన విత్రస్తా జగ్ము ర్భీతా దిశో దశ. ౧౭

శిఖరం తత్త్రికూటస్య ప్రాంశు చైకం దివిస్పృశమ్,
సమన్తా త్పుష్పసంఛన్నం మహారజతసన్నిభమ్. ౧౮
శతయోజనవిస్తీర్ణం విమలం చారుదర్శనమ్,
శ్లక్ష్ణం శ్రీమ న్మహచ్చైవ దుష్ప్రాపం శకునై రపి. ౧౯
మనసాఽపి దురారోహం కింపునః కర్మణా జనైః,
నివిష్టా తత్ర శిఖరే లఙ్కా రావణపాలితా. ౨౦
శతయోజనవిస్తీర్ణా త్రింశద్యోజన మాయతా,

అప్పుడు మహాపరాక్రమశాలులగు వానరులు లావనంబులం బ్రవేశించునప్పుడు పుష్పసంబంధంబునం జేసి సుగంధిలంబగు వాయువు వారలపై వీచెను. ౧౩

మఱికొంద ఱావానరవీరులు మాత్రము సుగ్రీవుని యనుమతినొంది వానరసేననుండి బయలుదేఱి పతాకాశోభితంబగు లంకకుఁ బోయిరి. ౧౪

గట్టిగా నఱవఁగలవారలలో నుత్తములగు వానరులు సింహనాదంబులచేఁ బక్షులను మృగంబుల నేనుగులను భయపఱచుచు లంకాపురినంతయుఁ జలింపం జేయుచుఁ బోయిరి. ౧౫

మహావేగులగు వానరులు తమపాదాఘాతవేగంబున భూమిం బీడించుచుఁ బోయిరి.

అంత నవ్వానరులచరణాఘాతంబునం జేసి నిమేషమాత్రంబున నాకాశం బంతయుం బరాగావృతంబయ్యెఁ. ౧౬

లంకావనంబులనుండునట్టి యెలుఁగుబంటులును సింహంబులును వరాహంబులును మహిషంబులును గజంబులును జింకలును అవ్వానరుల భీకరాకారంబులఁ జూచుటచే భయపడియున్నవి గావున వారల సింహనాదంబులు విన్నంతనే మఱియుం భయపడి దశదిశలకుం బాఱినవి. ౧౭

ఉన్నతంబును మధ్యమంబును నాకాశంబు స్పృశించుచున్నట్లున్నదియుం నంతటను బుష్పావృతమయి యుండునదియుం బంగారమువన్నెగలదియుం నూఱుయోజనంబుల వైశాల్యముఁగలదియుం నిర్మలంబును సుందరంబును శ్రీమంతంబును బక్షులకైనఁ బొందనలవిగానిదియునగు నా త్రికూటశిఖరమును జనులకు మనస్సుచేనైనఁ బొందనలవిగాదు; ఇంక నడచిపోలేరని చెప్పనేల?

రావణబాహుపాలితంబును నూఱుయోజనంబులనిడుపును ముప్పది యోజనంబులవెడలుపును గలదియునగు లంకాపురి యాత్రికూటశిఖరంబున నున్నది. ౨౦

సా పురీ గోపురై రుచ్చైః పాణ్డురామ్బుదసన్నిభైః. ౨౧
కాఞ్చనేన చ సాలేన రాజతేన చ శోభితా,

ప్రాసాదైశ్చ విమానైశ్చ లఙ్కా పరమభూషితా. ౨౨
ఘనై రివాఽఽతపాపాయే మధ్యమం వైష్ణవం పదమ్,

యస్యాం స్తమ్భసహస్రేణ ప్రాసాద స్సమలఙ్కృతః. ౨౩
కైలాసశిఖరాకారో దృశ్యతే ఖమివోల్లిఖన్,

చైత్య స్సరాక్షసేన్ద్రస్య బభూవ పురభూషణమ్. ౨౪
శతేన రక్షసాం నిత్యం య స్సమగ్రేణ రక్ష్యతే,

మనోజ్ఞాం కాననవతీం పర్వతై రుపశోభితామ్. ౨౫
నానాధాతువిచిత్రైశ్చ ఉద్యానై రుపశోభితామ్,
నానావిహంగసంఘుష్టాం నానామృగనిషేవితామ్. ౨౬
నానాకాననసఞ్ఛన్నాం నానారాక్షససేవితామ్,
తాం సమృద్ధాం సమృద్ధార్థాం లక్ష్మీవా న్లక్ష్మణాగ్రజః. ౨౭
రావణస్య పురీం రామో దదర్శ సహ వానరైః,
తాం మహాగృహసమ్బాధాం దృష్ట్వా లక్ష్మణపూర్వజః. ౨౮
నగరీ మమరప్రఖ్యాం విస్మయం ప్రాప్య వీర్యవాన్.

తాం రత్నపూర్ణాం బహుసంవిధానాం
ప్రాసాదమాలాభిరలంకృతాం చ,

అలంకాపురి తెల్లని మేఘంబులవంటి యత్యున్నతంబులగు పురద్వారంబులును గాంచనమయంబగు ప్రాకారంబును రాజతంబగు ప్రాకారంబునుం గల్గి యెంతయుం నొప్పుచుండినది. ౨౧

వర్షాకాలంబున మేఘంబులచే నాకాశంబువలె రాజగృహంబులచేతను విమానాకారగృహంబులచేతను అలంకాపురి యెంతయుం బ్రకాశించుచుండినది. ౨౨

అలంకాపురియందు వేయి స్తంభములచే నలంకరింపఁబడినదియుం గైలాసశిఖరంబువలె నత్యున్నతంబునగు చైత్యప్రాసాద మొకటి యాకాశంబునొరయునట్లు చూపట్టుచుండినది. ౨౩

దేని నెల్లప్పుడును నూఱుగురురాక్షసులు గావలియుండి రక్షింపుచుందురో అట్టిరాక్షసరాజుండగు రావణుని చైత్యప్రాసాదము లంకాపురంబునకంతయు భూషణమయి వెలుఁగుచుండినది. ౨౪

శ్రీమంతుఁడును లక్ష్మణుని యన్నయునగురాముఁడు వానరులతోఁగూడ మనోహరంబును నానావిధధాతుమండితంబులగు పర్వతంబులుగలదియు నుద్యానవనాలంకృతంబును మధురంబుగాఁ గూయుచుండు నానావిధపక్షులు గలదియు నానావిధమృగసేవితంబును నానావిధములయినయడవులుగలదియు నానావిధాకారులగు రాక్షసులచే నిండినదియు నత్యున్నతంబును సమృద్ధార్థంబునగు నారావణుని లంకాపురిం జూచెను. ౨౫-౨౭

పరాక్రమవంతుఁడును దేవసదృశుఁడును లక్ష్మణాగ్రజుఁడునగు రాముఁడు ఉత్తమంబులగుగృహంబులచే నిండియున్న యాలంకాపురింజూచి యాశ్చర్యంబు నొందెను. ౨౮

రాముఁడు అనంతవానరసేనాపరివృతుఁడై శ్రేష్ఠవస్తుపూర్ణంబును నానావిధమయిన రక్షణంబు గలదియుఁ బెక్కుప్రాసాదములచే నలంకృతమును

పురీం మహాయన్త్రకవాటముఖ్యాం
దదర్శ రామో మహతా బలేన. ౨౯

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే ఏకోనచత్వారింశస్సర్గః. 39.

---

## చత్వారింశస్సర్గః.

తతో రామ స్సువేలాగ్రం యోజనద్వయమణ్డలమ్,
ఆరురోహ ససుగ్రీవో హరియూథపసంవృతః. ౧
స్థిత్వా ముహూర్తం తత్రైవ దిశో దశ విలోకయన్,
త్రికూటశిఖరే రమ్యే నిర్మితాం విశ్వకర్మణా. ౨
దదర్శ లఙ్కాం సున్యస్తాం రమ్యకాననశోభితామ్,

తస్యాం గోపురశృఙ్గస్థం రాక్షసేన్ద్రం దురాసదమ్. 3
శ్వేతచామరపర్యన్తం విజయచ్ఛత్రశోభితమ్,
రక్తచన్దనసంలిప్తం రత్నాభరణభూషితమ్. ౪
నీలజీమూతసఙ్కాశం హేమసంఛాదితామ్బరమ్,
ఐరావతవిషాణాగ్రైరుత్కృష్టకిణవక్షసమ్. ౫
శశలోహితరాగేణ సంవీతం రక్తవాససా,
సన్ధ్యాతపేన సంవీతం మేఘరాశి మివామ్బరే. ౬

పశ్యతాం వానరేన్ద్రాణాం రాఘవస్యాపి పశ్యతః,
దర్శనా ద్రాక్షసేన్ద్రస్య సుగ్రీవ స్సహసోత్థితః. ౭
క్రోధవేగేన సంయుక్త స్సత్త్వేన చ బలేన చ,
అచలాగ్రాదథోత్థాయ పుప్లువే గోపురస్థలే. ౮
స్థిత్వా ముహూర్తం సమ్ప్రేక్ష్య నిర్భయేనాన్తరాత్మనా,

గొప్ప యంత్రకవాటంబులతోఁ గూడినదియు నగు నా లంకానగరముం జూచెను. ౨౯

ఇది ముప్పదితొమ్మిదవసర్గము.

## నలువదవసర్గము.

అంత రాముఁడు సుగ్రీవుని, వానరయూథపులనుంగూడి రెండు యోజనములవై శాల్యముగల సువేలపర్వతశిఖరంబు నారోహించెను. ౧

రాముఁడు సువేలశిఖరంబున నే కొంచెముసేపుండి దశదిశలం జూచుచు సుందరమయిన త్రికూటపర్వతశిఖరంబున విశ్వకర్మచే దృఢంబుగా నిర్మితంబును రమణీయంబులగు వనంబులతోఁ గూడినదియునగు లంకాపురముం జూచెను. ౨

అంత రాముఁడు ఆలంకాపురి గోపురశిఖరంబుననుండిన దురాసదుఁడును దెల్లనివింజామరలచే నిరుగెలంకుల వీచఁబడుచున్న వాఁడును జయసూచకంబగు శ్వేతచ్ఛత్రముతోఁ గూడినవాఁడును రక్తచందనాలంకృతుఁడును రత్నమయంబులగు సొమ్ములం దొడుగుకొన్న వాఁడును నూతనమేఘంబువలె నల్లని మేనివాఁడును బలుమాఱు ఐరావతగజంబుతో యుద్ధము చేసియుండుటవలన దానిదంతంబులపోటులచేఁ గలిగిన గాయలతో నొప్పుచున్న వక్షస్స్థలంబు గలవాఁడును గుంకేటిరక్తంబువలె మిక్కిలియు నెఱ్ఱనైన బంగారుజరీవలువలం గట్టుకొన్న వాఁడగుటచే సంధ్యారాగావృతంబగు మేఘసమూహముం బోలెఁ జూపట్టుచున్న వాఁడునగు రాక్షసనాథుని రావణుం గనెను. ౩, ౬

అంత వానరశ్రేష్ఠులును రాముఁడును జూచుచుండఁగానే సుగ్రీవుఁడు రాక్షసరాజుండగు రావణుంజూచుటవలనఁ బరమకోపంబునొంది బలధైర్యసమన్వితుడై సువేలపర్వతశిఖరంబుననుండి తత్క్షణంబు యారావణుం డున్న గోపురంబుపై కెగిరెను. ౭, ౮

ఆ సుగ్రీవుఁడు కొంచెముసేపు రావణుంజూచుచుండి నిర్భయంబుగా

తృణీకృత్య చ తద్రక్షః సోఽబ్రవీ త్పరుషం వచః. ౯
లోకనాథస్య రామస్య సఖా దాసోఽస్మి రాక్షస!,
న మయా మోక్ష్యసేఽద్య త్వం పార్థివేన్ద్రస్య తేజసా. ౧౦

ఇత్యుక్త్వా సహసోత్పత్య పుప్లువే తస్య చోపరి,
ఆకృష్య ముకుటం చిత్రం పాతయిత్వాఽపతద్భువి. ౧౧
సమీక్ష్య తూర్ణ మాయాన్త మాబభాషే నిశాచరః,

సుగ్రీవ స్త్వం పరోక్షం మే హీనగ్రీవో భవిష్యసి. ౧౨

ఇత్యుక్త్వోత్థాయ తం క్షిప్రం బాహుభ్యా మాక్షిప త్తలే,
కన్దువ త్తం సముత్థాయ బాహుభ్యా మాక్షిప ద్ధరిః. ౧౩

పరస్పరం స్వేదవిదగ్ధగాత్రౌ
పరస్పరం శోణితదిగ్ధదేహౌ,
పరస్పరం శ్లిష్టనిరుద్ధచేష్టౌ
పరస్పరం శాల్మలికింశుకౌ యథా. ౧౪
ముష్టిప్రహారై శ్చ తలప్రహారై
రరత్నిఘాతై శ్చ కరాగ్రఘాతైః,
తౌ చక్రతు ర్యుద్ధ మసహ్యరూపం
మహాబలౌ వానరరాక్షసేన్ద్రౌ. ౧౫
కృత్వా నియుద్ధం భృశ ముగ్రవేగౌ
కాలం చిరం గోపురవేదిమధ్యే,
ఉత్క్షిప్య చాక్షిప్య వినమ్య దేహౌ

నా రావణుం దృణీకరించి పరుషవచనమున నిట్లని చెప్పెను. ౯

రావణుఁడా! నేను లోకనాథుఁడగు రామునిస్నేహితుఁడను; దాసుఁడను; రాజశ్రేష్ఠుఁడను రాముని తేజోబలంబున నిన్నిప్పుడును నేను విడువను. అని సుగ్రీవుఁడు రావణునితోఁ జెప్పెను. ౧౦

ఆ సుగ్రీవుఁ డిట్లు రావణునితోఁ జెప్పి తటాలునఁ బైకెగిరి యాతని కిరీటంబు నేలం బడఁద్రోసి క్రిందికి వ్రాలెను. ౧౧

రావణుఁడు అతివేగంబునఁ దనమీఁది కడరుచున్న సుగ్రీవుంజూచి యిట్లని చెప్పెను.

నీవు నాపరోక్షంబున సుందరమగు కంఠముగలిగియుంటివి; ఇప్పుడు నాసమక్షమునకు వచ్చినావు. కావున నింకఁ గంఠములేనివాఁడ వవుదువు. అని రావణుఁడు సుగ్రీవునితోఁ జెప్పెను. ౧౨

ఆ రావణుఁడు ఇట్లు చెప్పి శీఘ్రంబున లేచి యాసుగ్రీవునిఁ జేతులతో నేలంబడఁ ద్రోసెను; అంత నాసుగ్రీవుఁడు చెండువలెఁ దటాలున నెగిరి రెండుచేతులచేతను ఆరావణుఁ బడఁద్రోసెను. ౧౩

ఆ రావణసుగ్రీవులు దేహ మంతయుఁ జెమటగాఱ దేహ మంతయుం నెత్తురు వెల్లువలుగా యుద్ధముసేయుచుఁ గొంతదడవు పరస్పరదృఢాలింగనంబున నిశ్చేష్టులయి యంత విడివడుచుఁ బుష్పితంబులగు శాల్మలికింశుక వృక్షంబులుంబోలెఁ బ్రకాశించుచుండిరి. ౧౪

మహాబలశాలులగు నాసుగ్రీవరావణులు ఒండొరులఁ బిడికిళ్లఁ గ్రుద్దుకొనియుం నఱచేతులం జఱచుకొనియు మోచేతులం బొడుచుకొనియుం గోళ్లం గీఱుకొనియు నిట్లు నానావిధంబును భయంకరప్రకారంబునగు యుద్ధంబు గావించిరి. ౧౫

భయంకరవేగులగు నాసుగ్రీవరావణులు గోపురవేదిమధ్యంబున బహుకాలము బాహుయుద్ధము గావించి యొకరినొకరు ద్రోసికొనుచును ఈడ్చుకొనుచు వంచుకొనుచు గోపురవేదికలయందుండి యొక్కరిపైనొకరు పడికొట్టు

పాదక్రమా ద్గోపురవేదిలగ్నౌ, ౧౬
అన్యోన్య మావిధ్య విలగ్నదేహౌ
తౌ పేతతు స్సాలనిఖాతమధ్యే,
ఉత్పేతతు ర్భూతల మస్పృశన్తౌ
స్థిత్వా ముహూర్తం త్వభినిశ్వసన్తౌ. ౧౭
ఆలిఙ్గ్య చావల్గ్య చ బాహుయోక్త్రైః
స్సంయోజయామాసతు రాహవే తౌ,
సంరమ్భశిక్షాబలసంప్రయుక్తౌ
సంచేరతు స్సమ్ప్రతి యుద్ధమార్గైః, ౧౮

శార్దూలసింహావివ జాతదర్పౌ
గజేన్ద్రపోతావివ సమ్ప్రయుక్తౌ,
సంహత్య చాపీడ్య చ తావురోభ్యాం
నిపేతతు ర్వై యుగప ద్ధరణ్యామ్. ౧౯
ఉద్యమ్య చాన్యోన్య మధిక్షిపన్తౌ
సంచక్రమాతే బహుయుద్ధమార్గైః,

వ్యాయామశిక్షాబలసమ్ప్రయుక్తౌ
క్లమం న తౌ జగ్మతురాశు వీరౌ. ౨౦
బాహూత్తమై ర్వారణవారణాభై
ర్నివారయన్తౌ వరవారణాభౌ,
చిరేణ కాలేన తు సంప్రయుక్తౌ
సంచేరతు ర్మణ్డలమార్గ మాశు. ౨౧

తౌ పరస్పర మాసాద్య యత్తా వన్యోన్యసూదనే,
మార్జారా వివ భక్ష్యార్థే వితస్థాతే ముహుర్ముహుః. ౨౨

కొనుచు ఒక్కరినొక్కరు దృఢంబుగాఁ గవుఁగిలించుకొని ప్రాకారపరిఖల నడుమంబడిరి. ౧౬

యుద్ధంబున నాసుగ్రీవరావణులు నేలనుండి యాకాశంబున కుద్గమించి యందుఁ గొంతదడవుండి నిట్టూర్పులుపుచ్చుచు, నొకరినొకరు కవుఁగిలించుకొని యెగురుచు బాహుపాశంబులఁ బరస్పరము బంధించుకొనిరి. ౧౭

అప్పుడు ఆసుగ్రీవరావణులు అభినివేశంబునను అభ్యాసంబునను బలంబునను బెద్దపులులవలె ఏనుఁగుపిల్లలంబోలె నానావిధ యుద్ధమార్గంబులం జెనంగిరి. ౧౮

ఆ సుగ్రీవరావణులు ఒకరినొకరు కవుఁగిలించుకొని బొమ్ములఁ జేఁ గొట్టుకొని యిద్దఱు నేకకాలంబున నేలంబడిరి; అంత నొకరినొకరు పట్టుకొని యాక్షేపించికొనుచు నిట్లు నానావిధంబులుగ యుద్ధంబు గావించిరి. ౧౯

చక్కఁగా సాముచేసి యున్నవారలు శౌర్య పరాక్రమవంతులును మదపుటేనుఁగులవంటి వారలునగు నాసుగ్రీవరావణులు ఏనుఁగులంగట్టు స్తంభంబులవంటి బాహువుల నొండొరులం గొట్టుకొనుచున్నను అలసటనొందరైరి.

ఆసుగ్రీవరావణులు ఇట్లు బహుకాలము యుద్ధము చేయుచుండి యంత మండలాది నానావిధమార్గంబులఁ దమతమ యుద్ధక్రమసాధన చమత్కారంబు తేటపడ యుద్ధంబు గావించిరి. ౨౧

ఆ సుగ్రీవరావణులు ఒకరినొకరు వధింప నాసక్తులయి యాహారమునకై పొంచియుండుపిల్లులవలె నప్పుడప్పుడు ఒకరిఛిద్రంబు నొకరు వెదకుచుండిరి. ౨౨

మణ్డలాని విచిత్రాణి స్థానాని వివిధాని చ,
గోమూత్రికాణి చిత్రాణి గతప్రత్యాగతానిచ. ౨౩
తిరశ్చీనగతాన్యేవ తథా వక్రగతాని చ,
పరిమోక్షం ప్రహారాణాం వర్జనం పరిధావనమ్. ౨౪
అభిద్రవణ మాప్లావ మాస్థానం చ సవిగ్రహమ్,
పరావృత్త మపావృత్త మపద్రుత మవప్లుతమ్. ౨౫
ఉపన్యస్త మపన్యస్తం యుద్ధమార్గవిశారదౌ,
తౌ సఞ్చేరతురన్యోన్యం వానరేన్ద్రశ్చ రావణః. ౨౬

ఏతస్మిన్నన్తరే రక్షో మాయాబల మథాఽఽత్మనః,
ఆరబ్ధుముపసమ్పేదే
జ్ఞాత్వా తం వానరాధిపః. ౨౭
ఉత్పపాత తదాఽఽకాశం జితకాశీ జితక్లమః,
రావణః స్థిత ఏవాత్ర హరిరాజేన వఞ్చితః. ౨౮

అథ హరివరనాథః ప్రాప్య సఙ్గ్రామకీర్తిం
నిశిచరపతి మాజౌ యోజయిత్వా శ్రమేణ,
గగన మతివిశాలం లఙ్ఘయిత్వాఽర్కసూను
ర్హరివరగణమధ్యే రామపార్శ్వం జగామ. ౨౯
ఇతి స సవితృసూనుస్తత్ర తత్కర్మ కృత్వా
పవనగతి రనీకం ప్రావిశత్సమ్ప్రహృష్టః,

యుద్ధమార్గంబులం బండితులగు నాసుగ్రీవరావణులు చక్రాకారగమనంబులును వైష్ణవవైశాఖకుండల ప్రత్యాలీఢాలీఢములను స్థానములును గోమూత్రమువంటి కుటిలగమనములును ఉపసర్పణాపసర్పణములును దిర్యగ్గమనములును సవ్యాపసవ్యవక్రగమనములును ఎదిరి దెబ్బలదప్పించుకొనుట తన దెబ్బను దప్పించుకొన నెదిరికిఁ దెలిసినప్పుడు దెబ్బ నుపసంహరించుట ఎదిరి నిలుచుండఁగా నతని చుట్టుం దిరుగుట అభిముఖగమనము ఈషదమనము ధైర్యమున నెదిరిని నిగ్రహించి స్థిరంబుగా నుండుట పరాఙ్ముఖగమనంబు నిలుచున్నట్లే యుండి వెనుకకుఁబోవుట శరీరసంకోచంబున నెదిరిపట్టుననుండి తప్పించుకొనుట ఎదిరిని గాలందన్నుటకై యధోముఖముగా నెగురుట ఎదిరి చేయిఁబట్టుకొనుటకై తనచేయి చాఁచుట ఎదిరి తనచేయిఁబట్టుకొన యత్నించినప్పుడు తనచేయిని ముడుచుకొనుట ఈ మార్గములన్నియుఁ బ్రయోగించుచు యుద్ధంబు గావించిరి. ౨౩, ౨౪

అంత నట్లు పోవుచుండునప్పుడు రావణుఁడు సోలి తన మాయాబలంబుఁజూప నారంభించెను. ౨౫

జయశాలియుఁ శ్రమములేనివాఁడు నగుసుగ్రీవుఁడు ఆరావణుని తలంపెఱింగి తటాలున నాకాశంబున కెగసెను. ౨౬

రావణుఁడు సుగ్రీవుఁడు మరల వచ్చునని మోసపోయి యచ్చటనే యుండెను. ౨౭

అంత సూర్యపుత్రుఁడగు సుగ్రీవుఁడు యుద్ధంబున రాక్షసేశ్వరుఁడగు రావణునిసోలించి కీర్తినొంది యతివిశాలంబగు నాకాశంబునకు లంఘించి వానరమధ్యంబున రాముని పార్శ్వభాగంబుఁ జేరెను. ౨౮

సూర్యకుమారుఁడగు నా సుగ్రీవుఁడు అట్లు రావణుతో యుద్ధంబు గావించి పరమసంతుష్టుఁడై శ్రీరాముని యుద్ధోత్సాహంబు వృద్ధిఁబొందిం

రఘువరనృపసూనోర్వర్ధయన్యుద్ధహర్షం
తరుమృగగణముఖ్యైః పూజ్యమానో హరీన్ద్రః. ౩౦

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే చత్వారింశస్సర్గః. ౪౦.

---

## ఏకచత్వారింశస్సర్గః.

అథ తస్మి న్నిమిత్తాని దృష్ట్వా లక్ష్మణపూర్వజః,
సుగ్రీవం సమ్పరిష్వజ్య తదా వచన మబ్రవీత్. ౧
అసమ్మన్త్ర్య మయా సార్ధం తదిదం సాహసం కృతమ్,
ఏవం సాహసకర్మాణి న కుర్వన్తి జనేశ్వరాః. ౨
సంశయే స్థాప్య మాం చేదం బలంచ సవిభీషణమ్,
కష్టం కృత మిదం వీర! సాహసం సాహసప్రియ!. ౩

ఇదానీం మాకృథా వీర! ఏవంవిధ మచిన్తితమ్,

త్వయి కించి త్సమాపన్నే కిం కార్యం సీతయా మమ. ౪
భరతేన మహాబాహో! లక్ష్మణేన యవీయసా!,
శత్రుఘ్నేన చ శత్రుఘ్న! స్వశరీరేణ వా పున!. ౫
త్వయి చానాగతే పూర్వ మితి మే నిశ్చితా మతిః,
జానతశ్చాపి తే వీర్యం మహేన్ద్రవరుణోసమ!. ౬

హత్వాఽహం రావణం యుద్ధే సపుత్త్రబలవాహనమ్,
అభిషిచ్య చ లఙ్కాయాం విభీషణ మథాపి చ. ౭
భరతే రాజ్య మావేశ్య త్యక్ష్యే దేహం మహాబల!,

చుచు వానరవీరులచేఁ బూజ్యమానుఁడై వాయువేగంబున వానరసేనం బ్రవేశించెను. ౩౦

ఇది నలువదవసర్గము.

## నలువదియొకటవసర్గము.

అంత నప్పుడు లక్ష్మణాగ్రజుండగు రాముఁడు సుగ్రీవునియందు యుద్ధచిహ్నంబులం జూచి యతనిఁ గవుఁగలిగించుకొని యిట్లనిచెప్పెను. ౧

నీవు నాతో నాలోచింపక గొప్పసాహసము గావించినావు; రాజులు ఇట్టింతమాత్రము సాహసకార్యములం జేయరు. ౨

సాహసప్రియుఁడవు వీరుఁడవు నగుసుగ్రీవుఁడా! నీవు నాకును విభీషణునకును ఈవానరసైన్యమున కంతయు గొప్పసందేహము గల్గునట్లు యపాయకరమయిన యీసాహసకార్యము గావించినావు. ౩

వీరుఁడవగుసుగ్రీవుఁడా! ఇంక నైన నిట్టికార్యమును ఆలోచింపక గావింపకుము.

మహాబాహుఁడవు శత్రువుల వధించువాఁడవు నగు సుగ్రీవుఁడా! నీకు ఏమైన హానిగలుగునెడ సీతతోఁగాని భరతునితోఁగాని లక్ష్మణునితోఁగాని శత్రుఘ్నునితోఁగాని నాదేహముతోఁగాని నాకేమి కార్యము? ౪,౫

దేవేంద్రవరుణుల పరాక్రమమువంటి పరాక్రమముగల సుగ్రీవుఁడా! నీవు రాకమునుపు నాకు నీపరాక్రమము దెలిసియున్నను ఈప్రకారమునిశ్చయించియుంటిని. ౬

మహాబలుఁడవగు సుగ్రీవుఁడా! నేను యుద్ధంబున రావణునిపుత్రబంధు సైన్యసమేతంబుగా వధించి లంకయందు విభీషణుఁ బట్టాభిషిక్తుం గావించి యయోధ్యకుఁ బోయి రాజ్యమును భరతుని యధీనముఁ జేసి దేహంబు విడిచెదను; అని యిట్లు నిశ్చయించుకొని యుంటిని. అని రాముఁడు సుగ్రీవునితోఁ జెప్పెను. ౭

తమేవంవాదినం రామం సుగ్రీవః ప్రత్యభాషత. ౮
తవ భార్యాపహర్తారం దృష్ట్వా రాఘవ! రావణమ్,
మర్షయామి కథం వీర! జానన్పౌరుష మాత్మనః. ౯

ఇత్యేవంవాదినం వీర మభినన్ద్య స రాఘవః!,
లక్ష్మణం లక్ష్మి సమ్పన్న మిదం వచన మబ్రవీత్. ౧౦
పరిగృహ్యోదకం శీతం వనాని ఫలవన్తి చ,
బలౌఘం సంవిభజ్యేమం వ్యూహ్య తిష్ఠేమ లక్ష్మణ!. ౧౧

లోకక్షయకరం భీమం భయం పశ్యామ్యుపస్థితమ్,
నిబర్హణం ప్రవీరాణా మృక్షవానరరక్షసామ్, ౧౨
వాతాశ్చ పరుషా వాన్తి కమ్పతే చ వసున్ధరా,
పర్వతాగ్రాణి వేపన్తే పతన్తి ధరణీరుహాః. ౧౩
మేఘాః క్రవ్యాదసంకాశాః పరుషాః పరుషస్వనాః,
క్రూరాః క్రూరం ప్రవర్షన్తి మిశ్రం శోణితబిన్దుభిః. ౧౪

రక్తచన్దనసంకాశా సన్ధ్యా పరమదారుణా,
జ్వలచ్చ నిపతత్యేత దాదిత్యా దగ్నిమణ్డలమ్. ౧౫

ఆదిత్య మభివాశ్యన్తి జనయన్తో మహద్భయమ్,
దీనా దీనస్వరా ఘోరా నప్రశస్తా మృగద్విజాః. ౧౬

రజన్యా మప్రకాశశ్చ సన్తాపయతి చన్ద్రమాః,
కృష్ణరక్తాంశుపర్యన్తో యథా లోకస్య సంక్షయే. ౧౭

సుగ్రీవుఁడు రాముఁడట్లు చెప్పినమాటనువిని ఇట్లని బదులుచెప్పెను.

పరాక్రమవంతుఁడవగు రాముఁడా! నీభార్య నపహరించినట్టి దుష్టుఁడగు రావణునిజూచి నేనుపౌరుషంబుగలవాఁడనై యుండి యెట్లు సహింతును? అని సుగ్రీవుఁడు రామునితోఁ జెప్పెను. ౯

అంత రాముఁడు సుగ్రీవునిమాటనువిని శాంతిమంతుఁడగు లక్ష్మణుం జూచి యిట్లని చెప్పెను. ౧౦

లక్ష్మణుఁడా! మనము చల్లనిజలంబును మంచిఫలంబులతోఁగూడిన వనంబులుంగల ప్రదేశంబుజేరి సైన్యంబులఁ జక్కఁగా విభజించి వ్యూహంబులుగాఁ దీర్చుకొనియుందము. ౧౧

లోకనాశకరంబును భయంకరంబునునగుభయంబొకటి వాటిల్లిఋక్షవానరవీరులును రాక్షసవీరులును పెక్కండ్రుహతులగుదురని తోఁచుచున్నది.

వాయువులు పరుషముగా వీచుచున్నవి; పర్వతశిఖరంబులు వడఁకుచున్నవి; వృక్షంబులు విఱిగిపడుచున్నవి. ౧౩

మేఘములు క్రూరపక్షులంబోలెఁ జూపట్టుచు భయంకరంబుగాగర్జించుచు భయంకరంబులయి మహాభయసూచకంబగునట్లుగా నెత్తురు బిందువులతో వానగురియుచున్నవి.

సంధ్య ఎఱ్ఱనిచందనంబుంబోలెఁ గ్రాలుచు మిక్కిలియు భయంకరంబయియున్నది; ఇదిగో సూర్యమండలంబుననుండి మండుచున్న యగ్నిఖండంబులు పడుచున్నవి. ౧౫

అమంగళకరంబులును భయంకరంబులునగు మృగపక్షులు దీనంబులయి మహాభయంబు గలుగఁజేయుచు దీనస్వరంబున సూర్యుని కెదురునిలుచుండి యఱచుచున్నవి. ౧౬

ప్రళయకాలమునందుంబోలె రాత్రికాలంబునఁ జంద్రుండు కాంతిహీనుఁడై నలుపు నెఱ్ఱఁదనంబును కొనయందుఁగలవాఁడై సంతాపంబు గలిగించుచున్నాఁడు. ౧౭

ప్రాప్తో రూక్షోఽప్రశస్తశ్చ పరివేష స్సులోహితః,

ఆదిత్యమణ్డలే నీలం లక్ష్మ లక్ష్మణ! దృశ్యతే. ౧౮
దృశ్యన్తేన యథావచ్చ నక్షత్రాణ్యభివర్తతే,
యుగాన్త మివ లోకస్య పశ్య లక్ష్మణ! శంసతి. ౧౯
కాకా శ్శ్యేనా స్తథా గృధ్రా నీచైః పరిపతన్తి చ,
శివా శ్చాప్యశివా వాచః ప్రవదన్తి మహాస్వనాః. ౨౦
క్షిప్ర మద్య దురాధర్షాం లఙ్కాం రావణపాలితామ్,
అభియామ జవే నైవ సర్వతో హరిభి ర్వృతాః. ౨౧

ఏవం సంవద న్వీరో లక్ష్మణం లక్ష్మణాగ్రజః,
తస్మా దవాతర చ్ఛీఘ్రం పర్వతాగ్రా న్మహాబలః. ౨౨
అవతీర్య చ ధర్మాత్మా తస్మా చ్ఛైలాత్స రాఘవః,
పరైః పరమదుర్ధర్షం దదర్శ బలమాత్మనః. ౨౩
సన్నహ్య తు ససుగ్రీవః కపిరాజబలం మహత్,
కాలజ్ఞో రాఘవః కాలే సంయుగాయాభ్యచోదయత్. ౨౪

తతః కాలే మహాబాహు ర్బలేన మహతా వృతః,
ప్రస్థితః పురతో ధన్వీ లఙ్కా మభిముఖః పురీమ్. ౨౫
తం విభీషణసుగ్రీవౌ హనూమా ఞ్జామ్బవా న్నళః,
ఋక్షరాజ స్తథా నీలో లక్ష్మణ శ్చాన్వయు స్తదా. ౨౬

తతః పశ్చా త్సుమహతీ పృతనర్క్షవనౌకసామ్,
ప్రచ్ఛాద్య మహతీం భూమి మనుయాతి స్మ రాఘవమ్. ౨౭
శైలశృఙ్గాణి శతశః ప్రవృద్ధాంశ్చ మహీరుహాన్,

చంద్రునిపరివేషము హ్రస్వముగాను భయంకరముగాను రక్తవర్ణముగాను జూపట్టుచున్నది.

లక్ష్మణుఁడా! సూర్యమండలంబున నల్లనికలంకంబు కనుపట్టుచున్నది.

లక్ష్మణుఁడా! నక్షత్రంబులును మలినంబు లయియున్నవి; ఈదుర్నిమిత్తంబులన్నియు లోకవినాశంబుఁ దెల్పుచున్నవి. ౧౯

కాకులును డేగలును గద్దలును నీచపక్షులతోఁ జేరియున్నవి; నక్కలును పేరెలుంగున నమంగళధ్వనులు సేయుచున్నవి. ౨౦

ఇంక మనము సమస్తవానరులంగూడి యిప్పుడే దురాధర్షంబును రావణబాహురక్షితంబు నగు లంకాపురికి శీఘ్రంబునఁ బోవుదము. అని రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పెను. ౨౧

అట్లు మహాబలుఁడును లక్ష్మణునియన్నయునగు రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పుచు శీఘ్రంబున నాపర్వతశిఖరంబుననుండి దిగెను. ౨౨

ధర్మాత్ముఁడగు నారాముఁడు ఆపర్వతశిఖరంబునుండి దిగి శత్రువులకు దుర్ధర్షంబయి వెలయుచున్న తనవానరసైన్యముం జూచెను. ౨౩

ఏది యేకాలంబునం జేయవలయునో యావిధంబునంతయుఁ జక్కఁగాఁ దెలిసినట్టిరాముఁడు సుగ్రీవునితోఁగూడ నవ్వానరసేన నంతయుఁ బ్రోత్సాహపఱచి యుక్తకాలంబున యుద్ధంబున కాజ్ఞాపించెను. ౨౪

అంతఁ బ్రాతఃకాలంబున మహాబాహుఁడగురాముఁడు ధనుర్ధరుఁడై యసంఖ్యసైన్యంబు వెంబడింప లంకానగరాభిముఖుఁడై పోయెను. ౨౫

అప్పుడు విభీషణుఁడును సుగ్రీవుఁడును హనుమంతుఁడును జాంబవంతుఁడును నలుఁడును సుషేణుఁడును నీలుండును లక్ష్మణుఁడును రాముని వెంబడించిపోయిరి. ౨౬

అంత ననంతంబగు ఋక్షవానరసేన యతివిస్తీర్ణంబుగా భూమి నాచ్ఛాదించి రాముని వెంబడించిపోయినది. ౨౭

ఏనుఁగులంతటిదేహంబుగలవారలును శత్రువులవారింపఁజాలినవారలు

జగృహు స్సర్వతో వీరాః పర్వతాంశ్చ మహాబలాః। ౨౮
తౌ త్వదీర్ఘేణ కాలేన భ్రాతరౌ రామలక్ష్మణౌ,
రావణస్య పురీం లఙ్కా మాసేదతు రరిన్దమౌ, ౨౯
పతాకమాలినీం రమ్యా ముద్యానవనశోభితామ్,
చిత్రవప్రాం సుదుష్ప్రాపా ముచ్చైః ప్రాకారతోరణామ్. ౩౦
తాం సురై రపి దుర్ధర్షాం రామవాక్యప్రచోదితాః,
యథానివేశం సమ్పీడ్య న్యవిశన్త వనౌకసః. ౩౧

లఙ్కాయా స్తూత్తరద్వారం శైలశృఙ్గ మివోన్నతమ్,
రామ స్సహానుజో ధన్వీ జుగోప చ రురోధ చ. ౩౨
లఙ్కా ముపనివిష్టశ్చ రామో దశరథాత్మజః,
లక్ష్మణానుచరో వీరః పురీం రావణపాలితామ్. ౩౩
ఉత్తరద్వార మాసాద్య యత్ర తిష్ఠతి రావణః,
నాన్యో రామాద్ధి తద్ద్వారం సమర్థః పరిరక్షితుమ్. ౩౪
రావణాధిష్ఠితం భీమం వరుణేనేవ సాగరమ్,
సాయుధై రాక్షసై ర్భీమై రభిగుప్తం సమన్తతః. ౩౫
లఘూనాం త్రాసజననం పాతాళ మివ దానవైః,

విన్యస్తాని చ యోధానాం బహూని వివిధాని చ. ౩౬
దదర్శాయుధజాలాని తత్రైవ కవచాని చ,
పూర్వం తు ద్వార మాసాద్య నీలో హరిచమూపతిః. ౩౭
అతిష్ఠ త్సహ మైన్దేన ద్వివిదేన చ వీర్యవాన్,
అఙ్గదో దక్షిణద్వారం జగ్రాహ సుమహాబలః. ౩౮
ఋషభేణ గవాక్షేణ గజేన గవయేన చ,
హనూమా న్పశ్చిమద్వారం రరక్ష బలవా న్కపిః. ౩౯

నగు వానరులు వేలకొలఁదిపర్వతశిఖరంబులను గొప్పవృక్షంబులను ధరించిరి.

శత్రువుల నడఁగఁ ద్రొక్కఁజాలినట్టి యారామలక్ష్మణులు అట్లు సేనాసహితులయిపోవుచు శీఘ్రకాలంబుననే రావణునిలంకాపురిం జేరిరి. ౨౯

అంత నావానరులు రాముని యాజ్ఞం జేసి ధ్వజసమూహాలంకృతంబును రమణీయంబును ఉద్యానవనంబుల నొప్పుచున్నదియు నానావిధమయిన కోట గలదియు శత్రువులకుఁ బొందఁగూడనిదియు ఉన్నతప్రాకారతోరణంబులుగలదియు దేవతలకేని యెదిరింప నలవిగానిదియునగు నాలంకాపురిని దమతమస్థానంబుల నిరోధించి విడిసిరి. ౩౦,౩౧

రాముఁడును లక్ష్మణసహితుఁడై పర్వతశిఖరముంబోలె నత్యున్నతం బయిన లంకాపురి యుత్తరద్వారంబును నిరోధించెను. ౩౨

పరాక్రమవంతుఁడును దశరథమహారాజు పుత్త్రుఁడునగు రాముఁడు లక్ష్మణసహితుఁడై రావణుఁ డెచ్చటనున్నాఁడో అట్టిలంకాపురి యుత్తరద్వారంబుననే నిరోధించియుండెను. ౩౩

సాక్షాద్రావణాధిష్ఠితంబును వరుణాధిష్ఠితంబగు సముద్రంబువలె నున్నదియు భయంకరాకారంబును భయంకరాకారులును ఆయుధధారులునగు రాక్షసులచే సురక్షితంబును దానవరక్షితంబగు పాతాళంబువలెనున్నదియు నల్పులకు భయంకరంబునగు నాయుత్తరద్వారంబు నిరోధించుటకు రాముఁడు దక్క మఱియెవ్వఁడును సమర్థుఁడుగాఁడు. ౩౪,౩౫

రాముఁ డాయుత్తరద్వారంబున రాక్షసయోధులుంచుకొనిన నానావిధంబులగు పెక్కాయుధసమూహములను గవచంబులనుఁ జూచెను. ౩౬

పరాక్రమవంతుఁడగు వానరసేనానాయకుఁడు నీలుఁడు పూర్వద్వారంబున మైందద్వివిదసహితుఁడై నిలిచియుండెను. ౩౭

మహాబలుఁడగు నంగదుఁడు ఋషభగవాక్షులను గజగవయులనుం గూడి దక్షిణద్వారంబునఁ గావలియుండెను. ౩౮

బలవంతుఁడగు హనుమంతుఁడు ప్రమాథిప్రఘసులు మున్నగువానర

ప్రమాథిప్రఘసాభ్యాం చ వీరై రన్యైశ్చ సంగతః,
మధ్యమేచ స్వయం గుల్మే సుగ్రీవ స్సమతిష్ఠత. ౪౦
సహాసరైర్వ ర్హరిశ్రేష్ఠై స్సుపర్ణశ్వసనోపమైః,

వానరాణాంతు షట్త్రింశత్కోట్యగ్ర ప్రఖ్యాతయూథపాః. ౪౧
నిపీడ్యోపనివిష్టాశ్చ సుగ్రీవో యత్ర వానరః,
శాసనేన తు రామస్య లక్ష్మణ స్సవిభీషణః. ౪౨
ద్వారేద్వారే హరీణాం తు కోటిం కోటిం న్యవేశయత్,
పశ్చిమేన తు రామస్య సుగ్రీవ స్సహజామ్బవాన్. ౪౩
అదూరా న్మధ్యమే గుల్మే తస్థౌ బహుబలానుగః,
తే తు వానరశార్దూలా శ్శార్దూలా ఇవ దంష్ట్రిణః. ౪౪
గృహీత్వా ద్రుమశైలాగ్రా న్హృష్టా యుద్ధాయ తస్థిరే,
సర్వే వికృతలాఙ్గూలా స్సర్వే దంష్ట్రానఖాయుధాః. ౪౫
సర్వే వికృతచిత్రాఙ్గా స్సర్వే చ వికృతాననాః,

దశనాగబలాః కేచి త్కేచి ద్దశగుణోత్తరాః. ౪౬
కేచి న్నాగసహస్రస్య బభూవు స్తుల్యవిక్రమాః,

సన్తి చౌఘబలాః కేచి త్కేచి చ్ఛతగుణోత్తరాః. ౪౭
అప్రమేయబలాశ్చాన్యే తత్రాస న్హరియూథపాః,

అద్భుతశ్చ విచిత్రశ్చ తేషా మాసీ త్సమాగమః. ౪౮
తత్ర వానరసైన్యానాం శలభానా మివోద్యమః,

వీరులతోఁగూడి పడమటివాకిలిని రక్షించుచుండెను. ౩౯

సుగ్రీవుఁడు గరుడానిలసమానులగు వానరశ్రేష్ఠులంగూడి బలవంతులగు రావణేంద్రజిత్తులతోఁ బోరు రామహనుమంతుల కిర్వురకును గాకాక్షిన్యాయంబున సాహాయ్యంబు గావించుటకై యుత్తరపశ్చిమద్వారంబుల నడుమ నుండెను. ౪౦

సుప్రసిద్ధులగు యూథపతులతోఁగూడిన ముప్పదియాఱుకోట్లు వానరులు లంకాపురిని నిరోధించి సుగ్రీవుఁడున్న స్థలంబున నుండిరి. ౪౧

రాముని యానతింజేసి లక్ష్మణుఁడును విభీషణుఁడును బ్రతిద్వారంబునను గోటికోటివానరులవంతున నిలిపిరి. ౪౨

రామునకుఁ బశ్చిమపార్శ్వంబు సమీపంబుననే సుగ్రీవుఁడు జాంబవంతుంగూడి బహుసైన్యసహితుఁడై మధ్యగుల్మంబున నుండెను. ౪౩

ఆవానరశ్రేష్ఠులు పెద్దపులులుంబోలె వృక్షంబులను పర్వతశిఖరంబులనుంబట్టుకొని పరమసంతోషంబున యుద్ధంబునకుఁ గాచియుండిరి. ౪౪

ఆవానరులు అందఱును దోఁకలం బైకెత్తుకొని యుండువారలును అందఱును దంతనఖంబులే యాయుధంబులుఁగాఁ గలవారలుగాను అందఱును గోపవికారంబున నానావర్ణములయిన యవయవములు గలవారలుగాను అందఱును వికృతంబులగు ముఖములుగలవారలుగాను ఉండిరి. ౪౫

ఆవానరులలోఁ గొందఱు పదియేనుఁగుల బలముగలవారలును గొందఱు నూఱేనుఁగుల బలముగలవారలును, గొందఱు వేయేనుఁగులబలముగల వారలునుగా నుండిరి. ౪౬

అవ్వానరసేనయందు కొందఱు వానరవీరులు ఓఘసంఖ్యాకములగు నేనుఁగులబలముగలవారలుగాను గొంద ఱందుకు నూఱంతలు బలముగలవారలును కొంద ఱప్రమేయంబగు బలముగలవారలుగాను ఉండిరి. ౪౭

అచ్చట నవ్వానరసైనికులు ఒకగుంపుగానుండుట మిడుతలు గుంపుగట్టినట్లు ఆశ్చర్యకరముగాను విచిత్రముగాను ఉండినది. ౪౮

పరిపూర్ణమివాఽఽకాశం సంఛన్నేవ చ మేదినీ. ౪౯
లఙ్కా ముపనివిష్టైశ్చ సంపతద్భిశ్చ వానరైః,
శతం శతసహస్రాణాం పృథగృక్షవనౌకసామ్. ౫౦
లఙ్కాద్వారా ణ్యుపాజగ్ము రన్యే యోద్ధుం సమన్తతః,

ఆవృత స్సగిరి స్సర్వైస్తై స్సమన్తాత్ ప్లవఙ్గమైః. ౫౧
అయుతానాం సహస్రం చ పురీం తా మభ్యవర్తత,
వానరై ర్బలవద్భిశ్చ బభూవ ద్రుమపాణిభిః. ౫౨
సంవృతా సర్వతో లఙ్కా దుష్ప్రవేశాఽపి వాయునా,
రాక్షసా విస్మయం జగ్ము స్సహసాఽభినిపీడితాః. ౫౩
వానరై ర్మేఘసంకాశైః శ్శక్రతుల్యపరాక్రమైః,

మహాన్ శబ్దోఽభవ త్తత్ర బలౌఘస్యాభివర్తతః. ౫౪
సాగరస్యేవ భిన్నస్య యథా స్యా త్సలిలస్వనః,
తేన శబ్దేన మహతా సప్రాకారా సతోరణా. ౫౫
లఙ్కా ప్రచలితా సర్వా సశైలవనకాననా,
రామలక్ష్మణగుప్తా సా సుగ్రీవేణ చ వాహినీ. ౫౬
బభూవ దుర్ధర్షతరా సర్వైరపి సురాసురైః,
రాఘవ స్సన్నివేశ్యైవ సైన్యం స్వం రక్షసాం వధే. ౫౭
సమ్మన్త్ర్య మన్త్రిభి స్సార్ధం నిశ్చిత్య చ పునఃపునః,
ఆనన్తర్య మభిప్రేప్సుః క్రమయోగార్థతత్త్వవిత్. ౫౮
విభీషణస్యానుమతే రాజధర్మ మనుస్మరన్,
అఙ్గదం వాలితనయం సమాహూయేదమబ్రవీత్. ౫౯
గత్వా సౌమ్య! దశగ్రీవం బ్రూహి మద్వచనాత్కపే!,

లంకచుట్టును విడిసియున్నవారలును విడియ నేతెంచుచున్నవారలు నగు నవ్వానరులచేత భూమ్యాకాశంబులు రెండును నిండిన ట్లుండినవి. ౪౯

మునుపుంచినసైన్యముగాక కోటిఋక్షవానరులు ప్రతిలంకాద్వారంబునందునుఁ జేరియుండిరి; మఱియు నితరులు అచ్చటచ్చటివారల సాహాయ్యమునకై యంతటనుఁ గాచియుండిరి. ౫౦

ఆవానరులచే నా త్రికూటపర్వతమంతయు నాచ్ఛాదితమయియుండినది.

మఱియు కోటివానరులు లంకాపురిచుట్టును బరివేష్టించియుండిరి.

అట్లు బలవంతులగు వానరులు వృక్షహస్తులయి లంకాపురిచుట్టును ముట్టడించుటవలన వాయువునకేనియు నాలంకాపురిం బ్రవేశింప నలవి గాకుండినది.

అట్లు మేఘంబులంతటి దేహములుగలవారలును దేవేంద్రునంతటి పరాక్రమంబుగలవారలునగు వానరులు అతిశీఘ్రంబున వచ్చి ముట్టడించినందుకు రాక్షసు లాశ్చర్యంబునొందిరి. ౫౩

అప్పు డచ్చట అవ్వానరసేన వచ్చుచుండఁగా సముద్రంబు తెంచుకొని ప్రవహించునప్పుడుంబోలె మహాధ్వని గలిగినది. ౫౪

ఆమహాధ్వనికి లంకాపురియంతయుఁ బ్రాకారతోరణపర్వతకాననసహితంబుగాఁ జలించినది. ౫౫

రామలక్ష్మణులచేతను సుగ్రీవునిచేతను రక్షింపఁబడుచున్న యావానరసేన సమస్తదేవాసురులకేని దేఱిచూడ నలవిగాకుండినది ౫౬

అయ్యెకాలంబునఁ జేయవలసినసామాద్యుపాయంబులక్రమంబు దెలిసినట్టి రాముఁడు రాక్షసవధనిమిత్తమయి వానరసైన్య మంతయు యుక్తక్రమంబున విడియ నియమించి యంత ననంతరకర్తవ్యంబుఁ జేయఁగోరి మంత్రులతోఁ జక్కఁగా నాలోచించి నిశ్చయించి రాజధర్మంబు దలఁచి విభీషణానుమతంబున వాలిపుత్రుఁడగు నంగదుం బిలిచి యిట్లని చెప్పెను. ౫౭,౫౮

శాంతుఁడవగు నంగదుఁడా! నీవు గతశ్రముఁడవై భయంబు విడిచి

లఙ్ఘయిత్వా పురీం లఙ్కాం భయం త్యక్త్వా గతవ్యథః. ౬౦

భ్రష్టశ్రీక! గతైశ్వర్య! ముమూర్షో! నష్టచేతన?,
ఋషీణాం దేవతానాం చ గన్ధర్వాప్సరసాం తథా. ౬౧
నాగానా మథ యక్షాణాం రాజ్ఞాం చ రజనీచర!,
యచ్చ పాపం కృతం మోహా దవలిప్తేన రాక్షస!, ౬౨
నూన మద్య గతో దర్ప స్స్వయమ్భువరదానజః,
యస్య దణ్డధర స్తేఽహం దారాహరణకర్శితః. ౬౩
దణ్డం ధారయమాణస్తు లఙ్కాద్వారే వ్యవస్థితః,
పదవీం దేవతానాం చ మహర్షీణాం చ రాక్షస!. ౬౪
రాజర్షీణాం చ సర్వేషాం గమిష్యసి మయా హతః,
బలేన యేన వై సీతాం మాయయా రాక్షసాధమ!. ౬౫
యా మతిక్రామయిత్వా త్వం హృతవాం స్త ద్విదర్శయ,
అరాక్షస మిమం లోకం కర్తాఽస్మి నిశితై శ్శరైః ౬౬
నచేచ్ఛరణ మభ్యేషి మా ముపాదాయ మైథిలీమ్,
ధర్మాత్మా రక్షసాం శ్రేష్ఠ స్సమ్ప్రాప్తోఽయం విభీషణః. ౬౭
లఙ్కైశ్వర్యం ధ్రువం శ్రీమా నయం ప్రాప్నోత్యకణ్టకమ్,

నహి రాజ్య మధర్మేణ భోక్తుం క్షణ మపి త్వయా. ౬౮
శక్యం మూర్ఖసహాయేన పాపేనావిదితాత్మనా,

యుధ్యస్వ వా ధృతిం కృత్వా శౌర్యమాలమ్బ్య రాక్షస!. ౬౯
మచ్ఛరై స్త్వం రణే శాన్త స్తతః పూతో భవిష్యసి,

యద్యావిశసి లోకాం స్త్రీ న్పక్షిభూతో మనోజవః. ౭౦

లంకాప్రాకారంబుదాఁటి రావణు నొద్దకుఁబోయి నేను జెప్పిన ట్లీప్రకారం
బునఁ జెప్పుము ౬౦

నశించినసంపదగలవాఁడవు నష్టైశ్వర్యుఁడవు మరణంబు నొందఁబోవు వాఁడవు నష్టజ్ఞానుఁడవునగు రావణుఁడా! నీవు గర్వంబున ఋషులకును దేవతలకును గంధర్వులకును అచ్చరలకును నాగంబులకును యక్షులకును రాజులకును ఏమి యపకారంబు గావించినావో దానికంతయుఁ గారణమయిన బ్రహ్మవరగర్వమంతయు నిప్పుడు నశించినది. వాస్తవము. ఏలయన దండధరుఁడనగు నేను భార్యాపహరణకుపితుఁడనై నిన్ను శిక్షించుటకు లంకాద్వారం
బునం గనిపెట్టియున్నానే! ౬౧, ౬౩

రావణుఁడా! నీవు నాచే హతుఁడవై గతపాపుఁడవై దేవతలును
మహర్షులును రాజర్షులునుఁ బొందులోకముం బొందఁగలవు. ౬౪

రాక్షసాధముఁడవగు రావణుఁడా! నీవు ఏబలంబున మాయచే నన్ను
మోసపుచ్చి సీతను హరించినావో ఆబలమంతయు నిప్పుడు జూపుము. ౬౫

నీవు సీతను దీసికొనివచ్చి సమర్పించి నన్ను శరణుపొందవేని శరకు
బాణంబుల నీలోకంబునంతయు నరాక్షసంబు గావించెదను. ౬౬

ధర్మస్వభావుఁడును రాక్షసశ్రేష్ఠుఁడునగు నీవిభీషణుఁడు నన్ను శరణం
చొచ్చినాఁడు; శ్రీమంతుఁడగు నీవిభీషణుఁడు అకంటకంబగు లంకాధి
పత్యంబు నొందఁగలఁడు. సందేహమ్ములేదు. ౬౭

మూర్ఖులను సహాయులుగాఁ జేసుకొన్న వాఁడవు పాపిష్ఠుఁడవు స్వాధీ
నముగాని మనస్సుగలవాఁడవు ధర్మరహితుఁడవు నగు నీకు క్షణమయినను
రాజ్యంబు ననుభవింప నలవిగాదు. ౬౮

రావణుఁడా! ధైర్యశౌర్యముల నవలంబించివచ్చి యుద్ధము చేసినను
జేయుము. నీవు యుద్ధంబున నాబాణంబుల మృతుఁడవై గతపాపుఁడవై
పరిశుద్ధుఁడవు కాఁగలవు. ౬౯

అట్లుగాక నీవు పక్షివై మనోవేగంబున ముల్లోకంబులకుఁ బోయినను

మమ చక్షుష్పథం ప్రాప్య న జీవ న్ప్రతియాస్యసి,
బ్రవీమి త్వాం హితం వాక్యం క్రియతా మౌర్ధ్వదైహికమ్.
సుదృష్టా క్రియతాం లఙ్కా జీవితం తే మయి స్థితమ్,

ఇత్యుక్త స్సతు తారేయో రామేణాక్లిష్టకర్మణా. ౭౨
జగామాఽఽకాశ మావిశ్య మూర్తిమా నివ హవ్యవాట్,

సోఽతిపత్య ముహూర్తేన శ్రీమా న్రావణమన్దిరమ్. ౭౩
దద ర్శాఽసీన మవ్యగ్రం రావణం సచివై స్సహ,

తత స్తస్యావిదూరే స నిపత్య హరిపుఙ్గవః. ౭౪
దీప్తాగ్నిసదృశ స్తస్థా వఙ్గదః కనకాఙ్గదః,

తద్రామవచనం సర్వ మన్యూనాధిక ముత్తమమ్. ౭౫
సామాత్యం శ్రావయామాస నివేద్యాత్మాన మాత్మనా,

దూతోఽహం కోసలేన్ద్రస్య రామస్యాక్లిష్టకర్మణః. ౭౬
వాలిపుత్త్రోఽఙ్గదో నామ యది తే శ్రోత్ర మాగతః,

ఆహ త్వాం రాఘవో రామః కౌసల్యానన్దవర్ధనః. ౭౭

నిష్పత్య ప్రతియుధ్యస్వ నృశంస! పురుషో భవ,

నాయెదుటం బడినపిమ్మట బ్రతికిపోఁజాలవు. ౨౦

నీకు హితంబుఁ జెప్పెదను వినుము. ఇఁక లోకం బరాక్షసంబు గాఁ గలదు కావున నిప్పుడే నీకు నీవే యపరక్రియఁ గావించుకొనుము. నీ వింకఁ జూడఁబోవునది లేదు కావున నిప్పుడే లంకనంతయుఁ జక్కఁగాఁ జూచుకొనుము. నీప్రాణంబులు నాచేత నున్నది. ఇట్లు రావణునితోఁ జెప్పుము. అని రాముఁడు అంగదునితోఁ జెప్పెను. ౨౧

తారాపుత్రుఁడగు నంగదుఁడు రాముఁడు చెప్పినమాటను విని యాకాశంబున కెగసి కరచరణాద్యవయవవిశిష్టం బగు శరీరంబునొందిన యగ్నిహోత్రుఁడుంబోలెఁ బోయెను. ౨౨

శ్రీమంతుఁడగు నాయంగదుఁడు ముహూర్తకాలంబున రావణుగృహంబునొంది యచ్చట జాగరూకుఁడును మంత్రులతోఁ గూర్చుండియున్న వాఁడునగు రావణుం జూచెను. 23

అంత బంగారుబాహుపురులు ధరించియుండు వానరోత్తముఁడగు నంగదుఁడు ఆరావణునకు సమీపంబున వ్రాలి మండుచున్న యగ్నికైవడి నిలుచుండెను. ౨౪

ఆయంగదుఁడు మొదలఁ దన పేరు నూరుం జెప్పి యంత మంత్రిసహితుఁడగు రావణునకు రాముఁడు చెప్పినమాటల నన్నియు నెచ్చుతక్కువ లెంతమాత్రము లేకుండునట్లు చెప్పెను. ౨౫

నేను గోసలదేశాధిపతియును బరులకు దుఃఖకరములు కానికార్యములు గలవాఁడునగు రామునిదూతను; వాలికుమారుఁడను; అంగదుఁడని నాపేరు; నీవును వినియుండుదువు. ౨౬

కౌసల్యాపుత్రుఁడును రఘువంశంబునఁ బుట్టినవాఁడునగు రాముఁడు నీతోఁ జెప్పు మన్నాఁడు. ౨౭

క్రూరుఁడవగు రావణుఁడా! పట్టణంబుననుండి వెడలివచ్చి యెదురు నిలిచి యుద్ధము సేయుము; పౌరుషంబు వహింపుము.

హన్తాస్మి త్వాం సహామాత్యం సపుత్త్రజ్ఞాతిబాన్ధవమ్. ౭౮

నిరుద్విగ్నా స్త్రయో లోకా భవిష్యన్తి హతే త్వయి,

దేవదానవయక్షాణాం గన్ధర్వోరగరక్షసామ్. ౭౯
శత్రు మద్యోద్ధరిష్యామి త్వా మృషీణాం చ కణ్టకమ్,
విభీషణస్య చైశ్వర్యం భవిష్యతి హతే త్వయి. ౮౦
న చేత్సత్కృత్య వైదేహీం ప్రణిపత్య ప్రదాస్యసి,

ఇత్యేవం పరుషం వాక్యం బ్రువాణే హరిపుఙ్గవే. ౮౧
అమర్షవశ మాపన్నో నిశాచరగణేశ్వరః,
తత స్సరోషతామ్రాక్ష శ్శశాస సచివాం స్తదా. ౮౨
గృహ్యతామేష దుర్మేధా వధ్యతా మితి చాసకృత్,

రావణస్య వచశ్శ్రుత్వా దీప్తాగ్నిసమతేజసః. ౮౩
జగృహు స్తం తతో ఘోరా శ్చత్వారో రజనీచరాః,
గ్రాహయామాస తారేయ స్స్వయమాత్మానమాత్మవాన్. ౮౪
బలం దర్శయితుం వీరో యాతుధానగణే తదా,

స తా న్బాహుద్వయే సక్తా నాదాయ పతగా నివ. ౮౫
ప్రాసాదం శైలసఙ్కాశ ముత్పపాతాఙ్గద స్తదా,
తేఽ స్యోత్పాతవేగేన నిర్ధూతా స్తస్య రాక్షసాః. ౮౬
భూమౌ నిపతితా స్సర్వే రాక్షసేన్ద్రస్య పశ్యతః,
తతః ప్రాసాదశిఖరం శైలశృఙ్గ మివోన్నతమ్. ౮౭
దదర్శ రాక్షసేన్ద్రస్య వాలిపుత్త్రః ప్రతాపవాన్,

నిన్ను నీకొడుకులను దాయాదులను బంధువులను నీమంత్రులను అంద అను వధించెదను. ౭౯

నిన్ను వధించినపిదప ముల్లోకంబులును నిర్భయంబులయి సుఖంబు నొందును.

దేవతలకును దానవులకును యక్షులకును గంధర్వులకును ఉరగములకును రాక్షసులకును శత్రుఁడవు ఋషిబాధకుఁడవునగు నిన్నిప్పుడు వధించెదను.

నీవు పూజించి సీతను సమర్పించి నాపాదంబులంబడవేని నిన్ను వధించి విభీషణునకు లంకాధిపత్యంబు నొసంగెదను. అని రాముఁడు చెప్పుచున్నాఁడు. అని యంగదుఁడు రావణునితోఁ జెప్పెను. ౮౦

వానరశ్రేష్ఠుఁడగు నంగదుఁడు ఇట్లు పరుషవాక్యంబులాడ రావణుఁడు కోపవివశుఁడయ్యెను. ౮౧

అంత నారావణుఁడు కోపంబునఁ గన్నులు నెఱ్ఱఁదనంబుగదుర మంత్రులంజూచి "దుర్బుద్ధియగు నీయంగదుంబట్టి వధింపుఁడు." అని పలుమాఱు ఆజ్ఞాపించెను. ౮౨

ఆరావణునాజ్ఞను విని మండుచున్న యగ్నిహోత్రమువంటి భయంకరాకారులగు నలుపురురాక్షసులు ఆ యంగదుం బట్టుకొనిరి. ౮౩

అప్పుడు ధైర్యవంతుఁడును బరాక్రమవంతుఁడునగు నంగదుఁడు రాక్షసులకుఁ దనబలంబుఁ జూపుటకై తానే యారాక్షసులు తన్నుఁబట్టుకొనుట కియ్యకొనెను. ౮౪

అప్పుడు ఆయంగదుఁడు ఆరాక్షసులను బక్షులంబోలె రెండుచేతుల నిఱికించుకొని పర్వతాకారంబగు ప్రాసాదంబుపై కెగసెను. ౮౫

ఆరాక్షసులందఱు రాక్షసేశ్వరుఁడగు రావణుఁడు చూచుచుండఁగానే ఆయంగదునివేగంబునకు ఆకాశంబుననుండి నేలంబడిరి. ౮౬

అంత మహాపరాక్రమశాలియగు వాలిపుత్రుఁడయిన యంగదుఁడు పర్వతశిఖరముంబోలె నత్యున్నతంబయిన రావణునిప్రాసాదశిఖరముం జూచెను

తత్పశాల పదాక్రాన్తం దశగ్రీవస్య పశ్యతః. ౧౮
పురా హిమవత శ్శృఙ్గం వజ్రిణేవ విదారితమ్,

భఙ్క్త్వా ప్రాసాదశిఖరం నామ విశ్రావ్య చాత్మనః. ౧౯
వినద్య సుమహానాద ముత్పపాత విహాయసమ్,

వ్యథయ న్రాక్షసాన్ సర్వా న్హర్షయం శ్చాపి వానరాన్. ౯౦
స వానరాణాం మధ్యే తు రామపార్శ్వ ముపాగతః,

రావణస్తు పరం చక్రే క్రోధం ప్రాసాదధర్షణాత్. ౯౧
వినాశం చాత్మనః పశ్యన్ని శ్వాసపరమోఽభవత్,

రామస్తు బహుభి ర్హృష్టై ర్నినదద్భిః ప్లవఙ్గమైః. ౯౨
వృతో రిపువధాకాఙ్క్షీ యుద్ధా యై వాభ్యవర్తత,

సుషేణ స్తు మహావీర్యో గిరికూటోపమో హరిః ౯౩
బహుభిస్సంవృత స్తత్ర వానరైః కామరూపిభిః,
చతుర్ద్వారాణి సర్వాణి సుగ్రీవవచనా త్కపిః. ౯౪
పర్యక్రామత దుర్ధర్షో నక్షత్రాణీవ చన్ద్రమాః,

తేషా మక్షౌహిణిశతం సమవేక్ష్య వనౌకసామ్. ౯౫
లఙ్కా ముపనివిష్టానాం సాగరం చాతివర్తతామ్,
రాక్షసా విస్మయం జగ్ము స్త్రాసం జగ్ము స్తథాపరే. ౯౬
అపరే సమరోద్ధర్షా ద్ధర్ష మేవ ప్రపేదిరే,
కృత్స్నం హి కపిభి ర్వ్యాప్తం ప్రాకారపరిఖాన్తరమ్. ౯౭

రావణుఁడు చూచుచుండఁగానే మున్నింద్రునిచేఁగొట్టఁబడిన హిమవచ్ఛిఖరంబుంబోలె నాయంగదుని పాదాఘాతంబున నాప్రాసాద శిఖరంబు పగిలెను. ౮౮

ఆయంగదుఁడు అట్లు ప్రాసాదశిఖరమును బగులఁగొట్టి తన పేరందఱకుఁ దెలియునట్లుచేసి మహాధ్వనిగల్గునట్లు సింహనాదంబు గావించి యాకాశంబున కెగిరెను. ౮౯

ఆయంగదుఁడు అట్లు రాక్షసులకందఱకును దుఃఖంబు గలుగఁజేయుచు వానరులను సంతోషింపఁజేయుచును వానరమధ్యంబున రామపార్శ్వంబుఁ జేరెను. ౯౦

రావణుఁడును దనప్రాసాదంబును బగులఁగొట్టుటకుఁ బరమకోపంబు నొంది అందువలనఁ దనకుఁ జేటుగలుగునని సూచింపఁబడుటఁగని వేఁడి నిట్టూర్పులు విడుచుచుండెను. ౯౧

రాముఁడును సంతుష్టులయి సింహనాదంబులు సేయుచుండునట్టి పెక్కండ్ర వానరవీరులచేఁ బరివేష్టితుఁడై శత్రువధంబుఁగోరుచు యుద్ధంబుకొఱకుఁ గాచియుండెను. ౯౨

అప్పు డచ్చట మహాపరాక్రమశాలియుఁ బర్వతాకారుఁడునగు సుషేణుఁడు కామరూపులగు పెక్కండ్రు వానరులచేఁ బరివేష్టితుఁడై యుండెను.

దుర్ధర్షుఁడగు సుషేణుఁడు సుగ్రీవు నానతిం జేసి చంద్రుఁడు నక్షత్రంబులఁ దిరుగుచుండునట్లు లంకాద్వారంబుల నాలుగింటను విడువక తిరుగుచుండెను. ౯౪

అట్లు లంకాపురిసమీపంబున విడిసి సముద్రంబునుంగూడ నతిక్రమించి యుండు నా అక్షౌహిణులవానరసేనం జూచి రాక్షసులు కొందఱు ఆశ్చర్యంబు నొందిరి; కొందఱు భయపడిరి; శూరులగు మఱికొందఱు యుద్ధోత్సాహంబునం జేసి సంతోషంబునొందిరి. ౯౫,౯౬

రాక్షసులందఱు దీనులయిప్రాకారపరిఖలమధ్యప్రదేశంబున నంతయు

దదృశుస్తే రాక్షసా దీనాః ప్రాకారం వానరీకృతమ్,
హాహాకారం ప్రకుర్వన్తి రాక్షసా భయమోహితాః. ౯౦

తస్మి న్మహాభీషణకే ప్రవృత్తే
కోలాహలే రాక్షసరాజధాన్యామ్,
ప్రగృహ్య రక్షాంసి మహాయుధాని
యుగాన్తవాతా ఇవ సంవిచేరుః. ౯౯

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే ఏకచత్వారింశస్సర్గః. ౪౧.

---

## ద్విచత్వారింశస్సర్గః.

తత స్తే రాక్షసా స్తత్ర గత్వా రావణమన్దిరమ్,
న్యవేదయ న్పురీం రుద్ధాం రామేణ సహవానరైః. ౧
రుద్ధాం తు నగరీం శ్రుత్వా జాతక్రోధో నిశాచరః,
విధానం ద్విగుణం కృత్వా ప్రాసాదం సోఽధ్యరోహత. ౨.

స దదర్శావృతాం లఙ్కాం సశైలవనకాననామ్,
అసఙ్ఖ్యేయై ర్హరిగణై స్సర్వతో యుద్ధకాఙ్క్షిభిః. 3
స దృష్ట్వా వానరై స్సర్వాం వసుధాం కబలీకృతామ్,
కథం క్షపయితవ్యా స్స్యు రితి చిన్తాపరోఽభవత్. ౪
స చిన్తయిత్వా సుచిరం ధైర్య మాలమ్బ్య రావణః,
రాఘవం హరియూథాంశ్చ దదర్శాఽఽయతలోచనః. ౫

రాఘవ స్సహ సైన్యేన ముదితో నామ పుప్లువే,
లఙ్కాం దదర్శ గుప్తాం వై సర్వతో రాక్షసై ర్వృతామ్. ౬

వానరులు వ్యాపించియుండుటం జేసి వానరమయప్రాకారంబుగాఁ జూపట్టు చున్న యాప్రాకారపరిఖమధ్యప్రదేశముం జూచిరి.

రాక్షసులందఱు భయంబున నోడలు దెలియక హాహాకారంబులు గావింపుచుండిరి. ౯౭

రాక్షసులరాజధానియగు లంకాపురియందు అట్టి మిక్కిలి భయంకరమయిన కోలాహలంబున శూరులగు రాక్షసులు మహాయుధంబులుధరించి ప్రళయకాలవాయువులుంబోలె సంచరించుండిరి. ౯౮

ఇది నలువదియొకటవసర్గము.

## నలువదిరెండవసర్గము.

అంత నప్పు డారాక్షసులు రావణునిగృహంబునకుఁబోయి రాముఁడు వానరులతో లంకాపురినంతయు ముట్టడించియున్నాఁడని రావణునకుఁదెల్పిరి.

ఆరావణుఁడు లంకానగరమును వానరులు ముట్టడించుటను విని పరమకోపమునొంది రెండింతలుగా నగరరక్షణసంవిధానంబు గావించి ప్రాసాదంబుపైకెక్కెను. ౨

అంతరావణుఁడు ప్రాసాదంబుపైనుండి యుద్ధకాంక్షులగు లెక్కలేని వానరులచే నంతటను బరివేష్టితంబయియున్న లంకాపురిం జూచెను. ౩

ఆరావణుఁడు వానరులు భూమినంతయు నాచ్ఛాదించియుండుటం జూచి వీరల నెట్లు వధింతునని చింతనొందెను. ౪

ఆరావణుఁ డట్లు బహుకాలము చింతించి ధైర్యం బవలంబించి యాశ్చర్యంబున దీర్ఘములయినకండ్లతో రాముని వానరసమూహములనుం జూచెను. ౫

రాముఁడు సంతుష్టుఁడై సైన్యంబుతోఁగూడ వేగంబునఁ బ్రాకారసమీపంబునకుఁబోయి సమస్తభాగంబులరాక్షసులచేఁ బరివృతంబయి సురక్షి

దృష్ట్వా దాశరథి ర్లఙ్కాం చిత్రధ్వజపతాకినీమ్,
జగామ సహసా సీతాం ధ్యాయమానేన చేతసా. ౭

అత్ర సా మృగశాబాక్షీ మత్కృతే జనకాత్మజా,
పీడ్యతే శోకసంతప్తా కృశా స్థణ్డిలశాయినీ. ౮

పీడ్యమానాం స ధర్మాత్మా వైదేహీ మనుచిన్తయన్,
క్షిప్ర మాజ్ఞాపయామాస వానరా న్ద్విషతాం వధే. ౯

ఏవ ముక్తే తు వచనే రామేణాక్లిష్టకర్మణా,
సఙ్ఘర్షమాణాః ప్లవగా స్సింహనాదై రనాదయన్. ౧౦

శిఖరై ర్వికిరామైనాం లఙ్కాం ముష్టిభిరేవవా,
ఇతి స్మ దధిరే సర్వే మనాంసి హరియూథపాః. ౧౧
ఉద్యమ్య గిరిశృఙ్గాణి శిఖరాణి మహాన్తి చ,
తరూం శ్చోత్పాట్య వివిధాం స్తిష్ఠన్తి హరియూథపాః. ౧౨
ప్రేక్షతో రాక్షసేన్ద్రస్య తాన్యనీకాని భాగశః,
రాఘవప్రియకామార్థం లఙ్కా మారురుహు స్తదా. ౧౩

తే తామ్రవక్త్రా హేమాభా రామార్థే త్యక్తజీవితాః,
లఙ్కామేవాభ్యవర్తన్త సాలతాలశిలాయుధాః. ౧౪

తే ద్రుమైర్గిరి పర్వతాగ్రై శ్చ ముష్టిభి శ్చ ప్లవఙ్గమాః,
ప్రాకారాగ్రాణ్యరణ్యాని మమన్థు స్తోరణాని చ. ౧౫

తంబై యున్న లంకాపురిం జూచెను. ౬

రాముఁడు చిత్రధ్వజంబులతో నొప్పుచున్న యాలంకానగరముం జూచి మనంబున సీతాదేవిం దలఁచి మిక్కిలియు దుఃఖితుఁడయ్యెను. ౭

ఈలంకానగరంబున నేకదా! జింకపిల్లలకండ్లవంటి కండ్లుగలదియు జనకమహారాజునకూఁతురునైన యాసీతాదేవి రాక్షసపీడితయయి నానిమిత్తము పరమదుఃఖితయై యుపవాసంబుచేఁ గృశించి నానావిధంబులఁ గష్టపడుచున్నది. అని రాముఁడు దుఃఖించెను. ౮

ధర్మాత్ముఁడగు నారాముఁడు అట్లు రాక్షసులచేఁ బీడింపఁబడుచున్న సీతాదేవిం దలఁచుకొని రోషం బిరుమడింపఁగా వానరుల శీఘ్రంబున శత్రువధంబు గావింపుఁడని యాజ్ఞాపించెను. ౯

పరులకు దుఃఖకరంబులౌ కాని కార్యములుగల రాముఁడట్లాజ్ఞాపింపఁగానే వానరులొకరిమునుం దొకరు వాటితో యుద్ధసన్నద్ధులయి సింహనాదంబులు గావించిరి. ౧౦

వానరశ్రేష్ఠులు "ఈలంకను బర్వతశిఖరంబులచేఁగాని పిడికిళ్ళచేఁ గాని చూర్ణముగావింతము" అని తలంపుగొనిరి. ౧౧

వానరశ్రేష్ఠులు పర్వతశిఖరంబులను బర్వతఖండములను నానావిధవృక్షంబులనుఁ బట్టుకొని యుద్ధసన్నద్ధులయియుండిరి. ౧౨

అప్పుడు రాక్షసాధిపతియగురావణుఁడు చూచుచుండఁగానే యా వానరసైన్యంబంతయు రామునకు సంతోషంబుగలుగుటకై భాగంబులు భాగంబులుగా లంకాప్రాకారంబు నారోహించిరి. ౧౩

ఎఱ్ఱని మొగంబులుగలవారలును రామునిమిత్తమయి ప్రాణంబులనైనను విడువ నిశ్చయించినవారలునగు నావానరులు సాలవృక్షంబులను దాలవృక్షంబులను శిలలను ఆయుధంబులుగాఁగొని లంకాపురిపైకిఁ బోయిరి. ౧౪

ఆవానరులు పర్వతశిఖరముతో గొట్టియుఁ బిడికిళ్లం బొడిచియు నాలంకాప్రాకారంబులను అరణ్యంబులను బురద్వారంబులను జూర్ణంబు

పరిఖాః పూరయన్తి స్మ ప్రసన్నసలిలాయుతాః,
పాంసుభిః పర్వతాగ్రైశ్చ తృణైః కాష్ఠైశ్చ వానరాః. ౧౬

తత స్సహస్రయూథాశ్చ కోటియూథాశ్చ వానరాః,
కోటీశతయుతా శ్చాన్యే లఙ్కా మారురుహు స్తదా. ౧౭

కాఞ్చనాని ప్రమృద్నన్త స్తోరణాని ప్లవఙ్గమాః,
కైలాసశిఖరాభాణి గోపురాణి ప్రమథ్య చ. ౧౮
ఆప్లవన్తః ప్లవన్త శ్చ గర్జన్త శ్చ ప్లవఙ్గమాః,
లఙ్కాం తామభిధావన్తి మహావారణసన్నిభాః. ౧౯
జయత్యతిబలో రామో లక్ష్మణ శ్చ మహాబలః,
రాజా జయతి సుగ్రీవో రాఘవే ణాభిపాలితః. ౨౦

ఇత్యేవం ఘోషయన్తశ్చ గర్జన్తశ్చ ప్లవఙ్గమాః,
అభ్యధావన్త లఙ్కాయాః ప్రాకారం కామరూపిణః. ౨౧
వీరబాహు స్సుబాహుశ్చ నళశ్చ వనగోచరః,
నిపీడ్యోపనివిష్టాస్తే ప్రాకారం హరియూథపాః. ౨౨
ఏతస్మి న్నన్తరే చక్రుః స్కన్ధావారనివేశనమ్,
పూర్వద్వారం తు కుముదః కోటిభి ర్దశభి ర్వృతః. ౨౩
ఆవృత్య బలవాం స్తస్థౌ హరిభి ర్జితకాశిభిః,
సాహాయ్యార్థం తు తస్యైవ నివిష్టః ప్రఘసో హరిః. ౨౪
పనసశ్చ మహాబాహు ర్వానరై ర్బహుభి ర్వృతః,
దక్షిణద్వార మాగమ్య వీర శ్శతవలిః కపిః. ౨౫
ఆవృత్య బలవాం స్తస్థౌ వింశత్యా కోటిభి ర్వృతః,

గావింపసాగి. ౧౫

వానరులు మట్టిపోసియుఁ బర్వతశిఖరంబులను తృణకాష్ఠంబులను వైచియుఁ నిర్మలజలంబులతోఁ గూడిన యగడ్తలను బూడ్చిరి. ౧౬

అంత వానరులు కొందఱు వేయిమంది వానరులతోను గొందఱు గోటివానరులతోను మఱికొందఱు నూఱుకోటులవానరులతోనుం గూడి లంకాప్రాకారము నారోహించిరి. ౧౭

మత్తగజంబులంతటివానరులు బంగారుపురద్వారంబులు బగులఁ గొట్టుచు కైలాసశిఖరంబువంటి గోపురంబులఁ జూర్ణంబుసేయుచు నిటునటు గంతులువేయుచు సింహనాదంబులుసేయుచు లంకపైకిఁ బోయిరి. ౧౮, ౧౯

మహాబలుఁడగు రాముఁడును బలవంతుఁడగు లక్ష్మణుఁడును సర్వోత్కృష్టంబున నున్నారు! వానరరాజుండగు సుగ్రీవుఁడు రామునిచే సురక్షితుఁడై సర్వోత్కృష్టంబున నున్నాఁడు! ౨౦

కామరూపులగు వానరులు ఇట్లుద్ఘోషించుచు సింహనాదంబుసేయుచు లంకాప్రాకారంబుమీఁదికిఁ బోయిరి. ౨౧

అందు వీరబాహువును సుబాహువును నలుఁడును నీవానరోత్తములు లంకాప్రాకారంబును భేదింపుచు విడిసిరి. ౨౨

ఈమధ్యంబున దండును దగినస్థలంబున విడియఁజేసికొనిరి.

బలవంతుఁడగు కుముదుఁడు జయశాలులగు పదికోటులవానరులచేఁ బరివృతుఁడై యాస్కంధావారమునందలి తూర్పుద్వారంబున నుండెను. ౨౩

ప్రఘసుఁడును మహాబాహుఁడగు పనసుఁడును బెక్కువానరులం గూడి యాకుముదునికి సహాయులయి పూర్వద్వారంబుననే యుండిరి. ౨౪

మహాబలపరాక్రమశాలియగు శతవలి ఇరువదికోటులవానరులతోఁ గూడినవాఁడై యాస్కంధావారదక్షిణద్వారంబు నావరించి నిలిచెను. ౨౫

సుషేణశ్చ పశ్చిమద్వారం గత స్తారాపితా హరిః. ౨౬
ఆవృత్య బలవాం స్తస్థౌ షష్టికోటిభి రావృతః,
ఉత్తరద్వార మాసాద్య రామ స్సౌమిత్రిణా సహ. ౨౭
ఆవృత్య బలవాం స్తస్థౌ సుగ్రీవశ్చ హరీశ్వరః,
గోలాఙ్గూలో మహాకాయో గవాక్షో భీమదర్శనః. ౨౮
వృతః కోట్యా మహావీర్య స్తస్థౌ రామస్య పార్శ్వతః,

ఋక్షాణాం భీమవేగానాం ధూమ్ర శ్శత్రునిబర్హణః. ౨౯
వృతః కోట్యా మహావీర్య స్తస్థౌ రామస్య పార్శ్వతః,
సన్నద్ధస్తు మహావీర్యో గదాపాణి ర్విభీషణః. 30
వృతో యత్తైస్తు సచివై స్తస్థౌ తత్ర మహాబలః,

గజో గవాక్షో గవయ శ్శరభో గన్ధమాదనః. 3౧
సమన్తా త్పరిధావన్తో ररక్షు ర్హరివాహినీమ్,

తతః కోపపరీతాత్మా రావణో రాక్షసేశ్వరః. 3౨
నిర్యాణం సర్వసైన్యానాం ద్రుత మాజ్ఞాపయ త్తదా,

ఏతచ్ఛ్రుత్వా తతో వాక్యం రావణస్య ముఖోద్గతమ్. 33
సహసా భీమనిర్ఘోష ముద్ఘుష్టం రజనీచరైః,
తతః ప్రచోదితా భేర్య శ్చన్ద్రపాణ్డురపుష్కరాః. 3౪
హేమకోణాహతా భీమా రాక్షసానాం సమన్తతః,
వినేదుశ్చ మహాఘోషా శ్శఙ్ఖా శ్శతసహస్రశః. 3౫
రాక్షసానాం సుఘోరాణాం ముఖమారుతపూరితాః,
తే బభు శ్శుభనీలాఙ్గా స్సశఙ్ఖా రజనీచరాః. 3౬

బలవంతుఁడగు తారాజనకుఁడయిన సుషేణుఁడు ఇరువదికోటుల వానరులతోఁగూడి స్కంధావారపశ్చిమద్వారంబు నావరించి నిలిచెను. ౨౬

బలవంతుఁడగు రాముఁడు లక్ష్మణసహితుఁడై స్కంధావారోత్తర ద్వారంబున నుండెను; వానరరాజుండగు సుగ్రీవుఁడు నందే యుండెను. ౨౭

మహాకాయుఁడును జూపరులకు భయంబుగలిగించువాఁడును మహాపరాక్రమశాలియునగు గవాక్షుఁడు కోటిగోలాంగూలాలంబులచేఁ బరివృతుఁడై రాముని పార్శ్వభాగంబున నిలిచెను. ౨౮

మహాపరాక్రమశాలియు శత్రుధ్వంసకుఁడునగు ధూమ్రుఁడు కోటి భల్లూకంబులంగూడి రాముని పార్శ్వభాగంబున నుండెను. ౨౯

మహాపరాక్రమశాలియు మహాబలుఁడునగు విభీషణుఁడు కవచంబు దొడిగి గదాపాణియయి యుద్ధసన్నద్ధులయిన మంత్రులంగూడి రామునితోఁ గూడ నుండెను. ౩౦

గజుఁడును గవయుఁడును గవాక్షుఁడును శరభుఁడును గంధమాదనుండును సమస్తప్రదేశంబులం దిరుగుచు వానరసేననంతయుం రక్షింపు చుండిరి. ౩౧

అంత రాక్షసరాజుండగు రావణుఁడు వానరసేనాసన్నివేశక్రమం బంతయుంజూచి పరమకుపితుఁడై తనసేనలనన్నియు యుద్ధంబునకు వెడల నాజ్ఞాపించెను. ౩౨

రావణుని ముఖంబుననుండి వెడలినయాజ్ఞను విన్నంతనే రాక్షసు లందఱు భయంకరధ్వని గలుగునట్లు సింహనాదంబు గావించిరి. ౩౩

అంతఁ జంద్రబింబమువలె శుభ్రములయిన ముఖములుగల భయంకర ధ్వనులగు భేరులను బంగారుదండములచే వాయించిరి. ౩౪

భయంకరాకారులగు రాక్షసులు లక్షలులక్షలుగా మహాధ్వనులగు శంఖంబులఁ బూరించిరి. ౩౫

ఆభరణభూషితులై నల్లనిదేహముతో శంఖంబులు ధరించియున్న

విద్యున్మణ్డలసన్నద్ధా స్సబలాకా ఇవామ్బుదాః,
నిష్పతన్తి తత స్సైన్యా హృష్టా రావణచోదితాః. ౩౭
సమయే పూర్యమాణస్య వేగా ఇవ మహోదధేః,
తతో వానరసైన్యేన ముక్తో నాద స్సమన్తతః. ౩౮
మలయః పూరితో యేన ససానుప్రస్థకన్దరః,
శఙ్ఖదున్దుభిసఙ్ఘుష్ట స్సింహనాద స్తరస్వినామ్. ౩౯
పృథివీం చాన్తరిక్షంచ సాగరం చైవ నాదయన్,
గజానాం బృంహితై స్సార్ధం హయానాం హేషితై రపి. ౪౦
రథానాం నేమిఘోషై శ్చ రక్షసాం పదనిస్స్వనైః,
ఏతస్మి న్నన్తరే ఘోర స్సఙ్గ్రామ స్సమవర్తత. ౪౧
రక్షసాం వానరాణాం చ యథా దేవాసురే పురా,
తే గదాభిః ప్రదీప్తాభి శ్శక్తిశూలపరశ్వధైః. ౪౨
నిజఘ్ను ర్వానరాన్ ఘోరాః కథయన్త స్స్వవిక్రమాన్,
రాజా జయతి సుగ్రీవ ఇతి శబ్దో మహా నభూత్. ౪౩
రాజన్! జయజయే త్యుక్త్వా స్వస్వనామకథాం తతః,
తథా వృక్షై ర్మహాకాయాః పర్వతాగ్రైశ్చ వానరాః. ౪౪
నిజఘ్ను స్తాని రక్షాంసి నఖై ర్దన్తైశ్చ వేగితాః,
రాక్షసా స్త్వపరే భీమాః ప్రాకారస్థా మహీంగతాన్. ౪౫
భిణ్డిపాలై శ్చ ఖడ్గైశ్చ శూలై శ్చైవ వ్యదారయన్,
వానరా శ్చాపి సంక్రుద్ధాః ప్రాకారస్థా న్మహీంగతాః. ౪౬
రాక్షసా న్పాతయామాసు స్సమాప్లుత్య ప్లవఙ్గమాః,

యా రాక్షసులు మెఱపులతోఁ గూడిన మేఘంబులకైవడిఁ బ్రకాశించిరి. ౩౬

అంత రావణుని పనుపున సైనికులు సంతుష్టులయి ప్రళయకాలంబున మహాసముద్రప్రవాహంబులుంబోలె బయలుదేఱిరి. ౩౭

అంత వానరులు త్రికూటపర్వతమునంతయుఁ వ్యాపించునట్లు భయంకరమయిన సింహనాదంబు గావించిరి. ౩౮

బలవంతులగు వానరరాక్షసుల సింహనాదంబు శంఖదుందుభిధ్వనులతోఁగూడి భూమ్యాకాశంబుల నంతయు వ్యాపించినది. ౩౯

రాక్షసులసింహనాదములును గజబృంహితంబులును గుఱ్ఱంబుల హేషాధ్వనులును రథంబుల నేమిధ్వనులు ఒండొంటింగలసి చెలంగుచుండినవి. ౪౦

ఇంతలో మున్ను దేవాసురులకుంబోలె రాక్షసులకును వానరులకును భయంకరంబగు యుద్ధంబు ఆరబ్ధమయినది. ౪౧

భయంకరాకారులగు రాక్షసులు తమ పరాక్రమంబుల నుగ్గడించుకొనుచు గదలచేతను శక్తులచేతను శూలంబులచేతను గొడ్డళ్లచేతను వానరులం బ్రహరించిరి. ౪౨

"వానరరాజుండగు సుగ్రీవుఁడు సర్వోత్కృష్టుఁడై యున్నాఁడు" అని మహాధ్వని వానరసేనలోఁ జెలంగుచుండినది. ౪౩

మహాకాయులగు వానరులు "వానరరాజా! సర్వోత్కర్షంబున నుండుము" అని యుద్ఘోషింపుచు తమ తమవృత్తాంతంబుల నుగ్గడింపుచు వృక్షంబులచేతను పర్వతశిఖరంబులచేతను దంతంబులచేతను నఖంబులచేతను రాక్షసులం బ్రహరించిరి. ౪౪

భయంకరులగు మఱికొందఱు రాక్షసులు ప్రాకారంబుపైనుండి భిండివాలంబులచేతను ఖడ్గంబులచేతను నేలనున్న వానరులం బ్రహరించిరి. ౪౫

క్రిందనున్న వానరులు క్రుద్ధులయి పైకెగిరి ప్రాకారంబుపై నున్న రాక్షసులం బడఁద్రోసిరి. ౪౬

స సమ్ప్రహార స్తుములో మాంసశోణితకర్దమః. ౪౭
రక్షసాం వానరాణాం చ సమ్బభూవాద్భుతోపమః.

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే ద్విచత్వారింశస్సర్గః. ౪౨.

## త్రి చ త్వా రిం శ స్స ర్గః.

యుధ్యతాం తు తత స్తేషాం వానరాణాం మహాత్మనామ్,
రక్షసాం సంబభూవాథ బలకోప స్సుదారుణః. ౧
తే హయైర్గ కాఞ్చనాపీడై ర్ధ్వజై శ్చాగ్నిశిఖోపమైః,
రథై శ్చాదిత్యసఙ్కాశైః కవచై శ్చ మనోరమైః. ౨
నిర్యయూ రాక్షసవ్యాఘ్రా నాదయన్తో దిశో దశ,
రాక్షసా భీమకర్మాణో రావణస్య జయైషిణః. ౩

వానరాణా మపి చమూ ర్బృహతీ జయ మిచ్ఛతామ్,
అభ్యధావత తాం సేనాం రక్షసాం కామరూపిణామ్. ౪
ఏతస్మి న్నన్తరే తేషా మన్యోన్య మభిధావతామ్,
రక్షసాం వానరాణాం చ ద్వన్ద్వయుద్ధ మవర్తత. ౫
అఙ్గదేనేన్ద్రజి త్సార్ధం వాలిపుత్త్రేణ రాక్షసః,
అయుధ్యత మహాతేజా స్త్ర్యమ్బకేన యథాఽన్తకః. ౬
ప్రజఙ్ఘేన చ సమ్పాతి ర్నిత్యం దుర్ధర్షణో రణే,
జమ్బుమాలిన మారబ్ధో హనూమా నపి వానరః. ౭

సఙ్గత స్సుమహాక్రోధో రాక్షసో రావణానుజః,
సమరే తీక్ష్ణవేగేన మిత్రఘ్నేన విభీషణః. ౮
తపనేన గజ స్సార్ధం రాక్షసేన మహాబలః,
నికుమ్భేన మహాతేజా నీలోఽపి సమయుధ్యత. ౯

అప్పుడు రాక్షసవానరులకుం గలిగిన దొమ్మియుద్ధము నెత్తురును మాంసమును బురదగా నెంతయుం నాశ్చర్యకరం బయియుండినది. ౪౭

ఇది నలువది రెండవసర్గము.

## నలువదిమూఁడవసర్గము.

అంత మహాబలశాలులగు వానరు లట్లెదురులేక యుద్ధంబు సేయుచుం డుటంజూచి రాక్షసులు సహింపఁజాలక మిక్కిలియుఁ గోపంబునొందిరి. ౧

రావణునికి జయంబుఁ గోరువారలును భయంకరకర్ములునగు రాక్షసో త్తములు బంగారుశేఖరంబులతో నొప్పుచున్న గుఱ్ఱంబులను అగ్నిజ్వాలలుం బోలె వెలుఁగుచుండు ధ్వజంబులతోను సూర్యబింబమువలెఁ దేజరిల్లుచుండు రథంబులతోను సుందరంబులగు కవచంబులతోనుంగూడి దశదిశలును నిండు నట్లు సింహనాదంబులు సేయుచు యుద్ధంబునకు వెడలిరి. ౨, ౩

అంత వానరులు జయంబుఁగోరి వచ్చిన కామరూపులగు రాక్షసుల పైకి యుద్ధోత్సాహంబున నడరిరి. ౪

ఇంతలో నట్లు రాక్షసులును వానరులును ఒండొరులమీఁదికిం గవి యుచు నప్పు డిరుగెలంకులవారికిని ద్వంద్వయుద్ధంబు గలిగినది. ౫

మహాతేజుఁడగు నింద్రజిత్తు వాలికుమారుఁడగు నంగదునితో ముక్కంటితో మృత్యువుపోరునట్లు యుద్ధము గావించెను. ౬

యుద్ధంబున శత్రువులకు సహింప నలవిగానట్టి విభీషణసచివుండగు సంపాతి ప్రజంఘునితోఁ బోరెను; హనుమంతుఁడు జంబుమాలితో యుద్ధంబు గావించెను. ౭

మహాకోపుఁడగు రావణునితమ్ముఁడు విభీషణుఁడు మహావేగుఁడయిన మిత్రఘ్నుఁడను రాక్షసునితో యుద్ధము చేసెను. ౮

మహాబలుఁడగు గజుఁడు తపనుఁడను రాక్షసునితోఁ బోరెను మహాతేజుఁడగు నీలుఁడు నికుంభునితోఁగూడ యుద్ధము గావించెను. ౯

వానరేన్ద్రస్తు సుగ్రీవః ప్రఘసేన సమాగతః,
సఙ్గత స్సమరే శ్రీమా న్విరూపాక్షేణ లక్ష్మణః. ౧౦
అగ్నికేతుశ్చ దుర్ధర్షో రశ్మికేతుశ్చ రాక్షసః,
సుప్తఘ్నో యజ్ఞకోపశ్చ రామేణ సహ సఙ్గతాః. ౧౧
వజ్రముష్టి స్తు మైన్దేన ద్వివిదేనాశనిప్రభః,
రాక్షసాభ్యాం సుఘోరాభ్యాం కపిముఖ్యౌ సమాగతౌ. ౧౨

వీరః ప్రతపనో ఘోరో రాక్షసో రణదుర్ధరః,
సమరే తీక్ష్ణవేగేన నళేన సమయుధ్యత. ౧౩

ధర్మస్య పుత్రో బలవాన్ సుషేణ ఇతి విశ్రుతః,
స విద్యున్మాలినా సార్ధ మయుధ్యత మహాకపిః. ౧౪
వానరా శ్చాపరే భీమా రాక్షసై రపరై స్సహ,
ద్వన్ద్వం సమీయు ర్బహుధా యుద్ధాయ బహుభి స్సహ. ౧౫
తత్రాఽసీ త్సుమహద్యుద్ధం తుములం రోమహర్షణమ్,
రక్షసాం వానరాణాం చ వీరాణాం జయ మిచ్ఛతామ్. ౧౬
హరిరాక్షసదేహేభ్యః ప్రభూతాః కేశశాద్వలాః,
శరీరసంఘాటవహాః ప్రసుస్రుశ్శోణితాపగాః. ౧౭

ఆజఘానేన్ద్రజి త్క్రుద్ధో వజ్రేణేవ శతక్రతుః,
అఙ్గదం గదయా వీరం శత్రుసైన్యవిదారణమ్. ౧౮

తస్య కాఞ్చనచిత్రాఙ్గం రథం సాశ్వం ససారథిమ్ః
జఘాన సమరే శ్రీమా నఙ్గదో వేగవా న్కపిః. ౧౯

వానరరాజుండగు సుగ్రీవుఁడు ప్రఘసుఁడను రాక్షసునిపై కదరెను; శ్రీమంతుఁడగు లక్ష్మణుఁడు విరూపాక్షునితో యుద్ధము గావించెను. ౧౦

దుర్ధర్షుఁడగు నగ్నికేతుఁడును రశ్మికేతుండును సుప్తఘ్నుఁడును యజ్ఞకోపుఁడును రామునితో యుద్ధంబు గావించిరి. ౧౧

వజ్రముష్టియను రాక్షసుఁడు మైందునితోను అశనిప్రభుఁడనువాఁడు ద్వివిదునితోను ఇట్లు మైందద్వివిదులు భయంకరాకారులగు నిద్దఱిరాక్షసులతోఁ బోరిరి. ౧౨

పరాక్రమవంతుఁడును భయంకరాకారుఁడును యుద్ధంబున నెదిరింప నలవిగానివాఁడునగు ప్రతపనుఁడనువాఁడు యుద్ధమునఁ దీక్ష్ణప్రతాపుఁడగు నలునితో యుద్ధము గావించెను. ౧౩

బలవంతుఁడగు ధర్మపుత్త్రుఁడైన సుషేణుఁడను వానరశ్రేష్ఠుఁడు విద్యున్మాలితో యుద్ధము గావించెను. ౧౪

ఇంక భయంకరాకారులగు వానరులు పెక్కండ్రు రాక్షసుల పెక్కండ్రతో నానావిధంబుల ద్వంద్వయుద్ధంబు గావించిరి. ౧౫

అప్పుడు మహాపరాక్రమశాలులును జయంబుగోరువారలునగు నా రాక్షసులకును రోమహర్షణంబగు తుములయుద్ధము గలిగినది. ౧౬

ఆయుద్ధంబున వానరరాక్షసదేహంబులనుండి వెండ్రుకలె పచ్చికలుగాఁ గలవియు దేహావయవములె కాష్ఠములుగాఁ గలవియునగు విస్తీర్ణంబులయిన రక్తనదులు ప్రవహించినవి. ౧౭

ఇంద్రజిత్తు క్రుద్ధుఁడై దేవేంద్రునివజ్రాయుధంబుతో సమానంబయిన గదచేఁ బరాక్రమవంతుఁడును శత్రుసైన్యంబుల సంహరించువాఁడునగు నంగదుఁ బ్రహరించెను; ౧౮

అంత శ్రీమంతుఁడును మహావేగుఁడునగు నంగదుఁడు కాంచనాలంకృతంబగు నాయింద్రజిత్తురథంబును సారథితోను గుఱ్ఱంబులతోను గూడ నుగ్గుగావించెను. ౧౯

సమ్పాతి స్తు త్రిభి ర్బాణైగ ప్రజఙ్ఘేన సమాహతః,
నిజఘానాశ్వకర్ణేన ప్రజఙ్ఘం రణమూర్ధని. ౨౦
జమ్బుమాలీ రథస్థస్తు రథశక్త్యా మహాబలః,
బిభేద సమరే క్రుద్ధో హనూమన్తం స్తనాన్తరే. ౨౧
తస్య తం రథ మాస్థాయ హనూమా న్మారుతాత్మజః,
ప్రమమాథ తలేనాశు సహ తేనైవ రక్షసా. ౨౨
నదన్ ప్రతపనో ఘోరో నళం సోఽప్యన్వధావత,

నళగ ప్రతపనస్యాశు పాతయామాస చక్షుషీ. ౨౩
భిన్నగాత్ర శ్శరై స్తీక్ష్ణైః క్షిప్రహస్తేన రక్షసా,

గ్రసన్త మివ సైన్యాని ప్రఘసం వానరాధిపః. ౨౪
సుగ్రీవ స్సప్తపర్ణేన నిర్బిభేద జఘాన చ,

అగ్నికేతు శ్చ దుర్ధర్షో రశ్మికేతుశ్చ రాక్షసః. ౨౫
సుప్తఘ్నో యజ్ఞకోపశ్చ రామం నిర్బిభిదు శ్శరైః,
తేషాం చతుర్ణాం రామస్తు శిరాంసి నిశితై శ్శరైః. ౨౬
క్రుద్ధ శ్చతుర్భి శ్చిచ్ఛేద ఘోరై రగ్నిశిఖోపమైః,
వజ్రముష్టి స్తు మైన్దేన ముష్టినా నిహతో రణే. ౨౭
పపాత సరథ స్సాశ్వగ పురాట్ట ఇవ భూతలే,
నికుమ్భస్తు రణే నీలం నీలాఞ్జనచయప్రభమ్. ౨౮
నిర్బిభేద శరై స్తీక్ష్ణైగ కరై ర్మేఘ మివాంశుమాన్,

పున శ్శరశతేనాథ క్షిప్రహస్తో నిశాచరః. ౨౯
బిభేద సమరే నీలం నికుమ్భగ ప్రజహాసచ,

ప్రజంఘుఁడు సంపాతిని మూఁడమ్ములనొప్పింప నాతఁడు యుద్ధమధ్యంబున నశ్వకర్ణవృక్షంబుచేఁ బ్రజంఘుని వధించెను. ౨౦

మహాబలుఁడగు జంబుమాలి రథగతుఁడై యుద్ధంబునఁ గోపించి రథశక్తిఁగొని హనుమంతుని వక్షస్స్థలంబునఁ బ్రహరించెను. ౨౧

వాయుకుమారుఁడగు హనుమంతుఁడు శీఘ్రంబున నాజంబుమాలి రథంబుమీఁది కుఱికి యతని నఱచేతం జఱచెను. ౨౨

భయంకరాకారుఁడగు నాప్రతపనుఁడు గర్జించుచు నళునిపైకిఁ గవిసెను.

అతిశీఘ్రంబుగా బాణంబులు ప్రయోగించునట్టి ప్రతపనుఁడు నలునిఁ దీక్ష్ణబాణంబుల నొంప నవ్వానరవీరుఁడు ప్రతపనుని కన్నులం బెఱికివైచెను. ౨౩

వానరరాజుండగు సుగ్రీవుఁడు సైన్యంబునంతయు మ్రింగునట్లు నోరు దెఱచుకొనివచ్చుచున్న ప్రఘసుని సప్తపర్ణవృక్షంబునం బ్రహరించి వధించెను. ౨౪

దుర్ధర్షుఁడగు నగ్నికేతుఁడును రశ్మికేతుఁడును సుప్తఘ్నుఁడును యజ్ఞకోపుఁడును రామునిపై నానావిధబాణంబులం బ్రయోగించిరి. ౨౫

రాముఁడు అగ్నిజ్వాలలవంటి నాలుగు కఱకుబాణంబుల ఆనల్వురి రాక్షసుల శిరస్సులఁ ద్రుంచెను. ౨౬

వజ్రముష్టి యుద్ధంబున మైందునిచేఁ బిడికిటం బొడువఁబడినవాఁడై రథాశ్వంబులతోఁగూడఁ గోటబురుజుకైవడి నేలంగూలెను. ౨౭

సూర్యుఁడు కిరణంబుల మేఘంబును భేదించునట్లు నికుంభుఁడు కాటుకవలె నల్లనైననీలుని కఱకుబాణంబుల నొంచెను. ౨౮

శీఘ్రముగా బాణంబులు ప్రయోగించునట్టి నికుంభుఁడు మరల నూఱుబాణంబుల నీలుం బ్రహరించి నవ్వెను. ౨౯

తస్యైవ రథచక్రేణ నీలో విష్ణు రివాహవే. ౩౦
శిరశ్చిచ్ఛేద సమరే నికుమ్భస్య చ సారథేః,
వజ్రాశనిసమస్పర్శో ద్వివిదోఽప్యశనిప్రభమ్. ౩౧
జఘాన గిరిశృఙ్గేణ మిషతాం సర్వరక్షసామ్,

ద్వివిదం వానరేన్ద్రం తు నగయోధినమాహవే. ౩౨
శరై రశనిసఙ్కాశై స్స వివ్యాధాశనిప్రభః,
సశరై రతివిద్ధాఙ్గో ద్వివిదః క్రోధమూర్ఛితః. ౩౩
సాలేన సరథం సాశ్వం నిజఘానాశనిప్రభమ్,
విద్యున్మాలీ రథస్థస్తు శరైః కాఞ్చనభూషణైః. ౩౪
సుషేణం తాడయామాస ననాదచ ముహుర్ముహుః,
తం రథస్థ మథో దృష్ట్వా సుషేణో వానరోత్తమః. ౩౫
గిరిశృఙ్గేణ మహతా రథ మాశు న్యపాతయత్,

లాఘవేన తు సంయుక్తో విద్యున్మాలీ నిశాచరః. ౩౬
అపక్రమ్య రథా త్తూర్ణం గదాపాణిః క్షితౌ స్థితః,
తతః క్రోధసమావిష్ట స్సుషేణో హరిపుఙ్గవః. ౩౭
శిలాం సుమహతీం గృహ్య నిశాచర మభిద్రవత్,
త మాపతన్తం గదయా విద్యున్మాలీ నిశాచరః. ౩౮
వక్షస్యభిజఘానాశు సుషేణం హరిసత్తమమ్,
గదాప్రహారం తం ఘోర మచిన్త్య ప్లవగోత్తమః. ౩౯
తాం శిలాం పాతయామాస తస్యోరసి మహామృధే,
శిలాప్రహారాభిహతో విద్యున్మాలీ నిశాచరః. ౪౦
నిష్పిష్టహృదయో భూమౌ గతాసు ర్నిపపాత హ,
ఏవం తై ర్వానరై శ్శూరై శ్శూరా స్తే రజనీచరాః. ౪౧

నీలుఁడు యుద్ధంబున విష్ణుదేవుఁడుంబోలె అనికుంభుని రథచక్రముం
గొని సారథిశిరంబు దెగవేసెను. ౩౦

వజ్రాశనులతో సమానమైన దేహముగలద్వివిదుఁడును రాక్షసులం
దఱు చూచుచుండఁగా యుద్ధంబున నశనిప్రభునిఁ బర్వతశిఖరంబునం
బ్రహరించెను. ౩౧

అశనిప్రభుఁడు పర్వతంబులచేఁ బోరుచున్న వానరోత్తముఁడగు
ద్వివిదుని బిడుగులంబోని కఱకుబాణంబుల నొంచెను. ౩౨

అద్వివిదుఁడు బాణంబులచే మిక్కిలియుం నొచ్చి కరమకుపితుఁడై
సాలవృక్షంబున నాయశనిప్రభుని రథాశ్వంబులతోఁగూడ వధించెను. ౩౩

విద్యున్మాలి రథగతుఁడై కాంచనాలంకృతంబులగు బాణంబుల
సుషేణుం బ్రహరించి పలుమాఱు సింహనాదంబులు గావించెను. ౩౪

అంత వానరశ్రేష్ఠుఁడగు సుషేణుఁడు తాను క్రిందనుండుటయు జంబు
మాలి రథంబుపై నుండుటయుంజూచి పెద్దపర్వతంబువేసి శీఘ్రంబున రథం
బును నుగ్గుగావించెను. ౩౫

ఆవిద్యున్మాలి మిక్కిలియుం లాఘవంబుగలవాఁడు కావున గద చేతం
గొని రథంబునుండి శీఘ్రంబున నేలకు లంఘించెను. ౩౬

అంత వానరశ్రేష్ఠుండగు సుషేణుఁడు కుపితుఁడై, పెద్దఱాయియొకటి
గ్రహించి విద్యున్మాలిం దఱిమెను. ౩౭

అంత విద్యున్మాలి వానరశ్రేష్ఠుఁడగు సుషేణుఁడు పెనుఱాయి చేతం
గొనివచ్చుటంజూచి యతనిఱొమ్ముపైఁ గదచేఁ గొట్టెను. ౩౮

వానరశ్రేష్ఠుఁడగు నాసుషేణుఁడు ఆగదాప్రహారమును సరకుసేయక
విద్యున్మాలివక్షస్స్థలంబుపై నాశిలం బడవేసెను. ౩౯

విద్యున్మాలి యాశిలాప్రహారంబున వక్షస్స్థలమంతయుఁ జూర్ణముగా
గతప్రాణుఁడై నేలంబడెను. ౪౦

ఇట్లు శూరులగు వానరులు శూరులగు నారాక్షసులను దేవత లసురు

ధ్వజైర్వై విమృదితా స్తత్ర దైత్యా ఇవ దివౌకసైః,
భగ్నైః ఖడ్గై ర్గదాభిశ్చ శక్తితోమరపట్టసైః. ౪౨
అపవిద్ధైశ్చ భిన్నైశ్చ రథై స్సాఙ్గ్రామికై ర్హయైః,
నిహతైః కుఞ్జరై ర్మత్తై స్తథా వానరరాక్షసైః. ౪౩
చక్రాక్షయుగదణ్డైశ్చ భగ్నై ర్ధరణిసంశ్రితైః,
బభూవాయోధనం ఘోరం గోమాయుగణసంకులమ్. ౪౪
కబన్ధాని సముత్పేతు ర్దిక్షు వానరరక్షసామ్,
విమర్దే తుములే తస్మి న్దేవాసురరణోపమే. ౪౫
విదార్యమాణా హరిపుఙ్గవై స్తదా
నిశాచరా శ్శోణితదిగ్ధగాత్రాః,
పున స్సుయుద్ధం తరసా సమాస్థితా
దివాకర స్యాస్తమయాభికాఙ్క్షిణః. ౪౬
ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే త్రిచత్వారింశస్సర్గః. ౪౩.

---

చతుశ్చత్వారింశస్సర్గః.

యుధ్యతా మేవ తేషాం తు తదా వానరరక్షసామ్,
రవి రస్తం గతో రాత్రిః ప్రవృత్తా ప్రాణహారిణీ. ౧
అన్యోన్యం బద్ధవైరాణాం ఘోరాణాం జయమిచ్ఛతామ్,
రాక్షసోఽసీతి హరయో హరిశ్చాసీతి రాక్షసాః,
అన్యోన్యం సమరే జఘ్ను స్తస్మిం స్తమసి దారుణే. ౩
జహి దారయ చైహీతి కథం విద్రవసీతి చ,
ఏవం సుతుములశ్శబ్దం స్తస్మిం స్తమసి శుశ్రువే. ౪

లంబోలె ద్వంద్వయుద్ధంబున వధించిరి. ౪౧

అప్పుడు యుద్ధభూమి తునిసిపడిన ఖడ్గంబులచేతను గదలచేతను శక్తులచేతను తోమరంబులచేతను పట్టిసంబులచేతను విఱిగిపడిన రథంబులచేతను యుద్ధయోగ్యంబులగు గుఱ్ఱంబులచేతను నిహతంబులగు మత్తగజంబులచేతను హతులగు వానరరాక్షసులచేతను విఱిగి నేలంబడిన బండిచక్రంబులచేతను గన్నులచేతను గాఁడులచేతను భయంకరంబై భక్షణార్థమయి సంచరించు నక్కలతోఁగూడినదై యుండినది. ౪౨-౪౪

దేవాసురయుద్ధంబుతో సమానమయిన యా బొమ్మయుద్ధమునందు వానరరాక్షసుల మొండెములు దిక్కులం జెదరించుచుండినవి. ౪౫

అప్పుడు రాక్షసులు వానరవీరులచే వధింపఁబడి నెత్తురు వెల్లువలయిన దేహముగలవారలయ్యు తమకు బలకరంబగు సూర్యాస్తమయంబు రాఁగోరి బలంబు నవలంబించి యుద్ధంబు సేయుచుండిరి. ౪౬

ఇది నలువదిమూఁడవసర్గము.

## నలువదినాలుగవసర్గము.

అప్పుడు ఆవానరరాక్షసులు అట్లుయుద్ధము సేయుచుండఁగానే సూర్యుఁ డస్తంగతుఁడయ్యెను; అంత వానరప్రాణహారిణియగురాత్రియు వచ్చినది.

అప్పుడు పరస్పరము బద్ధవైరులును భయంకరాకారులును జయాభిలాషులునగు నావానరరాక్షసులకు రాత్రియుద్ధంబు గలిగినది. ౨

భయంకరంబగు నాయంధకారంబునందు వానరులు రాక్షసుఁడని వానరుని రాక్షసులు వానరుఁడని రాక్షసుని ఇట్లు గన్ను దెలియక ఒండొరులం గొట్టుకొనిరి. 3

వధింపుము, చీల్చివేయుము; పోవలదురమ్ము; ఏల పరుగెత్తెదవు? ఇట్లు ఆయంధకారమునందుఁ దుములంబుగా మహాధ్వని వినఁబడినది. ౪

కాళాగ్ని కాఞ్చనసన్నాహా స్తస్మిం స్తమసి రాక్షసాః,
సంప్రాదృశ్య న్త శైలేన్ద్రా దీప్తౌషధివనా ఇవ. ౫

తస్మిం స్తమసి దుష్పారే రాక్షసాః క్రోధమూర్ఛితాః,
పరిపేతు ర్మహావేగా భక్షయ న్తః ప్లవఙ్గమాన్. ౬
తే హయాన్కాఞ్చనాపీడాన్ ధ్వజాం శ్చాగ్నిశిఖోపమాన్,
ఆప్లుత్య దశనై స్తీక్ష్ణై ర్భీమకోపా వ్యదారయన్. ౭

వానరా బలినో యుద్ధే క్షోభయ న్రాక్షసీం చమూమ్,

కుఞ్జరా న్కుఞ్జరారోహా న్పతాకాధ్వజినో రథాన్. ౮
చకర్షుశ్చ దదంశుశ్చ దశనైః క్రోధమూర్ఛితాః,

లక్ష్మణ శ్చాపి రామశ్చ శరై రాశీవిషోపమైః. ౯
దృశ్యాదృశ్యాని రక్షాంసి ప్రవరాణి నిజఘ్నతుః,
తురఙ్గఖురవిధ్వ స్తం రథనేమి సముత్థితమ్. ౧౦
రురోధ కర్ణనేత్రాణి యుధ్యతాం ధరణీరజః,
వ ర్తమానే మహాఘోరే సఙ్గ్రామే రోమహర్షణే. ౧౧
రుధిరోదా మహాఘోరా నద్య స్తత్ర ప్రసుస్రువుః,

తతో భేరీమృదఙ్గానాం పణవానాం చ నిస్వనః. ౧౨
శఙ్ఖవేణుస్వనోన్మిశ్ర స్సంబభూ వాద్భుతోపమః,
హతానాం స్తనమానానాం రాక్షసానాం చ నిస్వనః. ౧౩
శస్తానాం వానరాణాంచ సంబభూ వాతిదారుణః,

ఆయంధకారంబున నల్లని మేనుగలవారలును బంగారుకవచంబుఁ దొడఁగుకొని యున్నవారలునగు రాక్షసులు రాత్రికాలంబున జ్వలించునట్లు ప్రకాశించుచుండు నోషధుల వనముగల మహాపర్వతంబులఁబోల్కిఁ గాన్పట్టుచుండిరి. ౫

అనంతరంబగు నాయంధకారంబున రాక్షసులు పరమకుపితులయి మహావేగంబున వానరుల భక్షించుచు యుద్ధభూమిని విహరింపుచుండిరి. ౬

ఆవానరులు మహాకోపంబునొంది యాకాశంబున కుద్గమించి తీక్ష్ణదంతంబుల బంగారుశిరోభూషణంబులు గలగుఱ్ఱంబులను అగ్నిజ్వాలలువలెఁ బ్రకాశించుచున్నధ్వజంబులను జీలిచివేసిరి. ౭

బలవంతులగు వానరులు యుద్ధంబున రాక్షససేనను నానావిధంబులం గలంచిరి.

వానరులు క్రోధమూర్ఛితులయి యేనుఁగులను, ఏనుఁగులపైఁ గూర్చుండినవారలను ధ్వజములు గట్టియున్నరథంబులను ఈడ్చివేసి దంతంబులఁ గొఱికి నాశంబు నొందించిరి. ౯

రాముఁడును లక్ష్మణుండును అప్పుడు దృశ్యులయియున్న వారలును అదృశ్యులయినవారలునగు రాక్షసులఁ బెక్కండ్రఁ దీక్ష్ణబాణంబుల వధించిరి.

అప్పుడు గుఱ్ఱంబుల త్రొక్కుడుచేఁ జూర్ణితంబయి రథచక్రంబులచేఁ బైకిలేచినపరాగము యుద్ధముసేయువారలచెవులను గన్నులను నావరించినది.

అట్లు చూపరులకు రోమహర్షణంబుగా మహాభయంకరంబుగా యుద్ధము జరుగుచుండఁగా నాయుద్ధభూమియందు మహాభయంకరములగు రక్తనదులు ప్రవహించినవి. ౧౧

అంత భేరీమృదంగపణవధ్వనులును శంఖవేణురావంబులును ఒక్కటిగాఁగలసి యాశ్చర్యకరంబుగా వినవచ్చినవి. ౧౨

ఒండొరులం జక్కఁగాఁ బ్రహరించుకొని గర్జించుచున్న వానరరాక్షసుల గర్జాధ్వనులు అతిభయంకరంబుగా వినవచ్చుచుండినవి. ౧౩

హతై ర్వానరవీరై శ్చ శక్తిశూలపరశ్వధైః. ౧౪
నిహతైః పర్వతాగ్రైశ్చ రాక్షసైః కామరూపిభిః,
శస్త్రపుష్పోపహారా చ తత్రాసీ ద్యుద్ధమేదినీ. ౧౫
దుర్జ్ఞేయా దుర్నివేశా చ శోణితాస్రావకర్దమా,

సా బభూవ నిశా ఘోరా హరిరాక్షసహారిణీ. ౧౬
కాళరాత్రీవ భూతానాం సర్వేషాం దురతిక్రమా,

తత స్తే రాక్షసా స్తత్ర తస్మిం స్తమసి దారుణే. ౧౭
రామమేవాభ్యవర్తన్త సంసృష్టా శ్శరవృష్టిభిః,
తేషా మాపతతాం శబ్దః క్రుద్ధానా మపి గర్జతామ్. ౧౮
ఉద్వర్త ఇవ సప్తానాం సముద్రాణాం ప్రశుశ్రువే,

తేషాం రామ శ్శరై ష్షడ్భి ష్షడ్జఘాన నిశాచరాన్. ౧౯
నిమేషాన్తరమాత్రేణ శితై రగ్నిశిఖోపమైః,
యమశత్రుశ్చ దుర్ధర్షో మహాపార్శ్వ మహోదరౌ. ౨౦
వజ్రదంష్ట్రో మహాకాయ స్తౌ చోభౌ శుకసారణౌ,
తే తు రామేణ బాణౌఘై స్సర్వే మర్మసు తాడితాః. ౨౧
యుద్ధా దపసృతా స్తత్ర సావశేషాయుషోఽభవన్,

తత్ర కాఞ్చనచిత్రాఙ్గై శ్శరై రగ్నిశిఖోపమైః. ౨౨
దిశ శ్చకార విమలాః ప్రదిశశ్చ మహాబలః,
యే త్వన్యే రాక్షసా భీమా రామ స్యాభిముఖే స్థితాః. ౨౩
తేఽపి నష్టా స్సమాసాద్య పతఙ్గా ఇవ పావకమ్,

అచ్చట నప్పుడు వానరవీరులు శక్తిశూలపరశ్వథాద్యాయుధంబుల హతులగుటవలనను రాక్షసులు పర్వతశిఖరంబుల హతులగుటవలనను ఆయుద్ధభూమి యయ్యాయుధంబులచేతను బర్వతశిఖరంబులనుండి రాలిన పుష్పంబులచేతను ఆచ్ఛాదితమయి నెత్తురుచేఁ దడుపంబడి బురదగా నుండుటచేత దుష్ప్రవేశమయియుండినది. ౧౪,౧౫

భయంకరమును వానరరాక్షసుల ప్రాణంబులు హరించునదియునగు నారాత్రి కాళరాత్రియుంబోలె సమస్తభూతంబులకును ఇంక నెట్లు తెల్లవాఱు ననునట్లు భయంబుగల్గించినది. ౧౬

అంత నప్పుడు భయంకరంబగు నాయంధకారంబున నామేటిరాక్షసులు బాణవర్షంబులు గురిపించుచు రామునిపై కడరిరి. ౧౭

ఆరాక్షసులు క్రుద్ధులయి గర్జించుచు రామునిపై కడరఁగా నాధ్వని మహాప్రళయంబున నుప్పొంగు సప్తసముద్రంబుల శబ్దముంబోలె, భయంకరంబై వినవచ్చినది. ౧౮

రాముఁడు ఒక్కయెప్పపాటున ఆరాక్షసులలో నాఱుగురను తీక్ష్ణములగు నగ్నిజ్వాలలవంటి యాఱుబాణంబుల నొప్పించెను. ౧౯

దుర్ధర్షుఁడగు యమశత్రుఁడును మహాపార్శ్వుండును మహోదరుండును మహాకాయుండగు వజ్రదంష్ట్రుండును ఆరావణునిచే నుత్తరద్వార రక్షణార్థమయి నియుక్తులగు శుకసారణు లిద్దఱును, ఈరాక్షసులార్గురును, రామునిచేత జీవస్థానంబులందుఁ దీక్ష్ణబాణంబులఁ దాడితులయి యంత యుద్ధంబుననుండి దొలఁగి కొంత యాయుస్సును దక్కించుకొనిరి. ౨౦, ౨౧

మహాబలుఁడగు రాముండు అంధకారంబునఁ గాంచనాలంకృతంబులగు నగ్నిజ్వాలలవంటి బాణంబులచే దిక్కులందును విదిక్కులందును వెలుతురు గలుగఁజేసెను. ౨౨

మఱియు నింకను భయంకరాకారులగు రాక్షసు లెవ్వరెవ్వరు రాముని కభిముఖంబుగా నిలిచిరో వారలందఱు నగ్నిహోత్రంబునంబడిన మిడుతలమాడ్కి నాశంబునొందిరి. ౨౩

సువర్ణపుఙ్ఖైర్విశిఖై స్సంపతద్భి స్సహస్రశః. ౨౪
బభూవ రజనీ చిత్రా ఖద్యోతై రివ శారదీ,
రాక్షసానాం చ నినదై ర్హరీణాం చాపి నిస్వనైః. ౧౫
సా బభూవ నిశా ఘోరా భూయో ఘోరతరా తదా,
తేన శబ్దేన మహతా ప్రవృద్ధేన సమన్తతః. ౨౬
త్రికూటః కన్దరాకీర్ణః ప్రవ్యాహరదివాచలః,

గోలాఙ్గూలా మహాకాయా స్తమసా తుల్యవర్చసః. ౨౭
సమ్పరిష్వజ్య బాహుభ్యాం భక్షయ న్రజనీచరాన్,
అఙ్గద స్తు రణే శత్రుం నిహన్తుం సముపస్థితః. ౨౮
రావణిం నిజఘానాశు సారథిం చ హయానపి,
వర్తమానే తదా ఘోరే సఙ్గ్రామే భృశదారుణే. ౨౯
ఇన్ద్రజిత్తు రథం త్యక్త్వా హతాశ్వో హతసారథిః,
అఙ్గదేన మహాకాయ స్తత్రై వాన్తరధీయత. ౩౦
తత్కర్మ వాలిపుత్రస్య సర్వే దేవా స్సహర్షిభిః,
తుష్టువుః పూజనార్హస్య తౌ చోభౌ రామలక్ష్మణౌ. ౩౧
ప్రభావం సర్వభూతాని విదు రిన్ద్రజితో యుధి,
తేన తే తం మహాత్మానం తుష్టా దృష్ట్వా ప్రధర్షితమ్. ౩౨

తతః ప్రహృష్టాః కపయ స్ససుగ్రీవవిభీషణాః,
సాధు సాధ్వితి నేదుశ్చ దృష్ట్వా శత్రుం ప్రధర్షితమ్. ౩౩

ఇన్ద్రజిత్తు తదా తేన నిర్జితో భీమకర్మణా,
సంయుగే వాలిపుత్రేన క్రోధం చక్రే సుదారుణమ్. ౩౪

వేనవేలుగా బంగారు పింజలుగలబాణములు ప్రయోగింపఁబడుచుండుటంజేసి మిడుఁగుఱుఁగురువులతోఁగూడిన శరద్రాత్రికైవడి నారాత్రి యెంతయుఁ నొప్పుచుండినది. ౨౪

మొదలే భయంకరమయియుండు నారాత్రి వానరరాక్షసులు సేయుచుండు సింహనాదంబులచే మఱియుఁ భయంకరముగానుండినది. ౨౫

అంతటను వ్యాపించి వృద్ధిఁబొందినయాధ్వనిచేతఁ బెక్కుగుహలతోఁ గూడిన త్రికూటపర్వతము ప్రతిధ్వనులుసేయుచు మాటలాడినట్లు చూపట్టినది. ౨౬

మహాకాయులును అంధకారంబువలె నల్లనిమేనుగలవారలునగు గోలాంగూలంబులు రాక్షసులఁ జేతులం గవుఁగిలించుకొని భక్షింపసాగిరి. ౨౭

అంగదుఁడు యుద్ధంబునఁ దన ప్రతివీరుఁడగు నింద్రజిత్తును వధింపఁ దలంపుగొని సారథిని గుఱ్ఱంబులనుంగూడ వధించెను. ౨౮

అప్పు డిట్లు మహాభయంకరంబుగ యుద్ధంబు జరుగుచుండఁగానే మహాకాయుఁడగు నింద్రజిత్తుమాత్రము అంగదుఁడు గుఱ్ఱంబులను సారథినిఁజంపినందున రథంబును విడిచి యచ్చటనె యంతర్ధానంబు నొందెను. ౨౯, ౩౦

దేవతలును ఋషులును రామలక్ష్మణు లిద్దఱును బూజార్హుఁడగు నంగదుఁడు గావించిన యాకార్యమునకు మెచ్చుకొని ప్రస్తుతించిరి. ౩౧

సమస్తభూతంబులకును యుద్ధంబున నింద్రజిత్తుప్రభావంబు దెలియును; కావున వారలు అట్టి మహాపరాక్రమశాలియగు నింద్రజిత్తు యుద్ధంబునఁ బరాజయంబు నొందుటంజూచి సంతోషము నొందిరి. ౩౨

అంత సుగ్రీవుఁడును విభీషణుఁడును వానరులును ఇంద్రజిత్తు పరాజయంబు నొందుటంజూచి పరమసంతోషంబునొంది యంగదుని సాధువాదంబులఁ బ్రశంసించిరి. ౩౩

అంత నింద్రజిత్తు అట్లు భయంకర పరాక్రముఁడగు నంగదుని యుద్ధంబునఁ బరాజయంబునొంది దారుణంబగుకోపంబు నవలంబించెను. ౩౪

ఏతస్మిన్నన్తరే రామో వానరాన్వాక్య మబ్రవీత్,
సర్వే భవన్త స్తిష్ఠన్తు కపిరాజేన సంగతాః. 35

స బ్రహ్మణా దత్తవర స్త్రైలోక్యం బాధతే భృశమ్,
భవతా మర్థసిద్ధ్యర్థం కాలేన స సమాగతః. 36

అద్యైవ క్షమితవ్యం మే భవన్తో విగతజ్వరాః,
సో౽న్తర్ధానగతః పాపో రావణీ రణకర్కశః. 37
అదృశ్యో నిశితాన్బాణా న్ముమోచాశనివర్చసః,
సరామం లక్ష్మణం చైవ ఘోరై ర్నాగమయై శ్శరైః. 38
బిభేద సమరే క్రుద్ధ స్సర్వగాత్రేషు రాక్షసః,
మాయయా సంవృత స్తత్ర మోహాయ న్రాఘవౌ యుధి. 39
అదృశ్య స్సర్వభూతానాం కూటయోధీ నిశాచరః,
బబన్ధ శరబన్ధేన భ్రాతరౌ రామలక్ష్మణౌ. 40
తౌ తేన పురుషవ్యాఘ్రౌ క్రుద్ధేనాశీవిషై శ్శరైః,
సహసా నిహతౌ వీరౌ తదా ప్రైక్షన్త వానరాః. 41

ప్రకాశరూపస్తు యదా న శక్త
స్తౌ బాధితుం రాక్షసరాజపుత్త్రః,
మాయాం ప్రయోక్తుం సముపాజగామ
బబన్ధ తౌ రాజసుతౌ దురాత్మా. 42

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే చతుశ్చత్వారింశస్సర్గః. 44.

---

పఞ్చచత్వారింశస్సర్గః.

స తస్య గతి మన్విచ్ఛ న్రాజపుత్త్రః ప్రతాపవాన్,

ఈమధ్యమున రామూఁడు వానరులంజూచి యిట్లని చెప్పెను.

మీరలందఱు వానరరాజుండగు సుగ్రీవునితోఁగూడ జాగ్రత్తతో నుండుఁడు. 3౫

ఆయింద్రజిత్తు బ్రహ్మావలన వరంబునొంది ముల్లోకంబులను మిక్కిలియు బాధింపుచుండు. ఇప్పుడతనికి మృత్యుసన్నిహితమగుటవలన నతనివధించుట యను మీకార్యము సిద్ధించుటకై వచ్చినాఁడు. 3౬

ఇప్పుడుమాత్రము మీరు జాగరూకులై యుండవలసినది.

పాపాత్ముఁడును యుద్ధమునందు సమర్థుఁడునగు నాయింద్రజిత్తు అంతర్ధానవిద్యచే నదృశ్యుఁడై పిడుగులవంటి తీక్ష్ణబాణంబులఁ బ్రయోగించెను.

ఆయింద్రజిత్తు యుద్ధంబునఁ గోపించి రామలక్ష్మణులపై నాపాదమస్తకంబు భయంకరంబులగు నాగమయబాణంబులఁ బ్రయోగించెను. 3౮

అప్పుడు కపటమున యుద్ధముసేయునట్టి యాయింద్రజిత్తు మాయ నవలంబించి సమస్తభూతంబులకు నదృశ్యుఁడై వానరులకందఱ మోహంబు నొందించుచు రామలక్ష్మణుల నిద్దఱను నాబాణంబులచే బంధించెను. 3౯,౪౦

అంత నట్లు క్రుద్ధుఁడగు నింద్రజిత్తుచే నాగబాణంబుల బంధింపఁబడి పరవశులయియున్న పురుషశ్రేష్ఠులను వీరులునగు రామలక్ష్మణులను వానరులు చూచిరి. ౪౧

మహాపరాక్రమశాలియగు రాక్షసేశ్వరసుతుఁ డింద్రజిత్తు స్పష్టముగా నెదుటనిలిచి రామలక్ష్మణుల బాధింప నశక్తుఁడయ్యెఁ గావున మాయ నవలంబించి యదృశ్యరూపుఁడైయుండియారామలక్ష్మణుల నాగబాణంబుల బంధించెను; ౪౨

ఇది నలువదినాలుగవసర్గము.

## నలువదియైదవసర్గము.

రాచకొమరుఁడును మహాపరాక్రమశాలియు మహాబలుఁడునగు

దిదేశాతిబలో రామో దశ వానర యూథపాన్. ౧

ద్వౌ సుషేణస్య దాయాదౌ నీలం చ ప్లవగర్షభమ్,
అఙ్గదం వాలిపుత్త్రం చ శరభం చ తరస్వినమ్. ౨
వినతం జామ్బవన్తం చ సానుప్రస్థం మహాబలమ్,
ఋషభం చర్షభస్కన్ధ మాదిదేశ పరన్తపః. ౩

తే సమ్ప్రహృష్టా హరయో భీమా నుద్యమ్య పాదపాన్,
ఆకాశం వివిశు స్సర్వే మార్గమాణా దిశో దశ. ౪
తేషాం వేగవతాం వేగ మిషుభి ర్వేగవత్తరైః,
అస్త్రవి త్పరమా స్త్రైస్తు వారయామాస రావణిః. ౫
తం భీమవేగా హరయో నారాచైః క్షతవిగ్రహాః,
అన్ధకారే న దదృశు ర్మేఘై స్సూర్య మి వావృతమ్. ౬
రామలక్ష్మణయో రేవ సర్వదేహభిద శ్శరాన్,
భృశ మావేశ యామాస రావణి స్సమితింజయః. ౭
నిరన్తరశరీరౌ తౌ భ్రాతరౌ రామలక్ష్మణౌ,
క్రుద్ధే నేన్ద్రజితా వీరౌ పన్నగై శ్శరతాం గతైః. ౮

తయోః క్షతజమార్గేణ సుస్రావ రుధిరం బహు,
తా వుభౌ చ ప్రకాశేతే పుష్పితా వివ కింశుకౌ. ౯

తతః పర్యన్తరక్తాక్షో భిన్నాఞ్జనచయోపమః,
రావణి ర్భ్రాతరౌ వాక్య మన్తర్ధానగతో౽బ్రవీత్, ౧౦

యుధ్యమాన మనాలక్ష్యం శక్రో౽పి త్రిదశేశ్వరః,

రాముఁడు ఆ యింద్రజి త్తెందున్నాఁడో తెలియఁగోరి పదుగురవానర యూథపుల కాజ్ఞాపించెను. ౧

శత్రువుల దపింపఁజేయునట్టి రాముఁడు సుషేణునికొడుకు లిద్దఱును వానరోత్తముఁడగు నీలుఁడు నంగదుఁడును బలవంతుఁడగు శరభుఁడును వినతుఁడును జాంబవంతుఁడును మహాబలశాలియగు సానుప్రస్థుఁడును ఋషభుఁడును ఋషభస్కంధుఁడును నీపదిమందిని ఇంద్రజిత్తుస్థానం బారసిరం డని యాజ్ఞాపించెను. ౨, ౩

ఆ వానరులందరును బరమసంతోషంబునొంది మహావృక్షంబులం గొని దశదిశలందు నింద్రజిత్తును వెదకుచు నాకాశంబున కుద్గమించిరి. ౪

పరమాస్త్రవేత్తయగు నింద్రజిత్తు బ్రహ్మాస్త్రాభిమంత్రితంబులగు బాణంబుల వేగవంతులగు నావానరుల వేగంబు నివారించెను. ౫

భయంకరవేగులగు నావానరులు బాణంబుల భిన్నగాత్రులయి మేఘావృతుఁడగు సూర్యుఁడుంబోలె నంధకారంబుననున్న యింద్రజిత్తుం గానరైరి.

జయశాలియగు నాయింద్రజిత్తు సమస్తావయవంబులను భేదించునట్టి కఱకుబాణంబులమీఁద నారామలక్ష్మణులపై యెచ్చుగాఁ బ్రయోగించెను. ౭

ఆ ట్లింద్రజిత్తు క్రుద్ధుఁడై పరాక్రమవంతులగు నారామలక్ష్మణులపై బాణాకారములగు సర్పములను దేహములందు సూదిమోపనైన నవకాశము లేనట్లు ప్రయోగించెను. ౮

ఆ రామలక్ష్మణుల దేహంబులందుండి యధికముగా నెత్తురు గాఱినది; అప్పుడు వార లిరువురు పుష్పితంబులగు పలాశవృక్షములమాడ్కిఁ బ్రకాశించిరి. ౯

అంతఁ గాటుకరాశియుంబోలె నీలవర్ణుఁడగు నా యింద్రజిత్తు అంతర్ధానగతుఁడై యే కోపంబునఁ గనుంగొనల నెఱ్ఱఁదనంబుగదుర రామలక్ష్మణులం జూచి యిట్లని చెప్పెను. ౧౦

నే నంతర్ధానమునొంది యుద్ధముసేయుచుండఁగా దేవనాథుఁడగు

ద్రష్టుమాసాదితుం వాపి న శక్తః కింపునర్యువామ్. ౧౧

ప్రావృతావిషుజాలేన రాఘవౌ కఙ్కపత్త్రిణా,
ఏషరోషపరీతాత్మా నయామి యమసాదనమ్. ౧౨

ఏవ ముక్త్వా తు ధర్మజ్ఞౌ భ్రాతరౌ రామలక్ష్మణౌ,
నిర్బిభేద శితై ర్బాణైః ప్రజహర్ష ననాద చ. ౧౩

భిన్నాఞ్జనచయశ్యామో విస్ఫార్య విపులం ధనుః,
భూయోభూయ శ్శరాన్ఘోరాన్విససర్జ మహామృధే. ౧౪

తతో మర్మసు మర్మజ్ఞో మజ్జయ న్నిశితాన్ శరాన్,
రామలక్ష్మణయో ర్వీరో ననాద చ ముహుర్ముహుః. ౧౫

బద్ధౌ తు శరబన్ధేన తా వుభౌ రణమూర్ధని,
నిమేషాన్తరమాత్రేణ న శేకతురుదీక్షితుమ్. ౧౬
తతో విభిన్నసర్వాఙ్గౌ శరశల్యాచితావుభౌ,
ధ్వజావివ మహేన్ద్రస్య రజ్జుముక్తౌ ప్రకమ్పితౌ. ౧౭
తౌ సమ్ప్రచలితౌ వీరౌ మర్మభేదేన కర్శితౌ,
నిపేతతు ర్మహేష్వాసౌ జగత్యాం జగతీపతీ. ౧౮
తౌ వీరశయనే వీరౌ శయానౌ రుధిరోక్షితౌ,
శరవేష్టితసర్వాఙ్గా వార్తౌ పరమపీడితౌ. ౧౯

న హ్యవిద్ధం తయో ర్గాత్రే బభూవాఙ్గుళమన్తరమ్,

నింద్రుఁడుగూడ నన్నుఁ జూచుటకుఁగాని సమీపించుటకుఁగాని శక్తుఁడు గాఁడు; ఇంక మీసంగతి చెప్పనేల ? ౧౧

రామలక్ష్మణులారా! ఇప్పుడు మీరలు కంకపత్రవంతములగు బాణంబుల నాపాదమస్తకము నావృతులై యున్నారుగదా! ఇంక నిప్పుడే మిమ్ముల యమపురికిం బంపెదను; నాకోపము వ్యర్థముగాదు. అని యింద్రజిత్తు రామలక్ష్మణులతోఁ జెప్పెను. ౧౨

ఆ యింద్రజిత్తు ఈప్రకారముగం జెప్పి ధర్మజ్ఞులగు నారామలక్ష్మణులను దీక్ష్ణబాణంబుల నొప్పించి సంతోషంబున సింహనాదంబు గావించెను. ౧౩

పగిలిన కాటుకరాశివలె నల్లనైన యింద్రజిత్తు అమ్మహాయుద్ధంబున విశాలంబగు ధనువును సారించి మాటిమాటికి తీక్ష్ణంబులగు బాణంబులం బ్రయోగించెను. ౧౪

అంతఁ బరాక్రమవంతుఁడును జీవస్థానంబులు చక్కఁగాఁ దెలిసినవాఁడునగు నింద్రజిత్తు రామలక్ష్మణులమర్మస్థానములఁ దీక్ష్ణబాణంబులు చొప్పించి మాటిమాటికి సింహనాదంబులు గావించెను. ౧౫

ఆ రామలక్ష్మణులు అట్లు శరబంధంబున బద్ధులయి క్షణమాత్రంబునఁ జూచుటకుఁగూడ నశక్తులయిరి. ౧౬

అంత మహాధనుర్ధరులును మహావీరులును భూపతులునగు నారామలక్ష్మణు లిర్వురును భిన్నసర్వావయవులై బాణపూర్ణదేహులయి మర్మస్థానంబుల భిన్నలగుటం జేసి మిక్కిలియుం నొచ్చి చలనంబునొంది రజ్జుముక్తంబులగు నింద్రధ్వజంబులకైవడి నేలంబడిరి. ౧౭, ౧౮

పరాక్రమవంతులగు నారామలక్ష్మణులు నెత్తుటందోఁగుచు సమస్తావయవంబులందును బాణంబుల బద్ధులయి పరమపీడితులయి యార్తులయి యుద్ధభూమియందు శయనించియుండిరి. ౧౯

ఆ రామలక్ష్మణులదేహమునందు ఆపాదమస్తకము బాణంబుల విద్ధంబు

నానిర్భిన్నం నచాస్తబ్ధ మాకరాగ్రా దజిహ్మగః. ౨౦

తౌ తు క్రూరేణ నిహతౌ రక్షసా కామరూపిణా,
అసృక్సుస్రావతు స్తీవ్రం జలం ప్రస్రవణావివ. ౨౧

పపాత ప్రథమం రామో విద్ధో మర్మసు మార్గణైః,
క్రోధా దిన్ద్రజితా యేన పురా శక్రో వినిర్జితః. ౨౨

రుక్మపుఙ్ఖైః ప్రసన్నాగ్రై రధోగతిభిరాశుగైః,
నారాచైరర్ధనారాచై ర్భల్లై రఞ్జలికై రపి. ౩౨
వివ్యాధ వత్సదన్తైశ్చ సింహదంష్ట్రైః క్షురై స్తథా,

స వీరశయనే శిశ్యే విజ్య మాదాయ కార్ముకమ్. ౨౪
భిన్నముష్టిపరీణాహం త్రిణతం రుక్మభూషితమ్,

బాణపాతాన్తరే రామం పతితం పురుషర్షభమ్. ౨౫
స తత్ర లక్ష్మణో దృష్ట్వా నిరాశో జీవితేఽభవత్,
రామం కమలపత్త్రాక్షం శరబన్ధపరిక్షతమ్. ౨౬
శుశోచ భ్రాతరం దృష్ట్వా పతితం ధరణీతలే,
హరయశ్చాపి తం దృష్ట్వా సన్తాపం పరమం గతాః. ౨౭

బద్ధౌ తు వీరౌ పతితౌ శయానౌ
తే వానరాస్సమ్పరివార్య తస్థుః,

గానిదియు భిన్నంబు గానిదియు నిశ్చలముగానిదియుఁ నంగుళప్రమాణ ప్రదేశంబును లేదు. ౨౦

అట్లు కామరూపియుఁ గ్రూరుఁడునగు నింద్రజిత్తుచేఁ గొట్టఁబడిన రామలక్ష్మణుల దేహంబులనుండి సెలయేఱులనుండి జలముగాఱునట్లు ఎఱ్ఱగా నెత్తురుగాఱినది. ౨౧

ముందు దేవేంద్రునింగూడ జయించినట్టి మహాపరాక్రమశాలియగు నింద్రజిత్తుచేఁ గోపంబున బాణంబులచే జీవస్థానంబులందు విద్ధుఁడై మొదట రాముఁడు నేలంబడెను. ౨౨

ఆ యింద్రజిత్తు బంగారుపింజలుగలవియు స్వచ్ఛములగు కొనలుగలవియుఁ వాయువేగోద్ధూతంబగు దుమ్మువలె సాంద్రముగాఁ బఱతెంచునవియుం నగు నారాచంబులును అర్ధనారాచంబులును భల్లంబులును అంజలికంబులును వత్సదంతములును సింహదంష్ట్రంబులును అర్ధచంద్రాకారబాణంబులును మొదలగు నానావిధబాణంబుల రాముని నొప్పించెను. ౨౩

ఆరాముఁడు శిథిలముష్టిబంధంబులును మధ్యంబునను పార్శ్వంబులను వంగినదియుఁ గాంచనాలంకృతంబునగు ధనువు నవలంబించి యుద్ధభూమిం బరుండెను. ౨౪

అంత నయ్యుద్ధభూమియందు బాణమయతల్పంబునఁ బరుండిన పురుషోత్తముఁడగు రాముంజూచి లక్ష్మణుఁడు బ్రతుకుపై నాసవిడిచెను. ౨౫

లక్ష్మణుఁడు అట్లు తనయన్న కమలపత్రాక్షుఁడగు రాముఁడు బాణబంధంబున నొచ్చి భూమింబడుటనుజూచి మిక్కిలియుఁ దుఃఖమునొందెను. ౨౬

వానరులును అట్లు రాముఁడు నేలంబడియుండుటనుజూచి పరమ దుఃఖితులయిరి. ౨౭

హనుమంతుఁడు మొదలుగాఁగల యా వానరులందఱుం జేరి అట్లు నాగపాశబద్ధులయి నేలంబడి పరుండియున్న రామలక్ష్మణులం బరివేష్టించి నిలు

సమాగతా వాయుసుతప్రముఖ్యా
విషాద మార్తాగ పరమం చ జగ్ముః ౨౮

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే పఞ్చచత్వారింశస్సర్గః. ౪౫.

---

## షట్చత్వారింశస్సర్గః.

తతో ద్యాం పృథివీం చైవ వీక్షమాణా వనౌకసః,
దదృశు స్సన్తతౌ బాణై శ్ఛాదితౌ రామలక్ష్మణౌ. ౧
వృష్ట్వేవోపరతే దేవే కృతకర్మణి రాక్షసే,
ఆజగామాథ తం దేశం ససుగ్రీవో విభీషణః. ౨

నీలద్వివిదమైన్దాశ్చ సుషేణకుముదాఙ్గదాః,
తూర్ణం హనుమతా సార్థ మన్వశోచన్త రాఘవౌ. 3

అచేష్టౌ మన్దనిశ్వాసౌ శోణితౌఘపరిప్లుతౌ,
శరజాలాచితౌ స్తబ్ధౌ శయానౌ శరతల్పయోః. ౪
నిశ్వసన్తౌ యథా సర్పౌ నిశ్చేష్టౌ మన్దవిక్రమౌ,
రుధిరస్రావదిగ్ధాఙ్గౌ తాపనీయావివ ధ్వజౌ. ౫

తౌ వీరశయనే వీరౌ శయానౌ మన్దచేష్టితౌ,
యూథపై స్తైః పరివృతౌ బాష్పవ్యాకులలోచనైః. ౬
రాఘవౌ పతితౌ దృష్ట్వా శరజాలసమావృతౌ,
బభూవు ర్వ్యథితా స్సర్వే వానరా స్సవిభీషణాః. ౭

అన్తరిక్షం నిరీక్షన్తో దిశ స్సర్వాశ్చ వానరాః,
నచైనం మాయయా చ్ఛన్నం దదృశూ రావణిం రణే. ౮

చుండి యార్తులయి మిక్కిలి దుఃఖంబునొందిరి. ౨౮

ఇతి నలువదియైదవసర్గము.

## నలువదియాఱవసర్గము.

అంత వానరులు ఆకాశంబును భూమినిం జూచుచు నట్లు బాణంబుల విద్ధులయి నేలంబరుండియున్న రామలక్ష్మణులం గనిరి. ౧

వర్షించి నిలుచు మేఘంబుకైవడి నాయింద్రజిత్తు కార్యంబు గావించి యుపరమించినవెనుక రాముఁడున్నస్థలంబునకు విభీషణుఁడు సుగ్రీవునితోఁ గూడ వచ్చెను. ౨

హనుమంతుఁడును నీలుఁడును ద్వివిదుఁడును మైందుఁడును సుషేణుఁడును గుముదుఁడును నంగదుఁడును రామలక్ష్మణులంజూచి మిక్కిలియుం దుఃఖించిరి. ౩

ఆ రామలక్ష్మణులు నిశ్చేష్టులయి కొంతసేపు మెల్లఁగా నిట్టూర్పు పుచ్చుచు నెత్తురుచేఁ దడుపఁబడి బాణసమూహావృతదేహులయి నిశ్చలులయి బాణతల్పంబులం బరుండి కొంతసేపు సర్పములంబోలె వేఁడినిట్టూర్పులు పుచ్చుచుఁ బరాక్రమహీనులయి బంగారుధ్వజంబుల కైవడిఁ జూపట్టుచుండిరి. ౪, ౫

యుద్ధభూమియందు శయనించియున్న వారలును బరాక్రమశాలులును స్వల్పముగాఁ గాళ్లఁజేతు లాడించువారలును గన్నులనిండఁ గన్నీళ్లతో నున్న వానరయూథపులచేఁ బరివేష్టితులును బాణసమూహముచేఁ గప్పఁబడియున్న వారలునగు నారామలక్ష్మణులంజూచి విభీషణుఁడును వానరులు నందఱును దుఃఖితులయిరి. ౬, ౭

యుద్ధంబున నావానరులు ఆకాశంబును సమస్తదిక్కులను వెదకినను మాయాసహితుఁడగు నింద్రజిత్తుం జూడఁజాలరైరి. ౮

తం తు మాయాప్రతిచ్ఛన్నం మాయయైవ విభీషణః,
వీక్షమాణో దదర్శాథ భ్రాతుః పుత్త్ర మవస్థితమ్. ౯
త మప్రతిమకర్మాణ మప్రతిద్వన్ద్వ మాహవే,
దదర్శాన్తర్హితం వీరం వరదానాద్విభీషణః. ౧౦
తేజసా యశసా చైవ విక్రమేణ చ సంయుతమ్,
ఇన్ద్రజిత్త్వాత్మనః కర్మ తౌ శయానౌ సమీక్ష్య చ. ౧౧
ఉవాచ పరమప్రీతో హర్షయన్ సర్వనైరృతాన్,
దూషణస్య చ హన్తారౌ ఖరస్య చ మహాబలౌ. ౧౨
సాదితౌ మామకైర్బాణై ర్భ్రాతరౌ రామలక్ష్మణౌ,
నేమౌ మోక్షయితుం శక్యావేతస్మా దిషుబన్ధనాత్. ౧౩
సర్వైరపి సమాగమ్య సర్షిసఙ్ఘై స్సురాసురైః,
యత్కృతే చిన్తయానస్య శోకార్తస్య పితు ర్మమ. ౧౪
అస్పృష్ట్వా శయనం గాత్రై స్త్రియామా యాతి శర్వరీ,
కృత్స్నేయం యత్కృతే లఙ్కా నదీ వర్షాస్వివాఽఽకులా. ౧౫
సోఽయం మూలహరోఽనర్థ స్సర్వేషాం నిహతో మయా,
రామస్య లక్ష్మణస్యాపి సర్వేషాం చ వనౌకసామ్. ౧౬
విక్రమా నిష్ఫలా స్సర్వే యథా శరది తోయదాః,

అంత విభీషణుఁడు మాయాతిరోహితులం గనుంగొనునట్టి మాయ నవలంబించి చూచి మాయాచ్ఛాదితుఁడగు నయ్యింద్రజిత్తుం జూచెను. ౯

విభీషణుఁడు అప్రతికర్మడును యుద్ధంబున నెదురులేనివాఁడును వరదానమహిమవలన నంతర్హితుఁడును బరాక్రమవంతుఁడును దేజంబుతోను గీర్తితోను బరాక్రమంబుతోనుం గూడినవాఁడునగు నాయింద్రజిత్తుఁ జూచెను. ౧౦

ఇంద్రజిత్తు తన ప్రభావంబున నారామలక్ష్మణు లట్లు పడుండియుండుటం జూచి పరమసంతుష్టుఁడై సమస్తరాక్షసుల సంతోషింపఁజేయుచు నిట్లని చెప్పెను. ౧౧

దూషణుని ఖరుని వధించినవారలును మహాబలశాలులునగు రామలక్ష్మణులు నాబాణంబుల నాశంబునొందినారు చూడుఁడు. ౧౨

ఋషులును దేవతలును నసురులు నందఱు నొక్కటిగావచ్చినను ఈరామలక్ష్మణులను నాగపాశబంధముననుండి విడిపింప నలవిగాదు. ౧౩

ఏరాముని నిమిత్తమయి నాతండ్రి రావణుఁడు చింతించుచు దుఃఖపీడితుఁడై ప్రతిరాత్రియందును నిత్యకృత్యంబుల నొకజాము గడచిపోఁగాఁ దక్కినమూఁడుజాముల నొకప్పుడును శయనంబు దాఁకకయే చింతాక్రాంతుఁడై ప్రొద్దుగడపునో. ౧౪

మఱియు నెవ్వనినిమిత్తమయి యీలంకాపురియందలి జనంబులన్నియు వర్షర్తువునందు నదీజలంబులుంబోలె నాకులంబులయ్యెనో అట్టి మనశందఱకును మూలముతో నాశంబుగలిగించు ననర్థమునకుఁ గారణంబగు రాముని నే నిప్పుడు వధించినాను. ౧౫

ఇప్పుడు రాముని పరాక్రమంబును లక్ష్మణుని విక్రమంబును సమస్తవానరులవీర్యంబులును శరత్కాలంబున మేఘంబులుంబోలె వ్యర్థములయినవి, అని యింద్రజిత్తు రాక్షసులతోఁ జెప్పెను. ౧

ఏవ ముక్త్వా తు తాన్ సర్వా న్రాక్షసా న్పరిపార్శ్వతః. ౧౭
యూథపా నపి తాన్ సర్వాం స్తాడయామాస రావణిః,
నీలం నవభిరాహత్య మైన్దం చ ద్వివిదం తథా. ౧౮
త్రిభి స్త్రిభి రమిత్రఘ్న స్తతాప ప్రవరేషుభిః,
జామ్బవన్తం మహేష్వాసో విద్ధ్వా బాణేన వక్షసి. ౧౯
హనూమతో వేగవతో విససర్జ శరాన్దశ,
గవాక్షం శరభం చైవ ద్వా వప్యమితతేజసౌ. ౨౦
ద్వాభ్యాం ద్వాభ్యాం మహావేగో వివ్యాథ యుధి రావణిః,
గోలాఙ్గూలేశ్వరం చైవం వాలిపుత్త్రమథాఙ్గదమ్. ౨౧
వివ్యాథ బహుభిర్బాణై స్త్వరమాణోఽథ రావణిః,
తా న్వానరవరా న్భిత్త్వా శరై రగ్నిశిఖోపమైః. ౨౨
ననాద బలవాం స్తత్ర మహాసత్త్వ స్సరావణిః,

తా నర్దయిత్వా బాణౌఘై స్త్రాసయిత్వా చ వానరాన్. ౨౩
ప్రజహాస మహాబాహు ర్వచనం చేదమబ్రవీత్,

శరబన్ధేన ఘోరేణ మయా బద్ధౌ చమూముఖే. ౨౪
సహితౌ భ్రాతరా వేతౌ నిశామయత రాక్షసాః!,

ఏవ ముక్తా స్తు తే సర్వే రాక్షసాః కూటయోధినః. ౨౫
పరం విస్మయ మాజగ్ముః కర్మణా తేన హర్షితాః,

వినేదుశ్చ మహానాదాన్ సర్వతో జలదోపమాః. ౨౬
హతో రామ ఇతి జ్ఞాత్వా రావణిం సమపూజయన్,

ఇంద్రజిత్తు ఇట్లు తనసమీపంబుననున్న రాక్షసులతోఁ జెప్పి యంత నావానరయూథపుల నందఱ నొప్పించెను. ౧౭

శత్రుసంహర్తయగు నింద్రజిత్తు నీలుని దొమ్మిదిబాణంబుల నొప్పించి మైందద్వివిదుల వేర్వేఱ మూఁడుమూఁడుకఱకుబాణంబుల నొప్పించెను.

మహాధనుర్ధరుఁడగు నింద్రజిత్తు జాంబవంతుని నొక్కబాణంబున నేసి వేగవంతుఁడగు హనుమంతునిపైఁ బదిబాణంబులఁ బ్రయోగించెను. ౧౯

యుద్ధంబున మహావేగుఁడగు నింద్రజిత్తు అమితపరాక్రమశాలులగు గవాక్షశరభుల నిద్దఱను రెండేసిబాణంబుల నొప్పించెను. ౨౦

అంత నింద్రజిత్తు వేగంబున మరల నాగోలాంగూలేశ్వరుఁడగు గవాక్షుని వాలిపుత్రుఁడగు నంగదునిఁ బెక్కుబాణంబుల నొప్పించెను. ౨౧

మహాపరాక్రమశాలియు మహాబలుండునగు నాయింద్రజిత్తు అట్టియుద్ధంబున నవ్వానరవీరులకెల్ల నగ్నిజ్వాలలవంటి కఱకుబాణంబుల నొప్పించి సింహనాదంబు గావించెను. ౨౨

మహాబాహుఁడగు నింద్రజిత్తు అట్లు వానరవీరుల బాణంబుల నొప్పించి యందఱను భయపడునట్లు గావించి సంతోషాతిశయంబునం బకపకనవ్వుచుఁ దోడిరాక్షసులం జూచి యిట్లని చెప్పెను. ౨౩

రాక్షసులారా! సైనికులందఱుఁ జూచుచుండ భయంకరంబగు బాణపాశంబున నాచేబంధింపఁబడి యీరామలక్ష్మణులు నేలంబడియున్నారు. చూడుఁడు. అని యింద్రజిత్తు రాక్షసులతోఁ జెప్పెను. ౨౪

కపటయోధులగు నారాక్షసులందఱును ఇంద్రజిత్తుమాటనువిని యింద్రజిత్తు గావించినకార్యమునకుఁ బరమసంతుష్టులయి మిక్కిలియు నాశ్చర్యంబు నొందిరి. ౨౫

మేఘాకారులగు నారాక్షసులు రాముఁడు హతుఁడయ్యెనని తలఁచుకొనియంతటను మహాధ్వనిగలుగునట్లు సింహనాదంబు సేయుచు నింద్రజిత్తు బూజించిరి. ౨౬

నిష్పన్దౌ తు తదా దృష్ట్వా తౌ వుభౌ రామలక్ష్మణౌ. ౨౭
వసుధాయాం నిరుచ్ఛ్వాసౌ హతావిత్యన్వమన్యత,
హర్షేణ తు సమావిష్ట ఇన్ద్రజి త్సమితింజయః. ౨౮
ప్రవివేశ పురీం లఙ్కాం హర్షయన్ సర్వరాక్షసాన్,
రామలక్ష్మణయో ర్దృష్ట్వా శరీరే సాయకై శ్చితే. ౨౯
సర్వాణి చాఙ్గోపాఙ్గాని సుగ్రీవం భయ మావిశత్,
త మువాచ పరిత్రస్తం వానరేన్ద్రం విభీషణః. ౩౦
స బాష్పవదనం దీనం శోకవ్యాకులలోచనమ్,
అలం త్రాసేన సుగ్రీవ! బాష్పవేగో నిగృహ్యతామ్. ౩౧
ఏవంప్రాయాణి యుద్ధాని విజయో నా స్తి నైష్ఠికః.
సశేషభాగ్యతాఽస్మాకం యది వీర! భవిష్యతి. ౩౨
మోహమేతౌ ప్రహాస్యేతే మహాత్మానౌ మహాబలౌ,
పర్యవస్థాపయాత్మాన మనాథం మాం చ వానర!. ౩౩
సత్యధర్మాభిరక్తానాం నా స్తి మృత్యుకృతం భయమ్,

ఏవ ముక్త్వా తత స్తస్య జలక్లిన్నేన పాణినా. ౩౪
సుగ్రీవస్య శుభే నేత్రే ప్రమమార్జ విభీషణః,
తత స్సలిల మాదాయ విద్యయా పరిజప్య చ. ౩౫
సుగ్రీవనేత్రే ధర్మాత్మా స మమార్జ విభీషణః,

ప్రమృజ్య వదనం తస్య కపిరాజస్య ధీమతః. ౩౬
అబ్రవీ త్కాలసంప్రాప్త మసంభ్రమ మిదం వచః,

న కాలః కపిరాజేన్ద్ర! వైక్లబ్య మనువర్తితుమ్. ౩౭
అతిస్నేహోఽప్యకాలేఽస్మిన్మరణాయోపకల్పతే,

అప్పు డాయింద్రజిత్తు నిశ్చలులయి నిట్టూర్పులువిడువక భూమింబడి యున్న రామలక్ష్మణుల నిద్దఱంజూచి మృతిఁబొందిరని తలఁచుకొనెను ౨౭

యుద్ధంబున బలశాలియగు నింద్రజిత్తును పరమసంతోషంబునొంది రాక్షసులకందఱకును సంతోషంబుగలిగించుచు లంకాపురిం బ్రవేశించెను.

రామలక్ష్మణుల దేహములు ఆపాదమస్తకమును బాణమయములుగా నుండుటంజూచి సుగ్రీవుఁడు భయమునొందెను. ౨౯

భీతుఁడై దుఃఖితుఁడై కన్నుల నీళ్లుగాఱ వెలవెలంబోవుచున్న వానర రాజుండగు సుగ్రీవుంజూచి విభీషణుఁ డిట్లనిచెప్పెను. ౩౦

సుగ్రీవుఁడా! భయంబువదలుము; కన్నీళ్లు విడువకుము; యుద్ధంబు లన్నియుం నిట్టివే; సర్వకాలంబులందును జయమే గలుగదు. ౩౧

వీరుఁడవగు సుగ్రీవుఁడా; మనకు భాగ్యశేషంబుగలదేని మహాత్ములును మహాబలశాలులునగు నీరామలక్ష్మణులు మూర్ఛ దేఱఁగలరు. ౩౨

సుగ్రీవుఁడా! నీవు ధైర్యంబువహించి నాకును ధైర్యంబుగలిగింపుము; సత్యంబును ధర్మంబును నవలంబించియున్న మహాత్ములకు మృత్యుభయంబు గలదు. అని విభీషణుఁడు సుగ్రీవునకుఁ జెప్పెను. ౩౩

విభీషణుఁ డిట్లు సుగ్రీవునకుఁజెప్పి యంతఁ జేత నీళ్లదీసికొని యా సుగ్రీవుని కన్నులం దుడిచెను. ౩౪

అంత ధర్మాత్ముఁడగు విభీషణుండు మరల జలంబుదీసికొని మాయా మోహనివారకరంబగు విద్యచే నభిమంత్రించి దానిచే సుగ్రీవుని కన్నులం దుడిచెను. ౩౫

ఆవిభీషణుఁడు ఇట్లు బుద్ధిమంతుఁడగు వానరరాజుఁడైన సుగ్రీవుని ముఖంబునుదుడిచి యక్కాలంబునకు దగినట్టుగాఁ దొట్రుపడక దృఢంబులగు వాక్యంబుల నిట్లనిచెప్పెను. ౩౬

వానరరాజుండవగు సుగ్రీవుఁడా! అధైర్యపడుట కిది కాలముకాదు; ఇట్టికాలంబుల నధికస్నేహంబును నుంచుకొనరాదు; అదిగూడ మరణము.

తస్మా దుత్సృజ్య వైక్లబ్యం సర్వకార్యవినాశనమ్. ౩౮
హితం రామపురోగాణాం సైన్యానా మనుచిన్త్యతామ్,
అథవా రక్ష్యతాం రామో యావ త్సంజ్ఞావిపర్యయః. ౩౯
లబ్ధసంజ్ఞౌ హి కాకుత్స్థౌ భయం నో వ్యపనేష్యతః,
నైత త్కిఞ్చన రామస్య నచ రామో ముమూర్షతి. ౪౦
న హ్యేనం హాస్యతేలక్ష్మీ ర్దుర్లభా యా గతాయుషామ్.

తస్మా దాశ్వాసయాత్మానం బలం చాశ్వాసయ స్వకమ్. ౪౧
యావత్కార్యాణి సర్వాణి పున స్సంస్థాపయామ్యహమ్,
ఏతే హి ఫుల్లనయనా స్త్రాసాదాగతసాధ్వసాః. ౪౨
కర్ణే కర్ణే ప్రకథితా హరయో హరిసత్తమ!,

మాం తు దృష్ట్వా ప్రధావన్త మనీకం సమ్ప్రహర్షితుమ్. ౪౩
త్యజన్తు హరయ స్త్రాసం భుక్తపూర్వా మివ స్రజమ్,

సమాశ్వాస్య తు సుగ్రీవం రాక్షసేన్ద్రో విభీషణః. ౪౪
విద్రుతం వానరానీకం తత్సమాశ్వాసయ త్పునః,
ఇన్ద్రజిత్తు మహామాయ స్సర్వసైన్యసమావృతః. ౪౫
వివేశ నగరీం లఙ్కాం పితరం చాభ్యుపాగమత్,
తత్ర రావణ మాసీన మభివాద్య కృతాఞ్జలిః. ౪౬
ఆచచక్షే ప్రియం పిత్రే నిహతౌ రామలక్ష్మణౌ,

ఉత్పపాత తతో హృష్టః పుత్త్రం చ పరిషస్వజే. ౪౭
రావణో రక్షసాం మధ్యే శ్రుత్వా శత్రూ నిపాతితౌ,

నకుఁ గారణమగును. ౩౮

అందువలన సమస్తకార్యములను జెఱచునట్టి యధైర్యంబునువిడిచి రాముని వెంబడివచ్చిన వానరసైన్యంబులకు మేలుగలుగు నాలోచనం జేయుము.

అటుగాదేని రాముఁడు మూర్ఛదేఱువఱకు నతనిరక్షింపుఁడు! రామలక్ష్మణులు మూర్ఛదేఱినంతనే మనభయముం బోఁగొట్టఁగలరు. ౩౯

దీనివలన రామున కేమియపాయములేదు; రామునకుఁ బ్రాణభయము కొంతమాత్రములేదు; ఏది చావఁబోవువారల కుండదో అట్టికాంతి రాముని విడువకున్నది; చూడుము. ౪౦

అందువలన నేను జేయవలసినదానినెల్ల మరలఁ జక్కపఱచునంత లోపల నీవు ధైర్యంబుదెచ్చుకొని నీసైన్యంబును నాశ్వాసింపుము. ౪౧

ఈవానరులు భయంబున వెడల్పులయినకన్నులతో వికృతాంగులయి పాఱిపోదమని యొకరిచెవిలో నొకరు గుసగుసలాడుకొనుచున్నారు; చూడుము. ౪౨

నేను నలుప్రక్కలం దిరుగుచు సైన్యమును సంతోషపఱుప వానరులందఱు తొలినాఁడుధరించిన పుష్పమాలికను బాఱవైచునట్లు భయమును విడుతురుగాక. అని విభీషణుండు సుగ్రీవునితోఁ జెప్పెను. ౪౩

రాక్షసరాజుండగు విభీషణుఁడు అట్లు సుగ్రీవు నాశ్వాసించి యంత భయంబున నఱచుచున్న వానరసైన్యము నాశ్వాసించెను. ౪౪

మహామాయుఁడగు నింద్రజిత్తు సమస్తసైన్యంబులం గూడి లంకాపురిం బ్రవేశించి తండ్రిసమ్ముఖమునకుఁ బోయెను. ౪౫

అంత నయ్యింద్రజిత్తు సభయందుఁ గూర్చుండియున్న తండ్రికి నమస్కరించి చేతులు మొగుడ్చుకొని "రామలక్ష్మణుల వధించితిని" అను నీప్రియవార్తం జెప్పెను. ౪౬

రావణుఁడు రాక్షసమధ్యంబునఁ దనశత్రువులయిన రామలక్ష్మణులు హతులయి రనువార్తను విని పరమసంతుష్టుఁడై యాసనంబుననుండి లేచి

ఉపాఘ్రాయ చ మూర్ధ్న్యేనం పప్రచ్ఛ ప్రీతమానసః. ४८

పృచ్ఛతే చ యథావృత్తం పిత్రే సర్వం న్యవేదయత్,
యథా తౌ శరబన్ధేన నిశ్చేష్టౌ నిష్ప్రభౌ కృతౌ. ४९

సహర్ష వేగానుగతాన్తరాత్మా
శ్రుత్వా వచ స్తస్య మహారథస్య,
జహౌ జ్వరం దాశరథేః స్సముత్థితం
ప్రహృష్య వాచాఽభిననన్ద పుత్రమ్. ५०

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే షట్చత్వారింశస్సర్గః. ४६.

---

సప్తచత్వారింశస్సర్గః.

ప్రతిప్రవిష్టే లఙ్కాం తు కృతార్థే రావణాత్మజే,
రాఘవం పరివార్యార్తా రరక్షు ర్వానరర్షభాః. ౧
హనూమానఙ్గదో నీల స్సుషేణః కుముదో నళః,
గజో గవాక్షో గవయ శ్శరభో గన్ధమాదనః. ౨
జామ్బవా నృషభస్కన్ధో రమ్భ శ్శతవలిః పృథుః,

వ్యూఢానీకా శ్చ యత్తా శ్చ ద్రుమానాదాయ సర్వతః. 3
వీక్షమాణాదిశ స్సర్వా స్తిర్య గూర్ధ్వం చ వానరాః,
తృణేష్వపిచ చేష్టత్సు రాక్షసా ఇతి మేనిరే. ४

రావణ శ్చాపి సంహృష్టో విసృజ్యేన్ద్రజితం సుతమ్,
ఆజుహావ తత స్సీతారక్షిణీ రాక్షసీ స్తదా. ५

కొడుకును గవుఁగిలించుకొనెను. ౪౭

అంత రావణుఁడు సంతుష్టుఁడై యింద్రజిత్తును శిరంబున మూర్కొని రామలక్ష్మణులు హతులయిన విధంబునంతయును నడిగెను. ౪౮

ఆ యింద్రజిత్తు తాను రామలక్ష్మణుల బాణపాశంబుల బంధించి నిశ్చేష్టులుగాను నిష్ప్రభులుగాను జేసినది మొదలుగా జరిగిన సమాచారమునంతయుఁ దండ్రికిఁ జెప్పెను. ౪౯

ఆ రావణుఁడు తన్నును సారథిని గుఱ్ఱంబులను గాపాడుకొనుచుఁ బదునొకండు వేలమంది విలుకాండ్రతోఁ బోరంజాలిన యింద్రజిత్తు చెప్పిన మాటను విని సంతుష్టుఁడై రామభయంబువలనం గలిగినసంతాపమును విడిచి కొడుకును ఎంతయుం మెచ్చుకొనెను. ౫౦

ఇది నలువదియాఱవసర్గము.

## నలువదియేడవసర్గము.

ఆ యింద్రజిత్తు కృతార్థుఁడయి మరల లంకాపురిం బ్రవేశించినవెనుక హనుమంతుఁడును నంగదుఁడును నీలుఁడును సుషేణుఁడును గుముదుఁడును నలుఁడును గజుఁడును గవాక్షుఁడును గవయుఁడును శరభుఁడును గంధమాదనుఁడును జాంబవంతుఁడును ఋషభస్కంధుఁడును రంభుఁడును శతవలియుఁ బృథువునను నీవానరోత్తములు దుఃఖితులయి రామునిం బరివేష్టించి కాచియుండిరి. ౧,

ఆ వానరులు వృక్షములు చేతంబూని సేనలను వ్యూహంబుగాఁ దీర్చి సిద్ధులయి నాలుగుప్రక్కలను నిలుచుండి సమస్తదిక్కులను దిర్యగూర్ధ్వ ప్రదేశములనుం జూచుచుఁ దృణంబు గదలినను రాక్షసులువచ్చిరని తలఁచుచు జాగ్రత్తతో నుండిరి. ౩, ౪

అంత సప్పుడు రావణుఁడు సంతోషంబున ఇంద్రజిత్తును బంపి సీతకుఁ గావలియున్న రాక్షసులం బిలిపించెను. ౫

రాక్షస్య స్త్రిజటాచైవ శాసనా త్సముపస్థితాః,
తా ఉవాచ తతో హృష్టో రాక్షసీ రాక్షసాధమః. ౬

హతా విన్ద్రజితాఽఽఖ్యాత వైదేహ్యా రామలక్ష్మణౌ,
పుష్పకం చ సమారోప్య దర్శయధ్వం హతౌ రణే. ౭

యదాశ్రయా దవష్టబ్ధా నేయం మా ముపతిష్ఠతి,
సోఽస్యా భర్తా సహ భ్రాత్రా నిరస్తో రణమూర్ధని. ౮
నిర్విశఙ్కా నిరుద్విగ్నా నిరపేక్షా చ మైథిలీ,
మా ముపస్థాస్యతే సీతా సర్వాభరణభూషితా. ౯
అద్య కాలవశం ప్రాప్తం రణే రామం సలక్ష్మణమ్,
అవేక్ష్య వినివృత్తాశా నాన్యాం గతి మపశ్యతీ. ౧౦
నిరపేక్షా విశాలాక్షీ మాముపస్థాస్యతే స్వయమ్,

తస్య తద్వచనం శ్రుత్వా రావణస్య దురాత్మనః. ౧౧
రాక్షస్య స్తా స్తథే త్యుక్త్వా జగ్ము ర్యత్ర పుష్పకమ్,
తతః పుష్పక మాదాయ రాక్షస్యో రావణాజ్ఞయా. ౧౨
అశోకవనికాస్థాం తాం మైథిలీం సముపానయన్,
తా మాదాయ తు రాక్షస్యో భర్తృశోకపరాజితామ్. ౧౩
సీతా మారోపయామాసు ర్విమానం పుష్పకం తదా,
తతః పుష్పక మారోప్య సీతాం త్రిజటయా సహ. ౧౪
జగ్ము ర్దర్శయితుం తస్యై రాక్షస్యో రామలక్ష్మణౌ,
రావణోఽకారయ ల్లఙ్కాం పతాకాధ్వజమాలినీమ్. ౧౫

అంతఁ ద్రిజట మొదలుగా నారాక్షసస్త్రీలందఱు రావణు నాజ్ఞ మేరకు వచ్చిరి.

అంత రాక్షసరాజుండగు రావణుఁడు సంతోషంబున నారాక్షస స్త్రీలంజూచి యిట్లని చెప్పెను. ౬

ఇంద్రజిత్తుచే రామలక్ష్మణులు హతులయిరని సీతాదేవికిం జెప్పుఁడు; ఆబిడను పుష్పకంబుపై నెక్కించుకొనిపోయి యుద్ధంబున హతులయి పడియున్న రామలక్ష్మణులం జూపుఁడు. ౭

ఎవ్వనియాశ్రయంబున నీసీత గర్వితయయి నాకు వశ్యగాకుండినదో అట్టి యాబిడ పెనిమిటియగు రాముఁడు యుద్ధంబున నిహతుఁడయ్యె. ౮

ఇంక సీత నిర్విచారయయి దుఃఖమునువిడిచి రాముఁడు వచ్చునను నాశనుంగూడ వదలి సర్వాభరణంబులును దాల్చి నన్నుఁ బొందగలదు. ౯

నన్నుఁ గన్నెత్తి చూడక రాముని యాశ్రయించియుండు విశాలాక్షి యగుసీత యిప్పుడు యుద్ధంబున లక్ష్మణునితోఁగూడ నిహతుఁడైన రాముని జూచి యాశవదలి ఇతరాపేక్షవిడిచి తనకుఁ దానే నన్నుఁ బొందఁగలదు. అని రావణుఁడు రాక్షసస్త్రీలతోఁ జెప్పెను. ౧౦

ఆ రాక్షసస్త్రీలు దురాత్ముఁడగు రావణు నాజ్ఞనువిని అట్లే యని చెప్పి పుష్పకవిమానం బున్నచోటికిం బోయిరి. ౧౧

అంత రాక్షసస్త్రీలు రావణుని నియోగంబున పుష్పకవిమానంబు దీసికొని యశోకవనంబున నున్న సీతయొద్దకుంబోయిరి. ౧౨

అప్పుడు రాక్షసస్త్రీలు భర్తృదుఃఖంబునఁ గృశించియున్న సీతను బట్టి యాపుష్పకవిమానంబుపై నెక్కించిరి. ౧౩

అంత నారాక్షసాంగన లట్లు సీతను త్రిజటతోఁగూడఁ బుష్పకంబుపై నెక్కించి యాబిడకు రామలక్ష్మణులం జూపుటకై తీసికొనిపోయిరి. ౧౪

రావణుఁడు సంతోషంబున లంకయంతయుఁ ధ్వజంబు నెత్తించి యలంకారము గావించెను. ౧౫

ప్రాఘోషయత హృష్టశ్చ లఙ్కాయాం రాక్షసేశ్వరః,
రాఘవో లక్ష్మణశ్చైవ హతా విన్ద్రజితా రణే. ౧౬
విమానేనాపి సీతా తు గత్వా త్రిజటయా సహ,
దదర్శ వానరాణాం తు సర్వం సైన్యం నిపాతితమ్. ౧౭
ప్రహృష్టమనస శ్చాపి దదర్శ పిశితాశనాన్,
వానరాంశ్చాపి దుఃఖార్తా న్రామలక్ష్మణపార్శ్వతః. ౧౮
తత స్సీతా దదర్శోభౌ శయానౌ శరతల్పయోః,
లక్ష్మణం చాపి రామం చ విసంజ్ఞౌ శరపీడితౌ. ౧౯
విధ్వస్తకవచౌ వీరౌ విప్రవిద్ధశరాసనౌ,
సాయకై శ్ఛిన్నసర్వాఙ్గౌ శర స్తమ్భమయౌ క్షితౌ. ౨౦

తౌ దృష్ట్వా భ్రాతరౌ తత్ర వీరౌ సా పురుషర్షభౌ,
శయానౌ పుణ్డరీకాక్షౌ కుమారా వివ పావకీ. ౨౧
శరతల్పగతౌ వీరౌ తథాభూతౌ నరర్షభౌ,
దుఃఖార్తా సుభృశం సీతా సుచిరం విలలాప హ. ౨౨

భర్తార మనవద్యాఙ్గీ లక్ష్మణం చాసితేక్షణా,
ప్రేక్ష్య పాంసుషు వేష్టన్తౌ రురోద జనకాత్మజా. ౨౩

సా బాష్పశోకాభిహతా సమీక్ష్య
తౌ భ్రాతరౌ దేవసమప్రభావౌ,
వితర్కయన్తీ నిధనం తయో స్సా
దుఃఖాన్వితా వాక్య మిదం జగాద. ౨౪

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే సప్తచత్వారింశస్సర్గః. ౪౭.

రాక్షసరాజుండగు రావణుఁడు సంతోషాతిశయంబున లంకయంతయు నిట్లని చాటించెను.

ఇంద్రజిత్తు రామలక్ష్మణుల నిద్దఱను యుద్ధంబున వధించెను. ౧౬

సీత త్రిజటతోఁగూడ పుష్పకవిమానంబు నారోహించిపోయి నేలంబడియున్న వానరసైన్యమునంతయుం జూచెను. ౧౭

ఆ సీత రాక్షసులు పరమసంతోషంబునొందియుండుటయు వానరులు రామలక్ష్మణులసమీపంబున దుఃఖార్తులైయుండుటయుం గనెను. ౧౮

అంత సీతాదేవి భూమియందు బాణతల్పంబులఁ బరుండియున్న వారలును మూర్ఛనొందియున్నవారలును బాణపీడితులును జినిఁగిపోయిన కవచములుగలవారలును ధనుస్సుజాఱవిడిచియున్న వారలును బాణంబుచే సర్వావయవములందును గాయములంగలిగియున్న వారలును బాణమయదేహులయి చూపట్టుచున్న వారలును బరాక్రమవంతులునగు రామలక్ష్మణుల నిద్దఱను జూచెను. ౧౯, ౨౦

ఆ సీతాదేవి అచ్చట నేలం బరుండియున్న వారలును పరాక్రమశాలులును పురుషోత్తములును పుండరీకంబులుంబోలె విశాలసుందరంబులగు కన్నులుంగలవారలును అగ్నిపుత్రులగు స్కందవిశాఖులుంబోలె నున్న వారలును బాణతల్పగతులును అట్టి దురవస్థం బొందియున్న వారలునగు నారామలక్ష్మణులంజూచి పరమదుఃఖితయయి మిక్కిలియుఁ బెద్దకాలము విలపించెను. ౨౨

నిందింపనలవిగాని యుత్తమలక్షణవిశిష్టములగు నవయవములుగలదియు నల్లనికన్నులుగలదియు సీతాదేవి తన పెనిమిటి రాముఁడును లక్ష్మణుఁడు నేలం బరాగంబులం బొరలుచుండుటంజూచి పరమదుఃఖితయయి రోదనంబు గావించెను. ౨౩

ఆ సీత కన్నులనీళ్లుగాఱ దేవతలుంబోలె మహాప్రభావులగు నారామలక్ష్మణులంజూచి మృతిఁ బొందిరనితలంచి పరమదుఃఖితయయి యిట్లని చెప్పెను. ౨౪

ఇది నలువదియేడవసర్గము.

## అష్టచత్వారింశస్సర్గః.

భర్తారం నిహతం దృష్ట్వా లక్ష్మణం చ మహాబలమ్,
విలలాప భృశం సీతా కరుణం శోకకర్శితా. ౧
ఊచు ర్లక్షణినో యే మాం పుత్త్రిణ్యవిధవేతి చ,
తేఽద్య సర్వే హతే రామే జ్ఞానినోఽనృతవాదినః. ౨

యజ్వనో మహిషీం యే మా మూచుః పత్నీం చ సత్త్రిణః,
తేఽద్య సర్వే హతే రామే జ్ఞానినోఽనృతవాదినః. 3

ఊచు స్సంశ్రవణే యే మాం ద్విజాః కార్తాన్తికా శ్శుభామ్,
తేఽద్య సర్వే హతే రామే జ్ఞానినోఽనృతవాదినః. ౪

వీరపార్థివపత్నీ త్వం యే ధన్యేతి చ మాం విదుః,
తేఽద్య సర్వే హతే రామే జ్ఞానినోఽనృతవాదినః. ౫

ఇమాని ఖలు పద్మాని పాదయో ర్యైః కిల స్త్రియః,
ఆధిరాజ్యేఽభిషిచ్యన్తే నరేన్ద్రైః పతిభి స్సహ. ౬

వైధవ్యం యాన్తి యై ర్నార్యో లక్షణై ర్భాగ్యదుర్లభాః,
నాత్మన స్తాని పశ్యామి పశ్యన్తీ హతలక్షణా. ౭

సత్యనామాని పద్మాని స్త్రీణా ముక్తాని లక్షణైః,
తా న్యద్య నిహతే రామే వితథాని భవన్తి మే. ౮

## నలువదియెనిమిదవసర్గము.

సీత పెనిమిటిని మహాబలుఁడగులక్ష్మణుఁడును నిహతులయి యుండుటం జూచి పరమదుఃఖితయయి శోకావేశంబున నిట్లని విలపించెను. ౧

సాముద్రికలక్షణము దెలిసినవార లెవ్వరును మున్ను నన్నుఁ బుత్రవతి యనియుం విధవగానిదనియుఁ జెప్పిరో వారలంద ఱిప్పుడు రాముఁడు నిహతుఁడుగాఁగా నబద్ధముఁ జెప్పువారలయిరి. ౨

మున్నెవ్వరు నాభర్త యశ్వమేధయాగంబులు సేయును; సత్రంబులు గావించునని యుఁ జెప్పిరో అట్టిమహాత్ములందఱు నిప్పుడు రాముఁడు నిహతుఁడుఁగాఁగా నబద్ధముఁ జెప్పువారలయిరి. ౩

మున్ను జ్యోతిశ్శాస్త్రవేత్తలగు బ్రాహ్మణు లెవ్వరు నాయెదుట నన్ను మంగళకరియని చెప్పిరో ఇప్పుడు రాముఁడు హతుఁడయినపిమ్మట వారలందఱు నబద్ధముఁ జెప్పువారలు. ౪

ఎవ్వరు నన్నుఁజూచి నీవు మహాపరాక్రమశాలియగు రాజునకు భార్యవుగాఁగలవనియుం ధన్యురాలవనియుం జెప్పిరో ఆజ్యోతిశ్శాస్త్రవేత్తలందఱు నిప్పుడు రాముఁడు హతుఁ డగుటవలన నబద్ధములు జెప్పువారలయిరి. ౫

ఏవియున్నచో స్త్రీలు మహారాజులగు పెనిమిటులతోఁ గూడ సామ్రాజ్యపట్టాభిషిక్తులగుదురో అట్టిపద్మరేఖలు నా పాదంబుల స్పష్టముగాఁ జూపట్టుచున్నవి. ౬

ఏలక్షణంబులున్న స్త్రీలు నిర్భాగ్యలయి వైధవ్యంబునొందుదురో అట్టి దుష్టలక్షణంబు లెంత వెదకినను నాకు లేవు; అయితే నాకుంగల శుభలక్షణము లన్నియు వ్యర్థములయినవి. ౭

పద్మాకారరేఖలు స్త్రీలకుఁ దప్పక మహాఫలంబులు గల్గించునని శాస్త్రంబులం జెప్పఁబడియున్నది; ఇప్పుడు రాముఁడు హతుఁడగుటవలన నాకు మాత్ర మవి నిష్ఫలములయినవి. ౮

కేశా స్సూక్ష్మా స్సమా నీలా భ్రువౌ చాసంగతే మమ,
వృత్తే చారోమశే జఙ్ఘే దన్తాశ్చావిరళా మమ. ౯

శఙ్ఖే నేత్రే కరౌ పాదౌ గుల్ఫావూరూ చ మే చితౌ,
అనువృత్తనఖా స్స్నిగ్ధా స్సమా శ్చాఙ్గుళయో మమ. ౧౦

స్తనౌ చావిరళౌ పీనౌ మమేమౌ మగ్నచూచుకౌ,
మగ్నా చోత్సఙ్గినీ నాభిఃపార్శ్వోరస్కాశ్చ మే చితాః. ౧౧

మమ వర్ణో మణినిభో మృదూన్యఙ్గరుహాణి చ,
ప్రతిష్ఠితాం ద్వాదశభి ర్మా మూచు శ్శుభలక్షణామ్. ౧౨

సమగ్రయవ మచ్ఛిద్రం పాణిపాదం చ వర్ణవత్,
మన్దస్మితేత్యేవ చ మాం కన్యాలక్షణినో ద్విజాః. ౧౩

ఆధిరాజ్యేఽభిషేకో మే బ్రాహ్మణైః పతినా సహ,
కృతాన్తకుశలై రుక్తం తత్సర్వం వితథీకృతమ్. ౧౪

శోధయిత్వా జనస్థానం ప్రవృత్తిముపలభ్య చ,
తీర్త్వా సాగర మక్షోభ్యం భ్రాతరౌ గోష్పదే హతౌ. ౧౫

నాతలవెండ్రుకలు సూక్ష్మములయి సమములయి నల్లఁగానున్నవి; నా కనుబొమలు ఒండొంటితో సంబంధింపకున్నవి; నాపిక్కలును గుండ్రములయి వెండ్రుకలులేకున్నవి; నాపండ్లు విరళములుగాక దట్టముగా నొండొంటిం గలసియున్నవి. ౯

నాకన్నులకుఁ బార్శ్వంబునందు లలాటప్రదేశంబులును నేత్రంబులును హస్తములును పాదములును జీలమండలును దొడలును బలిసియున్నవి; నాయంగుళులును గుండ్రములయిన నఖములతో నొప్పుచు స్నిగ్ధంబులయి సమంబులయియున్నవి. ౧౦

నా స్తనంబులు ఒండొంటి నొరసికొని కొంచెము పల్లముగాను నగ్రములుగలిగి చక్కఁగా బలిసియున్నవి; నా నాభియు మిక్కిలియుఁ లోఁతు గలిగి యుఁన్నతములగు పార్శ్వములతో నొప్పుచున్నది; నా పార్శ్వములును రొమ్మును మాంసములుగా నున్నవి. ౧౧

నా మేనిరంగు రత్నముంబోలె స్నిగ్ధముగానున్నది; నా మేనివెండ్రుకలు మృదులములుగానున్నవి; శాస్త్రజ్ఞులు నీపాదంబుల పదివ్రేళ్లు రెండుపాదతలంబులును నేల నానియుండుటవలన నన్ను శుభలక్షణములు గలదానిఁగాఁ జెప్పిరి. ౧౨

నాహస్తంబులును బాదంబులును బూర్ణమయిన యవాకారరేఖతో నొప్పుచు వ్రేళ్లు నెంతమాత్రము సందులేనివై కొంలిమంతంబులయి యున్నవి; కన్యాలక్షణము దెలిసినబ్రాహ్మణులు నన్ను ఎల్లప్పుడును జీయినవ్వగలదానవని చెప్పిరి. ౧౩

జ్యోతిశ్శాస్త్రమునందు సమర్థులగుబ్రాహ్మణులు నాకుఁ జెనిమిటితోఁ గూడ సామ్రాజ్యపట్టాభిషేకంబు గలుగునని చెప్పిరి; ఇప్పు డదంతయుం వ్యర్థమయినది. ౧౪

అన్నదమ్ములగు రామలక్ష్మణులు జనస్థానమునంతయుం వెదకి తుదకు వాసమాచారమునుం దెలిసికొని యక్షోభ్యంబగు మహాసముద్రమునుంగూడ

నను వారుణమాగ్నేయ మైన్ద్రం వాయవ్యమేవ చ,
అస్త్రం బ్రహ్మశిర శ్చైవ రాఘవౌ ప్రత్యపద్యతామ్. ౧౬

అదృశ్యమానేన రణే మాయయా వాసవోపమౌ,
మమ నాథావనాథాయా నిహతౌ రామలక్ష్మణౌ. ౧౭

న హి దృష్టిపథం ప్రాప్య రాఘవస్య రణే రిపుః,
జీవ న్ప్రతినివర్తేత యద్యపి స్యా న్మనోజవః. ౧౮

న కాలస్యాతిభారోఽస్తి కృతాన్తశ్చ సుదుర్జయః,
యత్ర రామ స్సహ భ్రాత్రా శేతే యుధి నిపాతితః. ౧౯

న శోచామి తథా రామం లక్ష్మణం చ మహాబలమ్,
నాత్మానం జననీం వాపి యథా శ్వశ్రూం తపస్వినీమ్. ౨౦

సాఽనుచిన్తయతే నిత్యం సమాప్తవ్రతమాగతమ్,
కదా ద్రక్ష్యామి సీతాం చ లక్ష్మణం చ సరాఘవమ్. ౨౧

పరిదేవయమానాం తాం రాక్షసీ త్రిజటాఽబ్రవీత్,

మావిషాదం కృథా దేవి! భర్తాఽయం తవ జీవతి. ౨౨
కారణాని చ వక్ష్యామి మహాన్తి సదృశాని చ,
యథేమౌ జీవతో దేవి! భ్రాతరౌ రామలక్ష్మణౌ. ౨౩
న హి కోపపరీతాని హర్షపర్యుత్సుకాని చ,
భవన్తి యుధి యోధానాం ముఖాని నిహతే పతౌ. ౨౪

దాఁటివచ్చి యెద్దుకాలియంతమాత్రమయిన యీయింద్రజిన్మాయచే హతు
లయిరి. ౧౫

రామలక్ష్మణులు వారుణాస్త్రము నాగ్నేయాస్త్రము నైంద్రాస్త్రమును వాయవ్యాస్త్రమును బ్రహ్మశిరోనామకాస్త్రమునుం బొందియుండిరే! ఆ యస్త్రంబులన్నియుం నిప్పు డెచ్చటికిఁ బోయినవి? ౧౬

ఇంద్రజిత్తు యుద్ధంబున మాయచే నదృశ్యుఁడై కపటంబున దేవేంద్ర సమానులగు రామలక్ష్మణుల వధించినాఁడు; నే ననాథనైతిని. ౧౭

మనోవేగముగలవాఁడైనను శత్రువు యుద్ధంబున రామునికంటంబడి మఱలఁ బ్రాణముతో నావలికిఁ బోఁజాలఁడు. ౧౮

మహాపరాక్రమశాలియగు రాముఁడుగూడఁ దమ్మునితోఁగూడ యుద్ధంబున హతుఁడై నేలంబరుండియున్నాఁడు కావునఁ గాలమున కశక్య మేదియుం లేదు; దైవమున కెదురులేదు.

శోచనీయయగు నాయత్తను గౌసల్యను దలఁచుకొన్న నాకు దుఃఖము గలుగునట్లు రామునిఁ గాని మహాబలుఁడగు లక్ష్మణునిఁ గాని నన్నుఁగాని నాతల్లినిగాని తలఁచుకొన్నను అంత దుఃఖముగలుగదు. ౨౦

ఆ కౌసల్య "పదునాలుగుసంవత్సరంబులను వనంబునం గడపి సీతాలక్ష్మణసహితుఁడయి వచ్చినరాముని ఎప్పుడు చూచెదను?" అని యెల్లప్పుడును గోరుచుండును. అని సీత విలపించినది. ౨౧

అట్లు దుఃఖించుచున్న సీతంజూచి త్రిజట యనురాక్షసి యిట్లని చెప్పెను.

అమ్మా! నీవు దుఃఖింపవలదు; నీభర్త బ్రతికియున్నాఁడు. ౨౨

అమ్మా! ఈరామలక్ష్మణులు లిద్దఱును బ్రతికియున్నారనుటకుఁ దగి కారణంబులుగూడ నాకగపడుచున్నవి. ౨౩

నాథుఁడు హతుఁడగునేని యుద్ధంబున యోధులముఖములు ఇట్లు కోపంబుతోఁ గూడినవిగాఁగాని సంతుష్టములుగాఁగాని కాఁజాలవు. ౨౪

ఇదం విమానం వైదేహి! పుష్పకం నామ నామతః,
దివ్యం త్వాం ధారయే న్నైవం యద్యేతౌ గతజీవితౌ. ౨౫
హతవీరప్రధానా హి హతోత్సాహా నిరుద్యమా,
సేనా భ్రమతి సఙ్ఖ్యేషు హతకర్ణేవ నౌర్జలే. ౨౬

ఇయం పున రసమ్భ్రాన్తా నిరుద్విగ్నా తరస్వినీ,
సేనా రక్షతి కాకుత్స్థౌ మయా ప్రీత్యా నివేదితా. ౨౭

సా త్వం భవ సువిస్రబ్ధా అనుమానై స్సుఖోదయైః,
అహతౌ పశ్య కాకుత్స్థౌ స్నేహాదేతద్బ్రవీమి తే. ౨౮

అనృతం నోక్తపూర్వం మే న చ వక్ష్యే కదాచన,
చారిత్రసుఖశీలత్వా త్ప్రవిష్టాఽసి మనో మమ. ౨౯

నేమౌ శక్యౌ రణే జేతుం సేన్ద్రై రపి సురాసురైః,

తాదృశం దర్శనం దృష్ట్వా మయా చావేదితం తవ. ౩౦

ఇదం చ సుమహచ్చిహ్నం శనైః పశ్యస్వ మైథిలి!,
నిస్సంజ్ఞావప్యుభావేతౌ నైవ లక్ష్మీర్వియుజ్యతే. ౩౧

ప్రాయేణ గతసత్త్వానాం పురుషాణాం గతాయుషామ్,
దృశ్యమానేషు వక్త్రేషు పరం భవతి వైకృతమ్. ౩౨

సీతాదేవీ! మఱియుం నీరామలక్ష్మణులు మృతిఁబొందియున్నచోఁ స్వర్గంబునఁ బుట్టిన యీపుష్పకవిమానము నిన్నిట్లు వహింపదు. ౨౫

సేనానాథుఁడు చంపఁబడునేని యట్టిసైన్యము నిరుత్సాహమును బ్రయత్నంబులేనిదియునై జలంబుల కర్ణధారుఁడులేని యోడపగిది యుద్ధంబుల దిక్కులేక తిరుగుడునొందియుండును. ౨౬

ఈవానరసేన యట్లులేదు; ఇది తొట్రుపడక భయమునొందక నేను బ్రతికియున్నారని చెప్పిన యీరామలక్ష్మణులను సంతోషంబున జాగ్రత్తతో రక్షింపుచున్నది. ౨౭

అట్లు అనాయాసముగాఁ దెలియఁదగిన యాచిహ్నములచేత నీవు రామలక్ష్మణులు జీవించియున్నారని స్వష్టముగా నుండుము; రామలక్ష్మణులు బ్రతికియున్నారు చూడుము; నీయందలి స్నేహంబున నీకింతదూరము చెప్పుచున్నాను. ౨౮

నే నిదివఱకు నీతో నబద్ధముఁ జెప్పినదిలేదు; ఇంకనుఁ జెప్పను; నీవు పాతివ్రత్యంబుతో నొప్పుచున్న స్వభావంబుగల దానవగుటచేత నీయందు నాకు మిక్కిలియు మక్కువగలిగినది. ౨౯

యుద్ధంబున దేవేంద్రునితోఁ గూడిన సురాసురులకైనను రామలక్ష్మణుల జయింప నలవిగాదు.

బ్రతికియుండుటకు సూచకంబు లగులక్షణంబులం జూచి నీకుఁ జెప్పితిని. ౩౦

సీతాదేవీ! గొప్పది యిది యొక్కటియున్నది; ఈచిహ్నముం జూడుము.

ఈరామలక్ష్మణులు మూర్ఛనొందియున్నను వీరలముఖకాంతి యెంత మాత్రము తఱుఁగకున్నది. ౩౧

తఱచుగా మృతిఁబొందినవారల ముఖములం జూడఁగా నవి మిక్కిలియు వికారముగలిగియుండును. ౩౨

త్యజ శోకం చ మోహం చ దుఃఖం చ జనకాత్మజే!,
రామలక్ష్మణయోరర్థే నాద్య శక్య మజీవితుమ్. 33

శ్రుత్వా తు వచనం తస్యా స్సీతా సురసుతోపమా,
కృతాఞ్జలిరువాచేద మేవమ స్త్వితి మైథిలీ. 34

విమానం పుష్పకం తత్తు సన్నివర్త్య మనోజవమ్,
దీనా త్రిజటయా సీతా లఙ్కా మేవ ప్రవేశితా. 35
తత స్త్రిజటయా సార్ధం పుష్పకాదవరుహ్య సా,
అశోకవనికా మేవ రాక్షసీభిః ప్రవేశితా. 36
ప్రవిశ్య సీతా బహువృక్షషణ్డాం
తాం రాక్షసేన్ద్రస్య విహారభూమిమ్,
సంప్రేక్ష్య సఞ్చిన్త్య చ రాజపుత్త్రీ
పరం విషాదం సముపాజగామ. 37

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డేఽష్టచత్వారింశ స్సర్గః. ౪౮.

---

ఏ కో న ప ఞ్చా శ స్స ర్గః.

ఘోరేణ శరబన్ధేన బద్ధౌ దశరథాత్మజౌ,
నిశ్వసన్తౌ యథా నాగౌ శయానౌ రుధిరోక్షితౌ. 1
సర్వే తే వానరశ్రేష్ఠా స్ససుగ్రీవా మహాబలాః,
పరివార్య మహాత్మానౌ తస్థు శ్శోకపరిప్లుతాః. 2
ఏతస్మి న్నన్తరే రామః ప్రత్యబుధ్యత వీర్యవాన్,
స్థిరత్వా త్సత్త్వయోగాచ్చ శరై స్సన్దానితోఽపి సన్. 3
తతో దృష్ట్వా సరుధిరం విషణ్ణం గాఢ మర్పితమ్,

సీతాదేవీ ! నీవు రామలక్ష్మణులనిమిత్తమయి యిట్లు మూర్ఛనొందుచు దుఃఖింపకుము, రామలక్ష్మణులు బ్రతికియున్నారనుటకు సందియము లేదు. అని త్రిజట సీతతోఁ జెప్పెను. 33

దేవకన్యాసమానురాలగు సీతాదేవి యాత్రిజట చెప్పినమాటను విని చేమోడ్పుగీలించి నీవు చెప్పినట్లే రామలక్ష్మణులు జీవించియే యుండుఁగాక యని చెప్పెను. 34

అంతఁ ద్రిజట మనోవేగంబుతోఁ గూడియున్న యాపుష్పకవిమానంబును మరలించి దీనురాలగు సీతాదేవిని లంకాపురికిం దీసికొనిపోయెను. 35

అంత రాక్షసస్త్రీలు సీతను త్రిజటతోఁగూడ బుష్పకవిమానంబున నుండి దింపి యశోకవనముఁ జేర్చిరి. 36

సీతాదేవి పెక్కువృక్షములతోఁ గూడినదియు రాక్షసరాజుండగు రావణుని విహారస్థానమునగు నశోకవనికను బ్రవేశించి రాచకొమరులగు రామలక్ష్మణులం దలఁచుకొని పరమదుఃఖంబు నొందినది. 37

ఇది నలువదియెనిమిదవసర్గము.

---

## నలువదితొమ్మిదవసర్గము.

సుగ్రీవుఁడు మొదలుగాఁగల మహాబలశాలులగు వానరోత్తము లందఱును భయంకరంబగు నాగపాశంబుచే బద్ధులును సర్పములంబోలె నిట్టూర్పులు పుచ్చుచున్నవారలును నెత్తుటం దోఁగి భూమిం బరుండియున్నవారలు నగు మహాత్ముల నారామలక్ష్మణులం బరివేష్టించి దుఃఖితులయి యుండిరి. ౧, ౨

ఇంతలో వీర్యవంతుఁడగు రాముఁడు బాణపాశంబున బద్ధుఁడై యున్నను ధీరుఁడగుటవలనను బలవంతుఁడగుటవలనను మూర్ఛదేఱెను. 3

అంత నారాముఁడు నెత్తురుగాఱ దుఃఖితుఁడై గాఢంబుగా బాణము

భ్రాతరం దీనవదనం పర్యదేవయ దాతురః, ౪

కిన్ను మే సీతయా కార్యం కిం కార్యం జీవితేన వా,
శయానం యోఽద్య పశ్యామి భ్రాతరం యుధి నిర్జితమ్. ౫

శక్యా సీతాసమా నారీ మర్త్యలోకే విచిన్వతా,
న లక్ష్మణసమో భ్రాతా సచివ స్సాంపరాయికః. ౬

పరిత్యక్ష్యామ్యహం ప్రాణా న్వానరాణాం తు పశ్యతామ్,
యది పఞ్చత్వ మాపన్న స్సుమిత్రానన్దవర్ధనః. ౭
కిన్ను వక్ష్యామి కౌసల్యాం మాతరం కిన్ను కైకయీమ్.

కథ మమ్బాం సుమిత్రాం చ పుత్త్రదర్శనలాలసామ్. ౮
వివత్సాం వేపమానాం చ క్రోశన్తీం కురరీ మివ,
కథ మాశ్వాసయిష్యామి యది యాస్యామి తం వినా. ౯
కథం వక్ష్యామి శత్రుఘ్నం భరతం చ యశస్వినమ్,
మయా సహ వనం యాతో వినా తేనాఽఽగతః పునః. ౧౦
ఉపాలమ్భం న శక్ష్యామి సోఢుం బత సుమిత్రయా,
ఇహైవ దేహం త్యక్ష్యామి న హి జీవితు ముత్సహే. ౧౧
ధిఙ్మాం దుష్కృతకర్మాణ మనార్యం యత్కృతే హ్యసౌ,
లక్ష్మణః పతితశ్శేతే శరతల్పే గతాసువత్. ౧౨

త్వం నిత్యం సవిషణ్ణం మా మాశ్వాసయసి లక్ష్మణ!,
గతాసు ర్నాద్య శక్నోషి మా మార్త మభిభాషితుమ్. ౧౩

లచే బాధితుఁడై దీనవదనుఁడైయున్న తమ్మునిలక్ష్మణుంజూచి దుఃఖంబున నిట్లని విలపించెను. ౪

నాతమ్ముఁడు యుద్ధంబున నిర్జితుఁడై నేలంబడి పొరలుచుండుటం జూడఁగంటినే యింక నాకు సీతతో నేమికార్యము? నాప్రాణములతోఁగాని నా కింకేమిప్రయోజనము? ౫

భూలోకంబున వెదకినచో సీతకు సరితయిన వనితను సంపాదింప వచ్చును; యుద్ధంబున నమర్థుఁడును సహాయుఁడునగు లక్ష్మణునితో సమానుఁడగు తమ్మునిమాత్రము పొంద నలవిగాదు. ౬

సుమిత్ర కూరిమికొమరుఁడగు లక్ష్మణుఁడు మరణమునొందు నేని నేను ఈవానరులు చూచుచుండఁగానే ప్రాణంబులు విడిచెదను. ౭

నేను అయోధ్యకుఁబోయి నాతల్లి కౌసల్య కేమి చెప్పుదును? కైకేయి కేమిచెప్పుదును?

లక్ష్మణుఁడు లేక నేనుమాత్రము అయోధ్యకుఁబోదునేని పుత్రదర్శనలాలసయైయుండు నాడను విడచిన లేడివలె విలపించుచున్నదియునగు తల్లియయిన సుమిత్ర నెట్లు లాశ్వాసింపఁగలను? ౮,౯

శత్రుఘ్నునితో మహాయశుఁడగు భరతునితోను ఏమిచెప్పుదును?

"సీతోఁగూడ వనంబునకు వచ్చినవాని లక్ష్మణుని విడిచివచ్చినావే" అని సుమిత్ర నన్నుఁ దప్పుచెప్పును, అయ్యో! దాని నే సహింపఁజాలను.

నే నింక జీవింపఁజాలను ఇచ్చటనే ప్రాణంబులు విడిచెదను. ౧౦

ఎవ్వనినిమిత్తమయి యీలక్ష్మణుఁడు బాణతల్పంబున చచ్చినట్లు పడియున్నాఁడో అట్టి పాపకర్ముఁడను దుష్టుఁడ నగు నేను దహింపఁబడుదును గాక. ౧౧

లక్ష్మణుఁడా! నేను దుఃఖితుఁడనగుదునేని నీవు నన్నాశ్వాసింపుచుందువు; ఇంక నీవు మరణంబునొందినపిదప నే నెంతదుఃఖితుఁడనైనను నన్నాశ్వాసింపఁజాలవుగదా! ౧౩

యేనాద్య నిహతా యుద్ధే రాక్షసా వినిపాతితాః,
తస్యామేవ క్షితౌ వీర స్స శేతే నిహతః పరైః. ౧౪

శయాన శ్శరతల్పేఽస్మిన్ స్వశోణితపరిప్లుతః,
శరజాలై శ్చితో భాతి భాస్కరోఽస్తమివ వ్రజన్. ౧౫

బాణాభిహతమర్మత్వా న్న శక్నోత్యభిభాషితుమ్,
రుజా చాబ్రువతోఽప్యస్య దృష్టిరాగేణ సూచ్యతే. ౧౬

యథైవ మాం వనం యాన్త మనుయాతో మహాద్యుతిః,
అహమప్యనుయాస్యామి తథైవైనం యమక్షయమ్. ౧౭

ఇష్టబన్ధుజనో నిత్యం మాం చ నిత్య మనువ్రతః,
ఇమా మద్య గతోఽవస్థాం మమానార్యస్య దుర్నయైః. ౧౮

సురుష్టేనాపి వీర్యేణ లక్ష్మణేన న సంస్మరే,
పరుషం విప్రియం వాపి శ్రావితం న కదాచన. ౧౯

విససర్జైకవేగేన పఞ్చబాణశతాని యః,
ఇష్వస్త్రేష్వధిక స్తస్మా త్కార్తవీర్యాచ్చ లక్ష్మణః. ౨౦

అస్త్రైరస్త్రాణి యో హన్యా చ్ఛక్రస్యాపి మహాత్మనః,
సోఽయ ముర్వ్యాం హత శ్శేతే మహార్హ శయనోచితః. ౨౧

ఎవ్వఁడు ఇప్పుడు యుద్ధంబున రాక్షసులవధించి వడఁద్రోసెనో అట్టివీరుఁడగు లక్ష్మణుఁడు అచ్చటనే శత్రువులచే నిహతుఁడై పరుండి యున్నాఁడు. ౧౪

ఈలక్ష్మణుఁ డిట్లు బాణములపాన్పునం బరుండి నెత్తురు వెల్లువలుగాఁ గాఱుబాణములు దేహమంతయుఁ గ్రుచ్చుకొనియుండ విసంజ్ఞుఁడైయుండుటం జేసి అస్తమయమునొందు సూర్యునివగిది శాంతుఁడైయున్నాఁడు. ౧౫

జీవస్థానంబులం దంతటను బాణంబులఁ బ్రహరింపఁబడియుండుటవలన నీలక్ష్మణుఁడు మాటలాడఁజాల కున్నాఁడు; ఇతఁడు చెప్పకపోయినను ఇతని చూపువలననే యితనిబాధ దెలియవచ్చుచున్నది. ౧౬

మహాతేజుఁడగు నీలక్ష్మణుఁడు నేను వనంబునకువచ్చునప్పుడు నన్నెట్లు వెంబడించివచ్చినాఁడో అట్లే నేనును యమునియొద్దకుఁబోవు నీలక్ష్మణుని వెంబడించిపోయెదను. ౧౭

ఎల్లప్పుడును బంధుజనులయందుఁ బ్రీతిగలవాఁడును ఎల్లప్పుడును నన్ననుసరించియుండువాఁడు నగు నీలక్ష్మణుఁడు దుష్టుఁడనగు నాయక్రమముల చేత నిప్పు డీదురవస్థం బొందినాఁడు. ౧౮

వీరుఁడగు లక్ష్మణుఁ డెంతకోపమునొందినను నాయెదుటఁ బరుషముగాఁ గాని యప్రియముగాఁగాని పలికినదిలేదు; అట్లు పలికినట్లు నాకు జ్ఞప్తియు లేదు. ౧౯

ఎవ్వఁడు వేయిచేతులుగలవాఁడగుటచే నేకప్రయత్నంబున నయిదు వందలబాణంబులఁ బ్రయోగించునో అట్టికార్తవీర్యునికన్నను బాణములు విడుచుటయందు లక్ష్మణుఁడధికుఁడు; లక్ష్మణుఁడు రెండుచేతులుగలవాఁడైనను వేయిచేతులుగలకార్తవీర్యుఁ డయిదువందలబాణంబుల విడుచునంతకాలములో నంతకన్న నెచ్చుబాణంబుల విడుచును. ౨౦

ఎవ్వఁడు బాణంబుల మహాపరాక్రమశాలియగు నింద్రునిబాణంబులను గూడ వ్యర్థము సేయఁజాలునో అట్టి యుత్తమశయనంబునం బరుండఁదగిన యీలక్ష్మణుఁడు హతుఁడై నేలం బరుండియున్నాఁడు. ౨౧

యస్త్వయా న కృతో రాజా రాక్షసానాం విభీషణః,
తచ్చ మిథ్యాప్రలప్తం మాం ప్రధక్ష్యతి న సంశయః. ౨౨

అస్మి న్ముహూర్తే సుగ్రీవ! ప్రతియాతు మితో౽ర్హసి,
మత్వా హీనం మయా రాజ! న్రావణో౽భిద్రవే ద్బలీ. ౨౩

అఙ్గదం తు పురస్కృత్య ససైన్య స్ససుహృజ్జనః,
సాగరం తర సుగ్రీవ! నీలేన చ నళేన చ. ౨౪

కృతం హనుమతా కార్యం య దన్యై ర్దుష్కరం రణే,
ఋక్షరాజేన తుష్యామి గోలాఙ్గూలాధిపేన చ. ౨౫

అఙ్గదేన కృతం కర్మ మైన్దేన ద్వివిదేన చ,
యుద్ధం కేసరిణా సఙ్ఖ్యే ఘోరం సమ్పాతినా కృతమ్. ౨౬

గవయేన గవాక్షేణ శరభేణ గజేన చ,
అన్యైశ్చ హరిభిర్యుద్ధం మదర్థే త్యక్తజీవితైః. ౨౭

నచాతిక్రమితుం శక్యం దైవం సుగ్రీవ! మానుషైః,

యత్తు శక్యం వయస్యేన సుహృదా చ పరన్తప!. ౨౮
కృతం సుగ్రీవ! తత్సర్వం భవతా౽ధర్మభీరుణా,

మిత్రకార్యం కృత మిదం భవద్భి ర్వానరర్షభాః!. ౨౯
అనుజ్ఞాతా మయా సర్వే యథేష్టం గన్తు మర్హథ,

నేను విభీషణుని రాక్షసరాజుఁగాఁ జేయనైతినిగదా! మున్ను నే నతనికి నిన్ను రాక్షసరాజుఁ గావించెదనని చెప్పిన యసత్యవచనముకూడ నన్ను దహింపఁగలదు. ఇందుకు సందియము లేదు. ౨౨

వానరరాజుండవగు సుగ్రీవుఁడా! నీ విప్పుడే యిచ్చటనుండి కిష్కింధకుఁ బొమ్ము; నేను లేకుండుటచూచి బలవంతుఁడగు రావణుఁడు నిన్నుఁ దఱిమికొట్టును. ౨౩

సుగ్రీవుఁడా! నీ వంగదునిఁ దోడ్కొని సైన్యంబుతోను స్నేహితులతోనుంగూడి నీలుఁడు నలుఁడు నున్నగువానరవీరులు గొలువ సముద్రంబు దాఁటుము. ౨౪

హనుమంతుఁడు యుద్ధంబున నితరులకుఁ జేయనలవిగాని కార్యముఁ గావించినాఁడు; ఋక్షరాజుండగు జాంబవంతుఁను గోలాంగూలనాథుఁడగు గవాక్షుఁడును జక్కఁగాయుద్ధంబు గావించినందుకు సంతోషించినాను.

అంగదుఁడును మైందుఁడును ద్వివిదుఁడును యుద్ధంబున మిక్కిలియుఁ గష్టపడిరి; కేసరియు సంపాతియు నను వానరవీరులును భయంకరముగా యుద్ధము గావించిరి. ౨౫

గవయుఁడును గవాక్షుఁడును శరభుఁడును గజుఁడును మఱియు నితరులగు వానరవీరులును నానిమిత్తమయి ప్రాణములయం దాసవిడిచి చక్కఁగా యుద్ధంబు గావించిరి. ౨౬

సుగ్రీవుఁడా! ఎంత ప్రయత్నము చేసిననేమి? మనుష్యులకు దైవము నతిక్రమింప నలవిగాదుగదా!

శత్రువులం దపింపఁజేయునట్టి సుగ్రీవుఁడా! స్నేహితుఁడును సుహృదుఁడు నగువానిచే నెంతమాత్రము చేయ శక్యమవునో నీవు ధార్మికుఁడవు కావున నధర్మమునకు భయపడి యదంతయు శక్తివంచన లేక గావించినావు.

వానరశ్రేష్ఠులారా! మీరు శక్తివంచన లేక మీస్నేహితుని కార్యము గావించినారు. ఇంక మీకుఁ బో ననుజ్ఞ నొసఁగితిని. యథేష్టముగాఁ

శుశ్రువు స్తస్య తే సర్వే వానరాః పరిదేవనమ్. ౩౦
వర్తయాంచక్రు రశ్రూణి నేత్రైః కృష్ణేతరేక్షణాః,
తత స్సర్వాణ్యనీకాని స్థాపయిత్వా విభీషణః. ౩౧
ఆజగామ గదాపాణి స్త్వరితో యత్ర రాఘవః,
తం దృష్ట్వా త్వరితం యాన్తం నీలాఞ్జనచయోపమమ్. ౩౨
వానరా దుద్రువు స్సర్వే మన్యమానా స్తు రావణిమ్.

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే ఏకోనపఞ్చాశస్సర్గః. ౪౯.

---

## పఞ్చాశస్సర్గః.

అథోవాచ మహాతేజా హరిరాజో మహాబలః,
కిమియం వ్యథితా సేనా మూఢవాతేవ నౌర్జలే. ౧

సుగ్రీవస్య వచ శ్శ్రుత్వా వాలిపుత్రోఽఙ్గదోఽబ్రవీత్,
న త్వం పశ్యసి రామంచ లక్ష్మణంచ మహాబలమ్. ౨
శరజాలాచితౌ వీరావుభౌ దశరథాత్మజౌ,
శరతల్పే మహాత్మానౌ శయానౌ రుధిరోక్షితౌ. ౩
అథాబ్రవీ ద్వానరేన్ద్ర స్సుగ్రీవః పుత్రమఙ్గదమ్,

నానిమిత్త మిదం మన్యే భవితవ్యం భయేన తు. ౪

విషణ్ణవదనా హ్యేతే త్యక్తప్రహరణా దిశః,
ప్రపలాయన్తి హరయ స్త్రాసా దుత్ఫుల్లలోచనాః. ౫
అన్యోన్యస్య న లజ్జన్తే న నిరీక్షన్తి పృష్ఠతః,
విప్రకర్షన్తి చాన్యోన్యం పతితం లఙ్ఘయన్తి చ. ౬

బొందు. అని రాముఁడు చెప్పెను. ౨౯

ఆ వానరు లందఱును రాముని విలాపంబు విని దుఃఖంబునఁ గన్నుల నెత్తుదనంబుగదురఁ గన్నీళ్లు గార్చిరి. ౩౦

అంత విభీషణుఁడు గదాపాణియై వానరసైన్యంబుల నన్నిఁటిని నిలుపరించి వేగంబున రాముఁ డున్నచోటికి వచ్చెను. ౩౧

వానరులందఱు నట్లు గదాపాణియయి వచ్చుచున్న కాటుకవలె నల్లని దేహముగల విభీషణునిఁజూచి యింద్రజిత్తనితలఁచి భయంబునం బాఱిరి. ౩౨

ఇది నలువదితొమ్మిదవసర్గము.

## ఏఁబదవసర్గము.

అంత మహాతేజుఁడును మహాబలశాలియునగు వానరరాజగు సుగ్రీవుఁడు వానరులంజూచి "జలంబుల నెదురుగాలిచేఁ గొట్టఁబడిన యోడవలెది నీసేన వ్యాకులమయి యున్న దేల ?" నని యడిగెను. ౧

సుగ్రీవుఁడు చెప్పినదివిని వాలికుమారుఁడగు నంగదుఁ డిట్లని చెప్పెను.

దశరథపుత్రులగు మహాత్ములు రామలక్ష్మణు లిద్దఱును దేహమంతయుం బాణంబులు గ్రుచ్చుకొని బాణతల్పంబునంబరుండి నెత్తుటఁ దోఁగుచున్నారే నీవు చూడకున్నావా యేమి ? ౨, ౩

అంత వానరరాజను సుగ్రీవుఁడు తనపుత్రుఁడయిన యంగదుంజూచి యిట్లని చెప్పెను.

ఇట్లు రామలక్ష్మణులు పడియుండుటయేఁ గారణమే; ఇప్పుడు గలిగిన భయమునకు మఱియొకకారణముగూడ నుండవలయును. ౪

ఈవానరులు పరమదుఃఖితులయి భయంబునఁ గన్నులం వికసింప నాయుధంబులు పాఱవైచి దిక్కులకుఁ బరుగెత్తుచున్నారు. ౫

ఈ వానరులు ఒకరినొకరిజూచి యొకరైనను సిగ్గుపడక వెనుకకుఁ దిరిగి చూడక శీఘ్రముగాఁ బోవుటకై యొండొరుల లాగికొనుచు నేలంబడినవాని

ఏతస్మిన్నన్తరే వీరో గదాపాణి ర్విభీషణః,
సుగ్రీవం వర్ధయామాస రాఘవం చ నిరైక్షత. ౭
విభీషణం తం సుగ్రీవో దృష్ట్వా వానరభీషణమ్,
ఋక్షరాజం సమీపస్థం జామ్బవన్త మువాచ హ. ౮

విభీషణోఽయం సంప్రాప్తో యం దృష్ట్వా వానరర్షభాః,
విద్రవన్తి పరిత్రస్తా రావణాత్మజశఙ్కయా. ౯
శీఘ్ర మేతాన్ సుసన్త్రస్తాన్ బహుధా విప్రధావితాన్,
పర్యవస్థాపయాఖ్యాహి విభీషణముపస్థితమ్. ౧౦

సుగ్రీవేణైవ ముక్తస్తు జామ్బవా నృక్షపార్థివః,
వానరాన్ సాన్త్వయామాస సన్నిరుధ్య ప్రధావతః. ౧౧
తే నివృత్తాః పున స్సర్వే వానరా స్త్యక్తసమ్భ్రమాః,
ఋక్షరాజవచ శ్శ్రుత్వా తం చ దృష్ట్వా విభీషణమ్. ౧౨
విభీషణస్తు రామస్య దృష్ట్వా గాత్రం శరై శ్చితమ్,
లక్ష్మణస్య చ ధర్మాత్మా బభూవ వ్యథితేన్ద్రియః. ౧౩
జలక్లిన్నేన హస్తేన తయో ర్నేత్రే ప్రమృజ్య చ,
శోకసమ్పీడితమనా రురోద విలలాప చ. ౧౪
ఇమౌ తౌ సత్త్వసమ్పన్నౌ విక్రాన్తౌ ప్రియసంయుగౌ,
ఇమా మవస్థాం గమితౌ రాక్షసైః కూటయోధిభిః. ౧౫

భ్రాతుః పుత్త్రేణ మే తేన దుష్పుత్త్రేణ దురాత్మనా,
రాక్షస్యా జిహ్మయా బుద్ధ్యా ఛలితౌ ఋజువిక్రమౌ. ౧౬

లంఘించుచుఁ బోవుచున్నారు; చూడుము అని సుగ్రీవుఁ డంగదునితోఁ జెప్పెను. ౬

ఇంతలోపల మహాపరాక్రమశాలియగు విభీషణుఁడు గదాపాణియయి వచ్చి సుగ్రీవు నాశీర్వదించి రాముంజూచెను. ౬

సుగ్రీవుఁడు విభీషణుం జూచియే వానరు లట్లుభయపడుచున్నారని తెలిసికొని తనచెంగటనున్న భల్లూకరాజుండగు జాంబవంతుంజూచి యిట్లని చెప్పెను. ౭

ఇదిగో విభీషణుఁడు వచ్చినాఁడు; వానరవీరులు ఇతనింజూచియే యింద్రజిత్తని సందేహించి భయముపడి పరుగెత్తుచున్నారు ౮

నీవు పరమభీతులయి నానావిధములఁ బరుగెత్తుచున్న యీవానరవీరుల నందఱను శీఘ్రముగా నిలువరించి "విభీషణుఁడు వచ్చినాఁడు ఇంద్రజిత్తుగాఁ"డనివీరలకుఁ జెప్పుము. అనిసుగ్రీవుఁడు జాంబవంతునితోఁ జెప్పెను.

భల్లూకరాజుండగు జాంబవంతుఁడు సుగ్రీవునిమాటను విని పరుగెత్తుచున్న వానరులను మరలించి వారలనందఱ నాశ్వాసించెను. ౧౧

ఆవానరులందఱును భల్లూకరాజగు జాంబవంతునిమాటను విని విభీషణునింజూచి మరల భయంబువిడిచి మరలివచ్చిరి. ౧౨

ధర్మాత్ముఁడగు విభీషణుఁడు రామలక్ష్మణుల దేహములంతయుం బాణంబులు గ్రుచ్చుకొనియుండుటనుజూచి పరమదుఃఖితుఁడయ్యెను. ౧౩

అంత విభీషణుఁడు చేత నీళ్లుదీసికొని యారామలక్ష్మణులకన్నులం దుడిచి పరమదుఃఖితుఁడై రోదనంబుసేయుచు నిట్లని విలపించెను. ౧౪

ఈరామలక్ష్మణులు బలవంతులును బరాక్రమవంతులును యుద్ధప్రియులును అయినను ఈరాక్షసులు కపటముతో యుద్ధముసేయువారలు కావున నిట్టిదురవస్థం బొందిరి. ౧౫

నిష్కపటముగా యుద్ధముసేయునట్టి యీరామలక్ష్మణులను దుర్మార్గుఁడును దల్లికడుపు చెఱపఁబుట్టినవాఁడును నాయన్నకొడుకునగు నింద్రజిత్తు రాక్షససాధారణమయిన కుటిలబుద్ధిచే మోసపుచ్చెను. ౧౬

శరై రిమౌ వలం విద్ధౌ రుధిరేణ సముక్షితౌ,
వసుధాయాం విమౌ సుప్తౌ దృశ్యేతే శల్యకా వివ. ౧౭

యయో ర్వీర్య ముపాశ్రిత్య ప్రతిష్ఠా కాఙ్క్షితా మయా,
తౌ పుభౌ దేహనాశాయ ప్రసుప్తౌ పురుషర్షభౌ. ౧౮

జీవన్నద్య విపన్నోఽస్మి నష్టరాజ్యమనోరథః,
ప్రాప్త ప్రతిజ్ఞశ్చ రిపు స్సకామో రావణః కృతః. ౧౯

ఏవం విలపమానం తం పరిష్వజ్య విభీషణమ్,
సుగ్రీవ స్సత్త్వసమ్పన్నో హరిరాజోఽబ్రవీ దిదమ్. ౨౦
రాజ్యం ప్రాప్స్యసి ధర్మజ్ఞ! లఙ్కాయాం నాత్ర సంశయః
రావణ స్సహపుత్త్రేణ సకామం నేహ లప్స్యతే. ౨౧

న రుజాపీడితౌ వేతౌ పుభౌ రాఘవలక్ష్మణౌ,
త్యక్త్వా మోహం వధిష్యేతే సగణం రావణం రణే. ౨౨

త మేవ సాన్త్వయిత్వా తు సమాశ్వాస్య చ రాక్షసమ్,
సుషేణం శ్వశురం పార్శ్వే సుగ్రీవ స్త ముపాచ హ. ౨౩
సహ శూరై ర్హరిగణై ర్లబ్ధసంజ్ఞా వరిన్దమౌ,
గచ్ఛ త్వం భ్రాతరౌ గృహ్య కిష్కిన్ధాం రామలక్ష్మణౌ. ౨౪

అహం తు రావణం హత్వా సపుత్త్రం సహబాన్ధవమ్,
మైథిలీ మానయిష్యామి శక్రో నష్టామివ శ్రియమ్. ౨౫

నెత్తుటం దోఁగుచు భూమింబరుండియున్న యీరామలక్ష్మణులు దేహ మంతయు బాణములు గ్రుచ్చుకొని నిండియుండుటంజేసి నేలపై నిదురించు చుండు ముండ్లపందులుం బోలెఁ జూపట్టుచున్నారు. ౧౭

నే నెవ్వరిపరాక్రమంబు నాశ్రయించి ప్రతిష్ఠఁ బొంద వలయునని యుంటినో యట్టిపురుషోత్తములగు రామలక్ష్మణు లిద్దఱు నేలంబరుండి మృతిఁ బొందునట్లున్నారు. ౧౮

నాకు రాజ్యంబునొందవలెనను కోర్కియుం బోయినది; ఇంక బ్రతికి యున్న మిక్కిలియు నాపదగలుగును; నాశత్రువు రావణుండు తన ప్రతిన కోర్కిని నెఱవేర్చుకొనెను. అని విభీషణుఁడు విలపించెను. ౧౯

ధైర్యశాలియగు వానరరాజగు సుగ్రీవుఁడు ఇట్లు విలపించుచున్న విభీషణుఁ గవుఁగిలించుకొని యిట్లని చెప్పెను. ౨౦

ధర్మవేత్తవగు విభీషణుఁడా! నీవు లంకారాజ్యంబు నొందఁగలవు; ఈవిషయమునందు సందేహము లేదు; రావణుఁడును అతనికొడుకును కృతకృత్యులు కాఁజాలరు. ౨౧

ఈరామలక్ష్మణులకు దీనివలనఁ బ్రాణహాని గలుగదు; వీరలు మూర్ఛఁ దేఱి యుద్ధంబున రాక్షససమేతంబుగా రావణుని వధింపఁగలరు. అని సుగ్రీవుఁడు విభీషణునితోఁ జెప్పెను.

సుగ్రీవుఁడు ఇట్లు విభీషణుని మృదువచనంబుల నాశ్వాసించి తన సమీపంబుననున్న మామను సుషేణుంజూచి యిట్లని చెప్పెను. ౨౩

నీవు శత్రువుల నడంగఁద్రొక్కంజాలిన యీరామలక్ష్మణులు మూర్ఛ దేఱినపిదప వీరలం దీసికొని శూరులగు వానరవీరుల కొందఱితోఁ గూడఁ గిష్కింధకుఁ బొమ్ము. ౨౪

నేను బుత్రబంధుసమేతంబుగా రావణునివధించి దేవేంద్రుఁడు నశించినరాజ్యలక్ష్మింబోలె సీతాదేవిని దెచ్చెదను. ౨౫

శ్రుత్వైతత్తు వచనం సుషేణో వాక్యమబ్రవీత్,
దైవాసురం మహా ద్యుద్ధ మనుభూతం సుదారుణమ్. ౨౬

తదా స్మ దానవా దేవాన్ శరసంస్పర్శకోవిదాః,
నిజఘ్ను శ్శస్త్రవిదుష శ్ఛాదయన్తో ముహుర్ముహుః. ౨౭
తా నార్తా న్నష్టసంజ్ఞాంశ్చ పరాసూంశ్చ బృహస్పతిః,
విద్యాభి ర్మన్త్రయుక్తాభి రోషధీభి శ్చికిత్సతి. ౨౮

తా న్యౌషధా న్యానయితుం క్షీరోదం యాన్తు సాగరమ్,
జవేన వానరా శ్శీఘ్రం సంపాతిపనసాదయః. ౨౯
హరయ స్తు విజానన్తి పార్వతీస్తా మహౌషధీః,

సంజీవకరణీం దివ్యాం విశల్యాం దేవనిర్మితామ్. ౩౦

చన్ద్రశ్చనామ ద్రోణశ్చ క్షీరోదే సాగరోత్తమే,
అమృతం యత్ర మథితం తత్ర తే పరమౌషధీ. ౩౧

తే తత్ర నిహితే దేవైగ పర్వతే పరమౌషధీ,

అయం వాయుసుతో రాజ! న్హనూమాం స్తత్ర గచ్ఛతు.

ఏతస్మి న్నన్తరే వాయు ర్మేఘాంశ్చాపి సవిద్యుతః,
పర్యస్య సాగరే తోయం కమ్పయ న్నివ మేదినీమ్. ౩౩

సుషేణుఁడు వానరరాజగు సుగ్రీవుఁడు చెప్పినమాటను విని యిట్లని చెప్పెను.

మున్ను మహాభయంకరమగు దేవాసురయుద్ధంబును నేను జూచి యున్నాను. ౨౭

అప్పుడు బాణములు ప్రయోగించుటయందుఁ బండితులును ఆయుధ విద్యాకుశలులునగు నసురులు మాయ చేసి దేవతలను జక్కఁగాఁ బ్రహరించిరి.

అట్లు దేవతలలోఁ గొందఱు బాణపీడితులును గొందఱు మూర్ఛితులును గొందఱు మృతులునై యుండ బృహస్పతి మృతసంజీవని మున్నగువిద్యల చేతను మూలికలచేతను వారలకుఁ జికిత్స చేసెను. ౨౮

ఆయౌషధంబులఁ దెచ్చుటకై సంపాతియుఁ బనసుండును మున్నగు వానరులు వేగంబున క్షీరసముద్రంబునకుఁ బోవుదురుగాక. ౨౯

వానరులకుమాత్రము పర్వంబుల నుండుపట్టి యామహౌషధులు దెలియును.

దేవతలచే నిర్మింపఁబడినవగు సంజీవకరణి విశల్యకరణి యను నీ రెండు మూలికలం దేవలయును. ౩౦

సముద్రశ్రేష్ఠమగు క్షీరసముద్రమునందు మున్ను దేవత లమృతము మథించినస్థలంబునఁ జంద్రపర్వతమనియు ద్రోణపర్వతమనియు రెండు పర్వతంబు లున్నవి; ఆపర్వతములందు సంజీవకరణియు విశల్యకరణియు నను నామహౌషధు లున్నవి. ౩౧

ఈ యుత్తమములయిన మూలికలగు సంజీవకరణియు విశల్యకరణియు నా చంద్రద్రోణపర్వతములయందు దేవతలచే నుంచఁబడినవి.

వానరరాజగు సుగ్రీవుఁడా! వాయుదేవునికుమారుఁడగు హనుమంతుని నాచంద్రద్రోణపర్వతంబులయొద్దకుఁ బంపుము. అని సుషేణుండు సుగ్రీవునితోఁ జెప్పెను. ౩౨

ఇంతలో మెఱపులతోఁ గూడ మేఘంబుల నెగురఁగొట్టుచు సముద్ర జలంబులం గలంచుచు భూమిం గదలించునట్లు పెనుగాలి యొకటి వీచెను. ౩౩

మహతా పక్షవాతేన సర్వద్వీపమహాద్రుమాః,
నిపేతు ర్భగ్నవిటపాః సమూలా లవణామ్భసి. ౩౪
అభవ న్పన్నగా స్త్రస్తా భోగిన స్తత్ర వాసినః,
శీఘ్రం సర్వాణి యాదాంసి జగ్ముశ్చ లవణార్ణవమ్. ౩౫
తతో ముహూర్తా ద్గరుడం వైనతేయం మహాబలమ్,
వానరా దదృశు స్సర్వే జ్వలన్త మివ పావకమ్. ౩౬
త మాగత మభిప్రేక్ష్య నాగా స్తే విప్రదుద్రువుః,
యై స్తౌ సత్పురుషౌ బద్ధౌ శరభూతై ర్మహాబలౌ. ౩౭

తత స్సుపర్ణః కాకుత్స్థౌ దృష్ట్వా ప్రత్యభినన్దితః,
విమమర్శ చ పాణిభ్యాం ముఖే చన్ద్రసమప్రభే. ౩౮

వైనతేయేన సంస్పృష్టా స్తయో స్సంరురుహు ర్వ్రణాః,
సువర్ణే చ తనూ స్నిగ్ధే తయో రాశు బభూవతుః. ౩౯

తేజో వీర్యం బలం చౌజ ఉత్సాహశ్చ మహాగుణాః,
ప్రదర్శనం చ బుద్ధిశ్చస్మృతిశ్చ ద్విగుణం తయోః. ౪౦

తా వుత్థాప్య మహావీర్యౌ గరుడో వాసవోపమౌ,
ఉభౌ తౌ సస్వజే హృష్టో రామశ్చైన మువాచహ. ౪౧

భవత్ప్రసాదా ద్వ్యసనం రావణిప్రభవం మహత్,
ఆవామిహ వ్యతిక్రాన్తౌ పూర్వవ ద్బలినౌ కృతౌ. ౪౨
యథా తాతం దశరథం యథాఽజం చ పితామహమ్,

లంకాద్వీపమునందలి మహావృక్షములన్నియుఁ బక్షవాతంబునఁ గొమ్మలువిఱిగి వ్రేళ్లతోఁగూడ సముద్రంబునఁ బడినవి. ౩౪

ఆసముద్రంబున నుండునట్టి సర్పములన్నియు భయంబునొందినవి; జలజంతువులన్నియు భయంబునొంది సముద్రములోనికిం జొచ్చినవి. ౩౫

అంత మఱికొంతసేపునకు వానరులందఱు మహాబలుఁడును జ్వలించుచున్నయగ్నికైవడిఁ దేజరిల్లుచున్నవాఁడునగు గరుత్మంతునిఁ బొడగనిరి. ౩౬

ఇంద్రజిత్తు బాణరూపములయిన యేసర్పములచేఁ మహాబలశాలులగు రామలక్ష్మణులను బంధించెనో ఆసర్పములన్నియు గరుత్మంతుఁడు వచ్చుటం జూచి భయంబునం బాఱినవి. ౩౭

అంత గరుత్మంతుఁడు రామలక్ష్మణులంజూచి వారలచేఁ బూజితుఁడై తనరెండుచేతులతోను జంద్రబింబసమానంబులగు వారల ముఖంబులం దడవెను. ౩౮

గరుత్మంతుఁడు హస్తంబులందడవుటచే నారామలక్ష్మణుల దేహమునందలి గాయములన్నియు మానినవి; వారలదేహములు శీఘ్రంబున మంచిరంగు గలవియు స్నిగ్ధంబులునయినవి. ౩౯

అంత నారామలక్ష్మణులకు దేజస్సును బరాక్రమంబును బలంబును గాంతియు నుత్సాహంబును సూక్ష్మార్థపరిజ్ఞానంబును బుద్ధియు స్మృతియుం మున్నున్నదానికన్న రెండింతలయినవి. ౪౦

గరుత్మంతుఁడు మహాపరాక్రమశాలులును దేవేంద్రసమానులునగు నారామలక్ష్మణులను లేవనెత్తి పరమసంతుష్టులయియున్నవారలం గవుఁగిలించుకొనెను; అంత రాముఁడు గరుత్మంతుంజూచి యిట్లని చెప్పెను. ౪౧

మీయనుగ్రహంబున మాకిప్పు డింద్రజిత్తువలనంగలిగిన మహావ్యసనంబుగడచినది. మఱియు మునుపటివలె బలవంతులము నైతిమి. ౪౨

నాతండ్రియగు దశరథమహారాజును నాతాతయగు నజమహారాజును

తథా భవన్త మాసాద్య హృదయం మే ప్రసీదతి. ౪౩
కో భవాన్ రూపసమ్పన్నో దివ్యస్రగనులేపనః,
వసానో విరజే వస్త్రే దివ్యాభరణభూషితః. ౪౪

త ముువాచ మహాతేజా వైనతేయో మహాబలః,
పతత్త్రిరాజః ప్రీతాత్మా హర్ష పర్యాకులేక్షణః. ౪౫

అహం సఖా తే కాకుత్స్థ! ప్రియః ప్రాణో బహిశ్చరః.
గరుత్మా నిహ సంప్రాప్తో యువాభ్యాం సాహ్యకారణాత్. ౪౬

అసురా వా మహావీర్యా దానవా వా మహాబలాః,
సురాశ్చాపి సగన్ధర్వాః పురస్కృత్య శతక్రతుమ్. ౪౭
నేమం మోక్షయితుం శక్తా శ్శరబన్ధం సుదారుణమ్.
మాయాబలా దిన్ద్రజితా నిర్మితం క్రూరకర్మణా. ౪౮
ఏతే నాగాః కాద్రవేయా స్తీక్ష్ణదంష్ట్రా విషోల్బణాః,
రక్షోమాయాప్రభావేన శరా భూత్వా త్వదాశ్రితాః. ౪౯

సభాగ్య శ్చాసి ధర్మజ్ఞ! రామ! సత్యపరాక్రమ!,
లక్ష్మణేన సహ భ్రాత్రా సమరే రిపుఘాతినా.. ౫౦

ఇమం శ్రుత్వా తు వృత్తాన్తం త్వరమాణోఽహ మాగతః,
సహసా యువయో స్స్నేహా త్సఖిత్వ మనుపాలయన్. ౫౧

మోక్షితౌ చ మహాఘోరా దస్మా త్సాయకబన్ధనాత్,

జూచినట్లు నిన్నుఁజూడఁగా నామనస్సు మిక్కిలియుఁ బ్రసన్నమగుచున్నది. రూపవంతుఁడవై దివ్యంబులగు పుష్పమాలికలు దాల్చి సుగంధానులేపనంబుఁ బూసికొని నిర్మలంబులగు వస్త్రంబులఁ గట్టుకొని దివ్యాభరణంబులు ధరించి చూపరుల కెంతయుఁ నాశ్చర్యంబు గలిగించుచున్నావు. నీవెవ్వఁడవు? అని రాముఁడు గరుత్మంతునితోఁ జెప్పెను. ౪౪

మహాతేజుఁడును మహాబలుఁడునగు పక్షిరాజై నగరుత్మంతుఁడు రాముంజూచి పరమసంతుష్టుఁడై కన్నుల కానందబాష్పంబులుగాఱ నిట్లని చెప్పెను. ౪౫

రాముఁడా! నేను నీకు స్నేహితుఁడను బ్రియుఁడను, బహిశ్చరంబగు ప్రాణంబువంటివాఁడను; నాపేరు గరుత్మంతుఁడందురు; మీకు సాహాయ్యంబు సేయుటకై యిచ్చటికి వచ్చినాను. ౪౬

క్రూరకర్ముఁడగు నింద్రజిత్తుచే నిర్మింపఁబడిన మహాభయంకరంబయిన యీబాణపాశంబుల విడిపించుటకు మహాపరాక్రమశాలులగు సురులచేఁగాని మహాబలశాలులగు దానవులచేఁగాని మహేంద్రసహితులగు దేవగంధర్వులచేఁగాని యలవికాదు. ౪౭. ౪౮

ఇవి తీక్ష్ణదంష్ట్రములును మహావిషములునగు కద్రువుకుఁబుట్టిన సర్పములు; ఇంద్రజిత్తు మాయాప్రభావంబునం జేసి బాణరూపంబునొంది నిన్నుఁ బొందినవి. ౪౯

ధర్మజ్ఞుఁడవు సత్యపరాక్రముఁడవు నగురాముఁడా! యుద్ధంబున శత్రువును వధించునట్టి నీతమ్ముఁడు లక్ష్మణుఁడును నీవును భాగ్యవంతులరు కావున మీకేమియుఁ భయము లేదు. ౫౦

నేను ఇట్లు మీర లింద్రజిత్తుచే నాగపాశంబుల బంధింపఁబడియుండుటను విన్నంతనె మీయందలి స్నేహంబున మిత్రధర్మం బేర్పడ వేగంబున నిచ్చటికి వచ్చితిని. ౫౧

అట్లు మహాభయంకరంబగు నాగపాశబంధంబుననుండి మిమ్ము విడిపిం

అప్రమాదశ్చ కర్తవ్యో యువాభ్యాం నిత్యమేవ హి. ౫౨

ప్రకృత్యా రాక్షసాస్సర్వే సఙ్గ్రామే కూటయోధినః,
శూరాణాం శుద్ధభావానాం భవతామార్జవం బలమ్. ౫౩

తన్న విశ్వసితవ్యం వో రాక్షసానాం రణాజిరే,
ఏతేనైవోపమానేన నిత్యం జిహ్మా హి రాక్షసాః. ౫౪

ఏవ ముక్త్వా తతో రామం సువర్ణ స్సుమహాబలః,
పరిష్వజ్య సుహృత్స్నిగ్ధ మాప్రష్టు ముపచక్రమే. ౫౫

సఖే! రాఘవ! ధర్మజ్ఞ! రిపూణా మపి వత్సల!,
అభ్యనుజ్ఞాతు మిచ్ఛామి గమిష్యామి యథాగతమ్. ౫౬

నచ కౌతూహలం కార్యం సఖిత్వం ప్రతి రాఘవ!,
కృతకర్మా రణే వీర! సఖిత్వ మను వేత్స్యసి. ౫౭

బాలవృద్ధావశేషాం తు లఙ్కాం కృత్వా శరోర్మిభిః,
రావణం చ రిపుం హత్వా సీతాం సముపలప్స్యసే. ౫౮
ఇత్యేవ ముక్త్వా వచనం సుపర్ణ శ్శీఘ్రవిక్రమః,
రామం చ విరుజం కృత్వా మధ్యే తేషాం వనౌకసామ్. ౫౯
ప్రదక్షిణం తతః కృత్వా పరిష్వజ్య చ వీర్యవాన్,
జగామాకాశ మావిశ్య సుపర్ణః పవనో యథా. ౬౦
విరుజౌ రాఘవౌ దృష్ట్వా తతో వానరయూథపాః,
సింహనాదాం స్తదా నేదు ర్లాఙ్గూలా న్దుధువు స్తదా. ౬౧

చిలిని, మీర లీయుద్ధంబున నెంత మాత్రమేని యేమఱుపాటు నొందఁ గూడదు. ౫౨

రాక్షసులందఱు యుద్ధంబునఁ గపటముగాఁ బోరువారలు; వారల స్వభావమే యది; శూరులరును నిర్మలమయిన మనస్సుగలవారలునగు మీరు యెంతమాత్రము కపటములేనివారలు; అదియె మీకు బలము. ౫౩

అందువలన మీరలు యుద్ధంబున రాక్షసులనెంతమాత్రము నమ్మవలదు; ఈనిదర్శనము చేతనె రాక్షసుల నమ్మరాదని తెలియవచ్చినదిగదా! అని గరుత్మంతుఁడు రామునితోఁ జెప్పెను. ౫౪

మహాబలశాలియగు గరుత్మంతుఁడు రామునితో నీప్రకారము చెప్పి, రాముని సస్నేహంబుగాఁ గవుఁగిలించుకొని యంతఁ బోయివచ్చెద నని చెప్ప నారంభించెను. ౫౫

నాచెలికాఁడవు ధర్మంబుఁ దెలిసినవాఁడవు. శత్రువులయందుఁ గూడ నధికముగాఁ బ్రేమగలవాఁడవునగు రాముఁడా! నా కనుమతి యొసంగుము; నేను బోవలయును. ౫౬

పరాక్రమశాలివగు రాముఁడా! నేను నీకెట్లు స్నేహితుఁడ నైతి నని యిప్పు డడుగవలదు. యుద్ధంబునఁ గృతకృత్యుఁడవై చెలిమిగలిగిన సంగతిం దెలిసికొనఁగలవు. ౫౭

బాణపరంపరలచే లంకయందు బాలవృద్ధులుమాత్రము మిగులునట్లు చేసి శత్రుఁడగు రావణుని వధించి సీతం బొందఁగలవు. ౫౮

మహాపరాక్రమశాలియు శీఘ్రమున నడచువాఁడునగు గరుత్మంతుఁడు ఈప్రకారమునం జెప్పి రామలక్ష్మణుల నిరోగులుగాఁజేసి ఆవానరుల నడుమ నారామలక్ష్మణులకుఁ బ్రదక్షిణంబు గావించి వారలం గవుఁగిలించుకొని వాయువుంబోలె నాకాశమార్గంబునఁ బోయెను. ౫౯, ౬౦

అంత నప్పుడు వానరవీరులు రామలక్ష్మణు లేమియుఁ శ్రమంబులేక సుఖశరీరులుగా నుండుటం జూచి పరమసంతోషంబున సింహనాదంబులు సేయుచు లాంగూలంబులు విదిలించిరి. ౬౧

తతో భేరీ స్సమాజఘ్ను ర్మృదఙ్గాంశ్చాప్యనాదయన్,
దధ్ము శ్శఙ్ఖాన్ సమ్ప్రహృష్టాః క్ష్వేళ న్త్యపి యథాపురమ్. ౬౨

ఆస్ఫోట్యాస్ఫోట్య విక్రాన్తా వానరా నగయోధినః,
ద్రుమా నుత్పాట్య వివిధాం స్తస్థు శ్శతసహస్రశః. ౬౩

విసృజన్తో మహానాదాం స్త్రాసయన్తో నిశాచరాన్,
లఙ్కాద్వారాణ్యుపాజగ్ము ర్యోద్ధుకామాః ప్లవఙ్గమాః. ౬౪

తతస్తు భీమ స్తుములో నినాదో
బభూవ శ్శాఖామృగయూథపానామ్,
క్షయే నిదాఘస్య యథా ఘనానాం
నాదస్సుభీమో నదతాం నిశీథే. ౬౫

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే పఞ్చాశస్సర్గః. ౫౦.

---

## ఏకపఞ్చాశస్సర్గః.

తేషాం సుతుములం శబ్దం వానరాణాం తరస్వినామ్,
నర్దతాం రాక్షసై స్సార్ధం తదా శుశ్రావ రావణః. ౧
స్నిగ్ధగమ్భీరనిర్ఘోషం శ్రుత్వా స నినదం భృశమ్,
సచివానాం తత స్తేషాం మధ్యే వచన మబ్రవీత్. ౨
యథాఽసౌ సమ్ప్రహృష్టానాం వానరాణాం సముత్థితః,
బహూనాం సుమహానాదో మేఘానా మివ గర్జతామ్. ౩
వ్యక్తం సుమహతీ ప్రీతిరేతేషాం నాత్ర సంశయః,
తథాహి విపులై ర్నాదై శ్చుక్షుభే వరుణాలయః. ౪

అంత వానరు లెప్పటి యట్లు సంతుష్టులయి భేరులువాయించిరి; మృదంగంబులను వాయించిరి; శంఖంబులఁ బూరించిరి; సింహనాదంబులు గావించిరి. ౬౨

వృక్షములం బోరునట్టి వానరులు పరాక్రమగర్వితులయి మాటిమాటికి భుజంబుల నాస్ఫాలించుచు నానావిధంబులగు వృక్షంబులం బెకలించి వానిం జేతనిడుకొని యుద్ధంబునకు సన్నద్ధులయి నిలిచిరి. ౬౩

వానరులు మహాధ్వనిగలుగునట్లు సింహనాదంబులు సేయుచు రాక్షసులకు భయంబుగలిగించుచు యుద్ధంబుసేయ నుత్సాహంబుసెలంగ లంకాద్వారంబుల నరికట్టిరి. ౬౪

అంత నర్ధరాత్రంబున సింహనాదంబులుసేయుచుండు నావానరవీరుల ధ్వని వర్షర్తువునందు గర్జించునట్టి మేఘంబుల మహాధ్వనివలె నతిభయంకరంబుగా వినవచ్చుచుండినది. ౬౫

ఇది యేఁబదవసర్గము.

## ఏఁబదియొకటవసర్గము.

అప్పుడు బలవంతులగు నావానరు లట్లు సింహనాదంబులుసేయుచుండ నాధ్వని రావణుఁడును రాక్షసులును వినిరి. ౧

ఆ రావణుఁడు స్నిగ్ధంబును గంభీరంబునగు నాధ్వని విని మంత్రుల నడుమ వారలంజూచి యిట్లని చెప్పెను. ౨

ఈవానరులు పెక్కండ్రు చేరి మహామేఘంబులు గర్జించునట్లు సింహనాదంబులు సేయుచున్నారు. కావున వీరలకుఁ బరమసంతోషంబుగలిగి నట్లున్నది, ఇది స్పష్టము; ఇందుకు సందేహము లేదు. ౩

అది యటుండ్తమే; అమ్మహాధ్వనులచేతనే సముద్రంబును క్షోభంబు నొందినది, చూడుఁడు.

తౌ తు బద్ధౌ శరైస్తీక్ష్ణైర్భ్రాతరౌ రామలక్ష్మణౌ,
అయం చ సుమహాన్నాద శ్శఙ్కాం జనయతీవ మే. ౫
ఏతత్తు వచనం చోక్త్వా మన్త్రిణో రాక్షసేశ్వరః,
ఉవాచ నైరృతాం స్తత్ర సమీప పరివర్తినః. ౬

జ్ఞాయతాం తూర్ణ మేతేషాం సర్వేషాం వనచారిణామ్,
శోకకాలే సముత్పన్నే హర్ష కారణముత్థితమ్. ౭

తథోక్తాస్తేన సమ్భ్రాన్తాః ప్రాకారమధిరుహ్య తే,
దదృశుః పాలితాం సేనాం సుగ్రీవేణ మహాత్మనా. ౮
తౌ చ ముక్తౌ సుఘోరేణ శరబన్ధేన రాఘవౌ,
సముత్థితౌ మహాభాగౌ విషేదుః ప్రేక్ష్య రాక్షసాః. ౯
సన్త్రస్తహృదయాస్సర్వే ప్రాకారాదవరుహ్య తే,
విషణ్ణవదనా ఘోరా రాక్షసేన్ద్ర ముపస్థితాః. ౧౦

తదప్రియం దీనముఖా రావణస్య నిశాచరాః,
కృత్స్నం నివేదయామాసుర్యథావద్వాక్యకోవిదాః. ౧౧
యౌ తావిన్ద్రజితా యుద్ధే భ్రాతరౌ రామలక్ష్మణౌ,
నిబద్ధౌ శరబన్ధేన నిష్ప్రకమ్పభుజౌ కృతౌ. ౧౨
విముక్తౌ శరబన్ధేన తౌ దృశ్యేతే రణాజిరే,
పాశానివ గజౌ ఛిత్త్వా గజేన్ద్రసమవిక్రమౌ. ౧౩

తచ్ఛ్రుత్వా వచనం తేషాం రాక్షసేన్ద్రో మహాబలః,
చిన్తాశోకసమాక్రాన్తో విషణ్ణవదనోఽబ్రవీత్. ౧౪
ఘోరై ర్దత్తవరై ర్బద్ధౌ శరై రాశీవిషోపమైః,

అచ్చట నారామలక్ష్మణులును దీక్ష్ణబాణంబుల బద్ధులయియున్నారు. ఈమహాధ్వనియుఁ వినవచ్చుచున్నది. కావున నాకు సందేహముగా నున్నది.

రాక్షసరాజుండగు రావణుఁ డీప్రకారమున మంత్రులతోఁ జెప్పి యచ్చట సమీపంబునఁ గాచియుండు రాక్షసులఁజూచి యిట్లని యాజ్ఞాపించెను. ౬

ఇప్పుడు దుఃఖంబునకుఁ గాలముగానుండఁగా నీవానరు లందఱు సంతోషంబుతో నుండుటకుఁ గారణమేమో శీఘ్రంబున నారసిరండు. అని రావణుఁడు రాక్షసుల కాజ్ఞాపించెను. ౭

ఆరాక్షసులు రావణు నాజ్ఞనువిని సంభ్రాంతులయి ప్రాకారంబు నారోహించి మహాత్ముఁడగు సుగ్రీవునిచేఁ బరిపాలితంబగు వానరసేనంజూచిరి. ౮

రాక్షసులు మహాభయంకరంబగు బాణపాశబంధంబువదలి సుఖంబున నున్న మహాభాగులగు రామలక్ష్మణులనుంజూచి దుఃఖంబునొందిరి. ౯

భయంకరాకారులగు నారాక్షసులు భయంబునొంది ప్రాకారంబున నుండి దిగి ముఖంబులు వెలవెలంబోవ రాక్షసరాజుండగు రావణు నొద్దకుఁ బోయిరి. ౧౦

మాటలయందుఁ బండితులగు నారాక్షసులు అట్లు రామలక్ష్మణులు నాగపాశబంధముక్తులయియుండు సమాచారమునంతయుఁ రావణునకుఁ దెల్పిరి.

ఇంద్రజిత్తు ఎవ్వరిని యుద్ధంబున నాగపాశంబులబంధించి ఇటునటుఁ జేతులఁ గదలింపఁజాలనట్లు గావించినాఁడో యారామలక్ష్మణు లిప్పుడు ఆ నాగపాశబంధంబుల వదలించుకొని కట్టుత్రాళ్లం ద్రెంచుకొన్న మదపుటేనుఁగుల పగిది యుద్ధభూమియందు వెలుఁగుచున్నారు. అని రాక్షసులు రావణునితోఁ జెప్పిరి. ౧౨, ౧౩

మహాబలశాలియగు రాక్షసరాజుఁడైన రావణుఁడు రాక్షసులమాటను విని పరమదుఃఖితుఁడై ముఖంబు వెలవెలంబోవ నిట్లని చెప్పెను. ౧౪

ఇంద్రజిత్తు యుద్ధంబున భయంకరంబులును వరబలంబున సంపాదింపఁ

అమోఘైస్సూర్యసఙ్కాశై ప్రమథ్యేన్ద్రజితా యుధి. ౧౬

తదస్త్రబన్ధ మాసాద్య యది ముక్తౌ రిపూ మమ,
సంశయస్థ మిదం సర్వ మనుపశ్యామ్యహం బలమ్. ౧౭

నిష్ఫలాః ఖలు సంవృత్తా శ్శరా వాసుకితేజసః,
ఆదత్తం యైస్తు సఙ్గ్రామే రిపూణాం మమ జీవితమ్. ౧౮

ఏవ ముక్త్వా తు సఙ్క్రుద్ధో నిశ్వసన్నురగో యథా,
అబ్రవీ ద్రక్షసాం మధ్యే ధూమ్రాక్షం నామ రాక్షసమ్. ౧౯

బలేన మహతా యుక్తో రక్షసాం భీమవిక్రమ!,
త్వం వధాయాభినిర్యాహి రామస్య సహ వానరైః. ౧౯

ఏవ ముక్తస్తు ధూమ్రాక్షో రాక్షసేన్ద్రేణ ధీమతా,
కృత్వా ప్రణామం సంహృష్టో నిర్జగామ నృపాలయాత్. ౨౦

అభినిష్క్రమ్య తద్ద్వారం బలాధ్యక్షమువాచ హ,
త్వరయస్వ బలం తూర్ణం కిం చిరేణ యుయుత్సతః. ౨౧

ధూమ్రాక్షవచనం శ్రుత్వా బలాధ్యక్షో బలానుగః,
బలముద్యోజయామాస రావణస్యాఽజ్ఞయా ద్రుతమ్. ౨౨

తే బద్ధఘణ్టా బలినో ఘోరరూపా నిశాచరాః,
వినర్దమానా స్సంహృష్టా ధూమ్రాక్షం పర్యవారయన్. ౨౩

బడినవియు తీక్ష్ణవిషంబుల సర్పములవంటివియు నమోఘంబులును సూర్య సమానములునగు బాణంబుల నారామలక్ష్మణుల బంధించినాఁడు. ౧౫

నాశత్రువులయిన యారామలక్ష్మణులు, కట్టిబాణబంధమును బొందియుం విముక్తులయినయెడ నీరాక్షససేనకంతయుం బ్రాణసంశయము గలిగినట్లు నాకుఁ దోఁచుచున్నది. ౧౬

మున్ను పెక్కుమార్లు యుద్ధంబున నాశత్రువుల ప్రాణంబులు గొన్నట్టి వాసుకి సమానతేజంబులగు బాణంబులు నిష్ఫలంబులయినవిగదా! అని రావణుఁడు చెప్పెను. ౧౭

రావణుఁడు ఈప్రకారంబునం జెప్పి పరమకుపితుఁడై సర్పమంబోలె వేఁడినిట్టూర్పులుపుచ్చుచు రాక్షసమధ్యంబున ధూమ్రాక్షుఁడను రాక్షసుం జూచి యిట్లని చెప్పెను. ౧౮

భయంకరపరాక్రముఁడవగు ధూమ్రాక్షుఁడా! నీవు గొప్పరాక్షస సేనంగూడి వానరులతోఁగూడ రామునివధింపంబొమ్ము. అని రావణుఁడు ధూమ్రాక్షున కాజ్ఞాపించెను. ౧౯

ధూమ్రాక్షుఁడు బుద్ధిమంతుఁడగు రాక్షసరాజుండైన రావణుని యాజ్ఞను విని పరమసంతుష్టుఁడై రావణునకు నమస్కరించి రాజసదనంబున నుండి వెడలెను. ౨౦

"నేను యుద్ధంబు సేయఁగోరియున్నాను; నాసైన్యమునంతయుం శీఘ్రంబున నాయత్తంబు గావింపుము. ఆలస్యంబు సేయవలదు" అని చెప్పెను. ౨౧

సైన్యమువెంబడి నుండుకట్టి సేనాధ్యక్షుఁడు ధూమ్రాక్షుఁడు రావణునియాజ్ఞ చొప్పునం జెప్పినమాటనువిని శీఘ్రంబున సైన్యంబు నంతయుం నాయత్తంబు గావించెను. ౨౨

శౌర్యాతిశయజ్ఞాపనార్థమయి నడుమున గంటలుఁగట్టుకొని యుండు వారలును భయంకరాకారులునగు నారాక్షసులు శూలంబులు ముద్గరంబులం

వివిధాయుధహస్తాశ్చ శూలముద్గరపాణయః,
గదాభిః పట్టసై ర్దణ్డై రాయసై ర్ముసలై ర్భృశమ్. ౨౪
పరిఘై ర్భిణ్డివాలైశ్చ భల్లైః ప్రాసైః పరశ్వథైః,
నిర్యయూ రాక్షసా దిర్భ్యో నర్దన్తో జలదా యథా. ౨౫
రథైః కవచిన స్త్వన్యే ధ్వజైశ్చ సమలంకృతైః,
సువర్ణజాలవిహితైః ఖరైశ్చ వివిధాననైః. ౨౬
హయైః పరమశీఘ్రైశ్చ గజేన్ద్రైశ్చ మదోత్కటైః,
నిర్యయూ రాక్షసవ్యాఘ్రా వ్యాఘ్రా ఇవ దురాసదాః. ౨౭
వృకసింహముఖై ర్యుక్తం ఖరైః కనకభూషణైః,
ఆరురోహ రథం దివ్యం ధూమ్రాక్షః ఖరనిస్వనః. ౨౮
స నిర్యాతో మహావీర్యో ధూమ్రాక్షో రాక్షసై ర్వృతః,
ప్రహస న్పశ్చిమద్వారం హనూమా న్యత్ర యూథపః. ౨౯
రథప్రవర మాస్థాయ ఖరయుక్తం ఖరస్వనమ్,
ప్రయాన్తం తు మహాఘోరం రాక్షసం భీమవిక్రమమ్. ౩౦
అన్తరిక్షగతా ఘోరాశ్శకునాః ప్రత్యవారయన్,
రథశీర్షే మహా స్భీమో గృధ్రశ్చ నిపపాత హ. ౩౧
ధ్వజాగ్రే గ్రథితా శ్చైవ నిపేతుః కుణపాశనాః,
రుధిరార్ద్రో మహాన్ శ్వేతః కబన్ధః పతితో భువి. ౩౨

మున్నగు నానావిధాయుధంబులు దాల్చి పరమసంతోషంబున గర్జించుచు ధూమ్రాక్షుం బరివేష్టించిరి. ౨౩

రాక్షసులు గదలు బట్టిసంబులు నాయసదండములు మసలంబులుం బరిఘంబులు భిండివాలంబులు బల్లెములు నీటెలు గొడ్డళ్లు మున్నగు నాయుధంబుల ధరించి మేఘంబులుంబోలె గర్జించుచు నలుదిక్కులనుండియు వెడలిరి.

మఱికొందఱు రాక్షసులు కవచధారులయి ధ్వజాలంకృతంబులును నానావిధముఖంబులుగల గాడిదలతోఁ గూడినవియు బంగారుకిటికీలలోఁ నొప్పు చున్నవియు నగు రథంబులపై వెడలిరి. ౨౬

పెద్దపులులుంబోలెఁ జెనకరాని రాక్షసోత్తములు మహావేగంబులగు గుఱ్ఱంబుల నారోహించి కొందఱును, కొందఱు మదపుటేనుఁగుల నారోహించియు వెడలిరి. ౨౭

భయంకరమయిన ధ్వనిగలధూమ్రాక్షుఁడు బంగారుతో నలంకరింపఁ బడిన తోఁడేళ్లవంటిముఖంబులును సింహములవంటిముఖంబులును గలగాడిదలం గట్టిన దివ్యంబగురథము నారోహించెను. ౨౮

మహాపరాక్రమశాలియగు నాధూమ్రాక్షుఁడు భయంకరంబగు ధ్వని గలదియు గాడిదలు గట్టినదియునగు దివ్యరథంబు నారోహించి రాక్షసపరి వృతుఁడై పకపకనవ్వుచు హనుమంతుఁడుండునట్టి లంకాపశ్చిమద్వారంబునకుఁ బోయెను. ౨౯

అట్లు బయలుదేఱి పోవుచున్న మహాభయంకరుఁడును భయంకర పరాక్రముఁడునగు ధూమ్రాక్షుని రథంబున కడ్డముగా దుర్నిమిత్తసూచకంబు లగు భయంకరపక్షులుఁ నిలిచినవి. ౩౦

రథశిరస్సునందు మహాభయంకరంబగు గృధ్రం బొకటివ్రాలినది. శవ ములం దినునట్టి భయంకరపక్షులు ధ్వజంబుపైవ్రాలి యచ్చోటనుండి నేలఁ బడినవి. ౩౧

నెత్తుటం దడిసినదియుఁ దెల్లనిదియు నగు గొప్పమొండె మొకటి

విస్వరం చోత్సృజన్నాదం ధూమ్రాక్షస్య సమీపతః,
వవర్ష రుధిరం దేవస్సంచచాల చ మేదినీ. 33
ప్రతిలోమం వవౌ వాయు ర్నిర్ఘాతసమనిస్వనః,
తిమిరౌఘావృతా స్తత్ర దిశశ్చ న చకాశిరే. 34

స తూత్పాతాం స్తదా దృష్ట్వా రాక్షసానాం భయావహాన్,
ప్రాదుర్భూతాన్ సుఘోరాంశ్చ ధూమ్రాక్షో వ్యథితోఽభవత్.
ముముహూ రాక్షసాస్సర్వే ధూమ్రాక్షస్య పురస్సరాః,

తత స్సుభీమో బహుభి ర్నిశాచరై
ర్వృతోఽభినిష్క్రమ్య రణోత్సుకో బలీ,
దదర్శ తాం రాఘవబాహుపాలితాం
మహౌఘకల్పాం బహువానరీం చమూమ్. 36

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే ఏకపఞ్చాశస్సర్గః. ౫౧.

---

ద్విపఞ్చాశస్సర్గః.

ధూమ్రాక్షం ప్రేక్ష్య నిర్యాన్తం రాక్షసం భీమవిక్రమమ్,
వినేదుర్వానరాస్సర్వే ప్రహృష్టా యుద్ధకాఙ్క్షిణః. ౧

తేషాం సుతుములం యుద్ధం సఞ్జజ్ఞే హరిరక్షసామ్,

అన్యోన్యం పాదపై ర్ఘోరం నిఘ్నతాం శూలముద్గరైః. ౨
ఘోరైశ్చ పరిఘై శ్చిత్రై స్త్రిశూలై శ్చాపి సంహతైః,

వికృతధ్వనిగా రోదనంబు సేయుచు ధూమ్రాక్షునకు సమీపంబుగా నేలం బడినది. ౩౨

మేఘము నెత్తురువానగురిసినది. భూమి చలనంబు నొందినది. పిడుగు పడునట్లు మహాధ్వనిగదుర మహావేగంబున నెదురుగాలివీచెను. ౩౩

మఱియు నప్పుడు దిక్కులన్నియుం జీకట్లుక్రమ్ముటం జేసి యెంత మాత్రము లేకుండినవి. ౩౪

అధూమ్రాక్షుఁడు రాక్షసభయంకరంబులును మహాఘోరంబులును నగు నాయుత్పాతంబులుగనుపట్టుటంజూచి దుఃఖితుం డయ్యెను. ౩౫

ధూమ్రాక్షునితోఁగూడ వచ్చిన రాక్షసులందఱును దుఃఖంబున మూర్ఛితులయిరి.

అంత భయంకరాకారుఁడును బలవంతుఁడు నగు ధూమ్రాక్షుండు ఆయుత్పాతంబులు సరకుసేయక పెక్కురాక్షసులంగూడి యుద్ధోత్సాహంబునఁ బురంబువెడలి రామబాహుపాలితంబయి మహాసముద్రంబుపగిది నలరుచున్న యవ్వానరసేనం జూచెను. ౩౬

ఇది యేఁబదియొకటవసర్గము.

## ఏఁబదిరెండవసర్గము.

యుద్ధంబుఁగోరుచున్న యవ్వానరులందఱు భయంకరపరాక్రముఁడగు ధూమ్రాక్షుఁడు వచ్చుటంచూచి పరమసంతుష్టులయి సింహనాదంబులం గావించిరి. ౧

అప్పుడు వానరులకును రాక్షసులకును దుములంబుగా మహాయుద్ధం బయినది.

వానరులును రాక్షసులును వృక్షంబులచేతను శూలముద్గరపరిఘత్రిశూలాద్యాయుధముల చేతను ఒండొరులఁ బ్రహారించుకొనుచు భయంకరంబుగాఁ బోరిరి. ౩

రాక్షసై ర్వానరాఘోరై ర్వినికృత్తా స్సమ న్తతః. ౩
వానరై రాక్షసాశ్చాపి ద్రుమై ర్భూమౌ సమీకృతాః,
రాక్షసాశ్చాపి సఙ్క్రుద్ధా వానరాన్నిశితై శ్శరైః. ౪
వివ్యధు ర్ఘోరసంకాశైః కఙ్కపత్రై రజిహ్మగైః,
తే గదాభిశ్చ భీమాభిః పట్టిసైః కూటముద్గరైః. ౫
విదార్యమాణా రక్షోభి ర్వానరా స్తే మహాబలాః,
అమర్షా జ్జనితోద్ధర్షా శ్చక్రుః కర్మాణ్యభీతవత్. ౬
శరనిర్భిన్నగాత్రా స్తే శూలనిర్భిన్న దేహినః,
జగృహు స్తే ద్రుమాం స్తత్ర శిలాశ్చ హరియూథపాః. ౭
తే భీమవేగా హరయో నర్దమానా స్తత స్తతః,
మమన్థూ రాక్షసాన్భీమా న్నామాని చ బభాషిరే. ౮

తద్బభూవాద్భుతం ఘోరం యుద్ధం వానరరక్షసామ్,
శిలాభిర్వివిధాభిశ్చ బహుభి శ్చైవ పాదపైః. ౯
రాక్షసా మథితాః కేచి ద్వానరై ర్జితకాశిభిః,
వవమూ రుధిరం కేచి న్ముఖై రుధిరభోజనాః. ౧౦
పార్శ్వేషు దారితాః కేచిత్కేచి ద్రాశీకృతా ద్రుమైః,
శిలాభిశ్చూర్ణితాః కేచిత్కేచి ద్దన్తై ర్విదారితాః, ౧౧

ధ్వజై ర్విమథితై ర్భగ్నైః ఖరై శ్చ వినిపాతితైః.
రథై ర్విధ్వంసితై శ్చాపి పతితై రజనీచరైః. ౧౨
గజేన్ద్రైః పర్వతాకారైః పర్వతాగ్రై ర్వనౌకసామ్,
మథితై ర్వాజిభిః కీర్ణం సారోహై ర్వసుధాతలమ్. ౧౩

వానరై ర్భీమవిక్రాన్తై రాప్లుత్యాఽప్లుత్య వేగితైః,

భయంకరాకారులగు రాక్షసులు పెక్కండ్ర వానరులను వధించిరి. వానరులు రాక్షసులఁ బెక్కండ్ర వృక్షంబులచేఁ జూర్ణముగావించిరి. ౩

రాక్షసులును పరమకుపితులయి భయంకరంబులును గంకపక్షిఱెక్కలు గట్టినవియు నగు కఱకుబాణంబుల వానరులం బ్రహరించిరి. ౪

మహాబలశాలులగు నవ్వానరులును రాక్షసులచే భయంకరంబులగు గదాపట్టిసకూటముద్గరాద్యాయుధంబుల విదారితులయ్యు రోషంబున మహోత్సాహులయి యెంతమాత్రము వెనుదీయక పోరుచుండిరి. ౫,౬

అట్లప్పుడావానరవీరులు బాణంబులచేతను శూలంబులచేతను భిన్నదేహులయి మహారోషంబున వృక్షంబులను బెఱుకాళ్లనుం జేకొనిరి. ౭

అవ్వానరవీరులు అంతకంతకు భయంకరవేగంబున సింహనాదంబులు సేయుచుఁ దమతమపే రుగ్గడించుకొనుచు భయంకరాకారులగు రాక్షసులం బ్రహరించిరి. ౮

అప్పుడు వానరరాక్షసులు నానావిధశిలావృక్షంబులచేతను నొండొరులపైఁ దర నాయుద్ధం బాశ్చర్యకరంబును భయంకరంబునై చూపట్టినది. ౯

జయశీలురగు వానరులు కొందఱు రాక్షసులంగొట్టి మద్దగావించిరి. కొందఱురాక్షసులు వానరుల ప్రహారంబున నోట నెత్తురుగ్రక్కుకొనిరి. ౧౦

వానరులు రాక్షసులం గొందఱఁ బ్రక్కలంబట్టి రెండుగాఁ జీల్చిరి. కొందఱువృక్షంబుల నలియఁగొట్టి కుప్పగా వేసిరి. కొందఱుశిలలచేఁ జూర్ణంబుగావించిరి. కొందఱు దంతంబులం గొఱికిరి. ౧౧

వానరులు ప్రయోగించు పర్వతశిఖరంబులచే విఱిగినధ్వజంబులును హతములయిన గాడిదలును విధ్వంసితములైన రథంబులును బతితంబులగు రాక్షసకళేబరంబులును బర్వతాకారంబులగు నేనుఁగులును సాదిసహితంబుగా నలియఁగొట్టఁబడిన గుఱ్ఱంబులును, ఆయుద్ధభూమియంతయు నిండియుండినవి. ౧౨,౧౩

భయంకరపరాక్రములగు వానరులు మహావేగంబున నెగసి యు

రాక్షసాః కరజై స్తీక్ష్ణై ర్ముఖేషు వినికర్తితాః. ౧౪

వివర్ణవదనా భూయో విప్రకీర్ణశిరోరుహాః,
మూఢాశ్శోణితగన్ధేన నిపేతు ర్ధరణీతలే. ౧౫
అన్యే పరమసఙ్క్రుద్ధా రాక్షసా భీమనిస్వనాః,
తలై రేవాభిధావన్తి వజ్రస్పర్శసమై ర్హరీన్. ౧౬
వానరై రాపతన్త స్తే వేగితా వేగవత్తరైః,
ముష్టిభి శ్చరణై ర్దన్తైః పాదపై శ్చావపోథితాః. ౧౭

వానరై ర్హన్యమానా స్తే రాక్షసా విప్రదుద్రువుః

సైన్యం తు విద్రుతం దృష్ట్వా ధూమ్రాక్షో రాక్షసర్షభః. 3౮
క్రోధేన కదనం చక్రే వానరాణాం యుయుత్సతామ్,

ప్రాసైః ప్రమథితాః కేచిద్వానరా శ్శోణితస్రవాః. ౧౯
ముద్గరై రాహతాః కేచి త్పతితా ధరణీతలే,
పరిఘై ర్మథితాః కేచి ద్భిణ్డిపాలై ర్విదారితాః. ౨౦
పట్టసై రాహతాః కేచి ద్విహ్వలన్తో గతాసవః,

కేచిద్వినిహతా శ్శూలై రుధిరార్ద్రా వనౌకసః. ౨౧
కేచిద్విద్రావితా నష్టాస్సబలై రాక్షసై ర్యుధి,

విభిన్నహృదయాః కేచిదేకపార్శ్వేన దారితాః. ౨౨
విదారితా స్త్రిశూలైశ్చ కేచిదాన్త్రై ర్వినిస్సృతాః,

తీక్ష్ణంబులగు నఖంబులచే రాక్షసులముఖంబుల విదారింప నారాక్షసులు తల వెండ్రుకలు ఒరిసియూడ నెత్తుటం దోఁగుచు మూర్ఛిల్లి భూతలంబునం బడిరి.

మఱికొందఱు రాక్షసులు పరమకుపితులయి భయంకరంబుగా గర్జించుచు వజ్రసమంబులగు నఱచేతులతో వానరులం దఱిమిరి. ౧౭

అట్లు మహావేగులగు నారాక్షసులు పైఁబడ వానరులు అంతకన్నను వేగముగలవారలగుటచే నారాక్షసులను బిడికిళ్లం బొడిచియు పాదంబులం దన్నియు దంతంబులం గొఱికియు వృక్షంబులం బ్రహరించియు హింసించిరి.

అట్లు వానరులచేఁ బ్రహరింపఁబడినవారలయి నిలువఁజాలక యా రాక్షసులు పరుగెత్తిరి.

రాక్షసశ్రేష్ఠుఁడగు ధూమ్రాక్షుఁడు అట్లు రాక్షససైన్యంబంతయుఁ బాఱుటం జూచి కుపితుఁడై యుద్ధంబుసేయ నుత్సుకులయి యున్న వానరుల హింసింప నారంభించెను. ౧౮

వానరులు కొందఱు రాక్షసులచేఁ బ్రాసంబులం బ్రహరింపఁబడి నెత్తురుగాఱుచుఁ గొందఱు ముద్గరంబులం దాడితులయి నేలంబడిరి. ౧౯

కొందఱు వానరులు రాక్షసులచేఁ బరిఘంబులం దాడితులయిరి; కొందఱు భిండివాలంబుల వధింపఁబడి కొంద ఱడ్డకత్తుల నఱకంబడి మృతిఁ బొందిరి. ౨౦

కొందఱు వానరులు రాక్షసులచే శూలంబులం దాడితులయి నెత్తుటం దోఁగియుండిరి; కొందఱు యుద్ధంబున బలవంతులగు రాక్షసుల నోర్వంజాలక పాఱిపోయిరి. ౨౧

కొందఱికిఁ బ్రక్కవాటునం గొట్టుటచే గుండెకాయలు పగిలినవి; కొందఱు త్రిశూలంబులం బొడువఁబడి ప్రేగులు వెలికివచ్చునట్లు చీకి చీల్పఁబడిరి. ౨౨

తత్సుభీమం మహాయుద్ధం హరిరాక్షససంకులమ్. ౨౩
ప్రబభౌ శబ్దబహుళం శిలాపాదపసంకులమ్,
ధనుర్జ్యాతన్త్రిమధురం హిక్కాతాళసమన్వితమ్. ౨౪
మన్ద్రస్తనితసఙ్గీతం యుద్ధగాన్ధర్వ మాబభౌ,

ధూమ్రాక్షస్తు ధనుష్పాణిర్వానరా న్రణమూర్ధని. ౨౫
హసన్విద్రావయామాస దిశ స్తైః శరవృష్టిభిః,

ధూమ్రాక్షేణార్దితం సైన్యం వ్యథితం దృశ్య మారుతిః. ౨౬
అభ్యవర్తత సఙ్క్రుద్ధః ప్రగృహ్య విపులాం శిలామ్,

క్రోధా ద్ద్విగుణతామ్రాక్షః పితృతుల్యపరాక్రమః. ౨౭
శిలాం తాం పాతయామాస ధూమ్రాక్షస్య రథం ప్రతి,

ఆపతన్తీం శిలాం దృష్ట్వా గదా ముద్యమ్య సమ్భ్రమాత్. ౨౮
రథాదాప్లుత్య వేగేన వసుధాయాం వ్యతిష్ఠత,
సా ప్రమథ్యరథం తస్య నిపపాత శిలా భువి. ౨౯
సచక్రకూబరం సాశ్వం సధ్వజం సశరాసనమ్,
స భఙ్క్త్వా తు రథం తస్య హనుమా న్మారుతాత్మజః. ౩౦
రక్షసాం కదనం చక్రే సస్కన్ధవిటపై ర్ద్రుమైః,

విభిన్నశిరసో భూత్వా రాక్షసాశ్శోణితోక్షితాః. ౩౧
ద్రుమైః ప్రవ్యథితాశ్చాన్యే నిపేతుర్ధరణీతలే,
విద్రావ్య రాక్షసం సైన్యం హనూమా న్మారుతాత్మజః. ౩౨
గిరే శ్శిఖర మాదాయ ధూమ్రాక్షమభిదుద్రువే,

అట్లు వానరరాక్షసులు మహారోషంబున శిలాపాదపాయుధంబులచేఁ బెనఁగుచు నమ్మహాయుద్ధం బతిభయంకరంబయి యొప్పినది. ౨౩

అల్లెత్రాళ్లధ్వనులె వీణాధ్వనులుగా నాయాసంబునం గలుగు నెక్కిళ్లె తాళంబులుగా మందవచనంబులె గానంబుగా నాయుద్ధగాంధర్వం బెంతయుఁ బ్రకాశించినది. ౨౪

అప్పుడు ధూమ్రాక్షుఁడు యుద్ధాగ్రంబున ధనుర్ధరుఁడై వీరోత్సేకంబునఁ బకపకనవ్వుచు బాణవర్షంబులు గురిపించి వానరులను దిక్కులకుం దఱిమెను. ౨౫

వాయుదేవునికుమారుఁడగు హనుమంతుఁడు ధూమ్రాక్షునిచేఁ దఱుమఁబడి విహ్వలంబయి పాఱుచున్న వానరసేనం జూచి పరమకుపితుఁడై విశాలంబగు శిలం జేకొని ధూమ్రాక్షునిపైకిఁ బోయెను. ౨౬

తండ్రియగు వాయుదేవునితో సమానమయిన పరాక్రమముగల యాహనుమంతుఁడు కోపంబునఁ గనుఁగొనల రెండింత లెఱ్ఱఁదనంబుగదుర నాశిలను ధూమ్రాక్షుని రథంబుపైఁ బడవేసెను. ౨౭

ఆ ధూమ్రాక్షుఁడు తనపైకి నమ్మహాశిలవచ్చుటం జూచి తత్క్షణంబున గదచేతంగొని వేగంబున రథమునుండి నేలకులంఘించి నిలుచుండెను. ౨౮

ఆ పెనుఱాయి ధూమ్రాక్షునిరథంబును జక్రకూబరంబులతోను గుఱ్ఱంబులతోను ధ్వజంబుతోను విల్లుతోనుంగూడ నుగ్గుగావించినది. ౨౯

వాయుదేవునికుమారుఁడగు హనుమంతుఁడు అట్లు ధూమ్రాక్షుని రథంబును నుగ్గుగావించి యంత బోదెలతోను గొమ్మలతోనుంగూడిన మహావృక్షంబులచే రాక్షసుల వధింపసాగెను. ౩౦

మఱికొందఱు రాక్షసులు వృక్షంబులచేఁ గొట్టఁబడి తలలుపగిలి నెత్తురుగాఱ విహ్వలులయి నేలంబడిరి. ౩౧

వాయుదేవునికుమారుఁడగు హనుమంతుఁడు అట్లు రాక్షససైన్యంబుల నన్నిఁటినిం బాఱఁదోలి పర్వతశిఖరంబు నొకటిం జేఁబూని ధూమ్రాక్షుని మీఁది కుఱికెను. ౩౨

తమాపతన్తం ధూమ్రాక్షో గదాముద్యమ్య వీర్యవాన్,
వినర్దమాన స్సహసా హనూమన్త మభిద్రవత్,

తతః క్రుద్ధస్తు వేగేన గదాం తాం బహుకణ్టకామ్. ౩౪
పాతయామాస ధూమ్రాక్షో మస్తకే తు హనూమతః,
తాడితస్సతయా తత్ర గదయా భీమరూపయా. ౩౫
స కపి ర్మారుతబల స్తం ప్రహార మచిన్తయన్,
ధూమ్రాక్షస్య శిరోమధ్యే గిరిశృఙ్గ మపాతయత్. ౩౬
స విహ్వలితసర్వాఙ్గో గిరిశృఙ్గేణ తాడితః,
పపాత సహసా భూమౌ వికీర్ణ ఇవ పర్వతః. ౩౭
ధూమ్రాక్షం నిహతం దృష్ట్వా హతశేషా నిశాచరాః,
త్రస్తాః ప్రవివిశు ర్లఙ్కాం వధ్యమానాః ప్లవఙ్గమైః. ౩౮

స తు పవనసుతో నిహత్య శత్రుం
క్షతజవహా స్సరిత శ్చ సంనికీర్య,
రిపువధజనితశ్రమో మహాత్మా
ముద మగమ త్కపిభిశ్చ పూజ్యమానః. ౩౯

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే ద్విపఞ్చాశస్సర్గః. ౫౨.

---

## త్రిపఞ్చాశస్సర్గః.

ధూమ్రాక్షం నిహతం శ్రుత్వా రావణో రాక్షసేశ్వరః,
క్రోధేన మహతాఽఽవిష్టో నిశ్వసన్నురగో యథా. ౧
దీర్ఘ ముష్ణం చ నిశ్వస్య క్రోధేన కలుషీకృతః,
అబ్రవీ ద్రాక్షసం క్రూరం వజ్రదంష్ట్రం మహాబలమ్. ౨

మహాపరాక్రమశాలియగు ధూమ్రాక్షుఁడు అట్లు హనుమంతుఁడు తనమీఁదికిఁ గవియుటంజూచి గదచేతంగొని సింహనాదంబు గావించుచు వేగంబున నాహనుమంతునిమీఁది కడరెను. ౩౩

అంత ధూమ్రాక్షుఁడు కోపించి పెక్కుమేకులతోఁగూడిన యాగదను వేగంబున హనుమంతునితలపైఁ బడవైచెను. ౩౪

భయంకరంబగు నాగద యప్పుడు హనుమంతునితలపైఁ బడినది. ౩౫

వాయుసమానబలుఁడగు నాహనుమంతుఁడు ఆ దెబ్బను సరకుసేయక ధూమ్రాక్షునిశిరంబుపై నాపర్వతశిఖరంబు పడవైచెను. ౩౬

ఆ ధూమ్రాక్షుఁడు పర్వతశిఖరంబుచేఁ దాడితుఁడై సమస్తావయవంబులును వివశంబులుగా ఛిన్నపక్షంబగు పర్వతంబుకరణి నేలంగూలెను. ౩౭

అంత హతశేషులగు రాక్షసులు ధూమ్రాక్షుఁడు నిహతుఁడగుటం జూచి వానరులు మఱియు నుక్కుమిగిలి పైఁబడ నోర్వఁజాలక భయంబున లంకకుం బాఱిరి. ౩౮

మహాత్ముఁడును వాయుదేవకుమారుఁడునగు నాహనుమంతుఁడు అట్లు ధూమ్రాక్షునివధించి యుద్ధభూమియందు రక్తనదులు ప్రవహింపఁజేసి వానరులచేఁ బూజితుఁడై సంతోషంబునొందెను. ౩౯

ఇది యేబదిరెండవసర్గము.

## ఏఁబదిమూఁడవసర్గము.

రాక్షసరాజుండగు రావణుఁడు ధూమ్రాక్షుఁడు వధింపఁబడుటను విని సర్పమువలె నిట్టూర్పులుపుచ్చుచుఁ బరమకోపంబునొందెను. ౧

ఆరావణుఁడు కోపంబున నొడలుదెలియక వేఁడినిట్టూర్పులు పుచ్చుచు శూరుఁడును మహాబలుఁడునగు వజ్రదంష్ట్రుంజూచి యిట్లని చెప్పెను. ౨

గచ్ఛ త్వం వీర! నిర్యాహి రాక్షసైః పరివారితః,
జహి దాశరథిం రామం సుగ్రీవం వానరైస్సహ. 3

తథేత్యుక్త్వా ద్రుతతరం మాయావీ రాక్షసేశ్వరమ్,
నిర్జగామ బలైస్సార్ధం బహుభిః పరివారితః. ౪

నాగై రశ్వైః ఖరై రుష్ట్రై స్సంయుక్త స్సుసమాహితః,
పతాకాధ్వజచిత్రైశ్చ రథైశ్చ సమలంకృతః. ౫
తతో విచిత్రకేయూరమకుటైశ్చ విభూషితః,
తనుత్రాణి చ సంరుధ్య సధను ర్నిర్యయౌ ద్రుతమ్. ౬
పతాకాలఙ్కృతం దీప్తం తప్తకాఞ్చనభూషణమ్,
రథం ప్రదక్షిణం కృత్వా సమారోహచ్చమూపతిః. ౭

యష్టిభి స్తోమరై శ్చిత్రై శ్శూలైశ్చముసలైరపి,
భిణ్డిపాలైశ్చ పాశైశ్చశక్తిభిః పట్టసైరపి. ౮
ఖడ్గైశ్చక్రై ర్గదాభిశ్చ నిశితైశ్చ పరశ్వధైః,
పదాతయశ్చ నిర్యాన్తి వివిధా శ్శస్త్రపాణయః. ౯
విచిత్రవాసస స్సర్వే దీప్తా రాక్షసపుఙ్గవాః,

గజా మదోత్కటా శ్శూరా శ్చలన్త ఇవ పర్వతాః. ౧౦
తే యుద్ధకుశలై రూఢా స్తోమరాఙ్కుశపాణిభిః,

అన్యే లక్షణసంయుక్తా శ్శూరా రూఢా మహాబలాః. ౧౧

పరాక్రమశాలివగు వజ్రదంష్ట్రుఁడా! నీ విప్పుడు రాక్షససేనం గూడి పోయి దశరథపుత్త్రుఁడగు రాముని సుగ్రీవుని వానరుల నందఱను వధించిరమ్ము. అని రావణుఁడు వజ్రదంష్ట్రునితోఁ జెప్పెను. 3

మాయావియగు నావజ్రదంష్ట్రుఁడు రాక్షసరాజుఁడగు రావణునిం జూచి యట్లె యని చెప్పి పెక్కురాక్షసులం గూడి సైన్యములతోఁ గూడ బయలుదేఱెను. ౪

అంత నావజ్రదంష్ట్రుఁడు ఏనుఁగులను గుఱ్ఱంబులను గాడిదలను నొంటెలను నానావిధధ్వజాలంకృతంబులగు రథంబులనుంగూడి బాహుపురులు కిరీటంబు మున్నగుభూషణంబులు దాల్చి కవచంబులు దొడుగుకొని ధనుర్ధరుండై యెచ్చరికతో శీఘ్రంబునం బోయెను. ౫, ౬

సేనాపతియగు వజ్రదంష్ట్రుఁడు ధ్వజంబులచే నలంకృతంబును బంగారముతో నలంకరింపఁబడినదియునగు రథంబునకుఁ బ్రదక్షిణంబు గావించి దాని నారోహించెను. ౭

అంతఁ గాల్బలరును యష్టులుఁ దోమరంబులుఁ జిత్రంబులగు శూలంబులు ముసలంబులు భిండివాలంబులుఁ బాశంబులు శక్తులుఁ బట్టిసంబులు ఖడ్గంబులుఁ జక్రంబులు గదలుఁ దీక్ష్ణంబులగు పరశ్వధంబులు మున్నగు నాయుధంబులం జేకొని వెడలిరి. ౮, ౯

ఆ రాక్షసవీరు లందఱు మంచిమంచివస్త్రంబులం దాల్చి యెంతయుఁ బ్రకాశించుచుండిరి.

యుద్ధంబున సమర్థులగు రాక్షసవీరులు తోమరంబులు నంకుశంబులుఁ జేతులం బూని మదోత్కటంబులును ఎట్టి యుద్ధంబునందును భయములేనివియుం సంచరించు పర్వతంబులకరణి నొప్పుచున్నవియునగు నేనుఁగుల నారోహించి పోయిరి. ౧౦

మఱి కొందఱు మేటిరాక్షసులు, శుభలక్షణయుక్తంబులును మహా

తద్రాక్షసబలం ఘోరం విప్రస్థిత మశోభత,
ప్రావృట్కాలే యథా మేఘా నర్దమానాస్సవిద్యుతః. ౧౨

నిస్సృతా దక్షిణద్వారా దఙ్గదో యత్ర యూథపః,
తేషాం నిష్క్రమమాణానా మశుభం సమజాయత. ౧౩
ఆకాశా ద్విఘనా త్తీవ్రా ఉల్కాశ్చాభ్యపతం స్తదా,
వమన్త్యగ్ని పావకజ్వాలా శ్శివా ఘోరం వవాశిరే. ౧౪

వ్యాహరన్తి మృగా ఘోరా రక్షసాం నిధనం తదా,
సమాపతన్తో యోధాస్తు ప్రాస్ఖలన్ భయమోహితాః. ౧౫

ఏతా నౌత్పాతికాన్ దృష్ట్వా వజ్రదంష్ట్రో మహాబలః,
ధైర్య మాలమ్బ్య తేజస్వీ నిర్జగామ రణోత్సుకః. ౧౬

తాంస్తు నిష్క్రమతో దృష్ట్వా వానరా జితకాశినః,
ప్రణేదుస్సుమహానాదా న్పూరయంశ్చ దిశో దశ. ౧౭
తతః ప్రవృత్తం తుములం హరీణాం రాక్షసైస్సహ,
ఘోరాణాం భీమరూపాణా మన్యోన్యవధకాఙ్క్షిణామ్. ౧౮
నిష్పతన్తో మహోత్సాహా భిన్నదేహశిరోధరాః,
రుధిరోక్షితసర్వాఙ్గా న్యపత న్జగతీతలే. ౧౯

కేచిదన్యోన్య మాసాద్య శూరాః పరిఘపాణయః,
చిక్షిపు ర్వివిధం శస్త్రం సమరేష్వనివర్తినః. ౨౦

బలంబులను యుద్ధంబుల భయంబులేనివియునగు మహాగజంబులు నారోహించిపోయిరి. ౧౧

అప్పు డట్లు యుద్ధంబునకై వెడలిన నీలదేహులును గాంచనాలంకృతులను సింహనాదంబులు సేయుచుండువారలునగు నారాక్షసవీరులు వర్షాకాలంబున మెఱుపులతోఁగూడి గర్జించుచున్న మేఘంబులుంబోలెనొప్పుచుండిరి.

ఆరాక్షసులు అంగదుఁడుండునట్టి లంకాదక్షిణద్వారంబున వెడలిరి; వారలు వెడలుచుండఁగానే యశుభనిమిత్తంబులు పొడసూపినవి. ౧౩

అప్పుడు మేఘశూన్యంబగు నాకాశంబుననుండి తీవ్రంబులగు కొఱవులు పడినవి: నక్కలు అగ్నిజ్వాలలు గ్రక్కుచు భయంకరంబుగా నఱచెను. ౧౪

అప్పుడు భయంకరంబులగు క్రూరమృగంబులు రాక్షసుల మరణంబును సూచించెను. రాక్షసవీరులును పోవునప్పుడు భయమోహితులయి నేలంబడిరి. ౧౫

మహాపరాక్రమశాలియు మహాబలుఁడునగు వజ్రదంష్ట్రుఁడు ఈయుత్పాతంబులన్నియుఁజూచి యెట్టకేలకు ధైర్యంబు నవలంబించి యుద్ధోత్సుకుఁడై వెడలెను. ౧౬

జయశీలురగు వానరులు ఆరాక్షసులు వచ్చుటఁజూచి దశదిశలను నిండునట్లు సింహనాదంబులు గావించిరి. ౧౭

అంత భయంకరాకారులను ఒండొరుల వధింపఁ దలంపుగొనియుండు వారలునగు వానరరాక్షసులకు దొమ్మియుద్ధంబు జరగినది. ౧౮

ఆవానరరాక్షసులు మహోత్సాహంబున నొండొరులం గలసి పోరి దేహములందు గాయములుగలిగి మెడకాయలువిఱిగి నెత్తుటం దోఁగుచు నేలంబడిరి. ౧౯

యుద్ధంబులందు వెనుదీయక పోరునట్టిశూరులగు కొందఱు వానరరాక్షసులు ఒండొరులుంగలసి నానావిధంబులుగాఁ బోరిరి. ౨౦

ద్రుమాణాం చ శిలానాం చ శస్త్రాణాం చాపి నిస్వనః,
శ్రూయతే సుమహాం స్తత్ర ఘోరో హృదయభేదనః. ౨౧
రథనేమిస్వన స్తత్ర ధనుష శ్చాపి నిస్వన,
శఙ్ఖభేరీమృదఙ్గానాం బభూవ తుములస్వనః. ౨౨
కేచి దస్త్రాణి సంసృజ్య బాహుయుద్ధ మకుర్వత,

తలై శ్చ చరణై శ్చాపి ముష్టిభిశ్చద్రుమై రపి. ౨౩
జానుభిశ్చ హతాః కేచి ద్భిన్న దేహాశ్చ రాక్షసాః,

శిలాభి శ్చూర్ణితాః కేచి ద్వానరై ర్యుద్ధదుర్మదైః. ౨౪

వజ్రదంష్ట్రో భృశం బాణై రణే విత్రాసయ న్హరీన్,
చచార లోకసంహారే పాశహ స్త ఇవా న్తకః. ౨౫

బలవన్తోఽస్త్రవిదుషో నానా ప్రహరణా రణే,
జఘ్ను ర్వానరసైన్యాని రాక్షసాః క్రోధమూర్ఛితాః. ౨౬
నిఘ్నతో రాక్షసా న్దృష్ట్వా సర్వాన్వాలిసుతో రణే,
క్రోధేన ద్విగుణావిష్ట స్సంవ ర్తక ఇవానలః. ౨౭

తాః రాక్షసగణాః సర్వా న్వృక్ష ముద్యమ్య వీర్యవాన్,
అఙ్గదః క్రోధతామ్రాక్ష స్సింహః క్షుద్రమృగా నివ. ౨౮

చకార కదనం ఘోరం శక్రతుల్యపరాక్రమః,

అఙ్గదాభిముఖా స్తత్ర రాక్షసా భీమవిక్రమాః. ౨౯

అప్పుడు వృక్షశిలాయుధంబులు ప్రయోగించునప్పుడు గలిగినధ్వని భయంకరముగాను వినువారలహృదయంబు భేదించునదిగాను వినంబడినది. ౨౧

అప్పుడు రథనేమిధ్వనియు ధనుర్ధ్వనియుఁ శంఖభేరీమృదంగాదిధ్వనులును దుములంబుగా వినఁబడియెను. ౨౨

ఆయుధంబుల నన్నిఁటిని బ్రయోగించి యయినపిదపఁ గొందఱు బాహుయుద్ధంబుఁ గావించిరి.

వానరులు కొందఱు రాక్షసులను అఱచేతులం జఱచియుఁ బాదంబులం దన్నియుఁ బిడికిళ్లం బొడిచియు వృక్షంబులం బ్రహరించియుఁ బ్రోకాళ్లం బ్రగ్రహించియు వధింప వారలు భిన్నదేహులయి నేలంబడిరి. ౨౩

యుద్ధోన్మత్తులగువానరులు కొందఱు కొందఱు రాక్షసులను శిలలచేఁ జూర్ణముగావించిరి. ౨౪

వజ్రదంష్ట్రుఁడు యుద్ధంబున బాణంబులచే వానరుల నొప్పించుచుఁ బ్రళయకాలంబునం బాశహస్తుఁడగు యమునికైవడి నెంతయు భయంకరాకారుఁడై విహరించుచుండెను. ౨౫

బలవంతులు నాయుధవిద్యయందుఁ బండితులునగు రాక్షసులు యుద్ధంబునఁ బరమకుపితులయి నానావిధాయుధంబుల వానరసైన్యంబుల వధించిరి.

వాలిపుత్రుఁడగు నంగదుఁడు అట్లు యుద్ధంబున నారాక్షసులందఱు వానరులను వధించుటజూచి ప్రళయకాలంబున నగ్నిహోత్రుఁడుంబోలె మహాకోపంబునొందెను. ౨౬

మహాపరాక్రమశాలియగు నంగదుఁడు కోపంబునఁ గనుఁగొనల నెఱ్ఱఁదనంబుమెఱయ వృక్షంబుచే నారాక్షసులనందఱను సింహంబు స్వల్పమృగంబులంబోలెఁ జక్కాడెను. ౨౭

దేవేంద్రునితో సాటియయినపరాక్రమంబుగల యాయంగదుఁ డప్పుడు భయంకరంబుగా యుద్ధంబుగావించెను.

అప్పు డంగదుని యెదుటనున్న భయంకరపరాక్రములగు రాక్షసుల

విభిన్నశిరసః పేతు ర్వికృతా ఇవ పాదపాః,
రథై రశ్వై ర్ధ్వజై శ్ఛత్రై శ్శరీరై ర్హరిరక్షసామ్. ౩౦
రుధిరేణ చ సంఛన్నా భూమి ర్భయకరీ తదా,
హారకేయూరవస్త్రైశ్చ శస్త్రైశ్చ సమలంకృతా. ౩౧
భూమిర్భాతి రణే తత్ర శారదీవ యథానిశా,
అఙ్గదస్య చ వేగేన త ద్రాక్షసబలం మహత్. ౩౨
ప్రాకమ్పత తదా తత్ర పవనే నామ్బుదో యథా,

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే త్రిపఞ్చాశస్సర్గః. ౫౩.

---

## చతుఃపఞ్చాశస్సర్గః.

బలస్య చ నిఘాతేన అఙ్గదస్య జయేన చ,
రాక్షసః క్రోధమావిష్టో వజ్రదంష్ట్రో మహాబలః. ౧
స విస్ఫార్య ధను ర్ఘోరం శక్రాశనిసమస్వనమ్,
వానరాణా మనీకాని ప్రాకిర చ్ఛరవృష్టిభిః. ౨

రాక్షసా శ్చాపి ముఖ్యా స్తే రథేషు సమవస్థితాః,
నానాప్రహరణా శ్శూరాః ప్రాయుధ్యన్త తదా రణే. ౩
వానరాణాం తు శూరా యే సర్వే తే ప్లవగర్షభాః,
అయుధ్యన్త శిలాహస్తా స్సమవేతా స్సమన్తతః. ౪
తత్రాయుధసహస్రాణి తస్మి న్నాయోధనే భృశమ్,
రాక్షసాః కపిముఖ్యేషు పాతయాంచక్రిరే తదా. ౫
వానరా శ్చాపి రక్షస్సు గిరీ న్వృక్షా న్మహాశిలాః,
ప్రవీరాః పాతయామాసు ర్మత్తమాతఙ్గసన్నిభాః. ౬

ఒకవేటునం దలలుపగిలి ఛిన్నమూలంబులగు వృక్షంబులవలెనె నేలంగూలిరి.

అప్పుడు ఆయుద్ధభూమి విఱిగినరథములచేతను ధ్వజంబులచేతను జచ్చి పడినగుఱ్ఱంబులచేతను వానరరాక్షసులకళేబరములచేతను రక్తప్రవాహముల చేతను నాచ్ఛాదితమయి భయంకరంబై యుండినది. ౩౦

అప్పుడు యుద్ధంబున హారకేయూరాది నానావిధభూషణంబులచేతను వస్త్రంబులచేతను శాస్త్రంబులచేతను అలంకరింపఁబడినయుద్ధభూమి నక్షత్ర చంద్రాలంకృతంబగు శరద్రాత్రివలెఁ బ్రకాశించినది. ౩౧

అప్పు డచ్చట ఆరాక్షససేన అంగదుని వేగంబునకు సహింపంజాలక వాయువేగంబున మేఘముంబోలెఁ జలనంబునొందినది. ౩౨

ఇది యేఁబదిమూఁడవ సర్గము.

## ఏఁబదినాలుగవసర్గము

అంత దనసైన్యము పరాజయమునొందుటయు నంగదుఁడు జయించు టయుంజూచి మహాబలశాలియగు వజ్రదంష్ట్రుఁడు కోపంబునొందెను. ౧

ఆవజ్రదంష్ట్రుఁడు భయంకరంబును వజ్రాయుధసమానంబునగు ధనుస్సును మహాధ్వనిగదుర సారించుచు వానరసైన్యంబులపై బాణవర్షంబులు గురిపించెను. ౨

అప్పుడు శూరులగు నాముఖ్యరాక్షసులును రథారూఢులయి నానా విధాయుధంబులం జక్కఁగా యుద్ధముగావించిరి. ౩

వానరులలో శూరులగు వారలందఱును గొప్పగొప్పశిలలను చేతులం బూని నలుప్రక్కలం జేరి చక్కఁగా యుద్ధముగావించిరి. ౪

అప్పు డమ్మహాయుద్ధంబునందు రాక్షసులు వానరవీరులపైఁ బెక్కువేల యాయుధంబుల నేసిరి. ౫

మహాపరాక్రమశాలులును మదపుటేనుఁగులఁబోలినవారలునగు వానరులు పర్వతంబులను వృక్షంబులను మహాశిలలను రాక్షసులపై నేసిరి. ౬

శూరాణాం యుధ్యమానానాం సమరే ష్వనివర్తినామ్,
తద్రాక్షసగణానాం చ సుయుద్ధం సమవర్తత. ౭
ప్రభిన్నశిరసః కేచి చ్ఛిన్నైః పాదైశ్చ బాహుభిః,
శస్త్రై రర్దితదేహాశ్చ రుధిరేణ సముక్షితాః. ౮
హరయో రాక్షసా శ్చైవ శేరతే గాం సమాశ్రితాః,
కఙ్కగృధ్రవడై రాఢ్యా గోమాయుగణసంకులాః. ౯
కబన్ధాని సముత్పేతు ర్భీరూణాం భీషణానివై,
భుజపాణిశిరశ్ఛిన్నా శ్ఛిన్నకాయాశ్చ భూతలే. ౧౦
వానరా రాక్షసా శ్చాపి నిపేతు స్తత్ర వై రణే,
తతో వానరసైన్యేన హన్యమానం నిశాచరమ్. ౧౧
ప్రాభజ్యత బలం సర్వం వజ్రదంష్ట్రస్య పశ్యతః,
రాక్షసా న్భయవిత్రస్తా న్హన్యమానాన్ ప్లవఙ్గమైః. ౧౨
దృష్ట్వా స రోషతామ్రాక్షో వజ్రదంష్ట్రః ప్రతాపవాన్,
ప్రవివేశ ధనుష్పాణి స్త్రాసయ న్హరివాహినీమ్. ౧౩
శరై ర్విదారయామాస కఙ్కపత్రై రజిహ్మగైః,
బిభేద వానరాం స్తత్ర సప్తాష్టౌ నవ పఞ్చ చ. ౧౪
వివ్యాధ పరమక్రుద్ధో వజ్రదంష్ట్రః ప్రతాపవాన్,
త్రస్తా స్సర్వే హరిగణా శ్శరై స్సంకృత్తకన్ధరాః. ౧౫
అఙ్గదం సంప్రధావన్తి ప్రజాపతి మివ ప్రజాః,

శూరులును యుద్ధంబులందు వెనుదీయక పోరువారలునగు నావానరుల
కును రాక్షసులకును మహాయుద్ధంబు జరగినది. ౭

కొందఱు వానరులును రాక్షసులును దలలుపగిలి చేతులుఁగాళ్లువిఱిగి
దేహములందుఁ గ్రుచ్చుకొనియున్న యాయుధములతోఁ గూడినవారలయి
నెత్తుటందోఁగుచు గంకపక్షులు గద్దలుఁ గాకులును మూసరుకొన నక్కలు
గుంపులుగుంపులుగాఁ జుట్టుకొన భూమిం బడియుండిరి. ౮, ౯

పిఱికివారల శిరస్సులు ఖండింపఁబడి వారిమొండెములు ఆకాశంబున
కెగసి నేలఁబడినవి.

అప్పుడు యుద్ధంబునందు వానరులును రాక్షసులును చేతులును అఱ
చేతులును తలలును దెగియుం దేహము నంతంతట గాయములయ్యు నేలం
బడిరి. ౧౦

అంత నారాక్షససేనయంతయుం వానరసేనచే నానావిధంబుల వధింపఁ
బడి వజ్రదంష్ట్రుఁడు చూచుచుండఁగానే భగ్నమయి పరుగెత్తినది. ౧౧

మహాపరాక్రమశాలియగు నావజ్రదంష్ట్రుఁడు రాక్షసులందఱు వాన
రులచే వధింపఁబడుచు భయపడియుండుటనుజూచి కోపంబునఁ గనుఁగొనల
నిప్పుఁదనంబుగదుర ధనుర్ధరుఁడై వానరులందఱు భయపడ వానరసేనం బ్రవే
శించెను. ౧౨, ౧౩

ఆవజ్రదంష్ట్రుఁడు కంకపక్షిఱెక్కలుగలవియుం లక్ష్యంబుదప్పనివియుం
నగు బాణంబులచే వానరుల భేదించెను.

పరాక్రమవంతుఁడగు వావజ్రదంష్ట్రుఁడు అప్పుడొక్కొకబాణంబున
వానరుల నేడ్వుర నెనిమిదిమందిని దొమ్మిదిమందిని నైదుగురను గూలసేయుచు
నిట్లు విచిత్రప్రకారంబున వానరుల నొప్పించెను. ౧౪

అట్లు వానరులు పెక్కండ్రు ఛిన్నకంఠులయి నేలంబడుచు నంతట
దక్కినవానరులందఱు భయపడి ప్రజలు ప్రజాపతి నాశ్రయించునట్లు అంగదు
నాశ్రయించిరి.

తతో హరిగణాన్భగ్నాన్దృష్ట్వా వాలిసుత స్తదా. ౧౬
క్రోధేన వజ్రదంష్ట్రం త ముదీక్షన్త ముద్వైక్షత,

వజ్రదంష్ట్రోఽఙ్గద శ్చోభౌ సఙ్గతౌ హరిరాక్షసౌ. ౧౭
చేరతుః పరమక్రుద్ధౌ హరిమత్తగజా వివ,

తత శ్శరసహస్రేణ వాలిపుత్రం మహాబలః. ౧౮
జఘాన మర్మదేశేషు మాతఙ్గ మివ తోమరైః,

రుధిరోక్షితసర్వాఙ్గో వాలిసూను ర్మహాబలః. ౧౯
చిక్షేప వజ్రదంష్ట్రాయ వృక్షం భీమపరాక్రమః,
దృష్ట్వా పతన్తం తం వృక్ష మసంభ్రాన్తశ్చ రాక్షసః. ౨౦
చిచ్ఛేద బహుధా సోఽపి నికృత్తః పతితో భువి,

తం దృష్ట్వా వజ్రదంష్ట్రస్య విక్రమం ప్లవగర్షభః. ౨౧
ప్రగృహ్య విపులం శైలం చిక్షేప చ ననాద చ,

సమాపతన్తం తం దృష్ట్వా రథా దాప్లుత్య వీర్యవాన్. ౨౨
గదాపాణి రసంభ్రాన్తః పృథివ్యాం సమతిష్ఠత,
సాఙ్గదేన గదా క్షిప్తా గత్వా తు రణమూర్ధని. ౨౩

సచక్రకూబరం సాశ్వం ప్రమమాథ రథం తదా,

తతోఽన్యం గిరిమాక్షిప్య విపులం ద్రుమభూషితమ్. ౨౪
వజ్రదంష్ట్రస్య శిరసి పాతయామాస సోఽఙ్గదః,

అంత నప్పుడు వాలికుమారుఁడగు నంగదుఁడు వానరసేనలు భయంబునం బాఱుటనుజూచి కోపంబునొంది తనపైకి వచ్చుచున్న వజ్రదంష్ట్రు నెదుర్కొనెను. ౧౬

అంగదుఁడును వజ్రదంష్ట్రుఁడును ఒండొరులంగలసి పరమక్రుద్ధులయి సింహంబులు మదపుటేనుఁగునుంబోలె యుద్ధంబు సేయుచు విహరించిరి. ౧౭

అంత మహాబలశాలియగు వజ్రదంష్ట్రుఁడు ఏనుఁగును జిల్లకోలలతోఁ బొడుచునట్లు వాలికుమారుఁడగు నంగదుని జీవస్థానంబులందు వేయిబాణంబుల నొప్పించెను. ౧౮

మహాబలశాలియుం భయంకరపరాక్రముఁడునగు నంగదుఁడు దేహమంతయు నెత్తురుగాఁ గోపించి వజ్రదంష్ట్రునిపై నొక్క మహావృక్షము వేసెను.

ఆ వజ్రదంష్ట్రుఁడు తనపైకి వృక్షమువచ్చుటంజూచి సంభ్రమంబు నొందక యావృక్షమును బెక్కువ్రయ్యలుగా బాణంబులచే ఖండించెను. అంత నావృక్షము తునియలయి నేలంబడెను. ౨౦

వానరశ్రేష్ఠుఁడగు నంగదుఁడు వజ్రదంష్ట్రుని పరాక్రమంబుఁజూచి యొక్క విశాలపర్వతంబుఁ గొని యారాక్షసునిపై వైచి సింహనాదంబు గావించెను. ౨౧

మహాపరాక్రమశాలియగు నావజ్రదంష్ట్రుఁడు పర్వతమువచ్చుటం జూచి గదచేతంగొని నిర్భయంబుగా రథంబుననుండి నేలకు లంఘించెను. ౨౨

అంగదుఁడు యుద్ధాగ్రంబున వజ్రదంష్ట్రునియొద్దకుఁబోయి యాగద నపహరించెను. ౨౩

అంత నాయంగదుఁడు ప్రయోగించినపర్వతము చక్రములతోను నొగతోను గుఱ్ఱంబులతోనుంగూడ నావజ్రదంష్ట్రురథము నుగ్గు గావించెను.

అంత నాయంగదుఁడు విశాలంబును వృక్షంబులతో నొప్పుచున్నదియునగు మఱియొక పర్వతంబెత్తి వజ్రదంష్ట్రుని తలపై వైచెను. ౨౪

అభవచ్ఛోణితోద్గారీ వజ్రదంష్ట్ర స్స మూర్ఛితః. ౨౫
ముహూర్త మభవ న్మూఢో గదామాలిఙ్గ్య నిశ్వసన్,
స లబ్ధసంజ్ఞో గదయా వాలిపుత్ర మవస్థితమ్. ౨౬
జఘాన పరమక్రుద్ధో వక్షోదేశే నిశాచరః,
గదాం త్యక్త్వా తత స్తత్ర ముష్టియుద్ధ మవర్తత. ౨౭
అన్యోన్యం జఘ్నతు స్తత్ర తా వుభౌ హరిరాక్షసౌ,
రుధిరోద్గారిణౌ తౌ తు ప్రహారై ర్జనితశ్రమౌ. ౨౮
బభూవతు స్సువిక్రాన్తా వఙ్గారకబుధావివ,
తతః పరమతేజస్వీ అఙ్గదః కపికుఞ్జరః. ౨౯
ఉత్పాట్య వృక్షం స్థితవాన్ బహుపుష్పఫలాఞ్చితమ్,
జగ్రాహ చార్షభం చర్మ ఖడ్గం చ విపులం శుభమ్. ౩౦
కిఙ్కిణీజాలసంఛన్నం చర్మణాచ పరిష్కృతమ్,
విచిత్రాంశ్చేరతు ర్మార్గాన్ రుషితౌ కపిరాక్షసౌ. ౩౧
జఘ్నతుశ్చ తదాఽన్యోన్యం నిర్దయం జయకాఙ్క్షిణౌ,
వ్రణై స్సాస్రై రశోభేతాం పుష్పితావివ కింశుకౌ. ౩౨
యుధ్యమానౌ పరిశ్రాన్తౌ జానుభ్యా మవనీం గతౌ,

ఆవజ్రదంష్ట్రుఁడు నెత్తురు గ్రక్కుచు మూర్ఛితుఁడై నిట్టూర్పులు పుచ్చుచు గద చేతం గవుఁగిలించుకొని కొంతసేపు సంజ్ఞ లేక పడియుండెను. ౨౪

ఆవజ్రదంష్ట్రుఁడు మూర్ఛదేఱి పరమకుపితుండై యచ్చట నిలిచి యున్న వాలికుమారుఁడగు నంగదుని ఱొమ్మున గదచేఁ బ్రహారించెను. ౨౫

అంద నప్పుడు వజ్రదంష్ట్రుఁడు గదపాఱవైచి యంగదునితో ముష్టి యుద్ధంబు గావించెను. ౨౬

ఆ యంగద వజ్రదంష్ట్రు లిద్దఱును ఒండొరులం జక్కఁగాఁ బ్రహరించుకొనిరి.

ఆ యంగదుఁడును వజ్రదంష్ట్రుఁడును ఒకరి నొకరు గొట్టుకొనుచు దెబ్బలచే నెత్తురుగార్చుచు నాయాసంబునొంది యంగారకబుధులంబోలె బద్ధవైరంబునం బోరుచుండిరి. ౨౮

అంతఁ బరమపరాక్రమశాలియు వానరశ్రేష్ఠుఁడునగు నంగదుఁడు పెక్కుపూలతోను ఫలములతోనుం గూడినవృక్షము నొకటిఁ బెఱికి యుద్ధంబునకు నిలిచెను. అట్లు వజ్రదంష్ట్రుఁడును వృక్షంబుఁ బెఱికి నిలిచెను. ౨౯

ఆ యంగదుఁ డంత వృషభచర్మము గప్పిన డాలును విశాలంబును జేఱుగంటలతో నొప్పుచున్నదియు మంచియొరగలదియునగు ఖడ్గంబును గ్రహింప నావజ్రదంష్ట్రుఁడును డాలును వాలును గ్రహించెను. ౩౦

ఆ యంగదవజ్రదంష్ట్రులు పరమకుపితులయి పరస్పరజయంబుఁ గోరి నానావిధమార్గంబుల యుద్ధంబు గావింపుచుఁ గఠినంబుగా నొండొరులం బ్రహరించుకొనిరి. ౩౧

ఆ యంగదవజ్రదంష్ట్రులు నెత్తురుగాఱుచుండు గాయంబులతోఁ గూడినవారలగుటచేఁ జక్కఁగాఁ బుష్పించిన మోదుగువృక్షంబులుంబోలెఁ బ్రకాశింపుచుండిరి. ౩౨

ఆ యంగదవజ్రదంష్ట్రులు అట్లు యుద్ధముసేయుచు నలసి ముట్టికాలు వేసికొని కూర్చుండిరి.

నిమేషాన్తరమాత్రేణ అఙ్గదః కపికుఞ్జరః. ౩౩
ఉదతిష్ఠత దీప్తాక్షో దణ్డాహత ఇవోరగః,
నిర్మలేన సుధౌతేన ఖడ్గేనాస్య మహచ్ఛిరః. ౩౪
జఘాన వజ్రదంష్ట్రస్య వాలిసూనుర్మహాబలః,
రుధిరోక్షితగాత్రస్య బభూవ పతితం ద్విధా. ౩౫
స రోషపరివృత్తాక్షం శుభం ఖడ్గహతం శిరః,

వజ్రదంష్ట్రం హతం దృష్ట్వా రాక్షసా భయమోహితాః. ౩౬
త్రస్తాః ప్రత్యపతన్లఙ్కాం వధ్యమానాః ప్లవఙ్గమైః,
విషణ్ణవదనా దీనా హ్రియా కించిదవాఙ్ముఖాః. ౩౭
నిహత్య తం వజ్రధరప్రభావ
స్స వాలిసూనుః కపిసైన్యమధ్యే,
జగామ హర్షం మహితో మహాబల
స్సహస్రనేత్రస్త్రిదశైరివావృతః. ౩౮

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే చతుఃపఞ్చాశస్సర్గః. ౫౪.

---

## పఞ్చపఞ్చాశస్సర్గః.

వజ్రదంష్ట్రం హతం శ్రుత్వా వాలిపుత్రేణ రావణః,
బలాధ్యక్ష మువాచేదం కృతాఞ్జలి మవస్థితమ్. ౧

శీఘ్రం నిర్యాన్తు దుర్ధర్షా రాక్షసా భీమవిక్రమాః,
అకమ్పనం పురస్కృత్య సర్వశస్త్రప్రకోవిదమ్. ౨

ఏష శాస్తా చ గోప్తా చ నేతా చ యుధి సమ్మతః,
భూతికామశ్చ మే నిత్యం నిత్యం చ సమరప్రియః. ౩

వానరశ్రేష్ఠుఁడగు నంగదుఁడు కోపంబునఁ గన్నులు వెలుంగ కొయ్యతో గొట్టఁబడిన సర్పమువలె ఱెప్పపాటంతలో లేచెను. 33

మహాబలుఁడగు వాలిపుత్త్రుఁ డంగదుఁడు చక్కఁగా సానఁబెట్టఁబడినదియుం స్వచ్ఛంబునగు ఖడ్గంబున నావజ్రదంష్ట్రునిశిరస్సును ఖండించెను. 3౪

దేహమంతయు నెత్తురుగాఱుచున్న యావజ్రదంష్ట్రుని శిరస్సు కోపంబునఁ గన్నులుతిరుగుడువడ నంగదునిఖడ్గంబుచే ఛిన్నంబై రెండుగా నేలఁ బడినది. 3౫

అట్లు వజ్రదంష్ట్రుఁడు హతుఁడగుటను జూచి రాక్షసులు భయమోహితులయి దుఃఖితులయి దీనులయి సిగ్గుచే మొగంబువంచుకొని వానరు లంతకంతకుం దఱిమికొట్ట భయపడి మరల లంకకుం బరుగెత్తిరి. 3౬,

దేవేంద్రుని ప్రభావమువంటి ప్రభావముగల మహాబలుఁడగు నాయకుఁడు ఆవజ్రదంష్ట్రుని వధించి వానరులచేఁ బూజితుఁడై వానరసైన్యమధ్యంబున దేవతలనడుమ దేవేంద్రుఁడుంబోలెఁ బరమసంతోషంబు నొంది యుండెను. 3౮

ఇది యేఁబదినాలుగవసర్గము.

---

## ఏఁబదియైదవసర్గము.

రావణుఁడు అంగదునిచే వజ్రదంష్ట్రుఁడు వధింపఁబడుటను విని తన ప్రోలఁ జేతులు మొగుడ్చుకొని నిలిచియున్న సేనాధ్యక్షుంజూచి యిట్లని చెప్పెను. ౧

ఎదిరింప నలవిగాని వారలును భయంకరపరాక్రమశాలులునగు రాక్షసులు సమస్తాస్త్రంబులందును బండితుఁడగు నీయకంపనుని మున్నిడుకొని శీఘ్రంబుగా యుద్ధంబునకుఁ బోవునట్లు గావింపుము. ౨

ఈయకంపనుఁడు యుద్ధంబున శత్రువుల వధించువాఁడు. తన సేనను రక్షించువాఁడు. గట్టిసేనానాయకుఁడు. మఱియు నెప్పుడును నామేలుగోరు

ఏష జేష్యతి కాకుత్ స్థౌ సుగ్రీవం చ మహాబలమ్,
వానరాంశ్చాపరా న్ఘోరాన్హనిష్యతి పరన్తపః. ౪

పరిగృహ్య సతామాజ్ఞాం రావణస్య మహాబలః,
బలం సన్త్వరయామాస తదా లఘుపరాక్రమః. ౫
తతో నానాప్రహరణా భీమాక్షా భీమదర్శనాః,
నిష్పేతూరక్షసాం ముఖ్యా బలాధ్యక్షప్రచోదితాః. ౬

రథ మాస్థాయ విపులం తప్తకాఞ్చనకుణ్డలః,
మేఘాభో మేఘవర్ణశ్చ మేఘస్వనమహాస్వనః. ౭
రాక్షసై స్సంవృతో భీమై స్తదా నిర్యాత్యకమ్పనః,

నహి కమ్పయితుం శక్య స్సురై రపి మహామృధే. ౮
అకమ్పన స్తత స్తేషా మాదిత్య ఇవ తేజసా,

తస్య నిర్ధావమానస్య సంరబ్ధస్య యుయుత్సయా. ౯
అకస్మా ద్దైన్య మాగచ్ఛ ద్ధయానాం రథవాహినామ్,
వ్యస్ఫురన్నయనం చాస్య సవ్యం యుద్ధాభినన్దినః. ౧౦
వివర్ణో ముఖవర్ణశ్చ గద్గదశ్చాభవత్స్వనః,
అభవత్సుదినే చాపి దుర్దినం రూక్షమారుతమ్. ౧౧

ఊచుః ఖగా మృగా స్సర్వే వాచః క్రూరా భయావహాః,
స సింహోపచితస్కన్ధః శార్దూలసమవిక్రమః. ౧౨

చుండును. యుద్ధప్రియుఁడు. ౩

శత్రువుల దపింపఁజేయునట్టి యీయకంపనుఁడు రామలక్ష్మణులను మహాబలశాలియగు సుగ్రీవుని జయించి భయంకరాకారులగు నితరవానరులనుం గూడ వధింపఁగలఁడు. అనిరావణుఁడు సేనాధ్యక్షునకుఁ జెప్పెను. ౪

మహాబలశాలియుం శీఘ్రపరాక్రముఁడునగు నాసేనాధ్యక్షుఁడు రావణునియాజ్ఞను శిరసావహించి యీప్రకారంబున సేనను సిద్ధము గావించెను.

అంత నానావిధాయుధధారులును భయంకరంబులగు కన్నులుగలవారలును జూపరులకు భయంబుగలిగించువారలునగు రాక్షసోత్తములు సేనాధ్యక్షప్రేరితులయి యుద్ధంబునకు వెడలిరి.

అంత మంచిబంగారుపోఁగులు ధరించినవాఁడును మేఘాకారుఁడును మేఘవర్ణుఁడును మేఘగర్జనముంవంటి మహాధ్వనిగలవాఁడునగు నకంపనుఁడు విశాలంబగు రథంబు నారోహించి భయంకరాకారులగు రాక్షసులచేఁ బరివేష్టింపఁబడినవాఁడై యుద్ధంబునకు వెడలెను. ౭

మహాయుద్ధంబున దేవతలకుఁగూడఁ గదలింపరానివాఁడు కావున నకంపనుఁడని యతనికిఁ బేరువచ్చినది. అతఁడు ఆరాక్షసులనడుమ సూర్యుఁడు వలె వెలుఁగుచుండెను. ౮

అకంపనుఁ డట్లు యుద్ధంబుసేయఁగోరి వేగంబునఁ బోవుచుండఁగా నతని రథంబునకుఁ గట్టినగుఱ్ఱంబులకు అకస్మికంబుగా దైన్యముగలిగినది. ౯

యుద్ధోత్సాహంబుగల యాయకంపనుని యెడమకన్ను దరిసెనది. ముఖము తెల్లఁబాఱినది. కంఠధ్వనియుం దగ్గుత్తిక నొందినది. ౧౦

అంతకు మున్ను స్వచ్ఛముగా నున్నదిగ లప్పుడు పెద్దగాలి గలిగి మేఘావృతమయినది. ౧౧

మృగపక్షులన్నియుఁ గ్రూరముగాను భయంకరంబుగాను గూసినవి.

సింహమునకుంబోలె నున్నతములగు మూపులుగలవాఁడును బెద్దపులి

తానుత్పాతానచిన్త్యైవ నిర్జగామ రణాజిరమ్,

తదా నిర్గచ్ఛత స్తస్య రక్షసస్సహ రాక్షసైః. ౧౩
బభూవ సుమహాన్నాదః క్షోభయన్నివ సాగరమ్,

తేన శబ్దేన విత్రస్తా వానరాణాం మహాచమూః. ౧౪
ద్రుమశైలప్రహరణా యోద్ధుం సమవతిష్ఠత,
తేషాం యుద్ధం మహారౌద్రం సంజజ్ఞే హరిరక్షసామ్. ౧౫
రామరావణయోరర్థే సమభిత్యక్తజీవినామ్,

సర్వే హ్యతిబలాః శూరా స్సర్వే పర్వతసన్నిభాః. ౧౬
హరయో రాక్షసాశ్చైవ పరస్పరజిఘాంసవః,
తేషాం వినర్దతాం శబ్దస్సంయుగేఽతితరస్వినామ్. ౧౭
శుశ్రువే సుమహాన్క్రోధా దన్యోన్యమభిగర్జతామ్,

రజశ్చారుణవర్ణాభం సుభీమమభవద్భృశమ్. ౧౮
ఉద్ధూతం హరిరక్షోభిస్సంరురోధ దిశో దశ,
అన్యోన్యం రజసా తేన కౌశేయోద్ధూతపాణ్డునా. ౧౯
సంవృతాని చ భూతాని దదృశుర్న రణాజిరే,

న ధ్వజా న పతాకా వా వర్మ వా తురగోఽపి వా. ౨౦
ఆయుధం స్యన్దనం వాపి దదృశే తేన రేణునా,

శబ్దశ్చ సుమహాం స్తేషాం నర్దతా మభిధావతామ్. ౨౧
శ్రూయతే తుములే యుద్ధే న రూపాణి చకాశిరే,

వంటిపరాక్రమంబుగలవాఁడునగు నాయకంపనుఁడు ఆమహోత్పాత బుల సరకుసేయక యుద్ధభూమికిఁబోయెను. ౧౨

ఆ యకంపనుఁడు రాక్షసులతోఁగూడ నట్లు యుద్ధంబునకు వెడలు చుండఁగా వారలధ్వని సముద్రంబంతయుఁ గలంగునట్లు దిక్కులునిండి చెలంగినది. ౧౩

వానరసేన ఆ మహాధ్వనికి భయపడి వృక్షంబులను బర్వతంబులను ఆయుధంబులుగాఁ గొని యుద్ధముసేయ నిలిచి యుండినది. ౧౪

రాముని నిమిత్తమయి ప్రాణంబులనైనను విడువ నిశ్చయించుకొన్న వానరులకును రావణుని నిమిత్తమయి ప్రాణంబులనైనను విడువనిశ్చయించు కొన్న రాక్షసులకును మహాభయంకరంబగు యుద్ధము జరిగినది. ౧౫

మహాబలశాలులును బర్వతాకారులునగు నావానరరాక్షసు లిరుగెలం కులవారును బండొరుల వధింపఁగోరి చక్కఁగా యుద్ధంబు గావించిరి. ౧౬

మహాబలశాలులగు నావానరరాక్షసులు యుద్ధంబున సింహనాదం బులు సేయుచు నొండొరులపైఁ గోపంబున గర్జించుచుండఁగా నమ్మహాధ్వని దిక్కులునిండి చెలగెనది. ౧౭

పరాగము భూస్వభావంబున రక్తవర్ణమయి మహాభయంకరముగాఁ గనఁపట్టుచు నవ్వానరరాక్షసుల త్రొక్కుడువలన రేఁగి దశదిశలనుం గప్పినది. చక్కఁగా విదిలింపఁబడిన తెల్లపట్టువలెఁ దెల్లనైన పరాగముచేఁ గప్పఁ బడియుండుటంజేసి యాయుద్ధభూమియందు అర్థ్యోపదార్థంబులంగాని యొం డొరులంగాని వానరరాక్షసులు కనుంగొనఁజాలరైరి. ౧౯

ఆయుద్ధంబున నట్టు దుమ్ముకప్పుటచే ఁట్టిధ్వజంబులుగాని చిహ్నంబులు వ్రాసిన ధ్వజంబులుగాని కవచములుగాని ఖడ్గములుగాని యాయుధములుగాని రథములుగాని యెంతమాత్రము గానఁబడవయ్యె. ౨౦

ఆ తుములయుద్ధంబున సింహనాదంబులు సేయుచు నొండొరులపై కదరుచున్న యావానరరాక్షసుల ధ్వనిమాత్రము వినవచ్చుచుండినది; వారి

హరీనేవ సుసంక్రుద్ధా హరయో జఘ్ను రాహవే. ౨౨
రాక్షసాశ్చాపి రక్షాంసి నిజఘ్ను స్తిమిరే తదా,

పరాం శ్చైవ వినిఘ్న న్త స్స్వాంశ్చ వానరరాక్షసాః. ౨౩
రుధిరార్ద్రాం తథా చక్రు ర్మహీం పఙ్కానులేపనామ్,

తతస్తు రుధిరౌఘేణ సిక్తం వ్యపగతం రజః. ౨౪
శరీరశవసంకీర్ణా బభూవ చ వసున్ధరా,
ద్రుమశక్తిశిలాప్రాసై ర్గదాపరిఘతోమరైః. ౨౫
హరయో రాక్షసా శ్చైవ జఘ్నురన్యోన్యమోజసా,

బాహుభిః పరిఘాకారై ర్యుధ్యన్తః పర్వతోపమాః. ౨౬
హరయో భీమకర్మాణో రాక్షసా ఞ్జఘ్ను రాహవే,

రాక్షసా స్త్వపి సంక్రుద్ధాః ప్రాసతోమరపాణయః. ౨౭
కపీ న్నిజఘ్నిరే తత్ర శ స్త్రైః పరమదారుణైః,
అకమ్పన స్సుసంక్రుద్ధో రాక్షసానాం చమూపతిః. ౨౮
సంహర్షయతి తాన్ సర్వా న్రాక్షసాన్భీమవిక్రమాన్,
హరయ స్త్వపి రక్షాంసి మహాద్రుమమహాశ్మభిః. ౨౯
విదారయ న్త్యభిక్రమ్య శస్త్రాణ్యాచ్ఛిద్య వీర్యతః,

ఏతస్మిన్న న్తరే వీరా హరయః కుముదో నళః. ౩౦
మైన్దశ్చ ద్వివిదః క్రుద్ధాశ్చక్రు ర్వేగమను త్తమమ్,
తే తు వృక్షై ర్మహావేగా రాక్షసానాం చమూముఖే. ౩౧

రూపములుమాత్రముగనుపడవయ్యె. ౨౧

అప్పుడు చీకటియందు వానరులు తమవారల నెదిరివారలం దెలియక పరమకుపితులయి వానరులనే ప్రహరించిరి. అట్లు రాక్షసులు రాక్షసులచే కొట్టుకొనిరి.

అప్పుడు ఆవానరరాక్షసులు చీకటియగుటచే నొకరినొకరు దెలియక శత్రువులను దమవారినింగూడ వధించుకొనుచు యుద్ధమునందు భూమినంతయుం నెత్తురుచే బురదగలదానిఁ గావించిరి. ౨౩

అంత దుమ్మంతయుఁ నెత్తుటం దడియుటచే నణఁగిపోయినది. ౨౪

యుద్ధభూమి యంతయుఁ బీనుఁగులచే నిండినది.

వానరులును రాక్షసులును వృక్షంబులను శక్తులను ఱాళ్లను బ్రాసంబులను గదలను బరిఘంబులను దోమరంబులనుఁ బట్టుకొని పరాక్రమంబున నొండొరులంగలసి యుద్ధంబు గావించిరి. ౨౫

అమ్మహాయుద్ధంబునఁ బర్వతాకారులును భయంకరకర్ములు నగు వానరులు పరిఘంబులవంటిబాహువులతో యుద్ధంబుఁ గావింపుచు రాక్షసుల వధించిరి. ౨౬

అప్పుడు రాక్షసులును బరమకుపితులై ప్రాసంబులుఁ దోమరంబులుఁ జేకొని భయంకరంబులగు నయ్యాయుధంబులచే వానరుల వధించిరి. ౨౭

రాక్షససేనానాయకుఁడగు నకంపనుఁడు పరమకుపితుఁడై భయంకర పరాక్రములగు నారాక్షసుల నందఱు బురికొలుపుచుండెను. ౨౮

వానరులును రాక్షసుల నెదిరించి పరాక్రమబలంబున వారల చేతియాయుధంబుల నొడిసి పెఱికికొని గొప్పవృక్షంబులచేతను గొప్పశిలలచేతను వధించిపుచ్చిరి. ౨౯

ఇంతలోఁ గుముదుఁడును నలుఁడును మైందుఁడును ద్వివిదుఁడును నను నీవారనవీరులు కుపితులై మహావేగంబు గావించిరి. 30

మహావేగులగు నాకుముదనలమైందద్వివిదులు రాక్షససేనాముఖంబునం

కదనం సుమహ చ్చక్రు ర్లీలయా హరియూథపాః,
మమన్థూ రాక్షసాన్ సర్వే వానరా గణశో భృశమ్. ౩౭

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే పఞ్చపఞ్చాశస్సర్గః ౫౫.

---

షట్పఞ్చాశస్సర్గః.

త ద్దృష్ట్వా సుమహ త్కర్మ కృతం వానరసత్తమైః,
క్రోధ మాహారయామాస యుధి తీవ్ర మకమ్పనః. ౧
క్రోధమూర్ఛితరూపస్తు ధూన్వ న్పరమకార్ముకమ్,
దృష్ట్వా తు కర్మ శత్రూణాం సారథిం వాక్య మబ్రవీత్. ౨
త త్రైవ తావ త్త్వరితం రథం ప్రాపయ సారథే!,
య త్రైతే బహవో ఘ్నన్తి సుబహూ న్రాక్షసా న్రణే. ౩
ఏతేఽత్ర బలవన్తో హి భీమకాయాశ్చ వానరాః,
ద్రుమశైలప్రహరణా స్తిష్ఠన్తి ప్రముఖే మమ. ౪

ఏతాన్నిహన్తుమిచ్ఛామి సమరశ్లాఘినో హ్యహమ్,
ఏతైః ప్రమథితం సర్వం దృశ్యతే రాక్షసం బలమ్. ౫

తతః ప్రజవనాశ్వేన రథేన రథినాం వరః,
హరీ నభ్యహన త్క్రోధా చ్ఛరజాలై రకమ్పనః. ౬
న స్థాతుం వానరాశ్శేకుః కింపున ర్యోద్ధు మాహవే,
అకమ్పనశరై ర్భగ్నాస్సర్వే ఏవ విదుద్రువుః. ౭

తా న్మృత్యువశమాపన్నానకమ్పనవశం గతాన్,
సమీక్ష్య హనుమాన్ జ్ఞాతీ నుపతస్థే మహాబలః. ౮
తం మహాప్లవగం దృష్ట్వా సర్వే ప్లవగయూథపాః,

జేరి విలాసంబు మెఱయ వృక్షధరులయి మహాయుద్ధంబు గావించిరి. ౩౧
ఆవానరవీరులు నల్వురును రాక్షసులను గుంపులుగుంపులుగా వధించిరి.

ఇది యేఁబదియైదవసర్గము.

## ఏఁబదియాఱవసర్గము.

అకంపనుఁడు వానరోత్తములగు నాకుముదనలమైందద్వివిదులం యుద్ధంబునఁ బెక్కురాక్షసుల వధించుటనుజూచి మహాకోపంబు నొందెను.

ఆయకంపనుఁడు శత్రువులు గావించిన కార్యమును జూచినంతనే పరమకుపితుఁడై ధనువుసారించుచు సారథింజూచి యిట్లని చెప్పెను. ౨

సారథీ! పెక్కండ్రు వానరులుచేరి మనరాక్షసుల ననేకుల రూపుమాపుచున్నారే ఆస్థలంబునకు శీఘ్రంబుగా రథము దోలుము. ౩

ఇదిగో నాయెదుట మహాబలశాలులును భయంకరాకారులునగు వానరులు వృక్షంబులను బర్వతంబులనుఁ జేకొని యుద్ధంబు గావించుచున్నారు గదా! ౪

యుద్ధంబున మహాసమర్థులని పొగడ్తగాంచిన యవ్వానరుల వధింపఁ గోరియున్నాను; వారలచేతనే యీ రాక్షససైన్యమంతయుఁ జీకాకునొందింపఁ బడియున్నది. అని యకంపనుఁడు సారథికిం జెప్పెను. ౫

అంత రథికశ్రేష్ఠుఁడగు నకంపనుఁడు కుపితుఁడై వేగవంతంబులగు గుఱ్ఱంబులుపూన్చిన రథంబుఁదోలించి బాణవర్షములచే వానరుల నొప్పించెను.

వానరులు యుద్ధంబున నాయకంపనుని యెదుటనిలుచుటకే యశక్తులైరి. ఇఁకఁ బోరఁజాలరైరని చెప్పనేల? వానరులు అతనిబాణములచే భంగము నొంది యందఱునుఁ బరుగెత్తిరి. ౭

మహాబలశాలియగు హనుమంతుఁడు అట్లకంపనుని చేతంజిక్కి మృత్యువు నోటం బడినట్లున్న యావానరులంజూచి యకంపనునిమీఁది కడరెను.

పరాక్రమవంతులగు నావానరయూథపులందఱును యుద్ధంబున హను

సమేత్య సమరే వీరా స్సంహృష్టాః పర్యవారయన్. ౯

అవస్థితం హనూమన్తం తే దృష్ట్వా హరియూథపాః,
బభూవుర్బలవన్తో హి బలవన్తం సమాశ్రితాః. ౧౦
అకమ్పనస్తు శైలాభం హనూమన్త మవస్థితమ్,
మహేన్ద్ర ఇవ ధారాభిః శరై రభివవర్షహ. ౧౧
అచిన్తయిత్వా బాణౌఘాన్ శరీరే పతితాన్ శితాన్,
అకమ్పనవధార్థాయ మనో దధ్రే మహాబలః. ౧౨
స ప్రసహ్య మహాతేజా హనూమా న్మారుతాత్మజః,
అభిదుద్రావ తద్రక్షః కమ్పయ న్నివ మేదినీమ్. ౧౩
తస్యాభినర్దమానస్య దీప్యమానస్య తేజసా,
బభూవ రూపం దుర్ధర్షం దీప్తస్యేవ విభావసోః. ౧౪
ఆత్మాన మప్రహరణం జ్ఞాత్వా క్రోధసమన్వితః,
శైల ముత్పాటయామాస వేగేన హరిపుఙ్గవః. ౧౫
తం గృహీత్వా మహాశైలం పాణినైకేన మారుతిః,
స వినద్య మహానాదం భ్రామయామాస వీర్యవాన్. ౧౬

తత స్త మభిదుద్రావ రాక్షసేన్ద్ర మకమ్పనమ్,
పురా హి నముచిం సఙ్ఖ్యే వజ్రేణేవ పురన్దరః. ౧౭

అకమ్పన స్తు త ద్దృష్ట్వా గిరిశృఙ్గం సముద్యతమ్,
దూరా దేవ మహాబాణై రర్ధచన్ద్రై ర్వ్యదారయత్. ౧౮

తత్పర్వతాగ్ర మాకాశే రక్షోబాణవిదారితమ్,
విశీర్ణం పతితం దృష్ట్వా హనూమా న్క్రోధమూర్ఛితః. ౧౯

మంతుఁడు తమకుఁ దోడ్పడుటంజూచి పరమసంతుష్టులయి యందఱుం జేరి యతనిఁ బరివేష్టించిరి. ౯

బలవంతుఁడగు నావానరవీరులు హనుమంతుఁడువచ్చి నిలుచుటంజూచి బలవంతుఁడగు నాహనుమంతునిప్రాపున నిలిచిరి. ౧౦

అకంపనుఁడు పర్వతాకారుఁడగు హనుమంతునిపై ఇంద్రుఁడు వర్షంబు గురిపించునట్లు బాణంబులఁ గురిపించెను. ౧౧

మహాబలుఁడగు హనుమంతుఁడు తన దేహంబుపైఁ బడిన కఱకు బాణంబుల పరకుసేయక యాయకంపనుని వధింపన లెనని మనంబునఁ దలఁచెను.

మహాతేజుఁడును వాయుదేవుని కుమారుఁడునగు నాహనుమంతుఁడు పాదాఘాతంబున భూమి యదర నాయకంపనునిమీఁది కడరెను. ౧౩

క్రోధావేశంబున సింహనాదంబు సేయుచుఁ దేజంబున వెలుఁగుచున్న యాహనుమంతుఁడు పట్టపగటిసూర్యునికైవడి దుర్ధర్షుఁడై యుండెను.

వానరశ్రేష్ఠుఁడగు హనుమంతుఁడు తనచేత నాయుధము లేకుండుటం దెలిసి పరమకుపితుఁడై వేగంబున నొక మహాపర్వతంబుఁ బెకలించెను. ౧౪

మహాపరాక్రమశాలియు వాయుపుత్రుఁడునగు నాహనుమంతుఁడు అమ్మహాశైలము నొక్కచేతంబట్టుకొని మహాధ్వనిగదుర సింహనాదంబు సేయుచు గిఱగిఱం ద్రిప్పెను. ౧౫

అంత నాహనుమంతుఁడు మున్ను దేవేంద్రుండు వజ్రధరుఁడై నముచిమీఁదికిఁ బోయినట్లు అమ్మహాపర్వతంబు చేతందాల్చి రాక్షసశ్రేష్ఠుఁడగు నాయకంపనునిమీఁదికిఁ బోయెను. ౧౬

అకంపనుఁడు తనమీఁదికిఁ బర్వతశిఖరము నెత్తుకొని వచ్చుటంజూచి దూరంబుననుండియే యర్ధచంద్రాకారబాణంబులచే దానిం దునియలు గావించెను. ౧౭

హనుమంతుఁడు అప్పర్వతశిఖరంబు ఆకాశంబుననే యకంపనుని బాణంబులచే ఖండింపఁబడి తునియలయి నేలంబడుటనుజూచి పరమకుపితుఁ డయ్యెను. ౧౮

సోఽశ్వకర్ణం సమాసాద్య రోషదర్పాన్వితో హరిః,
తూర్ణ ముత్పాటయామాస మహాగిరి మివోచ్ఛ్రితమ్. ౨౦

తం గృహీత్వా మహాస్కన్ధం సోఽశ్వకర్ణం మహాద్యుతిః,
ప్రహస్య పరయా ప్రీత్యా భ్రామయామాస సంయుగే. ౨౧

ప్రధావన్నురువేగేన ప్రభఞ్జం స్తరసా ద్రుమాన్,
హనూమా న్పరమక్రుద్ధ శ్చరణై ర్దారయ త్క్షితిమ్. ౨౨
గజాంశ్చ సగజారోహాన్ సరథా న్రథిన స్తథా,
జఘాన హనుమాన్ ధీమా న్రాక్షసాంశ్చ పదాతిగాన్. ౨౩

త మన్తక మివ క్రుద్ధం సమరే ప్రాణహారిణమ్,
హనూమ న్త మభిప్రేక్ష్య రాక్షసా విప్రదుద్రువుః. ౨౪
త మాపత న్తం సంక్రుద్ధం రాక్షసానాం భయావహమ్,
దదర్శాకమ్పనో వీర శ్చుక్రోధ చ ననాద చ. ౨౫

స చతుర్దశభి ర్బాణై శ్శితై ర్దేహవిదారణైః,
నిర్బిభేద హనూమ న్తం మహావీర్య మకమ్పనః. ౨౬
స తదా ప్రతివిద్ధస్తు బహ్వీభి శ్శరవృష్టిభిః,
హనూమా న్దదృశే వీరః ప్రరూఢ ఇవ సానుమాన్. ౨౭

విరరాజ మహాకాయో మహావీర్యో మహామనాః,
పుష్పితాశోకసఙ్కాశో విధూమఇవ పావకః. ౨౮

తతోఽన్యం వృక్ష ముత్పాట్య కృత్వా వేగ మను త్తమమ్,

ఆ హనుమంతుఁడు కోపగర్వంబులు పెనంగొన మహాపర్వతమువలె నత్యున్నతమయిన యొక్కమద్దిచెట్టుంజూచి దాని శీఘ్రంబుగాఁ బెకలించెను. ౨౦

యుద్ధంబున మహాతేజుఁడగు హనుమంతుఁడు పెద్దకొమ్మలగల యా యశ్వకర్ణవృక్షమును దీసికొని పరమసంతోషంబున నవ్వుచు దాని గిఱగిఱం ద్రిప్పెను. ౨౧

హనుమంతుఁడు ఊరువేగంబున వృక్షంబులు విఱిగిపడఁ బరమ కుపితుఁడై పాదఘాతంబున భూమి పగుల వేగంబునం బోయెను. ౨౨

అప్పుడు బుద్ధిమంతుఁడగు హనుమంతుఁడు ఆ యశ్వకర్ణవృక్షంబుచే నేనుఁగును మావటీలను రథంబులను రథికులను గాలిబంటులను ఇట్లు పెక్కు రాక్షసులఁ జూర్ణము గావించెను. ౨౩

క్రుద్ధుఁడగు యమునికైవడి నత్యుగ్రుఁడై రాక్షసులప్రాణంబులు హరించుచున్న యాహనుమంతుంజూచి రాక్షసులు భయంబునం బాఱిరి. ౨౪

పరాక్రమవంతుఁడగు నకంపనుఁడు హనుమంతుఁడు కుపితుఁడై వచ్చుటయుం రాక్షసులందఱు భయంబునం బాఱుటయుంజూచి కోపంబు నొంది సింహనాదము గావించెను. ౨౫

ఆ యకంపనుఁడు తీక్ష్ణంబులును మర్మభేదకంబులునగు పదునాలుగు బాణంబులచేత మహాపరాక్రమశాలియగు హనుమంతుని నొప్పించెను. ౨౬

మహాపరాక్రమశాలియగు నాహనుమంతుఁడు అప్పుడు పెక్కుమార్లు బాణవర్షములచే నొప్పింపఁబడినవాఁడయ్యు వృక్షంబులతోఁ గూడిన పర్వతంబుకరణి నిశ్చలుఁడై యుండెను. ౨౭

మహాకాయుఁడును మహాపరాక్రమశాలియు మహాధైర్యుఁడునగు నాహనుమంతుఁడు పుష్పించిన యశోకవృక్షమువలె రక్తవర్ణుఁడై పొగలేక మండుచుండు నగ్నిహోత్రముభంగిఁ దేజరిల్లుచుండెను. ౨౮

అంత నాహనుమంతుఁడు మఱియొక వృక్షముఁ బెకలించి మహావేగంబుఁ

శిరస్యభిజఘానాశు రాక్షసేన్ద్ర మకమ్పనమ్. ౨౯
స వృక్షేణ హత స్తేన సక్రోధేన మహాత్మనా,
రాక్షసో వానరేన్ద్రేణ పపాత చ మమార చ. ౩౦
తం దృష్ట్వా నిహతం భూమౌ రాక్షసేన్ద్ర మకమ్పనమ్,
వ్యథితా రాక్షసా స్సర్వే క్షితికమ్ప ఇవ ద్రుమాః. ౩౧

త్యక్తప్రహరణా స్సర్వే రాక్షసా స్తే పరాజితాః,
లఙ్కా మభియయు స్త్రస్తా వానరా స్తై రభిద్రుతాః. ౩౨
తే ముక్తకేశా స్సమ్భ్రాన్తా భగ్నమానాః పరాజితాః,
ప్రవచ్ఛ్రమజలై రఙ్గై శ్శ్వసన్తో విప్రదుద్రువుః. ౩౩

అన్యోన్యం ప్రమమన్థు స్తే వివిశు ర్నగరం భయాత్,
పృష్ఠత స్తే సుసమ్మూఢాః ప్రేక్షమాణా ముహుర్ముహుః. ౩౪

తేషు లఙ్కాం ప్రవిష్టేషు రాక్షసేషు మహాబలాః,
సమేత్య హరయ స్సర్వే హనూమన్త మపూజయన్. ౩౫
సోఽపి ప్రహృష్ట స్తాన్ సర్వా న్హరీన్ ప్రత్యభిపూజయత్,
హనూమాన్ సత్త్వసమ్పన్నో యథార్హ మనుకూలతః. ౩౬

వినేదుశ్చ యథాప్రాణం హరయో జితకాశినః,
చకర్షుశ్చ పున స్తత్ర సప్రాణా నపి రాక్షసాన్. ౩౭

స వీరశోభా మభజ న్మహాకపి
స్సమేత్య రక్షాంసి నిహత్య మారుతిః,

బూని శీఘ్రంబున రాక్షసోత్తముఁడగు నా యకంపనుని శిరస్సునం గొట్టెను.

ఆ యకంపనుఁడు మహాపరాక్రమశాలి యగు నా హనుమంతుని చేఁ బరమకోపంబున వృక్షంబుచే హతుఁడై నేలంబడి మృతినొందెను. 30

రాక్షసులందఱు అట్లు రాక్షసశ్రేష్ఠుఁడగు నకంపనుఁడు నిహతుఁడై నేలంబడుటనుజూచి భూకంపముగలిగినప్పుడు వృక్షములు చలించునట్లు మిక్కిలియు దుఃఖితులయిరి. 31

ఆ రాక్షసులందఱు నట్లు పరాజయమునొంది యావానరులు వెంబడించి తఱుమఁ బరమభీతులయి యాయుధంబులు పాఱవైచి లంకకుఁ బరుగెత్తిరి.

ఆ రాక్షసులు తలవిరియఁబోసికొని సంభ్రాంతులయి మానంబు విడిచి పరాజితులయి దేహమంతయుఁ జెమటగాఱ నూర్పులుపుచ్చుచు నతివేగంబునఁ బరుగెత్తిరి. 33

ఆ రాక్షసులు పరాజయంబుగలుగుటఁజేసి మూఢులయి యొండొరులం గొట్టుకొనుచు భయంబున మాటిమాటికి వెనుకకుఁ దిరిగిచూచుచు లంకాపురిం బ్రవేశించిరి. 34

ఆ రాక్షసు లందఱు లంకకుఁబోయిన పిమ్మట మహాబలశాలులగు వానరు లందఱుం జేరి హనుమంతునిఁ బూజించిరి. 35

బలసంపన్నుఁడగు హనుమంతుఁడు సంతుష్టుఁడై "మీసాహాయ్యంబు నన నాకు జయంబుగలిగినదిగాని వేఱుగాదు" అను మొదలగుమాటలచే నావానరుల నందఱను యథాయోగ్యంబుగా బదులు పూజించెను. 36

జయలక్ష్మీవిరాజమానులగు వానరులు హనుమంతుఁ డకంపనుని వధించిన సంగతి యెల్లరకుం దేటపడఁ దమబలంబుకొలఁది సింహనాదంబులు గావించిరి. ఆ సింహనాదములకు బలవంతు లగురాక్షసు లదరిపడిరి. 37

వాయుదేవుని కుమారుఁడగు నాహనుమంతుఁడు అట్లు రాక్షస సంహారంబుగావించి భయంకరుఁడును శత్రుసంహారకుఁడును మహాబలుఁడు నగు

మహాసురం భీమ మమిత్రనాశనం
యథైవ విష్ణు ర్బలినం చమూముఖే. 3౭
అపూజయ న్దేవగణా స్తదా కపిం
స్వయంచ రామోఽతిబలశ్చ లక్ష్మణః,
తథైవ సుగ్రీవముఖాః ప్లవఙ్గమా
విభీషణశ్చైవ మహాబల స్తథా. 3౮

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే షట్పఞ్చాశస్సర్గః. ౫౬.

---

## సప్తపఞ్చాశస్సర్గః.

అకమ్పనవధం శ్రుత్వా క్రుద్ధో వై రాక్షసేశ్వరః,
కించి ద్దీనముఖ శ్చాపి సచివాం స్తా నుదైక్షత. ౧

స తు ధ్యాత్వా ముహూర్తం తు మన్త్రిభి స్సంవిచార్య చ,
తతస్తు రావణః పూర్వదివసే రాక్షసాధిపః. ౨
పురీం పరియయౌ లఙ్కాం సర్వా గుల్మా నవేక్షితుమ్,
తాం రాక్షసగణై ర్గుప్తాం గుల్మై ర్బహుభి రావృతామ్. 3
దదర్శ నగరీం లఙ్కాం పతాకాధ్వజమాలినీమ్,

రుద్ధాం తు నగరీం దృష్ట్వా రావణో రాక్షసేశ్వరః, ౪
ఉవాచామర్షితః కాలే ప్రహస్తం యుద్ధకోవిదమ్,

పురస్యోపనివిష్టస్య సహసా పీడితస్య వా. ౫
నాన్యం యుద్ధా త్ప్రపశ్యామి మోక్షం యుద్ధవిశారద!,

కైటభాసురుని వధించిన మహావిష్ణువుం బోలె సేనాముఖంబున వీరలక్ష్మివిరాజ మానుండై యెంతయు వెలుంగుచుండెను. ౩౭

అప్పుడు ఆహనుమంతుని ఆకాశంబునం బున్నయున్న దేవతలందఱుం బూజించిరి. అట్లు రాముండును మహాబలశాలియగు లక్ష్మణుండును సుగ్రీవ ప్రభృతులగు వానరవీరులును మహాబలుండగు విభీషణుండును హనుమంతు నెంతయుం గౌరవించిరి. ౩౮

ఇది యేఁబదియాఱవసర్గము.

---

## ఏఁబదియేడవసర్గము.

రాక్షసనాథుండగు రావణుండు అకంపనుఁడు వధింపఁబడిన సంగతిని విని కుపితుండై కొంచెము దైన్యంబునుం బొంది తనయొద్దనున్న మంత్రులం జూచెను. ౧

రాక్షసరాజుండగు రావణుండు కొంచెముసేపు విచారమగ్నుండై యుండి యంత మంత్రులతో నాలోచించి పిమ్మటం బూర్వాహ్ణంబున లేచి సేనా వ్యూహంబులం జూచుటకై లంకయంతయుం దిరిగెను. ౨

ఆరావణుండు రాక్షససమూహంబులచే రక్షింపఁబడుచున్నదియుం బెక్కుసేనావ్యూహములతోఁ గూడినదియుం రాజచిహ్నంబులు వ్రాసిన టెక్కెములతోను వట్టిటెక్కెములతోను ఒప్పుచున్నదియునగు లంకాపురి నంతయుం జూచెను. ౩

రాక్షసరాజుండగు రావణుండు లంకచుట్టును వానరులు ముట్టడించి యుండుటనుజూచి కుపితుండై సభామంటపమునకువచ్చి యుద్ధంబునం బండితుం డగు ప్రహస్తుంజూచి యిట్లని చెప్పెను. ౪

యుద్ధపండితుండవగు ప్రహస్తుండా! శత్రుసైన్యంబులు తటాలున వచ్చి ముట్టడించి పీడింపుచుండుపట్టణమును విడిపించుటకు ఇతరు లెంతయుద్ధము చేసినను ఆగునని నాకుఁ దోఁచదు. ౫

అహం వా కుమ్భకర్ణో వా త్వం వా సేనాపతి ర్మమ. ౬
ఇన్ద్రజిద్వా నికుమ్భో వా వహేయు ర్భార మీదృశమ్,

స త్వం బల మత శ్శీఘ్ర మాదాయ పరిగృహ్యచ. ౭
విజయాయాభినిర్యాహి యత్ర సర్వే వనౌకసః,
నిర్యాణాదేవ తే నూనం చపలా హరివాహినీ. ౮
నర్దతాం రాక్షసేన్ద్రాణాం శ్రుత్వా నాదం ద్రవిష్యతి,
చపలా హ్యవినీతాశ్చ చలచిత్తాశ్చ వానరాః. ౯
న సహిష్యన్తి తే నాదం సింహనాద మివ ద్విపాః,

విద్రుతే చ బలే తస్మి న్రామ స్సౌమిత్రిణా సహ. ౧౦
అవశ స్తే నిరాలమ్బః ప్రహస్త! వశ మేష్యతి,

ఆప త్సంశయితా శ్రేయో నతు నిస్సంశయీ కృతా. ౧౧

ప్రతిలోమానులోమం వా యద్వా నో మన్యసే హితమ్,

రావణే నైవ ముక్తస్తు ప్రహస్తో వాహినీపతిః. ౧౨
రాక్షసేన్ద్ర ముచాచేద మసురేన్ద్ర మివోశనా,

ఇట్టికార్యము నేనుగాని కుంభకర్ణుఁడుగాని నాసేనానాయకుఁడవగు నీవుగాని యింద్రజిత్తుగాని నికుంభుఁడుగాని సాధింపవలెనుగాని యితరులచేతఁ గాదు. ౬

ఇందువలన నట్టిమహాబలసంపన్నుఁడవగునీవు శీఘ్రంబున సేనను వెంటఁ బెట్టుకొని యావానరు లుండుస్థలంబునకుఁబోయి విజయంబునొందుము. ౭

నీవు యుద్ధంబునకు వెడలినంతనే చపలులగు నావానరులందఱు రాక్షసోత్తములు గావించు సింహనాదధ్వనులనువిని భయంబునఁ బాఱఁగలరు. ౮

ఏనుఁగులు సింహగర్జనమును విని సహింపంజాలనట్లు చంచలులును యుద్ధశిక్షల నొందనివారలును జిత్తస్థైర్యము లేనివారలునగు వానరులు నీ కంఠధ్వనిని సహింప జాలరు. ౯

ప్రహస్తుఁడా! అట్లు వానరసేనయంతయుఁ బాఱిపోయినపిమ్మట రాముఁడును లక్ష్మణుఁడును దమమాటవినువార లెవ్వరును లేమిం జేసి నిరాలంబులయి నీచేతం జిక్కుదురు. ౧౦

అయితే "యుద్ధము గావించిన జయమేవచ్చునని నియమము లేదే; మరణంబునుఁ గలుగును; కావున దానిం గావింపకుండుటయే మేలు" అని చెప్పుదువు; మనమిప్పుడు యుద్ధముఁ గావింపకున్నను శత్రువులు మనల వధింపక విడువరు; కావున యుద్ధంబుగావింపకున్న మరణంబుగలుగుట నిశ్చితము; యుద్ధంబుగావించినచో మరణమే గలుగునని నిశ్చయము లేదు; కావున యుద్ధము చేయకుండుటకన్న యుద్ధము సేయుట మంచిది. ౧౧

నే నిప్పుడు చెప్పినదానికి విరుద్ధముగఁగాని యనుకూలముగఁగాని నీ వేమని యభిప్రాయపడుచున్నావో, అది మాకుసమ్మతము; దానిం జెప్పుము. అని రావణుఁడు ప్రహస్తునితోఁ జెప్పెను.

సేనానాయకుఁడగు ప్రహస్తుఁడు రావణుఁడు చెప్పినమాటను విని శుక్రాచార్యుఁడు అసురరాజుతోఁ జెప్పునట్లు రాక్షసరాజుండగు రావణునితో నిట్లని చెప్పెను. ౧౨

రాజ న్మన్త్రితపూర్వం నః కుశలై స్సహ మన్త్రిభిః. ౧౩
వివాద శ్చాపి నో వృత్త స్సమవేక్ష్య పరస్పరమ్,

ప్రదానేన తు సీతాయాః శ్రేయో వ్యవసితం మయా. ౧౪
అప్రదానే పున ర్యుద్ధం దృష్ట మేత త్తథైవ నః,
సోఽహం దానైశ్చ మానైశ్చ సతతం పూజిత స్త్వయా. ౧౫
సాన్త్వైశ్చ వివిధైః కాలే కిం న కుర్యాం ప్రియం తవ,

న హి మే జీవితం రక్ష్యం పుత్రదారధనాని వా. ౧౬
త్వం పశ్య మాం జుహూషన్తం త్వదర్థం జీవితం యుధి,

ఏవముక్త్వా తు భర్తారం రావణం వాహినీపతిః. ౧౭
ఉవాచేదం బలాధ్యక్షా న్ప్రహస్తః పురతః స్థితాన్,

సమానయత మే శీఘ్రం రాక్షసానాం మహద్బలమ్. ౧౮
మద్బాణాశనివేగేన హతానాం చ రణాజిరే,
అద్య తృప్యన్తు మాంసాదాః పక్షిణః కాననౌకసామ్. ౧౯

ఇత్యుక్తా స్తే ప్రహస్తేన బలాధ్యక్షాః కృతత్వరాః,
బల ముద్యోజయామాసు స్తస్మి న్రాక్షసమన్దిరే. ౨౦
సా బభూవ ముహూర్తేన తిగ్మనానావిధాయుధైః,
లఙ్కా రాక్షసవీరై స్తై ర్గజై రివ సమాకులా. ౨౧



లక్ష్మణుఁడు మృతసంజీవినిచే బ్రతికింపబడుట. 436.

తాత్పర్యము.

రాక్షసరాజుండవగు రావణుండా! ఈసంగతి మున్ను సమర్థులగు మంత్రులతోఁగూడ నాలోచించిన విషయమే కదా! దీని గుఱించియే మాకు మతభేదము గలిగి జగడముగూడ నైనది. ౧౩

సీత నిచ్చినచో మేలుగలుగునని నేను నిశ్చయించియే యుంటిని; సీత నివ్వనిచో యుద్ధంబుగలుగునను నీసంగతి మున్ను మాకుఁ దెలిసినదే. ౧౪

నీచేత దానంబులను సమ్మానంబులను సాంత్వవచనంబులను నానా విధంబుల నెల్లప్పుడును బూజితుఁడగు నట్టినేను గాలమువచ్చినప్పుడు నీకుఁ బ్రియంబగుకార్యంబును దేనిఁజేయను? ఏదిగాని గావించెదను. ౧౫

నాకు బ్రాణమును గొడుకులను భార్యలను ధనములను రక్షించుకొన వలసినదిలేదు. నీకార్యము గావించుట యొకటియే నాకుఁ గావలసినది. ఇదిగో నీకొఱకు యుద్ధమునందుఁ బ్రాణమును గూడ విడువఁగోరెదను జూడుము. అని ప్రహస్తుఁడు రావణునితోఁ జెప్పెను. ౧౬

సేనానాయకుఁడగు ప్రహస్తుఁడు రాక్షసరాజుఁడగు రావణునితో నీప్రకారంబునం జెప్పి తనముందటనున్న సేనాధ్యక్షులంజూచి యీమాటం జెప్పెను. ౧౭

అనంతంబగు నారాక్షససేనను శీఘ్రముగాఁ దీసికొనిరండు. ౧౮

ఇప్పుడు మాంసభక్షకంబులగు పక్షులు యుద్ధభూమియందు వజ్రముల వంటి నాబాణములచే వధింపఁబడిన వానరులమాంసములను దనివిదీరం దిని తృప్తిఁబొందఁగలవు. అని ప్రహస్తుఁడు సేనాధ్యక్షులతోఁ జెప్పెను. ౧౯

ఆ సేనాధ్యక్షులు ప్రహస్తుఁడు చెప్పినమాటను విని అతిత్వరగా నా లంకానగరంబున రాక్షససేనలం గూర్చిరి. ౨౦

అంత ముహూర్తమాత్రంబున నాలంకాపురియంతయు మత్తగజాకారులును దీక్ష్ణములగు నానావిధాయుధంబులు ధరించిన వారలునగు రాక్షస వీరులచే నిండినదయ్యె. ౨౧

హుతాశనం తర్పయతాం బ్రాహ్మణాంశ్చ నమస్యతామ్,
ఆజ్యగన్ధప్రతివహ స్సురభి ర్మారుతో వవౌ. ౨౨

స్రజశ్చ వివిధాకారా జగృహు స్త్వభిమన్త్రితాః,
సఙ్గ్రామసజ్జా స్సంహృష్టా ధారయ న్రాక్షసా స్తదా, ౨౩

సధనుష్కాః కవచినో వేగా దాప్లుత్య రాక్షసాః,
రావణం ప్రేక్ష్య రాజానం ప్రహస్తం పర్యవారయన్. ౨౪
అథామన్త్ర్య చ రాజానం భేరీ మాహత్య భైరవామ్,
ఆరురోహ రథం దివ్యం ప్రహస్త స్సజ్జకల్పితమ్. ౨౫
హయై ర్మహాజవై ర్యుక్తం సమ్యక్సూత సుసంయుతమ్,
మహాజలదనిర్ఘోషం సాక్షా చ్చన్ద్రార్కభాస్వరమ్, ౨౬
ఉరగధ్వజదుర్ధర్షం సువరూథం స్వపస్కరమ్,
సువర్ణజాలసంయుక్తం ప్రహస న్త మివ శ్రియా. ౨౭

తత స్తం రథ మాస్థాయ రావణార్పితశాసనః,
లఙ్కాయా నిర్యయౌ తూర్ణం బలేన మహతా వృతః. ౨౮

తతో దున్దుభినిర్ఘోషః పర్జన్యనినదోపమః,
వాదిత్రాణాం చ నినదః పూరయ న్నివ సాగరమ్. ౨౯
శుశ్రువే శఙ్ఖశబ్దశ్చ ప్రయాతే వాహినీపతౌ,
నినద న్త స్స్వరా న్ఘోరా న్రాక్షసా జగ్ము రగ్రతః. ౩౦
భీమరూపా మహాకాయాః ప్రహస్తస్య పురస్సరాః,

అప్పుడు రాక్షసవీరులు అగ్నిహోత్రంబున జయావహంబులగు హోమంబులు సేయుటవలనను బ్రాహ్మణుల గంధపుష్పాక్షతాదులఁ బూజించుట వలనను అచ్చట వాయువు ఆజ్యగంధముతోను పుష్పాదిగంధముతోనుం గూడి మనోహరంబుగా వీచినది. ౨౨

అప్పుడు యుద్ధసన్నద్ధులగు రాక్షసులు సంతుష్టులయి విజయప్రదంబగునటుల నభిమంత్రితంబులగు నానావిధములయిన పుష్పమాలికలం దీసి ధరించిరి. ౨౩

రాక్షసవీరులు ధనుస్సులను గవచంబులను ధరియించి రాక్షసరాజుడగు రావణున కభివందనంబు గావించి ప్రహస్తునిం బరివేష్టించి నిలిచిరి. ౨౪

అంతఁ బ్రహస్తుఁడు రాక్షసరాజుండగు రావణునివీడ్కొని భయంకరాకారంబగు భేరిని వాయింపఁజేసి దివ్యంబును యుద్ధసన్నద్ధంబు గావింపఁబడినదియుం మహావేగంబులగు గుఱ్ఱములు పూన్చినదియుం సమర్థుఁడగు సారథి గలదియుం సుబద్ధసంధిబంధమును మహామేఘగర్జనమువంటి ధ్వనిగలదియుఁ జంద్రసూర్యులుంబోలె వెలుఁగుచుండునదియుం సర్పధ్వజశోభితంబును దుర్ధర్షంబును మంచికప్పుగలదియుఁ జక్కనిచక్రములుగలదియుం బంగారు కిటికిలతోఁ గూడినదియుఁ గాంతిచే నితరపదార్థంబులంజూచి పరిహసించునట్లు చూపట్టుచున్నదియుం నగు మహారథము నారోహించెను. ౨౫ ౨౭

అంత నా ప్రహస్తుఁడు రావణునిచే నాజ్ఞాపింపఁబడినవాఁడై యా రథంబు నారోహించి యనంతరంబగు సైన్యముంగూడి శీఘ్రంబున లంకాపట్టణంబుననుండి వెడలెను. ౨౮

అంతఁ బ్రహస్తుఁడు వెడలునప్పుడు మేఘగర్జనంబుఁబోలు భేరీధ్వనియు నానావిధవాద్యంబులశబ్దమును శంఖధ్వనియు సముద్రంబు నుప్పొంగఁజేయునట్లు దిక్కులునిండి చెలంగినవి. ౨౯

ప్రహస్తపురస్సరులగు భయంకరాకారులును మహాకాయులునైన రాక్షసులు భయంకరధ్వని గలుగునట్లు సింహనాదంబులు సేయుచుఁ బ్రహస్తు ముందటం బోయిరి. ౩౦

నరాన్తకః కుమ్భహనూ ర్మహానాద స్సమున్నతః. ౩౧
ప్రహస్తసచివా హ్యేతే నిర్యయుః పరివార్య తమ్,
వ్యూఢేనైవ సుఘోరేణ పూర్వద్వారా త్స నిర్యయౌ. ౩౨
గజయూథనికాశేన బలేన మహతా వృతః,

సాగరప్రతిమౌఘేన వృత స్తేన బలేన సః. ౩౩
ప్రహస్తో నిర్యయౌ తూర్ణం కాలాన్తకయమోపమః,

తస్య నిర్యాణఘోషేణ రాక్షసానాం చ నర్దతామ్. ౩౪
లఙ్కాయాం సర్వభూతాని వినేదు ర్వికృతైః స్వరైః,

వ్యభ్రమాకాశమావిశ్య మాంసశోణితభోజనాః. ౩౫
మణ్డలా న్యపసవ్యాని ఖగా శ్చక్రూ రథం ప్రతి,
వమ న్త్యగ్ని పావకజ్వాలా శ్శివా ఘోరా వవాశిరే. ౩౬

అన్తరిక్షా త్పపాతోల్కా వాయుశ్చ పరుషో వవౌ,

అన్యోన్య మభిసంరబ్ధా గ్రహాశ్చ న చకాశిరే. ౩౭

మేఘాశ్చ ఖరనిర్ఘోషా రథస్యోపరి రక్షసః,
వవృషూ రుధిరం చాస్య సిషిచుశ్చ పురస్సరాన్. ౩౮
కేతుమూర్ధని గృధ్రోఽస్య నిలీనో దక్షిణాముఖః,
తుదన్నుభయతః పార్శ్వం సమగ్రా మహర త్ప్రభామ్. ౩౯

సారథే ర్బహుశ శ్చాస్య సఙ్గ్రామ మవగాహతః,

నరాంతకుఁడును కుంభహనుఁడును మహానాదుఁడును సమున్నతుఁడును నను నీప్రహస్తునిమంత్రులు నలువురును ప్రహస్తునిం బరివేష్టించి నడచిరి.

ఈప్రహస్తుఁడు వ్యూహములుగాఁ దీర్చఁబడినదియుఁ గజసమూహముతో సమానమయినదియుఁ మహాభయంకరమునగు నమ్మహాసేనం గూడి యుద్ధంబునకు వెడలెను.

ప్రళయకాలమునందు సమస్తప్రపంచమును నశింపఁజేసెడు యమునిం బోలునట్టి యీప్రహస్తుఁడు సముద్రప్రవాహంబునంటి యమ్మహాసేనం గూడి శీఘ్రింబునం బోయెను. ౩౩

ఆప్రహస్తుఁడును రాక్షసులను ప్రయాణకాలంబునఁ గావించిన సింహనాదంబులధ్వనికి లంకయందలి సమస్తజంతువులును భయపడి వికృతస్వరంబుగా నఱచినవి. ౩౪

మాంసరక్తాహారంబులగు పక్షులు మేఘరహితంబగు నాకాశంబునం జేరి రథంబునకుఁ బ్రదక్షిణంబుగాఁ జుట్టినవి. ౩౫

నక్కలు భయంకరాకారంబులయి నోట నగ్నిజ్వాలలు గ్రక్కుచు నఱచినవి. ౩౬

ఆకాశంబుననుండి కొఱవిగట్టియవంటి తేజస్సుపడినది; వాయువు పరుషంబుగా వీచెను.

చంద్రసూర్యాదిగ్రహములును బరస్పరము యుద్ధము సేయుచు నెంతమాత్రము ప్రకాశింపకుండినవి. ౩౭

మేఘములు పరుషముగా గర్జించుచు నాప్రహస్తునిరథంబుమీఁద నతని ముందు నడచువారలు తడియునట్లు నెత్తురువాన గురిసినవి. ౩౮

గద్దయొకటి ప్రహస్తునిధ్వజాగ్రంబు దక్షిణాభిముఖంబై ప్రాలి రెండు రెక్కలును ముక్కుతో గీకుకొనుచు నిలిచెను; దానింజూచి ప్రహస్తుఁడు ముఖకాంతియంతయుంబీడి వివర్ణముఖుఁడయ్యె. ౩౯

పెక్కుమార్లు యుద్ధంబునందు సారథ్యము గావించి తేఱినవాఁడును

ప్రతోదో న్యపత ద్ధస్తాత్సూతస్య హయసాదినః. ౪౦

నిర్యాణశ్రీశ్చ యాఽస్యాసీద్భాస్వరా వసుదుర్లభా,
సా ననాశ ముహూర్తేన సమే చ స్ఖలితా హయాః. ౪౧

ప్రహస్తం త్వభినిర్యాన్తం ప్రఖ్యాతబలపౌరుషమ్,
యుధి నానాప్రహరణా కపిసేనాఽభ్యవర్తత. ౪౨
అథ ఘోషస్సుతుములో హరీణాం సమజాయత,
వృక్షానారుజతాం చైవ గుర్వీరాగృహ్ణతాం శిలాః. ౪౩
నదతాం రాక్షసానాం చ వానరాణాం చ గర్జతామ్,
ఉభే ప్రముదితే సైన్యే
రక్షోగణవనౌకసామ్, ౪౪
వేగితానాం సమర్థానామన్యోన్యవధకాఙ్క్షిణామ్,
పరస్పరం చాహ్వయతాం నినాదశ్శ్రూయతే మహాన్. ౪౫
తతః ప్రహస్తః కపిరాజవాహినీ
మభిప్రతస్థే విజయాయ దుర్మతిః,
వివృద్ధవేగాం చ వివేశ తాం చమూం
యథా ముమూర్షుశ్శలభో విభావసుమ్. ౪౬
ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే సప్తపఞ్చాశస్సర్గః. ౫౭.

---

అష్టపఞ్చాశస్సర్గః.

తతః ప్రహస్తం నిర్యాన్తం దృష్ట్వా భీమపరాక్రమమ్,

తండ్రి తాతలనాఁటనుండి సారథ్యముసేయుటయె జీవనముగాఁగల కులంబునఁ బుట్టుటచే సారథ్యంబున నతిసమర్థుఁడని చెప్పఁదగినవాఁడును అశ్వగతి శిక్షయందుఁ బండితుఁడునగు నా ప్రహస్తుని సారథిచేతనుండి మునిగోల కటాలున నేలఁబడినది. ౪౦

బయలువెడలునప్పుడు ప్రహస్తునికి అష్టవసువులకునుంగూడ దుర్లభంబయి వెలుఁగునట్టి యేకాంతిగలిగియుండినదో ఆకాంతి ముహూర్త మాత్రంబున నశించి ప్రహస్తుఁడు వివర్ణుఁడై నిరుత్సాహుఁడయ్యె. సమభూమియందే యతనిగుఱ్ఱంబులు జాఱి పడినవి. ౪౧

ప్రఖ్యాతంబులగు బలపౌరుషంబులుగల ప్రహస్తుఁడువచ్చుటంజూచి వానరసైనికులు నానావిధాయుధంబులు ధరించి యుద్ధంబున కెదురునిలిచిరి.

అంత వానరులు ఆయుధార్థమయి వృక్షంబులం బెకలించుటచేతను బెద్ద పెద్దఱాలం దీయుటచేతను దుములంబగు మహాధ్వని గలిగినది. ౪౩

రాక్షసులును వానరులును బరమకోలాహలంబున సింహనాదంబులు సేయుచు నట్లిరువాఁగులసైన్యములును సంతుష్టంబులయియుండినవి.

వేగవంతులును సమర్థులును నావానరరాక్షసుల మహాధ్వని నింగి ముట్టి చెలంగినది. ౪౪,౪౫

అంత దుష్టబుద్ధియగు ప్రహస్తుఁడు విజయంబుబొందుటకై వానర రాజుండగు సుగ్రీవునిసేనయొద్దకుఁబోయి శలభం బగ్నిహోత్రమును బ్రవేశించునట్లుఅంతకంతకు వృద్ధిఁబొందుచుండు వేగంబుగల యమ్మహాసేనం బ్రవేశించెను. ౪౬

ఇది యేఁబదియేడవసర్గము.

## ఏఁబదియెనిమిదవసర్గము.

అంత శత్రువులనడఁగఁ ద్రొక్కునట్టి రాముఁడు భయంకరపరాక్రముఁ

ఉవాచ సస్మితం రామో విభీషణమరిన్దమః, ౧

క ఏషస్సుమహాకాయో బలేన మహతా వృతః.
ఆచక్ష్వ మే మహాబాహో! వీర్యవన్తం నిశాచరమ్. ౨

రాఘవస్య వచ శ్శ్రుత్వా ప్రత్యువాచ విభీషణః,
ఏష సేనాపతి స్తస్య ప్రహస్తో నామ రాక్షసః. ౩

లఙ్కాయాం రాక్షసేన్ద్రస్య త్రిభాగబలసంవృతః,
వీర్యవానస్త్రవిచ్ఛూరః ప్రఖ్యాతశ్చ పరాక్రమే. ౪

తతః ప్రహస్తం నిర్యాన్తం భీమం భీమపరాక్రమమ్,
గర్జన్తం సుమహాకాయం రాక్షసై రభిసంవృతమ్. ౫
దదర్శ మహతీ సేనా వానరాణాం బలీయసామ్,
అభిసంజాతరోషాణాం ప్రహస్త మభిగర్జతామ్. ౬

ఖడ్గశక్త్యృష్టిబాణాశ్చ శూలాని ముసలాని చ,
గదాశ్చ పరిఘాః ప్రాసా వివిధాశ్చ పరశ్వధాః. ౭
ధనూంషి చ విచిత్రాణి రాక్షసానాం జయైషిణామ్,
ప్రగృహీతాన్యశోభన్త వానరా నభిధావతామ్. ౮

జగృహుః పాదపాంశ్చాపి పుష్పితా న్వానరర్షభాః,
శిలాశ్చ విపులా దీర్ఘా యోద్ధుకామాః ప్లవఙ్గమాః. ౯

డగు ప్రహస్తుఁడు వచ్చుటంగని చిఱునగవు మోమునందనర విభీషణుం జూచి యిట్లని చెప్పెను. ౧

మహాబాహుండనగు విభీషణుండా! మహాకాయుండగు నీరాక్షసుఁడు గొప్పసేనంగూడి వచ్చుచున్నాఁడు. ఈతఁ డెవ్వఁడు? ఇతఁడు మిక్కిలియుఁ బరాక్రమంబుగలవాఁడని తోఁచుచున్నది. ఇతనిం జెప్పుము. అని రాముఁడు విభీషణు నడిగెను. ౨

విభీషణుఁడు రాముని మాటను విని యిట్లని బదులుచెప్పెను.

ఈ రాక్షసుఁడు రావణుని సేనానాయకుఁడు. ఇతని పేరు ప్రహస్తుఁడు. ౩

లంకయందు రాక్షసరాజుండగు రావణుని సైన్యంబునందు మూఁడవ భాగ మీప్రహస్తుని యధీనముగా నుండును ఇతఁడు బలవంతుఁడు అస్త్రంబులం దెలిసినవాఁడు. శూరుఁడు. పరాక్రమంబునను బేరు వొందినవాఁడు అని విభీషణుండు రామునితోఁ జెప్పెను. ౪

అంతఁ దమపైకివచ్చుచున్న భయంకరాకారుఁడును భయంకరపరాక్రముఁడును సింహనాదంబులు సేయుచున్నవాఁడును మహాకాయుండును బెక్కు రాక్షసవీరులతోఁ గూడిన వాఁడునగు ప్రహస్తునిం జూచి బలవంతులగు వానర వీరులు పరమకుపితులయి ప్రహస్తుం జేరి కని సింహనాదంబులు గావించిరి. ౫, ౬

అప్పుడు వానరులమీఁదికిఁ బరుగెత్తుచు జయంబుగోరి యుద్ధంబున నుపక్రమించిన రాక్షసవీరులు ధరించిన ఖడ్గంబులు శక్తులు నష్టులు బాణంబులు శూలంబులు ముసలంబులు గదలుఁ బరిఘంబులుఁ బ్రాసంబులు నానావిధము లయిన పరశ్వధంబులు మొదలగు నాయుధంబులు ఎంతయుఁ బ్రకాశించుచుండినవి. ౭. ౮

వానరోత్తములు యుద్ధంబు సేయుటకై పుష్పితంబులగు వృక్షములను విశాలంబులును దీర్ఘంబులు నగు ఱాళ్లను బట్టుకొని నిలిచిరి. ౯

తేషామన్యోన్యమాసాద్య సఙ్గ్రామ స్సుమహా నభూత్,
బహూనామశ్మవృష్టిం చ శరవృష్టిం చ వర్షతామ్. ౧౦
బహవో రాక్షసా యుద్ధే బహూ న్వానరయూథపాన్,
వానరా రాక్షసాంశ్చాపి నిజఘ్ను ర్బహవో బహూన్. ౧౧
శూలై ప్రమథితాః కేచిత్కేచిచ్చ పరమాయుధైః,
పరిఘైరాహతాః కేచిత్కేచి చ్ఛిన్నాః పరశ్వథైః. ౧౨

నిరుచ్ఛ్వాసాః కృతాః కేచిత్పతితా ధరణీతలే,
విభిన్నహృదయాః కేచిదిషుసంధానసందితాః. ౧౩
కేచి ద్ద్విధాకృతాః ఖడ్గైః స్ఫురన్తః పతితా భువి,
వానరా రాక్షసై శ్శూలైః పార్శ్వత శ్చావదారితాః. ౧౪

వానరై శ్చాపి సంక్రుద్ధై రాక్షసౌఘా స్సమన్తతః,
పాదపై ర్గిరిశృఙ్గైశ్చ సంపిష్టా వసుధాతలే. ౧౫
వజ్రస్పర్శతలై ర్హస్తై ర్ముష్టిభిశ్చ హతా భృశమ్,
వేము శ్శోణిత మాస్యేభ్యో విశీర్ణదశనేక్షణాః. ౧౬

ఆర్తస్వనం చ స్వనతాం సింహనాదం చ నర్దతామ్,
బభూవ తుముల శ్శబ్దో హరీణాం రక్షసాం యుధి. ౧౭

వానరా రాక్షసాః క్రుద్ధా వీరమార్గ మనువ్రతాః,
వివృత్తనయనాః క్రూరాశ్చక్రుః కర్మాణ్యభీతవత్. ౧౮

నరాన్తకః కుమ్భహను ర్మహానాదస్సమున్నతః,

అట్లు ఆవానరరాక్షసులు ఒండొరులం గలసి శిలావర్షంబును గురియించుచుఁ బెనంగ నారంభింపుడుఁ బోరు ఘోరంబయ్యె. ౧౦

అప్పుడు యుద్ధమునందు రాక్షసులు పెక్కండ్రువానరుల ననేకుల వధించిరి; అట్లు వానరు లనేకులు అనేకరాక్షసుల వధించిరి. ౧౧

వానరులు కొందఱు రాక్షసులచే శూలంబుల వధింపఁబడిరి. కొందఱు చక్రములచేఁ జంపఁబడిరి. కొందఱు పరిఘంబులవధింపఁబడిరి. కొందఱు గొడ్డళ్లచే ఛేదింపఁబడిరి. ౧౨

కొందఱు గతప్రాణులుగాఁ జేయఁబడి నేలంబడిరి. కొందఱు బాణంబులచేఁ గొట్టఁబడినవారలయి గుండియలుపగిలి ప్రాణంబులు విడిచిరి. ౧౩

కొంతఱు వానరులు రాక్షసులచే ఖడ్గంబుల రెండుతునియలుగా ఖండింపంబడినవారలయి యొగురుచు నేలంబడిరి. కొందఱు వానరులు పార్శ్వభాగంబుల శూలంబులచే విదారింపఁబడినవారలయి మృతిఁబొందిరి. ౧౪

అప్పుడు వానరులును బరమకుపితులయి రాక్షసులను గుంపుగుంపుగా వృక్షములచేతను బర్వతశిఖరంబులచేతను జూర్ణముగావించి రూపు మాపిరి. ౧౫

కొందరు రాక్షసులు వానరులచే వజ్రస్పర్శంబులగు పిడికిళ్లఁ బొడువంబడి దంతములును గన్నులును రాలి నోట నెత్తురుగ్రక్కుకొనుచు నేలంబడిరి. ౧౬

యుద్ధంబున వానరరాక్షసులు కొందఱు దెబ్బదిన్నప్పుడు రోదనము సేయుచుఁ గొందఱు జయమునొంది సింహనాదంబు సేయుచునుండిరి. ఆశబ్దంబు తుములంబై నింగిముట్టి చెలంగినది. ౧౭

వానరులు రాక్షసులు నందఱును క్రుద్ధులయి వీరమార్గంబు ననుసరించి కన్నులు గిఱగిఱందిరుగ భయంకరాకారులయి నిర్భయంబుగా యుద్ధంబు గావించిరి. ౧౮

నరాంతకుఁడును గుంభహనుఁడును మహానాదుఁడును సమున్నతుఁ

ఏతే ప్రహ_స్తసచివాస్సర్వే జఘ్నుర్వనౌకసః. ౧౯

తేషా మాపతతాం శీఘ్రం నిఘ్నతాం చాపి వానరాన్,
ద్వివిదో గిరిశృఙ్గేణ జఘా నైకం నరా_న్తకమ్. ౨౦

దుర్ముఖశ్చ పున రుత్థాయ కపి స్స విపులద్రుమమ్,
రాక్షసం క్షిప్రహ_స్త స్తు సమున్నత మపోథయత్. ౨౧
జామ్బవాం స్తు సుసంక్రుద్ధః ప్రగృహ్య మహతీం శిలామ్,
పాతయామాస తేజస్వీ మహానాదస్య వక్షసి. ౨౨
అథ కుమ్భహను _స్తత్ర తారే ణాసాద్య వీర్యవాన్,
వృక్షేణాభిహతో మూర్ధ్ని ప్రాణాన్ సంత్యాజయ ద్రణే. ౨౩
అమృష్యమాణ _స్తత్కర్మ ప్రహస్తో రథమాస్థితః,
చకార కదనం ఘోరం ధనుష్పాణి ర్వనౌకసామ్. ౨౪

ఆవ_ర్త ఇవ సంజజ్ఞే ఉభయో స్సేనయో _స్తదా,
క్షుభితస్యాప్రమేయస్య సాగరస్యేవ నిస్వనః. ౨౫

మహతా హి శరౌఘేణ ప్రహస్తో యుద్ధకోవిదః,
అర్దయామాస సంక్రుద్ధో వానరాన్పరమాహవే. ౨౬

వానరాణాం శరీరై శ్చ రాక్షసానాం చ మేదినీ,
బభూవ నిచితా ఘోరా పతితై రివ పర్వతైః. ౨౭
సా మహీ రుధిరౌఘేణ ప్రచ్ఛన్నా సంప్రకాశతే,
సంఛన్నా మాధవే మాసి పలాశై రివ పుష్పితైః. ౨౮

డును ఈప్రహ స్తమంత్రులు నల్వురును శెలరేఁగి వానరుల నానావిధంబుల వధించిరి. ౧౯

అనరాంతకకుంభహనుమహానాదసమున్నతు లట్లు చెలరేఁగి వానరుల వధింపుచుండుటం జూచి ద్వివిదుఁడు పర్వతశిఖరముచే వారలలో నరాంతకు నొక్కని వధించిపుచ్చెను. ౨౦

శీఘ్రముగాఁ గార్యములు చేయఁనట్టి దుర్ముఖుఁడు పెద్దవృక్షము నొకటిఁ బెకలించి సమున్నతుఁడను రాక్షసుని వధించెను. ౨౧

మహాపరాక్రమశాలియగు జాంబవంతుఁడు పరమకుపితుఁడై పెద్ద తాయి నొకటి దీసి మహానాదుని ఱొమ్ము పై వైవ నతఁడు నేలం గూలెను.

అంతఁ బరాక్రమవంతుఁడగు కుంభహనుఁడు తారునిచే వృక్షంబున శిరస్సునందుఁ బ్రహరింపఁబడినవాఁడై నేలంబడి ప్రాణంబులు విడిచెను.

ప్రహస్తుఁడును రథంబునుండి యిట్లు తనమంత్రులు నల్వురును హతులగుటంజూచి దాని నోర్వఁజాలక ధనుర్ధరుఁడై వానరులతో భయంకరంబుగా యుద్ధముగావించెను. ౨౪

ప్రళయకాలమునం దప్రమేయంబగు సముద్రం బుప్పొంగునప్పుడు గలుగుమహాధ్వనివలె ఆరెండుసేనలయందును అయ్యుద్ధంబునంబుట్టిన మహాధ్వనియుం భయంకరంబై యొప్పినది. ౨౫

యుద్ధంబునందుఁ బండితుఁడగు ప్రహస్తుఁడు పరమకుపితుఁడై యమ్మహాయుద్ధంబునందు అసంఖ్యంబుగా బాణంబులు ప్రయోగించి వానరుల నొప్పించెను. ౨౬

పర్వతాకారంబులగు వానరరాక్షసుల శరీరంబులు పడియుండుటఁచే నాయుద్ధభూమియంతయుం భయంకరాకారంబయి యుండినది. ౨౭

అయ్యుద్ధభూమియంతయుం నెత్తురుచే నిండియుండుటవలన నది వసంతఋతువునందుఁ బుష్పించిన పలాశవృక్షంబులచే నిండినట్లు ప్రకాశింపుచుండినది. ౨౮

హతవీరౌఘవప్రాం తు భగ్నాయుధమహాద్రుమామ్,
శోణితౌఘమహాతోయాం యమసాగరగామినీమ్. ౨౯
యకృత్ప్లీహమహాపఙ్కాం వినికీర్ణాన్త్రశైవలామ్,
భిన్నకాయశిరోమీనా మఙ్గావయవశాద్వలామ్. 30
గృధ్రహంసగణాకీర్ణాం కఙ్కసారససేవితామ్,
మేదఃఫేనసమాకీర్ణా మార్తస్తనితనిస్వనామ్. 3౧
తాం కాపురుషదుస్తారాం యుద్ధభూమిమయీం నదీమ్,

నదీ మివ ఘనాపాయే హంససారససేవితామ్. 3౨
రాక్షసాః కపిముఖ్యాశ్చ తేరు స్తాం దుస్తరాం నదీమ్,

యథా పద్మరజోధ్వస్తాం నళినీం గజయూథపాః. 33

తత స్సృజన్తం బాణౌఘా న్ప్రహస్తం స్యన్దనే స్థితమ్,
దదర్శ తరసా నీలో వినిఘ్నన్తం ప్లవఙ్గమాన్, 3౪
ఉద్ధూత ఇవ వాయుః ఖే మహదభ్రబలం బలాత్,
సమీక్ష్యాభిద్రుతం యుద్ధే ప్రహస్తో వాహినీపతిః. 3౫
రథేనాదిత్యవర్ణేన నీలమేవాభిదుద్రువే,
స ధను ర్ధన్వినాం శ్రేష్ఠో వికృష్య పరమాహవే. 3౬

నీలాయ వ్యసృజ ద్బాణా న్ప్రహస్తో వాహినీపతిః,
తే ప్రాప్య విశిఖా నీలం వినిర్భిద్య సమాహితాః. 3౭

హతులయిన యిరువాఁగువీరులసమూహములే తీరములుగాఁగలదియు విఱిగినయాయుధములె తీరవృక్షములుగాఁగలదియు నెత్తురే జలముగాఁగలదియు యకృత్ప్లీహములను మాంసములే యడుసుగాఁగలదియుఁ బ్రేగులే పాచితీఁగెలుగాఁగలదియు తెగిపడిన దేహఖండములు శిరస్సులునే మత్స్యములుగాఁగలదియు వ్రేళ్లుమొదలగు నవయవంబులే పచ్చికగాఁగలదియు గద్దలే హంసలుగాఁగలదియు పులుఁగులే సారసంబులుగాఁగలదియు మేదస్సే నురుగుగాఁగలదియు దెబ్బలు దిన్నవారలయేడ్పులే ధ్వనిగాఁగలదియు యముఁడను సముద్రమునంగలయునదియు బిఱికివాండ్రకు దాఁటనలవిగానిదియునగు యుద్ధభూమియను మహానదిని ఆవ్వానరరాక్షసులు ప్రవహింపఁజేసిరి. ౩౧

రాక్షసులును వానరవీరులును శరదృతువునందు హంససారసపక్షులతో నొప్పుచుండునదిని సులభంబుగా దాఁటునట్లు దుస్తరంబగు నయ్యుద్ధభూమి నదిని దాఁటిరి. ౩౨

మదపుటేనుఁగులు కమలములపరాగము పడియుండుటచే వర్ణాంతరము నొందిన తామరకొలంకుల దాఁటి యెఱ్ఱనిదేహము గలవగునట్లు ఆవ్వానర రాక్షసులు అయ్యుద్ధభూమిం దిగినట్టి రక్తవర్ణములయిన దేహములుగలవారలయిరి. ౩౩

అంత నట్లు రథగతుఁడై బాణంబులనేకంబులు ప్రయోగించుచు వానరులవధించుచున్న ప్రహస్తుని నీలుఁడు చూచెను. ౩౪

సేనానాయకుఁడగు ప్రహస్తుఁడు ఆకాశంబున నుద్ధూతంబగు వాయువు మేఘసమూహంబుపై కడరునట్లు తనపైకడరిన నీలుంజూచి సూర్యప్రభంబగు రథంబుతో నానీలునిమీఁదికే పోయెను. ౩౫

ధనుర్ధరులలో నుత్తముఁడగు రాక్షససేనానాయకుఁడగు నాప్రహస్తుఁడు ఉత్తమంబగు ధనుస్సు నాకర్ణాంతము నాకర్షించి నీలునిపై బాణంబులు ప్రయోగించెను. ౩౬

మహావేగంబులును కుపితంబులగు సర్పంబులువలె నతితీక్ష్ణంబులగు

మహీం జగ్ము ర్మహావేగా రుషితా ఇవ పన్నగాః,

నీల శ్శరై రభిహతో నిశితై ర్జ్వలనోపమైః. ౩౮
స తం పరమదుర్ధర్ష మాపత న్తం మహాకపిః,
ప్రహ స్తం తాడయామాస వృక్షముత్పాట్య వీర్యవాన్. ౩౯
స తేనాభిహతః క్రుద్ధో నద న్రాక్షసపుఙ్గవః,
వవర్ష శరవర్షాణి ప్లవఙ్గానాం చమూపతౌ. ౪౦

తస్య బాణగణా న్ఘోరా న్రాక్షసస్య మహాబలః,
అపారయ న్వారయితుం ప్రత్యగృహ్ణా న్నిమీలితః. ౪౧

య థైవ గోవృషో వర్షం శారదం శీఘ్ర మాగతమ్,
ఏవ మేవ ప్రహ స్తస్య శరవర్షం దురాసదమ్. ౪౨
నిమీలితాక్ష స్సహసా నీల స్సేహే సుదారుణమ్,

రోషిత శ్శరవర్షేణ సాలేన మహతా మహాన్. ౪౩
ప్రజఘాన హయా న్నీలః ప్రహ స్తస్య మనోజవాన్,
తత స్స చాపముద్గృహ్య ప్రహ స్తస్య మహాబలః. ౪౪
బభఞ్జ తరసా నీలో ననాద చ పునఃపునః,

విధను స్తు కృత స్తేన ప్రహస్తో వాహినీపతిః. ౪౫
ప్రగృహ్య ముసలం ఘోరం స్యన్దనాదవపుప్లువే,

తావుభౌ వాహినీముఖ్యౌ జాతవైరౌ తరస్వినౌ. ౪౬
స్థితౌ క్షతజదిగ్ధాఙ్గౌ ప్రభిన్నావివ కుఞ్జరౌ,

నా బాణంబులు లక్ష్యంబుదప్పక నీలునిదేహంబు బ్రవేశించి యావలికిం బోయి భూమిం బ్రవేశించినవి. ౩౭

మహాపరాక్రమశాలియగు నానీలుఁడు అట్లు తీక్ష్ణంబులయిన నిప్పు వంటి బాణంబులఁ గొట్టబడినవాఁడై కోపించి వృక్షము నొకటిం బెకలించి తనపైకి వచ్చుచున్న దుర్ధర్షుఁడగు ప్రహస్తుం బ్రహరించెను. ౩౮, ౩౯

రాక్షసశ్రేష్ఠుఁడగు నాప్రహస్తుఁడు అట్లు వృక్షంబునఁ గొట్టఁబడి కోపించి సింహనాదంబుసేయుచు వానరసేనానాయకుఁడగు నీలునిపై బాణ వర్షంబులు గురిపించెను. ౪౦

మహాబలశాలియగు నీలుఁడు భయంకరాకారంబులగు నాప్రహస్తుని బాణసమూహంబుల నివారింప నశక్తుఁడై కన్నులు మూసికొని యన్నిటిని సహించుచుండెను. ౪౧

ఆబోతు శరదృతువునందలి వర్షంబును ఎంతమాత్రము సరకుసేయక సహించునట్లు నీలుఁడు ప్రహస్తుఁడు ప్రయోగించిన భయంకరంబగు బాణ వర్షంబును ఎంతమాత్రము సరకుసేయక కన్నులుమూసికొని సహించి యుండెను. ౪౨

మహాబలుఁడగు నీలుఁడు ఆ బాణవర్షంబునకుఁ గోపించి యొక్క మహావృక్షంబుగొని మనోవేగంబులగు ప్రహస్తుని గుఱ్ఱంబులను వధించెను. ౪౩

అంత మహాబలశాలియగు నీలుఁడు వేగంబున నా ప్రహస్తునిచేతి ధనుస్సు నొడిసిపట్టుకొని విఱిచివైచి పెక్కుమాఱులు సింహనాదంబు గావించెను. ౪౪

రాక్షససేనానాయకుఁడగు ప్రహస్తుఁడు అట్లు నీలునిచే విరథుఁడును విధనుష్కుఁడును గావింపఁబడి భయంకరంబగు ముసలంబు చేతంగొని రథంబున నుండి నేల కుఱికెను. ౪౫

పరస్పరబద్ధవైరులును బలవంతులును నెత్తుటం దడిసిన దేహముగల వారలునగు నావానరరాక్షససేనానాయకులు నీలప్రహస్తు లిద్దఱు మదపు టేనుఁగులుంబోలె నొండొరులం దాఁకి నిల్చిరి. ౪౬

ఉల్లిఖన్తౌ సుతీక్ష్ణాభి ర్దంష్ట్రాభి రితరేతరమ్. ౪౭
సింహశార్దూలసదృశౌ సింహశార్దూలచేష్టితౌ,
విక్రాన్తవిజయౌ వీరౌ సమరే ష్వనివర్తినౌ. ౪౮
కాఙ్క్షమాణౌ యశః ప్రాప్తుం వృత్రవాసవయో స్సమౌ,
ఆజఘాన తదా నీలం లలాటే ముసలేన సః. ౪౯
ప్రహస్తః పరమాయత్త స్తస్య సుస్రావ శోణితమ్,
తత శ్శోణితదిగ్ధాఙ్గః ప్రగృహ్య సుమహాతరుమ్. ౫౦
ప్రహస్తస్యోరసి క్రుద్ధో విససర్జ మహాకపిః,
తమచిన్త్య ప్రహారం స ప్రగృహ్య ముసలం మహత్. ౫౧
అభిదుద్రావ బలినం బలా న్నీలం ప్లవఙ్గమమ్,
త ముగ్రవేగం సంరబ్ధ మాపతన్తం మహాకపిః. ౫౨
తత స్సంప్రేక్ష్య జగ్రాహ మహావేగో మహాశిలామ్,
తస్య యుద్ధాభికామస్య మృధే ముసలయోధినః. ౫౩
ప్రహస్తస్య శిలాం నీలో మూర్ధ్ని తూర్ణ మపాతయత్,
సా తేన కపిముఖ్యేన విముక్తా మహతీ శిలా. ౫౪
బిభేద బహుధా ఘోరా ప్రహస్తస్య శిర స్తదా,
స గతాసు ర్గతశ్రీకో గతసత్త్వో గతేన్ద్రియః. ౫౫
పపాత సహసా భూమౌ ఛిన్నమూల ఇవ ద్రుమః,
విభిన్నశిరస స్తస్య బహు సుస్రావ శోణితమ్. ౫౬
శరీరా దభిసుస్రావ గిరేః ప్రస్రవణం యథా,
హతే ప్రహస్తే నీలేన తదకమ్ప్యం మహద్బలమ్. ౫౭
రక్షసామప్రహృష్టానాం లఙ్కా మభిజగామ హ,
న శేకు స్సమరే స్థాతుం నిహతే వాహినీపతౌ. ౫౮
సేతుబన్ధం సమాసాద్య విశీర్ణం సలిలం యథా,

సింహశార్దూలంబులతో సమానులును సింహశార్దూలచేష్టితులును బెక్కుయుద్ధంబుల నిదివఱకు జయంబునొందియుండు వారలును వీరులును యుద్ధంబున వెనుదీయనివారలును వృత్రాసురదేవేంద్రులకు సరియగువారలునగు నాప్రహస్తుఁడును నీలుఁడును తీక్ష్ణంబులగు కోఱలచే గొండొరుల దేహంబున గాయంబులువడఁ బరస్పరజయంబుఁ గోరి కొంతదడవు మల్లయుద్ధంబు గావించిరి.

అప్పుడు ప్రహస్తుఁడు పరమవేగంబున ముసలంబు దీసి నీలుని లలాట
ప్రదేశంబునఁ బ్రహరింప నందుండి రక్తంబు గాఱినది. ౪౯

అంత దేహంబంతయు నెత్తుటందడిసి నీలుఁడు కోపించి యొకమహా
వృక్షంబుగొని ప్రహస్తుని వక్షస్థలంబుపై వేసెను. ౫౦

ఆ ప్రహస్తుఁడు ఆ దెబ్బను సరకుసేయక అమ్మహాముసలంబుగొని బల
వంతుఁడగు నీలునిపైకిఁ బరుగెత్తెను. ౫౧

అంత మహావేగుఁడగు నీలుఁడు ఆ ప్రహస్తుఁడు భయంకరవేగంబునఁ
దనపైకి వచ్చుటంజూచి యొక్కగొప్పశిలను గ్రహించెను. ౫౨

నీలుఁడు ముసలంబుతో యుద్ధంబుసేయుచుఁ దనపైకిఁ బఱతెంచు
చున్న యాప్రహస్తుని తలమీఁద శీఘ్రంబున నాశిలం బడవేసెను. ౫౩

అప్పుడు వానరశ్రేష్ఠుఁడగు నీలుఁడు వైచిన భయంకరాకారంబగు
నమ్మహాశిలచేఁ బ్రహస్తుని తల పెక్కువ్రక్కలయి రూపఱిపోయెను. ౫౪

ఆ ప్రహస్తుఁడు కాంతియు బలంబును నింద్రియంబులును నశించి గతప్రాణుఁడై నఱకఁబడిన వేఱుగలవృక్షంబుకైవడి తటాలున నేలంగూలెను.

ఆ ప్రహస్తుని భిన్నంబగు శిరస్సునుండియు దేహంబునుండియు పర్వ
తంబుననుండి సెలయేఱు ప్రవహించునట్లు అధికముగా నెత్తురు గాఱినది. ౫౬

నీలుఁడు ప్రహస్తుని వధించినపిమ్మట నంతవఱకు నప్రధృష్యులుగా
నుండిన నారాక్షససైనికులందఱు పరమదుఃఖితులయి లంకకుంబోయిరి. ౫౭

యుద్ధంబున సేనానాయకుఁడు నిహతుండైన పిదప జలం బనకట్టను
దాఁటి యావలికిఁ బ్రవహింపఁజాలనట్లు రాక్షసులు నిలువఁజాలరైరి. ౫౮

హతే తస్మిం శ్చమూముఖ్యే రాక్షసా స్తే నిరుద్యమాః. ౫౯

రక్షఃపతిగృహం గత్వా ధ్యానమూకత్వ మాస్థితాః,
ప్రాప్తా శ్శోకార్ణవం తీవ్రం నిస్సంజ్ఞా ఇవ తేఽభవన్. ౬౦

తతస్తు నీలో విజయీ మహాబలః
ప్రశస్యమాన స్స్వకృతేన కర్మణా,
సమేత్య రామేణ సలక్ష్మణేన చ
ప్రహృష్టరూప స్తు బభూవ యూథపః. ౬౧

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డేఽష్టషష్ఠ్యాశ్శస్సర్గః. ౫౮.

---

ఏ కో న ష ష్టి త మ స్స ర్గః.

తస్మి న్హతే రాక్షససైన్యపాలే
ప్లవఙ్గమానా మృషభేణ యుద్ధే,
భీమాయుధం సాగరతుల్యవేగం
విదుద్రువే రాక్షసరాజసైన్యమ్. ౧
గత్వాఽథ రక్షోధిపతే శ్శశంసు
స్సేనాపతిం పావకసూనుశస్తమ్,
తచ్చాపి తేషాం వచనం నిశమ్య
రక్షోధిపః క్రోధవశం జగామ. ౨
సంఖ్యే ప్రహస్తం నిహతం నిశమ్య
శోకార్దితః క్రోధపరీతచేతాః,
ఉవాచ తా న్నైరృతయోధముఖ్యా
నిన్ద్రో యథా చామరయోధముఖ్యాన్. ౩

రాక్షససేనానాయకుఁడగు ప్రహస్తుఁడు వధింపఁబడినవెనుక రాక్షస సైనికులు ఏమియుం జేయఁజాలక యూరకుండిరి. ౫౯

ఆ రాక్షసులు రావణునియొద్దకుఁబోయి చింతావశంబున మూఁగలు వలె నేమియు మాటలాడఁజాలక దుఃఖసముద్రమగ్నులయి మూర్ఛితులం బోలె నుండిరి. ౬౦

అంత మహాబలుఁడును జయశాలియునగు వానరవాహినీనాయకుఁడు నీలుఁడు రామలక్ష్మణులం జేరి తాను గావించిన ప్రహస్తవధంబునకు యందఱి చేతను బ్రశంసింపఁబడుచుఁ బరమసంతోషంబున నుండెను. ౬౧

ఇది యేఁబదియెనిమిదవసర్గము.

## ఏఁబదితొమ్మిదవసర్గము.

వానరవరిష్ఠుఁడగు నీలునిచే రాక్షససేనాపాలకుఁడయిన ప్రహస్తుఁడు నిహతుఁడయినపిదప భయంకరములయిన యాయుధములుగలదియు సముద్రమునకుంబోలె మహావేగంబుగలదియునగు నారాక్షససేన లంకకుఁ బరుగెత్తె నది. ౧

అంత నారాక్షసులుపోయి రావణునకు "సేనానాయకుఁడగు ప్రహస్తుఁడు నీలునిచే నిహతుఁడయ్యె" నని విన్నవింప నారాక్షసరాజు వారల మాటను విని శోకంబు నొందెను. ౨

ఆ రావణుఁడు ప్రహస్తుఁడు యుద్ధంబున నిహతుఁడగుటను విని శోక క్రోధంబులు మనంబునఁ బెనఁగొన సమీపంబులనుండు రాక్షసోత్తములం జూచి దేవోత్తముల కింద్రుఁడు చెప్పునట్లు ఇట్లని చెప్పెను. ౩

నావజ్ఞా రిపవే కార్యా యైరిన్ద్రబలసూదనః,
సూదిత సైన్యపాలో మే సానుయాత్ర స్సకుఞ్జరః. ౪

సోఽహం రిపువినాశాయ విజయాయావిచారయన్,
స్వయమేవ గమిష్యామి రణశీర్షం తదద్భుతమ్. ౫

అద్య తద్వానరానీకం రామం చ సహలక్ష్మణమ్,
నిర్దహిష్యామి బాణౌఘై ర్వనం దీప్తై రివాగ్నిభిః. ౬
స ఏవ ముక్త్వా జ్వలనప్రకాశం
రథం తురఙ్గోత్తమరాజయుక్తమ్,
ప్రకాశమానం వపుషా జ్వలన్తం
సమారురోహామరరాజశత్రుః. ౭
స శఙ్ఖభేరీపణవప్రణాదై
రాస్ఫోటితక్ష్వేళితసింహనాదైః,
పుణ్యైః స్తవైశ్చాప్యభిపూజ్యమాన
స్తదా యయౌ రాక్షసరాజముఖ్యః. ౮
స శైలజీమూతనికాశరూపై
ర్మాంసాదనైః పావకదీప్తనేత్రైః,
బభౌ వృతో రాక్షసరాజముఖ్యో
భూతై ర్వృతో రుద్ర ఇవాసురేశ్వరః. ౯
తతో నగర్యాః సహసా మహౌజా
నిష్క్రమ్య తద్వానరసైన్యముగ్రమ్,
మహార్ణవాభ్రస్తనితం దదర్శ
సముద్యతం పాదపశైలహస్తమ్. ౧౦
తద్రాక్షసానీకమతిప్రచణ్డ

దేవేంద్రుని బలంబును వధించునట్టి యాసేనానాయకుని సపరివారంబుగాఁ బొరిగొన్నట్టి మనశత్రువులు వానరు లనుబుద్ధిచే స్వల్పముగాఁ దలంపఁదగిన వారలుకారు. ౪

నే నింక నాలోచింపను; నేనే శత్రువులను వధించి విజయంబుఁ జేకొనుటకై యల్పులచేఁ బ్రబలులు వధి పఁబడుటచే నాశ్చర్యకరముగా నుండునట్టి యాయుద్ధంబునకుఁ బోయెదను. ౫

ఇప్పుడు కార్చిచ్చు వనంబును దహించునట్లు బాణంబులచే నారామలక్ష్మణులను వానరసేన నంతయుం దహించెదను. ౬

దేవేంద్రశత్రుఁడగు రావణుఁడు ఈప్రకారమునం జెప్పి అగ్నికింబోలెఁ దేజస్సుకలదియు నుత్తమాశ్వంబులు పూన్చినదియు నలంకారంబులచేతను స్వరూపముచేతను బ్రకాశించుచున్నదియు నగు రథము నారోహించెను. ౭

అప్పుడు రాక్షసరాజోత్తముఁడగు నారావణుఁడు శంఖభేరీపణవాది వాద్యధ్వనులచేతను భుజాస్ఫాలనసింహనాదధ్వనులచేతను నానావిధస్తోత్రములచేతను గొనియాడఁబడుచు యుద్ధంబునకుఁ బోయెను. ౮

రాక్షసరాజోత్తముఁడగు నారావణుఁడు పర్వతమేఘంబులతో సమానములయిన యాకారముగలవారలునగు రాక్షసులచేఁ బరివృతుఁడై భూతంబులచేఁ బరివేష్టితుఁడగు రుద్రునికైవడిఁ బ్రకాశించెను. ౯

అంత మహాపరాక్రమశాలియగు రావణుఁడు శీఘ్రంబునఁ బట్టణంబు వెలువడి భయంకరంబును మహాసముద్రంబునకును మేఘంబునకునుంబోలె మహాధ్వనిగలదియుఁ వృక్షంబులు శైలంబులు చేతులందాల్చి యుద్ధసన్నద్ధంబై యున్నదియునగు నవ్వానరసైన్యముం జూచెను. ౧౦

సర్పరాజువంటి బాహువులుగల రాముఁడు యుద్ధోత్సాహంబున నిను

మాలోక్య రామో భుజగేన్ద్రబాహుః,
విభీషణం శస్త్రభృతాం వరిష్ఠ
మువాచ సేనానుగతః పృథుశ్రీః. ౧౧
నానాపతాకాధ్వజశస్త్రజుష్టం
ప్రాసాసిశూలాయుధవజ్రజుష్టమ్,
సైన్యం నగేన్ద్రోపమనాగజుష్టం
కస్యేద మక్షోభ్య మభీరుజుష్టమ్. ౧౨
తతస్తు రామస్య నిశమ్య వాక్యం
విభీషణ శ్శక్రసమానవీర్యః,
శశంస రామస్య బలప్రవేగం
మహాత్మనాం రాక్షసపుఙ్గవానామ్. ౧౩
యోఽసౌ గజస్కన్ధగతో మహాత్మా
నవోదితార్కోపమతామ్రవక్త్రః,
ప్రకమ్పయ న్నాగశిరోఽభ్యుపైతి
హ్యకమ్పనం త్వేన మవేహి రాజన్!. ౧౪
యోఽసౌ రథస్థో మృగరాజకేతు
ర్ధూన్వ న్ధను శ్శక్రధనుః ప్రకాశమ్,
కరీవ భాత్యుగ్రవివృత్తదంష్ట్ర
స్స ఇన్ద్రజి న్నామ వరప్రధానః. ౧౫
యశ్చైష విన్ధ్యాస్తమహేన్ద్రకల్పో
ధన్వీ రథస్థోఽతిరథోఽతివీరః,
విస్ఫారయం శ్చాప మతుల్యమానం
నామ్నాతికాయోఽతివివృద్ధకాయః. ౧౬
యోఽసౌ నవార్కోదితతామ్రచక్షు
రారుహ్య ఘణ్టానినదప్రణాదమ్,

మడించిన కాంతి గలవాఁడై వానరసేనాపరివృతుఁడై మహాభయంకరంబై వచ్చుచున్నయీ రాక్షససేనం గని యాయుధధారులలోనుత్తముఁడగు విభీషణుం జూచి యిట్లని చెప్పెను. ౧౧

నానావిధములయిన ధ్వజములతోఁ గూడినదియుఁ బ్రాసములు ఖడ్గములుశూలములు ధనుస్సులు మొదలగు నాయుధములతోఁ గూడినదియు నైరావతసమానంబులగు నుత్తమగజంబులతోఁ గూడినదియు నక్షోభ్యంబును శూరమయంబునగు నీసేన యెవ్వనిది? అని రాముఁడు విభీషణునితోఁ జెప్పెను.

అంత దేవేంద్రసమానపరాక్రముఁడగు విభీషణుఁడు రామునిమాటను విని రామునకు మహాపరాక్రమశాలులగు నారాక్షసోత్తముల బలాతిశయంబులఁ జెప్పెను. ౧౩

రాముఁడా! ఇదిగో నూతనముగా నుదయించినసూర్యునిపగిది నెఱ్ఱనైన ముఖముగలిగి యేనుఁగుమీఁదఁ గూర్చుండి తనదేహభారంబున నేనుఁగు శిరస్సదరఁ బరమాటోపంబున నేతెంచుచున్నాఁడే. ఇతఁడు రావణపుత్రుఁడగు నకంపనుఁడు. ౧౪

ఎవ్వఁడు రథము నారోహించినవాఁడై సింహధ్వజంబలర నింద్రధనుస్తుల్యంబగు ధనుస్సును జ్యాకర్షణంబున ధ్వనింపఁజేయుచు భయంకరములయిన కోఱలు బయలుపడ నోరు దెఱచుకొనియుండు నేనుఁగుకైవడిఁ బ్రకాశించుచున్నాఁడో యతఁడు బ్రహ్మదత్తవరుఁడగు నింద్రజిత్తు. ౧౫

వింధ్యాస్తమహేంద్రపర్వతాకారుఁడును అతిరథుఁడు నతిపరాక్రమశాలియునగు నొకఁడు రథగతుఁడై యతిప్రమాణాకారంబగు ధనుస్సును ధ్వనింపఁజేయుచు వచ్చుచున్నాఁడే ఈతఁడు మహాదేహుఁడైన యతికాయుఁడు. ౧౬

ఏమహాబలుఁడు నవోదితంబగు సూర్యబింబమునకుంబోలెఁ గన్నుల నెఱ్ఱదనంబుగదుర ఘంటాధ్వనిశోభితంబగు నేనుఁగునెక్కి గర్జించుచు వచ్చు

గజం ఖరం గర్జతి వై మహాత్మా
మహోదరో నామ స ఏష వీరః. ౧౭
యోఽసౌ హయం కాఞ్చన చిత్రభాణ్డ
మారుహ్య సంధ్యాభ్రగిరిప్రకాశమ్,
ప్రాసం సముద్యమ్య మరీచినద్ధం
పిశాచ ఏషోఽశనితుల్యవేగః. ౧౮
యశ్చైష శూలం నిశితం ప్రగృహ్య
విద్యుత్ప్రభం కింకరవజ్రవేగమ్,
వృషేన్ద్ర మాస్థాయ గిరిప్రకాశ
మాయాతి యోఽసౌ త్రిశిరా యశస్వీ. ౧౯
అసౌ చ జీమూతనికాశరూపః
కుమ్భః పృథువ్యూఢసుజాతవక్షాః,
సమాహితః పన్నగరాజకేతు
ర్విస్ఫారయ న్భాతి ధను ర్విధూన్వన్. ౨౦
యశ్చైష జామ్బూనదవజ్రజుష్టం
దీప్తం సధూమం పరిఘం ప్రగృహ్య,
ఆయాతి రక్షోబల కేతుభూత
స్త్వసౌ నికుమ్భోఽద్భుతఘోరకర్మా. ౨౧
యశ్చైష చాపాసి శరౌఘజుష్టం
పతాకినం పావకదీప్తరూపమ్,
రథం సమాస్థాయ విభాత్యుదగ్రో
నరాన్తకోఽసౌ నగశృఙ్గయోధీ. ౨౨
యశ్చైష నానావిధఘోరరూపై
ర్వ్యాఘ్రోష్ట్రనాగేన్ద్రమృగాశ్వవక్త్రైః,
భూతై ర్వృతో భాతి వివృత్తనేత్రై

చున్నాఁడో అతఁడు మహోదరుఁడు. ౧౭

ఎవ్వఁడు బంగారుసొమ్ములచే నలంకరింపఁబడి సంధ్యామేఘయుక్తంబగు పర్వతంబుకరణిం బోల్చుచున్న గుఱ్ఱంబు నారోహించి తళతళాయమానంబగు ప్రాసంబు చేఁబూని వచ్చుచున్నాఁడో యీతఁడు పిశాచుఁడు. పిడుగువంటి వాఁడు. ౧౮

ఎవ్వఁడు తీక్ష్ణంబును మెఱుపువలె మెఱయుచున్నదియు వజ్రాయుధము కన్న నధికమయిన వేగముగలదియు నగు శూలంబుఁబట్టుకొని పర్వతాకారంబగు వృషభంబు నారోహించి వచ్చుచున్నాఁడో ఈతఁడు యశశ్శాలియగు త్రిశిరుఁడు. ౧౯

మేఘాకారుఁడు విశాలంబును మాంసలంబును సుందరంబునగు ఱొమ్ము గలవాఁడునగు నీరాక్షసుఁడు సన్నద్ధుఁడై పన్నగరాజధ్వజంబుగ్రాల ధనుర్విస్ఫారణంబు గావింపుచున్నాఁడే; ఈతఁడు కుంభుఁడు. ౨౦

ఎవ్వఁడు బంగారముతోను వజ్రమణులతోను నలంకరింపఁబడినదియుఁ బ్రకాశమానంబును ధూమసహితంబునగు పరిఘంబుగొని వచ్చుచున్నాఁడో అతఁడు నికుంభుఁడు; ఈతఁడు రాక్షససైన్యమునకంతయుం ముఖ్యుఁడు; గొప్ప కార్యములు గావించినాఁడు. ౨౧

ఎవ్వఁడు ధనుర్బాణఖడ్గంబులతోఁ గూడినదియుం ధ్వజాలంకృతంబును అగ్నిహోత్రంబువలెఁ బ్రకాశించుచున్నదియుం నగురథంబు నారోహించి భయంకరాకారుఁడై ప్రకాశించుచున్నాఁడో ఈతఁడు నరాంతకుఁడు; పర్వతశిఖరంబులచే యుద్ధముసేయువాఁడు. ౨౨

ఎవ్వఁడు నానావిధభయంకరాకారంబులును వ్యాఘ్రముఖంబులును సర్పముఖంబులును గజముఖంబులును మృగముఖంబులును అశ్వముఖంబులు నగు భూతంబులచేఁ బరివేష్టితుఁడై యొప్పుచున్నాఁడో అతఁడే దేవతలగర్వము

స్సోఽసౌ సురాణా మపి దర్పహన్తా, ౨౩
యత్రైత దిన్ద్రప్రతిమం విభాతి
ఛత్త్రం సితం సూక్ష్మశలాక మగ్ర్యమ్,
అత్రైష రక్షోధిపతి ర్మహాత్మా
భూతై ర్వృతో రుద్ర ఇవావభాతి. ౨౪
అసౌ కిరీటీ చలకుణ్డలాస్యో
నగేన్ద్రవిన్ధ్యోపమభీమకాయః,
మహేన్ద్రవైవస్వతదర్పహన్తా
రక్షోధిపస్సూర్య ఇవావభాతి ౨౫
ప్రత్యువాచ తతో రామో విభీషణ మరిన్దమమ్,

అహో దీప్తో మహాతేజా రావణో రాక్షసేశ్వరః. ౨౬

ఆదిత్య ఇవ దుష్ప్రేక్ష్యో రశ్మిభి ర్భాతి రావణః,

సువ్యక్తం లక్షయే హ్యస్య రూపం తేజస్సమావృతమ్. ౨౭
దేవదానవవీరాణాం వపు ర్నైవంవిధం భవేత్,
యాదృశం రాక్షసేన్ద్రస్య వపురేత త్ప్రకాశతే. ౨౮
సర్వే పర్వతసఙ్కాశా స్సర్వే పర్వతయోధినః,
సర్వే దీప్తాయుధధరా యోధాశ్చాస్య మహౌజసః. ౨౯
భాతి రాక్షసరాజోఽసౌ ప్రదీప్తై ర్భీమవిక్రమైః,
భూతైః పరివృత స్తీక్ష్ణై ర్దేహవద్భి రివాన్తకః. ౩౦

దిష్ట్యాఽయ మద్య పాపాత్మా మమ దృష్టిపథం గతః,
అద్య క్రోధం విమోక్ష్యామి సీతాహరణసమ్భవమ్. ౩౧

నడంచినమహాత్ముఁడు. ౨౩

చంద్రతుల్యంబును సూక్ష్మశలాకంబును నుత్తమంబునగు శ్వేతచ్ఛత్రము ప్రకాశించుచున్నదే; ఈరథమునందే మహాత్ముఁడగు రాక్షసరాజు రాక్షస పరివృతుఁడై భూతసేవితుఁడగు రుద్రునికైవడి దేజరిల్లుచున్నాఁడు. ౨౪

కిరీటధరుఁడును గుండలాలంకృతముగు ముఖము గలవాఁడును హిమవత్పర్వతాకారుఁడు నగు నీతఁడు రాక్షసరాజుండగు రావణుఁడు; ఇంద్రియముల గర్వం బడఁచినవాఁడు; సూర్యుఁడుంబోలె వెలుఁగుచున్నాఁడు చూడుము. అని విభీషణుఁడు రామునితోఁ జెప్పెను. ౨౫

అంత రాముఁడు శత్రువుల నడంగఁద్రొక్కంజాలిన విభీషణుంజూచి యిట్లని బదులుచెప్పెను.

రాక్షసరాజుఁడగు రావణుఁడు దివ్యతేజంబున వెలుంచున్నాఁడు; మహాప్రతాపుఁడుగా నున్నాఁడు ఆశ్చర్యము. ౨౬

రావణుఁడు తేజంబున సూర్యునిపగిదిఁ దేఱిచూడ నలవిగాక వెలుఁగుచున్నాఁడు.

తేటస్సమూహావృతంబగు నీతనిరూపము స్పష్టముగా నగపడుచున్నది.

రాక్షసరాజుండగు నీరావణునిదేహంబు తేజస్సు దేవదానవులలో నెవ్వరికిని లేదు. ౨౭

ఈతనిభటులందఱు మహాతేజులు; పర్వతాకారులు; కొండలచే యుద్ధంబు గావించువారలు; దీప్యమానంబులగు నాయుధంబులం దాల్చియున్నారు.

రాక్షసరాజుండగు నీరావణుఁడు దేదీప్యమానులగు భయంకర పరాక్రములచేఁ బరివేష్టితుఁడై మహాకాయంబులగు భూతములచేఁ బరివృతుఁడగు యమునికైవడిఁ దేజరిల్లుచున్నాఁడు. 3౦

దైవవశంబున నీపాపాత్ముఁడు నాయెదుటంబడెను.

ఇప్పుడు సీతాపహారమునం గలిగినకోపంబుఁ దీర్చుకొనెదను. అని

ఏవ ముక్త్వా తతో రామో ధను రాదాయ వీర్యవాన్,
లక్ష్మణానుచర స్తస్థౌ సముద్ధృత్య శరోత్తమమ్. 32
తత స్స రక్షోధిపతి ర్మహాత్మా
రక్షాంసి తాన్యాహ మహాబలాని,
ద్వారేషు చర్యాగృహగోపురేషు
సునిర్వృతా స్తిష్ఠత నిర్విశఙ్కాః. 33
ఇహాఽగతం మాం సహితం భవద్భి
ర్వనౌకస శ్ఛిద్ర మిదం విదిత్వా,
శూన్యాం పురీం దుష్ప్రసహాం ప్రమథ్య
ప్రధర్షయేయు స్సహసా సమేతాః. 34
విసర్జయిత్వా సహితాన్ తత స్తా
న్గతేషు రక్షస్సు యథానియోగమ్,
వ్యదారయ ద్వానరసాగరౌఘం
మహాఝషః పూర్ణ మివార్ణవౌఘమ్. 35
తమాపత న్తం సహసా సమీక్ష్య
దీప్తేషుచాపం యుధి రాక్షసేన్ద్రమ్,
మహత్సముత్పాట్య మహీధరాగ్రం
దుద్రావ రక్షోధిపతిం హరీశః. 36
తచ్ఛైలశృఙ్గం బహువృక్షసానుం
ప్రగృహ్య చిక్షేప నిశాచరాయ,
తమాపత న్తం సహసా సమీక్ష్య
బిభేద బాణై స్తపనీయపుఙ్ఖైః. 37

తస్మి న్ప్రవృద్ధోత్తమసానువృక్షే

రాముఁడు విభీషణునితోఁ జెప్పెను. ౩౧

అంత మహాపరాక్రమశాలియగురాముఁడు ఈప్రకారము జెప్పి లక్ష్మణ సహితుఁడై ధనుర్బాణంబులుధరియించి సన్నద్ధుఁడై నిలిచియుండెను. ౩౨

అంత మహాపరాక్రమశాలియగు నారాక్షసరాజు రావణుఁడు బలవంతులగురాక్షసులఁజూచి "మీరలు నిశ్చయముగాఁ జతుష్పథగృహములయందును బురద్వారంబులయందును సుఖంబుగాఁ గాచియుండుఁడు" అని యాజ్ఞాపించెను. ౩౩

వానరులు మీరలందఱు నాతోఁగూడ వచ్చియుండుటఁజూచి పట్టణంబున నెవ్వరును సైనికులు లేరనుఛిద్రంబుఁ దెలిసికొని యంత శీఘ్రంబున గుంపుగూడి సుఖంబుగాఁ బురంబుఁ బ్రవేశించి నాశంబునొందింతురు. అని రావణుఁడు రాక్షసవీరులతోఁ జెప్పెను. ౩౪

అంత నారావణుఁడు ఆరాక్షసవీరులంబంపి వారలు రాజాజ్ఞచొప్పునఁ బోయినతరువాత మహామత్స్యము సముద్రజంబులఁ గలంచునట్లు వానరసైన్యంబులం గలంచెను. ౩౫

వానరరాజుండగు సుగ్రీవుఁడు రాక్షసరాజుఁడగు రావణుఁడు దీప్తంబులగు ధనుర్బాణంబులు దాల్చి వేగంబున వానరసేనమీఁదికి వచ్చుటంజూచి గొప్పపర్వతశిఖరము నొకటిఁ బెకలించి రావణునిమీఁది కడరెను. ౩౬

ఆసుగ్రీవుఁడు పెక్కువృక్షంబులతోఁగూడిన తటముగల యాపర్వతశిఖరంబును రావణునిపైనేయ నతఁడది తనమీఁదికి వచ్చుటఁజూచి శీఘ్రంబున బంగారుపింజలుగలబాణంబులచే దానిఁ దునియలుగావించెను. ౩౭

మహావృక్షములతోఁగూడిన నెత్తముగల యాపర్వతశిఖరము తునియ

శృఙ్గే వికీర్ణే పతితే పృథివ్యామ్,
మహాహికల్పం శరమన్తకాభం
సమాదధే రాక్షసలోకనాథః. ౩౮
స తం గృహీత్వాఽనిలతుల్యవేగం
సవిస్ఫులిఙ్గజ్వలనప్రకాశమ్,
బాణం మహేన్ద్రాశనితుల్యవేగం
చిక్షేప సుగ్రీవవధాయ రుష్టః. ౩౯
స సాయకో రావణబాహుముక్త
శ్శక్రాశనిప్రఖ్యవపుశ్శితాగ్రః,
సుగ్రీవమాసాద్య బిభేద వేగా
ద్గుహేరితా క్రౌఞ్చమివోగ్రశక్తిః. ౪౦
స సాయకార్తో విపరీతచేతాః
కూజన్పృథివ్యాం నిపపాత వీరః,
తం ప్రేక్ష్య భూమౌ పతితం విసంజ్ఞం
నేదుః ప్రహృష్టా యుధి యాతుధానాః. ౪౧
తతో గవాక్షో గవయస్సుదంష్ట్ర
స్తథర్షభో జ్యోతిముఖో నలశ్చ,
శైలాన్సముద్యమ్య వివృద్ధకాయాః
ప్రదుద్రువుస్తం ప్రతి రాక్షసేన్ద్రమ్. ౪౨
తేషాం ప్రహారాన్స చకార మోఘా
న్రక్షోధిపో బాణగణైశ్శితాగ్రైః,
తాన్వానరేన్ద్రానపి బాణజాలై
ర్బిభేద జామ్బూనదచిత్రపుఙ్ఖైః. ౪౩
తే వానరేన్ద్రాస్త్రిదశారిబాణై

లయి నేలంబడిన తరువాత రాక్షసరాజుండగు రావణుండు మృత్యువుంబోలిన దియుం మహాసర్పంబువంటిదియునగు నొక్క దివ్యబాణంబును ధనుస్సున సంధించెను. ౩౮

ఆ రావణుండు కుపితుండై వాయువునకుంబోలె వేగంబుగలదియుం గణంబులతోఁగూడిన నిప్పువలె మండుచున్నదియుం దేవేంద్రుని వజ్రాయుధంబు వంటిదియునగు నాబాణంబును గ్రహించి సుగ్రీవవధార్థమయి ప్రయోగించెను. ౩౯

ఇంద్రునివజ్రాయుధముంబోలె నతికఠినంబును తీక్ష్ణమయిన యగ్రము గలదియునగు నాబాణము రావణబాహుముక్తంబై వేగంబునఁ గుమారస్వామి ప్రయుక్తంబగు శక్తిక్రౌంచపర్వతమును భేదించినట్లు సుగ్రీవుని భేదించెను.

వీరుండగు నా సుగ్రీవుండు బాణపీడితుండై తెలివిదప్పి వెలవెలం గూయుచు నేలంబడెను. రాక్షసులందఱు అట్లు సుగ్రీవుండు యుద్ధంబున మూర్ఛితుండై నేలంబడుటనుజూచి సంతోషంబున సింహనాదంబులు గావించిరి. ౪౧

అంత గవాక్షుండును గవయుండును ఋషభుండును జ్యోతిర్ముఖుండును నభుండును మేనులు పెంచికొని పర్వతంబులందిసికొని యారాక్షస రాజుమీఁది కడరిరి. ౪౨

ఆ రావణుండు ఆవ్వానరవీరులు వేసినపర్వతములను దీక్ష్ణబాణంబులఁ దునియలు గావించి యవ్వానరోత్తములను గాంచనపుంఖములగు బాణంబుల నొప్పించెను. ౪౩

భయంకరాకారులగు నావానరోత్తములు రావణుని బాణంబులచే భిన్న

ర్భిన్నా నిపేతు ర్భువి భీమకాయాః,
తతస్తు తద్వానరసైన్య ముగ్రం
ప్రచ్ఛాదయామాస స బాణజాలైః. ౪౪
తే వధ్యమానాః పతితాః ప్రవీరా
నానద్యమానా భయశల్యవిద్ధాః,
శాఖామృగా రావణసాయకార్తాః
జగ్ము శ్శరణ్యం శరణం స్మ రామమ్. ౪౫
తతో మహాత్మా స ధనుర్ధనుష్మా
నాదాయ రామ స్సహసా జగామ,
తం లక్ష్మణః ప్రాఞ్జలి రభ్యు పేత్య
ఉవాచ వాక్యం పరమార్థయుక్తమ్. ౪౬
కామ మార్య స్సుపర్యాప్తో వధాయాస్య దురాత్మనః,
విధమిష్యా మ్యహం నీచమనుజానీహి మాం ప్రభో!. ౪౭

తమబ్రవీ న్మహాతేజా రామ స్సత్యపరాక్రమః,

గచ్ఛ! యత్నపరశ్చాపి భవ లక్ష్మణ! సంయుగే. ౪౮
రావణో హి మహావీర్యో రణేఽద్భుతపరాక్రమః,

త్రైలోక్యే నాపి, సంక్రుద్ధో దుష్ప్రసహ్యో నసంశయః. ౪౯

తస్య చ్ఛిద్రాణి మార్గస్వ స్వచ్ఛిద్రాణి చ లక్షయ,

చక్షుషా ధనుషా యత్నా ద్రక్షాత్మానం సమాహితః. ౫౦

దేహులయి నేలంబడిరి. అంత నారావణుఁడు నవ్వానరసేననంతయుఁ దీక్ష్ణంబు లగు బాణసమూహంబుల ముంచెను. ౪౪

మహాపరాక్రమశాలులగు నవ్వానరవీరులు రావణుని బాణంబులచేఁ బీడితులయి పరమభీతులయి యఱచుచు నేలంబడి శరణ్యుఁడగు రాముని శరణుచొచ్చిరి. ౪౫

అంత మహాత్ముఁడు మహాధనుర్ధరుఁడు నగు రాముఁడు ధనుస్సు దీసికొని శీఘ్రంబున వానరరక్షణార్థంబు పోయెను; అప్పుడు లక్ష్మణుఁడు ఆ రాముని యొద్దకుఁబోయి చేమోడ్పుగీలించి పరమార్థయుక్తం బగు నీమాటం జెప్పెను.

పూజ్యుఁడవగు నీకు దురాత్మునివధింప నెంతమాత్రము; అయినను ఈతఁడు నీతో యుద్ధంబుసేయ యోగ్యుఁడుకాఁడు; కావున నీతని నేను వధించెదను; నా కనుజ్ఞయొసంగుము. అని లక్ష్మణుఁడు రామునితోఁ జెప్పెను.

మహాతేజుఁడును సత్యపరాక్రముఁడు నగురాముఁడు ఆలక్ష్మణుంజూచి యిట్లని చెప్పెను.

లక్ష్మణుఁడా! పొమ్ము; యుద్ధంబున జాగ్రత్తతో నుండుము. ౪౭

రావణుఁడు మహాపరాక్రమశాలి; యుద్ధంబున నతనిపరాక్రమంబు అత్యాశ్చర్యకరంబుగా నుండును.

ఈతఁడు కుపితుఁడగునేని ముల్లోకంబులుంగూడ నీతనియెదుట నిలువం జాలవు. ౪౯

అతని ఛిద్రంబులనుజూచి ప్రహరింపుము; నీఛిద్రంబులను గనుఁగొని పవరించుకొనుము.

ఆ త్వరితరితతోఁ బ్రయత్నంబునఁ జక్కఁగాఁ గంటంజూచుచు ధనుస్సుచే నిన్ను రక్షించుకొనుచు యుద్ధంబు గావింపుము. అని రాముఁడు

రాఘవస్య వచ శ్శ్రుత్వా పరిష్వజ్యాభిపూజ్య చ,
అభివాద్య తతో రామం యయౌ సౌమిత్రి రాహవమ్. ౫౧

స రావణం వారణహస్తబాహు
ర్దదర్శ దీప్తోద్యతభీమచాపమ్.
ప్రచ్ఛాదయన్తం శరవృష్టిజాలై
స్తా న్వానరా న్భిన్నవికీర్ణ దేహాన్. ౫౨

త మాలోక్య మహాతేజా హనూమా న్మారుతాత్మజః.
నివార్య శరజాలాని ప్రదుద్రావ స రావణమ్. ౫౩

రథం తస్య సమాసాద్య భుజ ముద్యమ్య దక్షిణమ్,
త్రాసయ న్రావణం ధీమా న్హనూమా న్వాక్య మబ్రవీత్. ౫౪
దేవదానవగన్ధర్వా యక్షాశ్చ సహ రాక్షసైః,
అవధ్యం తు త్వయా భగ్నా వానరేభ్య స్తు తే భయమ్. ౫౫
ఏష మే దక్షిణో బాహుః పఞ్చశాఖ స్సముద్యతః,
విధమిష్యతి తే దేహా ద్భూతాత్మానం చిరోషితమ్. ౫౬

శ్రుత్వా హనుమతో వాక్యం రావణో భీమవిక్రమః,
సంరక్తనయన క్రోధా దిదం వచన మబ్రవీత్. ౫౭
క్షిప్రం ప్రహర నిశ్శఙ్కం స్థిరాం కీర్తి మవాప్నుహి,
తత స్త్వాం జ్ఞాతవిక్రాన్తం నాశయిష్యామి వానర!. ౫౮

రావణస్య వచః శ్రుత్వా వాయుసూను ర్వచోఽబ్రవీత్,

లక్ష్మణునకుఁ జెప్పెను. ౫౦

లక్ష్మణుఁడు రామునిమాటనువిని రామునిం గవుఁగలించికొని పూజించి నమస్కరించి యంత యుద్ధంబునకుఁ బోయెను. ౫౧

ఏనుఁగుతొండములవంటి బాహువులుగల యాలక్ష్మణుఁడు దేదీప్యమానంబగు భయంకరధనుస్సుఁ బట్టుకొని ఖిన్నులయి నేలంబడి యుండు వానరులపై బాణవర్షంబులు గురిపించుచున్న రావణుం జూచెను. ౫౨

మహాతేజుఁడును వాయుదేవునికుమారుఁడు నగుహనుమంతుఁడు లక్ష్మణుఁడు యుద్ధంబునకు వచ్చుటంజూచి భృత్యుఁడు తానుండగా నాయన్న కేల కష్టమని బాణసమూహములను సరకుసేయక రావణునిపై కడరెను. ౫౩

బుద్ధిమంతుఁడగు హనుమంతుఁడు రావణునిరథంబుఁ జేరి కుడిభుజం బెత్తి రావణుని భయపఱచుచు నిట్లని చెప్పెను. ౫౪

నీవు దేవతలను దానవులను గంధర్వులను యక్షులను రాక్షసులను జయించియున్నావు. వాస్తవము; నీకు వానరులవలన మాత్రము భయముగలదు.

అయిదువ్రేళ్లుగలదియు సముద్యతంబునయిన యీ నాదక్షిణబాహువు ఇప్పుడు నిన్ను వధించి నీదేహంబున బహుకాలంబుగా నున్న జీవుని వెలువరింపఁ గలదు. అని హనుమంతుఁడు రావణునితోఁ జెప్పెను. ౫౬

భయంకరపరాక్రముఁడగు రావణుఁడు హనుమంతునిమాటను విని కోపంబునఁ గన్నులనెఱ్ఱఁదనంబుగదురహనుమంతుంజూచి యిట్లని చెప్పెను.

హనుమంతుఁడా! శీఘ్రింబున నిర్భయంబుగాఁ బ్రహరింపుము. ఒకకోఁతి రావణుని యుద్ధంబునం గొట్టెనని స్థిరమయిన కీర్తిం బొందుము. అంత నేను నీపరాక్రమంబుఁ దెలిసి నిన్ను వధించి పుచ్చెదను. అని రావణుఁడు హనుమంతునితోఁ జెప్పెను. ౫౭

వాయుదేవునికుమారుఁడగు హనుమంతుఁడు రావణునిమాటనువిని యిట్లని చెప్పెను.

ప్రహృతం హి మయా పూర్వ మక్షం స్మర సుతం తవ. ౫౯

ఏవ ముక్తో మహాతేజా రావణో రాక్షసేశ్వరః,
ఆజఘానానిలసుతం తలేనోరసి వీర్యవాన్. ౬౦
స తలాభిహత స్తేన చచాల చ ముహుర్ముహుః,

స్థిత్వా ముహూర్తం తేజస్వీ స్థైర్యం కృత్వా మహామతిః. ౬౧
ఆజఘా నాభిసంక్రుద్ధ స్తలే నైవామరద్విషమ్,

తత స్తలే నాభిహతో వానరేణ మహాత్మనా. ౬౨
దశగ్రీవ స్సమాధూతో యథా భూమిచలేఽచలః,
సఙ్గ్రామే తం తథా దృష్ట్వా రావణం తలతాడితమ్. ౬౩
ఋషయో వానరా స్సిద్ధా నేదు ర్దేవా స్సహాసురైః,

అథాఽఽశ్వాస్య మహాతేజా రావణో వాక్య మబ్రవీత్. ౬౪

సాధు వానర! వీర్యేణ శ్లాఘనీయోఽసి మే రిపుః,

రావణే నైవ ముక్తస్తు మారుతి ర్వాక్య మబ్రవీత్. ౬౫

ధిగస్తు మమ వీర్యేణ య స్త్వం జీవసి రావణ!,

సకృత్తు ప్రహ రేదానీం దుర్బుద్ధే! కిం వికత్థసే ౬౬

మున్ను నాచే దెబ్బదిని చచ్చిన నీకొడుకు నక్షుని దలఁచుకొనుము. అని హనుమంతుఁడు రావణునితోఁ జెప్పెను. ౫౯

మహాతేజుఁడు మహాపరాక్రమశాలియు నగురాక్షసరాజు రావణుఁడు హనుమంతుని మాటను విని ఱొమ్మున నఱచేతం జఱచెను. ౬౦

హనుమంతుఁడు రావణుని యఱచేతిదెబ్బకు మిక్కిలియుఁ జలనంబు నొందెను.

మహాపరాక్రమశాలియు బుద్ధిమంతుఁడు నగుహనుమంతుఁడు కొంచెము సేపుండి స్థైర్యంబు దెచ్చుకొని పరమక్రుద్ధుఁడై యారావణుని నఱచేతం బ్రహరించెను. ౬౧

అంత రావణుఁడు మహాబలుఁడగు హనుమంతుని యఱచేతి దెబ్బకు భూకంపమునఁ బర్వతము చలించునట్లు మిక్కిలియుఁ జలించెను ౬౨

అట్లు రావణుఁడు యుద్ధంబున హనుమంతునిహస్తతలంబునం దాడితుఁడై చలించుటంజూచి వానరులును ఋషులును దేవతలు నసురులును బరమసంతోషంబునఁ గోలాహలంబు గావించిరి. ౬౩

అంత మహాతేజుఁడగు రావణుఁడు ఊఱటనొంది హనుమంతుంజూచి యిట్లని చెప్పెను. ౬౪

హనుమంతుఁడా! లెస్సలెస్స నీవు నాకు శత్రుఁడవైనను నీపరాక్రమంబునకు మెచ్చుకొన్నాను. అని రావణుఁడు హనుమంతునితోఁ జెప్పెను.

అంత హనుమంతుఁ డిట్లని చెప్పెను; నాపరాక్రమమేల? దహింపఁబడుఁగాక. ౬౫

రావణుఁడా! నాచేఁ గొట్టఁబడినవాఁడవయ్యు నీవు చావక బ్రతికియున్నావే; అట్టి నాపరాక్రమము దహింపఁబడుఁగాక.

దురాత్ముఁడవగు రావణుఁడా! ఇంకను ఒకమాఱుమాత్రము ప్రహరింపుము; ఊరక నిన్ను నీవే పొగడుకొనెద వేల? ౬౬

తత స్త్వాం మామికా ముష్టి ర్నయిష్యతి యమక్షయమ్,

తతో మారుతివాక్యేన క్రోధ స్తస్య తదాఽజ్వలత్, ౬౭
సంరక్తనయనో యత్నా న్ముష్టి ముద్యమ్య దక్షిణమ్,
పాతయామాస వేగేన వానరోరసి వీర్యవాన్. ౬౮

హనూమా న్వక్షసి వ్యూఢే సంచచాల హతః పునః,

విహ్వలం తు తదా దృష్ట్వా హనూమన్తం మహాబలమ్. ౬౯
రథేనాతిరథ శ్శీఘ్రం నీలం ప్రతిసమభ్యగాత్,

రాక్షసానా మధిపతి ర్దశగ్రీవః ప్రతాపవాన్. ౭౦
పన్నగప్రతిమై ర్భీమైః పరమర్మాతిభేదిభిః,
శరై రాదీపయామాస నీలం హరిచమూపతిమ్. ౭౧
సశరౌఘసమాయస్తో నీలః కపిచమూపతిః,
కరేణైకేన శైలాగ్రం రక్షోధిపతయేఽసృజత్. ౭౨
హనుమా నపి తేజస్వీ సమాశ్వస్తో మహామనాః,
విప్రేక్షమాణో యుద్ధేప్సు స్సరోష మిద మబ్రవీత్. ౭౩
నీలేన సహ సంయుక్తం రావణం రాక్షసేశ్వరమ్,

అన్యేన యుధ్యమానస్య న యుక్త మభిధావనమ్. ౭౪

రావణోఽపి మహాతేజా స్తచ్ఛృఙ్గం సప్తభి శ్శరైః,
ఆజఘాన సుతీక్ష్ణాగ్రై స్తద్వికీర్ణం పపాతహ. ౭౫

అంత నేనొకపిడికిటిపోటుతో నిన్ను యమపురికిం బంపెదను. అని హనుమంతుండు రావణునితోఁ జెప్పెను.

అంత హనుమంతునిమాటకు రావణునకు మహాకోపంబువచ్చినది. ౧౭

మహాపరాక్రమశాలియగు రావణుఁడు కోపంబునం గన్నుల నెఱ్ఱఁదనంబుదోఁప దక్షిణహస్తంబున దృఢంబుగాఁ బిడికిలి యలవరించి వేగంబున హనుమంతుని వక్షస్స్థలంబునం బొడిచెను. ౧౮

హనుమంతుఁడు అట్లు విశాలంబగు వక్షస్స్థలంబునఁ గొట్టఁబడినవాఁడై మరలఁ జలనంబునొందెను.

అతిరథుండగురావణుండు మహాబలశాలియయినహనుమంతుండు సోలుటంజూచి యాతండు తెప్పిఱిలినఁ గష్టుని శీఘ్రంబున నీలునిమీఁదికిఁ బోయెను. ౧౯

మహాపరాక్రమశాలియగు రాక్షసేశ్వరుఁడు రావణుఁడు పన్నగతుల్యంబులును భయంకరంబులును శత్రువుల మర్మస్థానంబుల భేదించునవియు నగు బాణంబులు వానరసేనానాయకుఁడగు నీలునిపైఁ బఱపెను. ౨౦,౨౧

వానరసేనానాయకుఁడగునీలుఁడు అట్లు బాణసమూహంబులచేఁ బీడితుఁడై ఒక్కచేత నొకపర్వతశిఖరంబుఁగొని రాక్షసరాజుపై నేసెను. ౨౨

మహాపరాక్రమశాలియు మహాత్ముఁడునగు హనుమంతుఁడంతఁ దెప్పఱిలి యుద్ధకాంక్షచే నలుప్రక్కలం జూచి నీలునితో యుద్ధంబుఁ గావించుచున్న రావణుంగని తప్పించుకొనిపోయినాఁడను కోపంబున నతనితో నిట్లని చెప్పెను. ౨౩

మఱియొకనితోడి యుద్ధముసేయుచున్నవానిం దఱుముకొనిపోవుట యుక్తముకాదు; కావున నిన్ను విడిచినాను. అని హనుమంతుఁడు రావణునితోఁ జెప్పెను. ౨౪

మహాతేజుఁడగు రావణుఁడును ఆపర్వతశిఖరంబును ఏడుతీక్ష్ణబాణంబులచే ఖండింప నది తునియలయి నేలంబడెను. ౨౫

త ద్వికీర్ణం గిరే శ్శృఙ్గం దృష్ట్వా హరిచమూపతిః.
కాలాగ్ని రివ జజ్వాల క్రోధేన పరవీరహా. ౭౬

సోఽశ్వకర్ణాన్ధవాన్ సాలాం శ్చూతాం శ్చాపి సుపుష్పితాన్,
అన్యాంశ్చ వివిధా న్వృక్షా న్నీల శ్చిక్షేప సంయుగే. ౭౭

స తా న్వృక్షాన్ సమాసాద్య ప్రతిచిచ్ఛేద రావణః,
అభ్యవర్ష త్సుఘోరేణ శరవర్షేణ పావకిమ్. ౭౮
అభివృష్ట శ్శరౌఘేణ మేఘే నేవ మహాచలః.
హ్రస్వం కృత్వా తదా రూపం ధ్వజాగ్రే నిపపాత హ. ౭౯

పావకాత్మజ మాలోక్య ధ్వజాగ్రే సముపస్థితమ్,
జజ్వాల రావణః క్రోధా త్తతో నీలో ననాద చ. ౮౦

ధ్వజాగ్రే ధనుష శ్చాగ్రే కిరీటాగ్రే చ తం హరిమ్,
లక్ష్మణోఽథ హనూమాంశ్చ దృష్ట్వా రామశ్చ విస్మితాః. ౮౧

రావణోఽపి మహాతేజాః కపిలాఘవవిస్మితః,
అస్త్ర మాహారయామాస దీప్త మాగ్నేయ మద్భుతమ్. ౮౨
తత స్తే చుక్రుశు ర్హృష్టా లబ్ధలక్షాః ప్లవఙ్గమాః,
నీలలాఘవసంభ్రాన్తం దృష్ట్వా రావణ మాహవే. ౮౩
వానరాణాం చ నాదేన సంరబ్ధో రావణ స్తదా,
సమ్భ్రమావిష్టహృదయో న కించి త్ప్రత్యపద్యత. ౮౪

ఆగ్నేయేనాథ సంయుక్తం గృహీత్వా రావణ శ్శరమ్,

శత్రువీరులవధించునట్టి వానరసేనానాయకుఁడు నీలుఁడు తాను ప్రయోగించినపర్వతశిఖరంబు దునియలగుటంజూచి కోపంబునఁ బ్రలయకాలాగ్నికైవడి మండిపడెను. ౨౬

ఆనీలుఁ డప్పుడు యుద్ధంబున ఇనుమద్దిచెట్లను చక్కఁగాఁ బూచిన మామిడిచెట్లను మఱియుం నితరములయిన నానావిధవృక్షములను రావణునిపై వేసెను. ౨౭

అంత రావణుఁడు ఆవృక్షముల నన్నిఁటిని గఱుకుబాణంబుల ఖండించి నీలునిమీఁద మిక్కిలియుఁ భయంకరంబగు బాణవర్షంబుఁ గురిపించెను.

ఆనీలుఁడు అట్లు మేఘంబుచే మహాపర్వతంబుకరణి రావణునిచే బాణవర్షంబున నభివృష్టుఁడై తనయాకారమును హ్రస్వమును గావించికొని రావణునిధ్వజాగ్రంబుమీఁదికి వ్రాలెను. ౨౯

రావణుఁ డట్లు నీలుఁడు తనధ్వజాగ్రంబుమీఁదికి వ్రాలుటంజూచి పరమక్రుద్ధుఁడై మండిపడెను; నీలుఁడు ధ్వజాగ్రంబుననుండి సింహనాదంబు గావించెను. ౩౦

అంత రావణునికి బాణంబువిడువ గుఱి నిలువకుండునట్లు ధ్వజాగ్రంబునను గిరీటాగ్రంబునను సంచరించుచున్న నీలుంజూచి లక్ష్మణుఁడును హనుమంతుఁడును రాముఁడును ఆశ్చర్యము నొందిరి. ౩౧

మహాతేజుఁడగు రావణుఁడును నీలునిలాఘవమున కాశ్చర్యమునొంది దివ్యంబగు నాగ్నేయాస్త్రంబు గ్రహించెను. ౩౨

అంత నావానరులందఱు రావణుఁడు యుద్ధంబున నీలునిలాఘవంబుచే సంభ్రాంతుఁడగుట వెఱఁగి సంతోషంబునొందిసింహనాదంబులు గావించిరి.

అప్పుడు నీలునిలాఘవంబుచే సంభ్రాంతుండై యాగ్నేయాస్త్రసంధాన సంరంభంబున నున్నరావణుఁడు వానరులుచేయు కోలాహలంబుచేఁ గొంతసే పేమియుఁ దోఁచకుండెను. ౩౪

అంత రావణుఁడు ఆగ్నేయాస్త్రముతో నభిమంత్రింపఁబడిన శరంబుఁ

ధ్వజశీర్షస్థితం నీల ముదైక్షత నిశాచరః. ౮౫
తతోఽబ్రవీ న్మహాతేజా రావణో రాక్షసేశ్వరః,

కపే! లాఘవయుక్తోఽసి మాయయా పరయాఽనయా. ౮౬

జీవితం ఖలు రక్షస్వ యది శక్నోషి వానర!,
తాని తాన్యాత్మరూపాణి సృజసి త్వమనేకశః. ౮౭

తథాపి త్వాం మయా యుక్త స్సాయకోఽస్త్రప్రయోజితః,
జీవితం పరిరక్షన్తం జీవితా ద్భ్రంశయిష్యతి. ౮౮

ఏవ ముక్త్వా మహాబాహూ రావణో రాక్షసేశ్వరః,
సంధాయ బాణ మస్త్రేణ చమూపతి మతాడయత్. ౮౯

సోఽస్త్రయుక్తేన బాణేన నీలో వక్షసి తాడితః,
నిర్దహ్యమాన స్సహసా నిపపాత మహీతలే. ౯౦

పితృమాహాత్మ్యసంయోగా దాత్మన శ్చాపి తేజసా,
జానుభ్యా మపత ద్భూమౌ నచ ప్రాణై ర్వ్యయుజ్యత. ౯౧

విసంజ్ఞం వానరం దృష్ట్వా దశగ్రీవో రణోత్సుకః,
రథే నామ్బుదనాదేన సౌమిత్రి మభిదుద్రువే. ౯౨
ఆసాద్య రణమధ్యే తు వారయిత్వా స్థితో జ్వలన్,
ధను ర్విస్ఫారయామాస కమ్పయన్నివ మేదినీమ్. ౯౩

దీసి ధ్వజాగ్రంబుననున్న నీలుం గాంచెను. ౧౫

అంత మహాపరాక్రమశాలియగు రాక్షసరాజు రావణుఁడు నీలునితో నిట్లని చెప్పెను.

నీలుఁడా! నీవు చాలమాయలు నేర్చినవాఁడవు; మహాలాఘవము గలిగియున్నావు. ౧౬

నీలుఁడా! ఇప్పుడు నీవు శక్తిగలదేని నీప్రాణము రక్షించుకొనుము.

నీవు నానావిధములగు నయ్యైరూపంబులం దాల్చెదవు; దానింజూడ నాశ్చర్యమగుచున్నది. ౧౭

అట్లు నీవు ప్రాణసంరక్షణార్థమయి మాయచే నానావిధరూపంబులు దాల్చుచున్నను నే నిప్పుడు ప్రయోగించుదివ్యాస్త్రయుక్త మగుబాణము నిన్ను మృతుంజేయఁగలదు. అని రావణుఁడు నీలునితోఁ జెప్పెను. ౧౮

మహాబాహుఁడగు రాక్షసేశ్వరుండగు రావణుఁడు ఈప్రకారమునం జెప్పి యాగ్నేయాస్త్రంబుచే బాణంబు నభిమంత్రించి వానరసేనానాయకుఁడగు నీలుపై విడిచెను. ౧౯

ఆనీలుఁడు ఆగ్నేయాస్త్రముచే వక్షస్థలంబునం దాడితుఁడై యాదివ్యాస్త్రజ్వాలలచే దహింపఁబడుచు తటాలున ధ్వజాగ్రంబుననుండి భూమిం బడెను. ౨౦

ఆనీలుఁడు తండ్రియగు నగ్నిహోత్రుని యనుగ్రహమువలనను తన తేజోమహిమవలనను ఆయాగ్నేయాస్త్రంబుచే విసంజ్ఞుఁడై మోఁకాళ్లూనుకొని నేలంబడెనుగాని మృతుఁడుకాఁడయ్యె. ౨౧

రావణుఁడు నీలుఁడు మూర్ఛితుఁడగుటనుజూచి యుద్ధోత్సుకుఁడై మేఘగర్జనంబువంటి ధ్వనిగలరథంబుచే లక్ష్మణునిమీఁది కడరెను. ౨౨

ఆరావణుఁడు లక్ష్మణుంబొంది యడ్డమువచ్చిన సుగ్రీవాదుల వారించి యుద్ధమధ్యంబునఁ దేజరిల్లుచున్నవాఁడై, భూమియదరునట్లు ధనస్సును జ్యాకర్షణంబున ధ్వనింపఁజేసెను. ౨౩

త మాహ సౌమిత్రిరదీనసత్త్వో
విస్ఫారయన్తం ధను రప్రమేయమ్,
అభ్యేహి మామేవ నిశాచరేన్ద్ర!
న వానరాం స్త్వం ప్రతియోద్ధు మర్హః. ౯౪
స తస్య వాక్యం ప్రతిపూర్ణఘోషం
జ్యాశబ్ద ముగ్రం చ నిశమ్య రాజా,
ఆసాద్య సౌమిత్రి ముపస్థితం తం
కోపాన్వితో వాక్యమువాచ రక్షః. ౯౫
దిష్ట్యాఽసి మే రాఘవ! దృష్టిమార్గం
ప్రాప్తోఽన్తగామీ విపరీతబుద్ధిః,
అస్మి న్క్షణే యాస్యసి మృత్యుదేశం
సంసాద్యమానో మమ బాణజాలైః. ౯౬
తమాహ సౌమిత్రి రవిస్మయానో
గర్జన్త ముద్వృత్తసితాగ్రదంష్ట్రమ్,
రాజ! న్నగర్జన్తి మహాప్రభావా
వికత్థనే పాపకృతాం వరిష్ఠ! ౯౭
జానామి వీర్యం తవ రాక్షసేన్ద్ర!
బలం ప్రతాపం చ పరాక్రమం చ,
అవస్థితోఽహం శరచాపపాణి
రాగచ్ఛ కిం మోఘవికత్థనేన. ౯౮
స ఏవ ముక్తః కుపిత స్ససర్జ
రక్షోధిప స్సప్త శరాన్ సుపుఙ్ఖాన్,
తాన్లక్ష్మణః కాఞ్చనచిత్రపుఙ్ఖై
శ్చిచ్ఛేద బాణై ర్నిశితాగ్రధారైః. ౯౯

మహాబలశాలియగు లక్ష్మణుఁడు అట్లు మహాప్రమాణంబగు ధనుస్సును ధ్వనింపఁజేయుచున్న రావణుంజూచి యిట్లని చెప్పెను

రాక్షసరాజుండవగు రావణుఁడా! ఈవానరులతో యుద్ధముసేయుచున్నావేమి? నాయొద్దకురమ్ము. అని లక్ష్మణుఁడు రావణునితోఁ జెప్పెను. ౯౪

రాక్షసేశ్వరుఁడగు రావణుఁడు ఆలక్ష్మణుని యతిగంభీరధ్వనిగలమాటను భయంకరంబగు జ్యానాదంబును విని క్రుద్ధుఁడై లక్ష్మణునిడగ్గఱి యిట్లని చెప్పెను. ౯౫

లక్ష్మణుఁడా! నీకు నాశముసమీపించినది కావున విపరీతబుద్ధితో నాభాగ్యవశంబున నాదృష్టింబడినావు.

ఈక్షణంబునందే నీవు నాబాణంబుల హతుఁడవయి యమపురికిం బోఁగలవు. అని రావణుఁడు లక్ష్మణునితోఁ జెప్పెను. ౯౬

లక్ష్మణుఁడు అట్లు గర్జించుచున్నవాఁడును తెల్లనివియైనున్నశంబులు నగు దంష్ట్రాగ్రంబులుగలవాఁడు నగురావణునిం దృణీకరించి యిట్లనిచెప్పెను.

పాపిష్ఠులలో నుత్తముఁడవయిన రావణుఁడా! మహాప్రభావులగువారలు నీయట్లు గర్జింపరు; నిన్ను నీవే పొగడుకొనుచున్నావు. ౯౭

రాక్షసనాథుఁడవగు రావణుఁడా! నీశక్తియు నీబలంబును నీప్రతాపంబును నీపరాక్రమంబును నాకుఁ జక్కఁగాఁ దెలియును.

నేను ధనుర్బాణంబులుదాల్చి నిల్చియున్నాను; యుద్ధంబునకురమ్ము; ఇట్లు వ్యర్థముగా నాత్మస్తుతిచేసికొనుటచే నేమి ప్రయోజనము? అని లక్ష్మణుఁడు రావణునితోఁ జెప్పెను. ౯౮

రాక్షసేశ్వరుఁడగు రావణుఁడు లక్ష్మణునిమాటనువిని కుపితుఁడై లక్ష్మణునిపై ఏడుబాణంబులు ప్రయోగించెను.

లక్ష్మణుఁడు కాంచనపుంఖంబులును తీక్ష్ణాగ్రంబులునగు బాణంబులచే నారావణుఁడు ప్రయోగించినబాణంబుల నేడింటిని ఖండించెను. ౯౯

తా న్ప్రేక్షమాణ స్సహసా నికృత్తా
న్నికృత్తభోగా నివ పన్నగేన్ద్రాన్,
లక్ష్మేశ్వరః క్రోధవశం జగామ
ససర్జ చాన్యా న్నిశితా న్పృషత్కాన్. ౧౦౦

స బాణవర్షం తు వవర్ష తీవ్రం
రామానుజః కార్ముక సమ్ప్రయుక్తమ్,
క్షురార్ధచన్ద్రోత్తమకర్ణిభల్లై
శ్శరాంశ్చ చిచ్ఛేద న చుక్షుభే చ, ౧౦౧

స బాణజాలా న్యథ తాని తాని
మోఘాని పశ్యం స్త్రిదశారిరాజః,
విసిస్మియే లక్ష్మణ లాఘవేన
పున శ్చ బాణా న్నిశితా న్ముమోచ. ౧౦౨

స లక్ష్మణ శ్చాశు శరాన్ శితాగ్రా
న్మహేన్ద్రవజ్రాశనితుల్యవేగాన్,
సంధాయ చాపే జ్వలనప్రకాశా
ససర్జ రక్షోధిపతే ర్వధాయ. ౧౦౩

స తా న్ప్రచిచ్ఛేద హి రాక్షసేన్ద్ర
శ్ఛిత్వా చ తాన్లక్ష్మణ మాజఘాన,
శరేణ కాలాగ్నిసమప్రభేణ
స్వాయమ్భువదత్తేన లలాటదేశే. ౧౦౪

స లక్ష్మణో రావణసాయకార్త
శ్చచాల చాపం శిథిలం ప్రగృహ్య,
పునశ్చ సంజ్ఞాం ప్రతిలభ్య కృచ్ఛ్రా
చ్చిచ్ఛేద చాపం త్రిదశేన్ద్రశత్రోః. ౧౦౫

లంకారాజుండగు రావణుఁడు దాను బ్రయోగించిన బాణంబులు ఛేదింపఁబడి ఛిన్నశరీరంబులగు మహాసర్పంబులకై పడి నేలంబడుటం జూచి కుపితుఁడై మఱియుఁ దీక్ష్ణబాణంబులం బ్రయోగించెను. ౧౦౦

ఆ లక్ష్మణుఁడు తనధనుస్సు మండలాకారంబు గావించి రావణునిపై దీవ్రంబగు బాణవర్షంబు గురిపించి కత్తివాతియమ్ముల చేతను నర్ధచంద్రాకార బాణంబులచేతను గర్ణాకారబాణముల చేతను భల్లంబులచేతను రావణుఁడేయు బాణంబుల ఖండించుచు నెంతమాత్రముఁ గలఁతనొందకుండెను. ౧౦౧

రాక్షసరాజుఁడగు రావణుఁడు తానేయు బాణంబు లన్నింటిని లక్ష్మణుఁడు ఖండించుచు మఱియుం దన్ను బాణంబులనొప్పించుటం జూచి లక్ష్మణుని శరసంధానలాఘవంబున కచ్చెరువొందుచు మరల దీక్ష్ణములగు బాణంబులం బ్రయోగించెను. ౧౦౨

ఆ లక్ష్మణుఁడు రావణవధార్థమయి శీఘ్రంబునఁ దీక్ష్ణాగ్రంబులును దేవేంద్రుని వజ్రాయుధంబునకును బిడుగునకును సమానమయిన వేగముగలవియుం నగ్నిహోత్రతుల్యంబునగు బాణంబులు వింటంగూర్చి విడిచెను. ౧౦౩

రాక్షసనాథుఁడగు రావణుఁడు లక్ష్మణుఁడేసినబాణంబులను ఖండించి తనకు బ్రహ్మదేవుఁ డొసంగిన ప్రలయకాలాగ్నితుల్యంబగు దివ్యశరంబు సంధించి లక్ష్మణుని లలాటంబు నాటనేసెను. ౧౦౪

ఆ లక్ష్మణుఁడు రావణబాణపీడితుఁడై శిథిలంబుగా ధనస్సుఁబట్టుకొని చలనంబునొంది మూర్ఛిల్లెను. అంతఁ గొంతఁదడవునకు మూర్ఛదేఱి రావణుని చేతి ధనుస్సును ఖండించెను. ౧౦౫

నికృత్తచాపం త్రిభిరాజఘాన
బాణై స్తదా దాశరథి శ్శితాగ్రైః,
స సాయకార్తో విచచాల రాజా
కృచ్ఛ్రాచ్చ సంజ్ఞాం పున రాససాద. ౧౦౬
స కృత్తచాప శ్శరతాడితశ్చ
మేదార్ద్రగాత్రో రుధిరావసిక్తః,
జగ్రాహ శక్తిం సముదగ్రశక్తి
స్స్వయమ్భుదత్తాం యుధి దేవశత్రుః. ౧౦౭
స తాం విధూమానలసన్నికాశాం
విత్రాసినీం వానరవాహినీనామ్,
చిక్షేప శక్తిం తరసా జ్వలన్తీం
సౌమిత్రయే రాక్షసరాష్ట్రనాథః. ౧౦౮
తా మాపతన్తీం భరతానుజోఽస్త్రై
ర్జఘాన బాణైశ్చ హుతాగ్నికల్పైః,
తథాపి సా తస్య వివేశ శక్తి
ర్భుజాన్తరం దాశరథే ర్విశాలమ్. ౧౦౯
స శక్తిమాన్ శక్తిసమాహతస్సన్
ముహుః ప్రజజ్వాల రఘుప్రవీరః,
తం విహ్వలన్తం సహసాఽభ్యుపేత్య
జగ్రాహ రాజా తరసా భుజాభ్యామ్. ౧౧౦
హిమవా న్మన్దరో మేరు స్త్రైలోక్యం వా సహామరైః,
శక్యం భుజాభ్యా ముద్ధర్తుం నసంఖ్యే భరతానుజః. ౧౧౧

శక్త్యా బ్రాహ్మ్యా హి సౌమిత్రి స్తాడితస్తు స్తనాన్తరే,
విష్ణో రచిన్త్యం స్వం భాగ మాత్మానం ప్రత్యనుస్మరత్. ౧౧౨

అప్పుడు లక్ష్మణుఁడు అంతకూరతుండక తీక్ష్ణాగ్రంబులగు మూఁడు బాణంబుల రావణుని నొప్పించెను; ఆరావణుండు లక్ష్మణబాణపీడితుఁడై చలనమునొంది మూర్ఛిల్లి యెట్టకేలకు మఱలఁ దెలివొందెను ౧౦౬

మహాసామర్థ్యుఁడును దేవశత్రుఁడునగు నా రావణుఁడు ఛేదింపఁబడిన దేహముగలవాఁడునై మున్ను బ్రహ్మదేవునిచేఁ దన కియ్యఁబడిన శక్తిని గ్రహించెను. ౧౦౭

రాక్షసలోకనాథుఁడగు నారావణుఁడు పొగలేనియగ్నితో సమానమయినదియు నవానరసేనకంతయుం భయముఁగలిగించుచున్నదియుం నిప్పులుగ్రక్కుచున్నదియునగు నాశక్తిని శీఘ్రంబున లక్ష్మణునిపై వేసెను. ౧౦౮

లక్ష్మణుఁడు ఆశక్తి తనపైకి వచ్చుటంజూచి దాని భయంకరాకారంబులను నేతిచే వృద్ధిఁబొందిన యగ్నితో సమానంబులునగు బాణంబులం గొట్టెను; అట్లయినను ఆశక్తి విశాలంబగు లక్ష్మణుని వక్షస్థలంబుఁ జొచ్చినది. ౧౦౯

మహాసామర్థ్యుఁడగు నాలక్ష్మణుఁడు ఆశక్తిచేఁ బీడితుఁడై పలుమాఱు మండిపడెను. అంత నాలక్ష్మణుఁడు మూర్ఛనొందుటం జూచి రావణుఁడు శీఘ్రంబునవచ్చి బాహువులచే నతనిం బట్టుకొనెను. ౧౧౦

హిమవత్పర్వతమును గాని మందరపర్వతమును గాని మేరుపర్వతమును గాని దేవతలతోఁగూడ ముల్లోకంబులను గాని చేతులతో నెత్తవచ్చును గాని యుద్ధంబున లక్ష్మణునిమాత్రము ఎత్త నలవిగాదు. ౧౧౧

లక్ష్మణుఁడు ఆ బ్రహ్మదేవుని శక్తి తనవక్షస్థలమును జొచ్చినంతనె తన్ను విష్ణుదేవుని యచింత్యంబగు నంశంబునుగా స్మరించెను. ౧౧౨

తతో దానవదర్పఘ్నం సౌమిత్రిం దేవకణ్టకః,
తం పీడయిత్వా బాహుభ్యాం న ప్రభు ర్లంఘనేఽభవత్. ౧౧౩
అథైనం వైష్ణవం భాగం మానుషం దేహ మాస్థితమ్,
అథ వాయుసుతః క్రుద్ధో రావణం సమభిద్రవత్. ౧౧౪

ఆజఘానోరసి క్రుద్ధో వజ్రకల్పేన ముష్టినా

తేన ముష్టిప్రహారేణ రావణో రాక్షసేశ్వరః. ౧౧౫
జానుభ్యా మపత ద్భూమౌ చచాల చ పపాత చ,
ఆస్యైశ్చ స నేత్రశ్రవణై ర్వవామ రుధిరం బహు. ౧౧౬

విఘూర్ణమానో నిశ్చేష్టో రథోపస్థ ఉపావిశత్,

విసంజ్ఞో మూర్ఛితశ్చాసీ న్నచ స్థానం సమాలభత్. ౧౧౭

విసంజ్ఞం రావణం దృష్ట్వా సమరే భీమవిక్రమమ్,
ఋషయో వానరా స్సర్వే నేదు ర్దేవా స్సహాసవాః. ౧౧౮

హనూమా నపి తేజస్వీ లక్ష్మణం రావణార్దితమ్,
అనయద్రాఘవాభ్యాశం బాహుభ్యాం పరిగృహ్య తమ్. ౧౧౯
వాయుసూనో స్సుహృత్త్వేన భక్త్యా పరమయా చ సః,
శత్రూణా మప్రకమ్ప్యోఽపి లఘుత్వ మగమ త్కపేః. ౧౨౦

తం సముత్సృజ్య సా శక్తి స్సౌమిత్రిం యుధి దుర్జయమ్,
రావణస్య రథే తస్మిన్ స్థానం పున రుపాగతా. ౧౨౧

లక్ష్మణుఁడు మానుషాకారంబు నొందిన సాక్షాద్విష్ణుదేవుని యంశమే కావున నప్పుడు దేవశత్రువు రావణుఁడు లక్ష్మణుని లేవనెత్తుటకు సమర్థుఁడు కాఁడయ్యె. ౧౧౩

అంత వాయుకుమారుఁడగు హనుమంతుఁడు గుపితుఁడై రావణుని మీఁది కడరెను. ౧౧౪

ఆ హనుమంతుఁడు క్రుద్ధుఁడై వజ్రంబువంటి పిడికిలిచే రావణుని ఱొమ్మునం బొడిచెను.

రాక్షసనాథుఁడగు రావణుఁడు ఆ హనుమంతుని పిడికిటిదెబ్బను భూమియందు మోఁకాళ్లాన బోరగిలంబడి మిక్కిలియుఁ జలనంబునొందెను. ౧౧౫

ఆ రావణుఁడు నోళ్లనుండియుఁ గన్నులనుండియుఁ జెవులనుండియు నధికముగా నెత్తురు గ్రక్కెను. ౧౧౬

అప్పుడు రావణుఁడు ఇట్టట్టు పొరలాడుచుండి యంతఁ జేష్టలు దక్కి రథమధ్యంబునం బడియుండెను.

ఆ ట్లతఁడు సంజ్ఞదప్పియు మూర్ఛితుఁడునై నిలుకడనొందక పరితపించుచుండెను. ౧౧౭

భయంకరపరాక్రముఁడగు రావణుఁడు యుద్ధంబున మూర్ఛితుఁడగుటం జూచి వానరులును ఋషులును దేవేంద్రప్రముఖులగు దేవతలును సంతోషంబునఁ గోలాహలంబుఁ గావించిరి. ౧౧౮

మహాపరాక్రమశాలియగు హనుమంతుఁడు రావణప్రహారంబున మూర్ఛితుఁడయిన లక్ష్మణునిఁ జేతులనెత్తుకొని రాముని సమీపంబునకుఁ దెచ్చెను.

ఆ లక్ష్మణుఁడు శత్రువులకుఁ గదలింపనుగూడ నలవిగానివాఁడైనను హనుమంతుఁడు మిత్రుఁడును బరమభక్తుఁడును గావున నతనికిఁ దేలిక యయ్యెను. ౧౨౦

ఆశక్తి యంత యుద్ధంబున దుర్జయుఁడగు లక్ష్మణునివదలి మరల రావణుని రథంబునఁ జేరెను. ౧౨౧

ఆశ్వస్తశ్చ విశల్యశ్చ లక్ష్మణశ్శత్రుసూదనః,
విష్ణోర్భాగ మమీమాంస్య మాత్మానం ప్రత్యనుస్మరన్. ౧౨౨
రావణోఽపి మహాతేజాః ప్రాప్య సంజ్ఞాం మహాహవే,
ఆదదే నిశితాన్బాణా ఞ్జగ్రాహ చ మహద్ధనుః. ౧౨౩
నిపాతితమహావీరాం ద్రవన్తీం వానరీం చమూమ్,
రాఘవస్తు రణే దృష్ట్వా రావణం సమభిద్రవత్. ౧౨౪
అథైన ముపసఙ్గమ్య హనూమాన్వాక్య మబ్రవీత్,
మమ పృష్ఠం సమారుహ్య రాక్షసం శాస్తు మర్హసి. ౧౨౫
విష్ణుర్యథా గరుత్మన్తం బలవన్తం సమాహితః,

తచ్ఛ్రుత్వా రాఘవో వాక్యం వాయుపుత్రేణ భాషితమ్.
ఆరురోహ మహాశూరో బలవన్తం మహాకపిమ్,
రథస్థం రావణం సఙ్ఖ్యే దదర్శ మనుజాధిపః. ౧౨౭

తమాలోక్య మహాతేజాః ప్రదుద్రావ సరాఘవః,
వైరోచని మివ క్రుద్ధో విష్ణు రభ్యుద్యతాయుధః. ౧౨౮
జ్యాశబ్ద మకరో త్తీవ్రం వజ్రనిష్పేషనిస్వనమ్,

గిరా గమ్భీరయా రామో రాక్షసేన్ద్ర మువాచ హ. ౧౨౯
తిష్ఠ తిష్ఠ మమ త్వం హి కృత్వా విప్రియ మీదృశమ్,
క్వను రాక్షసశార్దూల! గతో మోక్ష మవాప్స్యసి. ౧౩౦
యదీన్ద్రవైవస్వతభాస్కరా న్వా
స్వయంభువైశ్వానరశంకరాన్వా,
గమిష్యసి త్వం దశ వా దిశో వా
తథాపి మే నాద్య గతో విమోక్ష్యసే. ౧౩౧

శత్రువులవధించునట్టి లక్ష్మణుండు మూర్ఛదేఱి యాఱిన గాయములుగల వాఁడై తన్ను అచింత్యమయిన విష్ణుదేవుని యంశముగా స్మరించెను. ౧౨౨

మహాతేజుఁడగు రావణుండును అంత యుద్ధంబున మూర్ఛదేఱి తీక్ష్ణంబులగు బాణంబులను గొప్పధనుస్సును గ్రహించెను. ౧౨౩

రాముఁడు యుద్ధంబున గొప్పవీరులు పడిపోవుటం జేసి పరుగెత్తుచున్న వానరసేనం జూచి తాను రావణునిమీఁది కడరెను. ౧౨౪

అంత హనుమంతుఁడు రాముని యెదుకువచ్చి యిట్లని చెప్పెను.

విష్ణుఁడు బలవంతుఁడగు గరుత్మంతు నెక్కినట్లు నీవు నన్నారోహించి యెచ్చరికగలవాఁడవై రావణునితోఁ యుద్ధంబు గావింపుము. అని హనుమంతుఁడు రామునితోఁ జెప్పెను. ౧౨౬

మహాశూరుఁడగు రాముఁడు వాయుదేవునికుమారుఁడగు హనుమంతుఁడు చెప్పిన మాటను విని బలవంతుఁడగు నివ్వాంజనేయు నారోహించెను.

మనుజలోకేంద్రుఁడగు రాముఁడు అట్లు హనుమంతు నారోహించి రథగతుఁడగు రావణుంజూచెను. ౧౨౮

విష్ణువు బలినింజూచి యతనిమీఁదికిఁబోవునట్లు మహాతేజుఁడగు రాముఁడు ఆరావణుంజూచి క్రుద్ధుఁడై ధనుర్ధరుఁడై యతనిమీఁది కడరెను.

ఆ రాముఁడు వజ్రధ్వనివంటి మహాధ్వనిగలుగునట్లు జ్యాశబ్దంబు గావించెను.

రాముఁ డంత రాక్షసేశ్వరుఁడగు రావణుంజూచి యిట్లని చెప్పెను.

రాక్షసశ్రేష్ఠుఁడవగు రావణుఁడా! నిలునిలు నీవు నా కింతటి యపకారము గావించి యెచ్చటికిఁబోయి విముక్తుఁడవు కాఁగలవు? ౧౩౦

నీవు దేవేంద్రునియొద్దకుఁగాని యమునియొదకుఁగాని సూర్యునియొద్దకుఁ గాని బ్రహ్మదేవునొద్దకుఁగాని యగ్నిహోత్రునొద్దకుఁగాని శంకరునియొద్దకుఁ గాని బోయినను దశదిశలకుం బరుగెత్తినను అప్పుడు నాయెదుటంబడిన వెనుక ఇంకఁ దప్పించుకొనఁజాలవు. ౧౩౧

య శ్శైవ శక్త్యాఽభిహత స్త్వయాఽద్య
ఇచ్ఛ న్విషాదం సహసాఽభ్యుపేతః,
స ఏవ రక్షోగణరాజమృత్యుః
సపుత్త్రదారస్య తవాద్య యుద్ధే. ౧౩౨
ఏతేన చాత్యద్భుతదర్శనాని
శరై ర్జలస్థానకృతాలయాని,
చతుర్దశాన్యా త్తవరాయుధాని
రక్షస్సహస్రాణి నిషూదితాని. ౧౩౩
రాఘవస్య వచ శ్శ్రుత్వా రాక్షసేన్ద్రో మహాకపిమ్,
వాయుపుత్త్రం మహావీర్యం వహన్తం రాఘవం రణే. ౧౩౪
ఆజఘాన శరై స్తీక్ష్ణైః కాలానలశిఖోపమైః,
రాక్షసేనాహవే తస్య తాడితస్యాపి సాయకైః. ౧౩౫
స్వభావతేజోయుక్తస్య భూయ స్తేజో వ్యవర్ధత,
తతో రామో మహాతేజా రావణేన కృతవ్రణమ్. ౧౩౬
దృష్ట్వా ప్లవగశార్దూలం కోపస్య వశమేయివాన్.
తస్యాభిచఙ్క్రమ్య రథం సచక్రం
సాశ్వధ్వజచ్ఛత్త్రమహాపతాకమ్,
ససారథిం సాశనిశూలఖడ్గం
రామః ప్రచిచ్ఛేద శరై స్సుపుఙ్ఖైః. ౧౩౭
అథేన్ద్రశత్రుం తరసా జఘాన
బాణేన వజ్రాశనిసన్నిభేన,
భుజాన్తరే వ్యూఢసుజాతరూపే
వజ్రేణ మేరుం భగవానివేన్ద్రః. ౧౩౮
యో వజ్రపాతాశనిసన్నిపాతా

రాక్షసరాజుండవగు రావణుండా! నీ విప్పు డెవ్వని శక్తిచేఁ గొట్టినావో అతఁడే యిప్పుడు వచ్చి నీతో యుద్ధంబు గావించి నిన్ను నీవారలనందఱను వధింపఁగలఁడు, ఇంతలోఁ దొందరపడకుము. ౧౩౨

ఇప్పుడు నీయెదుటనున్న నేను భయంకరాకారులును సత్తమాయుధధారులునగు జనస్థానమున నుండు పదునాలుగువేలమంది రాక్షసుల నొక్కండనే తీక్ష్ణబాణంబుల వధించినవాఁడను. అని రాముఁడు రావణునితోఁ జెప్పెను. ౧౩౩

రాక్షసరాజుఁడగు రావణుఁడు రామునిమాటనువిని యుద్ధంబున రామునకు వాహనమయియున్న మహాపరాక్రమశాలియగు వాయుపుత్త్రుఁడైన హనుమంతునిపైఁ బ్రలయకాలాగ్నితుల్యంబులగు తీక్ష్ణబాణంబుల నేసెను.

యుద్ధంబున రావణునిచే బాణంబులఁ గొట్టఁబడినను స్వభావంబుననే తేజశ్శాలియగు హనుమంతుని తేజస్సు మఱియు నధికమయినది. ౧౩౫

అంత మహాతేజుఁడగు రాముఁడు రావణునిచే గాయములగునట్లు గొట్టఁబడిన వానరోత్తముని హనుమంతుఁ జూచి కుపితుఁడయ్యెను. ౧౩౬

అంత రాముఁడు ఆరావణునిరథంబు సమీపంబునకుం బోయి వాని చక్రములను గుఱ్ఱంబులను ధ్వజంబును ఛత్త్రంబును సారథిని శూలాద్యాయుధంబులను తీక్ష్ణబాణంబుల ఖండించెను. ౧౩౭

అంత భగవంతుఁడగు దేవేంద్రుఁడు వజ్రాయుధంబున మేరుపర్వతముం గొట్టునట్లు రాముఁడు వజ్రంబునకును బిడుగునకును సరివచ్చునట్టి బాణంబుచే రావణునివిశాలంబగు వక్షస్థ్సలంబునఁ బ్రహరించెను. ౧౩౮

ఎవ్వఁడు తనపై బిడుగుపడినను ఇంద్రుఁడు వజ్రాయుధంబునఁ

న్న చుకుభే నాపి చచాల రాజా,
స రామబాణాభిహతో భృశార్త
శ్చచాల చాపం చ ముమోచ వీరః. ౧౩౯
తం విహ్వల న్తం ప్రసమీక్ష్య రామ
స్సమాదదే దీప్త మథార్ధ చన్ద్రమ్,
తేనార్కవర్ణం సహసా కిరీటం
చిచ్ఛేద రక్షోధిపతే ర్మహాత్మా. ౧౪౦
తం నిర్విషాశీవిషసన్నికాశం
శాన్తార్చిషం సూర్యమివాప్రకాశమ్,
గతశ్రియం కృత్తకిరీటకూట
మువాచ రామో యుధి రాక్షసేన్ద్రమ్. ౧౪౧
కృతం త్వయా కర్మ మహత్సుభీమం
హతప్రవీరశ్చ కృత స్త్వయాఽహమ్,
తస్మా త్పరిశ్రాన్త ఇతి వ్యవస్య
న త్వాం శరై ర్మృత్యువశం నయామి ౧౪౨
గచ్ఛానుజానామి రణార్దిత స్త్వం
ప్రవిశ్య రాత్రించరరాజ! లఙ్కామ్,
ఆశ్వాస్య నిర్యాహి రథీ చ ధన్వీ
తదా బలం ద్రక్ష్యసి మే రథస్థః. ౧౪౩
స ఏవముక్తో హతదర్పహర్షో
నికృత్తచాప శ్చ హతాశ్వసూతః,
శరార్దితః కృత్తమహాకిరీటో
వివేశ లఙ్కాం సహసా స రాజా. ౧౪౪
తస్మి న్ప్రవిష్టే రజనీచరేన్ద్రే
మహాబలే దానవదేవశత్రౌ,

గొట్టినను గలఁతనొందక చలింపకుండెనో అట్టివీరుఁడు రావణుఁడు రాముని బాణంబుచేఁ గొట్టఁబడి బాధం దాళఁజాలక నలవంబునొంది చేతిధనుస్సును గూడ విడిచెను. ౧౩౯

మహాత్ముఁ డగురాముఁడు ఆరావణుఁడు మూర్ఛనొందుటంజూచి యొకయర్ధచంద్రబాణంబుఁదీసి దానిచే శీఘ్రంబున సూర్యవర్ణంబగు రాక్షసరాజుకిరీటమును ఖండించెను. ౧౪౦

రాముఁడు యుద్ధంబున ఛేదింపఁబడిన కిరీటశిఖరముగలవాఁడై నిర్విషంబగు సర్పంబుకైవడి మంటలులేని యగ్నిభంగిఁ గాంతిలేనిసూర్యునిచాడ్పున నిస్తేజస్కుఁడయియున్న రాక్షసరాజును రావణునింజూచి యిట్లని చెప్పెను.

నీవు మహాభయంకరంబగు కార్యము గావించినావు; మఱియుఁ బెక్కుమేటివీరులఁ గొట్టినావు; కావున మిక్కిలిగాం నలసినట్లున్నావని యిప్పుడు నిన్ను బాణంబులచే యమపురికిం బంపకవిడిచితిని. ౧౪౨

రాక్షసరాజుఁడవగు రావణుఁడా! మిక్కిలియు యుద్ధపరిశ్రాంతుఁడవై యున్నావు; నేననుజ్ఞయొసంగెదను. పొమ్ము; లంకకుఁబోయి కొంత విశ్రమించి రథంబు నారోహించి ధనుర్ధరుఁడవై రమ్ము; అప్పుడు నీవు మరల రథగతుఁడవై యుండునప్పుడు నాబలంబుఁ జూపెదను. ౧౪౩

అట్లు తనధనుస్సు ఖండింపఁబడి సారథియు గుఱ్ఱంబులును వధింపఁబడి తాను బాణపీడితుఁడై భిన్నకిరీటుఁడైనపిమ్మట నారావణుఁడు గర్వంబువిడిచి సంతోషంబువీడి రామునిమాటనువిని లజ్జితుఁడై శీఘ్రంబున లంకాపురిం బ్రవేశించెను. ౧౪౪

మహాబలశాలియు దేవదానవశత్రుఁడునగు రావణుండు లంకకుఁబోయిన వెనుక రాముఁడు తానునులక్ష్మణుఁడునుం జేరి వానరులదేహమునందలి బాణం

హరీన్విశల్యాన్ సహలక్ష్మణేన
చకార రామః పరమాహవాగ్రే. ౧౮౫
తస్మిన్ప్రభిన్నే త్రిదశేన్ద్రశత్రౌ
సురాసురా భూతగణా దిశశ్చ,
ససాగరాస్సర్షి మహోరగాశ్చ
తథైవ భూమ్యమ్బుచరాశ్చ హృష్టాః. ౧౮౬

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే ఏకోనషష్టితమస్సర్గః. ౫౯.

---

## షష్టితమస్సర్గః.

స ప్రవిశ్య పురీం లఙ్కాం రామబాణభయార్దితః,
భగ్నదర్పస్తదా రాజా బభూవ వ్యథితేన్ద్రియః. ౧
మాతఙ్గ ఇవ సింహేన గరుడేనేవ పన్నగః,
అభిభూతోఽభవద్రాజా రాఘవేణ మహాత్మనా, ౨

బ్రహ్మదణ్డప్రకాశానాం విద్యుత్సదృశవర్చసామ్,
స్మరన్రాఘవబాణానాం వివ్యథే రాక్షసేశ్వరః. 3

స కాఞ్చనమయం దివ్య మాశ్రిత్య పరమాసనమ్,
విప్రేక్షమాణో రక్షాంసి రావణో వాక్య మబ్రవీత్. ౪
సర్వం తత్ఖలు మే మోఘం యత్తప్తం పరమం తపః,
యత్సమానో మహేన్ద్రేణ మానుషేణాస్మి నిర్జితః. ౫
ఇదం తద్బ్రహ్మణో ఘోరం వాక్యం మామభ్యుపస్థితమ్,
మానుషేభ్యో విజానీహి భయం త్వమితి తత్తథా. ౬

దేవదానవగన్ధర్వై ర్యక్షరాక్షసపన్నగైః,

ఖులఁ జెఱికించి వారలబాధలు దీఱునట్లు గావించిరి. ౧౪౫

దేవేంద్రశత్రువగు నారావణుఁడు పరాజితుఁడగుటకు సురలు నసురులును దిక్పాలురును సమస్తభూతంబులును సముద్రవాసిప్రాణులును ఋషులును మహాసర్పంబులును అట్లు జలచరప్రాణులును భూమిచరప్రాణులును అందఱును సంతోషంబునొందిరి. ౧౪౬

ఇది యేఁబదితొమ్మిదవసర్గము.

## అఱువదవసర్గము.

అప్పుడు రావణుఁడు లంకాపురంబుఁ బ్రవేశించి రామబాణభయపీడితుఁడై గర్వంబువిడిచి పరమదుఃఖితుఁడయ్యెను. ౧

ఏనుఁగు సింహమునుజూచి భయపడునట్లు సర్పంబు గరుత్మంతునిఁ జూచి భయపడునట్లు మహాబలుఁడగు రాముంజూచి రావణుఁడు పరమభీతుఁడయ్యెను. ౨

రాక్షసరాజుండగు రావణుఁడు బ్రహ్మాస్త్రసమానములును మెఱపులంబోలె మెఱయుచున్నవియునగు రామునిబాణంబులం దలఁచి తలఁచి భయపీడితుఁడయ్యెను. ౩

ఆరావణుఁడు కాంచనమయంబగు దివ్యసింహాసనంబున నాసీనుఁడై రాక్షసులంజూచి యిట్లని చెప్పెను. ౪

మహేంద్రసమానుఁడవగు నేను మనుష్యమాత్రునివలనఁ బరాజయము నొందితినే! నేను గావించినమహాతపస్సంతయు వ్యర్థమేకదా! ౫

“నీకు మనుష్యులవలన భయముగలుగును” అని మున్ను బ్రహ్మదేవుఁడు చెప్పినభయంకరవాక్యము ఇప్పటికి నాకు సఫలంబయ్యె; అది యెన్నటికి నబద్ధముకాదు. ౬

దేవతలవలనఁగాని దానవులవలనఁగాని గంధర్వులవలనఁగాని యక్షుల

అవధ్యత్వం మయా ప్రాప్తం మానుషేభ్యో న యాచితమ్. ౭

విదితం మానుషం మన్యే రామం దశరథాత్మజమ్,
ఇక్ష్వాకుకులనాథేన అనరణ్యేన యత్పురా. ౮
ఉత్పత్స్యతే హి మద్వంశే పురుషో రాక్షసాధను!,
యస్త్వాం సపుత్రం సామాత్యం సబలం సాశ్వసారథిమ్. ౯
నిహనిష్యతి సఙ్గ్రామే త్వాం కులాధమ! దుర్మతే!,
శప్తోఽహం వేదవత్యాచ యదా సా ధర్షితా పురా. ౧౦
సేయం సీతా మహాభాగా జాతా జనకనన్దినీ,
ఉమా నన్దీశ్వరశ్చాపి రమ్భా వరుణకన్యకా. ౧౧
యథోక్తా స్తపసా ప్రాప్తం న మిథ్యా ఋషిభాషితమ్,

ఏతదేవా భ్యుపాగమ్య యత్నం కర్తు మిహార్హథ, ౧౨
రాక్షసా శ్చాపి తిష్ఠన్తు చర్యాగోపురమూర్ధసు,

స చాప్రతిమగమ్భీరో దేవదానవదర్పహా. ౧౩
బ్రహ్మశాపాభిభూత స్తు కుమ్భకర్ణో విబోధ్యతామ్,

స పరాజిత మాత్మానం ప్రహస్తం చ నిషూదితమ్. ౧౪
జ్ఞాత్వా రక్షోబలం భీమ మాదిదేశ మహాబలః,

ద్వారేషు యత్నః క్రియతాం ప్రాకారశ్చాధిరుహ్యతామ్.
నిద్రావశసమావిష్టః కుమ్భకర్ణో విబోధ్యతామ్,

వలనఁగాని రాక్షసులవలనఁగాని సర్పములవలనఁగాని చావులేకుండునట్లు బ్రహ్మదేవు నడిగి వరము నొందితిని; మనుష్యులవలనఁ జావులేకుండునట్లు మాత్రము అడుగనైతిని. ౭

మున్ను ఇక్ష్వాకువంశజాతుఁడగు ననరణ్యుఁడు నాచే వధింపఁబడునప్పుడు "రాక్షసాధముఁడవు కులాధముఁడవు దుర్బుద్ధివగు రావణుఁడా! నిన్ను యుద్ధంబునఁ బుత్రమంత్రిబలాశ్వ సారథిసహితంబుగా వధించునట్టి మహాపురుషుఁడొకఁడు నావంశంబున జన్మింపఁగలఁడు" అని ప్రతిజ్ఞ చేసెనే; దశరథపుత్రుఁడగు శ్రీరాముఁడు ఆమహాపురుషుఁడే యని తలఁచెదను. ౮,౯

మున్ను నేను వేదవతిని బలాత్కరించినప్పుడు ఆబిడ నన్ను శపించినది. మహాభాగురాలగు నావేదవతియే జనకపుత్రియగు సీతగాఁ బుట్టినది.

పార్వతి నందీశ్వరుఁడు రంభపుంజికస్థల వీరలు మున్ను ఎట్లుచెప్పిరో అట్లెయయినది; తపఃప్రభావంబునం జెప్పఁబడిన ఋషివచనం బెన్నటికి నబద్ధము కానేరదు. ౧౧

రాక్షసులారా! మీరలు దీనినంతయుఁ దెలిసి శత్రుసంహారవిషయమునందుఁ జక్కఁగాఁ బ్రయత్నము సేయవలయును; మఱియుఁ బురద్వారంబులయందలి భటసంచారప్రదేశములందును గోపురశిఖరములందును రాక్షసులం జక్కఁగాఁ గావలియుంచుఁడు. ౧౨

సరిలేనిగాంభీర్యముగలవాఁడును దేవదానవులకొ్రవ్వడంచువాఁడును బ్రహ్మశాపంబునం జేసి యెల్లప్పుడు నిద్రించుచుండువాఁడునగు కుంభకర్ణునిం గూడ నిద్రలేపుఁడు. అని రావణుఁడు రాక్షసులతోఁ జెప్పెను. ౧౩

మహాబలుఁడగు నారావణుఁడు ప్రహస్తుఁడు నిహతుఁడగుటయుం దాను బరాజితుఁడగుటయుఁ దలపోసి కుంభకర్ణుఁడు భయంకరబలుఁడగుటను దలఁచి యీప్రకారంబున నాజ్ఞాపించెను. ౧౪

పురద్వారములయందు జాగ్రత్తతోఁ గావలియుంచుఁడు; ప్రాకారంబుల నధిరోహింపుఁడు; నిద్రాపరవశుఁడైయున్న కుంభకర్ణుని లేపుఁడు. ౧౫

సుఖం స్వపితి నిశ్చిన్తః కాలోపహతచేతనః. ౧౬
నవ షట్సప్త చాష్టౌ చ మాసాన్ స్వపితి రాక్షసః,

మన్త్రయిత్వా ప్రసుప్తోఽయ మితస్తు నవమేఽహని. ౧౭
తం తు బోధయత క్షిప్రం కుమ్భకర్ణం మహాబలమ్,

స తు సఙ్ఖ్యే మహాబాహుః కకుద స్సర్వరక్షసామ్. ౧౮
వానరా న్రాజపుత్రౌ చ క్షిప్ర మేవ వధిష్యతి,

ఏష కేతుః పర స్సఙ్ఖ్యే ముఖ్యో వై సర్వరక్షసామ్. ౧౯
కుమ్భకర్ణ స్సదా శేతే మూఢో గ్రామ్యసుఖే రతః,

రామేణ హి నిరస్తస్య సఙ్గ్రామేఽస్మిన్ సుదారుణే. ౨౦
భవిష్యతి న మే శోకః కుమ్భకర్ణే విబోధితే,
కిం కరిష్యామ్యహం తేన శక్రతుల్యబలేన హి. ౨౧
ఈదృశే వ్యసనే ప్రాప్తే యో న సాహ్యాయ కల్పతే,

తే తు తద్వచనం శ్రుత్వా రాక్షసేన్ద్రస్య రాక్షసాః. ౨౨
జగ్ముః పరమసంభ్రాన్తాః కుమ్భకర్ణనివేశనమ్,
తే రావణసమాదిష్టా మాంసశోణితభోజనాః. ౨3
గన్ధమాల్యాం స్తథా భక్ష్యానాదాయ సహసా యయుః,
తాం ప్రవిశ్య మహాద్వారాం సర్వతో యోజనాయతామ్. ౨౪
కుమ్భకర్ణగుహాం రమ్యాం సర్వగన్ధప్రవాహినీమ్,
కుమ్భకర్ణస్య నిశ్వాసా దవధూతా మహాబలాః. ౨౫

కుంభకర్ణుఁడు దైవవశంబున బుద్ధిహీనుఁడై యేచింతయుఁ లేనివాఁడై నేనిట్లు కష్టపడుచుండఁగా సుఖంబుగ నిద్రపోవుచున్నాఁడు. ఇట్లు ఆఱే డెనిమిదితొమ్మిదిమాసములు విడువక నిద్రపోవుచుండును. ౧౬

అతఁడు యుద్ధాలోచనసభకు వచ్చియుండి యుద్ధారంభమునకు ముందు తొమ్మిదవదినంబున నిద్రపోయెను; అతఁడు మహాబలుండు; అతని శీఘ్రంబుగా నిద్ర లేపుఁడు. ౧౭

మహాబాహుండును సమస్తరాక్షసులలోను ముఖ్యుఁడునగు నా కుంభకర్ణుఁడుమాత్రము నాయట్లు కామగ్రస్తుఁడు కాఁడు. కావున యుద్ధంబునందు శీఘ్రముగనే వానరులను రామలక్ష్మణులను వధింపఁగలఁడు. ౧౮

యుద్ధమునందు మహాధ్వజంబువంటివాఁడును సమస్తరాక్షసముఖ్యుండును నగు నీకుంభకర్ణుఁడు మూఢుఁడై గ్రామ్యసుఖంబునందలి యెల్లప్పుడు నిద్రపోవుచున్నాఁడు. ౧౯

భయంకరమయిన యీయుద్ధంబున రామునివలనఁ బరాజయంబునొంది యున్న నాకు కుంభకర్ణుని లేపుటవలన నొకమాత్రము దుఃఖము కలుగదు.

ఇట్టి కష్టంబువచ్చినను సాహాయ్యముసేయ నుపయోగింపఁడేని యట్టి దేవేంద్రసమపరాక్రముఁడగు కుంభకర్ణుఁడుండి నాకేమి ప్రయోజనము ? అని రావణుఁడు రాక్షసుల కాజ్ఞాపించెను. ౨౧

ఆ రాక్షసులు రాక్షసరాజుండగు రావణుని మాటవిని పరమసంభ్రాంతులయి కుంభకర్ణునిగృహమునకుం బోయిరి. ౨౨

మాంసరక్తాహారులగు నారాక్షసులు రావణాజ్ఞను శిరసావహించి గంధంబును పుష్పమాలికలను భక్ష్యంబులను దీసికొని శీఘ్రంబునం బోయిరి.

మహాబలశాలులగు నారాక్షసులు పెద్దవాకిలిగలదియు నెటుచూచి నను ఒకటిన్నరఆమడ వైశాల్యముగలదియు రమణీయంబును నానావిధసుగంధములచే గుబాళించుచున్నదియునగు గుహాకారమయిన యాకుంభకర్ణుని గృహమునకుఁబోయి యాకుంభకర్ణుని బలవంతములగు నిట్టూర్పులచే వెనుకకుం

ప్రతిష్ఠమానాః కృచ్ఛ్రేణ యత్నా త్ప్రవివిశు ర్గుహామ్,

తాం ప్రవిశ్య గుహాం రమ్యాం శుభ్రాం కాఞ్చనకుట్టిమామ్.
దదృశు ర్నైరృతవ్యాఘ్రాః శయానం భీమదర్శనమ్,

తే తు తం వికృతం సుప్తం వికీర్ణ మివ పర్వతమ్. ౨౭
కుమ్భకర్ణం మహానిద్రం సహితాః ప్రత్యబోధయన్,

ఊర్ధ్వరోమాఞ్చితతనుం శ్వసన్త మివ పన్నగమ్. ౨౮
త్రాసయన్తం మహాశ్వాసై శ్శయానం భీమదర్శనమ్,
భీమనాసాపుటం తం తు పాతాళవిపులాననమ్. ౨౯
శయ్యాయాం న్యస్తసర్వాఙ్గం మేదోరుధిరగన్ధినమ్,
కాఞ్చనాఙ్గదనద్ధాఙ్గం కిరీటిన మరిన్దమమ్. 3౦
దదృశు ర్నైరృతవ్యాఘ్రాః కుమ్భకర్ణం మహాబలమ్,

తత శ్చక్రు ర్మహాత్మానః కుమ్భకర్ణాగ్రత స్తదా. 3౧
మాంసానాం మేరుసఙ్కాశం రాశిం పరమతర్పణమ్,

మృగాణాం మహిషాణాం చ వరాహాణాం చ సఞ్చయాన్. 3౨
చక్రు ర్నైరృతశార్దూలా రాశి మన్నస్య చాద్భుతమ్,

తత శ్శోణితకుమ్భాంశ్చ మద్యాని వివిధాని చ. 33
పురస్తా త్కుమ్భకర్ణస్య చక్రు స్త్రిదశశత్రవః,
లిలిపు శ్చ పరార్ధ్యేన చన్దనేన పరన్తపమ్. 3౪

ద్రోయఁబడుచు నెట్టకేలకు బహుకష్టంబున లోనికిం బోవుచు మహాప్రయత్నంబునఁ బ్రవేశించిరి. ౨౮. ౨౯

ఆ రాక్షసులు అట్లు రమణీయంబును మంగళద్రవ్యసమాకీర్ణంబును బంగారుతోఁ గూర్పఁబడిన నేలగలదియునగు నాగుహం బ్రవేశించి యచ్చట పరుండియున్న భయంకరాకారుఁడగు రాక్షసశ్రేష్ఠుఁ గుంభకర్ణుం జూచిరి.

ఆ రాక్షసులందఱు నొక్కటిగాఁ జేరి వికృతాకారుఁడును నిదురించుచున్నవాఁడును నేలంబడినపర్వతంబుకరణిం గానుపట్టుచున్నవాఁడును మేలుకొలుప నలవిగాని నిద్రగలవాఁడునగు నాకుంభకర్ణుని మేలుకొలుపసాగిరి.

ఆ రాక్షసులు దేహమంతయుఁ బొడవులయిన వెండ్రుకలుగలవాఁడును నిట్టూర్పులు విడుచుచున్న మహాసర్పంబుకరణి నున్నవాఁడును భయంకరంబులగు నూర్పులచేఁ జూపరులకు భయంబు కలిగించుచున్నవాఁడును భయంకరాకారుఁడును భయంకరములగు నాసారంధ్రములుగలవాఁడును పాతాళముం బోలె విశాలంబగు నోరుగలవాఁడును శయనంబున సమస్తావయవంబులుఁ దాఁగునట్లు పరుండియున్నవాఁడును మున్ను త్రాగిన మేదోరుధిరంబుల వాసనతోఁ గూడినవాఁడును బంగారుబాహుపురులు దాల్చియున్నవాఁడును గిరీటియుం శత్రుసంహర్తయునగు రాక్షసశ్రేష్ఠుని మహాబలశాలిని గుంభకర్ణుని ఆశ్చర్యంబునఁ గొంతవడవు చూచుచుండిరి. ౨౯, ౩౦

అంత నప్పుడు మహాబలశాలులగు నారాక్షసులు కుంభకర్ణుని ముందట నతనికిఁ దృప్తియగుటకై మేరుపర్వతమువంటి మాంసరాశి నుంచిరి. ౩౧

ఆ రాక్షసశ్రేష్ఠులు కుంభకర్ణుని ముంగట జింకమాంసములును మహిషమాంసములును వరాహమాంసములును నానావిధములయిన యన్నములును రాసులురాసులుగా నునిచిరి. ౩౨

అంత దేవశత్రువులగు నారాక్షసులు కుంభకర్ణుని ముందట నెత్తురుబానలను నానావిధ మద్యభాండములను నునిచిరి. ౩౩

అంత నారాక్షసులు శ్రేష్ఠంబగు చందనమును శత్రుసంహర్తయగు కుంభ

దివ్యై రాచ్ఛాదయామాసు ర్మాల్యగన్ధై స్సుగన్ధిభిః,

ధూపం సుగన్ధం సస్సృజు స్తుష్టువు శ్చ పరన్తపమ్. 3౫

జలదా ఇవ చోన్నేదు ర్యాతుధానా స్తత స్తతః,
శఙ్ఖా నాపూరయామాసు శ్శశాఙ్కసదృశప్రభాన్. 3౬
తుములం యుగపచ్చాపి వినేదు శ్చా ప్యమర్షితాః,

నేదు రాస్ఫోటయామాసు శ్చిక్షిపు స్తే నిశాచరాః. 3౭

కుమ్భకర్ణవిబోధార్థం చక్రు స్తే విపులం స్వనమ్,

సశఙ్ఖభేరీపణవప్రణాద
మాస్ఫోటితక్ష్వేళితసింహనాదమ్. 3౮
దిశో ద్రవన్త స్త్రిదివం కిరన్త
శ్శ్రుత్వా విహఙ్గా స్సహసా నిపేతుః,
యదా భృశం తై ర్నినదై ర్మహాత్మా
నకుమ్భకర్ణో బుబుధే ప్రసుప్తః. 3౯
తతో ముసుణ్డీ ర్ముసలాని సర్వే
రక్షోగణా స్తే జగృహు ర్గదా శ్చ,
తం శైలశృఙ్గై ర్ముసలై ర్గదాభి
ర్వృక్షై స్తలై ర్ముద్గరముష్టిభి శ్చ. ౪౦
సుఖప్రసుప్తం భువి కుమ్భకర్ణం
రక్షాం స్యుదగ్రాణి తదా నిజఘ్నుః,

కర్ణునిదేహమంతయుఁ బూసిరి. ౩౪

శ్రేష్ఠములును మంచివాసనగలవియునగు పుష్పమాలికలచేతను నానావిధగంధములచేతను గుంభకర్ణుని దేహమంతయుఁ గప్పిరి.

అంత నారాక్షసులు సుగంధమగుధూపమువేసి శత్రువులను దపింపఁజేయువాఁడగు కుంభకర్ణునిఁ బొగడిరి. ౩౫

ఆ రాక్షసు లంత అప్పుడప్పుడు మేఘంబులంబోలె గర్జించిరి. చంద్రబింబమువలెఁ దెల్లనైనశంఖములఁ బూరించిరి. ౩౬

ఆ రాక్షసులు అంతకుఁ గుంభకర్ణుఁడు లేవకుండుటంజేసి కుపితులయియందఱు నేకకాలంబున దొమ్మిగా నఱచిరి.

ఆ రాక్షసులు అఱచిరి; కుంభకర్ణునిఁ గొట్టిరి; అతని నిట్టట్టుకదలించిరి. ౩౭

ఆ రాక్షసులు ఈ ప్రకారంబునఁ గుంభకర్ణునిలేపుటకై మహాధ్వనిఁగావించిరి.

పక్షులు ఆశంఖధ్వనులను భేరీధ్వనులను బణవధ్వనులను భుజస్ఫాలనధ్వనులను గర్జనధ్వనులను సింహనాదంబులను విని భయంబున దిక్కులకుంబాఱి యచ్చట భయంబు దీఱకుండుటచే నంత స్వర్గంబునకుఁబోయి యచ్చటను భయశాంతి కలుగమింజేసి నేలంబడినవి. ౩౮

మిక్కిలియుఁ గష్టముతోఁ గావించిన ధ్వనులచే సుప్తుఁడగు నాకుంభకర్ణుఁడు మేలుకొనకుండుటంజూచి అంత నారాక్షసులందఱు గుదియలను ముసలంబులను గదలనుం జేకొనిరి. ౩౯

అప్పుడు గర్వితులగు నారాక్షసులు పర్వతశిఖరములచేతను ముసలంబులచేతను గదలచేతను వృక్షంబులచేతను అఱచేతులచేతను గుదియలచేతను పిడికిళ్లచేతను సుఖసుప్తుఁడగు కుంభకర్ణుం బ్రహరించిరి. ౪౦

తస్య నిశ్వాసవాతేన కుమ్భకర్ణస్య రక్షసః. ౪౧
రాక్షసా బలవన్తోఽపి స్థాతుం నాశక్నువ న్పురః,
తతః పరిహితా గాఢం రాక్షసా భీమవిక్రమాః. ౪౨

మృదఙ్గపణవా న్భేరీ శ్శఙ్ఖకుమ్భగణాం స్తదా,
దశ రాక్షససాహస్రా యుగప త్పర్యవాదయన్. ౪౩
నీలాఞ్జనచయాకారా స్తే తు తం ప్రత్యబోధయన్,
అభిఘ్నన్తో నదన్త శ్చ నైవ సంవివిదే తు సః. ౪౪

యదా చైనం న శేకు స్తే ప్రతిబోధయితుం తదా,
తతో గురుతరం యత్నం దారుణం సముపాక్రమన్. ౪౫

అశ్వా నుష్ట్రా న్ఖరా న్నాగా న్జఘ్ను ర్దణ్డకశాఙ్కుశైః,
భేరీశఙ్ఖమృదఙ్గాంశ్చ సర్వప్రాణై రవాదయన్. ౪౬

నిజఘ్ను శ్చాస్య గాత్రాణి మహాకాష్ఠకటఙ్కరైః,
ముద్గరై ర్ముసలై శ్చైవ సర్వప్రాణసముద్యతైః. ౪౭
తేన శబ్దేన మహతా లఙ్కా సమభిపూరితా,
సపర్వతవనా సర్వా సోఽపి నైవ ప్రబుధ్యతే. ౪౮
తత స్సహస్రం భేరీణాం యుగప త్సమహన్యత,
మృష్టకాఞ్చనకోణానా మాసక్తానాం సమ న్తతః ౪౯
ఏవ మప్యతినిద్రస్తు యదా నైవ ప్రబుధ్యతే,
శాపస్య వశమాపన్న స్తతః క్రుద్ధా నిశాచరాః. ౫౦
మహాక్రోధసమావిష్టా స్సర్వే భీమపరాక్రమాః,
త ద్రక్షో బోధయిష్య న్త శ్చక్రు రన్యే పరాక్రమమ్. ౫౧

ఆ రాక్షసులు బలవంతులయినను ఆ కుంభకర్ణుని నిట్టూర్పుగాలిచేత నతని ముందట నిలువంజాలరైరి. ౪౧

అంత భయంకరపరాక్రములగు నారాక్షసులు అప్పటికిని గుంభకర్ణుండు మేలుకొనకుండుటఁజూచి మఱియు నధికముగాఁ బ్రయత్నించిరి. ౪౨

అప్పుడు పదివేవురు రాక్షసులు ఆకుంభకర్ణుని చుట్టును మృదంగములను బణవంబులను భేరులను శంఖములను కుంభములను ఏకకాలంబున వాయించిరి.

నల్లనికాటుకరాశివంటి యాకారముగల యారాక్షసులు అట్లు కుంభకర్ణునిం గొట్టుచు గర్జించుచు నెంతమేలుకొలిపినను ఆ కుంభకర్ణుఁడు మేలుకొనఁడయ్యె. ౪౪

ఆ రాక్షసులు అదివఱకుఁ దాముసేయు ప్రయత్నములచేఁ గుంభకర్ణుఁడు లేవకుండుటఁజూచి యంత మఱియు భయంకరంబగు ప్రయత్నంబు సేయ నారంభించిరి. ౪౫

అంత నారాక్షసులు గుఱ్ఱంబులను ఒంటెలను గాడిదలను ఏనుఁగులను గొయ్యలతోను గొఱడాలతోను అంకుశములతోనుం గొట్టి కుంభకర్ణునిపైకిఁ దోలిరి; భేరులను శంఖములను మృదంగంబులను దమబలముకొలఁది వాయించిరి.

పెద్దకఱ్ఱలచేతను ఎనిమిదిచేతుల ప్రమాణముగల కొయ్యలచేతను గుదియలచేతను ముసలంబులచేతను దమబలముకొలఁది కుంభకర్ణుం బ్రహరించిరి. ౪౬

ఆమ్మహాధ్వని పర్వతవనసమేతంబగు లంకానగరమంతయు నిండి చెలఁగినది; అప్పటికిని కుంభకర్ణుఁడు మేలుకొనఁడయ్యె. ౪౭

అంతఁ గుంభకర్ణునిచుట్టును వేయిభేరులను మంచిబంగారుదండంబులచే నేకకాలంబున వాయించిరి. ౪౮

ఇంతదూరముచేసినను మహానిద్రుఁడు బ్రహ్మశాపవశంగతుఁడునగు కుంభకర్ణుఁడు మేలుకొనకుండుటంజూచి రాక్షసులందఱుఁ గుపితులయిరి.

భయంకరపరాక్రములగు నారాక్షసులందఱు మహాకోపము నొందిరి.

కొందఱు కుంభకర్ణుని మేలుకొలుపుటకై తమబలముకొలఁది పిడికిళ్లఁ

అన్యే భేరీ స్సమాజఘ్ను రన్యే చక్రు ర్మహాస్వనమ్,
కేశా నన్యే ప్రలులుపుః కర్ణా వన్యే దశన్తిచ. ౫౨

ఉదకుమ్భశతా న్యన్యే సమసిఞ్చన్త కర్ణయోః,
న కుమ్భకర్ణః పస్పన్దే మహానిద్రావశం గతః. ౫౩

అన్యేచ బలిన స్తస్య కూటముద్గరపాణయః,
మూర్ధ్ని వక్షసి గాత్రేషు పాతయ న్కూటముద్గరాన్. ౫౪

రజ్జుబన్ధనబద్ధాభి శ్శతఘ్నీభి శ్చ సర్వతః,
వధ్యమానో మహాకాయో న ప్రాబుధ్యత రాక్షసః. ౫౫
వారణానాం సహస్రం చ శరీరేఽస్య ప్రధావితమ్,

కుమ్భకర్ణ స్తతో బుద్ధః స్పర్శం పర మబుధ్యత. ౫౬

స పాత్యమానై ర్గిరిశృఙ్గవృక్షై
రచిన్తయం స్తా న్విపులాన్ ప్రహారాన్,
నిద్రాక్షయా త్క్షుద్భయపీడితశ్చ
విజృమ్భమాణ స్సహసోత్పపాత. ౫౭
స నాగభోగాచలశృఙ్గకల్పౌ
విక్షిప్య బాహూ గిరిశృఙ్గసారౌ,
వివృత్య వక్త్రం బడబాముఖాభం
నిశాచరోఽసౌ వికృతం జజృమ్భే. ౫౮

బొడిచిరి. ౫౧

మఱికొందఱు భేరులను వాయించిరి; మఱికొందఱు గొప్పధ్వనిగలుగు నట్లు సింహనాదములుగావించిరి.

కొందఱు కుంభకర్ణుని తలవెండ్రుకలు పెఱికిరి; మఱికొందఱు అతని చెవులంబట్టి కొఱికిరి. ౫౨

మఱికొంద ఱతని చెవులలోఁ బెక్కునూర్లబానలనీళ్లను బోసిరి.

అప్పటికిని మహానిద్రం జెందియున్నకుంభకర్ణుఁ డెంతమాత్రము కదలఁ డయ్యె. ౫౩

బలవంతులగుకొందఱురాక్షసులు కూటముద్గరంబులు దీసి వానిచేఁ గుంభకర్ణునితలయందును ఱొమ్మునందును నితరములయిన యవయవములందును గొట్టిరి. ౫౪

మహాకాయుఁడగు నాకుంభకర్ణుఁడు త్రాళ్లచేతను ఇనుపకట్లచేతను ఒప్పుచున్నశతఘ్నులచే నెంతకొట్టఁబడినను మేలుకొనఁడయ్యె. ౫౫

అంత వేయియేనుఁగులను నాకుంభకర్ణునిశరీరముపైఁదోలి త్రొక్కించిరి.

అంతఁ గుంభకర్ణుఁడు మేలుకొనె; నతనికావేయియేనుఁగులు త్రొక్కుటయుఁ జిన్నపురుఁగు మేనుం బ్రాఁకులాడిన ట్లుండెను. ౫౬

ఆకుంభకర్ణుఁడు మేల్కొన్నపిమ్మట లేచుటకై వేయఁబడుచున్న పర్వతశిఖరములచేతను వృక్షములచేతనుం దగిలినదెబ్బలను సరకుసేయక ఆఁకలిచేఁ బీడింపఁబడినవాఁడై పెద్దయావలింతలువిడుచుచు శీఘ్రంబున లేచెను.

ఆకుంభకర్ణుఁడు మహాసర్పములంబోలె నతిదీర్ఘంబులును బర్వతశిఖరంబులఁబోలె నతికఠినంబులును బర్వతంబులవంబోలె సారముగలవియుఁనగు బాహువులనుజాచి బడబాముఖసదృశంబగు నోరు దెఱచి భయంకరంబుగా నావలించెను. ౫౭

తస్య జాజృమ్భమాణస్య వక్త్రం పాతాళసన్నిభమ్,
దదృశే మేరుశృఙ్గాగ్రే దివాకర ఇవోదితః. ౫౯

స జృమ్భమాణోఽతిబలః ప్రతిబుద్ధో నిశాచరః,
నిశ్వాస శ్చాస్య సంజజ్ఞే పర్వతా దివ మారుతః. ౬౦
రూప ముత్తిష్ఠత స్తస్య కుమ్భకర్ణస్య తద్బభౌ,
తపా న్తే సబలాకస్య మేఘస్యేవ వివర్షతః. ౬౧

తస్య దీప్తాగ్నిసదృశే విద్యుత్సదృశవర్చసీ,
దదృశాతే మహానేత్రే దీప్తా వివ మహాగ్రహా. ౬౨
తత స్త్వదర్శయన్ సర్వా న్భక్ష్యాంశ్చ వివిధా న్బహూన్,
వరాహా న్మహిషాంశ్చైవ స బభక్ష మహాబలః. ౬౩

అదన్ బుభుక్షితో మాంసం శోణితం తృషితః పిబన్,
మేదః కుమ్భాంశ్చ మద్యంచ పపౌ శక్రరిపు స్తదా. ౬౪

తత స్తృప్త ఇతి జ్ఞాత్వా సముత్పేతు ర్నిశాచరాః,
శిరోభిశ్చ ప్రణమ్యైనం సర్వతః పర్యవారయన్. ౬౫
నిద్రావిశదనేత్ర స్తు కలుషీకృతలోచనః,
చారయన్ సర్వతో దృష్టిం తాన్ దదర్శ నిశాచరాన్. ౬౬
స సర్వాన్ సాన్త్వయామాస నైరృతా న్నైరృతర్షభః,
బోధనా ద్విస్మిత శ్చాపి రాక్షసా నిద మబ్రవీత్. ౬౭
కిమర్థ మహ మాదృత్య భవద్భిః ప్రతిబోధితః,
కచ్చి త్సుకుశలం రాజ్ఞో భయవానేష వా న కిమ్. ౬౮
అథవా ధ్రువ మన్యేభ్యో భయం పర ముపస్థితమ్,

అట్లావలించునప్పుడు పాతాళమువంటిదైన యాకుంభకర్ణునినోరు మేరుపర్వతశిఖరాగ్రంబున నుదయించిన సూర్యబింబముకైవడిఁ బ్రకాశించినది. ౫౯

మహాబలశాలియగు నాకుంభకర్ణుఁ డట్లు ఆవలింతవిడుచుచు లేచెను. కొండపైనుండి గాలిగొట్టునట్లు ఆతనినిట్టూర్పు మహావేగంబయి యడరినది.

ఆకుంభకర్ణుఁడు లేచునప్పుడు అభరణాలంకృతంబగు నతనిశరీరంబు వర్షర్తువునందు కొక్కెరలతోఁగూడి వర్షించుచున్న మేఘమువలెఁ బ్రకాశించినది. ౬౧

మండుచున్న నిప్పుకైవడి మెఱుపులమాడ్కిం గ్రాలుచున్న యాకుంభకర్ణుని పెద్దనేత్రంబులు రెండు మహాగ్రహంబులుంబోలెఁ జూడనొప్పినవి.

అంత నారాక్షసులు నానావిధములగు సమస్తభక్ష్యంబులను వరాహంబులను మహిషంబులను నివేదింప మహాబలుఁడగు నాకుంభకర్ణుఁడు వానినెల్ల భక్షించెను. ౬౩

దేవేంద్రశత్రుఁడగు నాకుంభకర్ణుఁడు మాంసముదిని యాఁకలిదీర్చుకొనుచు నెత్తురుద్రావి దప్పిదీర్చుకొనుచు బానలనుండు మేదస్సును మద్యంబునుం ద్రావెను. ౬౪

అంత రాక్షసులు కుంభకర్ణుఁడు తృప్తింబొందుటంజూచి యతని యొద్దకువచ్చి సాష్టాంగముగ నమస్కరించి యతనిఁ బరివేష్టించి నిలిచిరి. ౬౫

ఆకుంభకర్ణుఁడు నిదురచేఁ గలుషములయినకన్నులతో నాలుగు ప్రక్కలంజూచి యారాక్షసుల నందఱు జూచెను. ౬౬

రాక్షసశ్రేష్ఠుఁ డగు నాకుంభకర్ణుఁడు రాక్షసులనందఱ నాశ్వాసించి తన్ను మేలుకొలుపుట కాశ్చర్యపడి రాక్షసులంజూచి యిట్లని చెప్పెను.

మీర లెందుకొఱ కింత యక్కఱతో నన్ను లేపినారు? రాక్షసరాజుం డగు రావణునకు క్షేమమేగదా? భయమేమియుఁ గలుగ లేదుగదా? ౬౮

అటుకాదేని ఇతరులవలన మహాభయంబు గలిగియున్నది. ఇది నిశ్చ

యదర్థ మేవం త్వరితై ర్భవద్భిః ప్రతిబోధితః. ౧౯
అద్య రాక్షసరాజస్య భయ ముత్పాటయా మ్యహమ్,
పాతయిష్యే మహేన్ద్రంవా శాతయిష్యే తథానలమ్. ౨౦
న హ్యల్పకారణే సుప్తం బోధయిష్యతి మాం గురుః,
తదాఖ్యాతార్థత త్త్వేన మత్ప్రబోధనకారణమ్. ౨౧

ఏవం బ్రువాణం సంరబ్ధం కుమ్భకర్ణం మహాబలమ్.
యూపాక్ష స్సచివో రాజ్ఞః కృతాఞ్జలి రువాచ హ. ౨౨

న నో దైవకృతం కించి ద్భయ మస్తి కదాచన,
మానుషా న్నో భయం రాజం! స్తుములం సమ్ప్రబాధతే. ౨౩
న దైత్యదానవేభ్యో వా భయ మస్తి హి తాదృశమ్,
యాదృశం మానుషం రాజ! న్భయ మస్మా నుపస్థితమ్. ౨౪
వానరైః పర్వతాకారై ర్లఙ్కేయం పరివారితా,
సీతాహరణసన్తప్తా ద్రామా న్న స్తుములం భయమ్. ౨౫
ఏకేన వానరే ణేయం పూర్వం దగ్ధా మహాపురీ,
కుమారో నిహత శ్చాక్ష స్సానుయాత్ర స్సకుఞ్జరః. ౨౬
స్వయం రక్షోధిప శ్చాపి పౌలస్త్యో దేవకణ్టకః
మృతేతి సంయుగే ముక్తో రామే ణాదిత్యతేజసా. ౨౭

యన్న దేవైః కృతో రాజా నాపి దైత్యై ర్న దానవైః,
కృత స్స ఇహ రామేణ విముక్తః ప్రాణసంశయాత్. ౨౮

యము. అందుకొఱకే మీర లింతవేగముతో నన్ను లేపినారు. ౧౯

నే నిప్పుడు రాక్షసరాజుండగు రావణుని భయంబు నశింపఁజేసెదను. దేవేంద్రు నేని పడవేసెదను. అగ్నిహోత్రు నేని ఛేదించెదను. ౨౦

అన్నయగురావణుఁడు స్వల్పకారణమునకై నిద్రితుఁడనగు నన్ను మేలుకొలుపఁడు. కావున నన్ను లేపుటకుఁ గారణమును యథార్థముగాఁ జెప్పుఁడు అని కుంభకర్ణుఁడు రాక్షసులతోఁ జెప్పెను. ౨౧

రాక్షసరాజుండగు రావణునిమంత్రియగు యూపాక్షుఁడనువాఁడు ఈప్రకారంబున సంరంభంబుతోఁ జెప్పుచున్న మహాబలుఁడగు కుంభకర్ణుం జూచి చేమోడ్పుగీలించి యిట్లని చెప్పెను. ౨౨

కుంభకర్ణుఁడా! మాకెప్పుడును దేవతలవలనఁ గొంచెమేని భయము లేదు. మనుష్యునివలననే మా కిప్పుడు మహాభయము గలిగియున్నది. ౨౩

కుంభకర్ణుఁడా! మాకిప్పుడు మనుష్యునివలనఁ గలిగినంతటిభయము దైత్యదానవులవలననుంగూడ నెప్పుడును గలుగలేదు. ౨౪

పర్వతాకారులగు వానరులు లంకచుట్టును ముట్టడించియున్నారు; రాముఁడు సీతాహరణముచేఁ గోపమునొంది మా కింతభయము గలిగించినాఁడు

మును పొక్కవానరుఁడు ఇమ్మహాపట్టణమంతయు దహించెను; చతురంగబలసమేతుఁడగు నక్షకుమారుని వధించెను. ౨౬

రాక్షసరాజుండు దేవతలనెల్ల జయించినవాఁడునగు రావణుండునుం గూడ యుద్ధంబున సూర్యతేజుఁడగు రామునిచే మృతప్రాయుండను బుద్ధితో విడువఁబడియె. ౨౭

రాక్షసరాజుఁడగు రావణుని దేవతలుగాని దైత్యులుగాని దానవులుగాని యేమిచేయఁజాలకపోయినారో ఆకార్య మిప్పుడు రాముఁడు గావించినాఁడు. రావణుఁడు బ్రతికియున్నాఁడో లేఁడో యనుసంశయంబున యుద్ధంబున నతని రాముఁడు విడిచిపెట్టినాఁడు. అని యూపాక్షుఁడు కుంభకర్ణునితోఁ జెప్పెను. ౨౮

స యూపాక్షవచ శ్శ్రుత్వా భ్రాతు ర్యుధి పరాజయమ్,
కుమ్భకర్ణో వివృత్తాక్షో యూపాక్షమిదమబ్రవీత్. ౨౯

సర్వ మద్యైవ యూపాక్ష! హరిసైన్యం సలక్ష్మణమ్,
రాఘవం చ రణే హత్వా పశ్చా ద్ద్రక్ష్యామి రావణమ్. ౩౦
రాక్షసాం స్తర్పయిష్యామి హరీణాం మాంసశోణితైః,
రామలక్ష్మణయోశ్చాపి స్వయం పాస్యామి శోణితమ్. ౩౧

తత్తస్య వాక్యం బ్రువతో నిశమ్య
సగర్వితం రోషవివృద్ధదోషమ్,
మహోదరో నైరృతయోధముఖ్యః
కృతాఞ్జలి ర్వాక్య మిదం బభాషే. ౩౨
రావణస్య వచః శ్రుత్వా గుణదోషౌ విమృశ్య చ,
పశ్చాదపి మహాబాహో! శత్రూ న్యుధి విజేష్యసి. ౩౩

మహోదరవచ శ్శ్రుత్వా రాక్షసైః పరివారితః,
కుమ్భకర్ణో మహాతేజాస్సమ్ప్రతస్థే మహాబలః. ౩౪

తం సముత్థాప్య భీమాక్షం భీమరూపపరాక్రమమ్,
రాక్షసా స్త్వరితా జగ్ము ర్దశగ్రీవనివేశనమ్. ౩౫

తతో గత్వా దశగ్రీవ మాసీనం పరమాసనే,
ఊచుర్బద్ధాఞ్జలిపుటాః సర్వ ఏవ నిశాచరాః. ౩౬
ప్రబుద్ధః కుమ్భకర్ణోఽయం భ్రాతా తే రాక్షసర్షభ!,
కథం తత్రైవ నిర్యాతు. ద్రక్ష్యస్యేన మిహాగతమ్. ౩౭

ఆకుంభకర్ణుఁడు తనయన్న రావణుఁడు యుద్ధంబునఁ బరాజయంబు నొందెనని చెప్పిన యాయూపాక్షునిమాటవిని కోపంబునఁ గండ్లు గిఱగిఱఁ ద్రిప్పుచు యూపాక్షుంజూచి యిట్లని చెప్పెను. ౯

యూపాక్షుఁడా! నే నిప్పుడే వానరసేనసంతయుఁ రామలక్ష్మణులను యుద్ధంబున వధించిపుచ్చి యటుపిమ్మట రావణుం జూచెదను. ౧౦

వానరుల మాంసరుధిరంబులచేత రాక్షసులఁ దృప్తినొందించెదను. నేనే రామలక్ష్మణుల నెత్తురుద్రావెదను. అని కుంభకర్ణుఁడు యూపాక్షునితోఁ జెప్పెను. ౧౧

అట్లు గర్వితుఁడై కోపంబున నొడలుదెలియక మాటలాడుచున్న యాకుంభకర్ణునిమాటనువిని రాక్షసయోధముఖ్యుఁడగు మహోదరుఁడు చేమోడ్పుగీలించి యీమాటం జెప్పెను. ౧౨

మహాబాహుఁడవగు కుంభకర్ణుఁడా! నీవు రావణునొద్దకువచ్చి అతఁడు చెప్పునదివిని గుణదోషంబులు విమర్శించి యటుపిమ్మట యుద్ధంబున శత్రువుల జయింపఁగలవు అని మహోదరుఁడు కుంభకర్ణునితోఁ జెప్పెను.

మహాపరాక్రమశాలియుఁ మహాబలుఁడునగు కుంభకర్ణుఁడు మహోదరుని మాటనువిని రాక్షసులు పరివేష్టించి వెంబడింప రావణునిగృహంబునకుఁ బోఁగోరెను. ౧౪

అంత రాక్షసులు అట్లు భయంకరనేత్రుఁడును భయంకరాకారుఁడును భయంకరపరాక్రముఁడునగు కుంభకర్ణు నిద్రలేపి వేగంబున రావణునిగృహంబునకుఁ బోయిరి. ౧౫

అంత నారాక్షసులందఱుఁ బోయి సింహాసనాసీనుఁడగు రావణుంగని చేమోడ్పుగీలించి యీప్రకారంబునం జెప్పిరి. ౧౬

రాక్షసోత్తముఁడవగు రావణుఁడా! నీతమ్ముఁడు కుంభకర్ణుఁడు నిద్రమేలుకొనియున్నాఁడు! అతని కేమియాజ్ఞ యొసఁగెదవు? యుద్ధమున కట్లే పో

రావణ స్త్వబ్రవీ ద్దృష్టో రాక్షసాం స్తా నుపస్థితాన్,
ద్రష్టుమేనమిహేచ్ఛామి యథాన్యాయం చ పూజ్యతామ్. ౮౯

తథే త్యుక్త్వా తు తే సర్వే పునరాగమ్య రాక్షసాః,
కుమ్భకర్ణ మిదం వాక్య మూచూ రావణచోదితాః. ౮౯
ద్రష్టుం త్వాం కాఙ్క్షతే రాజా సర్వరాక్షసపుఙ్గవః,
గమనే క్రియతాం బుద్ధి ర్భ్రాతరం సంప్రహర్షయః. ౯౦

కుమ్భకర్ణస్తు దుర్ధర్షో భ్రాతు రాజ్ఞాయ శాసనమ్,
తథే త్యుక్త్వా మహాబాహు శ్శయనా దుత్పపాతహ. ౯౧
ప్రక్షాళ్య వదనం హృష్ట స్స్నాతః పరమభూషితః,
పిపాసు స్త్వరయామాస పానం బలసమీరణమ్. ౯౨

తత స్తే త్వరితా స్తస్య రాక్షసా రావణాజ్ఞయా,
మద్యకుమ్భాంశ్చ వివిధా న్క్షిప్ర మే వోపహారయన్. ౯౩
పీత్వా ఘటసహస్రే ద్వే గమనా యోపచక్రమే,

ఈషత్సముత్కటో మత్త స్తేజోబలసమన్వితః. ౯౪
కుమ్భకర్ణో బభౌ హృష్టః కాలా న్తకయమోపమః,

భ్రాతు స్సభవనం గచ్ఛన్రక్షోగణసమన్వితః. ౯౫
కుమ్భకర్ణః పదన్యాసై రకమ్పయత మేదినీమ్,

మ్మనెదవా? లేక నిన్నుఁజూడ నిచ్చటికి రమ్మనెదవా? అని రాక్షసులు రావణునితోఁ జెప్పిరి. ౫౭

రావణుఁడును కుంభకర్ణుఁడు మేలుకొనియుండుటను విని సంతుష్టుఁడై యారాక్షసులఁజూచి యిట్లని చెప్పెను.

నేను కుంభకర్ణు నిచ్చటఁ జూడఁగోరెదను కావున నతని యథాన్యాయంబుగఁ బూజించి యిచ్చటికిఁ దోడ్కొని రండు. అని రావణుఁడు రాక్షసులతోఁ జెప్పెను. ౫౮

ఆ రాక్షసులు అట్లే యనిచెప్పి మరలవచ్చి కుంభకర్ణునిఁజూచి రావణు నాజ్ఞచొప్పున నిట్లని చెప్పిరి. ౫౯

సమస్తరాక్షసముఖ్యుఁడగు రావణుఁడు నిన్నుఁ జూడఁగోరియున్నాఁడు. కావున నతని యొద్దకురమ్ము. అన్నగారికి సంతోషంబు గలిగింపుము అని రాక్షసులు కుంభకర్ణునితోఁ జెప్పిరి. ౬౦

మహాబాహుఁడును దుర్ధర్షుఁడునగు కుంభకర్ణుఁడు అన్నగారియాజ్ఞను విని యట్లే యని చెప్పి శయనంబుననుండి లేచెను. ౬౧

ఆ కుంభకర్ణుఁడు సంతుష్టుఁడై ముఖంబుగడిగికొని స్నానంబుచేసినవాఁడై యలంకరించుకొని దప్పిగొని బలవృద్ధిగలిగించునట్టిమద్యమును శీఘ్రముగఁ దెండని యాజ్ఞాపించెను. ౬౨

అంత నారాక్షసులు రావణు నాజ్ఞంజేసి యతివేగంబున నానావిధంబులగు మద్యభాండంబులందెచ్చి యాకుంభకర్ణునకు సమర్పించిరి. ౬౩

ఆకుంభకర్ణుఁడు రెండువేలకుండలమద్యంబుద్రావి రావణసమీపంబునకుఁ బో నారంభించెను.

కుంభకర్ణుఁ డప్పుడు కొంచెము కైపుగలిగి మత్తుఁడై బలపరాక్రమసంయుతుఁడై సంతుష్టుఁడై ప్రళయకాలంబునందలి యమునికైవడిఁ బ్రకాశించెను. ౬౪

ఆకుంభకర్ణుండు రాక్షససమూహములచే వెంబడింపఁబడినవాఁడై పాదన్యాసంబులభూమిని వడంకునట్లుసేయుచు రావణుని గృహంబునకుఁ బోయెను.

స రాజమార్గం వపుషా ప్రకాశయన్
సహస్రరశ్మి ర్ధరణీ మి వాంశుభిః,
జగామ తత్రాఞ్జలిమాలయా వృత
శ్శతక్రతు ర్గేహ మివ స్వయమ్భువః. ౯౬
తం రాజమార్గస్థ మమిత్రఘాతినం
వనౌకస స్తే సహసా బహిః స్థితాః,
దృష్ట్వాఽప్రమేయం గిరిశృఙ్గకల్పం
వితత్రసు స్తే హరియూథపాలాః. ౯౭
కేచి చ్ఛరణ్యం శరణం స్మ రామం
వ్రజన్తి కేచి ద్వ్యథితాః పతన్తి,
కేచి ద్దిశః స్మ వ్యథితాః ప్రయాన్తి
కేచి ద్భయార్తా భువి శేరతే స్మ. ౯౮
త మద్రిశృఙ్గప్రతిమం కిరీటినం
స్పృశన్త మాదిత్య మివాఽఽత్మతేజసా,
వనౌకసః ప్రేక్ష్య వివృద్ధ మద్భుతం
భయార్దితా దుద్రువిరే తత స్తతః. ౯౯
ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే షష్టితమ స్సర్గః. ౬౦.

---

ఏకషష్టితమస్సర్గః.

తతో రామో మహాతేజా ధను రాదాయ వీర్యవాన్,
కిరీటినం మహాకాయం కుమ్భకర్ణం దదర్శహ. ౧
తం దృష్ట్వా రాక్షసశ్రేష్ఠం పర్వతాకారదర్శనమ్,
క్రమమాణ మి వాఽఽకాశం పురా నారాయణం ప్రభుమ్. ౨
సతోయామ్బుదసంకాశం కాఞ్చనాఙ్గదభూషణమ్,
దృష్ట్వా పునః ప్రదుద్రావ వానరాణాం మహాచమూః. ౩

ఆకుంభకర్ణుఁడు సూర్యుఁడు కిరణంబుల భూమిం బ్రకాశింపఁజేయు నట్లు తనదేహకాంతిచే రాజమార్గమును వెలుఁగంజేయుచు ఆరాజమార్గంబున బౌరజనులచేఁ జేమోడ్పుగీలించి నమస్కరింపఁబడుచు దేవేంద్రుఁడు బ్రహ్మదేవునిగృహంబునకుంబోవునట్లు రావణునిగృహంబునకుంబోయెను. ౬౩

లంకకు వెలుపలనుండునట్టి వానరులు రాజమార్గంబునఁ బోవుచున్న శత్రుసంహర్తయు నప్రమేయాకారుఁడును బర్వతశిఖరసమానుఁడునగు నాకుంభకర్ణుంజూచి మిక్కిలియు భయపడిరి. ౬౪

వానరులుకొందఱు భయపీడితులయి శరణ్యుఁడగు రాముని శరణం బొచ్చిరి. కొందఱు నేలఁబడిరి. కొందఱు దిక్కులకుం బరుగెత్తిరి. కొందఱు నేలఁబరుండిరి. ౬౫

వానరులు పర్వతశిఖరాకారుఁడును కిరీటధరుఁడును దేహకాంతిచే సూర్యుంబోలియున్నవాఁడును ఆశ్చర్యముగలిగించునాకారముగలవాఁడునగు నాకుంభకర్ణుంజూచి భయపీడితులయి దిక్కులకుం బరుగెత్తిరి. ౬౬

ఇది యఱువదవసర్గము.

## అఱువదియొకటవసర్గము.

అంత మహాతేజుఁడును మహాపరాక్రమశాలియు నగురాముఁడు ధనుర్ధరుఁడై కిరీటియు మహాకాయుఁడు నగుకుంభకర్ణునిం జూచెను. ౧

పర్వతాకారుఁడును మున్ను త్రివిక్రమావతారంబు దాల్చిననారాయణునికైవడిఁ జూపట్టుచున్నవాఁడును నూతనమేఘసమానవర్ణుఁడును బంగారుబాహుపురులు దాల్చినవాఁడును రాక్షసోత్తముఁడు నగు నా కుంభకర్ణుంజూచి మరల నవ్వానరసేనయంతయు భయపడి పరుగెత్తినది. ౨, ౩

విద్రుతాం వాహినీం దృష్ట్వా వర్ధమానం చ రాక్షసమ్,
సవిస్మయ మిదం రామో విభీషణ మువాచ హ. ౪
కోఽసౌ పర్వతసఙ్కాశః కిరీటీ హరిలోచనః,
లఙ్కాయాం దృశ్యతే వీరస్సవిద్యుదివ తోయదః. ౫

పృథివ్యాః కేతుభూతోఽసౌ మహానేకోఽత్ర దృశ్యతే,
యం దృష్ట్వా వానరా స్సర్వే విద్రవన్తి తతస్తతః. ౬
ఆచక్ష్వ మే మహాన్ కోఽసౌ రక్షో వా యది వాఽసురః,
న మయైవంవిధం భూతం దృష్టపూర్వం కదాచన. ౭

స పృష్టో రాజపుత్త్రేణ రామేణాక్లిష్టకర్మణా,
విభీషణో మహాప్రాజ్ఞః కాకుత్స్థ మిద మబ్రవీత్. ౮

యేన వైవస్వతో యుద్ధే వాసవ శ్చ పరాజితః,
సైషవిశ్రవసః పుత్త్రః కుమ్భకర్ణః ప్రతాపవాన్.
అస్య ప్రమాణా త్సదృశో రాక్షసోఽన్యో న విద్యతే,

ఏతేన దేవా యుధి దానవాశ్చ యక్షాభుజఙ్గాః పిశితాశనాశ్చ.
గన్ధర్వవిద్యాధరకిన్నరాశ్చ సహస్రశో రాఘవ! సంప్రభగ్నాః,

శూలపాణిం విరూపాక్షం కుమ్భకర్ణం మహాబలమ్. ౧౧
హన్తుం న శేకు స్త్రిదశాః కాలోఽయ మితి మోహితాః,

ప్రకృత్యా హ్యేష తేజస్వీ కుమ్భకర్ణో మహాబలః. ౧౨
అన్యేషాం రాక్షసేన్ద్రాణాం వరదానకృతం బలమ్,

రాముఁడు పర్వతాకారుఁడగు నా కుంభకర్ణునిం జూచి వానరసేన పరు
గెత్తుటంగని యాశ్చర్యంబున విభీషణుంజూచి యిట్లని చెప్పెను. ౪

లంకయందుఁ బర్వతాకారుఁడును గిరీటధరుఁడును గపిలనేత్రుఁడునగు
వీరుఁడొకఁడు మెఱపులతోఁ గూడిన మేఘముకైవడిఁ జూపట్టుచున్నాఁడే
ఈతఁడెవ్వఁడు?

ఈతఁడు భూమికంతయుఁ ధ్వజంబువలె నత్యున్నతాకారుఁడై
యున్నాఁడు. ఈతనింజూచి వానరులందఱు భయంబునఁ బరుగెత్తుచున్నారు.

ఈతఁ డెవ్వఁడు? రాక్షసుఁడా? అసురుఁడా? నాకుఁ జెప్పుము; నేనిది
వఱకిట్టి మహాభూతము నెప్పుడును జూచినదిలేదు. అని రాముఁడు విభీషణుని
తోఁ జెప్పెను. ౫

మహాపండితుఁడగు విభీషణుఁడు రాజపుత్త్రుఁడును ఒరుల కెంత
మాత్రము దుఃఖముగలిగింపనివాఁడునగు రామునిచే నిట్లడుగఁబడినవాఁడై
రామునింజూచి యిట్లని చెప్పెను. ౬

ఈతఁడు విశ్రవసునిపుత్త్రుఁడగు కుంభకర్ణుఁడు యుద్ధంబున యముని
దేవేంద్రునింగూడ జయించినట్టి మహాపరాక్రమశాలి. ౭

ప్రమాణంబున నీకుంభకర్ణు నంతటివాఁడు మఱియొకరాక్షసుఁ
డెవ్వఁడును లేఁడు.

రాముఁడా! ఈకుంభకర్ణుఁడు యుద్ధంబున దేవతలును దానవులును
బన్నగులును రాక్షసులును గంధర్వులును విద్యాధరులును గిన్నరులును వేన
వేలుగా నొక్కుమ్మడి వచ్చినను వారలనందఱఁ బెక్కుమార్లు జయించినాఁడు.

మహాబలుఁడగు కుంభకర్ణుఁడు శూలపాణియయి భయంకరంబులగుకన్ను
లతో యుద్ధభూమియందునిలువఁగా దేవతలందఱు అతనిఁ గొట్టఁజాలక
యీతఁడు త్రైలోక్యసంహారకర్తయగు కాలుఁడే యనిభ్రమించి భయంబునఁ బాఱిరి

మహాబలుఁడగు నీకుంభకర్ణుఁడుమాత్రము స్వభావంబుననే మహాపరా
క్రమశాలి; ఇతరరాక్షసులకంతయుఁ వరదానంబునఁ గలిగినబలము. ౧౨

ఏతేన జాతమాత్రేణ క్షుధార్తేన మహాత్మనా. ౧౩
భక్షితాని సహస్రాణి సత్త్వానాం సుబహూన్యపి,
తేషు సమ్భక్ష్యమాణేషు ప్రజా భయనిపీడితాః. ౧౪
యాన్తి స్మ శరణం శక్రం తమప్యర్థం న్యవేదయన్,
స కుమ్భకర్ణం కుపితో మహేన్ద్రో
జఘాన వజ్రేణ శితేన వజ్రీ. ౧౫
స శక్రవజ్రాభిహతో మహాత్మా
చచాల కోపాచ్చ భృశం ననాద,

తస్య నానద్యమానస్య కుమ్భకర్ణస్య ధీమతః. ౧౬
శ్రుత్వా నినాదం విత్రస్తా భూయో భూమి ర్వితత్రసే,
తత్ర కోపాన్మహేన్ద్రస్య కుమ్భకర్ణో మహాబలః. ౧౭
వికృష్యైరావతా ద్దన్తం జఘానోరసి వాసవమ్,
కుమ్భకర్ణప్రహారార్తో విజజ్వాల స వాసవః. ౧౮
తతో విషేదు స్సహసా దేవ బ్రహ్మర్షిదానవాః,
ప్రజాభిస్సహ శక్రశ్చ యయౌ స్థానం స్వయంభువః. ౧౯
కుమ్భకర్ణస్య దౌరాత్మ్యం శశంసుస్తే ప్రజాపతేః,
ప్రజానాం భక్షణం చాపి దేవానాం చాపి ధర్షణమ్. ౨౦
ఆశ్రమధ్వంసనం చాపి పరస్త్రీహరణం భృశమ్,

ఏవం ప్రజా యది త్వేష భక్షయిష్యతి నిత్యశః. ౨౧
అచిరే ణైవ కాలేన శూన్యో లోకో భవిష్యతి,

వాసవస్య వచశ్శ్రుత్వా సర్వలోకపితామహః. ౨౨
రక్షాంస్యావాహయామాస కుమ్భకర్ణం దదర్శహ,

ఈతఁడు పుట్టినంతనే మహాబలుఁడై యాఁకలిగొని పెక్కువేల ప్రాణులను భక్షించెను. ౧౩

అట్లు కుంభకర్ణుఁడు అందఱను భక్షించుచుండఁగాఁ బ్రజలందఱు బరమ భీతులయి దేవేంద్రుని శరణుఁజొచ్చి యావృత్తాంత మతనికిం జెప్పిరి. ౧౪

ఆదేవేంద్రుఁడు కుపితుఁడై కుంభకర్ణునిఁ దీక్ష్ణంబగువజ్రాయుధముచేఁ బ్రహరించెను. ౧౫

మహాబలుఁ డగు నాకుంభకర్ణుఁడు అట్లు దేవేంద్రునిచే వజ్రాయుధంబునఁగొట్టఁబడి కొంతదడవు చలనముఁజెంది యంత కోపంబున సింహనాదంబు గావించెను.

ముందే భయపడియున్న ప్రజలందఱు ఆకుంభకర్ణుని మహాసింహనాదమునువిని మఱియుఁ భయముఁజెందిరి. ౧౬

మహాబలుఁడగు కుంభకర్ణుడు కోపంబున నైరావతముదంతంబు వెఱికి ఇంద్రునివక్షస్థలంబునఁ బ్రహరించెను. ౧౭

ఇంద్రుఁడు కుంభకర్ణునిప్రేటునకుసోలి కోపంబున మండిపడెను; అంత దేవతలును బ్రహ్మర్షులును దానవులును బరమదుఃఖితులయిరి. ౧౮

దేవేంద్రుఁడు ప్రజలతోఁగూడ బ్రహ్మదేవునియొద్దకుఁబోయి ప్రజలుం దానును కుంభకర్ణుని దుష్కృతములను బ్రహ్మదేవునికిఁ దెలుపుకొనిరి.

ప్రజలభక్షించుటయు దేవతల నవమానించుటయు ఋష్యాశ్రమంబుల నశింపఁజేయుటయుఁ బరస్త్రీల నపహరించుటయు మొదలుగాఁగుంభకర్ణుఁడు గావించుదుష్కార్యముల నన్నిటిని జెప్పిరి. ౨౦

ఈకుంభకర్ణుఁ డీప్రకారంబున నెప్పుడును బ్రజలను భక్షింపుచుండునేని ఇంక శీఘ్రంబున నె లోకంబంతయుఁ బ్రజాశూన్యంబు గాఁగలదు. అని ఇంద్రుఁడు బ్రహ్మదేవునితోఁ జెప్పెను. ౨౧

బ్రహ్మదేవుఁడు ఇంద్రుఁడు చెప్పినమాటను విని రాక్షసుల నందఱను రప్పించి వారలలోఁ గుంభకర్ణుఁ బొడగనెను. ౨౨

కుమ్భకర్ణం సమీక్ష్యైవ వితత్రాస ప్రజాపతిః. ౨౩

దృష్ట్వా విశ్వాస్య చైవైనం స్వయంభూ రిద మబ్రవీత్,

ధ్రువం లోకవినాశాయ పౌలస్త్యే నాసి నిర్మితః. ౨౪

తస్మా త్త్వ మద్య ప్రభృతి మృతకల్ప శ్శయిష్యసే,

బ్రహ్మశాపాభిభూతో౽థ నిపపాతాగ్రతః ప్రభోః. ౨౫

తతః పరమసమ్భ్రాన్తో రావణో వాక్య మబ్రవీత్,
వివృద్ధః కాఞ్చనో వృక్షః ఫలకాలే నికృత్యతే. ౨౬
న నప్తారం స్వకం న్యాయ్యం శప్తు మేవం ప్రజాపతే!,

న మిథ్యావచన శ్చ త్వం స్వప్స్యత్యేష న సంశయః. ౨౭
కాలస్తు క్రియతా మస్య శయనే జాగరే తథా,

రావణస్య వచ శ్శ్రుత్వా స్వయంభూ రిద మబ్రవీత్. ౨౮

శయితా హ్యేష షణ్మాసా నేకాహం జాగరిష్యతి,

ఏకేనాహ్నా త్వసౌ వీర శ్చరన్భూమిం బుభుక్షితః. ౨౯
వ్యాత్తాస్యో భక్షయే ల్లోకాన్ సంక్రుద్ధ ఇవ పావకః,

బ్రహ్మదేవుఁడును గూడ కుంభకర్ణుం జూచినంతనే భయమునొందెను.

బ్రహ్మదేవుఁడుకుంభకర్ణుంజూచి భయంబునీర్చుకొని యాకుంభకర్ణునితో నీమాటంజెప్పెను.

విశ్రవసుఁడు లోకనాశంబుగలుగుటకై నిన్నుఁ బుట్టించినాఁడు; ఇది వాస్తవము. ౨౮

అందువలన నీ విదిమొదలు ఎల్లప్పుడును జచ్చినట్లు పడి నిద్రించుచుండఁగలవు. అని బ్రహ్మ కుంభకర్ణునితోఁ జెప్పెను.

అంత నాకుంభకర్ణుఁడు బ్రహ్మదేవునిశాపముచే నిద్రకొంది యాయన ముందటం బడెను. ౨౯

అంత రావణుఁడు పరమభీతుఁడై బ్రహ్మదేవునింజూచి యిట్లనిచెప్పెను.

బ్రహ్మదేవుఁడా! చక్కఁగా వృద్ధిఁబొందిన బంగారుపండు వృక్షమును ఫలించుకాలమున నఱికివేసెదవేమి? నీ మునిమనుమఁడేయయిన యీకుంభకర్ణు నిట్లు శపించుట యుక్తముగాదు. ౩౦

నీమాట యబద్ధముకాఁజాలదు; కావున నీకుంభకర్ణుఁడు నిద్రించుచునే యుండును; సందియములేదు; అయితే యితఁడు నిద్రించుటకును మేలుకొని యుండుటకును గాలనియమము చేయవలయును. అని రావణుఁడు బ్రహ్మదేవునితోఁ జెప్పెను. ౩౧

బ్రహ్మదేవుండు రావణుఁడు చెప్పినమాటను విని యతనితో నిట్లని చెప్పెను. ౩౨

ఈకుంభకర్ణుఁడు ఆఱుమాసములు నిద్రపోవుచు నొకదినము మేలుకొనుచు నుండును.

వీరుఁడగు నీకుంభకర్ణుఁడు ఆఱుమాసముల కొకదినమునిద్ర లేచియాఁకలిగొని నోరుదెఱచుకొని భూమియందు సంచరించుచుఁ గ్రుద్ధుఁడగు నగ్నిహోత్రుఁడు దహించునట్లు లోకంబుల భక్షింపఁగలఁడు అని బ్రహ్మదేవుఁడు

సోఽసౌ వ్యసన మాపన్నః కుమ్భకర్ణ మబోధయత్. ౩౦
త్వత్పరాక్రమభీతశ్చ రాజా సంప్రతి రావణః,
స ఏష నిర్గతో వీర శ్శిబిరా ద్భీమవిక్రమః. ౩౧
వానరా న్భృశసఙ్క్రుద్ధో భక్షయ న్పరిధావతి,
కుమ్భకర్ణం సమీక్ష్యైవ హరయోఽద్య ప్రవిద్రుతాః. ౩౨
కథ మేనం రణే క్రుద్ధం వారయిష్యన్తి వానరాః,

ఉచ్యన్తాం వానరా స్సర్వే యన్త్ర మేత త్సముచ్ఛ్రితమ్. ౩౩
ఇతి విజ్ఞాయ హరయో భవిష్యన్తీహ నిర్భయాః,

విభీషణవచ శ్శ్రుత్వా హేతుమ త్సుముఖేరితమ్. ౩౪
ఉవాచ రాఘవో వాక్యం నీలం సేనాపతిం తదా,
గచ్ఛ సైన్యాని సర్వాణి వ్యూహ్యతిష్ఠస్వ పావకే. ౩౫
ద్వారా ణ్యాదాయ లఙ్కాయాశ్చర్యాశ్చాప్యథసంక్రమాన్,

శైలశృఙ్గాణి వృక్షాంశ్చ శిలాశ్చా ప్యుపసంహర. ౩౬
తిష్ఠన్తు వానరా స్సర్వే సాయుధా శ్శైలపాణయః,

రాఘవేణ సమాదిష్టో నీలో హరిచమూపతిః. ౩౭
శశాస వానరానీకం యథావ త్కపికుఞ్జరః,
తతో గవాక్ష శ్శరభో హనూమా నఙ్గద స్తథా. ౩౮
శైలశృఙ్గాణి శైలాభా గృహీత్వా ద్వార మభ్యయుః,
రామవాక్య ముపశ్రుత్య హరయో జితకాశినః. ౩౯
పాదపై రర్దయ న్వీరా వానరాః పరవాహినీమ్,

రావణునితోఁ జెప్పెను. ౨౯

రాక్షసరాజుండగు రావణుఁడు నీపరాక్రమంబునకు భయపడి దుఃఖితుఁడై నిద్రపోవుచున్న యీకుంభకర్ణుని మేలుకొలిపెను. ౩౦

శూరుఁడును భయంకరపరాక్రముఁడునగు నీకుంభకర్ణుఁడు గృహంబున నుండి వెడలి పరమక్రుద్ధుఁడై వానరులను భక్షించుటకై వచ్చెను. ౩౧

వానరు లిప్పుడు కుంభకర్ణునిఁ జూచినంతనే భయంబునం బరుగెత్తుచున్నారే; ఇంక వీరలు యుద్ధంబునఁ గుపితుఁడైయున్న యీకుంభకర్ణు నెట్లువారింపఁగలరు? ౩౨

“ఇది యొకయంత్రము పైకెత్తఁబడినది” అని వానరులకుఁ జెప్పవలయును. వార లట్లుదెలిసికొని నిర్భయులై యుందురు. అని విభీషణుండు రామునితోఁ జెప్పెను. ౩౩

రాముఁడు విభీషణుఁడు సుముఖంబుతో యుక్తియుక్తంబుగాఁ జెప్పిన మాటనువిని వానరసేనానాయకుఁడగు నీలుంజూచి యిట్లని చెప్పెను. ౩౪

అగ్నిహోత్రపుత్రుఁడవగు నీలుఁడా! నీవు సమస్తసైన్యంబులను వ్యూహములుగాఁ దీర్చుకొని లంకయందలి పురద్వారంబులను చర్యాగృహములను ఆనకట్టలను ఆక్రమించియుండుము. ౩౫

పర్వతశిఖరంబులను వృక్షంబులను రాళ్లను సేకరింపుము. వానరులందఱు పర్వతంబులు మొదలగు నాయుధంబులను ధరించియుందురుగాక. అని రాముఁడు నీలునితోఁ జెప్పెను. ౩౬

వానరోత్తముఁడును వానరసేనానాయకుఁడు నగు నీలుఁడు రాముని యాజ్ఞను శిరసావహించి ఆప్రకారముగ వానరసేన నాజ్ఞాపించెను. ౩౭

అంతఁ బర్వతాకారులగు గవాక్షుఁడును శరభుఁడును హనుమంతుఁడును అంగదుఁడును బర్వతశిఖరములను గ్రహించిలంకాద్వారంబుల నిరోధించిరి.

జయశీలురై తేజరిల్లుచుండువీరులగు వానరులు రామునిమాటనువిని వృక్షములుగొని శత్రుసైన్యంబుల మర్దించిరి. ౩౮

తతో హరీణాం తదనీక ముగ్రం
రరాజ శైలోద్యతదీప్తహస్తమ్,
గిరే స్సమీపానుగతం యథైవ
మహ న్మహాంభోధరజాల ముగ్రమ్. ४०

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే ఏకషష్టితమ స్సర్గః. ६१.

## ద్విషష్టితమస్సర్గః

స తు రాక్షసశార్దూలో నిద్రామదసమాకులః,
రాజమార్గం శ్రియా జుష్టం యయౌ విపులవిక్రమః. ౧

రాక్షసానాం సహస్రై శ్చ వృతః పరమదుర్జయః,
గృహేభ్యః పుష్పవర్షేణ కీర్యమాణ స్తదా యయౌ. ౨

స హేమజాలవితతం భానుభాస్వరదర్శనమ్,
దదర్శ విపులం రమ్యం రాక్షసేన్ద్రనివేశనమ్. ౩

స త త్తదా సూర్య ఇవాభ్రజాలం
ప్రవిశ్య రక్షోధిపతే ర్నివేశమ్,
దదర్శ దూరేఽగ్రజమాసనస్థం
స్వయంభువం శక్ర ఇవాఽసనస్థమ్. ४

భ్రాతు స్స భవనం గచ్ఛ న్రక్షోగణసమన్వితః,
కుమ్భకర్ణః పదన్యాసై రకమ్పయత మేదినీమ్. ५

సోఽభిగమ్య గృహం భ్రాతుః కక్ష్యా మభివిగాహ్య చ,
దదర్శోద్విగ్న మాసీనం విమానే పుష్పకే గురుమ్. ६

అంత లంకాప్రాకారసమీపంబున నానావిధపర్వతంబులు చేతులం దాల్చియున్న భయంకరంబగు నవ్వానరసేన పర్వతసమీపంబుననుండు భయంకరంబగు మహామేఘసమూహంబుకైవడిఁ బ్రకాశించెను. ౮౦

ఇది యఱువదియొకటవసర్గము.

## అఱువదిరెండవసర్గము.

మహాపరాక్రమశాలియగు రాక్షసోత్తముఁడైన యాకుంభకర్ణుఁడును కొంచెము నిదురకైపు చెలంగ నానావిధకాంతులం దేజరిల్లుచున్న రాజమార్గంబు నొందెను. ౧

యుద్ధంబున నెట్టివారికిని జయింపనలవిగానట్టి కుంభకర్ణుఁడు పెక్కువేలరాక్షసులచేఁ బరివృతుఁడై పౌరులు మేడలపైనుండి పుష్పవర్షంబు గురియింపఁ బేరోలగంబునం బోయెను. ౨

ఆకుంభకర్ణుఁడు బంగారుకిటికీలతో నొప్పుచున్నదియు సూర్యమండలంబుభంగిఁ బ్రకాశించుచున్నదియు విశాలంబును రమణీయంబునగు రాక్షసరాజు రావణునిగృహంబును జూచెను. ౩

ఆకుంభకర్ణుఁ డప్పుడు సూర్యుఁడు మేఘసమూహముం బ్రవేశించునట్లు రాక్షసరాజుఁడగు రావణుని గృహంబుఁ బ్రవేశించి దేవేంద్రుఁడు ఆసనగతుఁడగు బ్రహ్మదేవుంజూచునట్లు దూరంబున సింహాసనగతుఁడగు రావణుం గాంచెను. ౪

ఆకుంభకర్ణుఁడు రాక్షససమూహసంయుతంబగు రావణునిగృహంబుఁ బ్రవేశించునప్పుడు అతనిపాదన్యాసంబులచే భూమి వడఁకినది. ౫

ఆ కుంభకర్ణుఁడు రావణునిగృహంబుఁ బ్రవేశించి ద్వారమునుదాఁటి లోపలఁ బుష్పకవిమానంబున నాసీనుఁడును దుఃఖితుఁడునై యున్న యన్నం గాంచెను. ౬

అథ దృష్ట్వా దశగ్రీవః కుమ్భకర్ణ ముపస్థితమ్,
తూర్ణ ముత్థాయ సంహృష్టః సన్నికర్ష ముపానయత్. ౭

అథాసీనస్య పర్యఙ్కే కుమ్భకర్ణో మహాబలః,
భ్రాతు ర్వవన్దే చరణౌ కింకృత్య మితి చాబ్రవీత్. ౮

ఉత్పత్య చైనం ముదితో రావణః పరిషస్వజే,
స భ్రాత్రా సంపరిష్వక్తో యథావచ్చాభినన్దితః. ౯
కుమ్భకర్ణ శ్శుభం దివ్యం ప్రతిపేదే వరాసనమ్,
స త దాసన మాశ్రిత్య కుమ్భకర్ణో మహాబలః. ౧౦
సంరక్తనయనః కోపా ద్రావణం వాక్య మబ్రవీత్,
కిమర్థ మహ మాదృత్య త్వయా రాజ! న్విబోధితః. ౧౧

శంస కస్మా ద్భయం తేఽస్తి కోఽద్య ప్రేతో భవిష్యతి,

భ్రాతరం రావణః క్రుద్ధం కుమ్భకర్ణ మవస్థితమ్. ౧౨
ఈషత్తు పరివృత్తాభ్యాం నేత్రాభ్యాం వాక్య మబ్రవీత్,

అద్య తే సుమహా న్కాల శ్శయానస్య మహాబల!. ౧౩
సుఖిత స్త్వం న జానీషే మమ రామకృతం భయమ్,

ఏష దాశరథీ రామ స్సుగ్రీవసహితో బలీ. ౧౪
సముద్రం సబల స్తీర్త్వా మూలం నః పరికృన్తతి,

హన్త పశ్యస్వ లఙ్కాయాం వనాన్యుపవనాని చ. ౧౫

అంత రావణుండు కుంభకర్ణుండు వచ్చుటంజూచి పరమసంతుష్టుండై శీఘ్రంబున నాసనంబుననుండిలేచి యతనిం గవుంగిలించుకొని యాసనము సమీపంబునకుం దీసికొనివచ్చెను. ౭

అంత రావణుండు మరలం బర్యంకంబునం గూర్చుండినపిమ్మట మహాబలుండగు కుంభకర్ణుండు అన్నచరణంబులకు నమస్కరించి "ఏమి కార్యము!" అని యడిగెను ౮

రావణుండు సంతుష్టుండై లేచి యాకుంభకర్ణునిం గవుంగిలించుకొనెను. ఆకుంభకర్ణుండు రావణునిచేం గవుంగిలింపంబడి ప్రశంసింపంబడినవాడై సుందరంబును దివ్యంబునగు సింహాసనంబు నారోహించెను. ౯

మహాబలుండగు నాకుంభకర్ణుండు ఆసనగతుండై కోపంబునం గన్నుల నెఱ్ఱదనంబుగదుర రావణుంజూచి యీమాటం జెప్పెను. ౧౦

రాక్షసరాజుండవగు రావణుండా! నీవు నిద్రపోవుచున్న నన్ను నింత యక్కఱతో నేల లేపినావు? ౧౧

నీ కిప్పు డెవ్వనివలన భయముగలిగెను? ఎవ్వం డిప్పుడు మరణంబు నొందనున్నాండు? చెప్పుము. అని కుంభకర్ణుండు రావణునితోం జెప్పెను.

రావణుండు క్రుద్ధుండునునిశ్చితంబుగా మాటలాడుచున్నవాండునగు తమ్మునిం గుంభకర్ణునిం జూచి కొంచెము కోపంబునం గన్నులందిరుగ నిట్లని చెప్పెను. ౧౨

మహాబలుండవగు కుంభకర్ణుండా! నీవు పరుండి యిప్పటికి బహుకాలమయినది, ఇట్లు సుఖంబుగా నిద్రించుచుండువాండవు కావున నాకు రాముని వలనం గలిగినభయము నీకుం దెలియదు. ౧౩

బలవంతుండగు దశరథకుమారుండు రాముండు సుగ్రీవునితోను వానర సేనతోనుంగూడి సముద్రంబుం దాంటివచ్చి మనలను సమూలంబుగా ఖండించుచున్నాండు. ౧౪

లంకయందలివనంబుల నుపవనంబులం జూడుము. రాముండు సముద్రం

సేతునా సుఖ మాగమ్య వానరై ర్కాణ్ణపీకృతమ్,

యే రాక్షసానాం ముఖ్యతమా హతా స్తే వానరై ర్యుధి. ౧౬
వానరాణాం క్షయం యుద్ధే న పశ్యామి కదాచన,

నచాపి వానరా యుద్ధే జితపూర్వాః కదాచన. ౧౭
తదేత ద్భయ ముత్పన్నం త్రాయస్వేమాం మహాబల!,
నాశయ త్వ మిమా నద్య తదర్థం బోధితో భవాన్. ౧౮

సర్వక్షపితకోశం చ స త్వ మభ్యవపద్య మామ్,
త్రాయస్వేమాం పురీం లఙ్కాం బాలవృద్ధావశేషితామ్. ౧౯

భ్రాతు రర్థే మహాబాహో! కురు కర్మ సుదుష్కరమ్,

మయైవం నోక్తపూర్వో హి కచ్చి ద్భ్రాతరః! పరన్తప!. ౨౦

త్వయ్యస్తి తు మమ స్నేహః పరా సమ్భావనా చ మే,

దైవాసురేషు యుద్ధేషు బహుశో రాక్షసర్షభ! ౨౧
త్వయా దేవాః ప్రతివ్యూహ్య నిర్జితాశ్చాసురా యుధి,
తదేతత్సర్వ మాతిష్ఠ వీర్యం భీమపరాక్రమ!. ౨౨
న హి తే సర్వభూతేషు దృశ్యతే సదృశో బలీ,

కురుష్వ మే ప్రియహిత మేత దుత్తమం
యథాప్రియం ప్రియరణ! బాన్ధవప్రియ!,

బనను సేతువుఁ గట్టుకొనివచ్చి లంకయంతయు వానరమయము గావించి యున్నాఁడు. ౧౫

మన రాక్షసులలో నుత్తములుగా నుండువారలు వానరులచే యుద్ధంబున నిహతులయిరి. నేను యుద్ధంబున నొకప్పుడును వానరవీరులలో నొక్కఁడేని చచ్చుటం జూడలేదు. ౧౬

యుద్ధంబున నొకప్పుడైనను వానరు లపజయము నొందినదిలేదు. ౧౭

మహాబలుండవగు కుంభకర్ణుఁడా! ఇట్టి భయముగలిగినది. నీ విప్పుడు వానరులనందఱను వధించి యీలంకాపట్టణమును గాపాడుము. అందుకొఱకే నిన్ను నిద్ర లేపినాము. ౧౮

నాబొక్కసమంతయుం జెలవయినది. లంకయందలి మేటిరాక్షసు లందరు హతులయి ఇప్పుడు బాలవృద్ధులుమాత్రము శేషించియున్నారు. ఈ సంగతి దెలిసి నీవు ఇప్పుడు లంకను రక్షింపుము. ౧౯

మహాబాహుఁడవగు కుంభకర్ణుఁడా! నీయన్నకుఁగా ఇతరునకుఁ జేయ నలవిగాని యీకార్యమును నీవు చేయుము.

శత్రువుల వధించువాఁడవగు కుంభకర్ణుఁడా! ఇదివఱ కెప్పుడైన నేను నీతో నీప్రకారంబునం జెప్పియున్నానా? ౨౦

నీయందుమాత్రము నాకెప్పుడును మిక్కిలియుం స్నేహమును గౌరవంబునుం గలదు.

రాక్షసశ్రేష్ఠుఁడవగు కుంభకర్ణుఁడా! దేవాసురయుద్ధంబులందు నీవు మున్ను దేవతల నసురులను ఎదిరించి యందఱనుంగూడ జయించినావు. ౨౧

భయంకరపరాక్రముఁడవగు కుంభకర్ణుఁడా! నీవా పరాక్రమమంతయు నిప్పు డవలంబింపుము. సమస్తప్రాణులయందును నీకు సరియయిన బలవంతుఁ డెవ్వఁడును లేఁడు. ౨౨

యుద్ధప్రియుఁడవు బంధువులయం దధిక ప్రీతిగలవాఁడవునగు కుంభ కర్ణుఁడా! నాకుఁ బ్రియంబును హితంబునగు నీయుత్తమకార్యంబు గావిం

స్వతేజసా విధమ సపత్నవాహినీం
శరద్ఘనం పవన ఇవోద్యతో మహాన్. ౭౩

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే ద్విషష్టితమస్సర్గః. ౬౨.

---

## త్రి ష ష్టి త మ స్స ర్గః.

తస్య రాక్షసరాజస్య నిశమ్య పరిదేవితమ్,
కుమ్భకర్ణో బభాషేఽథ వచనం ప్రజహాస చ. ౧
దృష్టో దోషో హి యోఽస్మాభిః పురా మన్త్రవినిర్ణయే,
హితేష్వనభియుక్తేన సోఽయ మాసాదిత స్త్వయా. ౨

శీఘ్రం ఖల్వభ్యుపేతం త్వాం ఫలం పాపస్య కర్మణః,
నిరయేష్వేవ పతనం యథా దుష్కృతకర్మణః. ౩
ప్రథమం వై మహారాజ! కృత్య మేత దచిన్తితమ్,
కేవలం వీర్యదర్పేణ నానుబన్ధో విచారితః. ౪

యః పశ్చా త్పూర్వకార్యాణి కుర్యా దైశ్వర్య మాస్థితః,
పూర్వం చాపరకార్యాణి న స వేద నయానయౌ. ౫

దేశకాలవిహీనాని కర్మాణి విపరీతవత్,
క్రియమాణాని దుష్యన్తి హవీంష్యప్రయతేష్వివ. ౬
త్రయాణాం పఞ్చధా యోగం కర్మణాం యః ప్రపశ్యతి,
సచివైః సమయం కృత్వా స సభ్యే వర్తతే పథి. ౭

పుము. మహావాయువులేచి శరన్మేఘంబులం బాఱఁదోలునట్లు నీవు పరాక్రమంబుచే శత్రుసైన్యంబులం బాఱఁదోలుము. అని రావణుండు కుంభకర్ణునితోఁ జెప్పెను. ౨౩

ఇది యఱువదిరెండవసర్గము.

## అఱువదిమూఁడవసర్గము

కుంభకర్ణుఁడు రాక్షసరాజుండగు నా రావణుఁడు చెప్పినమాటలను విని నవ్వి యీమాటలం జెప్పెను. ౧

మున్ను మన మాలోచనము సేయునప్పుడు ఏదోషము గలుగునని నిశ్చయించుకొంటిమో నీవు హితులమాటను వినకపోవుటవలన ఇప్పు డాదోషమునే పొందినావు. ౨

పాపకర్ములు నరకపాతముఁబొందునట్లు నీవు గావించిన సీతాహరణరూపపాపకార్యముయొక్క ఫలమును శీఘ్రంబుగనే పొందినావు. ౩

మహారాజుఁడవగు రావణుఁడా! నీవు పరాక్రమగర్వంబున సీతనపహరించుటకు మున్ను చక్కఁగా నాలోచింపకయే గావించినావు. గుణదోషంబులనుగూడ విచారింపవైతివి. ౪

ఏరాజు ముందు చేయవలసినకార్యములను వెనుకను వెనుకఁజేయవలసిన కార్యమును ముందును జేయునో అతఁడు న్యాయాన్యాయంబులు దెలియనివాఁడు. ౫

దేశకాలవిరుద్ధంబుగఁ జేయఁబడినకార్యములు విపరీతంబులయి అపరిశుద్ధులచే వ్రేల్వఁబడిన హవిస్సులువలె వ్యర్థము లగును. ౬

ఎవ్వఁడు మంత్రులతోఁ జక్కఁగా నాలోచించి తాను బలిష్ఠుఁడై శత్రువు దుర్బలుఁడై యుండునప్పుడు గావింపవలసిన యుద్ధంబను నుత్తమకర్మంబును, తానును శత్రువును సమానులయి యుండునప్పుడు చేయునట్టి సంధియను మధ్యమకర్మంబును, తాను దుర్బలుఁడై శత్రువు బలిష్ఠుఁడై యుండునప్పుడు గావించుదానంబను నధమకర్మంబును, కర్మములయారంభోపాయము, పురుష

యథాగమం చ యో రాజా సమయం విచికీర్షతి,
బుధ్యతే సచివా న్బుద్ధ్యా సుహృద శ్చానుపశ్యతి. ౮

ధర్మ మర్థం చ కామం చ సర్వా న్వా రక్షసాం పతే,
భజేత పురుష కాలే త్రీణి ద్వన్ద్వాని వా పునః. ౯

త్రిషు చైతేషు యచ్ఛ్రేష్ఠం శ్రుత్వా తన్నావబుధ్యతే,
రాజా వా రాజమాత్రో వా వ్యర్థం తస్య బహుశ్రుతమ్. ౧౦

ఉపప్రదానం సాన్త్వం వా భేదం కాలే చ విక్రమమ్,
యోగం చ రక్షసాం శ్రేష్ఠ! తావుభౌ చ నయానయౌ. ౧౧
కాలే ధర్మార్థకామాన్య స్సంమన్త్ర్య సచివై స్సహ,
నిషేవేతాత్మవా ల్లోకే న స వ్యసన మాప్నుయాత్. ౧౨

హితానుబన్ధ మాలోచ్య కార్యాకార్య మిహాత్మనః,
రాజా సహార్థతత్త్వజ్ఞై స్సచివై స్సహి జీవతి. ౧౩

ద్రవ్యసంపత్తు, దేశకాలవిభాగము, విఘ్ననివారణము, కార్యసిద్ధి అనునీయయిదింటితోఁ బొసఁగించి కార్యముసాధించునో ఆరాజు సమర్థుఁడు; సన్మార్గంబున నుండువాఁడు. ౭

ఎవ్వఁడు మంత్రుల యభిప్రాయంబుఁ జక్కఁగాఁ దెలిసికొని స్నేహితులతో నాలోచించి నీతిశాస్త్ర ప్రకారమున నిశ్చయముఁ జేయునో ఆరాజు సమర్థుఁడు. ౮

రాక్షసేశ్వరుఁడవగు రావణుఁడా! పురుషుఁడు శాస్త్రంబున విధింపఁబడియుండునట్లు ప్రాతఃకాలంబున ధర్మమును మధ్యాహ్నంబున నర్థంబును సాయంకాలంబునఁ గామంబును సేవింపవలయును; లేక ప్రాతఃకాలంబున ధర్మార్థంబులను మధ్యాహ్నంబున నర్థధర్మంబులను సాయంకాలంబునఁ గామార్థంబులను ఇట్లొక్కొకకాలంబున రెండు రెండుగాఁ గాని సేవింపవలయును; లేక సాయంకాలంబుననైనను ధర్మార్థకామంబులను మూఁడింటిని సేవించునది; కామంబును మాత్రము సర్వకాలంబుల సేవించువాఁ డధముండు. ౯

ఎవ్వఁడు రాజుగాని రాజంతటివాఁడు గాని ఈ మూఁడుపక్షములందును ఉత్తమమగు దానివినియోగ ననుష్ఠింపఁడో అతనిశాస్త్రజ్ఞాన మంతయు వ్యర్థము. ౧౦

రాక్షసోత్తముఁడవగు రావణుఁడా! ధీరుఁడు కాలంబున మంత్రులతోఁ జక్కఁగా నాలోచించి యర్హ్యోకాలంబుల ధర్మార్థకామంబుల విడువక యాచరించుచు శత్రుస్థితినిబట్టి యతనియొద్దకుఁబోయి ధనము సమర్పించుటను గాని మంచిమాటలు చెప్పుకొనుటనుగాని వారలలో వారలకు విరోధంబు పుట్టించుటను గాని యుద్ధంబు సేయుటను గాని ఈ నాలుగు పాయంబులలో రెంటిని మూఁటిని గాని అర్హ్యోకాలంబులకుఁ దగినట్లు గావించునో ఆతనికి దుఃఖముగలుగదు. ౧౧, ౧౨

ఏరాజు కార్యతత్త్వంబు దెలిసినట్టిమంత్రులతో నేది దనకు మేలుగలిగించునదో ఏది కార్యమో ఏది యకార్యమో దీనినంతయుఁ జక్కఁగా నాలోచించి యుక్తమయినదానిని మాత్రమే చేయునో అతఁడుమాత్రము

అనభిజ్ఞాయ శాస్త్రార్థా న్పురుషాః పశుబుద్ధయః,
ప్రాగల్భ్యా ద్వక్తు మిచ్ఛన్తి మన్త్రే ష్వభ్య న్తరీకృతాః. ౧౪

అశాస్త్రవిదుషాం తేషాం న కార్య మహితం వచః,
అర్థశాస్త్రానభిజ్ఞానాం విపులాం శ్రియ మిచ్ఛతామ్. ౧౫

అహితం చ హితాకారం ధార్ష్ట్యా జ్జల్పన్తి యే నరాః,
అవేక్ష్య మన్త్రబాహ్యా స్తే క ర్తవ్యాః కృత్యదూషణాః. ౧౬

వినాశయన్తో భర్తారం సహితా శ్శత్రుభి ర్బుధైః,
విపరీతాని కృత్యాని కారయ న్తీహ మన్త్రిణః. ౧౭
తా న్భర్తా మిత్రసంకాశా నమిత్రా న్మన్త్రనిర్ణయే,
వ్యవహారేణ జానీయా త్సచివానుపసంహితాన్. ౧౮

చపలస్యేహ కృత్యాని సహసాఽను ప్రధావతః,
ఛిద్ర మన్యే ప్రపద్యన్తే క్రౌఞ్చస్య ఖ మివ ద్విజాః. ౧౯

యో హి శత్రు మవిజ్ఞాయ నాత్మాన మభిరక్షతి,
అవాప్నోతి హి సోఽనర్థాన్ స్థానాచ్చ వ్యవరోప్యతే. ౨౦

యదు క్త మిహ తే పూర్వం క్రియతా మనుజేన చ,
తదేవ నో హితం కార్యం యదిచ్ఛసి చ తత్కురు. ౨౧

లోకంబున సుఖంబుగా జీవింపును. ౧౩

పశువులవంటిపురుషులు నీతిశాస్త్రము కొంచెమేని దెలియనివార లయినను రాజు మూర్ఖుండగుటచే, రాజ్యోపనసభయందుఁ బ్రవేశమునొందిన వారలయి తమ ప్రగల్భతం జూపుచుం ద్రెంచెదరు. ౧౪

కొంచెమేని శాస్త్రాభ్యాసము సేయనివారలును నీతిశాస్త్రము బొత్తిగాఁ దెలియనివారలు నగువారలమాట కీడుఁగలిగించును. గావున సంపదగోరువారలు దాని నెంతమాత్రము చేయఁగూడదు. ౧౫

ఎవ్వరు ప్రాగల్భ్యముచే నహితమగుదాని హితమువలెనే ప్రేలుదురో వారలు కార్యముఁ జెఱతురు గావున రాజు వారల మున్నె పరీక్షించి మంత్రసభనుండి గెంటింపవలయును. ౧౬

మంత్రులు ఉపాయజ్ఞులగు శత్రువులతోఁ జేరి తమరాజును జెఱచుటకై యతనిచే విపరీతంబులగు కార్యంబులం జేయించెదరు. ౧౭

రాజు అట్లు శత్రువులయొద్ద లంచమునుదీసికొనుట మొదలగువానిచే వారలకు వశవర్తులయి తనకు మిత్రులుంబోలె నటించుచు యథార్థంబున శత్రువులయియున్న యామంత్రులను మంత్రకాలంబున వారలవ్యవహారముచేఁ దెలిసికొనవలయును. ౧౮

పక్షులు కుమారస్వామిచేఁ జేయఁబడిన క్రౌంచపర్వతరంధ్రమును బొందు నట్లు రాజు చపలుఁడై శత్రువులయొద్ద లంచము దీసికొన్న దుర్మంత్రులు బోధించుకార్యములను ఆలోచింపక శీఘ్రంబునఁ జేయునప్పుడు శత్రువులు ఛిద్రంబు గనుంగొని సాధింతురు. ౧౯

ఏరాజు శత్రుకార్యంబుఁ జక్కఁగాఁ దెలిసికొని తన్నురక్షించుకొన కుండునో అతఁడు అనర్థంబులఁ బొందుటయేగాక రాజ్యంబునుగూడఁ బోఁగొట్టుకొనును. ౨౦

ఈ విషయమునందు మన తమ్ముఁడు విభీషణుఁ డేమిచెప్పినాఁడో దానిం గావింపుము. అదే మన కిప్పుడు హితము. ఇంక నీకును ఏది దోఁచుచున్నదో

తత్తు శ్రుత్వా దశగ్రీవః కుమ్భకర్ణస్య భాషితమ్,
భ్రుకుటిం చైవ సంచక్రే క్రుద్ధశ్చైన మభాషత. ౨౨
మాన్యో గురు రివాచార్యః కిం మాం త్వ మనుశాససి,
కి మేవం వాక్శ్రమం కృత్వా కాలే యుక్తం విధీయతామ్. ౨౩

విభ్రమా చ్చిత్తమోహాద్వా బలవీర్యాశ్రయేణ వా,
నాభిపన్న మిదానీం య ద్వ్యర్థా స్తస్య పునః కథాః. ౨౪

అస్మి న్కాలే తు యద్యుక్తం తదిదానీం విధీయతామ్,
గతం తు నానుశోచన్తి గతం తు గతమేవ హి. ౨౫

మమాపనయజం దోషం విక్రమేణ సమీకురు,
యది ఖల్వస్తి మే స్నేహో విక్రమం వాఽవగచ్ఛసి. ౨౬
యదివా కార్యమేత త్తే హృది కార్యతమం మతమ్,
స సుహృద్యో విపన్నార్థం దీన మభ్యవపద్యతే. ౨౭
స బన్ధు ర్యోఽపనీతేషు సాహాయ్యాయోపకల్పతే,

త మథైవం బ్రువాణం తు వచనం ధీరదారుణమ్. ౨౮
రుష్టోఽయ మితి విజ్ఞాయ శనైః శ్లక్ష్ణ మువాచ హ,

అతీవ హి సమాలక్ష్య భ్రాతరం క్షుభితేన్ద్రియమ్. ౨౯
కుమ్భకర్ణ శ్శనై ర్వాక్యం బభాషే పరిసాన్త్వయన్,

దానిం జేయుము. అని కుంభకర్ణుఁడు రావణునితోఁ జెప్పెను. ౨౧

కుంభకర్ణుఁడు చెప్పినమాటను విని రావణుఁడు కోపంబునొంది మొగంబున బొమముడిపాటుగదుర నతనిం జూచి యిట్లని చెప్పెను. ౨౨

కుంభకర్ణుఁడా! నాకన్నఁ జిన్నవాఁడవగు నీవు పూజనీయుఁడును ఆచార్యప్రవర్తకుఁడునగు గురువువలెనె నన్ను శిక్షించు న్యాయమేమి? ఈ మాటలు చెప్పుటకుఁ గేవలప్రయాసమే ఫలము గాని వేఱేమియుఁ బ్రయోజనము లేదు. ఇది నీతి నాలోచించుటకుఁ గాలము గాదు. ఇప్పుడు చేయవలసిన పరాక్రమంబు నవలంబింపుము ౨౩

భ్రాంతివలనఁ గాని యజ్ఞానంబువలనఁ గాని బలపరాక్రమంబులచేఁ గలిగినగర్వంబువలన గాని యేదో చేసినాము. చేసినది యిప్పుడు రాదు. దాని మాటిమాటికిఁ జెప్పుట వ్యర్థము. ౨౪

ఈ కాలమునందు ఏది చేయఁదగినదో దానిమాత్రమే యిప్పుడు చేయుము. కడచిన దానిగుఱించి బుద్ధిమంతులు దుఃఖింపరు. పోయినది పోయినదే కాని మరలరాదు. ౨౫

నీకు నాయందు వాస్తవముగా స్నేహముగలదేని పరాక్రమము నీకు తెలిసియుండునేని ఇప్పుడు యుద్ధము చేయక తప్పదని నీకును దోఁచునేని నాయక్రమమువలనం గలిగినదోషమును నీవు పరాక్రమంబున బోఁగొట్టుము.

కార్యనాశము నొంది దీనుఁడై యుండువానికి సాహాయ్యము గావింపవచ్చు స్నేహితుఁడే స్నేహితుఁడు. నీతి దప్పి బాధపడుచుండువారలకు సాహాయ్యముగావించు బంధువే బంధువు. అని రావణుఁడు కుంభకర్ణునితోఁ జెప్పెను.

అంతఁ గుంభకర్ణుఁడు ఇట్లు ధీరముగాను భయంకరంబుగాను వాదులాడుచున్న రావణుంజూచి యాతఁడు కోపమునొందెనని తెలిసికొని మెల్లఁగా మృదువచనంబున నిట్లనియె. ౨౮

కుంభకర్ణుఁడు తనయన్న రావణుఁడు మిక్కిలియుఁ గుపితుఁడై యుండుటంజూచి మెల్లగా నతని నూరడించుచు నిట్లని చెప్పెను. ౨౯

అలం రాక్షసరాజేన్ద్ర! సన్తాప ముపపద్య తే. 30
రోషం చ సమ్పరిత్యజ్య స్వస్థో భవితు మర్హసి,
నైత న్మనసి క ర్తవ్యం మయి జీవతి పార్థివ!. 31
త మహం నాశయిష్యామి యత్కృతే పరితప్యసే,

అవశ్యం తు హితం వాచ్యం సర్వావస్థం మయా తవ. 32
బన్ధుభావా దభిహితం భ్రాతృస్నేహాచ్చ పార్థివ!,

సదృశం యత్తు కాలేఽస్మి న్కర్తుం స్నిగ్ధేన బన్ధునా. 33
శత్రూణాం కదనం పశ్య క్రియమాణం మయా రణే,

అద్య పశ్య మహాబాహో! మయా సమరమూర్ధని. 34
హతే రామే సహభ్రాత్రా ద్రవన్తీం నరవాహినీమ్,

అద్య రామస్య త ద్దృష్ట్వా మయా నీతం రణా చ్ఛిరః. 35
సుఖీ భవ మహాబాహో! సీతా భవతు దుఃఖితా,

అద్య రామస్య పశ్యన్తు నిధనం సుమహ త్ప్రియమ్. 36
లఙ్కాయాం రాక్షసా స్సర్వే యే తే నిహతబాన్ధవాః,

అద్యశోకపరీతానాం స్వబన్ధువధకారణాత్. 37
శత్రో ర్యుధి వినాశేన కరో మ్యాస్రప్రమార్జనమ్,

అద్య పర్వతసంకాశం ససూర్య మివ తోయదమ్. 38
వికీర్ణం పశ్య సమరే సుగ్రీవం ప్లవగో త్తమమ్,

రాక్షసరాజోత్తముఁడవగు రావణుఁడా! ఈ పరితాపము వదలుము. కోపమునుంగూడఁ బరిత్యజించి స్వస్థుఁడవై యుండుము. ౩౦

రాక్షసరాజుఁడవగు రావణుఁడా! నేను బ్రతికియుండఁగా నీవు ఈ దుఃఖమును మనసులో నుంచవలదు. ఎవ్వని నిమిత్తమయి నీవు పరితపించు చున్నావో ఆ రాముని నేను వధించెదను. ౩౧

రాక్షసరాజుండవగు రావణుఁడా! నేను నీకుఁ దమ్ముఁడను బంధువుఁడను; సర్వావస్థలయందును నీ కవశ్యము హితముఁ జెప్పవలసినది విధి. కావున ఈ మాటం జెప్పితిని. ౩౨

స్నేహముగల బంధువు ఇట్టికాలములందు ఏమిచేయుట యుక్తమో ఆ కార్యమును యథాశక్తి గావించెదను. యుద్ధమునందు శత్రువుల నందఱిం జంపెదఁ జూడుము. ౩౩

మహాబాహుఁడవగు రావణుఁడా! ఇప్పుడు నేను యుద్ధంబున రాముని లక్ష్మణుని వధించి వానరసేనయంతయుఁ బాఱిపోవునట్లు గావించెదను. చూడుము. ౩౪

మహాబాహుఁడవగు రావణుఁడా! ఇప్పుడు నేను యుద్ధంబుననుండి రాముని శిరస్సు దెచ్చి నీకుఁ జూపెదను. నీవు దానింజూచి సుఖితుఁడవగుము. సీతాదేవి దుఃఖంబు నొందుఁగాక. ౩౫

లంకయందు ఇదివఱకు యుద్ధంబున బంధువులం బోఁగొట్టుకొనియుండు రాక్షసులు తమకుఁ బరమసంతోషకరమయిన రామమరణంబు నిప్పుడు చూతురు. ౩౬

ఇప్పుడు యుద్ధంబునఁ దమబంధువులు చచ్చుటవలన దుఃఖితులయి యుండు రాక్షసులకు యుద్ధంబున శత్రువును వధించుటచేఁ గన్నీళ్ళు తుడిచి సంతోషంబు గలిగించెదను. ౩౭

ఇప్పుడు పర్వతాకారుఁడును వానరోత్తముఁడు నగుసుగ్రీవుఁడు నెత్తుటం దోఁగుచు సూర్యకాంతిసహితంబగు మేఘంబువలెఁ జూపట్టుచు

కథం త్వం రాక్షసై రేభి ర్మయాచ పరిరక్షితః. 3౯
జిఘాంసుభి ర్దాశరథిం వధ్యసే త్వ మిహానఘ!,
అథ పూర్వం హతే తేన మయి త్వాం హన్తి రాఘవః. ౪౦
నాహమాత్మని సన్తాపం గచ్ఛేయం రాక్షసాధిప!.

కామం త్విదానీ మపి మాం వ్యాదిశ త్వం పరన్తప!. ౪౧
న పరః ప్రేషణీయ స్తే యుద్ధాయాతులవిక్రమ!,

అహముత్పాదయిష్యామి శత్రూం స్తవ మహాబలః. ౪౨

యది శక్రో యది యమో యది పావకమారుతౌ,
తా నహం యోధయిష్యామి కుబేరవరు ణావపి. ౪3
గిరిమాత్రశరీరస్య శితశూలధరస్య మే,
నర్దత స్తీక్ష్ణదంష్ట్రస్య బిభీయా చ్చ పురన్దరః. ౪౪

అథవా త్యక్తశస్త్రస్య మృద్నత స్తరసా రిపూన్,
న మే ప్రతిముఖే స్థాతుం కశ్చి చ్ఛక్తో జిజీవిషుః. ౪౫

నైవ శక్త్యా న గదయా నాసినా నిశితై శ్శరైః,
హస్తాభ్యామేవ సంరబ్ధో హనిష్యామ్యపి వజ్రిణమ్. ౪౬
యది మే ముష్టివేగం స రాఘవోఽద్య సహిష్యతే,
తతః పాస్యన్తి బాణౌఘా రుధిరం రాఘవస్య తు. ౪౭
చిన్తయా బాధ్యసే రాజ! న్కిమర్థం మయి తిష్ఠతి,
సోఽహం శత్రువినాశాయ తవ నిర్యాతు ముద్యతః. ౪౮

నేలం బడియుండఁగలఁడు చూడుము. ౩౯

పాపరహితుఁడవగు రావణుఁడా! రాముని వధింపఁగోరుచుండు నీరాక్షసులును నేను రక్షించుచుండఁగా నిన్నిప్పుడు రాముఁ డెట్లు వధింపఁగలఁడు?

రాక్షసరాజుఁడవగు రావణుఁడా! రాముఁడు నన్ను వధించి యటుపిమ్మట నిన్ను వధింపవలెను. నేను బ్రతియుండఁగా నిన్నింతమాత్రము వధింపఁజాలఁడు. నావిషయమై నాకెంతమాత్రము పరితాపములేదు. ౪౦

సరిలేని పరాక్రమముగలవాఁడవు శత్రువులఁ దపింపజేయువాఁడవునగు రావణుఁడా! ఇప్పుడే నాకాజ్ఞ యొసంగుము. యుద్ధమునకు బంపఁదగినవాఁడు నాకన్న నితరుఁ డెవ్వఁడును నీకు దొరకఁడు. ౪౧

మహాబలశాలివగు రావణుఁడా! నీ శత్రువుల నందఱను నేను వధించెదను. ౪౨

ఇంద్రుఁడుగాని యముఁడుగాని అగ్నివాయువులుగాని కుబేరవరుణులుగాని వచ్చినను వారలతోనుం గూడ నేను యుద్ధము గావించెదను. ౪౩

పర్వతాకారశరీరుఁడను తీక్ష్ణంబులగు కోఱలుగలవాఁడనగు నేను తీక్ష్ణమగు శూలముదాల్చి సింహనాదంబులసేయుచుఁబోగా దేవేంద్రుఁడు గూడ భయపడి పాఱిపోవును. ౪౪

అటుగాక నేను ఆయుధంబువిడిచి వట్టిబాహుబలంబుచే శత్రువులం జంపుచు మారించునెడ బ్రతుకవలెనని యుండువాఁ డెవ్వఁడు నాయెదుట నిలువంగలఁడు? ౪౫

నాకు శక్తి గద ఖడ్గము బాణములు ఈయాయుధములేదియు నక్కఱలేదు. కోపంబుగల్గునేని దేవేంద్రునైనను చేతులచేతనే వధించిపుత్తును. ౪౬

ఆ రాముఁడు నాపిడికిటిపోటునకు తాళునేని యటుపిమ్మట రాముని బాణములు నానెత్తురు త్రాగఁగలవు. ౪౭

రావణుఁడా! నే నుండఁగా నీ వేల యిట్లు దుఃఖపడుచున్నావు? నేను నీశత్రువును వధించుటకై పోవుటకు సిద్ధుఁడనై యున్నాను. ౪౮

ముఞ్చ రామభయం రాజ! న్హనిష్యామి మహా సంయుగే,
రాఘవం లక్ష్మణం చైవ సుగ్రీవం చ మహాబలమ్. ౪౯
హనూమన్తం చ రక్షోఘ్నం లఙ్కా యేన ప్రదీపితా,
హరీంశ్చాపి హనిష్యామి సంయుగే సమవస్థితాన్. ౫౦
అసాధారణ మిచ్ఛామి తవ దాతుం మహ ద్యశః,
యది చేన్ద్రాద్భయం రాజ! న్యదివాఽపి స్వయమ్భువః. ౫౧
అపి దేవా శ్శయిష్యన్తే క్రుద్ధే మయి మహీతలే,
యమం చ శమయిష్యామి భక్షయిష్యామి పావకమ్. ౫౨
ఆదిత్యం పాతయిష్యామి సనక్షత్రం మహీతలే,
శతక్రతుం వధిష్యామి పాస్యామి వరుణాలయమ్. ౫౩
పర్వతాం శ్చూర్ణయిష్యామి దారయిష్యామి మేదినీమ్,
దీర్ఘకాలం ప్రసుప్తస్య కుమ్భకర్ణస్య విక్రమమ్. ౫౪
అద్య పశ్యన్తు భూతాని భక్ష్యమాణాని సర్వశః,
న న్విదం త్రిదివం సర్వ మాహారస్య న పూర్యతే. ౫౫

వధేన తే దాశరథే స్సుఖార్హం
సుఖం సమాహర్తు మహం వ్రజామి,
నిహత్య రామం సహ లక్ష్మణేన
ఖాదామి సర్వా న్హరియూథముఖ్యాన్. ౫౬
రమస్వ కామం పిబ చాగ్ర్యవారుణీం
కురుష్వ కృత్యాని వినీయతాం జ్వరః,
మయాఽద్య రామే గమితే యమక్షయం

రావణుఁడా! “మునివలని భయంబు విడువుము. నే నిప్పుడు యుద్ధంబునందు రామలక్ష్మణులను మహాబలశాలియగు సుగ్రీవుని వధించి పుచ్చెదను.

మనలంకను దహించి రాక్షసుల నేకులం జంపిన హనుమంతుఁడు మొదలుగా యుద్ధమునకు వచ్చియున్న వానరుల నందఱను వధించెదను. ౫౦

మఱి యెవ్వరికిఁ బొందనలవిగాని మహాయశస్సు నీకు గలుగునట్లు గావించెదను.

రాక్షసరాజుఁడవగు రావణుఁడా! ఇంద్రునివలన భయంబుగలిగినను బ్రహ్మాదేవునివలన భయముగలిగినను అన్నిటిని బోఁగొట్టెదను. ౫౧

నేను గోపమునొందినయెడల దేవతలుగూడ నేలంబడిపోదురు; యమునింగూడ వధింతును; అగ్నిహోత్రుంగూడ భక్షింతును. ౫౨

సూర్యుని నక్షత్రములతోఁగూడ ఆకాశంబునుండి నేలంబడవేసెదను; దేవేంద్రుని వధించెదను; సముద్రమునంతయుఁ ద్రాగివేసెదను. ౫౩

పర్వతంబులను జూర్ణంబుగాఁజేసెదను; భూమి నంతయుఁ బగులఁగొట్టెదను.

ఇప్పుడు భూతములన్నియు నాచే భక్షింపఁబడుచున్నవయి బహుకాలముగా నిద్రవోవుచుండిన నాపరాక్రమమును జూచునుగాక. ౫౪

ఈమూఁడులోకములును నాకొక్కపూట యాహారమునకే చాలవు; ఇంక నాతో నెట్లు యుద్ధముచేయును? ౫౫

సుఖం బనుభవింపఁదగిన రావణుఁడా! నేను నీకు సుఖంబుగలిగించుటకై రాముని వధింపంబోవుచున్నాను; రామలక్ష్మణులను వధించి వానరోత్తముల నందఱను యథేచ్ఛం భక్షించెదను. ౪౬

యథేచ్ఛగా సంతోషంబునఁ గ్రీడింపుము; ఉత్తమమయిన మద్యమును గ్రోలుము; పనులంజేసికొనుము; సంతాపమును విడువుము; నే నిప్పుడు రాముని వధించెదఁ గావున సీతాదేవి యింక బహుకాలము నీవశములో నుండఁ

చిరాయ సీతా వశగా భవిష్యతి.

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే త్రిషష్టితమస్సర్గః. ౬౩.

---

## చతుష్షష్టితమస్సర్గః.

తదుక్త మతికాయస్య బలినో బాహుశాలినః,
కుమ్భకర్ణస్య వచనం శ్రుత్వోవాచ మహోదరః. ౧

కుమ్భకర్ణ కులే జాతో ధృష్టః ప్రాకృతదర్శనః,
అవలిప్తో న శక్నోషి కృతం సర్వత్ర వేదితుమ్. ౨

నహి రాజా న జానీతే కుమ్భకర్ణ! నయానయౌ,
త్వం తు కైశోరకా ద్ధృష్టః కేవలం వక్తు మిచ్ఛసి. ౩

స్థానం వృద్ధిం చ హానిం చ దేశకాలవిభాగవిత్,
ఆత్మన శ్చ పరేషాం చ బుధ్యతే రాక్షసర్షభః. ౪

యత్తు శక్యం బలవతా కర్తుం ప్రాకృతబుద్ధినా.
అనుపాసితవృద్ధేన కః కుర్యా త్తాదృశం బుధః. ౫

యాం స్తు ధర్మార్థకామాం స్త్వం బ్రవీషి పృథగాశ్రయాన్,
అనుబోద్ధుం స్వభావే తా న్నహి లక్షణ మస్తి తే. ౬

కర్మ చైవహి సర్వేషాం కారణానాం ప్రయోజకమ్,
శ్రేయః పాపీయసాం చాత్ర ఫలం భవతి కర్మణామ్. ౭

గలను. అని కుంభకర్ణుఁడు రావణునితోఁ జెప్పెను. ౫౭

ఇది యఱువదిమూఁడవసర్గము.

---

## అఱువదినాలుగవసర్గము.

మహోదరుఁడు, మహాకాయుఁడును మహాబలుఁడును మహాబాహుఁడు నగు కుంభకర్ణుఁడు చెప్పిన మాటను విని యిట్లని బదులు చెప్పెను. ౧

కుంభకర్ణుఁడా! నీవు ఉత్తమకులమునఁ బుట్టినవాఁడవైనను మోటు గాఁడవు. అల్పబుద్ధివి. గర్వితుఁడవు. కావున నేవిషయమునందును నీకుఁ గార్యాకార్యము తెలియదు. ౨

కుంభకర్ణుఁడా! రాక్షసరాజుఁడగు రావణునకు న్యాయాన్యాయములు తెలియకుండలేదు; నీవు బాలుఁడవు గావున మోటుతనమున నిట్లు వ్యర్థపు మాటలం బ్రేలెదవు. ౩

రావణుఁడు దేశకాలవిభాగములం దెలిసినవాఁడు కావున తన యొక్కయుం శత్రువులయొక్కయుం వృద్ధిక్షయములను సమముగా నుండుటను జక్కఁగాఁ దెలిసినవాఁడు. ౪

కేవలబలముమాత్రముగలిగి అల్పబుద్ధియయి వృద్ధసేవచేయని నీయట్టి వానికింగూడఁ జేయరానిదని తోఁచునట్టి కార్యమును బండితుఁడగు రావణుఁ డెట్లు చేయును? ౫

నీవు ధర్మార్థకామములకు వేఱువేఱుగా ఫలములు నియతముగాఁ గలవు; అధర్మము గావించుటచే నిట్టియాపద గలిగినదని చెప్పినావే; అట్లు ధర్మార్థకామములకు నియతమున్నవి యనుటకు నీకుఁ బ్రమాణ మేమియున్నది? ౬

సమస్తఫలములకును గర్మమే కారణము; మంచికర్మము చేసిన మంచిఫలమును జెడుకర్మమునకుఁ జెడుఫలమును గలుగుననికదా చెప్పవలెను; అందు చెడ్డకర్మమువలన మంచిఫలములు గలుగుచున్నవి; మంచికర్మములవలన చెడు గలుగుచున్నది; కావున నట్లు చెప్పుటతగదు. ౭

నిశ్శ్రేయసఫలా వేవ ధర్మార్థా వితరా వపి,
అధర్మానర్థయోగ ప్రాప్తిగ ఫలం చ ప్రత్యవాయికమ్. ౮

ఐహలౌకికపారత్రం కర్మ పుంభిర్నిషేవ్యతే,
కర్మా ణ్యపితు కల్యాని లభతే కామ మాస్థితః. ౯

తత్రక్లృప్త మిదం రాజ్ఞా హృది కార్యం మతం చ నః,
శత్రౌహి సాహసం యత్స్యా త్కిమి వాత్రాపనీయతే. ౧౦

ఏకస్యై వాభియానే తు హేతు ర్యః కథిత స్త్వయా,
తత్రా ప్యనుపపన్నం తే వక్ష్యామి యదసాధు చ. ౧౧

యేన పూర్వం జనస్థానే బహవోఽతిబలా హతాః,
రాక్షసా రాఘవం తం త్వం కథ మేకో జయిష్యసి. ౧౨
యే పురా నిర్జితా స్తేన జనస్థానే మహౌజసః,
రాక్షసాం స్తా న్పురే సర్వా న్భీతా నద్యాపి పశ్యసి. ౧౩

తం సింహ మివ సంక్రుద్ధం రామం దశరథాత్మజమ్,
సర్పం సుప్తమివాబుద్ధ్వా ప్రబోధయితు మిచ్ఛసి. ౧౪
జ్వలన్తం తేజసా నిత్యం క్రోధేన చ దురాసదమ్,
కస్తం మృత్యు మివాసహ్య మాసాదయితు మర్హతి. ౧౫

సంశయస్థ మిదం సర్వం శత్రోః ప్రతిసమాసనే,

ధర్మార్థములును అధర్మానర్థములును అన్నియుం శ్రేయస్సునే గలిగించి నవి. అయితే అందు అధర్మానర్థములు మాత్రము ఒకప్పుడు దుఃఖమునుగూడఁ గలిగించుటకలదు; ఇంతియకాని వానికి దుఃఖమేఫలమని చెప్పుట సాగాదు.

పురుషుఁ డీలోకమున నుపయోగించుకర్మములును బరలోకమున నుపయోగించుకర్మములును జేయుచున్నారు; కేవల కామము నవలంబించియుండు వానికి కర్మములన్నియుఁ నతని కీలోకంబున మిక్కిలియుం సుఖం బొసంగును. ౯

అప్పుడు రాక్షసరాజుఁడగు రావణుఁడు సీత నపహరింపవలెనని తలంపు గొనెను! మేమును అదిచేయఁదగినదేయని సమ్మతించినాము, ఇట్లు జరిగియుండఁగా ఇందు శత్రువిషయమయి రావణుఁ డాలోచింపక చేసినయాత్రను మేమియున్నది? ౧౦

నీ వొక్కఁడవే యుద్ధమునకుఁబోయెదనని చెప్పి యందుకుఁ గారణంబులుగా నీపరాక్రమాదుల నుగ్గడించితివే; ఆమాటగూడ అయుక్తముగాను అసాధువుగానున్నది; చెప్పెదను వినుము. ౧౧

ఎవ్వఁడు మున్ను జనస్థానంబునందు మహాబలశాలులగు రాక్షసుల బెక్కండ్ర వధించెనో ఆట్టిరాముని నీవొక్కఁడ వెట్లు జయింపఁగలవు? ౧౨

మున్ను రామునిచే జనస్థానంబున జయింపఁబడిన మహాపరాక్రమశాలులగు రాక్షసులందఱు నిప్పటికిని రాముని పేరు చెప్పినను భయపడుచున్నారు చూడుము. ౧౩

కుపితంబగు సింహంబువలె దుర్ధర్షుఁడైన దశరథపుత్రుఁడగు రామునిసంగతి దెలియక నిదురించినసర్పమును లేపునట్లు అతనిపైకిఁ బోఁజూచుచున్నావు.

ఎల్లప్పుడును దివ్యతేజంబున వెలుఁగుచున్నవాఁడును కోపంబున దుర్ధర్షుఁడును మృత్యువుంబోలె జేటిమీఁద నలవిగానివాఁడునగు నారాముని సమీపంబునకు ఎవ్వఁడు పోఁగలుగును. ౧౫

రామునియెదుట నిలిచినచో ఈమనరాక్షససైన్య మంతయుఁ బ్రా

ఏకస్య గమనం తత్ర న హి మే రోచతే భృశమ్. ౧౬

హీనార్థస్సుసమృద్ధార్థం కో రిపుం ప్రాకృతం యథా,
నిశ్చిత్య జీవితత్యాగే వశ మానేతు మిచ్ఛతి. ౧౭

యస్య నాస్తి మనుష్యేషు సదృశో రాక్షసోత్తమ!,
కథ మాశంససే యోద్ధుం తుల్యేనేన్ద్రవివస్వతోః. ౧౮

ఏవ ముక్త్వా తు సంరబ్ధః కుమ్భకర్ణం మహోదరః,
ఉవాచ రక్షసాం మధ్యే రావణం లోకరావణమ్. ౧౯
లబ్ధ్వా పున స్త్వం వైదేహీం కిమర్థం సమ్ప్రజల్పసి,
యదీచ్ఛసి తదా సీతా వశగా తే భవిష్యతి. ౨౦
దృష్టః కశ్చిదుపాయో మే సీతోపస్థానకారకః,
రుచిర శ్చేత్స్వయా బుద్ధ్యా రాక్షసేశ్వర! తం శృణు. ౨౧
అహం ద్విజిహ్వ స్సంహ్రాదీ కుమ్భకర్ణో వితర్దనః,
పఞ్చ రామవధాయైతే నిర్యాన్తీత్యవఘోషయ. ౨౨
తతో గత్వా వయం యుద్ధం దాస్యామ స్తస్య యత్నతః,
జేష్యామో యది తే శత్రూ న్నోపాయైః కృత్య మస్తి నః. ౨౩

అథ జీవతి నశ్శత్రు ర్వయం చ కృతసంయుగాః,
తత స్త దభిపత్స్యామో మనసా యత్సమీక్షితమ్. ౨౪
వయం యుద్ధాదిహైష్యామో రుధిరేణ సముక్షితాః,
విదార్య స్వతనుం బాణై రామనామాఙ్కితై శ్శితైః. ౨౫

సంశయము నొందును; అట్లుండఁగా నొక్కఁడు యుద్ధమునకుఁ బోవుట నా
కెంతమాత్రము సమ్మతము గాదు. ౧౬

ఎవ్వఁడు తానసమర్థుఁడై యుండియుఁ దప్పున మహాబలుఁడగు శత్రువును అల్పునిగాఁ దలఁచి సరి సేయక యతని పైకిఁ బోయి ప్రాణములు పోఁగొట్టుకొనును? ౧౭

రాక్షసశ్రేష్ఠుఁడవగు కుంభకర్ణుఁడా! ఎవ్వఁడు సహస్రమనుష్యుల కన్నను అధికుఁడో అట్టి దేవేంద్రునికిని సూర్యునకును సమానుఁడైన రామునితో నీ వొక్కఁడవె వెళ్లి యుద్ధము సేయఁగోరెదవు? అని మహోదరుఁడు కుంభకర్ణునితోఁ జెప్పెను. ౧౮

మహోదరుఁడు ఈప్రకారంబునఁ గుపితుఁడై కుంభకర్ణునితోఁ జెప్పి యంత రాక్షసమధ్యంబున లోకరావణుఁడగు రావణుం జూచి యిట్లని చెప్పెను.

నీవు సీతాదేవిని బొందుటకు మరల నెందుకు ఊరక మాటలాడుచున్నావు? నీ వెప్పుడు కోరుదువో అప్పుడే నీకు సీత వశ్యయగును. ౨౦

రాక్షసరాజుఁడవగు రావణుఁడా! సీత వశ్యయగునట్టు నాకొక యుపాయము దోఁచుచున్నది; నీ కది రుచించునేని వినుము చెప్పెదను. ౨౧

నేనును ద్విజిహ్వుఁడును సంహ్రాదియుఁ గుంభకర్ణుఁడును వితర్దనుండును మే మైదుగురమును రామవధంబునకై పోవలయునని చాటింపుము.

అంత మేము పోయి యథాశక్తి రామునితో యుద్ధము గావించెదము; మేము రామలక్ష్మణులను జయింతుమేని యప్పటికి మన కేయుపాయములతోను గార్యము లేదు. ౨౩

ఒకవేళ మేము యుద్ధము చేసినను రాముఁడు దుర్జయుఁడై జీవించి యుండునేని మన మిప్పుడు ఆలోచించువిధంబునఁ గావింతము. ౨౪

మేము బాణములచే మా దేహమునంతయుం గాయము చేసికొని దేహమంతయు నెత్తురుగాఱ రామనామములు చెక్కిన బాణములతోఁ గూడ యుద్ధంబుననుండి యిచ్చటికి వచ్చెదము. ౨౫

భక్షితో రాఘవో ఽస్మాభి ర్లక్ష్మణ శ్చేతి వాదినః,
తవ పాదౌ గ్రహీష్యామ స్త్వం నః కామం ప్రపూరయ. ౨౬

తతో ఽవఘోషయ పురే గజస్కన్ధేన పార్థివ!,
హతో రామ స్సహ భ్రాత్రా ససైన్య ఇతి సర్వతః. ౨౭

ప్రీతో నామ తతో భూత్వా భృత్యానాం త్వ మరిన్దమ!,
భోగాంశ్చ పరివారాంశ్చ కామాంశ్చ వసు దాపయ. ౨౮

తతో మాల్యాని వాసాంసి వీరాణా మనులేపనమ్,
పేయం చ బహు యోధేభ్య స్స్వయం చ ముదితః పిబ. ౨౯

తతోఽస్మి న్బహుళీభూతే కౌలీనే సర్వతో గతే,
భక్షిత స్ససుహృ ద్రామో రాక్షసై రితి విశ్రుతే. ౩౦
ప్రవిశ్యాశ్వాస్య చాపి త్వం సీతాం రహసి సాన్త్వయ,
ధనధాన్యైశ్చ కామైశ్చ రత్నైశ్చైనాం ప్రలోభయ. ౩౧

అనయోపధయా రాజన్ భయశోకానుబన్ధయా,
అకామా త్వద్వశం సీతా నష్టనాథా భవిష్యతి. ౩౨

రఞ్జనీయం హి భర్తారం వినష్ట మవగమ్య సా,
నైరాశ్యా త్స్త్రీలఘుత్వాచ్చ త్వద్వశం ప్రతిపత్స్యతే. ౩౩

సా పురా సుఖసంవృద్ధా సుఖార్హా దుఃఖకర్శితా,
త్వయ్యధీనం సుఖం జ్ఞాత్వా సర్వథోపగమిష్యతి. ౩౪

మేము "రాముని లక్ష్మణుని భక్షించి వేసినాము" అని చెప్పుచు నీపాదములకు నమస్కరించెదము. అప్పుడు నీవు సంతోషించి మాకపరిమిత బహుమానంబు లొసంగుము. ౨౬

రాక్షసరాజుండవగు రావణుండా! అంత నీవు ఒకరాక్షసుని ఏనుఁగుపై నెక్కించి "రాముఁడును లక్ష్మణుఁడును వానరులును వధింపఁబడిరి" అని పట్టణంబంతయుం చాటింపుము. ౨౭

శత్రువుల నడంగఁద్రొక్కిపట్టి రావణుండా! నీవంత సంతోషించినట్లు భృత్యులను యథేష్టముగా భోగ్యపదార్థములను దాసదాసీపరిజనంబులకును మఱియు ననేకములయిన యమూల్యపదార్థములను ధనంబులను ఒసంగుము.

అంత నీవు భటులకు బుష్పమాలికలను వస్త్రములను పీరాను లేపనంబులను మద్యంబును అధికముగా నొసఁగుము; నీవును సంతోషంబునం ద్రాగుము. ౨౯

అంత 'రాక్షసులు రామలక్ష్మణులను భక్షించిరి" అను నీలోకవార్త పట్టణమంతయుఁ వ్యాపించి ప్రసిద్ధినొందినపిమ్మట నీవు సీతయొద్దకుఁబోయి ఆబిడకుఁ బతివియోగంబువలనం గలిగిన దుఃఖంబుదీర్చి మంచిమాటలం దేర్చి ధనధాన్యంబులను ఉత్తమ పదార్థములను రత్నంబులను ఆబిడమనస్సును వశ్యము జేసికొనుము. ౩౦ ౩౧

రాక్షసరాజుఁడవగు రావణుండా! ఈకపటోపాయంబున సీతను భయదుఃఖములు గలిగింతువేని ఆబిడకుఁ గోర్కిలేకున్నను వేఱునాథుఁడు లేమిం జేసి భీతిచే నీకు వశ్యయగును. ౩౨

ఆసీత రమణీయాకారుఁడగు తనభర్త రాముఁడు మృతిఁబొందినాఁడని తలఁచి యింక వేరేయాశ లేకపోవుటవలనను స్త్రీలు స్వభావంబున నే చాపలము గలవారగుటవలనను నీయధీనయగును. ౩౩

ఆసీత మున్ను సుఖముగాఁ బెరిఁగినదియుఁ సుఖార్హయుఁ బహుదుఃఖములచే గాసినొందినదియుఁ గావున ఇంకఁ దనకు సుఖముగలుగుట నీయధీన

ఏతత్సునీతం మమ దర్శనేన
రామం హి దృష్ట్వైవ భవేదనర్థః,
ఇహైవ తే సేత్స్యతి మోత్సుకో భూ
స్త్వమహానయుద్ధేన సుఖస్య లాభః. 38
అదృష్టసైన్యో హ్యనవాప్తసంశయో
రిపూనయుద్ధేన జయం నరాధిపః,
యశశ్చ పుణ్యం చ మహాన్మహీపతే
శ్రియం చ కీర్తిం చ చిరం సమశ్నుతే. 39

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే చతుష్షష్టితమస్సర్గః. 64.

---

పఞ్చషష్టితమస్సర్గః.

స తథోక్తస్తు నిర్భర్త్స్య కుమ్భకర్ణో మహోదరమ్,
అబ్రవీద్రాక్షసశ్రేష్ఠం భ్రాతరం రావణం తతః, 1

సోఽహం తవ భయం ఘోరం వధాత్తస్య దురాత్మనః,
రామస్యాద్య ప్రమార్జామి నిర్వైరో హి సుఖీ భవ. 2

గర్జన్తి న వృథా శూరా నిర్జలా ఇవ తోయదాః,
పశ్య సమ్పాద్యమానం తు గర్జితం యుధి కర్మణా. 3

న మర్షయతి చాత్మానం సమ్భావయతి నాత్మనా,
అదర్శయిత్వా శూరాస్తు కర్మ కుర్వన్తి దుష్కరమ్. 4

మని తెలిసి యన్నివిషయములను నిశ్చయించుము. ౩౪

ఈయుపాయము నేను జక్కఁగా బుద్ధితో నాలోచించి నిర్ణయించితిని; నీవు రాముని యెదుటఁ బడుమనేని నీకపాయము గలుగును; నీకోర్కె యిచ్చటనే యీడేఱును; యుద్ధంబునకుఁబోవలదు: యుద్ధముసేయకనే యుండుటచేఁ గలుగుసుఖ మెచ్చుగానున్నది చూడుము. ౩౫

రావణుఁడా! రాజు నేఁజెప్పినప్రకారంబున సైన్యనాశము చేసికొనక తాను ప్రాణసందేహమునొందక యుద్ధముసేయకనే శత్రువులజయించునేని బహుకాలము కీర్తియుం మహాపుణ్యమును లక్ష్మియుం మనఃప్రసాదంబును బొందియుండును. అని మహోదరుఁడు రావణునితోఁ జెప్పెను. ౩౬

ఇది యఱువదినాలుగవసర్గము.

## అఱువదియైదవసర్గము.

ఆకుంభకర్ణుఁడు మహోదరుఁడుచెప్పినమాటను విని ఇట్టిమాట లింక జెప్పవలదు భద్రమని యతని బెదరించి రాక్షసోత్తముఁడును తనయన్నయుం నగురావణుంజూచి యిట్లనియె. ౧

నాపరాక్రమము నీకుఁ దెలిసియున్నదికదా! నే నిప్పుడు దురాత్ముఁడగు నారాముని వధించి నీభయంబుఁ బోఁగొట్టెదను! నీవు వైరంబువిడిచి సుఖముగా నుండుము. ౨

శూరులగువారలు జలములేని మేఘములువలె వ్యర్థముగా నిట్లుగర్జింపరు. నేను యుద్ధంబున అసదృశంబుగాఁ గార్యముగావించి నాగర్జనంబుం జూపెదఁ జూడుము.

శూరులు ఇతరులు తమ్ముఁగుఱించి యవమానోక్తులాడిన నెంతమాత్రము సహింపరు. తామే తమ్ముఁ బొగడుకొనరు. అయితే ఎవ్వరికిం దెలియఁజేయక తమంతనే యితరులకుఁ జేయనలవిగాని కార్యములం జేయుందురు. ౪

విక్లబానా మబుద్ధీనాం రాజ్ఞాం పణ్డితమానినామ్,
శృణ్వతా సాదిత మిదం త్వద్విధానాం మహోదర!. ౫

యుద్ధే కాపురుషై ర్నిత్యం భవద్భిః ప్రియవాదిభిః,
రాజాన మనుగచ్ఛద్భిః కృత్య మేతద్ధి సాదితమ్. ౬

రాజశేషా కృతా లఙ్కా క్షీణః కోశో బలం హతమ్,
రాజాన మిమ మాసాద్య సుహృచ్చిహ్న మమిత్రకమ్. ౭

ఏష నిర్యామ్యహం యుద్ధ ముద్యత శ్శత్రునిర్జయే,
దుర్నయం భవతా మద్య సమీకర్తు మిహాహవే. ౮

ఏవ ముక్తవతో వాక్యం కుమ్భకర్ణస్య ధీమతః,
ప్రత్యువాచ తతో వాక్యం ప్రహసన్రాక్షసాధిపః. ౯
మహోదరోఽయం రామాత్తు పరిత్రస్తో న సంశయః,
న హి రోచయతే తాత! యుద్ధం యుద్ధవిశారద! ౧౦
కశ్చిన్మే త్వత్సమో నాస్తి సౌహృదేన బలేన చ,
గచ్ఛ శత్రువధాయ త్వం కుమ్భకర్ణ! జయాయచ. ౧౧

తస్మాత్తు భయనాశార్థం భవాన్ సంబోధితో మయా,

అయం హి కాల స్సుహృదాం రాక్షసానా మరిన్దమ. ౧౨

తద్గచ్ఛ శూలమాదాయ పాశహస్త ఇవాన్తకః,
వానరా న్రాజపుత్రౌ చ భక్షయాదిత్యతేజసా. ౧౩

మహోదరుఁడా! భీరువులును బుద్ధిహీనులు ఏమియుఁ దెలియకున్నను బండితులమని దురహంకారముగల వారలునగు నీయట్టి వారలమాటను వినుటచే రాక్షసేశ్వరుఁడగు రావణుఁడీయాపదం బొందినాఁడు. ౫

యుద్ధమను పేరుచెప్పినను భయపడునట్టి మీరలు రాజునకెల్లప్పుడును ఇచ్చకములాడుచు అతఁడు పోయినదారి వెల్లం బోవుచుండి యింతదూరము నకుఁ దెచ్చినారు. ౬

లంకాపురిని రాజుమాత్రము శేషించునట్లు గావించినారు. బొక్కస మంతయు నశింపఁజేసినారు సైన్యమునంతయు హతముజేసినారు. మీరలు ఈరాజును శత్రువుగా నెంచినట్లున్నది. ౭

మీతప్పువలనఁ గలిగినదోషమునంతయు నివారించుటకై నే నిప్పుడు శత్రువులజయింప నుద్యుక్తుఁడనై యుద్ధభూమికిఁ బోయెదను. అని కుంభకర్ణుఁడు చెప్పెను. ౮

బుద్ధిమంతుఁడగు కుంభకర్ణుఁడుచెప్పినమాటనువిని రావణుఁడు పకపక నవ్వుచుఁ గుంభకర్ణుంజూచి యిట్లని బదులుచెప్పెను. ౯

యుద్ధపండితుఁడవగు కుంభకర్ణుఁడా! ఈమహోదరుఁడు రామునకు భయపడియున్నాఁడు కావున యుద్ధ మక్కఱలే దనుచున్నాఁడు ౧౦

కుంభకర్ణుఁడా! నీయట్టిబలవంతుఁడును నాయందు స్నేహముగల వాఁడును నాకెవ్వఁడును లేఁడు నీవుపోయి శత్రువులవధించి జయంబు నొందుము. ౧౧

అట్లు నీ వసమానుఁడవు కావున నే నాభయంబుఁ బోఁగొట్టుదువని నిన్ను నిద్ర లేపినాను.

శత్రువులరూపుమాపునట్టి కుంభకర్ణుఁడా! మనరాక్షసులుపోయి యుద్ధముసేయుట కిదికాలము కావున శీఘ్రముగా యుద్ధమునకుఁ బొమ్ము.

అందువలన నీవు శూలంబుఁ జేకొని పాశహస్తుఁడగు నంతకునిభంగి భయంకరాకారుఁడవై పొమ్ము. సూర్యుఁడుబోలె దుర్ధర్షుఁడవై రామలక్ష్మణులను

సమాలోక్య తు తే రూపం విద్రవిష్యన్తి వానరాః,
రామలక్ష్మణయో శ్చాపి హృదయే ప్రస్ఫుటిష్యతః. ౧౪

ఏవ ముక్త్వా మహారాజః కుమ్భకర్ణం మహాబలమ్,
పునర్జాత మివాత్మానం మేనే రాక్షసపుఙ్గవః. ౧౫

కుమ్భకర్ణబలాభిజ్ఞో జానం స్తస్య పరాక్రమమ్,
బభూవ ముదితో రాజా శశాఙ్క ఇవ నిర్మలః. ౧౬
ఇత్యేవము క్త స్సంహృష్టో నిర్జగామ మహాబలః,

రాజ్ఞ స్తు వచనం శ్రుత్వా కుమ్భకర్ణ స్సముద్యతః. ౧౭
ఆదదే నిశితం శూలం వేగా చ్ఛత్రు నిబర్హణమ్,
సర్వకాలాయసం దీప్తం తప్తకాఞ్చనభూషణమ్. ౧౮
ఇన్ద్రాశనిసమం భీమం వజ్రప్రతిమగౌరవమ్,
దేవదానవగన్ధర్వయక్షకిన్నరసూదనమ్. ౧౯
రక్తమాల్యం మహాధామ స్వత శ్చోద్గతపావకమ్,
ఆదాయ నిశితం శూలం శత్రుశోణితరఞ్జితమ్. ౨౦
కుమ్భకర్ణో మహాతేజా రావణం వాక్య మబ్రవీత్,

గమిష్యామ్యహ మేకాకీ తిష్ఠత్విహ బలం మమ. ౨౧
అద్య తాన్ క్షుభితాన్ క్రుద్ధో భక్షయిష్యామి వానరాన్,

కుమ్భకర్ణవచ శ్శ్రుత్వా రావణో వాక్య మబ్రవీత్. ౨౨
సైన్యైః పరివృతో గచ్ఛ శూలముద్గరపాణిభిః,

వానరులను భక్షింపుము. ౧౩

నీరూపమును జూచినంతనే వానరు లందఱు భయపడి పాఱిపోదురు. రామలక్ష్మణుల గుండెకాయలు పగులును. అని రావణుఁడు కుంభకర్ణునితోఁ జెప్పెను. ౧౪

రాక్షసశ్రేష్ఠుఁడగు రావణుఁడు ఈప్రకారంబున మహాబలుఁడగు కుంభకర్ణునితోఁ జెప్పి యితఁడు జయించునని నమ్మకంబునం జేసి తాను మరలఁ బ్రాణము పుట్టినట్లు తలంచెను. ౧౫

రావణుఁడు కుంభకర్ణుని బలంబును బరాక్రమంబును జక్కఁగాఁ దెలిసినవాఁడు కావున సంతుష్టుఁడై కళంకము లేని చంద్రుని చందంబున నుండెను.

మహాబలశాలియగు కుంభకర్ణుఁడు రావణుఁడు చెప్పినమాటను విని పరమసంతుష్టుఁడై యుద్ధంబునకుఁ బోయెను.

కుంభకర్ణుఁడు రావణుఁడు చెప్పినది విని యుద్ధంబునకుఁ బోనుద్యుక్తుఁడై శత్రువధకారణంబగు తీక్ష్ణమయినశూలంబు గ్రహించెను. ౧౭

మహాతేజుఁడగు కుంభకర్ణుఁడు అపరిమితమయిన యినుముతోఁ జేయఁబడినదియుఁ బ్రదీప్తంబును బంగారముచే నలంకరింపఁబడినదియు దేవేంద్రుని వజ్రాయుధంబునకు సాటివచ్చునదియు భయంకరాకారంబును వజ్రంబువలె నతికఠినంబును దేవతలను దానవులను గంధర్వులను యక్షులను కిన్నరులను వధించిపుచ్చునదియు నెఱ్ఱనిపువ్వుమాలికలచే నలంకరింపఁబడినదియు మహాతేజంబునఁ గాంత్యతిశయంబున నిప్పులుగ్రక్కుచున్నట్లున్నదియు శత్రురక్తదిగ్ధంబును దీక్ష్ణమునగు శూలంబు గ్రహించి రావణుంజూచి యిట్లనియె.

నేను ఒక్కఁడనే పోయెదను; నాసైన్య మిచ్చుటనే యుండుఁగాక; ఇప్పుడుపోయి నన్నుఁజూచి భయపడి కలఁతనొందునట్టివానరులనందఱను భక్షించెదను. అని కుంభకర్ణుఁడు రావణునితోఁ జెప్పెను. ౨౧

రావణుఁడు కుంభకర్ణుఁడు చెప్పినమాటను విని యిట్లని చెప్పెను. ౨౨

శూలములు ముద్గరములు ధరించినసైన్యములను దీసికొనిపొమ్ము.

వానరా హి మహాత్మాన శ్శీఘ్రా స్సువ్యవసాయినః. ౨౩
ఏకాకినం ప్రమత్తం వా నయేయు ర్దశనైః క్షయమ్,

తస్మా త్పరమదుర్ధర్షైః సైన్యైః పరివృతో వ్రజ. ౨౪
రక్షసా మహితం సర్వం శత్రుపక్షం నిషూదయ,

అథాసనా త్సముత్పత్య స్రజం మణికృతా న్తరామ్. ౨౫
ఆబబన్ధ మహాతేజాః కుమ్భకర్ణస్య రావణః,
అఙ్గదా న్యఙ్గులీవేష్టా న్వరాణ్యాభరణాని చ. ౨౬
హారం చ శశిసఙ్కాశ మాబబన్ధ మహాత్మనః

దివ్యాని చ సుగన్ధీని మాల్యదామాని రావణః. ౨౭

శ్రోత్రే చాసఞ్జయామాస శ్రీమతీ చాస్య కుణ్డలే,
కాఞ్చనాఙ్గదకేయూరో నిష్కాభరణభూషితః. ౨౮
కుమ్భకర్ణో బృహత్కర్ణ స్సుహుతోఽగ్నిరివాబభౌ,

శ్రోణీసూత్రేణ మహతా మేచకేన వ్యరాజత. ౨౯
అమృతోత్పాదనే నద్ధో భుజఙ్గేనేవ మన్దరః,

స కాఞ్చనం భారసహం నివాతం
విద్యుత్ప్రభం దీప్త మి వాత్మభాసా. ౩౦
ఆబధ్యమానః కవచం రరాజ
సన్ధ్యాభ్రసంవీత ఇవాద్రిరాజః,
సర్వాభరణసర్వాఙ్గ శ్శూలపాణి స్సరాక్షసః. ౩౧

వానరులు మహాపరాక్రమశాలులు, వేగవంతులు. వివుపక ప్రయత్నముసేయువారలు కావున ఒంటరిగా నున్నవానిఁగాని యేమఱుపాటుననున్నవానిఁగాని దంతములచే వధించిపుత్తురు. ౧౩

అందువలన మహాబలశాలులగు సైనికులఁగూడిపొమ్ము. రాక్షసులకు శత్రువులయినవారినందఱను రూపుమాపుము. అని రావణుఁడు కుంభకర్ణునితోఁ జెప్పెను. ౧౪

అంత మహాతేజుఁడగు రావణుఁడు సింహాసనంబుననుండిలేచి రత్నములను గూర్చిన బంగారుమాలికచేఁ గుంభకర్ణు నలంకరించెను. ౧౫

రావణుఁడు బాహుపురులును ఉంగరంబులు ఉత్తమంబులగు నాభరణంబులును చంద్రబింబముం బోని ముక్తాహారంబును గుంభకర్ణున కొసఁగెను. ౧౬

రావణుఁడు మంచివాసనగలదివ్యములగు పుష్పమాలికలను గుంభకర్ణున కిచ్చెను. ౧౭

మఱియు నుత్తమములయినపోఁగులు కుంభకర్ణునిచెవులకుఁ బెట్టెను.

పెద్దచెవులుగల కుంభకర్ణుఁడు బంగారుబాహుపురులును మంచిపతకమును నాభరణములును ధరించియుండుటవలన జక్కఁగా వ్రేల్వఁబడిన యగ్నిహోత్రువిధంగిఁ దేజరిల్లెను. ౧౮

ఆకుంభకర్ణుడు నీలమణులతోఁ జేయఁబడినగొప్ప మొలత్రాడుఁ దాల్చియుండుటఁ జేసి అమృతమథనమునకై వాసుకిచే జుట్టఁబడిన మందరపర్వతము కైవడిఁ బ్రకాశించెను. ౧౯

ఆకుంభకర్ణుఁడు పెక్కుబారువలభాగముగలదియు ఏయాయుధమునను భేదింపనలవిగానిదియు మెఱుపువలె మెఱయుచున్నదియుఁ గాంతిచే వెలుంగుచున్నదియునగు బంగారుకవచమును ధరించుటవలన సంధ్యాకాలమేఘముచేఁ గప్పఁబడిన హిమవత్పర్వతంబుకరణి నెంతయుఁ బ్రకాశించెను.

సమస్తావయవంబులందును ఆయాయాభరణములు ధరించియున్న

త్రివిక్రమకృతోత్సాహో నారాయణ ఇవాబభౌ,
భ్రాతరం సమ్పరిష్వజ్య కృత్వా చాభిప్రదక్షిణమ్. 32
ప్రణమ్య శిరసా తస్మై సంప్రతస్థే మహాబలః,
నిష్పతన్తం మహాకాయం మహానాదం మహాబలమ్. 33
త మాశీర్భిః ప్రశస్తాభిః ప్రేషయామాస రావణః,
శఙ్ఖదున్దుభినిర్ఘోషై స్సైన్యైశ్చాపి వరాయుధైః. 34
తం గజైశ్చ తురఙ్గైశ్చ స్యన్దనైశ్చామ్బుదస్వనైః,
అనుజగ్ము ర్మహాత్మానం రథినో రథినాం వరమ్. 35
సర్పై రుష్ట్రైః ఖరై రశ్వై స్సింహద్విపమృగద్విజైః,
అనుజగ్ము శ్చ తం ఘోరం కుమ్భకర్ణం మహాబలమ్. 36
స పుష్పవర్షై రవకీర్యమాణో
ధృతాతపత్ర శ్శితశూలపాణిః,
మదోత్కట శ్శోణితగన్ధమత్తో
వినిర్యయౌ దానవదేవశత్రుః. 37
పదాతయశ్చ బహవో మహానాదా మహాబలాః,
అన్వయూ రాక్షసా భీమా భీమాక్షా శ్శస్త్రపాణయః. 38
(రక్తాక్షా స్సుమహాకాయా నీలాఞ్జనచయోపమాః,
శూలా నుద్యమ్య ఖడ్గాంశ్చ నిశితాంశ్చ పరశ్వథాన్.)
బహువ్యామాంశ్చ పరిఘా న్గదాశ్చ ముసలానిచ,
తాలస్కన్ధాంశ్చ విపులా న్క్షేపణీయా న్దురాసదాన్. 39
అథాన్య ద్వపు రాదాయ దారుణం రోమహర్షణమ్,
నిష్పపాత మహాతేజాః కుమ్భకర్ణో మహాబలః, 40

వాఁడును త్రిశూలంబు చేతం బూనినవాఁడు నగు నా కుంభకర్ణుఁడు త్రివిక్రమావతారంబు దాల్చిన నారాయణునిభంగిఁ దేజరిల్లెను. ౩౧

మహాబలశాలియగు కుంభకర్ణుఁడు అన్నయగు రావణుం గవుఁగిలించుకొని యాతని చుట్టును ప్రదక్షిణంబు చేసి సాష్టాంగముగ నమస్కరించి యుద్ధంబునకుఁ దరలెను. ౩౨

రావణుండు మహాకాయుఁడును మహాధ్వనిగలవాఁడును మహాబలశాలియు నగు నాకుంభకర్ణుని జక్కఁగా నాశీర్వదించి పంపెను. ౩౩

రాక్షసరథికులు పెక్కండ్రు శంఖభేరీధ్వనులు చెలంగ నుత్తమాయుధంబులు ధరించిన సైన్యంబులతోఁ గూడి మహాత్ముఁడును రథికశ్రేష్ఠుఁడును నగు నా కుంభకర్ణుని వెంబడించి నడచిరి. ౩౪, ౩౫

రాక్షసులు సర్పములను ఒంటెలను గాడిదలను గజములను సింహములను ఏనుఁగులను మృగంబులను బక్షులను ఆరోహించి భయంకరాకారుఁడును మహాబలశాలియు నగు నాకుంభకర్ణుని వెంబడించిరి. ౩౬

దేవదానవులకు శత్రువైన యా కుంభకర్ణుఁడు రాక్షసాంగనలు పుష్పవర్షంబుగురియఁగ గర్వంబున నొడలు దెలియక నెత్తురుద్రావుటచేఁ గైపు నొందినవాఁడై వెడలెను. ౩౭

మహాధ్వనిగలవారలును మహాబలశాలులును భయంకరాకారులును భయంకరముగా నెఱ్ఱనైయుండు కన్నులుగలవారలును ఆయుధధారులును మహాకాయులును నల్లనికాటుకరాశివంటి మేనులుగలవారలు నగు కాల్వురు పెక్కండ్రు రాక్షసులు శూలంబులను ఖడ్గంబులను బరశ్వధంబులను బెక్కుబారలు నిడివిగల పరిఘంబులను గదలను ముసలంబులను తాళవృక్షంబులను క్షేపణీయంబులను ధరించి కుంభకర్ణు వెంట నడచిరి. ౩౮, ౩౯

మహాపరాక్రమశాలియు మహాబలుఁడు నగుకుంభకర్ణుఁడు అంత మహాభయంకరమగు మఱియొకరూపంబు దాల్చి యుద్ధంబునకుఁ బోయెను. ౪౦

ధనుశ్శతపరీణాహ స్సషట్ఛతసముచ్ఛ్రితః,
రౌద్ర శ్శకటచక్రాక్షో మహాపర్వతసన్నిభః. ౪౧

సన్నిపత్య చ రక్షాంసి దగ్ధశైలోపమో మహాన్,
కుమ్భకర్ణో మహావక్త్రః ప్రహస న్నిద మబ్రవీత్. ౪౨

అద్య వానరముఖ్యానాం తాని యూథాని భాగశః,
నిర్దహిష్యామి సంక్రుద్ధ శ్శలభానివ పావకః. ౪౩
నాపరాధ్యన్తి మే కామం వానరా వనచారిణః,
జాతి రస్మద్విధానాం సా పురోద్యానవిభూషణమ్. ౪౪

పురరోధస్య మూలం తు రాఘవ స్సహలక్ష్మణః,
హతే తస్మి న్హతం సర్వం తం వధిష్యామి సంయుగే. ౪౫

ఏవం తస్య బ్రువాణస్య కుమ్భకర్ణస్య రాక్షసాః,
నాదం చక్రు ర్మహాఘోరం కమ్పయన్త ఇవార్ణవమ్. ౪౬
తస్య నిష్పతత స్తూర్ణం కుమ్భకర్ణస్య ధీమతః,
బభూవు ర్ఘోరరూపాణి నిమిత్తాని సమన్తతః. ౪౭

ఉల్కాశనియుతా మేఘా బభూవు ర్గర్దభారుణాః,
స సాగరవనా చైవ వసుధా సమకమ్పత. ౪౮
ఘోరరూపా శ్శివా నేదు స్సజ్వాలకబళై ర్ముఖైః,
మణ్డలా న్యపసవ్యాని బబన్ధుశ్చ విహఙ్గమాః. ౪౯
నిష్పపాత చ మాలేవ గృధ్రోఽస్య పథి గచ్ఛతః,

ఆ కుంభకర్ణుఁడు అప్పుడును మహాధనుస్సుల వెడల్పును అఱువందల ధనుస్సుల పొడవును బండిచక్రంబులంబోలె కన్నులునుంగలిగిన మేనితో మహా భయంకరాకారుఁడై మహాపర్వతంబుకరణి నొప్పెను. ౪౧

దహింపఁబడిన పర్వతంబుకరణి నల్లని గొప్పశరీరముగల కుంభకర్ణుఁడు తన వెంబడివచ్చు రాక్షసులసమీపించి పాతాళకుహరాకారంబగు నోరు వివృతంబుగా నవ్వి యిట్లని చెప్పెను. ౪౨

అగ్ని శలభంబుల దహించునట్లు నేనిప్పుడు కోపంబున వానరోత్తముల నందఱ వధించిపుచ్చెదను ౪౩

అడవులం దిరుగుచుండు నీ వానరులు నాకేవిధమయిన యపరాధమునుం జేయలేదు; మఱియును వానరజాతి మావంటివిలాసపురుషులకు ఉద్యానవనభూషణముగాను నున్నది. ౪౪

ఇప్పుడు లంకచుట్టును ముట్టడించుటకు రామలక్ష్మణులె కారణము; వారలంజంపిన సర్వంబును హతంబగును; కావున రామలక్ష్మణులను యుద్ధమునందు వధించిపుచ్చెదను. అని కుంభకర్ణుఁడు రాక్షసులతోఁ జెప్పెను. ౪౫

కుంభకర్ణుఁ డట్లు చెప్పఁగానే రాక్షసులందఱు సముద్రంబుఘోషించు నట్లు సంతోషంబున మహాధ్వనిఁ గావించిరి. ౪౬

బుద్ధిమంతుఁడగు నాకుంభకర్ణుండు వేగంబున నట్టి యుద్ధంబునకుఁ బోవుచుండఁగా నప్పుడు మహాభయంకరంబులయిన యశుభనిమిత్తంబు లతనికిఁ బొడసూపినవి. ౪౭

మేఘములు జ్వాలలతోను పిడుగులతోనుంగూడి గర్దభవర్ణంబులై యుండినవి; భూమియు సముద్రంబులతోను వనంబులతోనుంగూడ గడగడవడఁకినది.

నక్కలు మహాభయంకరాకారంబున నోట మంటలుగ్రక్కుచు నఱచినవి; పక్షులు అపసవ్యమండలాకారంబునఁ దిరిగి కట్టినవి. ౪౮

ఈకుంభకర్ణుఁడు పోవుచుండునప్పుడు మార్గంబున గద్దలు మాలికవలె బారుగట్టి వ్రాలినవి.

ప్రాస్ఫురన్నయనం చాస్య సవ్యో బాహుశ్చ కమ్పతే. ౫౦
నిపపాత తదా చోల్కా జ్వలన్తీ భీమనిస్వనా,
ఆదిత్యో నిష్ప్రభ శ్చాసీ న్న ప్రవాతి సుఖోఽనిలః. ౫౧

అచిన్తయ న్మహోత్పాతా నుత్థితా న్రోమహర్షణాన్,
నిర్యయౌ కుమ్భకర్ణ స్తు కృతా న్తబలచోదితః. ౫౨
స లఙ్ఘయిత్వా ప్రాకారం పద్భ్యాం పర్వతసన్నిభః,
దదర్శాభ్రఘనప్రఖ్యం వానరానీక మద్భుతమ్. ౫౩

తే దృష్ట్వా రాక్షసశ్రేష్ఠం వానరాః పర్వతోపమమ్,
వాయునున్నా ఇవ ఘనా యయు స్సర్వా దిశ స్తదా. ౫౪
తద్వానరానీక మతి ప్రచణ్డం
దిశో ద్రవ ద్భిన్న మివాభ్రజాలమ్,
స కుమ్భకర్ణ స్సమవేక్ష్య హర్షా
న్ననాద భూయో ఘనవద్ఘనాభః. ౫౫
తే తస్య ఘోరం నినదం నిశమ్య
యథా నినాదం దివి వారిదస్య,
పేతు ర్ధరణ్యాం బహవః ప్లవఙ్గా
నికృత్తమూలా ఇవ సాలవృక్షాః. ౫౬
విపులపరిఘవాన్ స కుమ్భకర్ణో
రిపునిధనాయ వినిస్సృతో మహాత్మా,
కపిగణభయమాదదత్సుభీమం
ప్రభు రివ కిఙ్కరదణ్డవా న్యుగా న్తే. ౫౭

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే పఞ్చషష్టితమస్సర్గః. ౬౫.

కుంభకర్ణుని యెడమకన్నును యెడమబాహువును చలించినది. ౫౦

అప్పుడు భయంకరధ్వనియును ప్రజ్వలించుచు కొఱవి యొకటి యాకాశంబుననుండి పడినది; సూర్యుఁడు కాంతిహీనుఁడయ్యెఁ; వాయువు సుఖంబుగా వీవదయ్యె. ౫౧

కుంభకర్ణుఁడు కాలచోదితుఁడై మహాభయంకరంబులగు నాయుత్పాతంబుల నరకుసేయక యుద్ధంబునకుఁ బోయెను. ౫౨

పర్వతాకారుఁడగు నా కుంభకర్ణుఁడు పాదంబులచేతనే ప్రాకారంబు లంఘించి మేఘసమూహంబువలె నున్న యత్యాశ్చర్యకరంబగు వానరసేనం జూచెను. ౫౩

అప్పు డావానరులు పర్వతాకారుఁడగు నా కుంభకర్ణుం జూచి భయంబున గాలిచేఁ గొట్టఁబడిన మేఘంబులకైవడి దశదిశలకుం బాఱిరి. ౫౪

మేఘసమానుఁడగు నా కుంభకర్ణుఁడు అట్లు భయంకరంబగు నవ్వానరసేన భిన్నమేఘసమూహంబుకైవడి దశదిశలకుఁ బాఱుటం జూచి సంతోషంబున మేఘంబువలె గర్జనంబుఁ గావించెను. ౫౫

ఆకాశంబునందు మేఘగర్జనంబుం బోలె నతిభయంకరమయిన యా కుంభకర్ణుని ధ్వనిని విని వానరులు పెక్కండ్రు ఛిన్నమూలంబులగు సాలవృక్షములకైవడి నేలంబడిరి. ౫౬

మహాబలశాలియగు కుంభకర్ణుఁడు విశాలంబగు పరిఘంబు చేఁబూని వానరులు చూచి భయంబునం బాఱ ప్రళయకాలంబునఁ గింకరులతోఁ గూడిన దండధరుఁడగు యమునికైవడి భయంకరాకారుఁడై శత్రువధంబునకుఁ బోయెను. ౫౭

ఇది యఱువదియైదవసర్గము.

---

## షట్షష్టితమస్సర్గః.

స లఙ్ఘయిత్వా ప్రాకారం గిరికూటోపమో మహాన్,
నిర్యయౌ నగరా త్తూర్ణం కుమ్భకర్ణో మహాబలః. ౧

స ననాద మహానాదం సముద్ర మభినాదయన్,
జనయ న్నివ నిర్ఘాతాన్విధమ న్నివ పర్వతాన్. ౨
త మవధ్యం మఘవతా యమేన వరుణేన వా,
ప్రేక్ష్య భీమాక్ష మాయాన్తం వానరా విప్రదుద్రువుః. ౩

తాంస్తు విప్రద్రుతాన్ దృష్ట్వా వాలిపుత్త్రోఽఙ్గదోఽబ్రవీత్,
నళం నీలం గవాక్షం చ కుముదం చ మహాబలమ్. ౪

ఆత్మాన మత్ర విస్మృత్య వీర్యా ణ్యభిజనాని చ,
క్వ గచ్ఛత భయత్రస్తాః ప్రాకృతా హరయో యథా. ౫
సాధు సౌమ్యా! నివర్తధ్వం కిం ప్రాణా న్పరిరక్షథ,
నాలం యుద్ధాయ వై రక్షో మహతీయం బిభీషికా. ౬

మహతీ ముత్థితా మేనాం రాక్షసానాం బిభీషికామ్,
విక్రమా ద్విధమిష్యామో నివర్తధ్వం ప్లవఙ్గమాః. ౭

కృచ్ఛ్రేణ తు సమాశ్వాస్య సంగమ్య చ తత స్తతః,
వృక్షాద్రిహస్తా హరయ స్సమ్ప్రతస్థూ రణాజిరమ్. ౮
తే నివృత్య తు సంక్రుద్ధాః కుమ్భకర్ణం వనౌకసః,
నిజఘ్నుః పరమక్రుద్ధా స్సమదా ఇవ కుఞ్జరాః. ౯

## అఱువదియాఱవసర్గము.

పర్వతశిఖరాకారుఁడును మహాకాయుఁడును మహాబలుఁడు నగు నా కుంభకర్ణుఁడు అట్లు ప్రాకారమును లంఘించి శీఘ్రముగఁ బట్టణమునుండి యుద్ధభూమికిం బోయెను. ౧

ఆ కుంభకర్ణుఁడు సముద్రం బుప్పొంగునట్లు పిడుగుపడునట్లు పర్వతంబులు పగులునట్లు సింహనాదంబు గావించెను. ౨

ఇంద్రునకుఁగాని యమునకుఁగాని వరుణునకుఁగాని వధింపనలవిగాని వాఁడును భయంకరములగు కన్నులుగలవాఁడునగు నాకుంభకర్ణుఁడు వచ్చుటం జూచి వానరులు భయంబునం బాఱిరి. 3

వాలికుమారుఁడగు నంగదుఁడు వానరవీరు లట్లు భయంబునఁ బాఱుటంజూచి నలుని నీలుని గవాక్షుని మహాబలుఁడగు కుముదునింజూచి యిట్లనియె. ౪

ఇప్పుడు మీరలు మీస్వరూపమును పరాక్రమములను గులంబులను మఱచి క్షుద్రవానరులకైవడి భయపడి యెచ్చటికిం బోయెదరు? ౫

సౌమ్యులగు వానరులారా! చక్కఁగానున్నది! మఱలుఁడు; ప్రాణముల రక్షించుకొనెద రేమి? ఈతఁడు యుద్ధముసేయువాఁడు కాఁడు; ఇది మనకు భయముగలుగుటకై నిర్మింపఁబడిన యంత్రము. ౬

వానరులారా! ఈ రాక్షసులభయ జనకమహాయంత్రమును మనము పరాక్రమంబున నశింపఁజేయుదము; మరలిరండు. అని యంగదుఁడు నవ్వానరులతోఁ జెప్పెను. ౭

వానరులు అంత కష్టంబున నూఱటనొంది యందఱుంజేరి వృక్షంబులను బర్వతంబులనుం జేకొని యుద్ధభూమికిం బోయిరి. ౮

ఆవానరులు అట్లు మరలి యుద్ధభూమికి వచ్చి పరమక్రుద్ధులయి మత్తగజంబుల చందంబున నుక్కుమిగిలి కుంభకర్ణుం బ్రహరించిరి. ౯

ప్రాంశుభి ర్గిరిశృఙ్గైశ్చ శిలాభిశ్చ మహాబలః,
పాదపైః పుష్పితాగ్రైశ్చ హన్యమానో న కమ్పతే. ౧౦

తస్య గాత్రేషు పతితా భిద్యన్తే శతశ శ్శిలాః,
పాదపాః పుష్పితాగ్రాశ్చ భగ్నాః పేతు ర్మహీతలే. ౧౧
సోఽపి సైన్యాని సంక్రుద్ధో వానరాణాం మహౌజసామ్,
మమన్థ పరమాయత్తో వనాన్యగ్ని రివోత్థితః. ౧౨

లోహితార్ద్రాస్తు బహవ శ్శేరతే వానరర్షభాః,
నిరస్తాః పతితా భూమౌ తామ్రపుష్పా ఇవ ద్రుమాః. ౧౩

లఙ్ఘయన్తః ప్రధావన్తో వానరా నావలోకయన్,

కేచి త్సముద్రే పతితాః కేచి ద్గగన మాశ్రితాః. ౧౪
వధ్యమానాస్తు తే వీరా రాక్షసేన బలీయసా,

సాగరం యేన తే తీర్ణాః పథా తేన ప్రదుద్రువుః. ౧౫

తే స్థలాని తథా నిమ్నం విషణ్ణవదనా భయాత్,

ఋక్షా వృక్షాన్ సమారూఢాః కేచి త్పర్వత మాశ్రితాః. ౧౬

మమజ్జు రర్ణవే కేచి ద్గుహాః కేచి త్సమాశ్రితాః,
నిషేదుః ప్లవగాః కేచి త్కేచి న్నైవావతస్థిరే. ౧౭
కేచి ద్భూమౌ నిపతితాః కేచి త్సుప్తా మృతా ఇవ,

మహాబలుఁడగు కుంభకర్ణుఁడు ఉన్నతంబులగు పర్వతశిఖరంబులచేతను తాళ్ళచేతను పుష్పితంబులగు వృక్షంబులచేతను నొంతకొట్టఁబడినను చలనంబు నొందఁడయ్యె. ౧౦

తాళ్లును పుష్పితంబులగు వృక్షంబులును ఆకుంభకర్ణుని మేనందగిలి నూఱువ్రయ్యలయి నేలంబడినవి. ౧౧

ప్రజ్వలించుచున్న కార్చిచ్చువనంబుల దహించునట్లు ఆకుంభకర్ణుఁడును బరమకుపితుఁడై మహాపరాక్రమశాలులగు నవ్వానరుల వధింప నారంభించెను. ౧౨

వానరోత్తములు పెక్కండ్రు కుంభకర్ణునిచే నిహతులయి దేహమంతయుం నెత్తురు వెల్లువలుగా నేలంబడి యెఱ్ఱనిపుష్పములుగల వృక్షములపగిది నొప్పుచుండిరి. ౧౩

వానరులు వెనకకుఁ దిరిగిచూడక యొకరినొకరు లంఘించి యతివేగంబునం బరుగెత్తిరి.

అట్లు బలవంతుఁడగు కుంభకర్ణునిచే వధింపఁబడుచు నా వానరవీరు లోర్వంజాలక కొందరు సముద్రమునంబడిరి. కొంద ఱాకాశంబున కుద్గమించిరి. ౧౪

ఆ వానరులు కొందఱు మున్ను తామేమార్గంబున సముద్రంబు దాఁటి వచ్చినారో ఆసేతుమార్గముంబట్టి పరుగెత్తిరి. ౧౫

ఆ వానరులు భయంబున వెలవెలబోవు ముఖంబులతోఁ గొందఱు మిట్ట భూములకును గొందఱు పల్లములకును పరుగెత్తిరి.

భల్లూకంబులు కొన్ని వృక్షంబుల నారోహించినవి. కొన్ని పర్వతంబుల కుఱికినవి. ౧౬

కొందఱు సముద్రంబునంబడి మునిఁగిరి. కొందఱు వానరులు గుహలం ప్రవేశించిరి. కొందఱు భయంబున నేమియుఁ దెలియక కూర్చుండిరి. కొందఱు నిలువక పాఱిరి. కొందఱు నేలంబడిరి. కొందఱు మూర్ఛనొంది

తాః సమీరాత్మజాదీన్ భగ్నాన్వానరా నిద మబ్రవీత్. ౧౮

అవతిష్ఠత యుధ్యామో నివర్తధ్వం ప్లవఙ్గమాః,

భగ్నానాం వో న పశ్యామి పరిగమ్య మహీ మిమామ్. ౧౯
స్థానం సర్వే నివర్తధ్వం కిం ప్రాణా న్పరిరక్షథ,

నిరాయుధానాం ద్రవతా మసంగ గతిపౌరుషాః. ౨౦
దారా హ్యపహసిష్యన్తి సవై ఘాతస్తు జీ(వినామ్)వతామ్,

కులేషు జాతా స్సర్వే స్మ విస్తీర్ణేషు మహత్సు చ. ౨౧
క్వ గచ్ఛథ భయత్రస్తా హరయః ప్రాకృతా యథా,

అనార్యాః ఖలు యద్భీతా స్త్యక్త్వా వీర్యం ప్రధావత. ౨౨

వికత్థనాని వో యాని తథా వై జనసంసది,
తాని వః క్వను యాతాని సోదగ్రాణి మహాన్తిచ. ౨౩

భీరుప్రవాదాః శ్రూయన్తే యస్తు జీవతి ధిక్కృతః,
మార్గ స్సత్పురుషై ర్జుష్ట స్సేవ్యతాం త్యజ్యతాం భయమ్. ౨౪

శయామహే౽థ నిహతాః పృథివ్యా మల్పజీవితాః,
దుష్ప్రాపం బ్రహ్మలోకం వా ప్రాప్నుమో యుధి సూదితాః.

చచ్చినట్లు పడియుండిరి. ౧౭

అంగదుఁడు అట్లు పరాజితులయి పరుగెత్తుచున్న వానరులంజూచి యిట్లని చెప్పెను. ౧౮

వానరులారా! నిలువుఁడు; పరుగెత్తవలదు; యుద్ధము గావింతము; మరలిరండు.

మీ రిప్పు డిచ్చటనుండి భయపడి పరుగెత్తి యీ భూమియంతయుఁ దిరిగినను మీకుండుటకు చోటుదొరకదు; కావున అందఱును మరలరండు; ప్రాణంబుల రక్షించుకొని యేమి ప్రయోజనము! ౧౯

ఎదురులేని పరాక్రమముగల వానరులారా! మీర లాయుధంబువిడిచి పరుగెత్తుదురేని మీభార్యలే మిమ్ము ఎగతాళిసేయుందురు; పౌరుషముగలవారలకు అది మరణముకన్న హెచ్చుగదా! ౨౦

మన మందఱమును బహుబంధుసహితంబును బాజనీయంబులు నగు కులంబులం బుట్టినాము. అట్లుండఁగా క్షుద్ర వానరులంబోలె మీరలు భయపడి యెందుఁబోవుచున్నారు. ౨౧

మీరలు భయంబునం బరాక్రమంబువిడిచి పరుగెత్తుచున్నారు గావున అల్పులని చెప్పఁబడుదురు. ౨౨

మున్ను మీరలు జనులయెదుట మే మట్టివార మిట్టివారమని పెక్కువిధంబుల నాత్మస్తుతులు చేసికొంటిరే; అవి యన్నియు నిప్పు డెచ్చటికిఁ బోయినవి. ౨౩

పరాజయమునొంది జీవించియుండునేని జను లందఱు అతనిఁ బిఱికి యని చెప్పుదురు; సత్పురుషులచే సేవింపఁబడు శూరమార్గమును అవలంబింపుఁడు; భయంబు వదలుఁడు. ౨౪

ఇంక మనకాయుస్సు స్వల్పమయి యుద్ధమునందు నిహతులమయి నేలఁబడుదుమేని యుద్ధమున నిహతులమగుటం జేసి ఎట్టివారికిని బొందనలవి గాని బ్రహ్మలోకము మనకు ఘటిల్లును. ౨౫

సమ్ప్రాప్స్యామః కీర్తిం వా నిహత్వా శత్రు మాహవే,
జీవితం వీరలోకస్య మోక్ష్యామో వసు వానరాః. ౨౬
న కుమ్భకర్ణః కాకుత్స్థం దృష్ట్వా జీవ న్గమిష్యతి,
దీప్యమాన మివాసాద్య పతఙ్గో జ్వలనం యథా. ౨౭
పలాయనేన చోద్దిష్టాః ప్రాణా న్ర(క్షా)క్ష్యామహే వయమ్,
ఏకేన బహవో భగ్నా యశో నాశం గమిష్యతి. ౨౮

ఏవం బ్రువాణం తం వీర మఙ్గదం కనకాఙ్గదమ్,
ద్రవమాణా స్తతో వాక్య మూచు శ్శూరవిగర్హితమ్. ౨౯

కృతం నః కదనం ఘోరం కుమ్భకర్ణేన రక్షసా,
న స్థానకాలో గచ్ఛామో దయితం జీవితం హి నః. 30

ఏతావదుక్త్వా వచనం సర్వే తే భేజిరే దిశః,
భీమం భీమాక్ష మాయాన్తం దృష్ట్వా వానరయూథపాః. 3౧
ద్రవమాణా స్తు తే వీరా అఙ్గదేన వలీముఖాః,
సాన్త్వైశ్చైవానుమానైశ్చ తత స్సర్వే నివర్తితాః. 3౨

ప్రహర్ష ముపనీతాశ్చ వాలిపుత్త్రేణ ధీమతా,
ఆజ్ఞాప్రతీక్షా స్తస్థు శ్చ సర్వే వానరయూథపాః. 33

ఋషభశరభమైన్దధూమ్రనీలాః
కుముదసుషేణగవాక్షరమ్భతారాః,
ద్వివిదపనసవాయుపుత్త్రముఖ్యా

వానరులారా! యుద్ధంబున శత్రువును వధించి కీర్తియేనిఁ బొందుదము; లేక యుద్ధంబునఁ బ్రాణమువిడిచి బ్రహ్మలోకము నేనిఁ బొందుదము.

మండుచున్న నిప్పునుజూచి మిడుత ప్రాణముతోఁ బోఁజాలనట్లు కుంభకర్ణుఁడు రాముంజూచి ప్రాణముతో మరలఁ బోఁజాలఁడు. ౨౭

మనము పెక్కండ్రము ఒక్క కుంభకర్ణునకు భయపడి పరుగెత్తి ప్రాణంబులఁ రక్షించుకొందుమేని మన మిన్నాళ్లు సంపాదించిన కీర్తియంతయుం నాశమునొందును. అని యంగదుఁడు వానరులతోఁ జెప్పెను. ౨౮

అంత నీప్రకారంబునం జెప్పుచున్న బంగారుబాహుపురులు దాల్చియున్న యంగదుంజూచి భయంబునఁ బరుగెత్తువానరులు తమ పిరికితనంబు లేటపడ నిట్లని చెప్పిరి. ౨౯

కుంభకర్ణుఁడు మమ్ము భయంకరముగా మర్దించుచున్నాఁడు; కాబట్టి పోయెదము; మాకు ప్రాణమే కావలసినది. అని యావానరులు అంగదునితోఁ జెప్పిరి. 30

ఆ వానరోత్తములందఱు ఇంతమాత్రము చెప్పి భయంకరాకారుఁడును భయంకరనేత్రుఁడు నగు కుంభకర్ణుఁడు వచ్చుటంజూచి దశదిశలకుఁ బాఱిరి.

అంత నంగదుఁడు భయంబునం బరుగెత్తుచున్న యవ్వానరవీరులను మంచిమాటలచేతను దానుగావించు దృష్టాంతములచేతను మరల యుద్ధంబునకు మరలించెను. 3౨

అంత బుద్ధిమంతుఁడగు హనుమంతుఁడుఁ దోడ్పడుటయుం నవ్వానరవీరు లందఱుఁ బరమసంతుష్టులయి సుగ్రీవాజ్ఞకు ఎదురుచూచుచు యుద్ధసన్నద్ధులయియుండిరి. 33

అంత ఋషభుఁడును శరభుఁడును మైందుఁడును ధూమ్రుఁడును నీలుఁడును గుముదుఁడును సుషేణుఁడును గవాక్షుఁడును రంభుఁడును తారుఁడును ద్వివిదుఁడును పనసుఁడును హనుమంతుని మున్నిడుకొని యుతి

స్త్వరితతరాభిముఖం రణం ప్రయాతాః. ౩౪

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే షట్షష్టితమస్సర్గః. ౬౬.

---

## సప్తషష్టితమస్సర్గః.

తే నివృత్తా మహాకాయాః శ్రుత్వాఽఙ్గదవచ స్తదా,
నైష్ఠికీం బుద్ధి మాసాద్య సర్వే సఙ్గ్రామకాఙ్క్షిణః. ౧

సముదీరితవీర్యా స్తే సమారోపితవిక్రమాః,
పర్యవస్థాపితా వాక్యై రఙ్గదేన వలిముఖాః. ౨

ప్రయాతాశ్చ గతా హర్షం మరణే కృతనిశ్చయాః,
చక్రు స్సుతుములం యుద్ధం వానరా స్త్యక్తజీవితాః. ౩

అథ వృక్షా న్మహాకాయా స్సానూని సుమహాన్తి చ,
వానరా స్తూర్ణ ముద్యమ్య కుమ్భకర్ణ మభిద్రుతాః. ౪
స కుమ్భకర్ణ స్సంక్రుద్ధో గదా ముద్యమ్య వీర్యవాన్,
అర్దయన్ సుమహాకాయ స్సమన్తా ద్వ్యాక్షిప ద్రిపూన్. ౫
శతాని సప్త చాష్టౌ చ సహస్రాణి చ వానరాః,
ప్రకీర్ణా శ్శేరతే భూమౌ కుమ్భకర్ణేన పోథితాః. ౬
షోడశాష్టౌ చ దశ చ వింశ త్త్రింశ త్తథైవ చ,
పరిక్షిప్య చ బాహుభ్యాం ఖాదన్విపరిధావతి. ౭
భక్షయ న్భృశసంక్రుద్ధో గరుడః పన్నగా నివ,

కృచ్ఛ్రేణ చ సమాశ్వస్తా స్సంగమ్య చ తత స్తతః. ౮
వృక్షాద్రిహస్తా హరయ స్తస్థు స్సంగ్రామమూర్ధని,

వేగంబున యుద్ధాభిముఖులయి చనిరి. ౩౮

ఇది యుఱువదియాఱవసర్గము.

---

## అఱువదియేడవసర్గము.

మహాకాయులగు నావానరవీరులు అంగదుని మాటవిని మరణంబు గల్గినం గల్గుగాక యని నిశ్చయించి యుద్ధంబు సేయఁగోరినవారలయి మరలి వచ్చిరి. ౧

వానరు లట్లు అంగదునిచే మంచిమాటల నిలువరింపఁబడి తమ పరాక్రమంబుల నగ్గడించుకొనుచు శౌర్యంబు నవలంబించి యుద్ధోత్సాహంబుతో నుండిరి. ౨

వానరులు పరమసంతుష్టులయి ప్రాణంబులయం దాశయుంచక మరణంబునొందినం బొందుదుముగాక యని నిశ్చయించి తుములంబగు యుద్ధంబు గావించిరి. ౩

అంత మహాకాయులగు వానరవీరులు వృక్షంబులను గొప్పపర్వతంబులనుం బట్టుకొని శీఘ్రంబునఁ గుంభకర్ణుం దఱిమిరి. ౪

మహాకాయుండును మహాబలుండు నగు కుంభకర్ణుఁడు పరమకుపితుండై గదగొని శత్రువుల నానావిధంబులఁ బ్రహరించి పాఱందోలెను. ౫

వానరులు అట్లు కుంభకర్ణునిచే హింసింపఁబడి పెక్కునూఱులు పెక్కువేలునుగా నేలఁబడిరి. ౬

ఆ కుంభకర్ణుఁడు పరమకుపితుడై గరుత్మంతుఁడు సర్పంబులం దినునట్లు పదునాఱుమందిని ఎనిమిదిమందిని పదిమందిని ఇరువదిమందిని ముప్పదిమందినిగా వానరులను జేతులంబట్టి నోటవేసికొని భక్షించుచు యుద్ధరంగంబున విహరించెను. ౭

అంత బలవంతులగు వానరులు ఎట్టకేల కూఱటనొంది యందఱు నొకటిగాఁ జేరి వృక్షములను బర్వతంబులనుం బట్టుకొని యుద్ధసన్నద్ధులయి నిలిచిరి. ౮

తతః పర్వత ముత్పాట్య ద్వివిదః ప్లవగర్షభః. ౯
దుద్రావ గిరిశృఙ్గాభం విలమ్బ ఇవ తోయదః,
తం సముత్పత్య చిక్షేప కుమ్భకర్ణస్య వానరః. ౧౦
తమప్రాప్తో మహాకాయం తస్య సైన్యేఽపత త్తదా,
మమర్దాశ్వా న్గజాంశ్చాపి రథాంశ్చైవ నగోత్తమః. ౧౧
తాని చాన్యాని రక్షాంసి పునశ్చాన్య ద్గిరే శ్శిరః,
తచ్ఛైలవేగాభిహతం హతాశ్వం హతసారథి ౧౨
రక్షసాం రుధిరక్లిన్నం బభూవాయోధనం మహత్,
రథినో వానరేన్ద్రాణాం శరైః కాలా న్తకోపమైః. ౧౩
శిరాంసి నదతాం జహ్రు స్సహసా భీమనిస్వనాః,
వానరాశ్చ మహాత్మాన స్సముత్పాట్య మహాద్రుమాన్. ౧౪
రథా నశ్వా న్గజా నశ్వా న్రాక్షసా నభ్యసూదయన్,
హనూమాన్ శైలశృఙ్గాణి వృక్షాంశ్చ వివిధా న్బహూన్. ౧౫
వవర్ష కుమ్భకర్ణస్య శిరస్యమ్బర మాస్థితః,
తాని పర్వతశృఙ్గాణి శూలేన స బిభేద హ. ౧౬
బభఞ్జ వృక్షవర్షం చ కుమ్భకర్ణో మహాబలః,
తతో హరీణాం తదనీక ముగ్రం
దుద్రావ శూలం నిశితం ప్రగృహ్య. ౧౭
తస్థౌ తతోఽస్యాపతతః పురస్తా
న్మహీధరాగ్రం హనుమాన్ప్రగృహ్య,
స కుమ్భకర్ణం కుపితో జఘాన
వేగేన శైలోత్తమభీమకాయమ్. ౧౮
స చుక్షుభే తేన తదాఽభిభూతో
మేదార్ద్రగాత్రో రుధిరావసిక్తః,

అంత వానరశ్రేష్ఠుఁడగు ద్వివిదుఁడు ఒకపర్వతోత్తమంబు పెకలించి
వంగిన మేఘంబువలె నొప్పుచుఁ గుంభకర్ణునిపై కదలెను. ౯

ద్వివిదుఁడు కుంభకర్ణుని సమీపంబునఁ బోయి యప్పర్వతంబు నత
నిపై వేసెను. అది గుఱిఁదప్పి యతనిపైఁబడక యతనిసేనపయింబడెను. ౧౦

ఆపర్వతము గుఱ్ఱంబుల నేనుఁగులను రథంబులను రాక్షసులను జూర్ణంబు
గావించెను; అంత నాద్వివిదుఁడు మఱియొకపర్వతశిఖరంబు వేసెను. ౧౧

రాక్షసుల యుద్ధభూమి యంతయు ఆపర్వతశిఖరముచే గుఱ్ఱంబులను
సారథులను నిహతులైన నెత్తురు వెల్లువలయినవి. ౧౨

రాక్షసరథికులు భయంకరంబుగా సింహనాదంబులుచేయుచు కాల
తుల్యంబులగు బాణంబులచే గర్జించుచున్న వానరోత్తములశిరస్సులు ఖండించిరి

మహాబలశాలులగు వానరులు నప్పుడు గొప్పగొప్పవృక్షంబులం బెక
లించి వానిచే రథంబులఁ జూర్ణంబుగావించి గుఱ్ఱంబులను ఏనుఁగులను ఒంటె
లను రాక్షసులను వధించిరి. ౧౪

హనుమంతుఁడు ఆకాశగతుఁడై పర్వతశిఖరములను నానావిధానేక
వృక్షంబులను కుంభకర్ణునితలపై వర్షించెను. ౧౫

మహాబలుఁడగు నాకుంభకర్ణుఁడు శూలంబున నాపర్వతశిఖరంబుల
భేదించి యావృక్షంబుల నన్నింటిని తట్టివేసెను. ౧౬

అంత నాకుంభకర్ణుఁడు నిశితంబగుశూలంబుగొని భయంకరం బగు
నవ్వానరసేనం దఱుమ నప్పుడు హనుమంతుఁడు పర్వతశిఖరం బొకటి పెక
లించి యాతని కడ్డపడెను. ౧౭

ఆహనుమంతుఁడు ఆపర్వతంబుచే మహాపర్వతాకారుఁడైన యాకుంభ
కర్ణుం బ్రహరించెను. ఆకుంభకర్ణుఁడు ఆదెబ్బకు దేహమునుండి మేదస్సు
నెత్తురుగాఱఁ గొంచెము క్షోభంబు నొందెను. ౧౮

స శూల మావిధ్య తటిత్ప్రకాశం
గిరిం యథా ప్రజ్వలితాగ్రశృఙ్గమ్. ౧౯
బాహ్వన్తరే మారుతి మాజఘాన
గుహోఽచలం క్రౌఞ్చ మి వోగ్రశక్త్యా,
స శూలనిర్భిన్నమహాభుజాన్తరః
ప్రవిహ్వల శ్శోణిత ముద్వమ న్ముఖాత్. ౨౦
ననాద భీమం హనుమాన్మహాహవే
యుగాన్తమేఘ స్తనితస్వనోపమమ్,
తతో వినేదు స్సహసా ప్రహృష్టా
రక్షోగణా స్తం వ్యథితం సమీక్ష్య. ౨౧
ప్లవఙ్గమా స్తు వ్యథితా భయార్తాః
ప్రదుద్రువు స్సంయతి కుమ్భకర్ణమ్,
తత స్తు నీలో బలవా న్పర్యవస్థాపయ న్బలమ్. ౨౨
ప్రవిచిక్షేప శైలాగ్రం కుమ్భకర్ణాయ ధీమతే.
తమాపతన్తం సంప్రేక్ష్య ముష్టినాఽభిజఘాన హ. ౨౩

ముష్టిప్రహారాభిహతం తచ్ఛైలాగ్రం వ్యశీర్యత,
సవిస్ఫులిఙ్గం సజ్వాలం నిపపాత మహీతలే. ౨౪
ఋషభ శ్శరభో నీలో గవాక్షో గన్ధమాదనః,
పఞ్చ వానరశార్దూలాః కుమ్భకర్ణ ముపాద్రవన్. ౨౫
శైలై ర్వృక్షై స్తలైః పాదై ర్ముష్టిభిశ్చ మహాబలాః,

కుమ్భకర్ణం మహాకాయం సర్వతోఽభిప్రదుద్రువుః. ౨౬
స్పర్శా నివ ప్రహారాం స్తా న్వేదయానో నవివ్యథే,

ఆకుంభకర్ణుఁడు నెఱపువలె మెఱయుచు మండుచున్న యగ్రశిఖర ముతో నొప్పుచుండు పర్వతముకరణిఁ జేజరిల్లుచున్న శూలమును గిఱగిఱం ద్రిప్పి కుమారస్వామి శక్తిచేఁ గ్రౌంచపర్వతంబు భేదించునట్లు హనుమంతుని వక్షస్స్థలంబునం బొడిచెను. ౧౯

అట్లు హనుమంతుని విశాలంబగు వక్షస్స్థలంబునం బొడుచుటయుఁ నాతఁడు మూర్ఛితుఁడై నోట నెత్తురు గ్రక్కుచుఁ బ్రళయకాలమేఘగర్జారవ భీకరంబుగా నఱచెను. ౨౦

అంత రాక్షసులు హనుమంతుఁడు మూర్ఛితుఁడగుటం జూచి సంహృ సంతుష్టులయి సింహనాదంబులు గావించిరి. వానరులు కుంభకర్ణునివలన మఱియుఁ భయమునొంది దిక్కులకుం బఱచిరి. ౨౧

అంత బలవంతుఁడగు నీలుఁడు చెదరిన సేనల నిలువరించి కుంభకర్ణునిపై నొకపర్వతశిఖరంబు నేసెను ౨౨

ఆకుంభకర్ణుఁడు ఆపర్వతశిఖరంబు తనపైకి వచ్చుటం జూచి దానిఁ బిడికిటం బొడిచెను ౨౩

అట్లు పిడికిటం బొడువఁగానే యప్పర్వతశిఖరము పగిలినదై యగ్నికణంబులు రాలం బ్రజ్వలించుచు నేలంబడినది. ౨౪

ఋషభుఁడు శరభుఁడు నీలుఁడు గవాక్షుఁడు గంధమాదనుఁడు నీ యయిదుగురు వానరోత్తములును కుంభకర్ణునిపై కదిరిరి. ౨౫

మహాబలశాలులగు నవ్వానరోత్తములు మహాకాయుండగు కుంభకర్ణుం జుట్టుముట్టి పర్వతంబులచేతను వృక్షంబులచేతను అఱచేతులను పాదంబుల చేతను బిడికిళ్లచేతను బ్రహరించిరి. ౨౬

ఆదెబ్బలన్నియుఁ నతని సుఖస్పర్శముగాఁ దోఁచినవిగాని యెంత మాత్రము కష్టము గలిగింపవయ్యె.

ఋషభం తు మహావేగం బాహుభ్యాం పరిషస్వజే. ౨౭

కుమ్భకర్ణభుజాభ్యాం తు పీడితో వానరర్షభః,
నిపపాత ర్షభో భీమః ప్రముఖా ద్వాన్తశోణితః, ౨౮
ముష్టినా శరభం హత్వా జానునా నీల మాహవే,
ఆజఘాన గవాక్షం తు తలేనేన్ద్రరిపు స్తదా. ౨౯
పాదేనాభ్యహనత్క్రుద్ధ స్తరసా గన్ధమాదనమ్,

దత్తప్రహారవ్యథితా ముముహుః శోణితోక్షితాః. ౩౦
నిపేతు స్తే తు మేదిన్యాం నికృత్తా ఇవ కింశుకాః,
తేషు వానరముఖ్యేషు పతితేషు మహాత్మసు. ౩౧
వానరాణాం సహస్రాణి కుమ్భకర్ణం ప్రదుద్రువుః,
తం శైల మివ శైలాభా స్సర్వే తే ప్లవగర్షభాః. ౩౨
సమారుహ్య సముత్పత్య దదంశు శ్చ మహాబలాః,

తం నఖై ర్దశనై శ్చాపి ముష్టిభి ర్జానుభి స్తదా. ౩౩
కుమ్భకర్ణం మహాకాయం తే జఘ్నుః ప్లవగర్షభాః,
స వానరసహస్రై స్తై రాచితః పర్వతోపమః. ౩౪
రరాజ రాక్షసవ్యాఘ్రో గిరిరాత్మరుహై రివ,
బాహుభ్యాం వానరాన్ సర్వాన్ప్రగృహ్య సుమహాబలః. ౩౫
భక్షయామాస సంక్రుద్ధో గరుడః పన్నగానివ,

ప్రక్షిప్తాః కుమ్భకర్ణేన వక్త్రే పాతాళసన్నిభే. ౩౬
నాసాపుటాభ్యాం నిర్జగ్ముః కర్ణాభ్యాంచైవ వానరాః,

ఆకుంభకర్ణుఁడప్పుడు మహావేగుఁడగు ఋషభుని రెండుచేతులఁ గవుఁగి లించికొని గట్టిగ నదిమెను. ౨౭

వానరోత్తముఁడును భయంకరబలుఁడు నగుఋషభుఁడుకుంభకర్ణ భుజ పీడితుఁడై నోట నెత్తురుగ్రక్కుచు నేలంబడెను. ౨౮

అప్పుడు యుద్ధంబునం గుంభకర్ణుఁడు పిడికిలిపోటున శరభుని వధించి మోఁకాల నీలుం గ్రుమ్మి గవాక్షు నఱచేతం బ్రహరించెను. ౨౯

కుంభకర్ణుఁడు కుపితుఁడై తనబలంబుకొలఁది గంధమాదనునిఁ బాదాఘా తంబునఁ బ్రహరించెను.

ఆవానరోత్తములు ఆదెబ్బలకు నెత్తురుగాఱ మూర్ఛనొంది ఛేదింపఁ బడిన మోదుగుచెట్లపగిది నేలంగూలిరి. 3౦

మహాబలశాలులగు నవ్వానరోత్తములు గూలుటంజూచి పెక్కువేల వానరవీరులు కుంభకర్ణునిపై కదరిరి. 3౧

పర్వతాకారులును మహాబలశాలులునగు నావానరోత్తములందఱును మహాపర్వతాకారుఁడగు నాకుంభకర్ణునిపైకెగిరి యారోహించి దంతంబులం గొఱికిరి. 3౨

ఆవానరోత్తములుమహాకాయుఁడగు నాకుంభకర్ణు నప్పుడు నఖంబులం గీఱిరి; దంతంబులం గొఱికిరి. పిడికిళ్లం బొడిచిరి; మోకాళ్లంగ్రుమ్మిరి.

పర్వతాకారుఁడగు నారాక్షసోత్తముఁడు కుంభకర్ణుఁడు అట్లువేవవేల వానరవీరులచే వ్యాపింపఁబడి వృక్షంబులచే నిండినపర్వతంబుకరణినొప్పెను.

మహాబలుఁడగు నాకుంభకర్ణుఁడంతఁ బరమకుపితుఁడై గరుత్మంతుఁడు సర్పంబుల భక్షించునట్లు వానరుల నందఱం జేతులంబట్టుకొని భక్షింప నారంభించెను. 3౫

అట్లు కుంభకర్ణుఁడు వానరులను బాతాళకుహరాకారంబగు తననోట వేసికొనఁగానే వారలు ముక్కురంధ్రంబులనుండియుఁ జెవులనుండియు వెడలి వచ్చుచుండిరి. 3౬

భక్షయన్భృశసఙ్క్రుద్ధో హరీన్ప్రేతసన్నిభః. ౩౭
బభఞ్జ వానరాన్ సర్వాన్ సఙ్క్రుద్ధో రాక్షసోత్తమః,
మాంసశోణితసంక్లేదాం భూమిం కుర్వన్ స రాక్షసః. ౩౮
చచార హరిసైన్యేషు కాలాగ్నిరివ మూర్ఛితః,

వజ్రహస్తో యథా శక్రః పాశహస్త ఇవాన్తకః. ౩౯
శూలహస్తో బభౌ సఙ్ఖ్యే కుమ్భకర్ణో మహాబలః,

యథా శుష్కాణ్యరణ్యాని గ్రీష్మే దహతి పావకః. ౪౦
తథా వానరసైన్యాని కుమ్భకర్ణో వినిర్దహత్,
తతస్తే వధ్యమానాస్తు హతయూథా వినాయకాః. ౪౧
వానరా భయసంవిగ్నా వినేదుర్విస్వరం భృశమ్,
అనేకశో వధ్యమానాః కుమ్భకర్ణేన వానరాః. ౪౨
రాఘవం శరణం జగ్ముర్వ్యథితాః ఖిన్నచేతసః,
ప్రభగ్నాన్వానరాన్ దృష్ట్వా వజ్రహస్తాత్మజాత్మజః. ౪౩
అభ్యధావత వేగేన కుమ్భకర్ణం మహాహవే,
శైలశృఙ్గం మహద్గృహ్య వినదంశ్చ ముహుర్ముహుః. ౪౪
త్రాసయన్రాక్షసాన్ సర్వాన్కుమ్భకర్ణపదానుగాన్,
చిక్షేప శైలశిఖరం కుమ్భకర్ణస్య మూర్ధని. ౪౫
స తేనాభిహతోఽత్యర్థం గిరిశృఙ్గేణ మూర్ధని,
కుమ్భకర్ణః ప్రజజ్వాల కోపేన మహతా తదా. ౪౬
సోఽభ్యధావత వేగేన వాలిపుత్త్రమమర్షణః,
కుమ్భకర్ణో మహానాదస్త్రాసయన్ సర్వవానరాన్. ౪౭
శూలం ససర్జ వై రోషాదఙ్గదే స మహాబలః,

పర్వతాకారుఁడగు నాకుంభకర్ణుఁడు అట్లు విడలివచ్చుటం జూచి పరమకుపితుఁడై వానరుల నందఱ నెత్తిచి భక్షింపసాగెను. ౩౭

ఆకుంభకర్ణుఁడు ప్రళయకాలాగ్నిహోత్రునిమాడ్కి రౌద్రాకారుఁడై భూమియంత రక్తమాంసముల నిండిరిగాఁ జేయుచు వానరసైన్యంబుల విహరించుచుండెను. ౩౮

వజ్రాయుధంబుదాల్చిన దేవేంద్రునిభంగిఁ బాశంబుధరించియుండు యమునికైవడి శూలపాణియగు కుంభకర్ణుఁడు యుద్ధంబున నెంతయుఁ బ్రకాశించుచుండెను. ౩౯

అగ్నిహోత్రుఁడు వేసఁగికాలమున ఎండియున్నయడవులను దహించునట్లు కుంభకర్ణుఁడు వానరసేనలను దహించెను. ౪౦

అంత నావానరులు అట్లు వధింపఁబడుచు గుంపులువీడి నాయకుఁడు లేకుండుటచేఁ బరమభీతులయి మహాధ్వనిగా రోదనంబుగావించిరి. ౪౧

అట్లు కుంభకర్ణుఁడు అనేకవిధంబుల వధింప నవ్వానరులు భీతులయి దుఃఖితులయి రాముని శరణంబొచ్చిరి. ౪౨

అంత నంగదుఁడు యుద్ధంబున వానరులందఱు పరాజయంబునొంది పాఱుటంజూచి యొకగొప్పపర్వతశిఖరంబుగొని మాటిమాటికి కుంభకర్ణుని వెంబడివచ్చు రాక్షసులందఱు భయపడ సింహనాదంబులుసేయుచు వేగంబున కుంభకర్ణునిపై కదరెను. ౪౩, ౪౪

ఆయంగదుఁడాపర్వతశిఖరమును గుంభకర్ణునితలపైఁ బడవైచెను. ౪౫

అట్లు తలపై గొప్పదెబ్బతగులుటంజేసి యాకుంభకర్ణుఁ డప్పుడు మహాకోపంబున మండిపడెను. ౪౬

ఆకుంభకర్ణుఁ డట్లు కుపితుఁడై సమస్తవానరులును భయపడునట్లు మహాధ్వనిగా నఱచుచు వేగంబున నంగదునిమీఁదికిఁ బోయెను. ౪౭

మహాబలుఁడగు నాకుంభకర్ణుఁడు కోపంబున నంగదునిపై శూలంబు వైచెను.

త మాపతన్తం బుద్ధ్వా తు యుద్ధమార్గవిశారదః. ౪౭
లాఘవా న్మోచయామాస బలవాన్వానరర్షభః,

ఉత్పత్య చైనం సహసా తలేనోరస్యతాడయత్. ౪౯

స తేనాభిహతః కోపా త్ప్రముమోహ చలోపమః,

స లబ్ధసంజ్ఞో బలవా న్ముష్టి మావర్త్య రాక్షసః. ౫౦
అపహ స్తేన|చిక్షేప స విసంజ్ఞః పపాత హ,

తస్మిన్ ప్లవగశార్దూలే విసంజ్ఞే పతితే భువి. ౫౧
త చ్ఛూలం సముపాదాయ సుగ్రీవ మభిదుద్రువే,
త మాపతన్తం సమ్ప్రేక్ష్య కుమ్భకర్ణం మహాబలమ్. ౫౨
ఉత్పపాత తదా వీర స్సుగ్రీవో వానరాధిపః,
స పర్వతాగ్ర ముత్క్షిప్య సమావిధ్య మహాకపిః. ౫౩
అభిదుద్రావ వేగేన కుమ్భకర్ణం మహాబలమ్.
త మాపతన్తం సమ్ప్రేక్ష్య కుమ్భకర్ణః ప్లవఙ్గమమ్. ౫౪
తస్థౌ వికృతసర్వాఙ్గో వానరేన్ద్రసమున్ముఖః,
కపిశోణితదిగ్ధాఙ్గం భక్షయన్తం ప్లవఙ్గమాన్. ౫౫
కుమ్భకర్ణం స్థితం దృష్ట్వా సుగ్రీవో వాక్య మబ్రవీత్,
పాతితా శ్చ త్వయా వీరాః కృతం కర్మ సుదుష్కరమ్. ౫౬
భక్షితాని చ సైన్యాని ప్రాప్తం తే పరమం యశః,

త్యజ తద్వానరానీకం ప్రాకృతైః కిం కరిష్యసి. ౫౭
సహస్వైకనిపాతం మే పర్వతస్యాస్య రాక్షస!,

యుద్ధోపాయములఁ జక్కఁగాఁ దెలిసినవాఁడును బలవంతుఁడు నగు నంగదుఁడు ఆశూలంబు తనపైకి వచ్చుటం జూచి లాఘవంబునఁ దప్పించుకొనెను. ౪౮

ఆయంగదుఁడు కటాలున సమీపంబునకు దుమికి కుంభకర్ణుని ఱొమ్ముపైన అఱచేతఁ జఱచెను. ౪౯

పర్వతాకారుఁడగు నాకుంభకర్ణుఁడు అంగదుని దెబ్బకుఁ బరవశత్వంబు నొంది యేమియుఁ దెలియక మూర్ఛిల్లెను.

బలవంతుఁడగు నాకుంభకర్ణుఁడు కొంతసేపటికిఁ దెలివొంది యెడమచేతఁ బిడికిలి సవరించి యంగదుఁ బొడిచెను; అంత నంగదుఁడు మూర్ఛిలి నేలం బడెను. ౫౦

వానరోత్తముఁడగు నాయంగదుఁడట్లు మూర్ఛిలి నేలఁబడఁగానే కుంభకర్ణుఁ డాశూలంబుఁగొని సుగ్రీవునిమీఁదికిఁ బోయెను. ౫౧

అప్పుడు వీరుఁడగు వానరరాజు సుగ్రీవుఁడు మహాబలుఁడగు కుంభకర్ణుఁడు తనమీఁదికి వచ్చుటంజూచి యుద్ధోత్సాహంబున గంతువేసెను.

సుగ్రీవుఁడు పర్వతశిఖరంబు చేకొని గిఱగిఱం ద్రిప్పుచు వేగమున మహాబలుఁడగు కుంభకర్ణునిమీఁదికిం బోయెను. ౫౩

కుంభకర్ణుఁడు తనపైకి సుగ్రీవుఁడు వచ్చుటంజూచి సమస్తావయవంబులను వికృతంబుగా విదుర్చుకొని సుగ్రీవున కభిముఖంబుగా నిలిచెను.

సుగ్రీవుఁడు వానరులను భక్షింపుచు వానరులరక్తముచేఁ దడిసినదేహముతో నిలుచున్న కుంభకర్ణుంజూచి యిట్లని చెప్పెను. ౫౫

నీవు యుద్ధంబున గొప్పగొప్పవీరులఁ బడవేసినావు; ఇతరుల కెవ్వరికిని జేయనలవికానికార్యము గావించినావు; వానరసైన్యములను భక్షించినావు; గొప్పకీర్తినిం బొందితివి. ౫౬

కుంభకర్ణుఁడా! ఆవానరులనందఱను వదలుము. అల్పులతో నీకేమి కార్యము? నాయొద్దకు రమ్ము. నేనిప్పుడు వేయు నీపర్వతము నొకటిమాత్రము సహింపుము చాలును. అని సుగ్రీవుఁడు కుంభకర్ణునితోఁ జెప్పెను. ౫౭

తద్వాక్యం హరిరాజస్య సత్త్వధైర్యసమన్వితమ్. ౭౮
శ్రుత్వా రాక్షసశార్దూలః కుమ్భకర్ణోఽబ్రవీ ద్వచః,
ప్రజాపతే స్తు పౌత్ర స్త్వం తథైవర్క్షరజస్సుతః. ౭౯
శ్రుతపౌరుషసమ్పన్నః తస్మా ద్గర్జసి వానర!।

స కుమ్భకర్ణస్య వచో నిశమ్య
వ్యావిధ్య శైలం సహసా ముమోచ. ౮౦
తేనాజఘానోరసి కుమ్భకర్ణం
శైలేన వజ్రాశనిసన్నిభేన.
తచ్ఛైలశృఙ్గం సహసావికీర్ణం
భుజాన్తరే తస్య తదా విశాలే. ౮౧
తతో విషేదు స్సహసా ప్లవఙ్గా
రక్షోగణాశ్చాపి ముదా వినేదుః,
స శైలశృఙ్గాభిహత శ్చుకోప
ననాద కోపా చ్చ వివృత్య వక్త్రమ్. ౮౨
వ్యావిధ్య శూలం చ తటిత్ప్రకాశం
చిక్షేప హర్యృక్షపతే ర్వధాయ,
తత్కుమ్భకర్ణస్య భుజప్రవిద్ధం
శూలం శితం కాఞ్చనదామజుష్టమ్. ౮౩
క్షిప్రం సముత్పత్య నిగృహ్య దోర్భ్యాం
బభఞ్జ వేగేన సుతోఽనిలస్య,
కృతం భారసహస్రస్య శూలం కాలాయసం మహత్. ౮౪
బభఞ్జ జానున్యారోప్య ప్రహృష్టః ప్లవగర్షభః,

శూలం భగ్నం హనుమతా దృష్ట్వా వానరవాహినీ. ౮౫

రాక్షసశ్రేష్ఠుఁడగు కుంభకర్ణుఁడు వానరరాజు సుగ్రీవుఁడు బలధైర్యంబులు తేఁటపడం జెప్పినమాటను విని యిట్లని బదులుచెప్పెను. ౫౮

నీవు బ్రహ్మదేవుని మనుమఁడవు. బ్రహ్మపుత్రుఁడగు బుక్షరజునికుమారుఁడవు; అధికమయినపరాక్రమముగలవాఁడవు; ఇదంతయును మాకుఁ దెలిసినదే; నీవేల గర్జించెదవు? అని కుంభకర్ణుఁడు సుగ్రీవునితోఁ జెప్పెను. ౫౯

అంత సుగ్రీవుఁడు కుంభకర్ణునిమాటను విని వజ్రాశనిసమానంబగు నప్పర్వతమును వేగంబున గిఱగిఱం ద్రిప్పి వక్షస్స్థలంబుపైఁ బడవైచెను. ౬౦

అప్పుడు ఆపర్వతశిఖరము కుంభకర్ణుని విశాలవక్షస్స్థలముపైఁబడి చూర్ణమయినది, దానింజూచి వానరులందఱు దుఃఖమునొందిరి; రాక్షసులు సంతోషంబున సింహనాదంబులు గావించిరి. ౬౧

ఆకుంభకర్ణుఁడు తన్నుఁ బర్వతశిఖరముతోఁ గొట్టుటకు గోపించి నోరుదెఱచి భయంకరంబుగా నఱచుచు మెఱుపువలె మెఱయుచున్నశూలమును గిఱగిఱం ద్రిప్పి సుగ్రీవుని వధించుటకై దానివైచెను. ౬౨

హనుమంతుఁడు తత్క్షణంబు నచ్చోటి కుద్గమించి కుంభకర్ణుఁడు ప్రయోగించిన కాంచనాలంకృతంబును దీక్ష్ణంబునగు శూలంబుఁబట్టుకొని వేగంబున రెండుచేతులంబట్టి విఱిచెను. ౬౩

వానరోత్తముఁడగు హనుమంతుఁడు పరమసంతోషంబున వేయి బారువలయినుముతోఁ జేయఁబడిన యమ్మహాశూలమును మోఁకాలి కానించి విఱిచి వేసెను. ౬౪

హనుమంతుఁడు శూలమును విఱుచుటనుజూచి వానరులు పరమ

హృష్టా ననాద బహుశస్సర్వతశ్చాపి దుద్రువే,
సింహనాదం చ తే చక్రుః ప్రహృష్టా వనగోచరాః. ౬౬
మారుతిం పూజయాంచక్రు ర్దృష్ట్వా శూలం తథా గతమ్,

స తత్తదా భగ్న మవేక్ష్య శూలం
చుకోప రక్షోధిపతి ర్మహాత్మా. ౬౭
ఉత్పాట్య లఙ్కామలయా త్స శృఙ్గం
జఘాన సుగ్రీవ ముపేత్య తేన,
స శైలశృఙ్గాభిహతో విసంజ్ఞః
పపాత భూమౌ యుధి వానరేన్ద్రః. ౬౮
తం ప్రేక్ష్య భూమౌ పతితం విసంజ్ఞం
నేదుః ప్రహృష్టా స్త్వథ యాతుధానాః,
తమభ్యుపేత్యాద్భుతఘోరవీర్యం
స కుమ్భకర్ణో యుధి వానరేన్ద్రమ్. ౬౯
జహార సుగ్రీవ మభిప్రగృహ్య
యథా నిలో మేఘ మతిప్రచణ్డః,
స తం మహామేఘనికాశరూప
ముత్పాట్య గచ్ఛ న్యుధి కుమ్భకర్ణః. ౭౦
రరాజ మేరుప్రతిమానరూపో
మేరు ర్యథాభ్యుచ్ఛ్రితఘోరశృఙ్గః,
తత స్త ముత్పాట్య జగామ వీర
స్సంస్తూయమానో యుధి రాక్షసేన్ద్రైః. ౭౧

శృణ్వ న్నినాదం త్రిదివాలయానాం
ప్లవఙ్గరాజగ్రహవిస్మితానామ్,

సంతోషంబునొంది సింహనాదములు సేయుచు గంతులు వేయుచు నాలుగు ప్రక్కలకుఁ బరుగెత్తిరి. ౬౫

ఆవానరులందఱు కుంభకర్ణుని భయంకరరూపం బవ్యథం బగుటంజూచి పరమసంతుష్టులయి సింహనాదంబులు చేయుచు వాయుదేవునికుమారుఁడగు హనుమంతుం బూజించిరి. ౬౬

మహాబలుఁడగు నాకుంభకర్ణుఁడు కనశూలంబు విఱువఁబడుటను చూచి కుపితుఁడై లంకామలయపర్వతంబునుండి శిఖరంబుఁ బెకలించి దానిచే సుగ్రీవు నేసెను. ౬౭

ఆసుగ్రీవుఁడు అప్పర్వతశిఖరంబు దెబ్బకు మూర్ఛిలి యుద్ధంబున నేలఁ బడెను. అదిచూచి రాక్షసులందఱు పరమసంతుష్టులయి సింహనాదంబులు గావించిరి. ౬౮

ఆకుంభకర్ణుఁడు యుద్ధంబున ఆశ్చర్యంబును భయంబును గల్గించుపరాక్రమముగల వానరరాజు సుగ్రీవునొద్దకుఁ బోయి యతనింబట్టి ప్రచండ వాయువు మేఘమును గొనిపోవునట్లు సుగ్రీవునిం గొనిపోయెను. ౬౯

మేరుపర్వతాకారుఁడగు కుంభకర్ణుఁడు యుద్ధంబున మహామేఘరూపుఁడగు నాసుగ్రీవు నెత్తుకొనిపోవుచు ఉన్నతంబగు మహాశిఖరముగల మేరు పర్వతంబుకరణిఁ జూడనొప్పెను. ౭౦

అంత వీరుఁడగు కుంభకర్ణుఁడు అట్లు సుగ్రీవు నెత్తుకొని రాక్షసశ్రేష్ఠులు నానావిధంబులం బొగడ వానరరాజుండగు సుగ్రీవుఁడును బట్టువడుట కచ్చెరువొందిన దేవతల యాశ్చర్యధ్వనులవినుచుం బోయెను. ౭౧

తత స్త మాదాయ తదా సమేనే
హరీన్ద్ర మిన్ద్రోపమ మిన్ద్రవీర్యః. ౭౨
అస్మి న్హృతే సర్వ మిదం హృతం స్యా
త్సరాఘవం సైన్య మితీన్ద్రశత్రుః,
విద్రుతాం వాహినీం దృష్ట్వా వానరాణాం తత స్తతః. ౭౩
కుమ్భకర్ణేన సుగ్రీవం గృహీతం చాపి వానరమ్,
హనూమాం శ్చిన్తయామాస మతిమా న్మారుతాత్మజః. ౭౪
ఏవం గృహీతే సుగ్రీవే కింకర్తవ్యం మయా భవేత్,
యద్వై న్యాయ్యం మయా కర్తుం తత్కరిష్యామి సర్వథా.

భూత్వా పర్వతసఙ్కాశో నాశయిష్యామి రాక్షసమ్,
మయా హతే సంయతి కుమ్భకర్ణే
మహాబలే ముష్టివికీర్ణదేహే. ౭౬
విమోచితే వానరపార్థివే చ
భవన్తు హృష్టాః ప్లవగా స్సమస్తాః,
అథవా స్వయ మప్యేష మోక్షం ప్రాప్స్యతి పార్థివః. ౭౭
గృహీతోఽయం యది భవేత్త్రిదశై స్సాసురోరగైః.

మన్యే న తావ దాత్మానం బుధ్యతే వానరాధిపః. ౭౮
శైలప్రహారాభిహతశ్చ కుమ్భకర్ణేన సంయుగే,

అయం ముహూర్తా త్సుగ్రీవో లబ్ధసంజ్ఞో మహాహవే. ౭౯
ఆత్మనో వానరాణాం చ యత్పథ్యం తత్కరిష్యతి,
మయాతు మోక్షితస్యాస్య సుగ్రీవస్య మహాత్మనః. ౮౦
అప్రీతిశ్చ భవే త్కష్టా కీర్తినాశశ్చ శాశ్వతః,

అంత నప్పుడు దేవేంద్రసమానపరాక్రముండగు నాకుంభకర్ణుండు దేవేంద్రసమానుండగు నాసుగ్రీవు నెత్తుకొని "ఈసుగ్రీవుని హరించితి మేని రామలక్ష్మణులతోఁ గూడ వానరసైన్యమునంతయును హరించినట్లగును." అని తలఁచెను. ౨౨

అంత వానరసైన్యమంతయుఁ బాఱుటయు సుగ్రీవుఁడు కుంభకర్ణునిచేఁ బట్టువడుటయుం జూచి బుద్ధిమంతుఁడును వాయుకుమారుఁడునగు హనుమంతుఁ డిట్లని యాలోచించెను. ౨౩,౨౪

ఇట్లు సుగ్రీవుఁడుగూడఁ బట్టువడినాఁడే! ఇంక నేనేమి చేయవచ్చును? దేనిఁ జేసిన యుక్తముగానుండునో నేను దానినే చేయుదునుగాని యొండు గావింపను. ౨౫

నేను బర్వతాకారరూపుఁడనై యాకుంభకర్ణు నశింపఁ జేసెదను.

నేను యుద్ధంబున మహాబలుఁడగు కుంభకర్ణుని పిడికిటం బొడిచి భిన్నదేహుం గావించి వధించి వానరరాజును విడిపింపఁగా నీవానరులందఱు సంతోషంబు నొందుదురుగాక. ౨౬

అటుగాదేని యీసుగ్రీవుని దేవతలును అసురులును ఉరగులును ఒక్కటియై వచ్చి పట్టుకొన్నను తానే విడిపించుకొన సమర్థుఁడు; ఇప్పుడేమి భయము? ౨౭

వానరరాజుసుగ్రీవుఁడు యుద్ధంబునఁ గుంభకర్ణునిచేఁ బర్వతంబునం గొట్టఁబడి మూర్ఛిలియున్నందునఁ దన్నుఁ దెలిసికొనఁజాలకున్నాఁడని తలఁచెదను. ౨౮

ఈసుగ్రీవుఁడు శీఘ్రంబున మూర్ఛదేఱి యిప్పుడీయుద్ధమునందుఁ దనకును వానరులకును ఏద్ది హితమో దానిం జేయును. ౨౯

నేను ఈసుగ్రీవుని విడిపింతునేని మహాపరాక్రమశాలియగు నీతనికి మనోదుఃఖమును శాశ్వతమయిన కీర్తిహానియుఁ గలుగును. ౩౦

తస్మా న్మహార్థం కాఙ్క్షిష్యే విక్రమం పార్థివస్య తు. ౮౧
భిన్నంచ వానరానీకం తావ దాశ్వాసయా మ్యహమ్,

ఇత్యేవం చిన్తయిత్వా తు హనూమా న్మారుతాత్మజః. ౮౨
భూయ స్సం స్తంభయామాస వానరాణాం మహాచమూమ్,
స కుమ్భకర్ణోఽథ వివేశ లఙ్కాం
స్ఫురన్త మాదాయ మహాకపిం తమ్. ౮౩
విమానచర్యాగృహగోపురస్థైః
పుష్పాగ్ర్యవర్షై రవకీర్యమాణః,
లాజగన్ధోదవర్షై స్తు సిచ్యమాన శ్శనై శ్శనైః. ౮౪
రాజమార్గస్య శీతత్వా త్సంజ్ఞా మాప మహాబలః,

తత స్స సంజ్ఞా ముపలభ్య కృచ్ఛ్రా
ద్బలీయ స స్తస్య భుజాన్తరస్థః, ౮౫
అవేక్షమాణః పురరాజమార్గం
విచిన్తయామాస ముహు ర్మహాత్మా,
ఏవం గృహీతేన కథం ను నామ
శక్యం మయా సమ్ప్రతి కర్తు మద్య. ౮౬
తథా కరిష్యామి యథా హరీణాం
భవిష్యతీష్టం చ హితం చ కార్యమ్,
తతః కరాగ్రైః సహసా సమేత్య
రాజా హరీణా మమరేన్ద్రశత్రుమ్. ౮౭
ఖరై శ్చ కర్ణౌ దశనై శ్చ నాసాం
దదంశ పార్శ్వేషు చ కుమ్భకర్ణమ్,

అందువలన నేను సుగ్రీవునిపరాక్రమము మీఁదనే భారము వేసి యూతఁడువచ్చువఱకు విచ్చిపాఱెడు వానరసేనల నాశ్వాసించుచుండెదను. అని హనుమంతుఁ డాలోచించెను. ౮౧

వాయుదేవుని కుమారుఁడగు హనుమంతుఁ డీప్రకారంబున నాలోచించి యవ్వానరసేనను పాఱిపోకుండునట్లు నిలిపెను. ౮౨

అంత నా కుంభకర్ణుఁడును ఇట్టటు గదలుచున్న యా సుగ్రీవు నెత్తుకొని మేడలపైనను చర్యాగృహములందును గోపురంబులందును నుండు రాక్షసులు చల్లనిపుష్పంబులు చల్లఁ బేరోలగంబున లంకాపురిం బ్రవేశించెను. ౮౩

మహాబలుఁడగు సుగ్రీవుఁడు అట్లు తనపై పేలాలను సుగంధజలంబులను గురిపించుటవలనను రాజమార్గము చల్లఁగా నుండుటవలనను మూర్ఛ దేఱెను. ౮౪

అంత మహాపరాక్రమశాలియగు సుగ్రీవుఁడు ఎట్టకేలకుఁ దెలివొంది అధికబలుఁడగు నా కుంభకర్ణుని భుజంబుననుండి పలుమాఱు లంకాపురీరాజమార్గంబుఁ జూచుచు నిట్లని యాలోచించెను. ౮౫

ఇప్పు డిట్లు పట్టువడియున్నా నే; నే నిప్పు డేమి ప్రతీకారము చేయవచ్చును? వానరుల కేది యిష్టమును హితమునుగా నుండునో అలాగునఁ జేసెదను. ౮౬

అంత వానరరాజుం డగు సుగ్రీవుఁడు కఱకుగోళ్లచే శీఘ్రంబున దేవేంద్రశత్రువగు కుంభకర్ణుని చెవులఁ గిల్లి పండ్లతో ముక్కు కొఱికి పార్శ్వభాగంబులందుఁ గొఱికిపెట్టెను. ౮౭

స కుమ్భకర్ణో హృతకర్ణనాసో
విదారిత స్తేన విమర్దితశ్చ. ౮౮
రోషాభిభూతః క్షతజార్ద్రగాత్ర
స్సుగ్రీవ మావిధ్య పిపేష భూమౌ,
స భూతలే భీమబలాభిపిష్ట
స్సురారిభి స్తై రభిహన్యమానః. ౮౯
జగామ ఖం వేగవదభ్యుపేత్య
పునశ్చ రామేణ సమాజగామ,
కర్ణనాసావిహీన స్తు కుమ్భకర్ణో మహాబలః, ౯౦
రరాజ శోణితై స్సిక్తో గిరిగ ప్రస్రవణై రివ,

శోణితార్ద్రో మహాకాయో రాక్షసో భీమవిక్రమః. ౯౧
యుద్ధాయాభిముఖో భూయో మన శ్చక్రే మహాబలః,

అమర్షా చ్ఛోణితోద్గారీ శుశుభే రావణానుజః. ౯౨
నీలాఞ్జనచయప్రఖ్య స్ససన్ధ్య ఇవ తోయదగి,

గతే తు తస్మిన్ సురరాజశత్రుగ
క్రోధా త్ప్రదుద్రావ రణాయ భూయః. ౯౩
అనాయుధోఽస్మీతి విచిన్త్య రౌద్రో
ఘోరం తదా ముద్గర మాససాద,
తత స్స పుర్యా స్సహసా మహౌజా
నిష్క్రమ్య తద్వానరసైన్య ముగ్రమ్. ౯౪
బభక్ష రక్షో యుధి కుమ్భకర్ణగి
ప్రజా యుగాన్తాగ్ని రివ ప్రదీప్తః,

ఆకుంభకర్ణుఁడు అట్లు సుగ్రీవుఁడు తనముక్కుఁ జెవులను గొఱికి దేహమంతయుం గాయములుగాఁ జేసి పీడింపఁ బరమకుపితుఁడై దేహమంతయుం నెత్తురుగాఱ సుగ్రీవునిఁ బట్టుకొని చక్కఁగాఁ గొట్టి నేలపైవేసి నలిపెను. ౮౮

ఆసుగ్రీవుఁడు భయంకరబలుఁడగు కుంభకర్ణునిచేత నేలం బడవేసి పిసుకఁబడియుం రాక్షసులచే నానావిధంబులఁ బ్రహారింపఁబడియుఁ సరకు సేయక వేగంబున నాకాశంబున కెగసి రామునిం జేరెను. ౮౯

అట్లు ముక్కుఁజెవులం బీడి వికృతాకారుఁడైన మహాబలుఁడగు కుంభకర్ణుఁడు నెత్తుటం దోఁగుచు సెలయేఱులతోఁ గూడిన పర్వతంబుకరణిం జూపట్టెను. ౯౦

అట్లు నెత్తుటం దోఁగుచున్నవాఁడును భయంకరాకారుఁడును భయంకర పరాక్రముఁడును మహాబలశాలియునగు నాకుంభకర్ణుఁడు మరల యుద్ధమే చేసెదనని యుద్ధభూమికట్టు పఱిగెను. ౯౧

నీలాంజనరాశివలె నల్లనిదేహముగల యాకుంభకర్ణుఁడు దేహమంతయుం నెత్తురుగాఱుటం జేసి సంధ్యాకాలమునందలి మేఘముంబోలె నొప్పుచుఁ బరమకుపితుఁడయ్యెను. ౯౨

ఆసుగ్రీవుఁడు తప్పించుకొనిపోయినంతనే దేవేంద్రశత్రువై కుంభకర్ణుఁడు పరమకుపితుఁడై భయంకరాకారంబున మరల యుద్ధమునకుఁ బరుగెత్తుచు ఆయుధంబులేదని తలఁచి భయంకరమయిన యొకముద్గరముం గొనెను. ౯౩

అంత మహాపరాక్రమశాలియగు నాకుంభకర్ణుఁడు శీఘ్రంబునఁ బట్టణంబువెలువడి యవ్వానరసైన్యంబుఁ జొచ్చి ప్రలయకాలాగ్నిహోత్రుఁడు ప్రజలనుంబోలె నవ్వానరసైన్యంబుల భక్షింపసాగెను. ౯౪

బుభుక్షిత శ్శోణితమాంసగృధ్నుః
ప్రవిశ్య త ద్వానరసైన్య ముగ్రమ్. ౯౫
చఖాద రక్షాంసి హరీ న్పిశాచా
నృక్షాంశ్చ మోహా ద్యుధి కుమ్భకర్ణః,
యథైవ మృత్యు ర్హరతే యుగాన్తే
స భక్షయామాస హరీంశ్చ ముఖ్యాన్. ౯౬
ఏకం ద్వౌ త్రీ న్బహూ న్క్రుద్ధో వానరాన్ సహ రాక్షసైః,
సమాదాయైకహస్తేన ప్రచిక్షేప త్వరన్ముఖే. ౯౭
సంప్రస్రవం స్తదా మేద శ్శోణితం చ మహాబలః,
వధ్యమానో నగేన్ద్రాగ్రై ర్భక్షయామాస వానరాన్. ౯౮

తే భక్ష్యమాణా హరయో రామం జగ్ము స్తదా గతిమ్,

కుమ్భకర్ణో భృశం క్రుద్ధః కపీ న్ఖాద న్ప్రధావతి. ౯౯

శతాని సప్త చాష్టౌ చ వింశ త్త్రింశ త్తథైవ చ,
సంపరిష్వజ్య బాహుభ్యాం ఖాద న్విపరిధావతి. ౧౦౦

తస్మి న్కాలే సుమిత్రాయాః పుత్త్రః పరబలార్దనః,
చకార లక్ష్మణః క్రుద్ధో యుద్ధం పరపురఞ్జయః. ౧౦౧

స కుమ్భకర్ణస్య శరాన్ శరీరే సప్త వీర్యవాన్,
నిచఖాదాదదే చాన్యా న్విససర్జ చ లక్ష్మణః. ౧౦౨
అతిక్రమ్య చ సౌమిత్రిం కుమ్భకర్ణో మహాబలః,
రామ మే వాభిదుద్రావ దారయ న్నివ మేదినీమ్. ౧౦౩

కుంభకర్ణుఁడు యుద్ధంబున భయంకరాకారంబున సర్వవానరసైన్యంబుఁ జొచ్చి ఆఁకలిగొని రక్తమాంసంబులయం దాశగొని మోహంబునఁ దన వారి తెలిసివారలని తెలియక రాక్షసులను బిశాచంబులను వానరులను ఎలుఁగు బంటులను బక్షించెను. ౯౬

ప్రళయకాలంబున మృత్యువు ప్రజలసంహరించునట్లు కుంభకర్ణుఁడు గొప్పగొప్ప వానరులనెల్ల భక్షించెను. ౯౭

ఆ కుంభకర్ణుఁడు కుపితుఁడై వానరరాక్షసులబట్టి యేకకాలంబున ఒకరి నిద్దఱ ముగ్గుర ననేకుల నొకచేతనెత్తి వేగంబున వేసుకొనుచుండెను.

మహాబలశాలియగు కుంభకర్ణుఁడు వానరులు పర్వతశిఖరంబులచే నెంత గొట్టినను ఆ దెబ్బలను సరకుసేయక మేదస్సును నెత్తురును బుగ్గసందులనుండి వెల్లువలుగాఁ గాఱ వానరుల భక్షింపుచుండెను. ౯౮

ఆ వానరు లట్లు కుంభకర్ణునిచే భక్షింపఁబడుచు రాముని శరణు చొచ్చిరి.

కుంభకర్ణుఁడును బరమకుపితుఁడై వానరులను భక్షింపుచు వారివెంటం బరుగెత్తెను. ౯౯

కుంభకర్ణుఁడు వానరులను ఏడువందలును ఎనిమిదివందలును ఇరువది వందలును ముప్పదివందలనుగా చేతులం గ్రుచ్చియెత్తి భక్షింపుచుఁ బరు గెత్తెను. ౧౦౦

అప్పుడు శత్రుసైన్యము వధించువాఁడును శత్రుపట్టణంబుల జయించు వాఁడునగు సుమిత్రాపుత్రుఁడు లక్ష్మణుఁడు కుపితుఁడై యుద్ధంబు గావించెను. ౧౦౧

మహాపరాక్రమశాలియగు నాలక్ష్మణుఁడు కుంభకర్ణునిదేహముపై నేడు బాణంబుల నాటించి మరలఁ బెక్కుబాణంబులు దీసివిడిచెను. ౧౦౨

మహాబలుఁడగు కుంభకర్ణుఁడు సరకుగొనక యతిక్రమించి పాదా ఘాతంబున భూమిపగులునట్లు దోఁప రాముని మీఁదికే పోయెను. ౧౦౩

అథ దాశరథీ రామో రౌద్ర మస్త్రం ప్రయోజయన్,
కుమ్భకర్ణస్య హృదయే ససర్జ నిశితాన్ శరాన్. ౧౦౪
తస్య రామేణ విద్ధస్య సహసాభిప్రధావతః,
అఙ్గారమిశ్రాః క్రుద్ధస్య ముఖా న్నిశ్చేరు రర్చిషః. ౧౦౫
రామాస్త్రవిద్ధో ఘోరం వై నదన్రాక్షసపుఙ్గవః,
అభ్యధావత సంక్రుద్ధో హరీన్విద్రావయ న్రణే. ౧౦౬

త స్యోరసి నిమగ్నాశ్చ శరా బర్హిణవాససః,
హస్తా చ్చాపి పరిభ్రష్టా పపాతోర్వ్యాం మహాగదా. ౧౦౭
ఆయుధాని చ సర్వాణి విప్రాకీర్యన్త భూతలే,
స నిరాయుధ మాత్మానం యదా మేనే మహాబలః. ౧౦౮
ముష్టిభ్యాం చరణాభ్యాంచ చకార కదనం మహత్,
సబాణై రతివిద్ధాఙ్గః క్షతజేన సముక్షితః. ౧౦౯
రుధిరం ప్రతిసుస్రావ గిరిః ప్రస్రవణం యథా,

స తీవ్రేణ చ కోపేన రుధిరేణ చ మూర్ఛితః. ౧౧౦
వానరా న్రాక్షసా నృక్షా న్ఖాద న్విపరిధావతి,

అథ శృఙ్గం సమావిధ్య భీమం భీమపరాక్రమః. ౧౧౧
చిక్షేప రామ ముద్దిశ్య బలవాన న్తకోపమః,

అప్రాప్త మన్తరా రామ స్సప్తభి స్తై రజిహ్మగైః. ౧౧౨
శరైః కాఞ్చనచిత్రాఙ్గై శ్చిచ్ఛేద పురుషర్షభః,

తన్మేరుశిఖరాకారం ద్యోతమాన మివ శ్రియా. ౧౧౩

అంత దశరథకుమారుఁడగు రాముండు భయంకరాస్త్రం బొకటి సంధించి తీక్ష్ణబాణంబులఁ గుంభకర్ణుని భుజమ్ము వాటవేసెను. ౧౦౪

అట్లు రామునిచే దెబ్బలఁదిని కుపితుఁడై రామునిపైకిఁ బరుగెత్తుచున్న యాకుంభకర్ణుని నోటనుండి యగ్నిజ్వాలలు వెడలినవి. ౧౦౫

రాక్షసోత్తముఁడగు కుంభకర్ణుఁడు అట్లు రాముని యస్త్రముచేఁ గొట్టఁబడి పరమకుపితుఁడై వానరులు భయంబునం బాఱ యుద్ధంబున రామాభిముఖంబుగాఁ బరుగెత్తెను. ౧౦౬

రాముఁడు తీక్ష్ణబాణంబులఁ గుంభకర్ణుని హస్తంబు వాటవేయఁగానే యతఁడు పరవశుఁడగుటయుం అతనిచేతనుండి మహాగద నేలంబడినది. ౧౦౭

ఆట్లాతనిచేత నుండునట్టి యాయుధంబు లన్నియుం నేలంబడినవి.

మహాబలశాలియగు నాకుంభకర్ణుఁడు తాను నిరాయుధుఁ డయ్యెనని తెలిసికొని, పిడికిళ్లను బాహంబులను మహాయుద్ధంబు గావించెను. ౧౦౮

అట్లు బాణంబులచే గాయములైన దేహముగలవాఁడై నెత్తుటం దోఁగుచు నాకుంభకర్ణుఁడు పర్వతంబు సెలయేటిని సేవించునట్లు రక్తంబు స్రవించెను. ౧౦౯

ఆకుంభకర్ణుఁడు అట్లు నెత్తుటం దోఁగుచుఁ బరమకుపితుఁడై వానరులను రాక్షసులను భల్లూకంబులను భక్షించుచు యుద్ధరంగమున విహరించుచుండెను. ౧౧౦

అంత భయంకరపరాక్రముఁడును మహాబలశాలియుం మృత్యువుం బోలినవాఁడునగు నాకుంభకర్ణుఁడు భయంకరాకారంబగు నొకపర్వతశిఖరం బెత్తి గిఱగిఱం ద్రిప్పి రామునిపై వేసెను. ౧౧౧

పురుషశ్రేష్ఠుఁడగు రాముఁడు ఆ పర్వతశిఖరమును నడుమనే కాంచనాలంకృతములును లక్ష్యంబు దప్పనివియునగు సప్తబాణంబులచే ఖండించెను. ౧౧౨

మఱియుం మేరుశిఖరాకారుఁడగు కుంభకర్ణుఁడు కాంతిచే వెలుఁగుచు

ద్వే శతే వానరేన్ద్రాణాం పతమాన మపాతయత్,
తస్మి న్కాలే స ధర్మాత్మా లక్ష్మణో రామ మబ్రవీత్. ౧౧౪
కుమ్భకర్ణ వధే యుక్తో యోగా న్పరిమృశ న్బహూన్,
నై వాయం వానరా న్రాజ! న్నాపి జానాతి రాక్షసాన్. ౧౧౫
మత్త శ్శోణితగన్ధేన స్వా న్పరాం శ్చైవ ఖాదతి,
సాధ్వేన మధిరోహన్తు సర్వే తే వానరర్షభాః. ౧౧౬
యూథపా శ్చ యథా ముఖ్యా స్తిష్ఠ న్త్వస్య సమన్తతః,
అప్యయం దుర్మతిః కాలే గురుభార ప్రపీడితః. ౧౧౭
ప్రపత న్రాక్షసో భూమౌ నాన్యా న్హన్యా త్ప్లవఙ్గమాన్,
తస్య తద్వచనం శ్రుత్వా రాజపుత్త్రస్య ధీమతః. ౧౧౮
తే సమారురుహు ర్హృష్టాః కుమ్భకర్ణం ప్లవఙ్గమాన్,
కుమ్భకర్ణస్తు సంక్రుద్ధ స్సమారూఢః ప్లవఙ్గమైః. ౧౧౯
వ్యధూనయ త్తా న్వేగేన దుష్టహస్తీవ హస్తిపాన్,
తా న్దృష్ట్వా నిర్ధుతా న్రామో దుష్టోఽయ మితి రాక్షసః. ౧౨౦
సముత్పపాత వేగేన ధను రుత్తమ మాదదే,
క్రోధతామ్రేక్షణో వీరో నిర్దహ న్నివ చక్షుషా. ౧౨౧
రాఘవో రాక్షసం రోషా దభిదుద్రావ వేగితః,
యూథపా న్హర్షయన్ సర్వా న్కుమ్భకర్ణ భయార్దితాన్. ౧౨౨

రెండువందల వానరవీరులపై కదరుటయుం రాముఁడని మీఁది యతని బాణముల
చేలంబడునట్లు గావించెను. ౧౧౩

అప్పుడు ధర్మాత్ముఁడగు లక్ష్మణుఁడు కుంభకర్ణుని వధించుటకై తగునట్టి
యుపాయంబుల నాలోచించుచు నీమాట చెప్పెను. ౧౧౪

రామఁడా! ఈకుంభకర్ణుఁడు నెత్తురుచే మత్తుఁడై యున్నవాఁడు;
ఇతనికి వానరులనిగాని రాక్షసులనిగాని తెలియదు; తనవారలను ఎదిరివారలను
గూడఁ బట్టి తినుచున్నాఁడు. ౧౧౫

వానరవీరులందఱు చక్కఁగా నీకుంభకర్ణునిపై నారోహించి నిలుతురు
గాక; ముఖ్యులగు సేనానాయకులును యథాయోగ్యముగా నీతని కదలమెదల
నీకుండ గావింతురుగాక. ౧౧౬

ఇప్పుడు అట్లు గావింతురేని దుర్బుద్ధియగు నీకుంభకర్ణుఁడు నేలంబడి
నదేగాక మహాభారముచేతను బీడింపఁబడి లేవలేనివాఁడై యింక వానరులం
జంపకుండును. అని లక్ష్మణుఁడు చెప్పెను. ౧౧౭

ఆవానరులు రాచకొమరుఁడగు లక్ష్మణుని మాటను విని సంతుష్టులయి
కుంభకర్ణు నారోహించిరి. ౧౧౮

కుంభకర్ణుఁడు అట్లు వానరులు తనపై నారోహింపఁ బరమకుపితుఁడై
వేగంబున దుష్టగజము మావటివారలను విదిలించునట్లు ఆ వానరుల నందఱను
విదిలించివేసెను. ౧౧౯

రాముఁడు అట్లు కుంభకర్ణుఁడు వానరులనందఱ విదిలించివేయుటను
జూచి యతఁడు దుష్టుఁడు వధ్యుఁడని యుత్తమంబగు ధనువుదీసికొని యతని
మీఁదికిఁ బోయెను. ౧౨౦

పరాక్రమవంతుఁడగు రాముఁడు కోపంబున నెఱ్ఱనైనకన్నుల నిప్పులు
రాలఁ బరమవేగంబుగలవాఁడై కుంభకర్ణభయపీడితులగు వానరయూథపుల
సంతోషంబునొంద రోషంబునఁ గుంభకర్ణునిమీఁది కఱిగెను. ౧౨౧, ౧౨౨

స చాప మాదాయ భుజఙ్గకల్పం
దృఢజ్యముగ్రం తపనీయచిత్రమ్,
హరీన్ సమాశ్వాస్య సముత్పపాత
రామో నిబద్ధోత్తమతూణబాణః. ౧౨౩
స వానరగణై స్తై స్తు వృతః పరమదుర్జయః,
లక్ష్మణానుచరో రామ స్సంప్రతస్థే మహాబలః. ౧౨౪
స దదర్శ మహాత్మానం కిరీటిన మరిన్దమమ్,
శోణితాప్లుతసర్వాఙ్గం కుమ్భకర్ణం మహాబలమ్. ౧౨౫

సర్వాన్ సమభిధావన్తం యథా రుష్టం దిశాగజమ్,
మార్గమాణం హరీ న్క్రుద్ధం రాక్షసైః పరివారితమ్. ౧౨౬

విన్ధ్యమన్దరసఙ్కాశం కాఞ్చనాఙ్గదభూషణమ్,
స్రవన్తం రుధిరం వక్త్రా ద్వర్ష మేఘ మివోత్థితమ్. ౧౨౭

జిహ్వయా పరిలిహ్యన్తం శోణితం శోణితేక్షణమ్,
మృద్నన్తం వానరానీకం కాలాన్తకయమోపమమ్. ౧౨౮

తం దృష్ట్వా రాక్షసశ్రేష్ఠం ప్రదీప్తానలవర్చసమ్,
విస్ఫారయామాస తదా కార్ముకం పురుషర్షభః. ౧౨౯
స తస్య చాపనిర్ఘోషా త్కుపితో రాక్షసర్షభః,
అమృష్యమాణ స్తం ఘోష మభిదుద్రావ రాఘవమ్. ౧౩౦
తత స్తు వాతోద్ధతమేఘకల్పం

ఆరాముఁడు మహాసర్పసమానంబును దృఢమయిన యల్లెత్రాడుగలదియుం భయంకరాకారంబును గాంచనాలంకృతంబునగు ధనుస్సునుదీసికొని యుత్తమంబులగు బాణంబులుగల యమ్ములపొదులను గట్టుకొని కుంభకర్ణునిమీఁదికిఁ బోయెను. ౧౨౩

పరమదుర్జయుఁడు మహాబలుఁడు నగురాముఁడు ఆ వానరసమూహంబులు గొలువ, లక్ష్మణునితోఁగూడ యుద్ధంబునకు వెడలెను. ౧౨౪

ఆరాముఁడు, మహాకాయుఁడును కిరీటధరుఁడును శత్రువు నడంగఁద్రొక్కువాఁడును నెత్తుటం దోఁగుచున్నవాఁడును మహాబలుఁడునగు కుంభకర్ణునిఁ జూచెను. ౧౨౫

అట్లు వానరరాక్షసుల నందఱను దఱిమికొట్టుచున్నవాఁడును కుపితంబగు దిగ్గజంబువలె దుర్వారుఁడై యున్నవాఁడును వానరులను వెదకివెదకి భక్షించుచున్నవాఁడును గుపితుండును రాక్షసులచేఁ బరివేష్టితుండునగు కుంభకర్ణుని రాముఁడు చూచెను. ౧౨౬

వింధ్యమందరపర్వతాకారుఁడును బంగారుబాహుపురులు దాల్చినవాఁడునగు కుంభకర్ణుని రాముఁడు చూచెను. ౧౨౭

నాలుకచే నెత్తురు నాకుచున్నవాఁడును నెత్తురువలె నెఱ్ఱనికన్నులు గలవాఁడును వానరసేనను మర్దించుచున్నవాఁడును ప్రలయకాలంబున సకలప్రజానాశకరుఁడగు యమునింబోలి యున్నవాఁడు నగుకుంభకర్ణుని రాముఁడు చూచెను. ౧౨౮

పురుషశ్రేష్ఠుఁడగు రాముఁడు మండుచున్న యగ్నియుంబోలె వెలుఁగుచున్న రాక్షసోత్తముఁడగు నాకుంభకర్ణునింజూచి ధనుస్సు సారించెను. ౧౨౯

రాక్షసోత్తముఁడగు కుంభకర్ణుఁడు రామునివింటి ధ్వనిని విని దాని సహింపఁజాలక పరమకుపితుఁడై రామునిమీఁదికిం బోయెను. ౧౩౦

అంత రాముఁడు యుద్ధంబున వాయుహతంబగు మేఘంబుంబోలి

భుజఙ్గరాజో త్తమభోగబాహుమ్,
త మాపత న్తం ధరణీధరాభ
మువాచ రామో యుధి కుమ్భకర్ణమ్. ౧౩౧
ఆగచ్ఛ రక్షోధిప! మావిషాద
మవస్థితో௨హం ప్రగృహీతచాపః,
అవేహి మాం శక్రసపత్న! రామం
మయా ముహూర్తా ద్భవితా విచేతాః. ౧౩౨

రామో௨య మితి విజ్ఞాయ జహాస వికృతస్వనమ్,
అభ్యధావత సంక్రుద్ధో హరీ న్విద్రావయ న్రణే. ౧౩౩
పాతయ న్నివ సర్వేషాం హృదయాని వనౌకసామ్,
ప్రహస్య వికృతం భీమం స మేఘ స్తనితోపమమ్. ౧౩౪
కుమ్భకర్ణో మహాతేజా రాఘవం వాక్య మబ్రవీత్,
నాహం విరాధో విజ్ఞేయో న కబన్ధః ఖరో న చ. ౧౩౫
న వాలీ న చ మారీచః కుమ్భకర్ణో௨హ మాగతః,

పశ్య మే ముద్గరం ఘోరం సర్వకాలాయసం మహత్. ౧౩౬
అనేన నిర్జితా దేవా దానవాశ్చ పురా మయా,

వికర్ణనాస ఇతి మాం నావజ్ఞాతుం త్వమర్హసి. ౧౩౭
స్వల్పా௨పి హి న మే పీడా కర్ణనాసావినాశనాత్,
దర్శయేక్ష్వాకుశార్దూల! వీర్యం గాత్రేషు మే లఘు. ౧౩౮
తత స్త్వాం భక్షయిష్యామి దృష్టపౌరుషవిక్రమమ్,

యున్నవాఁడును వాసుకిశరీరమువంటి చేతులుగలవాఁడును పర్వతాకారుఁడు నగు కుంభకర్ణుఁడు తనపైకి వచ్చుటంజూచి యిట్లని చెప్పెను. ౧౩౧

రాక్షసరాజునకుఁ దమ్ముఁడవగు కుంభకర్ణుఁడా! నిమ్ము; భయపడకుము; నేను ధనుర్ధరుఁడనైయున్నాను. చూడుము; ఇంద్రుని జయించినవాఁడనని యను కొందువు కాఁబోలు; నేను రాముఁడను; ఇంద్రుఁడఁగాను; ఇంక స్వల్పకాలంబుననే నిన్ను వధించిపడవైచెదను చూడుము. అని రాముఁడు కుంభకర్ణునితోఁ జెప్పెను. ౧౩౨

కుంభకర్ణుఁడు ఈతఁడే రాముఁడని యెఱింగి వికృతస్వరంబునం బకపక నవ్వుచుఁ బరమకుపితుఁడై వానరులందఱు భయంబునం బాఱ వానరుల గుండెకాయలు పగులునట్లు రామునిమీఁదికిఁ బరుగెత్తెను. ౧౩౩

మహాపరాక్రమశాలియగు కుంభకర్ణుఁడు వికృతముగాను భయంకరముగాను మేఘగర్జనమువలె గంభీరంబుగాను నవ్వి రామునింజూచి యిట్లనియె.

నేను విరాధుఁడనుగాను కబంధుఁడఁగాను వాలినిగాను మారీచుఁడనుంగాను; నీవు వారల వధించితినని గర్వింపవలదు; నేను కుంభకర్ణుఁడ వచ్చినాను. ౧౩౫

ఇనుముతోఁ జేయఁబడిన భయంకరాకారంబగు నీమహాముద్గరముం జూడుము. దీనిచేతనే మున్ను నేను దేవతలను దానవులనుం జయించి యున్నాను ౧౩౬

నీవు ముక్కుచెవులుపోయినవాఁడనని నన్నుఁ జులుకనఁజూడవలదు. ముక్కుఁజెవులుపోవుటచే నా కెంతమాత్రమును బాధలేదు. ౧౩౭

ఇక్ష్వాకువంశములలో నుత్తముఁడవగు రాముఁడా! శీఘ్రంబున నీ పరాక్రమమును నాదేహముమీఁదం జూపుము. అంత నీపౌరుషపరాక్రమంబులు దెలిసినపిమ్మట నిన్ను భక్షించి వేసెదను. అని కుంభకర్ణుఁడు రామునితోఁ జెప్పెను. ౧౩౮

స కుమ్భకర్ణస్య వచో నిశమ్య
రామ స్సుపుఙ్ఖా న్విససర్జ బాణాన్. ౧౩౯
తై రాహతో వజ్రసమప్రవేగై
ర్న చుక్షుభే న వ్యథతే సురారిః,
యై స్సాయకై స్సాలవరా నికృత్తా
వాలీ హతో వానరపుఙ్గవశ్చ. ౧౪౦
తే కుమ్భకర్ణస్య తదా శరీరే
వజ్రోపమా న వ్యథయాం ప్రచక్రుః,
స వారిధారా ఇవ సాయకాం స్తా
న్పిబన్ శరీరేణ మహేన్ద్రశత్రుః. ౧౪౧
జఘాన రామస్య శరప్రవేగం
వ్యావిధ్య తం ముద్గర ముగ్రవేగమ్,
తత స్తు రక్షః క్షతజానులిప్తం
విత్రాసనం దేవమహాచమూనామ్. ౧౪౨
వివ్యాథ తం ముద్గర ముగ్రవేగం
విద్రావయామాస చమూం హరీణామ్,
వాయవ్య మాదాయ తతో వరాస్త్రం
రామః ప్రచిక్షేప నిశాచరాయ. ౧౪౩
సముద్గరం తేన జఘాన బాహుం
సకృత్తబాహు స్తుములం ననాద,
స తస్య బాహు ర్గిరిశృఙ్గకల్పః
సముద్గరో రాఘవబాణకృత్తః. ౧౪౪
పపాత తస్మి న్హరిరాజసైన్యే
జఘాన తాం వానరవాహినీం చ,

ఆ రాముఁడు కుంభకర్ణుఁడు చెప్పినమాటను విని దృఢములయిన పింజలు గల బాణంబులఁ బ్రయోగించెను. దేవశత్రుఁడగు నా కుంభకర్ణుఁడు వజ్ర సమానంబులగు బాణంబులచేఁ గొట్టఁబడినవాఁడయ్యు, నొకమాత్రము కలఁక నొందఁడయ్యె. ౧౩౯

ఏబాణంబులచే మున్ను సప్తసాలవృక్షంబులు ఛేదింపఁబడినవో వానరశ్రేష్ఠుఁడగు వాలియుం బధింపఁబడెనో వజ్రసమానంబులగు నాబాణంబు లప్పుడు కుంభకర్ణుని మేన నేమియుం జేయంజాలక పోయినవి. ౧౪౦

దేవేంద్రశత్రుఁడగు నాకుంభకర్ణుఁడు జలధారలంబోలె నా బాణంబులం గొన్నిటిని లీలమెయి గ్రహించుచు భయంకరవేగంబగు నాముద్గరమును గిఱగిఱం ద్రిప్పి కొన్నిబాణంబుల నివారించుకొనెను. ౧౪౧

అంత కుంభకర్ణుఁడు నెత్తురుచేఁ గప్పఁబడినదియుం దేవసేనలకు భయంబు గలిగించునదియు భయంకరాకారంబునగు నాముద్గరముతో వానరసేనలం దఱిమెను. ౧౪౨

అంత రాముఁడు వాయవ్యాస్త్రంబు దీసి కుంభకర్ణునిపై వేసెను. అది ముద్గరసహితంబుగా కుంభకర్ణుని బాహువును ఖండించినది; అంత నతఁడు ఛిన్నబాహుఁడై యఱచెను. ౧౪౩

పర్వతశిఖరాకారంబగు నాకుంభకర్ణుని బాహువు ముద్గరసహితంబుగా రామాస్త్రంబుచే ఖండితంబై వానరసైన్యంబునం బడి యవ్వానరసైనికులం జంపినది. ౧౪౪

తే వానరా భగ్నహతావశేషాః
పర్యన్త మాశ్రిత్య తదా విషణ్ణాః. ౧౪౫
ప్రవేపితాఙ్గా దదృశు స్సుఘోరం
నరేన్ద్రరక్షోఽధిప సన్నిపాతమ్,
స కుమ్భకర్ణోఽస్త్రనికృత్తబాహు
ర్మహా న్నికృత్తాగ్ర ఇవాచలేన్ద్రః. ౧౪౬
ఉత్పాటయామాస కరేణ వృక్షం
తతో విదుద్రావ రణే నరేన్ద్రమ్,
స తస్య బాహుం సహసాలవృక్షం
సముద్యతం పన్నగభోగకల్పమ్. ౧౪౭
ఐన్ద్రాస్త్రయుక్తేన జఘాన రామో
బాణేన జామ్బూనదచిత్రితేన,
స కుమ్భకర్ణస్య భుజో నికృత్తః
పపాత భూమౌ గిరిసన్నికాశః. ౧౪౮
వివేష్టమానోఽభిజఘాన వృక్షాన్
శైలాన్ శిలా వానరరాక్షసాంశ్చ,
తం ఛిన్నబాహుం సమవేక్ష్య రామ
స్సమాపతన్తం సహసా నదన్తమ్. ౧౪౯
ద్వావర్ధచన్ద్రౌ నిశితౌ ప్రగృహ్య
చిచ్ఛేద పాదౌ యుధి రాక్షసస్య,
తౌ తస్య పాదౌ ప్రదిశో దిశశ్చ
గిరీ న్గుహాం శ్చైవ మహార్ణవం చ. ౧౫౦
లఙ్కాం చ సేనాం కపిరాక్షసానాం
వినాదయన్తౌ వినిపేతతుశ్చ,

నగాశితులు కాఁగా వధింపఁబడఁగా మిగిలినవానర లప్పుడు దుఃఖితు లయి సమీపమునఁ జేరి భయమునఁ గడగడవడఁకుచు మహాభయంకరంబగు రామ కుంభకర్ణుల ద్వంద్వయుద్ధము గాంచిరి. ౧౪౫

అట్లు వాయవ్యాస్త్రంబుచే నొకచేయి ఖండింపఁబడుటయు నాకుంభ కర్ణుఁడు ఖండితశిఖరంబగు మహాపర్వతంబుకరణి నొప్పుచు రెండవచేత నొక వృక్షంబుఁ బెఱికి దానితో రామునిమీఁది కదరెను. ౧౪౬

ఆరాముఁడు కాంచనచిత్రితంబగు నమ్మున నైంద్రాస్త్రంబుఁ గూర్చి పన్నగాకారంబగు నాతని యితరబాహువును గూడ సాలవృక్షసహితంబుగా ఖండించివైచెను. ౧౪౭

పర్వతాకారంబగు నాకుంభకర్ణుని బాహువు ఖండితంబై గిఱగిఱఁదిరు గుచుఁ జెట్లువృక్షంబులను పర్వతంబులను రాళ్లను వానరులను రాక్షసులను చూర్ణంబగునట్లు నేలంబడినది. ౧౪౮

రాముఁడు అట్లు కుంభకర్ణుఁడు రెండుచేతులుఁదెగి యఱచుచు తన పైకివచ్చుటంజూచి తీక్ష్ణంబులగు రెండర్ధచంద్రమ్ములుదీసి యతని పాదంబు లను ఛేదించివైచెను. ౧౪౯

ఆకుంభకర్ణుని పాదంబులు నేలంబడుధ్వని దిక్కులను విదిక్కులను పర్వతంబులను గుహలను మహాసముద్రంబును లంకాపురియు వానరసేనయు రాక్షససేనయు నిండి చెలంగినది. ౧౫౦

నికృత్తబాహు ర్వినికృత్తపాదో
విదార్య వక్త్రం బడబాముఖాభమ్. ౧౫౧
దుద్రావ రామం సహసాఽభిగర్జ
న్రాహు ర్యథా చన్ద్ర మివాన్తరిక్షే,
అపూరయ త్తస్య ముఖం శితాగ్రై
రామ శ్శరై ర్హేమపినద్ధపుఙ్ఖైః. ౧౫౨
సంపూర్ణవక్త్రో న శశాక వక్తుం
చుకూజ కృచ్ఛ్రేణ ముమోహ చాపి,
అథాదదే సూర్యమరీచికల్పం
స బ్రహ్మదణ్డాన్తకకాలకల్పమ్. ౧౫౩
అరిష్ట మైన్ద్రం నిశితం సుపుఙ్ఖం
రామ శ్శరం మారుతతుల్యవేగమ్,
తం వజ్రజామ్బూనదచారుపుఙ్ఖం
ప్రదీప్తసూర్యజ్వలనప్రకాశమ్. ౧౫౪
మహేన్ద్రవజ్రాశనితుల్యవేగం
రామః ప్రచిక్షేప నిశాచరాయ,
స సాయకో రాఘవబాహుచోదితో
దిశ స్స్వభాసా దశ సంప్రకాశయన్. ౧౫౫
సధూమవైశ్వానరదీప్తదర్శనో
జగామ శక్రాశనిభీమవిక్రమః.
స తన్మహాపర్వతకూటసన్నిభం
వివృత్తదంష్ట్రం చలచారుకుణ్డలమ్. ౧౫౬
చకర్త రక్షోధిపతే శ్శిర స్తథా
యథైవ వృత్రస్య పురా పురన్దరః,

కుంభకర్ణుఁ డట్లు ఖండింపఁబడినహస్తుఁడై బడబాముఖాగ్నిసదృశంబగు నోరు దెఱచుకొని గర్జించుచు రాహువుచంద్రునిమీఁదికిఁ బోవునట్లు రాఘవుని మీఁదికి వేగంబుగఁ బోయెను. ౧౫౧

రాముఁడు తీక్ష్ణంబులును గాంచనపుంఖంబులునగు అమ్ములఁ గుంభకర్ణుని నోటినిండఁ గుప్పించెను. అతఁడు నోటినిండ అమ్ములు నిండి యుండుటంజేసి మాటలాడఁజాలక యెట్టకేలకు అఱచి మూర్ఛనొందెను. ౧౫౨

అంత రాముఁడు సూర్యప్రభంబును బ్రహ్మదండముంబోలినదియుం ప్రళయకాలంబునందలి యముఁడును సరివచ్చునదియును శత్రువుల కళవళంబు గల్గించునదియుం నింద్రనిర్మితంబును కాంచనపుంఖంబును వాయువేగంబును తీక్ష్ణంబు నగు దివ్యబాణంబుఁ దీసెను. ౧౫౩

వజ్రకఠినంబును గాంచనమయంబును సుందరంబునగు పింజెలదియును సూర్యాగ్నితేజంబును దేవేంద్రవజ్రాయుధసమానంబును బిడుగుంబోలినదియుం నగు నాదివ్యబాణంబును రాముఁడు కుంభకర్ణునిపై వైచెను. ౧౫౪

దేవేంద్రుని వజ్రాయుధంబునకుంబోలె బలపరాక్రమంబులుంగల యా దివ్యఅమ్ము రామబాహుప్రయుక్తంబై సధూమంబగు జ్వలదగ్నిహోత్రంబు పగిదిఁ జెలరెల్లుచుఁ దనకాంతిచే దశదిశలు వెలుఁగంజేయుచుఁ గుంభకర్ణుని మీఁదికడరెను. ౧౫౫

మున్ను దేవేంద్రుఁడు వృత్రాసురుని శిరస్సు ఖండించినట్లు ఆదివ్య అమ్ము మహాపర్వతశిఖరాకారంబును పెద్దకోఱలుంగలదియుం చంచలంబులగు సుందర కుండలముల నొప్పుచున్నదియుం నగు నాకుంభకర్ణుని శిరస్సును ఖండించెను. ౧౫౬

కుమ్భకర్ణశిరో భాతి కుణ్డలాలఙ్కృతం మహత్. ౧౬౭
ఆదిత్యేఽభ్యుదితే రాత్రౌ మధ్యస్థ ఇవ చన్ద్రమాః,

తద్రామబాణాభిహతం పపాత
రక్షశ్శిరః పర్వత సన్నికాశమ్. ౧౬౮
బభఞ్జ చర్యాగృహగోపురాణి
ప్రాకార ముచ్చం తమపాతయచ్చ,
న్యపతత్కుమ్భకర్ణోఽథ స్వకాయేన నిపాతయన్. ౧౬౯
ప్లవఙ్గమానాం కోటీః(ట్యశ్చ) పరిత స్సమ్ప్రధావతామ్,
తచ్చాతికాయం హిమవత్ప్రకాశం
రక్ష స్తత స్తోయనిధౌ పపాత. ౧౭౦
గ్రాహాన్ వరా న్మీనవరా న్భుజఙ్గా
న్మమర్ద భూమిం చ తదా వివేశ,
తస్మిన్ హతే బ్రాహ్మణదేవశత్రౌ
మహాబలే సంయతి కుమ్భకర్ణే. ౧౭౧
చచాల భూర్భూమిధరాశ్చ సర్వే
హర్షాచ్చ దేవా స్తుములం ప్రణేదుః,
తత స్తు దేవర్షి మహర్షి పన్నగా
స్సురాశ్చ భూతాని సుపర్ణ గుహ్యకాః. ౧౭౨
సయక్ష గన్ధర్వగణా నభోగతాః
ప్రహర్షితా రామపరాక్రమేణ,
తత స్తు తే తస్య వధేన భూరిణా
మనస్వినో నైరృతరాజబాన్ధవాః. ౧౭౩
వినేదు రుచ్చై ర్వ్యథితా రఘూత్తమం
హరిం సమీక్ష్యైవ యథా సురార్దితాః,

కెంపుకుండలములచే నలంకృతంబులై ఖాదనవేగంబున నాకాశగతం బయియున్న కుంభకర్ణుని శిరస్సు రాత్రియందుదయించిన పునర్వసునక్షత్రముల కెంటినడుమనుండు చంద్రబింబమువలెఁ బ్రకాశించెను. ౧౫౭

పర్వతాకారంబగు నాకుంభకర్ణునిశిరస్సు రామబాణహతిఁ నేలంబడు టయినప్పుడు దానిదెబ్బచే చర్యాగృహంబులును బురద్వారంబులును బ్రాకారంబును విఱిగి నేలంగూలినవి. ౧౫౮

మఱియు నాకుంభకర్ణుని కళేబరంబు పడుటకుఁ జూట్టు భయంబునం బరుగెత్తుచున్న వానరు లనేకకోట్లు నలిగిపోయిరి. ౧౫౯

అంత హిమవత్పర్వతాకారంబగు నాకుంభకర్ణుని కళేబరంబు సముద్రంబునంబడి గ్రాహంబులను మత్స్యములను సర్పంబులను మర్దించి నేలంజొచ్చినది.

మహాబలశాలియగు నాకుంభకర్ణుఁడు యుద్ధంబున నిహతుఁడగుటయుం భూమియుం బర్వతంబులును జలించినవి; దేవతలు సంతోషంబున సింహనాదంబులు గావించిరి. ౧౬౧

అంత దేవతలును దేవర్షులును మహర్షులును ఉరగులును భూతంబులును గరుడగుహ్యకులును యక్షులును గంధర్వులును ఆకాశగతులై రామపరాక్రమంబుఁజూచి యెంతయు సంతోషంబునొందిరి. ౧౬౨

అంత ధైర్యశాలులగు నారాక్షసులు మహాబలుండగు కుంభకర్ణుఁడు నిహతుఁడగుటకుఁ బరమదుఃఖితులయి దేవతలు జయించినప్పుడు అసురులు విష్ణుంజూచి భయపడునట్లు రామునిఁజూచి పరమభీతులయి యుచ్చైర్నాదంబున రోదనంబుగావించిరి. ౧౬౩

స దేవలోకస్య తమో నిహత్య
సూర్యో యథా రాహుముఖా ద్విముక్తః. ౧౬౪
తథా వ్యభాసీద్భువి వానరౌఘే
నిహత్య రామో యుధి కుమ్భకర్ణమ్,
ప్రహర్ష మీయు ర్బహవస్తు వానరాః
ప్రబుద్ధపద్మప్రతిమై రివాననైః. ౧౬౫
అపూజయ న్రాఘవ మిష్టభాగినం
హతే రిపౌ భీమబలే దురాసదే,
స కుమ్భకర్ణం సురసఙ్ఘమర్దనం
మహత్సు యుద్ధేషు పరాజితశ్రమమ్, ౧౬౬
ననన్ద హత్వా భరతాగ్రజో రణే
మహాసురం వృత్ర మివామరాధిపః,

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే సప్తషష్టితమ స్సర్గః. ౬౭.

---

## అష్టషష్టితమస్సర్గః.

కుమ్భకర్ణం హతం దృష్ట్వా రాఘవేణ మహాత్మనా,
రాక్షసా రాక్షసేన్ద్రాయ రావణాయ న్యవేదయన్. ౧
రాజన్! స కాలసఙ్కాశ స్సంయుక్తః కాలకర్మణా,
విద్రావ్య వానరీం సేనాం భక్షయిత్వా చ వానరాన్. ౨
ప్రతపిత్వా ముహూర్తం చ ప్రశాన్తో రామతేజసా,
కాయేనార్ధప్రవిష్టేన సముద్రం భీమదర్శనమ్. 3
నికృత్తకణ్ఠోరుభుజో విక్షర న్రుధిరం బహు,
రుద్ధ్వా ద్వారం శరీరేణ లఙ్కాయాః పర్వతోపమః. ౪

కుమ్భకర్ణ స చ భ్రాతా కాకుత్ స్థశరపీడితః,
లగణ్డాభూతో వికృతో దావదగ్ధ ఇవ ద్రుమః. ౫

తం శ్రుత్వా నిహతం సఙ్ఖ్యే కుమ్భకర్ణం మహాబలమ్,
రావణ శ్శోకసంతప్తో ముమోహ చ పపాత చ. ౬
పితృవ్యం నిహతం శ్రుత్వా దేవాన్తకనరాన్తకౌ,
త్రిశిరా శ్చాతికాయ శ్చ రురుదు శ్శోకపీడితాః. ౭
భ్రాతరం నిహతం శ్రుత్వా రామేణాక్లిష్టకర్మణా,
మహోదరమహాపార్శ్వౌ శోకాక్రాన్తౌ బభూవతుః. ౮
తతః కృచ్ఛ్రాత్ సమాసాద్య సంజ్ఞాం రాక్షసపుఙ్గవః,
కుమ్భకర్ణవధా ద్దీనో విలలాప స రావణః. ౯
హా వీర! రిపుదర్పఘ్న! కుమ్భకర్ణ! మహాబల!,
త్వం మాం విహాయ వై దైవా ద్యాతోఽసి యమసాదనమ్. ౧౦

మమ శల్య మనుద్ధృత్య బాన్ధవానాం మహాబల!,
శత్రుసైన్యం ప్రతాప్యైక స్త్వం మాం సన్త్యజ్య గచ్ఛసి. ౧౧

ఇదానీం ఖల్వహం నాస్మి యస్య మే దక్షిణో భుజః,
పతితో యం సమాశ్రిత్య న బిభేమి సురాసురాన్. ౧౨
కథ మేవం విధో వీరో దేవదానవదర్పహా,
కాలాగ్నిరుద్రప్రతిమో రణే రామేణ వై హతః. ౧౩
యస్య తే వజ్రనిష్పేషో న కుర్యా ద్వ్యసనం సదా,
స కథం రామబాణార్తః ప్రసుప్తోఽసి మహీతలే. ౧౪

ఏతే దేవగణా స్సార్ధ మృషిభి ర్గగనే స్థితాః,

నీతమ్ముఁడు కుంభకర్ణుండు రామబాణంబులచే దావాగ్నిదగ్ధంబగు వృక్షంబువలెను వికృతంబుగా బడిపోయి నేలఁగూలినాఁడు. అని రాక్షసులు రావణునకుం జెప్పిరి. ౫

రావణుండు మహాబలుండగు కుంభకర్ణుండు యుద్ధంబున నిహతుండగు టకు బరమదుఃఖితుండై మూర్ఛనొంది నేలంబడెను. ౬

దేవాంతకుండును నరాంతకుండును త్రిశిరుండును అతికాయుండును పినతండ్రిచచ్చుటను విని దుఃఖపీడితులయి రోదనంబుగావించిరి. ౭

మహోదరమహాపార్శ్వులు తమ సహోదరుండగు కుంభకర్ణుఁడు రామునిచే వధింపఁబడినాఁడని తెలిసి పరమదుఃఖితులయిరి. ౮

అంత రాక్షసశ్రేష్ఠుఁడగు నా రావణుండు ఎట్టకేలకు మూర్ఛదేఱి కుంభకర్ణవధంబు దలంచుకొని దీనుఁడై యాప్రకారంబున నిట్లు విలపించెను. ౯

అయ్యో! వీరుఁడవు, శత్రుగర్వం బడచువాఁడవు, మహాబలుండవు నగు కుంభకర్ణుఁడా! నీవు దైవవశంబున నిప్పుడు నన్నువిడిచి యమలోకంబు నొందినావుగదా. ౧౦

మహాబలుండవగు కుంభకర్ణుఁడా! నీవు నాదుఃఖమును బంధువులదుఃఖ మునుం దీర్పకయే యొక్కరుండవే శత్రువులజయించి నన్నువిడిచిపెట్టి పోవుచున్నావేమి! ౧౧

నేను దేని నాశ్రయించి దేవాసురులకును భయపడకుందునో అట్టి నా దక్షిణభుజము పడిపోయినందున నే నిప్పుడు వధింపబడితిని. ౧౨

ఇట్టి మహావీరుఁడును దేవదానవులగర్వం బడంచినవాఁడును కాలాగ్నిరుద్రసమానుఁడు నగు కుంభకర్ణుని యుద్ధమున రాముఁడెట్లు వధించినాఁడు?

నీకు వజ్రాయుధంబు వ్రేటును ఎంతమాత్రము నాయాసము గలిగింపఁజాలదు. అట్టినీవు ఎట్లు రామబాణంబులచేఁ బీడితుఁడవై నేలంబడి నిద్రించుచున్నావు? ౧౪

ఇదిగో దేవతలందఱు ఋషులతోఁగూడ నాకాశంబునం జేరి యుద్ధా

నిహతం త్వాం రణే దృష్ట్వా నినదన్తి ప్రహర్షితాః. ౧౫

ధ్రువ మద్యైవ సంహృష్టా లబ్ధలక్షాః ప్లవఙ్గమాః,
ఆరోక్ష్యన్తి హి దుర్గాణి లఙ్కాద్వారాణి సర్వశః. ౧౬

రాజ్యేన నాస్తి మే కార్యం కిం కరిష్యామి సీతయా,
కుమ్భకర్ణవిహీనస్య జీవితే నాస్తి మే గతిః. ౧౭
యద్యహం భ్రాతృహన్తారం న హన్మి యుధి రాఘవమ్,
నను మే మరణం శ్రేయో న చేదం వ్యర్థజీవితమ్. ౧౮
అద్యైవ తం గమిష్యామి దేశం యత్రానుజో మమ,
నహి భ్రాతౄన్ సముత్సృజ్య క్షణం జీవితు ముత్సహే. ౧౯
దేవా హి మాం హసిష్యన్తి దృష్ట్వా పూర్వాపకారిణమ్,
కథ మిన్ద్రం జయిష్యామి కుమ్భకర్ణ! హతే త్వయి. ౨౦

తదిదం మా మనుప్రాప్తం విభీషణవచశ్శుభమ్,
యదజ్ఞానాన్మయా తస్య న గృహీతం మహాత్మనః. ౨౧
విభీషణవచో యావ త్కుమ్భకర్ణప్రహస్తయోః,
వినాశోఽయం సముత్పన్నో మాం వ్రీడయతి దారుణః. ౨౨

తస్యాయం కర్మణః ప్రాప్తో విపాకో మమ శోకదః,
యన్మయా ధార్మిక శ్శ్రీమాన్ స నిరస్తో విభీషణః. ౨౩

ఇతి బహువిధ మాకులాన్తరాత్మా
కృపణ మతీవ విలప్య కుమ్భకర్ణమ్,

బున నిహతుఁడవగు నిన్నుంజూచి పరమసంతోషంబున సింహనాదంబులు గావించుచున్నారు. ౧౫

పరమసంతుష్టులగువానరులు అవసరంబుఁజూచుకొని యిప్పుడే యెట్టి వారికిని బొందసలవిగాని లంకాద్వారంబుల నారోహింతురు. ఇది నిశ్చయము. ౧౬

నాకు ఇంక రాజ్యముతోనే పనిలేదు; ఇంక సీతతో నేమిచేయఁ గలను? కుంభకర్ణుని విడిచి నేను జీవించియుండఁజాలను. ౧౭

నేను నాతమ్మునింజంపిన రాముని యుద్ధంబున వధింపఁజాలనేని నాకును మరణంబే మంచిది; వ్యర్థమయిన బ్రతుకెంతమాత్రము మంచిదిగాదు. ౧౮

ఇప్పుడే నాతమ్ముఁడు పోయినచోటికిఁ బోయెదను; నాతమ్మునివిడిచి నేను నిముషమయినను బ్రతికియుండనొల్లను. ౧౯

దేవతలు మున్ను తమ కపకారముగావించిన నన్నుంజూచి యిప్పుడు ఎగతాళిసేయుదురు; కుంభకర్ణుఁడా! నీవు హతుఁడవైతివే; ఇంక నేను దేవేంద్రు నెట్లు జయింతును? ౨౦

మహాత్ముఁడగు విభీషణుఁడు చెప్పిన మంగళకరంబగుమాట యిప్పుడు నాకు యథార్థముగా సంభవించినది; మున్ను అజ్ఞానంబున నతనిమాట విననైతిని. ౨౧

ఇట్లు భయంకరముగా ప్రహస్తుఁడును కుంభకర్ణుఁడును నాశంబు నొందుటవలన విభీషణుఁడు చెప్పినమాటయిప్పు డెంతయునామనస్సును బీడించుచున్నది. ౨౨

నేను మున్ను పరమధార్మికుఁడును శ్రీమంతుఁడునగు నా విభీషణునిం దఱిమికొట్టితినే; ఆతప్పుయొక్కఫల మిది యీదుఃఖరూపంబున నాకనుభవంబునకు వచ్చినది. అని రావణుఁడు విలపించెను. ౨౩

రావణుఁడు కుంభకర్ణమరణంబువిని యీప్రకారంబున నానావిధంబుల దీనంబుగా మిక్కిలియు విలపించి యంత దుఃఖంబు సహింపఁజాలక

న్యపతత దథ దశాననో భృశార్త
స్తమనుజ మిన్ద్రరిపుం హతం విదిత్వా. ౨౮

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డేఽష్టషష్టితమస్సర్గః. ౬౮.

---

ఏకోనసప్తతితమస్సర్గః.

ఏవం విలపమానస్య రావణస్య దురాత్మనః,
శ్రుత్వా శోకాభితప్తస్య త్రిశిరా వాక్య మబ్రవీత్. ౧

ఏవ మేవ మహావీర్యో హతో న స్తాత మధ్యమః,
నతు సత్పురుషా రాజ! న్విలపన్తి యథా భవాన్. ౨

నూనం త్రిభువనస్యాపి పర్యాప్త స్త్వమసి ప్రభో!,
స కస్మా త్ప్రాకృత ఇవ శోచస్యాత్మాన మీదృశమ్. 3

బ్రహ్మదత్తాఽస్తి తే శక్తిః కవచ స్సాయకో ధనుః,
సహస్రఖరసంయుక్తో రథో మేఘస్వనో మహాన్. ౪

త్వయాఽసకృ ద్విశస్త్రేణ విశస్తా దేవదానవాః,
స సర్వాయుధసమ్పన్నో రాఘవం శాస్తు మర్హసి. ౫

కామం తిష్ఠ మహారాజ! నిర్గమిష్యామ్యహం రణమ్,
ఉద్ధరిష్యామి తే శత్రూ న్గరుడః పన్నగా నివ. ౬

శమ్బరో దేవరాజేన నరకో విష్ణునా యథా,
తథాఽద్య శయితా రామో మయా యుధి నిపాతితః. ౭

మూర్ఛితుఁడై నేలంబడెను. ౨౪

ఇది యఱువదియెనిమిదవసర్గము.

## అఱువదితొమ్మిదవసర్గము

త్రిశిరుఁడు ఇట్లు శోకాక్రాంతుఁడై విలపించుచున్న దురాత్ముఁడగు రావణుని విలాపంబు విని యిట్లని చెప్పెను. ౧

రావణుఁడా! మానడిమితండ్రియగు కుంభకర్ణుఁడు నీవుచెప్పిన ట్లమిత పరాక్రమశాలి. సందేహములేదు! దైవయోగంబున హతుఁడయ్యె. అయితే నీయట్లు పెద్దలు ఎంతమాత్రము విలపింపరు. ౨

రాక్షసనాయకుఁడగు రావణుఁడా! నీవొక్కఁడవే ముల్లోకంబులను సాధింపఁజాలుదువు. అట్టి నీవు నిన్నుగుఱించి ప్రాకృతునియట్లు ఏల దుఃఖించెదవు! ౩

నీకు బ్రహ్మదేవుఁ డొసంగిన శక్తియుఁ కవచంబును బాణంబును ధనుస్సు వేయిగాడిదలతోఁ గూడినదియు మేఘగర్జనంబువంటి ధ్వనిగలదియునగు మహారథంబునుం గలవు. ౪

ఒకప్పుడు నీవు ఆయుధంబేమియుఁ లేకయే దేవతలను దానవులనుం గూడ జయించియున్నావు, అట్టినీవు సమస్తాయుధంబులతోఁగూడి రాముని జయింపఁగలవు. ౫

రాక్షసమహారాజుఁడవగు రావణుఁడా! నీ వూరకయుండుము. నేను యుద్ధమునకుఁ బోయెదను. గరుత్మంతుఁడు సర్పముల నశింపఁజేయునట్లు నీ శత్రువులనందఱ నశింపఁజేసెదను. ౬

దేవేంద్రుఁడు శంబరాసురునింబోలె విష్ణుదేవుఁడు నరకాసురుంబోలె నేనిప్పుడు యుద్ధంబున రామునిం బడవైచెదను. అని త్రిశిరుఁడు రావణునితోఁ జెప్పెను. ౭

శ్రుత్వా త్రిశిరసో వాక్యం రావణో రాక్షసాధిపః,
పునర్జాత మివాత్మానం మన్యతే కాలచోదితః. ౮
శ్రుత్వా త్రిశిరసో వాక్యం దేవాన్తకనరాన్తకౌ,
అతికాయశ్చ తేజస్వీ బభూవు ర్యుద్ధహర్షితాః. ౯
తతోఽహ మహమిత్యేవ గర్జన్తో నైరృతర్షభాః,
రావణస్య సుతా వీరా శ్శక్రతుల్యపరాక్రమాః. ౧౦

అన్తరిక్షగతా స్సర్వే సర్వే మాయావిశారదాః,
సర్వే త్రిదశదర్పఘ్నా స్సర్వే చరణదుర్జయాః, ౧౧

సర్వే సుబలసమ్పన్నా స్సర్వే విస్తీర్ణకీర్తయః,
సర్వే సమర మాసాద్య న శ్రూయన్తే పరాజితాః. ౧౨
దేవై రపి సగన్ధర్వై స్సకిన్నరమహోరగైః,
సర్వేఽస్త్రవిదుషో వీరా స్సర్వే యుద్ధవిశారదాః. ౧౩
సర్వే ప్రవరవిజ్ఞానా స్సర్వే లబ్ధవరా స్తథా,
స తై స్తదా భాస్కరతుల్యవర్చసైః
పుత్రై ర్వృత శ్శత్రుబలప్రమర్దనైః. ౧౪
రరాజ రాజా మఘవానివామరై
ర్వృతో మహాదానవదర్పనాశనైః,
స పుత్రాన్ సంపరిష్వజ్య భూషయిత్వా చ భూషణైః. ౧౫
ఆశీర్భిశ్చ ప్రశస్తాభిః ప్రేషయామాస సంయుగే,
యుద్ధోన్మత్తం చ మత్తం చ భ్రాతరౌ చాపి రావణః. ౧౬
రక్షణార్థం కుమారాణాం ప్రేషయామాస సంయుగే,
తేఽభివాద్య మహాత్మానం రావణం రిపురావణమ్. ౧౭
కృత్వా ప్రదక్షిణం చైవ మహాకాయాః ప్రతస్థిరే,

రాక్షసరాజునగు రావణుండు త్రిశిరునిమాటను విని కాలచోదితుం
డగుటంజేసి తన్నుం బూర్ణునిగా నొండొరులు దలంచుకొనెను. ౮

రాక్షసశ్రేష్ఠులగు దేవాంతకుండును నరాంతకుండును పరాక్రమశాలి
యగు నతికాయుండును త్రిశిరునిమాటను విని నేను యుద్ధంబునకుం బోయె
దను నేను బోయెదను యుద్ధంబునకని యుద్ధోత్సాహంబున గర్జించిరి. ౯

రావణునిపుత్రులందఱు మహాపరాక్రమశాలులు, పరాక్రమంబున
దేవేంద్రునకు సరివచ్చువారలు. ౧౦

రావణునికొడుకులందఱు ఆకాశగతులయి యుద్ధంబుసేయువారలు.
అందఱు మాయలంబండితులు. అందఱు దేవతలగర్వం బణంచువారలు.
అందఱును యుద్ధంబున జయింప నలవిగానివారలు. ౧౧

అందఱును మహాబలశాలులు, అందఱును అధికమయినకీర్తిగలవారలు.
అందఱును యుద్ధమునందు గంధర్వులును కిన్నరులును మహోరగులును దేవ
తలును ఒక్కటై వచ్చినను బరాజయము నొందనివారలు. ౧౨

అందఱును బండితులు. వీరులు. అందఱు యుద్ధసమర్థులు అందఱును
ఉత్తమమయిన శాస్త్రజ్ఞానముగలవారలు. అందఱును వరబలంబుగలవారలు. ౧౩

అప్పు డారాక్షసరాజుండగు రావణుండు సూర్యతేజస్కులును శత్రు
బలంబుల మర్దించువారలునగు కొడుకులచేఁ బరివేష్టితుండై దానవులగర్వం
బడఁచునట్టి దేవతలచేఁ బరివృతుండగు దేవేంద్రునిభంగిఁ బ్రకాశించెను. ౧౪

ఆ రావణుండు కొడుకులను గవుఁగిలించుకొని భూషణంబుల నలంకరించి
ప్రశస్తంబులగు నాశీర్వచనంబు లొసఁగి యుద్ధంబునకుఁ బంపెను. ౧౫

రావణుండు యుద్ధంబునఁ గొడుకులకు రక్షణార్థముగా తనతమ్ములయిన
మహోదరమహాపార్శ్వులం బంపెను. ౧౬

మహాకాయులగు నా రాక్షసులు మహాత్ముండును శత్రువులనేడ్పించు
వాఁడు నగురావణునకు నమస్కరించి ప్రదక్షిణంబుచేసి యుద్ధంబునకుఁ
బోయిరి. ౧౭

సర్వౌషధీభి ర్గన్ధైశ్చ సమాలభ్య మహాబలాః, ౧౮
నిర్జగ్ము ర్నై ఋతశ్రేష్ఠా షడేతే యుద్ధకాఙ్క్షిణః,
త్రిశిరా శ్చాతికాయశ్చ దేవా న్తకనరా న్తకౌ. ౧౯
మహోదరమహాపార్శ్వౌ నిర్జగ్ముః కాలచోదితాః,

తత స్సుదర్శనం నామ నీలజీమూతసన్నిభమ్. ౨౦
ఐరావతకులే జాత మారురోహ మహోదరః,
సర్వాయుధసమాయు క్తం తూణీభిశ్చ స్వలంకృతమ్. ౨౧
రరాజ గజమాస్థాయ సవితేవా స్తమూర్ధని,

హయో త్తమసమాయు క్తం సర్వాయుధసమాకులమ్, ౨౨
ఆరురోహ రథశ్రేష్ఠం త్రిశిరా రావణాత్మజః,
త్రిశిరా రథ మాస్థాయ విరరాజ ధనుర్ధరః. ౨౩
సవిద్యుదుల్కః స్సైజ్వాలః సేన్ద్రచాప ఇవామ్బుదః,

త్రిభిః కిరీటై శ్శుశుభే త్రిశిరా స్స రథో త్తమే. ౨౪
హిమవానివ శైలేన్ద్ర స్త్రిభిః కాఞ్చనపర్వతైః,

అతికాయోఽపి తేజస్వీ రాక్షసేన్ద్రసుత స్తదా. ౨౫
ఆరురోహ రథశ్రేష్ఠం శ్రేష్ఠ స్సర్వధనుష్మతామ్,
సుచక్రాక్షం సుసంయు క్తం స్వనుకర్షం సుకూబరమ్. ౨౬
తూణీబాణాసనై ర్దీ ప్తం ప్రాసాసిపరిఘాకులమ్,

మహాబలశాలులగు రాక్షసోత్తము లీయార్వురును ఆయుధప్రహారంబుఁ దప్పించునట్టి యౌషధులను నానావిధసుగంధములను బూసికొని యుద్ధోత్సాహంబున వెడలిరి. ౧౮

త్రిశిరుఁడును అతికాయుఁడును దేవాంతకుఁడును నరాంతకుఁడును మహోదరుఁడును మహాపార్శ్వుఁడును ఈ యార్వురును గాలచోదితులయి యుద్ధంబునకు వెడలిరి. ౧౯

అంత మహోదరుఁడు ఐరావతకులంబునఁ బుట్టినదియు నల్లని మేఘంబు వంటిదియునగు గజంబు నారోహించెను. ౨౦

అమ్మహోదరుఁడు సమస్తాయుధములతోను అమ్ములపొదులతోను నొప్పుచున్న గజంబు నారోహించి యందు అస్తగిరియందు సూర్యునిపగిది వినాశోన్ముఖుఁడై యొప్పుచుండెను. ౨౧

రావణపుత్త్రుఁడగు త్రిశిరుఁడు ఉత్తమాశ్వంబులు పూన్చినదియు సమస్తాయుధంబులతోనుం గూడినదియునగు నుత్తమరథము నారోహించెను.

కాంచనచిత్రంబగు ధనుస్సుదాల్చి రథగతుఁడై యున్న త్రిశిరుఁడు మెఱుపులతోను కొఱవులతోను ఇంద్రధనుస్సుతోనుంగూడి పర్వతశిఖరంబుపై నున్న మేఘంబుకైవడిఁ దేజరిల్లెను. ౨౩

ఆ త్రిశిరుఁడు అయ్యుత్తమరథమునందు మూఁడుతలలందును మూఁడు కిరీటములుగలవాఁడై మూఁడుబంగారుశిఖరములు గల పర్వతరాజం బగు హిమవత్పర్వతంబుకరణిఁ బ్రకాశించెను. ౨౪

అప్పుడు మహాపరాక్రమశాలియు ధనుర్ధరుల యందఱిలో నుత్తముఁడు నగురాక్షసరాజపుత్త్రుఁడైన యతికాయుఁడు మంచిచక్రములును కన్నులును గలదియు మిక్కిలియు దృఢంబును కాఁడిక్రిందఁదగిలించియుం మ్రానితోఁగూడినదియు నొగతోఁగూడినదియు అమ్ములపొదులతోను ధనుస్సులతోను నొప్పుచున్నదియు ఈఁటెలు ఖడ్గములు ఇనుపగుదియలు మొదలగు వానితో నిండియుండునదియునగు నుత్తమరథంబు నారోహించెను. ౨౫, ౨౬

స కాఞ్చనవిచిత్రేణ మకుటేన విరాజితా. ౨౭
భూషణైశ్చ బభౌ మేరుః కిరణై రివ భాసయన్,
స రరాజ రథే తస్మి న్రాజసూనుర్మహాబలః. ౨౮
వృతో నైరృతశార్దూలై ర్వజ్రపాణి రివామరైః,

హయ ముచ్చైశ్శ్రవః ప్రఖ్యం శ్వేతం కనకభూషణమ్. ౨౯
మనోజవం మహాకాయ మారురోహ నరాన్తకః,

గృహీత్వా ప్రాస ముల్కాభం విరరాజ నరాన్తకః. ౩౦
శక్తి మాదాయ తేజస్వీ గుహ శ్శిఖిగతో యథా,
దేవాన్తక స్సమాదాయ పరిఘం వజ్రభూషణమ్. ౩౧
పరిగృహ్య గిరిం దోర్భ్యాం వపు ర్విష్ణో ర్విడమ్బయన్,

మహాపార్శ్వో మహాకాయో గదా మాదాయ వీర్యవాన్,
విరరాజ గదాపాణిః కుబేర ఇవ సంయుగే,
ప్రతస్థిరే మహాత్మానో బలై రప్రతిమై ర్వృతాః. ౩౩
సురా ఇవామరావత్యా బలై రప్రతిమై ర్వృతాః,
తా న్గజైశ్చ తురఙ్గైశ్చ రథై శ్చామ్బుదనిస్వనైః. ౩౪
అనుజగ్ము ర్మహాత్మానో రాక్షసాః ప్రవరాయుధాః,

తే విరేజు ర్మహాత్మానః కుమారా స్సూర్యవర్చసః. ౩౫
కిరీటిన శ్శ్రియా జుష్టా గ్రహా దీప్తా ఇవామ్బరే,

ప్రగృహీతా బభౌ తేషాం శస్త్రాణా మావళి స్సితా. ౩౬
శారదాభ్రప్రతీకాశా హంసావళిరివామ్బరే,

ఆయతికాయుఁడు దేదీప్యమానంబగు బంగారుకిరీటంబుచేతను భూషణంబులచేతను కిరణంబులచేఁ బ్రకాశించు మేరుపర్వతంబుకైవడిఁ దేజరిల్లెను.

మహాబలశాలియగు రాక్షసరాజపుత్త్రుఁ డాయతికాయుఁడు దేవతలచే దేవేంద్రుఁడుంబోలె రాక్షసవీరులచేఁ బరివేష్టితుఁడై ఆ రథంబున నెంతయుఁ బ్రకాశించుచుండెను. ౨౮

నరాంతకుఁడు ఉచ్చైశ్శ్రవస్సుతో సమానమయినదియు కాంచన భూషణంబులచే నలంకృతంబును మనోవేగంబును మహాకాయంబు నగు శ్వేతాశ్వంబు నారోహించెను. ౨౯

నరాంతకుఁడు అశ్వగతుఁడై కొఱవివంటి ప్రాసము గ్రహించి నెమలిమీఁద శక్తిధరుఁడైయుండు కుమారస్వామిపగిదిఁ బ్రకాశించెను. ౩౦

దేవాంతకుఁడు వజ్రములచే నలంకృతమయిన పరిఘము చేతులం బట్టుకొని సముద్రమథనమప్పుడు మందరపర్వతము వహించియుండు విష్ణుదేవునికరణిఁ బ్రకాశించెను. ౩౧

మహాకాయుఁడును మహాపరాక్రమశాలియు నగుమహాపార్శ్వుఁడు గద చేతంబట్టి యుద్ధంబున గదాధరుఁడగు కుబేరునిభంగిఁ బ్రకాశించెను. ౩౨

దేవతలు గొప్పసేనలతోఁ గూడి యమరావతినుండి తరలునట్లు మహాబలశాలులగు నారాక్షసవీరులు గొప్పసేనలం గూడి లంకాపురంబునుండి వెడలిరి.

మహాబలశాలులగు రాక్షసులు ఉత్తమాయుధములం దాల్చి కొందఱు గజంబులను గొంద ఱశ్వంబులను గొందఱు మేఘగర్జనమువంటి ధ్వనిగల రథంబులను నారోహించి యిమ్మహోదరాదుల వెంబడించి నడచిరి. ౩౪

మహాబలశాలులును సూర్యునకుంబోలె వర్చస్సుగలవారలును కాంతిమంతులునగు నారాక్షసకుమారులు ఆకాశంబున వెలుఁగుచుండు గ్రహంబుల మాడ్కి దేజరిల్లుచుండిరి. ౩౪

శారదమేఘంబులకైవడి ధవళంబుగానుండు నారాక్షసుల యాయుధపఙ్క్తి యాకాశంబునం దిరిన హంసపక్షులపఙ్క్తివలెఁ బ్రకాశించినది. ౩౬

మరణం వాపి నిశ్చిత్య శత్రూణాం వా పరాజయమ్. ౩౮

ఇతి కృత్వా మతిం వీరా నిర్జగ్ముస్సంయుగార్థినః,

జగర్జుశ్చ ప్రణేదుశ్చ చిక్షిపుశ్చాపి సాయకాన్. ౩౯
జగృహుశ్చాపి తే వీరా నిర్యాన్తో యుద్ధదుర్మదాః,

క్ష్వేళితాస్ఫోటనినదై శ్చచాల చ వసున్ధరా. ౩౯
రక్షసాం సింహనాదై శ్చ పుస్ఫోటేవ తదామ్బరమ్,

తేఽభినిష్క్రమ్య ముదితా రాక్షసేన్ద్రా మహాబలాః. ౪౦
దదృశు ర్వానరానీకం సముద్యతశిలానగమ్,

హరయోఽపి మహాత్మానో దదృశు ర్నైరృతం బలమ్. ౪౧
హస్త్యశ్వరథసమ్బాధం కిఙ్కిణీశతనాదితమ్,
నీలజీమూతసఙ్కాశం సముద్యతమహాయుధమ్. ౪౨
దీప్తానలరవిప్రఖ్యై స్సర్వతో నైరృతై ర్వృతమ్,

తద్దృష్ట్వా బల మాయాన్తం లబ్ధలక్షాః ప్లవఙ్గమాః. ౪౩
సముద్యతమహాశైలా స్సంప్రణేదు ర్మహాబలాః,

అమృష్యమాణా రక్షాంసి ప్రతినర్దన్తి వానరాః. ౪౪
తత స్సముద్ఘుష్టరవం నిశమ్య
రక్షోగణా వానరయూథపానామ్,
అమృష్యమాణాః పరహర్ష ముగ్రం
మహాబలా భీమతరం వినేదుః. ౪౫

ఆ రాక్షసులు "శత్రువులనైనను జయింపవలెను, లేక యుద్ధంబున మరణంబునైనఁ బొందవలెను" అని నిశ్చయించి పోయిరి. ౩౭

పరాక్రమవంతులగు నా రాక్షసులు ఈ ప్రకారము నిశ్చయించి యుద్ధార్థులయి వెడలిపోయిరి.

పరాక్రమశాలులును యుద్ధదుర్మదులునగు నా రాక్షసులు యుద్ధభూమికిఁ బోవుచు గర్జించిరి, సింహనాదములు గావించిరి, శత్రువులను గుఱించి యాక్షేపవచనంబులాడిరి, బాణంబులం బట్టిరి. ౩౮

అప్పుడు ఆ రాక్షసుల యఱపులచేతను భుజాస్ఫాలనధ్వనులచేతను భూమి చలనంబునొందెను; వారల సింహనాదంబులచే నాకాశంబు పగులు నట్లుండెను. ౩౯

మహాబలశాలులగు నా రాక్షసవీరులు అట్లు పరమసంతోషంబున యుద్ధోత్సాహంబు గడలుకొనంబోయి పెనుఱాళ్లను వృక్షంబును బట్టుకొని యుద్ధసన్నద్ధంబై యున్న వానరసైన్యముం జూచిరి. ౪౦

మహావీరులగు వానరులు గజాశ్వరథసంకీర్ణంబును రథంబులందలి చిఱు గంటలచే మ్రోఁగుచున్నదియు మహాయుధముల ధరించి యంతటను మండు చున్న యగ్నిహోత్రంబుతోను సూర్యునితోను సమానులయిన రాక్షసవీరు లతోఁ గూడి నల్లనిమేఘంబువలె వచ్చుచున్నదియు నగు నా రాక్షససైన్య మును జూచిరి. ౪౧, ౪౨

మహాబలశాలులగు నవ్వానరులు వచ్చుచున్న యీరాక్షససేనంజూచి తమపరాక్రమంబుఁ జూపుట కవకాశము దొరకినదని సంతుష్టులయి మహా శైలంబులంగొని సింహనాదంబులు చేసిరి. ౪౩

వానరులు రాక్షసులంజూచి యోర్వఁజాలక గర్జించుచుండిరి. ౪౪

అంత మహాపరాక్రమశాలులగు నారాక్షసులు వానరవీరుల సింహనాదధ్వని విని వారి సంతోషము సహింపఁజాలక మఱియు భయంకరముగా గర్జించిరి. ౪౫

తే రాక్షసబలం ఘోరం ప్రవిశ్య హరియూథపాః,
విచేరు రుద్యతై శ్శైలై ర్నగా శ్శిఖరిణో యథా. ౪౬

కేచి దాకాశ మావిశ్య కేచి దుర్వ్యాం ప్లవఙ్గమాః,
రక్షస్సైన్యేషు సంక్రుద్ధా శ్చేరు ర్ద్రుమశిలాయుధాః. ౪౭
ద్రుమాంశ్చ విపులస్కన్ధాన్ గృహ్య వానరపుఙ్గవాః,

తద్యుద్ధ మభవ ద్ఘోరం రక్షో వానరసంకులమ్. ౪౮

తే పాదపశిలా శ్శైలై శ్చక్రు ర్వృష్టి మనూపమామ్,
బాణౌఘై ర్వార్యమాణాశ్చ హరయో భీమవిక్రమాః. ౪౯

సింహనాదా న్వినేదు శ్చ రణే వానరరాక్షసాః,

శిలాభి శ్చూర్ణయామాసు ర్యాతుధానా న్ప్లవఙ్గమాః. ౫౦
నిజఘ్ను స్సంయుగే క్రుద్ధాః కవచాభరణావృతాన్,
కేచి ద్రథగతా న్వీరా న్గజవాజిగతానపి. ౫౧
నిజఘ్ను స్సహసాఽఽప్లుత్య యాతుధానా న్ప్లవఙ్గమాః,
శైలశృఙ్గాచితాఙ్గాశ్చ ముష్టిభి ర్వాన్తలోచనాః. ౫౨
చేలుః పేతు శ్చ నేదు శ్చ తత్ర రాక్షసపుఙ్గవాః,

రాక్షసాశ్చ శరై స్తీక్ష్ణై ర్బిభిదుః కపికుఞ్జరాన్. ౫౩

శూలముద్గరఖడ్గై శ్చ జఘ్నుః ప్రాసై శ్చ శక్తిభిః,

అన్యోన్యం పాతయామాసుః పరస్పరజయైషిణః. ౫౪
రిపుశోణితదిగ్ధాఙ్గా స్తత్ర వానరరాక్షసాః,

ఆవానరవీరులు భయంకరాకారంబగు రాక్షససేనం బ్రవేశించి పర్వతంబులఁ బట్టుకొనియుండుటచే శిఖరంబులతో నొప్పుచున్న పర్వతంబులకరణిఁ బ్రకాశించిరి. ౪౬

ఱాళ్ళను వృక్షములను ఆయుధములుగాఁగొని యుద్ధంబు గావించునట్టి యావానరులు పెద్దపెద్దవృక్షంబులను గ్రహించి పరమక్రుద్ధులయి కొంద ఱాకాశంబునొందియుఁ గొందఱు భూమిపైనుండియుఁ రాక్షససైన్యంబుల విహారించిరి. ౪౭

అప్పుడు రాక్షసులకును వానరులకును యుద్ధము భయంకరముగా జరిగెను. ౪౮

భయంకరపరాక్రమశాలులగు నావానరులు, రాక్షసులు ప్రయోగించు బాణసమూహములచే నెంతయు వారింపఁబడియుఁ, నిలువక రాక్షసులపై వృక్షంబులను ఱాళ్లను బర్వతంబులను ఆసదృశముగాఁ గురిపించిరి. ౪౯

వానరులును రాక్షసులును యుద్ధోత్సాహంబు గదుర యుద్ధమునందు సింహనాదంబులం గావించిరి.

వానరులు రాక్షసులను ఱాలచే మోది చూర్ణముగావించిరి. ౫౦

కొందఱు వానరులు యుద్ధంబున సంక్రుద్ధులయి పైకెగిరి రథంబులను గుఱ్ఱంబులను ఏనుఁగులను ఆరోహించియున్న కవచంబులఁ దొడిగినవారలును ఆభరణాలంకృతులు నగు పరాక్రమవంతులయిన రాక్షసులం జంపిరి. ౫౧

ఆ యుద్ధంబున రాక్షసోత్తములు పయిఁబడియుండు పర్వతశిఖరములతోఁగూడిన దేహములుగలవారలయి పిడికిటిపోటులచే బైటికి వెడలివచ్చిన కండ్లతోఁ దిరుగుచు నేలంబడి యఱచిరి. ౫౨

రాక్షసులు కఱకుబాణంబులను శూలంబులను ముద్గరంబులను ఖడ్గంబులను బ్రాసంబులను శక్తులను వానరోత్తముల వధించిరి. ౫౩

ఆయుద్ధమునందు వానరులును రాక్షసులును ఒకరినొకరు జయింపఁగోరి దేహమంతయు శత్రువుల నెత్తుటం దడియ నొండొరులం గొట్టుకొనిరి. ౫౪

తత శ్శైలై శ్చ ఖడ్గైశ్చ విసృష్టై ర్హరిరాక్షసైః. ౫౫
ముహూర్తేనావృతా భూమి రభవచ్ఛోణితాప్లుతా,

వికీర్ణపర్వతాకారై రక్షోభి రరిమర్దనైః. ౫౬
ఆసీ ద్వసుమతీ పూర్ణా తదా యుద్ధమదాన్వితైః,
ఆక్షిప్తాః క్షిప్యమాణాశ్చ భగ్నశూలాశ్చ వానరైః. ౫౭
పున రఙ్గై స్తథా చక్రు రాసన్నా యుద్ధ మద్భుతమ్,

వానరా న్వానరై రేవ జఘ్ను స్తే రజనీచరాః. ౫౮
రాక్షసా న్రాక్షసై రేవ జఘ్ను స్తే హరియూథపాః,
ఆక్షిప్య చ శిలా స్తేషాం నిజఘ్నూ రాక్షసా హరీన్. ౫౯
తేషాం చాచ్ఛిద్య శస్త్రాణి జఘ్నూ రక్షాంసి వానరాః,

నిజఘ్ను శ్శైలశూలా స్త్రై ర్బిభిదు శ్చ పరస్పరమ్. ౬౦
సింహనాదా న్వినేదుశ్చ రణే వానరరాక్షసాః,

ఛిన్నవర్మతనుత్రాణా రాక్షసా వానరై ర్హతాః. ౬౧
రుధిరం ప్రస్రుతా స్తత్ర రససార మివ ద్రుమాః,

రథేన చ రథం చాపి వారణేన చ వారణమ్. ౬౨
హయేన చ హయం కేచి న్నిజఘ్ను ర్వానరా రణే,
ప్రహృష్టమనస స్సర్వే ప్రగృహీత మనశ్శిలాః. ౬౩
హరయో రాక్షసా ఞ్జఘ్ను ర్ద్రుమైశ్చ బహుశాఖిభిః,

తద్యుద్ధ మభవ ద్ఘోరం రక్షో వానరసంకులమ్. ౬౪

అంత ముహూర్తమాత్రంబున నాయుద్ధభూమియంతయు వానర రాక్షసులు ఒకరిపైనొకరు ప్రయోగించుకొనిన పర్వతంబులచేతను కత్తులచేతను నిండి నెత్తురు వెల్లువలయ్యెను. ౫౫

అప్పుడు యుద్ధభూమియంతయుఁ బర్వతాకారులును శత్రుమర్దనులును యుద్ధగర్వితులునగు రాక్షసుల కళేబరంబులచే నిండినది. ౫౬

వానరులు రాక్షసులను పైకెత్తిపడవేయుచు శాలాద్యాయుధంబులను విఱిచి చీకాకుపఱిచినను రాక్షసులు ఓడక వానరుల మీఁదికిఁ బోయి చూచువారల కాశ్చర్యము గలుగునట్లు కాళ్ళం జేతులఁ బోరు గావించిరి. ౫౭

రాక్షసులు వానరులతోనే వానరులం గొట్టిరి, వానరులును రాక్షసులతోనే రాక్షసులం బ్రహరింపుచుండిరి. ౫౮

రాక్షసులు వానరులు ప్రయోగించుశిలల నొడిసిపట్టుకొని వానరులం బ్రహరించి వధించిపుచ్చిరి, వానరులును రాక్షసులచేతి యాయుధంబులం బెఱికికొని రాక్షసుల వధించిరి. ౫౯

వానరులును రాక్షసులును యుద్ధంబున పర్వతంబులచేతను శాలాద్యాయుధంబులచేతను పరస్పరము దేహంబు ఛేదిల్లి నెత్తురు గాఱునట్లు ప్రహరించుకొని సింహనాదంబులు గావించిరి. ౬౦

ఆ యుద్ధభూమియందు రాక్షసులు వానరులచేఁ గొట్టఁబడినవారలయి కవచంబులు పగిలి కత్తివాటు వేయఁబడిన వృక్షములు పాలుగాఱునట్లు నెత్తురు గాఱిరి. ౬౧

కొందఱు వానరులు యుద్ధంబునందు రథంబును వీనుఁగుచేత నేనుఁగును గుఱ్ఱంబుచేత గుఱ్ఱంబును విచిత్రంబుగాఁ బ్రహరించిరి. ౬౨

వానరు లందఱును సంతుష్టహృదయులై జాగ్రతలై స్థిరమయిన మనస్సు గలవారలై పెక్కుకొమ్మలు గలవృక్షములను శిలలును జేకొని రాక్షసుల వధించిరి. ౬౩

అప్పుడు రాక్షసులకును వానరులకును పోరు భయంకరంబయ్యె. ౬౪

క్షురప్రైరర్ధచన్ద్రైశ్చ భల్లైశ్చ నిశితైశ్శరైః,
రాక్షసా వానరేన్ద్రాణాం చిచ్ఛిదుః పాదపాన్ శిలాః. ౬౫

వికీర్ణైః పర్వతాగ్రైశ్చ ద్రుమైశ్ఛిన్నైశ్చ సంయుగే,
హతైశ్చ కపిరక్షోభి ర్దుర్గమా వసుధాఽభవత్. ౬౬
తే వానరా గర్వితహృష్టచేష్టా
స్సఙ్గ్రామమాసాద్య భయం విముచ్య,
యుద్ధం తు సర్వే సహ రాక్షసై స్తై
ర్నానాయుధా శ్చక్రు రదీనసత్త్వాః. ౬౭
తస్మిన్ ప్రవృత్తే తుములే విమర్దే
ప్రహృష్యమాణేషు వలీముఖేషు,
నిపాత్యమానేషు చ రాక్షసేషు
మహర్షయో దేవగణా శ్చ నేదుః. ౬౮
తతో హయం మారుతతుల్యవేగ
మారుహ్య శక్తిం నిశితాం ప్రగృహ్య,
నరాన్తకో వానరరాజసైన్యం
మహార్ణవం మీన ఇవావివేశ. ౬౯
స వానరాన్ సప్త శతాని వీరః
ప్రాసేన దీప్తేన వినిర్బిభేద,
ఏకః క్షణేనేన్ద్రరిపు ర్మహాత్మా
జఘాన సైన్యం హరిపుఙ్గవానామ్. ౭౦
దదృశుశ్చ మహాత్మానం హయపృష్ఠే ప్రతిష్ఠితమ్,
చరన్తం హరిసైన్యేషు విద్యాధరమహర్షయః. ౭౧
స తస్య దదృశే మార్గో మాంసశోణితకర్దమః,

రాక్షసులు అర్ధచంద్రాకారబాణంబులచేతను బల్లెములచేతను తీక్ష్ణంబులగు నితరబాణంబులచేతను వానరోత్తములు ప్రయోగించు వృక్షంబులను శిలలను ఛేదించిరి. ౬౫

యుద్ధమునందు పిఱిగిపడిన పర్వతశిఖరంబులచేతను ఛిన్నంబులగు వృక్షములచేతను హతులయిన వానర రాక్షసులచేతను నిండి భూమి దుర్గమంబయ్యె.

మహాబలశాలులగు సావానరులందఱు గర్వసంతోషంబులతోఁ గూడినవారలయి యుద్ధభూమినొంది నిర్భయులయి రాక్షసుల నానావిధాయుధంబులు పెఱికికొని వానింగొని యారాక్షసులతోఁగూడ యుద్ధంబు గావించిరి.

ఇట్లు దొమ్మియుద్ధమునందు వానరులు సంతోషంబు నొందుటయును రాక్షసులు త్రోయఁబడుటయునుజూచి మహర్షులును దేవతలును సంతోషంబున నఱచిరి. ౬౭

అంత నరాంతకుఁడు వాయువేగంబగుగుఱ్ఱము నారోహించి తీక్ష్ణంబగు శక్తింగొని మహాసముద్రంబును మత్స్యంబు ప్రవేశించునట్లు వానరసైన్యమును బ్రవేశించెను. ౬౯

పరాక్రమవంతుఁడగు నానరాంతకుఁడు దీప్తంబగు శక్తిచే నేడువందలవానరులను వధించెను; అట్లు మహాబలుఁడగు నానరాంతకుఁ డొకఁడు క్షణమాత్రంబున వానరసైన్యంబునుగొట్టి చీకాకుపఱిచెను. ౭౦

విద్యాధరులు మహర్షులు మున్నగువారలు గుఱ్ఱంబుపైఁ గూర్చుండి వానరసైన్యంబుల విహరించుచున్న మహాబలుఁడగు నరాంతకుం జూచిరి. ౭౧

ఆ నరాంతకునిమార్గము మాంసశోణితమయంబై చచ్చి నేలంబడియుండు

పతితైగ పర్వతాకారై ర్వానరై రభిసంవృతః. ౭౨
యావ ద్విక్రమితుం బుద్ధిం చక్రుగి ప్లవగపుఙ్గవాః,
తావదేతావతిక్రమ్య నిర్బిభేద నరాన్తకః. ౭౩
జ్వలన్తం ప్రాస ముద్యమ్య సంగ్రామాగ్రే నరాన్తకః,
దదాహ హరిసైన్యాని వనానీవ విభావసుః. ౭౪
యావ దుత్పాటయామాసు ర్వృక్షాన్ శైలా న్వనౌకసః,
తావ త్ప్రాసహతాగ పేతు ర్వజ్రకృత్తా ఇవాచలాః. ౭౫

దిక్షు సర్వాసు బలవా న్విచచార నరాన్తకః,
ప్రమృద్నన్ సర్వతో యుద్ధే ప్రావృట్కాలే యథానిలః. ౭౬

న శేకు ర్ధావితుం వీరా న స్థాతుం స్పన్దితుం భయాత్,
ఉత్పతన్తం స్థితం యాన్తం సర్వాన్వివ్యాథ వీర్యవాన్. ౭౭

ఏకేనాన్తకకల్పేన ప్రాసేనాదిత్యతేజసా,
భిన్నాని హరిసైన్యాని నిపేతు ర్ధరణీతలే. ౭౮
వజ్రనిష్పేషసదృశం ప్రాసస్యాభినిపాతనమ్,
నశేకు ర్వానరా స్సోఢుం తే వినేదు ర్మహాస్వనమ్. ౭౯
పతతాం హరివీరాణాం రూపాణి ప్రచకాశిరే,
వజ్రభిన్నాగ్రకూటానాం శైలానాం పతతా మివ. ౮౦
యే తు పూర్వం మహాత్మానగి కుమ్భకర్ణేన పాతితాః,
తే స్వస్థా వానరశ్రేష్ఠా స్సుగ్రీవ ముపతస్థిరే. ౮౧
విప్రేక్షమాణ స్సుగ్రీవో దదర్శ హరివాహినీమ్,
నరాన్తకభయత్రస్తాం విద్రవన్తీ మిత స్తతః. ౮౨

పర్వతాకారులగు వానరుల కళేబరంబులచే భయంకరంబై చూడనొప్పెను.

ఈ వానరోత్తములు పరాక్రమింపఁ దలంచినంతలో నరాంతకుఁడు దానిందెలిసి వారలు ప్రయత్నించుటకుమున్నె వారల వధింపుచుండెను. ౭౩

నరాంతకుఁడు యుద్ధమధ్యంబున మండుచున్నట్లున్న ప్రాసంబుంబట్టుకొని దావానలంబువనంబుల దహించునట్లు వానరసైన్యంబులను దహించెను.

వానరులు వృక్షంబులనుగాని పర్వతంబులనుగాని పెఱుకునంతలోపలనే వారలు నరాంతకుని ప్రాసంబుచేఁ బొడువఁబడినవారలై వజ్రముచే ఛిన్నంబులగు పర్వతంబులకరణి నేలంగూలిరి. ౭౫

బలవంతుఁడగు నరాంతకుఁడు యుద్ధంబున వానరసేనల నన్నియు మర్దించుచు వర్షాకాలవాయువువలె ఎదురులేక అన్నిదిక్కులందును సంచరించుచుండెను. ౭౬

వానరవీరులు భయంబునఁజేసి పరుగెత్తుటకుఁగాని నిలుచుటకుఁగాని కదలుటకుఁగాని యశక్తులైరి; పరాక్రమవంతుఁడగు నరాంతకుఁడు ఎగురుచున్నవానిని నిలుచున్నవానిని పోవుచున్నవాని నందఱను ఒక్కపెట్టఁగొట్టెను.

మృత్యువువంటిదియు సూర్యతేజంబుఁగు నాయొక్క ప్రాసముచే వానరసైన్యము లన్నియు భిన్నములయి నేలఁబడినవి. ౭౮

వానరులు వజ్రాయుధముయొక్క దెబ్బతో సమానమయిన యాప్రాసముయొక్క దెబ్బను సహింపఁజాలక మహాధ్వనిగలుగునట్లు అఱచిరి. ౭౯

అప్పుడు వానరవీరులు నరాంతకునిచేఁ బ్రాసహతులై వజ్రాయుధముచే భిన్నములగు శిఖరములుగల పర్వతంబులవలె నేలంబడిరి. ౮౦

మున్ను కుంభకర్ణునిచే మూర్ఛితులయి పడియుండిన మహాబలశాలులగు వానరోత్తములు ఈలోపల మూర్ఛదేఱి సుగ్రీవునియొద్ద నిలిచిరి. ౮౧

సుగ్రీవుఁడు నలుప్రక్కలంజూచి నరాంతకుని భయంబున ఇట్టటు పాఱుచున్న వానరసేనం జూచెను. ౮౨

విద్రుతాం వాహినీం దృష్ట్వా స దదర్శ నరాన్తకమ్,
గృహీతప్రాసమాయాన్తం హయపృష్ఠే ప్రతిష్ఠితమ్. ౨౩
అథోవాచ మహాతేజా స్సుగ్రీవో వానరాధిపః,
కుమార మఙ్గదం వీరం శక్రతుల్యపరాక్రమమ్. ౨౪

గచ్ఛ త్వం రాక్షసం వీరో యోఽసౌ తురగ మాస్థితః,
క్షోభయన్తం హరిబలం క్షిప్రం ప్రాణైర్వియోజయ. ౨౫

స భర్తు ర్వచనం శ్రుత్వా నిష్పపాతాఙ్గద స్తతః,
అనీకాన్మేఘసంకాశా న్మేఘానీకాదివాంశుమాన్. ౨౬

శైలసంఘాతసంకాశో హరీణాముత్తమోఽఙ్గదః,
రరాజాఙ్గదసన్నద్ధ స్సధాతురివ పర్వతః. ౨౭

నిరాయుధో మహాతేజాః కేవలం నఖదంష్ట్రవాన్,
నరాన్తక మభిక్రమ్య వాలిపుత్త్రోఽబ్రవీద్వచః. ౨౮

తిష్ఠ కిం ప్రాకృతైరేభిర్హరిభి స్త్వం కరిష్యసి,
అస్మి న్వజ్రసమస్పర్శం ప్రాసం క్షిప మమోరసి. ౨౯
అఙ్గదస్య వచః శ్రుత్వా ప్రచుక్రోధ నరాన్తకః,
సందశ్య దశనై రోష్ఠం వినిశ్వస్య భుజఙ్గవత్. ౩౦
అభిగమ్యాఙ్గదం క్రుద్ధో వాలిపుత్త్రం నరాన్తకః,
ప్రాసం సమావిధ్య తదాఙ్గదాయ
సముజ్జ్వలన్తం సహసోత్ససర్జ. ౩౧

ఆ సుగ్రీవుఁడు అట్లు భయంబునం బరుగెత్తుచున్న తన సేనం జూచి గుఱ్ఱంబుమీఁదఁ గూర్చుండి ప్రాసంబు చేఁబట్టి వచ్చుచున్న నరాంతకుఁ గనెను.

అంత మహాపరాక్రమశాలియు వానరరాజుండునగు సుగ్రీవుఁడు ఇంద్రసుతుంబోలె మహాపరాక్రమంబుగల యువరాజుండగు నంగదుం జూచి యిట్లని చెప్పెను. ౧౪

నీవు పోయి అదిగో గుఱ్ఱంబుపైఁ గూర్చుండి వానరసేన నంతయుఁ జీకాకుపఱచుచున్న వీరుఁడగు నారాక్షసుని వధింపుము. అని సుగ్రీవుఁ డంగదునితోఁ జెప్పెను. ౧౫

అంత ఆ యంగదుఁడు వానరరాజుమాటను విని మేఘసమూహమునుండి సూర్యుఁడు వెడలివచ్చునట్లు మేఘాకారంబయిన వానరసైన్యమునుండి వెడలెను. ౧౬

అనేకపర్వతముల సమూహమంతటి యాకారముగల వానరోత్తముఁడగు నాయంగదుఁడు బాహుపురులు దాల్చియుండుటచేత గైరికధాతువులతోఁ గూడిన పర్వతంబుకరణిఁ బ్రకాశించెను. ౧౭

వాలికుమారుఁడగు నా యంగదుఁడు ఏ యాయుధంబును దీసికొనక నఖదంతములు మాత్రమే యాయుధంబులుగాఁ గలవాఁడై నరాంతకుని యొద్దకుఁబోయి యిట్లని చెప్పెను. ౧౮

నిలువుము; ఈయల్పవానరులతో నీకేమిపని? వజ్రసమానంబగు నీప్రాసమును నావక్షంబుపై వేయుము. అని యంగదుఁడు నరాంతకునితోఁ జెప్పెను.

నరాంతకుఁడు అంగదునిమాటను విని పండ్లచేఁ బెదవిఁ గొఱుకుకొని కృష్ణసర్పమువలె నిట్టూర్పులుపుచ్చుచు మిక్కిలియుఁ గుపితుఁడయ్యెను.

నరాంతకుఁ డట్లు కుపితుఁడై వాలిపుత్త్రుఁడగు నంగదునిమీఁదికిఁబోయి మండుచున్న ప్రాసమును గిఱగిఱం ద్రిప్పి వేగంబున నంగదునిపై వేసెను. ౨౧

స వాలిపుత్త్రోరసి వజ్రకల్పే
బభూవ భగ్నో న్యపతచ్చ భూమౌ,
తం ప్రాస మాలోక్య తదా విభగ్నం
సుపర్ణకృత్తోరగభోగకల్పమ్. ౯౨
తలం సముద్యమ్య స వాలిపుత్త్ర
స్తురఙ్గమం తస్య జఘాన మూర్ధ్ని,
నిమగ్నతాలు స్స్ఫుటితాక్షితారో
నిష్క్రాన్తజిహ్వోऽచలసన్నికాశః. ౯౩
స తస్య వాజీ నిపపాత భూమౌ
తలప్రహారేణ విశీర్ణమూర్ధా,
నరాన్తకః క్రోధవశం జగామ
హతం తురఙ్గం పతితం నిరీక్ష్య. ౯౪
సముష్టి ముద్యమ్య మహాప్రభావో
జఘాన శీర్షే యుధి వాలిపుత్త్రమ్,
అథాఙ్గదో ముష్టివిభిన్నమూర్ధా
సుస్రావ తీవ్రం రుధిరం భృశోష్ణమ్. ౯౫
ముహు ర్విజజ్వాల ముమోహ చాపి
సంజ్ఞాం సమాసాద్య విసిస్మియే చ,
అథాఙ్గదో వజ్రసమానవేగం
సంవర్త్య ముష్టిం గిరిశృఙ్గకల్పమ్. ౯౬
నిపాతయామాస తదా మహాత్మా
నరాన్తకస్యోరసి వాలిపుత్త్రః,
సముష్టినిష్పిష్టవిభిన్నవక్షాః
జ్వాలావమచ్ఛోణితదిగ్ధగాత్రః. ౯౭

ఆప్రాసము వజ్రసమానమగు నంగదుని వక్షస్థలముదాఁకి విఱిగి నేలం బడెను.

వాలికుమారుఁడగు నాయంగదుఁడు గరుత్మంతునిచే ఖండింపబడు సర్పమువలె విఱిగిపడిన యాప్రాసముంజూచి యఱచేయి నెత్తి యతనిగుఱ్ఱము నెత్తిమీఁదం గొట్టెను. ౯౨

పర్వతాకారమగు నానరాంతకునిగుఱ్ఱము అంగదుని యఱచేతిదెబ్బకు తలపగిలి, దవడలు లోనికిఁబోయి, కంటిగ్రుడ్లు పగిలి, నాలుకవెలువడ నేలం గూలెను. ౯3

మహాప్రభావుఁడగు నరాంతకుఁడు తనగుఱ్ఱము హతమై నేలంగూలుటను జూచి పరమకుపితుడై పిడికిలి నెత్తి యుద్ధంబున వాలిపుత్రుఁడగు నంగదుని తలపైఁ బొడిచెను. ౯౪

అంత నంగదుఁడు నరాంతకుని పిడికిటిపోటునకు తలపగిలి వేఁడినెత్తురు కార్చుచు పలుమాఱు కోపంబునొందియు మూర్ఛిల్లియుం దుదకుఁ దెలివొంది నరాంతకునిబలమున కచ్చెరువు నొందెను. ౯౫

అంత మహాబలుఁడగు వాలికుమారుఁడైన యంగదుఁడు వజ్రముం బోలిన పర్వతశిఖరాకారంబగు పిడికిలి నలవరించి నరాంతకుని రొమ్ముపైఁ బొడిచెను. ౯౬

ఆనరాంతకుఁడు అంగదుని పిడికిటిపోటుచే రొమ్ముపగిలియు నలంగియుఁ బైకుద్గమించు నెత్తురుధారలందోఁగుచు వజ్రాయుధముచే నఱుకఁబడిన

నరాన్తకో భూమితలే పపాత
యథాఽచలో వజ్రనిపాత భగ్నః.
అథాన్తరిక్షే త్రిదశోత్తమానాం
వనౌకసాం చైవ మహాప్రణాదః. ౯౨
బభూవ తస్మి న్నిహతేఽగ్ర్యవీరే
నరాన్తకే వాలిసుతేన సఙ్ఖ్యే,
అథాఙ్గదో రామమనః ప్రహర్షణం
సుదుష్కరం తత్కృతవా న్హి విక్రమమ్. ౯౯
విసిస్మియే సోఽప్యతివీర్యవిక్రమః
పునశ్చ యుద్ధే స బభూవ హర్షితః.

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే ఏకోనసప్తతితమస్సర్గః. ౬౯.

---

సప్తతితమస్సర్గః.

నరాన్తకం హతం దృష్ట్వా చుక్రుశు ర్నైరృతర్షభాః,
దేవాన్తక స్త్రిమూర్ధాచ పౌలస్త్య శ్చ మహోదరః. ౧
ఆరూఢో మేఘసంకాశం వారణేన్ద్రం మహోదరః.
వాలిపుత్త్రం మహావీర్య మభిదుద్రావ వీర్యవాన్. ౨

భ్రాతృవ్యసనసంతప్త స్తదా దేవాన్తకో బలీ,
ఆదాయ పరిఘం దీప్త మఙ్గదం సమభిద్రవత్. 3
రథమాదిత్యసంకాశం యుక్తం పరమవాజిభిః,
ఆస్థాయ త్రిశిరా వీరో వాలిపుత్త్ర మథాభ్యయాత్. ४

స త్రిభి ర్దేవదర్పఘ్నై ర్నైరృతేన్ద్రై రభిద్రుతః,

పర్వతము భంగి నేలంగూలెను. ౯౭

అంత వీరోత్తముఁడగు నాసరాంతకుని అంగదుఁడు యుద్ధంబున వధింపఁగానే దేవతలును వానరులును గాంచు సంతోషధ్వనులు నింగిముట్టి చెలంగినవి. ౯౮

అంత నంగదుఁడు రామునిమనస్సునకు సంతోషముగలుగునట్లుగా దుష్కరమయిన పరాక్రమంబు చేయుటవలన మహాపరాక్రముఁడగు రాముఁడు ఆశ్చర్యమునొంది శ్లాఘించెను; ఆయంగదుఁడును సంతుష్టుఁడై మరల యుద్ధసన్నద్ధుఁడయ్యెను. ౯౯

ఇది యడువదితొమ్మిదవసర్గము.

## డెబ్బదియవసర్గము.

రాక్షసోత్తములగు దేవాంతకుఁడును త్రిశిరుఁడును మహోదరుఁడును నరాంతకుఁడు హతుఁడగుటను జూచి దుఃఖంబున నడచిరి. ౧

మహాపరాక్రమశాలియగు మహోదరుఁడు మేఘసమానంబగు నుత్తమమయిన యేనుఁగు నారోహించి మహాపరాక్రమశాలియగు వాలికుమారుఁడయిన యంగదునిం దఱిమెను. ౨

అట్లు బలవంతుఁడగు దేవాంతకుఁడు శోకమువు హతుఁడగుటను దుఃఖితుఁడై దేదీప్యమానంబగు పరిఘంబుగొని యంగదునిమీఁది కడరెను. ౩

అంత వీరుఁడగు త్రిశిరుండు సూర్యబింబమువలె వెలుఁగుచున్న యుత్తమాశ్వంబులు పూన్చిన రథంబునెక్కి వాలిపుత్త్రుఁడగు నంగదుని కెదిరిపోయెను. ౪

ఆ యంగదుఁడు అట్లు దేవతలగర్వంబు నణంచునట్టి రాక్షసోత్తములు ముగ్గురు తనమీఁదికి వచ్చుటంజూచి పెద్దకొమ్మలుగల వృక్షంబు నొకటిం

వృక్ష ముత్పాటయామాస మహావిటప మఙ్గదః. ౫
దేవాన్తకాయ తం వీర శ్చిక్షేప సహసాఙ్గదః,
మహావృక్షం మహాశాఖం శక్రో దీప్తమివాశనిమ్. ౬
త్రిశిరా స్తం ప్రచిచ్ఛేద శరై రాశీవిషోపమైః,
స వృక్షం కృత్త మాలోక్య ఉత్పపాత తదాఙ్గదః. ౭

స వవర్ష తతో వృక్షాన్ శైలాంశ్చ కపికుఞ్జరః,
తాం స్ప్రచిచ్ఛేద సంక్రుద్ధ స్త్రిశిరా నిశితై శ్శరైః. ౮

పరిఘాగ్రేణ తా న్వృక్షా న్బభఞ్జ చ సురాన్తకః,
త్రిశిరా శ్చాఙ్గదం వీర మభిదుద్రావ సాయకైః. ౯

గజేన సమభిద్రుత్య వాలిపుత్త్రం మహోదరః,
జఘానోరసి సంక్రుద్ధ స్తోమరై ర్వజ్రసన్నిభైః. ౧౦
దేవాన్తకశ్చ సంక్రుద్ధః పరిఘేణ తదాఙ్గదమ్,
ఉపగమ్యాభిహత్యాశు వ్యపచక్రామ వేగవాన్. ౧౧

స త్రిభి ర్నైరృతశ్రేష్ఠై ర్యుగప త్సమభిద్రుతః,
న వివ్యథే మహాతేజా వాలిపుత్త్రః ప్రతాపవాన్. ౧౨

స వేగవా న్మహావేగం కృత్వా పరమదుర్జయః,
తలేన భృశ ముత్పత్య జఘానాస్య మహాగజమ్. ౧౩

తస్య తేన ప్రహారేణ నాగరాజస్య సంయుగే,
పేతతు ర్లోచనే తస్య విననాద స వారణః. ౧౪

బెల్లగించెను. ౫

వీరుఁడగు నంగదుఁడు దేవేంద్రుఁడు వజ్రాయుధమును బ్రయోగించు నట్లు పెద్దకొమ్మలుగల యొకమహావృక్షమును శీఘ్రంబున దేవాంతకునిపై వైచెను.

త్రిశిరుఁడు తీక్ష్ణంబులగు బాణంబులచే నావృక్షమును ఛేదించెను; అంగదుఁడు వృక్షంబు ఛేదింపఁబడుటను జూచి యంత నాకాశంబున కుద్గమించెను ౬

అంత వానరశ్రేష్ఠుండగు నాయంగదుఁడు వృక్షంబులను బర్వతంబు లను గురియఁ ద్రిశిరుఁడు సంక్రుద్ధుఁడై వానినన్నిటిని గఱుకుబాణంబుల ఖండించెను. ౭

దేవాంతకుఁడు పరిఘాగ్రంబున నంగదుఁడు ప్రయోగించు వృక్షం బులఁ దట్టిచేయుచుండెను. త్రిశిరుఁడు బాణంబులచే వీరుఁడగు నంగదుని నొప్పించెను. ౮

మహోదరుఁడు పరమకుపితుఁడై వీరుఁగుడు అంగదునిమీఁదికిఁ దఱిమి వజ్రసమానంబులగు తోమరంబులచే నంగదుని ఱొమ్ముపం గొట్టెను. ౧౦

వేగవంతుఁడగు దేవాంతకుఁడును క్రుద్ధుఁడై యప్పుడు అంగదుని మీఁదికిఁ బోయి శీఘ్రమునఁ బరిఘముతో నంగదునిం బ్రహరించి యవ కాశముగల్గుటకై వెనుకకుఁ బోయెను. ౧౧

మహాతేజుఁడును మహాపరాక్రమశాలియు నగు వాలికుమారుఁడైన యయ్యంగదుఁడు అ ట్లేకకాలమున ముగ్గురు రాక్షసోత్తములచే నెదిరింపఁ బడియు నెంతమాత్రము వ్యథనొందలేదు. ౧౨

వేగవంతుఁడును బరిమదుర్జయుఁడు నగు నాయంగదుఁడు మహా వేగంబు నవలంబించి పైకెగిరి మహోదరుఁ డెక్కియున్న మహాగజంబు నఱ చేతం జఱచెను. ౧౩

యుద్ధంబున నాయంగదుని దెబ్బకు ఆమహోదరుని యేనుఁగుకన్నులం డాడును వీడిపడినవి; ఆ యేనుఁగును అఱచెను. ౧౪

విషాణం చాస్య నిష్కృష్య వాలిపుత్త్రో మహాబలః,
దేవాన్తక మభిప్లుత్య తాడయామాస సంయుగే. ౧౫
స విహ్వలితసర్వాఙ్గో వాతోద్ధూత ఇవ ద్రుమః,
లాక్షారససవర్ణం చ సుస్రావ రుధిరం ముఖాత్. ౧౬
అథాశ్వాస్య మహాతేజాః కృచ్ఛ్రా ద్దేవాన్తకో బలీ,
ఆవిధ్య పరిఘం ఘోర మాజఘాన తదాఙ్గదమ్. ౧౭

పరిఘాభిహతశ్చాపి వానరేన్ద్రాత్మజ స్తదా,
జానుభ్యాం పతితో భూమౌ పునరేవోత్పపాత హ. ౧౮
త ముత్పతన్తం త్రిశిరా స్త్రిభి ర్బాణై రజిహ్మగైః,
ఘోరై ర్హరిపతేః పుత్త్రం లలాటేఽభిజఘాన హ. ౧౯
తతోఽఙ్గదం పరిక్షిప్తం త్రిభి ర్నైరృతపుఙ్గవైః,
హనూమా నపి విజ్ఞాయ నీల శ్చాపి ప్రతస్థతుః. ౨౦
తత శ్చిక్షేప శైలాగ్రం నీల స్త్రిశిరసే తదా,
తద్రావణసుతో ధీమా న్బిభేద నిశితై శ్శరైః. ౨౧

తద్బాణశతనిర్భిన్నం విదారితశిలాతలమ్,
సవిస్ఫులిఙ్గం సజ్వాలం నిపపాత గిరే శ్శిరః. ౨౨
తతో జృమ్భిత మాలోక్య హర్షా ద్దేవాన్తక స్తదా,
పరిఘేణాభిదుద్రావ మారుతాత్మజ మాహవే. ౨౩

త మాపతన్త ముత్ప్లుత్య హనూమాన్మారుతాత్మజః,
ఆజఘాన తదా మూర్ధ్ని వజ్రకల్పేన ముష్టినా. ౨౪

శిరసి ప్రహర న్వీర స్తదా వాయుసుతో బలీ,

మహాబలశాలియగు నంగదుఁడు మహోదరుని యేనుఁగుదంతమును బెఱికి యుద్ధంబున దేవాంతకునిమీఁదికి దుమికి దానిచే నతనిం గొట్టెను. ౧౫

అంత దేవాంతకుఁడు వాయువుచేఁ ద్రోయఁబడిన వృక్షంబుపోలెను నిశ్చేష్టుఁడై పడి నోటనుండి లత్తుకరసమువంటి నెత్తురుగ్రక్కెను. ౧౬

అంత మహాతేజుఁడును మహాబలుఁడు నగుదేవాంతకుఁ డెట్టకేలకు నూఱటనొంది భయంకరాకారంబగు పరిఘంబు గిఱగిఱం ద్రిప్పి యంగదుఁ గొట్టెను. ౧౭

అప్పుడు వానరరాజపుత్త్రుఁడగు నంగదుఁడు పరిఘంబుచేఁ గొట్టఁబడియుఁ మోఁకాళ్లు భూమియంట బోరగిలంబడి తక్షణంబున నే లేచెను. ౧౮

త్రిశిరుఁడు వానరరాజపుత్త్రుఁడను నంగదుఁడు లేచుటంజూచి యతనిని భయంకరంబులగు మూఁడుబాణంబులచే నొసటంగొట్టెను. ౧౯

అంత అంగదునొక్కని ముగ్గురురాక్షసోత్తములు చుట్టుకొనియున్నారని తెలిసి హనుమంతుఁడును నీలుఁడును దోడ్పడిరి. ౨౦

అంత నీలుఁడు త్రిశిరునిమీఁద నొక్కపర్వతశిఖరంబు నేయ బుద్ధిమంతుఁడగు రావణపుత్త్రుఁడు కఱకుబాణంబులచే దానినిం దునియలు గావించెను. ౨౧

అప్పర్వతశిఖరము త్రిశిరునిబాణంబులచే భిన్నమై తాళ్ళన్నియుఁ బగిలి మిఱుంగుఱులతోను జ్వాలలతోను నొప్పుచు నేలఁబడెను. ౨౨

అంత నప్పుడు దేవాంతకుఁడు ఆపర్వతశిఖరంబు తునియలయి పడుటం జూచి సంతోషంబున పరిఘంబుగొని యుద్ధంబున వాయుకుమారుఁడగు హనుమంతునిమీఁదకిఁ బోయెను. ౨౩

అప్పుడు వాయుపుత్త్రుఁడగు హనుమంతుఁడు తనపైకి దేవాంతకుఁడు వచ్చుటంజూచి యతనిపైకెగిరి యతని శిరస్సునందు వజ్రతుల్యంబగు పిడికిటం బొడిచెను. ౨౪

అప్పుడు వీరుఁడును బలవంతుఁడునగు వాయుపుత్త్రుఁడైన హనుమం

నాదేనాకమ్పయచ్చైవ రాక్షసాన్ స మహాకపిః. ౨౫

స ముష్టినిష్పిష్టవికీర్ణమూర్ధా
నిర్వాన్తదన్తాక్షివిలమ్బిజిహ్వః,
దేవాన్తకో రాక్షసరాజసూను
ర్గతాసు రుర్వ్యాం సహసా పపాత. ౨౬
తస్మిన్హతే రాక్షసయోధముఖ్యే
మహాబలే సంయతి దేవశత్రౌ,
క్రుద్ధ స్త్రిమూర్ధా నిశితాగ్ర ముగ్రం
వవర్ష నీలోరసి బాణవర్షమ్. ౨౭
మహోదరస్తు సంక్రుద్ధః కుఞ్జరం పర్వతోపమమ్,
భూయ స్సమధిరుహ్యాశు మన్దరం రశ్మిమా నివ. ౨౮

తతో బాణమయం వర్షం నీలస్యోరస్యపాతయత్,
గిరౌ వర్షం తటిచ్చక్రచాపవానివ తోయదః, ౨౯

తత శ్శరౌఘై రభివర్ష్యమాణో
విభిన్నగాత్రః కపిసైన్యపాలః,
నీలో బభూవాథ నిసృష్టగాత్రో
విష్టమ్భిత స్తేన మహాబలేన. 30
తత స్తు నీలః ప్రతిలభ్య సంజ్ఞాం
శైలం సముత్పాట్య సవృక్షషణ్డమ్,
తత స్సముత్పత్య భృశోగ్రవేగో
మహోదరం తేన జఘాన మూర్ధ్ని. 31

తుఁడు దేవాంతకుని శిరస్సుపై గుద్ది రాక్షసులందఱు భయంబున వడఁకునట్లు సింహనాదంబుచేసెను. ౨౫

రాక్షసరాజుఁడగు రావణునిపుత్త్రుఁడగు నాదేవాంతకుఁడు హనుమంతుని పిడికిటిపోటునకు తల వెఱువ్రక్కలయి దంతములును నేత్రములును రాల నాలుక వ్రేలుకాడ గతప్రాణుఁడై శీఘ్రంబున నేలంగూలెను. ౨౬

రాక్షసవీరులలో నుత్తముఁడును మహాబలుఁడును దేవశత్రువునగు నాదేవాంతకుఁడు యుద్ధంబున హతుఁడగుటను జూచి త్రిశిరుఁడు కుపితుఁడై నీలుని వక్షస్స్థలంబుపై తీక్ష్ణంబులగు వెక్కు బాణంబులఁ గురిపించెను. ౨౭

మహోదరుఁడు మిక్కిలియుఁ గుపితుఁడై మందరపర్వతంబును సూర్యుఁ డారోహించునట్లు మరల మఱియొకపర్వతాకారమయిన యేనుఁగు నారోహించి యుద్ధంబునకు వచ్చెను. ౨౮

అంత మెఱపులసమూహములతోను ఇంద్రధనుస్సుతోను గూడిన మేఘము పర్వతంబుమీఁద వర్షంబుగురియునట్లు అమ్మహోదరుఁడు సమస్త భూషణంబులతో నొప్పుచు ధనుర్ధరుఁడై నీలునివక్షస్స్థలంబునందు బాణ వర్షంబు గురిపించెను. ౨౯

అంత వానరసేనానాయకుఁడగు నీలుఁడు మహాబలుఁడైన యమ్మహోదరునిచే నట్లు బాణంబువర్షంబుల నభివర్షితుఁడై దేహమంతయుం గాయంబులయి శిథిలములయిన యవయవములతో ఇట్టటుకదలలేక స్తంభితుఁడయ్యె. ౩౦

అంత భయంకరవేగుఁడగు నీలుఁడు కొంతవడికిం దెలివొంది వృక్ష సమూహాలంకృతంబగు నొకపర్వతంబుఁ బెల్లగించి మహావేగంబున నెగసివచ్చి మహోదరుని తలమీఁదం గొట్టెను. ౩౧

తత స్స శైలేన్ద్రనిపాతభగ్నో
మహోదర స్తేన మహాక్షిపేన,
విపోథితో భూమితలే గతాసుః
పపాత వజ్రాభిహతో యథాద్రిః. ౩౨
పితృవ్యం నిహతం దృష్ట్వా త్రిశిరా శ్చాపమాదదే,
హనూమన్తం చ సంక్రుద్ధో వివ్యాధ నిశితై శ్శరైః. ౩౩

స వాయుసూనుః కుపిత శ్చిక్షేప శిఖరం గిరేః,
త్రిశిరా స్త చ్ఛరై స్తీక్ష్ణై ర్బిభేద బహుధా బలీ. ౩౪

త ద్వ్యర్థం శిఖరం దృష్ట్వా ద్రుమవర్షం మహాకపిః,
విససర్జ రణే తస్మి న్రావణస్య సుతం ప్రతి. ౩౫

త మాపత న్త మాకాశే ద్రుమవర్షం ప్రతాపవాన్,
త్రిశిరా నిశితై ర్బాణై శ్చిచ్ఛేద చ ననాద చ. ౩౬
తతో హనూమా నుత్ప్లుత్య హయాం స్త్రిశిరస స్తదా,
విదదార నఖైః క్రుద్ధో నాగేన్ద్రం మృగరాడివ. ౩౭
అథ శక్తిం సమాదాయ కాళరాత్రి మివాన్తకః,
చిక్షేపానిలపుత్త్రాయ త్రిశిరా రావణాత్మజః. ౩౮
దివః క్షిప్తా మివోల్కాం తాం శక్తిం క్షిప్తా మసఙ్గతామ్,
గృహీత్వా హరిశార్దూలో బభఞ్జ చ ననాద చ, ౩౯

తాం దృష్ట్వా ఘోరసంకాశాం శక్తిం భగ్నాం హనూమతా,
ప్రహృష్టా వానరగణా వినేదు ర్జలదా ఇవ. ౪౦
తతః ఖడ్గం సముద్యమ్య త్రిశిరా రాక్షసోత్తమః,

అంత నమ్మహోదరుఁడు ఆపర్వతంబు దెబ్బకు తన యేనుఁగుతోఁగూడ దేహమంతయుం విఱిగి వజ్రాయుధహతంబగు పర్వతంబుకరణి గతప్రాణుండై నేలంగూలెను. 3౨

త్రిశిరుఁడు తనపినతండ్రియగు మహోదరుఁడు నిహతుఁడగుటం జూచి క్రుద్ధుఁడై ధనుస్సు గ్రహించి హనుమంతుని దీక్ష్ణబాణంబులం బ్రహరించెను. 33

ఆ హనుమంతుఁడు కోపించి పర్వతశిఖరం బొకటి ప్రయోగించెను; బలవంతుఁడగు త్రిశిరుఁడు కఱకుబాణంబుః బెక్కుప్రయ్యలుగా దానిఁ దునియలు గావించెను. 3౪

హనుమంతుఁడు తాను బ్రయోగించిన పర్వతశిఖరంబు వ్యర్థంబగుటం జూచి యయ్యుద్ధంబున రావణపుత్త్రుఁడగు త్రిశిరునిపై వృక్షంబులఁ గురిపించెను. 3౫

మహాపరాక్రమశాలియగు త్రిశిరుఁడు వృక్షవర్షంబు వచ్చుటంజూచి దాని నాకాశంబుననే కఱకుబాణంబులచే ఛేదించి సింహనాదంబు చేసెను.

అంత నప్పుడు హనుమంతుఁడు క్రుద్ధుఁడై యెరిగిపోయి మహాగజంబును సింహము చీల్చునట్లు త్రిశిరునిగుఱ్ఱమును నఖంబులచేఁ జీల్చివేసెను. 3౭

అంత రావణపుత్త్రుఁడగు త్రిశిరుఁడు యముండు కాళరాత్రిం బోలె శక్తింగొని వాయుకుమారుఁడగు హనుమంతునిపై వేసెను. 3౮

వానరోత్తముండుఁడగు హనుమంతుఁడు ఆకాశంబుననుండిపడు పెద్ద కొఱవి కట్టైవలెనున్న యాత్రిశిరుఁడు ప్రయోగించిన శక్తిని తన్నుదితాఁకక మున్నే దానింబట్టి విఱిచి సింహనాదంబు గావించెను. 3౯

అట్లు భయంకరాకారమయిన యాశక్తిని హనుమంతుఁడు విఱిచివేయుటంజూచి వానరులు సంతోషమునొంది మేఘంబులభంగి గర్జించిరి. ౪౦

అంత నప్పుడు రాక్షసవర్యుఁడగు త్రిశిరుఁడు ఖడ్గంబుదీసి వికాలం

నిజఘాన తదా వ్యూఢే వాయుపుత్త్రస్య వక్షసి. ౪౧
ఖడ్గప్రహారాభిహతో హనూమా న్మారుతాత్మజః,
ఆజఘాన త్రిశిరసం తలేనోరసి వీర్యవాన్. ౪౨
స తలాభిహత స్తేన స్రస్తహస్తాయుధో భువి,
నిపపాత మహాతేజా స్త్రిశిరా స్త్యక్తచేతనః. ౪౩
స తస్య పతతః ఖడ్గం సమాచ్ఛిద్య మహాకపిః,
ననాద గిరిసఙ్కాశ స్త్రాసయన్ సర్వనైరృతాన్. ౪౪

అమృష్యమాణ స్తం ఘోష ముత్పపాత నిశాచరః,
ఉత్పత్యచ హనూమన్తం తాడయామాస ముష్టినా. ౪౫
తేన ముష్టిప్రహారేణ సంచుకోప మహాకపిః,
కుపితశ్చ నిజగ్రాహ కిరీటే రాక్షసర్షభమ్. ౪౬
స తస్య శీర్షాణ్యసినా శితేన
కిరీటజుష్టాని సకుణ్డలాని,
క్రుద్ధః ప్రచిచ్ఛేద సుతోఽనిలస్య
త్వష్టుః సుతస్యేవ శిరాంసి శక్రః. ౪౭
తాన్యాయతాక్షాణ్యగసన్నిభాని
ప్రదీప్తవైశ్వానరలోచనాని,
పేతు శ్శిరాంసీన్ద్రరిపో ర్ధరణ్యాం
జ్యోతీంషి ముక్తాని యథాఽర్కమార్గాత్. ౪౮
తస్మి న్హతే దేవరిపౌ త్రిశీర్షే
హనూమతా శక్రపరాక్రమేణ,
నేదుః ప్లవఙ్గాః ప్రచచాల భూమి
రక్షాంస్యథో దుద్రువిరే సమన్తాత్. ౪౯
హతం త్రిశిరసం దృష్ట్వా తథైవ చ మహోదరమ్,

బగు హనుమంతుని వక్షస్స్థలంబుపైఁ గొట్టెను. ౮౧

పరాక్రమవంతుఁడగు వాయుకుమారుఁడు హనుమంతుఁడు ఖడ్గముచేఁ గొట్టఁబడినవాఁడై త్రిశిరునిఱొమ్ముపై నఱచేతం బ్రహరించెను. ౮౨

మహాపరాక్రమశాలియగు నాత్రిశిరుఁడు హనుమంతుని యఱచేతి దెబ్బకు మూర్ఛితుఁడై చేతియాయుధంబు జాఱిపడ నేలంబడెను. ౮౩

పర్వతాకారుఁడగు నా హనుమంతుఁడు అట్లు మూర్ఛితుఁడై నేలం బడుచున్న త్రిశిరునిచేతి ఖడ్గంబు పెఱికికొని సమస్తరాక్షసులును భయపడున ట్లు సింహనాదంబు గావించెను. ౮౪

త్రిశిరుఁడు హనుమంతుని సింహనాదంబు సహింపక లేచి హనుమంతునిఁ బిడికిటిపోటునం బొడిచెను. ౮౫

హనుమంతుఁడు ఆపిడికిపోటునకుఁ బరమకుపితుఁడై రాక్షసశ్రేష్ఠుఁడగు త్రిశిరుని గిరీటంబునుం బట్టుకొనెను. ౮౬

ఇంద్రుఁడు త్వష్ట్రపుత్రుఁడగు విశ్వరూపునితలలను ఖండించినట్లు ఆ హనుమంతుఁడు తీక్ష్ణంబగు నాఖడ్గంబుచే కిరీటకుండలాలంకృతంబులగు నా త్రిశిరునిశిరస్సుల మూఁడింటిని ఛేదించెను. ౮౭

మండుచున్న నిప్పువంటి నిడుదకన్నులుగలవియుఁ బర్వతాకారంబులు నగు నా యింద్రశత్రువగు త్రిశిరునితలలు మూఁడును ఆకాశంబుననుండి నక్షత్రములు పడునట్లు నేలంబడినవి. ౮౮

దేవశత్రువయిన యా త్రిశిరుని దేవేంద్రపరాక్రముఁడగు హనుమంతుఁడు వధింపఁగానే వానరులందఱు సంతోషంబున సింహనాదంబులు గావించిరి. భూమి చలనంబు నొందినది. రాక్షసులు భయపడి దిక్కులకుం బాఱిరి. ౮౯

అట్లు త్రిశిరుఁడును మహోదరుఁడును వధింపఁబడుటయుం అంతకు

హతౌ ప్రేక్ష్య దురాధర్షౌ దేవాన్తకనరాన్తకౌ. ౫౦
చుకోప పరమామర్షీ మత్తో రాక్షసపుఙ్గవః,

జగ్రాహార్చిష్మతీం ఘోరాం గదాం సర్వాయసీం శుభామ్. ౫౧
హేమపట్ట పరిక్షిప్తాం మాంసశోణిత ఫేనిలామ్,
విరాజమానాం వపుషా శత్రుశోణిత రఞ్జితామ్. ౫౨
తేజసా సంప్రదీప్తాగ్రాం రక్తమాల్య విభూషితామ్,
ఐరావత మహాపద్మ సార్వభౌమ భయావహామ్. ౫౩

గదా మాదాయ సంక్రుద్ధో మత్తో రాక్షసపుఙ్గవః,
హరీన్ సమభిదుద్రావ యుగాన్తాగ్ని రివ జ్వలన్. ౫౪
అథర్షభస్సముత్పత్య వానరో రావణానుజమ్,
మత్తానీకముపాగమ్య తస్థౌ తస్యాగ్రతో బలీ. ౫౫
తం పురస్తాత్ స్థితం దృష్ట్వా వానరం పర్వతోపమమ్,
ఆజఘానోరసి క్రుద్ధో గదయా వజ్రకల్పయా. ౫౬
స తయాఽభిహత స్తేన గదయా వానరర్షభః,
భిన్నవక్షా స్సమాధూత స్సుస్రావ రుధిరం బహు. ౫౭
స సంజ్ఞాం ప్రాప్య సుచిరా దృషభో వానరర్షభః,
అభిదుద్రావ వేగేన గదాం తస్య మహాత్మనః, ౫౮
గృహీత్వా తాం గదాం భీమా మావిధ్య చ పునఃపునః,
మత్తానీకం మహాత్మానం జఘాన రణమూర్ధని. ౫౯

స స్వయా గదయా భగ్నో విశీర్ణదశనేక్షణః,
నిపపాత తతో మత్తో వజ్రాహత ఇవాచలః. ౬౦

మున్ను దుర్ధర్షులయిన దేవాంతకుఁడును నరాంతకుఁడును హతులగుటయుం జూచి పరమకోపయుతుఁడగు రాక్షసోత్తముఁడైన మహాపార్శ్వుఁడు మిక్కిలియుం గోపము నొందెను. ౫౦

అమ్మహాపార్శ్వుఁడు భయంకరాకారంబును అంతయుం నినుముతోఁ జేయఁబడినదియుం జయకరంబును బంగారుకట్టులతో నొప్పుచున్నదియుం మాంస శోణితములచేఁ బూయఁబడినదియుఁ గాంతిచేఁ బ్రకాశించుచున్నదియుం శత్రు రక్తముచే నెఱ్ఱగానుండునదియుం దేదీప్యమానమయిన యగ్రముగలదియుం రక్తపుష్పమాలికచే నలంకరింపఁబడినదియు నైరావతము పుండరీకము సార్వభౌమమను నీదిగ్గజంబులకు భయంబు గల్గించునదియుం నగు గదం గ్రహించెను.

రాక్షసశ్రేష్ఠుఁడగు నామహాపార్శ్వుఁడు పరమకుపితుఁడై గద చేతం గొని ప్రలయకాలానలునిపగిది మండుచు వానరులమీఁదికిఁ బోయెను. ౫౪

అంత బలవంతుఁడగు ఋషభుఁడు ఒక్కయెగురున రావణుని తమ్ముఁడగు మహాపార్శ్వుని జేరి యతనిముందట నిలిచెను. ౫౫

అమ్మహాపార్శ్వుఁడు పర్వతాకారుఁడగు ఋషభుఁడు తన ముందట నిలుచుటం జూచి కోపించి వజ్రసమానంబగు గదచే నతనిఱొమ్మునఁ గొట్టెను.

వానరశ్రేష్ఠుఁడగు ఋషభుఁడు అట్లు మహాపార్శ్వునిచే గదతోఁ గొట్టఁబడినవాఁడై ఱొమ్ముపగిలి యధికముగా నెత్తురుగాఱఁ జలనంబు నొందెను.

వానరశ్రేష్ఠుఁడగు ఋషభుఁడు ఎట్టకేలకు మూర్ఛదేఱి వేగంబున మహాబలుఁడగు నామహాపార్శ్వుని గదమీఁదికిఁ బరుగెత్తెను. ౫౭

ఆ ఋషభుఁ డట్లు భయంకరాకారమయిన యాగదం బెఱికికొని పలుమాఱు గిఱగిఱం ద్రిప్పి దానిచే యుద్ధంబున మహాబలుఁడగు మహాపార్శ్వుం గొట్టెను. ౫౯

అంత నామహాపార్శ్వుఁడు తన గదచేతనే కొట్టబడినవాఁడై దంతములును నేత్రములును రాలి వజ్రాయుధహతంబగు పర్వతంబుపగిది నేలం గూలెను. ౬౦

విశీర్ణనయనే భూమౌ గతసత్త్వే గతాయుషి,
పతితే రాక్షసే తస్మిన్విద్రుతం రాక్షసం బలమ్. ౬౧

తస్మిన్హతే భ్రాతరి రావణస్య
తన్నైఋతానాం బల మర్ణవాభమ్,
త్యక్త్వాయుధం కేవలజీవితార్థం
దుద్రావ భిన్నార్ణవసన్నికాశమ్. ౬౨

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే సప్తతితమస్సర్గః. ౭౦.

---

ఏకసప్తతితమస్సర్గః.

స్వబలం వ్యథితం దృష్ట్వా తుములం రోమహర్షణమ్,
భ్రాతౄంశ్చ నిహతాన్ దృష్ట్వా శక్రతుల్యపరాక్రమాన్. ౧

పితృవ్యౌ చాపి సన్దృశ్య సమరే సన్నిషూదితౌ,
యుద్ధోన్మత్తం చ మత్తం చ భ్రాతరౌ రాక్షసర్షభౌ. ౨

చుకోప చ మహాతేజా బ్రహ్మదత్తవరో యుధి,
అతికాయోఽద్రిసఙ్కాశో దేవదానవదర్పహా. ౩

స భాస్కరసహస్రస్య సఙ్ఘాత మివ భాస్వరమ్,
రథ మాస్థాయ శక్రారి రభిదుద్రావ వానరాన్. ౪

స విస్ఫార్య మహచ్చాపం కిరీటీ మృష్టకుణ్డలః,
నామ విశ్రావయామాస ననాద చ మహాస్వనమ్. ౫

తేన సింహప్రణాదేన నామవిశ్రావణేన చ,
జ్యాశబ్దేన చ భీమేన త్రాసయామాస వానరాన్. ౬

తే దృష్ట్వా దేహమాహాత్మ్యం కుమ్భకర్ణోఽయ ముత్థితః,
భయార్తా వానరా స్సర్వే సంశ్రయన్తే పరస్పరమ్. ౭

ఆమహాపార్శ్వుఁడు కన్నులు వీడిపడ గతబలుఁడై గతజీవితుఁడై నేలఁ బడినంతనే రాక్షససైన్యము భయంబునం బాఱెనది. ౬౧

ఆరావణుని తమ్ముఁడగు మహాపార్శ్వుఁడు హతుఁడుకాఁగానే సముద్ర సమానమయిన రాక్షససైన్యము ఆయుధంబులువిడిచి బ్రతికినంజాలునని చెల్లెలికట్టఁదాటిన సముద్రంబుపగిదిఁ బరుగెత్తెఁది. ౬౨

డెబ్బదియవసర్గము

---

## డెబ్బదియొకటవసర్గము.

అట్లు తమసైన్యమాతయు కలంగి విచ్చి రోమహర్షణంబుగాఁ బాఱుటయుఁ దేవేంద్రపరాక్రములగు తోఁబుట్టువులు వధింపఁబడుటయుఁ మఱియుఁ దనపినతండ్రులును రాక్షసోత్తములునయిన యున్నదమ్ములు మహోదరమహాపార్శ్వులు యుద్ధంబున నిహతులగుటయుంజూచి మహాతేజుఁడు బ్రహ్మదేవుని వలన వరంబుపడసినవాఁడును బర్వతాకారుఁడును మిక్కిలియు యుద్ధంబున దేవదానవుల గర్వంబునేని యణఁపఁజాలినవాఁడునగు నతికాయుఁడు మిక్కిలి యుఁ గోపంబునొందెను. ౧-౩

దేవేంద్రశత్రువయిన యయ్యతికాయుఁడు వేయిసూర్యులుంబోలె దేదీప్యమానంబయిన రథంబు నారోహించి వానరులమీఁది కడరెను. ౪

కిరీటంబును స్వచ్ఛంబులగు కుండలంబులును ధరించియున్న యాయతికాయుఁడు అత్యైత్రాటిధ్వనిగదుర ధనుస్సుపారించి తన పేరెల్లెడల వినిపించు మహాధ్వనిగలుగునట్లు సింహనాదము చేసెను. ౫

ఆయతికాయుని సింహనాదమునకును జేవవినిపించుటకును వానరు లందఱు భయమునొందిరి. ౬

ఆవానరులందఱు అతికాయుని మహాదేహమునుజూచి "కుంభకర్ణుఁడే మరల లేచివచ్చినవాఁడు" అని భయపీడితులయి యొకరినొకరు ఆశ్రయించిరి. ౭

తే తస్య రూప మాలోక్య యథా విష్ణో స్త్రివిక్రమే,
భయా ద్వానరయూథా స్తే విద్రవన్తి తత స్తతః. ౮
తేఽతికాయం సమాసాద్య వానరా మూఢచేతసః,
శరణ్యం శరణం జగ్ము ర్లక్ష్మణాగ్రజ మాహవే. ౯
తతోఽతికాయం కాకుత్స్థో రథస్థం పర్వతోపమమ్,
దదర్శ ధన్వినం దూరా ద్గర్జన్తం కాలమేఘవత్. ౧౦

స తం దృష్ట్వా మహాత్మానం రాఘవస్తు విసిష్మియే,
వానరాన్ సాన్త్వయిత్వాఽథ విభీషణ మువాచ హ. ౧౧
కోఽసౌ పర్వతసంకాశో ధనుష్మా న్హరిలోచనః,
యుక్తే హయసహస్రేణ విశాలే స్యన్దనే స్థితః. ౧౨
య ఏష నిశితై శ్శూలై స్సుతీక్ష్ణైః ప్రాసముద్గరైః,
అర్చిష్మద్భి ర్వృతో భాతి భూతై రివ మహేశ్వరః. ౧౩

కాలజిహ్వప్రకాశాభి ర్య ఏషోఽతివిరాజతే,
ఆవృతో రథశక్తిభి ర్విద్యుద్భిరివ తోయదః. ౧౪

ధనూంషి చాస్య సజ్జాని హేమపృష్ఠాని సర్వశః,
శోభయన్తి రథశ్రేష్ఠం శక్రచాప ఇవామ్బరమ్. ౧౫

కఏష రక్షశ్శార్దూలో రణభూమిం విరాజయన్,
అభ్యేతి రథినాం శ్రేష్ఠో రథేనాదిత్యతేజసా. ౧౬
ధ్వజశృఙ్గప్రతిష్ఠేన రాహుణాభివిరాజతే,
సూర్యరశ్మినిభై ర్బాణై ర్దిశో దశ విరాజయన్. ౧౭

ఆవానరులు త్రివిక్రమావతారమునందలి విష్ణుదేవునిరూపమువలెనున్న యాయతికాయుని రూపముంజూచి భయపడి యిట్టటు పాఱిపోయిరి. ౯

ఆవానరులు అతికాయునింజూచి ఏమియుందోఁచక పరమభీతులై నిర్విణ్ణులైయుద్ధంబున శరణ్యుఁడగు లక్ష్మణునియన్న రాముని శరణుచొచ్చి.

అంత రాముఁడు రథగతుఁడును బర్వతాకారుఁడును ధనుర్ధరుఁడును బ్రలయకాలమేఘంబుకైవడి గర్జించుచున్నవాఁడునగు నతికాయుని దూరంబుననుండి చూచెను. ౧౦

రాముఁడు మహాత్ముఁడగు నాయతికాయుంజూచి యాశ్చర్యమునొంది వానరుల నాశ్వాసించి విభీషణుంజూచి యిట్లని చెప్పెను ౧౧

వేయిగుఱ్ఱంబులుగట్టిన విశాలరథంబున నున్నాఁడే; ఈపర్వతాకారుఁడును ధనుర్ధరుఁడును సింహలోచనుఁడునగు వీరుఁడెవ్వఁడు? ౧౨

కాంతిమంతములగు శూలములచేతను బ్రాసములచేతను తోమరములచేతను బరివేష్టితుఁడై భూతంబులచేఁ బరివేష్టితుండగు రుద్రునికైవడిఁ బ్రకాశించుచున్నాఁడే; ఈతఁ డెవ్వఁడు? ౧౩

మఱియు మృత్యువుయొక్క నాలుకలువలె రాజిల్లుచుండు శక్తులతోఁ గూడినవాఁడే; మెఱుపులతోఁగూడిన మేఘమువలె వెలుఁగుచున్నాఁడే; ఈతఁ డెవ్వఁడు? ౧౪

అన్నియు సజ్యంబులయి పృష్ఠభాగంబులఁ గాంచనాలంకృతంబులయియుండు నీతనిధనుస్సులును ఇంద్రధనుస్సు ఆకాశమునుంబోలె రథమును ఎంతయు నలంకరించుచున్నవి. ౧౫

ఈరథికోత్తముఁడు సూర్యతేజంబగురథంబునఁ గూర్చుండి యుద్ధభూమిని వెలుఁగంజేయుచు వచ్చుచున్నాఁడే; ఈరాక్షససింహుఁ డెవ్వఁడు?

ఈరాక్షసోత్తముఁడు సూర్యకిరణంబులంబోలి బాణంబులచే దశదిశలం బ్రకాశింపఁజేయుచు ధ్వజశిఖరంబున నుండురాహువుచే నెంతయు నొప్పుచున్నాఁడు. ౧౬

త్రిణతం మేఘనిర్హ్రాదం హేమపృష్ఠ మలంకృతమ్,
శతక్రతుధనుఃప్రఖ్యం ధనుశ్చాస్య విరాజతే. ౧౮

స ధ్వజ స్సపతాకశ్చ సానుకర్షో మహారథః,
చతుస్సాదిసమాయుక్తో మేఘ స్తనితనిస్వనః. ౧౯

వింశతి ర్దశ చాష్టౌ చ తూణో౽స్య రథ మాస్థితాః,
కార్ముకాని చ భీమాని జ్యాశ్చ కాఞ్చనపిఙ్గళాః. ౨౦
ద్వౌ చ ఖడ్గౌ రథగతౌ పార్శ్వస్థౌ పార్శ్వశోభితౌ,
చతుర్హస్త త్సరుయుతౌ వ్యక్తహ స్తదశాయతౌ. ౨౧

రక్తకణ్ఠగుణో ధీరో మహాపర్వతసన్నిభః,
కాళగ కాలమహావక్త్రో మేఘస్థ ఇవ భాస్కరః. ౨౨

కాఞ్చనాఙ్గదనద్ధాభ్యాం భుజాభ్యా మేష శోభతే,
శృఙ్గాభ్యా మివ తుఙ్గాభ్యాం హిమవా న్పర్వతోత్తమః. ౨౩

కుణ్డలాభ్యాం తు యస్యైతద్భాతి వక్త్రం శుభేక్షణమ్,
పునర్వస్వ న్తరగతం పూర్ణం బిమ్బమివైన్దవమ్. ౨౪
ఆచక్ష్వ మే మహాబాహో! త్వ మేనం రాక్షసోత్తమమ్,
యం దృష్ట్వా వానరా స్సర్వే భయార్తా విద్రుతా దిశః. ౨౫

స పృష్టో రాజపుత్త్రేణ రామేణామితతేజసా,
ఆచచక్షే మహాతేజా రాఘవాయ విభీషణః. ౨౬

ఆద్యంతములయందును మధ్యమునందును వంగియుండునదియు మేఘధ్వనివంటి జ్యాధ్వనిగలదియుఁ గాంచనాలంకృతంబును ఇంద్రధనుస్సుతో సరియైనదియునగు నీతని చేతివిల్లును ఎంతయుఁ బ్రకాశించుచున్నది. ౧౮

ఈతనిమహారథము ధ్వజపతాకలతోను అనుకర్షముతోనుంగూడి సలుగురుసారథులచేఁ బోలఁబడుచున్నదై, మేఘగర్జనమువంటి ధ్వనిగలదై యెంతయుఁ బ్రకాశించుచున్నది. ౧౯

ఈతనిరథంబుపై ముప్పదియెనిమిదియమ్ములపొదు లున్నవి; మఱియుం భయంకరములయినధనుస్సులునుబంగారువన్నెగలఅల్లెత్రాళ్లును పెక్కు లున్నవి.

నాలుగుచేతుల ప్రమాణముగలపిడిగలవియుఁ బదిచేతుల నిడుపుగలవియు నగుఖడ్గములు రెండు రథంబున ఇతనిపార్శ్వభాగంబుల నలంకరించుచున్నవి. ౨౧

ఈతఁడు ఎఱ్ఱనిపుష్పమాలికను గంఠమునదాల్చి ధీరుఁడై మహాపర్వతాకారుఁడై నీలవర్ణుఁడై మృత్యువునకుంబోలెఁ బెద్దనోరుగలవాఁడై మేఘచ్ఛన్నుఁడగు సూర్యునిపగిదిఁ దేజరిల్లుచున్నాఁడు. ౨౨

ఈరాక్షసుఁడు బంగారుబాహుపురులచే నలంకృతములయిన యున్నతము లగుభుజములచే ఉన్నతములగు శిఖరములచే హిమవత్పర్వతమువలెఁ బ్రకాశించుచున్నాఁడు. ౨౩

మహాబాహుఁడవగు విభీషణుఁడా! మంగళకరములగు నేత్రములుగల యెవ్వనిముఖము కుండలములు దాల్చియుండుటచే పునర్వసునక్షత్రముల నడుమనుండు పూర్ణమగు చంద్రబింబమువలె నొప్పుచున్నదో మఱియు నెవ్వనిఁజూచి వానరులందఱు భయమునొంది పరుగెత్తుచున్నారో అట్టియీరాక్షసోత్తముఁ డెవ్వఁడో నీవు నాకుఁ జెప్పుము. అని రాముఁడు విభీషణు నడిగెను. ౨౪ ౨౫

మహాతేజుఁడగు విభీషణుఁడు రాచకొమరుఁడును కొలఁదిలేని తేజస్సుగలవాఁడునగు రాముఁ డడుగుటను విని రామున కిట్లని చెప్పెను. ౨౬

దశగ్రీవో మహాతేజా రాజా వైశ్రవణానుజః,
భీమకర్మా మహోత్సాహో రావణో రాక్షసాధిపః. ౨౭
తస్యాసీద్వీర్యవా న్పుత్రో రావణప్రతిమో రణే,
వృద్ధసేవీ శ్రుతిధర స్సర్వాస్త్రవిదుషాం వరః. ౨౮
అశ్వపృష్ఠే రథే నాగే ఖడ్గే ధనుషి కర్షణే,
భేదే సాన్త్వే చ దానే చ నయే మన్త్రే చ సమ్మతః. ౨౯

యస్య బాహూ సమాశ్రిత్య లఙ్కా వసతి నిర్భయా,
తనయం ధాన్యమాలిన్యా అతికాయ మిమం విదుః. ౩౦
ఏతేనారాధితో బ్రహ్మా తపసా భావితాత్మనా,
అస్త్రాణి చాప్యవాప్తాని రిపవశ్చ పరాజితాః. ౩౧
సురాసురై రవధ్యత్వం దత్త మస్మై స్వయంభువా,
ఏతచ్చ కవచం దివ్యం రథ శ్చైషోఽర్కభాస్వరః. ౩౨
ఏతేన శతశో దేవా దానవాశ్చ పరాజితాః,
రక్షితాని చ రక్షాంసి యక్షాశ్చాపి నిషూదితాః. ౩౩
వజ్రం విష్టమ్భితం యేన బాణై రిన్ద్రస్య ధీమతః,
పాశ స్సలిలరాజస్య రణే ప్రతిహత స్తథా. ౩౪
ఏషోఽతికాయో బలవా న్రాక్షసానా మృషభః,
రావణస్య సుతో ధీమా న్దేవదానవదర్పహా. ౩౫
తదస్మిన్క్రియతాం యత్నః క్షిప్రం పురుషపుఙ్గవ!,
పురా వానరసైన్యాని క్షయం నయతి సాయకైః. ౩౬

తతోఽతికాయో బలవా న్ప్రవిశ్య హరివాహినీమ్,
విస్ఫారయామాస ధను ర్ననాద చ పునఃపునః. ౩౭

మహాతేజుఁడును గుబేరునితమ్ముఁడును భయంకరకర్ముఁడును మహో త్సాహుఁడును రాక్షసేశ్వరుఁడునగు రాజు రావణుఁ డున్నాఁడుగదా! ౨౭

ఆరావణునకుఁ బరాక్రమవంతుఁడును యుద్ధంబున రావణునంతటి వాఁడును వృద్ధులసేవించువాఁడును విద్యావంతుఁడును సమస్తాస్త్రవేత్తలలో నుత్తముఁడునుగ గుఱ్ఱముపైనను రథంబుమీఁదను గజంబుమీఁదను ధనుర్విద్య యందును గృషియందును సామదానభేదోపాయంబులయందును నీతియం దును ఆలోచనమునందును సమర్థుఁడని యెన్నికగన్నవాఁడునగు; పుత్త్రుఁ డున్నాఁడు. ౨౮, ౨౯

ఇతఁడు ధాన్యమాలినికొడుకు అతికాయుఁడు; ఇతనిబాహుబలము నాశ్రయించియే లంకాపురి నిర్భయంబుగా నున్నది. ౩౦

భావితాత్ముఁడగు నీయతికాయుఁడు తపస్సుచేసి బ్రహ్మదేవు నారా ధించి దివ్యాస్త్రంబులంబొంది శత్రువులను జయించినాఁడు. ౩౧

బ్రహ్మదేవుఁడు ఇయ్యతికాయునకు దేవాసురులచే వధ్యుఁడు గాకుం డుటయు ఇద్దివ్యకవచంబును సూర్యప్రకాశంబగు నీరథమును ఒసఁగెను. ౩౨

ఇయ్యతికాయుఁడు వెక్కుమార్లు దేవతలను దానవులను జయించి రాక్షసుల రక్షించి యున్నాఁడు; యక్షులను వధించియున్నాఁడు. ౩౩

ఎవ్వఁడు యుద్ధంబున బాణంబులచే దేవేంద్రుని వజ్రాయుధమును స్తంభింపఁజేసినాఁడో, అట్లు వరుణునిపాశమునుగూడఁ బ్రతిహతము గావించి నాఁడో, అట్టిబలవంతుఁడును రాక్షసోత్తముఁడును బుద్ధిమంతుఁడును దేవదాన వులగర్వంబు నణంచువాఁడును రావణపుత్త్రుండునగు నతికాయుండితఁడు.

పురుషశ్రేష్ఠుఁడవగు రాముఁడా! కాఁబట్టి యీతనివిషయమయి శీఘ్రముగాఁ బ్రయత్నముచేయుము; లేనియెడ ఇంక బాణంబులనే వానర సైన్యములను నశింపఁజేయును. అని విభీషణుండు రామునితోఁ జెప్పెను. ౩౬

అంత బలవంతుఁడగు నతికాయుండు వానరసేనం బ్రవేశించి జ్యానా దంబు గావించి పలుమాఱు సింహనాదంబుచేసెను. ౩౭

తం భీమవపుషం దృష్ట్వా రథస్థం రథినాం వరమ్,
అభిపేతు ర్మహాత్మానో యే ప్రధానా వనౌకసః. ౩౮
కుముదో ద్వివిదో మైన్దో నీల శ్శరభ ఏవచ,
పాదపై ర్గిరిశృఙ్గై శ్చ యుగపత్సమభిద్రవన్. ౩౯
తేషాం వృక్షాంశ్చ శైలాంశ్చ శరైః కాఞ్చనభూషణైః,
అతికాయో మహాతేజా శ్చిచ్ఛేదాస్త్రవిదాం వరః. ౪౦

తాంశ్చైవ సర్వాన్ సహరీన్ శరై స్సర్వాయసై ర్బలీ,
వివ్యాథాభిముఖ స్సఙ్ఖ్యే భీమకాయో నిశాచరః. ౪౧

తే_ర్దితా బాణవర్షేణ భిన్నగాత్రాః ప్లవఙ్గమాః,
న శేకు రతికాయస్య ప్రతికర్తుం మహారణే. ౪౨

తత్సైన్యం హరివీరాణాం త్రాసయామాస రాక్షసః,
మృగయూథ మివ క్రుద్ధో హరిర్యౌవనదర్పితః. ౪౩
స రాక్షసేన్ద్రో హరిసైన్యమధ్యే
నాయుధ్యమానం నిజఘాన కంచిత్,
ఉపేత్య రామం సధనుః కలాపీ
సగర్వితం వాక్య మిదం బభాషే. ౪౪
రథే స్థితో_హం శరచాపపాణి
ర్న ప్రాకృతం కంచన యోధయామి,
యశ్చాస్తి కశ్చిద్వ్యవసాయయుక్తో
దదాతు మే క్షిప్ర మిహాద్య యుద్ధమ్. ౪౫
తత్తస్య వాక్యం బ్రువతో నిశమ్య

భయంకరాకారుండును రథగతుండగు సారథికోత్తము నతికాయుం జూచి వానరులలోఁ బ్రధానులగు బలవంతులు ఎదుర్కొనిరి ౩౮

కుముదుండును ద్వివిదుండును మైందుండును నీలుండును శరభుండును వృక్షంబులును బర్వతశిఖరంబులును జేకొని ఒక్కపెట్ట నెదిరించిరి. ౩౯

అస్త్రవేత్తలలో నుత్తముండును మహాతేజుండునగు నతికాయుండు ఆవానరులవృక్షములను బర్వతములను గాంచనాలంకృతములగు బాణములచే ఛేదించెను. ౪౦

బలవంతుండును భయంకరాకారుండునగు నాయతికాయుండు, యుద్ధంబున నావానరుల కభిముఖుండై వారలనందఱను ఉక్కు బాణంబులచేఁ బ్రహరించెను. ౪౧

ఆవానరులు అతికాయుని బాణవర్షములచేఁ బీడితులయి దేహమంతయు గాయములయి పరవశులయి ఆమహాయుద్ధంబున నేమియుఁ బదులు చేయఁజాలకపోయిరి. ౪౨

అతికాయుండు క్రుద్ధంబును యౌవనగర్వితంబునగు సింహము మృగసమూహమునుంబోలె ఆవానరసేననంతటినిఁ జీకాకుపఱిచెను. ౪౩

రాక్షసశ్రేష్ఠుం డతికాయుండు, వానరసేనయందు ఆయుధంబు చేకొని తనపైకి యుద్ధంబునకు రానివాని నెవ్వనిని గొట్టనొల్లక ధనుస్తూణీరంబులతో రామునొద్దకుఁబోయి గర్వయుక్తంబుగా నీమాటం జెప్పెను. ౪౪

నేను రథంబున ధనుర్బాణధరుండనై యుద్ధంబునకు నిలిచియున్నాను. ధైర్యంబునం బాఱినట్టి అల్పులతో జిన్నలతోను యుద్ధంబు గావింపను. ఇందు యుద్ధోత్సాహముగలవాఁ డెవ్వఁడో అతఁడు నాకిప్పుడు యుద్ధం బొసంగుఁగాక. అని అతికాయుండు రామునితోఁ జెప్పెను. ౪౫

అతికాయుం డట్లు సగర్వంబుగా మాటలాడుటనువిని శత్రుహంతయగు

చుకోప సౌమిత్రి రమిత్రహన్తా,
అమృష్యమాణశ్చ సముత్పపాత
జగ్రాహ చాపం చ తతః స్మయిత్వా. ౪౬
క్రుద్ధ స్సౌమిత్రిరుత్పత్య తూణాదాక్షిప్య సాయకమ్,
పురస్తా దతికాయస్య విచకర్ష మహ ద్ధనుః. ౪౭
పూరయన్ సమహీం శైలానాకాశం సాగరం దిశః,
జ్యాశబ్దో లక్ష్మణస్యోగ్ర స్త్రాసయ న్రజనీచరాన్. ౪౮

సౌమిత్రే శ్చాపనిర్ఘోషం శ్రుత్వా ప్రతిభయం తదా,
విసిష్మియే మహాతేజా రాక్షసేన్ద్రాత్మజో బలీ. ౪౯

అథాతికాయః కుపితో దృష్ట్వా లక్ష్మణ ముత్థితమ్,
ఆదాయ నిశితం బాణ మిదం వచన మబ్రవీత్. ౫౦
బాల స్త్వ మసి సౌమిత్రే! విక్రమేష్వవిచక్షణః,
గచ్ఛ కిం కాలసదృశం మాం యోధయితు మిచ్ఛసి. ౫౧

నహి మద్బాహుసృష్టానా మస్త్రాణాం హిమవా నపి,
సోఢు ముత్సహతే వేగ మన్తరిక్షమథో మహీ. ౫౨
సుఖప్రసుప్తం కాలాగ్నిం విబోధయితు మిచ్ఛసి,
న్యస్య చాపం నివర్తస్వ మా ప్రాణా న్జహి మద్గతః. ౫౩

అథవా త్వం ప్రతిష్టబ్ధో న నివర్తితు మిచ్ఛసి,
తిష్ఠ ప్రాణా న్పరిత్యజ్య గమిష్యసి యమక్షయమ్. ౫౪
పశ్య మే నిశితా న్బాణా నరిదర్పనిషూదనాన్,
ఈశ్వరాయుధసఙ్కాశాం స్తప్తకాఞ్చనభూషణాన్. ౫౫

లక్ష్మణుండు కోపించి యతఁడాడినమాట నోర్వఁజాలక యతనిముందటికిఁబోయి యతని నెంతమాత్రమును సరకుసేయక ధనుస్సును గ్రహించెను. ౪౬

లక్ష్మణుఁడు క్రుద్ధుఁడై పోయి యమ్ములపొదినుండి బాణంబెత్తి యతికాయునిముందట జ్యానాదంబుగదుర నమ్మహాధనుస్సు నాకర్షించెను. ౪౭

భయంకరంబగు నాలక్ష్మణుని జ్యానాదము భూమిని బర్వతంబుల నాకాశమును సముద్రమును దిక్కులను నిండి రాక్షసులనందఱ భయపఱచుచుఁ జెలంగెను. ౪౮

అప్పుడు భయంకరమయిన లక్ష్మణునిధనుర్ధ్వనినివిని మహాతేజుండును బలవంతుండునగు రాక్షసరాజపుత్త్రుం డతికాయుండు ఎంతయు నాశ్చర్యము నొందెను. ౪౯

అంత నతికాయుండు, లక్ష్మణుండు వచ్చుటంజూచి కుపితుండై తీక్ష్ణంబగుబాణంబు గ్రహించి యతనితో నిట్లనిచెప్పెను. ౫౦

లక్ష్మణుఁడా! నీవుచిన్నవాఁడవు. పరాక్రమకార్యములయం దసమర్థుఁడవు; కావున నీవు పొమ్ము; మృత్యువుతో సమానుఁడనైన నాతో యుద్ధము చేయ నేలవచ్చినావు? ౫౧

నాబాహువులచే విడువఁబడునస్త్రంబుల వేగమును హిమవత్పర్వతము గూడ భూమ్యంతరిక్షములుగూడ నెంతమాత్రము సహింపఁజాలవు. ౫౨

సుఖముగా నిద్రించుచున్న ప్రలయకాలానలము నేల ప్రజ్వలింపఁజేసెదవు? ధనుస్సును విడిచి మరలిపొమ్ము; నన్నెదిరించి ప్రాణంబులు పోఁగొట్టుకొనవలదు. ౫౩

అట్లుగాక నీవు నాకెదురునిలిచి మరలిపోవనొల్లవేని నిలువుము; ఇంక క్షణంబున నీప్రాణంబులు గొని నిన్ను యమపురికంపెదను. ౫౪

తీక్ష్ణంబులును శత్రుగర్వనాశనంబులును ఈశ్వరుని త్రిశూలంబు వంటివియుఁ గాంచనాలంకృతములునగు నాబాణంబులం జూడుము. ౫౫

ఏష తే సర్పసఙ్కాశో బాణః పాస్యతి శోణితమ్,
మృగరాజ ఇవ క్రుద్ధో నాగరాజస్య శోణితమ్. ౫౬

ఇత్యేవ ముక్త్వా సంక్రుద్ధ శ్శరం ధనుషి సందధే,
శ్రుత్వాఽతికాయస్య వచ స్సరోషం
సగర్వితం సంయతి రాజపుత్త్రః. ౫౭
స సంచుకోపాతిబలో బృహచ్ఛ్రీ
రువాచ వాక్యం చ తతో మహార్థమ్,
న వాక్యమాత్రేణ భవాన్ప్రధానో
న కత్థనా త్సత్పురుషా భవన్తి. ౫౮
మయి స్థితే ధన్విని బాణపాణౌ
నిదర్శయ స్వాత్మబలం దురాత్మన్!,
కర్మణా సూచయాత్మానం న వికత్థితు మర్హసి. ౫౯
పౌరుషేణ తు యో యుక్త స్సతు శూర ఇతి స్మృతః,

సర్వాయుధసమాయుక్తో ధన్వీ త్వం రథ మాస్థితః. ౬౦
శరైర్వా యదివా ప్యస్త్రై ర్దర్శయస్వ పరాక్రమమ్,

తత శ్శిర స్తే నిశితైః పాతయిష్యామ్యహం శరైః. ౬౧
మారుతః కాలసంపక్వం వృన్తా త్తాళఫలం యథా,
అద్య తే మామకా బాణా స్తప్తకాఞ్చనభూషణాః. ౬౨
పాస్యన్తి రుధిరం గాత్రా ద్బాణశల్యాన్తరోత్థితమ్,

బాలోఽయ మితి విజ్ఞాయ న మావజ్ఞాతు మర్హసి. ౬౩
బాలో వా యది వా వృద్ధో మృత్యుం జానీహి సంయుగే,

సర్పసమానంబగు నీబాణము క్రుద్ధంబగు సింహము గజముయొక్క నెత్తురుద్రావునట్లు నీనెత్తురు ద్రాఁగఁగలదు. అని యతికాయుండు లక్ష్మణునితోఁ జెప్పెను. ౫౬

ఆయతికాయుం డీప్రకారముగఁ జెప్పి వింట బాణంబు సంధించెను.

మహాబలుండును మహాతేజుండు నగు నాలక్ష్మణుండు యుద్ధంబున రోషగర్వంబులతోఁ గూడిన యతికాయునిమాటను విని పరమకుపితుండై యధికమయిన యర్థముగల యీమాటం జెప్పెను. ౫౭

దురాత్ముడా! ఈమాటమాత్రమున నీవధికుఁడవు కాఁజాలవు; ఎవ్వరును కార్యముచేయుటవలన శూరులగుదురుగాని తమ్ముం దాము పొగడు కొనుటవలన నెంతమాత్రము శూరులు కాఁజాలరు; నేను ధనుర్బాణంబులం దాల్చి నిల్చియుండఁగా నీబలంబుఁ జూపుము. ౫౮

నీవు కార్యముచేసి నీస్వరూపము జూపుము; ఊరక నిన్ను నీవె పొగడు కొనవలదు; ఎవ్వఁడు యుద్ధంబునఁ బౌరుషంబుఁ జూపునో అతఁడె శూరుఁడు; ఊరక యాత్మశ్లాఘి యెంతమాత్రము శూరుఁడని చెప్పఁబడఁడు. ౫౯

నీవు సమస్తాయుధంబులధరించి ధనుర్ధరుండవై రథముమీఁద నున్నావు; బాణంబులచేఁగాని లేక దివ్యాస్త్రములచేఁగాని నీపరాక్రమంబుఁ జూపుము. ౬౦

ఆటుపిమ్మట వాయువు చక్కఁగాఁ బండిన తాటిపండును తొడిమనుండి రాల్చునట్లు, నేను బాణంబులచే నీశిరస్సును బడఁద్రోసెదను. ౬౧

ఇప్పుడు కాంచనభూషణంబులగు నా బాణంబులు నీదేహమునను౦డి బాణశల్యములచేఁ జేయఁబడిన రంధ్రములనుండి పాఱు నెత్తురుం ద్రావఁగలవు. ౬౨

ఇతఁడు బాలుఁడని నన్నెంతమాత్రము తక్కువగా నెంచవలదు; నేను బాలుఁడనుగాని వృద్ధుఁడనుగాని యుద్ధంబున మృత్యువువంటివాఁడనని తలంచుము. ౬౩

బాలేన విష్ణునా లోకా స్త్రయః క్రాన్తా స్త్రివిక్ర(మైః) మే. ౬౪

లక్ష్మణస్య వచ శ్శ్రుత్వా హేతుమ త్పరమార్థవత్,
అతికాయః ప్రచుక్రోధ బాణం చో త్తమ మాదదే. ౬౫

తతో విద్యాధరా భూతా దేవా దైత్యా మహర్షయః,
గుహ్యకాశ్చ మహాత్మాన స్తద్యుద్ధం ద్రష్టు మాగమన్. ౬౬
తతో௨తికాయః కుపిత శ్చాప మారోప్య సాయకమ్,
లక్ష్మణాయ ప్రచిక్షేప సంక్షిపన్నివ చామ్బరమ్. ౬౭

త మాపతన్తం నిశితం శర మాశీవిషోపమమ్,
అర్ధచన్ద్రేణ చిచ్ఛేద లక్ష్మణః పరవీరహా. ౬౮
తం నికృత్తం శరం దృష్ట్వా కృత్తభోగమివోరగమ్,
అతికాయో భృశం క్రుద్ధః పఞ్చబాణా న్సమాదదే. ౬౯
తాన్ శరాన్ సమ్ప్రచిక్షేప లక్ష్మణాయ నిశాచరః,
తా నప్రాప్తాన్ శరై స్తీక్ష్ణై శ్చిచ్ఛేద భరతానుజః. ౭౦

స తాన్ ఛిత్త్వా శరై స్తీక్ష్ణై ర్లక్ష్మణః పరవీరహా,

ఆదదే నిశితం బాణం జ్వలన్త మివ తేజసా. ౭౧
త మాదాయ ధనుశ్శ్రేష్ఠే యోజయామాస లక్ష్మణః,
విచకర్ష చ వేగేన విససర్జ చ వీర్యవాన్. ౭౨
పూర్ణాయతవిసృష్టేన శరేణ నతపర్వణా,
లలాటే రాక్షసశ్రేష్ఠ మాజఘాన స వీర్యవాన్. ౭౩
స లలాటే శరో మగ్న స్తస్య భీమస్య రక్షసః,
దదృశే శోణితే నాక్తః పన్నగేన్ద్ర ఇవాచలే. ౭౪

బాలుండగు విష్ణువు త్రివిక్రమావతారంబున మూఁడులోకంబులను మూఁడడుగులం ద్రొక్కలేదా? యేమి? అని లక్ష్మణుండు అతికాయునితోఁ జెప్పెను. ౧౪

రయుక్తియుక్తంబును పరమార్థంబుగలదియునగు లక్ష్మణుండు చెప్పిన మాటను విని యతికాయుండు పరమకుపితుఁడై యుత్తమంబగు బాణమును గ్రహించెను. ౧౫

అంత మహానుభావులగు విద్యాధరులును భూతంబులును దేవతలును దైత్యులును మహర్షులును గంధర్వులును అచ్చటి కాయుద్ధంబుఁ జూడవచ్చిరి.

అంత నతికాయుండు కుపితుఁడై వింట బాణంబు సంధించి బాణవేగంబున నడుమనుండు నాకాశంబు నెగురవేయువాఁడువలె లక్ష్మణునిపై విడిచెను. ౧౭

శత్రువీరుల వధించునట్టి లక్ష్మణుండు తనపైకివచ్చుచున్న సర్పతుల్యంబగు నాతీక్ష్ణబాణమును అర్ధచంద్రబాణముచే ఛేదించెను. ౧౮

అతికాయుండు ఆబాణంబు ఖండింపఁబడి ఛిన్నశరీరంబగు సర్పముకైవడి నేలంబడుటను జూచి పరమకుపితుఁడై యయిదుబాణంబుల గ్రహించెను.

అతికాయుండు ఆబాణములను లక్ష్మణునిపై వేసెను; ఆబాణములు పైకిరాకమున్నె వానిని లక్ష్మణుండు కఱకుబాణంబుల ఛేదించెను. ౨౦

శత్రువీరుల వధించునట్టి లక్ష్మణుండు ఆబాణంబులను గఱకుబాణంబులచే ఛేదించి తేజస్సుచే మండుచున్నట్లున్న యొకతీక్ష్ణబాణంబుఁ దీసెను. ౨౧

మహాపరాక్రమశాలియగు లక్ష్మణుండు ఆబాణంబుదీసి వింటంగూర్చి యాకర్ణాంతము నాకర్షించి యతికాయునిపై విడిచెను. ౨౨

వీర్యవంతుఁడగు నాలక్ష్మణుండు ఆ ట్లాకర్ణాంతము నాకర్షించి నతపర్వంబగు నాబాణంబున అతికాయునిలలాటంబునం గొట్టెను. ౨౩

ఆబాణము భయంకరాకారుండగు నతికాయుని లలాటంబున నాటుకొని నెత్తుటందడిసి పర్వతంబుపైనుండు సర్పమువలెఁ జూడనొప్పెను. ౨౪

రాక్షసః ప్రచకమ్పే చ లక్ష్మణేషుప్రపీడితః,
రుద్రబాణహతం ఘోరం యథా త్రిపురగోపురమ్. ౭౫
చిన్తయామాస చాశ్వాస్య విమృశ్యచ మహాబలః,
సాధు బాణనిపాతేన శ్లాఘనీయోఽసి మే రిపుః. ౭౬

విధాయైవం వినమ్యాస్యం నియమ్యచ భుజావుభౌ,
స రథోపస్థమాస్థాయ రథేన ప్రచచార హ. ౭౭
ఏకం త్రీన్పఞ్చ సప్తేతి సాయకాన్రాక్షసర్షభః,
ఆదదే సన్దధే చాపి విచకర్షోత్ససర్జ చ. ౭౮

తే బాణాః కాలసఙ్కాశా రాక్షసేన్ద్రధనుశ్చ్యుతాః,
హేమపుఙ్ఖా రవిప్రఖ్యాశ్చక్రుర్దీప్తమివామ్బరమ్. ౭౯

తతస్తాన్రాక్షసోత్సృష్టాన్ శరౌఘాన్రాఘవానుజః,
అసమ్భ్రాన్తః ప్రచిచ్ఛేద నిశితైర్బహుభిశ్శరైః. ౮౦

తాన్ శరాన్యుధి సమ్ప్రేక్ష్య నికృత్తాన్రావణాత్మజః,
చుకోప త్రిదశేన్ద్రారిర్జగ్రాహ నిశితం శరమ్. ౮౧

స సన్ధాయ మహాతేజాస్తం బాణం సహసోత్సృజత్,
తతస్సౌమిత్రిమాయాన్తమాజఘాన స్తనాన్తరే. ౮౨
అతికాయేన సౌమిత్రిస్తాడితో యుధి వక్షసి,
సుస్రావ రుధిరం తీవ్రం మదం మత్తఇవ ద్విపః. ౮3
స చకార తదాత్మానం విశల్యం సహసా విభుః,
జగ్రాహ చ శరం తీక్ష్ణమస్త్రేణాపిచ సన్దధే. ౮౪

అతికాయుండు లక్ష్మణబాణముచేఁ బీడితుండై రుద్రునిబాణముచేఁ బీడితమయిన త్రిపురద్వారముకగిది ఎంతయుఁ జలించెను. ౭౫

మహాబలుండగు నాయతికాయుండు కొంతయు నాడిల్లి బలాబలంబు విమర్శించి లక్ష్మణుఁ జూచి "నీ విట్లు బాణప్రయోగంబు సేయుటచే నాకు మిక్కిలియు శ్లాఘనీయుఁడగు శత్రుఁడవగుచున్నావు" అని చెప్పెను. ౭౬

ఆ యతికాయుం డిట్లు లక్ష్మణునితోఁ జెప్పి మొగంబువంచి చేతులు సరిచేసికొని రథగతుండై విచిత్రప్రచారంబులఁ దిరిగెను. ౭౭

రాక్షసోత్తముఁడగు నా యతికాయుఁడు ఒకటి మూఁడు అయిదు ఏడు ఇట్లు బాణంబులం దీసి వింట సంధించి యాకర్షించి లక్ష్మణునిపైఁ బ్రయోగించెను. ౭౮

మృత్యుసమానంబులును కాంచనపుంఖములు సూర్యతేజంబులునగు నతికాయప్రయుక్తంబులయిన యీబాణంబులు ఆకాశంబును వెలుఁగం జేసినవి. ౭౯

అంత రామానుజుండగు లక్ష్మణుండు ఎంతమాత్రము తొట్రుపాటు నొందక అతికాయుండు ప్రయోగించిన బాణంబుల నన్నింటిని తీక్ష్ణంబులగు పెక్కుబాణంబుల ఖండించెను. ౮౦

దేవేంద్రశత్రువగు రావణపుత్రుఁ డతికాయుండు యుద్ధంబున నా బాణంబు లన్నియుం భిన్నంబులగుటంజూచి కుపితుండై తీక్ష్ణంబగు నొకదివ్య బాణముం దీసెను. ౮౧

మహాతేజుండగు నాయతికాయుండు ఆబాణంబును ధనుస్సున సంధించి వేగంబున విడిచెను; అది లక్ష్మణుని వక్షస్స్థలంబుపై నాటెను. ౮౨

లక్ష్మణుండు యుద్ధంబున నతికాయునిచే వక్షంబునం బ్రహరింపఁబడినవాఁడై మదపుటేనుఁగు మదజలంబు స్రవించునట్లు వేఁడినెత్తురు కాఱెను. ౮౩

సమర్థుండగు లక్ష్మణుండు శీఘ్రముగాఁ దనదేహములోని బాణంబును పెఱికివేసి బాధతీర్చుకొని తీక్ష్ణంబగు నొకబాణంబు గ్రహించి దాని దివ్యాస్త్రమంత్రముతోఁ గూర్చెను. ౮౪

ఆగ్నేయేన తదాఽస్త్రేణ యోజయామాస సాయకమ్,
స జజ్వాల తదా బాణో ధనుష్యస్య మహాత్మనః. ౮౫

అతికాయోఽపి తేజస్వీ సౌర మస్త్రం సమాదధే,
తేన బాణం భుజఙ్గాభం హేమపుఙ్ఖ మయోజయత్. ౮౬
తదస్త్రం జ్వలితం ఘోరం లక్ష్మణ శ్శర మాహితమ్,
అతికాయాయ చిక్షేప కాలదణ్డ మివాన్తకః. ౮౭

ఆగ్నేయేనాభిసంయుక్తం దృష్ట్వా బాణం నిశాచరః,
ఉత్ససర్జ తదా బాణం దీప్తం సూర్యాస్త్రయోజితమ్. ౮౮
తా వుభా వమ్బరే బాణా వన్యోన్య మభిజఘ్నతుః,
తేజసా సమ్ప్రదీప్తాగ్రౌ క్రుద్ధా వివ భుజఙ్గమౌ. ౮౯
తా వన్యోన్యం వినిర్దహ్య పేతతు ర్ధరణీతలే,
నిరర్చిషౌ భస్మకృతౌ న భ్రాజేతే శరోత్తమౌ. ౯౦
తతోఽతికాయ స్సంక్రుద్ధ స్త్వస్త్ర మైషీక ముత్సృజత్,
తత్ప్రచిచ్ఛేద సౌమిత్రి రస్త్ర మైన్ద్రేణ వీర్యవాన్. ౯౧
ఐషీకం నిహతం దృష్ట్వా రుషితో రావణాత్మజః,
యామ్యేనాస్త్రేణ సంక్రుద్ధో యోజయామాస సాయకమ్. ౯౨
తత స్తదస్త్రం చిక్షేప లక్ష్మణాయ నిశాచరః,
వాయవ్యేన తదస్త్రేణ నిజఘాన స లక్ష్మణః. ౯౩
అథైనం శరధారాభి ర్ధారాభి రివ తోయదః,
అభ్యవర్ష త్సుసంక్రుద్ధో లక్ష్మణో రావణాత్మజమ్. ౯౪
తేఽతికాయం సమాసాద్య కవచే వజ్రభూషితే,
భగ్నాగ్రశల్యా సహసా పేతు ర్బాణా మహీతలే. ౯౫
తా న్మోఘా నభిసంప్రేక్ష్య లక్ష్మణః పరవీరహా,

లక్ష్మణుండాబాణంబును ఆగ్నేయాస్త్రమంత్రముచే నభిమంత్రించెను; అది మహానుభావుండగు లక్ష్మణుని ధనుస్సునందు దివ్యాస్త్రవిద్యా మంత్రితంబై యొంతయు వెలింగినది. ౫౫

మహాతేజుండగు నతికాయుండును సౌర్యాస్త్రంబు స్మరించి ఆ యస్త్రమంత్రముచే సర్పతుల్యమును గాంచనపుంఖంబునగు బాణము నభిమంత్రించెను.

లక్ష్మణుండు ఆగ్నేయాస్త్రాలభిమంత్రితంబై భయంకరాకారంబై తేజరిల్లుచున్న యాబాణమును యముడు కాలదండమునుంబోలె అతికాయుని పైం బ్రయోగించెను. ౫౬

అతికాయుండు ఆగ్నేయాస్త్రయుక్తంబగు బాణంబు వచ్చుటంజూచి సూర్యాస్త్రాభిమంత్రితంబగు బాణంబును విడిచెను. ౫౭

ఆ బాణములు రెండును ఆకాశంబున మహాతేజంబున వెలుంగుచు క్రుద్ధంబులగు సర్పములవలెని ఒండొంటం దాకినవి. ౫౮

ఆబాణంబులు రెండును ఒండొంటి దహించుకొని నిస్తేజంబులై భస్మీభూతంబులయి నేలంబడినవి. ౬౦

అంత అతికాయుండు కుపితుండై ఐషీకాస్త్రమును బ్రయోగించెను; పరాక్రమవంతుండగు లక్ష్మణుండు అయ్యస్త్రము ఐంద్రాస్త్రముచేం గొట్టెను.

రావణపుత్రుండగు నతికాయుండు తాం బ్రయోగించిన యైషికాస్త్రంబు ప్రతిహతంబగుటనుజూచి కుపితుండై యామ్యాస్త్రమంత్రంబుచే బాణంబు నభిమంత్రించెను. ౬౨

అంత నతికాయుండు అయామ్యాస్త్రమును లక్ష్మణునిపైం బ్రయోగించెను; లక్ష్మణుండును వాయవ్యాస్త్రంబున దానింగొట్టెను. ౬౩

అంత లక్ష్మణుండు పరమకుపితుండై మేఘము వర్షమువర్షించునట్లు బాణవర్షము నతికాయునిపైం గురిపించెను. ౬౪

ఆబాణములు అతికాయునింబొంది వజ్రభూషితంబగు నతనిమేని కవచంబు దాంకి కొనలందుం ద్రుక్కు మేకులు విఱిగి నేలంబడినవి. ౬౫

శత్రువీరుల వధించువాండును మహాయశుండునగు లక్ష్మణుండు ఆ

అభ్యవర్ష న్మహేషూణాం సహస్రేణ మహాయశాః. ౯౬

స వృష్యమాణో బాణౌఘై రతికాయో మహాబలః,
అవధ్యకవచ స్సఙ్ఖ్యే రాక్షసో నైవ వివ్యథే. ౯౭

న శశాక రుజం కర్తుం యుధి తస్య నరోత్తమః,

అథైన మభ్యుపాగమ్య వాయు ర్వాక్య మువాచహ. ౯౮
బ్రహ్మదత్తవరో హ్యేష అవధ్యకవచావృతః,
బ్రాహ్మే ణాస్త్రేణ భిన్ధ్యేన మేష వధ్యో హి నాన్యథా. ౯౯

అవధ్య ఏవ హ్యస్యైషా మస్త్రాణాం కవచీ బలీ,

తత స్తు వాయో ర్వచనం నిశమ్య
సౌమిత్రి రిన్ద్ర ప్రతిమానవీర్యః. ౧౦౦
సమాదదే బాణ మమోఘవేగం
తద్బ్రాహ్మ మస్త్రం సహసా నియోజ్య,
తస్మిన్ మహాస్త్రే తు వియుజ్యమానే
సౌమిత్రిణా బాణవరే శితాగ్రే. ౧౦౧
దిశశ్చ చన్ద్రార్కమహాగ్రహాశ్చ
నభశ్చ తత్రాస చచాల చోర్వీ,
తం బ్రహ్మణోఽస్త్రేణ నియుజ్య చాపే
శరం సుపుఙ్ఖం యమదూతకల్పమ్. ౧౦౨
సౌమిత్రి రిన్ద్రారి సుతస్య తస్య
ససర్జ బాణం యుధి వజ్రకల్పమ్,

బాణము లన్నియుం వ్యర్థము లగుటంజూచి మరల వేయిమహాబాణంబుల వర్షించెను. ౯౬

మహాబలుండగు నాయతికాయుండు అభేద్యంబగుకవచము ధరించి యుండుటచే లక్ష్మణుండు బాణవర్షంబు లెంతవర్షించినను కొంచెమేని బాధ నొందలేదు. ౯౭

పురుషోత్తముండగు లక్ష్మణుండు యుద్ధంబున నయ్యతికాయు నెంత మాత్రము నొప్పింపంజాలండయ్యె.

అంత వాయుదేవుండు లక్ష్మణుని యొద్దకువచ్చి యిట్లనిచెప్పెను ౯౮

ఈయతికాయుండు బ్రహ్మదేవునివలన వరంబునొంది అభేద్యంబగు కవచము ధరించియున్నాండు; ఇతని బ్రహ్మాస్త్రంబుచే వధింపుము; వేఱు విధమున నితని వధింప నలవిగాదు. ౯౯

కవచధరుండును బలవంతుండునగు నితని ఇతరాస్త్రంబుల వధింప నలవి గాదు. అని వాయువు లక్ష్మణునికిం జెప్పెను.

అంత దేవేంద్రసమాన పరాక్రముండగు లక్ష్మణుండు వాయుదేవుని వచనంబు విని శీఘ్రంబున బ్రహ్మాస్త్రమంత్రంబు జపించి మహావేగంబగు బాణము ధనుస్సున సంధించెను. ౧౦౦

లక్ష్మణుండు తీక్ష్ణాగ్రంబగు నుత్తమబాణంబున బ్రహ్మాస్త్రంబు నభి మంత్రింపంగానే చంద్రసూర్యులును ఇతరగ్రహంబులును భయంబునొందిరి; దిక్కులును ఆకాశంబును భూమియుం జలించినవి. ౧౦౧

లక్ష్మణుండు కాంచనపుంఖంబును వజ్రాయుధతుల్యంబును దేవేంద్ర శత్రువగు రావణునికొడుకైన యతికాయునకు యమదూతవంటిదియు నగు నమ్మహాబాణంబును బ్రహ్మాస్త్రమంత్రంబుతో నభిమంత్రించి ధనుస్సున సంధించి విడిచెను. ౧౦౨

తం లక్ష్మణోత్సృష్ట మమోఘవేగం
సమాపతన్తం జ్వలనప్రకాశమ్. ౧౦౩
సువర్ణ వజ్రోత్తమచిత్రపుఙ్ఖం
తదాఽతికాయ స్సమరే దదర్శ,
తం ప్రేక్షమాణ స్సహసాఽతికాయో
జఘాన బాణై ర్నిశితై రనేకైః. ౧౦౪
స సాయక స్తస్య సుపర్ణవేగ
స్తదాఽతికాయస్య జగామ పార్శ్వమ్,
త మాగతం ప్రేక్ష్య తదాఽతికాయో
బాణం ప్రదీప్తాన్తకకాలకల్పమ్. ౧౦౫
జఘాన శక్త్యృష్టిగదాకుఠారై
శ్శూలై ర్హలై శ్చా ప్యవిపన్నచేతాః,
తా న్యాయుధా న్యద్భుతవిగ్రహాణి
మోఘాని కృత్వా స శరోఽగ్నిదీప్తః. ౧౦౬
ప్రగృహ్య తస్యైవ కిరీటజుష్టం
తతోఽతికాయస్య శిరో జహార,
తచ్ఛిర స్సశిరస్త్రాణం లక్ష్మణేషు ప్రపీడితమ్. ౧౦౭
పపాత సహసా భూమౌ శృఙ్గం హిమవతో యథా,
తం తు భూమౌ నిపతితం దృష్ట్వా విక్షిప్తభూషణమ్, ౧౦౮
బభూవు ర్వ్యథితా స్సర్వే హతశేషా నిశాచరాః,

తే విషణ్ణముఖా దీనాః ప్రహారజనితశ్రమాః, ౧౦౯
వినేదు రుచ్చై ర్బహవ స్సహసా విస్వరై స్స్వరైః,

తత స్తే త్వరితం యాతా నిరపేక్షా నిశాచరాః. ౧౧౦

అప్పుడు యుద్ధంబున లక్ష్మణునిచే విడువఁబడి మిణుంగురులు గ్రక్కుచు నగ్నిహోత్రంబుకైవడి వచ్చుచున్న యమోఘవేగంబును వజ్రఖచిత కాంచనపుంఖయు నగు నాబాణమును అతికాయుండు చూచెను. ౧౦౩

అతికాయుఁ డాబాణముఁ జూచుచునే వేగంబున దాని ననేక తీక్ష్ణబాణంబులం గొట్టెను; అట్లు గొట్టినను గరుత్మంతునకుంబోలె మహావేగంబుగల యమ్మహాబాణం బప్పు డతికాయుని సమీపంబు నొందెను. ౧౦౪

అప్పు డతికాయుండు సకలలోక నాశకరుండగు యమునిపగిదిఁ దేజరిల్లుచున్న యాబాణంబు వచ్చుటం జూచి యొంతమాత్రము భయంబునొందక శక్తులచేతను అష్టులచేతను గదలచేతను గొడ్డళ్ళచేతను శూలములచేతను హలములచేతను దానిం గొట్టెను. ౧౦౫

అమ్మహాస్త్రము భయంకరాకారంబులగు నయ్యాయుధంబుల సరకుగొనక అగ్నిహోత్రమువలె వెలుంగుచుంబోయి యయ్యతికాయుని కిరీటాలంకృతంబగు శిరస్సును ఖండించెను. ౧౦౬

కిరీటాలంకృతమగు నాయతికాయుని శిరస్సు లక్ష్మణబాణచ్ఛిన్నంబై హిమవత్పర్వతశిఖరంబుభంగిఁ దటాలున నేలంగూలెను. ౧౦౭

అట్లు భూషణంబు లన్నియు నిట్టటుచెదరిపడ నేలంగూలిన యాయతికాయుం జూచినంతనె హతశేషులగు రాక్షసు లందఱు పరమదుఃఖితులయిరి. ౧౦౮

ఆ రాక్షసు లందఱు దుఃఖితులయి గర్వంబుడిగి యలసి వానరులు కొట్టుదెబ్బల సహింపఁజాలక వికృతస్వరంబుగా నుచ్చైర్నాదంబున రోదనంబు చేసిరి. ౧౦౯

అంత నాయకుండగు నతికాయుండు హతుండగుటచే నారాక్షసు

పురీ మభిముఖా భీతా ద్రవన్తో నాయకే హతే,

ప్రహర్షయుక్తా బహవస్తు వానరాః
ప్రబుద్ధపద్మప్రతిమాననా స్తదా. ౧౧౧
అపూజయ న్లక్ష్మణ మిష్టభాగినం
హతే రిపౌ భీమబలే దురాసదే.

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే - ఏకసప్తతితమస్సర్గః. ౭౧.

---

## ద్విసప్తతితమస్సర్గః

అతికాయం హతం శ్రుత్వా లక్ష్మణేన మహౌజసా,
ఉద్వేగ మగమద్రాజా వచనం చేద మబ్రవీత్. ౧
ధూమ్రాక్షః పరమామర్షీ ధన్వీ శస్త్రభృతాం వరః,
అకమ్పనః ప్రహస్తశ్చ కుమ్భకర్ణ స్తథైవ చ. ౨
ఏతే మహాబలా వీరా రాక్షసా యుద్ధకాఙ్క్షిణః,
జేతారః పరసైన్యానాం పరై ర్నిత్యాపరాజితాః. 3

నిహతా స్తే మహావీర్యా రామే ణాక్లిష్టకర్మణా,
రాక్షసా స్సుమహాకాయా నానాశస్త్రవిశారదాః. ౪

అన్యే చ బహవ శ్శూరా మహాత్మానో నిపాతితాః,

ప్రఖ్యాతబలవీర్యేణ పుత్త్రే ణేన్ద్రజితా మమ. ౫
యౌ హి తౌ భ్రాతరౌ వీరౌ బద్ధౌ దత్తవరై శ్శరైః,

య న్నశక్యం సురై స్సర్వై రసురై ర్వా మహాబలైః. ౬

లందఱు భయపడి యుద్ధంబువిడిచి పరుగెత్తుచు లంకాభిముఖులయి త్వరితంబుగాఁ బోయిరి. ౧౧౦

అప్పుడు భయంకరబలుండును దురాసదుండునగు శత్రువు హతుండైన పిమ్మట వానరులందఱు సంతుష్టులయి వికసితకమలంబులఁబోని ముఖంబు లలర విజయంబునొందిన లక్ష్మణునిఁ బూజించిరి. ౧౧౧

ఇది డెబ్బదియొకటవసర్గముఁ

---

## డెబ్బదిరెండవసర్గము.

రాక్షసరాజుఁడగు రావణుండు మహాపరాక్రమశాలియగు లక్ష్మణుండు అతికాయుని వధించినాఁడని విని పరమదుఃఖితుండై యిట్లని చెప్పెను. ౧

పరమకోపనుండును దుర్ధరుండును ఆయుధధారులలో నుత్తముండునగు ధూమ్రాక్షుండును అకంపనుఁడు ప్రహస్తుఁడు కుంభకర్ణుఁడు ఈ రాక్షసులు మహాబలపరాక్రమశాలులు; యుద్ధం బెప్పుడెప్పుడా యని కోరువారలు; శత్రుసైన్యముల జయించువారలు; శత్రువులవలన నెన్నఁడును బరాజయంబునొంది యెఱుఁగరు. ౨. ౩

మహాపరాక్రమశాలులు మహాకాయులు నానావిధాయుధ పరిశ్రమములయందును బండితులునగు నారాక్షసులను గూడ రాముండు వధించినాఁడు. ౪

ఇతరులును శూరులు మహాబలశాలులునగువారు పెక్కండ్రురాక్షసులం వధింపఁబడిరి.

ఖరాదులను వధించిన మహాపరాక్రమశాలుల నారామలక్ష్మణులను గూడఁ బ్రసిద్ధబలపరాక్రముఁడగు నాపుత్త్రుం డింద్రజిత్తు వరలబ్ధంబులయిన దివ్యబాణంబుల బంధించినాఁడు. ౫

ఆబంధము మిక్కిలియుం భయంకరమయినది; దాని విడిపించుటకు దేవత

మోక్తుం తద్బన్ధనం ఘోరం యక్షగన్ధర్వకిన్నరైః,

తన్నజానే ప్రభావై ర్వా మాయయా మోహనేన వా. ౭
శరబన్ధాద్విముక్తౌ తౌ భ్రాతరౌ రామలక్ష్మణౌ,

యే యోధా నిర్గతా శ్శూరా రాక్షసా మమ శాసనాత్. ౮
తే సర్వే నిహతా యుద్ధే వానరై స్సుమహాబలైః,

తం న పశ్యామ్యహం యుద్ధే యోఽద్య రామం సలక్ష్మణమ్.
శాసయే త్సబలం వీరం ససుగ్రీవవిభీషణమ్,

అహో ను బలవా న్రామో మహదస్త్రబలం చ వై. ౧౦
యస్య విక్రమ మాసాద్య రాక్షసా నిధనం గతాః,
తం మన్యే రాఘవం వీరం నారాయణ మనామయమ్. ౧౧
తద్భయాద్ధి పురీ లఙ్కా పిహితద్వారతోరణా,

అప్రమత్తైశ్చ సర్వత్ర గుప్తై రక్ష్యా పురీ త్వియమ్. ౧౨

అశోకవనికాయాం చ యత్ర సీతాఽభిరక్ష్యతే,
నిష్క్రామో వా ప్రవేశో వా జ్ఞాతవ్య స్సర్వథైవ నః. ౧౩
యత్ర యత్ర భవే ద్గుల్మ స్తత్ర తత్ర పునఃపునః,
సర్వతశ్చాపి తిష్ఠధ్వం స్వైస్స్వైః పరివృతా బలైః. ౧౪
ద్రష్టవ్యం చ పదం తేషాం వానరాణాం నిశాచరాః,
ప్రదోషే వార్ధరాత్రే వా ప్రత్యూషే వాపి సర్వతః. ౧౫

లందఱకుఁగాని మహాబలశాలులగు నసురులకుఁగాని యక్షులకుఁగాని గంధ ర్వులకుఁగాని కిన్నరులకుఁగాని యలవిగాదు. ౬

అన్నదమ్ములగు నా రామలక్ష్మణులు అట్టిబాణబంధమునుండి విడిపించు కొనిరి; అది ప్రభావముచేతనో మాయచేతనో మోహముచేతనో నాకుఁ దెలి యదు. ౭

నాయాజ్ఞవలన వీరులును శూరులునగు రాక్షసు లెవరెవరు యుద్ధం బునకుఁ బోయినారో వారలనందఱను యుద్ధంబున మహాబలశాలులగువానరులు వధించిపుచ్చిరి. ౮

ఇప్పుడు యుద్ధంబున మహావీరుఁడగు రాముని లక్ష్మణునితోఁ గూడ వానరసేనాసమేతంబుగా సుగ్రీవునితోను విభీషణునితోనుంగూడ వధింపఁజాలి నట్టివాఁ డెవ్వఁడును నాకగపడలేదు. ౯

రాముని యెదుటంబడినంతనె రాక్షసులందఱు మరణమునొందినారే; ఆహా! రామునిబల మెంతగొప్పది! అతని యస్త్రబలమును ఎంతయధికము! ౧౦

మహావీరుఁడగు నారాముఁడు నాశరహితుండగు నారాయణుఁడే యని తలంచెదను; అతనిభయమువలన నేకదా లంకాపురిలోపలి వెలుపలివాకిళ్ల నన్నిం టిని మూసుకొనియున్నాము. ౧౧

కావున రాక్షసులారా! మీరలు ఎంతమాత్ర మేమఱక మిమ్ముం గాపాడుకొనుచు ఈలంకాపురి నతిజాగ్రత్తతో రక్షింపుచుండవలయును. ౧౨

సీతాదేవి నుంచియుండు నశోకవనికయందు ఎవ్వనిగాని మాకుఁ దెలి యక లోపలికిఁగాని వెలుపలికిఁగాని యెంతమాత్రము పోనివ్వవలదు. ౧౩

మఱియు సేనాభాగము లెచ్చటెచ్చటనిలుపఁబడియున్నవో యచ్చ టంతయు మీమీసేనలంగూడి మాటిమాటికి గస్తుతిరుగుచుండవలయును. ౧౪

రాక్షసులారా! సాయంకాలమునందుఁగాని యర్ధరాత్రమునందుఁగాని ప్రాతఃకాలమునందుఁగాని యేకాలమునందుఁగాని వానరులుచేయుం కార్య ములను చూచుచుండుఁడు. ౧౫

నావజ్ఞా తేషు కర్తవ్యా వానరేషు కదాచన,
ద్విషతాం బల ముద్యుక్త మాపతత్కిం స్థితం సదా. ౧౬

తత స్తే రాక్షసా స్సర్వే శ్రుత్వా లఙ్కాధిపస్య తత్,
వచనం సర్వ మాతిష్ఠ న్యథావత్తు మహాబలాః. ౧౭
స తాన్ సర్వాన్ సమాదిశ్య రావణో రాక్షసాధిపః,
మన్యుశల్యం వహన్ దీనః ప్రవివేశ స్వమాలయమ్. ౧౮
తత స్స సన్దీపితకోపవహ్ని
ర్నిశాచరాణా మధిపో మహాబలః,
తదేవ పుత్ర వ్యసనం విచిన్తయ
న్ముహు ర్ముహుశ్చైవ తదా వ్యనిశ్వసత్, ౧౯

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే ద్విసప్తతితమస్సర్గః. ౭౨

## త్రి స ప్త తి త మ స్సర్గః.

తతో హతా న్రాక్షసపుఙ్గవాం స్తా
న్దేవా న్తకాది త్రిశిరోతికాయాన్,
రక్షోగణా స్తత్ర హతావశిష్టా
స్తే రావణాయ త్వరితం శశంసుః. ౧
తతో హతాంస్తాన్ సహసా నిశమ్య
రాజాముమోహాశ్రుపరిప్లుతా(జ్ఞః)క్షః,
పుత్రక్షయం భ్రాతృవధం చ ఘోరం
విచిన్త్య రాజా విపులం ప్రదధ్యౌ. ౨
తత స్తు రాజాన ముదీక్ష్య దీనం
శోకార్ణవే సంపరిపుప్లువానమ్,

వానరులని యెంతమాత్రము వారల నల్పములుగాఁ జూడవలదు; శత్రుసైన్యము యుద్ధముఁ జేయుచున్నదా? లేక మనపైకి వచ్చుచున్నదా? లేక నిల్చియూరకున్నదా? ఇట్లు ఎప్పుడు ఏలాగుననుండునదియుఁ దెలియవలెను. అని రావణుండు రాక్షసుల కాజ్ఞాపించెను. ౧౬

అంత బలవంతులగు సారాక్షసులందఱు లంకారాజుండగు రావణుండు చెప్పినమాటను విని యతం డానతిచ్చినచొప్పున అంతయుఁ గావించిరి. ౧౭

రాక్షసరాజుండగురావణుండు ఆరాక్షసులందఱ కట్లాజ్ఞాపించి దుఃఖంబునం గుందుచు దీనుండై తనగృహంబునకుఁ బోయెను. ౧౮

అంత నప్పుడు మహాబలుండును రాక్షసేశ్వరుండునగు రావణుండు కోపంబున మండిపడుచు మాటిమాటికి నాపుత్రవ్యసనంబు దలంచుకొని నిట్టూర్పులు విడిచెను. ౧౯

ఇది డెబ్బదిరెండవసర్గము.

## డెబ్బదిమూఁడవసర్గము.

అంత హతశేషులగురాక్షసులు దేవాంతకుఁడు త్రిశిరుఁడు అతికాయుఁడు మొదలయినవారలు యుద్ధంబున హతులయినారని శీఘ్రంబున రావణునకుఁ జెప్పిరి. ౧

అంత రాక్షసరాజుండగు రావణుఁడు అతికాయాదులందఱు హతులయిరన్నసంగతివిని దుఃఖమునఁ గన్నులనీళ్లుగాఱ మూర్ఛిల్లి కొంతవడికిం దేఱి భయంకరంబగు పుత్రనాశంబును తమ్ములచావును దలంచుకొని మిక్కిలిచింతం బగచెను. ౨

అంత రాక్షసోత్తముఁడును రావణకుమారుండునగు నింద్రజిత్తు దీనుండును దుఃఖసముద్రంబున మునింగియున్నవాఁడు నగురాక్షసరాజు రావణుం

రథర్షభో రాక్షసరాజసూను
స్త మిన్ద్రజి ద్వాక్య మిదం బభాషే. 3
న తాత! మోహం ప్రతిగన్తు మర్హసి
యత్రేన్ద్రజి జ్జీవతి రాక్షసేన్ద్ర!,
నేన్ద్రారిబాణాభిహతో హి కశ్చి
త్ప్రాణాన్ సమర్థ స్సమరేఽభిపాతుమ్. ౪
పశ్యాద్య రామం సహ లక్ష్మణేన
మద్బాణనిర్భిన్న వికీర్ణదేహమ్,
గతాయుషం భూమితలే శయానం
శితై శ్శరై రాచితసర్వగాత్రమ్. ౫
ఇమాం ప్రతిజ్ఞాం శృణు శక్రశత్రో
స్సునిశ్చితాం పౌరుషదైవయుక్తామ్,
అద్యైవ రామం సహ లక్ష్మణేన
సంతర్పయిష్యామి శరై రమోఘైః. ౬
అద్యేన్ద్రవైవస్వత విష్ణుమిత్ర
సాధ్యాశ్వి వైశ్వానరచన్ద్రసూర్యాః,
ద్రక్ష్యన్తు మే విక్రమ మప్రమేయం
విష్ణో రివోగ్రం బలియజ్ఞవాటే. ౭
స ఏవ ముక్త్వా త్రిదశేన్ద్రశత్రు
రాపృచ్ఛ్య రాజాన మదీనసత్త్వః,
సమారురోహానిలతుల్యవేగం
రథం ఖరశ్రేష్ఠసమాధియుక్తమ్. ౮
త మాస్థాయ మహాతేజా రథం హరిరథోపమమ్,
జగామ సహసా తత్ర యత్ర యుద్ధమరిన్దమః. ౯

జూచి యిట్లని చెప్పెను. ౩

రాక్షసేశ్వరుండవగు నాయనా! ఇంద్రజిత్తు బ్రతికియుండునప్పుడు నీవిట్లు దుఃఖంబు నొందవలదు; యుద్ధంబున నింద్రజిత్తుయొక్క బాణంబులచేఁ గొట్టఁబడినవాఁడై యెట్టివాఁడును బ్రాణంబుల దక్కించుకొనఁజాలఁడు. ౪

ఇప్పుడు రాముని లక్ష్మణునితోఁగూడ బాణంబులచే భిన్నదేహుండ్రై గతప్రాణుండ్రై దేహమంతయును గుచ్చుకొనియుండు బాణంబులతో నేలంబడియుండునట్లు గావించెదను చూడుము. ౫

ఇంద్రజిత్తును నేను చక్కఁగా నిశ్చయించి పౌరుషదైవబలంబుల రెంటితోనుంగూడిన ప్రతిజ్ఞను జేయుచున్నాను వినుము; ఇప్పుడే రాముని లక్ష్మణుని అమోఘబాణంబులం దీర్చిపుచ్చెదను. ౬

ఇప్పుడును దేవేంద్రుండును యముండును విష్ణుదేవుండును మిత్రుఁడును సాధ్యులును అశ్వినీదేవతలును అగ్నిహోత్రుఁడును జంద్రుఁడును సూర్యుఁడును బలిచక్రవర్తియాగశాలయందుఁ ద్రివిక్రమావతారరూపుఁడగు విష్ణుదేవుని పరాక్రమమువంటి యప్రమేయంబగు నాపరాక్రమముం జూడఁగలరు. అని యింద్రజిత్తు రావణునితోఁ జెప్పెను. ౭

మహాబలుండగు నా యింద్రజిత్తు తండ్రియగు రావణునితో నీప్రకారమునం జెప్పి తండ్రియనుమతిం దీసికొని వాయుసమానవేగంబును నుత్తమంబులగు కంచరగాడిదలు గట్టినదియునగు రథంబు నారోహించెను. ౮

మహాతేజుండును శత్రువుల నణఁగఁద్రొక్కఁజాలినవాఁడు నగు నాయింద్రజిత్తు సూర్యరథమువలె వెలుంగుచున్న యాయరదంబు నెక్కి

తం ప్రస్థితం మహాత్మాన మనుజగ్ము ర్మహాబలాః,
సంహర్షమాణా బహవో ధనుఃప్రవరపాణయః. ౧౦
గజస్కన్ధగతాః కేచి త్కేచి త్ప్రవరవాజిభిః,
ప్రాసముద్గరనిస్త్రింశపరశ్వథగదాధరాః. ౧౧
స శఙ్ఖనినదైః పూర్ణై ర్భేరీణాం చాపి నిస్వనైః,
జగామ త్రిదశేన్ద్రారి స్తూయమానో నిశాచరైః. ౧౨

స శఙ్ఖశశివర్ణేన చ్ఛత్రేణ రిపుసూదనః,
రరాజ ప్రతిపూర్ణేన నభ శ్చన్ద్రమసా యథా. ౧౩

అవీజ్యత తతో వీరో హైమై ర్హేమవిభూషితైః,
చారుచామరముఖ్యైశ్చ ముఖ్య స్సర్వధనుష్మతామ్. ౧౪

తత స్త్రివ న్నిర్జితా లఙ్కా సూర్యప్రతిమతేజసా,
రరాజా ప్రతివీర్యేణ ద్యౌరివార్కేణ భాస్వతా, ౧౫

స సంప్రాప్య మహాతేజా యుద్ధభూమి మరిన్దమః,
స్థాపయామాస రక్షాంసి రథం ప్రతి సమన్తతః. ౧౬

తత స్తు హుతభోక్తారం హుతభు క్సదృశప్రభః,
జుహావ రాక్షసశ్రేష్ఠో మన్త్రవ ద్విధివ త్తదా. ౧౭

స హవిర్లాజసంస్కారై ర్మాల్యగన్ధపురస్కృతైః,
జుహువే పావకం తత్ర రాక్షసేన్ద్రః ప్రతాపవాన్. ౧౮

యుద్ధభూమికిఁ బోయెను. ౯

మహాబలశాలులగు రాక్షసులు పెక్కండ్రు పరమసంతోషంబున ధనుర్ధరులయి కొందఱు గజంబులను గొంద ఱుత్తమాశ్వంబులను ఆరోహించి ప్రాసంబులను ముద్గరంబులను ఖడ్గంబులను గొడ్డళ్లను గదలను ధరించి యుద్ధమునకుఁ బోవుచున్న మహాబలుండగు నయ్యింద్రజిత్తు వెంటం బోయిరి. ౧౦

ఆయింద్రజిత్తు వెంటవచ్చు రాక్షసులు మహాధ్వని గలుగునట్లు శంఖములు పూరించియుఁ భేరులు వాయించియుఁ దన్నుఁ బ్రస్తుతింపఁ జేరోలగంబునం బోయెను. ౧౨

శత్రుహంతయగు నయ్యింద్రజిత్తు నిండుచందురునిచే నాకాశంబు ప్రకాశించునట్లు శంఖమువలెను చంద్రబింబమువలెను ధవళంబయిన ఛత్రముచే నెంతయుఁ బ్రకాశించెను. ౧౩

అంత సమస్తధనుర్ధరులలోను ముఖ్యుండును బరాక్రమవంతుండునగు నింద్రజిత్తును బంగారుదండములు గలవియు బంగారుశలాకలచే నలంకృతములు నగు సుందరచామరంబులచే వీచిరి. ౧౪

అంత సూర్యునిభంగి వెలుఁగుచున్న ఎదురులేని పరాక్రమముఁగలవాఁడగు నాయింద్రజిత్తుచే సూర్యునిచే నాకాశమువలె లంకాపురి యెంతయుఁ బ్రకాశించినది. ౧౫

మహాపరాక్రమశాలియు శత్రువుల నడఁగఁద్రొక్కు వాఁడునగు నాయింద్రజిత్తు యుద్ధభూమినొంది దివ్యరథమునొందుటకై హోమముసేయ నుద్యుక్తుండై చుట్టును రాక్షసులఁ గావలియుంచెను. ౧౬

అంత నగ్నితో సమానమయిన కాంతిగల రాక్షసోత్తముఁడగు నాయింద్రజిత్తు అప్పుడు యథాశాస్త్రముగా మంత్రపూర్వకముగా అగ్నిహోత్రమునందు హోమము గావించెను. ౧౭

అచ్చట మహాపరాక్రమశాలియగు రాక్షసశ్రేష్ఠుం డాయింద్రజిత్తు గంధమాల్యసహితంబుగా సంస్కృతంబులయిన హవిస్సును బేలాలను అగ్ని

శస్త్రాణి శరపత్రాణి సమిధోఽథ విభీతకాః,
లోహితాని చ వాసాంసి స్రువం కార్ష్ణాయసం తథా. ౧౯

స తత్రాగ్నిం సమాస్తీర్య శరపత్రైస్సతోమరైః,
ఛాగస్య కృష్ణవర్ణస్య గళం జగ్రాహ జీవతః. ౨౦

సకృదేవ సమిద్ధస్య విధూమస్య మహార్చిషః,
బభూవు స్తాని లిఙ్గాని విజయం యాన్యదర్శయన్. ౨౧

ప్రదక్షిణావర్తశిఖ స్తప్తకాఞ్చనభూషణః,
హవి స్తత్ప్రతిజగ్రాహ పావక స్స్వయ మాస్థితః ౨౨
సోఽస్త్ర మాహారయామాస బ్రాహ్మ మిన్ద్రరిపు స్తదా.
ధనుశ్చాత్మరథంచైవ సర్వం తత్రాభ్యమన్త్రయత్. ౨౩
తస్మి న్నాహూయమానేఽస్త్రే హూయమానే చ పావకే,
సార్థం గ్రహేన్దునక్షత్రై ర్వితత్రాస నభస్స్థలమ్. ౨౪

స పావకం పావకదీప్తతేజా
హుత్వా మహేన్ద్రప్రతిమప్రభావః,
సచాపబాణాసిరథాశ్వసూతః
ఖేఽన్తర్దధేఽఽత్మాన మచిన్త్యరూపః. ౨౫
తతో హయరథాకీర్ణం పతాకాధ్వజశోభితమ్,
నిర్యయౌ రాక్షసబలం నర్దమానం యుయుత్సయా. ౨౬

తే శరై ర్బహుభి శ్చిత్రై స్తీక్ష్ణవేగై రలంకృతైః,

హోత్రమునందు హోమముచేసెను. ౧౮

ఆహోమమునందు ఇంద్రజిత్తు జెల్లునకుబదులు ఆయుధంబులను తాండ్రపుల్లలుసమిత్తులును ఎఱ్ఱనివస్త్రములును నల్లయినుపస్రువంబును ఉంచుకొనెను. ౧౯

ఆయుద్ధభూమియందు ఇంద్రజిత్తు తోమరంబులతోను బెల్లెంతోను అగ్నిపరిస్తరణముగావించి ప్రతికియున్న నల్లనిమేకను బశువునుగాఁ బట్టి హోమముగావించెను. ౨౦

ఒక్కసారి సమిత్తులతో జ్వలింపఁజేయఁగానే యాయగ్నిహోత్రము విజయసూచకంబులగు చిహ్నములతో పొగలేక పెద్దపెద్దజ్వాలలు గలిగి యుండినది. ౨౧

అగ్నిహోత్రుఁడు తానె ప్రదక్షిణముగాఁ జుట్టుజ్వాలలతోను మంచి బంగారుభూషణములతోను బ్రాదుర్భవించియాహవిస్సును బ్రతిగ్రహించెను.

అప్పుడు ఆయింద్రజిత్తు బ్రహ్మాస్త్రమును జపించి యమ్మహాస్త్రముచే తనరథము ధనుస్సు మొదలగువానినన్నిటిని అభిమంత్రించెను. ౨౩

అట్లు ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రమంత్రము జపించుటయుఁ అగ్నిహోత్రమున హోమముగావించుటయుఁ గ్రహములతోను జంద్రునితోను నక్షత్రములతోనుంగూడ నాకాశమంతయుఁ భయంబునఁ జలించినది. ౨౪

అగ్నిహోత్రమునకుంబోలెఁ గాంతియును దేవేంద్రునకుంబోలెఁ బ్రభావము గలవాఁడును ఇట్టిదనిచెప్పరానిశక్తిగలవాఁడునగు నాయింద్రజిత్తు, ఆప్రకారమున నగ్నిహోత్రమునందు హోమముచేసి తాను ధనుర్బాణఖడ్గరథాశ్వసారథిసహితంబుగా నాకాశంబున నంతర్ధానంబునొందెను. ౨౫

అంత గుఱ్ఱములతోను రథములతోను నిండియుండునదియుఁ బతాకాధ్వజంబులతో నొప్పుచున్నదియునగు నారాక్షససేన యుద్ధోత్సాహంబున గర్జించుచు వెడలెను. ౨౬

ఆరాక్షసులు కాంచనాలంకృతంబులును జిత్రవర్ణంబులును మహా

తోమరై రఙ్కుశైశ్చాపి వానరా జఘ్ను రాహవే. ౨౭

రావణిస్తు తతః క్రుద్ధ స్తాన్ నిరీక్ష్య నిశాచరాన్,
హృష్టా భవన్తో యుధ్యన్తు వానరాణాం జిఘాంసయా. ౨౮

తత స్తే రాక్షసా స్సర్వే నర్దన్తో జయకాఙ్క్షిణః,
అభ్యవర్షం స్తతో ఘోరా న్వానరాన్ శరవృష్టిభిః. ౨౯
సతు నాళీకనారాచై ర్గదాభి ర్ముసలై రపి,
రక్షోభి స్సంవృత స్సఙ్ఖ్యే వానరా న్విచకర్త హ. ౩౦
తే వధ్యమానా స్సమరే వానరాః పాదపాయుధాః,
అభ్యద్రవన్త సహితా రావణిం రణకర్కశమ్. ౩౧

ఇన్ద్రజిత్తు తతః క్రుద్ధో మహాతేజా మహాబలః,
వానరాణాం శరీరాణి వ్యధమ ద్రావణాత్మజః. ౩౨
శరేణైకేన చ హరీ న్నవ పఞ్చ చ సప్త చ,
చిచ్ఛేద సమరే క్రుద్ధో రాక్షసాన్ సమ్ప్రహర్షయన్. ౩౩

స శరై స్సూర్యసఙ్కాశై శ్శాతకుమ్భవిభూషితైః,
వానరాన్ సమరే వీరః ప్రమమాథ సుదుర్జయః. ౩౪

తే భిన్నగాత్రా స్సమరే వానరా శ్శరపీడితాః,
పేతుర్మథితసఙ్కల్పా స్సురై రివ మహాసురాః. ౩౫

తం తపన్త మివాదిత్యం ఘోరై ర్బాణగభస్తిభిః,
అభ్యధావన్త సంక్రుద్ధా స్సంయుగే వానరర్షభాః. ౩౬

వేగంబులునగు పెక్కు బాణంబుల చేతను దోమరంబుల చేతను అంకుశంబుల చేతను యుద్ధంబున వానరులం బ్రహరించిరి. ౨౭

అంత ఇంద్రజిత్తు కుపితుండై యారాక్షసులం జూచి యిట్లని చెప్పెను.

మీరలు సంతోషంబున యథేచ్ఛంబుగా యుద్ధంబు గావించి వానరుల వధింపుఁడు. అని యింద్రజిత్తు రాక్షసులతోఁ జెప్పెను. ౨౮

అంత నారాక్షసులందఱు జయముఁగోరినవారలయి గర్జించుచు భయంకరాకారులగు వానరులపై బాణవర్షంబులు గురిపించిరి. ౨౯

అయింద్రజిత్తు యుద్ధంబున రాక్షససహితుండై బాణముల చేతను గదల చేతను ముసలంబుల చేతను వానరులను వధించెను. ౩౦

ఆవానరు లట్లు ఇంద్రజిత్తుచేఁ గొట్టఁబడినవారలయి వృక్షంబులం గొని యందఱు నొకటిగా యుద్ధకర్కశుండగు నింద్రజిత్తుమీఁదికిఁ బోయిరి. ౩౧

అంత మహాపరాక్రమశాలియు మహాబలుండును రావణపుత్త్రుండునగు నింద్రజిత్తు కుపితుండై యవ్వానరుల దేహములను జించి చెండాడెను. ౩౨

ఆయింద్రజిత్తు యుద్ధంబునఁ గుపితుండై రాక్షసులు సంతోషంబు నొంద ఒక్కొక బాణంబునకు తొమ్మిదినుందిని అయిదుగురను ఏడ్గురను వానరులను ఖండించెను. ౩౩

పరాక్రమవంతుండును దుర్జయుండునగు నింద్రజిత్తు యుద్ధంబున సూర్యసమానంబులును గాంచనాలంకృతంబులునగు బాణములచే వానరులను వధించెను. ౩౪

అవ్వానరులు యుద్ధమున బాణపీడితులయి దేహమంతయుం ఛిన్నమయి నెత్తురుగాఱ, జయమునం దాశవదలుకొని దేవతలచేఁ గొట్టఁబడిన యసురులం బోలె నేలంబడిరి. ౩౫

అంత నప్పుడు యుద్ధంబున మఱికొందఱు మేటివానరవీరులు కుపితులయి బాణంబులను కిరణంబులచే సూర్యునికై వడి దురాధర్షుండై వెలుంగు

తత స్తు వానరా స్సర్వే భిన్న దేహా విచేతసః,
వ్యథితా విద్రవన్తిస్మ రుధిరేణ సముక్షితాః. ౩౭
రామస్యార్థే పరాక్రమ్య వానరా స్త్యక్తజీవితాః,
నర్దన్త స్తేఽభివృత్తా స్తు సమరే సశిలాయుధాః. ౩౮

తే ద్రుమైర్ పర్వతాగ్రై శ్చ శిలాభిశ్చ ప్లవఙ్గమాః,
అభ్యవర్షన్త సమరే రావణిం పర్యవస్థితాః. ౩౯
తద్ద్రుమాణాం శిలానాం చ వర్షం ప్రాణహరం మహత్,
వ్యపోహత మహాతేజా రావణి స్సమితింజయః. ౪౦

తతః పావకసంకాశై శ్శరై రాశీవిషోపమైః,
వానరాణా మనీకాని బిభేద సమరే ప్రభుః. ౪౧

అష్టాదశశరై స్తీక్ష్ణై స్స విద్ధ్వా గన్ధమాదనమ్,
వివ్యాథ నవభి శ్చైవ నళం దూరా దవస్థితమ్. ౪౨
సప్తభి స్తు మహావీర్యో మైన్దం మర్మవిదారణైః,
పఞ్చభి ర్విశిఖై శ్చైవ గజం వివ్యాథ సంయుగే. ౪౩

జామ్బవన్తం తు దశభి ర్నీలం త్రింశద్భిరేవచ,

సుగ్రీవ మృషభం చైవ సోఽఙ్గదం ద్వివిదం తథా. ౪౪
ఘోరై ర్దత్తవరై స్తీక్ష్ణై ర్నిష్ప్రాణా నకరో త్తదా,

అన్యానపి తదా ముఖ్యా న్వానరా న్బహుభి శ్శరైః. ౪౫

చున్న యింద్రజిత్తుమీఁదికిఁ బోయిరి. ౩౬

అంత సర్వవానరవీరులు ఇంద్రజిత్తుయొక్క బాణంబులచే భిన్నదేహు లయి ధైర్యమువీడి భయమునొంది నెత్తురువెల్లువలుగాఁగాఱఁబరు గెత్తిరి. ౩౭

అవ్వానరులు యుద్ధంబున రామకార్యార్థమయి పరాక్రమంబు విడువక ప్రాణంబులపై నాశవిడిచి గర్జించుచు, పెనుతాల నాయుధములుగాఁ జేసికొని వెనుదీయక యింద్రజిత్తుపైకిఁ బోయిరి. ౩౮

ఆవానరులు యుద్ధంబున అట్లెదుర్కొనిలిచిన వారలయి వృక్షంబులను పర్వతశిఖరంబులను శిలలను ఇంద్రజిత్తుపై వర్షించిరి. ౩౯

మహాతేజుఁడును యుద్ధంబున విజయంబు నొందువాఁడు నగు నా యింద్రజిత్తు ప్రాణంబుల హరించునట్టి భయంకరమయిన యావృక్షశిలావర్షంబును బాణములచే నివారించెను. ౪౦

అంత సమర్థుండగు నా ఇంద్రజిత్తు యుద్ధంబున అగ్నిసమానంబులును క్రూర సర్పతుల్యంబులునగు బాణంబులఁ బ్రయోగించి వానరసైన్యంబుల భేదించెను. ౪౧

ఆయింద్రజిత్తుపదునెనిమిది కఱకుబాణంబులచే గంధమాదనుని గొట్టి దూరంబుననున్న నలుని దొమ్మిదిబాణంబులఁ బ్రహరించెను. ౪౨

మహాపరాక్రమశాలియగు ఇంద్రజిత్తు, మర్మస్థానములను భేదించునట్టి యేదుబాణంబుల మైందునిఁ బ్రహరించి ఏదుబాణంబుల గజుని నొప్పించెను. ౪౩

ఇంద్రజిత్తు జాంబవంతుని బదిబాణంబులను నీలుని ముప్పది బాణంబులను నొప్పించెను.

ఇప్పుడాయింద్రజిత్తు సుగ్రీవుని ఋషభుని అంగదుని ద్వివిదుని భయంకరములును వరప్రభావముగలవియు తీక్ష్ణంబులునగు బాణంబులచేత మూర్ఛితులం గావించెను. ౪౪

అప్పుడు యింద్రజిత్తు పరమకుపితుండై ప్రలయకాలాగ్ని వహోగ్రుని

అర్దయామాస సంక్రుద్ధః కాలాగ్నిరివ మూర్ఛితః,
స శరై స్సూర్యసఙ్కాశై స్సుముక్తై శ్శీఘ్రగామిభిః. ౪౮
వానరాణా మనీకాని నిర్మమన్థ మహారణే,
ఆకులాం వానరీం సేనాం శరజాలేన మోహితామ్. ౪౯
హృష్టస్స పరయా ప్రీత్యా దదర్శ క్షతజోక్షితామ్,
పునరేవ మహాతేజా రాక్షసేన్ద్రాత్మజో బలీ. ౪౭
సంసృజ్య బాణవర్షం చ శస్త్రవర్షం చ దారుణమ్,
మమర్ద వానరానీక మిన్ద్రజి త్త్వరితో బలీ. ౪౯
స్వసైన్య ముత్సృజ్య సమేత్య తూర్ణం
మహారణే వానరవాహినీషు,
అదృశ్యమాన శ్శరజాలముగ్రం
వవర్ష నీలామ్బుధరో యథాఽమ్బు. ౫౦
తే శక్రజిద్బాణవిశీర్ణదేహా
మాయాహతా విస్వర మున్నదన్తః,
రణే నిపేతు ర్హరయోఽద్రికల్పా
యథేన్ద్రవజ్రాభిహతా నగేన్ద్రాః. ౫౧
తే కేవలం సందదృశు శ్శితాగ్రా
న్బాణా న్రణే వానరవాహినీషు,
మాయానిగూఢం తు సురేన్ద్రశత్రుం
న చావృతం రాక్షస మభ్యపశ్యన్. ౫౨
తత స్స రక్షోధిపతి ర్మహాత్మా
సర్వా దిశో బాణగణై శ్శితాగ్రైః,

వడుపునం గ్రాలుచు ఇతరులగు మేటివానరులనుంగూడ పెక్కు బాణముల చేత నొప్పించెను. ౪౫

ఇంద్రజిత్తు అమ్మహాయుద్ధంబున సూర్యసమానంబులును ఆ కర్ణాంతము నాకర్షించి విడువఁబడినవియుం మహావేగంబులునగు బాణంబులచే వానర సైన్యంబులం జించి చెండాడెను. ౪౬

ఇంద్రజిత్తు వానరసేనయంతయుం దన బాణసమూహముచే మూర్ఛిత యయి నెత్తుటం దోఁగుచు నిశ్చేష్టయయి యుండుటను జూచి మిక్కిలియుం సంతోషంబు నొందెను. ౪౭

మహాపరాక్రమశాలియుం వేగవంతుండును బలవంతుండును వరదాన బలముగలవాఁడును రాక్షసరాజపుత్రుండునగు నింద్రజిత్తు మరల బాణంబు లను ఖడ్గాద్యాయుధంబులను గురిపించి వానరసేన నెంతయుం నొప్పించెను.

అమ్మహాయుద్ధంబున నింద్రజిత్తు తన సైన్యంబునువిడిచి వానరసైన్యముఁ జొచ్చి యదృశ్యుఁడై యాకాశగతుండై నల్లనిమేఘము జలమును వర్షించు నట్లు వానరసేనలపై భయంకరంబులగు బాణసమూహములను వర్షించెను.

అయ్యుద్ధంబునందు పర్వతాకారులగు నవ్వానరులు ఇంద్రజిత్తు ప్రయోగించు బాణవర్షంబులచే భిన్నదేహులయి మాయాబద్ధులయి వికృత స్వరముగా నఱచుచు దేవేంద్రుని వజ్రాయుధముచే ఛిన్నంబులగు పర్వతంబుల భంగి నేలంగూలిరి. ౫౧

అవ్వానరులు యుద్ధంబున కఱకుబాణంబులు వానరసేనలపైఁ బడుటను మాత్రము చూచుచుండిరే కాని మాయచేఁ బ్రచ్ఛన్నుండై యున్న యింద్రజిత్తుమాత్రము వారలకుఁ గనుపడనేలేదు. ౫౨

అంత మహాపరాక్రమశాలియగు రాక్షసశ్రేష్ఠుఁడైన యాయింద్ర జిత్తు, సూర్యప్రకాశంబులగు కఱకుబాణంబులచే దిక్కులన్నియుం గప్పి

ప్రచ్ఛాదయామాస రవిప్రకాశై
ర్విషాదయామాస చ వానరేన్ద్రాన్. ౫౩
స శూలనిస్త్రింశపరశ్వధాని
వ్యావిధ్య దీప్తానలసన్నిభాని,
స విస్ఫులిఙ్గోజ్జ్వలపావకాని
వవర్ష తీవ్రం ప్లవగేన్ద్రసైన్యే. ౫౪
తతో జ్వలనసఙ్కాశై శ్శరై ర్వానరయూథపాః.
తాడితా శ్శక్రజిద్బాణైః ప్రఫుల్లా ఇవ కింశుకాః. ౫౫

తేఽన్యోన్య మభిసర్పన్తో నినదన్త శ్చ విస్వరమ్,
రాక్షసేన్ద్రాస్త్రనిర్భిన్నా నిపేతు ర్వానరర్షభాః. ౫౬
ఉదీక్షమాణా గగనం కేచిన్నేత్రేషు తాడితాః,
శరై ర్వివిశు రన్యోన్యం పేతుశ్చ జగతీతలే. ౫౭
హనూమన్తం చ సుగ్రీవమఙ్గదం గన్ధమాదనమ్,
జామ్బవన్తం సుషేణం చ వేగదర్శిన మేవ చ. ౫౮
మైన్దం చ ద్వివిదం నీలం గవాక్షం గజగోముఖౌ,
కేసరిం హరిలోమానం విద్యుద్దంష్ట్రం చ వానరమ్. ౫౯
సూర్యాననం జ్యోతిముఖం తథా దధిముఖం హరిమ్,
పావకాక్షం నళం చైవ కుముదం చైవ వానరమ్. ౬౦
ప్రాసై శ్శూలై శ్శితై ర్బాణై రిన్ద్రజి న్మన్త్రసంహితైః,
వివ్యాధ హరిశార్దూలాన్ సర్వాం స్తా న్రాక్షసోత్తమః. ౬౧
స వై గదాభి ర్హరియూథముఖ్యాన్
నిర్భిద్య బాణై స్తపనీయపుఙ్ఖైః,
వవర్ష రామం శరవృష్టిజాలై

వానరోత్తముల నొప్పించెను. ౫౩

ఇంద్రజిత్తు మండుచున్న యగ్నిహోత్రమువలెఁ గ్రాలుచున్న శూలంబులను ఖడ్గంబులను బరశ్వధంబులను మిఱుంగుఱులురాల గిఱగిఱాఁ ద్రిప్పి వానరరాజసేనపైఁ బ్రయోగించెను. ౫౪

అంత వానరవీరులు అగ్నిసమానంబులగు నింద్రజిద్బాణంబులం గొట్టఁబడిన వారలయి దేహమంతయు నెత్తురు వెల్లువలుగా చక్కఁగాఁ బూచిన మోదుగుచెట్లువలె నుండిరి. ౫౫

ఆ వ్వానరోత్తములు ఇంద్రజిత్తు బాణంబులచే ఛిన్నదేహులయి ఒకరిపై నొకరు పడుచు వికృతస్వరంబుగా నఱచుచు నేలంగూలిరి. ౫౬

కొందఱు తలయెత్తి యాకాశమును జూచుచు కన్నులయందు బాణంబులు నాటఁగా ఒకరిపై నొకరు పడుచు నేలంగూలిరి. ౫౭

రాక్షసోత్తముఁడగు నింద్రజిత్తు హనుమంతుని సుగ్రీవు నంగదుని గంధమాదనుని జాంబవంతుని సుషేణుని వేగదర్శిని మైందుని ద్వివిదుని గవాక్షుని గజుని గోముఖుని కేసరిని హరిలోముని విద్యుద్దంష్ట్రుని సూర్యాననుని జ్యోతిర్ముఖుని దధిముఖుని పావకాక్షుని నలుని కుముదుని ఈ వానరోత్తముల నందఱను బ్రహ్మాస్త్రమంత్రముచే నభిమంత్రితంబులగు ప్రాసముల చేతను శూలములచేతను గఱకుబాణములచేతను మిక్కిలియుఁ నొప్పించెను. ౫౮, ౬౧

ఆ యింద్రజిత్తు అట్లు గదలచేతను గాంచనపుంఖములగు బాణముల చేతను వానరవీరుల నొప్పించి యంత రామలక్ష్మణులమీఁద సూర్యకిరణతుల్యంబులగు బాణంబులను కుప్పకుప్పగా వర్షించెను. ౬౨

స్సలక్ష్మణం భాస్కరరశ్మికల్పైః. ౬౨
స బాణవర్షై రభివృష్యమాణో
ధారానిపాతానివ తా నచిన్త్య,
సమీక్షమాణః పరమాద్భుతశ్రీ
రామ స్తదా లక్ష్మణ మిత్యువాచ. ౬౩
అసౌ పునర్లక్ష్మణ! రాక్షసేన్ద్రో
బ్రహ్మాస్త్ర మాశ్రిత్య సురేన్ద్రశత్రుః,
నిపాతయిత్వా హరిసైన్య ముగ్ర
మస్మాన్ శరై రర్దయతి ప్రసక్తః. ౬౪
స్వయమ్భువా దత్తవరో మహాత్మా
ఖ మాస్థితో ఽన్తర్హితభీమకాయః,
కథం ను శక్యో యుధి నష్టదేహో
నిహన్తు మద్యేన్ద్రజి దుద్యతాస్త్రః. ౬౫
మన్యే స్వయమ్భూ ర్భగవా నచిన్త్యో
య స్యైతదస్త్రం ప్రభవ శ్చ యో(ఽద్య)స్య,
బాణావపాతాం స్త్వ మి హాద్య ధీమన్!
మయా సహావ్యగ్రమనా స్సహస్వ. ౬౬
ప్రచ్ఛాదయత్యేష హి రాక్షసేన్ద్ర
స్సర్వా దిశస్సాయకవృష్టిజాలైః,
ఏతచ్చ సర్వం పతితాగ్ర్యశూరం
న భ్రాజతే వానరరాజసైన్యమ్. ౬౭
ఆవాం తు దృష్ట్వా పతితౌ విసంజ్ఞౌ
నివృత్తయుద్ధౌ గతరోషహర్షౌ,
ధ్రువం ప్రవేక్ష్యత్యమరారివాస

అప్పుడు పరమాశ్చర్యకర శ్రీసంపన్నుండగు నారాముండు. ఆప్రకారమున నింద్రజిత్తు తనపై పెక్కుబాణవర్షంబులు గురియుచున్నను జలవర్షమునువలె దానిసరకుసేయక లక్ష్మణుంజూచి యిట్లని చెప్పెను. ౬౩

లక్ష్మణుఁడా! మరల రాక్షసశ్రేష్ఠుండగు నీయింద్రజిత్తు బ్రహ్మాస్త్రము నాశ్రయించి యమ్మహాప్రభావంబున భయంకరంబగు వానరసైన్యము నంతయును వధించి మనల బాణములచే నొప్పించుచున్నాఁడు. ౬౪

మహాత్ముండగు నింద్రజిత్తు ఇప్పుడు యుద్ధంబున బ్రహ్మదేవుని వరంబలంబునం జేసి ఆకాశంబునొంది యంతర్హితుండై బ్రహ్మాస్త్రబలంబున మనల నొప్పించుచున్నాఁడు; ఆతండు మనకన్నుల కగపడుటలేదు; కాఁబట్టి యిప్పు డతని వధింప నలవిగాదు. ౬౫

బుద్ధిమంతుఁడవగు లక్ష్మణుఁడా! ఇట్టిమహానీయమయిన యస్త్రంబునకు దేవతగాను కారణముగాను నుండు భగవంతుండగు బ్రహ్మదేవుని మహిమ యచింత్యమని తలంచెదను; కాబట్టి నీవును నాతోఁగూడ మనస్సునఁ గలఁత నొందక యిప్పుడు ఈబాణపాతంబుల నోర్చియుండుము. ౬౬

ఈ యింద్రజిత్తు పెక్కుబాణవర్షంబులు పరఁగించి సమస్త దిక్కులను నీరంధ్రము గాఁ గప్పుచున్నాఁడు; ఈ వానర సైన్యమంతయును నుత్తమ శూరులు పడుటవలన నెంతమాత్రము ప్రకాశింపకున్నది. ౬౭

ఈ యింద్రజిత్తు మనకు యుద్ధము సేయఁజాలక మూర్ఛితులమయి శోకోత్సాహములు లేక నేలంబడియుండుటను చూచినంతనె జయలక్ష్మీ యబ్బెనను సంతోషముతోఁ దప్పక లంకాపురికిఁ బోఁగలఁడు; ఇది నిశ్చ

ముషో సమాదాయ రణాగ్రలక్ష్మీమ్. ౧౮
తతస్తు తా విన్ద్రజిదస్త్రజాలై
ర్బభూవతు స్తత్ర తథా విశస్తౌ,
స చాపి తౌ తత్ర విదర్శయిత్వా
ననాద హర్షా ద్యుధి రాక్షసేన్ద్రః. ౧౯
స తత్తదా వానరసైన్య మేవం
రామం చ సఙ్ఖ్యే సహ లక్ష్మణేన,
విషాదయిత్వా సహసా వివేశ
పురీం దశగ్రీవభుజాభిగుప్తామ్. ౨౦

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే త్రిసప్తతితమస్సర్గః. ౨3.

---

## చతుస్సప్తతితమస్సర్గః.

తయో స్తదా సాదితయో రణాగ్రే
ముమోహ సైన్యం హరిపుఙ్గవానామ్,
సుగ్రీవనీలాఙ్గదజామ్బవన్తో
నచాపి కించి త్ప్రతిపేదిరే తే. ౧
తతో విషణ్ణం సమవేక్ష్య సైన్యం
విభీషణో బుద్ధిమతాం వరిష్ఠః,
ఉవాచ శాఖామృగరాజవీరా
నాశ్వాసయ న్నప్రతిమై ర్వచోభిః. ౨
మా భైష్ట నా స్త్యత్ర విషాదకాలో
యదార్యపుత్త్రౌ వివశౌ విషణ్ణౌ,
స్వయమ్భువో వాక్య మథోద్వహన్తౌ
యత్సాదితా విన్ద్రజిదస్త్రజాలైః. 3
తస్మై తు దత్తం పరమాస్త్రమేత

యము. అని రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పెను. ౬౮

అంత నచ్చట శాస్త్రకారకుఁడనై యా రామలక్ష్మణులు ఇంద్రజిత్తు బాణంబులచేఁ బీడితులయి పడియుండిరి; రాక్షసశ్రేష్ఠుఁడగు నాయింద్రజిత్తును అట్లు రామలక్ష్మణులు పడియుండుటం జూచి సంతోషంబుచే యుద్ధమధ్యంబున సింహనాదంబుచేసెను. ౬౯

ఆ యింద్రజిత్తు అప్పుడు యుద్ధంబున అట్లు వానరసైన్యమంతయుం రామలక్ష్మణులను మూర్ఛనొందునట్లు చేసి శీఘ్రంబున రావణబాహురక్షితంబగు లంకాపురిం బ్రవేశించెను. ౭౦

ఇది డెబ్బదిమూఁడవసర్గము.

## డెబ్బదినాలుగవసర్గము.

అప్పుడు రామలక్ష్మణులు మూర్ఛితులగుటయుం జూచి వానరసేన యంతయు భయంబున మూర్ఛనొందెను; సుగ్రీవుఁడు నీలుఁడంగదుఁడు జాంబవంతుఁడు వీరలు మూర్ఛితులయి యుండుటవలన ఏసంగతియుం దెలియరైరి.

అంత బుద్ధిమంతులలో శ్రేష్ఠుండగు విభీషణుండు వానరసైన్యమంతయుం భయవిహ్వలమయి యుండుటం జూచి సదృశంబులగు మాటలచే వానరవీరుల నాశ్వాసించుచు నిట్లని చెప్పెను. ౧

మీరలు భయపడవలదు; రామలక్ష్మణులు ఇంద్రజిద్బాణంబులంగొట్టఁబడి యవశులయి మూర్ఛితులయి యున్నారని మీరెంతమాత్రము దుఃఖింపవలదు; వారలు బ్రహ్మదేవునిమాటను గౌరవించుటకై యిట్లభినయించుచున్నారు గాని వేఱుగాదు. ౩

ఆ యింద్రజిత్తునకు బ్రహ్మదేవుండు అమోఘవేగంబగు బ్రహ్మాస్త్రము

తస్స్వయమ్భువా బ్రాహ్మ మమోఘవేగమ్,
త న్మానయన్తౌ యుధి రాజపుత్త్రౌ
నిపాతితౌ కో౽త్ర విషాదకాలః. ४
బ్రాహ్మ మస్త్రం తతో ధీమా న్మానయిత్వా తు మారుతిః.
విభీషణవచః శ్రుత్వా హనుమాం స్త మథా బ్రవీత్. ౫

ఏతస్మి న్నిహతే సైన్యే వానరాణాం తరస్వినామ్,
యో యో ధారయతే ప్రాణాం స్తం తమాశ్వాసయావహై. ౬

తావుభౌ యుగపద్వీరౌ హనుమ ద్రాక్షసోత్తమౌ,
ఉల్కాహస్తౌ తదా రాత్రౌ రణభూమౌ విచేరతుః. ౭

భిన్నలాఙ్గూలహస్తోరుపాదాఙ్గులిశిరోధరైః,
స్రవద్భిః క్షతజం గాత్త్రైః ప్రస్రవద్భి స్తత స్తతః. ౮
పతితైః పర్వతాకారై ర్వానరై రభిసఙ్కులామ్.
శస్త్రైశ్చ పతితై ర్దీప్తై ర్దదృశాతే వసున్ధరామ్. ౯

సుగ్రీవ మఙ్గదం నీలం శరభం గన్ధమాదనమ్,
గవాక్షం చ సుషేణం చ వేగదర్శన మాహుకమ్. ౧౦
మైన్దం నళం జ్యోతిముఖం ద్వివిదం పనసం తథా.
విభీషణో హనూమాంశ్చ దదృశాతే హతా న్రణే. ౧౧
సప్తషష్టి ర్హతాః కోట్యో వానరాణాం తరస్వినామ్,
అహ్నః పఞ్చమశేషేణ వల్లభేన స్వయమ్భువః. ౧౨
సాగరౌఘనిభం భీమం దృష్ట్వా బాణార్దితం బలమ్,
మార్గతే జామ్బవ న్తం స హనూమాన్ సవిభీషణః. ౧౩

నొసంగెను: రాజపుత్రులగు రామలక్ష్మణులు బ్రాహ్మంబగు నమ్మహాస్త్రంబును గౌరవించుటకై నేలంబడియున్నారు; ఇందుకు దుఃఖింపనేల? అని విభీషణుండు చెప్పెను. ౪

అంత బుద్ధిమంతుండగు వాయుపుత్రుండు హనుమంతుఁడు బ్రహ్మాస్త్రంబును గౌరవించుటకై మహాస్త్రకాలము బద్ధుఁడై యుండి యంత నదలించుకొని విభీషణుని మాటనువిని యతనితో నిట్లని చెప్పెను. ౫

బలవంతులగు నీవానరులందఱు వధింపఁబడియున్నారు. ఇందు ఎవ్వ రెవ్వరు ఇంకం బ్రాణంబులు దాల్చియున్నారో వారల నాశ్వాసింతము అని హనుమంతుఁడు విభీషణునితోఁ జెప్పెను. ౬

ఆరాత్రియం దట్లు వీరులగు హనుమంతుఁడును విభీషణుండును ఇద్దఱును కొఱవికట్టెలం జేతులఁబట్టుకొని యుద్ధభూమియందు వానరవీరుల వెదకుచుం దిరిగిరి. ౭

ఆహనుమంతుఁడును విభీషణుఁడును కొందఱు తోఁకలు దెగియుఁ గొందఱు చేతులును గొందఱుతొడలును గొందఱు కాళ్లును కొందఱు వ్రేళ్లును కొందఱు మెడలును దెగి నెత్తురుగాఱుచు ఇట్టటుపొరలుచు నేలంబడి యున్న పర్వతాకారులగు వానరులచేతను దేదీప్యమానం బయి పడియున్న శరాయుధంబులచేత నిండియుండు యుద్ధభూమిం జూచిరి. ౮, ౯

అంత వారలు యుద్ధంబున హతులయిపడియున్న సుగ్రీవుసంగదుని నీలుఁ నిశరభుని గంధమాదనుని గవాక్షుని సుషేణుని వేగదర్శిని ఆహుకుని మైందుని నలుని జ్యోతిర్ముఖుని ద్వివిదుని ఐనసుని ఇంక నితరులగు వానరవీరులనుం జూచిరి. ౧౦, ౧౧

ఇంద్రజిత్తు ఆ బ్రహ్మాస్త్రముచే సాయాహ్నమున అయిదుగడియలలో అఱువదియేడుకోటుల బలవంతులగు వానరవీరులను వధించెను. ౧౨

హనుమంతుఁడును విభీషణుఁడును, సముద్రసమానంబగు భయంకర మయిన యావానరసైన్యంబంతయు బాణపీడితమయి యుండుటంజూచి

స్వభావజరయా యుక్తం వృద్ధం శరశతైశ్చితమ్,
ప్రజాపతిసుతం వీరం శామ్యన్తమివ పావకమ్. ౧౪
దృష్ట్వా తముపసఙ్గమ్య పౌలస్త్యో వాక్యమబ్రవీత్,

కచ్చిదార్య శరైస్తీక్ష్ణైర్న ప్రాణాధ్వంసితాస్తవ. ౧౫

విభీషణవచః శ్రుత్వా జామ్బవానృక్షపుఙ్గవః,
కృచ్ఛ్రాదభ్యుద్గిరన్వాక్యమిదం వచనమబ్రవీత్. ౧౬
నైరృతేన్ద్ర మహావీర్య! స్వరేణ త్వాఽభిలక్షయే,
పీడ్యమానశ్శితైర్బాణైర్న త్వాం పశ్యామి చక్షుషా. ౧౭

అఞ్జనా సుప్రజా యేన మాతరిశ్వా చ నైరృత!,
హనూమా న్వానరశ్రేష్ఠః ప్రాణాన్ధారయతే క్వచిత్. ౧౮

శ్రుత్వా జామ్బవతో వాక్యమువాచేదం విభీషణః,

ఆర్యపుత్త్రావతిక్రమ్య కస్మాత్పృచ్ఛసి మారుతిమ్. ౧౯

నైవ రాజని సుగ్రీవే నాఙ్గదే నాపి రాఘవే,
ఆర్య! సన్దర్శితస్స్నేహో యథా వాయుసుతే పరః. ౨౦

విభీషణవచశ్శ్రుత్వా జామ్బవాన్వాక్యమబ్రవీత్,

జాంబవంతుని వెదకిరి. ౧౩

విభీషణుండు స్వభావంబుననె ముసలివాఁడును జ్ఞానవృద్ధుండును పెక్కుబాణంబులచేఁ బీడింపఁబడుచున్నవాఁడును వీరుండునగు చల్లారు నగ్నిహోత్రమువలెనున్న బ్రహ్మపుత్రుని జాంబవంతునింజూచి సమీపంబునకుఁ బోయి యిట్లని చెప్పెను. ౧౪

పూజ్యుఁడవగు జాంబవంతుఁడా! ఈ తీక్ష్ణబాణంబుల దెబ్బకు నీప్రాణంబులు నశింపకున్నవిగదా! అని విభీషణుండు జాంబవంతునితోఁ జెప్పెను.

భల్లూకశ్రేష్ఠుండగు జాంబవంతుఁడు విభీషణుని మాటనువిని బహుకష్టంబున శబ్దము లుచ్చరింపుచు నీమాటం జెప్పెను. ౧౬

మహాపరాక్రమశాలివగు రాక్షసరాజుండవైన విభీషణుఁడా! నీకంఠధ్వనివలన నిన్నుఁ దెలిసికొంటిని; తీక్ష్ణబాణంబులఁ బీడింపఁబడుచుండుటవలన నిన్నుఁ గంటితోఁ జూడఁజాలకున్నాను. ౧౭

విభీషణుఁడా! ఎవ్వనిచేత అంజనయు వాయువును మంచిసంతానము గలవారయిరో అట్టి వానరోత్తముఁడగు హనుమంతుండు బ్రతికియున్నాఁడా లేమి? అని జాంబవంతుండు విభీషణునితోఁ జెప్పెను. ౧౮

విభీషణుండు జాంబవంతుండు చెప్పినమాటను విని యతని కిట్లని బదులు చెప్పెను.

రామలక్ష్మణులనుం గూడ విడిచి వాయుకుమారుండగు హనుమంతునేల యడుగుచున్నావు? ౧౯

పూజ్యుఁడవగు జాంబవంతుఁడా! నీవు వాయుకుమారుండగు హనుమంతునిపైఁ జూపినట్లు అధికస్నేహమును వానరరాజుండగు సుగ్రీవునందును గాని యువరాజుండగు నంగదునియందుఁ గాని రామునియందుఁ గాని చూపవైతివి; దీనికేమి కారణము? అని విభీషణుండు జాంబవంతునితోఁ జెప్పెను. ౨౦

జాంబవంతుఁడు విభీషణుండు చెప్పినమాటను విని యందుకు బదులిట్లని చెప్పెను.

శృణు నైరృతశార్దూల! యస్మా త్పృచ్ఛామి మారుతిమ్. ౨౧

తస్మి న్జీవతి వీరే తు హత మప్యహతం బలమ్,
హనుమత్యుజ్ఝిత ప్రాణే జీవన్తోఽపి వయం హతాః. ౨౨

ధరతే మారుతి స్తాత! మారుత ప్రతిమో యది,
వైశ్వానరసమో వీర్యే జీవితాశా తతో భవేత్ ౨౩

తతో వృద్ధ ముపాగమ్య నియమేనాభ్యవాదయత్,
గృహ్య జామ్బవతః పాదౌ హనూమా న్మారుతాత్మజః. ౨౪

శ్రుత్వా హనుమతో వాక్యం తథాఽపి వ్యథితేన్ద్రియః,
పునర్జాతమివాత్మానం మన్యతే స్మ ఋక్షపుఙ్గవః. ౨౫

తతోఽబ్రవీ న్మహాతేజా హనూమన్తం స జామ్బవాన్,

ఆగచ్ఛ హరిశార్దూల! వానరాం స్త్రాతు మర్హసి. ౨౬

నాన్యో విక్రమపర్యాప్త స్త్వమేషాం పరమ స్సఖా,

త్వత్పరాక్రమకాలోఽయం నాన్యం పశ్యామి కంచన. ౨౭

రాక్షసశ్రేష్ఠుఁడవగు విభీషణుఁడా! నేను అందఱను విడిచి వాయుపుత్రుఁడగు హనుమంతు నడిగినందుకుఁ గారణంబు చెప్పెదను వినుము. ౨౧

వీరందఱు నా హనుమంతుం డొకఁడుమాత్రము బ్రతికియుండినట్లయితే ఈ వానరసైన్యమంతయు హతమయినను భయములేదు; బ్రతికియున్నట్లే; ఆహనుమంతుం డొక్కఁడు హతుండైనచో మనమందఱమును బ్రతికియున్నను జచ్చినవారలమే. ౨౨

నాయనా! వాయువంతటివాఁడును బరాక్రమంబున నగ్నిహోత్రునకు సరివచ్చువాఁడునగు వాయుపుత్రుండు హనుమంతుండు ప్రాణంబులతో నుండునేని యంత మాకు బ్రతుకుపై ఆశ కలుగును. అని జాంబవంతుండు విభీషణునితోఁ జెప్పెను. ౨౩

అంత వాయుదేవుని కుమారుండగు హనుమంతుండు వృద్ధుండగు జాంబవంతుని సమీపంబునకుఁ బోయి, శాస్త్రోక్తనియమంబున నతని పాదంబులం బట్టుకొని నమస్కరించెను. ౨౪

భల్లూకరాజుండగు జాంబవంతుండు అట్లు బాణంబులచేఁ బరమపీడితుండై యున్నను హనుమంతుని కంఠధ్వనిని వినఁగానే తాను బునర్జన్మము నొందినట్లు తలంచెను. ౨౫

అంత మహాతేజుండగు నా జాంబవంతుండు హనుమంతుం జూచి యిట్లని చెప్పెను.

వానరోత్తముఁడవగు హనుమంతుఁడా! ఇట్లు రమ్ము; నీ విప్పుడు ఈ వానరుల నందఱ రక్షింపవలయును. ౨౬

మఱియొకఁ డెవ్వఁడును ఇప్పుడు వానరుల రక్షింపఁజాలినవాఁడు లేఁడు; నీవు పరాక్రమంబునఁ బూర్ణుఁడవు; వీరలకుఁ జాలఁ గావలసినవాఁడవు, కావున నీవె రక్షింపవలయును.

నీవు పరాక్రమంబుఁ జూపవలసిన కాలము వచ్చినది, మఱియొకఁ డెవ్వఁడును ఇట్టికాలమున ఇప్పుడు పరాక్రమించువాఁడు లేఁడు. ౨౭

ఋక్షవానరవీరాణా మనీకాని ప్రహర్షయ,
విశల్యౌ కురు చాప్యేతౌ సాదితౌ రామలక్ష్మణౌ. ౨౮
గత్వా పరమ మధ్వాన ముపర్యుపరి సాగరమ్,
హిమవన్తం నగశ్రేష్ఠం హనుమ! న్గన్తు మర్హసి. ౨౯
తతః కాఞ్చన మత్యుచ్చ మృషభం పర్వతోత్తమమ్,
కైలాసశిఖరం చాపి ద్రక్ష్యస్యరినిషూదన!. ౩౦
తయో శ్శిఖరయో ర్మధ్యే ప్రదీప్త మతులప్రభమ్,
సర్వౌషధియుతం వీర! ద్రక్ష్యస్యోషధిపర్వతమ్. ౩౧

తస్య వానరశార్దూల! చతస్రో మూర్ధ్ని సమ్భవాః,
ద్రక్ష్యస్యోషధయో దీప్తా దీపయన్త్యో దిశో దశ. ౩౨

మృతసంజీవనీం చైవ విశల్యకరణీ మపి,
సావర్ణ్యకరణీం చైవ సన్ధానకరణీం తథా. ౩౩
తా స్సర్వా హనుమ! న్గృహ్య క్షిప్ర మాగన్తు మర్హసి,
ఆశ్వాసయ హరీ న్ప్రాణై ర్యోజ్య గన్ధవహాత్మజ. ౩౪

శ్రుత్వా జామ్బవతో వాక్యం హనూమా న్హరిపుఙ్గవః,
ఆపూర్యత బలోద్ధర్షై స్తోయవేగై రివార్ణవః. ౩౫

సపర్వతతటాగ్రస్థః పీడయ న్పర్వతోత్తమమ్,
హనూమా న్దృశ్యతే వీరో ద్వితీయ ఇవ పర్వతః. ౩౬

హరిపాదవినిర్భగ్నో నిషసాద స పర్వతః,

భల్లూక సైన్యములకును వానర సైన్యములకును సంతోషము గలుగఁ జేయుము, మూర్ఛితులగు నీరామలక్ష్మణులను గూడ సుఖితులం గావింపుము.

హనుమంతుఁడా ! నీవు సముద్రంబుమీఁదుగా బహుదూరముపోయి పర్వతోత్తమంబగు హిమవత్పర్వతంబునకుఁ బోవలయును. ౨౯

శత్రువుల వధించునట్టి హనుమంతుఁడా ! అంత నచ్చట నీవు అత్యున్నతంబగు ఋషభమను కాంచనశిఖరంబును కైలాసశిఖరంబును జూడఁగలవు.

వీరుండవగు హనుమంతుఁడా ! ఆ శిఖరంబుల రెంటినడుమను దేదీప్యమానంబును అసదృశమయిన కాంతిగలదియు నగు సమస్తౌషధులతోనుం గూడిన ఓషధిపర్వతంబను శిఖరంబును జూడఁగలవు. ౩౧

వానరశ్రేష్ఠుఁడవగు హనుమంతుఁడా! ఆ ఓషధిపర్వతముయొక్క శిఖరంబునందుఁ బుట్టినవియు దేదీప్యమానంబులును దశదిశల వెలుంగం జేయుచున్నవియు నగు నాలుగు దివ్యౌషధులం జూడఁగలవు. ౩౨

హనుమంతుఁడా ! ఆ విశల్యకరణిని మృతసంజీవినిని సౌవర్ణ్యకరణిని సంధానకరణిని ఈ నాలుగు ఓషధులం దీసికొని నీవు శీఘ్రంబుగ రమ్ము. ౩౩

వాయుపుత్రుండవగు హనుమంతుఁడా ! వానరుల మరల బ్రతికించి వారల కూరట గల్గింపుము. అని జాంబవంతుండు హనుమంతునితోఁ జెప్పెను. ౩౪

వానర శ్రేష్ఠుండగు హనుమంతుండు జాంబవంతునిమాటను వినఁగానే జలప్రవాహముల సముద్రము పొంగునట్లు, బలపరాక్రమములఁ బూర్ణుఁడయ్యెను. ౩౫

పరాక్రమవంతుఁడగు నాహనుమంతుఁడు పర్వతశిఖరంబుపైకి దుమికి పాదఘాతంబున నప్పర్వతోత్తమమును బీడించుచు రెండవపర్వతంబువలెఁ జూపట్టెను. ౩౬

ఆ పర్వతంబు హనుమంతుని పాదంబులచేఁ ద్రొక్కఁబడినదై మిక్కిలి

న శశాక తదాత్మానం సోఢుం భృశనిపీడితః. ౩౭

తస్య పేతు ర్నగా భూమౌ హరివేగా చ్చ జజ్వలుః,
శృఙ్గాణి చ వ్యశీర్యన్త పీడితస్య హనూమతా. ౩౮

తస్మిన్ సమ్పీడ్యమానే తు భగ్నద్రుమశిలాతలే,
న శేకు ర్వానరాః స్థాతుం ఘూర్ణమానే నగోత్తమే. ౩౯

సా ఘూర్ణితమహాద్వారా ప్రభగ్నగృహగోపురా,
లఙ్కా త్రాసాకులా రాత్రౌ ప్రవృత్తే వాభవ త్తదా. ౪౦

పృథివీధరసఙ్కాశో నిపీడ్య ధరణీధరమ్,
పృథివీం క్షోభయామాస సార్ణవాం మారుతాత్మజః. ౪౧

ఆరురోహ తదా తస్మా ద్ధరి ర్మలయపర్వతమ్,
మేరుమన్దరసఙ్కాశం నానాప్రస్రవణాకులమ్. ౪౨
నానాద్రుమలతాకీర్ణం వికాసికమలోత్పలమ్,
సేవితం దేవగన్ధర్వై ష్షష్టియోజన ముచ్ఛ్రితమ్. ౪౩
విద్యాధరై ర్మునిగణై రప్సరోభి ర్నిషేవితమ్,
నానామృగగణాకీర్ణం బహుకన్దరశోభితమ్. ౪౪

సర్వా నాకులయం స్తత్ర యక్షగన్ధర్వకిన్నరాన్,
హనూమా న్మేఘసఙ్కాశో వవృధే మారుతాజః. ౪౫

పద్భ్యాం తు శైల మాపీడ్య బడబాముఖవన్ముఖమ్,

యుఁ బీడితంబై హనుమంతుని యౌద్ధత్యమున కెంతమాత్రము నిలువఁజాల దయ్యెను. ౩౭

హనుమంతుని వేగంబున నాత్రికూటపర్వతశిఖరమునందలి వృక్షంబులు నేలంబడి హనుమద్వేగజన్యమయిన యగ్నిచే మండినవి; హనుమత్పద పీడనంబునం జేసి యప్పర్వతముయొక్క శిఖరములు చూర్ణములయినవి. ౩౮

అట్లు పీడింపఁబడుచు విఱిగినవృక్షంబులతోను శిలలతోను హనుమద్వేగంబునకు గడగడవడంకుచున్న యాత్రికూటపర్వతంబుపై వానరులు నిలువఁజాలరైరి. ౩౯

అప్పుడు రాత్రియందు లంకాపురి హనుమంతుని వేగంబునకు జనులందఱు భయంబునొంద మహాద్వారంబులు చలింప గృహంబులు గోపురంబులు విఱిగిపడ నర్తనముచేసిన ట్లుండినది. ౪౦

పర్వతాకారుండగు వాయుపుత్రుఁడు హనుమంతుఁడు అట్లు త్రికూట పర్వతంబును పీడించి సముద్రసహితంబుగా భూమియంతయుఁ జలనము నొందునట్లు గావించెను. ౪౧

అంత హనుమంతుఁడు అచ్చటనుండి మేరుమందరసమానమును నానా విధములయిన సెలయేళ్లచే నొప్పుచున్నదియు నానావిధవృక్షములచే నిండినదియు వికసించిన కమలంబులును కలువలు గలదియు దేవగంధర్వులచేతను విద్యాధరులచేతను మహర్షులచేతను అప్సరసలచేతను సేవింపఁబడినదియు అఱువదియోజనంబుల యౌన్నత్యంబుగలదియు నానామృగ సమూహములతో నొప్పుచున్నదియును పెక్కుగుహలు గలదియునగు లంకామలయపర్వతము నారోహించెను. ౪౨, ౪౪

అచ్చట మేఘసమానుండగు వాయుకుమారుఁడు హనుమంతుఁడు యక్షులును గంధర్వులును కిన్నరులును భయంబునం గలఁతపడ దేహముం బెంచెను. ౪౫

ఆ హనుమంతుఁడు పాదములచేఁ బర్వతమును ద్రొక్కుచు భయం

వివృతోష్ఠాగ్రం ననాదోచ్చైస్త్రాసయ న్నివ రాక్షసాన్. ౪౬

తస్య నానద్యమానస్య శ్రుత్వా నినద మద్భుతమ్,
లఙ్కాస్థా రాక్షసాస్సర్వే న శేకు స్స్పన్దితుం భయాత్. ౪౭
నమస్కృత్వాఽథ రామాయ మారుతి ర్భీమవిక్రమః,
రాఘవార్థే పరం కర్మ సమీహత పరన్తపః. ౪౮

స పుచ్ఛ ముద్యమ్య భుజఙ్గకల్పం
వినమ్య పృష్ఠం శ్రవణే నికుఞ్చ్య,
వివృత్య వక్త్రం బడబాముఖాభ
మాపుప్లువే వ్యోమని చణ్డవేగః. ౪౯
స వృక్షషణ్డాం స్తరసా జహార
శైలాన్ శిలాః ప్రాకృతవానరాంశ్చ,
బాహూరువేగోద్ధతసమ్ప్రణున్నా
స్తే క్షీణవేగా స్సలిలే నిపేతుః. ౫౦
స తౌ ప్రసార్యోరగభోగకల్పౌ
భుజౌ భుజఙ్గారినికాశవీర్యః,
జగామ మేరుం నగరాజ మగ్ర్యం
దిశః ప్రకర్ష న్నివ వాయుసూనుః. ౫౧
స సాగరం ఘూర్ణితవీచిమాలం
తదా భృశం భ్రామిత సర్వసత్త్వమ్,
సమీక్షమాణ స్సహసా జగామ
చక్రం యథా విష్ణుకరాగ్రముక్తమ్. ౫౨
స పర్వతా న్వృక్షగణాన్ సరాంసి
నదీ స్తటాకాని పురోత్తమాని,

కరంబగు బడబాముఖమువంటి నోరు దెఱచి రాక్షసులను భయపెట్టుటకై గట్టిగా నఱచెను. ౪౬

లంకయందలి రాక్షసులందఱు అట్లు భీకరంబుగా గర్జించిన హనుమంతుని గర్జనను విని భయంబున ఇట్టటుకదలక నిశ్చేష్టులయియుండిరి. ౪౭

అంత శత్రువులఁదపింపఁజేయువాఁడును భయంకరపరాక్రముఁడునగు హనుమంతుఁడు రామునకు సమస్కరించి రామకార్యార్థమయి ఇతరులకు సాధ్యముకాని కార్యమును జేయఁగోరెను. ౪౮

భయంకరవేగుండగు నాహనుమంతుండు సర్పమువంటి తోఁకనెత్తి వీపునువంచి చెవులనుముడుచుకొని బడబాముఖమువంటి నోరుదెఱచి యాకాశంబున కెగరెను. ౪౯

ఆ హనుమంతుని బాహువులయొక్కయు తొడలయొక్కయు వేగంబుచే వృక్షసమూహంబులు పర్వతంబులు ఱాళ్లు క్షుద్రులగు వానరులు ఆకర్షింపఁబడి బహుదూరముపోయి యంతనష్ట వేగంబులయి పడినవి. ౫౦

గరుత్మంతునితో సమానమయిన పరాక్రమముగల వాయుపుత్రుండగు హనుమంతుఁడు భుజంగభోగసదృశములయిన బాహువులుసాఁచి దిక్కులఁ నాకర్షించువాఁడువలెఁ జూపట్టుచు నుత్తమంబగు మేరుసమానమయిన హిమవత్పర్వతంబునకుఁ బోయెను. ౫౧

ఆ హనుమంతుఁడు అప్పుడు కలంగిన యలలుగలదియు మిక్కిలియుఁ దిరుగుడునొందిన సమస్తజంతువులు గలదియునగు సముద్రముం జూచుచు విష్ణుదేవునిహస్తముచేఁ బ్రయోగింపఁబడిన సుదర్శనంబుపగిది నతివేగంబునం బోయెను. ౫౨

వేగంబున తండ్రియగు వాయువుతో సమానుఁడగు హనుమంతుఁడు పర్వతంబులను వనంబులను సరస్సులను నదులను చెఱువులను పట్టణంబులను

స్ఫీతాన్ జనాన్తాసపి సంప్రవీక్ష్య
జగామ వేగాత్పితృతుల్యవేగః. ౫౩
ఆదిత్యపథ మాశ్రిత్య జగామ స గతక్లమః,
హనూమాన్ త్వరితో వీరః పితృతుల్యపరాక్రమః. ౫౪

జవేన మహతా యుక్తో మారుతిర్మారుతో యథా,
జగామ హరిశార్దూలో దిశ శ్శబ్దేన పూరయన్. ౫౫
స్మర న్జాంబవతో వాక్యం మారుతిర్వాతరంహసా,
దదర్శ సహసా గత్వా హిమవన్తం మహాకపిః. ౫౬
నానాప్రస్రవణోపేతం నానాకన్దరనిర్ఝరమ్,
శ్వేతాభ్రచయసఙ్కాశై శ్శిఖరై శ్చారుదర్శనైః. ౫౭
శోభితం వివిధై ర్వృక్షై రగమ త్పర్వతోత్తమమ్,

సతం సమాసాద్య మహానగేన్ద్ర
మతిప్రవృద్ధోత్తమఘోరశృఙ్గమ్. ౫౮
దదర్శ పుణ్యాని మహాశ్రమాణి
సురర్షిసఙ్ఘోత్తమసేవితాని,
స బ్రహ్మకోశం రజతాలయం చ
శక్రాలయం రుద్రశరప్రమోక్షమ్. ౫౯
హయాననం బ్రహ్మశిరశ్చ దీప్తం
దదర్శ వైవస్వతకిఙ్కరాంశ్చ,
వజ్రాలయం వైశ్రవణాలయంచ
సూర్యప్రభం సూర్యనిబన్ధనంచ. ౬౦
బ్రహ్మాసనం శఙ్కరకార్ముకం చ
దదర్శ నాభిం చ వసున్ధరాయాః,

సమృద్ధంబులగు జనపదంబులనుం జూచుచు వేగంబునంబోయెను. ౫౩

పరాక్రమవంతుఁడును బరాక్రమంబునం దండ్రికి సరివచ్చువాఁడు నగునాహనుమంతుఁడు ఆకాశంబున నెంతమాత్రము శ్రమములేక యతివేగంబునంబోయెను. ౫౪

వానరోత్తముఁడగు హనుమంతుఁడు వాయువుంబోలె మహావేగంబున దిక్కులన్నియుం శబ్దంబునం బూరించుచుం బోయెను. ౫౫

వాయుకుమారుండగు హనుమంతుఁడు జాంబవంతునిమాటను మఱువక వాయువేగంబునంబోవుచు హిమవత్పర్వతంబుఁ జూచెను. ౫౬

ఆహనుమంతుఁడు నానావిధములయిన ప్రస్రవణంబులతోఁ గూడినదియుఁ బెక్కుగుహలతోను నదులతోను నొప్పుచున్నదియుం తెల్లనిశరన్మేఘసమానంబులగు సుందరములయిన శిఖరములను నానావిధవృక్షంబులతో నెంతయుఁ బ్రకాశించుచున్నదియునగు హిమవత్పర్వతముఁ జేరెను. ౫౭

ఆహనుమంతుఁడు అత్యున్నతములును భయంకరములునగు నుత్తమశిఖరములతో నొప్పుచున్నయాహిమవత్పర్వతముఁ జేరి యందు దేవతలచేతను మహర్షులచేతను సేవింపఁ బడుచుండు పవిత్రములగు నాశ్రమములం జూచెను. ౫౮

ఆహనుమంతుఁడు బ్రహ్మకోశంబను క్షేత్రమును కైలాసపర్వతమును దేవేంద్రుఁడు తపస్సుగావించిన స్థలమును రుద్రబాణమోక్షస్థానమును హాయగ్రీవక్షేత్రమును బ్రహ్మకపాలమును యమకింకరులు విశ్రమార్థము నిలిచినస్థలమును సందర్శించెను. ౫౯

ఆహనుమంతుఁడు ఇంద్రునకు బ్రహ్మదేవుండు వజ్రము నొసంగిన స్థానంబును సూర్యప్రకాశంబగు కుబేరస్థానంబును సూర్యనిబంధవక్షేత్రమును బ్రహ్మాసనంబును శివధనుఃక్షేత్రంబును భూమినుండి పాతాళప్రవేశరంధ్రంబును జూచెను. ౬౦

కైలాస మగ్ర్యం హిమవచ్ఛిలాం చ
తథర్షభం కాఞ్చనశైల మగ్ర్యమ్. ౬౧
సన్దీప్తసర్వౌషధిసంప్రదీప్తం
దదర్శ సర్వౌషధిపర్వతేన్ద్రమ్,
సతం సమీక్ష్యానలరశ్మిదీప్తం
విసిష్మియే వాసవదూతసూనుః. ౬౨
ఆప్లు(వృ)త్య తం చౌషధిపర్వతేన్ద్రం
తత్రౌషధీనాం విచయం చకార,
స యోజనసహస్రాణి సమతీత్య మహాకపిః. ౬౩
దివ్యౌషధిధరం శైలం వ్యచర న్మారుతాత్మజః,

మహౌషధ్య స్తత స్సర్వా స్తస్మిన్ పర్వతసత్తమే. ౬౪
విజ్ఞాయార్థిన మాయా న్తం తతో జగ్ము రదర్శనమ్,

స తా మహాత్మా హనుమా నపశ్యం
శ్చుకోప కోపాచ్చ భృశం ననాద. ౬౫
అమృష్యమాణోఽగ్నినికాశచక్షు
ర్మహీధరేన్ద్రం త మువాచ వాక్యమ్,
కిమేత దేవం సువినిశ్చితం తే
య ద్రాఘవే నాసి కృతానుకమ్పః. ౬౬
పశ్యాద్య మద్బాహుబలాభిభూతో
వికీర్ణ మాత్మాన మథో నగేన్ద్ర!,
స తస్య శృఙ్గం సనగం సనాగం
సకాఞ్చనం ధాతుసహస్రజుష్టమ్. ౬౭
వికీర్ణకూటం జ్వలితాగ్రసానుం

ఆహనుమంతుఁడు ఉత్తమంబగు కైలాసపర్వతంబును హిమవచ్ఛిలను ఋషభపర్వతంబును కాంచనశృంగంబును రాత్రుల వెలుఁగుచుండు సమస్తౌషధులతోను నొప్పుచున్నట్టి సర్వౌషధిపర్వతంబునుం జూచెను. ౬౧

వాయుపుత్త్రుఁడగు హనుమంతుఁడు అగ్నిహోత్రమువలె నోషధులచే వెలుఁగుచున్న యయోష్యౌషధిపర్వతంబును జూచి యాశ్చర్యంబు నొంది యాపర్వతరాజంబంతయుఁ దిరిగి యోషధుల వెదకెను. ౬౨

వాయుకుమారుండగు హనుమంతుఁడు అట్లు పెక్కువేలయోజనంబు లతిక్రమించి పోయి దివ్యౌషధులుగల పర్వతంబుఁజేరి యచ్చట నోషధుల వెదకుచుం దిరిగెను. ౬౩

అంత ఆపర్వతోత్తమమునందుండు దివ్యౌషధులు తమ్ముఁ దీసికొనిపోవుటకై హనుమంతుఁడు వచ్చినాఁడని యెఱింగి యంతర్ధానంబు నొందినవి. ౬౪

మహాత్ముండగు నాహనుమంతుఁడు ఆయోష్యౌషధులు అగపడకపోవుట వలనఁగోపించి కోపంబునఁ బెద్దయుంకె వేసి కన్నుల నెఱ్ఱఁదనముగదుర పర్వతశ్రేష్ఠంబగు నయోష్యౌషధిపర్వతమును జూచి యిట్లనిచెప్పెను. ౬౫

ఓషధిపర్వతమా! నీవు ఇట్లు రామునియందుఁగూడ దయలేకున్నావే! ఇదేనీనిశ్చయమాయేమి? అట్లేని బాహుబలమున నిన్నుఁ బెల్లగించి చూర్ణముగావించెదను జూడుము. అని హనుమంతుఁడు ఓషధిపర్వతముతోఁ జెప్పెను ౬౬

ఆహనుమంతుం డంత వృక్షంబులతోను ఏనుంగులతోను గూడినదియుం బంగారుగనులతోఁ గూడినదియుం నానావిధములయిన గైరికధాతువులతో నొప్పుచున్నదియుం గైరికధాతువులచేఁ దేజరిల్లుచున్న శృంగములుగలదియునగు

ప్రగృహ్య వేగా త్సహ సోన్మమాథ,
స తం సముత్పాట్య ఖ ముత్పపాత
వి త్రాస్య లోకా న్ససురాసురేన్ద్రాన్. ౬౮
సంస్తూయమానః ఖచరై రనేకై
ర్జగామ వేగా ద్గరుడోగ్ర వేగః,
స భాస్కరాధ్వాన మనుప్రపన్న
స్తం భాస్కరాభం శిఖరం ప్రగృహ్య. ౬౯
బభౌ తదా భాస్కరసన్నికాశో
రవే స్సమీపే ప్రతిభాస్కరాభః,
స తేన శైలేన భృశం రరాజ
శైలోపమో గన్ధవహాత్మజస్తు. ౭౦
సహస్రధారేణ సపావకేన
చక్రేణ ఖే విష్ణు రివార్పితేన,
తం వానరాః ప్రేక్ష్య వినేదు రుచ్చై
స్స తానపి ప్రేక్ష్య ముదా ననాద. ౭౧
తేషాం సముద్ఘుష్టరవం నిశమ్య
లఙ్కాలయా భీమతరం వినేదుః,
తతో మహాత్మా నిపపాత తస్మి
న్శైలోత్తమే వానరసైన్యమధ్యే. ౭౨
హరుత్తమేభ్య శ్శిరసాఽభివాద్య
విభీషణం తత్ర స సస్వజే చ,
తావప్యుభౌ మానుషరాజపుత్రౌ
తం గన్ధ మాఘ్రాయ మహౌషధీనామ్. ౭౩
బభూవతు స్తత్ర తదా విశల్యా
వుత్తస్థు రన్యే చ హరిప్రవీరాః,

నప్పర్వతశిఖరంబును వేగంబునకుఁగొన్ని కొన్ని తాళ్లపగులం బట్టి పెల్లగించెను. ౬౭

ఆహానుమంతుఁడు దేవతలతోను అసురులతోను దేవేంద్రునితోను సమస్తలోకంబును భయపడ అప్పర్వతశిఖరమును పెల్లగించి గరుత్మంతుండుం బోలె భయంకరవేగుండై దేవతలందఱిచే పొగడఁబడుచు వేగంబునం బోయెను. ౬౮

అప్పుడు సూర్యసమానుండగు నాహానుమంతుఁడు సూర్యప్రభంబగు శిఖరంబు గ్రహించి యాకాశమునొంది సూర్యసమీపంబున రెండవసూర్యుని భంగిఁ బ్రకాశించెను. ౬౯

పర్వతాకారుఁడగు వాయుపుత్రుఁడైన హానుమంతుఁడు ఆపర్వతంబు చేతఁబట్టియుండుటవలన సహస్రధారంబును అగ్నిజ్వాలలతోఁ గూడినది యైనగు సుదర్శనంబు చేత ధరించి యుండు మహావిష్ణువవలె నెంతయుఁ బ్రకాశించెను. ౭౦

వానరులు ఆహానుమంతుండు పర్వతశిఖరంబు గొనివచ్చుటం జూచి సంతోషంబున గర్జించిరి; ఆ హానుమంతుఁడును వానరులంజూచి తనకార్యసిద్ధిఁ దెలుపుచు సంతోషంబున గర్జించెను; అతి భయంకరంబగు వారలగర్జనధ్వనులను విని లంకానివాసులగు రాక్షసులు భయంబున నఱచిరి. ౭౧

అంత మహాప్రభావుఁడగు హానుమంతుఁడు ఆ త్రికూటపర్వతంబున వానరసేనామధ్యంబున ఓషధిపర్వత సహితంబుగా వ్రాలి అవ్వానరసేనయందు వానరోత్తములకు సాష్టాంగముగ నమస్కరించి విభీషణుని గవుఁగిలించుకొనెను. ౭౨

అప్పుట నప్పుడు ఆరామలక్ష్మణులిద్దఱును ఆదివ్యౌషధుల గంధము నాఘ్రాణించి బాణబాధ విడిచి సుఖితులయిరి; మఱియు వానరవీరులును ఆగంధమును మూర్కొన్నమాత్రమున సుఖితులయి లేచిరి. ౭౩

సర్వే విశల్యా విరుజః క్షణేన
హరిప్రవీరా నిహతాశ్చ యే స్యుః. ౭౪
గన్ధేన తాసాం ప్రవరౌషధీనాం
సుప్తా నిశాన్తేష్వివ సంప్రబుద్ధాః,
యదాప్రభృతి లఙ్కాయాం యుధ్యన్తే కపిరాక్షసాః. ౭౫
తదాప్రభృతి మానార్థ మాజ్ఞయా రావణస్య చ,
యే హన్యన్తే రణే తత్ర రాక్షసాః కపికుఞ్జరైః. ౭౬
హతాహతాస్తు క్షిప్యన్తే సర్వఏవ తు సాగరే,
తతో హరి ర్గన్ధవహాత్మజస్తు
త మోషధీ శైల ముదగ్రవీర్యః. ౭౭
నినాయ వేగాద్ధిమవన్త మేవ
పునశ్చ రామేణ సమాజగామ.

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే - చతుస్సప్తతితమస్సర్గః. ౭౪.

---

పఞ్చసప్తతితమస్సర్గః.

తతోఽబ్రవీ న్మహాతేజా స్సుగ్రీవో వానరాధిపః,
అర్థ్యం విజ్ఞాపయంశ్చాపి హనూమన్త మిదం వచః. ౧
యతో హతః కుమ్భకర్ణః కుమారాశ్చ నిషూదితాః,
నేదానీ ముపనిర్హారం రావణో దాతు మర్హతి. ౨
యేయే మహాబలా స్సన్తి లఘవశ్చ ప్లవఙ్గమాః,
లఙ్కా మభ్యుత్పతన్త్వాశు గృహ్యోల్కాః ప్లవగర్షభాః. 3

తతోఽస్తంగత ఆదిత్యే రౌద్రే తస్మి న్నిశాముఖే,
లఙ్కా మభిముఖా స్సోల్కా జగ్ముస్తే ప్లవగర్షభాః. ౪

మఱియు మొదటనుండి యుద్ధంబున హతులయిపడి యుండు వానర వీరులు గూడ ఆదివ్యౌషధుల గంధము సోఁకినంతనె క్షణమాత్రంబున రాత్రి పరుండి నిద్రించినవారలు ప్రాతఃకాలంబున నిద్రలేచునట్లు బాణబాధ లేని వారలయి సుఖితులయి లేచిరి. ౭౪

లంకలో వానరులును రాక్షసులును యుద్ధముసేయ నారంభించినది మొదలు రాక్షలు పెక్కండ్రు నిహతులయిరని యెవ్వరికిని తెలియకుండ వలయునని రావణునాజ్ఞవలన యుద్ధంబున వానరులచే హతులయిన రాక్షసు లందఱు అప్పుడప్పుడె సముద్రమునం బడవేయఁబడిరి. ౭౫, ౭౬

అంత మహాపరాక్రమశాలియగు వాయుకుమారుండు హనుమంతుండు ఆయోషధిపర్వతమును వేగంబున హిమవత్పర్వతంబుఁ జేర్చి మరల రాముని సన్నిధానముఁ జేరెను. ౭౭

డెబ్బదినాలుగవసర్గము.

## డెబ్బదియైదవసర్గము.

అంత మహాతేజుండగు వానరరాజు సుగ్రీవుండు హనుమంతుంజూచి యాకాలంబునఁ జేయవలసిన కార్యంబుఁ దెలుపుచు నీమాటం జెప్పెను. ౧

తమ్ముండు కుంభకర్ణుండును కొడుకులును యుద్ధంబున హతులగుటవలన ఇప్పుడు రావణుండు మరల యుద్ధంబునకు రాఁడు. ౨

మనవారలలో ఎవ్వరెవ్వరు మహాబలశాలులును వేగవంతులునో వార లిప్పుడు దివిటీలు చేకొని శీఘ్రంబున లంకాపురికిఁ బోవుదురు గాక. అని సుగ్రీవుండు హనుమంతునితోఁ జెప్పెను. ౩

అంత సూర్యుం డస్తమించినవెనుక భయంకరమయిన యారాత్రి యందు అవ్వానరోత్తములు దివిటీలు చేతఁగొని లంకాపురాభిముఖులయి పోయిరి. ౪

ఉల్కాహస్తై ర్హరిగణై స్సర్వత స్సమభిద్రుతాః,
ఆరక్షస్థా విరూపాక్షా స్సహసా విప్రదుద్రువుః. ౫
గోపురాట్టప్రతోళీషు చర్యాసు వివిధాసు చ,
ప్రాసాదేషు చ సంహృష్టా స్ససృజు స్తే హుతాశనమ్. ౬

తేషాం గృహసహస్రాణి దదాహ హుతభు క్తదా,

ప్రాసాదాః పర్వతాకారాః పత న్తి ధరణీతలే. ౭
అగరు ర్దహ్యతే తత్ర వరం చ హరిచన్దనమ్,

మౌక్తికా మణయ స్స్నిగ్ధా వజ్రంచాపి ప్రవాళకమ్. ౮
క్షౌమం చ దహ్యతే తత్ర కౌశేయం చాపి శోభనమ్,

ఆవికం వివిధం చౌర్ణం కాఞ్చనం భాణ్డ మాయుధమ్. ౯
నానావికృతసంస్థానం వాజిభాణ్డపరిచ్ఛదౌ,

గజగ్రైవేయకక్ష్యాశ్చ రథభాణ్డాశ్చ సంస్కృతాః. ౧౦
తనుత్రాణి చ యోధానాం హస్త్యశ్వానాం చ వర్మ చ,

ఖడ్గా ధనూంషి జ్యా బాణా స్తోమరాఙ్కుశశక్తయః. ౧౧
రోమజం వాలజం చర్మ వ్యాఘ్రజం చాణ్డజం బహు,

ముక్తామణివిచిత్రాంశ్చ ప్రాసాదాంశ్చ సమన్తతః. ౧౨
వివిధా నస్త్రసంయోగా నగ్ని ర్దహతి తత్ర వై,

దివిటీలచేఁగొని వానరవీరులు వచ్చి తఱుముఁగానే పురద్వారంబులఁ గావలియుండు రాక్షసులు భయంబున శీఘ్రంబుగాఁ బరుగెత్తిరి. ౫

ఆవానరులు సంతోషంబున ఎదురులేక పురద్వారంబులయందును గోటబురుజులయందును రాజవీథులయందును నానావిధములయిన యితర వీథులయందును బ్రాసాదములయందును నిప్పుఁ బెట్టిరి. ౬

అప్పుడు అగ్నిహోత్రము ఆరాక్షసుల గృహములను వేలకొలఁది దహించెను.

పర్వతములంతటి మేడలు దహింపఁబడి నేలం గూలినవి. ౭

ఆ మేడలయందు అగరువును ఉత్తమంబగు హరిచందనంబును దహింపఁబడెను.

ఆ మేడలయందును మంచిసుందరములయిన ముత్తెములును వజ్రములును బవడములును తెల్ల నారపట్టుచీరలును బట్టుచీరలును దహింపఁబడినవి. ౮

నానావిధసన్నివేశముగాఁ బ్రాసాదంబుల నుంచఁబడియుండిన శాలువలును కంబళములును బంగారుభూషణములును ఆయుధములును గుఱ్ఱములకు వేయునలంకారములును దీని మొదలగునవియుం దహింపఁబడినవి. ౯

ఏనుగుల కంఠభూషములును నడుమునఁ గట్టెడు త్రాటి మోఁకులును జక్కఁగాఁ దోమఁబడిన రథాలంకారపదార్థములును వీరుల కవచములును ఇనుముతోను కాంస్యముతోను జేయఁబడిన గజకవచములును అశ్వకవచములును దహింపఁబడినవి. ౧౦

ఖడ్గములును ధనుస్సులును అల్లెత్రాళ్లను బాణంబులును తోమరంబులును అంకుశంబులును శక్తులును కంబళములును వింజామరలును పులిచర్మములును గస్తూరికాది సుగంధిద్రవ్యంబులును దహింపఁబడినవి. ౧౧

అలంకాపురియం దప్పుడట్లు అగ్నిహోత్రము ముత్తెములచేతను ఇంక నితరమణులచేతను అలంకృతములయిన ప్రాసాదములను నానావిధము లయిన యాయుధసమూహములను దహించెను. ౧౨

నానావిధా న్గృహచ్ఛన్నాన్దదాహ హుతభు క్తదా. ౧౩
ఆవాసా న్రాక్షసానాం చ సర్వేషాం గృహగర్ధినామ్,

హేమచిత్రతనుత్రాణాం స్రగ్దామామ్బరధారిణామ్. ౧౪
శీధుపానచలాక్షాణాం మదవిహ్వలగామినామ్,
కాన్తాలమ్బితవస్త్రాణాం శత్రుసంజాతమన్యునామ్. ౧౫
గదాశూలాసిహస్తానాం ఖాదతాం పిబతా మపి,
శయనేషు మహార్హేషు ప్రసుప్తానాం ప్రియై స్సహ. ౧౬
త్రస్తానాం గచ్ఛతాం తూర్ణం పుత్త్రా నాదాయ సర్వతః,
తేషాం శతసహస్రాణి తదా లఙ్కానివాసినామ్. ౧౭
అదహ త్పావక స్తత్ర జజ్వాల చ పునఃపునః,

సారవన్తి మహార్హాణి గంభీరగుణవన్తి చ. ౧౮
హేమచన్ద్రార్ధచన్ద్రాణి చన్ద్రశాలోన్నతానిచ,
రత్నచిత్రగవాక్షాణి సాధిష్ఠానాని సర్వశః. ౧౯
మణివిద్రుమచిత్రాణి స్పృశన్తీవ దివాకరమ్,
క్రౌఞ్చబర్హిణవీణానాం భూషణానాంచ నిస్వనైః. ౨౦
నాదితాన్యచలాభాని వేశ్మా న్యగ్ని ర్దదాహ సః,

జ్వలనేన పరీతాని తోరణాని చకాశిరే. ౨౧
విద్యుద్భిరివ నద్ధాని మేఘజాలాని ఘర్మగే,

అప్పుడు గృహస్థులగు రాక్షసుల నివాసస్థానములయిన స్వస్తికాది భేదముల నానావిధ విన్యాసముగాఁ గట్టఁబడిన గృహంబుల నన్నింటిని దహించెను. ౧౩

అప్పుడా లంకాపురియందు బంగారుతోఁ జేయఁబడిన కవచములు గలవారలును పుష్పమాలికలు నుత్తమవస్త్రములు దాల్చినవారలును మద్యపానముచేఁ జంచలములయిన కన్నులు గలవారలును మైపుచేతఁ దొట్రుపడుచునున్నవారలును బ్రియురాండ్రచీరలం బట్టుకొని రతిలోలురై యున్నవారలును శత్రువులపట్లఁ జాలఁ బౌరుషముగలవారలును గదలను శూలములను జేతులం దాల్చినవారలును మాంసాదుల భక్షించుచు క్షీరాదులు ద్రావుచునున్నవారలును నుత్తమంబగు శయనంబులందుఁ బ్రియురాండ్రతోడం బరుండియున్నవారలును భయపడి బిడ్డలం దీసికొని వేగంబున దిశదశలకుఁ బరుగెత్తుచున్నవారలునగు లంకానివాసులయిన రాక్షసులను బెక్కులక్షలమందిని అగ్నిహోత్రము దహించి ప్రజ్వరిల్లెను. ౧౪, ౧౫

ఆ యగ్ని సారవంతంబులును ఉత్తమంబులును గంభీరంబులును సౌందర్యవంతంబులును బంగారుతోఁ జేయఁబడిన చంద్రాకారంబులును అర్ధచంద్రాకారంబులును గలవియు మైమేడలచే నత్యున్నతంబులయి యుండునవియు మణిచిత్రంబులయిన కిటికీలతో నొప్పుచున్నవియు శయ్యలతోను నానావిధములయిన యాసనంబులతోను గూడినవియు రత్నఖచితంబులయి ప్రవాళమయంబులయి యుండుటవలనఁ జిత్రవర్ణంబులును నౌన్నత్యంబున సూర్యుని స్పృశించునట్లు చూపట్టునవియుఁ గ్రౌంచపక్షులయొక్కయు నెమిళ్లయొక్కయు వీణలయొక్కయు ఆభరణంబులయొక్కయు ధ్వనులచే శబ్దాయమానంబులయి యున్నవియుఁ బర్వతాకారంబులునగు గృహంబులను దహించెను. ౧౯, ౨౦

నిప్పుదగిలి మండుచున్న లంకాపురి పురద్వారంబులు వర్షాకాలంబున మెఱపులతోఁ గూడిన మేఘసమూహంబులమాడ్కిఁ బ్రకాశించినవి. ౨౧

జ్వలనేన పరీతాని నిపేతుర్భవనా న్యథ. ౨౨
వజ్రివజ్రహతానీవ శిఖరాణి మహాగిరేః,
విమానేషు ప్రసుప్తాశ్చ దహ్యమానా వరాఙ్గనాః. ౨౩
త్యక్తాభరణసర్వాఙ్గా హాహేత్యుచ్చై ర్విచుక్రుశుః,

తాని నిర్దహ్యమానాని దూరతః ప్రచకాశిరే. ౨౪
హిమవచ్ఛిఖరాణీవ దీప్తౌషధివనాని చ,

హర్మ్యాగ్రై ర్దహ్యమానైశ్చ జ్వాలాప్రజ్వలితై రపి, ౨౫
రాత్రౌ సా దృశ్యతే లఙ్కా పుష్పితైరివ కింశుకైః.
హస్త్యధ్యక్షై ర్గజై ర్ముక్తై ర్ముక్తై శ్చైవ తురఙ్గమైః. ౨౬
బభూవ లఙ్కా లోకాన్తే భ్రాన్తగ్రాహ ఇవార్ణవః,

అశ్వం ముక్తం గజో దృష్ట్వా క్వచి ద్భీతోఽపసర్పతి. ౨౭
భీతో భీతం గజం దృష్ట్వా క్వచిదశ్వో నివర్తతే,

లఙ్కాయాం దహ్యమానాయాం శుశుభే స మహార్ణవః. ౨౮
ఛాయాసంసక్తసలిలో లోహితోద ఇవార్ణవః,

సా బభూవ ముహూర్తేన హరిభి ర్దీపితా పురీ. ౨౯
లోకస్యాస్య క్షయే ఘోరే ప్రదీప్తేవ వసున్ధరా,

అంత నాగృహంబులు నిప్పుచే దహింపఁబడినవై ఇంద్రుని వజ్రాయుధముచే ఛిన్నంబులగు మహాపర్వతశిఖరంబులభంగి నేలంగూలినవి. ౨౨

అప్పుడు విమానంబులయందుఁ బరుండి నిద్రించుచున్న యుత్తమస్త్రీలు, నిప్పు తమదేహంబులఁ దగులఁగానె యాభరణంబుల నన్నింటిని దీసి పాఱవైచి గట్టిగా హాహాకారంబులు గావించిరి. ౨౩

అప్పు డగ్నిచే దహింపఁ బడుచున్న యవ్విమానంబులు రాత్రుల వెలుంగుచుండు నోషధుల సమూహంబులు గల హిమవత్పర్వత శిఖరంబులు వలె దూరంబున నుండువారలకుఁ జూపట్టినవి. ౨౪

ఆ లంకాపురియం దారాత్రిని దహింపఁబడుచు జ్వాలాభీలంబులై యుండిన మేడలు చక్కఁగాఁ బుష్పించిన మోదుగుచెట్లువలె నెంతయుఁ బ్రకాశించినవి. ౨౫

అప్పుడు లంకాపురి యగ్నిభయంబున మావటీలు నశ్వరక్షకులు నేనుంగులను గుఱ్ఱంబులను గట్లుదెంచి విడిచిపెట్టఁగా భయసంభ్రమంబులం బరుగెత్తుచున్న యాగజతురంగంబులచేతఁ బ్రలయకాలంబునఁ దరంగంబుల యుద్ధతికి సంభ్రాంతంబులగు మొసళ్లుగల సముద్రంబువలె నుండెను. ౨౬

ఏనుంగు, అశ్వసంరక్షకులచే విడువఁబడి యగ్నిభయంబునం బరుగెత్తుచున్న గుఱ్ఱముంజూచి భయపడి మఱియొక దిక్కునకుఁ బాఱినది; గుఱ్ఱంబును, భయపడి పరుగెత్తుచున్న యేనుంగుంజూచి తానును భయపడి మఱియొక ప్రక్కకుఁ బరుగెత్తినది. ౨౭

లంకాపురి యట్లు దహింపఁబడుచుండఁగా దహింపఁబడుచున్న లంకాపురి ప్రతిబింబము జలంబుల సంక్రమించుటచే సముద్రంబు ఎఱ్ఱని జలముగలదివలెఁ బ్రకాశించినది. ౨౮

అట్లు వానరులు లంకాపురికి అగ్నిముట్టింపఁగానే ముహూర్తమాత్రంబున నమ్మహాపురి భయంకరంబగు మహాప్రలయంబునందు దందహ్యమానమయిన భూమివలె నుండెను. ౨౯

నారీజనస్య ధూమేన వ్యాప్తస్యోచ్చై ర్వినేదుషః. 3౦
స్వనో జ్వలనతప్తస్య శుశ్రువే దశయోజనమ్,
ప్రదగ్ధకాయా నపరా న్రాక్షసా న్నిర్గతా న్బహిః. 3౧
సహసాభ్యుత్పతన్తి స్మ హరయోఽథ యుయుత్సవః,

ఉద్ఘుష్టం వానరాణాం చ రాక్షసానాం చ నిస్వనః. 3౨
దిశో దశ సముద్రం చ పృథివీం చాన్వనాదయత్,

విశల్యౌ తు మహాత్మానౌ తావుభౌ రామలక్ష్మణౌ. 33
అసంభ్రాన్తౌ జగృహతు స్తదోభే ధనుషీ వరే,
తతో విస్ఫారయాణస్య రామస్య ధను రుత్తమమ్. 3౪
బభూవ తుముల శ్శబ్దో రాక్షసానాం భయావహః,
అశోభత తదా రామో ధను ర్విస్ఫారయ న్మహత్. 3౫
భగవానివ సంక్రుద్ధో భవో వేదమయం ధనుః,

ఉద్ఘుష్టం వానరాణాం చ రాక్షసానాం చ నిస్వనమ్. 3౬
జ్యాశబ్ద స్తా వుభౌ శబ్దావతి రామస్య శుశ్రువే,
వానరోద్ఘుష్టఘోషశ్చ రాక్షసానాం చ నిస్వనః. 3౭
జ్యాశబ్దశ్చాపి రామస్య త్రయం వ్యాప్య దిశోదశ,
తస్య కార్ముకముక్తై శ్చ శరై స్త త్పురగోపురమ్. 3౮
కైలాసశృఙ్గప్రతిమం వికీర్ణ మపత ద్భువి,
తతో రామశరా న్దృష్ట్వా విమానేషు గృహేషు చ. 3౯
సన్నాహో రాక్షసేన్ద్రాణాం తుముల స్సమపద్యత,
తేషాం సన్నహ్యమానానాం సింహనాదం చ కుర్వతామ్. ౪౦
శర్వరీ రాక్షసేన్ద్రాణాం రౌద్రీవ సమపద్యత,

పొగచేఁ జుట్టఁబడి యగ్నిచే దహింపఁబడుచు నుచ్చైర్నాదంబున రోదనంబుచేయుచున్న స్త్రీలయొక్కధ్వని పదియోజనంబులవఱకు వినఁబడెను.

అంత మఱికొందఱు రాక్షసులు దహింపఁబడుచున్న దేహములతో సహింపఁజాలక యెట్టకేలకుఁ ఖురంబు వెలువడినంతనె యుద్ధోత్సాహసంపన్నులగు వానరులు వారలకు వేగంబున నెదుర్కొనిరి. ౩౧

వానరుల సంతోషధ్వనులును రాక్షసులరోదన ధ్వనులును దశదిశల యందును సముద్రంబునందును భూమియందును ప్రతిధ్వనిగలుగునట్లు నిండి చెలంగినవి. ౩౨

అప్పుడు మహాత్ములగు నారామలక్ష్మణులు ఇద్దఱును బాణబాధలు లేని వారలయి విఱుపాటులేక ఉత్తమంబులగు రెండుధనుస్సుల గ్రహించిరి.

అంత రాముండు ఉత్తమంబగు ధనుస్సు నారిసారింపఁగానే యమ్మహాధ్వని తుములంబయి రాక్షసుల కెంతయు భయంబు గలిగించినది. ౩౪

అప్పుడు రాముండు సంక్రుద్ధుండై గొప్పధనుస్సును ధ్వనింపఁ జేయుచు క్రుద్ధుండై వేదోక్తమగు మహాధనుస్సును ధ్వనింపఁ జేయుచున్న భగవంతుఁడగు శివునిభంగిఁ బ్రకాశించెను. ౩౫

వానరులకోలాహలంబును రాక్షసులరోదనధ్వనిని ఈ రెండుధ్వనులను అణఁచివేసి రామునిజ్యానాదంబు వినంబడినది. ౩౬

వానరుల కోలాహలధ్వనియును రాక్షసుల రోదనధ్వనియు రాముని జ్యానాదంబును ఈమూఁడును దశదిశలను వ్యాపించి చెలంగినవి. ౩౭

ఆ రాముఁడు ప్రయోగించిన బాణంబులచేఁ గైలాసశిఖరసమానమగు నాలంకాపురద్వారము పగిలి నేలంబడినది. ౩౮

అంత రాక్షసులు విమానంబులయందును గృహంబులయందును రామ బాణంబులంజూచి యధికంబుగా యుద్ధసన్నాహము చేసిరి. ౩౯

అట్లా రాక్షసశ్రేష్ఠులు యుద్ధసన్నాహము సేయుచు సింహనాదంబులు సేయఁగా నారాత్రి ప్రలయకాలరాత్రివలె నుండినది. ౪౦

ఆదిష్టా వారేన్ద్రా స్తు సుగ్రీవేణ మహాత్మనా. ౪౧

ఆసన్న ద్వార మాసాద్య యుధ్యధ్వం ప్లవగర్షభాః,

యశ్చ వో వితథం కుర్యాత్తత్ర తత్ర వ్యవస్థితః. ౪౨
స హన్తవ్యో హి సంప్లుత్య రాజశాసనదూషకః,

తేషు వానరముఖ్యేషు దీప్తోల్కోజ్జ్వలపాణిషు. ౪3
స్థితేషు ద్వార మాసాద్య రావణం మన్యు రావిశత్,
తస్య జృమ్భితవిక్షేపా ద్వ్యామిశ్రా వై దిశో దశ. ౪౪

రూపవానివ రుద్రస్య మన్యుర్గాత్రేష్వదృశ్యత,
స నికుమ్భం చ కుమ్భం చ కుమ్భకర్ణాత్మజా వుభౌ. ౪౫
ప్రేషయామాస సంక్రుద్ధో రాక్షసై ర్బహుభి స్సహ,
యూపాక్ష శ్శోణితాక్షశ్చ ప్రజఙ్ఘః కమ్పన స్తథా. ౪౬
నిర్యయుః కౌమ్భకర్ణిభ్యాం సహ రావణశాసనాత్,
శశాస(చైవతాన్)నాదయన్ సర్వా న్రాక్షసాన్ సుమహాబలాన్.

నాదయన్గచ్ఛతాత్రైవ జయధ్వం శీఘ్ర మేవ చ,

తతస్తు చోదితా స్తేన రాక్షసా జ్వలితాయుధాః. ౪౭
లఙ్కాయా నిర్యయు ర్వీరాః ప్రణద న్తః పునఃపునః,

రక్షసాం భూషణస్థాభి ర్భాభి స్స్వాభిశ్చ సర్వశః. ౪౮

మహాపరాక్రమశాలియగు సుగ్రీవుండు వానరోత్తముల కిట్లని యాజ్ఞాపించెను. ౪౧

వానరోత్తములారా! మీరలు రావణాంతఃపురంబునకు సమీపమున నుండు ద్వారంబుఁజేరి యుద్ధము చేయుండు.

మీలో నయోగ్యస్థలంబులనుండు వారలలో నెవ్వఁడు నీయాజ్ఞప్రకారము నడువఁడో, అతని రాజాజ్ఞ నుల్లంఘించినందుకై తత్క్షణంబున వధింపవలెను. అని సుగ్రీవుండు వానరుల కాజ్ఞాపించెను. ౪౨

మండుచున్న దివిటీలం జేతులఁ బట్టుకొని యవ్వానరశ్రేష్ఠులు ద్వారంబున నిలుచుండుటం జూడఁగానే రావణునకుఁ గోపంబు వచ్చెను. ౪౩

ఆ రావణుండు కోపావేశంబున విజృంభించి కాళ్లుఁజేతులు విదుర్చుటకు దశదిశలు వ్యాకులతం జెందినవి. ౪౪

భయంకరాకారుండగు నారావణుని యవయవములయందుఁ గోపము రూపముగలదివలె భయంకరంబయి చూపట్టినది.

ఆ రావణుండు పరమకుపితుండై కుంభకర్ణుని పుత్రులగు నికుంభుని గుంభుని వీరల నిరువురను బెక్కండ్ర రాక్షసులతోడంగూడ యుద్ధంబున కంపెను.

రావణు నాజ్ఞవలన యూపాక్షుండును శోణితాక్షుండును బ్రఘసుండును గంపనుండును కుంభనికుంభులతోఁగూడఁ బోయిరి. ౪౫

రావణుండు మఱియుఁ గోపంబున గట్టిగానఱచుచు మహాబలశాలులగు నారాక్షసుల నందఱంజూచి యిట్లని యాజ్ఞాపించెను. ౪౬

రాక్షసులారా! మీరలిప్పుడెపోయి శీఘ్రంబున జయింపుఁడు. అని రావణుండు రాక్షసుల కాజ్ఞాపించెను.

అంత ఉత్తమంబులగు నాయుధములు ధరించినవారలును బరాక్రమవంతులునగు నారాక్షసులు రావణునాజ్ఞనువిని మాటిమాటికి సింహనాదములు చేయుచు లంకాపురినుండి వెడలిరి. ౪౭

ఆ వానరులచేతులనుండు నగ్నులకాంతులచేతను ఆరాక్షసుల భూషణ

చక్షుస్తే సప్రభం వ్యోమ హారయ శ్చాగ్నిభి స్సహ,
తత్ర తారాధిపస్యాభా తారాణాం చ తథైవ చ. ౫౦
తయో రాభరణస్థా చ బలయో ర్ద్యామభాసయన్,
చన్ద్రాభా భూషణాభా చ గృహాణాం జ్వలతాంచ భా. ౫౧
హరిరాక్షససైన్యాని భ్రాజయామాస సర్వతః,

తత్ర చోర్ధ్వం ప్రదీప్తానాం గృహాణాం సాగరః పునః. ౫౨
భాభి స్సంసక్తపాతాళ శ్చలోర్మి శ్శుశుభేఽధికమ్,

పతాకాధ్వజసంసక్త ముత్తమాసిపరశ్వథమ్. ౫౩
భీమాశ్వరథమాతఙ్గం నానాపత్తిసమాకులమ్,
దీప్తశూలగదాఖడ్గ ప్రాసతోమరకార్ముకమ్. ౫౪
తద్రాక్షసబలం ఘోరం భీమవిక్రమపౌరుషమ్,
దదృశే జ్వలితప్రాసం కిఙ్కిణీశతనాదితమ్. ౫౫
హేమజాలాచితభుజం వ్యావేష్టితపరశ్వథమ్,
వ్యాఘూర్ణితమహాశస్త్రం బాణసంసక్తకార్ముకమ్. ౫౬
గన్ధమాల్యమధూత్సేకసంమోదిత మహానిలమ్,
ఘోరం శూరజనాకీర్ణం మహామ్బుధరనిస్వనమ్. ౫౭

తద్దృష్ట్వా బలమాయాన్తం రాక్షసానాం సుదారుణమ్,
సంచచాల ప్లవఙ్గానాం బల ముచ్చైశ్చ ర్ననాదచ. ౫౮
జవేనాప్లుత్య చ పున స్తద్బలం రక్షసాం మహాత్,
అభ్యయా త్ప్రత్యరిబలం పతఙ్గా ఇవ పావకమ్. ౫౯
తేషాం భుజపరామర్శవ్యామృష్టపరిఘాశని,

ములకాంతులచేతను అచ్చటి యాకాశంబంతయు ఎంతయు వెలింగినది. ౪౯

అప్పుడు ఉదయించిన చంద్రునికాంతియు నక్షత్రములకాంతియు అయ్యుభయసేనల యాభరణకాంతులును ఆకాశము వెలింగించినవి. ౫౦

చంద్రునికాంతిచేతను భూషణంబులకాంతిచేతను మండుచుండు గృహంబులకాంతిచేతను అవ్వానర రాక్షససేనలు మిక్కిలియుఁ బ్రకాశించినవి. ౫౧

అప్పుడు మఱియు ఊర్ధ్వముఖంబుగా మండుచున్న గృహంబుల కాంతులచేత పాతాళంబువఱకు లోఁతుగల తరంగసంకులంబగు సముద్రంబును దేజరిల్లెను. ౫౨

అప్పుడు భయంకరాకారంబగు రాక్షససైన్యము పట్టిటెక్కెములతోను రాజచిహ్నచిత్రితంబులగు టెక్కెములతోనుంగూడి భయంకరంబులగు నేనుంగులు గుఱ్ఱంబులు రథంబులుం గలిగి నానావిధ వేషాయుధధరులగు పదాతులతో నొప్పుచు శూలంబులను గదలను ఖడ్గంబులను ప్రాసంబులను తోమరంబులను ధనుస్సులను కత్తిగొడ్డళ్లను ధరించి మహాయుధంబుల గిఱగిఱం ద్రిప్పుచున్న మహావీరులతోఁ గూడి కాంచనాలంకృతంబులగు భుజంబులతో నొప్పుచు బాణంబులు సంధించిన ధనుస్సులు గలిగి రథంబులందలి చిఱుగంటలు మ్రోయ గంధమాల్యంబులులయొక్కయు వీరపానంబుగాఁ ద్రావఁబడిన మద్యంబుయొక్కయు వాసనల గుబాళించుచుఁ బెనుగాలివీవ భయంకరంబయి మహాశూరులతోఁగూడినదై మహామేఘంబు మాడ్కి గర్జించుచు నెంతయుఁ జూడనొప్పెను. ౫౩ ౫౪

వానరసైనికులు భయంకరాకారంబగు రాక్షససేనవచ్చుటం జూచి ఉచ్చైర్నాదంబున గర్జింపుచుఁ గదలెను. ౫౫

ఆరాక్షసుల మహాసేనయు వేగంబునదుముకుచు శలభంబులు అగ్నిపైకి బోవునట్లు వానరసేనపైకిఁ బోయెను. ౫౬

ఎప్పుడును ఆ రాక్షసుల భుజములయందు రాపిడి తగులుటవలన సాన

రాక్షసానాం బలం శ్రేష్ఠం భూయస్తర మశోభత. ౬౦

తత్రోన్మత్తా ఇవోత్పేతు ర్హరయోఽథ యుయుత్సవః,
తరుశైలై రభిఘ్నన్తో ముష్టిభిశ్చ నిశాచరాన్. ౬౧
తథైవాపతతాం తేషాం కపీనా మసిభి శ్శితైః,
శిరాంసి సహసా జహ్రూ రాక్షసా భీమదర్శనాః. ౬౨
దశనై ర్హృతకర్ణాశ్చ ముష్టినిష్కీర్ణమస్తకాః,
శిలాప్రహారభగ్నాఙ్గా విచేరు స్తత్ర రాక్షసాః. ౬౩

తథైవా ప్యపరే తేషాం కపీనా మభిలక్షితాః,
ప్రవీరా నభితో జఘ్నూ రాక్షసానాం తరస్వినామ్. ౬౪
తథైవాప్యపరే తేషాం కపీనా మసిభి శ్శితైః,
హరివీరా న్నిజఘ్నుశ్చ ఘోరరూపా నిశాచరాః. ౬౫
ఘ్నన్త మన్యం జఘానాన్యగ పాతయన్త మపాతయత్,
గర్హమాణం జగర్హేఽన్యో దశన్త మపరోఽదశత్. ౬౬

దేహీత్యన్యో దదాత్యన్యో దదామీత్యపరగ పునః,
కింక్లేశయసి తిష్ఠేతి తత్రాన్యోన్యం బభాషిరే. ౬౭

విప్రలమ్బితవస్త్రం చ విముక్తకవచాయుధమ్,
సముద్యతమహాప్రాసం యష్టిశూలాసిసంకులమ్. ౬౮
ప్రావర్తత మహారౌద్రం యుద్ధం వానరరక్షసామ్,
వానరా న్దశ సప్తేతి రాక్షసా జఘ్ను రాహవే. ౬౯

బెట్టఁబడినట్లు తళతళం బ్రకాశించుచుండు పరిఘంబులును వజ్రాయుధంబులునుం గలిగియుత్తమంబగు నారాక్షససేన యెంతయుం బ్రకాశించెను. ౬౦

అంత నప్పుడు వానరులు యుద్ధోత్సాహంబునఁ బిచ్చిపట్టినట్లు ఎగురుచుఁ బర్వతంబులచేతను బిడికిళ్లచేతను రాక్షసులం బ్రహరించిరి. ౬౧

భయంకరాకారులగు నారాక్షసులు తమపైకివచ్చినంతనె వారలశిరస్సులను తీక్ష్ణంబులగు ఖడ్గంబులచేఁ దటాలున ఖండించిరి. ౬౨

ఆయుద్ధమునందు రాక్షసులు కొందఱు వానరులచేఁ గొఱికివేయఁబడిన చెవులుగలవారలును గొందఱు బిడికిటిపోటులచేఁ బగులఁగొట్టఁబడిన తలలుగలవారలును గొందఱు శిలాప్రహారంబుల విఱువఁబడిన యవయవములుం గలవారలును అయిరి. ౬౩

ఇట్లు వానరోత్తములు మఱికొందఱు బలవంతులగు రాక్షసులలోపల మేటులగువారలఁ బెక్కండ్రను వధించిపుచ్చిరి. ౬౪

అట్లే భయంకరాకారులగు రాక్షసులును గొందఱు అవ్వానరులలో మేటులగు వీరులను తీక్ష్ణఖడ్గంబులచే వధించిపుచ్చిరి. ౬౫

ఆయుద్ధంబున ఒకఁడు తన్నుఁ గొట్టవచ్చువానిం గొట్టెను; మఱియొకఁడు తన్నుఁ బడఁద్రోయువానిం బడఁద్రోసెను, మఱియొకఁడు తన్ను నిందించువాని నిందించెను; మఱియొకఁడు తన్నుఁ గొఱుకువానిం గొఱికిపెట్టెను. ౬౬

ఒకఁడు "నన్నుఁగొట్టు" మనియు మఱియొకఁడు "ఇదిగో కొట్టుచున్నాఁ" డనియు మఱియొకఁడు "ఇదిగోకొట్టెద" ననియు మఱియొకఁడు "ఇట్లేందుకు కష్టపడెదవు? నాయెదుటనిలు" వనియు నిట్లు ఆయుద్ధంబున ఒకరితో నొకరు వీరాలాపంబులాడిరి. ౬౭

అప్పుడు వానరరాక్షసులు కట్టువస్త్రములుఁ బీడ మేనికవచంబులును దొలఁగఁ జేతియాయుధంబులు జాఱిపడఁ బ్రాసయష్టిశూలఖడ్గంబులతో యుద్ధంబుసేయఁ బోరు ఘోరంబయ్యె. ౬౮

ఆయుద్ధమునందు రాక్షసులు వానరులను పదుగురనుఏడుగురను ఇట్లు

రాక్షసా న్దశసప్తేతి వానరాశ్చాభ్యపాతయన్,

విస్రస్తకేశవసనం విధ్వస్తకవచధ్వజమ్. ౭౦
బలం రాక్షస మాలమ్బ్య వానరాః పర్యవారయన్,

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే పఞ్చసప్తతితమస్సర్గః.

## షట్సప్తతితమస్సర్గః.

ప్రవృత్తే సంకులే తస్మి న్ఘోరే వీరజనక్షయే,
అఙ్గదః కమ్పనం వీర మాససాద రణోత్సుకః. ౧

ఆహూయ సోఽఙ్గదం కోపా త్తాడయామాస వేగితః,
గదయా కమ్పనః పూర్వం స చచాల భృశాహతః. ౨

స సంజ్ఞాం ప్రాప్య తేజస్వీ చిక్షేప శిఖరం గిరేః,
అర్దిత స్తత్ప్రహారేణ కమ్పనః పతితో భువి. 3

తత స్తు కమ్పనం దృష్ట్వా శోణితాక్షో హతం రణే,
రథేనాభ్యపత త్క్షిప్రం తత్రాఙ్గద మభీతవత్. ౪
సోఽఙ్గదం నిశితై ర్బాణై స్తదా వివ్యాథ వేగితః,
శరీరదారణై స్తీక్ష్ణైః కాలాగ్నిసమవిగ్రహైః. ౫

క్షురక్షురప్రైర్నారాచై ర్వత్సదన్తై శ్శిలీముఖైః,
కర్ణిశల్యవిపాఠైశ్చ బహుభిశ్చ శితై శ్శరైః. ౬
అఙ్గదః ప్రతివిద్ధాఙ్గో వాలిపుత్రః ప్రతాపవాన్,

వధించిపుచ్చిరి, అట్లు వానరులును రాక్షసులను బదుగురను ఏడుగురను అట్లు వధించిపుచ్చిరి. ౧౯

తలవెండ్రుకలువీడి వస్త్రంబులు దొలఁగి కవచంబులు భిన్నంబులయి ధ్వజంబులు భగ్నంబులయి కలఁతనొందియున్న రాక్షససేనను వానరులు చుట్టుముట్టిరి. ౨౦

ఇది డెబ్బదియైదవసర్గము.

## డెబ్బదియాఱవసర్గము.

అట్లు నిరంతరంబుగా ననేకవీరుల నశింపఁ జేయునట్టి భయంకరమయిన యుద్ధంబగుటయు యుద్ధోత్సాహంబున నంగదుండు వీరుఁడగుకంపనునిమీఁదికిఁ బోయెను. ౧

అకంపనుఁడు కోపంబున మహావేగుండై యంగదుని రమ్ము రమ్మని పిలిచి ముందతని గదచేఁ బ్రహరింప నయ్యంగదుండును ఆదెబ్బచేఁ బీడితుండై మూర్ఛిల్లెను. ౨

మహాపరాక్రమశాలియగు నంగదుండు అంతం దెలివొంది ఒకపర్వతశిఖరంబుఁ బెకలించి కంపనునిపై నేయ నతండు మృతుండై నేలం గూలెను. ౩

అంత శోణితాక్షుండు కంపనుండు యుద్ధంబున హతుండగుటం జూచి నిర్భయంబుగా నంగదునిమీఁదికి రథంబుఁ దోలించెను. ౪

అప్పుడు శోణితాక్షుఁడు మహావేగంబున శరీరభేదనంబులును తీక్ష్ణంబులును ప్రలయకాలానల సమానంబులును మహాభయంకరంబులునగు బాణంబులచే నంగదునిఁ బ్రహరించెను. ౫

వాలికుమారుండును మహాపరాక్రమశాలియు మహాబలుండు నగు నంగదుండు శోణితాక్షుండు ప్రయోగించిన మంగలకత్తివంటి బాణంబులచేతను అర్ధచంద్రాకారబాణంబులచేతను అంతయును నినుముతోఁ జేయఁబడిన

ధను రగ్ర్యం రథం బాణా న్మమర్ద తరసా బలీ. ౭

శోణితాక్ష స్తతః శీఘ్ర మసిచర్మ సమాదదే,
ఉత్పపాత దివం క్రుద్ధో వేగవా నవిచారయన్. ౮
తం క్షిప్రతర మాప్లుత్య పరామృశ్యాఙ్గదో బలీ,
కరేణ తస్య తం ఖడ్గం సమాచ్ఛిద్య ననాద చ. ౯

తస్యాంసఫలకే ఖడ్గం నిజఘాన తతోఽఙ్గదః,
యజ్ఞోపవీతవ చ్చైనం చిచ్ఛేద కపికుఞ్జరః. ౧౦
తం ప్రగృహ్య మహాఖడ్గం వినద్య చ పునఃపునః,
వాలిపుత్రోఽభిదుద్రావ రణశీర్షే పరానరీన్. ౧౧

ఆయసీం తు గదాం వీరః ప్రగృహ్య కనకాఙ్గదః,
శోణితాక్ష స్సమావిధ్య తమేవానుపపాత హ. ౧౨

ప్రజఙ్ఘసహితో వీరో యూపాక్ష స్తు తతో బలీ,
రథేనాభియయౌ క్రుద్ధో వాలిపుత్రం మహాబలమ్. ౧౩

తయో ర్మధ్యే కపిశ్రేష్ఠ శ్శోణితాక్షప్రజఙ్ఘయోః,
విశాఖయో ర్మధ్యగతః పూర్ణచన్ద్ర ఇవాభవత్. ౧౪

అఙ్గదం పరిరక్షన్తౌ మైన్దో ద్వివిద ఏవ చ,

బాణంబులచేతను వత్సదంతాకారబాణంబులచేతను కంకపత్త్రాకారబాణంబుల చేతను నుభయ పార్శ్వంబులఁ గర్ణంబులుగల బాణంబులచేతను సగము ఇనుముతోఁ జేయఁబడిన బాణంబులచేతను గరవీరపత్త్రాగ్రసదృశంబులచేతను మఱియుం బెక్కు కఱకుబాణంబులచేతను దాడితుండై ఆశోణితాక్షుని యుత్తమంబగుధనుస్సును రథంబును బాణంబులచే నుగ్గు గావించెను.

అంత శోణితాక్షుండు కుపితుండై వాలును డాలునుంగొని యెంత మాత్రము విచారముసేయక మహావేగంబున నాకాశంబునకు నెగసెను. ౮

మహాబలుండగు నంగదుండు అతనికన్న నధిక వేగంబున నాకాశంబున కుద్గమించి యాశోణితాక్షునిం బట్టుకొని యాతనిచేతి మహాఖడ్గంబునొడిసి పెఱికికొని సింహనాదంబు గావించెను. ౯

అంత వానరోత్తముఁడగు నంగదుండు ఆశోణితాక్షుని భుజశిఖరంబున ఖడ్గంబుచే యజ్ఞోపవీతంబులాగున ఛేదించెను. ౧౦

వాలికుమారుండగు నంగదుండు అమ్మహాఖడ్గంబు గ్రహించి మాటి మాటికి సింహనాదంబులు సేయుచు యుద్ధంబున నితర రాక్షసులపైఁకి బోయెను. ౧౧

బంగారు బాహుపురులు ధరించియుండు వీరుండగు శోణితాక్షుం డును ఇనుపగదను గ్రహించి గిఱగిఱం ద్రిప్పుచు నాయంగదుని వెంబ డించెను. ౧౨

అంత బలవంతుఁడును బరాక్రమశాలియునగు యూపాక్షుండు కుపి తుండై ప్రజంఘుండు తోడ్పడ మహాబలశాలియగు నంగదునిపై రథంబుఁ దోలించెను. ౧౩

వానరశ్రేష్ఠుఁడగు నంగదుఁడు ఆశోణితాక్ష ప్రజంఘుల నడుమ విశాఖానక్షత్రముల రెండింటి నడుమనుండు పూర్ణచంద్రునిభంగి దేజ రిల్లెను. ౧౪

మైందుండును ద్వివిదుండును అంగదుని రక్షణార్థముయి యుద్ధము

తస్య తస్థతు రభ్యాశే పరస్పరదిదృక్షయా. ౧౫
అభివేతు ర్మహాకాయాః ప్రతియత్తా మహాబలాః,
రాక్షసా వానరా స్త్రోషా దసిచర్మగదాధరాః. ౧౬

త్రయాణాం వానరేన్ద్రాణాం త్రిభీ రాక్షసపుఙ్గవైః,
సంసక్తానాం మహద్యుద్ధ మభవ ద్రోమహర్షణమ్. ౧౭

తే తు వృక్షాన్ సమాదాయ సంప్రచిక్షిపు రాహవే,
ఖడ్గేన ప్రతిచిచ్ఛేద తా న్ప్రజఙ్ఘో మహాబలః. ౧౮
రథా నశ్వాన్ ద్రుమై శ్శైలై స్తే ప్రచిక్షిపు రాహవే,
శరౌఘైః ప్రతిచిచ్ఛేద తాన్యూపాక్షో నిశాచరః. ౧౯
సృష్టా న్ద్వివిదమైన్దాభ్యాం ద్రుమా నుత్పాట్య వీర్యవాన్,
బభఞ్జ గదయా మధ్యే శోణితాక్షః ప్రతాపవాన్. ౨౦
ఉద్యమ్య విపులం ఖడ్గం పరమ ర్మనికృన్తనమ్,
ప్రజఙ్ఘో వాలిపుత్త్రాయ అభిదుద్రావ వేగితః. ౨౧
తమభ్యాశగతం దృష్ట్వా వానరేన్ద్రో మహాబలః,
ఆజఘానాశ్వకర్ణేన ద్రుమేణాతిబల స్తదా. ౨౨
బాహుం చాస్య సనిస్త్రింశ మాజఘాన స ముష్టినా,
వాలిపుత్త్రస్య ఘాతేన స పపాత క్షితావసిః. ౨౩
తం దృష్ట్వా పతితం భూమౌ ఖడ్గముత్పలసన్నిభమ్,
ముష్టిం సంవర్తయామాస వజ్రకల్పం మహాబలః. ౨౪
లలాటే సమహావీర్య మఙ్గదం వానరర్షభమ్,
ఆజఘాన మహాతేజా స్సముహూర్తం చచాల హ. ౨౫
స సంజ్ఞాం ప్రాప్య తేజస్వీ వాలిపుత్త్రః ప్రతాపవాన్,
ప్రజఙ్ఘస్య శిరః కాయా త్ఖడ్గేనాపాతయ త్క్షితౌ. ౨౬

చేయఁగోరి యంగదుని సమీపంబున నిలిచిరి. ౧౫

భయంకరాకారులును మహాబలశాలులునగు నారాక్షసులు యుద్ధసన్నద్ధులయి కత్తులను డాలులను గదలను దాల్చి మహారోషంబున వానరులపై కదిసిరి. ౧౬

అంగద ద్వివిద మైందులు మువ్వురు వానరోత్తములును బ్రజంఘ యూపాక్ష శోణితాక్షుల మువ్వురిరాక్షసులతోడను దలపడ నప్పుడు రోమహర్షణంబగు మహాయుద్ధంబయ్యెను. ౧౭

ఆవానరులు యుద్ధంబున రాక్షసులపై వృక్షంబులం దెచ్చివేయ మహాబలశాలియగు ప్రజంఘుండు ఖడ్గంబున నావృక్షంబుల ఛేదించెను. ౧౮

ఆవానరులు యుద్ధంబున రథాశ్వంబులపై వృక్షంబులను బర్వతంబులను వేయ యూపాక్షుండు బాణసమూహంబుల వాని నివారించెను. ౧౯

బలవంతుఁడును బరాక్రమశాలియు నగుశోణితాక్షుండు మైందద్వివిదులు ప్రయోగించిన వృక్షంబులును గదచే నడుమన భంజించి వైచెను. ౨౦

ప్రజంఘుండు శత్రుమర్మస్థానంబుల ఛేదించునట్టి మహాఖడ్గంబుఁబట్టుకొని మహావేగంబున వాలికుమారుఁడగు నంగదునిపైకిఁ బోయెను. ౨౧

మహాబలపరాక్రమశాలియగు వానరశ్రేష్ఠుం డంగదుండు అప్పుడా ప్రజంఘుండు తనపైకి వచ్చుటంజూచి ఇరుమద్దిచెట్టుతో నతనిం గొట్టెను. ౨౨

ఆయంగదుండు మఱియుఖడ్గంబుతోఁగూడిన ప్రజంఘునిభుజంబును బిడికిటంబొడిచిన నాదెబ్బకు ఖడ్గం బతనిభుజంబుననుండి జాఱి నేలంబడెను. ౨౩

మహాబలుండగు ప్రజంఘుండు నల్లకలువకాంతివంటి కాంతిగల ఖడ్గంబు నేలంబడుటనుజూచి వజ్రసమానంబగు పిడికిలి నలవరించెను. ౨౪

మహాపరాక్రమశాలియగు నాప్రజంఘుండు మహావీర్యుఁడయినవానరశ్రేష్ఠు నంగదుని లలాటంబునంబొడువ నతండు కొంచెము మూర్ఛిల్లెను. ౨౫

మహాతేజుండును మహావీర్యండునగు నాయంగదుండు అంతఁ గొంత వడికిఁ దెలివొంది ఖడ్గంబుచే ప్రజంఘునిశిరస్సును నేలం డొల్లనేసెను. ౨౬

స యూపాక్షో ఽశ్రుపూర్ణాక్షః పితృవ్యే నిహతే రణే,
అవరుహ్య రథాత్తిప్రం క్షీణేషుః ఖడ్గమాదదే. ౨౭

తమాపతన్తం సంప్రేక్ష్య యూపాక్షం ద్వివిదస్త్వరన్,
ఆజఘానోరసి క్రుద్ధో జగ్రాహ చ బలాద్బలీ. ౨౮

గృహీతం భ్రాతరం దృష్ట్వా శోణితాక్షో మహాబలః,
ఆజఘాన గదాగ్రేణ వక్షసి ద్వివిదం తతః. ౨౯
స గదాభిహతస్తేన సంచచాల మహాబలః,
ఉద్యతాం చ పునస్తస్య జహార ద్వివిదో గదామ్. ౩౦

ఏతస్మిన్నన్తరే వీరో మైన్దో వానరయూథపః,
యూపాక్షం తాడయామాస తలేనోరసి వీర్యవాన్. ౩౧
తౌ శోణితాక్షయూపాక్షౌ ప్లవగాభ్యాం తరస్వినౌ,
చక్రతుస్సమరే తీవ్రమాకర్షోత్పాటనం భృశమ్. ౩౨
ద్వివిదశ్శోణితాక్షం తు విదదార నఖైర్ముఖే,
నిష్పిపేష చ వేగేన క్షితావావిధ్య వీర్యవాన్. ౩౩

యూపాక్షమభిసంక్రుద్ధో మైన్దో వానరయూథపః,
పీడయామాస బాహుభ్యాం స పపాత హతః క్షితౌ. ౩౪
హతప్రవీరా వ్యథితా రాక్షసేన్ద్రచమూస్తదా,
జగామాభిముఖీ సా తు కుమ్భకర్ణసుతో యతః. ౩౫
ఆపతన్తీం చ వేగేన కుమ్భస్తాం సాన్త్వయచ్చమూమ్,
అథోత్కృష్టం మహావీరైర్లబ్ధలక్ష్యైః ప్లవఙ్గమైః. ౩౬

యుద్ధమునందుఁ దనపినతండ్రి ప్రజంఘుఁడు నిహతుండగుటం జూచి యూపాక్షుఁడు కన్నులనిండఁ గన్నీళ్లు గార్చుచు బాణంబులన్నియు ముగియుటం జేసి శీఘ్రంబున రథంబుననుండి డిగ్గి ఖడ్గంబు ధరించెను. ౨౭

బలవంతుఁడగు ద్వివిదుండు యూపాక్షుండు వచ్చుటం జూచి క్రుద్ధుండై వేగంబున నతని ఱొమ్మునం జఱచి బలాత్కారంబున నతనిం బట్టుకొనెను. ౨౮

అంత మహాబలశాలియగు శోణితాక్షుండు తమ్ముఁడు పట్టుపడుటం జూచి కోపంబున గదతో ద్వివిదుని ఱొమ్మునం గొట్టెను. ౨౯

మహాబలుండగు ద్వివిదుండు శోణితాక్షునిగదప్రేటున కొంతయుఁ జలించి మరల నాశోణితాక్షుండు గొట్టగద నెత్తుటయుం దానినొడిసి పెఱికికొనెను. ౩౦

ఇంతలో మహాబలపరాక్రమశాలియగు మైందుండను వానరయూథపుఁడు యూపాక్షునిఱొమ్మున నఱచేతం గొట్టెను. ౩౧

బలవంతులగు నాశోణితాక్షయూపాక్షులు అయ్యుద్ధంబున మైంద ద్వివిదులతోఁ దలపడి యొకరినొకరు లాగుకొనుచుఁ గొట్టుకొనిరి. ౩౨

పరాక్రమవంతుఁడగు ద్వివిదుండు గోళ్లచే శోణితాక్షునిముఖంబంతయుఁ జీల్చి వేగంబున నేలపైఁగొట్టి యతనిదేహమంతయుఁ బిసికి ముద్దగావించెను. ౩౩

వానరశ్రేష్ఠుండగు మైందుండును బరమకుపితుండై యూపాక్షుని రెండుచేతులతోనుం గొట్టె నారాక్షసుండు హతుండై నేలంగూలెను. ౩౪

అప్పుడు అట్లు రాక్షసమహావీరులు పెక్కండ్రు కూలుటయు ఆరాక్షససేన భయపడి కుంభకర్ణునికుమారుండుండు స్థలంబున కభిముఖమై నడచెను.

కుంభుండు అట్లు వేగంబునఁ దనయొద్దకు వచ్చుచున్న సేనకు ధైర్యంబుఁ జెప్పి యూఱడించెను.

అంత రాక్షసోత్తముండును మహాపరాక్రమశాలియునగు కుంభుండు,

నిపాతిత మహావీరాం దృష్ట్వా రక్షశ్చమూం తతః,
కుమ్భః ప్రచక్రే తేజస్వీ రణే కర్మ సుదుష్కరమ్. ౩౭

స ధనుర్ధన్వినాం శ్రేష్ఠః ప్రగృహ్య సుసమాహితః,
ముమోచాశీవిషప్రఖ్యాన్ శరాన్దేహవిదారణాన్. ౩౮

తస్య తచ్ఛుశుభే భూయ స్సశరం ధనురుత్తమమ్,
విద్యుదైరావతార్చిష్మ ద్ద్వితీయేన్ద్రధను ర్యథా. ౩౯
ఆకర్ణాకృష్టముక్తేన జఘాన ద్వివిదం తదా,
తేన హాటకపుఙ్ఖేన పత్త్రిణా పత్త్రివాససా. ౪౦
సహసాభిహత స్తేన విప్రముక్తపద స్త్వ(స్స్ఫు)రన్,
నిపపాతాద్రికూటాభో విహ్వలః ప్లవగోత్తమః. ౪౧

మైన్ద స్తు భ్రాతరం దృష్ట్వా భగ్నం తత్ర మహాహవే,
అభిదుద్రావ వేగేన ప్రగృహ్య మహతీం శిలామ్. ౪౨
తాం శిలాం తు ప్రచిక్షేప రాక్షసాయ మహాబలః,
బిభేద తాం శిలాం కుమ్భః ప్రసన్నైః పఞ్చభి శ్శరైః. ౪౩

సన్ధాయ చాన్యం సుముఖం శరమాశీవిషోపమమ్,
ఆజఘాన మహాతేజా వక్షసి ద్వివిదాగ్రజమ్. ౪౪

సతు తేన ప్రహారేణ మైన్దో వానరయూథపః,
మర్మణ్యభిహత స్తేన పపాత భువి మూర్ఛితః. ౪౫
అఙ్గదో మాతులౌ దృష్ట్వా పతితౌ తు మహాబలౌ,
అభిదుద్రావ వేగేన కుమ్భ ముద్యతకార్ముకమ్, ౪౬

రాక్షససేనలోని మేటివీరులు పెక్కండ్రు ఎదురులేని మహాపరాక్రమశాలు లగు వానరవీరులచే వధింపఁబడుటనుజూచి యుద్ధమునందు ఇతరులకుఁ జేయ నలవిగాని గొప్పకార్యము గావించెను. 3౭

విలుకాండ్రలో నుత్తముఁడగు కుంభుండు సమాహితుండై ధనుస్సు చేతంబట్టి కృష్ణసర్పసమానంబులును దేహంబును భేదించునవియునగు బాణం బులం బ్రయోగించెను. 3౮

బాణసహితంబగుటచే మెఱపుతోఁ గూడినట్లు రాజిల్లుచున్నయుత్తమం బగు నాకుంభునిధనుస్సు రెండవయింద్రధనుస్సువోలెం బ్రకాశించెను. 3౯

అప్పుడు కుంభుఁడు బంగారుపింజగలదియుఁ జెక్కలు గట్టినదియునగు నాబాణంబును జెవివరకు నాకర్షించి ద్వివిదునింగొట్టెను. ౪౦

పర్వతశిఖరాకారుండగు వానరశ్రేష్ఠుండు ద్వివిదుండు ఆబాణంబుచేఁ గొట్టఁబడినవాఁడై యడుగులు తొట్రుపడఁ జలించి విహ్వలాంగుండై నేలంబడెను. ౪౧

మైందుఁడు తనతమ్ముఁ డమ్మహాయుద్ధంబున భంగంబు నొందుటంజూచి గొప్పశిలం జేకొని వేగంబునఁ గుంభునిమీఁదికిఁ బోయెను. ౪౨

మహాబలశాలియగు మైందుండాశిలను గుంభునిమీఁద వేసెను. ఆరాక్ష సుండు మిక్కిలియుఁ దీక్ష్ణంబులగు నైదుబాణంబులచే దాని వ్రయ్యలు గావించెను. ౪3

మహాపరాక్రమశాలియగు కుంభుండు సుందరమయిన ముఖము గల దియుఁ సర్పతుల్యంబునగు మఱియొకబాణంబును వింట సంధించి ద్వివిదు నన్నయగు మైందునిఱొమ్ము నాటనేసెను. ౪౪

ఆదెబ్బ వానరోత్తముఁడగు మైందుని మర్మస్థానంబునం దవిలెను; అతండు దానికి మూర్ఛిల్లి నేలంబడెను. ౪౫

అంగదుండు మహాబలశాలులగు తన మేనమామ లిర్వురుఁ బడుటను జూచి ధనుర్ధరుండగు కుంభునిమీఁదికి వేగంబునం బోయెను. ౪౬

తమాపతన్తం వివ్యాధ కుమ్భగ పఞ్చభిరాయసైః,
త్రిభి శ్శానైశ్శ్శితై ర్బాణై ర్మాతఙ్గ మివ తోమరైః. ౪౭

సోఽఙ్గదం వివిధై ర్బాణైగ కుమ్భో వివ్యాధ వీర్యవాన్,
అకుణ్ఠధారై ర్నిశితై స్తీక్ష్ణైగ కనకభూషణైః. ౪౮
అఙ్గదగ ప్రతివిద్ధాఙ్గో వాలిపుత్త్రో న కమ్పతే,
శిలాపాదపవర్షాణి తస్య మూర్ధ్ని వవర్షహ. ౪౯

స ప్రచిచ్ఛేద తాన్ సర్వాన్బిభేద చ పున శ్శిలాః,
కుమ్భకర్ణాత్మజ శ్శ్రీమా న్వాలిపుత్త్రసమీరితాన్. ౫౦
ఆపతన్తం చ సంప్రేక్ష్య కుమ్భో వానరయూథపమ్,
భ్రువో ర్వివ్యాధ బాణాభ్యా ముల్కాభ్యా మివ కుఞ్జరమ్. ౫౧

తస్య సుస్రావ రుధిరం పిహితే చాస్య లోచనే,

అఙ్గదగ పాణినా నేత్రే పిధాయ రుధిరోక్షితే. ౫౨
సాలమాసన్న మేకేన పరిజగ్రాహ పాణినా,
సంపీడ్య చోరసి స్కన్ధం కరేణాభినివేశ్య చ. ౫౩
కించి దభ్యవనమ్యైన ముమ్మమాథ యథా గజః,
తమిన్ద్రకేతుప్రతిమం వృక్షం మన్దరసన్నిభమ్. ౫౪
సముత్సృజన్తం వేగేన పశ్యతాం సర్వరక్షసామ్,
స బిభేద శితై ర్బాణై స్సప్తభిగ కాయభేదనైః. ౫౫
అఙ్గదో వివ్యథేఽభీక్ష్ణం ససాద చ ముమోహ చ,
అఙ్గదం వ్యథితం దృష్ట్వా సీదన్త మివ సాగరే. ౫౬

కుంభుఁడు అంగదుండు వచ్చుటం జూచి యేనుంగును అంకుశంబుల చేతంబోలె నయ్యంగదుని ఇనుపబాణంబుల యయిదింటిచేతను ఇతరములయిన కఱకుబాణంబుల మూఁడింటిచేతను బ్రహరించెను. ౪౭

మహాపరాక్రమశాలియగు నాకుంభుండు మహాతీక్ష్ణంబులును అమోఘంబులును అయోమయంబులునగు బాణంబుల నంగదు నొప్పించెను. ౪౮

వాలికుమారుండగు నంగదుండు అట్లు కుంభునిచే నానావిధంబుల నొప్పింపఁబడియు నెంతమాత్రము చలింపక యాకుంభుని శిరస్సుమీఁదతాలను వృక్షంబులను గురిపించెను. ౪౯

శ్రీమంతుండగు నాకుంభకర్ణకుమారుండు కుంభుండు అంగదుండు వేసిన వృక్షంబుల నన్నింటిని ఖండించి శిలలను భేదించి పుచ్చెను. ౫౦

మఱియు నవ్వానరోత్తముం డంగదుండు సమీపంబునకు వచ్చుటంజూచి కుంభుండు కోపించి ఏనుంగును కొఱవికట్టెలచేతంబోలె నతని కనుబొమలయందు రెండు బాణంబులచేత నొప్పించెను. ౫౧

ఆ యంగదుని నొసటనుండి నెత్తురుగాఱి యతనికన్నులం మూతపడినవి.

అంగదుండు నెత్తురుచేఁ దడుపఁబడుచుండు కన్నుల నొకచేత మూసికొని రెండవచేత సమీపంబుననుండు వృక్షంబు గ్రహించెను. ౫౨

అంత ఆయంగదుఁడు ఱొమ్ముచేత బోదెను కదలించియుం చేతిచేత పట్టుకొనియుం కొంచెమువంగి ఈవృక్షము ఏనుంగువలె విఱిచెను. ౫౩

ఇంద్రధ్వజ తుల్యంబును మందరపర్వతాకారంబునగు నావృక్షంబును విడువఁబోవుచున్న యంగదునిఁ గుంభుండు సమస్తరాక్షసులును జూచుచుండఁగా మర్మభేదనంబులగు నేడు కఱకుబాణంబుల నొప్పించెను. ౫౪,౫౫

అంగదుండు బాణంబులచేఁ బీడింపఁబడినవాఁడై యఱచి మూర్ఛిల్లెను.

వానరులందఱు వానరోత్తముండును శత్రువులకు గానివాఁడునగు

దురాసదం హరిశ్రేష్ఠం రామాయాన్యే న్యవేదయన్,

రామస్తు వ్యథితం శ్రుత్వా వాలిపుత్త్రం రణాజిరే. ౫౭
వ్యాదిదేశ హరిశ్రేష్ఠా ఞ్జామ్బవత్ప్రముఖాన్ తతః,

తే తు వానరశార్దూలాః శ్రుత్వా రామస్య శాసనమ్. ౫౮
అభిపేతు స్సుసంక్రుద్ధాః కుమ్భ ముద్యతకార్ముకమ్,
తతో ద్రుమశిలాహస్తాః కోపసంరక్తలోచనాః. ౫౯
రిరక్షిషన్తోఽభ్యపత న్నఙ్గదం వానరర్షభాః,

జామ్బవాంశ్చ సుషేణశ్చ వేగదర్శీ చ వానరః. ౬౦
కుమ్భకర్ణాత్మజం వీరం క్రుద్ధా స్సమభిదుద్రువుః,
సమీక్ష్యాపతతస్తాంస్తు వానరేన్ద్రా న్మహాబలాన్. ౬౧
ఆవవార శరౌఘేణ నగేనేవ జలాశయమ్,

తస్య బాణపథం ప్రాప్య న శేకు రతివర్తితుమ్. ౬౨
వానరేన్ద్రా మహాత్మానో వేలా మివ మహోదధిః,
తాం స్తు దృష్ట్వా హరిగణాన్ శరవృష్టిభి రర్దితాన్. ౬౩
అఙ్గదం పృష్ఠతః కృత్వా భ్రాతృజం ప్లవగేశ్వరః,
అభిదుద్రావ వేగేన సుగ్రీవః కుమ్భ మాహవే. ౬౪
శైలసానుచరం నాగం వేగవానివ కేసరీ,
ఉత్పాట్య చ మహాశైలా నశ్వకర్ణా న్ధవా న్బహూన్. ౬౫
అన్యాంశ్చ వివిధా న్వృక్షాం శ్చిక్షేప చ మహాబలః,

తాం ఛాదయన్తీ మాకాశం వృక్షవృష్టిం దురాసదామ్. ౬౬

నంగదుండు సముద్రంబునం బడినట్లు యుద్ధంబున నొచ్చుటంజూచి రామున కాసంగతి విన్నవించిరి. ౫౬

రాముండు వాలికుమారుండగు నంగదుండు యుద్ధరంగంబున నొచ్చి వాఁడని విన్నంతనె జాంబవంతుండు మున్నగు వానరోత్తముల నంగదుని సాహాయ్యంబునకుఁ బంపెను. ౫౭

అవ్వానరవీరులు రాము నాజ్ఞను శిరసావహించి పరమకుపితులయి ధనుష్పాణియగు కుంభునిమీఁదికిఁ బోయిరి. ౫౮

అంత నవ్వానరోత్తములు అంగద సంరక్షణార్థమయి వృక్షంబులను శిలలను దాల్చి కోపంబునఁ గన్నుల చెఱ్ఱఁదనంబు గదురఁ గుంభునిమీఁదికిఁ బోయిరి. ౫౯

జాంబవంతుండును సుషేణుండును వేగదర్శియను వానరుండును క్రుద్ధులయి కుంభకర్ణపుత్రుండయిన కుంభునిమీఁదికిఁ బోయిరి. ౬౦

ఆకుంభుఁడు మహాబలశాలులగు నవ్వానరోత్తములు వచ్చుటంజూచి జలప్రవాహమును బర్వతము చేతంబోలె నవ్వానరులను బాణసమూహము చేత నివారించెను. ౬౧

మహాబలశాలులగు నవ్వానరవీరులా కుంభుని బాణంబుల బారింబడి చెలియలికట్టను దాఁకి సముద్రమువలె ముందుకుఁ బోఁజాలరైరి. ౬౨

వానరేశ్వరుండగు సుగ్రీవుండు అవ్వానరవీరులందఱు బాణవర్షంబుల నొచ్చుటంజూచి అన్నకుమారుండగు నంగదునిఁ బిఱుందనిడుకొని మహావేగం బగు సింహంబు పర్వతంబులం దిరుగు మహాగజంబుమీఁది కుఱుకునట్లు వేగంబునఁ గుంభునిమీఁది కడరెను. ౬౩,౬౪

మహాబలుండగు సుగ్రీవుండు గొప్ప పర్వతంబులను ఇనుమద్ది చెట్లను చండ్రచెట్లను ఇంక ననేకంబులగు నితరవృక్షంబులను బెఱికి కుంభునిమీఁద వైచెను.

కుంభకర్ణుని కుమారుండగు కుంభుండు ఆకాశమునంతయుం నావరించి

కుమ్భకర్ణాత్మజ శ్శీఘ్రం చిచ్ఛేద నిశితై శ్శరైః,

అభిలక్షేణ తీవ్రేణ కుమ్భేన నిశితై శ్శరైః. ౬౭
ఆచితా స్తే ద్రుమా రేజు ర్యథా ఘోరా శ్శతఘ్నయః,

ద్రుమవర్షం తు సంఛిన్నం దృష్ట్వా కుమ్భేన వీర్యవాన్. ౬౮
వానరాధిపతి శ్శ్రీమా న్మహాసత్త్వో న వివ్యథే,

నిర్భిద్యమాన స్సహసా సహమాన శ్చ తాన్ శరాన్. ౬౯
కుమ్భస్య ధను రాక్షిప్య బభఞ్జేన్ద్రధనుష్ప్రభమ్,

అవప్లుత్య తత శ్శీఘ్రం కృత్వా కర్మ సుదుష్కరమ్. ౭౦
అబ్రవీ త్కుపితః కుమ్భం భగ్నశృఙ్గమివ ద్విపమ్,

నికుమ్భాగ్రజ! వీర్యం తే బాణవేగవదద్భుతమ్. ౭౧
సన్నతి శ్చ ప్రభావ శ్చ తవ వా రావణస్య వా,

ప్రహ్లాదబలివృత్రఘ్న కుబేరవరుణోపమ!. ౭౨
ఏక స్త్వ మనుజాతోఽసి పితరం బలవృత్తతః,

త్వా మే వైకం మహాబాహుం చాపహస్త మరిన్దమమ్. ౭౩
త్రిదశా నాతివర్తన్తే జితేన్ద్రియ మివాధయః,

విక్రమస్వ మహాబుద్ధే! కర్మాణి మమ పశ్యతః. ౭౪

భయంకరంబయి పడుచున్న యా వృక్షముల వర్షమును దీక్ష్ణబాణంబుల ఛేదించెను. ౬౬

ఆ వృక్షములు కుంభుండు గుఱిదప్పక ప్రయోగించిన బాణంబులచే వ్యాపింపఁబడినవై ఇనుపశలాకలతో నిండిన మహాయుధములువలెఁ బ్రకాశించినవి. ౬౭

పరాక్రమవంతుండును మహాబలుండును శ్రీమంతుండునగు వానరరాజు సుగ్రీవుండు కుంభునిచేఁ దనవృక్షవర్షంబంతయు ఛేదింపఁబడినను ఎంతమాత్రము వ్యథ నొందఁడయ్యె. ౬౮

ఆ సుగ్రీవుఁడు కుంభునిచే బాణంబుల నొప్పిపడుచును ఆబాణంబుల సహించి యతనియొద్దకుఁ బోయి యింద్రధనుస్సువంటి యతని ధనుస్సుఁబట్టి విఱిచెను. ౬౯

సుగ్రీవుఁడు అటు శీఘ్రంబున రథంబుమీఁదికి దుమికి ఇతరుల కలవిగాని కార్యమును గావించి కుపితుండై కొమ్ము విఱిగిన యేనుంగువలె నున్న కుంభుని జూచి యిట్లనియెను. ౭౦

నికుంభుని యన్నవగు కుంభుఁడా! నీపరాక్రమమును బాణవేగంబును వినయంబును బ్రభావంబగు రావణుని పరాక్రమాదులం బోలె మిక్కిలియు నాశ్చర్యకరములుగా నున్నవి. ౭౧

కుంభుఁడా! నీవు ప్రహ్లాదునితోను బలిచక్రవర్తితోను దేవేంద్రునితోను గుబేరునితోను వరుణునితోను సమానుఁడవు, నీ వొకఁడవు బలవ్యాపారంబునఁ దండ్రిం బోలి పుట్టినావు. ౭౨

ధనుర్ధరుండవైన మహాబాహుండవు శత్రుహంతవగు ని న్నొక్కనిమాత్రము జితేంద్రియుని మనోవ్యథలువలె ఎంతమాత్రము అతిక్రమింపఁజాలరు. ౭౩

మహాబుద్ధిశాలివగు కుంభుఁడా! నేను జూచుచుండఁగా యుద్ధంబునఁ బరాక్రమంబుఁ జూపుము. ౭౪

వరదానా త్పితృవ్య స్తే సహతే దేవదానవాన్,
కుమ్భకర్ణస్తు వీర్యేణ సహతే చ సురాసురాన్. ౭౫

ధనుషీన్ద్రజిత స్తుల్యః ప్రతాపే రావణస్య చ,
త్వమద్య రక్షసాం లోకే శ్రేష్ఠోఽసి బలవీర్యతః. ౭౬

మహావిమర్దం సమరే మయా సహ తవాద్భుతమ్,
అద్య భూతాని పశ్యన్తు శక్రశమ్బరయో రివ. ౭౭
కృత మప్రతిమం కర్మ దర్శితం చాస్త్రకౌశలమ్,
పాతితా హరివీరాశ్చ త్వయా వై భీమవిక్రమాః. ౭౮
ఉపాలమ్భభయాచ్చాపి నాసి వీర! మయా హతః,
కృతకర్మా పరిశ్రాన్తో విశ్రాన్తం పశ్య మే బలమ్. ౭౯

తేన సుగ్రీవవాక్యేన సావమానేన మానితః,
అగ్నే రాజ్యాహుతస్యేవ తేజ స్తస్యాభ్యవర్ధత. ౮౦
తతః కుమ్భస్తు సుగ్రీవం బాహుభ్యాం జగృహే తదా,
గజావివాహితమదౌ నిశ్వసన్తౌ ముహుర్ముహుః. ౮౧
అన్యోన్యగాత్రగ్రథితౌ కర్షన్తౌ వితరేతరమ్,
సధూమాం ముఖతో జ్వాలాం విసృజన్తౌ పరిశ్రమాత్. ౮౨
తయోః పాదాభిఘాతాచ్చ నిమగ్నా చాభవ న్మహీ,
వ్యాఘూర్ణితతరఙ్గశ్చ చుక్షుభే వరుణాలయః. ౮౩

తతః కుమ్భం సముత్క్షిప్య సుగ్రీవో లవణామ్భసి,
పాతయామాస వేగేన దర్శయ న్నుదధే స్తలమ్. ౮౪

నీపెత్తండ్రి రావణుండు వరదానంబువలన దేవాసురుల లోఁగొని యున్నాఁడు. నీతండ్రి కుంభకర్ణుండుమాత్రము దేహబలంబుచేతనే దేవాసురులను నోర్చుచున్నాఁడు. ౭౫

నీవు ధనుస్సున నింద్రజిత్తుతోను బలాక్రమంబున రావణునితోను సమానుండవు, నీవిప్పుడు లోకంబున బలపరాక్రమంబుల రాక్షసులలో శ్రేష్ఠుఁడవు. ౭౬

ఇంద్రునకును శంబరునకునుం బోలె నీకును నాకును గలుగు మహాయుద్ధంబును ఇప్పుడు సమస్తభూతంబులును జూతురుగాక. ౭౭

నీవు అసమానమయిన కార్యము గావించినావు. అస్త్రసామర్థ్యములు జూపినావు, భయంకరపరాక్రములగు నానరవీరులం బడఁగొట్టినావు. ౭౮

పరాక్రమశాలివగు కుంభుఁడా! పెక్కండ్రతోఁ బోరి యలసినవాని వధించినాఁడని యపవాదము గలుగునను భయమువలన నేను నిన్నింకను వధింపలేదు. చాలఁ బనిచేసి యలసి యున్నావు, కొంత యలసట దీర్చుకొన్నపైని నాబలంబుఁ జూడుము. ౭౯

ఆ కుంభుఁడు సుగ్రీవుండు అవమానగర్భంబుగా మాటలచే గౌరవించుటయుం నేయిఁబోసిన యగ్నిహోత్రమువలెఁ దేజస్సున వృద్ధిఁ బొందెను.

అంతఁ గుంభుండు సుగ్రీవుని రెండుచేతులం బట్టెను.

ఆ సుగ్రీవుండును కుంభుండును మదించిన యేనుంగులువలె పలుమాఱు నిట్టూర్పులు వుచ్చుచు ఒకరిదేహము నొకరుపట్టి యాకర్షించుకొనుచు శ్రమంబునం జేసి నోటనుండి పొగతోఁగూడ నగ్నిజ్వాల విడుచుచుండిరి.

ఆ సుగ్రీవకుంభుల పాదాఘాతంబున భూమి లోఁతుగా నణంగెనుఁ సముద్రంబును గొప్పగొప్ప తరంగంబులు తిరుగుడుపడ నెంతయుం క్షోభంబు నొందెను. ౮౩

అంత సుగ్రీవుండు కుంభునెత్తి సముద్రముయొక్క అడుగునేలను జూపుటకైవలె వేగంబున సముద్రంబునం బడవైచెను. ౮౪

తతః కుమ్భనిపాతేన జలరాశి స్సముత్థితః,
విన్ధ్యమన్దరసఙ్కాశో విససర్ప సమన్తతః. ౮౫
తతః కుమ్భ స్సముత్పత్య సుగ్రీవ మభిపద్య చ,
ఆజఘానోరసి క్రుద్ధో వజ్రవేగేన ముష్టినా. ౮౬
తస్య చర్మ చ పుస్ఫోట బహు సుస్రావ శోణితమ్,
స చ ముష్టి ర్మహావేగః ప్రతిజఘ్నేఽస్థిమణ్డలే. ౮౭
తదా వేగేన తత్రాసీ త్తేజః ప్రజ్వలితం ముహుః,
వజ్రనిష్పేషసంజాతా జ్వాలా మేరౌ యథా గిరౌ. ౮౮

స తత్రాభిహత స్తేన సుగ్రీవో వానరర్షభః,
ముష్టిం సంవర్తయామాస వజ్రకల్పం మహాబలః. ౮౯
అర్చిస్సహస్రవికచం రవిమణ్డలసప్రభమ్,
స ముష్టిం పాతయామాస కుమ్భస్యోరసి వీర్యవాన్. ౯౦

స తు తేన ప్రహారేణ విహ్వలో భృశతాడితః,
నిపపాత తదా కుమ్భో గతార్చి రివ పావకః. ౯౧
ముష్టినాభిహత స్తేన నిపపాతాశు రాక్షసః,
లోహితాఙ్గ ఇవాకాశా ద్దీప్తరశ్మి ర్యదృచ్ఛయా. ౯౨

కుమ్భస్య పతతో రూపం భగ్నస్యోరసి ముష్టినా,
బభౌ రుద్రాభిపన్నస్య యథా రూపం గవాంపతేః. ౯౩

తస్మి న్హతే భీమపరాక్రమేణ ప్లవఙ్గమానా మృషభేణ యుద్ధే,

అంత నమ్మహాసముద్రంబు కుంభుండుండుటకు పైకి వింధ్యమందరా కారంబుగా నుబ్బి యంతటను బ్రవహించెను. ౧౫

అంతఁ గుంభుండు ఎగిరి సుగ్రీవుని యొద్దకు వచ్చి కుపితుండై వజ్రము వంటి పిడికిట నతనిఱొమ్మునం బొడిచెను. ౧౬

ఆదెబ్బకు సుగ్రీవుని వక్షస్థ్సలంబునందు జర్మముచీలెనుగాని యమ్ముష్టి పోటు అచ్చట యెముకనుదాఁకి ప్రతిహతంబయ్యెను. ౧౭

ఆ సుగ్రీవుని ఱొమ్మునఁ గుంభునిపిడికిటి యొరయుక వేగంబునం బుట్టిన జ్వాల మేరుపర్వతంబున వజ్రాయుధంబు నొరయుకచేతం గలిగిన జ్వాలవలె నుండెను. ౧౮

అప్పుడు మహాబలశాలియగు వానరోత్తముఁడు సుగ్రీవుండు కుంభునిచేఁ గొట్టఁబడినవాఁడై కోపించి వజ్రసమానంబగు పిడికిలి నలవరించెను.

పరాక్రమవంతుండగు నాసుగ్రీవుండు సూర్యమండలంబువలె సహస్రకిరణంబులు గలిగి వెలుంగుచున్న యమ్ముష్టితోఁ గుంభుని ఱొమ్మునం బొడిచెను. ౨౦

అప్పుడు కుంభుండు ఆ దెబ్బచేఁ బరమపీడితుండై యనయవంబుల స్వాధీనతదప్పి చల్లారిన నిప్పువలె విగతప్రాణుండై నేలంగూలెను. ౨౧

కుంభుండు ఆ పిడికిటిపోటుచే హతుండై యాదృచ్ఛికముగాఁ గాంతిమంతుండగు నంగారకుం డాకాశంబున నుండి నేలం బడునట్లు శీఘ్రంబున నేలంబడెను. ౨౨

ఱొమ్మున దెబ్బదగిలి నేలంగూలినట్టి కుంభుని యాకార మప్పుడు రుద్రునిచేఁ బరిద్రోయఁబడిన సూర్యుని రూపంబువలె కాంతయుం వెలింగెను. ౨౩

అట్లు కుంభుండు యుద్ధంబున వానరేంద్రుండగు సుగ్రీవునిచేత వధింపఁ

మహీ సశైలా సవనా చచాల భయం చ రక్షాంస్యధికం వివేశ.

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే షట్సప్తతితమస్సర్గః. ౭౬.

## సప్తసప్తతితమస్సర్గః.

నికుమ్భో భ్రాతరం దృష్ట్వా సుగ్రీవేణ నిపాతితమ్,
ప్రదహన్నివ కోపేన వానరేన్ద్రమవైక్షత. ౧

తత స్స్రగ్దామ సన్నద్ధం దత్తపఞ్చాఙ్గుళం శుభమ్,
ఆదదే పరిఘం వీరో నగేన్ద్రశిఖరోపమమ్. ౨
హేమపట్టపరిక్షిప్తం వజ్రవిద్రుమభూషితమ్,
యమదణ్డోపమం భీమం రక్షసాం భయనాశనమ్. ౩

తమావిధ్య మహాతేజా శ్శక్రధ్వజసమం తదా,
వినానాద వివృత్తాస్యో నికుమ్భో భీమవిక్రమః. ౪

ఉరోగతేన నిష్కేణ భుజస్థై రఙ్గదై రపి,
కుణ్డలాభ్యాం చ చిత్రాభ్యాం మాలయా చ విచిత్రయా. ౫
నికుమ్భో భూషణై ర్భాతి తేన స్మ పరిఘేణ చ,
యథేన్ద్రధనుషా మేఘ స్సవిద్యుత్ స్తనయిత్నుమాన్. ౬

పరిఘాగ్రేణ పుస్ఫోట వాతగ్రన్థి ర్మహాత్మనః,
ప్రజజ్వాల సఘోషశ్చ విధూమ ఇవ పావకః. ౭

బడి నేలంబడఁగానే పర్వతారణ్యసహితంబుగా భూమి గడగడవడంకెను, రాక్షసులును బరమభయంబు నొందిరి. ౯౪

ఇది డెబ్బదియాఱవసర్గము.

---

## డెబ్బ దియేడవసర్గము

నికుంభుండు తన అన్న సుగ్రీవునిచేఁ బడుటం జూచి కోపంబున దహించువాఁడువలె చుఱచుఱ చూపుల వానరేశ్వరుండగు సుగ్రీవుం జూచెను. ౧

అంత వీరుండగు నికుంభుండు పుష్పమాలికలచే నలంకృతంబును బంచాంగుళ ముద్ర వేయఁబడియుండునదియు మంగళకరమును హిమవత్పర్వత శిఖరసమానంబును కాంచనపట్టాలంకృతంబును వజ్రములచేతను బవడములచేతను అలంకరింపఁబడినదియు యమదండంబువంటిదియు భయంకరాకారంబును రాక్షసులకు అభయం బొసంగునదియు నగు పరిఘంబుచేకొనెను. ౩

అప్పుడు మహాతేజుండును భయంకరపరాక్రముండునగు నికుంభుండు ఇంద్రధ్వజ సమానంబగు నాపరిఘంబును గిఱగిఱం ద్రిప్పి నోరు దెఱచి సింహనాదంబు గావించెను. ౪

నికుంభుండు బొమ్మునుండు రత్నాల పదకముచేతను బాహువుల నుండు బాహుపురులచేతను జిత్రంబులగు కుండలంబులచేతను విచిత్రంబగు హారంబుచేతను ఇట్టి భూషణంబులచేతను అప్పరిఘాయుధముచేతను ఇంద్ర ధనుస్సుతోను మెఱపులతోను గర్జనములతోనుం గూడిన మేఘమువలెఁ బ్రకాశించెను. ౫, ౬

మహాబలుండగు నికుంభుండు పరిఘంబు గిఱగిఱం ద్రిప్పఁగా నాపరిఘంబున వాకాశంబుననుండు నావహాదివాయుసమూహంబు భేదిల్లుటయు నాపరిఘంబు మహాధ్వని సహితంబయి పొగలేని యగ్నిహోత్రము భంగిఁ బ్రజరిల్లెను. ౭

నగర్యా విటపావత్యా గన్ధర్వభవనోత్తమైః,
సహ చైవామరావత్యా సర్వైశ్చ భవనైస్సహ. ౮
సతారగ్రహనక్షత్రం సచన్ద్రం సమహాగ్రహమ్,
నికుమ్భపరిఘాఘూర్ణం భ్రమతీవ నభస్స్థలమ్. ౯
దురాసదశ్చ సంజజ్ఞే పరిఘాభరణప్రభః.
కపీనాం స నికుమ్భాగ్నిర్యుగాన్తాగ్నిరివోత్థితః. ౧౦
రాక్షసా వానరాశ్చాపి న శేకుస్స్పన్దితుం భయాత్,
హనూమాంస్తు వివృత్యోరస్తస్థౌ తస్యాగ్రతో బలీ. ౧౧

పరిఘోపమబాహుస్తు పరిఘం భాస్కరప్రభమ్.
బలీ బలవతస్తస్య పాతయామాస వక్షసి. ౧౨

స్థిరే తస్యోరసి వ్యూఢే పరిఘశ్శతధా కృతః,
విశీర్యమాణస్సహసా ఉల్కాశతమివామ్బరే. ౧౩

స తు తేన ప్రహారేణ విచచాల మహాకపిః,
పరిఘేణ సమాధూతో యథా భూమిచలేఽచలః. ౧౪
స తదాభిహతస్తేన హనూమాన్ ప్లవగోత్తమః,
ముష్టిం సంవర్తయామాస బలేనాతిమహాబలః. ౧౫

తముద్యమ్య మహాతేజా నికుమ్భోరసి వీర్యవాన్,
అభిచిక్షేప వేగేన వేగవాన్వాయువిక్రమః. ౧౬

తతః పుస్ఫోట చర్మాస్య ప్రసుస్రావ చ శోణితమ్,
ముష్టినా తేన సంజజ్ఞే జ్వాలా విద్యుదివోత్థితా. ౧౭

ఆ నికుంభుని పరిఘాయుధవేగంబుచే గంధర్వగృహంబులతోఁగూడ నలకాపట్టణంబును సమస్తదేవగృహంబులతోఁ గూడ నమరావతీనగరంబును అశ్విన్యాదినక్షత్రములతోను ఇతరములయిన చుక్కలతోను చంద్రాదిమహాగ్రహంబులతోనుంగూడిన యాకాశంబును జలించి గిఱగిఱం దిరిగెను. ౮, ౯

పరిఘము చేతను ఆభరణంబుల చేతను బ్రజ్వలించుచుండు నానికుంభాగ్ని వానరులకుఁ బ్రలయకాలాగ్నియోయనం దేఱిచూడ నలవిగాకుండెను. ౧౦

అప్పుడు రాక్షసులును వానరులును భయంబున నిట్టట్టు కదలకుండిరి; బలవంతుండగు నొకహనుమంతుఁడు మాత్రము వక్షంబుఁ జూపుచు నతని యెదుట నిలిచెను. ౧౧

పరిఘంబులవంటి చేతులుగలవాఁడును బలవంతుఁడునగు నానికుంభుఁడు సూర్యబింబంబువలె వెలుంగుచున్న యాపరిఘంబును మహాబలుండగు హనుమంతునిఱొమ్మున వేసెను. ౧౨

ఆపరిఘంబు వజ్రకఠినంబును విశాలంబునగు నాహనుమంతుని వక్షంబు దగిలి నూఱువ్రయ్యలయి యాకాశంబున నూఱుకొఱవులకై పడి వెలుంగుచు నేలంబడెను. ౧౩

ఆ హనుమంతుఁడు ఆపరిఘంబు దెబ్బకు భూకంపంబునఁ బర్వతంబువలె నెంతయుఁ జలనంబునొందను. ౧౪

అప్పుడు మహాబలుఁడయిన వానరోత్తముఁడగు నాహనుమంతుఁడు నికుంభునిచే నట్లుకొట్టఁబడినవాఁడై కోపించి తనబలంబుకొలఁది పిడికిలి నలవరించెను. ౧౫

మహాతేజుండును మహాపరాక్రముఁడును మహావేగుండును వాయువునకుంబోలెంగమనంబు గలవాఁడునగు హనుమంతుఁడు అముష్టి నెత్తి వేగంబున నికుంభుని ఱొమ్మునం బొడిచెను. ౧౬

అందువలన నికుంభుని వక్షస్థలంబునఁ జర్మంబుపీఁడి నెత్తురు కాఱెను. ఆపిడికిలిదెబ్బకు మెఱుపువలె నతనిఱొమ్మున జ్వాలపుట్టెను. ౧౭

స తు తేన ప్రహారేణ నికుమ్భో విచచాలహ,
స్వస్థ శ్చాపి నిజగ్రాహ హనూమన్తం మహాబలమ్. ౧౮
విచుక్రుశు స్తదా సఙ్ఖ్యే భీమం లఙ్కానివాసినః,
నికుమ్భేనోద్యతం దృష్ట్వా హనూమన్తం మహాబలమ్. ౧౯

స తదా హ్రియమాణోఽపి కుమ్భకర్ణాత్మజేన హ,
ఆజఘానానిలసుతో వజ్రకల్పేన ముష్టినా. ౨౦
ఆత్మానం మోచయిత్వాథ క్షితావభ్యవపద్యత,
హనూమా నున్మమాథాశు నికుమ్భం మారుతాత్మజః. ౨౧
నిక్షిప్య పరమాయత్తో నికుమ్భం నిష్పిపేషహ,
ఉత్పత్య చాస్య వేగేన పపాతోరసి వీర్యవాన్. ౨౨

పరిగృహ్య చ బాహుభ్యాం పరివృత్య శిరోధరామ్,
ఉత్పాటయామాస శిరో భైరవం నదతో మహత్. ౨౩

అథ వినదతి సాదితే నికుమ్భే
పవనసుతేన రణే బభూవ యుద్ధమ్,
దశరథసుతరాక్షసేన్ద్రసూన్వో
ర్భృశతరమాగతరోషయో స్సుభీమమ్. ౨౪
వ్యపేతే తు జీవే నికుమ్భస్య హృష్టా
వినేదుగ ప్లవఙ్గా దిశస్సస్వను శ్చ,
చచాలేవ చోర్వీ పఫాలేవ చ ద్యౌ
ర్భయం రాక్షసానాం బలం చావివేశ. ౨౫

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే - సప్తసప్తతితమస్సర్గః. ౭౭.

ఆ నికుంభుండు ఆ దెబ్బకు మూర్ఛిల్లి కొంతపడికిఁ జేటి మహాబలశాలి యగు హనుమంతుని రెండుచేతులతోనుం బట్టెను. ౧౮

అప్పుడు యుద్ధంబున నికుంభుఁడు మహాబలుండగు హనుమంతునిఁ బైకెత్తుటంజూచి రాక్షసులు సంతోషంబున భయంకరంబుగా సింహనాదంబు గావించిరి. ౧౯

అప్పుడు వాయుదేవుని కుమారుండగు హనుమంతుఁడు నికుంభునిచే నట్లు హరింపఁబడుచున్నను అతని వజ్రసమానంబగు పిడికిటం బొడిచెను. ౨౦

అంత వాయుకుమారుండగు హనుమంతుఁడు తన్నువిడిపించుకొని నేలపై నిలిచి జాగుసేయక యీప్రకారంబున నికుంభుని వధించెను ౨౧

పరాక్రమవంతుఁడగు హనుమంతుఁడు మహాప్రయత్నంబున నా నికుంభుని నేలపైఁబడవైచి నలఁగఁగొట్టటయెగాక వేగంబున నాకాశంబున కెగసి యతనిఱొమ్ముపైఁ బడెను. ౨౨

హనుమంతుఁ డంత రెండుచేతులను నికుంభుని కంఠంబుఁబట్టి త్రిప్పి యతండు భయంకరంబుగా నఱచుచుండఁగా నతనిభయంకరాకారంబగు శిరస్సు విఱిచివైచెను. ౨౩

అంత యుద్ధంబున హనుమంతునిచే నికుంభుండు అఱచుచుఁ జచ్చిన పిదప పరస్పరముపై మహాక్రోధమునొందిన రామునకును మకరాక్షునకును బరమభయంకరమయిన యుద్ధం బయ్యెను. ౨౪

నికుంభుఁడు మృతిఁ బొందినంతనె వానరు లందఱుఁ బరమసంతుష్టులయి దిక్కులం బ్రతిధ్వనులు వొడమ సింహనాదంబులు గావించిరి; భూమి చలించినట్లుండినది; ఆకాశంబు పగిలినట్లుండెను, రాక్షసు లందఱుఁ బరమ భయంబునొందిరి. ౨౫

ఇది డెబ్బదియేడవసర్గము.

---

## అ ష్ట స ప్త తి త మ స్స ర్గః.

నికుమ్భం నిహతం శ్రుత్వా కుమ్భం చ వినిపాతితమ్,
రావణః పరమామర్షీ ప్రజజ్వాలానలో యథా. ౧
నైరృతః క్రోధశోకాభ్యాం ద్వాభ్యాం తు పరిమూర్ఛితః,
ఖరపుత్త్రం విశాలాక్షం మకరాక్షమచోదయత్. ౨

గచ్ఛ పుత్త్ర! మయాఽఽజ్ఞప్తో బలేనాభిసమన్వితః,
రాఘవం లక్ష్మణం చైవ జహి తాంశ్చ వనౌకసః. 3
రావణస్య వచ శ్శ్రుత్వా శూరమానీ ఖరాత్మజః,
బాఢమిత్యబ్రవీ ద్ధృష్టో మకరాక్షో నిశాచరః. ౪
సోఽభివాద్య దశగ్రీవం కృత్వా చాపి ప్రదక్షిణమ్,
నిర్జగామ గృహాచ్ఛుభ్రా ద్రావణ స్యాజ్ఞయా బలీ. ౫

సమీపస్థం బలాధ్యక్షం ఖరపుత్త్రోఽబ్రవీ దిదమ్,

రథశ్చానీయతాం శీఘ్రం సైన్యం చాహూయతాం త్వరాత్.

తస్య తద్వచనం శ్రుత్వా బలాధ్యక్షో నిశాచరః,
స్యన్దనం చ బలం చైవ సమీపం ప్రత్యపాదయత్. ౭
ప్రదక్షిణం రథం కృత్వా ఆరురోహ నిశాచరః,
సూతం సంచోదయామాస శీఘ్రం మే రథ మావహ. ౮
అథ తాన్ రాక్షసాన్ సర్వా న్మకరాక్షోఽబ్రవీ దిదమ్,

యూయం సర్వే ప్రయుధ్యధ్వం పురస్తా న్మమ రాక్షసాః. ౯

## డెబ్బదియెనిమిదవసర్గము.

రావణుండు నికుంభుండును గుంభుండును వధింపఁబడినారనివిని పరమ కుపితుండై నిప్పువలె మండిపడెను. ౧

రావణుండు క్రోధంబును దుఃఖంబును మానంబునఁ బెనంగొన ఖరుని కొడుకైన విశాలంబులగు కన్నులుగల మకరాక్షుం జూచి యిట్లని యాజ్ఞాపించెను. ౨

కొడుకా! నీవు నాయాజ్ఞచే సేనాసహితుండవై పోయి రాముని లక్ష్మణుని అవ్వానరులను వధించి రమ్ము. అని రావణుం డాజ్ఞాపించెను. ౩

తాను మహాశూరుఁడని యహంకరించియుండు ఖరపుత్రుండు మకరాక్షుండు రావణునియాజ్ఞను విన్నంతనె సంతుష్టుండై మంచిదని చెప్పెను. ౪

బలవంతుఁడగు నామకరాక్షుండు రావణునకుఁ బ్రదక్షిణనమస్కారంబులు గావించి యతనియాజ్ఞను శుభ్రంబగు రాజగృహంబుననుండి వెడలెను. ౫

ఖరకుమారుండగు మకరాక్షుండు సమీపంబుననున్న సేనాపతిం జూచి యిట్లని చెప్పెను.

శీఘ్రముగా రథంబును దెమ్ము, సేనయుం శీఘ్రంబున వచ్చునట్లు గావింపుము. అని మకరాక్షుండు సేనాధిపతితోఁ జెప్పెను. ౬

సేనానాయకుఁడును మకరాక్షునిమాటనువిని తత్క్షణంబున రథంబును సైన్యమును అతని సమీపంబునకుఁ దెచ్చెను. ౭

మకరాక్షుండు తనరథంబునకుఁ బ్రదక్షిణంబుగావించి యారోహించి "రథంబు శీఘ్రంబుగాఁ దోలు" మని సూతున కాజ్ఞాపించెను. ౮

అంత మకరాక్షుండు ఆరాక్షససైనికుల నందఱం జూచి యిట్లని యెను.

రాక్షసులారా! మీరలందఱు నాముందటఁ జక్కఁగా యుద్ధము సేయుఁడు. ౯

అహం రాక్షసరాజేన రావణేన మహాత్మనా,
ఆజ్ఞప్తస్సమరే హన్తుం తావుభౌ రామలక్ష్మణౌ. ౧౦
అద్య రామం వధిష్యామి లక్ష్మణం చ నిశాచరాః,
శాఖామృగం చ సుగ్రీవం వానరాంశ్చ శరోత్తమైః. ౧౧
అద్య శూలనిపాతైశ్చ వానరాణాం మహాచమూమ్,
ప్రదహిష్యామి సమ్ప్రాప్తః శుష్కేన్ధన మివానలః. ౧౨

మకరాక్షస్య తచ్ఛ్రుత్వా వచనం తే నిశాచరాః,
సర్వే నానాయుధోపేతా బలవన్తస్సమాగతాః. ౧౩
తే కామరూపిణస్సర్వే దంష్ట్రిణః పిఙ్గళేక్షణాః,
మాతఙ్గా ఇవ నర్దన్తో ధ్వస్తకేశా భయానకాః. ౧౪

పరివార్య మహాకాయా మహాకాయం ఖరాత్మజమ్,
అభిజగ్ముస్తతో హృష్టాశ్చాలయన్తో వసున్ధరామ్. ౧౫

శఙ్ఖభేరీసహస్రాణా మాహతానాం సమన్తతః,
క్ష్వేళితాస్ఫోటితానాం చ తత శ్శబ్దో మహానభూత్. ౧౬

ప్రభ్రష్టోఽథ కరాత్తస్య ప్రతోద స్సారథే స్తదా,
పపాత సహసా చైవ ధ్వజ స్తస్య చ రక్షసః. ౧౭
తస్య తే రథయుక్తాశ్చ హయా విక్రమవర్జితాః,
చరణై రాకులై ర్గత్వా దీనా స్సాస్రముఖా యయుః. ౧౮

ప్రవాతి పవన స్తస్మిన్ సపాంసుః ఖరదారుణః,
నిర్యాణే తస్య రౌద్రస్య మకరాక్షస్య దుర్మతేః. ౧౯

రాక్షసరాజుండును మహాబలుండునగు రావణుండు ఆరామలక్ష్మణుల నిద్దఱను యుద్ధంబున వధింప నన్ను నియోగించినాఁడు. ౧౦

రాక్షసులారా! ఆరాముని లక్ష్మణుని వానరమాత్రుండగుసుగ్రీవుని ఇతరవానరులను ఇప్పుడు ఉత్తమబాణంబులచే వధించిపుచ్చెదను. ౧౧

ఇప్పుడు నేనచ్చటికిఁబోయి వానరమహాసేననంతయు ఎండుకట్టెను నిప్పుదహించునట్లు శూలములచే వధించి దహించెదను. అని మకరాక్షుండు చెప్పెను. ౧౨

బలవంతులగు నారాక్షసులు మకరాక్షుండు చెప్పినమాటనువిని యందఱు నానావిధాయుధంబులు ధరించి యుద్ధంబునకు వచ్చిరి. ౧౩

కామరూపులును కోఱలుగలవారలును పింగళవర్ణంబులగు కన్నులు గలవారలును తలలో వెండ్రుకలులేనివారును భయంకరాకారులునగు నారాక్షసులందఱు మత్తగజంబులంబోలె గర్జించుచుండిరి. ౧౪

అంత మహాకాయులగు నారాక్షసులు భయంకరకాయుండగు ఖరుని కొడుకుమకరాక్షుంబరివేష్టించి పరమసంతోషంబున భూమిం జలింపఁజేయుచు యుద్ధభూమికి నడచిరి. ౧౫

అంత నలుప్రక్కలనుంగొట్టఁబడిన భేరీలయొక్కయుం బూరింపఁబడిన శంఖంబులయొక్కయుం రాక్షసులుచేయు సింహనాదంబులయొక్కయు భుజాస్ఫాలనంబులయొక్కయు ధ్వని భయంకరంబుగా వినంబడెను. ౧౬

అంత నామకరాక్షుని సారథిచేతి మునికోలజాఱి నేలంబడెను. మకరాక్షుని ధ్వజంబును దటాలున నేలంబడెను. ౧౭

ఆమకరాక్షునిరథంబునకుఁ గట్టఁబడిన యశ్వంబులు యుక్తముగా నడుచుటనువిడిచి పాదంబులు దొట్రుపడ దీనంబులయిన కన్నుల నీళ్లుగార్చుచుఁ బోయినవి. ౧౮

భయంకరాకారుండును దుర్బుద్ధియునగు నామకరాక్షుండు బయలుదేఱినప్పుడు వాయువుదుమ్ముతోఁగూడి పరుషంబయి భయంకరంబుగా వీచెను.

తాని దృష్ట్వా నిమిత్తాని రాక్షసా వీర్యవత్తమాః,
అచిన్త్య నిర్గతా స్సర్వే యత్ర తౌ రామలక్ష్మణౌ. ౨౦
ఘనగజమహిషార్కతుల్యవర్ణా
స్సమరముఖేష్వసకృ ద్గదాసిభిన్నాః.
అహమహమితి యుద్ధకౌశలా స్తే
రజనిచరాః పరిత స్సమున్నద న్తః. ౨౧

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డేఽష్టసప్తతితమస్సర్గః. ౭౮.

---

ఏ కో నా శీ తి త మ స్స ర్గః.

నిర్గతం మకరాక్షం తే దృష్ట్వా వానరయూథపాః,
ఆప్లుత్య సహసా సర్వే యోద్ధుకామా వ్యవస్థితాః. ౧
తతః ప్రవృత్తం సుమహ త్తద్యుద్ధం రోమహర్షణమ్,
నిశాచరైః ప్లవఙ్గానాం దేవానాం దానవై రివ. ౨
వృక్షశూలనిపాతైశ్చ శిలాపరిఘపాతనైః,
అన్యోన్యం మర్దయ న్తి స్మ తదా కపినిశాచరాః. ౩
శక్తిఖడ్గగదా కున్తై స్తోమరైశ్చ నిశాచరాః,
పట్టసై ర్భిణ్డివాలైశ్చ బాణపాతై స్సమ న్తతః. ౪
పాశముద్గరదణ్డైశ్చ నిఘాతైశ్చాపరే తదా,
కదనం కపివీరాణాం చక్రు స్తే రజనీచరాః. ౫

బాణౌఘై రర్దితా శ్చాపి ఖరపుత్రేణ వానరాః,
సంభ్రాన్తమనస స్సర్వే దుద్రువు ర్భయపీడితాః. ౬
తా న్దృష్ట్వా రాక్షసా స్సర్వే ద్రవమాణా న్వలీముఖాన్,
నేదు స్తే సింహవ ద్దృప్తా రాక్షసా జితకాశినః. ౭

మహాపరాక్రమశాలులగు రాక్షసులందఱు అదుర్నిమిత్తంబులం జూచి వానిలెక్కింపక రామలక్ష్మణులుండు స్థలంబునకుం బోయిరి. ౨౦

మేఘముతోను ఏనుంగుతోను ఎనుబోతుతోను సమానమయిన దేహవర్ణముగలవారలును పలుమాఱు యుద్ధంబునందట నిలిచి గదల ఖడ్గంబుల చేతను దెబ్బలుదిని దౌర్చియుండువారలును యుద్ధంబునందు సమర్థులునగు రాక్షసులు 'నేనువధించెదను నేను వధించెదను' అని గర్జించుచుంబోయిరి.

ఇది డెబ్బదియెనిమిదవసర్గము.

## డెబ్బదితొమ్మిదవసర్గము.

ఆవ్వానరోత్తములందఱు యుద్ధంబునకు మకరాక్షుండు వెడలుటంజూచి యుత్సాహంబున ఎగిరి యుద్ధసన్నద్ధులయి నిలిచిరి. ౧

అంత దేవతలు దానవులతోడంబోలె నవ్వానరులు రాక్షసులతోడం దలపడఁగా నప్పు డమ్మహాయుద్ధంబు రోమహర్షణంబయ్యె. ౨

అప్పుడు వానరులును రాక్షసులును వృక్షశూలంబులచేతను శిలాపరిఘంబులచేతను నొండొరులును మర్దించుకొనిరి. ౩

ఆరాక్షసులలోఁగొందఱు ఈటెలచేతను ఖడ్గములచేతను గదలచేతను గుంతములచేతను దోమరంబులచేతను అడ్డకత్తులచేతను విడిచివాటుగుదియల చేతను వజ్రాయుధములచేతను మఱికొందఱురాక్షసులు పాశములచేతను ముద్గరములచేతను దండములచేతను నిఖాతంబులను నాయుధములచేతను వానరులతో యుద్ధంబు గావించిరి. ౪, ౫

వానరులందఱు మకరాక్షునిచే బాణంబులఁ గొట్టఁబడినవారలయి మనంబున సంభ్రమంబునొంది భయంబునం బాఱిరి. ౬

ఆరాక్షసులు వానరులందఱు భయంబునం బరుగెత్తుటంజూచి సంతోషంబున సింహనాదంబులు గావించుచు జయంబుచేఁ బ్రకాశించుచుండిరి. ౭

విద్రవత్సు తదా తేషు వానరేషు సమన్తతః,
రామ స్తా న్వారయామాస శరవర్షేణ రాక్షసాన్. ౮
వారితా న్రాక్షసా న్దృష్ట్వా మకరాక్షో నిశాచరః,
క్రోధానలసమావిష్టో వచనం చేద మబ్రవీత్. ౯
తిష్ఠ రామ! మయా సార్ధం ద్వన్ద్వయుద్ధం దదామి తే,
త్యాజయిష్యామి తే ప్రాణా న్ధనుర్ముక్తై శ్శితై శ్శరైః. ౧౦
య త్తదా దణ్డకారణ్యే పితరం హతవా న్మమ,
మదగ్రత స్స్వకర్మస్థం దృష్ట్వా రోషోఽభివర్ధతే. ౧౧

దహ్యన్తే భృశ మఙ్గాని దురాత్మ! న్మమ రాఘవ!,
య న్మయాఽసి న దృష్ట స్త్వం తస్మి న్కాలే మహావనే. ౧౨
దిష్ట్యాసి దర్శనం రామ! మమ త్వం ప్రాప్తవా నిహ,
కాఙ్క్షితోఽసి క్షుధార్తస్య సింహస్యేవేతరో మృగః. ౧౩

అద్య మద్బాణవేగేన ప్రేతరాడ్విషయం గతః,
యే త్వయా నిహతా వీరా స్సహ తైశ్చ సమేష్యసి. ౧౪
బహునాత్ర కిము క్తేన శృణు రామ! వచో మమ,
పశ్యన్తు సకలా లోకా స్త్వాం మాం చైవ రణాజిరే. ౧౫

అస్త్రైర్వా గదయా వాపి బాహుభ్యాం వా మహాహవే,
అభ్యస్తం యేన వా రామ! తేనైవ యుధి వర్తతామ్. ౧౬

మకరాక్షవచ శ్శ్రుత్వా రామో దశరథాత్మజః,
అబ్రవీ త్ప్రహస న్వాక్య ముత్తరోత్తరవాదినమ్. ౧౭
కత్థసే కిం వృథా రక్షో! బహూ న్యసదృశాని తు,

అప్పుడు వానరులందఱుఁ బరుగెత్తుటయుం రాక్షసులు వానరులం దఱు
ముటయుంజూచి రాముండు అరాక్షసులను బాణవర్షంబున వారించెను. ౯

మకరాక్షుండు రాముండు రాక్షసులను వారించుటంజూచి కోపంబున
మండిపడుచు రామునితో నిట్లని చెప్పెను. ౧౦

రాముఁడా! నాతోఁగూడ నిలువుము; నీకు ద్వంద్వయుద్ధం బొసంగె
దను; ధనుస్సునుండి కఱకులయిన బాణంబులచే నీప్రాణంబుల విడిపించెదను.

అప్పుడు నీవు దండకారణ్యంబున నాతండ్రి నివధించినావు. కావున
నీవు ఇప్పుడు మరల యుద్ధంబునకు నాయెదుట నిల్చుటం జూడఁగా నాకు
మఱిమఱి కోపంబు వృద్ధిఁబొందుచున్నది. ౧౧

దురాత్ముండవగురాముఁడా! ఆకాలమునందు దండకారణ్యంబున నిన్ను
నేను జూడకపోతినే యని నాదేహమంతయు మఱిమఱి మండుచున్నది. ౧౨

రామా! నాభాగ్యవశంబున నీవిచ్చట నాకంటంబడితివి; ఆఁకలిగొన్న
సింహంబు ఇతరమృగంబునకుఁ గాచియుండునట్లు ఇన్నాళ్లు నీకుఁ గాచి
యుంటిని. ౧౩

ఇప్పుడు నిన్ను నాబాణంబులచే వధించి నీచే నిదివఱకు హతులయిన
వీరులతోడంగూడ యమపురి కంపెదను. ౧౪

రాముఁడా! పెక్కుమాటలచేనేమి ప్రయోజనము? నామాటనువినుము.
యుద్ధభూమియందు నిన్నును నన్నును సమస్తలోకంబులవారు వారలుచు
జూతురుగాక. ౧౫

రాముఁడా! దివ్యాస్త్రములచేతనుగాని గదలచేతనుగాని బాహువుల
చేతంగాని నీకు దేనియందు నభ్యాసమున్నదో దానిచేతనే యుద్ధంబు గావింపుము.
అని మకరాక్షుండు రామునితోఁ జెప్పెను. ౧౬

దశరథకుమారుండగు రాముండు మకరాక్షుని మాటనువిని మిక్కిలియుం
నధికముగా ప్రేలుచున్న యమ్మకరాక్షంజూచి నవ్వుచు ఇట్లనిచెప్పెను. ౧౭

రాక్షసుఁడా! నీకు సాధింప నలవిగాని విషయమునందు వ్యర్థముగాఁ

న రణే శక్యతే జేతుం వినా యుద్ధేన వాగ్బలాత్. ౧౮

చతుర్దశసహస్రాణి రక్షసాం త్వత్పితా చ యః,
త్రిశిరా దూషణ శ్చైవ దణ్డకే నిహతా మయా. ౧౯
స్వాశితా స్తవ మాంసేన గృధ్రగోమాయువాయసాః,
భవిష్య న్త్యద్య వై పాప! తీక్ష్ణతుణ్డనఖాఙ్కురాః. ౨౦

రాఘవేణైవ ము క్తస్తు ఖరపుత్త్రో నిశాచరః,
బాణౌఘా నముచ త్తస్మై రాఘవాయ రణాజిరే. ౨౧
తాన్ శరాన్ శరవర్షేణ రామ శ్చిచ్ఛేద నైకధా,
నిపేతు ర్భువి తే చ్ఛిన్నా రుక్మపుఙ్ఖా స్సహస్రశః. ౨౨
తద్యుద్ధ మభవ త్తత్ర సమేత్యాన్యోన్య మోజసా,
రక్షసః ఖరపుత్త్రస్య సూనో ర్దశరథస్య చ. ౨౩

జీమూతయో రివాకాశే శబ్దో జ్యాతలయో స్తదా,
ధనుర్ముక్త స్స్వనోత్కృష్ట శ్శ్రూయతే చ రణాజిరే. ౨౪

దేవదానవగన్ధర్వాః కిన్నరాశ్చ మహోరగాః,
అన్తరిక్షగతా స్సర్వే ద్రష్టుకామా స్త దద్భుతమ్. ౨౫
విద్ధ మన్యోన్యగాత్రేషు ద్విగుణం వర్ధతే పరమ్,
కృతప్రతికృతాన్యోన్యం కురుతాం తౌ రణాజిరే. ౨౬

రామముక్తాంస్తు బాణౌఘాన్ రాక్షస స్త్వచ్ఛిన ద్రణే,
రక్షోముక్తాం స్తు రామో వై నైకధా ప్రాచ్ఛిన చ్ఛరైః. ౨౭

బెక్కుమాటలేల ప్రేలెదవు? యుద్ధమునందుఁ బోరిజయింపవలెనుగాని వట్టి మాటలచే నెంతమాత్రము జయింప నలవిగాదు. ౧౮

నేనొకండను దండకారణ్యంబునఁ బదునాలుగువేల రాక్షసులను నీతండ్రిని త్రిశిరుని దూషణుని వధించిపుచ్చినాను. ౧౯

పాపిష్ఠుఁడవగు మకరాక్షుఁడా! తీక్ష్ణంబులగు ముక్కులును నఖంబులును గలగద్దలును నక్కలును గాకులును ఇప్పుడు నీమాంసంబును దనివిదీరభుజింపఁ గలవు. అని రాముండు మకరాక్షునితోఁ జెప్పెను. ౨౦

ఖరకుమారుండగు నామకరాక్షుండు రాముమాటనువిని కోపించి యుద్ధరంగంబున రామునిపై బాణసమూహములను బ్రయోగించెను. ౨౧

రాముఁడు బాణవర్షంబు గురిపించి బంగారు పింజలుగల మకరాక్షుని బాణంబులను బెక్కుతునకలుగా ఛేదింప నవి వేనవేలుగా నేలంబడినవి. ౨౨

అప్పుడు ఖరపుత్త్రుఁడగు మకరాక్షుఁడును దశరథకుమారుఁడగు రాముఁడును బరాక్రమంబున నొండొరులందాఁకి యట్లు భయంకరంబుగా యుద్ధంబు గావించిరి. ౨౩

అప్పుడు యుద్ధరంగంబున ధనుస్సునుండి యల్లెత్రాడును అత్తెమును ఒరయుటచేతఁ బుట్టిన మహాశబ్దంబు ఆకాశంబున మేఘగర్జనంబువలె నిండినది. ౨౪

దేవతలును దానవులును కిన్నరులును మహోరగులును అందఱును అయ్యాశ్చర్యమును జూడఁగోరి యాకాశంబుఁ జేరిరి. ౨౫

ఆ రామమకరాక్షులు యుద్ధంబున ఒకరు చేసినదాని కొకరు బదులు చేయుచు అప్పటప్పటికి మఱిమఱి బలంబులు చూపుచు ద్విగుణంబుగాఁ గొట్టుకొనిరి. ౨౬

మకరాక్షుండు యుద్ధంబున రాముఁడు ప్రయోగించిన బాణంబుల ఛేదించెను; రాముఁడును మకరాక్షునిచే బ్రయోగింపఁబడిన శరంబుల బాణంబులచే ననేకవిధంబుల ఛేదించెను. ౨౭

బాణౌఘై ర్వితతా స్సర్వా దిశశ్చ ప్రదిశ స్తథా,
సంఛన్నా వసుధా చైవ సమన్తా న్న ప్రకాశతే. ౨౮

తతః క్రుద్ధో మహాబాహు ర్ధను శ్ఛిచ్ఛేద రక్షసః,
అష్టాభి రథ నారాచై స్సూతం వివ్యాధ రాఘవః. ౨౯
భిత్త్వా శరై రథం రామో రథాశ్వా న్సమపాతయత్,
విరథో వసుధా(ంతిష్ఠన్)స్థ శ్చ మకరాక్షో నిశాచరః. ౩౦
త త్తిష్ఠ ద్వసుధాం రక్ష శ్శూలం జగ్రాహ పాణినా,
త్రాసనం సర్వభూతానాం యుగాన్తాగ్ని సమప్రభమ్. ౩౧

విభ్రామ్యతు మహచ్ఛూలం ప్రజ్వల త్తన్నిశాచరః,
స క్రోధా త్ప్రాహిణో త్తస్మై రాఘవాయ మహాహవే. ౩౨
తమాపత న్తం జ్వలితం ఖరపుత్త్రకరాచ్చ్యుతమ్,
బాణై స్తు త్రిభి రాకాశే శూలం చిచ్ఛేద రాఘవః. ౩౩

స చ్ఛిన్నో నైకధా శూలో దివ్యహాటకమణ్డితః,
వ్యశీర్యత మహోల్కేవ రామబాణార్దితో భువి. ౩౪
తచ్ఛూలం నిహతం దృష్ట్వా రామే ణాక్లిష్టకర్మణా,
సాధు సాధ్వితి భూతాని వ్యాహర న్తి నభోగతాః. ౩౫

తం దృష్ట్వా నిహతం శూలం మకరాక్షో నిశాచరః,
ముష్టి ముద్యమ్య కాకుత్స్థం తిష్ఠతిష్ఠేతి చాబ్రవీత్. ౩౬
స తం దృష్ట్వాఽఽపత న్తం వై ప్రహస్య రఘునన్దనః,
పావకాస్త్రం తతో రామ స్సందధే తు శరాసనే. ౩౭
తేనాస్త్రేణ హతం రక్షః కాకుత్స్థేన తదా రణే,

దిక్కులు విదిక్కులు నన్నియు బాణమయంబులయ్యెను. భూమి యంతయు బాణంబులచేఁ గప్పఁబడుటంజేసి యెంతమాత్రము కానరాకుండెను. ౨౮

అంత మహాబాహుండగు రాముఁడు కుపితుఁడై, మకరాక్షుని ధనుస్సును ఛేదించి మరల నెనిమిది బాణంబుల సారథిని వధించెను. ౨౯

రాముఁడు బాణంబులచే రథంబును భేదించి గుఱ్ఱంబుల వధించెను.

అంత మకరాక్షుః విరథుఁడై నేల కుఱికెను. ౩౦

మకరాక్షుఁ డట్లు నేలపై నిలుచుండి సమస్తభూతభయంకరంబును బ్రళయకాలానలంబుంబోలె జ్వలించుచుండునదియు నగు శూలంబు చేతం గొనెను. ౩౧

ఆమకరాక్షుండు పరమకుపితుండై యమ్మహాయుద్ధంబున జ్వలించుచున్న యమ్మహాశూలంబు గిరగిరం ద్రిప్పి యారామునిపై వైచెను. ౩౨

రాముఁడు ఖరకుమారుఁడగు మకరాక్షునిచేతన్వ్యాడి ప్రయోగింపఁబడి మండుచున్న యమ్మహాశూలంబును ఆకాశముననె మూఁడు బాణంబుల ఛేదించెను. ౩౩

మంచి బంగారముచే నలంకృతమయిన యమ్మహాశూలంబు రాముని బాణంబులచే భిన్నమయి పెద్దకొఱవికట్టవలె మండుచు నేలంబడెను. ౩౪

ఎట్టికార్యమునేని బహులాఘవంబునం జేయునట్టి రాముఁడు ఆశూలంబును ఛేదించుటనుజూచి యాకాశంబున నున్న భూతంబులు సాధువాదంబులం బ్రశంసించినవి. ౩౫

మకరాక్షుండు అమ్మహాశూలంబుగూడ వ్యర్థంబగుట జూచి ముష్టినెత్తి రామునిజూచి నిలునిలుమని పలికెను. ౩౬

రాముఁడు మకరాంతుండు పిడికిలి నలవరించుకొని వచ్చుటం జూచి నవ్వి ధనుస్సున నాగ్నేయాస్త్రంబు సంధించి ప్రయోగించెను. ౩౭

అప్పుడు యుద్ధంబున రాముం డాగ్నేయాస్త్రంబుఁ బ్రయోగింప

సంఛిన్నహృదయం తత్ర పపాతచ మమార చ. ౩౮
దృష్ట్వా తే రాక్షసా స్సర్వే మకరాక్షస్య పాతనమ్,
లఙ్కామేవాభ్యధావన్త రామబాణార్దితా స్తదా. ౩౯
దశరథనృపపుత్త్రబాణవేగై
రజనిచరం నిహతం ఖరాత్మజం తమ్,
దదృశు రథ సురా భృశం ప్రహృష్టా
గిరి మివ వజ్రహతం క్షితౌ విశీర్ణమ్. ౪౦

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే-ఏకోనాశీతితమస్సర్గః. ౭౯.

---

## అ శీ తి త మ స్స ర్గః.

మకరాక్షం హతం శ్రుత్వా రావణ స్సమితింజయః,
క్రోధేన మహతావిష్టో దన్తా న్కటకటాపయన్. ౧
కుపిత శ్చ తదా తత్ర కిం కార్య మితి చిన్తయన్,
ఆదిదేశాతిసంక్రుద్ధో రణాయేన్ద్రజితం సుతమ్. ౨

జహి వీర! మహావీర్యౌ భ్రాతరౌ రామలక్ష్మణౌ,
అదృశ్యో దృశ్యమానో వా సర్వథా త్వం బలాధికః. ౩

త్వ మప్రతిమకర్మాణ మిన్ద్రం జయసి సంయుగే,
కిం పున ర్మానుషౌ దృష్ట్వా న వధిష్యసి సంయుగే. ౪

తథోక్తో రాక్షసేన్ద్రేణ ప్రతిగృహ్య పితు ర్వచః,
యజ్ఞభూమౌ స విధివత్పావకం జుహువేన్ద్రజిత్. ౫

నమ్మహాస్త్రంబు మకరాక్షుని వక్షస్థ్సలంబుఁ బ్రవేశించుటయు నతఁడు నేలంబడి మృతిఁ బొందెను. ౩౮

అప్పుడు రాక్షసు లందఱు మకరాక్షుండు నిహతుఁ డగుటను జూచి రామబాణంబుల వేగంబు సహింపఁజాలక లంకాపురంబునకే పరువెత్తిరి. ౩౯

అంత దేవతలు దశరథమహారాజు కుమారుఁడగు రాముని బాణవేగంబుచే నిహతుఁడై వజ్రహతంబగు పర్వతంబుభంగి నేలం గూలియున్న ఖరపుత్రుని మకరాక్షుని బరమసంతోషంబునఁ జూచిరి. ౪౦

ఇది డెబ్బదితొమ్మిదవసర్గము.

---

## ఎనుబదియవసర్గము.

యుద్ధంబున జయముఁ నే వహించునట్టి యారావణుండు మకరాక్షుండును హతుండగుట విని మహాకోపంబునొంది పండ్లు కటకటఁ గొఱికెను. ౧

అంత రావణుం డట్లు కుపితుండై యచ్చట నాకాలంబునం జేయఁ దగినది యెద్దియని కొంతతడ వాలోచించి కోపం బినుమడింపఁ దనకొడుకు నింద్రజిత్తుం బిలిచి యుద్ధంబునకుఁ బొమ్మని యాజ్ఞాపించెను. ౨

వీరుఁడా! మహాపరాక్రమశాలులగు నన్నదమ్ములగు రామలక్ష్మణులను నీవు వధింపుము; నీవు మాయచే నదృశ్యుఁడవై యుద్ధము చేసినను లేక దృశ్యుఁడవై యుద్ధముచేసినను అన్నివిధములను నీవు బలముచే నధికుండవు. ౩

సరిలేని పరాక్రమముగల యింద్రునంతటివానిని యుద్ధంబున నీవు జయించినావు; ఇంక ఈమనుష్యులను రామలక్ష్మణులను యుద్ధంబునఁ గన్నులం జూచియు వధింపఁజాలవాయేమి? తప్పక వధింతువు. అని రావణుండు ఇంద్రజిత్తునకుఁ జెప్పెను. ౪

అట్లు రాక్షసేశ్వరుండగు రావణునిమాటను విని ఆయింద్రజిత్తు తండ్రియాజ్ఞను శిరసావహించి యాగకార్యములుచేయు ప్రదేశమునకుఁ బోయి యచ్చట అగ్నిహోత్రమునందు యథావిధి హోమములు గావించెను. ౫

జుహ్వాత శ్చాపి తత్రాగ్నిం రక్తోష్ణీషధరాః స్త్రియః,
ఆజగ్ము స్తత్ర సమ్భ్రాన్తా రాక్షస్యో యత్ర రావణిః. ౬

శస్త్రాణి శరపత్త్రాణి సమిధోఽథ విభీతకాః,
లోహితాని చ వాసాంసి స్రువం కార్ష్ణాయసం తథా. ౭

సర్వతోఽగ్నిం సమాస్తీర్య శరపత్త్రైః సతోమరైః,
ఛాగస్య కృష్ణవర్ణస్య గళం జగ్రాహ జీవతః. ౮

సకృదేవ సమిద్ధస్య విధూమస్య మహార్చిషః,
బభూవు స్తాని లిఙ్గాని విజయం దర్శయన్తి చ. ౯

ప్రదక్షిణావర్తశిఖ స్తప్తహాటకసన్నిభః,
హవి స్తత్ప్రతిజగ్రాహ పావక స్స్వయ ముత్థితః. ౧౦

హుత్వాగ్నిం తర్పయిత్వా చ దేవదానవరాక్షసాన్,
ఆరురోహ రథశ్రేష్ఠ మన్తర్ధానగతం శుభమ్. ౧౧

స వాజిభి శ్చతుర్భిశ్చ బాణైశ్చ నిశితై ర్యుతః,
ఆరోపితమహాచాప శ్శుశుభే స్యన్దనోత్తమః. ౧౨

జాజ్వల్యమానో వపుషా తపనీయపరిచ్ఛదః,
మృగై శ్చన్ద్రార్ధచన్ద్రైశ్చ సరథ స్సమలంకృతః. ౧౩

జామ్బూనదమహాకమ్బు ర్దీప్తపావకసన్నిభః,

ఆ రావణపుత్రుం డింద్రజిత్తు హోమముచేయుటకు యాగభూమికిఁ బోఁగానే యచ్చట రాక్షసస్త్రీలు శీఘ్రంబున నెఱ్ఱని శిరోవస్త్రంబులను ఋత్విజులు ధరించుటకై తీసికొనివచ్చిరి. ౬

అప్పుడు ఇంద్రజిత్తు తోమరములు మున్నగునాయుధములే దర్భలుగా నుంచుకొనెను. తాండ్రపుల్లలు సమిధలుగా గ్రహించెను; ఎఱ్ఱవస్త్రంబులను ఋత్విజులచే ధరింపఁజేసెను; ఇనుపపాత్రలనే స్రుక్స్రువంబులు చేసికొనెను.

ఆ యింద్రజిత్తు తోమరములచేత అగ్నిహోత్రము నాలుగు ప్రక్కలను బరిస్తరణము గావించి హోమార్థమయి జీవించియున్న నల్లమేకయొక్క కంఠమును ఛేదించెను. ౮

అంత నొక్కమాఱు జ్వలింపఁజేయఁగానే యయ్యగ్నిహోత్రము ధూమరహితమయి గొప్పజ్వాలలతో విజయసూచకములగు చిహ్నములు గలిగి యొప్పెను. ౯

అగ్నిహోత్రము కరఁగిన బంగారమువలె వెలుంగుచుఁ బ్రదక్షిణముగాఁ దిరుగుజ్వాలలతో నొప్పుచుఁ దనకుఁదానే యున్నతముగా జ్వలించి యాహవిస్సును గ్రహించెను. ౧౦

ఆ యింద్రజిత్తు అగ్నిహోత్రమునం దట్లు హోమముచేసి దేవదానవరాక్షసులకుఁ దర్పణము గావించి ఆ హోమమహిమవలన అంతర్ధానశక్తినొంది యున్న యుత్తమమయినరథము నారోహించెను. ౧౧

ఆ యుత్తమమయిన రథము నాలుగు గుఱ్ఱములు పూన్పఁబడి తీక్ష్ణంబులగు బాణంబులచే నిండినదై యెక్కుపెట్టఁబడి యుద్ధమునకు సిద్ధముగానుండు మహాధనుస్సుగలదై యెంతయుఁ బ్రకాశించెను. ౧౨

ఆ రథము బంగారపుఱేకుచేఁ గప్పఁబడి మృగాకారములుగాను చంద్రాకారములుగను అర్ధచంద్రాకారములుగను గావింపఁబడిన చిత్రరచనలచేత నలంకరింపఁబడి కాంతిచే మిక్కిలియుఁ బ్రకాశించెను. ౧౩

ఇంద్రజిత్తుయొక్క ధ్వజము బంగారుతోఁ జేయఁబడిన యొకమహా

బభూవేన్ద్రజితః కేతు రైవ్వైడూర్యసమలంకృతః. ౧౪

తేన చాదిత్యకల్పేన బ్రహ్మాస్త్రేణ చ పాలితః,
స బభూవ దురాధర్షో రావణి స్సుమహాబలః. ౧౫

సోఽభినిర్యాయ నగరా దిన్ద్రజి త్సమితింజయః,
హుత్వాగ్నిం రాక్షసై ర్మన్త్రై రన్తర్ధానగతోఽబ్రవీత్. ౧౬

అద్య హత్వా రణే యౌ తౌ మిథ్యాప్రవ్రాజితౌ వనే,
జయం పిత్రే ప్రదాస్యామి రావణాయ రణార్జితమ్. ౧౭

అద్య నిర్వానరా ముర్వీం హత్వా రామం సలక్ష్మణమ్,
కరిష్యే పరమప్రీతి మిత్యు క్త్వాన్తరధీయత. ౧౮

ఆపపాతాథ సంక్రుద్ధో దశగ్రీవేణ చోదితః,
తీక్ష్ణకార్ముకనారాచై స్తీక్ష్ణ స్త్విన్ద్రరిపూ రణే. ౧౯

స దదర్శ మహావీర్యౌ నాగౌ త్రిశిరసావివ,
సృజన్తౌ విషుజాలాని వీరౌ వానరమధ్యగౌ. ౨౦

ఇమౌ తావితి సంచిన్త్య సజ్జం కృత్వాథ కార్ముకమ్,
సన్తతానేషుధారాభిః పర్జన్య ఇవ వృష్టిమాన్. ౨౧

వలయమునకు గట్టఁబడి పై దూర్వమణులచే నలంకృతంబై ప్రజ్వలించుచున్న యగ్నిహోత్రముకై పడిఁ బ్రకాశించెను. ౧౪

మిక్కిలియు మహాబలుండగు రావణకుమారుం డాయింద్రజిత్తు సూర్యసమానంబై వెలుంగుచున్న యంతర్ధానశక్తిగల యా రథశ్రేష్ఠముచేతను బ్రహ్మాస్త్రముచేతను సురక్షితుండై యెట్టివారికి నెదిరింప నలవిగానివాఁడై యుండెను. ౧౫

యుద్ధమునందు జయమునే వహించునట్టి యా యింద్రజిత్తు నిర్వృతి దేవతాకములయిన మంత్రములచేత నగ్నియందు హోమముగావించి యంతర్ధానశక్తిం బొందినవాఁడై లంకానగరంబు వెలువడి యిట్లనియె. ౧౬

అడవియందుఁ గపటమునివేషంబు వేసికొనియున్న యారామలక్ష్మణులను ఇప్పుడు యుద్ధమునందు వధించి యుద్ధంబున జయంబును సంపాదించి నాతండ్రి రావణున కొసంగెదను. ౧౭

ఇప్పుడు రామలక్ష్మణులను వధించి భూమినున్న సమస్త వానరులను సంహరించి భూమియందు వానరులే లేనట్లుచేసి మాతండ్రికిఁ బరమప్రీతి గావించెదను. ఈ ప్రకారమున ఆ యింద్రజిత్తు పలికి యాపిమ్మట నంతర్ధానంబు నొందెను. ౧౮

అంత యుద్ధంబునందు మిక్కిలియు భయంకరుండగు నాయింద్రజిత్తు రావణు నాజ్ఞచొప్పునఁ దీక్ష్ణంబులగు బాణంబులతోను ధనుస్సుతోను రణరంగమునకు వచ్చెను. ౧౯

ఆ యింద్రజిత్తు ఆవానరసేనామధ్యంబుననుండి బాణసమూహంబులు వర్షించుచున్నవారలకు భుజములు శిరస్సుతో సమముగా నున్నతములయి యుండుటవలన మూఁడు తలల నాగములవలె నున్నవారలను మహాపరాక్రమశాలులను ఆరామలక్ష్మణులం జూచెను. ౨౦

ఆ యింద్రజిత్తు అట్లు రామలక్ష్మణులం జూచి వీరే యా రామలక్ష్మణులని నిశ్చయించి విల్లు మోపెట్టి వర్షాకాలమునందు మేఘము ఎడతెగక వర్షము గురియు విధంబున బాణములను సందులేనట్లు ప్రయోగించెను. ౨౧

స తు వైహాయసం ప్రాప్య సరథో రామలక్ష్మణౌ,
అచక్షుర్విషయే తిష్ఠ న్వివ్యాధ నిశితై శ్శరైః. ౨౨

తౌ తస్య శరవేగేన పరీతౌ రామలక్ష్మణౌ,
ధనుషీ సశరే కృత్వా దివ్య మస్త్రం ప్రచక్రతుః. ౨౩

ప్రచ్ఛాదయ న్తౌ గగనం శరజాలై ర్మహాబలౌ,
త మస్త్రై స్సూర్యసఙ్కాశై ర్నైవ పస్పృశతు శ్శరైః. ౨౪

సహి ధూమాన్ధకారం చ చక్రే ప్రచ్ఛాదయ న్నభః,
దిశ శ్చా న్తర్దధే శ్రీమా న్నీహారతమసా వృతాః. ౨౫

నైవ జ్యాతలనిర్ఘోషో నచ నేమిఖురస్వనః,
శుశ్రువే చరత స్తస్య న చ రూపం ప్రకాశతే. ౨౬

ఘనాన్ధకారే తిమిరే శరవర్ష మివాద్భుతమ్,
స వవర్ష మహాబాహు ర్నారాచశరవృష్టిభిః. ౨౭

స రామం సూర్యసఙ్కాశై శ్శరై ర్దత్తవరో భృశమ్,
వివ్యాథ సమరే క్రుద్ధ స్సర్వగాత్రేషు రావణిః. ౨౮

ఆ యింద్రజిత్తు తనపద్ధతినే యవలంబించి రథసహితుండుగా నాకాశ మార్గంబున నుండి యదృశ్యుండై రామలక్ష్మణులను దీక్ష్ణబాణంబుల నొప్పించెను. ౨౨

ఆ యింద్రజిత్తు ప్రయోగించిన బాణములచేతఁ గప్పఁబడియున్న యా రామలక్ష్మణులును ధనుస్సున బాణముల సంధించి యుత్తమ మగు తమ యస్త్రవిద్యానైపుణ్యముం జూపిరి. ౨౩

మహాబలసంపన్నులగు రామలక్ష్మణులు అట్లు బాణసమూహంబుల నాకాశం బంతయుఁ గప్పి వేసినను సూర్యసమానంబులగు నాదివ్యాస్త్రంబులు గాని బాణంబులుగాని యాయింద్రజిత్తునకుఁ దగుల నేలేదు. ౨౪

శ్రీమంతుండగు నాయింద్రజిత్తు ధూమముగాని మంచుగాని యాకాశము నావరించినప్పుడు కలుగు చీఁకటివంటి గొప్పచీఁకటి పుట్టించి యాకాశంమనంతయుం నాచ్ఛాదించుటవలన అప్పుడు దిక్కులన్నియుం మఱుఁగుపడి నందున ఎంతమాత్రము గుర్తించుటకు అలవిగాకుండెను. ౨౫

ఆయింద్రజిత్తు అట్లు ఎదురులేక సంచరించునప్పుడు అతఁడు బాణప్రయోగంబు సేయునప్పుడు కలుగవలసిన జ్యాతలంబుల ధ్వనిగాని రథంబు నడుచుటచే భూమిఘట్టనంబునం గలుగు చక్రనేమి ధ్వనిగాని యశ్వ ఖురములధ్వనిగాని యెంతమాత్రము వినఁబడదయ్యెఁ; అతని రూపంబును ఎంతమాత్రముం గానరాదయ్యెఁ. ౨౬

మహాబాహుఁడగు నా యింద్రజిత్తు దట్టంబుగా మహామేఘములు క్రమ్మినప్పుడు కలుగు పెనుజీఁకటివంటి చీఁకటిని గల్పించి యప్పుడు గొప్పజలవర్షము గురియువిధంబున ఆశ్చర్యకరంబుగా అచ్చము లోహము తోనే చేయఁబడిన యతిక్రూరంబులగు బాణములం గురిసెను. ౨౭

రావణపుత్త్రుండగు నా యింద్రజిత్తు వరబలంబున నభివృద్ధుండై యుద్ధంబునఁ బరమకుపితుండై రాముని సమస్తావయవంబులను సూర్యసమానంబులగు బాణంబులచే నొప్పించెను. ౨౮

తౌ హన్యమానౌ నారాచై ర్ధారాభి రివ పర్వతౌ,
హేమపుఙ్ఖా న్నరవ్యాఘ్రౌ తిగ్మా న్ముముచతు శ్శరాన్. ౨౯

అన్తరిక్షే సమాసాద్య రావణిం కఙ్కపత్త్రిణః,
నికృత్య పతగా భూమౌ పేతు స్తే శోణితోక్షితాః. ౩౦

అతిమాత్రం శరౌఘేణ పీడ్యమానౌ నరోత్తమౌ,
తానిషూ న్పతతో భల్లై రనేకై ర్నిచకృన్తతుః ౩౧

యతో హి దదృశాతే తౌ శరా న్నిపతత శ్శితాన్,
తత స్తు తౌ దాశరథీ ససృజాతేఽస్త్ర ముత్తమమ్. ౩౨

రావణి స్తు దిశ స్సర్వా రథేనాతిరథః పతన్,
వివ్యాధ తౌ దాశరథీ లఘ్వస్త్రో నిశితై శ్శరైః. ౩౩

తేనాతివిద్ధౌ తౌ వీరౌ రుక్మపుఙ్ఖై స్సుసంహితైః,
బభూవతు ర్దాశరథీ పుష్పితా వివ కింశుకౌ. ౩౪

నాస్య వేద గతిం కశ్చి న్నచ రూపం ధను శ్శరాన్,
న చాన్య ద్విదితం కించి త్సూర్యస్యే వాభ్రసంప్లవే. ౩౫

పురుషశ్రేష్ఠులగు నారామలక్ష్మణులు వర్షధారలచేఁ గొట్టఁబడుపర్వతంబులభంగి బాణంబులచేఁ గొట్టఁబడుచుచుం జలనంబునొందక కాంచనపుంఖములగు తీక్ష్ణబాణంబులం బ్రయోగించిరి. ౨౯

కంకపక్షి ఱెక్కలుఁగట్టియున్న యాబాణములు ఆకాశమున రావణపుత్రు నింద్రజిత్తుం దాఁకి యతని మర్మస్థానంబులు భేధించి నెత్తుటం దడిసినవై నేలంబడినవి. ౩౦

అట్లు పురుషోత్తములగు నారామలక్ష్మణులు బాణసమూహములచే నధికముగాఁ బీడింపఁబడుచు నాయింద్రజిత్తు ప్రయోగించిన బాణంబులను ననేకబాణంబులచే ఖండించివైచిరి. ౩౧

ఆరామలక్ష్మణులు తమ మీఁదికి నేవైపున నుండి తీక్ష్ణంబులగు బాణంబులు పడుచున్నవో ఇంద్రజిత్తు కనఁబడకున్నందున నావైపును గనిపెట్టి యుత్తమములయిన బాణంబులు పరఁగించిరి. ౩౨

శీఘ్రముగా బాణప్రయోగము సేయువాఁడు ఏకకాలమునందుఁ బెక్కండ్రు విలుకాండ్రతోఁ బోరువాఁడునగు నాయింద్రజిత్తు మాయావరబలంబునం జేసి యొక్కచో నిలువక రథముతోఁగూడ నన్నిదిక్కులకుం దిరుగుచు రామలక్ష్మణుల బాణంబులకుఁ జిక్కక వారలను దీక్ష్ణబాణంబులచే మిక్కిలియుం నొప్పించెను. ౩౩

పరాక్రమవంతులగు నా రామలక్ష్మణులు అట్లు ఆయింద్రజిత్తుచే నల్లెత్రాటిని జెవిపట్టును లాగి విడువఁబడిన కాంచనపుంఖంబులగు బాణంబులచే నెంతయుం నొప్పింపఁబడి దేహమంతయు నెత్తురు గాఱుటవలనఁ జక్కఁగాఁ జూచి యెఱ్ఱనిపూలతో నిండియుండు మోదుగుచెట్లవలె నొప్పుచుండిరి. ౩౪

ఆకాశంబును మేఘంబు లావరించినప్పుడు సూర్యునిస్థానాదులు ఎవ్వరికిని దెలియరాకుండునట్లు ఆయింద్రజిత్తుయొక్క స్థానముగాని రూపముగాని ధనుర్బాణంబులు గాని యితర మేదిగాని అప్పుడు ఎంతమాత్రమును ఎవ్వరికిని దెలియరాదయ్యె. ౩౫

తేన విద్ధాశ్చ హరయో నిహతా శ్చ గతాసవః,
బభూవు శ్శతశ స్తత్ర పతితా ధరణీతలే. 36

లక్ష్మణస్తు సుసంక్రుద్ధో భ్రాతరం వాక్య మబ్రవీత్,
బ్రాహ్మ మస్త్రం ప్రయోక్ష్యామి వధార్థం సర్వరక్షసామ్. 37

త మువాచ తతో రామో లక్ష్మణం శుభలక్షణం,

నైకస్య హేతో రక్షాంసి పృథివ్యాం హన్తు మర్హసి. 38

అయుధ్యమానం ప్రచ్ఛన్నం ప్రాఞ్జలిం శరణాగతమ్,
పలాయ న్తం ప్రమ త్తం వా న త్వం హన్తు మిహార్హసి. 39

అస్యైవ తు వధే యత్నం కరిష్యావో మహాబల!,
ఆదేక్ష్యావో మహావేగా నస్త్రా నాశీవిషోపమాన్. 40

తమేనం మాయినం క్షుద్ర మ న్తర్హితరథం బలాత్,
రాక్షసం నిహనిష్య న్తి దృష్ట్వా వానరయూథపాః. 41

యద్యేష భూమిం విశతే దివం వా
రసాతలం వాపి నభస్స్థలం వా,
ఏవం నిగూఢోఽపి మమాస్త్రదగ్ధః
పతిష్యతే భూమితలే గతాసుః. 42

ఇత్యేవ ముక్త్వా వచనం మహాత్మా

అప్పుడు ఆయింద్రజిత్తుచే కొట్టఁబడిహతులయిన వానరులు మృతులయి యాయుద్ధభూమియందు గుంపులుగుంపులుగాఁ బడిరి. ౩౬

ఇప్పుడు లక్ష్మణుఁడు మాత్రము పరమకుపితుఁడై యన్నను రాముం జూచి "నే నిప్పుడు బ్రహ్మాస్త్రమును బ్రయోగించి సమస్తరాక్షసులను వధించెదను" అని యీమాటం జెప్పెను. ౩౭

అంత రాముఁడు మంగళకరంబులగు లక్షణంబులతో నొప్పుచున్న యాలక్ష్మణుం జూచి యిట్లని చెప్పెను

ఒక్కని నిమిత్తమయి నీవు భూమియందలి సమస్తరాక్షసులను వధింపఁగోరుట యెంతమాత్రము యుక్తముకాదు. ౩౮

యుద్ధము సేయక యుదాసీనుఁడై యున్నవానిఁగాని యుద్ధభయంబున డాఁగియున్నవానిఁగాని భయంబునం జేతులు మోడ్చుకొని యున్నవానిఁగాని శరణన్నవానిఁగాని భయంబునం బాఱిపోవుచున్న వానిఁగాని యేమఱియున్నవానిఁగాని నీ వెంతమాత్రము వధింపరాదు. ౩౯

మహాబలుండవగు లక్ష్మణుఁడా! ఈయింద్రజిత్తునే వధించుటకుం దగిన ప్రయత్నము గావింతము. కృష్ణసర్పములంబోలిన మహావేగములగు దివ్యాస్త్రములం బ్రయోగింతము. ౪౦

మాయలు నేర్చినవాఁడు నీచుండును రథసహితంబుగా నంతర్ధానంబుఁ బొందియున్నవాఁడునగు నీయింద్రజిత్తును ఎట్లయినను గనిపెట్టి వానరోత్తములు తమబలంబు పెంపునం బట్టి వధింపఁగలరు. ౪౧

ఈయింద్రజిత్తు భూవివరంబుఁ జొచ్చినను స్వర్గంబునకుఁబోయినను పాతాళంబుఁ బ్రవేశించినను ఆకాశంబునొందినను ఇట్లు ఊర్ధ్వలోకంబులలోఁ గాని యధోలోకంబులలోఁ గాని యేలోకంబుఁ జొచ్చినను నాదివ్యాస్త్రంబులచే దగ్ధుండై మృతుండై తప్పక నేలంగూలును. అని రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పెను. ౪౨

మహానుభావుండును మహాబుద్ధిమంతుఁడునగు రఘుశ్రేష్ఠుఁడయిన

రఘుప్రవీరః ప్లవగర్షభై ర్వృతః,
వధాయ రౌద్రస్య నృశంసకర్మణ
స్తదా మహాత్మా త్వరితం నిరీక్షతే. ౮౩

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డేఽశీతితమస్సర్గః. ౮౦.

---

## ఏకాశీతితమస్సర్గః.

విజ్ఞాయ తు మన స్తస్య రాఘవస్య మహాత్మనః,
సన్నివృత్త్యాహవా త్తస్మా త్ప్రవివేశ పురీం తతః. ౧
సోఽనుస్మృత్య వధం తేషాం రాక్షసానాం తరస్వినామ్,
క్రోధతామ్రేక్షణ శ్శూరో నిర్జగామ మహాద్యుతిః. ౨

స పశ్చిమేన ద్వారేణ నిర్యయౌ రాక్షసై ర్వృతః,
ఇన్ద్రజిత్తు మహావీర్యః పౌలస్త్యో దేవకణ్టకః. ౩

ఇన్ద్రజిత్తు తతో దృష్ట్వా భ్రాతరౌ రామలక్ష్మణౌ,
రణాయాభ్యుద్యతౌ వీరౌ మాయాం ప్రాదుష్కరో త్తదా. ౪

ఇన్ద్రజిత్తు రథే స్థాప్య సీతాం మాయామయీం తతః,
బలేన మహతాఽఽవృత్య తస్యా వధ మరోచయత్. ౫
మోహనార్థం తు సర్వేషాం బుద్ధిం కృత్వా స దుర్మతిః,
హన్తుం సీతాం వ్యవసితో వానరాభిముఖో యయౌ. ౬

తం దృష్ట్వా త్వభినిర్యాన్తం నగర్యాః కాననౌకసః,
ఉత్పేతు రభిసంక్రుద్ధా శ్శిలాహస్తా యుయుత్సవః. ౭

రాముఁడు ఇవ్విధంబునం జెప్పి భయంకరుండును క్రూరకర్ముండునగు నాయింద్రజిత్తును శీఘ్రముగా వధించుటకై యుపాయంబు నాచుచుండెను. ౪౩

ఇది యెనుబదియవసర్గము.

## ఎనుబదియొకటవసర్గము.

మహాత్ముఁడగు రాముని సంకల్పం బెఱింగి యాయింద్రజిత్తు యుద్ధంబు వదలి యచ్చటనుండి లంకాపురంబుఁ బ్రవేశించెను. ౧

శూరుండును మహాతేజుండునగు నాయింద్రజిత్తు అంతలోన బలవంతులగు కుంభకర్ణాదిరాక్షసులందఱు రామునిచే వధింపఁబడుటం దలంచుకొని క్రోధంబునఁ గన్నుల నెఱ్ఱఁదనంబు గదురఁ మరలఁ బురంబు వెలువడి యుద్ధభూమికి వచ్చెను. ౨

మహాపరాక్రమశాలియు దేవతల హింసించువాఁడు నగు నాయింద్రజిత్తు రాక్షససేనాపరివేష్టితుండై లంకానగరపశ్చిమద్వారంబుననుండి వెలువడి వచ్చెను. ౩

అంత ఇంద్రజిత్తు వీరులగు రామలక్ష్మణులు యుద్ధసన్నద్ధులైయే యుండుటం జూచి తాను నికుంభిలాయాగముసేయువఱకు వారలు యుద్ధప్రయత్నంబు వదలి దుఃఖపరవశులయి యుండుటకై యప్పుడు మాయ గావించెను. ౪

అంత ఇంద్రజిత్తు మాయచే సీతాదేవిం జేసి గొప్పరాక్షససేన నడుమ రథంబున నామాయాసీతనుంచి యామెను వధింపఁ దలంచెను. ౫

పరమదుర్మార్గుఁడగు నాయింద్రజిత్తు రామాదులనందఱను వంచించి మోహము నొందింపఁదలంచినవాఁడై యమ్మాయాసీతను వానరులయెదుటం జంపఁ గోరి వానరసేనాభిముఖుండై పోయెను. ౬

వానరవీరులు లంకానగరంబుననుండి మఱల నాయింద్రజిత్తు వచ్చుటం జూచినంతనె పరమక్రుద్ధులయి యుద్ధోత్సాహంబుగదుర శిలలు చేతులఁబూని

హనూమా న్పురత స్తేషాం జగామ కపికుఞ్జరః,
ప్రగృహ్య సుమహ చ్ఛృఙ్గం పర్వతస్య దురాసదమ్. ౮
స దదర్శ హతానన్దాం సీతా మిన్ద్రజితో రథే,
ఏకవేణీధరాం దీనా ముపవాసకృశాననామ్. ౯
పరిక్లిష్టైకవసనా మమృజాం రాఘవప్రియామ్,
రజోమలాభ్యా మాలిప్తై స్సర్వగాత్రై ర్వరస్త్రియమ్. ౧౦

తాం నిరీక్ష్య ముహూర్తం తు మైథిలీత్యధ్యవస్య తు,
బభూవాచిరదృష్టా హి తేన సా జనకాత్మజా. ౧౧

తాం దీనాం మలదిగ్ధాఙ్గీం రథస్థాం దృశ్య మైథిలీమ్,
బాష్పపర్యాకులముఖో హనూమా న్వ్యథితోఽభవత్. ౧౨

అబ్రవీత్తాం తు శోకార్తాం నిరానన్దాం తపస్వినీమ్,
సీతాం రథే స్థితాం దృష్ట్వా రాక్షసేన్ద్రసుతాశ్రితామ్. ౧౩
కిం సమర్థిత మస్యేతి చిన్తయన్ స మహాకపిః,

సహ తైర్వానరశ్రేష్ఠై రభ్యధావత రావణిమ్. ౧౪

తద్వానరబలం దృష్ట్వా రావణిః క్రోధమూర్ఛితః,
కృత్వా విశోశం నిస్త్రింశం మూర్ధ్ని సీతాం పరామృశత్. ౧౫

యెదుర్కొనిరి. ౭

వానరశ్రేష్ఠుండగు హనుమంతుఁడు భయంకరంబగు గొప్పపర్వతశిఖరంబుగ్రహించి యవ్వానరుల యగ్రభాగంబున నడిచెను. ౮

ఆ హనుమంతుఁడు ఇంద్రజిత్తు రథంబున ఒక్కటే జడగాఁ గట్టిన తలవెండ్రుకలు గలదై యుపవాసంబులచేఁ గృశించిన ముఖంబుకలదై ఎప్పుడును విడువక ధరించియున్న ఒక్కటే వస్త్రము మలినమయి యొప్ప ఎంత మాత్రము దేహసంస్కారము లేమిం జేసి సమస్తావయవంబుల యందునుం జేరియుండు దుమ్ము మఱికియుఁ గలదై యానందంబు చెడి దీనురాలై యున్న రాముని ప్రియురాలి నుత్తమ స్త్రీరత్నమును సీతాదేవిం గాంచెను. ౯, ౧౦

ఆహనుమంతుండు అట్లు కొంతసేపు సీతం జూచి యతఁడు జనకాత్మజయగు నాసీతం జూచి స్వల్పకాలమే యగుటవలన ఈమె సీతాదేవియని నిశ్చయించెను. ౧౧

హనుమంతుఁడు దీనురాలును మలినమయిన దేహముతోఁ గూడిన దియునగు సీత ఇంద్రజిద్రథంబున నుండుటం జూచి పరమదుఃఖితుండై కన్నీళ్లు విడిచెను. ౧౨

ఆహనుమంతుఁడు పరమదుఃఖితురాలును ఆనందహీనయును శోచనీయయునగు నాసీతాదేవి క్రూరుండగు నింద్రజిత్తుయొక్క వశంబు నొంది నదై యతని రథంబున నుండుటంజూచి ఇట్లు సీతాదేవిం దనరథంబున నుంచి యిచ్చటికిం దెచ్చుట కితని యభిప్రాయమేమిగా నుండునని యాలోచించి యచ్చటివారల నడిగెను. ౧౩

అంత హనుమంతుఁడు అవ్వానరవీరులచేఁ బరివేష్టితుండై యింద్రజిత్తుమీఁదికిం బోయెను. ౧౪

ఇంద్రజిత్తు అట్లు వానరసేన తనమీఁదికి వచ్చుటం జూచి కుపితుఁడై యొరనుండి ఖడ్గంబుఁ దీసి దానిచేత నమ్మాయాసీత శిరముం బడ వైచెను. ౧౫

తాం స్త్రియం పశ్యతాం తేషాం తాడయామాస రావణిః,
క్రోశన్తీం రామరామేతి మాయయా యోజితాం రథే. ౧౬
గృహీతమూర్ధజాం దృష్ట్వా హనూమాన్ దైన్య మాగతః,
శోకజం వారి నేత్రాభ్యా ముత్సృజ న్మారుతాత్మజః. ౧౭

తాం దృష్ట్వా చారుసర్వాఙ్గీం రామస్య మహిషీం ప్రియామ్,
అబ్రవీ త్పరుషం వాక్యం క్రోధా ద్రక్షోధిపాత్మజమ్. ౧౮

దురాత్మ! న్నాత్మనాశాయ కేశపక్షే పరామృశః,
బ్రహ్మర్షీణాం కులే జాతో రాక్షసీం యోని మాశ్రితః. ౧౯

ధిక్త్వాం పాపసమాచారం యస్య తే మతి రీదృశీ,

నృశంసానార్య! దుర్వృత్త! క్షుద్ర! పాపపరాక్రమ! ౨౦
అనార్యస్యేదృశం కర్మ ఘృణా తే నాస్తి నిర్ఘృణ!,

చ్యుతా గృహాచ్చ రాజ్యాచ్చ రామహస్తాచ్చ మైథిలీ. ౨౧
కిం తవైషాఽపరాద్ధా హి యదేనాం హన్తు మిచ్ఛసి,

సీతాం చ హత్వా న చిరం జీవిష్యసి కథంచన. ౨౨
వధార్హకర్మణానేన మమ హస్తగతో హ్యసి,

ఇంద్రజిత్తు మాయచే రథంబునందు నిర్మితయయి రామా రామా యని విలపించుచున్న సీతను ఆ వానరులందఱు చూచుచుండఁగా దెబ్బలు గొట్టెను.

వాయుకుమారుఁడగు హనుమంతుఁడు ఇంద్రజిత్తు సీతాదేవి తల వెండ్రుకలం బట్టుటను జూచి దుఃఖితుండై కన్నులనుండి యశ్రుజలంబులను విడిచెను. ౧౭

హనుమంతుఁడు అట్లు సర్వాంగసుందరియు రాముని ప్రియభార్యయు నగు సీతాదేవి యింద్రజిత్తు చేతిలోనం జిక్కి యవస్థపడుచుండుటం జూచి క్రుద్ధుండై రాక్షసేశ్వరపుత్రుఁడగు నింద్రజిత్తుం జూచి పరుషంబుగా నిట్లని చెప్పెను. ౧౮

దురాత్ముఁడా! నీవు బ్రహ్మర్షికులంబునఁ బుట్టినవాఁడయ్యు రాక్షస యోనికి సంబంధించినవాఁడవు. కావున దీనివలన ఆత్మనాశంబు గలుగునని తెలియక మహాపతివ్రతాశిరోమణియగు సీతాదేవి తలవెండ్రుకలం బట్టినావు. దీనం దప్పక నీవు నశింపఁగలవు. ౧౯

నీ కిట్టి పాపిష్ఠమయిన దురాచారమునందు బుద్ధి గలిగినది. కావున ఛీ! నీవు దహింపఁబడుదువు గాక.

క్రూరుఁడా! దుష్టుఁడా! దురాచారుఁడా! నీచుఁడా! పరాక్రమ గర్వంబునఁ బాపము సేయువాఁడా! నీ విప్పుడు చేసినకార్యము కేవలము దుర్మార్గుఁడు చేయవలసిన కార్యమె కాని వేఱుకాదు. నిర్దయుఁడా! ఇట్టి నిందితకార్యము చేయునప్పుడు నీకు సిగ్గైన లేదు గదా! ౨౦

గృహంబువదలి రాజ్యభ్రష్టయయి రక్షకుండగు రామునిం బాసి యున్న సీతాదేవిని వధింపఁగోరుచున్నావే! ఈమె నీవిషయమయి యేవిధముగా నేమి యపరాధంబు చేయఁగలిగి చేసినది? ౨౧

సీతను వధింతువేని నీవెంత సమర్థుండవైనను ఇంక బహుకాలము జీవింపఁజాలవు. నీవిట్టి సీతావధరూపమయిన మహాపకారంబు గావింగుటచే వధార్హుండవై నాచేతం జిక్కినావే ఇంక బ్రతికిపోవు టెక్కడ? ౨౨

యే చ స్త్రీఘాతినాం లోకా లోకవధ్యేషు కుత్సితాః. ౨౩
ఇహ జీవిత ముత్సృజ్య ప్రేత్య తా న్ప్రతిపత్స్యసే,

ఇతి బ్రువాణో హనుమాన్ సాయుధై ర్హరిభి ర్వృతః. ౨౪
అభ్యధావత సంక్రుద్ధో రాక్షసేన్ద్రసుతం ప్రతి,

ఆపత న్తం మహావీర్యం తదనీకం వనౌకసామ్. ౨౫
రక్షసాం భీమవేగానా మనీకేన న్యవారయత్,

స తాం బాణసహస్రేణ విక్షోభ్య హరివాహినీమ్. ౨౬
హరిశ్రేష్ఠం హనూమ న్త మిన్ద్రజి త్ప్రత్యువాచ హ,

సుగ్రీవ స్త్వం చ రామశ్చ యన్నిమి త్త మిహాగతాః. ౨౭
తాం హనిష్యామి వైదేహీ మద్యైవ తవ పశ్యతః,

ఇమాం హత్వా తతో రామం లక్ష్మణం త్వాం చ వానర!. ౨౮
సుగ్రీవం చ వధిష్యామి తం చానార్యం విభీషణమ్,

న హ న్తవ్యాః స్త్రియ శ్చేతి యద్బ్రవీషి ప్లవఙ్గమ!. ౨౯
పీడాకర మమిత్రాణాం యత్స్యా త్క ర్తవ్య మేవ తత్,

ఎవ్వఁడేని లోకమునందుఁ దనకు శత్రువైనవానికి మాత్రమే వధ్యుండై యుండును. నీవట్లు కావు. పరమ దుర్మార్గుండవు లోకనిందితములైన కార్యములు చేయుటచేత లోకమున కంతయు ననుతాపము గల్గించుచున్నావు. కావున లోకంబున కంతయు వధ్యుండవగుచున్నావు. నీ విప్పుడు ఈ లోకంబునందు జీవితంబు వదలి యాతనాశరీరంబు నొంది ఈ చతుర్దశభువనంబులయందును స్త్రీహత్య చేసినవారలు ఏకుత్సితలోకంబులం జెందుదురో ఆలోకంబులం బొందఁగలవు అని హనుమంతుఁడు ఇంద్రజిత్తునకుఁ జెప్పెను. ౨౩

హనుమంతుఁడు ఇవ్విధంబునఁ బరుషవచనంబులు పలుకుచు నాయుధంబులు ధరించి యుద్ధసన్నద్ధులయిన వానరులతోఁడం గూడ క్రుద్ధుండై యింద్రజిత్తుమీఁదికిం బోయెను. ౨౪

భయంకరమయిన పరాక్రమముగల రాక్షససేనయుం అట్లు వచ్చుచున్న మహాపరాక్రమశాలి హనుమంతుని వానరసేనను అడ్డగించి యుద్ధము గావించెను. ౨౫

ఆ యింద్రజిత్తు వేయిబాణంబులు ప్రయోగించి యవ్వానరసేన నంతయుఁ జీకాకు నొందించి వానరోత్తముఁడగు హనుమంతుం జూచి యిట్లని బదులు చెప్పెను. ౨౬

ఎవ్వతె నిమిత్తముగా నీవును సుగ్రీవుఁడును రాముఁడును ఈ లంకకు వచ్చినారలో ఆసీత నిప్పుడు నీవు కన్నెదుటం జూచుచుండఁగానే చంపివేసెదను. ౨౭

వానరుఁడా! మొదట నిప్పుడు ఈ సీతం జంపి యటుపిమ్మట రాముని లక్ష్మణుని నిన్నును సుగ్రీవుని దుర్మార్గుఁడయిన యావిభీషణుని వధించి వైచెదను. ౨౮

వానరుఁడా! మఱియు నీవు స్త్రీలను వధింపరాదని చెప్పినావే ఆవిషయమయి చెప్పెద వినుము. శత్రువుల కేది బాధకరమో అదంతయు నవశ్యము

తమేవ ముక్త్వా రుదతీం సీతాం మాయామయీం తదా. ౩౦
శితధారేణ ఖడ్గేన నిజఘానేన్ద్రజి త్స్వయమ్,

యజ్ఞోపవీతమార్గేణ భిన్నా తేన తపస్వినీ. ౩౧
సా పృథివ్యాం పృథుశ్రోణీ పపాత ప్రియదర్శనా,

తా మిన్ద్రజి త్స్వయం హత్వా హనూమన్త మువాచ హ. ౩౨

మయా రామస్య పశ్యేమాం కోపేన చ నిషూదితామ్,
ఏషా విశస్తా వైదేహీ విఫలో వః పరిశ్రమః. ౩౩

తతః ఖడ్గేన మహతా హత్వా తామిన్ద్రజి త్స్వయమ్,
హృష్ట స్స రథ మాస్థాయ విననాద మహాస్వనమ్. ౩౪

వానరా శ్శుశ్రువు శ్శబ్ద మదూరే ప్రత్యవస్థితాః,
వ్యాదితాస్యస్య నదత స్తద్దుర్గం సంశ్రితస్య చ. ౩౫

తథా తు సీతాం వినిహత్య దుర్మతిః
ప్రహృష్టచేతా స్స బభూవ రావణిః,
తం హృష్టరూపం సముదీక్ష్య వానరా
విషణ్ణరూపా స్సహసా ప్రదుద్రువుః. ౩౬

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే ఏకాశీతితమస్సర్గః.

చేయఁదగినదేకాని వేఱుకాదు. సీతను వధించుటయు శత్రువులకుఁ బీడాకర మగుటంజేసి కర్తవ్యమే. అని యింద్రజిత్తు హనుమంతునకుఁ జెప్పెను. ౨౯

ఇంద్రజిత్తు హనుమంతున కవ్విధంబుసం జెప్పి యప్పుడు మాయా నిర్మితయయిన రోదనంబుసేయుచున్న సీకను దీక్షంబగు ఖడ్గంబుచేతం దన చేతులార నఱికెను. ౩౦

సుందరములయిన పెద్దపిఱుందులుఁగలదియుఁ జూపరులకుఁ బ్రియ బొసంగునదియు శోచనీయయగు నాసీత యాయింద్రజిత్తు ఖడ్గంబువ్రేటునకు యజ్ఞోపవీతంబు ధరించు విధంబున ఖండింపఁబడినదై నేనంబడెను. ౩౧

అట్లు ఇంద్రజిత్తు ఆమ్మాయాసీతం దనచేతులార వధించి హనుమంతుం జూచి యిట్లని పలికెను. ౩౨

నేను గోపంబున మీరామునిప్రియభార్యయయిన సీతను వధించి వేసి నాను జూడుము. ఈసీతయే మా వధింపఁబడినది ఇంక మీప్రయాసమంతయు వ్యర్థము. అని యింద్రజిత్తు హనుమంతునితోఁ జెప్పెను. ౩౩

ఆ యింద్రజిత్తు అట్లు తనచేతులార గొప్పఖడ్గంబున సీతం దెగనఱికి సంతుష్టుండై రథముననుండియే మహాధ్వని గలుగునట్లు వికృతంబుగా సింహ నాదంబు గావించెను. ౩౪

అప్పుడు సమీపంబున యుద్ధంబునకై నిలిచియున్న వానరు లందఱు ఇంద్రజిత్తు చొరరాని యారాక్షససేనామధ్యంబుననుండి వికృతంబుగా నోరు దెఱచి యఱవఁగా నాధ్వనిని వినిరి. ౩౫

దురాత్ముండగు నారావణపుత్రుం డింద్రజిత్తు అట్లు మాయాసీతను వధించి పరమసంతోషంబు నొందెను. వానరు లంతఱు అవ్విధంబున మిక్కి లియు సంతుష్టుండైయున్న యయ్యింద్రజిత్తుం జూచి పరమదుఃఖితులయి యేమియుం దోఁచక పాఱిపోవ నారంభించిరి. ౩౬

ఇది యెనుబదియొకటవ సర్గము.

## ద్వ్యశీతితమస్సర్గః.

శ్రుత్వా తు భీమనిర్హ్రాదం శక్రాశనిసమస్వనమ్,
వీక్షమాణా దిశస్సర్వా దుద్రువుర్వానరర్షభాః. ౧

తానువాచ తతస్సర్వాన్ హనూమాన్మారుతాత్మజః,
విషణ్ణవదనాన్ దీనాం స్త్రస్తాన్విద్రవతః పృథక్. ౨

కస్మాద్విషణ్ణవదనా విద్రవధ్వే ప్లవఙ్గమాః,
త్యక్తయుద్ధసముత్సాహాః శూరత్వం క్వను వో గతమ్. 3
పృష్ఠతోఽనువ్రజధ్వం మా మగ్రతో యాన్తమాహవే,
శూరైరభిజనోపేతైరయుక్తం హి నివర్తితుమ్. ౪

ఏవముక్తాస్సుసంహృష్టా వాయుపుత్త్రేణ వానరాః,
శైలశృఙ్గాణ్యగాం శ్చైవ జగృహుర్హృష్టమానసాః. ౫

అభిపేతుశ్చ గర్జన్తో రాక్షసాన్వానరర్షభాః,
పరివార్య హనూమన్తమన్వయుశ్చ మహాహవే. ౬
స తైర్వానరముఖ్యైశ్చ హనూమాన్ సర్వతో వృతః,
హుతాశన ఇవార్చిష్మానదహచ్ఛత్రువాహినీమ్. ౭

స రాక్షసానాం కదనం చకార సుమహాకపిః,
వృతో వానరసైన్యేన కాలాన్తకయమోపమః. ౮

స తు కోపేన చావిష్టః శోకేన చ మహాకపిః,

## ఎనుబదిరెండవసర్గము.

వానరోత్తములు వజ్రాయుధధ్వనితో సమానమయిన మహాభయంకర మగు నాయింద్రజిత్తు సింహనాదధ్వని విని భయంబున దిక్కులు జూచుచుం బాఱిపోయిరి. ౧

అంత వాయుకుమారుండగు హనుమంతుఁడు అట్లు భయపడి దుఃఖంబు మొగంబునం దోఁప దీనులయి నొకరినొకరి సంబంధము లేక పాఱిపోవుచున్న యవ్వానవీరులం జూచి యిట్లనియె. ౨

వానరవీరులారా! ఇట్లు దుఃఖంబునొంది యుద్ధోత్సాహంబు వదలి పాఱిపోయెదరేల? మీశౌర్యమంతయు నిప్పు డెచటికిఁ బోయినది? 3

నేను యుద్ధంబున ముందు నడచెదను. నన్ను వెంబడించి రండు. ఇది వఱకుఁ బెక్కు యుద్ధంబుల జయంబు గొని పొగడ్తగన్న శూరులు యుద్ధంబు నుండి మరలుట యెంతమాత్రము యుక్తము గాదు. అని హనుమంతుఁడు వానరులకుఁ జెప్పెను. ౪

అవ్వానరులు వాయుకుమారుండగు హనుమంతుని వచనంబువిని సంతోషంబునొంది మేనం బులకలు వొడమఁ బర్వతశిఖరంబులను వృక్షంబులనుం జేకొని యుద్ధసన్నద్ధులయిరి. ౫

అంత నావానరవీరులు గర్జించుచు రాక్షసులమీఁదికిం బోయిరి. యుద్ధంబునందు హనుమంతు నందఱుఁ బరివేష్టించి వెంబడించి నడచిరి. ౬

ఆ హనుమంతుఁడు అన్నిప్రక్కలను అగ్నిజ్వాలలతో సమానులయిన యావానరవీరులచేఁ బరివృతుండై జ్వాలలతోఁగూడిన యగ్నిహోత్రునిభంగి శత్రుసైన్యంబులఁ దహించెను. ౭

ప్రలయకాలమునందుఁ బ్రపంచమునంతయుం నశింపఁజేయునట్టి యమునింబోలిన యమ్మహావానరవీరుఁడు హనుమంతుఁడు వానరసేనతోఁ గూడిన వాఁడై రాక్షసులతో మహాయుద్ధంబు గాంచెను. ౮

వానరవీరుండగు నాహనుమంతుఁడు ఒకవైపు దుఃఖంబుచేతను బరి

హనూమాన్ రావణిరథే పాతయ న్మహతీం శిలామ్. ౯
తామాపతన్తీం దృష్ట్వైవ రథ స్సారథినా తదా,
విధేయాశ్వసమాయుక్త స్సుదూర మపవాహితః. ౧౦

త మిన్ద్రజిత మప్రాప్య రథస్థం సహసారథిమ్,
వివేశ ధరణీం భిత్త్వా సా శిలా వ్యర్థ ముద్యతా. ౧౧

పాతితాయాం శిలాయాం తు రక్షసాం వ్యథితా చమూః,
నిపతన్త్యా చ శిలయా రాక్షసా మథితా భృశమ్. ౧౨

తమభ్యధావన్ శతశో నద న్తః కాననౌకసః,

తే ద్రుమాం శ్చ మహావీర్యా గిరిశృఙ్గాణి చోద్యతాః. ౧౩
క్షిప న్తీన్ద్రజిత స్సఙ్ఖ్యే వానరా భీమవిక్రమాః,
వృక్షశైలమహావర్షం విసృజ న్తః ప్లవఙ్గమాః. ౧౪
శత్రూణాం కదనం చక్రు ర్నేదుశ్చ వివిధై స్స్వనైః,
వానరై స్తై ర్మహావీర్యై ర్ఘోరరూపా నిశాచరాః. ౧౫
వీర్యాదభిహతా వృక్షై ర్వ్యవేష్టన్త రణాజిరే,

స్వసైన్య మభివీక్ష్యాథ వానరార్దిత మిన్ద్రజిత్. ౧౬
ప్రగృహీతాయుధః క్రుద్ధః పరానభిముఖో యయౌ,

స శరౌఘా నవసృజన్ స్వసైన్యేనాభిసంవృతః. ౧౭
జఘాన కపిశార్దూలాన్ సుబహూ న్దృష్టవిక్రమః,

తపించుచు నాయింద్రజిత్తురథంబుమీఁద మహాశిల నొక్కటిం బడవైచెను.

అప్పుడు సారథి భయంకరాకారంబుగా వచ్చుచున్న యమ్మహాశిలం జూడఁగానే సుశిక్షితములును స్వాధీనములయిన గుఱ్ఱములు పూన్చియుండుట వలన సారథ్యమును దక్షిణమే బహుదూరము తప్పఁదోలుకొని పోయెను. ౧౦

అమ్మహాశిల రథిస్థితుండగు నింద్రజిత్తుపైఁగాని యతని సారథిపైఁగాని బడకపోవుటవలన వ్యర్థముగాఁ బ్రయోగింపఁబడినదై భూమిని భేదించి పాతాళంబు నొందెను. ౧౧

హనుమంతుఁడు శిలను బ్రయోగింపఁగానే రాక్షససేనయంతయుం భయంబు నొందినది. అంత నాశిలపడుటచే రాక్షసులు పెక్కండ్రు మిక్కిలియు వలిగి మృతులైరి. ౧౨

వానరవీరులు గర్జనంబు సేయుచు గుంపులు గుంపులుగా నాయింద్రజిత్తుమీఁదికిఁ దఱిమిరి.

మహాబలశాలులును మహాపరాక్రమశాలులునగు నావానరులు యుద్ధంబున నింద్రజిత్తుపై వృక్షంబులను బర్వతశిఖరంబులను బ్రయోగించిరి. ౧౩

అప్పుడు వానరవీరులు వృక్షంబులను బర్వతంబులను శత్రువులపై వర్షించుచు నానావిధస్వరంబుగా గర్జించుచు రాక్షసులతో యుద్ధము చేసిరి.

మహాపరాక్రమశాలులయిన యావానరవీరులు తమబలంబు కొలంది వృక్షంబులచేఁ గొట్టుటవలన భయంకరాకారులగు రాక్షసులు యుద్ధభూమిం బడి దేహంబు తెలియక పొరలిరి. ౧౪

అంత నింద్రజిత్తు తన సైన్యమంతయు వానరులచేఁ బీడింపఁబడియుండుటం జూచి కుపితుండై ధనుర్ధరుండై వానరాభిముఖంబుగా నడచెను. ౧౫

ఇదివఱకుఁ పెక్కుమార్లు శత్రువులకుఁ దనపరాక్రమంబుఁ జూపి రొమాడించియున్న యయ్యింద్రజిత్తు తనసైన్యంబులు తోడ్పడ బాణసమూహంబులు పరఁగించి వానరోత్తములం బెక్కండ్రను వధించెను. ౧౬

శూలై రశనిభిః ఖడ్గైః పట్టిసైః కూటముద్గరైః. ౧౮
తే చాప్యనుచరా స్తస్య వానరా న్జఘ్ను రోజసా,

సస్కన్ధవిటపైః సాలైః శ్శిలాభి శ్చ మహాబలః. ౧౯
హనుమా న్కదనం చక్రే రక్షసాం భీమకర్మణామ్,

స నివార్య పరానీక మబ్రవీత్తా న్వనౌకసః. ౨౦
హనుమాన్ సన్నివర్తధ్వం న న స్సాధ్య మిదం బలమ్,

త్యక్త్వా ప్రాణా న్విచేష్టన్తో రామప్రియచికీర్షవః. ౨౧
యన్నిమిత్తం హి యుధ్యామో హతా సా జనకాత్మజా,

ఇమ మర్థం హి విజ్ఞాప్య రామం సుగ్రీవ మేవచ. ౨౨
తౌ యత్ప్రతివిధాస్యేతే తత్కరిష్యామహే వయమ్,

ఇత్యుక్త్వా వానరశ్రేష్ఠో వారయన్ సర్వవానరాన్. ౨౩
శనై శ్శనై రసంత్రస్త స్సబల స్సన్యవర్తత,

తతః ప్రేక్ష్య హనూమన్తం వ్రజన్తం యత్ర రాఘవః. ౨౪
స హోతుకామో దుష్టాత్మా గతశ్చైత్యనికుమ్భిళామ్,

నికుమ్భిళామధిష్ఠాయ పావకం జుహువేన్ద్రజిత్. ౨౫

అయింద్రజిత్తు వెంబడియున్న రాక్షసులును వానరవీరులను శూలంబుల చేతను పిడుగులచేతను (పిడుగులు పడునప్పుడు ఉపాయముచేత వానిశాగ్ని సంగ్రహించి యాయుధములు గావించుకొందురు) ఖడ్గంబులచేతను పట్టిసంబులను బాణంబులను ముద్గరంబులను దనుబలంబు కొలఁదిఁ బ్రహరించి వధించిరి. ౧౮

మహాబలుఁడగు హనుమంతుఁడు బోదెలతోను శాఖలతోనుం గూడిన వృక్షంబులను గొప్పశిలలను ఆయుధంబులుగాఁ గొని భయంకరపరాక్రములగు రాక్షసులతో యుద్ధము గావించెను. ౧౯

ఆహనుమంతుఁడు అట్లు పరాక్రమంబున శత్రుసైన్యములం బాఱఁదోలి యావానరులంజూచి యిట్లనియె. మనకు సాధింపఁదగినది యీసైన్యము కాదు. సీతను సాధించుటకు వచ్చినామే కాని యీరాక్షసులను సాధించుటకు రాలేదు. కావున మరలిరండు. ౨౦

మనకుందఱము రాముని ప్రియంబు సేయఁగోరి యెవ్వతెనిమిత్తమయి ప్రాణంబులపై నాశలేక నేలం బడినను నిలువక యుద్ధము సేయుచున్నామో అట్టి జనకమహారాజు కూఁతురు సీతాదేవి వధింపఁబడినది. ౨౧

ఇంద్రజిత్తు సీతను వధించినాఁడను నీవృత్తాంతమును రామునకును సుగ్రీవునకును దెలిపి వారలు దీనికేమి బదులు గావింతురో మనమును దానినే చేయుదము. ఇదే యుక్తమని హనుమంతుఁడు వానరులకుఁ జెప్పెను. ౨౨

వానరోత్తముఁడగు హనుమంతుఁడు ఇవ్విధంబున వానరులకుఁ జెప్పి సమస్తవానరులను యుద్ధంబునుండి మరలించి శత్రువున కెంతమాత్రము భయపడనివాఁడు కావున మెల్ల మెల్లగా సేనాసమేతుండై మరలి పోయెను. ౨౩

అంత దురాత్ముఁడగు నాయింద్రజిత్తు హనుమంతుఁడు రాముని యొద్దకుఁ బోవుటఁజూచి తానును హోమము గావించుటకై చైత్యమునందున్న నికుంభిలయను దేవతాయతనమునకుఁ బోయెను. ౨౪

ఇంద్రజిత్తు నికుంభిలం జేరి అగ్నిహోత్రమునందు యథావిధి హోమము గావించెను. ౨౫

యజ్ఞభూమ్యాం తు విధివ త్పావక స్తేన రక్షసా,
హూయమానః ప్రజజ్వాల మాంసశోణితభు క్తదా. ౨౮

సోఽర్చిర్గణస్సద్ధో దదృశే హోమశోణితతర్పితః,
సన్ధ్యాగత ఇవాదిత్య స్సుతీవ్రోఽగ్ని స్సముత్థితః. ౨౯

అథేన్ద్రజి ద్రాక్షసభూతయే తు
జుహావ హవ్యం విధినా విధానవిత్,
దృష్ట్వా వ్యతిష్ఠన్త చ రాక్షసా స్తే
మహాసమూహేషు నయానయజ్ఞాః. ౩౦

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే ద్వ్యశీతితమస్సర్గః.

## త్ర్య శీ తి త మ స్స ర్గః.

రాఘవశ్చాపి విపులం తం రాక్షసవనౌకసామ్,
శ్రుత్వా సఙ్గ్రామనిర్ఘోషం జామ్బవన్త మువాచ హ. ౧

సౌమ్య నూనం హనుమతా క్రియతే కర్మ దుష్కరమ్,
శ్రూయతే హి యథా భీమ స్సుమహా నాయుధస్వనః. ౨

తద్గచ్ఛ కురు సాహాయ్యం స్వబలేనాభిసంవృతః,
క్షిప్ర మృక్షపతే! తస్య కపిశ్రేష్ఠస్య యుధ్యతః. ౩

అప్పుడు యాగభూమియందు ఇంద్రజిత్తు అగ్నిహోత్రంబున యథావిధి మాంసమును నెత్తురును హోమము సేయుటయు నయ్యగ్నిహోత్రము, హుతములయిన మాంసశోణితంబుల నారగించి యెంతయుం బ్రజ్వలించెను. ౧౮

శోణితహోమముచేఁ దర్పితమయిన యయ్యగ్నిహోత్రము మిక్కిలియుఁ దీప్తమయి ప్రజ్వలించుచు జ్వాలలచేఁ గప్పఁబడి యుండుటవలన సంధ్యాకాలమునందలి సూర్యునిభంగిఁ జూడనొప్పెను. ౧౯

అంత శాస్త్రోక్తవిధిం జక్కఁగాఁ దెలిసిన యయ్యింద్రజిత్తు రాక్షసులకు జయంబు గలుగుటకై యథావిధిగా హవిస్సు నగ్నిహోత్రంబున హోమముం జేసెను. అప్పుడు అచ్చటనున్న రాక్షససమూహములయందు విధినిషేధములం జక్కఁగా నెఱింగిన పండితులయిన రాక్షసులు ఆహోమకర్మమున విధిలోపముం గలుగకుండునట్లు చూచుచుండిరి. ౨౦

ఇది యెనుబదిరెండవసర్గము.

## ఎనుబదిమూఁడవసర్గము.

రాముఁడు రాక్షసులును వానరులును గావించు యుద్ధమునం బుట్టిన మహాధ్వనినివిని యప్పుడు సమీపంబునం గాచియున్న జాంబవంతుంజూచి యిట్లనియె. ౧

సౌమ్యుఁడవగు జాంబవంతుఁడా! హనుమంతుఁ డిప్పుడు అసాధ్యమయిన యుద్ధము చేయుచున్నట్లున్నది. ఇదినిశ్చయము ఎందువలన ననఁగా అటువైపుననుండి భయంకరమయిన యాయుద్ధములమహాధ్వని చెవులు బ్రద్దలగునట్లు వినవచ్చుచున్నది. ౨

జాంబవంతుఁడా! కావున నీవు సేనాసమేతుండవై యచటికి శీఘ్రంబుగా నరిగి యొక్కఁడె యుద్ధము సేయుచున్న వానరోత్తమునికి హనుమంతునకు సాహాయ్యము గావింపుము. అని రాముఁడు జాంబవంతునితోఁ జెప్పెను. ౩

ఋక్షరాజ స్తథో క్తస్తు స్వేనానీకేన సంవృతః,
ఆగచ్ఛత్పశ్చిమద్వారం హనూమాన్యత్ర వానరః. ४

అథాయా న్తం హనూమన్తం దదర్శర్క్షపతిః పథి,
వానరైః కృతసఙ్గ్రామై శ్శ్వసద్భిరభిసంవృతమ్. ౫

దృష్ట్వా పథి హనూమాం శ్చ తదృక్షబల ముద్యతమ్,
నీలమేఘనిభం భీమం సన్నివార్య న్యవ ర్తత. ౬

స తేన హరిసై న్యేన సన్నికర్షం మహాయశాః,
శీఘ్రమాగమ్య రామాయ దుఃఖితో వాక్య మబ్రవీత్. ౭

సమరే యుధ్యమానానా మస్మాకం ప్రేక్షతాం పురః,
జఘాన రుదతీం సీతా మిన్ద్రజి ద్రావణాత్మజః. ౮

ఉద్భ్రాన్తచి త్త స్తాం దృష్ట్వా విషణ్ణోఽహ మరిన్దమ!,
తదహం భవతో వృ త్తం విజ్ఞాపయితు మాగతః. ౯

తస్య తద్వచనం శ్రుత్వా రాఘవ శ్శోకమూర్ఛితః,
నిపపాత తదా భూమౌ ఛిన్నమూల ఇవ ద్రుమః. ౧౦

తం భూమౌ దేవసంకాశం పతితం ప్రేక్ష్య రాఘవమ్,
అభిపేతు స్సముత్పత్య సర్వతః కపిస త్తమాః. ౧౧

అసిఞ్చన్ సలిలై శ్చైనం పద్మోత్పలసుగన్ధిభిః,
ప్రదహ న్త మనాసాద్యం సహసాఽగ్నిమివోచ్ఛిఖమ్. ౧౨

భల్లూకరాజు జాంబవంతుఁడు రాము నాజ్ఞను విని తన సైన్యముతోఁ గూడ హనుమంతుఁడున్న పశ్చిమద్వారంబునకుఁ బోయెను. ౪

అంత యుద్ధంబు చేసి యలసి నిట్టూర్పులు పుచ్చుచున్న వానరులచేఁ బరివేష్టితుండై వచ్చుచున్న హనుమంతుని జాంబవంతుఁడు మార్గంబునఁ జూచెను. ౫

హనుమంతుఁడును నీలమేఘసమానంబును భయంకరాకారంబునగు భల్లూకసైన్యము సన్నద్ధమయి వచ్చుటను మార్గంబునం జూచి యాభల్లూకసైన్యంబునకును వెనుకకు రావలసినదని చెప్పి తాను రామునొద్దకు శీఘ్రంబుగా బోయెను. ౬

మహాయశుండగు హనుమంతుఁడు వానరసేనాసమేతుండై శీఘ్రంబున రాము సమీపంబునకుఁ బోయి రామునిం జూచి దుఃఖితుఁడై యీ మాటం జెప్పెను. ౭

యుద్ధంబున మేము పోరుచు ముందటనుండి చూచుచుండఁగనే రావణకుమారుండగు నింద్రజిత్తు రోదనంబు సేయుచున్న సీతాదేవిని జంపివేసెను. ౮

శత్రువుల నణఁగఁ ద్రొక్కం జాలినట్టి రాముఁడా! నే నట్లు సీతాదేవి వధింపఁబడుటం జూచి భ్రమమునొంది మిక్కిలియుం దుఃఖితుఁడనైతిని గావున నాకేమి గావించుటకు దోఁచకున్నది ఆ వృత్తాంతమును నీకుఁ జెప్పుటకై యిచటికి వచ్చినాను. అని హనుమంతుఁడు రామునితోఁ జెప్పెను. ౯

రాముఁడు హనుమంతుని మాటను విని పరమదుఃఖితుఁడై వేరు తెగ నఱకఁగా వృక్షంబు నేలంగూలునట్లు తటాలున భూమిపయిం బడెను. ౧౦

అట్లు దేవసమానుండగు రాముఁడు నేలఁబడుటవిలోకించి వానరోత్తము లందఱు అన్యోన్యస్థలంబులనుండి యచటికిఁ బరుగెత్తి వచ్చిరి. ౧౧

అవ్వానరవీరులు మండుచున్న యగ్నిహోత్రము వలెఁ భూమింపడిన వాఁడయ్యును దేజస్సుచే నెవ్వరికేని సమీపించుట కలవిగాక యితరుల దహిం

తం లక్ష్మణోఽథ బాహుభ్యాం పరిష్వజ్య సుదుఃఖితః,
ఉవాచ రామ మస్వస్థం వాక్యం హేత్వర్థసంహితమ్. ౧౩

శుభే వర్త్మని తిష్ఠన్తం త్వా మార్య విజితేన్ద్రియమ్,
అనర్థేభ్యో న శక్నోతి త్రాతుం ధర్మో నిరర్థకః. ౧౪

భూతానాం స్థావరాణాం చ జఙ్గమానాం చ దర్శనమ్,
యథాఽస్తి న తథా ధర్మ స్తేన నాస్తీతి మే మతిః. ౧౫

యథైవ స్థావరం వ్యక్తం జఙ్గమం చ తథావిధమ్,
నాయ మర్థ స్తథా యుక్త స్త్వద్విధో న విపద్యతే. ౧౬

చున్నట్టున్న యారాముని మూర్ఛదేఱుటకై కమలంబులను గలువగలు గలిసి యుండుటం జేసి సువాసనతో నొప్పుచున్న జలంబులు చల్లి తడిపిరి. ౧౨

అంత లక్ష్మణుండు అట్లు మిక్కిలియుం శోకాక్రాంతుండై అస్వస్థుండై పడియున్న రాముని బాహువులం గ్రుచ్చి కవుంగిలించుకొనికొని, అధార్మికుండగు రావణునకు సుఖమే గలుగుటయుం ధర్మిష్ఠుండగు రామునకు వ్యసనంబులు గలుగుచునే యుండుటయుం అంతం బోక రామునకు సీతావధరూపం బయిన మహానర్థంబును సంభవించుటయు ఈ కారణంబులవలన కోపదుఃఖపరవశుండై ధర్మము అప్రామాణికము హేతుయుక్తముగు కేవలబలమె యాశ్రయణీయ మని తలంచి యుక్తియుక్తమయిన యీమాటం జెప్పెను. ౧౩

పూజ్యుండవగు రాముండా! నీవు పితృవచనపరిపాలనానిరూపమయిన ధర్మమార్గమునందు దృఢంబుగా నిలిచి హస్తగతమయిన రాజ్యమును బోంగొట్టిన కైకేయీ దశరథులయందును ఎంతమాత్రమును మనస్సునం గలుష బుద్ధి లేకుండుటవలన జితేంద్రియుండవై యున్నను నిన్ను ధర్మము నీవ్యసనంబులు నశింపంజేసి రక్షింపంజాలకున్నది. కావున ఈ ధర్మము నిష్ప్రయోజనము. అభ్యుదయఫలమువలనం గదా ధర్మమున్నదని యనుమానింపవలెను. అట్టి ఫలము దానివలనం గలుగకయే యుండుటవలన ప్రమాణము లేకుండుటం జేసి ధర్మము శశవిషాణాదులుంబోలె నసత్యము. అట్లు అసత్యమయినదని న్నెట్లు రక్షించును? ౧౪

ధర్మముగాని యధర్మముగాని కుందేటి కొమ్ము వంటిదని చెప్పితాను గదా! ఇంక ధర్మముగాని యధర్మముగాని కలదని చెప్పువారలు అవియున్నవనుటకుం బ్రమాణమేమి చెప్పంగలరు? ప్రత్యక్షమా? అనుమానమా? ప్రత్యక్షమేమో కాదు. చరాచరరూపములయిన భూతములు ఎట్లు ప్రత్యక్షముగా మన కగపడుచున్నవో అట్లు ధర్మాధర్మములు ప్రత్యక్షముగా నగపడుట లేదు. కావున ధర్మముగాని యధర్మముగాని లేనేలేదని నా నిశ్చయము. ౧౫

స్థావరపదార్థము ఎట్లు ప్రత్యక్షముగా మనకు అగపడుచున్నదో అట్లె జంగమపదార్థముగూడ ప్రత్యక్షముగా నగపడుచున్నది. కావున ఉన్నదని

యద్యధర్మో భవేద్భూతో రావణో నరకం వ్రజేత్,
భవాంశ్చ ధర్మయుక్తో వై నైవం వ్యసన మాప్నుయాత్. ౧౫

తస్య చ వ్యసనాభావా ద్వ్యసనం చ గతే త్వయి,
ధర్మో భవత్యధర్మశ్చ పరస్పరవిరోధినౌ. ౧౬

చెప్పఁబడుచున్నవి. ఈ ధర్మము అట్లు ప్రత్యక్షము కానందున ఉన్నదని చెప్పఁదగినది కాదు. అట్లు ధర్మమున్నట్లయితే నీయట్టి ధర్మాత్మునకు ఆపద గలుకయే యుండవలెను. అట్లు గాకపోవుటవలన లేదనియె చెప్పవలెను. ౧౬

ఇంక అనుమానమువలన సుధర్మముగాని యధర్మముగాని సిద్ధింపఁజాలదని చెప్పఁబడుచున్నది. అధర్మముండుట సత్యమయితే రావణుఁడు నరకము నొందవలెను. ధర్మముండుట సత్యమయితే ధార్మికుఁడవగు నీ ప్రకారమున వ్యసనముఁ బొందకుండవలెను; అనిష్టఫలము గల్గించుటవలనఁ బరస్త్రీహరణాదు లధర్మమనియు ఇష్టఫలము గల్గించుటవలనఁ బితృవాక్యపరిపాలనాదులు ఇష్టఫలము గల్గింపలేదు; సాధ్యమయిన ధర్మముగల నీయందు హేతువయిన అనిష్టఫలమును లేకుండుటంజేసి హేతువు స్వరూపా సిద్ధమగుటవలన అనుమానమునకుఁ బ్రసక్తియే లేదు కాఁబట్టి అనుమానమువలన నైనను ధర్మాధర్మములు సిద్ధించుటలేదు. ౧౭

అధర్మయుక్తుండగు నారావణునకు ఎంతమాత్రము వ్యసనములేక సుఖముగానే యుండుటవలనను ధర్మయుక్తుండవగు నీకు వ్యసనమే గలుగుట వలనను ధర్మముగాని యధర్మముగాని అయ్యది యేయే స్వభావము గలదిగా శాస్త్రమునందుఁ జెప్పఁబడియున్నదో యాయాస్వభావమునకు విరుద్ధముగా నున్నది. ధర్మము అభ్యుదయఫల మనియు నధర్మము అనిష్టఫలమనియుఁ గదా శాస్త్రమునందుఁ జెప్పఁబడినది. ధర్మముగల నీకు అభ్యుదయము గలుగక యనిష్టమే గలుగుచున్నది గావున ధర్మము శాస్త్రోక్తలక్షణమునకు విరుద్ధమగుచున్నది. అధర్మముగల రావణునకు అనిష్టమేమియుఁ గలుగక యభ్యుదయమె గల్గుటంజేసి అధర్మము శాస్త్రోక్తలక్షణమునకు విరుద్ధమగుచున్నది. ఇట్లు నియతఫలములు గాక లక్షణవిహీనము లగుటవలనను యథోక్తలక్షణములయిన ధర్మాధర్మము లున్నవనుట కెంతమాత్రము కవకాశము లేదు. ౧౮

ధర్మేణోపలభే ద్ధర్మ మధర్మం చాప్యధర్మతః,

యద్యధర్మేణ యుజ్యేయు ర్యేష్వధర్మః ప్రతిష్ఠితః. ౧౯
యది ధర్మేణ యుజ్యేరన్నాధర్మరుచయో జనాః,
ధర్మేణ చరతాం ధర్మ స్తథా చైషాం ఫలం భవేత్. ౨౦

యస్మా దర్థా వివర్ధన్తే యేష్వధర్మః ప్రతిష్ఠితః
క్లిశ్యన్తే ధర్మశీలా శ్చ తస్మాదేతౌ నిరర్థకౌ. ౨౧

వధ్యన్తే పాపకర్మాణో య ద్యధర్మేణ రాఘవ!,
వధకర్మహతో ధర్మ స్స హతః కం వధిష్యతి. ౨౨

అథవా విహితేనాయం హన్యతే హన్తి వా పరమ్,
విధి రాలిప్యతే తేన న స పాపేన కర్మణా. ౨3

ధర్మాధర్మములు వాస్తవములై లక్షణ ప్రమాణములచే సిద్ధములే యయినట్లయితే ధర్మము గలవానికి ధర్మఫలమయిన సుఖమే గలుగవలెను. అధర్మము గలవానికి అధర్మఫలమయిన వ్యసనమే కలుగవలెను. ౧౮

ఎవ్వరు అధర్మము ననుష్ఠింతురో వారికిఁ దప్పక యధర్మఫలమయిన వ్యసనము గల్గుటయు అట్లు ధర్మము నెవరనుష్ఠింతురో వారికి ధర్మఫలమయిన సుఖమె తప్పక గలుటయు ఈ ప్రకారముగా నుండునట్లయితేనే అప్పుడు ధర్మము ననుష్ఠించుటవలన సుఖము గలుగు ననియు అధర్మానుష్ఠానమువలన వ్యసనము గల్గుననియుఁ జెప్పవచ్చును గాని యిటుగానిచో నెంతమాత్రము వీలు లేదు. ౧౯, ౨౦

ఇప్పుడు అధర్మమునే యాచరించు వారలకు ఇష్టసిద్ధి యగుటవలనను ధర్మము నాచరించువారికి వ్యసనములు గలుగుటవలనను ఈధర్మాధర్మములు వాస్తవములు కావు. ఇష్టానిష్టరూపములయిన కార్యముల వలనఁ గదా కారణములయిన ధర్మాధర్మముల ననుమానింపవలెను. అట్టి కార్యములు నియతములు కానందువలన వ్యాప్తి సిద్ధింపదు. కాబట్టి యనుమానమున కవకాశము లేదు. ౨౧

ఇంక ధర్మాధర్మములు కర్మస్వరూపము? లేక కర్మమువలనఁ గలిగిన యతిశయరూపము?. కర్మస్వరూపములు కావు. ఎట్లనఁగా ధర్మాధర్మములు కర్మరూపము లయినచో బ్రాహ్మణవధము మొదలయి పాపకర్మములు చేసినవారలు ఆప్రాణవధాది పాపకర్మ రూపమయిన యధర్మముచేతఁ గదా బాధనొందవలెను. కర్మసామాన్యము క్షణిక మగుటవలన వధకర్మము సమాప్తముకాఁగానే నష్టమగుచున్నది కావున తత్కర్మరూపమయిన యధర్మమును నష్టము కావలెను గదా! అట్లు నష్టమయిన యధర్మము ఎవ్వానినెట్లు బాధింపఁగలదు? కివ్విప్రయోజనమే యగును. ౨౨

ఇఁక అదృష్టరూపమయిన కర్మమువలనఁ గలిగిన యతిశయము ధర్మాధర్మములందురేని అదృష్టముచేతఁ గదా కర్మ చేసినవాఁడు బాధింపఁబడ

అదృష్టప్రతికారేణ త్వవ్యక్తేనాసతా సతా,
కథం శక్యం పరం ప్రాప్తుం ధర్మేణారివికర్శన!. ౨౪

యది సత్స్యాత్సతాం ముఖ్య! నాసత్స్యాత్తవ కించన,
త్వయాం యదీదృశం ప్రాప్తం తస్మాత్సన్నోపపద్యతే. ౨౫

అథవా దుర్బలః క్లీబో బలం ధర్మోఽనువర్తతే,
దుర్బలో హృతమర్యాదో న సేవ్య ఇతి మే మతిః. ౨౬

ఫలయును. మొదట పథరూపమయిన కర్మము చేయుటకు ఈ యదృష్ట రూప మయినవిధియే ప్రేరకమని చెప్పవలెను. ధర్మాధర్మములలో నేది యెవ్వని యందు అధికమగుచున్నదో అదియే అతని ప్రవృత్త్యంతరమునకును గారణ మగునని సమ్మతముగదా! అట్లు ప్రవృత్త్యంతరమునకుఁ గారణములగు ధర్మాధర్మములు అదృష్టాతిశయరూపములుగానే కారణములు కావలెను. అప్పుడు అదృష్టరూపమయిన విధియె కారణమగు పక్షమున ఆపాపకర్మఫలమును గూడ ఆ విధియె పొందవలెను. అట్లు పుణ్యకర్మఫలమును విధియె పొందవలెను. ప్రయోజ్యుఁడయిన కర్తకు ఎంతమాత్రము నేకర్మము ఫలముతోను సంబంధ ముండఁ గూడదు. రాజుచేతఁ జేయింపబడిన కార్యము యొక్క ఫలము రాజునకే గలుగుంగాని భటునకెట్లు గలుగును? ౬౩

శత్రువులఁ గృశింపఁ జేయునట్టివాఁడా! మఱియు కర్మజన్యాదృష్ట రూపములు ధర్మాధర్మములు ఫలప్రదములను పక్షమునందు ఆ ధర్మము ఫలము నొందుట స్వతంత్రముగానా? ఇతరాశ్రయమువలననా? స్వతంత్రముగాఁగాదు ఆ కర్మజన్యమయిన యదృష్టముయొక్క ఫలమేమో యెవ్వరికి సరిపడదు. ఆ యదృష్టము తానును బ్రత్యక్షమయినది కాదు. కేవలము ఆ సద్భూతమని చెప్పఁదగినదిగా నున్నది. అట్టి యదృష్టరూపమయిన ధర్మము స్వతంత్రముగా నెట్లు శ్రేయస్సు నొసంగఁగలదు? ౬౪

సత్పురుషులలో నుత్తముఁడ వగు రాముఁడా! ధర్మాధర్మములు వాస్తవముగా నుండునవియయి ఫలము గలిగించునవైనను నీవు సర్వధార్మికులలోను నుత్తముఁడవై యున్నావు కావున నీకు నే విధమయిన బాధయుం గొంచె మేనియుఁ గలుగదు. అయితే ఇంతటి పరమధార్మికుఁడవు నీవుకూడ నిట్టి మహావ్యసనము నొందినావు కావున ధర్మాధర్మములు వాస్తవము లని చెప్పుట యెంతమాత్రము యుక్తముగా నుండలేదు. ౬౫

ధర్మము ఇతరము నాశ్రయించి యనఁగాఁ బౌరుషము నాశ్రయించియే ఫలము నొసంగుచున్నదను పక్షమునందు ధర్మము తాను స్వతఃఫలము,

బలస్య యది చే ద్ధర్మో గుణభూతః పరాక్రమే,
ధర్మ ముత్సృజ్య వర్తస్వ యథా ధర్మే తథా బలే. ౨౭

అథ చే త్సత్యవచనం ధర్మః కిల పరంతప!,
అనృత స్త్వయ్యకరుణః కిం న బద్ధ స్త్వయా పితా. ౨౮

యది ధర్మో భవే ద్భూతో హ్యధర్మో వా పరన్తప!,
న స్మ హత్వా మునిం వజ్రీ కుర్యా దిజ్యాం శతక్రతుః. ౨౯

నొసంగఁజాలక దుర్బలమయి యసమర్థమయి పౌరుషము నాశ్రయించుచున్న దనిగదా చెప్పవలెను. అట్టి దుర్బలమయినదియు యథోక్తఫలము నిచ్చునను నియమము లేనిదియు నగు నీధర్మము నెంతమాత్రము సేవింపరాదు. అట్టిధర్మమునకుఁ గూడ ఆశ్రయణీయమయిన పౌరుషమునే యాశ్రయింపవలయు నని నానిశ్చయము.

అట్లు ధర్మము స్వతఃఫలము గలిగించుటకు అసమర్థమయి పౌరుషము నాశ్రయించుటవలన కార్యసాధనమునందు పౌరుషమే ప్రధానమనియు ధర్మము ఆపౌరుషమునకు అంగమే కాని స్వతంత్రము కాదనియు నేర్పడు చున్నది కదా. నీవిపుడు ప్రధానముగా ధర్మమునే యాశ్రయించి యుండు విధంబున ఇఁక దుర్బలమును అస్వతంత్రమునగు నీధర్మమును బరిత్యజించి పౌరుషమునే ప్రధానముగా నవలంబింపుము. ౨౭

శత్రువులఁ దపింపఁజేయునట్టి రాముఁడా! ధర్మమె దుర్బలము. నిష్ఫలము అవాస్తవము ఆశ్రయింపఁదగినది కాదని నిరూపింపఁబడినదికదా! ఇంక నీవు అధర్మమునందును సత్యవచనమును ముఖ్యధర్మముగా భావించియున్నావు గదా! అట్లయినయెడల మొదట సమస్త సామంతప్రకృతి సమక్షమున నీకుఁ బట్టంబుఁగట్టెదనని ప్రతిజ్ఞచేసి పిమ్మట ఆమాటఁ దప్పిపోవుటవలన నసత్యమాడిన వాఁడైనవాఁడును నిన్ను జ్యేష్ఠపుత్రుని వనంబునకుఁ దఱుముటచే నీయందు నిర్దయుండును నగు నీతండ్రిని యప్పుడు సత్యము దప్పిన దోషంబునకు ఏలబంధించి వేయవైతివి? ౨౮

ధర్మముగాని యధర్మముగాని "దీనినే చేయవలెను. దీనిఁ జేయఁగూడదు" అని నిశ్చితమయినయెడ వజ్రాయుధధరుండును నూఱశ్వమేధములు చేసినవాఁడునగు దేవేంద్రుఁడుగూడ ఋషియయిన విశ్వరూపునిం జంపి యాగముచేయఁడుగదా! ధర్మమే చేయవలెను. అధర్మము పరిత్యాజ్యమని నిశ్చితమయినయెడ విశ్వరూపుని వధింపక యజ్ఞమునుమాత్రమే యింద్రుఁడు

అధర్మసంశ్రితో ధర్మో వినాశయతి రాఘవ!,
సర్వమేత ద్యథా కామం కాకుత్స్థ! కురుతే నరః. 30

మమ చేదం మతం తాత! ధర్మోఽయ మితి రాఘవ!,
ధర్మమూలం త్వయా ఛిన్నం రాజ్య ముత్సృజతా తదా. 3౧

అర్థేభ్యో హి వివృద్ధేభ్య స్సంవృత్తేభ్య స్తత స్తతః,
క్రియా స్సర్వాః ప్రవర్తన్తే పర్వతేభ్య ఇవాపగాః. 3౨

అర్థేన హి వియుక్తస్య పురుషస్యాల్పతేజసః,
వ్యుచ్ఛిద్యన్తే క్రియా స్సర్వా గ్రీష్మే కుసరితో యథా. 33

చేసియుండును. అధర్మమునే యనుష్ఠింపవలెను ధర్మమునే విడువవలెనని నిశ్చితమయినయెడ యజ్ఞముసేయక విశ్వరూపవధము మాత్రమె సేయును. రెండును దేవేంద్రుఁ డనుష్ఠించుటవలన ధర్మాధర్మములను రెంటినిఁగూడ అవస్థాకాలముల ననుసరించి యథేష్టముగా ననుష్ఠించుట యుక్తమనియు వానికి అనుష్ఠేయపరిత్యాజ్యత్వ నియమము ఎంతమాత్రమును లేదనియుఁ దెలియ వచ్చుచున్నది. అందఱును ఈలాగునం గాకున్నను క్షత్రియధర్మనిష్ఠుండగు నింద్రుఁ డట్లనుష్ఠించుటఁ జేసి క్షత్రియులకిదియె యనువర్తనీయము. ౨౯

రాముఁడా! నియమంబున యథోక్తముగా వేఱువేఱ అధర్మముఁ బరిత్యజించి ధర్మమునే యనుష్ఠించినయెడ ధర్మాధర్మములు రెండును గర్తకు నాశము కలిగించునవిగానే యున్నవి. గావున మనుష్యుఁడు అట్టినియమంబు వదలి ధర్మాధర్మంబుల రెంటిని గూడ కాలానుగుణముగా యథేష్టముగా నాచరింపవలెను. ౩౦

రాముఁడా! ఇట్లు ఎప్పుడును ధర్మమే యనుష్ఠింపవలెనను పిచ్చినియమంబువదలి ధర్మాధర్మములను రెంటినిగాలానుగుణముగా నొకకాలమునకు ఏది యుక్తమోదాని ననుష్ఠించుటయె ధర్మము. అనఁగా మేలుగలిగించునదియని నా యభిప్రాయము. అప్పుడు నీవు రాజ్యమును వదలుటచేత నేను చెప్పిన యీధర్మవృక్షమున కంతయు మూలకారణమయిన యర్థమును నశింపఁ జేసికొంటివి కావున నీవు శోచనీయుండవైతివి. ఇఁక నీకెట్లు ధర్మఫలమయిన సుఖము కల్గును? ౩౧

నదులు పర్వతంబులనుండి జన్మించుచున్నవిగాని ఇతరమునుండి జన్మింపవు గదా! అప్రకారముననే ధర్మమునకుఁ గారణములగు యజ్ఞాది సమస్త కర్మములు ప్రజలవలన షడ్భాగరూపమయిన పన్ను దీసికొంట మొదలయిన యుపాయములవలన సంప్రాప్తమయి క్రమముగా వృద్ధిఁబొందిన ధనమువలననే సాధ్యములగుచున్నవి గాని ధనములేనియెడ ఏకర్మమును ఎంతమాత్రమును ననుష్ఠింపశక్యముగాదు. ౩౨

వేసవికాలమునందు చిన్ననదులు నీళ్లులేక యెండిపోవునట్లు ధనహీనుఁడై యందువలన నిస్తేజస్కుఁడై యుండువాని కర్మములన్నియుం విచ్ఛిన్నము లగును. ౩౩

సోఽయ మర్థం పరిత్యజ్య సుఖకామ స్సుఖైధితః,
పాప మారభతే కర్తుం తతో దోషః ప్రవర్తతే. ౩౪

యస్యార్థా స్తస్య మిత్రాణి యస్యార్థా స్తస్య బాన్ధవాః,
యస్యార్థా స్స పుమా ల్లోకే యస్యార్థా స్స చ పణ్డితః. ౩౫

యస్యార్థా స్సచ విక్రాన్తో యస్యార్థా స్సచ బుద్ధిమాన్,
యస్యార్థా స్స మహాభాగో యస్యార్థా స్స మహాగుణః. ౩౬

అర్థ స్యైతే పరిత్యాగే దోషాః ప్రవ్యాహృతా మయా,
రాజ్య ముత్సృజతా వీర! యేన బుద్ధి స్త్వయా కృతా. ౩౭

యస్యార్థా ధర్మకామార్థా స్తస్య సర్వం ప్రదక్షిణమ్,
అధనేనార్థకామేన నార్థ శ్శక్యో విచిన్వతా. ౩౮

ధనమును వదలుటవలన ధర్మము లేకపోవుటమాత్రమే కాదు. అధర్మదోషంబునుంగలుగును. ఎట్లనఁగా ధనమునుబోఁగొట్టుకొన్నవాఁడు పూర్వము ధనమున్నపుడు సుఖముగా బ్రతికినవాఁడు కావున ధనమునశింపఁగానే కష్టముల సహింపజాలక సుఖముఁగోరి యాసుఖమునకు సాధనమయిన ధనమును సంపాదించుటకై దొంగతనము మొదలయిన పాపకర్మములఁ జేయనారంభించును. అందువలన అధర్మమునుం బొందును. ౩౪

లోకంబున ఎవనికి ధనంబులు గలవో అతనికే అందఱును స్నేహితులగుదురు. దరిద్రుని, అతని స్నేహితులుగూడ వదలుదురు. ఎవనికి ధనమున్నదో అతనికే యందఱును బంధువులు ధనహీనుని అతని బంధువులుగూడ గణింపరు. ఎవనికిధనంబులుగలవో అతఁడె పుంస్త్వముగలవాఁడు. ధనంబు లేనివారు స్త్రీప్రాయులె. ధనమెవ్వనికున్నదో అతఁడె పండితుఁడు. ధనహీనుఁడు పండితుఁడైనను అతని లోకులు మూర్ఖునిగాఁ దలంతురు. ౩౫

ఎవ్వఁడు ధనవంతుఁడో అతఁడె పరాక్రమవంతుఁడు ధనహీనుఁడు ఎంతపరాక్రమవంతుఁడైనను అతనిలోకులు పిఱికివాఁ డందురు. ఎవనికి విత్తముకలదో అతఁడే బుద్ధిశాలి. దరిద్రుఁడు ఎంతబుద్ధిమంతుఁడైనను అతని లోకులు బుద్ధిహీనుం డందురు. ఎవ్వఁడు ధనముగలవాఁడో అతఁడె మంచి యదృష్టముగలవాఁడు. దరిద్రునిదురదృష్టవంతుఁడందురు. ధనముగలవాఁడే గొప్పగుణములు గలవాఁడును. దరిద్రుఁడు ఎంతగుణవంతుఁడైనను అతని గుణవిహీనుం డందురు. ౩౬

అర్థమును వదలి నట్లయితే ఈదోషంబులు గలుగునని నేనిప్పుడు చెప్పినానుగదా! వీరుఁడా! నీవప్పుడు రాజ్యమును వదలినావే! అట్టిబుద్ధి నీకెందువలనఁ గనిగినది? ౩౭

ధనముగలవానికి ధర్మకామము లన్నియు ననుకూలముగా సిద్ధించును ధనములేనివాఁడు శ్రేయస్సుపొందఁగోరి యెంతప్రయత్నముచేసినను అతనికి శ్రేయస్సును బొందుట యెంతమాత్రము సాధ్యముకాదు. ౩౮

హర్షః కామశ్చ దర్పశ్చ ధర్మః క్రోధ శ్శమో దమః,
అర్థాదేతాని సర్వాణి ప్రవర్తన్తే నరాధిప!. ౩౯
యేషాం నశ్యత్యయం లోక శ్చరతాం ధర్మచారిణామ్,
తేఽర్థాస్త్వయి న దృశ్యన్తే దుర్దినేషు యథా గ్రహాః. ౪౦

త్వయి ప్ర(వ్రా)వ్రజితే వీర! గురోశ్చ వచనే స్థితే,
రక్షసా పహృతా భార్యా ప్రాణైః ప్రియతరా తవ. ౪౧

తదద్య విపులం వీర! దుఃఖమిన్ద్రజితా కృతమ్,
కర్మణా వ్యపనేష్యామి తస్మా దుత్తిష్ఠ రాఘవ!. ౪౨

ఉత్తిష్ఠ నరశార్దూల! దీర్ఘబాహో! దృఢవ్రత!,
కిమాత్మానం మహాత్మాన మాత్మానం నావబుధ్యసే. ౪౩

అయ మనఘ! తవోదితః ప్రియార్థం
జనకసుతానిధనం నిరీక్ష్య రుష్టః,
సహయగజరథాం సరాక్షసేన్ద్రాం
భృశ మిషుభి ర్వినిపాతయామి లఙ్కామ్. ౪౪

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే- త్ర్యశీతితమస్సర్గః.

రాజా! సంతోషము, కామము, గర్వము, ధనము, కోపము, శాంతి దాంతి ఇవన్నియుం ధనమున్నవానియందే ప్రకాశము నొందును. ౩౯

ధనములున్నను వాని ననాదరణచేసి కేవలధర్మమును ఎంతయనుష్ఠించినను అట్టివారికి ఈలోకము నందలి సుఖ మెంతమాత్రము గలుగదు. అట్టి యైహికసుఖములకన్నిటికి సాధనములయిన ధనములు సూర్యాదిగ్రహములు దుర్దినమునందుఁగనఁబడనట్లు నీయందుఁగనఁబడకున్నవి. ఇఁక నీకెట్లు సుఖము కలుగును? ౪౦

వీరుఁడా! నీవుతండ్రిమాటను శిరసావహించి యూరువదలి వనవాసంబు సేయుచు నిట్లు ధర్మనిష్ఠుఁడవై యున్నను అర్థము ననాదరణచేసి వదలుటవలన నీకుఁ బ్రాణంబులకన్న నధికముగాఁ బ్రీతిపాత్ర మయిన నీభార్యను రాక్షసుఁడు రావణుం డపహరించెను. ౪౧

వీరుండవగు రాముఁడా! అట్లు నీవు రాజ్యము ననాదరణచేయుటవలన సంప్రాప్తమయిన యింద్రజిత్తుచే గావింపఁబడినట్టియీసీతావధముచేఁ గలిగిన యీదుఃఖమును ఇప్పుడు శౌర్యముచేఁ బోఁగొట్టెదను లెమ్ము. ౪౨

పురుషోత్తముఁడా! ముల్లోకంబులను సంహరింపఁజాలిన బలంబుగల మోఁకాళ్లవఱకు వ్రేలుచాడు దీర్ఘములయిన బాహువులు గలవాఁడా! దృఢమయిన వ్రతముగలవాఁడా! లెమ్ము నీవు మహాప్రభావుఁడవనియుఁ బరమాత్మవనియుం నీకుఁ దెలియదా యేమి? ౪౩

పాపరహితుండవగు రాముఁడా! నేనిప్పుడు సీతాదేవి మరణంబు విని నీకు దుఃఖముగలిగినదేయని కుపితుండనై ధర్మాధర్మములు అప్రామాణికములని చెప్పినానుగాని వేఱుగాదు. ఇప్పుడు గుఱ్ఱములతోను ఏనుంగులతోను రథంబులతోనుంగూడ రాక్షసేశ్వరుఁడగు రావణునితోనుం గూడ ఈలంకాపట్టణంబు నంతయుం ఈక్షణంబున బాణంబులచే నాశము నొందించెదను. ౪౪

ఇది యెనుబదిమూఁడవసర్గము.

## చ తు ర శీ తి త మ స్స ర్గః.

రామ మాశ్వాసయానే తు లక్ష్మణే భ్రాతృవత్సలే,
నిక్షిప్య గుల్మా న్స్వస్థానే తత్రాఽగచ్ఛ ద్విభీషణః. ౧

నానాప్రహరణై ర్వీరై శ్చతుర్భి స్సచివై ర్వృతః,
నీలాఞ్జనచయాకారై ర్మాతఙ్గై రివ యూథపః. ౨

సోఽభిగమ్య మహాత్మానం రాఘవం శోకలాలసమ్,
వానరాం శ్చైవ దదృశే బాష్పపర్యాకులేక్షణాన్. ౩

రాఘవం చ మహాత్మాన మిక్ష్వాకుకులనన్దనమ్,
దదర్శ మోహ మాపన్నం లక్ష్మణస్యాఙ్క మాశ్రితమ్. ౪

వ్రీళితం శోకసన్తప్తం దృష్ట్వా రామం విభీషణః,
అన్తర్దుఃఖేన దీనాత్మా 'కిమేత' దితి సోఽబ్రవీత్. ౫

విభీషణముఖం దృష్ట్వా సుగ్రీవం తాంశ్చ వానరాన్,
లక్ష్మణోవాచ మన్దార్థ మిదం బాష్పపరిప్లుతః. ౬
హతా మిన్ద్రజితా సీతామిహ శ్రుత్వైవ రాఘవః,
హనుమద్వచనా త్సౌమ్య! తతో మోహ ముపాగతః. ౭

కథయన్తం తు సౌమిత్రిం సన్నివార్య విభీషణః,

## ఎనుబదినాలవసర్గము.

లక్ష్మణుం డట్లు వాత్సల్యంబున అన్నగారి నాశ్వాసించుచుండఁగా విభీషణుండు సేనాభాగములను అయ్యైప్రదేశములనుంచి యా రామలక్ష్మణు లుండు స్థలమునకు వచ్చెను. ౧

గజయూథపతియగు గజశ్రేష్ఠము ఏనుఁగులచేఁ బరివేష్టింపఁబడునట్లు ఆ విభీషణుఁడు నల్లని కాటుకరాశివంటి యాకారము గలవారలును నానావిధములు యాయుధములు ధరించినవారలును వీరులునగు నలువురు మంత్రులచేఁ బరివేష్టితుండై వచ్చెను. ౨

ఆ విభీషణుఁడు వచ్చి మహాబలుండగు లక్ష్మణుండు దుఃఖపరవశుఁడై యుండుటయు వానరు లందఱు కన్నుల నీళ్లు పెట్టుకొని దీనులయి యుండుటయుం జూచెను. ౩

అంత విభీషణుండు మహానుభావుండును ఇక్ష్వాకువంశమున కంతయుం సంతోషంబు గలుగఁజేయువాఁడనగు రాముఁడును దుఃఖంబున మోహంబు నొంది లక్ష్మణుని తొడపైఁ బరుండియుండుటం జూచెను. ౪

ఆ విభీషణుఁడు రాముఁడు పరమదుఃఖితుండై యుండుటం జూచి హృదయంబున దుఃఖమునొంది దీనుఁడై "యిట్లందఱు దుఃఖము నొంది యుండుటకుఁ గారణ మేమి?" యని యడిగెను. ౫

లక్ష్మణుఁడు విభీషణుని ముఖంబుఁజూచి సుగ్రీవుని ఆ వానరుల నందఱను గని కన్నుల నీళ్లు గాఱు మందవచనంబున నిట్లని చెప్పెను. ౬

సౌమ్యుఁడవగు విభీషణుఁడా! రాముఁ డిప్పుడు ఇంద్రజిత్తు సీతను వధించి వేసినాఁడన్న సంగతిని హనుమంతుఁడు చెప్పఁగా విని దుఃఖాతిశయంబున మోహంబు నొందినాఁడు. అని లక్ష్మణుఁడు విభీషణునితోఁ జెప్పెను.

విభీషణుఁడు అట్లు చెప్పుచున్న లక్ష్మణునిఁ దనకు సమాచారమంతయుం దెలిసియుండుటవలన నడ్డగించి యిట్లని పలికెను.

మనుజేన్ద్రార్థరూపేణ యదుక్తం తు హనూమతా. ౮
తదయుక్త మహం మన్యే సాగరస్యేవ శోషణమ్,

అభిప్రాయం తు జానామి రావణస్య దురాత్మనః. ౯
సీతాం ప్రతి మహాబాహో! న చ ఘాతం కరిష్యతి,

యాచ్యమాన స్సుబహుశో మయా హితచికీర్షుణా. ౧౦
వైదేహీ ముత్సృజస్వేతి న చ తత్కృతవా న్వచః,

నైవ సామ్నా న దానేన న భేదేన కుతో యుధా. ౧౧
సా ద్రష్టు మపి శక్యేత నైవ చాన్యేన కేనచిత్,

వానరా న్మోహయిత్వా తు ప్రతియాత స్సరాక్షసః. ౧౨
చైత్యం నికుమ్భిలాం నామ యత్ర హోమం కరిష్యతి,

హుతవా నుపయాతో హి దేవైరపి సవాసవైః. ౧౩
దురాధర్షో భవత్యేవ సఙ్గ్రామే రావణాత్మజః,

మనుష్యనాథుఁడవగు రాముఁడా! హనుమంతుం డిప్పుడు వాస్తవమని తలఁచి యేమాటఁ జెప్పినాఁడో ఆమాట యెంతమాత్రము యుక్తము కాదని నాకుఁ దోఁచుచున్నది. సముద్రము నెండించుట యెట్లు శక్యముకాదో అట్లు సీతను వధించినాఁడని చెప్పుట యెంతమాత్రము యుక్తము కాదు. ౮

మహాబాహుఁడవగు రాముఁడా! దురాత్ముఁడగు రావణుని యభిప్రాయము నాకుఁ దెలియును. సీతను గురించి యెంతమాత్రము వధమంతటి కార్యము చేయనే చేయఁడు. ౯

నేను హితముఁగోరి సీతను రామున కొసంగు మని యెంత యాచించినను రావణుఁ డామాటనే వినలేదు. అట్లు సీతను విడిచి యుండుటకే సమ్మతింపనివాఁడు వధించుటకు సమ్మతించునా? ౧౦

సామోపాయమునఁ గాని దానంబునఁ గాని భేదోపాయంబునఁ గాని దండోపాయంబునఁగాని సీతం జూచుటకేని యెట్టివారికి నలవిగాదు. రాక్షసులయందు మాయోపాయంబున కవకాశమే లేదుగదా! ఇఁక నింద్రజిత్తు సీతం దెచ్చి యెట్లు వధింపఁ గలఁడు? ౧౧

ఆయింద్రజిత్తు వానరులను మోసపుచ్చి నికుంభిలయను దేవాలయమునకు హోమముసేయుటకై పోయెను. ఏలయనఁగా ఇప్పుడు తాను దక్క రావణునకు సహాయముగా యుద్ధముసేయఁగల వీరుఁ డెవ్వఁడును లంకలో లేకుండుటం జేసి తాను హోమమారంభించు నేని ప్రతియుద్ధము సేయువారలు లేక వానరులవలనఁ దనకు హోమవిఘ్నము గలుగు నని తలఁచి తన హోమకార్యము నెఱవేఱువఱకు వానరులు మీరలందఱు దుఃఖపరవశులరై యుద్ధము విషయమై యుత్సాహము లేకుండుటకై యిట్లు మాయచే సీతావధంబు చేసి వంచించి పోయెను. ౧౨

రావణపుత్త్రుఁ డింద్రజిత్తు నికుంభిలయందు నిర్విఘ్నముగా హోమము గావించి మరలి వచ్చునేని దేవతలును దానవులునుఁ జేరి యొకపుట్ట యెత్తి వచ్చినను వారికిని యుద్ధంబున నతనియెదుట నిలువ శక్యము కాదు. ౧౩

తేన మోహయతా నూన మేషా మాయా ప్రయోజితా. ౧౪
విఘ్న మన్విచ్ఛతా తత్ర వానరాణాం పరాక్రమే,

ససైన్యా స్తత్ర గచ్ఛామో యావ త్తన్న సమాప్యతే. ౧౫

త్యజేమం నరశార్దూల! మిథ్యాసన్తాప మాగతమ్,
సీదతే హి బలం సర్వం దృష్ట్వా త్వాం శోకకర్శితమ్. ౧౬

ఇహ త్వం స్వస్థహృదయ స్తిష్ఠ సత్త్వసముచ్ఛ్రితః,
లక్ష్మణం ప్రేషయాస్మాభిస్సహ సైన్యానుకర్షిభిః. ౧౭

ఏష తం నరశార్దూలో రావణిం నిశితైశ్శరైః,
త్యాజయిష్యతి తత్కర్మ తతో వధ్యో భవిష్యతి. ౧౮

తస్యైతే నిశితా స్తీక్ష్ణాః పత్రిపత్రాఙ్గవాజినః,
పతత్త్రిణ ఇవాసౌమ్యా శ్శరాః పాస్యన్తి శోణితమ్. ౧౯

తం సందిశ మహాబాహో! లక్ష్మణం శుభలక్షణమ్,
రాక్షసస్య వినాశాయ వజ్రం వజ్రధరో యథా. ౨౦

మనుజవర! న కాలవిప్రకర్షో
రిపునిధనం ప్రతి యత్క్షమోఽద్య కర్తుమ్,

ఆ యింద్రజిత్తు వానరులు మహాపరాక్రమవంతులు నికుంభిలయందుఁ దాఁ జేయఁదలఁచు హోమకార్యమునకు విఘ్నముఁ గావింతురని తలంచి వానరులకు యుద్ధోత్సాహమే లేక దుఃఖపరవశులై యుండునట్లు వంచనము సేయుటకై యిట్లు మాయారూపమయిన సీతావధము చేసినాఁడు కాని వేఱుగాదు. ఇది నిశ్చయము. ౧౪

కావున ఆ హోమము సంపూర్ణముగా నెఱవేఱుటకు మునుపే యా నికుంభిలకు సైన్యసమేతంబుగాఁ బోవుదము. ౧౫

పురుషశ్రేష్ఠుఁడవగు రామా! ఈ భ్రమముచేఁ గలిగిన సంతాపమును విడువుము. నీ విట్లు దుఃఖితుండవై పరితపించుచుండుటను జూచి సేన యంతయుఁ బరమదుఃఖము నొందియున్నది. ౧౬

నీవు స్థైర్యము నొంది మనస్సున నెమ్మదిగలిగి యిచటనే యుండుము. మాతోడను సేనానాయకులయిన వానరవీరులతోడను గూడ లక్ష్మణునిఁ బంపుము. ౧౭

పురుషశ్రేష్ఠుఁడయిన యాలక్ష్మణుఁడు కఱకుటమ్ములు ప్రయోగించి యాయింద్రజిత్తును హోమకార్యమును వదలి యుద్ధమునకు వచ్చునట్లు గావించును. అందువలన ఇంద్రజిత్తు బ్రహ్మావరప్రకారమున వధ్యుండగును.

చక్కఁగా సానఁబెట్టఁబడినందువలన ముక్కులియు వాడిగలవియు పక్షిఱెక్కల యీఁకలుగట్టి యుండుటవలన నధికమయిన వేగము గలదియు నగు నీలక్ష్మణుని బాణములు గద్దలు మొదలగు క్రూరపక్షులుం బోలె నాయింద్రజిత్తు నెత్తురు ద్రావఁగలవు. ౧౮

మహాబాహుండవగు రామా! పూర్వము నముచివధార్థమయి దేవేంద్రుఁడు వజ్రాయుధమును ప్రయోగించినవిధంబున ఇప్పుడు నీవింద్రజిత్తును వధించుటకై శుభలక్షణుండగు లక్ష్మణుం బంపుము. ౨౦

పురుషశ్రేష్ఠుఁడా! శత్రువధము విషయమయి యిప్పు డెంతమాత్రము జాగుసేయుట యుక్తముకాదు కావున దేవశత్రువులు తారకాదులు తలపడి

త్వమతిసృజ రిపో ర్వధాయ వాణీ
మసురరిపో ర్మథనే యథా మహేన్ద్రః. ౨౧

సమాప్తకర్మా హి స రాక్షసాధిపో
భవత్యదృశ్య స్సమరే సురాసురైః,
యుయుత్సతా తేన సమాప్తకర్మణా
భవేత్సురాణామపి సంశయో మహాన్. ౨౨

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే చతురశీతితమస్సర్గః.

---

## పఞ్చాశీతితమస్సర్గః.

తస్య తద్వచనం శ్రుత్వా రాఘవ శ్శోకకర్శితః,
నోపధారయతే వ్యక్తం యదుక్తం తేన రక్షసా. ౧
తతో ధైర్య మవష్టభ్య రామః పరపురంజయః,
విభీషణ ముపాసీన మువాచ కపిసన్నిధౌ. ౨

నైరృతాధిపతే! వాక్యం య దుక్తం తే విభీషణ!,
భూయస్త చ్ఛ్రోతు మిచ్ఛామి బ్రూహి యత్తే వివక్షితమ్. 3

రాఘవస్య వచ శ్శ్రుత్వా వాక్యం వాక్యవిశారదః,
యత్త త్పున రిదం వాక్యం బభాషే స విభీషణః. ౪
యథాఽఽజ్ఞప్తం మహాబాహో! త్వయా గుల్మనివేశనమ్,
తత్తథాఽనుష్ఠితం వీర! త్వద్వాక్యసమనన్తరమ్. ౫

తాన్యనీకాని సర్వాణి విభక్తాని సమన్తతః,
విన్యస్తా యూథపా శ్చైవ యథాన్యాయం విభాగశః. ౬

నప్పుడు వారి వధింపుమని దేవేంద్రుఁడు దేవసేనాపతియగు కుమారస్వామి నాజ్ఞాపించినట్లు నీవు శత్రువయిన యింద్రజిత్తును వధించుటకై లక్ష్మణు నాజ్ఞాపింపుము. ౨౧

రాక్షసశ్రేష్ఠుండగు నాయింద్రజిత్తు చేయు హోమకార్యము సమాప్తిఁ బొందునేని యతండు యుద్ధంబున సురాసురులకేని యదృశ్యుం డగును. అతఁడు ఆహోమము నెఱవేర్చి యుద్ధమునకువచ్చెనచో దేవతలకును బ్రాణసంశయము గలుగును. ౨౨

ఇది యెనుబదినాలవసర్గము.

## ఎనుబదియైదవసర్గము.

రాముఁడు విభీషణునివచనంబు విని పరమదుఃఖితుఁడై యుండుట వలన నతఁడు చెప్పినమాటను జక్కఁగాఁ దెలిసికొనఁజాలఁడయ్యెను. ౧

అంత శత్రుపట్టణంబుల జయించునట్టి రాముఁడు కొంతసేపటికి ధైర్యబవలంబించి వానరులయెదుటం దనసమీపంబునఁ గూర్చుండియున్న విభీషణుం జూచి యిట్లని చెప్పెను. ౨

రాక్షసాధుఁడవగు విభీషణుఁడా! నీవిప్పుడు చెప్పినమాట నాకుఁ జక్కఁగాఁ దెలియలేదు. కావున మఱల వినఁగోరెదను. నీవు చెప్పఁదలంచుకొన్నది చక్కఁగాఁ జెప్పుము. అని రాముఁడు విభీషణునితోఁ జెప్పెను. ౩

మాటలు చెప్పుటయందు నేర్పరియగు నావిభీషణుండు రాముఁడు చెప్పినది విని తాను మున్ను పలికినమాటను మఱల నిట్లని వచించెను. ౪

మహాబాహుండవు మహాపరాక్రమశాలివగు రాముఁడా! నీవు సేనాభాగముల నెట్లు ఏర్పఱుపుమని యాజ్ఞాపించితివో ఆ ప్రకారముననె అంతయుం జేయఁబడినది. ౫

సైన్యముల నన్నింటిని అన్నిస్థలంబులందును విభజించి యెక్కడెక్కడ నెందఱ నుంచవలయునో యాయాస్థలంబుల నందఱ సేనానాయకులయి

భూయస్తు మమ విజ్ఞాప్యం తచ్ఛృణుష్వ మహాయశః!,

త్వయ్యకారణసన్తప్తే సన్తప్తహృదయా వయమ్. ౭
త్యజ రాజ! న్నిమం శోకం మిథ్యాసన్తాప మాగతమ్,

తదియం త్యజ్యతాం చిన్తా శత్రుహర్షవివర్ధనీ.
ఉద్యమసి క్రియతాం వీర! హర్ష స్సముపసేవ్యతామ్,
ప్రాప్తవ్యా యది తే సీతా హన్తవ్యాశ్చ నిశాచరాః. ౯
రఘునన్దన! వక్ష్యామి శ్రూయతాం మే హితం వచః,
సాధ్వయం యాతు సౌమిత్రి ర్బలేన మహతావృతః. ౧౦
నికుమ్భిలాయాం సంప్రాప్య హన్తుం రావణి మాహవే,
ధనుర్మణ్డలనిర్ముక్తై రాశీవిషవిషోపమైః. ౧౧
శరైర్హన్తుం మహేష్వాసో రావణిం సమితింజయః,

తేన వీరేణ తపసా వరదానాత్స్వయంభువః. ౧౨
అస్త్రం బ్రహ్మశిరసి ప్రాప్తం కామగా శ్చ తురంగమాః,

స ఏష సహసైన్యేన ప్రాప్తసి కిల నికుమ్భిలామ్. ౧౩
య ద్యుత్తిష్ఠే త్కృతం కర్మ హతాన్ సర్వాం శ్చ విద్ధి నః,

నికుమ్భిలా మసంప్రాప్త మహుతాగ్నిం చ యో రిపుః. ౧౪
త్వా మాతతాయినం హన్యా దిన్ద్రశత్రో స్స తే వధః,
వరో దత్తో మహాబాహో! సర్వలోకేశ్వరేణ వై. ౧౫

వేఱువేఱుగా నియమింపఁబడితారు. ౬

యశశ్శాలివగు రామునఁడా! మఱియును నేను విన్నవింపఁదలఁచిన విషయముఁ జెప్పెద వినుము.

నీవు నిష్కారణముగా నిట్లు దుఃఖించుటవలనమాకందఱకును దుఃఖము గలుగుచున్నది. ఇప్పుడు నీవు దుఃఖించుటకుఁ గారణమయిన సీతావధము ఇంద్రజిత్తుయొక్క మాయయేగాని వాస్తవముకాదు కావున ఈదుఃఖమును బరితాపమును వదలుము. ౭

పీరుఁడవగు రామునఁడా! శత్రువులు సంతోషించులాగున నీ విట్లు చింత వహింపకుము. సంతోషం బవలంబించి యుద్ధప్రయత్నంబు గావింపుము. ౮

రామునఁడా! నీవు సీతను బొందవలెననియుఁ రాక్షసుల వధింపవలె ననియుఁ గోరికగలదేని నేను జెప్పునట్టి హితవచనంబు వినుము. ౯

ఈలక్ష్మణుండు నికుంభిలకుఁబోయి యుద్ధంబున నింద్రజిత్తును వధించుటకై గొప్పవానరసేనతోఁగూడ బయలుదేఱుఁగాక. ౧౦

మహాధనుర్ధరుండును బెక్కుయుద్ధముల జయమునొంది యారి తీరిన వాఁడునగు లక్ష్మణుఁడు మండలీకృతమయిన ధనుస్సునుండి వెడలునట్టి కృష్ణ సర్పవిషమువంటి బాణంబుల నింద్రజిత్తును వధించుఁగాక. ౧౧

పీరుఁడగు నాయింద్రజిత్తు తపస్సుచేసి బ్రహ్మదేవుని వరమువలన బ్రహ్మశిరంబను మహాస్త్రంబును కామగమనంబులగురథంబును గుఱ్ఱంబులనుం బొందెను. ౧౨

ఆయింద్రజిత్తు ఇప్పుడు సైన్యసమేతుండై నికుంభిల నొందియున్నాఁడు కావున అతఁడు చేయఁబలఁచిన హోమము సమాప్తమయి యతఁడు మఱలి వచ్చునేని మనమందఱమును వధింపఁబడినామనియే తలంపవలెను. ౧౩

మహాబాహుండవగు రామునఁడా! "నీవు నికుంభిలాహోమమునకుఁ బ్రయత్నించి హోమము పూర్ణముగాఁ గావింపక నికుంభిలం జేరక యుండు నప్పుడు ఆయుధపాణివగు నీతో నెవ్వఁడు యుద్ధముసేయునో అతఁడె నిన్ను

57

ఇత్యేవం విహితో రాజ న్వధ స్తస్యైష ధీమతః,

వధాయేన్ద్రజితో రామ! సందిశస్వ మహాబల!. ౧౬
హతే తస్మి న్హతం విద్ధి రావణం ససుహృజ్జనమ్,

విభీషణవచ శ్శ్రుత్వా రాఘవో వాక్య మబ్రవీత్. ౧౭
జానామి తస్య రౌద్రస్య మాయాం సత్యపరాక్రమ!,

సహి బ్రహ్మాస్త్రవిత్ప్రాజ్ఞో మహామాయో మహాబలః. ౧౮
కరోత్యసంజ్ఞాన్ సజ్గ్రామే దేవాన్ సవరుణానపి,

తస్యాన్తరిక్షే చరతో రథస్థస్య మహాయశః!. ౧౯
న గతిర్జ్ఞాయతే తస్య సూర్యస్యేవాభ్రసంప్లవే,

రాఘవస్తు రిపో ర్జ్ఞాత్వా మాయావీర్యం దురాత్మనః. ౨౦
లక్ష్మణం కీర్తిసంపన్నమిదం వచన మబ్రవీత్,

యద్వానరేన్ద్రస్య బలం తేన సర్వేణ సంవృతః. ౨౧
హనూమత్ప్రముఖై శ్చైవ యూథపై స్సహలక్ష్మణ!,
జామ్బవే నర్క్షపతినా సహసైన్యేన సంవృతః. ౨౨
జహి తం రాక్షససుతం మాయాబలవిశారదమ్,

వధించువాఁడు. మఱియెవ్వఁడును నిన్ను వధింపఁజాలఁడు" అనినను స్తలోక నాథుండగు బ్రహ్మదేవుఁడు ఇంద్రజిత్తునకు వరంబొసంగెను. ౧౫

రాముఁడా! ఇట్లు నికుంభిలాహోమమునకు విఘ్నము సేయుంవాని చే బుద్ధిమంతుఁడగు నాయింద్రజిత్తు వధింపఁబడునట్లు బ్రహ్మదేవుండు నియమించెను.

మహాబలశాలివగురాముఁడా! కాఁబట్టి యిప్పుడు ఆయింద్రజిత్తును వధించుటకాజ్ఞ సేయుము. ఇంద్రజిత్తుహతుఁడయిన యెడ వెంటనేరావణుండును అతనిమిత్రులును హతులైరని తలంపుము. అని విభీషణుఁడు రామునితోఁ జెప్పెను. ౧౬

రాముఁడు విభీషణుండు చెప్పినమాటను విని యతనితో నిట్లనియె.

ఎట్టిసమయమునందేని వ్యర్థముగాని పరాక్రమముగల విభీషణుఁడా! భయంకరుండగు నా యింద్రజిత్తుయొక్క మాయనాఁ దెలియుదు. ౧౭

ఆయింద్రజిత్తు బ్రహ్మాస్త్రంబుఁగూడఁ దెలిసినవాఁడు, విద్వాంసుఁడు, మహామాయావి, మహాబలశాలి. యుద్ధంబున వరుణసహితులగు దేవతలనుం గూడ మూర్ఛిల్లఁజేయుంను ౧౮

కీర్తిసంపన్నుఁడవగు విభీషణుఁడా! ఆయింద్రజిత్తు రథారూఢుండై యాకాశంబున సంచరించుచుండఁగా మేఘసమూహంబున సూర్యునింబోలె నాతనిఁ గనుంగొనుట యశక్యము. అని రాముఁడు విభీషణునితోఁ జెప్పెను.

రాముఁడు దురాత్ముండగు నాయింద్రజిత్తు మాయాబలంబుగలవాఁడగుటం దెలిసి యుండుట వలన ననేకయుద్ధంబులం గీర్తి వహించిన లక్ష్మణుం జూచి యిట్లని పలికెను. ౨౦

లక్ష్మణుఁడా! నీవు వానరరాజు సుగ్రీవుని సమస్తసైన్యముతోను హనుమంతుఁడు మొదలగు సేనానాయకులతోను సేనాసమేతుండగు భల్లూకనాథుండు జాంబవంతునితోనుంగూడ సన్నద్ధుండవై పోయి మాయావియుం బలవంతుఁడునగు నారాక్షస పుత్త్రు నింద్రజిత్తును వధింపుము. ౨౧-౨౧

అయం త్వాం సచివై స్సార్ధం మహాత్మా రజనీచరః. ౨౩
అభిజ్ఞ స్తస్య దేశస్య పృష్ఠతోఽనుగమిష్యతి,

రాఘవస్య వచ శ్శ్రుత్వా లక్ష్మణ స్సవిభీషణః. ౨౪
జగ్రాహ కార్ముక శ్శ్రేష్ఠ మత్యద్భుతపరాక్రమః,
సన్నద్ధగ కవచీ ఖడ్గీ సశరో హేమచాపధృత్. ౨౫
రామపాదావుపస్పృశ్య హృష్ట స్సౌమిత్రి రబ్రవీత్,

అద్య మత్కార్ముకోన్ముక్తా శ్శరా నిర్భిద్య రావణిమ్. ౨౬
లఙ్కా మభిపతిష్యన్తి హంసాగ పుష్కరిణీ మివ,

అద్యైవ తస్య రౌద్రస్య శరీరం మామకా శ్శరాః. ౨౭
విధమిష్యన్తి భిత్త్వా తం మమ చాపగుణచ్యుతాః,

సఏవ ముక్త్వా ద్యుతిమా న్వచనం భ్రాతు రగ్రతః. ౨౮
స రావణివధాకాఙ్క్షీ లక్ష్మణ స్త్వరితో యయౌ,

సోఽభివాద్య గురోగ పాదౌ కృత్వా చాపి ప్రదక్షిణమ్. ౨౯
నికుమ్భిళామభియయౌ చైత్యం రావణిపాలితమ్,

విభీషణేన సహితో రాజపుత్త్రః ప్రతాపవాన్. ౩౦
కృతస్వస్త్యయనో భ్రాత్రా లక్ష్మణ స్త్వరితో యయౌ,
వానరాణాం సహస్రై స్తు హనుమా న్బహుభి ర్వృతః. ౩౧
విభీషణశ్చ సామాత్య స్తదా లక్ష్మణ మన్వగాత్,

మహాత్ముండును రాక్షసుఁ డగుటచే మాయాతంత్రములు దెలిసినవాఁడును విశేషించియా నికుంభిలాప్రదేశము నెఱింగినవాఁడునగు నీవిభీషణుండు మంత్రిసహితుండై నీవెంటనె రాఁగలఁడు. అని రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పెను. ౨౩

రామునాజ్ఞ విన్నంతనె మహాపరాక్రమశాలియగు లక్ష్మణుండును విభీషణుండును ఉత్తమంబులగు ధనుస్సులను ధరించిరి. ౨౪

లక్ష్మణుఁడు కవచము ధరించి ఖడ్గంబును గాంచనాలంకృతంబగు ధనుస్సును బాణంబులను గ్రహించి యుద్ధసన్నద్ధుఁడై యుద్ధంబు గలిగెనని సంతుష్టుండై రామునిపాదంబులకు మ్రొక్కి యిట్లని పలికెను. ౨౫

ఇప్పుడు నాధనుస్సునుండి ప్రయోగింపఁబడిన బాణంబులు ఇంద్రజిత్తుని దేహమును భేదించి తామర కొలనునహంసలు వ్రాలునట్లు లంకాపురంబునం బడఁగలవు. ౨౬

ఇప్పుడె నా బాణంబులు ధనుర్గుణంబునుండి వెడలి భయంకరాకారుండగు నాయింద్రజిత్తుని శరీరంబును భేదించి రంధ్రములు చేసి యాతని వధింపఁగలవు. అని లక్ష్మణుఁడు రామునితోఁ జెప్పెను. ౨౭

యుద్ధోత్సాహంబున నధిక కాంతితో నొప్పుచున్న యాలక్ష్మణుండు అన్నయెదుట నీలాగునం బలికి ఇంద్రజిత్తు వధించుటకై వేగంబునం బోయెను. ౨౮

లక్ష్మణుండట్లు అన్నపాదంబులకుమ్రొక్కి ప్రదక్షిణంబుచేసి యుద్ధార్థమయి యింద్రజిత్తు మహాహోమముచేయునట్టి యానికుంభిలయను చైత్యవృక్షమునొద్దకుఁ బోయెను. ౨౯

మహాపరాక్రమశాలియగు రాచకొమరుఁడైన లక్ష్మణుఁడురామునివలన నాశీర్వాదంబునొంది విభీషణసహితంబుగా వేగంబునం బోయెను. ౩౦

అప్పుడు అనేకవానరసహస్రపరివృతుండై హనుమంతుఁడును మంత్రిసహితుండై విభీషణుండును లక్ష్మణుని వెంబడించి నడచిరి. ౩౧

మహతా హరిసైన్యేన సవేగ మభిసంవృతః. ౩౨
ఋక్షరాజబలం చైవ దదర్శ పథి విష్ఠితమ్,

స గత్వా దూర మధ్వానం సౌమిత్రి ర్మిత్రనన్దనః. ౩౩
రాక్షసేన్ద్రబలం దూరా దపశ్య ద్వ్యూహ మాస్థితమ్,

స తం ప్రాప్య ధనుష్పాణి ర్మాయాయోగ మరిన్దమః. ౩౪
తస్థౌ బ్రహ్మవిధానేన విజేతుం రఘునన్దనః,

విభీషణేన సహితో రాజపుత్త్రః ప్రతాపవాన్. ౩౫
అఙ్గదేన చ వీరేణ తథాఽనిలసుతేన చ.
వివిధ మమలశస్త్రభాస్వరం త
ద్ధ్వజగహనం విపులం మహారథైశ్చ,
ప్రతిభయతమ మప్రమేయవేగం
తిమిర మివ ద్విషతాం బలం వివేశ. ౩౬

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే పఞ్చాశీతితమస్సర్గః.

---

## షడశీతితమస్సర్గః.

అథ తస్యామవస్థాయాం లక్ష్మణం రావణానుజః,
పరేషా మహితం వాక్య మర్థసాధక మబ్రవీత్. ౧

యదేత ద్రాక్షసానీకం మేఘశ్యామం విలోక్యతే,
ఏతదాయోధ్యతాం శీఘ్రం కపిభిః పాదపాయుధైః. ౨

అంత నాలక్ష్మణుండు వేగంబున గొప్పవానరసేన తన్నుఁబరివేష్టించియుండ దనవెంబడివచ్చుటకై సన్నద్ధుండై మార్గమున నిలిచియున్న భల్లూకసైన్యంబునుం గాంచెను. 32

మిత్రులకు సంతోషము గలిగించునట్టి యాలక్ష్మణుండు దూరమార్గంబు పోయినపిమ్మట దూరంబున వ్యూహంబు పన్నియున్న రాక్షససైన్యముం గనెను. 33

శత్రువుల రూపు మాపువాఁడును ధనుర్ధరుండును నగు నాలక్ష్మణుండు బ్రహ్మదేవుఁడు వరం బొసంగిన నియమంబునం జేసి యానికుంభిలాప్రదేశంబున మాయావియగు నింద్రజిత్తును జయింప సన్నద్ధుండై నిలిచెను. 34

అప్పుడు మహాపరాక్రమశాలియగు లక్ష్మణుని విభీషణుండును వీరుండగు నంగదుఁడును, వాయుపుత్రుండగు హనుమంతుఁడునుం బరివేష్టించిరి. 35

లక్ష్మణుండు నానావిధంబుగా విడిసియున్నదియు నిర్మలంబులగు నాయుధంబులచే వెలుంగుచున్నదియు లెక్కలేని ధ్వజములచే నలంకృతంబును గొప్పగొప్పరథరంబులచేత (మహారథులగు వీరులచేత) నిండినదియు భయంకరాకారంబును మహావేగంబుపై చీకటివలె నల్లగా దట్టమైయున్న శత్రుసైన్యంబుఁ జొచ్చెను. 36

ఇది యెనుబదియైదవ సర్గము.

## ఎనుబదియాఱవసర్గము.

అంత నప్పుడు రావణుని తమ్ముఁడగు విభీషణుండు లక్ష్మణుం జూచి రాక్షసులకుఁ గీడుగలిగించునదియుఁ దమకుఁగార్యసాధకంబునగు నీమాటం జెప్పెను. 1

ఇదిగో మేఘమువలె నల్లనైన రాక్షససైన్యము కనఁబడుచున్నదే, ఇంద్రజిత్తుయొక్క యాగము పూర్ణమగుటకుమున్నే శీఘ్రముగా నీరాక్షససైన్యమును వానరులు వృక్షములు మొదలగు నాయుధములతోఁ బ్రహరింతురుగాక. 2

అస్యానీకస్య మహతో భేదనే యత లక్ష్మణ!,
రాక్షసేన్ద్రసుతోఽప్యత్ర భిన్నే దృశ్యో భవిష్యతి. ౩
స త్వ మిన్ద్రాశనిప్రఖ్యై శ్శరై రవకిర న్పరాన్,
అభిద్రవాశు యావద్వై నైతత్కర్మ సమాప్యతే. ౪

జహి వీర! దురాత్మానం మాయాపర మధార్మికమ్,
రావణిం క్రూరకర్మాణం సర్వలోకభయావహమ్. ౫

విభీషణవచ శ్శ్రుత్వా లక్ష్మణ శ్శుభలక్షణః,
వవర్ష శరవర్షాణి రాక్షసేన్ద్రసుతం ప్రతి. ౬

ఋక్షా శ్శాఖామృగా శ్చైవ ద్రుమాద్రినఖయోధినః,
అభ్యధావన్త సహితా స్తదానీక మవస్థితమ్. ౭
రాక్షసాశ్చ శితై ర్బాణై రసిభి శ్శక్తితోమరైః,
ఉద్యతై స్సమవర్తన్త కపిసైన్యజిఘాంసవః. ౮
స సమ్ప్రహార స్తుముల స్సంజజ్ఞే కపిరక్షసామ్,
శబ్దేన మహతా లఙ్కాం నాదయన్వై సమన్తతః. ౯
శస్త్రై శ్చ బహుధాకారై శ్శితై ర్బాణైశ్చ పాదపైః,
ఉద్యతై ర్గిరిశృఙ్గైశ్చ ఘోరై రాకాశ మావృతమ్. ౧౦

తే రాక్షసా వానరేషు వికృతాననబాహవః,
నివేశయన్త శ్శస్త్రాణి చక్రు స్తే సుమహ ద్భయమ్. ౧౧

లక్ష్మణుఁడా! నీ వీసైన్యమును భేదింపుము. దీనిని భేదించినయెడ రాక్షసరాజకుమారుఁడు ఇంద్రజిత్తు కనఁబడును. ౩

నీ విప్పుడు ఇంద్రజిద్వధార్థమయి వచ్చినావు కావున ఇంద్రజిత్తు చేయుం కర్మము సమాప్తమగుటకు మున్నె ఇంద్రునివజ్రాయుధమువంటి బాణములం బ్రయోగించి యీసైన్యమును భేదింపుము. ౪

వీరుఁడగు లక్ష్మణుఁడా! చెడ్డబుద్ధిగలవాఁడును మాయావియు నధర్మమునే యాచరించువాఁడును భూతకోటికి హింససేయువాఁడును సమస్తలోకంబులకు భయంకరుండునగు నీయింద్రజిత్తును వధింపుము, అని విభీషణుఁడు చెప్పినమాటను విని రాక్షసేశ్వరకుమారుండగు నింద్రజిత్తుపై వర్షంబు గురియునట్లు బాణంబులు ప్రయోగించెను. ౫

జయావహంబులగు లక్షణంబులతో నొప్పుచున్న యా లక్ష్మణుఁడు విభీషణుఁడు చెప్పినమాటను విని రాక్షసేశ్వర కుమారుఁడగు నింద్రజిత్తుపై వర్షంబు గురియునట్లు బాణంబులు ప్రయోగించెను. ౬

వృక్షములను బర్వతములను నఖంబులను ఆయుధములుగాఁ గొనిపోరునట్టి భల్లూకంబులును వానరులును ఆ రాక్షససేనపైఁ గవిసిరి. ౭

రాక్షసులును దీక్ష్ణంబులగు బాణంబులను ఖడ్గంబులను శక్తులను తోమరంబులను ధరించి వానరులతోటి యుద్ధంబునకు సన్నద్ధులయిరి. ౮

అప్పుడు వానరులకును రాక్షసులకును గలిగిన తుములయుద్ధముచే లంకాపురంబునం దంతయు మహాధ్వని గలిగినది. ౯

అప్పుడు ప్రయోగింపఁబడిన నానావిధాకారంబులగు నాయుధములును దీక్ష్ణబాణంబులును వృక్షంబులును శత్రువుమీఁద వైచుటకైఁ బైకెత్తఁబడిన భయంకరంబులగు పర్వతశిఖరములును ఆకాశంబు నిండి చెలంగినవి. ౧౦

ఆ రాక్షసులు వికృతంబులయి భయంకరంబులగు ముఖంబులతోను జేతులతోను వానరులదేహంబులయం దాయుధంబులు చొప్పించి మిక్కిలియు భయము గలిగించిరి. ౧౧

తత్రైవ సకలై ర్వృక్షై గ్గిరిశృఙ్గైశ్చ వానరాః,
అభిజఘ్ను ర్నిజఘ్నుశ్చ సమరే రాక్షసర్షభాన్. ౧౨
ఋక్షవానరముఖ్యైశ్చ మహాకాయై ర్మహాబలైః,
రక్షసాం వధ్యమానానాం మహద్భయ మజాయత. ౧౩
స్వమనీకం విషణ్ణం తు శ్రుత్వా శత్రుభి రర్దితమ్,
ఉదతిష్ఠత దుర్ధర్ష స్తత్కర్మణ్యననుష్ఠితే. ౧౪

వృక్షాన్ధకారా న్నిర్గత్య జాతక్రోధ స్స రావణిః,
ఆరురోహ రథం సజ్జం పూర్వయుక్తం సరాక్షసః. ౧౫

స భీమకార్ముకధరః కాలమేఘసమప్రభః,
రక్తాస్యనయనః క్రుద్ధో బభౌ మృత్యురివాన్తకః. ౧౬

దృష్ట్వైవ తు రథస్థం తం పర్యవర్తత తద్బలమ్,
రక్షసాం భీమవేగానాం లక్ష్మణేన యుయుత్సతామ్. ౧౭

తస్మిన్కాలే తు హనుమా నుద్యమ్య సుదురాసదమ్,
ధరణీధరసఙ్కాశో మహావృక్షమరిన్దమః. ౧౮
స రాక్షసానాం తత్సైన్యం కాలాగ్ని రివ నిర్దహన్,
చకార బహుభి ర్వృక్షై ర్నిస్సంజ్ఞం యుధి వానరః. ౧౯
విధ్వంసయన్తం తరసా దృష్ట్వైవ పవనాత్మజమ్,
రాక్షసానాం సహస్రాణి హనూమన్త మవాకిరన్. ౨౦
శితశూలధరా శ్శూలై రసిభిశ్చాసిపాణయః,

అట్లు వానరులును యుద్ధంబునఁ గొమ్మలతోఁ గూడిన వృక్షంబులతోఁ బర్వతశిఖరంబులతోను రాక్షసోత్తములం బ్రహరించి వధించిరి. ౧౨

రాక్షసులు మహాకాయులును మహాబలశాలులునగు భల్లూకవానర వీరులచే నానావిధంబుగా వధింపఁబడుచు సహింపలేక భయంబునొందిరి. ౧౩

అంతఁ దనసైన్యము శత్రువులచే నిహతమయి భయము నొందుటను విని ఇంద్రాదులకును ధర్షింప నలవిగాని యింద్రజిత్తు హోమకార్యము సమాప్తి బొందుటకు మున్నె నియమమునుండి లేచెను. ౧౪

ఇంద్రజిత్తు కుపితుండై అంధకారంబు వలె నున్న వృక్షసమూహము నుండి రామసహితంబుగా వెలువడి ఆయుధసహితంబయి పూర్వమే గుఱ్ఱములు పూన్చియున్న రథము నారోహించెను. ౧౫

ఆ యింద్రజిత్తు భయంకరాకారంబగు ధనుస్సు చేతఁబూని వర్షాకాల మేఘముంబోలిన దేహముతో నొప్పుచుఁ గోపంబున ముఖంబునం గన్నుల నెఱ్ఱఁదనంబు గదుర లోకనాశంబు సేయు మృత్యువుకరణిం జూపరులకు భయంబు గలిగించెను. ౧౬

ఆ యింద్రజిత్తు రథగతుఁ డగుటను జూచినంతనె లక్ష్మణునితో యుద్ధంబునకు సన్నద్ధులై యున్న భయంకర వేగులగు నారాక్షసుల సైన్యమంతయు నింద్రజిత్తుం బరివేష్టించి నిలిచెను, ౧౭

ఆ సమయమునందుఁ బర్వతాకారుఁడు శత్రువుల నడంగఁ ద్రొక్కువాఁడునగు హనుమంతుఁడు ఒక భయంకరమయిన మహావృక్షంబెత్తి దానిచే నారాక్షసులం గొట్టి చెండాడి మఱలం బెక్కు వృక్షంబులచే నారాక్షస సైన్యం బంతయు మూర్ఛిలునట్లు గావించెను. ౧౮, ౧౯

అట్లు వాయుకుమారుఁడగు హనుమంతుఁడు మహావేగంబున రాక్షససైన్యంబుల రూపుమాపుచుండుటఁ గని వేనవేలు రాక్షసులు హనుమంతుఁ జుట్టు ముట్టిరి. ౨౦

రాక్షసులు పర్వతాకారుఁడగు హనుమంతుం జుట్టుముట్టి తీక్ష్ణశూలం

శక్తిభి శ్శక్తిహస్తాశ్చ పట్టసైగ పట్టసాయుధాః. ౨౧
పరిఘై శ్చ గదాభి శ్చ చక్రై శ్చ శుభదర్శనైః,
శతశశ్చ శతఘ్నీభి రాయసై రపి ముద్గరైః. ౨౨
ఘోరైగ పరశ్వథైశ్చైవ భిణ్డివాలైశ్చ రాక్షసాః,
ముష్టిభి ర్వజ్రకల్పైశ్చ తలై రశనిసన్నిభైః. ౨౩
అభిజఘ్నుస్సమాసాద్య సమన్తా త్పర్వతోపమమ్,
తేషా మపి చ సంక్రుద్ధ శ్చకార కదనం మహత్. ౨౪

స దదర్శ కపిశ్రేష్ఠ మచలోపమ మిన్ద్రజిత్,
సూదయన్త మమిత్రఘ్న మమిత్రా న్పవనాత్మజమ్. ౨౫

స సారథి మువాచేదం యాహి యత్రైష వానరః,
క్షయ మేష హి నగ కుర్యా ద్రాక్షసానా ముపేక్షితః. ౨౬

ఇత్యుక్త స్సారథి స్తేన యయౌ యత్ర స మారుతిః,
వహ న్పరమదుర్ధర్షం స్థిత మిన్ద్రజితం రథే. ౨౭

సోఽభ్యుపేత్య శరా న్ఖడ్గా న్పట్టసాంశ్చ పరశ్వథాన్,
అభ్యవర్షత దుర్ధర్షగ కపిమూర్ధ్ని స రాక్షసః. ౨౮

తాని శస్త్రాణి ఘోరాణి ప్రతిగృహ్య స మారుతిః,
రోషేణ మహతాఽఽవిష్టో వాక్యం చేద మువాచ హ. ౨౯
యుధ్యస్వ యది శూరోఽసి రావణాత్మజ! దుర్మతే!,
వాయుపుత్త్రం సమాసాద్య జీవన్న ప్రతియాస్యసి. ౩౦

ములందాల్చినవారలు శూలంబులను, ఖడ్గపాణులు ఖడ్గంబులను, ఈటెలు ధరించినవారలు ఈటెలచేతను బట్టిసధరులు పట్టిసంబులను మఱియుం బరిఘంబులను గదలను వాడిగల చక్రంబులను అనేకంబులగు శతఘ్నులచేతను నినుపగుదియలచేతను భయంకరంబులగు పరశ్వధంబులను భిండివాలంబులచేతను ఆ యా యాయుధంబులు ధరించినవారలు ఆ యా యుధంబులచేతం బ్రహరించిరి. ౨౧, ౨౩

హనుమంతుఁడును కుపితుఁడై ఆ రాక్షసుల యంతఱకును అన్నిరూపులయి మహాయుద్ధంబు గావించెను. ౨౪

ఆ యింద్రజిత్తు శత్రువుల వధించువాఁడును పర్వతాకారుఁడునగు వానరోత్తముఁడు హనుమంతుఁడు శత్రువుల రాక్షసుల నందఱ న్వధింపుచుండుటను జూచెను. ౨౫

ఆ యింద్రజిత్తు సారథిం జూచి "యంక నీహనుమంతు నుపేక్షింప రాదు. ఉపేక్షించినయెడ నీతఁడు మనరాక్షసులనెల్ల వధించిపుచ్చును. కావున నితనిపైకి రథముఁ గొనిపొమ్ము" అని వచించెను. ౨౬

సారథి యింద్రజిత్తుని వచనంబు విని పరమదుర్ధర్షుండగు నాయింద్రజిత్తు ఆరోహించి యున్న రథమును హనుమంతునిమీఁదికిఁ దోలుకొని పోయెను. ౨౭

మహాతేజుఁడగు నా యింద్రజిత్తు హనుమంతుని యొద్దకుఁ బోయి యతనిశిరము మీఁద బాణంబులను ఖడ్గంబులను పట్టిసంబులును బరశ్వధంబులును వర్షించెను. ౨౮

హనుమంతుఁడు భయంకరంబులగు నా యాయుధంబుల కన్నిటికిని సహించి పరమక్రుద్ధుండై యింద్రజిత్తుం జూచి యీవచనముఁ బలికెను.

దుష్టబుద్ధివగు నింద్రజిత్తా! నీవు పిఱికివిగాక శూరుండవే యగుదువేని యుద్ధము సేయుము. వాయుకుమారుఁడగు హనుమంతు నెదుటఁబడి మఱల బ్రతికిఁ పోఁజాలవు. ౩౦

బాహుభ్యాం ప్రతియుధ్యస్వ యది మే ద్వన్ద్వ మాహవే,
వేగం సహస్వ దుర్బుద్ధే! తత స్త్వం రక్షసాం వరః. 30

హనుమ న్తం జిఘాంస న్తం సముద్యతశరాసనమ్,
రావణాత్మజ మాచష్టే లక్ష్మణాయ విభీషణః. 32
య స్సవాసవనిర్జేతా రావణస్యాఽఽత్మసమ్భవః,
స ఏష రథ మాస్థాయ హనుమ న్తం జిఘాంసతి. 33

తమప్రతిమసంస్థానై శ్శరై శ్శత్రువిదారణైః,
జీవితా న్తకరై ర్ఘోరై స్సౌమిత్రే! రావణిం జహి. 34

ఇత్యేవ ముక్తస్తు తదా మహాత్మా విభీషణేనారివిభీషణేన,
దదర్శ తం పర్వతసన్నికాశం రథే స్థితం భీమబలం నద న్తమ్. 35

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే - షడశీతితమస్సర్గః.

---

## స ప్తా శీ తి త మ స్స ర్గః.

ఏవ ముక్త్వా తు సౌమిత్రిం జాతహర్షో విభీషణః,
ధనుష్పాణిన మాదాయ త్వరమాణో జగామ సః. 1

అవిదూరం తతో గత్వా ప్రవిశ్య చ మహద్వనమ్,
దర్శయామాస తత్కర్మ లక్ష్మణాయ విభీషణః. 2

దుర్మార్గుఁడా! నీవాయుధంబులు విడిచి బాహువులచేత నాతో యుద్ధముచేసి యుద్ధంబున నావేగంబు సహింతువేని యప్పుడు నీవు రాక్షసోత్తముఁడవు అని హనుమంతుఁడు ఇంద్రజిత్తుతోఁ జెప్పెను. 30

విభీషణుఁడు ఇంద్రజిత్తు ధనుర్ధరుఁడై హనుమంతుని వధింప నున్నాఁడని లక్ష్మణునితోఁ జెప్పెను. 31

దేవేంద్రుని జయించినవాఁడును రావణుని కుమారుఁడునగు ప్రసిద్ధుఁడయిన యీ యింద్రజిత్తు రథగతుఁడై హనుమంతుని వధింపఁ బోవుచున్నాఁడు. ఉపేక్షింపవలదు. 33

లక్ష్మణుఁడా! నానావిధంబులగు నుత్తమములయిన యాకారములు గలవియు శత్రుమర్మంబుల భేదించునవియు జీవితనాశము సేయునవియునగు క్రూరబాణంబులు ప్రయోగించి యీ యింద్రజిత్తును వధింపుము. అని విభీషణుఁడు లక్ష్మణునితోఁ జెప్పెను. 34

అప్పుడు మహానుభావుఁడగు లక్ష్మణుఁడు శత్రుభయంకరుఁడైన విభీషణుఁడు పలికిన మాటను విని యుద్ధార్థమయి నిలిచియున్నవాఁడును భయంకరమయిన పరాక్రమము గలవాఁడును బర్వతాకారుఁడు నగు భయంకరంబుగా గర్జించుచున్నవాని నింద్రజిత్తుం గాంచెను. 35

ఇది యెనుబడియాఱవసర్గము.

## ఎనుబదియేడవసర్గము

ఆ విభీషణుఁడు లక్ష్మణున కీ ప్రకారంబునఁ జెప్పి యిఁక నింద్రజిత్తు హతుండగునని సంతుష్టుఁడై ధనుర్ధరుఁడగు లక్ష్మణునిఁ బిలుచుకొని వేగంబునం బోయెను. ౧

విభీషణుఁ డంత లక్ష్మణునితోఁ గూడఁ గొంచెము దూరము పోయి యొకమహావనంబుఁ బ్రవేశించి యచట నింద్రజిత్తు హోమము సేయుస్థానమును లక్ష్మణునకుఁ జూపెను. ౨

నీలజీమూతసంకాశం న్యగ్రోధం భీమదర్శనమ్,
తేజస్వీ రావణభ్రాతా లక్ష్మణాయ న్యవేదయత్. ౩

ఇహోపహారం భూతానాం బలవా న్రావణాత్మజః,
ఉపహృత్య తతః పశ్చా త్సఙ్గ్రామ మభివర్తతే. ౪
అదృశ్య స్సర్వభూతానాం తతో భవతి రాక్షసః,
నిహన్తి సమరే శత్రూన్ బధ్నాతి చ శరోత్తమైః. ౫
తమప్రవిష్టం న్యగ్రోధం బలినం రావణాత్మజమ్,
విధ్వంసయ శరై స్తీక్ష్ణై స్సరథం సాశ్వసారథిమ్. ౬

తథేత్యుక్త్వా మహాతేజా స్సౌమిత్రి ర్మిత్రనన్దనః.
బభూవావస్థిత స్తత్ర చిత్రం విస్ఫారయ న్ధనుః. ౭

స రథేనాగ్నివర్ణేన బలవా న్రావణాత్మజః,
ఇన్ద్రజి త్కవచీ ధన్వీ సధ్వజః ప్రత్యదృశ్యత. ౮

త మువాచ మహాతేజాః పౌలస్త్య మపరాజితమ్,
సమాహ్వయే త్వాం సమరే సమ్యగ్యుద్ధం ప్రయచ్ఛ మే. ౯

ఏవ ముక్తో మహాతేజా మనస్వీ రావణాత్మజః,
అబ్రవీ త్పరుషం వాక్యం తత్ర దృష్ట్వా విభీషణమ్. ౧౦

మహాపరాక్రమశాలియగు రావణానుజుండగు విభీషణుండు లక్ష్మణునకు మేఘంబువలె నల్లగాఁ జూపరులకు భయంకరంబయి యున్న నికుంభిలాస్థానమందున్న న్యగ్రోధవృక్షంబుఁ జూపెను. ౩

బలశాలియగు రావణకుమారుం డింద్రజిత్తు నీస్థలంబుననె భూతంబులకు బలియొసఁగి యటుపిమ్మట యుద్ధమునకు వచ్చును. ౪

అంత నాయింద్రజిత్తు సమస్తభూతంబులకును అదృశ్యుండై యుద్ధంబున శత్రువుల వధించును. తీక్ష్ణబాణంబుల బంధించును. ౫

ఈ యింద్రజిత్తు న్యగ్రోధ వృక్షంబుఁ బ్రవేశించినచో నటుపిమ్మట రథాశ్వ సారథి సహితంబుగా నదృశ్యుండగును గావున నతఁడు న్యగ్రోధంబుఁ బ్రవేశింపకమున్నె బలవంతుఁడగు నీయింద్రజిత్తును రథాశ్వసారథిసహితంబుగాఁ దీక్ష్ణబాణంబుల వధింపుము. అని విభీషణుండు లక్ష్మణునితోఁ జెప్పెను. ౬

మహానుభావుండును మిత్రులకు సంతోషంబు నేయువాఁడునగు లక్ష్మణుఁడు వల్లెయని పలికి యాన్యగ్రోధమూలంబునఁ గాంచనచిత్రంబగుధనువు సారింపుచు యుద్ధార్థమై నిలిచియుండెను. ౭

అంత మహాబలుఁడగు రావణపుత్రుఁడా యింద్రజిత్తుకవచంబు దొడిగి ధనుర్ధరుండై యగ్నివలె వెలుంగుచున్న ధ్వజాలంకృతంబగు రథంబు నెక్కినవాఁడై లక్ష్మణు నెదుటఁ గనఁబడెను. ౮

మహాపరాక్రమశాలియగు లక్ష్మణుండు అదివఱకుఁ బరాజయంబె యెఱుంగని పులస్త్యవంశోద్భవుండగు నాయింద్రజిత్తునుం జూచి "నిన్ను యుద్ధమునకుఁ బిలుచుచున్నాను. నాకు మంచియుద్ధం బొసంగుము" అని పలికెను. ౯

పరాక్రమవంతుఁడు దృఢమయిన నిశ్చయము గలవాఁడునగు నింద్రజిత్తు లక్ష్మణుని వాక్యంబు విని యచట విభీషణుండు నుండుటం జూచి పరుషంబుగా నతనితో నిట్లనియె. ౧౦

ఇహ త్వం జాతసంవృద్ధ స్సాక్షా ద్భ్రాతా పితు ర్మమ,
కథం ద్రుహ్యసి పుత్రస్య పితృవ్యో మమ రాక్షస!. ౧౧

న జ్ఞాతిత్వం న సౌహార్దం న జాతి స్తవ దుర్మతే!,
ప్రమాణం న చ సోదర్యం న ధర్మో ధర్మదూషణ!. ౧౨

శోచ్య స్త్వ మసి దుర్బుద్ధే! నిన్దనీయ శ్చ సాధుభిః,
య స్త్వం స్వజన ముత్సృజ్య పరభృత్యత్వ మాగతః. ౧౩

నైతచ్ఛిథిలయా బుద్ధ్యా త్వం వేత్సి మహద న్తరమ్,
క్వచ స్వజనసంవాసః క్వచ నీచపరాశ్రయః. ౧౪

గుణవాన్వా పరజన స్స్వజనో నిర్గుణోఽపివా,
నిర్గుణ స్స్వజన శ్శ్రేయా న్యః పరః పరఏవ సః. ౧౫

య స్స్వపక్షం పరిత్యజ్య పరపక్షం నిషేవతే,
స స్వపక్షే క్షయం ప్రాప్తే పశ్చా త్తై రేవ హన్యతే. ౧౬

నిరనుక్రోశతా చేయం యాదృశీ తే నిశాచర!,
స్వజనేన త్వయా శక్యం పరుషం రావణానుజ!. ౧౭

విభీషణుఁడా! నీవును రాక్షసుఁడవు, కులాభిమానంబేని చూడవైతివి. ఇఁతియగాక ఇచటనే నీవు పుట్టి పెరిగినవాఁడవు. మఱియు నాతండ్రికిఁ దమ్ముఁడవు. నాపినతండ్రివిగానుండి పుత్రుఁడనైన నావిషయమున ద్రోహం బెట్లు గావించెదవు? ౧౧

దుర్మార్గుఁడవు అధర్మిష్ఠుఁడవగు విభీషణుఁడా! నీకు బంధుత్వముగాని స్నేహముగాని కులముగాని తోఁబుట్టుఁదనముగాని ధర్మముగాని ప్రమాణము కాదు. ౧౨

దురార్గుఁడా! నీవు స్వజనమును వదలి శత్రువులకు భృత్యుఁడవైతివి కావున నీవు బంధువులకు శోచనీయుఁడవును సత్పురుషులకు నింద్యుఁడవు నైతివి. ౧౩

స్వజనములలో గొప్పగా నుండుటకును నీచముగా శత్రువుల నాశ్రయించుటకును ఎంతో తారతమ్యమున్నది. నీబుద్ధి చెడినది కావున అది నీకుఁ దెలియలేదు. ౧౪

పెఱవారు గుణవంతులయి తమవారు గుణహీనులగుదురుగాక. గుణహీనులయినను దమవారినే యాశ్రయింపవలెను. ఎప్పటికిని బరాయివాఁడు పరాయివాఁడే గాని తనవాఁడు గాఁడు. ౧౫

ఎవ్వఁడు తనవారిని వదలి శత్రువుల నాశ్రయించునో అతఁడు తన వారందఱు నశించిన వెనుక తా నాశ్రయించిన శత్రువులచేతనె వధింపఁ బడును. ౧౬

రాక్షసుఁడవు రావణుని తమ్ముఁడవగు విభీషణుఁడా! నా హోమమునకు విఘ్నముగా లక్ష్మణుని న్యగ్రోధమూలమునకుఁ దీసికొనివచ్చినావే. బంధుఁడవు కావున నిర్దయుఁడవై యింత కఠినముగా నీవు నాకపకారము చేసినావు కాని మఱియెవ్వఁడును జేయఁడు. (ఇట్లు నిర్దయుఁడవై యింతకఠినముగా నీవు బంధుఁడవగు నావిషయమయి యపకారము సేయుట యెంతమాత్రము యుక్తము కాదు) అని యింద్రజిత్తు విభీషణునితోఁ జెప్పెను. ౧౭

ఇత్యుక్తో భ్రాతృపుత్రేణ ప్రత్యువాచ విభీషణః,

అజానన్నివ మచ్ఛీలం కిం రాక్షస! వికత్థసే. ౧౮
రాక్షసేన్ద్రసుతాసాధో! పారుష్యం త్యజ గౌరవాత్,

కులే యద్యప్యహం జాతో రక్షసాం క్రూరకర్మణామ్. ౧౯
గుణోఽయం ప్రథమో నృణాం తన్మే శీలమరాక్షసమ్,

న రమే దారుణేనాహం న చాధర్మేణ వై రమే. ౨౦
భ్రాత్రా విషమశీలేన కథం భ్రాతా నిరస్యతే,

ధర్మాత్ప్రచ్యుతశీలం హి పురుషం పాపనిశ్చయమ్. ౨౧
త్యక్త్వా సుఖమవాప్నోతి హస్తా దాశీవిషం యథా,

హింసాపరస్వహరణే పరదారాభిమర్శనమ్. ౨౨
త్యాజ్య మాహు ర్దురాచారం వేశ్మ ప్రజ్వలితం యథా,

పరస్వానాం చ హరణం పరదారాభిమర్శనమ్. ౨౩
సుహృదా మతిశఙ్కా చ త్రయో దోషాః క్షయావహాః,

మహర్షీణాం వధో ఘోర స్సర్వదేవైశ్చ విగ్రహః. ౨౪
అభిమానశ్చ కోపశ్చ వైరిత్వం ప్రతికూలతా,
ఏతే దోషా మమ భ్రాతు ర్జీవితైశ్వర్యనాశనాః. ౨౫
గుణా న్ప్రచ్ఛాదయామాసుః పర్వతా నివ తోయదాః,

విభీషణుఁడు అన్నకొడుకు ఇంద్రజిత్తు చెప్పిన మాటను విని యతనికిట్లు బదులు చెప్పెను.

రాక్షసరాజకుమారుఁడా! దుష్టుఁడా! నీవు నాస్వభావంబు దెలిసియుఁ దెలియనివాఁడవువలె నెందు కిట్లు మాటలాడుచున్నావు? నేను పినతండ్రి నిట్లు గావించినాను కారణమువలన నీవు పరుషవచనము లాడవలదు. ౧౮

నేను క్రూరులగు రాక్షసులయింటఁ బుట్టిన వాఁడనైనను సత్పురుషుల యుత్తమస్వభావమువలె నాస్వభావము సాత్త్వికమే కాని రాక్షసస్వభావము కాదు ౧౯

క్రూరమయిన కార్యముగాని యధర్మము గాని మొదటనుండియే నాకెంత మాత్రము ఇష్టముగాదు. లేనియెడ స్వభావము భిన్నమగుటవలన మాత్రమె నాయన్నను నేను ఎట్లు వదలుదును? ౨౦

ధర్మమును వదలినవాఁడును బాపమునే సేయనిశ్చయించిన వాఁడునగు పురుషుని సహవాసమువలనఁ దనకును బాపముగలుగును గావున యోగ్యుఁడగు వాఁడు చేతికిఁ జుట్టుకొనిన సర్పమును వదలునట్లు అదుర్మార్గునింబరిత్యజించి సుఖంబు నొందవలయును. ౨౧

హింస, పరధనమును హరించుట, పరస్త్రీగమనము ఈదురాచారములు గలవానిని మండిపోవునట్టి గృహమును వదలునట్లు తక్షణంబ వదలివేయవలయు నని పెద్దలు చెప్పెదరు. ౨౨

పరధనముల హరించుటయుఁ బరస్త్రీలఁ బొందుటయు హితముఁగోరు స్నేహితుల నమ్మకుండుటయు నీమూఁడుదోషంబులు పురుషుని నశింపఁ జేయును. ౨౩

మహర్షులను క్రూరముగా వధించుటయు సమస్తదేవతలతోను యుద్ధము సేయుటయు గర్వము దీర్ఘకోపము బద్ధవైరము గలిగియుండుటయుఁ బరశ్రేయస్సును ద్వేషించుటయు ఐశ్వర్యంబును జీవితంబును నశింపఁ జేయునట్టి యీదోషంబులు నాయన్నయందుండుటవలన నివి మేఘంబులు పర్వతముల

దోషైరేతైః పరిత్యక్తో మయా భ్రాతా పితా తవ. ౨౬

నేయ మస్తి పురీ లఙ్కా న చ త్వం న చ తే పితా,
అతిమానీ చ బాలశ్చ దుర్వినీతశ్చ రాక్షస!. ౨౭

బద్ధ స్త్వం కాలపాశేన బ్రూహి మాం యద్యదిచ్ఛసి,
అద్య తే వ్యసనం ప్రాప్తం కిం మాం త్వ మిహ వక్ష్యసి. ౨౮

ప్రవేష్టుం న త్వయా శక్యో న్యగ్రోధో రాక్షసాధమ!,
ధర్షయిత్వా చ కాకుత్స్థౌ న శక్యం జీవితుం త్వయా. ౨౯

యుధ్యస్వ నరదేవేన లక్ష్మణేన రణే సహ,
హత స్త్వం దేవతాకార్యం కరిష్యసి యమక్షయే. ౩౦
నిదర్శయ స్వాత్మబలం సముద్యతం
కురుష్వ సర్వాయుధ సాయకవ్యయమ్,
న లక్ష్మణ స్యైత్య హి బాణగోచరం
త్వమద్య జీవన్ సబలో గమిష్యసి. ౩౧

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే సప్తాశీతితమస్సర్గః.

---

## అష్టాశీతితమస్సర్గః.

విభీషణవచ శ్శ్రుత్వా రావణిః క్రోధమూర్ఛితః,
అబ్రవీ త్పరుషం వాక్యం వేగేనాభ్యుత్పపాత హ. ౧
ఉద్యతాయుధనిస్త్రింశో రథే సుసమలఙ్కృతే,
కాలాశ్వయుక్తే మహతి స్థితః కాలాన్తకోపమః. ౨

నావరించునట్లు లతిసుగుణంబుల నన్నింటి నాచ్ఛాదించినవి. ౨౫

సీతండ్రి నాయన్నను రావణుని నేనీదోషంబులుగలవాఁడగుటవలన నె విడిచినాను. ౨౬

రాక్షసుఁడా! ఇఁకశీఘ్రంబున నె ఈ లంకాపురంబునందలి రాక్షసులును గర్వితుండవు దుష్టుఁడవగునీవును నీతండ్రి రావణుఁడును నశింపఁబోయెదరు. ౨౭

నీవు మృత్యుపాశంబునం దగులుకొంటివి. నన్నేమియనఁగోరెదవో అవన్నియుఁ జెప్పుము. నీయంతకాలము ప్రాప్తమయినప్పుడు నన్ను నిందించుటచే నేమి ప్రయోజనము? ౨౮

రాక్షసాధముఁడా! న్యగ్రోధవృక్షంబుఁ బ్రవేశించుట యిఁక నీకలవి గాదు మాయాసీతావధముచేఁ గకుత్స్థవంశసంభవులగు రామలక్ష్మణుల నవమానపఱిచినావు కావున నిఁక జీవించుటకును నీకు శక్యము గాదు. ౨౯

మనుష్యనాథుఁడగు లక్ష్మణునితో యుద్ధంబు సేయుము. హతుండవై యమలోకంబున యమదూత లాజ్ఞాపించు పనులు సేయుచుండెదవు. ౩౦

నీబలమంతయుఁ జూపుము. సమస్తములయిన యాయుధంబులను బాణంబులను బ్రయోగించి కాఁ జేయుము; నీవేమిచేసినను ఇప్పుడు లక్ష్మణుని బాణము బారింబడి నీవేమి నీసైనికులేమి యొంతమాత్రము జీవించి పోఁజాలరు. అని విభీషణుఁడు ఇంద్రజిత్తుతోఁ జెప్పెను. ౩౧

ఇది యెనుబదియేడవసర్గము.

## ఎనుబదియెనిమిదవసర్గము.

ఇంద్రజిత్తు విభీషణుని వచనంబు విని పరమక్రుద్ధుండై ఖడ్గాయుధములు చేపట్టి చక్కఁగానలంకృతంబయినగుఱ్ఱములు పూన్చిన మహారథంబుపైఁ బ్రలయకాలమునందలి యమునిభంగి భయంకరాకారుండై వెలుంగుచు అతిదీర్ఘంబును విశాలంబును మహావేగంబును సారవంతంబును భయంకరంబునగు

మహాప్రమాణ ముద్యమ్య విపులం వేగవ ద్దృఢమ్,
ధను ర్భీమం పరామృశ్య శరాం శ్చామిత్రనాశనాన్. 3
తం దదర్శ మహేష్వాసో రథే సుసమలఙ్కృతః,
అలఙ్కృత మమిత్రఘ్నం రాఘవస్యానుజం బలీ. ౪
హనుమత్పృష్ఠ మాసీన ముదయస్థరవిప్రభమ్,

ఉవాచైనం సమారబ్ధ స్సౌమిత్రిం సవిభీషణమ్. ౫
తాం శ్చ వానరశార్దూలాః పశ్యధ్వం మే పరాక్రమమ్,
అద్య మత్కార్ముకోత్సృష్టం శరవర్షం దురాసదమ్. ౬
ముక్తం వర్షమివాకాశే వారయిష్యథ సంయుగే,
అద్య వో మామకా బాణా మహాకార్ముకనిస్సృతాః. ౭
విధమిష్యన్తి గాత్రాణి తూలరాశి మివానలః,
తీక్ష్ణసాయకనిర్భిన్నాన్ శూలశక్త్యృష్టితోమరైః. ౮
అద్య వో గమయిష్యామి సర్వానేవ యమక్షయమ్,

క్షిపత శ్శరవర్షాణి క్షిప్రహస్తస్య మే యుధి. ౯
జీమూతస్యేవ నదతః కః స్థాస్యతి మమాగ్రతః,

రాత్రియుద్ధే మయా పూర్వం వజ్రాశనిసమై శ్శరైః. ౧౦
శాయితౌ స్థో మయా భూమౌ విసంజ్ఞౌ సపురస్సరౌ,
స్మృతి ర్న తేఽస్తి వా మన్యే వ్యక్తం వా యమసాదనమ్. ౧౧
ఆశీవిష మివ క్రుద్ధం యన్మాం యోద్ధుం వ్యవస్థితః,

ధనుస్సును శత్రువుల ఛేదించునట్టి తీక్ష్ణబాణంబులను గ్రహించి విభీషణుని కభిముఖంబుగాఁ బోయి పరుషవచనంబులు పలికెను. ౧, ౩

రథారూఢుండై చక్కఁగా నలంకృతుండై యున్నవాఁడును గొప్ప ధనుస్సు ధరించినవాఁడును బలవంతుఁడునగు నింద్రజిత్తు స్వతేజస్సుచేతనే యలంకృతుండును శత్రువులం దన్నిక వధించువాఁడును హనుమంతుని వీఁపునం గూర్చుండి యుదయపర్వతంబుపై నున్న సూర్యునిభంగి వెలుంగుచున్న వాఁడు నగు రామానుజుని లక్ష్మణుం జూచెను. ౪

ఇంద్రజిత్తు సంరంభంబున లక్ష్మణుని విభీషణుని ఆ వానరవీరులనుం జూచి యిట్లని పలికెను. ౫

ఇఁక నాపరాక్రమంబుఁ జూడుఁడు. ఇప్పుడు యుద్ధంబున ఆకాశంబునం గురియుం వర్షము వంటిదైన యెట్టివారికి సమీపింప నలవిగాని నాధనుర్ముక్త బాణవర్షంబు నెట్లు వారింపఁగలరో చూచెదను. ౬

ఇప్పుడు నాబాణంబులు ఈమహాధనుస్సునుండి వెడలినవై దూది నగ్ని హోత్రము దహించునట్లు మీ దేహములను దహింపఁగలవు. ౭

ఇప్పుడు మిమ్ము అందఱను దీక్ష్ణబాణంబులచేతను శూలంబులచేతను ఈటెలచేతను యష్టులచేతను దోమరంబులచేతను వధించి యమలోకంబున కంపెదను. ౮

అధికమయిన హస్తలాఘవముగల నేను యుద్ధంబున బాణవర్షంబులం గురియుచు మేఘంబువలె గర్జించుచుండఁగా నాయెదుట నెవఁడు నిలువఁ గలఁడు ?. ౯

మున్ను రాత్రియుద్ధ మపుడు మీయిద్దఱను మీతోడవచ్చిన వారలను వజ్రాశనులవంటి బాణములచే మూర్ఛితులయి నేలంబడునట్లు గావించినాను.

కుపితంబయిన పాము వంటి వాఁడనయిన నాతో మఱల యుద్ధము సేయ వచ్చితావు కావున నీవు ఆరాత్రియుద్ధమును మఱచితివో లేక నీకు మరణ కారమే ఆసన్న మాయెనో అని తలంచెదను. అని యింద్రజిత్తు లక్ష్మణుని

తచ్ఛ్రుత్వా రాక్షసేన్ద్రస్య గర్జితం లక్ష్మణ స్తదా. ౧౨
అభీతవదనః క్రుద్ధో రావణిం వాక్య మబ్రవీత్,

ఉక్తశ్చ దుర్గమః పారః కార్యాణాం రాక్షస! త్వయా. ౧౩
కార్యాణాం కర్మణా పారం యో గచ్ఛతి స బుద్ధిమాన్,

స త్వ మర్థస్య హీనార్థో దురవాపస్య కేన చిత్. ౧౪
వచో వ్యాహృత్య జానీషే కృతార్థోఽస్మీతి దుర్మతే!,

అన్తర్ధానగతేనాజౌ యస్త్వయా చరిత స్తదా. ౧౫
తస్కరాచరితో మార్గో నైష వీరనిషేవితః,

యథా బాణపథం ప్రాప్య స్థితోఽహం తవ రాక్షస!. ౧౬
దర్శయస్వాద్య త త్తేజో వాచా త్వం కిం వికత్థసే,

ఏవ ముక్తో ధనుర్భీమం పరామృశ్య మహాబలః. ౧౭
ససర్జ నిశితా న్బాణా నిన్ద్రజి త్సమితింజయః,

తే నిసృష్టా మహావేగా శ్శరా స్సర్పవిషోపమాః. ౧౮
సంప్రాప్య లక్ష్మణం పేతు శ్శ్వసన్త ఇవ పన్నగాః,

తోఁ జెప్పెను. ౧౧

అప్పుడు లక్ష్మణుఁడు ఇంద్రజిత్తు చెప్పిన మాటను విని యెంత మాత్రమును ముఖంబున భయవికారంబు నొందక కుపితుఁడై యతనితో నిట్లని చెప్పెను. ౧౨

రాక్షసుఁడా! నీవు మమ్ము యమునింటికిఁ బంపుట మొదలగు నీకు నెఱవేర్ప నలవికాని కార్యములను నెఱవేర్చునట్లు నోటం జెప్పినావే కాని చేసినవాఁడవు కావు. ఎవఁడు వ్యర్థముగా బీరములు పలుకక కార్యసిద్ధిని సాధించునో అతఁడు బుద్ధిమంతుఁడు గాని నీవు కావు. ౧౩

దుష్టబుద్ధీ! నీవు ఎందుకును గొఱగాని వాఁడవు. అట్టి నీవు ఎట్టివానికిని సాధ్యముగానట్టి మమ్ము జయించుటయను ప్రయోజనమును గుఱించి చేతఁగాని వాఁడవయినను జయించెద ననుమాట మాత్రము చెప్పి దానం గృతార్థుఁడ వయినట్లు తలంచెదవు. ౧౪

అప్పుడు రాత్రియుద్ధమునందు నీవు మాకుఁ గనఁబడక యంతర్హితుండవై యుద్ధము చేసితివే అది దొంగలుచేయుఁపనిగాని వీరులుచేయఁ దగినది కాదు. ౧౫

రాక్షసుఁడా! నే నిప్పుడు నీబాణములకు లక్ష్యమునై నీయెదుట నిలిచియున్నాను గదా! ఇప్పుడు అపరాక్రమును జక్కఁగాఁ జూపుము. వ్యర్థముగా నిన్ను నీవే పొగడుకొనుటచేత నేమి ప్రయోజనము? అని లక్ష్మణుఁడు ఇంద్రజిత్తుతోఁ జెప్పెను. ౧౬

మహాబలుఁడును బెక్కుయుద్ధంబుల జయించిన వాఁడునగు నింద్రజిత్తు లక్ష్మణుని మాటను విని భయంకరంబగు ధనుస్సు సారించి తీక్ష్ణబాణంబులఁ బ్రయోగించెను. ౧౭

మహావేగంబులును సర్పముయొక్క విషమువలె భయంకరసములును క్రుద్ధసర్పములవలె నతితీక్ష్ణంబులునగు నాయింద్రజిత్తు ప్రయోగించిన బాణంబులు లక్ష్మణుని దేహంబున నాటినవి. ౧౮

శరై రతిమహావేగై ర్వేగవా న్రావణాత్మజః. ౧౯
సౌమిత్రి మిన్ద్రజి ద్యుద్ధే వివ్యాథ శుభలక్షణమ్,

సశరై రతివిద్ధాఙ్గో రుధిరేణ సముక్షితః. ౨౦
శుశుభే లక్ష్మణ శ్శ్రీమా న్విధూమ ఇవ పావకః,
ఇన్ద్రజిత్త్వాత్మనః కర్మ ప్రసమీక్ష్యాధిగమ్య చ. ౨౧
వినద్య సుమహానాద మిదం వచన మబ్రవీత్,
పత్త్రిణ శ్శితధారా స్తే శరా మత్కార్ముకచ్యుతాః. ౨౨
ఆదాస్యన్తేఽద్య సౌమిత్రే! జీవితం జీవితాన్తగాః,

అద్య గోమాయుసఙ్ఘా శ్చ శ్యేనసఙ్ఘాశ్చ లక్ష్మణ!. ౨౩
గృధ్రా శ్చ నిపతన్తు త్వాం గతాసుం నిహతం మయా,
క్షత్రబన్ధుం సదాఽనార్యం రామః పరమదుర్మతిః. ౨౪
భక్తం భ్రాతర మద్యైవ త్వాం ద్రక్ష్యతి మయా హతమ్,

విశస్తకవచం భూమౌ వ్యపవిద్ధశరాసనమ్. ౨౫
హృతోత్తమాఙ్గం సౌమిత్రే! త్వా మద్య నిహతం మయా,

ఇతి బ్రువాణం సంరబ్ధః పరుషం రావణాత్మజమ్. ౨౬
హేతుమ ద్వాక్య మత్యర్థం లక్ష్మణః ప్రత్యువాచ హ,

వాగ్బలం త్యజ దుర్బుద్ధే! క్రూరకర్మాఽసి రాక్షస!. ౨౭
అథ కస్మాద్వదస్యేతత్సంపాదయ సుకర్మణా,

యుద్ధంబున వేగవంతుడగు రావణకుమారుండు మిక్కిలియుం సుంద రాంగుఁడగు లక్ష్మణుని దేహంబునందు మహావేగంబులగు ననేక బాణంబులు చొప్పించెను. ౧౯

శ్రీమంతుఁడగు నాలక్ష్మణుండు దేహంబంతయుం బాణంబులు తగులుట చేత నెత్తుటం దడుపఁబడి పొగలేని యగ్నివలెఁ బ్రకాశించెను. ౨౦

ఇంద్రజిత్తు తాను గావించిన కార్యముచే లక్ష్మణుఁడు నొచ్చుటంగని మహాధ్వని గలుగునట్లు సింహనాదంబు చేసి యిట్లని చెప్పెను. ౨౧

లక్ష్మణుఁడా! ఱెక్కలు గట్టినవియుం తీక్ష్ణంబులును ప్రాణనాశంబు చేయునవియుం నగు నాధనుర్ముక్తంబులగు బాణంబులు ఇప్పుడు నీప్రాణంబులు గొనఁగలవు.

లక్ష్మణుఁడా! ఇప్పుడు నాచే నిహతుఁడవైన నీదేహము నక్కలకును డేగలకును గద్దలకును ఆహార మగుఁగాక. ౨౩

మిక్కిలియుం దురాత్ముఁడగు రాముఁడు నిజసోదరుండవయిన క్షత్రి యాధముఁడవు దుష్టుఁడవు భక్తుఁడవగు నీవు ఇప్పుడు నాచే నిహతుఁడవగుటను జూఁడగలఁడు. ౨౪

లక్ష్మణుఁడా! నేను నిన్ను వధించి నీతలను గొనిపోఁగాఁ గవచము ఛిన్నమయి భూమిపయిఁ బాఱవేయఁబడిన ధనుస్సుతోఁగూడిన నీమొండెము నిప్పుడు రాముఁడు చూడఁ గలఁడు. అని ఇంద్రజిత్తు లక్ష్మణునితోఁ జెప్పెను. ౨౫

ఇట్లు వేగిరపాటునం బరుషంబుగాఁ బలుకుచున్న రావణకుమారు నింద్రజిత్తుంజూచి లక్ష్మణుండు యుక్తియుక్తంబును మహార్థంబునగు వాక్యంబున నిట్లనియె. ౨౬

దుర్బుద్ధివగు రాక్షసుఁడా! ఇట్లు నోటబీరంబులు పలుకుటను వదలుము. నీవుసమర్థుఁడవేకాని యిప్పుడామాటను నోటం జెప్పుటచే నేమి ప్రయోజనము? బాహుబలంబునం గార్యంబు నెఱవేర్చిచూపుము. ౨౭

అకృత్వా కత్థసే కర్మ కిమర్థమిహ రాక్షస!. ౨౮
కురు తత్కర్మ యేనాహం శ్రద్దధ్యాం తవ కత్థనమ్,
అనుక్త్వా పరుషం వాక్యం కించిదప్యనవక్షిపన్. ౨౯
అవికత్థ న్వధిష్యామి త్వాం పశ్య పురుషాధమ!,

ఇత్యుక్త్వా పఞ్చ నారాచా నాకర్ణం పూరితాన్ శితాన్. 3౦
నిజఘాన మహావేగా న్లక్ష్మణో రాక్షసోరసి,

సుపత్త్రవాజితా బాణా జ్వలితా ఇవ పన్నగాః. 3౧
నైరృతోరస్యభాస న్త సవితూ రశ్మయో యథా,

స శరై రాహత స్తేన సరోషో రావణాత్మజః. 3౨
సుప్రయుక్తై స్త్రిభి ర్బాణైః ప్రతివివ్యాధ లక్ష్మణమ్,

స బభూవ తదా భీమో నరరాక్షససింహయోః. 33
విమర్ద స్తుములో యుద్ధే పరస్పరజయైషిణోః,

ఉభౌ హి బలసంపన్నా వుభౌ విక్రమశాలినౌ. 3౪
ఉభావపి సువిక్రాన్తౌ సర్వశస్త్రాస్త్రకోవిదౌ,
ఉభౌ పరమదుర్జ్ఞేయా వతుల్యబలతేజసౌ. 3౫

యుయుధాతే తదా వీరౌ గ్రహా వివ నభోగతౌ,

బలవృత్రా వివాభీతౌ యుధి తౌ దుష్ప్రధర్షణౌ. 3౬
యుయుధాతే మహాత్మానౌ తదా కేసరిణా వివ,

రాక్షసుఁడా! పనిచేయక యిచ్చట నిన్ను నీవే పొగడుకొనుటవలన నేఁమిగలదు? నేను నీమాటను నమ్మునట్లు కార్యముగావించి చూపుము. ౨౮

పురుషాధముఁడవగు నింద్రజిత్తా! నేను పరుషవచనంబు లాడకయు కొంచెమేని నిన్నాక్షేపింపకయు ఆత్మస్తుతి చేసికొనకయు నిన్నిప్పుడు వధించి పుచ్చెదను. చూడుము. అని లక్ష్మణుఁడు ఇంద్రజిత్తుతోఁ జెప్పెను. ౨౯

ఇట్లు పలికి లక్ష్మణుఁడు మహావేగంబులుఁ దీక్ష్ణంబులునగు నైదుబాణంబులను అల్లెత్రాడు చెవివఱకు సాకర్షించి యింద్రజిత్తు వక్షస్థలంబున నాటెను. ౩౦

మంచి ఱెక్కలు కట్టియుండుటచే మహావేగంబులగు నాబాణంబులం ఘోరసర్పములుంబోలె జ్వలించుచు నారాక్షసుని వక్షంబున సూర్యకిరణంబులకరణి వెలింగినవి. ౩౧

రావణకుమారుండు లక్ష్మణునిచే బాణంబులం బ్రహారింపఁబడినవాఁడై కోపించి మూఁడుబాణంబులు గుఱిదప్పక చెవివఱకు లాగి లక్ష్మణునిపయిం బ్రయోగించెను. ౩౨

అప్పుడు యుద్ధంబున మనుష్యశ్రేష్ఠుఁడగు లక్ష్మణుఁడు రాక్షసశ్రేష్ఠుఁడగునింద్రజిత్తును ఒకరినొకరు జయింపఁగోరి యొండొరులపైఁ జేయం బాణప్రయోగము భయంకరంబయి యొప్పెను. ౩౩

ఇంద్రజిల్లక్ష్మణులు ఇద్దఱును బలవంతులు మహాపరాక్రమశాలులు సమస్తాయుధములయందు నేర్పరులు సమస్తదివ్యాస్త్రంబులు దెలిసిన వారలు జయింపనలవిగాని వారు సరిలేని బలపరాక్రమంబులు గలవారు కావున ఒకరికొకరు సమముగాఁ బోరిరి. ౩౪-౩౫

అప్పుడు వీరులగు నింద్రజిల్లక్ష్మణులు ఆకాశంబున గ్రహములు పోరినట్లు యుద్ధము చేసిరి.

అప్పుడు యుద్ధంబున నెట్టివారికి నెదిరింపనలవిగానివారలును మహాపరాక్రమశాలులు నగు నాయింద్రజిల్లక్ష్మణులు ఎంతమాత్రము భయము

బహూనా నవసృజన్తౌ హి మార్గణౌఘా నవస్థితౌ. ౩౭
నరరాక్షససింహౌ తౌ ప్రహృష్టా వభ్యయుధ్యతామ్.

సుసంప్రహృష్టౌ నరరాక్షసో త్తమౌ
జయైషిణౌ మార్గణచాపధారిణౌ,
పరస్పరం తౌ ప్రవవర్షతు ర్భృశం
శరౌఘవర్షేణ వలాహకావివ. ౩౮
అభిప్రవృద్ధౌ యుధి యుద్ధకోవిదౌ
శరాసిచణ్డౌ శితశస్త్రధారిణౌ,
అభీక్ష్ణ మావివ్యధతు ర్మహాబలౌ
మహాహవే శమ్బరవాసవా వివ.

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే ఽష్టాశీతితమస్సర్గః. ౮౮

---

ఏకోననవతితమస్సర్గః.

తత శ్శరం దాశరథి స్సన్ధాయామిత్రకర్శనః,
ససర్జ రాక్షసేన్ద్రాయ క్రుద్ధ స్సర్ప ఇవ శ్వసన్. ౧

తస్య జ్యాతలనిర్ఘోషం స శ్రుత్వా రావణాత్మజః,
వివర్ణవదనో భూత్వా లక్ష్మణం సముదైక్షత. ౨
తం వివర్ణముఖం దృష్ట్వా రాక్షసం రావణాత్మజమ్,
సౌమిత్రిం యుద్ధసంయు క్తం ప్రత్యువాచ విభీషణః. ౩
నిమిత్తాన్యనుపశ్యామి యా న్యస్మి న్రావణాత్మజే,
త్వర తేన మహాబాహో! భగ్న ఏష న సంశయః. ౪

నొందక వృత్రుండును దేవేంద్రుఁడునుఁబోరినట్లుసింహములు పోరినట్లుపోరిరి. ౩౧

మనుష్యశ్రేష్ఠుఁడగు లక్ష్మణుఁడును రాక్షసోత్తముఁడగు నింద్రజిత్తును వెనుదీయక పెక్కుబాణసమూహంబుల నొండొరులపయిం బ్రయోగించుచు సంతోషంబునం బోరిరి. ౩౨

లక్ష్మణుఁడును నింద్రజిత్తును ధనుర్బాణంబులు ధరించి మిక్కిలి సంతుష్టులయి యొండొరుల జయించు తమకంబున మేఘములు జలమువర్షించు నట్లు ఒకరిపై నొకరు బాణసమూహంబులు ప్రయోగించిరి. ౩౩

యుద్ధంబునం బండితులును ఖడ్గబాణంబులు మొదలగు తీక్ష్ణములయిన యాయుధములు ధరించియున్న వరులును మహాబలశాలులునగు నా యింద్రజిల్లక్ష్మణులు యుద్ధంబుననిమడించిన శౌర్యంబుతో శంబరుండును ఇంద్రుఁడునుంబోలె నొకరితో నొకరుపోరిరి. ౩౪

ఇది యెనుబదియెనిమిదవసర్గము.

---

## ఎనుబదితొమ్మిదవసర్గము.

అంత శత్రునాశనుఁడగు లక్ష్మణుండు కుపితుండయి కృష్ణసర్పంబు వోలె నిట్టూర్పులు నిగుడించుచు నొకదివ్యబాణంబు వింటం గూర్చి యింద్రజిత్తునిపైఁ బ్రయోగించెను. ౧

రావణకుమారుఁడు లక్ష్మణునియల్లెత్రాటిధ్వనినివిని భయంబునం దెల్లఁబాఱిన మొగంబుతో లక్ష్మణుం జూచెను. ౨

విభీషణుఁడు భయంబున నింద్రజిత్తుని మొగంబు వెల్లనగుటం జూచి యుద్ధంబునం దేకాగ్రుండై యున్న లక్ష్మణుం జూచి యిట్లనియెను. ౩

మహాబలంబులగు బాహువులు గల లక్ష్మణుఁడా! ఇంద్రజిత్తు నందుఁ గలిగిన ముఖవైవర్ణ్యము మొదలగు నిమిత్తంబులం జూడఁగా నితఁడు భంగము నొందెనని స్పష్టముగాఁ దెలియఁజేయుచున్నది కావున నీవు శీఘ్రంబున వీని వధింపుము. అని విభీషణుఁడు లక్ష్మణునితోఁ జెప్పెను. ౪

తత స్సన్ధాయ సౌమిత్రి ర్బాణానగ్నిశిఖోపమాన్,
ముమోచ నిశితాం స్తస్మిꣳ సర్పానివ మహావిషాన్. ౫

శక్రాశనిసమస్పర్శై ర్లక్ష్మణే నాహత శ్శరైః,
ముహూర్త మభవ న్మూఢ స్సర్వసంక్షుభితేన్ద్రియః. ౬

ఉపలభ్య ముహూర్తేన సంజ్ఞాం ప్రత్యాగతేన్ద్రియః,
దదర్శావస్థితం వీరం వీరో దశరథాత్మజమ్. ౭

సోఽభిచక్రామ సౌమిత్రిం రోషా త్సంరక్తలోచనః,
అబ్రవీ చ్చైన మాసాద్య పున స్స పరుషం వచః. ౮
కిం న స్మరసి తద్యుద్ధే ప్రథమే మత్పరాక్రమమ్,
నిబద్ధ స్త్వం సహభ్రాత్రా యదా భువి విచేష్టసే. ౯
యువాం ఖలు మయా యుద్ధే శక్రాశనిసమైశ్శరైః,
శాయితౌ ప్రథమం భూమౌ విసంజ్ఞౌ సపురస్సరౌ. ౧౦

స్మృతి ర్వా నాస్తి తే మన్యే వ్యక్తం వా యమసాదనమ్,
గన్తు మిచ్ఛసి యస్మా త్త్వం మాం ధర్షయితు మిచ్ఛసి. ౧౧

యది తే ప్రథమే యుద్ధే న దృష్టో మత్పరాక్రమః,
అద్య తే దర్శయిష్యామి తిష్ఠేదానీం వ్యవస్థితః. ౧౨

ఇత్యుక్త్వా స సప్తభి ర్బాణై రభివివ్యాధ లక్ష్మణమ్,
దశభిస్తు హనూమన్తం తీక్ష్ణధారై శ్శరోత్తమైః. ౧౩
తత శ్శరశతేనైవ సుప్రయుక్తేన వీర్యవాన్,

అంత లక్ష్మణుండు అగ్నిజ్వాలలుం బోలె వెలుంగుచున్నవియుం సర్పంబులుం బోలె మహావిషంబులునగు తీక్ష్ణబాణంబులను వింట సంధించి యింద్రజిత్తుపైఁ బ్రయోగించెను. ౫

ఇంద్రజిత్తు ఇంద్రుని వజ్రాయుధమువంటి బాణంముల లక్ష్మణునిచే నొప్పింపఁబడి ముహూర్తకాలము సమస్తేంద్రియంబుల జ్ఞానంబు దప్పి మూర్ఛనొందెను. ౬

వీరుండగు రావణపుత్త్రుఁడు ముహూర్తంబునకుఁ దెలివొంది తన యెదుట యుద్ధంబునకు నిరీక్షించుచు నిలిచియున్న వీరుఁడగు దశరథకుమారుం గనెను. ౭

ఆయింద్రజిత్తు కోపంబునం గన్నుల నెఱ్ఱఁదనంబు గదుర లక్ష్మణుని మీఁదికిఁ బోయి యతని సమీపించి మఱలఁ బరుషంబుగా నిట్లనియె. ౮

నీవు నీయన్నయుం బాణంబులచే బద్ధులరయి నేలం బడి పొరలు చుంటిరే; ఆమొదటియుద్ధమునందలి నాపరాక్రమమును మఱచిపోతివా యేమి?

ముందు యుద్ధంబున నేను మీయన్నదమ్ముల నిర్వురను మీపరివారములను వజ్రాయుధ సమానములగు బాణములచే మూర్ఛితులం జేసి నేలం బడునట్లు గావించినాను గదా! ౧౦

అట్లు నాపరాక్రమము దెలిసియు నీవు నన్నెదిరింప వచ్చుటం జూడఁగా బుద్ధిలేనివాఁడవని గాని లేక యమలోకమునకుఁ బోవ నాశగొనియున్నావని గాని స్పష్టముగాఁ దోఁచుచున్నది. ౧౧

మొదటియుద్ధమపుడు నాపరాక్రమమును నీవు చూడకున్నయెడ ఇప్పుడు నీకుఁ జూపెదను. ఓడక నిలిచి యుద్ధము సేయుము. అని యింద్రజిత్తు లక్ష్మణునితోఁ జెప్పెను. ౧౨

ఈప్రకారంబునం బలికి యయ్యింద్రజిత్తు లక్ష్మణు నేడు బాణంబులను హనుమంతుని దీక్ష్ణంబులగు పది యుత్తమబాణంబులను నొప్పించెను. ౧౩

అంతఁ బరాక్రమవంతుఁడగు నింద్రజిత్తు లక్ష్మణాది విషయము కన్న

క్రోధా ద్ద్విగుణసంరబ్ధో నిర్బిభేద విభీషణమ్. ౧౪

తద్దృష్ట్వేన్ద్రజితా కర్మ కృతం రామానుజ స్తదా,
అచిన్తయిత్వా ప్రహసన్నైతత్కించి దితి బ్రువన్. ౧౫

ముమోచ స శరా న్ఘోరాన్ సంగృహ్య నరపుఙ్గవః,
అభీతవదనః క్రుద్ధో రావణిం లక్ష్మణో యుధి. ౧౬
నైవం రణగతాశ్శూరాః ప్రహర న్తి నిశాచర!,
లఘవశ్చాల్పవీర్యాశ్చ సుఖా హీమే శరా స్తవ. ౧౭

నైవం శూరాస్తు యుధ్యన్తే సమరే జయకాఙ్క్షిణః,

ఇత్యేవం తం బ్రువాణస్తు శరవర్షై రవాకిరత్. ౧౮
తస్య బాణైః సువిధ్వస్తం కవచం హేమభూషితమ్,
వ్యశీర్యత రథోపస్థే తారాజాల మివామ్బరాత్. ౧౯

విధూతవర్మా నారాచై ర్బభూవ స కృతవ్రణః,
ఇన్ద్రజి త్సమరే వీరః ప్రరూఢ ఇవ సానుమాన్. ౨౦

తత శ్శరసహస్రేణ సంక్రుద్ధో రావణాత్మజః,
బిభేద సమరే వీరం లక్ష్మణం భీమవిక్రమః. ౨౧
వ్యశీర్యత మహ ద్దివ్యం కవచం లక్ష్మణస్య చ,
కృతప్రతికృతాన్యోన్యం బభూవతు రభిద్రుతౌ. ౨౨

నిను మఱికోపంబున ఆకర్ణపూరితంబులగు నూఱుబాణంబులచే విభీషణుం జొప్పించెను. ౧౪

ఇంద్రజిత్తు గావించిన కార్యముం జూచి లక్ష్మణుండు దాని సరకు సేయక నవ్వుచు "ఈబాణములు కొంచెమేని బాధింప కున్నవి" అని పలికెను. ౧౫

పురుషోత్తముఁ డగు వాలక్ష్మణుండు ఎంతమాత్రము భయమునొందక కుపితుఁడై భయంకరబాణంబులు దీసి యింద్రజిత్తుపైఁ బ్రయోగించెను. ౧౬

రాక్షసుఁడా! నీబాణములు ఎంతమాత్రము బలము లేనందునఁ దేలికగాను బాధలేక సుఖముగా నున్నవి. యుద్ధంబున శూరులు ఎచటనేనియుంనింత చులుకనగాఁ బ్రహరింపరు. ౧౭

యుద్ధంబున జయముఁ గోరునట్టి శూరులు మాత్రము ఈప్రకారమున యుద్ధము సేయరు. అని లక్ష్మణుండు ఇంద్రజిత్తుతోఁ జెప్పెను.

లక్ష్మణుండిట్లు పలుకుచునే యింద్రజిత్తుపై బాణవర్షంబులు గురిసెను.

బంగారముచే నలంకృతంబయిన యీ యింద్రజిత్తు కవచము లక్ష్మణ బాణంబులచేఁ దునకలుగా ఖండింపఁబడి ఆకాశంబునుండి నక్షత్రంబులు రాలునట్లు రథంపై రాలెను. ౧౯

యుద్ధంబునఁ గవచంబు భిన్నమయి బాణంబులచే మిక్కిలి వ్రణంబులు దగులుటంజేసి నీగుఁడగు నాయింద్రజిత్తు పర్వతంబువోలెఁ గొంతదడవు నిశ్చలుండై యుండెను. ౨౦

అంత భయంకర పరాక్రముఁడగు నింద్రజిత్తు యుద్ధంబునం బరమ క్రుద్ధుండై వీరుఁడైన లక్ష్మణుని వేయి బాణంబులచే నొప్పించెను. ౨౧

శ్రేష్ఠంబును సారవంతంబునగు లక్ష్మణుని కవచముగూడ భిగ్నమయ్యె; అట్లు ఇంద్రజిల్లక్ష్మణులు ఒకరు చేసినదానికి మఱియొకరు బదులు చేయుచు కొండొరులం దలపడి పోరిరి. ౨౨

అభీక్ష్ణం నిశ్వసన్తౌ తౌ యుద్ధ్యేతాం తుములం యుధి,
శరసంకృత్తసర్వాఙ్గౌ సర్వతో రుధిరోక్షితౌ. ౨౩

సుదీర్ఘకాలం తౌ వీరా వన్యోన్యం నిశితై శ్శరైః,
తతక్షతు ర్మహాత్మానౌ రణకర్మవిశారదౌ. ౨౪
బభూవతు శ్చాత్మజయే యత్తౌ భీమపరాక్రమౌ,
తౌ శరౌఘై స్తదా కీర్ణౌ నికృత్తకవచధ్వజౌ. ౨౫
స్రవన్తౌ రుధిరం చోష్ణం జలం ప్రస్రవణావివ,

శరవర్షం తతో ఘోరం ముంచతోర్భీమనిస్వనమ్. ౨౬
సాసారయోరివాకాశే నీలయోః కాలమేఘయోః,
తయో రథ మహా న్కాలో వ్యత్యయా ద్యుధ్యమానయోః.

న చ తౌ యుద్ధవైముఖ్యం శ్రమం వా ప్యుపజగ్మతుః,

అస్త్రా ణ్యస్త్రవిదాం శ్రేష్ఠౌ దర్శయన్తౌ పునఃపునః. ౨౭
శరా నుచ్చావచాకారా నన్తరిక్షే బబన్ధతుః,

వ్యపేతదోష మస్యన్తౌ లఘు చిత్రం చ సుష్ఠు చ. ౨౮
ఉభౌ తౌ తుములం ఘోరం చక్రతు ర్నరరాక్షసౌ,

తయోః పృథక్పృథ గ్భీమ శ్శుశ్రువే తలనిస్వనః. ౩౦
ప్రకమ్పయ న్జనం ఘోరో నిర్ఘాత ఇవ దారుణః,

స తయో ర్భ్రాజతే శబ్ద స్తదా సమరసక్తయోః. ౩౧

ఇంద్రజిల్లక్ష్మణులు దేహమంతయును బాణములచే గాయములు చేయఁబడి నెత్తుటం దడుపఁబడిన వారలయి యధికముగా నిట్టూర్పులు నిగుడించుచుఁ బోరిరి. ౨౩

మహాపరాక్రమశాలులు యుద్ధమునందు నేర్పరులునగు నాయింద్రజిల్లక్ష్మణులు బహుకాలమువఱకు ఒకరి నొకరు తీక్ష్ణబాణంబుల నొప్పించిరి.

అప్పుడు భయంకర పరాక్రములగు నాయింద్రజిల్లక్ష్మణులు ఒకరిపై నొకరులు బాణసమూహంబులు పరఁగించుచు ఒండొరుల కవచంబులను ధ్వజంబులను ఖండించి సెలయేట్లు జలంబు స్రవించునట్లు వేఁడినెత్తురు స్రవించుచు జయంబు నొందుటకై ప్రయత్నంబునఁ బోరిరి. ౨౪

ప్రళయకాలంబున నల్లని మేఘంబులు ధారలుగా వర్షంబు గురియునట్లు ఆయింద్రజిల్లక్ష్మణులు ఒకరిపై నొకరు భయంకరముగా భయంకర ధ్వని గలుగునట్లు బాణవర్షంబులు గురియుచు బహుకాలము యుద్ధము చేసిరి. ౨౫-౨౭

అట్లు బహుకాలము యుద్ధము చేయుచున్నను ఆ యింద్రజిల్లక్ష్మణులకు విసుగుగాని శ్రమముగాని యెంతమాత్రము గలుగ లేదు.

సమస్తదివ్యాస్త్రంబులు నేర్చినవారిలో నుత్తములగు నాయింద్రజిల్లక్ష్మణులు ఒకరిపై నొకరు దివ్యాస్త్రంబులు ప్రయోగింపుచు ఆకాశంబు నిండునట్లు నానావిధములైన బాణంబులం బరఁగించిరి. ౨౮

రాక్షసుండును రఘువీరుఁడును ఒక బాణమేని వ్యర్థముగానట్లుగా నాశ్చర్యకరంబగు లాగున వేగంబునఁజక్కఁగా నొండొరులపై బాణములు ప్రయోగించుచు భయంకరంబుగా యుద్ధముగావించిరి. ౨౯

ఆయింద్రజిల్లక్ష్మణుల జ్యాతలధ్వని ఉభయసైనికులను వెఱపించుచు పిడుగు పడునపుడు గలుగు ధ్వనివలె భయంకరంబై వేఱువేఱుగా వినంబడినది. ౩౦

అప్పుడు ఆయింద్రజిల్లక్ష్మణులు యుద్ధము సేయుచుండఁగా ఆకాశం

సుఘోరయో ర్నిష్టనతో ర్గగనే మేఘయో రివ,
సువర్ణపుఙ్ఖై ర్నారాచై ర్బలవన్తౌ కృతవ్రణౌ. 3౨
ప్రసుస్రువాతే రుధిరం కీర్తిమన్తౌ జయే ధృతౌ,

తే గాత్రయో ర్నిపతితా రుక్మపుఙ్ఖా శ్శరా యుధి. 33
అసృ‌గ్దిగ్ధా వినిష్పత్య వివిశు ర్ధరణీతలమ్,
అన్యే సునిశితై శ్శస్త్రై రాకాశే సంజఘట్టిరే. 3౪
బభఞ్జు శ్చిచ్ఛిదు శ్చాన్యే తయో ర్బాణా స్సహస్రశః,

స బభూవ రణో ఘోర స్తయో ర్బాణమయశ్చ యః. 3౫
అగ్నిభ్యా మివ దీప్తాభ్యాం సత్రే కుశమయ శ్చ యః,

తయోః కృతవ్రణౌ దేహౌ శుశుభాతే మహాత్మనోః. 3౬
సపుష్పా వివ నిష్పత్రౌ వనే శాల్మలికింశుకౌ,

చక్రతు స్తుములం ఘోరం సన్నిపాతం ముహుర్ముహుః. 3౭
ఇన్ద్రజి ల్లక్ష్మణ శ్చైవ పరస్పరవధైషిణౌ,
లక్ష్మణో రావణిం యుద్ధే రావణి శ్చాపి లక్ష్మణమ్. 3౮
అన్యోన్యం తా వభిఘ్నన్తౌ న శ్రమం ప్రత్యపద్యతామ్,
బాణజాలై శ్శరీరస్థై రవగాఢై స్తరస్వినౌ. 3౯
శుశుభాతే మహావీర్యౌ ప్రరూఢావివ పర్వతౌ,

బున గర్జించుచున్న భయంకరంబులగు మేఘములయొక్క ధ్వనివంటి మహాధ్వని వినంబడినది. ౩౦

అధికమయిన కీర్తిగల వారలును జయము నొందవలెనని పట్టుదలతో యుద్ధము సేయుచున్న వారలును బలవంతులు నగు నింద్రజిత్తును లక్ష్మణుండును బంగారు పింజలుగల బాణంబులచే గాయంబులు నొందుటఁజేసి వారిదేహంబులనుండి యధికంబుగా నెత్తురు గాఱినది. ౩౧

యుద్ధంబునఁ గాంచనాలంకృతంబులగు బాణంబులు రాక్షస రఘువీర దేహంబులం జొచ్చి నెత్తురుతోఁగూడ వెడలి భూమిం బ్రవేశించినవి. ౩౩

ఆ వీరులు ప్రయోగించిన కొన్ని బాణంబులు ఆకాశంబునఁ దీక్ష్ణంబులగు సాయుధంబులం దాఁకినవి. మఱికొన్ని యితరబాణంబులను వేనవేలుగా ఖండించినవి. ౩౪

ఆయుద్ధము చూపరులకు భయంకరంబై యొప్పినది. అందు ఇంద్రజిల్లక్ష్మణులు ప్రయోగించునట్టి బాణసమూహము యజ్ఞమునందు జ్వలించుచున్న గార్హపత్యాహవనీయాగ్నిహోత్రంబులతోఁ గూడిన దర్భసమూహము వలె నొప్పెను. ౩౫

మహాపరాక్రమశాలులగు నాశూరుల దేహములు గాయములు దగిలియుండుటవలన వనంబున నెఱ్ఱని పుష్పములతో నిండి యాకులే లేకయున్న బూరుగు మోదుగు చెట్లులంబోలె బ్రకాశించినవి. ౩౬

రావణుని కొడుకును దశరథునిపుత్రుఁడును ఒకరినొకరు వధింపఁ గోరిన వారలయి మాటిమాటికి భయంకరమగునట్లు యుద్ధము గావించిరి. ౩౭

యుద్ధంబున లక్ష్మణుండు రావణపుత్త్రుని రావణపుత్త్రుఁడు లక్ష్మణుని బరస్పరము నొప్పించుచుఁ బోరినను ఎంతమాత్రము శ్రమము నొందరైరి. ౩౮

వేగవంతులు మహాబలశాలులు నగు నావీరులు బాణసమూహములు దేహంబునం గ్రుచ్చుకొని యుండుటవలన వృక్షములు మొలిచిన పర్వతంబులకరణిం బ్రకాశించిరి. ౩౯

తయో రుధిరసిక్తాని సంవృతాని శరై ర్భృశమ్. ౪౦
బభ్రాజు స్సర్వగాత్రాణి జ్వలన్త ఇవ పావకాః,
తయో రథ మహా న్కాలో వ్యత్యయాద్యుధ్యమానయోః.
న చ తౌ యుద్ధవైముఖ్యం శ్రమం వా ప్యుపజగ్మతుః.

అథ సమరపరిశ్రమం నిహన్తుం
సమరముఖే ష్వజితస్య లక్ష్మణస్య,
ప్రియహిత ముపపాదయ న్మహౌజా
స్సమర ముపేత్య విభీషణోఽవతస్థే. ౪౧

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే ఏకోననవతితమస్సర్గః.

---

నవతితమస్సర్గః.

యుధ్యమానౌ తు తౌ దృష్ట్వా ప్రసక్తౌ నరరాక్షసౌ,
ప్రభిన్నావివ మాతఙ్గౌ పరస్పరవధైషిణౌ. ౧
తౌ ద్రష్టుకామ స్సఙ్గ్రామే పరస్పరగతౌ బలీ,
శూర స్స రావణభ్రాతా తస్థౌ సఙ్గ్రామమూర్ధని. ౨
తతో విస్ఫారయామాస మహ ద్ధను రవస్థితః,
ఉత్ససర్జ చ తీక్ష్ణాగ్రా న్రాక్షసేషు మహాశరాన్. ౩

తే శరా శ్శిఖిసంకాశా నిపత న్త స్సమాహితాః,
రాక్షసా న్దారయామాసు ర్వజ్రా ణీవ మహాగిరీన్. ౪
విభీషణస్యానుచరా స్తేఽపి శూలాసిపట్టసైః,
చిచ్ఛిదు స్సమరే వీరా న్రాక్షసా న్రాక్షసోత్తమాః. ౫
రాక్షసై స్తైః పరివృత స్స తదా తు విభీషణః,
బభౌ మధ్యే ప్రహృష్టానాం కలభానా మివ ద్విపః. ౬

బాణంబులచేఁ గప్పఁబడి నెత్తుటం దడిసియున్న యావీరుల యవ
యవములు జ్వలించుచున్న యగ్నిహోత్రమ్ములభంగి వెలింగెను. ౪౦

అంత నారావణకుమారుఁడును దశరథపుత్త్రుఁడును బెద్దకాలము యుద్ధము సేయుచున్నను వారికి యుద్ధముపై విసుగుగాని శ్రమముగాని యెంత మాత్రము గలుగదయ్యెను. ౪౧

అంత మహాపరాక్రముఁడగు విభీషణుఁడు యుద్ధముఖంబుల నెవ్వరి చేతను జయింప నలవిగాని లక్ష్మణునకు యుద్ధాయాసము దీఱుటకై యతనికి సంతోషంబును హితంబును గల్గునట్లు యుద్ధరంగమునుముందట వచ్చి నిలిచెను.

ఇది యెనుబదితొమ్మిదవ సర్గము.

## తొంబదియవసర్గము.

బలవంతుఁడు శూరుఁడునగు విభీషణుఁడు యుద్ధంబున మదపుటేనుంగులంబోలె నొండొరులం దాఁకి యొకరినొకరు జయింపఁ గోరి పోరుచున్న యా లక్ష్మణేంద్రజిత్తులం జూడఁగోరి వారలం జూచినపిమ్మట దానును యుద్ధంబుసేయుటకై యుద్ధభూమి నగ్రభాగంబున నిలిచెను. ౧-౨

అంత నవ్విభీషణుఁడు యుద్ధరంగంబున నిలిచి గొప్పధనుస్సుగొని మహాధ్వని గలుగునట్లు సారిసారించి రాక్షసులపైఁ దీక్ష్ణబాణంబులఁ బ్రయోగించెను. ౩

ఆబాణంబులు అగ్నివలె మండుచు గుఱిదప్పక రాక్షసులం దాఁకి వజ్రాయుధము పర్వతమును ఛేదించునట్లు రాక్షసులను ఛేదించినవి. ౪

రాక్షసోత్తముల విభీషణుని సచివులును యుద్ధంబున శూల ఖడ్గాద్యాయుధంబులచేత రాక్షసులను వధించిరి. ౫

అప్పుడు తనసచివులగు రాక్షసులనడుమనున్న యవ్విభీషణుఁడు మదించిన యేనుఁగుగున్న నడుమ నుండు మదపుటేనుంగువలెఁ జూడ

తత స్సంచోదయానో వై హరీ న్రక్షోరణప్రియాన్,
ఉవాచ వచనం కాలే కాలజ్ఞో రక్షసాం వరః. ౭

ఏకోఽయం రాక్షసేన్ద్రస్య పరాయణ మివ స్థితః,
ఏతచ్ఛేషం బలం తస్య కిం తిష్ఠత హరీశ్వరాః. ౮

అస్మిన్వినిహతే పాపే రాక్షసే రణమూర్ధని,
రావణం వర్జయిత్వా తు శేష మస్య బలం హతమ్. ౯
ప్రహస్తో నిహతో వీరో నికుమ్భశ్చ మహాబలః,
కుమ్భకర్ణశ్చ కుమ్భశ్చ ధూమ్రాక్షశ్చ నిశాచరః. ౧౦
జమ్బుమాలీ మహామాలీ తీక్ష్ణవేగోఽశనిప్రభః,
సుప్తఘ్నో యజ్ఞకోపశ్చ వజ్రదంష్ట్రశ్చ రాక్షసః. ౧౧
సంహ్రాదీ వికటో నిఘ్నస్తపనో దమ ఏవ చ,
ప్రఘాసః ప్రఘస శ్చైవ ప్రజఙ్ఘోఽజఙ్ఘ ఏవ చ. ౧౨
అగ్నికేతుశ్చ దుర్ధర్షో రశ్మికేతుశ్చ వీర్యవాన్,
విద్యుజ్జిహ్వో ద్విజిహ్వశ్చ సూర్యశత్రుశ్చ రాక్షసః. ౧౩
అకమ్పన స్సుపార్శ్వశ్చ చక్రమాలీ చ రాక్షసః,
కమ్పన స్సత్త్వవన్తౌ తౌ దేవాన్తకనరాన్తకౌ. ౧౪
ఏతాన్నిహత్యాతిబలా న్బహూన్రాక్షససత్తమాన్,
బాహుభ్యాం సాగరం తీర్త్వా లఙ్ఘ్యతాం గోష్పదం లఘు. ౧౫

ఏతావదేవ శేషం వో జేతవ్యమిహ వానరాః,

నొప్పెను. ౬

అంత నేకాలంబున నేది చేయఁదగినదో అదంతయుఁ దెలిసిన వాఁడగు రాక్షసోత్తముఁడు విభీషణుండు రాక్షసులతో యుద్ధముఁ జేయ నుత్సుకులయి యున్న వానరులకు మఱియు నుత్సాహంబు గల్గుటకై యాకాలంబునఁ జెప్ప వలసిన రీతిని ఇట్లనిపలికెను. ౭

వానరవీరులారా! ఈయింద్రజిత్తు ఒకఁడె యిఁక రావణునకుగతి; రావణుని సైన్యములో నీతఁడొకఁడె శూరుఁడు మిగిలియున్నాఁడు; మీర లేల యీతని నుపేక్షించెదరు? ౮

దుష్టుఁడగు నీయింద్రజిత్తు యుద్ధంబున హతుండగునేని రావణుం డొకఁడు దక్కఁ దక్కినరావణుని బలమంతయుఁ హతమయినట్లగుచున్నది.

వీరుండగు ప్రహస్తుఁడు హతుఁడయ్యె; మహాబలుఁడు నికుంభుఁడును వధింపఁబడిరి; కుంభకర్ణుఁడును నిహతుఁడయ్యె; మఱియుఁ గుంభుఁడు, ధూమ్రాక్షుఁడు, జంబుమాలి, మహామాలి, తీక్ష్ణవేగుండు, అశనిప్రభుఁడు, సుప్తఘ్నుఁడు, యజ్ఞకోపుఁడు, వజ్రదంష్ట్రుండు, సంహ్రాది, వికటుఁడు, నిఘ్నుఁడు, తపనుఁడు, దముండు, ప్రఘాసుఁడు, ప్రఘసుఁడు, ప్రజంఘుఁడు, జంఘుఁడునను నీరాక్షసవీరులం బోరిగొంటిరి; దుర్ధర్షుండగు నగ్నికేతుని, బరాక్రమశాలియగు రశ్మికేతునిఁబరిమార్చితిరి; మఱియు విద్యుజ్జిహ్వుండును, సూర్యశత్రుఁడును, అకంపనుఁడును, సుపార్శ్వుఁడును, చక్రమాలియుఁ, గంపనుండు లోనుగాఁగల రాక్షసప్రధానుల ననేకులం బోరిపుచ్చితిరి; బల వంతులగు దేవాంతక నరాంతకులనుగూడ వధించి పుచ్చితిరి. ౧౦-౧౪

మీరలు మహాబలశాలులగు నీరాక్షసవీరులఁ బెక్కండ్ర రూపుమాపి సముద్రమును భుజములచే నీఁది దాఁటినవారలయితిరి; ఇఁక స్వల్పమయిన గోష్పదమంతటి యీయింద్రజిద్వధము మీ కెంతమాత్రము? ఉపేక్షింపక కూలవేర్పుఁడు. ౧౫

వానరులారా! బలగర్వితులగు రాక్షసులనందఱ వధించినారు; ఇఁక

హతా స్సర్వే సమాగమ్య రాక్షసా బలదర్పితాః. ౧౬
అయుక్తం నిధనం కర్తుం పుత్రస్య జనితుర్మమ,
ఘృణా మపాస్య రామార్థే నిహన్యాం భ్రాతు రాత్మజమ్. ౧౭
హన్తుకామస్య మే బాష్పం చక్షు శ్చైవ నిరుధ్యతి,
తమేవైష మహాబాహు ర్లక్ష్మణ శ్శమయిష్యతి. ౧౮
వానరా ఘ్నత సంభూయ భృత్యా నస్య సమీపగాన్,

ఇతి తేనాతియశసా రాక్షసేనాభిచోదితాః. ౧౯
వానరేన్ద్రా జహృషిరే లాఙ్గూలాని చ వివ్యథుః,
తత స్తే కపిశార్దూలాః క్ష్వేళ న్తశ్చ ముహుర్ముహుః. ౨౦
ముముచు ర్వివిధా న్నాదా న్మేఘా న్దృష్ట్వేవ బర్హిణః,

జామ్బవానపి తై స్సర్వై స్స్వయూథై రపి సంవృతః. ౨౧
అశ్మభి స్తాడయామాస నఖై ర్దన్తైశ్చ రాక్షసాన్,
నిఘ్నన్త మృక్షాధిపతిం రాక్షసా స్తే మహాబలాః. ౨౨
పరివవ్రు ర్భయం త్యక్త్వా త మనేకవిధాయుధాః,
శరైః పరశుభి స్తీక్ష్ణైః పట్టసై ర్యష్టితోమరైః. ౨౩
జామ్బవన్తం మృధే జఘ్ను ర్నిఘ్నన్తం రాక్షసీం చమూమ్,

స సమ్ప్రహార స్తుముల స్సంజజ్ఞే కపిరక్షసామ్. ౨౪
దేవాసురాణాం క్రుద్ధానాం యథా భీమో మహాస్వనః,
హనూమా నపి సంక్రుద్ధస్సాలముత్పాట్య వీర్యవాన్. ౨౫
రక్షసాం కదనం చక్రే సమాసాద్య సహస్రశః,

శేషము నీయింద్రజిత్తు నొకనిమాత్రమె మీరు వధింపవలసినది. ౧౬

రామునికార్యముకొఱకు నేను అన్నకొడుకునైనను వధించిపుత్తును గాని, దండ్రిని నేనే నాకొడుకు నింద్రజిత్తును వధించుట యుక్తము గాదు.

నే నింద్రజిత్తును వధింపఁగోరినంత నా కన్నులం గన్నీరు క్రమ్ముచున్నది; కావున నతని మహాబాహుఁడగు నీ లక్ష్మణుఁడే వధించుఁ గాక. ౧౭

వానరులారా! మీరలందఱుఁ జేరి యీ యింద్రజిత్తునికి సాహాయ్యార్థమయి వచ్చిన సైన్యమును వధింపుఁడు. అని విభీషణుఁడు వానరులతోఁ జెప్పెను.

వానరవీరులు కీర్తిశాలియగు నావిభీషణుని ప్రోత్సాహవచనంబు విని సంతోషంబు నొంది వాలంబు లాడించిరి. ౧౯

అంత నావానరోత్తములు విభీషణునిప్రోత్సాహకవచనములచే మేఘంబులం జూచిన మయూరంబులు వలెఁ బ్రహృష్టులయి నానావిధంబులుగా సింహనాదంబులు గావించిరి. ౨౦

జాంబవంతుఁడును సమస్తవానరులును తనభల్లూకసైన్యముంగూడి శిలలచేతను నఖములచేతను దంతములచేతను రాక్షసుల నొప్పించెను. ౨౧

మహాబలశాలులగు రాక్షసులు అట్లు ప్రహరించుచున్న భల్లూకనాథుండగు జాంబవంతుని నానావిధంబులగు నాయుధములతోఁ జుట్టుముట్టిరి. ౨౨

ఆరాక్షసులు అప్పుడు యుద్ధంబున రాక్షససైన్యమును వధించుచున్న జాంబవంతునిపై బాణంబులను గొడ్డళ్లను అడ్డకత్తులను యష్టులను దోమరంబులను బ్రయోగించి నొప్పించిరి. ౨౩

ఆ వానరరాక్షసుల దొమ్మియుద్ధము క్రుద్ధులగు దేవాసురులయుద్ధము వలె మహాధ్వని గలిగి భయంకరంబై యుండినది. ౨౪

మహాపరాక్రమశాలి యగు హనుమంతుఁడు మిక్కిలియుఁ గోపించి సాలం బొకటి పెకలించి రాక్షససేనం జొచ్చి భయంకరంబుగా యుద్ధము చేసెను. ౨౫

స దత్త్వా తుములం యుద్ధం పితృవ్యస్యేన్ద్రజిద్యుధి. ౨౬
లక్ష్మణం పరవీరఘ్నం పునరేవాభ్యధావత,
తౌ ప్రయుద్ధౌ తదా వీరౌ మృధే లక్ష్మణరాక్షసౌ. ౨౭
శరౌఘా నభివర్షన్తౌ జఘ్నతు స్తౌ పరస్పరమ్,
అభీక్ష్ణ మన్తర్దధతు శ్శరజాలై ర్మహాబలౌ. ౨౮
చన్ద్రాదిత్యా వివోష్ణాన్తే యథా మేఘై స్తరస్వినౌ,

న హ్యాదానం న సన్ధానం ధనుషో వా పరిగ్రహః. ౨౯
న విప్రమోక్షో బాణానాం న వికర్షో న విగ్రహః,
న ముష్టిప్రతిసన్ధానం న లక్ష్యప్రతిపాదనమ్. ౩౦
అదృశ్యత తయో స్తత్ర యుధ్యతోః పాణిలాఘవాత్,

చాపవేగవినిర్ముక్తబాణజాలై స్సమన్తతః. ౩౧
అన్తరిక్షేఽభిసంఛన్నే న రూపాణి చకాశిరే,

లక్ష్మణో రావణిం ప్రాప్య రావణి శ్చాపి లక్ష్మణమ్. ౩౨
అవ్యవస్థా భవత్యుగ్రా తాభ్యా మన్యోన్యవిగ్రహే,

తాభ్యా ముభాభ్యాం తరసా విసృష్టై ర్విశిఖై శ్శితైః. ౩౩
నిర న్తర మివాకాశం బభూవ తమసావృతమ్,

తైః పతద్భి శ్చ బహుభి స్తయో శ్శరశతై శ్శితైః. ౩౪
దిశశ్చ ప్రదిశశ్చైవ బభూవు శ్శరసంకులాః.
తమసా సంవృతం సర్వ మాసీ ద్భీమతరం మహత్. ౩౫
అస్తం గతే సహస్రాంశౌ సంవృతం తమసేవ హి,

ఇంద్రజిత్తు అట్లు పినతండ్రి విభీషణునకుఁ గావలసినంత యుద్ధము నొసంగి మఱల శత్రువీరులం బోరిగొనునట్టి లక్ష్మణునిమీఁది కడరెను. ౨౬

అయ్యుద్ధంబున వీరులును యుద్ధంబునందు సమర్థులునగు నాలక్ష్మణేంద్రజిత్తులు బాణవర్షంబులు గురియుచు నొకరినొకరు నొప్పించిరి. ౨౭

వర్షర్తువునందు చంద్రసూర్యులు మేఘములచే మఱుఁగుపడునట్లు మహాబలశాలులును వేగవంతులునగు నాయింద్రజిల్లక్ష్మణులు బాణసమూహములచేఁ బలుమాఱు అంతర్ధానము నొందుచుండిరి. ౨౮

ఆచట నాయింద్రజిల్లక్ష్మణులు పోరునపుడు వారిహస్తలాఘవవిశేషంబునఁ జేసి అమ్ములపొదినుండి బాణంబులఁ దీయుటగాని వింట సంధించుటగాని ధనుస్సును బట్టుటగాని బాణములఁ బ్రయోగించుటగాని చెవివఱకు నాకర్షించుటగాని వారియేనియునికిగాని వింటిని వారికి బిడికిట నమర్చుటగాని గుఱి దప్పక వేయుటగాని యెంతమాత్రము గనఁబడదయ్యె. ౨౯, ౩౦

ధనుస్సుచే వేగంబునం బ్రయోగింపఁ బడుచున్న బాణసమూహములు ఆకాశమంతటను గప్పుటం జేసి బాణంబులు దక్క మఱి యేవస్తువును గానఁబడదయ్యె. ౩౧

అప్పుడు లక్ష్మణుఁడు ఇంద్రజిత్తు మీఁదికిని ఇంద్రజిత్తు లక్ష్మణు మీఁదికిని అడరి వారలొండొరులతోఁ బోరుచుండఁగా "లక్ష్మణుఁడింద్రజిత్తును గొట్టునో ఇంద్రజిత్తు లక్ష్మణుఁగొట్టునో" అను భేదము తెలియఁబడదయ్యెను.

వారలిర్వురు ఒండొరులపయి వేగంబునం బ్రయోగించిన బాణంబులు ఎంతమాత్రము సందులేనట్లు నిండియుండుటం జేసి యాకాశమంతయుఁ జీఁకటి క్రమ్మినట్లుండినది. ౩౩

అట్లు ఇంద్రజిల్లక్ష్మణుల కఱకుబాణంబులు లెక్కకుమీఱి వ్యాపించుటఁ జేసి దిక్కులును విదిక్కులును బాణపూర్ణంబులయి యొప్పెను. ౩౪

సూర్యుం డస్తమించినప్పుడు చీఁకటిచే గప్పఁబడు విధంబున నపుడు సమస్తంబును దమస్సుచేఁ గప్పఁబడి మిక్కిలియు భయంకరంబై

రుధిరౌఘమహానద్యశ్చ ప్రావర్తన్త సహస్రశః. 36
క్రవ్యాదా దారుణా వాగ్భి శ్చిక్షిపు ర్భీమనిస్వనమ్,

న తదానీం వవౌ వాయు ర్నచ జజ్వాల పావకః. 37
స్వస్త్యస్తు లోకేభ్య ఇతి జజల్పు స్తే మహర్షయః,

సంపేతుశ్చాత్ర సంప్రాప్తా గన్ధర్వా స్సహ చారణైః. 38

అథ రాక్షససింహస్య కృష్ణా న్కనకభూషణాన్,
శరై శ్చతుర్భి స్సౌమిత్రి ర్వివ్యాధ చతురో హయాన్. 39

తతోఽపరేణ భల్లేన సితేన నిశితేన చ,
సంపూర్ణాయతముక్తేన సుపత్త్రేణ సువర్చసా. 40
మహేన్ద్రాశనికల్పేన సూతస్య విచరిష్యతః,
స తేన బాణాశనినా తలశబ్దానునాదినా. 41
లాఘవా ద్రాఘవ శ్శ్రీమాన్ శిర శ్శకాయా దపాహరత్,

స యన్తరి మహాతేజా హతే మణ్డోదరీసుతః. 42
స్వయం సారథ్య మకరో త్పున శ్చ ధను రస్పృశత్,

తదద్భుత మభూ త్తత్ర సామర్థ్యం పశ్యతాం యుధి. 43

హయేషు వ్యగ్రహస్తం తం వివ్యాధ నిశితై శ్శరైః,

చుండెను. ౩౫

అప్పుడు నెత్తురు వెల్లువలు గొప్పనదులుగా వేలకొలఁది ప్రవహించినవి. భయంకరములయిన మాంసాహారములయిన క్రూరజంతువులు భయంకరముగ నఱచినవి. ౩౬

అప్పుడు భయంబున వాయువు వీవకుండెను; అగ్ని జ్వలింపలేదు; మహర్షులును భయంబునొంది "లోకంబులు ఈ యుద్ధంబుచే నశింపక మంగళంబు నొందుఁగాక" యని పలికిరి. ౩౭

యుద్ధముఁ జూడవచ్చి యున్న గంధర్వులును చారణులును భయంబునంపెలఁగి పోయిరి ౩౮

అంత లక్ష్మణుఁడు రాక్షససింహుఁడగు నింద్రజిత్తుని కాంచనాలంకృతంబులగు నల్లనిగుఱ్ఱంబులను నాల్గింటిని నాలుగుబాణంబుల నొప్పించెను. ౩౯

ఆపిమ్మట శ్రీమంతుఁడగు లక్ష్మణుఁడు లాఘవంబున దేదీప్యమానంబును దీక్ష్ణమును సుపత్త్రంబును గాంతిమంతంబునగు మఱియొక కత్తివాతియమ్ము దీని చెవివఱకు నాకర్షించి దేవేంద్రు వజ్రాయుధమువంటిదియుం జ్యాఘాతధ్వనిచే ధ్వనించుచుఁ బిడుగువలె భయంకరముగాఁ జూపట్టుచున్నదియు నగుబాణంబుచే నింద్రజిద్రథంబు విచిత్రగతులం ద్రిప్పుచున్న సారథి తలడొల్ల జేసెను. ౪౦, ౪౧

సారథి హతుండగుటయు మహాతేజుండగు నామందోదరీకుమారుం డింద్రజిత్తు తానే సారథ్యముచేసికొనుచు ధనుస్సు గ్రహించి యుద్ధంబును గావించెను. ౪౨

అయ్యుద్ధమునందు అట్లు తా నొకఁడె సారథ్యంబును జేసికొనుచు యుద్ధంబుసేయుచున్న యింద్రజిత్తు సామర్థ్యంబునకుఁ జూపరు లచ్చెరువందిరి. ౪౩

లక్ష్మణుఁడు ఇంద్రజిత్తుచేతులు సారథ్యవ్యాపారంబునఁ దగిలియుండు

ధనుష్యథ పున స్త్వస్యాగ్రే హయేషు ముముచే శరాన్. ౪౪

ఛిన్నేషు తేషు బాణేషు సౌమిత్రి శ్శీఘ్రవిక్రమః,
అర్దయామాస బాణౌఘై ర్విచర న్త మభీతవత్. ౪౫

నిహతం సారథిం దృష్ట్వా సమరే రావణాత్మజః,
ప్రజహౌ సమరోద్ధర్షం విషణ్ణ స్స బభూవ హ. ౪౬

విషణ్ణవదనం దృష్ట్వా రాక్షసం హరియూథపాః,
తతః పరమసంహృష్టా లక్ష్మణం చాభ్యపూజయన్. ౪౭
తతః ప్రమాథీ శరభో రభసో గన్ధమాదనః,
అమృష్యమాణా శ్చత్వార శ్చక్రు ర్వేగం హరీశ్వరాః. ౪౮

తే చాస్య హయముఖ్యేషు తూర్ణముత్ప్లుత్య వానరాః,
చతుర్షు సుమహావీర్యా నిపేతు ర్భీమవిక్రమాః. ౪౯

తేషా మధిష్ఠితానాం తై ర్వానరైః పర్వతోపమైః,
ముఖేభ్యో రుధిరం రక్తం హయానాం సమవర్తత. ౫౦

తే హయా మథితా భగ్నా వ్యసవో ధరణీం గతాః,

తే నిహత్య హయాం స్తస్య ప్రమథ్య చ మహారథమ్. ౫౧
పున రుత్పత్య వేగేన తస్థు ర్లక్ష్మణపార్శ్వతః,
స హతాశ్వా దవప్లుత్య రథా న్మథితసారథేః. ౫౨
శరవర్షేణ సౌమిత్రి మభ్యధావత రావణిః,

నపుడు నాతని వాఁడియమ్ముల నొప్పించెను; అతండు ధనువుద్ధరించి బాణము లేయుచుండునపుడు గుఱ్ఱంబులపై బాణము లేసెను. ౪౪

బాణములు ప్రయోగించుటయందు మిక్కిలియు లాఘవముఁగల లక్ష్మణుండు అట్లు రంధ్రములు కనిపెట్టి నిర్భయుండై యింద్రజిత్తును బాణ సమూహంబులచే మిక్కిలియు నొప్పించెను. ౪౫

రావణకుమారుండు యుద్ధంబునఁ దనసారథి హతుండగుటయుఁ దాను సారథ్యము సేయు రంధ్రము కనిపెట్టి లక్ష్మణుఁడు తన్ను నొప్పించుటయుం జూచి యుద్ధగర్వంబు వదలి దుఃఖితుండయ్యెను. ౪౬

వానరవీరులు ఇంద్రజిత్తు మొగంబున దుఃఖంబుగని పరమసంతుష్టులయి లక్ష్మణునిం గొనియాడిరి. ౪౭

అంతఁ బ్రమాథియు శరభుండును రభసుండును గంధమాదనుండు నను వానరవీరులు నల్వురు ఇంద్రజిత్తుని యాటోపంబు సహింపక పరాక్రమించిరి. ౪౮

భయంకరమయిన పరాక్రమముగల యానల్వురు వానరవీరులు ఇంద్రజిత్తుని రథంబునకుఁ బూన్చిన యుత్తమంబులగు నాలుగు గుఱ్ఱంబులమీఁదను మహావేగంబునం బడిరి. ౪౯

పర్వతంబు లంతటి యవ్వానరవీరులు పైఁబడఁగానే యా యశ్వంబులు సహింపఁజాలక విహ్వలంబులయి ముఖంబులనుండి రొఱ్ఱని నెత్తురు గ్రక్కినవి. ౫౦

ఆగుఱ్ఱంబులు అవ్వానరుల వేగంబునకు నలఁగి యవయవంబులు విఱిగి విగతప్రాణంబులయి నేలం గూలినవి.

ఆ వానరవీరులు ఇంద్రజిత్తు గుఱ్ఱంబులను వధించి యతని దివ్యరథంబును విఱిచి మఱల వేగంబున వచ్చి లక్ష్మణుని పార్శ్వంబున నిలిచిరి. ౫౧

ఆ యింద్రజిత్తు సారథియుం హయంబులును వధింపఁబడుటవలన, రథంబు వదలి నేలకు డిగ్గి బాణవర్షంబు గురియుచు లక్ష్మణునిపైకిఁ బోయెను. ౫౨

తతో మహేన్ద్రప్రతిమ స్స లక్ష్మణః
పదాతినం తం నిశితై శ్శరోత్తమైః,
సృజన్త మాజౌ నిశితా ఞ్శరోత్తమా
న్భృశం తదా బాణగణై ర్న్యవారయత్. ౫౩

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే నవతితమస్సర్గః.

---

ఏకనవతితమస్సర్గః.

స హతాశ్వో మహాతేజా భూమౌ తిష్ఠ న్నిశాచరః,
ఇన్ద్రజి త్పరమక్రుద్ధ స్సంప్రజజ్వాల తేజసా. ౧
తౌ ధన్వినౌ జిఘాంసన్తౌ వన్యోన్య మిషుభి ర్భృశమ్,
విజయేనాభినిష్క్రాన్తౌ వనే గజవృషా వివ. ౨

నిబర్హయన్త శ్చాన్యోన్యం తే రాక్షసవనౌకసః,
భర్తారం న జహు ర్యుద్ధే సంపతన్త స్తత స్తతః. ౩
తత స్తా న్రాక్షసాన్ సర్వా న్హర్షయ న్రావణాత్మజః.
స్తువానో హర్షమాణ శ్చ ఇదం వచన మబ్రవీత్. ౪
తమసా బహుళేనేమా స్సంసక్తా స్సర్వతో దిశః,
నేహ విజ్ఞాయతే స్వో వా పరో వా రాక్షసోత్తమాః. ౫

ధృష్టం భవన్తో యుధ్యన్తు హరీణాం మోహనాయ వై,
అహం తు రథ మాస్థాయ ఆగమిష్యామి సంయుగమ్. ౬

తథా భవన్తః కుర్వన్తు యథేమే కాననౌకసః,
న బుద్ధ్యేయు ర్దురాత్మానః ప్రవిష్టే నగరం మయి. ౭

అంత నప్పుడు వృత్రాసురుని వధించిన మహేంద్రునితో సమానుఁడగు లక్ష్మణుఁడు తనపై వాఁడితూపులు సుత్తమంబులునగు పెక్కుబాణంబులు ప్రయోగించి నిలిపెను. ౫౩

ఇది తొంబదియవసర్గము.

## తొంబదియొకటవసర్గము.

అట్లు విరథుండై నేలపై నిలుచున్న మహాతేజుండగు నింద్రజిత్తు పరమకుపితుఁడై తేజస్సుచే జ్వలించుచుండెను. ౧

ధనుర్ధరులగు నా లక్ష్మణేంద్రజితులు బాణంబులచే నొకరినొకరు వధింపఁగోరిన వారలయి యడవియందు మదగజంబులుం బోలె విజయార్థమయి యొండొరుల నెదుర్కొనిరి. ౨

రాక్షసులును వానరులును యుద్ధంబున నాలుగుప్రక్కలను సంచరించుచు ఒకరి నొకరు వధించుచుఁ దమతమయొడయని విడువక పోరుచుండిరి.

అంత రావణకుమారుం డింద్రజిత్తు ఆరాక్షసులనందఱకు సంతోషంబు గల్గునట్లు వారలం బొగడుచు సంతోషంబున నిట్లని పలికెను. ౪

రాక్షసవీరులారా! సమస్తదిక్కులను జీకటి దట్టముగా వ్యాపించియున్నది. కావున నిపుడు యుద్ధంబునఁ దనవాఁడనిగాని శత్రువనిగాని భేదము దెలియకున్నది. ౫

మీరలు ఈ వానరులకు నేను బోయినసంగతి తెలియకుండునట్లు చక్కఁగా యుద్ధముసేయు చుండుడు. నేను యింతలో రథము నారోహించి యుద్ధమునకు వచ్చెదను. ౬

నేను బట్టణంబులోనికిఁ బోవుచుండఁగా దురాత్ము లగు నీవానరులు నాకడ్డమువచ్చి నన్నుఁబోనీక యుద్ధముసేయకుండునట్లు మీర లిచట వారలను మోసపుచ్చవలయును. అని యింద్రజిత్తు రాక్షసులతోఁ జెప్పెను. ౭

ఇత్యుక్త్వా రావణసుతో వఞ్చయిత్వా వనౌకసః,
ప్రవివేశ పురీం లఙ్కాం రథహేతో రమిత్రహా. ౮

స రథం భూషయిత్వా తు రుచిరం హేమభూషితమ్,
ప్రాసాసిశరసంపూర్ణం యుక్తం పరమవాజిభిః. ౯
అధిష్ఠితం హయజ్ఞేన సూతే నాప్తోపదేశినా,
ఆరురోహ మహాతేజా రావణి స్సమితింజయః. ౧౦

స రాక్షసగణై ర్ముఖ్యై ర్వృతో మన్దోదరీసుతః,
నిర్యయౌ నగరాత్తూర్ణం కృతాన్తబలచోదితః. ౧౧
సోఽభినిష్క్రమ్య నగరా దిన్ద్రజిత్పరవీరహా,
అభ్యయా జ్జవనై రశ్వై ర్లక్ష్మణం సవిభీషణమ్. ౧౨

తతో రథస్థ మాలోక్య సౌమిత్రి ద్రావణాత్మజమ్,
వానరాశ్చ మహావీర్యా రాక్షస శ్చ విభీషణః. ౧౩
విస్మయం పరమం జగ్ము ర్లాఘవా త్తస్య

రావణిశ్చాపి సంక్రుద్ధో రణే వానరయూథపాన్. ౧౪
పాతయామాస బాణౌఘై శ్శతశోఽథ సహస్రశః,
స మణ్డలీకృతధనూ రావణి స్సమితింజయః. ౧౫
హరీనభ్యహనత్క్రుద్ధః పరం లాఘవ మాస్థితః,

తే వధ్యమానా హరయో నారాచై ర్భీమవిక్రమాః. ౧౬
సౌమిత్రిం శరణం ప్రాప్తాః ప్రజాపతి మివ ప్రజాః,

శత్రువుల వధించువాఁడగు రావణకుమారుఁ డింద్రజిత్తు సైనికుల కవ్విధంబున జెప్పి వానరుల వంచించి రథముఁ దెచ్చుటకై లంకాపురంబునకుఁ బోయెను. ౭

మహాతేజుండును శత్రుసమూహంబుల జయించిన వాఁడునగు నయ్యింద్రజిత్తు సుందరంబును గాంచనాలంకృతంబును అసంఖ్యంబులయిన ప్రాసంబుల చేతను ఖడ్గంబులచేతను నిండినదియు నుత్తమాశ్వంబులు పూన్చినదియు నశ్వంబులలక్షణంబుఁ జక్కఁగాఁ దెలిసినవాఁడును రథికునకుహితంబుఁ జెప్పు వాఁడునగు సారథి గలదియునగు రథంబును ధ్వజాదులచే నలంకరించి దాని నారోహించెను. ౮-౧౦

మండోదరీపుత్త్రుండగు నింద్రజిత్తు మృత్యువశంగతుం డగుటంజేసి రాక్షసవీరుల ననేకులంగూడి లంకాపురంబునుండి మఱల వెడలివచ్చెను. ౧౧

శత్రువీరుల వధించునట్టి యయ్యింద్రజిత్తు వేగవంతంబులగు గుఱ్ఱంబులు పూన్చిన యరదంబుచేఁ బట్టణంబు వెలువడి లక్ష్మణవిభీషణులపైకిఁ బోయెను. ౧౨

అంత లక్ష్మణుండును మహాపరాక్రమశాలులగు వానరులును విభీషణుండును, యుద్ధభూమి నున్నట్టె యుండి తమ కెంతమాత్రము దెలియనీక యతిశీఘ్రముగా నగరంబునకుఁ బోయి రథగతుండై వచ్చిన యింద్రజిత్తుం జూచి వాని లాఘవంబునకు అత్యాశ్చర్యము నొందిరి. ౧౩

ఇంద్రజిత్తుండును బరమకుపితుండై యుద్ధంబున బాణసమూహంబులు పరఁగించి లెక్కలేనివానరవీరులను బడఁద్రోసెను. ౧౪

శత్రుసమూహముల జయించునట్టి యింద్రజిత్తుండు కుపితుండై తన యధికమయిన హస్తలాఘవంబుఁ జూపుచు ధనుస్సు మండలాకారంబై యొప్ప వానరుల వధింపసాగెను. ౧౫

భయంకరపరాక్రములగు నవ్వానరులు అట్టింద్రజిత్తుచే బాణంబుల వధింపఁబడుచు సహింపఁజాలక ప్రజలు ప్రజానాథుండగు బ్రహ్మదేవుని

తత స్సమరకోపేన జ్వలితో రఘునన్దనః. ౧౭
చిచ్ఛేద కార్ముకం తస్య దర్శయ న్పాణిలాఘవమ్,
సోఽన్య త్కార్ముక మాదాయ సజ్యం చక్రే త్వరన్నివ. ౧౮
తదప్యస్య త్రిభి ర్బాణై ర్లక్ష్మణో నిరకృన్తత,
అథైనం ఛిన్నధన్వాన మాశీవిషవిషోపమైః. ౧౯
వివ్యాధోరసి సౌమిత్రీ రావణిం పఞ్చభి శ్శరైః,

తే తస్య కాయం నిర్భిద్య మహాకార్ముకనిస్సృతాః. ౨౦
నిపేతు ర్ధరణీం బాణా రక్తా ఇవ మహోరగాః,
స భిన్నవర్మా రుధిరం వమ న్వక్త్రేణ రావణిః. ౨౧
జగ్రాహ కార్ముకం శ్రేష్ఠం దృఢజ్యం బలవత్తరమ్,

స లక్ష్మణం సముద్దిశ్య పరం లాఘవ మాస్థితః. ౨౨
వవర్ష శరవర్షాణి వర్షాణీవ పురన్దరః,
ముక్త మిన్ద్రజితా తత్తు శరవర్ష మరిన్దమః. ౨౩
అవారయ దసమ్భ్రాన్తో లక్ష్మణ స్సుదురాసదమ్,

దర్శయామాస చ తదా రావణిం రఘునన్దనః. ౨౪
అసమ్భ్రాన్తో మహాతేజా స్త దద్భుత మివాభవత్,

తత స్తా న్రాక్షసాన్ సర్వాం స్త్రిభి రేకైక మాహవే. ౨౫
అవిధ్య త్పరమక్రుద్ధ శ్శీఘ్ర మస్త్రం ప్రదర్శయన్,
రాక్షసేన్ద్రసుతం చాపి బాణౌఘై స్సమతాడయత్. ౨౬

శరణుచొచ్చునట్లు తమనాథుండగు లక్ష్మణుని శరణుచొచ్చిరి. ౧౬

అంత లక్ష్మణుండు యుద్ధంబునందుఁగోపంబునకుండిపడి తనహస్తలాఘవంబుఁజూపుచు నింద్రజిత్తునిచేతి ధనుస్సును ఖండించెను. ౧౭

ఇంద్రజిత్తు హస్తలాఘవంబుగదుర నొండు విల్లుగొని నారియెక్క పెట్టుటయు లక్ష్మణుండు దానినిగూడ మూఁడుబాణంబుల ఛేదించెను. ౧౮

అంత లక్ష్మణుండు ఇవ్విధంబున ధనుస్సు ఛేదించి మఱియునయ్యింద్రజిత్తుని వక్షంబున సర్పవిషమువలెఁ బ్రాణాంతకరంబులగు నైదుబాణంబుల నొప్పించెను. ౧౯

ఆబాణంబులు లక్ష్మణుని గొప్పధనుస్సునుండి వెడలినవై ఇంద్రజిత్తుని దేహంబుదూఱి నెత్తుటం దడిసి యెఱ్ఱనిసర్పంబులవలె నేలంబడినవి. ౨౦

అయ్యింద్రజిత్తు బాణవేగంబునఁగవచంబుభిన్నమగుటయునోట నెత్తురు గ్రక్కుచు దృఢమయిన యల్లెత్రాడుఁగలదియు సారవంతంబునగు మఱియొక యుత్తమమయిన ధనుస్సుగ్రహించెను. ౨౧

ఆరావణపుత్త్రుఁ డంత నధికమయిన హస్తలాఘవం బవలంబించి ఇంద్రుండు వర్షంబులు గురియునట్లు లక్ష్మణునిపై బాణవర్షంబులు గురిసెను.

శత్రువులనడంగఁ ద్రొక్కునట్టియాలక్ష్మణుండు ఎట్టివారికేని సమీపింప నలవిగాని యయ్యింద్రజిత్తుని బాణవర్షమును ఎంతమాత్రము తొట్రుపాటు నొందకయె బాణంబులచే నివారించెను. ౨౩

మహాపరాక్రమశాలియగు లక్ష్మణుండు అప్పుడు ఎంతమాత్రము సంభ్రమంబునొందక యింద్రజిత్తునకుఁ దన పరాక్రమంబు దేటపడునట్లు విక్రమించెను. అయ్యది యెంతయు నద్భుతంబై చూపట్టెను. ౨౪

అంత లక్ష్మణుండు యుద్ధంబునం బరమక్రుద్ధుండై తనబాణప్రయోగము నందలి లాఘవంబుఁజూపుచు నారాక్షసులనందఱ నొక్కొక్కని మూఁడేసి బాణంబులఁ బ్రహరించి రావణకుమారునిఁగూడఁ బెక్కుబాణంబుల నొప్పించెను. ౨౫-౨౬

సోఽతివిద్ధో బలవతా శత్రుణా శత్రు(ఘ్నా)తాపినా,
అసక్తం ప్రేషయామాస లక్ష్మణాయ శరా న్బహూన్. ౨౭

తా న ప్రాప్తాన్ శితై ర్బాణై శ్చిచ్ఛేద రఘునన్దనః,

సారథేఽస్య చ రణే రథినో రథిసత్తమః. ౨౮
శిరో జహార ధర్మాత్మా భల్లే నానతపర్వణా,

అసూతా స్తే హయా స్తత్ర రథ మూహు రవిక్లబాః. ౨౯
మణ్డలాన్యభిధావన్త స్తదద్భుత మివాభవత్,

అమర్షవశ మాపన్న స్సౌమిత్రి ర్దృఢవిక్రమః. ౩౦
ప్రత్యవిధ్య ద్ధయాం స్తస్య శరై ర్విత్రాసయ న్రణే,

అమృష్యమాణ స్తత్కర్మ రావణస్య సుతో బలీ. ౩౧
వివ్యాధ దశభి ర్బాణై స్సౌమిత్రిం త మమర్షిణమ్,
తే తస్య వజ్రప్రతిమా శ్శరా స్సర్పవిషోపమాః. ౩౨
విలయం జగ్ము రాహత్య కవచం కాఞ్చనప్రభమ్,

అభేద్యకవచం మత్వా లక్ష్మణం రావణాత్మజః. ౩౩
లలాటే లక్ష్మణం బాణై స్సుపుఙ్ఖై స్త్రిభి రిన్ద్రజిత్,
అవిధ్య త్పరమక్రుద్ధ శ్శీఘ్రాస్త్రం చ ప్రదర్శయన్. ౩౪
తైః పృషత్కై ర్లలాటస్థై శ్శుశుభే రఘునన్దనః,
రణాగ్రే సమరశ్లాఘీ త్రిశృఙ్గ ఇవ పర్వతః. ౩౫

ఆరాక్షసుఁడు అట్లు బలవంతుఁడును శత్రుహంతయునగు లక్ష్మణునిచే నధికముగా నొప్పింపఁబడినవాఁడై కోపించి లక్ష్మణునిమీఁద సందులేనట్లు వెక్కుబాణంబులం బ్రయోగించెను. ౨౬

ఆరాక్షసుఁడు ప్రయోగించిన బాణంబులు తన్నుఁదగులకమున్న నడుమనె వాని లక్ష్మణుండు తీక్ష్ణబాణంబుల ఖండించెను.

అంతియగాక ధర్మాత్ముఁడును రథికోత్తముఁడునగు లక్ష్మణుఁడు యుద్ధంబునందు నున్నగా సంస్కరింపఁబడిన గణుపులుగల కత్తివాతిబాణంబున నాయింద్రజితుని సారథిశిరంబు డొల్ల నేసెను. ౨౮

అయ్యుద్ధంబున సారథి హతుఁడయ్యును ఇంద్రజిద్రథమునకుఁ బూన్చిన గుఱ్ఱములు ఎంతమాత్రము తప్పుదారిఁబోక చూపరులాశ్చర్యపడునట్లు మండలాకారంబుగా రథంబును ద్రిప్పుచుండినవి. ౨౯

చలనములేని పరాక్రమముగల లక్ష్మణుండు యుద్ధంబునఁ గ్రోధవశంగతుండై లోకంబులు తల్లడిల్ల నాయింద్రజిత్తుని గుఱ్ఱంబులను బాణంబులచే నొప్పించెను. ౩౦

బలవంతుఁడగు రావణాత్మజుఁడు లక్ష్మణుని యాటోపంబు సహింపక కుపితుఁడగు లక్ష్మణునిపైఁ బదిబాణంబులఁ బ్రయోగించెను. ౩౧

వజ్రతుల్యంబులును సర్పవిషంబువలె నతి క్రూరంబులునగు నింద్రజిత్తుని బాణంబులు లక్ష్మణుని మేనం దొడిగిన కాంచనప్రభమగు నభేద్యకవచంబుఁ దాఁకి భగ్నము లయ్యె. ౩౨

రావణునికొడుకు లక్ష్మణుండు అభేద్యమయిన కవచంబుఁ దొడిగియున్నాఁడని తెలిసి పరమకుపితుఁడై తన శీఘ్రంబుగా బాణంబులు ప్రయోగించు శక్తిం జూపుచుఁ గాంచనపుంఖములగు మూఁడుబాణంబులు లక్ష్మణుని లలాటంబు గాఁడ నేసెను. ౩౩-౩౪

యుద్ధప్రియుండగు లక్ష్మణుఁడు లలాటంబున మూఁడుబాణములు గ్రుచ్చుకొనియుండుటవలన యుద్ధాగ్రంబున మూఁడుశిఖరములుగల పర్వతమం

స తదా హ్యర్దితో బాణై రాక్షసేన మహామృధే,
త మాశు ప్రతివివ్యాథ లక్ష్మణః పఞ్చభి శ్శరైః. 3౭
వికృష్టేన్ద్ర జితో యుద్ధే వదనే శుభకుణ్డలే,

లక్ష్మణేన్ద్ర జితౌ వీరౌ మహాబలశరాసనౌ. 3౮
అన్యోన్యం జఘ్నతు ర్బాణై ర్విశిఖై ర్భీమవిక్రమౌ,

లక్ష్మణేన్ద్రజితావుభౌ. 3౯
రణే తౌ రేజతు ర్వీరౌ పుష్పితా వివ కింశుకౌ,
తౌ పరస్పరమభ్యేత్య సర్వగాత్రేషు ధన్వినౌ. 3౯
ఘోరై ర్వివ్యథతు ర్బాణైః కృతభావావుభౌ జయే,

తత స్సమరకోపేన సంయుక్తో రావణాత్మజః. ౪౦
విభీషణం త్రిభి ర్బాణై ర్వివ్యాథ వదనే శుభే,
అయోముఖై స్త్రిభి ర్విద్ధ్వా రాక్షసేన్ద్రం విభీషణమ్. ౪౧
ఏకైకేనాభివివ్యాథ తాన్ సర్వా న్హరియూథపాన్,

తస్మై దృఢతరం క్రుద్ధో జఘాన గదయా హయాన్. ౪౨
విభీషణో మహాతేజా రావణే స్సదురాత్మనః,
స హతాశ్వా దవప్లుత్య రథా న్నిహతసారథేః. ౪3
రథశక్తిం మహాతేజాః పితృవ్యాయ ముమోచ హ,

తామాపతన్తీం సంప్రేక్ష్య సుమిత్రానన్దవర్ధనః. ౪౪
చిచ్ఛేద నిశితై ర్బాణై ర్దశధా సాఽపత ద్భువి,

వలెఁ జూడ నొప్పెను. ౩౫

లక్ష్మణుఁడపుడు యుద్ధంబున రాక్షసునిచే బాణంబుల నొప్పింపఁబడి యంతటఁ శీఘ్రముగా ధనుస్సు నాకర్ణాంతము నాకర్షించి యింద్రజిత్తుని సుందరములయిన పోఁగులతో నొప్పుచున్న ముఖంబున అయిదు బాణంబుల వేసెను. ౩౬

శూరులును మహాపరాక్రమశాలులునగు నాలక్ష్మణేంద్రజిత్తులు సారవంతంబులగు ధనుస్సులు ధరించి కరవీరపత్రాది నానావిధాగ్రంబులగు బాణంబులచే నొండొరుల నొప్పించిరి. ౩౭

యుద్ధంబున శూరులగు లక్ష్మణేంద్రజిత్తు లిద్దఱును నెత్తుటం దడిసిన వారలై చక్కఁగాఁ బుష్పించిన పలాశవృక్షంబులభంగిం బ్రకాశించిరి. ౩౮

ధనుర్ధరులగు నాలక్ష్మణేంద్రజిత్తు లుభయులును జయంబు నొందఁ గోరికతో నొండొరుల నెదిరించి సమస్తావయవంబులందును భయంకరంబులగు బాణంబుల నొప్పించిరి. ౩౯

అంత రావణకుమారుఁడు యుద్ధంబునఁ గోపరసంబుప్పొంగ విభీషణుని ముఖంబున మూఁడుబాణంబులు వేసెను. ౪౦

మఱియు నతఁడు రాక్షసేంద్రుండగు విభీషణుని మూఁడుబాణమ్ముల నొప్పించి యా వానరవీరుల నందఱను ఒక్కొకని నొక్కొకబాణంబున నొప్పించెను. ౪౧

మహాపరాక్రమశాలియగు విభీషణుఁడు అయింద్రజిత్తునిపై మిక్కిలియుఁ గోపించి దురాత్ముఁడగు నతనిగుఱ్ఱంబులను గదచే వధించిపుచ్చెను. ౪౨

మహాతేజుఁడగు నయ్యింద్రజిత్తుఁడు గుఱ్ఱంబులును సారథియుం వధింపఁబడుటవలన రథంబునుండి నేలకు లంఘించి రథమునకు వేసియున్న శక్తిం గొని పినతండ్రి విభీషణునిపై వేసెను. ౪౩

సుమిత్రాదేవి కూర్మిపట్టి లక్ష్మణుఁడు ఆరథశక్తి విభీషణునిమీఁదికి వచ్చుటంజూచి నడుమనె తీక్ష్ణబాణంబుల ఛేదింప నదిపదిపఱియ లయి

తస్మై దృఢధనుః క్రుద్ధో హతాశ్వాయ విభీషణః. ౪౫
వజ్రస్పర్శసమా న్పఞ్చ ససర్జోరసి మార్గణాన్,

తే తస్య కాయం నిర్భిద్య రుక్మపుఙ్ఖా నిమిత్తగాః. ౪౬
బభూవు ర్లోహితా దిగ్ధా రక్తా ఇవ మహోరగాః,

స పితృవ్యాయ సంక్రుద్ధ ఇన్ద్రజిచ్ఛరమాదదే. ౪౭
ఉత్తమం రక్షసాం మధ్యే యమదత్తం మహాబలః,

తం సమీక్ష్య మహాతేజా మహేషుం తేన సంహితమ్. ౪౮
లక్ష్మణోఽప్యాదదే బాణ మన్యం భీమపరాక్రమః,
కుబేరేణ స్వయం స్వప్నే స్వస్మై దత్తం మహాత్మనా. ౪౯
దుర్జయం దుర్విషహ్యం చ సేన్ద్రై రపి సురాసురైః,
తయో స్తే ధనుషీ శ్రేష్ఠే బాహుభిః పరిఘోపమైః. ౫౦
వికృష్యమాణే బలవ త్క్రౌఞ్చా వివ చుకూజతుః,

తాభ్యాం తౌ ధనుషి శ్రేష్ఠే సంహితౌ సాయకోత్తమౌ. ౫౧
వికృష్యమాణౌ వీరాభ్యాం భృశం జజ్వలతుః శ్రియా,

తౌ భాసయన్తావాకాశం ధనుర్భ్యాం విశిఖౌ చ్యుతౌ. ౫౨
ముఖేన ముఖ మాహత్య సన్నిపేతతు రోజసా,

సన్నిపాత స్తయో శ్చాసీ చ్ఛరయో ర్ఘోరరూపయోః. ౫౩

నేలం బడెను. ౪౪

దృఢతరమయిన ధనుస్సు ధరించిన విభీషణుఁడు కోపించి విరథుఁడై యున్న నయ్యింద్రజితుని వక్షంబున వజ్రసారంబులగు పంచబాణంబులఁ బ్రయోగించెను. ౪౫

కాంచనపుంఖంబులును లక్ష్యంబు దప్పనివియునగు నాబాణంబులు ఇంద్రజితుని మేను భేదించి నెత్తుటం దడిసి యెఱ్ఱని గొప్పసర్పంబుల భంగిఁ జూపట్టినవి. ౪౬

రాక్షసమధ్యంబున మహాబలుఁడగు నయ్యింద్రజిత్తు క్రుద్ధుఁడై పిన తండ్రి విభీషణునిపై వేయుటకై యముఁడొసఁగిన యుత్తమంబగు బాణంబుఁ దీసెను. ౪౭

ఇంద్రజిత్తు అట్లు గొప్పబాణంబును సంధించుటఁ జూచి మహాతేజుఁడు భయంకరపరాక్రముఁడు నగు లక్ష్మణుఁడును మున్ను తనకుఁ గుబేరుఁడు భవిష్యద్వృత్తాంతంబుఁ దెలిసి స్వప్నంబున నొసంగినదియు ఇంద్రాది దేవాసురులకుఁ గూడ జయింపను సహింపను అలవిగానిదియు నగు వాఁడియొక దివ్యబాణంబు గ్రహించెను. ౪౮,౪౯

అప్పు డుత్తమంబులగు నాలక్ష్మణేంద్రజితుల ధనువులు ఇనుపగుదియల వంటి వారి బాహువులచే నాకర్షింపఁబడుచుఁ గ్రౌంచపక్షులు కూయునట్లు ధ్వనించినవి. ౫౦

ఆ యుత్తమబాణంబులు శూరులగు నా లక్ష్మణేంద్రపుతులచే మహాధనుస్సున సంధించి యాకర్షింపఁ బడుచు కాంత్యతిశయంబునం జేసి మిక్కిలియుం జ్వలించినవి. ౫౧

ఆ దివ్యబాణంబులు ధనుస్సులనుండి వెడలి నిజప్రకాశంబున నాకాశంబునంతయుఁ బ్రకాశింపఁజేయుచు ముఖము ముఖముందాఁకి యొండొంటితో నొఁసికొన్నవి. ౫౨

భయంకరాకారంబులగు నమ్మహా బాణంబులు ఒండొంటిం దాఁకు

స ధూమవిస్ఫులిఙ్గశ్చ తజ్జోఽగ్ని ర్దారుణోఽభవత్,

తౌ మహాగ్రహసంకాశౌ వనో్యన్యం సన్నిపత్య చ. ౫౪
సఙ్గ్రామే శతధా చ తదా యాన్తౌ మేదిన్యాం వినిపేతతుః,
శరౌ ప్రతిహతౌ దృష్ట్వా తౌ వుభౌ రణమూర్ధని. ౫౫
వ్రీళితౌ జాతరోషౌ చ లక్ష్మణేన్ద్రజితౌ తదా,
సుసంరబ్ధ స్తు సౌమిత్రి రస్త్రం వారుణ మాదదే. ౫౬

రౌద్రం మహేన్ద్రజి ద్యుద్ధే వ్యసృజ ద్యుధి నిశ్చితః,
తేన తద్విహతం త్వస్త్రం వారుణం పరమాద్భుతమ్. ౫౭

తతః క్రుద్ధో మహాతేజా ఇన్ద్రజిత్సమితింజయః,
ఆగ్నేయం సందధే దీప్తం స లోకం సంక్షిపన్నివ. ౫౮

సౌరేణాస్త్రేణ తద్వీరో లక్ష్మణః ప్రత్యవారయత్,

అస్త్రం నివారితం దృష్ట్వా రావణిః క్రోధమూర్ఛితః. ౫౯
ఆసురం శత్రునాశాయ ఘోర మస్త్రం సమాదదే,

తస్మాచ్చాపాద్వినిష్పేతు ర్భాస్వరాః కూటముద్గరాః. ౬౦
శూలాని చ ముసుణ్ఠ్యశ్చ గదాః ఖడ్గాః పరశ్వధాః,

తద్దృష్ట్వా లక్ష్మణ స్సంఖ్యే ఘోర మస్త్ర మథాసురమ్. ౬౧
అవార్యం సర్వభూతానాం సర్వశత్రువినాశనమ్,
మాహేశ్వరేణ ద్యుతిమాం స్తదస్త్రం ప్రత్యవారయత్. ౬౨

టయు వానియొరయుకం బుట్టినయగ్ని ధూమముతోడు మిణుంగురులతోడను గూడి యందఱకును భయంబు గలిగించెను. ౫౩

అమ్మహాబాణంబులు మహాగ్రహంబులంబోలె నొండొంటిందాఁకి యంధ్ధంబున విచిత్రగతులం బోరి శాంతంబులై నేలం బడినవి. ౫౪

అప్పుడు లక్ష్మణేంద్రజితు లిద్దఱును యుద్ధరంగంబునఁ దమ దివ్య బాణంబులు ప్రతిహతము లగుటం గని సిగ్గును గోపంబునుం బొందిరి. ౫౫

అంత లక్ష్మణుఁడు మిక్కిలి త్వరపడి వారుణాస్త్రంబుఁ బ్రయోగించెను. ౫౬

వృత్రాసురుని వధించిన దేవేంద్రునిఁ గూడ యుద్ధంబున జయించిన రావణకుమారుఁడు పోరం జలింపక రౌద్రాస్త్రంబు నేయుటయు దానిచే నవ్వారుణాస్త్రంబు చూపఱల కాశ్చర్యంబు గలుగునట్లు ప్రతిహతంబయ్యె.

అంత మహాతేజుఁడును శత్రుసమూహంబుల జయించువాఁడు నగు నింద్రజిత్తు కుపితుఁడై లోకంబులన్నియు సంహరించుటకో యన దేదీప్యమానమగు నాగ్నేయాస్త్రంబు ధనుస్సున సంధించెను. ౫౭

పరాక్రమవంతుఁడగు లక్ష్మణుఁడు అయ్యాగ్నేయాస్త్రంబును సౌరాస్త్రంబున నివారించెను.

ఇంద్రజిత్తుండు తన యాగ్నేయాస్త్రంబు నివారితమగుటం గని పరమ క్రుద్ధుఁడై శత్రువినాశార్థమయి మహాభయంకరంబగు నాసురాస్త్రంబుఁ బ్రయోగించెను. ౫౮

అయ్యాసురాస్త్ర ప్రభావమువలన నింద్రజిత్తుని ధనుస్సునుండి దేదీప్యమానంబులగు బాణములు ముద్గరంబులు శూలములు ముసలంబులు గదలు ఖడ్గంబులు బరశ్వధంబులు నసంఖ్యంబుగా వెడలినవి. ౬౦

అంత మహాతేజుఁడగు లక్ష్మణుఁడు భయంకరంబగు నయ్యాసురాస్త్రంబు సమస్తభూతంబులకును నివారింప నలవిగాకుండుటయుం సమస్తశత్రువుల నశింపం జేయుటయుం దెలిసి మహేశ్వరాస్త్రంబున దాని నివారించెను. ౬౧, ౬౨

తయో స్సుతుములం యుద్ధం సంబభూవాద్భుతోపమమ్,
గగనస్థాని భూతాని లక్ష్మణం పర్యవారయన్. ౬౩

భైరవాభిరుతే భీమే యుద్ధే వానరరక్షసామ్,
భూతై ర్బహుభి రాకాశం విస్మితై రావృతం బభౌ. ౬౪

ఋషయః పితరో దేవా గన్ధర్వా గరుడోరగాః,
శతక్రతుం పురస్కృత్య రరక్షు ర్లక్ష్మణం రణే. ౬౫

అథాన్యం మార్గణశ్రేష్ఠం సందధే రాఘవానుజః,
హుతాశనసమస్పర్శం రావణాత్మజదారణమ్. ౬౬

సుపత్త్ర మనువృత్తాఙ్గం సుపర్వాణం సుసంస్థితమ్,
సువర్ణవికృతం వీర శ్శరీరాన్తకరం శరమ్. ౬౭
దురావారం దుర్విషహ్యం రాక్షసానాం భయావహమ్,
ఆశీవిషవిషప్రఖ్యం దేవసంఘై స్సమర్చితమ్. ౬౮
యేన శక్రో మహాతేజా దానవా నజయ త్ప్రభుః,
పురా దైవాసురే యుద్ధే వీర్యవా న్హరివాహనః. ౬౯
తదైన్ద్ర మస్త్రం సౌమిత్రి స్సంయుగే ష్వపరాజితమ్,
శరశ్రేష్ఠం ధనుశ్శ్రేష్ఠే నరశ్రేష్ఠోఽభిసందధే. ౭౦

సంధాయామిత్రదళనం విచకర్ష శరాసనమ్,
సజ్య మాయమ్య దుర్ధర్షం కాలో లోకక్షయే యథా. ౭౧

సంధాయ ధనుషి శ్రేష్ఠే వికర్ష న్నిద మబ్రవీత్,
లక్ష్మీవా న్లక్ష్మణో వాక్య మర్థసాధక మాత్మనః. ౭౨

అంత నాలక్ష్మణేంద్రజితుల యుద్ధము భయంకరంబై యసదృశంబై యొప్పె నప్పుడు ఆకాశంబున నున్న భూతంబులన్నియుం లక్ష్మణుం బరివేష్టించి నిలిచినవి. ౬౩

అప్పుడు వానరులును రాక్షసులును భయంకరముగా భయంకర మయిన ధ్వనితోఁ బోరుచుండఁగా సమస్తభూతంబులును ఆకాశంబునఁ జేరి యాశ్చర్య పడి చూచుచుండినవి. ౬౪

అప్పుడు మహర్షులును పితరులును వేల్పులును గంధర్వ గరుడోరగా దులును దేవేంద్రసహితులయి అమ్మహాయుద్ధంబున నెంతమాత్రము బాధగలుగ కుండ లక్ష్మణుని రక్షించిరి. ౬౫

అంత రాముని తమ్ముఁడగు లక్ష్మణుఁడు అగ్నిహోత్రమువంటిదియుం రావణకుమారుని వధించునదియు నగు నుత్తమమయిన మఱియొక బాణంబు ధనుస్సున సంధించెను. ౬౬

పరాక్రమవంతుఁడుఁ బురుషశ్రేష్ఠుండు నగు లక్ష్మణుండు చక్కఁగా జెక్కులుగట్టినదియుం వర్తులమయినదియు సుందరములయిన గణుపులుగలదియుం సుందరమయిన యాకారముగలదియు కాంచనచిత్రితంబును ప్రాణాంతకరంబును నివారింపను సహింపను అలవిగానిదియు రాక్షసులకు భయంకరంబును సర్ప విధంబువలె నతిక్రూరంబును సమస్తదేవతలచేతను బూజితంబును మఱియుం మున్ను దేవాసురయుద్ధంబున మహాతేజుండును మహాపరాక్రమశాలియునగు పచ్చని గుఱ్ఱంబులుగల దేవేంద్రుఁడు సమస్తదానవుల దేనం జయించెనో అట్టి యైంద్రాస్త్రంబుచే నభిమంత్రితంబును యుద్ధంబులందుఁ బరాజయంబులేనిదియుం నగు నుత్తమం బైన బాణమును మహాధనుస్సున సంధించెను.

లక్ష్మణుండు అట్లు శత్రునాశనంబగు దివ్యబాణంబుసంధించి ప్రలయ కాలంబులందు లోకవినాశార్థమయి యముండువలె దుర్ధర్షంబగు ధనుస్సును వంచి యాకర్షించెను. ౭౧

లక్ష్మీసంపన్నుండగు లక్ష్మణుఁడు బాణంబు వింటసంధించి యాకర్ణాం తముగాకర్షింపుచుఁ దనకుఁ గార్యసాధకంబగులాగున నీవచనంబుఁబలికెను. ౭౨

ధర్మాత్మా సత్యసన్ధశ్చ రామో దాశరథి ర్యది,
పౌరుషే చాప్రతిద్వన్ద్వ శ్శరైనం జహి రావణిమ్. ౭౩

ఇత్యుక్త్వా బాణ మాకర్ణం వికృష్య త మజిహ్మగమ్,
లక్ష్మణ స్సమరే వీర స్ససర్జేన్ద్రజితం ప్రతి. ౭౪
ఐన్ద్రాస్త్రేణ సమాయోజ్య లక్ష్మణః పరవీరహా,

స శిర స్సశిరస్త్రాణం శ్రీమజ్జ్వలితకుణ్డలమ్. ౭౫
ప్రమథ్యేన్ద్రజితః కాయా త్పాతయామాస భూతలే,

తద్రాక్షసతనూజస్య ఛిన్నస్కన్ధం శిరో మహత్. ౭౬
తపనీయనిభం భూమౌ దదృశే రుధిరోక్షితమ్,
హత స్తు నిపపాతాశు ధరణ్యాం రావణాత్మజః. ౭౭
కవచీ సశిరస్త్రాణో విధ్వస్త స్సశరాసనః,
చుక్రుశు స్తే తత స్సర్వే వానరా స్సవిభీషణాః. ౭౮
హృష్యన్తో నిహతే తస్మి న్దేవా వృత్రవధే యథా,

అథా న్తరిక్షే దేవానా మృషీణాం చ మహాత్మనామ్. ౭౯
అభిజజ్ఞే చ సన్నాదో గన్ధర్వాప్సరసామపి,
పతితం తమభిజ్ఞాయ రాక్షసీ సా మహాచమూః. ౮౦
వధ్యమానా దిశో భేజే హరిభి ర్జితకాశిభిః,
వానరై ర్వధ్యమానా స్తే శస్త్రా ణ్యుత్సృజ్య రాక్షసాః. ౮౧
లఙ్కా మభిముఖా స్సస్రు ర్నష్టసంజ్ఞాః ప్రధావితాః,
దుద్రువు ర్బహుధా భీతా రాక్షసా శ్శతశో దిశః. ౮౨
త్యక్త్వా ప్రహరణాన్ సర్వే పట్టసాసిపరశ్వధాన్,

బాణమా! దశరథనుహారాజపుత్రుడగు రాముడు ధర్మాత్ముడు నిజమువాడును ప్రతిజ్ఞ దప్పనివాడును పౌరుషంబున నెదురు లేనివాడునగు నేని నీ వీయింద్రజిత్తుని వధింపుము. అని లక్ష్మణుండు పలికెను. ౮౩

యుద్ధంబున వీరుండును శత్రువీరులవధించువాడును లక్ష్మీసంపన్నుండునగు లక్ష్మణుండు ఆదివ్యబాణంబునుగూర్చి యివ్విధంబుగఁ బలికి యమ్మహాబాణంబును జెవిపఱకు నాకర్షించి యైంద్రాస్త్రంబుతో నభిమంత్రించి యింద్రజిత్తునిపై ప్రయోగించెను. ౮౪

అమ్మహాబాణము బొమిడికముతోఁ గూడినదియు శ్రీమంతంబును సుందరంబులగు పోఁగుతో నొప్పుచున్నదియునగు నింద్రజిత్తుని శిరస్సును ఖండించి దేహమునుండి నేలం బడఁద్రోసెను. ౮౫

కాంచనప్రభంబగు గొప్పదైన యీ యింద్రజిత్తునిశిరస్సు మొండెమునుండి ఖండింపఁబడి నెత్తుటందోఁగుచు భూమిపయిం జూపఁబడెను. ౮౬

రావణకుమారుం డింద్రజిత్తు అట్లు నిహతుండై కవచంబుతోను శిరస్త్రాణంబుతోను ధనుస్సుతోనుం గూడ నేలంగూలెను. ౮౭

అప్పుడు వృత్రాసురుఁడు హతుండయినపుడు దేవతలుంబోలె ఇంద్రజిత్తు నిహతుండు కాఁగానే విభీషణుండు వానరులు నందఱును సంతోషంబున సింహనాదంబులు చేసిరి. ౮౮

అంత నాకాశంబున దేవతలును మహాత్ములగు ఋషులును గంధర్వులును అప్సరసలును సంతోషంబున మహాధ్వని గావించిరి. ౮౯

రాక్షససైనికులు ఇంద్రజిత్తు పడుటం జూచి జయమునొందిన వానరులు మఱియుం వధింపనారంభించుటవలన సహింపఁజాలక దిక్కులకుంబఱచిరి. ౯౦

రాక్షసులు వానరులచే వధింపఁబడుచు వారికొల్తలకు సహింపఁజాలక సంజ్ఞదప్పి ఆయుధంబుల వదలి లంకాభిముఖంబుగాఁ బరుగెత్తిపోయిరి. ౯౧

రాక్షసులందఱును భయమునొంది అడ్డకత్తులు కత్తులు పరశ్వథంబులు మున్నగు నాయుధంబులు విడిచి అనేకవిధంబుల గుంపులు గుంపులుగాఁ బరు

కేచి ల్లఙ్కాం పరిత్రస్తాః ప్రవిష్టా వానరార్దితాః. ౮౩
సముద్రే పతితాః కేచి త్కేచి త్పర్వత మాశ్రితాః,

హత మిన్ద్రజితం దృష్ట్వా శయానం సమరక్షితౌ. ౮౪
రాక్షసానాం సహస్రేషు న కశ్చి త్ప్రత్యదృశ్యత,
యథాఽస్తం గత ఆదిత్యే నావతిష్ఠన్తి రశ్మయః. ౮౫
తథా తస్మిన్నిపతితే రాక్షసా స్తే గతా దిశః,
శాన్తరశ్మి రివాదిత్యో నిర్వాణ ఇవ పావకః. ౮౬
స బభూవ మహాతేజా వ్యపాస్తగతజీవితః,

ప్రశాన్తపీడాబహులో వినష్టారిః ప్రతాపవాన్. ౮౭
బభూవ లోకఃపతితే రాక్షసేన్ద్రసుతే తదా,

హర్షం చ శక్రో భగవాన్ సహ సర్వై స్సురర్షభైః. ౮౮
జగామ నిహతే తస్మి న్రాక్షసే పాపకర్మణి,
ఆకాశే చాపి దేవానాం శుశ్రువే దున్దుభిస్వనః. ౮౯

నృత్యద్భి రప్సరోభిశ్చ గన్ధర్వైశ్చ మహాత్మభిః,

వవృషుః పుష్పవర్షాణి తదద్భుత మభూ త్తదా. ౯౦
ప్రశశంసు ర్హతే తస్మి న్రాక్షసే క్రూరకర్మణి,

శుద్ధా ఆపో దిశ శ్చైవ జహృషు ర్దైత్య దానవాః. ౯౧

గెత్తిరి. ౭౨

అట్లు వానరులచే నొప్పింపఁబడి భయంబునం గొందఱు రక్కసులు లంకానగరంబుఁ జొచ్చిరి. కొందఱు మున్నీటం బడిరి. మఱికొందఱు పర్వతంబునఁ దాఁగిరి. ౭౩

ఇంద్రజిత్తు హతుఁడై యుద్ధభూమిం బడుటను జూచినంతనె లెక్కకు మీఱినరాక్షసులలో నొకండైనను నిలువక యందఱును బాఱిపోయిరి. ౭౪

సూర్యుఁ డస్తమించినవెనుకఁ గిరణంబులుపోవునట్లు ఇంద్రజితుండు హతుఁడు కాఁగానే రాక్షసులందఱు దిక్కులకుఁ బాఱిపోయిరి. ౭౫

హతుఁడై కొంతసేపు అవయవములు విదిలించుచుండి ప్రాణములు మేను వదలుటం జేసి నిశ్చేష్టుండైన మహాతేజుండగు నాయింద్రజితుని కళేబరము కిరణములులేనిసూర్యునిభంగిఁ జల్లాఱిన యగ్నికైవడిఁ జూపట్టెను. ౭౬

రాక్షసరాజకుమారుండు ఇంద్రజిత్తు మృతుఁడు కాఁగానే లోకమునందు సమస్తబాధలుదొలంగి సమస్తారిష్టంబులుఁబాసి సూర్యుఁడు చక్కఁగాఁ బ్రకాశించెను. ౭౭

పాపిష్ఠుండగు నాయింద్రజిత్తు నిహతుఁడు కాఁగానే భగవంతుఁడగు దేవేంద్రుండును సమస్తదేవతలును సంతోషంబు నొందిరి. ౭౮

ఆకాశమందు దేవతలు సంతోషంబున వాయించిన దుందుభిధ్వనియుం వినవచ్చెను. ౭౯

మఱియు మహాత్ములగు గంధర్వులు నప్సరసలును నృత్యముసేయు నాధ్వనియుం వినంబడినది.

క్రూరకార్యములు చేయునట్టి యయ్యింద్రజితుఁడు హతుఁడైనప్పుడు దేవతలు సంతోషంబునఁ బుష్పవర్షంబులు గురిపించి లక్ష్మణునిఁ బ్రశంసించిరి. అది యపు డద్భుతంబై యుండెను. ౮౦

అప్పుడు జలంబులు దిశలును నిర్మలములయ్యె దైత్యులును దానవులును సంతసంబు నొందిరి. ౮౧

ఆజగ్ముః పతితే తస్మిన్ సర్వలోకభయావహే,
ఊచుశ్చ సహితా స్సర్వే దేవగన్ధర్వదానవాః. ॥ ౨
విజ్వరా శ్శాన్తకలుషా బ్రాహ్మణా విచరన్త్వితి,

తతోఽభ్యనన్ద స్సంహృష్టా స్సమరే హరియూథపాః. ॥ ౩
తమప్రతిబలం దృష్ట్వా హతం నైరృతపుఙ్గవమ్,

విభీషణో హనూమాంశ్చ జామ్బవాం శ్చర్క్షయూథపః. ॥ ౪
విజయేనాభినన్దన్త స్తుష్టువుశ్చాపి లక్ష్మణమ్,
క్ష్వేళ న్తశ్చ నద న్తశ్చ గర్జ న్తశ్చ ప్లవఙ్గమాః. ॥ ౫
లబ్ధలక్షా రఘుసుతం పరివార్యోపతస్థిరే,

లాఙ్గూలాని ప్రవిధ్యన్త స్స్ఫోటయన్తశ్చ వానరాః. ॥ ౬
లక్ష్మణో జయతీత్యేవం వాక్యం విశ్రావయం స్తదా,

అన్యోన్యం చ సమాశ్లిష్య కపయో హృష్టమానసాః. ॥ ౭
చక్రు రుచ్చావచగుణా రాఘవాశ్రయజాః కథాః.
తదసుకర మథాభివీక్ష్య హృష్టాః
ప్రియసుహృదో యుధి లక్ష్మణస్య కర్మ,
పరమ ముపలభ న్మనసి ప్రహర్షం
హత మిన్ద్రరిపుం నిశమ్య దేవాః. ॥ ౮

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే - ఏకనవతితమస్సర్గః.

సమస్తలోకంబులకును భయంబు గలిగించుచుండిన యయ్యింద్రజి
తుండు హతుండు కాఁగానే దేవతలు గంధర్వులు దానవులు వచ్చి యందఱును
జేరి "యింక బ్రాహ్మణులు నిర్బాధయులేక సుఖముగా విహరింతురుగాక" యని
వచించిరి. ౯౨

అప్పుడు వానరవీరులు అసదృశబలుఁడగు రాక్షసశ్రేష్ఠుం డింద్ర
జిత్తు యుద్ధంబున నిహతుఁ డగుటను జూచి సంతుష్టులయి లక్ష్మణుని
గొనియాడిరి. ౯౩

విభీషణుఁడును హనుమంతుఁడును భల్లూకనాథుఁడగు జాంబవంతుఁ
డును జయంబు గలుగుటకుఁ బరమసంతుష్టులయి లక్ష్మణుం బొగడిరి. ౯౪

వానరులు తాము కోరిన యింద్రజిద్వధము సిద్ధించుటఁ జేసినం తోషం
బున సింహనాదంబులు సేయుచు నానావిధంబుల నటించుచు గర్జించుచు
లక్ష్మణుం బరివేష్టించి కొలిచియుండిరి. ౯౫

అప్పుడు వానరులు సంతోషాతిశయంబున శిలలు మొదలగువాని వాల
ములచేఁ గొట్టి పగులఁగొట్టుచు "లక్ష్మణోజయతి" (లక్ష్మణుఁడు సర్వోత్కర్షం
బున నున్నాఁడు) అని యిట్లు చాటించిరి. ౯౬

వానరులు పరమసంతుష్టులయి యొకరి నొకరు కవుఁగిలించుకొనుచు
లక్ష్మణునిఁ గుఱించి నానావిధంబుగా స్తోత్రవచనంబులు పలుకుచుండిరి. ౯౭

దేవతలు ఇంద్రజిత్తు వధింపఁబడెనని చారణముఖంబున విని సంతుష్టు
లయి అయ్యుద్ధభూమికిఁబోయి యెట్టివారికిని అసాధ్యమయిన (సమస్త
లోకంబులకును ప్రాణప్రతిష్ఠాకరమయిన) యింద్రజిద్వధమును సర్వలోక
ప్రియసుహృదుఁడగు లక్ష్మణుండె గావించినాఁడని తెలిసి మిక్కిలియు సంతో
షించిరి. ౯౮

ఇది తొంబదియొకటవసర్గము.

## ద్వినవతితమస్సర్గః.

రుధిరక్లిన్నగాత్రస్తు లక్ష్మణశ్శుభలక్షణః,
బభూవ హృష్ట స్తం హత్వా శక్రజేతార మాహవే. ౧

తతస్స జామ్బవన్తం చ హనుమన్తం చ వీర్యవాన్,
సన్నివర్త్య మహాతేజాస్తాంశ్చ సర్వాన్వనౌకసః. ౨
ఆజగామ తత స్తీవ్రం యత్ర సుగ్రీవరాఘవౌ,
విభీషణ మవష్టభ్య హనూమన్తం చ లక్ష్మణః. 3
తతో రామ మభిక్రమ్య సౌమిత్రిరభివాద్య చ,
తస్థౌ భ్రాతృసమీపస్థ ఇన్ద్రస్యేవ బృహస్పతిః. ౪

నిష్టనన్నివ చాగమ్య రాఘవాయ మహాత్మనే,
ఆచచక్షే తదా వీరో ఘోర మిన్ద్రజితో వధమ్. ౫

రావణేస్తు శిర శ్ఛిన్నం లక్ష్మణేన మహాత్మనా,
న్యవేదయత రామాయ తదా హృష్టో విభీషణః. ౬

శ్రుత్వైతత్తు మహావీర్యో లక్ష్మణేనేన్ద్రజిద్వధమ్,
ప్రహర్ష మతులం లేభే రామో వాక్య మువాచహ. ౭
సాధు లక్ష్మణ! తుష్టోఽస్మి కర్మణా సుకృతం కృతమ్,
రావణేర్హి వినాశేన జితమిత్యుపధారయ. ౮

స తం శిరస్యుపాఘ్రాయ లక్ష్మణం లక్ష్మివర్ధనమ్,
లజ్జమానం బలాత్స్నేహా దఙ్క మారోప్య వీర్యవాన్. ౯

## తొంబది రెండవసర్గము.

నెత్తుటం దడుపఁబడియున్న మంగళకరంబులగు లక్షణంబులు గల లక్ష్మ ణుఁడు యుద్ధంబున నింద్రుని జయించినట్టి యమ్మహాబలుని వధించి యానం దంబు నొందెను. ౧

అంత మహాబలుఁడును మహాతేజుఁడునగు లక్ష్మణుఁడు జాంబవంతుని హనుమంతుని మఱియు నితరవానరుల నందఱను గుంపుగాఁ బిలుచుకొని యుద్ధ పారవశ్యంబున విభీషణ హనుమంతుల నవలంబించి యుద్ధభూమినుండి రామ సుగ్రీవులయొద్దకు శీఘ్రముగాఁ బోయెను. ౨ ౩

అంత లక్ష్మణుఁడు రామునకుఁ బ్రదక్షిణనమస్కారములు చేసి యింద్రుని సమీపంబున బృహస్పతియుండునట్లు రాముని సమీపంబున నిలుచుండెను. ౪

అప్పుడు వీరుఁడగు లక్ష్మణుఁడు రాముని సమీపంబునకు వచ్చి సంతో షాతిశయంబునఁజేసి యవ్యక్తాక్షరంబుగాఁ బలుకుచు మహాత్ముఁడగు రాము నితో "ఇంద్రజిత్తు హతుఁడయ్యె" నని చెప్పెను. ౫

అప్పుడు విభీషణుఁడు సంతుష్టుఁడై "ఇంద్రజిత్తు హతుఁడయ్యెఁగాని యతని శిరస్సునుమాత్రము మహాత్ముఁడగు లక్ష్మణుఁడు ఛేదించెను" అని రాము నకు విన్నవించెను. ౬

మహాపరాక్రమశాలియగు రాముఁడు లక్ష్మణుఁ డింద్రజితుని వధించి నాఁడన్నమాటను విన్నంతనె పరమసంతోషమునొంది యీమాటఁ జెప్పెను.

లక్ష్మణా! నీవుచేసిన కార్యమునకు మిక్కిలియు సంతోషించినాను. గొప్పపని గావించినావు. ఏలయనఁగా ఇంద్రజితుఁడు పడుటచే మనకింక రావణుఁడును హతుఁడైనట్లె నిశ్చయింపవచ్చును. అని రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పెను. ౭

వీర్యవంతుఁడగు రాముఁడు లక్ష్మీవర్ధనుఁడగు లక్ష్మణుని శిరంబున మూర్కొని యతఁడు సిగ్గుపడి యొదిగియుండుటయు స్నేహంబున బలాత్కా

ఉపవేశ్య తముత్సఙ్గే పరిష్వజ్యావపీడితమ్,
భ్రాతరం లక్ష్మణం స్నిగ్ధం పునః పున రుదైక్షత. ౧౦
శల్యసంపీడితం శస్తం నిశ్వసన్తం తు లక్ష్మణమ్,
రామస్తు దుఃఖసంతప్త స్తదా నిశ్వసితో భృశమ్. ౧౧
మూర్ధ్ని చైన ముపాఘ్రాయ భూయ స్సంస్పృశ్య చ త్వరన్,
ఉవాచ లక్ష్మణం వాక్య మాశ్వాస్య పురుషర్షభః. ౧౨

కృతం పరమకల్యాణం కర్మ దుష్కరకర్మణా,

అద్య మన్యే హతే పుత్త్రే రావణం నిహతం యుధి. ౧౩
అద్యాహం విజయీ శత్రౌ హతే తస్మిన్దురాత్మని,

రావణస్య నృశంసస్య దిష్ట్యా వీర! త్వయా రణే. ౧౪
ఛిన్నో హి దక్షిణో బాహు స్సహి తస్య వ్యపాశ్రయః,

విభీషణహనూమద్భ్యాం కృతం కర్మ మహ ద్రణే. ౧౫
అహోరాత్రై స్త్రిభి ర్వీరః కథంచి ద్వినిపాతితః,

నిరమిత్త్రః కృతోఽస్మ్యద్య నిర్యాస్యతి హి రావణః. ౧౬
బలవ్యూహేన మహతా శ్రుత్వా పుత్త్రం నిపాతితమ్,

తం పుత్త్రవధసన్తప్తం నిర్యాన్తం రాక్షసాధిపమ్. ౧౭
బలేనావృత్య మహతా నిహనిష్యామి దుర్జయమ్,

త్వయా లక్ష్మణ! నాథేన సీతా చ పృథివీ చ మే. ౧౮

రముగా నుత్సంగంబునఁ గూర్చుండఁ బెట్టుకొని గాఢముగాఁ గౌఁగిటఁ జేర్చి స్నేహాతిశయంబునఁ దమ్ముని మాటిమాటికిఁ జూచెను. ౯,౧౦

అప్పుడు పురుషోత్తముఁడగు రాముఁడు అట్లు లక్ష్మణుఁడు బాణములచే బీడితుండై దేహమంతయు గాయములందగిలి నిట్టూర్పులు నిగుడించుచుండు టను జూచి పరమదుఃఖితుండై నిట్టూర్పులువుచ్చుచుఁ దమ్ముని శిరంబు మూర్కొని వేగిరపాటున మాటిమాటికి నతనిదేహంబు దడవుచు మంచిమాటల నాశ్వాసించి యిట్లని పలికెను. ౧౧,౧౨

ఇతరుల కసాధ్యములయిన కార్యములు చేయువాఁడవు కావున నీవు ఈయింద్రజితునివధించి నాకు మిక్కిలియు మంగళంబు గలిగించినావు.

కొడుకు నిహతుఁడయ్యెఁ గావున నిఁక రావణుఁడును యుద్ధంబున నిహతుఁడైనట్లె తలంచెదను. ఇప్పుడు దురాత్ముండగు మనశత్రు నాయింద్రజితుఁడు హతుఁడయ్యెఁ గావున నిఁక నాకు విజయము సిద్ధము. ౧౩

వీరుఁడా! నీవు ఇంద్రజితుని వధించుటవలన క్రూరుఁడగు రావణుని కుడిభుజమును నేఁడు యుద్ధమున ఛేదించినవాఁడవైతివి. ఎట్లనఁగా నాయింద్రజిత్తె రావణునకు ముఖ్యమయిన యవలంబము. ౧౪

విభీషణుఁడును హనుమంతుఁడును యుద్ధంబున మిక్కిలియుఁ బరాక్రమముఁ గావించినారు. ఇట్లు మూఁడహోరాత్రములకు మహాప్రయాసంబున వీరుఁడగు నింద్రజిత్తును వధించినారు. ౧౫

ఇప్పుడు ఇంద్రజిత్తును వధించుటచేత నాకు శత్రువు లందఱు నశించినట్లు గావించినావు. ఇఁక రావణుఁడును కొడుకు పడుటను విని గొప్పసైన్యముతో యుద్ధమునకు వెడలిరాఁగలఁడు. ౧౬

కొడుకు హతుఁడగుటకుఁ బరితపించుచు దుర్జయుండగు రాక్షసరాజు రావణుఁడు యుద్ధమునకు వెడలివచ్చినంతనె గొప్పవానరబలంబుతోఁ జొచ్చి యతని వధించి పుచ్చెదను. ౧౭

లక్ష్మణుఁడా! నాథుఁడవు నీవు యుద్ధంబున నింద్రజిత్తును వధించుట

న దుష్ప్రాపా హతే త్వద్య శక్రజేతరి చాహవే,

స తం భ్రాతర మాశ్వాస్య పరిష్వజ్య చ రాఘవః. ౧౯
రామ స్సుషేణం ముదిత స్సమాభాష్యేద మబ్రవీత్,
సశల్యోఽయం మహాప్రాజ్ఞ సౌమిత్రి ర్మిత్రవత్సలః. ౨౦
యథా భవతి సుస్వస్థ స్తథా త్వం సముపాచర,

విశల్యః క్రియతాం క్షిప్రం సౌమిత్రి స్సవిభీషణః. ౨౧

ఋక్షవానరసైన్యానాం శూరాణాం ద్రుమయోధినామ్,
యే చాప్యన్యేఽత్ర యుధ్యన్తి సశల్యా వ్రణిన స్తథా. ౨౨
తేఽపి సర్వే ప్రయత్నేన క్రియన్తాం సుఖిన స్త్వయా,

ఏవ ముక్త స్తు రామేణ మహాత్మా హరియూథపః. ౨౩
లక్ష్మణాయ దదౌ న స్త స్సుషేణః పరమౌషధిమ్,
స తస్యా గన్ధ మాఘ్రాయ విశల్య స్సమపద్యత. ౨౪
తదా నిర్వేదన శ్చైవ సంరూఢవ్రణ ఏవ చ,

విభీషణముఖానాం చ సుహృదాం రాఘవాజ్ఞయా. ౨౫
సర్వవానరముఖ్యానాం చికిత్సాం స తదాఽకరోత్,
తతః ప్రకృతి మాపన్నో హృతశల్యో గతవ్యథః. ౨౬
సౌమిత్రి ర్ముదిత స్తత్ర క్షణేన విగతజ్వరః.

తథైవ రామః ప్లవగాధిప స్తదా

వలన నీకు కాని సీతను భూమిని బొందుట యెంతమాత్రము కష్టముగాదు. అని రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పెను. ౧౮

రఘువంశమునందుఁ బుట్టిన రాముఁడు అట్లు తమ్ము నాశ్వాసించి యాలింగనము చేసికొని సంతుష్టాంతరంగుఁడై సుషేణుం బిలిచి యిట్లనియె. ౧౯

వైద్యశాస్త్రంబునందు మహాపండితుఁడవైన సుషేణుఁడా! మిత్రులయం దధికప్రీతిగల యీ లక్ష్మణుని దేహమంతయుఁ బాణములు గ్రుచ్చుకొని బాధించుచున్నవి. ఈతఁడు బాణబాధ విడిచి సుఖంబునొందునట్లు నీవు చికిత్స గావింపుము. ౨౦

శీఘ్రముగా లక్ష్మణునకును విభీషణునకును మేనం గ్రుచ్చుకొన్న బాణముల విడదీసి సుఖము గల్గునట్లు చికిత్స చేయుము. ౨౧

మఱియు శూరులును వృక్షంబులచేఁ బోరువారలునగు భల్లూక వీరుల లోను వానరవీరులలోను యుద్ధంబున మేన నమ్ములు గ్రుచ్చుకొని గాయములం దగిలినవార లెవరెవరు గలరో వార లందఱకును శీఘ్రంబున నీవిపుడు సుఖంబు గల్గునట్లు సేయుము. అని రాముఁడు సుషేణునితోఁ జెప్పెను. ౨౨

మహాబుద్ధిశాలియగు వానరవీరుఁడు సుషేణుఁడు రాముఁడు చెప్పిన మాటను విని లక్ష్మణుని ఒక దివ్యౌషధిని వాసన చూపెను. ౨౩

ఆ లక్ష్మణుఁడు ఆ యోషధి నాఘ్రాణించినంత ఆతని దేహంబునం గ్రుచ్చుకొన్న బాణంబులు వీడి వేదనయుఁ డిగి గాయములు మాని సుఖము నొందెను. ౨౪

అంత సుషేణుఁడు రాము నానతి చొప్పున విభీషణుండు మున్నగు మిత్రవర్గమునకు సమస్తవానరవీరులకును జికిత్స గావించెను. ౨౫

అంత నప్పుడు లక్ష్మణుండు క్షణమాత్రంబున దేహమునందు బాణములు విడఁదీయఁబడుటం జేసి తాపంబును వేదనయుఁ వదలి యెప్పటియట్ల సంతోషము నొందెను. ౨౬

అప్పుడు రాముఁడును వానరరాజు సుగ్రీవుండును విభీషణుండును

విభీషణ శ్చర్క్షపతి శ్చ జామ్బవాన్,
అవేక్ష్య సౌమిత్రి మరోగ ముత్థితం
ముదా ససైన్యా స్సుచిరం జహర్షిరే. ౨౭
అపూజయ త్కర్మ స లక్ష్మణస్య
సుదుష్కరం దాశరథి ర్మహాత్మా,
హృష్టా బభూవు ర్యుధి యూథపేన్ద్రా
నిపాతితం శక్రజితం నిశమ్య. ౨౮

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే ద్వినవతితమస్సర్గః.

## త్రి న వ తి త మ స్స ర్గః.

తతః పౌలస్త్యసచివా శ్శ్రుత్వా చేన్ద్రజితం హతమ్,
ఆచచక్షు రభిజ్ఞాయ దశగ్రీవాయ సవ్యథాః. ౧

యుద్ధే హతో మహారాజ లక్ష్మణేన తవాత్మజః,
విభీషణసహాయేన మిషతాం నో మహాద్యుతిః. ౨

శూర శ్శూరేణ సంగమ్య సంయుగేష్వపరాజితః,
లక్ష్మణేన హత శ్శూరః పుత్ర స్తవ మహేన్ద్రజిత్. ౩

గత స్స పరమా న్లోకాన్ శరై స్సంతాప్య లక్ష్మణమ్,

స తం ప్రతిభయం శ్రుత్వా వధం పుత్రస్య దారుణమ్. ౪
ఘోర మిన్ద్రజిత స్సంఖ్యే కశ్మలం చావిశ న్మహత్,

భల్లూకనాథుఁడగు జాంబవంతుఁడును సైనికులును లక్ష్మణుఁడు రోగము వదలి సుఖముగా సంతోషంబుతో లేచుటం జూచి బహుకాలమువఱకు సంతోషింపుచుండిరి. ౨౭

మహాత్ముఁడగు రాముఁడు లక్ష్మణుఁడు ఇతరుల కజేయుఁడగు నింద్రజిత్తును వధించుటకు గుఱించి యెంతయుం శ్లాఘించెను. వానరవీరులను యుద్ధంబున నింద్రజితుండు హతుఁడయ్యెనని విని సంతసంబునొందిరి. ౨౮

ఇది తొంబదిరెండవ సర్గము.

## తొంబదిమూఁడవ సర్గము.

అంత నింద్రజిత్తుతోఁ గూడ యుద్ధంబునకు వచ్చి యచటచటం దమ సైన్యంబులతో యుద్ధము సేయుచుండిన రావణసచివులు ఇంద్రజిత్తు హతుఁడయ్యెనని విని తాము స్వయముగాఁ బోయి చూచి దుఃఖితులై దశగ్రీవునకుఁ దెలిపిరి. ౧

మహారాజవగు రావణుఁడా! మహాతేజుఁడగు నీకొడుకు ఇంద్రజిత్తును యుద్ధంబున మేమందఱము చూచుచుండఁగా లక్ష్మణుఁడు విభీషణుని సాహాయ్యంబున వధించెను. ౨

యుద్ధంబులందుఁ బరాజయమే యెఱుంగని శూరుం డింద్రజిత్తును అట్టి శూరుఁడగు లక్ష్మణుఁడును యుద్ధముచేసిచేసి తుదకు దేవేంద్రుని జయించిన శూరుఁడు నీకొడుకు ఇంద్రజిత్తు లక్ష్మణునిచే వధింపఁబడెను. ౩

ఆ యింద్రజిత్తు లక్ష్మణుని బాణంబులచే మిక్కిలియుం నొప్పించి యుద్ధంబున హతులగు వీరులు పొందు నుత్తమలోకంబులఁ బొందెను. అని సచివులు రాక్షసరాజుతోఁ జెప్పిరి.

ఆ రావణుఁడు యుద్ధంబునఁ దనపుత్త్రుఁడు నిహతుఁడయ్యె నను భయంకరంబును దుఃఖకరంబును దుస్సహంబునగు వార్తను విన్నంతనె మూర్ఛనొందెను. ౪

ఉపలభ్య చిరా త్సంజ్ఞాం రాజా రాక్షసపుఙ్గవః. ౫
పుత్రశోకార్దితో దీనో విలలాపాకులేన్ద్రియః,

హా రాక్షసచమూముఖ్య! మమ వత్స! మహారథ!. ౬
జిత్వేన్ద్రం కథమద్య త్వం లక్ష్మణస్య వశం గతః,

నను త్వ మిషుభిః క్రుద్ధో భిన్ద్యాః కాలా న్తకావపి. ౭
మన్దరస్యాపి శృఙ్గాణి కింపున ర్లక్ష్మణం యుధి,

అద్య వైవస్వతో రాజా భూయో బహుమతో మమ. ౮
యేనాద్య త్వం మహాబాహో! సంయుక్తః కాలధర్మణా,
ఏష పన్థా స్సుయోధానాం సర్వామరగణేష్వపి. ౯

యః కృతే హన్యతే భర్తు స్స పుమాన్ స్వర్గ మృచ్ఛతి,

అద్య దేవగణా స్సర్వే లోకపాలా స్తథర్షయః. ౧౦
హత మిన్ద్రజితం శ్రుత్వా సుఖం స్వప్స్యన్తి నిర్భయాః,
అద్య లోకా స్త్రయః కృత్స్నా పృథివీ చ సకాననా. ౧౧
ఏకేనేన్ద్రజితా హీనా శూన్యేవ ప్రతిభాతి మే,

అద్య నైరృతకన్యానాం శ్రోష్యామ్య న్తఃపురే రవమ్. ౧౨

రాక్షసోత్తముఁడగు రావణుఁడు దీర్ఘకాలంబునకుఁ దెలివొంది పుత్త్ర దుఃఖముచేఁ బీడితుఁడై దీనుఁడై విహ్వలంబులయిన యింద్రియంబులతో విలపించెను. ౫

అయ్యో! రాక్షససేన కంతయుఁ ముఖ్యుఁడా! నాచిన్నికొమరుఁడా! పదునొకండువేలమంది విలుకాండ్రతో నందఱకు నన్నిరూపులయి పోరు వాఁడా! నీవు దేవేంద్రునిఁగూడ జయించినావే; ఇప్పుడు లక్ష్మణుని కెట్లు లోఁబడితివి?. ౬

నాయనా! నీవు కోపించినచో యముని మృత్యువును మందరశిఖరం బులనేని బాణంబుల భేదింతువే; ఇఁక యుద్ధంబున నీవు లక్ష్మణుం డెంత మాత్రము? ౭

మహాబాహుఁడా! నీవిప్పుడు మరణంబు నొంది యమునితోఁ జేరి నావు కావున ఆ యముఁడు నాకిప్పుడు మిక్కిలియుఁ గావలసినవాఁడయ్యె. ౮

ఇట్లు యుద్ధంబున హతుఁడై మృతిఁబొందుట సమస్తశూరులకును ముఖ్యముగా నపేక్షణీయము. మనుష్యులకు మాత్రమె కాదు; సమస్తదేవతల కును ముఖ్యముగాఁ గోరఁదగినది; కావున నిన్నుగుఱించి దుఃఖించుట యుక్తముగాదు. ౯

ఎవఁడు తన యొడయని కార్యార్థమయి హతుఁ డగునో అతఁడు స్వర్గము నొందఁగలఁడు. కావున స్వామి కార్యార్థమయి హతుఁడవై స్వర్గము నొందినావగుటవలనను నీవు శోచ్యుఁడవు కావు.

ఇఁక సమస్తదేవతలును దిక్పాలురును మహర్షులును ఇంద్రజిత్తు హతుఁ డయ్యెనని విని నిర్భయులై సుఖముగా నిదురవోవఁ గలరు. ౧౦

ఇప్పుడు మూఁడు లోకంబులును ముఖ్యముగా నానావిధారణ్య సహితమగు సమస్తభూమండలమును ఒక యింద్రజిత్తులేని కారణంబున నాకు శూన్యములుగాఁ దోఁచుచున్నవి. ౧౧

ఇఁకఁ బర్వతగుహలందు యూథపతి మరణదుఃఖితములైన యాఁడేను

కరేణుసంఘస్య యథా నినాదం గిరిగహ్వరే,

యౌవరాజ్యం చ లఙ్కాం చ రక్షాంసి చ పరంతప!. ౧౩
మాతరం మాం చ భార్యాం చ క్వ గతోఽసి విహాయ నః,

మమ నామ త్వయా వీర గతస్య యమసాదనమ్. ౧౪
ప్రేతకార్యాణి కార్యాణి విపరీతే హి వర్తసే,

స త్వం జీవతి సుగ్రీవే రాఘవే చ సలక్ష్మణే. ౧౫
మమ శల్య మనుద్ధృత్య క్వ గతోఽసి విహాయ నః,

ఏవమాది విలాపార్తం రావణం రాక్షసాధిపమ్. ౧౬
ఆవివేశ మహాన్కోపః పుత్రవ్యసనసంభవః,
ప్రకృత్యా కోపనం హ్యేనం పుత్రస్య పునరాధయః. ౧౭
దీప్తం సందీపయామాసు ర్ఘర్మేఽర్క మివ రశ్మయః,

లలాటే భ్రుకుటీభిశ్చ సంగతాభి ర్వ్యరోచత. ౧౮
యుగాన్తే సహ నక్రైస్తు మహోర్మిభి రివోదధిః,

కోపా ద్విజృమ్భమాణస్య వక్త్రా ద్వ్యక్త మభిజ్వలన్. ౧౯
ఉత్పపాత సధూమోఽగ్నిర్వృత్రస్య వదనాదివ,

సపుత్రవధసంతప్త శ్శూరస్స క్రోధవశం గతః. ౨౦
సమీక్ష్య రావణో బుద్ధ్యా వై దేహ్యా రోచయ ద్వధమ్,

గులుంబోలె ఇంద్రజిద్వధదుఃఖితులై యంతిపురంబున రోదనంబు సేయు రాక్షసకన్యల యార్తధ్వనిని వినఁగలను. ౧౨

శత్రువులఁ దపింపఁజేయువాఁడా! నీవు యౌవరాజ్యంబును లంకను రాక్షసులను తల్లిని దండ్రిని భార్యనువదలి యిట్లు మమ్మందఱను వదలి యెందుఁ బోతివి? ౧౩

వీరుఁడా! నేను మృతిఁబొందితే నీవు గదా నాకు ప్రేతకార్యములు చేయవలసినవాఁడవు. అట్లుగాక విపరీతముగా నీకు నేను జేయునట్లు గావించితివి. ౧౪

ఇదివఱకు నాయాపద లన్నియుఁ దీర్చుచుండినట్టి నీవు ఇప్పుడు సుగ్రీవుని రాముని లక్ష్మణుని వధింపక వారలు బ్రతికి యుండఁగానే నాయాపదను బోఁగొట్టకయె మమ్ము వదలి యెచటికిఁ బోయినావు? అని రావణుఁడు విలపించెను. ౧౫

రాక్షసరాజు రావణుఁడు ఈ ప్రకారము విలపించుచుఁ బరమదుఃఖితుఁడై పుత్త్రమరణంబుఁజేసి మితిలేని కోపంబు నొందెను. ౧౬

స్వభావంబుననె తీక్ష్ణకిరణుఁడగు సూర్యుని వేసవికాలంబునఁ గిరణంబులు మఱియుం దీక్ష్ణునిఁగాఁ జేయునట్లు స్వభావంబుచేతనె కోపనుం డగు రావణుని పుత్త్రశోకము మఱియుఁ గుపితునిఁగాఁ జేసెను. ౧౭

అప్పుడు రావణుని పదిమొగంబులం బన్నిన బొమముళ్లు ప్రలయకాలంబున సముద్రంబునందు మకరంబులతోఁ గూడిన గొప్పకరుళ్లవలె నొప్పినవి. ౧౮

అప్పుడు రావణుఁడు కోపంబున నావులింత విడువఁగా నతని నోటినుండి పూర్వము వృత్రాసురుని ముఖమునుండి వెడలినట్లు ప్రకాశముతో జ్వలించుచు ధూమసహితమయిన యగ్ని వెడలెను. ౧౯

అట్లు పుత్త్రవధంబుచేఁ బరితపింపుచు శూరుండగు నా రావణుఁడు క్రోధవశంగతుండై బుద్ధితోఁ గర్తవ్యంబు నాలోచించి సీతాదేవిని వధింపవలె

తస్య ప్రకృత్యా రక్తే చ రక్తే క్రోధాగ్నినాపి చ. ౨౧
రావణస్య మహాఘోరే దీప్తే నేత్రే బభూవతుః,

ఘోరం ప్రకృత్యా రూపం తత్తస్య క్రోధాగ్నిమూర్ఛితమ్. ౨౨
బభూవ రూపం క్రుద్ధస్య రుద్రస్యేవ దురాసదమ్,

తస్య క్రుద్ధస్య నేత్రాభ్యాం ప్రాపతన్నాస్రబిన్దవః. ౨౩
దీప్తాభ్యామివ దీపాభ్యాం సార్చిషస్స్నేహబిన్దవః,

దన్తాన్విదశత స్తస్య శ్రూయతే దశనస్వనః. ౨౪
యన్త్రస్యావేష్ట్యమానస్య మహతో దానవైరివ,

కాలాగ్నిరివ సంక్రుద్ధో యాం యాం దిశ మవైక్షత. ౨౫
తస్యాం తస్యాం భయత్రస్తా రాక్షసా స్సంవిలిల్యిరే,

తమన్తక మివ క్రుద్ధం చరాచరచిఖాదిషుమ్. ౨౬
వీక్షమాణం దిశ స్సర్వా రాక్షసా నోపచక్రముః,

తతః పరమసంక్రుద్ధో రావణో రాక్షసాధిపః. ౨౭
అబ్రవీ ద్రక్షసాం మధ్యే సంస్తమ్భయి(షు రాక్షు) మాహవే,
మయా వర్షసహస్రాణి చరిత్వా దుశ్చరం తపః. ౨౮
తేషు తేష్వవకాశేషు స్వయంభూః పరితోషితః,
తస్యైవ తపసో వ్యుష్ట్యా ప్రసాదా చ్చ స్వయంభువః. ౨౯
నాసురేభ్యో న దేవేభ్యో భయం మమ కదాచన,

నని తలంపు గొనెను. ౨౦

స్వభావముచేతనె యెఱ్ఱగా నున్న యారావణుని కన్నులు అప్పుడు నిప్పువంటి క్రోధముచే మఱియు నెఱ్ఱనివై మహాభయంకరంబులయి ప్రజ్వలించినవి. ౨౧

స్వభావముచేతనె భయంకరంబగు నారావణుని యాకారంబు అపుడు కోపాగ్నిచే వ్యాప్తమగుటకజేసి మఱియుం భయంకరంబై కుపితుండగు రుద్రుని రూపమువలె దురాసదంబై యుండెను. ౨౨

మండుచున్న దీపములనుండి మంటతో నూనెబిందువులుపడునట్లు కుపితుండగు రావణుని నేత్రంబులనుండి జ్వాలలతోఁ గూడ నశ్రుబిందువులు పడినవి. ౨౩

ఆ రావణుఁడు పండ్లు కొఱుకునపుడు ఆదంతధ్వని బలవంతులగు రాక్షసులచేఁ ద్రిప్పఁబడుచున్న తిలయంత్రముయొక్క ధ్వనివలె భయంకరముగా వినంబడెను. ౨౪

సంక్రుద్ధుండగు నారావణుఁడు కాలాగ్నియుంబోలె భీకరాకారుండై యేయేదిశం జూచు నా యా దిక్కుననున్న రాక్షసు లందఱు భయంబున నతనియెదుటంబడక నోడి చాటునకుఁ బోయిరి. ౨౫

అట్లు కుపితుండై ప్రలయకాలంబునఁ జరాచరంబుల సంహరించునట్టి యంతకునిభంగి భయంకరాకారుఁడై యన్నివైపులం జూచుచున్న యారావణుని సమీపంబునకు రాక్షసులు భయంబునం బోవఁజాలరైరి. ౨౬

అంతఁ బరమకుపితుఁడగు రాక్షసేశ్వరుఁడగు రావణుఁడు రాక్షసులను యుద్ధంబునకుఁ బురికొల్పుటకై రాక్షసులనడుమ నిట్లని పలికెను. ౨౭

నేను పెక్కువేల సంవత్సరంబులు దుష్కరంబగు తపము గావించి అయ్యాయవకాశంబులందుఁ బెక్కుమార్లు బ్రహ్మదేవుని సంతోషపఱచినాను.

ఆ తపస్సుయొక్క మహిమవలనను మఱియు బ్రహ్మదేవుని యనుగ్రహమువలనను నాకు నొకప్పుడును దేవతలవలనను అసురులవలను ఎంతమాత్ర

కవచం బ్రహ్మదత్తం మే యదాదిత్యసమప్రభమ్. 30
దేవాసురవిమర్దేషు న భిన్నం వజ్రశక్తిభిః,

తేన మా మద్య సంయుక్తం రథస్థ మిహ సంయుగే. 31
ప్రతీయాతోఽద్య మామాజౌ సాక్షాదపి పురన్దరః,
యత్తదాభిప్రసన్నేన సశరం కార్ముకం మహత్. 32
దేవాసురవిమర్దేషు మమ దత్తం స్వయంభువా,
అద్య తూర్యశతైర్భీమం ధను రుత్థాప్యతాం మమ. 33
రామలక్ష్మణయో రేవ వధాయ పరమాహవే,
స పుత్త్రవధసంతప్త శ్శూరః క్రోధవశం గతః. 34
సమీక్ష్య రావణో బుద్ధ్యా సీతాం హన్తుం వ్యవస్యత,
ప్రత్యవేక్ష్య తు తామ్రాక్ష స్సుఘోరో ఘోరదర్శనః. 35
దీనో దీనస్వరాన్ సర్వాం స్తా నువాచ నిశాచరాన్,

మాయయా మమ వత్సేన వఞ్చనార్థం వనౌకసామ్. 36
కించి దేవ హతం తత్ర సీతేయ మితి దర్శితమ్,

తదిదం తథ్యమేవాహం కరిష్యే ప్రియ మాత్మనః. 37
వైదేహీం నాశయిష్యామి క్షత్త్రబన్ధు మనువ్రతామ్,

ఇత్యేవ ముక్త్వా సచివా న్ఖడ్గ మాశు పరామృశత్. 38

ఉద్ధృత్య గుణసంపన్నం విమలామ్బరవర్చసమ్,
నిష్పపాత స వేగేన సభార్య స్సచివై ర్వృతః. 39

ము భయములేదు.　　　　౨౯

నాకు బ్రహ్మదేవుండొసంగిన సూర్యుఁడుంబోలె వెలుఁగునట్టి కవచం బున్నదే అది దేవాసురులతో యుద్ధంబు సేయునపుడు వజ్రాయుధముచేఁగూడ భిన్నముగాదయ్యె. ఇఁక నీమనుష్యబాణము లెంతమాత్రము.　　　　౩౦

ఇప్పుడు నే నాకవచంబు ధరించి రథగతుండనై యుద్ధంబునకుఁబోఁగా నన్నెవ్వఁడెదిరింపఁగలఁడు. సాక్షాద్దేవేంద్రుఁడుగూడ నెదిరింపఁజాలఁడు. ౩౧

మున్ను దేవాసురులతో యుద్ధముసేయునపుడు బ్రహ్మదేవుం డనుగ్రహించి నాకు బాణసహితంబుగ గొప్పధను వొసంగినాఁడే, ఇప్పుడు మహాయుద్ధంబున రామలక్ష్మణుల వధించుటకొఱకు భయంకరంబగు నాధనువును బెక్కువాద్యధ్వనులతో నెత్తితెండు.　　　　౩౨,౩౩

పుత్త్రవధముచేఁ బరమదుఃఖితుండును గ్రుద్ధుండును శూరుండునగు నారావణుండు మనస్సున నాలోచించి సీతను వధింపవలెనని నిశ్చయించెను.

కోపంబునఁ గన్నుల నెఱ్ఱఁదనంబు గదురఁ జూపరులకు భయంబు గలిగించుచు దుఃఖితుండై యారావణుఁడు దుఃఖితులయిన తనయెదుటనున్న రాక్షసుల నందఱిం జూచి యిట్లని పలికెను.　　　　౩౪

నాకుమారుఁడు బాలుం డింద్రజిత్తు వానరుల వంచించుటకొఱకు దేనినో యొకదానిని వధించి దానిని మాయచే "ఈ బిడసీత" యని వానరులకుఁ జూపినాఁడు.　　　　౩౬

నేను ఆసీతావధము నిపుడు యథార్థముగానే చేసి సంతోషంబు నొందెదను. క్షత్రియాధముఁడగు రామునం దనురాగము విడువకున్న సీత నిపుడెవధించి పుచ్చెదను.　　　　౩౭

రావణుఁడు ఇవ్విధంబున సచివులగు రాక్షసులతోఁ జెప్పి శీఘ్రంబున ఖడ్గంబు గ్రహించెను.　　　　౩౮

ఆరావణుఁడు పుష్పమాలికాలంకృతంబును స్వచ్ఛమయిన యాకాశమువలె నిర్మలమయినదియు నగు ఖడ్గంబు గ్రహించి భార్యలచేతను మంత్రుల

రావణః పుత్త్రశోకేన భృశ మాకులచేతనః,
సంక్రుద్ధః ఖడ్గ మాదాయ సహసా యత్ర మైథిలీ. ౪౦
వ్రజన్తం రాక్షసం ప్రేక్ష్య సింహనాదం ప్రచుక్రుశుః,
ఊచుశ్చాన్యోన్యమాశ్లిష్య సంక్రుద్ధం ప్రేక్ష్య రాక్షసాః. ౪౧

అద్యైనం తావుభౌ దృష్ట్వా భ్రాతరౌ ప్రవ్యథిష్యతః,

లోకపాలా హి చత్వారః క్రుద్ధేనానేన నిర్జితాః. ౪౨
బహవ శ్శత్రవ శ్చా(పి)న్యే సంయుగేషు నిపాతితాః,

త్రిషు లోకేషు రత్నాని భుఙ్క్తే చాహృత్య రావణః. ౪౩
విక్రమే చ బలే చైవ నాస్త్యస్య సదృశో భువి,

తేషాం సంజల్పమానానా మశోకవనికాం గతామ్. ౪౪
అభిదుద్రావ వై దేహీం రావణః క్రోధమూర్ఛితః,

వార్యమాణ స్సుసంక్రుద్ధ స్సుహృద్భి ర్హితబుద్ధిభిః. ౪౫
అభ్యధావత సంక్రుద్ధః ఖే గ్రహో రోహిణీ మివ,

మైథిలీ రక్ష్యమాణా తు రాక్షసీభి రనిన్దితా. ౪౬
దదర్శ రాక్షసం క్రుద్ధం నిస్త్రింశవరధారిణమ్,

చేతను బరివేష్టింపఁబడినవాఁడై వేగంబునం బోయెను. ౩౯

రావణుఁడు అట్లు పుత్రశోకంబున మిక్కిలియు విహ్వలుఁడై పరమ కుపితుఁడై ఖడ్గంబుగొని సీతయున్న స్థలంబునకుఁ బోయెను. ౪౦

లంకాపురంబునందలి రాక్షసులు రావణుఁడు పోవుటఁ జూచి సింహనాదంబులు గావించిరి. రావణుఁడు క్రుద్ధుఁ డగుటనుజూచి యింకఁదమకు జయంబు గలుగునను సంభ్రమంబునం జేసి యొండొరులఁ గవుఁగిలించుకొని యొకరితో నొకరు ఇట్లని చెప్పుకొనిరి. ౪౧

ఇప్పుడు రామలక్ష్మణు లిద్దఱు ఈ భయంకరాకారుఁడగు రావణుఁ జూచి భయంబునొందగలరు.

మున్ను ఈరావణుఁడు కుపితుఁడై లోకపాలురగు దేవేంద్ర యమ వరుణ కుబేరులఁ జయించినాఁడు కాఁడా! మఱియుఁ బెక్కు యుద్ధంబుల నితరులనుగూడ ననేకశత్రువులఁ వధించినాఁడు కాఁడా? ఈరామలక్ష్మణు లీతని కెంతమాత్రము? ౪౨

మఱియును రావణునకు భోగార్థమయి ముల్లోకములనుండి శ్రేష్ఠములగు వస్తువులు కప్పము గావచ్చుచున్నవి. పరాక్రమంబునఁ గాని బలంబునఁగాని యీతనికి సరియయినవాఁడు భూలోకంబున నెవ్వఁడు లేఁడు. అని రాక్షసులు చెప్పుకొనిరి. ౪౩

ఆరాక్షసులు అట్లు ఒకరితో నొకరు మందలించుచుండఁగానే రావణుఁడు కోపంబున దేహముదెలియక అశోకవనంబున నున్న సీతాదేవి మీఁదికిఁ బరుగెత్తెను. ౪౪

అట్లు పరమకుపితుఁడగు రావణుఁడు తనమేలుగోరునట్టి స్నేహితులు వలదని యెంతవారించినను నిలువక యాకాశంబునఁ గుపితుఁడగు నంగారకుఁడు రోహిణిమీఁదికిఁ బోవునట్లు సీతమీఁదికిఁ బోయెను. ౪౫

కావలియున్న రాక్షసస్త్రీలమధ్యంబున నున్న కల్యాణగుణసంపన్నయగు సీతాదేవియుఁ గుపితుఁడై ఖడ్గంబు గొనివచ్చుచున్న రావణుం

తం నిశామ్య సనిస్త్రింశం వ్యథితా జనకాత్మజా. ౪౭
నివార్యమాణం బహుశ స్సుహృద్భి రనువర్తినమ్,
సీతా దుఃఖసమావిష్టా విలపన్తీద మబ్రవీత్. ౪౮
యథాయం మా మభిక్రుద్ధ స్సమభిద్రవతి స్వయమ్,
వధిష్యతి సనాథాం మా మనాథా మివ దుర్మతిః. ౪౯

బహుశశ్చోదయామాస భర్తారం మా మనువ్రతామ్,
భార్యా భవ రమస్వేతి ప్రత్యాఖ్యాతో ధ్రువం మయా. ౫౦

సోఽయం మమానుపస్థానే వ్యక్తం నైరాశ్య మాగతః,
క్రోధమోహసమావిష్టో నిహన్తుం మాం సముద్యతః. ౫౧
అథవా తౌ నరవ్యాఘ్రౌ భ్రాతరౌ రామలక్ష్మణౌ,
మన్నిమిత్త మనార్యేణ సమరేఽద్య నిపాతితౌ. ౫౨

అహో ధిఙ్మన్నిమిత్తోఽయం వినాశో రాజపుత్త్రయోః,

అథవా పుత్త్రశోకేన అహత్వా రామలక్ష్మణౌ. ౫౩
విధమిష్యతి మాం రౌద్రో రాక్షసః పాపనిశ్చయః,

హనూమతోఽపి యద్వాక్యం న కృతం క్షుద్రయా మయా. ౫౪
యద్యహం తస్య పృష్ఠేన తదా యాయా మనిన్దితా,
నాద్యైవ మనుశోచేయం భర్తు రఙ్కగతా సతీ. ౫౫

మన్యే తు హృదయం తస్యాః కౌసల్యాయాః ఫలిష్యతి,

జూచెను. ౪౬

జనకమహారాజపుత్త్రియగు సీత అట్లు ఖడ్గధరుఁడై స్నేహితులు వలదు వలదని బహువిధంబుల వారించినను నిలువక తనమీఁదికి వచ్చుచున్న రావణుఁ జూచి దిగులుపడి పరమదుఃఖంబున నిట్లని విలపించెను. ౪౭,౪౮

దురాత్ముఁడగు నీరావణుఁడు కుపితుఁడై నామీఁదికిఁ బరుగెత్తి వచ్చుటఁజూడఁగా వీఁడు నాథసహితురాలనగు నన్ను అనాథనువలె వధింపఁ దలఁచినట్లున్నది. ౪౯

ఈ రావణుఁడు పెనిమిటియందె బద్ధభావనైయున్న నన్ను "నాకు భార్యవై నాతో రమింపు" మని యనేకవిధంబులఁ బ్రేరించెను. అయితే నేనతనిమాటను వినుంచక స్థిరంబుగాఁ దిరస్కరించినాను. ౫౦

నేనంగీకరింపకుండుటవలన నీరావణుఁడు నిరాశుఁడై కోపంబును మోహంబును గలవాఁడై నన్ను వధించుటకు వచ్చినాఁడు; స్పష్టము. ౫౧

లేక పురుషోత్తములయిన యన్నదమ్ములారామలక్ష్మణులను నానిమిత్తమయి దురాత్ముఁడగు నీ రావణుఁ డిప్పుడు యుద్ధంబున వధించియుండు నేమో. ౫౨

అయ్యో! నానిమిత్తముయి రామలక్ష్మణులకు వినాశంబు గలిగినదే; అట్టిపాపిష్ఠురాలనగు నేను దహింపఁబడుదును గాక.

లేక క్రూరుఁడును బాపకార్యములు సేయుటయందు వెనుదీయనివాఁడు నగు రావణుండు పుత్త్రశోకము చేఁ బీడింపఁబడినవాఁడై రామలక్ష్మణుల వధింపఁ జాలక అందుకుబదులు నన్ను వధింపఁ దలఁచినాఁడో. ౫౩

మూఢురాలను నేను హనుమంతుఁడు చెప్పినమాటనైనను వినకపోతిని.

ఎవ్వరిచేతను ఏవిధముగానైనను నింద యెఱుంగనట్టి నేను అప్పుడు హనుమంతుని వీపుపైఁ గూర్చుండి పోయియుందునేని ప్రియుని యంకంబుఁ జేరియుందును గావున ఇప్పు డిట్లు దుఃఖపడకుందును. ౫౪

ఒకఁడె కొడుకుగలకౌసల్య కొడుకు యుద్ధంబున హతుండగుటను

ఏకపుత్త్రా యదా పుత్త్రం వినష్టం శ్రోష్యతే యుధి. ౫౬
సా హి జన్మ చ బాల్యం చ యౌవనం చ మహాత్మనః,
ధర్మకార్యాణి రూపం చ రుదతీ సంస్మరిష్యతి. ౫౭
నిరాశా నిహతే పుత్త్రే దత్త్వా శ్రాద్ధ మచేతనా,
అగ్ని మారోక్ష్యతే నూన మపో వాపి ప్రవేక్ష్యతి. ౫౮

ధిగస్తు కుబ్జా మసతీం మన్థరాం పాపనిశ్చయామ్,
యన్నిమిత్త మిదం దుఃఖం కౌసల్యా ప్రతిపత్స్యతే. ౫౯

ఇత్యేవం మైథిలీం దృష్ట్వా విలపన్తీం తపస్వినీమ్,
రోహిణీ మివ చన్ద్రేణ వినా గ్రహవశం గతామ్. ౬౦
ఏతస్మి న్నన్తరే తస్య అమాత్యో బుద్ధిమా ఞ్ఛుచిః,
సుపార్శ్వో నామ మేధావీ రాక్షసో రాక్షసేశ్వరమ్. ౬౧
నివార్యమాణం సచివై రిదం వచన మబ్రవీత్,

కథం నామ దశగ్రీవ! సాక్షా ద్వైశ్రవణానుజ!. ౬౨
హన్తు మిచ్ఛసి వైదేహీం క్రోధా ద్ధర్మ మపాస్య హి,

వేదవిద్యావ్రతస్నాత స్స్వకర్మనిరత స్సదా. ౬౩
స్త్రియాః కస్మా ద్వధం వీర! మన్యసే రాక్షసేశ్వర!,

మైథిలీం రూపసంపన్నాం ప్రత్యవేక్షస్వ పార్థివ!. ౬౪
త్వమేవ తు సహాస్మాభీ రాఘవే క్రోధ ముత్సృజ,
అభ్యుత్థానం త్వ మద్యైవ కృష్ణపక్షచతుర్దశీమ్. ౬౫

వినఁగానే యీమెహృదయంబు తప్పక పగులునని తలంచెదను. ౫౬

ఆ కౌసల్య మహాత్ముఁడగు రామునియొక్క జన్మంబును బాల్యమును యౌవనంబును ధర్మబుద్ధియుఁ దలంచి తలంచి రోదనంబు సేయఁగలదు. ౫౭

కౌసల్య, పుత్రుండు హతుండగుటవిని అతనికి శ్రాద్ధకార్యముచేసి ప్రపంచమునందాశవదలి మూర్ఛనొంది అగ్నిలోఁగాని బలములంగాని పడి ప్రాణంబులు వదలఁగలదు; నిశ్చయము. ౫౮

కుబ్జయగు మంథర నిమిత్తముననే గదా కౌసల్యకు ఈ మహాదుఃఖము సంభవించినది; అట్టి దుష్టురాలును బాపిష్ఠయునగు మంథర దహింపఁబడుఁగాక. అని సీత విలపించెను. ౫౯

ఇవ్విధంబున విలపించుచు శోచనీయ యయినదానిని, చంద్రుఁడు లేనపుడు అంగారకవశంగతయగు రోహిణివలె నున్నదానిని సీతంజూచి యింతలో రావణుని మంత్రులలో నొకండు బుద్ధిమంతుఁడును బరిశుద్ధుఁడును మేధావియు నగువాఁడు సుపార్శ్వుండను రాక్షసుఁడు ఇతరమంత్రులెంత వారించినను వినక సీతపైకిఁ బోవుచున్న రావణునింజూచి యీమాటం బలికెను. ౬౦, ౬౧

రావణుఁడా! నీవు సాక్షాత్కుబేరునితమ్ముఁడవు. మహాకులప్రసూతుఁడవు. అట్టి నీవు ధర్మమునువదలి కేవల క్రోధమునకు లోఁబడి సీతను ఎట్లు వధింపఁ గోరెదవు? ౬౨

శూరుఁడవు, సమస్త రాక్షసేశ్వరుఁడవు, సర్వవేదములను సమస్తవిద్యలను అధ్యయనించి వ్రతస్నాతుఁడవైనవాఁడవు, ఎల్లప్పుడును విహితకర్మంబుల నన్నింటిని దప్పక యాచరించుచున్నవాఁడవు; అట్టి నీవు ఇప్పుడు స్త్రీవధము సేయఁదలఁచితి వేమి? ౬౩

రాజా! రూపవతియగు సీత నీయధీనయగువిధమును జూడుము. ఈ కోపమును నీవు మాతోఁగూడ రామునందే చూపుము. ౬౪

నీవు నేఁడు కృష్ణపక్ష చతుర్దశియందె యుద్ధమునకుఁ బ్రయాణము

కృత్వా నిర్యాస్యామ్యమావాస్యాం విజయాయ బలై ర్వృతః.

శూరో ధీమా న్రథీ ఖడ్గీ రథప్రవర మాస్థితః. ౬౬
హత్వా దాశరథిం రామం భవా న్ప్రాప్స్యతి మైథిలీమ్.

స తద్దురాత్మా సుహృదా నివేదితం
వచ స్సుధర్మ్యం ప్రతిగృహ్య రావణః,
గృహం జగామాథ తత శ్చ వీర్యవా
న్పున స్సభాం చ ప్రయయౌ సుహృద్వృతః. ౬౭
ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే త్రినవతితమ స్సర్గః. ౯౩.

---

## చతుర్నవతితమస్సర్గః.

స ప్రవిశ్య సభాం రాజా దీనః పరమదుఃఖితః,
నిషసాదాసనే ముఖ్యే సింహః క్రుద్ధ ఇవ శ్వసన్. ౧

అబ్రవీచ్చ స తాన్ సర్వా న్బలముఖ్యా న్మహాబలః,
రావణః ప్రాఞ్జలి ర్వాక్యం పుత్రవ్యసనకర్శితః.

సర్వే భవన్త స్సర్వేణ హస్త్యశ్వేన సమావృతాః,
నిర్యాన్తు రథసఙ్ఘైశ్చ పాదాతై శ్చోపశోభితాః.

ఏకం రామం పరిక్షిప్య సమరే హన్తు మర్హథ,
వర్షన్త శ్శరవర్షేణ ప్రావృట్కాల ఇవామ్బుదాః.
అథవాఽహం శరై స్తీక్ష్ణై ర్భిన్నగాత్రం మహారణే,

చేసి రేపు అమావాస్యయందు సమస్తసైన్యపరివృతుఁడవై రామలక్ష్మణుల జయించుటకుఁ బొమ్ము. ౬౫

శూరుఁడవు బుద్ధిమంతుఁడవు మహారథుఁడవు ఖడ్గాది సాధనసంపత్తి గలవాఁడవు నగు నీవు ఉత్తమ రథారూఢుండవై దశరథపుత్త్రుఁడగు రాముని వధించి సీతాదేవిని బొందఁగలవు. అని సుపార్శ్వుఁడు రావణునకుఁ జెప్పెను. ౬౬

దురాత్ముఁడును బరాక్రమవంతుఁడునగు నా రావణుఁడు స్నేహితుఁడగు సుపార్శ్వుఁడు చెప్పిన ధర్మిష్ఠంబగు మాట నంగీకరించి గృహంబునకుఁ బోయి సుహృత్పరివేష్టితుఁడై మరల సభామండపంబుఁ బ్రవేశించెను. ౬౭

ఇది తొంబదిమూఁడవసర్గము.

## తొంబదినాలుగవసర్గము.

ఆ రావణుఁడు సభలోనికిఁ బోయి దీనుఁడై మిక్కిలియుం దుఃఖితుఁడై కుపితంబగు సింహమువలె నిట్టూర్పులు విడుచుచు ఉత్తమంబగు సింహాసనంబునఁ గూర్చుండెను. ౧

మహాబలశాలియగు నా రావణుఁడు పుత్త్రదుఃఖంబునఁ గ్రుంగినవాఁడగుటంజేసి తన సేనాధ్యక్షులగు వారల నందఱుంజూచి చేమోడ్పు గీలించి యిట్లని పలికెను. ౨

మీర లందఱును సమస్తమయిన ఏనుగులు గుఱ్ఱంబులు రథములు పదాతులు మొదలగు సైన్యముతోఁ గూడినవారలై యుద్ధంబునకు వెడలుఁడు.

మీరు యుద్ధంబునందు రాము నొకనినే చుట్టుముట్టి వర్షాకాలమేఘంబులు వర్షము గురియునట్లు బాణములు ప్రయోగించి యతని వధింపవలెను. ౪

మీచేత రాముఁడు హతుఁడు గాకపోయినను నేఁడు యుద్ధంబున మీచేఁ దీక్ష్ణబాణంబుల శరీర మర్మస్థానంబులు భేదింపఁబడుటంజేసి హీన

భవద్భిశ్శ్వో నిహన్తాస్మి రామం లోకస్య పశ్యతః. ౫

ఇత్యేతద్రాక్షసేన్ద్రస్య వాక్య మాదాయ రాక్షసాః,
నిర్యయు స్తే రథై శ్శీఘ్రై ర్నానానీకై స్సుసంవృతాః. ౬

పరిఘా న్పట్టసాంశ్చై వ శరఖడ్గపరశ్వథాన్,
శరీరా న్తకరాన్ సర్వే చిక్షిపు ర్వానరా న్ప్రతి. ౭
వానరాశ్చ ద్రుమాన్ శైలాన్రాక్షసా న్ప్రతిచిక్షిపుః,

స సఙ్గ్రామో మహాన్ భీమ స్సూర్యస్యోదయనం ప్రతి. ౮
రక్షసాం వానరాణాం చ తుముల స్సమపద్యత,
తే గదాభి ర్విచిత్రాభిః ప్రాసైః ఖడ్గైః పరశ్వథైః. ౯
అన్యోన్యం సమరే జఘ్ను స్తదా వానరరాక్షసాః,

ఏవం ప్రవృత్తే సఙ్గ్రామే హ్యుద్ధూతం సుమహ ద్రజః. ౧౦
రక్షసాం వానరాణాం చ శాన్తం శోణితవిస్రవైః,

మాతఙ్గరథకూలాశ్చ వాజిమత్స్యా ధ్వజద్రుమాః. ౧౧
శరీరసఙ్ఘాటవహాః ప్రసస్రుశ్శోణితాపగాః,

తత స్తే వానరా స్సర్వే శోణితౌఘపరిప్లుతాః. ౧౨
ధ్వజవర్మరథా నశ్వా న్నానాప్రహరణానిచ,
ఆప్లుత్యాప్లుత్య సమరే రాక్షసానాం బభఞ్జిరే. ౧౩
కేశా న్కర్ణలలాటాంశ్చ నాసికాశ్చ ప్లవఙ్గమాః,
రక్షసాం దశనై స్తీక్ష్ణై ర్నఖై శ్చాపి వ్యకర్తయన్. ౧౪

బలుండైన రాముని సమస్తలోకంబులు చూచుచుండఁగా రేపు నేను సులభ ముగా వధించెదను. అని రావణుండు సేనాముఖ్యులకుఁ జెప్పెను. ౫

రాక్షసేశ్వరుఁడగు రావణుఁడు చెప్పిన యీమాటను శిరసావహించి యారాక్షసులు వేగవంతంబులగు రథంబుల నారోహించి నానావిధ సైన్య సమేతులయి వెడలిరి. ౬

ఆ రాక్షసు లందఱును ప్రాణాంతకరంబులగు పరిఘంబులగు కత్తుల నడ్డకత్తుల బాణంబులఁ బరశ్వథంబులను వానరులమీఁదఁ బ్రయోగించిరి. ౭

వానరులును రాక్షసులమీఁద వృక్షంబులఁ బర్వతశృంగంబులం బ్రయోగించిరి.

అట్లు భయంకరంబును దుములంబునగు రాక్షసవానరుల యమ్మహా యుద్ధంబు సూర్యోదయసమయంబునఁ బ్రారంభ మయ్యెను! ౮

అప్పుడు వానరులును రాక్షసులును యుద్ధంబున నొండొరులపయి విచిత్రంబులగు గదలను బ్రాసంబులను ఖడ్గంబులను గండ్రగొడ్డళ్లను బ్రయోగించిరి. ౯

ఇవ్విధంబున రాక్షసవానరులు భయంకరంబుగాఁ బోర నయ్యుద్ధంబున విపరీతంబుగాఁ బరాగంబు రేఁగుటయు నది రక్తప్రవాహంబులచే శాంత మయ్యె. ౧౦

అప్పుడు రక్తప్రవాహనదులు ప్రవహించుటయును నందు గజరథంబులు తీరంబులుగాను గుఱ్ఱంబులు మత్స్యములుగాను ధ్వజములు వృక్షములుగాను కళేబరంబులు తెప్పలుగాను గానంబడినవి. ౧౧

అంత నావానరులు నెత్తురు ప్రవాహములం దడుపఁబడిన వారలయి యుద్ధంబున రాక్షసుల ధ్వజంబులను గవచంబులను రథములను గుఱ్ఱములను నానావిధాయుధములను ఎగిరిదుమికి విఱిచివేసిరి. ౧౨, ౧౩

వానరులు రాక్షసుల తలవెండ్రుకలను నొసళ్లను ముక్కులను దీక్ష్ణంబు లగు దంతంబులం గొఱికియు గోళ్లం జీఱియు నొప్పించిరి. ౧౪

ఏకైకం రాక్షసం సఙ్ఖ్యే శతం వానర(పుంగవాః)యూథపాః,
అభ్యధావన్త ఫలినం వృక్షం శకునయో యథా. ౧౫
తథా గదాభి ర్గుర్వీభిః ప్రాసైః ఖడ్గైః పరశ్వధైః,
నిజఘ్ను ర్వానరా న్ఘోరా న్రాక్షసాః పర్వతోపమాః. ౧౬

రాక్షసై ర్వధ్యమానానాం వానరాణాం మహాచమూః,
శరణ్యం శరణం యాతా రామం దశరథాత్మజమ్. ౧౭
తతో రామో మహాతేజా ధనురాదాయ వీర్యవాన్,
ప్రవిశ్య రాక్షసం సైన్యం శరవర్షం వవర్ష హ. ౧౮

ప్రవిష్టం తు తదా రామం మేఘా స్సూర్యమివామ్బరే,
నాభిజగ్ము ర్మహాఘోరం నిర్దహన్తం శరాగ్నినా. ౧౯

కృతాన్యేవ సుఘోరాణి రామేణ రజనీచరాః,
రణే రామస్య దదృశుః కర్మాణ్యసుకరాణిచ. ౨౦

చాలయన్తం మహానీకం విధమన్తం మహారథాన్,
దదృశు స్తే న వై రామం వాతం వనగతం యథా. ౨౧

ఛిన్నం భిన్నం శరై ర్దగ్ధం ప్రభగ్నం శస్త్రపీడితమ్,
బలం రామేణ దదృశు ర్న రామం శీఘ్రకారిణమ్. ౨౨

ఫలవంతంబగు వృక్షమును పెక్కుపక్షులు చుట్టుకొనునట్లు యుద్ధం
బున నొకరాక్షసుని నూర్గురు వానరులు మార్కొని యుద్ధంబు గావించిరి.

పర్వతంబులంతటి మేనులుగల రాక్షసులును అట్లు భయంకరాకారు
లగు వానరులను గొప్పగదలచే మోదియుఁ బీటెలచేఁ బొడిచియుఁ గత్తులచే
నఱికియుఁ బరశ్వథంబులచేఁ జెక్కియుఁ నొప్పించిరి. ౧౬

అట్లు వానరులు రాక్షసులచే వధింపఁబడుచు విషణ్ణులయి సమస్త
లోకశరణ్యుండగు దశరథకుమారుని రాముని శరణు చొచ్చిరి. ౧౭

వానరులు శరణుచొచ్చుటయు మహాతేజుండును మహాపరాక్రమ
శాలియు నగు రాముఁడు, ధనుస్సు చేతంబూని రాక్షససైన్యముఁ జొచ్చి
బాణంబులు వర్షించెను. ౧౮

అప్పుడు రాముఁడు రాక్షస సైన్యంబుఁ బ్రవేశించినంత మహాభయం
కరాకారుఁడై నిప్పువంటి బాణంబుల వర్షించుటయుఁ గ్రీష్మర్తువునందు మేఘ
ములు సూర్యుని సమీపింపఁజాలనట్లు ఆ రాక్షసులు రాము నెదుట నిలువఁ
జాలరైరి. ౧౯

యుద్ధంబున రాముని హస్తలాఘవాతిశయంబునం జేసి మహాభయం
కరంబులును ఇతరుల కశక్యంబులునగు రామునికార్యంబులను రాక్షసులు
అవి చేసి యయినపిమ్మటఁ జూచిరిగాని చేయఁనప్పుడు చూడఁజాలరైరి. ౨౦

వనంబునం బెనుగాలి గొట్టునపుడు దానికార్యములయిన కొమ్మలాడు
టయుఁ వృక్షంబులు విఱుగుటయుఁ మొదలగునవి యగపడునేగాని వాయుం
వేమో యగపడనట్లు రాముఁడు రాక్షససైన్యంబుఁ జొచ్చి బాణవర్షంబులు
గురియఁగా సంచారలాఘవంబునం జేసి రాక్షసులకు అతని కార్యములు సైన్య
ములు భయంబునం బరుగెత్తుటయుఁ మహారథంబులు విఱుఁగుటయు నగపడి
నవే కాని రాముం డేమో యెంతమాత్రము కానంబడఁడయ్యె. ౨౧

ఆ రాక్షసులు రామునిచే నొకవైపున ఖండింపఁబడియుఁ ఒకవైపునఁ
బగలఁగొట్టఁబడియుఁ ఒకవైపున బాణములచే రూపుదెలియనట్లు చేయఁ

ప్రహరన్తం శరీరేషు న తే పశ్యన్తి లాఘవమ్,
ఇన్ద్రియార్థేషు తిష్ఠన్తం భూతాత్మాన మివ ప్రజాః. ౨౩

ఏష హన్తి గజానీక మేష హన్తి మహారథాన్,
ఏష హన్తి శరై స్తీక్ష్ణైః పదాతీ న్వాజిభి స్సహ. ౨౪
ఇతి తే రాక్షసా స్సర్వే రామస్య సదృశా న్రణే,
అన్యోన్యం కుపితా జఘ్ను స్సాదృశ్యాద్రాఘవస్య తే. ౨౫

న తే దదృశిరే రామం దహన్త మరివాహినీమ్,
మోహితాః పరమాస్త్రేణ గాన్ధర్వేణ మహాత్మనా. ౨౬
తే తు రామసహస్రాణి రణే పశ్యన్తి రాక్షసాః,
పునః పశ్యన్తి కాకుత్స్థమేకమేవ మహాహవే. ౨౭
భ్రమన్తీం కాఞ్చనీం కోటిం కార్ముకస్య మహాత్మనః,
అలాతచక్రప్రతిమాం దదృశు స్తే న రాఘవమ్. ౨౮

శరీరనాభి సత్త్వార్చి శ్శరారం నేమికార్ముకమ్,
జ్యాఘోషతలనిర్ఘోషం తేజోబుద్ధిగుణప్రభమ్. ౨౯

బడియు ఒకవైపునఁ దుత్తునియలు చేయఁబడియు నొకవైపున బాణపీడితం బయ్యు నున్న సైన్యంబుఁ జూచిరేగాని శీఘ్రకారి యగు రాము నెంత మాత్రముఁ జూడఁజాలరైరి. ౨౨

పామరులగువారలు ఇంద్రియ విషయములయిన శబ్దస్పర్శరూపరస గంధముల ననుభవించుచు ఆశబ్దాదులయందు ఉపాదాన చైతన్యరూపంబున నవస్థితుఁడగు సర్వవ్యాపకుండయిన పరమాత్మను దెలియఁజాలనట్లు ఆ రాక్షసులు రాముఁడేయు దెబ్బల ననుభవించిరే కాని తమదేహంబులం బ్రహరించుచున్న రాముం జూడఁజాలరైరి. ౨౩

రాముఁడు అతిశీఘ్రముగా సంచరించుచు రాక్షససైన్యముల వధించుచుండుటవలన అతఁడు మెఱపువలె నెచట నగపడునో అచట నున్న రాక్షసుని రామునిఁగా భ్రమించి "వీఁడుగో రాముఁడు ఏనుంగుల జంపుచున్నాఁడు. వీఁడుగో మహారథంబుల నఱుము సేయుచున్నాఁడు. వీఁడుగో కఱకుటమ్ములఁ బదాతులను గుఱ్ఱంబులను వధించుచున్నాఁడు" అని యఱచుచు ఆరాక్షసులు రాముఁడున్న చోట నుండుటవలనఁ గలిగిన సాదృశ్యంబునం జేసి యొకరినొకరు రామునిఁగా భ్రమించి కుపితులయి యొండొరుల నే వధించుకొనిరి. ౨౪, ౨౫

ఆ రాక్షసులు మహాప్రభావంబగు గాంధర్వాస్త్రముచే మోహితులగుటం జేసి శత్రుసైన్యంబు దహించుచున్న రాముం జూడఁ జాలరైరి. ౨౬

ఆ రాక్షసులకు రాముఁడు అప్పుడమ్మహాయుద్ధంబునఁ బెక్కుసహస్రంబుల రాములై తోఁచును; మరల నప్పుడే యొకఁడుగానే గానంబడును. ౨౭

రక్కసులు రాముఁ మండలాకారగతి విశేషంబులం దిరుగునపుడు తిరుగుచున్నది కావునఁ ద్రిప్పఁబడుచున్న కొఱవికట్టెవలెనున్న మహానుభావుఁడగు నారాముని ధనుస్సుయొక్క కాంచనమయమైన యగ్రముం జూచిరే కాని రాముం గానరైరి. ౨౮

అప్పుడు యుద్ధంబున శరీరమె నాభిగా బలంబె జ్వాలగా బాణంబు లరంబులుగా ధనుస్సు నేమిగా జ్యాతలధ్వనిఘోషంబుగాఁ బరాక్రమంబును

దివ్యాస్త్రగుణపర్యన్తం నిఘ్నన్తం యుధి రాక్షసాన్,
దదృశూ రామచక్రం తత్కాలచక్ర మివ ప్రజాః. 30

అనీకం దశసాహస్రం రథానాం వాతరంహసామ్,
అష్టాదశసహస్రాణి కుఞ్జరాణాం తరస్వినామ్. 31
చతుర్దశసహస్రాణి సారోహాణాం చ వాజినామ్,
పూర్ణే శతసహస్రే ద్వే రాక్షసానాం పదాతినామ్. 32
దివసస్యాష్టమే భాగే శరై రగ్నిశిఖోపమైః,
హతాన్యేకేన రామేణ రక్షసాం కామరూపిణామ్. 33
తే హతాశ్వా హతరథా శ్శాన్తా విమథితధ్వజాః,
అభిపేతుగ్ పురీం లఙ్కాం హతశేషా నిశాచరాః. 34

హతై ర్గజపదాత్యశ్వై స్తద్బభూవ రణాజిరమ్,
ఆక్రీడమివ రుద్రస్య క్రుద్ధస్య సుమహాత్మనః. 35

తతో దేవా స్సగన్ధర్వా స్సిద్ధాశ్చ పరమర్షయః,
సాధు సాధ్వితి రామస్య తత్కర్మ సమపూజయన్. 36
అబ్రవీచ్చ తదా రామ స్సుగ్రీవం ప్రత్యనన్తరమ్,
విభీషణం చ ధర్మాత్మా హనూమన్తం చ వానరమ్. 37

జామ్బవన్తం హరిశ్రేష్ఠం మైన్దం ద్వివిదమేవ చ,
ఏత దస్త్రబలం దివ్యం మమ వా త్ర్యమ్బకస్య వా. 38

నిహత్య తాం రాక్షసవాహినీం తు

బుద్ధియుం బ్రకాశంబుగా దివ్యాస్త్రంబుల ప్రభావంబు ధారగా రాక్షసుల వధించుచు సుదర్శనచక్రంబువలెనున్న రాముని జ్యోతిశ్చక్రంబునుంబోలెం బ్రజలు సందర్శించిరి. ౩౦

వాయువేగంబులగు రథములు ఏడుకోట్ల యిరువదితొమ్మిదిలక్షలును బలవంతంబులగు మదగజంబులు పదుమూడుకోట్ల పండ్రెండు లక్షల యిరువది వేలును రౌతులతోఁగూడిన యశ్వంబులు పదికోట్ల యిరువదిలక్షల యఱువది వేలును పదాతులు నూటనలువదియయిదుకోట్ల యెనుబది లక్షలును కామరూపులగు రాక్షసుల యీచతురంగబలములు రామునిచే నిప్పువంటి బాణంబుల మూడుమ్ముక్కాలు గడియలోపల వధింపఁబడినవి. ౩౧-౩౩

అంత హతశేషులగు రాక్షసులు హతంబులగు నశ్వంబులతోను భగ్నంబులగు రథంబులతోను దుత్తునియలగు ధ్వజంబులతోను భగ్నోత్సాహు లయి లంకాపురంబునకుఁ బోయిరి. ౩౪

హతంబులగు పెక్కుకోట్ల యేనుఁగులతోను బదాతిసైన్యంబులతోను గుఱ్ఱంబులతోను గూడియుండుటం జేసి యయ్యుద్ధభూమి ప్రలయకాలంబునఁ గ్రుద్ధుండగు మహాత్ముండయిన రుద్రుని క్రీడాస్థానంబువలె భయంకరంబై యుండెను. ౩౫

అంత దేవతలును గంధర్వులును సిద్ధులును మహర్షులును రాముండు గావించిన యమ్మహాకార్యంబును సాధువాక్యంబులం బ్రశంసించిరి. ౩౬

అప్పుడు ధర్మాత్ముండగు రాముండు తనసమీపంబుననున్న సుగ్రీవుని విభీషణుని హనుమంతుని జాంబవంతుని మైందద్వివిదులనుం జూచి యీమాట నుం జెప్పెను. ౩౭

ఇట్లు బాణములు ప్రయోగించుట యెవ్వరికిని శక్యముగాదు. ఈయస్త్రబలంబు నాకును శివునకును మాత్రమె గలదుగాని మఱియెవ్వరికిని లేదు. అని రాముఁడు సుగ్రీవాదులకుఁ జెప్పెను. ౩౮

అప్పుడు దేవేంద్రతుల్యుండును మహాత్ముండును దివ్యాస్త్రంబులఁ

రామ స్తదా శక్రసమో మహాత్మా,
అస్త్రేషు శస్త్రేషు జితక్లమశ్చ
సంస్తూయతే దేవగణైర్గిరప్రహృష్టైః. ౩౯

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే - చతుర్నవతితమస్సర్గః ౯౪.

## పఞ్చనవతితమస్సర్గః.

తాని తాని సహస్రాణి సారోహాణాం చ వాజినామ్,
రథానాం త్వగ్నివర్ణానాం సధ్వజానాం సహస్రశః. ౧
రాక్షసానాం సహస్రాణి గదాపరిఘయోధినామ్,
కాఞ్చనధ్వజచిత్రాణాం శూరాణాం కామరూపిణామ్. ౨
నిహతాని శరై స్తీక్ష్ణై స్తప్తకాఞ్చనభూషణైః,
రావణేన ప్రయుక్తాని రామేణాక్లిష్టకర్మణా. ౩

దృష్ట్వా శ్రుత్వా చ సమ్భ్రాన్తా హతశేషా నిశాచరాః,
రాక్షసీశ్చ సమాగమ్య దీనా శ్చిన్తాపరిప్లుతాః. ౪

విధవా హతపుత్త్రా శ్చ క్రోశన్త్యో హతబాన్ధవాః,
రాక్షస్య స్సహసంగమ్య దుఃఖార్తాః పర్యదేవయన్. ౫

కథం శూర్పణఖా వృద్ధా కరాళా నిర్ణతోదరీ,
ఆససాద వనే రామం కన్దర్ప మివ రూపిణమ్. ౬
సుకుమారం మహాసత్త్వం సర్వభూతహితే రతమ్,

తం దృష్ట్వా లోకనిన్ద్యా సా హీనరూపా ప్రకామితా. ౭

ప్రయోగించుటయందుఁగాని యితరాయుధంబులఁ బ్రయోగించుటయందుఁ గాని యెంతమాత్రము నలసటలేనివాఁడునగు రాముఁడు ఆరాక్షససేనను వధించినందుకు దేవతలందఱు సంతుష్టులై ఆతనినెంతయుం బ్రస్తుతించిరి. ౩౯

ఇది తొంబదినాలుగవసర్గము.

## తొంబదియైదవసర్గము.

రావణుఁడుపంపిన సైన్యంబులనంతయు పెక్కువేల రౌతులతోఁ గూడినగుఱ్ఱంబులను వేనవేల ధ్వజాలంకృతంబులయిన యగ్నివర్ణంబులగు కాంచనరథంబులను శూరులను గదలతోను బరిఘంబులతోనుం బోరువారును రథశిఖరంబులనుంచఁబడిన బంగారుటెక్కెముల కాంతులు తగులుటం జేసి చిత్రములయిన నల్లనిమేనులుగలవారలును గామరూపులునగు పెక్కువేలమంది రాక్షసులను రాముండు అనాయాసంబునఁ గాంచనభూషితంబులగు కలుకుటమ్ములచే వధించిపుచ్చెను. ౧-౩

హతశేషులగు రాక్షసులు యుద్ధభూమినుండి వెనుకకుం బాఱివచ్చిన వారలును లంకాపురంబున నున్నవారలును అట్లు రామునిచేత మూలబలము వధింపఁబడుటను గనియుం వినియుం రాక్షసస్త్రీలతోఁ జేరి దీనులయి చింతాక్రాంతులయిరి.

రాక్షసస్త్రీలు యుద్ధంబున రామునిచే హతుండగు పెనిమిటిగలవారలును హతపుత్రులును బంధువులు చచ్చినవారలును గుంపుగాఁ జేరి పరమదుఃఖితలయి యుచ్చైస్స్వరాన్నాదంబున రోదనంబుచేసిరి. ౫

ఈశూర్పణఖ ముసలిది, వికృతరూపిణి; వ్రేలుకాడుచున్న కడుపు గలది; ఈబిడ వనంబున సశరీరుండగు మన్మథుం డనందగినవాఁడును సుకుమారుండును సమస్తభూతహితంబు గోరువాఁడునగు రామునొద్దకు ఎట్లు పోయినది? ౬

సమస్తలోకములచేతను నిందనీయురాలగు కురూపిణి యాశూర్పణఖ

కథం సర్వగుణై ర్హీనా గుణవన్తం మహారాజసమ్,
సుముఖం దుర్ముఖీ రామం కామయామాస రాక్షసీ. ౮

జనస్యాస్యాల్పభాగ్యత్వా ద్వలినీ శ్వేతమూర్ధజా,
అకార్య మపహాస్యం చ సర్వలోకవిగర్హితమ్. ౯
రాక్షసానాం వినాశాయ దూషణస్య ఖరస్యచ,
చకారాప్రతిరూపా సా రాఘవస్య ప్రధర్షణమ్. ౧౦

తన్నిమిత్త మిదం వైరం రావణేన కృతం మహత్,

వధాయ నీతా సా సీతా దశగ్రీవేణ రక్షసా, ౧౧
నచ సీతాం దశగ్రీవః ప్రాప్నోతి జనకాత్మజామ్,
బద్ధం బలవతా వైర మక్షయం రాఘవేణ చ. ౧౨
వైదేహీం ప్రార్థయానం తం విరాధం ప్రేక్ష్య రాక్షసమ్,
హత మేకేన రామేణ పర్యాప్తం తన్నిదర్శనమ్. ౧౩

చతుర్దశ సహస్రాణి రక్షసాం భీమకర్మణామ్,
నిహతాని జనస్థానే శరై రగ్నిశిఖోపమైః. ౧౪
ఖర శ్చ నిహతస్సఙ్ఖ్యే దూషణ స్త్రిశిరా స్తథా,
శరై రాదిత్యసఙ్కాశై ర్పర్యాప్తం తన్నిదర్శనమ్. ౧౫

హతో యోజనబాహు శ్చ కబన్ధో రుధిరాశనః,
క్రోధా న్నాదం నదన్ సోఽథ పర్యాప్తం తన్నిదర్శనమ్. ౧౬

ఆరాముంజూచి మోహించినదనుట యాశ్చర్యము! ౭

శూర్పణఖ గుణహీనురాలు, రాముఁడో గుణవంతుఁడు; ఈబిడ వికారపుముఖముగలది, రాముఁడు మహాతేజుఁడును సుముఖుఁడు, ఈమె రాక్షసి, అతఁడు మనుష్యోత్తముఁడు; ఈబిడ అట్టిరాము నెట్లుకామించెను! ౮

ముసలితనముచేత ముడుతలును తెల్లనివెండ్రుకలును గలదియు రామున కెంతమాత్రము అనురూప గానిదియునగు నాశూర్పణఖ, మేము నిర్భాగ్యుల మగుటవలన ఖరదూషణులును మఱియు సన్యరాక్షసులును వినాశంబు నొందుటకై చేయరానిదియుఁ బరిహాసాస్పదంబును సమస్తలోకనిందితంబునగు రామునందలి మోహంబు గావించెను. ౯,౧౦

ఆశూర్పణఖ నిమిత్తముయి రావణుఁడు రామునితో నీమహావైరంబు పెట్టుకొనెను.

రావణుఁడు తనవధంబునకై సీతంగొనితెచ్చి బలవంతుఁడగు రామునితోఁ దిరుగులేని విరోధము నుంచుకొన్నాఁడేగాని జనకమహారాజపుత్త్రియగు సీతయేమో యీరావణునకు స్వాధీన యగుట లేదు. ౧౧,౧౨

మున్ను సీత నపహరింపఁగోరి విరాధుని రాముం డొక్కఁడే వధించినాఁడనుటయె మాకిప్పుడు రామునకే జయంబు గలుగుననుటకు నిదర్శనము చాలును. ౧౩

రాముండు జనస్థానంబునఁ బదునాలుగువేల భయంకర పరాక్రములగు రాక్షసులను అగ్నిజ్వాలాభీకరంబులగు బాణంబులచే వధించెను. ౧౪

రాముండు యుద్ధమునందు సూర్యసమానంబులగు బాణంబులచేత ఖరుని దూషణుని త్రిశిరుని వధించి పుచ్చెను. రాముఁడే జయంబునొందు ననుటకు అదృష్టాంతమే చాలును. ౧౫

మఱియుఁ మాంసశోణితంబులె యాహారంబు గాఁగలవాఁడును క్రోధంబున భయంకరంబుగా నఱచువాఁడును ఆకుడదూషము నిడుపులయిన బాహువులుగలవాఁడునగు నాకబంధునిఁగూడ రాముఁడు వధించెను; రాముఁడే

జఘాన బలినం రామ స్సహస్రనయనాత్మజమ్,
వాలినం మేరుసఙ్కాశం పర్యాప్తం తన్నిదర్శనమ్. ౧౭

ఋశ్యమూకే వసన్ శైలే దీనో భగ్నమనోరథః,
సుగ్రీవ స్థాపితో రాజ్యే పర్యాప్తం తన్నిదర్శనమ్. ౧౮

ధర్మార్థసహితం వాక్యం సర్వేషాం రక్షసాం హితమ్,
యుక్తం విభీషణేనోక్తం మోహా త్తస్య న రోచతే. ౧౯

విభీషణవచః కుర్యా ద్యది స్మ ధనదానుజః,
శ్మశానభూతా దుఃఖార్తా నేయం లఙ్కాపురీ భవేత్. ౨౦

కుమ్భకర్ణం హతం శ్రుత్వా రాఘవేణ మహాబలమ్,
అతికాయం చ దుర్ధర్షం లక్ష్మణేన హతం పునః. ౨౧
ప్రియం చేన్ద్రజితం పుత్త్రం రావణో నావబుధ్యతే,

మమ పుత్త్రో మమ భ్రాతా మమ భర్తా రణే హతః. ౨౨
ఇత్యేవం శ్రూయతే శబ్దో రాక్షసీనాం కులేకులే,

రథా శ్చాశ్వాశ్చ నాగాశ్చ హతా శ్శతసహస్రశః. ౨౩
రణే రామేణ శూరేణ రాక్షసాశ్చ పదాతయః,

రుద్రో వా యది వా విష్ణు ర్మహేన్ద్రో వా శతక్రతుః. ౨౪
హన్తి నో రామరూపేణ యది వా స్వయ మన్తకః,

జయంబునొందు ననుటకు ఆ దృష్టాంతమే చాలును. ౧౬

మహాబలుఁడును మేరుపర్వతం బంతటివాఁడునగు దేవేంద్రకుమారుని వాలినిగూడ రాముఁడు వధించెను. రాముఁడే జయంబు నొందఁగలఁ డనుటకు ఆ దృష్టాంతమే చాలును. ౧౭

దీనుఁడై నిరాశుండై శత్రుభయంబున ఋశ్యమూకపర్వతంబున డాఁగియున్న సుగ్రీవునిఁగూడ రాముఁడు వానరరాజ్యంబున కధిపతిఁగాఁ జేసెను. రాముఁడే జయంబు నొందుననుటకు ఈ దృష్టాంతమె చాలును. ౧౮

విభీషణుండు చెప్పిన మాట, ధర్మార్థంబులు రెండును గలిగించునది. సమస్తరాక్షసులకును హితకరము. యుక్తియుక్తము. మోహంబునం జేసి రావణున కది తోఁచలేదు. ౧౯

కుబేరానుజుండగు రావణుండు విభీషణుఁడు చెప్పిన చొప్పునఁ గావించియుండునేని లంకాపుర మంతయు శ్మశానము వలెఁ బీనుఁగులతో నిండి యిట్లు ఆర్తనాదంబులతోఁ గూడినది కాదు. ౨౦

మహాబలుండగు కుంభకర్ణుండు రామునిచే వధింపఁబడుటను నెట్టివారి కిని ఎదిరింప నలవిగాని యతికాయుండును ప్రియసుతుండగు నింద్రజితుం డును లక్ష్మణునిచే వధింపఁబడుటను వినియు నింకన్ రావణుఁడు రామ ప్రభావంబుఁ దెలియకున్నాఁడు? ౨౧

"యుద్ధంబున నాకొడుకు హతుఁడయ్యె. నా సోదరుఁడు హతుఁ డయ్యె. నా పెనిమిటి హతుఁడయ్యె" నని లంకాపురంబున రాక్షసజనులు ప్రతియింటను రోదనము సేయుచున్నారు. ౨౨

శూరుఁడగు రాముఁడు రథంబులను గుఱ్ఱంబులను ఏనుఁగులను బదాతు లను లక్షలులక్షలుగా యుద్ధంబున వధించినాఁడు. ౨౩

రుద్రుఁడో విష్ణువో దేవేంద్రుఁడో లేక యముఁడో రామరూపంబున వచ్చి మా వారలను వధించుచున్నాఁడు గాని రాముఁడు మనుష్యమాత్రుఁడు కాఁడు. ౨౪

హతప్రవీరా రామేణ నిరాశా జీవితే వయమ్. ౨౫
అపశ్యన్తో భయ స్యాన్త మనాథా విలపామహే,

రామహస్తా ద్దశగ్రీవ శ్శూరో ద త్తమహావరః. ౨౬
ఇదం భయం మహాఘోర ముత్పన్నం నావబుధ్యతే,
న దేవా న చ గన్ధర్వాః న పిశాచా న రాక్షసాః. ౨౭
ఉపసృష్టం పరిత్రాతుం శక్తా రామేణ సంయుగే,
ఉత్పాతాశ్చాపి దృశ్యన్తే రావణస్య రణే రణే. ౨౮
కథయిష్యన్తి రామేణ రావణస్య నిబర్హణమ్,
పితామహేన ప్రీతేన దేవదానవరాక్షసైః. ౨౯
రావణస్యాభయం దత్తం మానుషేభ్యో న యాచితమ్,

తదిదం మానుషం మన్యే ప్రాప్తం నిస్సంశయం భయమ్. ౩౦
జీవితాన్తకరం ఘోరం రక్షసాం రావణస్యచ,

పీడ్యమానా స్తు బలినా వరదానేన రక్షసా. ౩౧
దీప్తై స్తపోభి ర్విబుధాః పితామహ మపూజయన్,

దేవతానాం హితార్థాయ మహాత్మా వై పితామహః. ౩౨
ఉవాచ దేవతాస్సర్వా ఇదం తుష్టో మహద్వచః,
అద్య ప్రభృతి లోకాం స్త్రీన్ సర్వే దానవరాక్షసాః. ౩౩
భయేన ప్రావృతా నిత్యం విచరిష్యన్తి శాశ్వతమ్,

దైవతైస్తు సమాగమ్య సర్వై శ్చేన్ద్రపురోగమైః. ౩౪
వృషధ్వజ స్త్రిపురహా మహాదేవః ప్రసాదితః,

మహావీరులగు మావారందఱు రామునిచే నిహతులగుటంజేసి మేము జీవితమునందు ఆశవదలి యీభయంబునకంతముగానక యనాథలమయి విలపించుచున్నాము. ౨౪

శూరుండగు రావణుండు వరబలంబున గర్వితుండు గావున దనకిప్పుడు రామునివలనఁ గలిగిన మహాభయంబు నెఱుంగఁడు. ౨౫

దేవతలుగాని గంధర్వులుగాని పిశాచంబులుగాని రాక్షసులుగాని యుద్ధంబున రామునిబారిం బడినవాని రక్షింపఁజాలరు. ౨౬

రావణుని పక్షమునఁ బ్రతియుద్ధంబునను ఉత్పాతంబులు అగపడుచున్నవి; అవే రాముఁడు రావణునివధించునని సూచించుచున్నవి. ౨౭

బ్రహ్మదేవుఁడు రావణుని తపస్సునకు మెచ్చి యతనికి దేవతలవలనఁగాని దానవులవలనఁగాని రాక్షసులవలనఁగాని భయంబు లేదని వరంబొసంగెను; అపుడు రావణుండు మనుష్యులవలన నభయము యాచింపఁడయ్యె. ౨౮

మనుష్యులవలన నభయంబు నప్పుడు యాచింపకుండుటవలన ఇప్పుడు రావణునకు రాక్షసులకును మనుష్యునివలనఁ బ్రాణాంతకరమయిన ఘోరంబగు నీభయంబు గలిగినది, సందేహము లేదు. ౩౦

దేవతలు బ్రహ్మదేవుఁడొసంగిన వరంబులవలన మఱియుం బలవంతుఁడగు రావణునిచేఁ బీడింపఁబడి యోర్వలేక బ్రహ్మదేవుంగుఱించి యత్యుగ్రంబగు తపము గావించిరి. ౩౧

మహానుభావుండగు బ్రహ్మదేవుండు సంతుష్టుఁడై దేవతలకు మేలుగలుగుటకై దేవతలంజూచి మహార్థంబగు నీమాటం జెప్పెను. ౩౨

ఇది మొదల సమస్తరాక్షసులును వారలతోఁ జేరిన దానవులును ఎల్లప్పుడును మూడు లోకంబులందును మీకెవ్వరికిని బాధసేయక భయంబుతో సంచరింపఁగలరు అని బ్రహ్మ దేవతలకు సమాధానముఁ జెప్పెను. ౩౩

దేవేంద్రుఁడు మొదలగు దేవతలు బ్రహ్మదేవునివలన నంతగాఁ దమ మనోరథము నెఱవేఱకపోవుటంజేసి అందఱు నొకటిగాఁజేరి వృషభధ్వజుం

ప్రసన్న స్తు మహాదేవో దేవానేతద్వచోఽబ్రవీత్. 3౫
ఉత్పత్స్యతి హితార్థం వో నారీ రక్షఃక్షయావహా,

ఏషా దేవైః ప్రయుక్తా తు క్షుద్యథా దానవా న్పురా. 3౬
భక్షయిష్యతి న స్సీతా రాక్షసఘ్నీ సరావణాన్,

రావణస్యాపనీతేన దుర్వినీతస్య దుర్మతేః. 3౭
అయం నిష్ఠానకో ఘోర శ్శోకేన సమభిప్లుతః,

తం న పశ్యామహే లోకే యో న శ్శరణదో భవేత్. 3౮
రాఘవేణోపసృష్టానాం కాలేనేవ యుగక్షయే,
నాస్తి న శ్శరణం కశ్చిద్భయే మహతి తిష్ఠతామ్. 3౯
దవాగ్ని వేష్టితానాం హి కరేణూనాం యథా వనే,
ప్రాప్తకాలం కృతం తేన పౌలస్త్యేన మహాత్మనా. ౪౦
యత ఏవ భయం దృష్టం తమేవ శరణం గతః.

ఇతీవ సర్వా రజనీచరస్త్రియః
పరస్పరం సంపరిరభ్య బాహుభిః,
విషేదు రార్తా భయభారపీడితా
వినేదు రుచ్చై శ్చ తదా సుదారుణమ్. ౪౧

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే - పఞ్చనవతితమస్సర్గః. ౯౫.

డును త్రిపురాసురులనుగూడ వధించినవాఁడునగు మహాదేవుని శివునిఁగుఱించి తపస్సు గావించిరి. ౩౪

అంత మహాదేవుఁడు ప్రసన్నుండై దేవతలంజూచి యిట్లనిపలికెను. ౩౫

రాక్షస వినాశంబు గలిగించునట్టి స్త్రీ యొకర్తుక జన్మింపఁగలదు. ఆబిడవలన మీకు హితంబుగలుగును. అని మహాదేవుఁడు దేవతలతోఁ జెప్పెను.

కాఁబట్టి సమస్తరాక్షసులకు వినాశంబు గలుగుటకై దేవతలచేఁ బంపఁబడిన యీసీత మున్ను ఆఁకలి దానవులను నశింపఁజేసినట్లు రావణునితోఁగూడ మమ్మందఱను భక్షించివేయఁగలదు. ౩౬

దుర్వినీతుఁడు దుర్బుద్ధియునగు రావణుఁడు చేసిన దుష్కార్యమునం జేసి యిట్లు మేమందఱము దుఃఖించి భయంకరమయిన వినాశము నొందవలసి వచ్చెను. ౩౭

ప్రలయకాలంబునఁ బ్రజలు యమునిబారిం బడినట్లు ఇప్పుడు రాముని బారిం బడిన మమ్ము ఈయాపదనుండి రక్షించునట్టి పురుషుం గానము. ౩౮

దావానలజ్వాలలచేఁ బరివేష్టితమయిన వనమున నున్న ఆఁడేనుఁగులకుం బోలె ఈమహాపదలోనున్న మాకు ఇప్పుడు ఎవ్వాఁడును రక్షకుండు లేఁడు. ౩౯

మహాత్ముఁడును బులస్త్యమహర్షి మనుమఁడునగు నవ్విభీషణుండు యుక్తమయిన పనియె గావించినాఁడు. ఎవ్వఁడు మనకు భయముచేయుచున్నాఁడో అట్టి రామునే శరణుపొంది సుఖముగా నున్నాఁడు. అని యారాక్షసస్త్రీలు విలపించిరి. ౪౦

అప్పుడు ఇవ్విధంబున రాక్షసస్త్రీలందఱు ఒకరినొకరు బాహువులతోఁ గవుఁగిలించుకొని మిక్కిలియు భయంబు నొందినవారలయి దీనలయి దుఃఖించుచు నుచ్చైర్నాదంబున భయంకరంబుగా రోదనంబు గావించిరి. ౪౧

ఇది తొంబదియైదవసర్గము.

---

## షణ్ణవతితమస్సర్గః.

ఆర్తానాం రాక్షసీనాం తు లఙ్కాయాం వై
రావణః కరుణం శబ్దం శుశ్రావ పరిదేవితమ్. ౧

స తు దీర్ఘం వినిశ్వస్య ముహూర్తం ధ్యాన మాస్థితః,
బభూవ పరమక్రుద్ధో రావణో భీమదర్శనః. ౨

సందశ్య దశనై రోష్ఠం క్రోధసంరక్తలోచనః,
రాక్షసై రపి దుర్దర్శః కాలాగ్ని రివ మూర్ఛితః.

ఉవాచ చ సమీపస్థా న్రాక్షసా న్రాక్షసేశ్వరః,
భయావ్యక్తకథ స్తత్ర నిర్దహ న్నివ చక్షుషా. ౪
మహోదరం మహాపార్శ్వం విరూపాక్షం చ రాక్షసమ్,

శీఘ్రం వదత సైన్యాని నిర్యాతేతి మమాజ్ఞయా. ౫

తస్య తద్వచనం శ్రుత్వా రాక్షసా స్తే భయార్దితాః,
చోదయామాసు రవ్యగ్రా న్రాక్షసాం స్తా న్నృపాజ్ఞయా. ౬

తే తు సర్వే తథేత్యుక్త్వా రాక్షసా ఘోరదర్శనాః,
కృతస్వస్త్యయనాస్సర్వే రణాయాభిముఖా యయుః. ౭
ప్రతిపూజ్య యథాన్యాయం రావణం తే నిశాచరాః,
తస్థుః ప్రాఞ్జలయ స్సర్వే భర్తు ర్విజయకాఙ్క్షిణః. ౮

## తొంబదియాఱవసర్గము.

అట్లు లంకాపురియందుఁ బ్రతిగృహంబునందును రాక్షసస్త్రీలు దుఃఖితలయి కరుణంబుగా రోదనంబు సేయ రావణుండును ఆధ్వనిని వినెను. ౧

ఆరావణుఁడు దీర్ఘంబుగా నిట్టూర్పులు విడిచి కొంతసేపు ఏమియుఁ దోఁచక చింతాగ్రస్తుండై యుండి యంతఁ బరమకుపితుఁడై భయంకరాకారుండయ్యెను. ౨

ఆరావణుఁడు దంతములచేఁ బెదవినిగొఱికి కోపంబున మఱియుం జెఱ్ఱనైన కన్నులుగలవాఁడై లోకమంతయు వ్యాపించిన ప్రలయకాలానలంబు వలె భయంకరాకారుండై రాక్షసులకునుగూడఁ దేఱిచూడ నలవిగాకుండెను. ౩

అపుడు రాక్షసరాజగు రావణుండు, భయంబునందడఁబడుచు నస్పష్టంబుగా మాటలాడుచున్న సమీపస్థులగురాక్షసులను మహోదరుండును మహాపార్శ్వుండును విరూపాక్షుండును మున్నగువారలంజూచి మూపులదహించు వాఁడువలె నిట్లనిపలికెను. ౪

శీఘ్రముగా యుద్ధంబునకు వెడలవలెనని నాయాజ్ఞయయినదని సైన్యములకుఁ జెప్పుఁడు. అని రావణుండు చెప్పెను. ౫

ఆరాక్షసులు రావణునిమాటనువిని రావణునికోపంబునకు భయపడుచు ఆతని యాజ్ఞచొప్పున రాజకార్యంబునందు ఎంతమాత్రము నేమఱుపాటు లేనట్టి రాక్షసులకుఁ జెప్పిరి. ౬

భయంకరాకారులగు నారాక్షసులు అట్లేయని రావణునివలన మంగళాశాసనంబు నొంది యందఱును యుద్ధాభిముఖులయి పోయిరి. ౭

ఆరాక్షసులందఱు వారివారియోగ్యతకుఁ దగునట్లు రావణునికి నమస్కారాదులుగావించి రావణుని జయంబుగోరుచు చేమోడ్పులుగీలించి నిలుచుండిరి. ౮

అథోవాచ ప్రహస్యైతాన్ రావణః క్రోధమూర్ఛితః,
మహోదరమహాపార్శ్వౌ విరూపాక్షం చ రాక్షసమ్. ౯
అద్య బాణైర్ధనుర్ముక్తై ర్యుగాన్తాదిత్యసన్నిభైః,
రాఘవం లక్ష్మణం చైవ నేష్యామి యమసాదనమ్. ౧౦
ఖరస్య కుమ్భకర్ణస్య ప్రహస్తేన్ద్రజితో స్తథా,
కరిష్యామి ప్రతీకార మద్య శత్రువధాదహమ్. ౧౧

నైవాన్తరిక్షం న దిశో న నద్యో నాపి సాగరాః,
ప్రకాశత్వం గమిష్యన్తి మద్బాణజలదావృతాః. ౧౨

అద్య వానరముఖ్యానాం తాని యూథాని భాగశః,
ధనుషా శరజాలేన విధమిష్యామి పత్త్రిణా. ౧౩

అద్య వానరసైన్యాని రథేన పవనౌజసా,
ధనుస్సముద్రా దుద్భూతై ర్మథిష్యామి శరోర్మిభిః. ౧౪
ఆకోశపద్మవక్త్రాణి పద్మకేసరవర్చసామ్,
అద్య(యూథ)వ్యూహతటాకాని గజవత్ప్రమథామ్యహమ్. ౧౫

సశరై రద్య వదనై స్సఙ్ఖ్యే వానరయూథపాః,
మణ్డయిష్యన్తి వసుధాం సనాళై రివ పఙ్కజైః. ౧౬

అద్య యుద్ధప్రచణ్డానాం హరీణాం ద్రుమయోధినామ్,
ముక్తేనైకేషుణా యుద్ధే భేత్స్యామి చ శతం శతమ్. ౧౭

హతో భర్తా హతో భ్రాతా యాసాం చ తనయా హతాః,

అంత రావణుండు పరమకుపితుండై నవ్వి మహోదరమహాపార్శ్వులను విరూపాక్షునిం జూచి యిట్లని చెప్పెను. ౯

ఇప్పుడు రామలక్ష్మణులను ధనుర్ముక్తంబులైన ప్రలయకాల సూర్యునితోఁ సమానంబులగు బాణంబులచే వధించి యమపురి కంపెదను. ౧౦

నే నిప్పుడు యుద్ధంబున శత్రువులవధించి యింతకుమున్ను వారిచే ఖరుండు కుంభకర్ణుండు ప్రహస్తుండు నింద్రజిత్తుండు వధింపఁబడినందుకుఁ బ్రతీకారంబు గావించెదను. ౧౧

నా బాణంబులను మేఘములచే నాచ్ఛాదితములయి యాకాశమును దిక్కులును నదులును సముద్రంబులును వెల్తురులేక చీఁకటితోఁ గూడి యుండఁగలవు. ౧౨

ఇప్పుడు ధనుస్సునుండి పత్త్రవంతంబులగు బాణంబులు సమూహంబులు సమూహంబులుగాఁ బ్రయోగించి యవ్వానరసైన్యంబులను గుంపులు గుంపులుగా వధించిపుచ్చెదను. ౧౩

ఇప్పుడు రథంబను వాయువేగంబుచే ధనుస్సను సముద్రమునుండి లేచిన బాణములకరుళ్లచే వానరసైన్యంబుల వధించెదను. ౧౪

కొంచెము వికసించిన కమలంబులుగల తటాకంబులను మదగజము కలఁచునట్లు కొంచెము వికసించిన కమలంబులవంటి ముఖములుగల యవ్వానర సేనలం గలంచెదను. ౧౫

ఇప్పుడు యుద్ధభూమి బాణసహితంబుగాఁ దెగిపడిన వానరేంద్ర ముఖంబులచే వ్యాప్తమయి కాడలతోఁగూడిన కమలంబులతోఁ గూడినట్లు రమణీయము గాఁగలదు. ౧౬

ఇప్పుడు యుద్ధంబున మహాపరాక్రమశాలులును వృక్షములతోఁ బోరువారలునగు నవ్వానరులను ఒక్కొకబాణముచే నూర్గురను. నూర్గురనుగా వధించెదను. ౧౭

యుద్ధంబున నెవ్వరెవ్వరికి భర్తలు సోదరులు కొడుకులు హతులయి

వధేనాద్య రిపో స్తాసాం కరోమ్యశ్రుప్రమార్జనమ్. ౧౮

అద్య మద్బాణనిర్భిన్నైః ప్రకీర్ణై ర్గతచేతనైః,
కరోమి వానరై ర్యుద్ధే యత్నావేక్ష్యతలాం మహీమ్. ౧౯
అద్య గోమాయవో గృధ్రా యేచ మాంసాశినోఽపరే,
సర్వాం స్తాం స్తర్పయిష్యామి శత్రుమాంసై శ్శరా(ర్పి)ర్దితైః,
కల్ప్యతాం మే రథ శ్శీఘ్రం క్షిప్ర మానీయతాం ధనుః,
అనుప్రయాన్తు మాం సర్వే యేఽవశిష్టా నిశాచరాః. ౨౧

తస్య తద్వచనం శ్రుత్వా మహాపార్శ్వోఽబ్రవీ ద్వచః,
బలాధ్యక్షాన్ స్థితాం స్తత్ర బలం సన్త్వర్యతా మితి. ౨౨

బలాధ్యక్షా స్తు సంరబ్ధాః రాక్షసాం స్తా న్గృహా ద్గృహాత్,
చోదయన్తః పరియయు ర్లఙ్కాయాం తు మహాబలాః. ౨౩
తతో ముహూర్తా న్నిష్పేతూ రాక్షసా భీమదర్శనాః,
నర్దన్తో భీమవదనా నానాప్రహరణై ర్భుజైః. ౨౪
అసిభిః పట్టసై శ్శూలై ర్గదాభి ర్ముసలై ర్హలైః,
శక్తిభి స్తీక్ష్ణధారాభి ర్మహద్భిః కూటముద్గరైః. ౨౫
యష్టిభి ర్విమలై శ్చక్రై ర్నిశితై శ్చ పరశ్వధైః,
భిణ్డిపాలై శ్శతఘ్నీభి రన్యై శ్చాపి వరాయుధైః. ౨౬
అథానయ ద్బలాధ్యక్షః స్సత్వరో రావణాజ్ఞయా,
ద్రుతం సూతసమాయుక్తం యుక్తాష్టతురగం రథమ్. ౨౭

ఆరురోహ రథం భీమో దీప్యమానం స్వతేజసా,

వారో, అట్టి రాక్షసస్త్రీలకందఱికిని ఇప్పుడు శత్రువును వధించి దుఃఖనివారణము గావించెదను. ౧౮

ఇప్పుడు యుద్ధంబున బాణంబులచే వానరులను వధించి వారికళేబరంబులచే భూమినిగప్పి చక్కఁగా నగపడునట్లు గావించెదను. ౧౯

మాంసాహారంబులగు నక్కలు గద్దలు మొదలగు జంతువులకన్నిటికిని ఇప్పుడు బాణంబులచే మాంసములనొసంగి తృప్తి గావించెదను. ౨౦

శీఘ్రంబుగా సారథంబాయత్తంబుసేయుదురుగాక. సాథువు తెత్తురుగాక. మఱియు నిప్పటికి అవశిష్టులగు రాక్షసులు నావెంబడి వత్తురుగాక. అని రావణుండు రాక్షసులతోఁ జెప్పెను. ౨౧

మహాపార్శ్వుఁడు రావణుఁడు చెప్పినమాటనువిని యచటనున్న సేనాధ్యక్షులంజూచి "శీఘ్రంబుగా సైన్యంబులందెండు" అని యాజ్ఞాపించెను. ౨౨

మహాబలశాలులగు నా సేనాధ్యక్షులు, అతివేగంబున లంకాపురియందుఁ బ్రతిగృహంబును దిరిగి రాక్షసులనందఱిం బిలిచిరి. ౨౩

అంత ముహూర్తంబునకు భయంకరమయిన ముఖములగలరాక్షసులు ఖడ్గంబులను అడ్డకత్తులను శూలంబులను గదలను రోఁకళ్లు హలంబులను దీక్ష్ణంబులగు బల్లెములను పట్టెలను గుదియలను ఇనుపకఱ్ఱలను నిర్మలంబులగు చక్రంబులను దీక్ష్ణంబులగు గండగొడ్డళ్లను విడిచివాటు గుదియలను శతఘ్నులను మొదలగు నాయుధంబుల భుజంబులందాలిచి చూపరులకు భయంబు గలిగించుచు వెడలిరి. ౨౪-౨౬

అంత రావణునాజ్ఞచొప్పున సేనాధ్యక్షుఁడు సారథిసహితంబును ఎనిమిదిగుఱ్ఱంబులు పూన్చినదియు నగు రథంబును త్వరితంబుగాఁ గొని వచ్చెను. ౨౭

భయంకరుండగు రావణుఁడు తేజంబుచే దేదీప్యమానంబగు నారథము నారోహించెను.

తతః ప్రయాత స్సహసా రాక్షసై ర్బహుభి ర్వృతః. ౨౮
రావణ స్సత్త్వగామ్భీర్యా ద్దారయన్నివ మేదినీమ్,
రావణేనాభ్యనుజ్ఞాతా మహాపార్శ్వ మహోదరౌ. ౨౯
విరూపాక్షశ్చ దుర్ధర్షో రథానారురుహు స్తదా,
తే తు హృష్టా వినర్దన్తో భిన్దన్త ఇవ మేదినీమ్. ౩౦
నాదం ఘోరం విముఞ్చన్తో నిర్యయు ర్జయకాఙ్క్షిణః,

తతో యుద్ధాయ తేజస్వీ రక్షోగణబలై ర్వృతః. ౩౧
నిర్యయావుద్యతధనుః కాలాన్తకయమోపమః,

తతః ప్రజవనాశ్వేన రథేన స మహారథః. ౩౨
ద్వారేణ నిర్యయౌ తేన యత్ర తౌ రామలక్ష్మణౌ,
తతో నష్టప్రభ స్సూర్యో దిశశ్చ తిమిరావృతాః. ౩౩
ద్విజాశ్చ నేదు ర్ఘోరాశ్చ సంచచాలేవ మేదినీ,

వవర్ష రుధిరం దేవ శ్చస్ఖలు స్తురగాః పథి. ౩౪
ధ్వజాగ్రే న్యపత ద్గృధ్రో వినేదు శ్చాశివం శివాః,
నయనం చాస్ఫుర ద్వామం సవ్యో బాహు రకమ్పత. ౩౫
వివర్ణవదనం చాసీ త్కిఞ్చి దభ్రశ్యత స్వరః,
తతో నిష్పతతో యుద్ధే దశగ్రీవస్య రక్షసః. ౩౬
రణే నిధనశంసీని రూపాణ్యేతాని జజ్ఞి రే,

అన్తరిక్షా త్పపాతోల్కా నిర్ఘాతసమనిస్వనా. ౩౭
వినేదు రశివా గృధ్రా వాయసై రనునాదితాః,

అంత రావణుండు పెక్కండ్రు రాక్షసులు పరివేష్టింప బలాతిశయంబునం జేసి భూమిని భేదించురీతినోప వేగంబునం బయనమయ్యెను. ౨౮

అప్పుడు మహాపార్శ్వుండును మహోదరుండును దుర్ధర్షుండగు విరూపాక్షుండును రావణుననుమతినొంది రథముల నారోహించిరి. ౨౯

ఆమహోదర మహాపార్శ్వ విరూపాక్షులును సంతుష్టులయి భూమి భేదిల్లునట్లు భయంకరంబుగా సింహనాదంబులచే గర్జించుచు జయంబునొందం గోరి వెడలిరి. ౩౦

అంత మహాతేజుండగు రావణుండు రాక్షససైన్యములచేం బరివేష్టితుండై ధనుర్ధరుండై ప్రలయకాలంబున సమస్త జీవరాసుల నశింపంజేయం యమునిభంగి జ్వలించుచు యుద్ధంబునకు వెడలెను. ౩౧

అంత నమ్మహారథుండు వేగవంతంబులగు గుఱ్ఱంబుల్పూనిచిన రథంబు నారోహించి రామలక్ష్మణులున్న యుత్తరద్వారంబున నిర్గమించెను. ౩౨

అప్పుడు సూర్యుండు కాంతి హీనుండయ్యె. దిక్కులందుం జీకట్లు క్రమ్మినవి. భయంకరములగు పక్షు లఱచినవి. భూమియుం జలనము నొందినట్లుండెను. ౩౩

మేఘము నెత్తురువర్షముగురిసెను. గుఱ్ఱములు మార్గంబునం దడంబడినవి. ధ్వజాగ్రంబున గద్దవ్రాలెను. నక్కలు భయంకరముగా నఱచినవి. ౩౪

ఆరావణుని యెడమకన్ను అదరినది. ఎడమచేయి యదరెను. ముఖము తెల్లంబాఱెను. కంఠస్వరము తగ్గెను. ౩౫

ఆయుత్తరద్వారము నుండి రావణుండు యుద్ధమునకు వెడలు నప్పుడు యుద్ధంబున నతనికి మరణము గలుగునని సూచించునట్టి యీ దుర్నిమిత్తంబులుగలిగెను. ౩౬

పిడుగుపడినట్లు మహాధ్వనితో నాకాశమునుండి పొగలేని నిప్పుపడినది. అమంగళకరంబులగు గద్దలును కాకులును జేరి యఱచినవి. ౩౭

ఏతానచిన్తయ న్ఘోరానుత్పాతాన్ సముపస్థితాన్, ౩౮
నిర్యయౌ రావణో మోహా ద్వధార్థీ కాలచోదితః,
తేషాం తు రథఘోషేణ రాక్షసానాం మహాత్మనామ్. ౩౯
వానరాణా మపి చమూ ర్యుద్ధాయైవాభ్యవర్తత,
తేషాం తు తుములం యుద్ధం బభూవ కపిరక్షసామ్. ౪౦
అన్యోన్య మాహ్వయానానాం క్రుద్ధానాం జయ మిచ్ఛతామ్,
తతః క్రుద్ధో దశగ్రీవ శ్శరైః కాఞ్చనభూషణైః. ౪౧
వానరాణామనీకేషు చకార కదనం మహత్,
నికృత్తశిరసః కేచి ద్రావణేన వలీముఖాః. ౪౨
కేచి ద్విచ్ఛిన్నహృదయాః కేచిచ్ఛ్రోత్రవివర్జితాః,
నిరుచ్ఛ్వాసా హతాః కేచి త్కేచి త్పార్శ్వేషు దారితాః. ౪౩
కేచి ద్వి(భి)చ్ఛిన్నశిరసః కేచి చ్చక్షుర్వివర్జితాః,

దశాననః క్రోధవివృత్తనేత్రో
యతో యతోఽభ్యేతి రథేన సఙ్ఖ్యే,
తత స్తత స్తస్య శరప్రవేగం
సోఢుం న శేకు ర్హరిపుఙ్గవా స్తే. ౪౪

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే షణ్ణవతితమస్సర్గః. ౯౬.

---

## సప్తనవతితమస్సర్గః.

తథా తైః కృత్తగాత్రై స్తు దశగ్రీవేణ మార్గణైః,
బభూవ వసుధా తత్ర ప్రకీర్ణా హరిభి స్తదా. ౧
రావణస్యాప్రసహ్యం తం శరసంపాతమేకతః,
న శేకు స్సహితుం దీప్తం పతఙ్గా జ్వలనం యథా. ౨
తేఽర్దితా నిశితై ర్బాణైః క్రోశన్తో విప్రదుద్రువుః,

రావణుఁడు మృత్యుప్రేరితుఁ డగుటంజేసి యిట్లు సంభవించిన యీ దుర్నిమిత్తంబులను సరకుసేయక మోహంబున వధంబునొందుటకై వెడలెను.

మహాబలులగు నారాక్షసుల రథధ్వనివిని వానరసేనయుం యుద్ధంబునకు ఎదురుమొగమై నిలిచెను. ౩౯

ఆవానరులు రాక్షసులును ఒండొరుల జయింపఁగోరి కుపితులయిస్పర్ధచే నొకరినొకరు పిలుచుచుఁ దుములంబుగా యుద్ధము గావించిరి. ౪౦

అప్పుడు రావణుఁడు వానరసైన్యంబులం బ్రవేశించి కాంచనపుంఖంబులగు బాణంబులు ప్రయోగింపుచు గొప్పయుద్ధంబు గావించెను. ౪౧

రావణుఁడప్పుడు కొందఱివానరుల తలల ఖండించెను. కొందఱి గుండెకాయల బద్దలు గావించెను. కొందఱి చెవులం దెగవేసెను. ౪౨

రావణుని బాణములచేఁ గొందఱు వానరులు ఊర్పులులేక హతులయి పడిరి. కొందఱు పార్శ్వములందు భేదింపఁబడిరి. కొందఱికిఁ దలలుపగిలినవి. కొందఱికి కన్నులుపోయినవి. ౪౩

యుద్ధంబున రావణుఁడు రథగతుఁడై క్రోధంబునం గన్నులు భయంకరంబుగాఁ దిరుగ నెందెందుఁబోవునో అయ్యైస్థలంబులందంతయుఁ వానరవీరు లతని బాణవేగంబు సహింపఁజాలరైరి. ౪౪

ఇది తొంబదియాఱవసర్గము.

---

## తొంబదియేడవసర్గము.

అప్పుడు రావణునిబాణంబులచే నవ్విధంబున నానావిధంబుగా వ్రేటుదిని పడినవానరుల కళేబరంబులచే నచటియుద్ధభూమియంతయుం నిండినది. ౧

శలభంబులు మండుచున్న యగ్నిని సహింపఁజాలనట్లు ఆవానరులుం దుస్సహంబులగు రావణునిబాణవేగమును సహింపఁజాలరైరి. ౨

ఆవానరులు కఱకుటమ్ములం బీడింపఁబడినవారలై యోర్వఁజాలక

పావకార్చి స్సమావిష్టా దహ్యమానా యథా గజాః. ౩

ప్లవఙ్గానా మనీకాని మహాభ్రాణీవ మారుతః,
స యయౌ సమరే తస్మిన్విధమ న్రావణశ్శరైః. ౪

కదనం తరసా కృత్వా రాక్షసేన్ద్రో వనౌకసామ్,
ఆససాద తతో యుద్ధే రాఘవం త్వరిత స్తదా. ౫
సుగ్రీవ స్తా న్కపీ న్దృష్ట్వా భగ్నా న్విద్రవతో రణే,
గుల్మే సుషేణం నిక్షిప్య చక్రే యుద్ధేఽద్భుతం మనః. ౬

ఆత్మన స్సదృశం వీర స్స తం నిక్షిప్య వానరమ్,
సుగ్రీవోఽభిముఖశ్శత్రుం ప్రతస్థే పాదపాయుధః. ౭

పార్శ్వతః పృష్ఠతశ్చాస్య సర్వే యూథాధిపా స్స్వయమ్,
అనుజహ్రు ర్మహాశైలా న్వివిధాంశ్చ మహాద్రుమాన్. ౮

స నదన్ యుధి సుగ్రీవ స్స్వరేణ మహతా మహాన్,
పాతయ న్వివిధాం శ్చాన్యా ఞ్జగామోత్తమరాక్షసాన్. ౯

మమన్థ చ మహాకాయా న్రాక్షసా న్వానరేశ్వరః,
యుగాన్తసమయే వాయుః ప్రవృద్ధా నగమానివ. ౧౦

రాక్షసానా మనీకేషు శైలవర్షం వవర్ష హ,
అశ్మవర్షం యథా మేఘః పక్షిసంఘేషు కాననే. ౧౧

అగ్నిచే దహింపఁబడుచున్న జ్వాలలు మేనులం దగులు కొన్న గజంబులు వలె వఱచుచుఁ బరుగెత్తిరి. ౩

వాయువు మహామేఘంబులం బాఱఁదోలునట్లు ఆయుద్ధంబున నా రావణుఁడు గొప్పగొప్ప వానరసైన్యంబులను బాణంబులం బాఱఁదోలుచుఁ బోయెను. ౪

అప్పుడు రాక్షసనాథుఁడు రావణుఁడు అట్లు వానరులతో నమ్మహా యుద్ధంబు గావించి యంత యుద్ధము సేయుటకై రాముని మీఁదికిఁ బోయెను.

సుగ్రీవుఁడు వానరులు యుద్ధంబునఁ బరాజితులయి పరుగెత్తు చుండుటం జూచి సేనాసంరక్షణమునకు సుషేణు నియమించి అందఱు నాశ్చర్యపడునట్లు యుద్ధము సేయఁబూనెను. ౬

వీరుఁడగు నాసుగ్రీవుఁడు సేనాసంరక్షణమునకు బలపరాక్రమంబులఁ దనకు సమానుఁడగు సుషేణునుంచి వృక్షంబు చేతం బూని శత్రువుమీఁదికిఁ బోయెను. ౭

వానరేశ్వరుఁడగు సుగ్రీవుండు యుద్ధమునకు బయలుదేఱుటయు గొప్ప గొప్ప యూథపతులగు వానరవీరులు తామె సుగ్రీవునకు యుద్ధోపకరణార్థమయి పర్వతంబులను నానావిధంబులగు వృక్షంబులనుం గొని యతని పార్శ్వంబులందును వెనుకను వెంబడించి నడచిరి. ౮

మహాకాయుఁడగు నా సుగ్రీవుఁడు యుద్ధంబున మహాధ్వనితో గర్జించుచు నానావిధులయిన రాక్షసుల ననేకుల వధించి మేటి రాక్షసులమీఁదికిఁ బోయెను. ౯

భయంకరాకారుఁడగు వానరనాథుఁడు సుగ్రీవుఁడు ప్రలయకాలంబున వాయువు ఉన్నతంబులగు వృక్షంబులం బడవైచునట్లు గొప్పరాసులం బడఁద్రోసెను. ౧౦

అడవియందు మేఘము పక్షిసమూహాలపై తాళ్లంగురియునట్లు సుగ్రీవుఁడు రాక్షససేనలపయిఁ బర్వతంబులం గురిసెను. ౧౧

కపిరాజవిముక్తైస్తైశ్శైలవర్షైస్తు రాక్షసాః,
వికీర్ణశిరసః పేతుర్నికృత్తా ఇవ పర్వతాః. ౧౨
అథ సంక్షీయమాణేషు రాక్షసేషు సమన్తతః,
సుగ్రీవేణ ప్రభగ్నేషు పతత్సు నినదత్సు చ. ౧౩
విరూపాక్షస్స్వకం నామ ధన్వీ విశ్రావ్య రాక్షసః,
రథాదాప్లుత్య దుర్ధర్షో గజస్కన్ధముపారుహత్. ౧౪
స తం ద్విరద మారుహ్య విరూపాక్షో మహారథః,
వినదన్భీమనిర్హ్రాదం వానరానభ్యధావత. ౧౫
సుగ్రీవే స శరాన్ఘోరాన్విససర్జ చమూముఖే,
స్థాపయామాస చోద్విగ్నాన్రాక్షసాన్సంప్రహర్షయన్. ౧౬

స తు విద్ధశ్శితైర్బాణైః కపీన్ద్రస్తేన రక్షసా,
చుక్రోధ స మహాక్రోధో వధే చాస్య మనో దధే. ౧౭
తతః పాదపముద్ధృత్య శూరస్సంప్రధనో హరిః,
అభిపత్య జఘానాస్య ప్రముఖే తు మహాగజమ్. ౧౮

స తు ప్రహారాభిహతస్సుగ్రీవేణ మహాగజః,
అపాసర్పద్ధనుర్మాత్రం నిషసాద ననాద చ. ౧౯
గజాత్తు మథితాత్తూర్ణమపక్రమ్య స వీర్యవాన్,
రాక్షసోఽభిముఖశ్శత్రుం ప్రత్యుద్గమ్య తతః కపిమ్. ౨౦
ఆర్షభం చర్మఖడ్గం చ ప్రగృహ్య లఘువిక్రమః,
భర్త్సయన్నివ సుగ్రీవమాససాద వ్యవస్థితమ్. ౨౧
స హి తస్యాభిసంక్రుద్ధః ప్రగృహ్య విపులాం శిలామ్,
విరూపాక్షాయ చిక్షేప సుగ్రీవో జలదోపమామ్. ౨౨

వానరరాజు సుగ్రీవుఁడు గురిసిన పర్వతవర్షములం జేసి రాక్షసులం దలలు తుత్తునియలుగాఁ బగిలి వజ్రాయుధముచే ఛేదింపఁబడిన పర్వతంబుల పగిది నేలంగూలిరి. ౧౨

అంత రాక్షసు లందఱు సుగ్రీవునిచే దెబ్బలుదిని హింసింపఁబడుచుఁ బడుటయు అఱచుటయుఁజూచి దుర్ధర్షుఁడగు విరూపాక్షుఁడు ధనుర్ధరుఁడై తన పేరు చాటింపుచు రథముందిడి యెగిరి సమీపంబున నున్న మదగజముపైఁ గూర్చుండెను. ౧౩, ౧౪

మహారథుండగు నావిరూపాక్షుఁడు ఆ మదపుటేనుఁగు నెక్కి భయంకరంబుగా సింహనాదంబు సేయుచు వానరులపై కడరెను. ౧౫

ఆ విరూపాక్షుఁడు వానరసేనాముఖంబున నున్న సుగ్రీవునిపై భయంకరంబులగు బాణంబులం బ్రయోగించి భయంబునం బరుగెత్తుచున్న రాక్షసులకు భయంబు దీర్చి సంతోషంబు గావించెను. ౧౬

వానరరాజైన సుగ్రీవుఁడు అట్లు విరూపాక్షునిచే బాణంబుల నొప్పింపఁబడి పరమకుపితుఁడై యతని వధింపఁ దలంచెను. ౧౭

అంత శూరుండును జక్కఁగాఁ బ్రహరించువాఁడునగు సుగ్రీవుండు వృక్షంబు పెల్లగించి విరూపాక్షునిమీఁదికి బోయి దానితో నతని యేనుఁగును ముఖమునం గొట్టెను. ౧౮

ఆమ్మదగజంబు సుగ్రీవుని పెట్టునకు ధనుస్సంతదూరము వెనుకకుఁ బాఱి యఱచుచు మృతినొందెను. ౧౯

అంతఁ బరాక్రమవంతుఁడును శీఘ్రంబుగా నడచువాఁడునగు నా విరూపాక్షుఁడు హతంబగు నా యేనుఁగుపైనుండి శీఘ్రంబుగ డిగ్గి వాలుం బలుకయుంగొని శత్రువున కభిముఖుఁడై స్థిరంబుగా నున్న సుగ్రీవునిమీఁదికి అతని బెదరించువాఁడువలె నాటోపంబునం బోయెను. ౨౦, ౨౧

ఆ సుగ్రీవుఁడు విరూపాక్షునిపైఁ గోపించి మేఘమువలె నున్న విశాలంబగు మహాశిలందీసి విరూపాక్షునిపై వేసెను. ౨౨

స తాం శిలా మాపతన్తీం దృష్ట్వా రాక్షసపుఙ్గవః,
అపక్రమ్య సువిక్రాన్తః ఖడ్గేన ప్రాహర త్తదా. ౨౩

తేన ఖడ్గప్రహారేణ రక్షసా బలినా హతః,
ముహూర్త మభవ ద్వీరో విసంజ్ఞ ఇవ వానరః. ౨౪
స తదా సహసోత్పత్య రాక్షసస్య మహాహవే,
ముష్టిం సంవర్త్య వేగేన పాతయామాస వక్షసి. ౨౫
ముష్టిప్రహారాభిహతో విరూపాక్షో నిశాచరః,
తేన ఖడ్గేన సంక్రుద్ధ స్సుగ్రీవస్య చమూముఖే. ౨౬
కవచం పాతయామాస పద్భ్యా మభిహతోఽపతత్,
స సముత్థాయ పతితః కపి స్తస్య వ్యసర్జయత్. ౨౭
తలప్రహార మశనే స్సమానం భీమనిస్వనమ్,
తలప్రహారం తద్రక్ష స్సుగ్రీవేణ సముద్యతమ్. ౨౮
నైపుణ్యా న్మోచయిత్వైనం ముష్టినోరస్యతాడయత్,
తత స్సుసంక్రుద్ధతర స్సుగ్రీవో వానరేశ్వరః. ౨౯
మోక్షితం చాత్మనో దృష్ట్వా ప్రహారం తేన రక్షసా,
స దదర్శాన్తరం తస్య విరూపాక్షస్య వానరః. ౩౦
తతో న్యపాతయ త్క్రోధా చ్ఛఙ్ఖదేశే మహా త్తలమ్,

మహేన్ద్రాశనికల్పేన తలేనాభిహతః క్షితౌ. ౩౧
పపాత రుధిరక్లిన్న శ్శోణితం చ సముద్వమన్,
స్రోతోభ్య స్తు విరూపాక్షో జలం ప్రస్రవణా దివ. ౩౨
వివృత్తనయనం క్రోధా త్సఫేనం రుధిరాప్లుతమ్,
దదృశు స్తే విరూపాక్షం విరూపాక్షతరం కృతమ్. ౩౩

అప్పుడు పరాక్రమవంతుఁడగు నా రాక్షసోత్తముఁడు విరూపాక్షుఁడు అమ్మహాశిల వచ్చుటంజూచి తప్పించుకొనుటకై కొంతప్రక్కకు దాఁటి ఖడ్గంబుచే సుగ్రీవునిఁ బ్రహరించెను. ౨౩

వీరుఁడగు సుగ్రీవుఁడు బలవంతుఁడయిన యా విరూపాక్షుని కత్తి దెబ్బకు కొంచెము సేపు మూర్ఛ నొందినట్లు విహ్వలుండయ్యెను. ౨౪

అంత నమ్మహాయుద్ధంబున సుగ్రీవుఁడు శీఘ్రంబు లేచి వేగంబునం బిడికిలి నలవరించి విరూపాక్షుని ఱొమ్మునం బొడిచెను. ౨౫

సేనాముఖంబున నట్లు పిడికిటం బొడువఁబడినవాఁడై యవ్విరూపాక్షుండు కోపించి యా ఖడ్గంబున సుగ్రీవుని కవచంబును వ్రక్కలు గావించెను. సుగ్రీవుం డా దెబ్బకుఁ గాళ్లు చాఁచుకొని నేలంబడెను. ౨౬

అంత సుగ్రీవుండు లేచి వజ్రాయుధముతో సమానమయినదియు మహాధ్వనిగలదియునగు నఱచేతి దెబ్బతో నావిరూపాక్షుని గొట్టఁబోయెను. ౨౭

విరూపాక్షుఁడు సామర్థ్యంబున సుగ్రీవుని యఱచేతి చఱపును దప్పించుకొని సుగ్రీవుని వక్షస్స్థలంబునఁ బిడికిటం బొడిచెను. ౨౮

అంత వానరనాథుండగు సుగ్రీవుండు తన దెబ్బను విరూపాక్షుండు తప్పించుకొని తన్నుఁగొట్టుటంజూచి కోపించి యావిరూపాక్షుం డేమఱి యుండుటం గనెను. ౨౯, 30

అంత సుగ్రీవుండు కోపంబున నావిరూపాక్షుని నొసటను అఱచేతం గొట్టెను.

దేవేంద్ర వజ్రాయుధమువంటి సుగ్రీవునియఱచేతి ప్రహారంబునకు అవ్విరూపాక్షుండు పర్వతంబు సెలయేర్లనుండి జలంబు విడుచునట్లు నవరంధ్రంబుల నెత్తురుగ్రక్కుచు నెత్తుటం దడుపఁబడినవాఁడై నేలంగూలెను.

అట్లు క్రోధవేశంబునం జేసి కంటిగ్రుడ్లు త్రిప్పుచు నోట నురుఁగు గాఱు నెత్తుటం దోఁగుచు స్వభావంబున నె వికృతనేత్రంబుగలిగి మఱియుం వికృతములయిన నేత్రములతో నున్న యవ్విరూపాక్షుని వానరులును రాక్షసులును జూచిరి. 33

స్ఫురన్తం పరివర్తన్తం పార్శ్వేన రుధిరోక్షితమ్,
కరుణం చ వినర్దన్తం దదృశుః కపయో రిపుమ్. 3౪

తథా తు తౌ సంయతి సంప్రయుక్తౌ
తరస్వినౌ వానరరాక్షసానామ్,
బలార్ణవౌ సస్వనతుః స్మభీమం
మహార్ణవౌ ద్వావివ భిన్నవేలౌ. 3౫
వినాశితం ప్రేక్ష్య విరూపనేత్రం
మహాబలం తం హరిపార్థివేన,
బలం సమస్తం కపిరాక్షసానా
మున్మత్తగఙ్గాప్రతిమం బభూవ. 3౬
ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే- సప్తనవతితమస్సర్గః. ౯౭.

---

అష్టనవతితమస్సర్గః.

హన్యమానే బలే తూర్ణ మన్యోన్యం తే మహామృధే,
సరసీవ మహాఘర్మే సోపక్షీణే బభూవతుః. ౧
స్వబలస్య విఘాతేన విరూపాక్షవధేన చ,
బభూవ ద్విగుణం క్రుద్ధో రావణో రాక్షసాధిపః. ౨
ప్రక్షీణం తు బలం దృష్ట్వా వధ్యమానం వలీముఖైః,
బభూవాస్య వ్యథా యుద్ధే ప్రేక్ష్య దైవవిపర్యయమ్. 3
ఉవాచ చ సమీపస్థం మహోదర మరిందమమ్,

అస్మిన్కాలే మహాబాహో! జయాశా త్వయి మే స్థితా. ౪

అట్లు వేదనచేఁ జైకి ఎగిరియెగిరిపడుచుఁ బ్రక్కలకుఁ బొరలుచు విను వారికి దుఃఖము గలుగునట్లు బొబ్బలు పెట్టుచున్న శత్రువు నవ్విరూపాక్షుని వానరులు చూచిరి. ౩౪

అట్లు వానరులలో బలవంతుఁడయిన సుగ్రీవుఁడును రాక్షసులలో బలవంతుఁడగు విరూపాక్షుఁడును బలసముద్రు లిద్దఱును యుద్ధంబున నొండొరులమార్కొని చెలియలికట్ట నతిక్రమించిన రెండు మహాసముద్రములు ఘోషించునట్లు భయంకరముగా సింహనాదములు గావించిరి. ౩౫

వానరరాజయిన సుగ్రీవుండు మహాబలుని విరూపాక్షుని వధించుటను జూచి వానరసైనికులు సంతోషంబునను రాక్షససైనికులు క్రోధదుఃఖంబులను గంగాప్రవాహమువలె నుప్పొంగి యొకరిమీఁద నొకరు పడి పోరిరి. ౩౬

ఇది తొంబదియేడవసర్గము.

---

## తొంబదియెనిమిదవసర్గము.

అమ్మహాయుద్ధంబున నొండొంటి వధించుచు వానర రాక్షససైన్యములు రెండు గొప్ప వేసవి యప్పుడు కొలంకులు నీరుతగ్గునట్లు క్షీణించినవి. ౧

రాక్షసేశ్వరుఁడగు రావణుఁడు అట్లు తన సైన్యంబు నశించి విరూపాక్షుఁడు హతుఁడగుటకు రెండింతలుగా కోపమునొందెను. ౨

యుద్ధంబున తనసైన్యము వానరులచే హతమై నశించుటను జూచి యట్లు తనకు దైవము విపరీతమగుటంగని మనంబున వ్యథనొందెను. ౩

అంత రావణుఁడు సమీపంబున నున్న శత్రుహంతయగు మహోదరుం జూచి యిట్లని పలికెను.

మహాబాహుఁడవగు మహోదరుఁడా! ఈ కష్టకాలంబుని నీవలననె నాకు జయంబు గలుగవలెను. ౪

జహి శత్రుచమూం వీర! దర్శయాద్య పరాక్రమమ్,
భర్తృపిణ్డస్య కాలోఽయం నిర్దేష్టుం సాధు యుధ్యతామ్. ౫

ఏవ ముక్త స్తథే త్యుక్త్వా రాక్షసేన్ద్రో మహోదరః,
ప్రవివేశారిసేనాం తాం పతఙ్గ ఇవ పావకమ్. ౬
తత స్స కదనం చక్రే వానరాణాం మహాబలః,
భర్తృవాక్యేన తేజస్వీ స్వేన వీర్యేణ చోదితః. ౭

వానరాశ్చ మహాసత్త్వాః ప్రగృహ్య విపులా శ్శిలాః,
ప్రవిశ్యారిబలం భీమం జఘ్ను స్తే రజనీచరాన్. ౮
మహోదర స్తు సంక్రుద్ధ శ్శరైః కాఞ్చనభూషణైః,
చిచ్ఛేద పాణిపాదోరూ న్వానరాణాం మహాహవే. ౯

తత స్తే వానరా స్సర్వే రాక్షసై రర్దితా భృశమ్,
దిశో దశ ద్రుతాః కేచిత్కేచి త్సుగ్రీవ మాశ్రితాః. ౧౦
ప్రభగ్నాం సమరే దృష్ట్వా వానరాణాం మహాచమూమ్,
అభిదుద్రావ సుగ్రీవో మహోదర మనన్తరమ్. ౧౧
ప్రగృహ్య విపులాం ఘోరాం మహీధరసమాం శిలామ్,
చిక్షేప స మహాతేజా స్తద్వధాయ హరీశ్వరః. ౧౨
తామాపతన్తీం సహసా శిలాం దృష్ట్వా మహోదరః,
అసమ్భ్రాన్త స్తతో బాణై ర్నిర్బిభేద దురాసదామ్. ౧౩

రక్షసా తేన బాణౌఘై ర్నికృత్తా సా సహస్రధా,
నిపపాత శిలా భూమౌ గృధ్రచక్రమివాకులమ్. ౧౪

పరాక్రమవంతుఁడవగు మహోదరుఁడా! ఇప్పుడు శత్రుసేనను వధించి పరాక్రమంబుఁ జూపుము. స్వామినైన నాయన్నంబు దిన్నందులకుఁ బ్రత్యుపకారముసేయు సమయ మిదే. చక్కఁగా యుద్ధముసేయుము. అని రావణుఁడు మహోదరునితోఁ జెప్పెను. ౫

రాక్షసశ్రేష్ఠుండగు మహోదరుఁడు రావణుని మాటనువిని యట్లేయని యియ్యకొని శలభ మగ్నిని జొచ్చునట్లు శత్రుసైన్యమునం బ్రవేశించెను. ౬

అంత అధికమయిన బలంబును బరాక్రమంబును గల యమ్మహోదరుండు స్వామివాక్యంబు శిరసావహించి తన పరాక్రమంబు కొలఁది వానరులతో యుద్ధంబు గావించెను. ౭

బలవంతులగు నవ్వానరులును గొప్పగొప్పశిలలు గైకొని భయంకరంబగు రాక్షససేనం జొచ్చిరి. రక్కసులను వధించిరి. ౮

అమ్మహాయుద్ధంబున మహోదరుండును కోపించి కాంచనాలంకృతంబులగు బాణంబులు ప్రయోగించి వానరులహస్తములఁ బాదంబుల నూరువులను ఖండించెను. ౯

అంత వానరు లందఱు రాక్షసులు గావించు మహాబాధకోర్వలేక కొందఱు దశదిశలకుఁ బాఱిరి. కొందఱు సుగ్రీవు నాశ్రయించిరి. ౧౦

సుగ్రీవుండు అట్లు వానరసైనికులు పరాజయంబు నొంది పాఱుటం జూచి తన సమీపంబుననున్న మహోదరునిమీఁదికిఁ బోయెను. ౧౧

మహాతేజుండగు వానరేశ్వరుఁడు సుగ్రీవుండు మహోదర వధార్థమయి పర్వతంబంతటి భయంకరంబగు గొప్పశిలందీసి యాతనిపై వేసెను. ౧౨

అంత మహోదరుండు తనపైకి వచ్చుచున్న భయంకరమయిన యమ్మహాశిలం గని యొంతమాత్రము తొట్రుపాటు నొందక వేగంబున బాణములచే దాని ఖండించెను. ౧౩

అమ్మహాశిల మహోదరుని బాణముచే వేయిపఱియలుగా ఖండింపఁబడి చెల్లాచెదరయిన గద్దలసమూహము నేలకు వ్రాలునట్లు నేలంబడెను. ౧౪

తాం తు భిన్నాం శిలాం దృష్ట్వా సుగ్రీవః క్రోధమూర్ఛితః,
సాల ముత్పాట్య చిక్షేప రాక్షసే రణమూర్ధని. ౧౫
శరైశ్చ విదదారైనం శూరః పరపురఞ్జయః,

స దదర్శ తతః క్రుద్ధః పరిఘం పతితం భువి. ౧౬

ఆవిధ్య తు స తం దీప్తం పరిఘం తస్య దర్శయన్,
పరిఘాగ్రేణ వేగేన జఘానాస్య హయోత్తమాన్. ౧౭

తస్మాద్ధతహయాద్వీర సోఽవప్లుత్య మహారథాత్,
గదాం జగ్రాహ సంక్రుద్ధో రాక్షసోఽథ మహోదరః. ౧౮
గదా పరిఘహస్తౌ తౌ యుధి వీరౌ సమీయతుః,
నర్దన్తౌ గోవృష ప్రఖ్యౌ ఘనా వివ సవిద్యుతౌ. ౧౯

తతః క్రుద్ధో గదాం తస్మై చిక్షేప రజనీచరః,
జ్వలన్తీం భాస్కరాభాసాం సుగ్రీవాయ మహోదరః. ౨౦
గదాం తాం సుమహాఘోరా మాపతన్తీం మహాబలః,
సుగ్రీవో రోషతామ్రాక్షః సముద్యమ్య మహాహవే. ౨౧
ఆజఘాన గదాం తస్య పరిఘేణ హరీశ్వరః,
పపాత స గదోద్భిన్నః పరిఘ స్తస్య భూతలే. ౨౨

తతో జగ్రాహ తేజస్వీ సుగ్రీవో వసుధాతలాత్,
ఆయసం ముసలం ఘోరం సర్వతో హేమభూషితమ్. ౨౩

సుగ్రీవుఁడు తాను బ్రయోగించినశిల యట్లు వ్రక్కలగుటం జూచి కుపితుఁడై రణరంగంబున వృక్షంబొకటి పెల్లగించి మహోదరునిపై వైచెను.

శత్రుపట్టణంబుల జయించునట్టి శూరుండగు నమ్మహోదరుండు బాణంబున నావృక్షమును గూడ ఛేదించెను.

అట్లు వృక్షముగూడ వ్యర్థ మగుటయుం సుగ్రీవుండు కుపితుండై పరిఘ మొకటి నేలం బడియుండుటం గాంచెను. ౧౬

సుగ్రీవుఁడు దేదీప్యమానంబగు నాపరిఘంబుగొని తన హస్తలాఘవంబు మహోదరునకుఁ దెలియఁజూపుచు దాని గిరగిరం ద్రిప్పి దాని శిఖరముచే వేగంబున నతనిగుఱ్ఱంబులం గూల్చెను. ౧౭

అంతఁ బరాక్రమశాలియగు నమ్మహోదరుఁడు గుఱ్ఱములు వోయిన యమ్మహారథమునుండి నేలకుఱికి పరమకుపితుండై గద చేతంగొనెను. ౧౮

పరాక్రమశాలులగు నామహోదరుండును సుగ్రీవుఁడును దేదీప్యమానంబులగు గదయుఁ బరిఘంబును ధరించి యుండుటంజేసి మెఱపులతోఁ గూడిన మేఘంబులకైవడి నొప్పుచు యుద్ధంబున ఆఁబోతులంబోలె నొండొరులం దాఁకిరి. ౧౯

అంత మహోదరుఁడు కుపితుఁడై సూర్యనిభంగి జ్వలించుచున్న తన చేతి గదను సుగ్రీవునిపై వైచెను. ౨౦

అమ్మహాయుద్ధంబున మహాబలశాలియగు వానరేశ్వరుఁడు సుగ్రీవుండు భయంకరమయిన మహోదరుని గద తనపైకి వచ్చుటంజూచి కోపంబునఁ గన్నుల నెఱ్ఱదనంబు గదురఁ బరిఘంబుగొని దానిచే నాగదం గొట్టెను. ౨౧

గదాపరిఘంబులు రెండును ఒండొంటిం దాఁకి భిన్నములయి నేలం బడినవి. ౨౨

అంతఁ బరాక్రమవంతుండగు సుగ్రీవుఁడు నేలపైఁ బడియున్న బంగారుకట్లచే నలంకరింపఁబడిన భయంకరమయిన యినుపరోఁకలి నెత్తుకొనెను. ౨౩

స త ముద్యమ్య చిక్షేప సోఽప్యన్యాభ్యాం వ్యాక్షిప ద్గదామ్,
భిన్నావన్యోన్య మాసాద్య పేతతు ర్ధరణీతలే. ౨౪

తతో భగ్నప్రహరణౌ ముష్టిభ్యాం తౌ సమీయతుః,
తేజోబలసమావిష్టౌ దీప్తా వివ హుతాశనౌ. ౨౫
జఘ్నతు స్తౌ తదాన్యోన్యం నేదతు శ్చ పునఃపునః,
తలై శ్చాన్యోన్య మాహత్య పేతతు ర్ధరణీతలే. ౨౬
ఉత్పేతతు స్తత స్తూర్ణం జఘ్నతుశ్చ పరస్పరమ్,
భుజై శ్చిక్షిపతు ర్వీరా వన్యోన్య మపరాజితౌ. ౨౭

జగ్మతు స్తౌ శ్రమం వీరౌ బాహుయుద్ధే పరంతపౌ,

ఆజహార తదా ఖడ్గ మదూర పరివర్తినమ్. ౨౮
రాక్షస శ్చర్మణా సార్ధం మహావేగో మహోదరః,
తథైవచ మహాఖడ్గం చర్మణా పతితం సహ. ౨౯
జగ్రాహ వానరశ్రేష్ఠ స్సుగ్రీవో వేగవత్తరః,
తౌ తు రోషపరీతాఙ్గౌ నర్దన్తా వభ్యధావతామ్. ౩౦
ఉద్యతాసీ రణే హృ(ష్టౌ యుధి)ష్టా వుభౌ) శస్త్రవిశారదౌ,

దక్షిణం మణ్డలం చోభౌ సుతూర్ణం సంపరీయతుః. ౩౧
అన్యోన్య మభిసంక్రుద్ధౌ జయే ప్రణిహితా వుభౌ,

స తు శూరో మహావేగో వీర్యశ్లాఘీ మహోదరః. ౩౨
మహాచర్మణి తం ఖడ్గం పాతయామాస దుర్మతిః,

ఆ సుగ్రీవుఁడు ఆ ముసలము నెత్తి మహోదరునిపై వేసెను. మహోదరుండును మఱియొక గదను బ్రయోగించెను. ఆ రెండును ఒండొంటిం దాఁకి భిన్నములయి నేలంబడినవి. ౨౪

అంత ఆయుధములు భగ్నములగుటయుం బలపరాక్రమంబుల పెంపున నాసుగ్రీవ మహోదరులు పిడికిటిపోటులతో నొండొరులం దాఁకి పోరిరి. ౨౫

అప్పుడు అమ్మహోదర సుగ్రీవులు మాటిమాటికి బొబ్బలుపెట్టుచు ఒండొరులం గొట్టుకొనుచు నఱచేతుల నొండొరులంజఱచి నేలపడిరి.

అంత ఎప్పుడును బరాజయంబు నొందని వీరులగు నమ్మహోదర సుగ్రీవులు శీఘ్రంబున లేచి యొండొరులం బ్రహారింపుచు నొకరి నొకరు భుజంబుల నెత్తి విసరివైచిరి. ౨౭

పరాక్రమవంతులును శత్రువులం బొరిగొనువారలునగు నమ్మహోదర సుగ్రీవులు అట్లు బాహుయుద్ధంబు చేసిచేసి యలసటనొందిరి.

అంత మహావేగుండగు మహోదరుఁడు సమీపంబున నేలంబడియున్న ఖడ్గంబును బలుకయుం గ్రహించెను. ౨౮

మహోదరునికన్న మఱియు వేగవంతుండగు వానరోత్తముఁడు సుగ్రీవుండును అట్లు నేలంబడియున్న మహాఖడ్గంబును డాలును గ్రహించెను. ౨౯

ఆయుధవిద్యయందుఁ బండితులగు నమ్మహోదర సుగ్రీవులు ఖడ్గములు దాల్చి యుద్ధంబు విషయమయి సంతోషంబు గదుర రోషంబుప్పొంగ గర్జించుచు నొండొరుల మార్కొనిరి. ౩౦

ఆ మహోదరసుగ్రీవులు ఒండొలపైఁ గోపంబు వహించి యొకరి నొకరు జయించు తమకంబున శీఘ్రగతులఁ బ్రదక్షిణంబుగాను అప్రదక్షిణంబుగాను మండలంబులు దిరుగుచుఁ బోరిరి. ౩౧

శూరుండును వేగవంతుఁడునగు నమ్మహోదరుఁడు పరాక్రమగర్వంబునం జేసి సూక్ష్మబుద్ధికాఁడు కావున ఖడ్గంబును గుఱిదప్పి సుగ్రీవునిచేతి డాలుమీఁద వేసెను. ౩౨

లగ్న ముత్కృష్ణతః ఖడ్గం ఖడ్గేన కపికుఞ్జరః. 33
జహార సశిరస్త్రాణం కుణ్డలోపహితం శిరః,

నికృత్తశిరస స్తస్య పతితస్య మహీతలే. 34
తద్బలం రాక్షసేన్ద్రస్య దృష్ట్వా తత్ర న తిష్ఠతే,
హత్వా తం వానరై స్సార్ధం ననాద ముదితో హరిః. 35
చుక్రోధ చ దశగ్రీవో బభౌ హృష్ట శ్చ రాఘవః,

విషణ్ణవదనా స్సర్వే రాక్షసా దీనచేతసః. 36
మహోదరం తం వినిపాత్య భూమౌ
మహాగిరేర్గ కీర్ణ మివైకదేశమ్,
సూర్యాత్మజ స్తత్ర రరాజ లక్ష్మ్యా
సూర్య స్స్వతేజోభి రివా ప్రధృష్యః. 37
అథ విజయ మవాప్య వానరేన్ద్రః
స్సమరముఖే సురసిద్ధయక్షసఙ్ఘైః,
అవనితలగతై శ్చ భూతసఙ్ఘై
ర్హర్షసమాకులితైః స్తుతో మహాత్మా. 38

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డేఽష్టనవతితమస్సర్గః. ౯౮.

---

## ఏకోనశతతమస్సర్గః.

మహోదరే తు నిహతే మహాపార్శ్వో మహాబలః,
సుగ్రీవేణ సమీక్ష్యాథ క్రోధా త్సంరక్తలోచనః. 1
అఙ్గదస్య చమూం భీమాం క్షోభయామాస సాయకైః,

అంత మహోదరుండు పలుకయందుఁ గ్రుచ్చుకొన్న ఖడ్గంబు లాగు చుండఁగా నింతలో వానరోత్తముఁడు సుగ్రీవుఁడు బొమిడికముతోఁ గూడి నదియుఁ గుండలాలంకృతంబగు నతని తలం దెగవ్రేసెను. ౩౩

అట్లు మహోదరుఁడు తల దెగి నేలంబడుటను జూచి రావణుని సేన యచట నిలువక పరుగెత్తెను. ౩౪

మహోదరుని వధించి సుగ్రీవుఁడు సంతోషంబున వానరులతోఁ గూడ సింహనాదంబు గావించెను. రావణుం డది చూచి కుపితుఁడయ్యెను. రాముఁడు ప్రహర్షంబు నొందెను. ౩౫

అంత రాక్షసులందఱు దీనులయి ముఖములు వెలవెలం బోవ దుఃఖితు లయి భయంబునఁ బరుగెత్తిరి. ౩౬

ఆ వానరసేనయందు సూర్యకుమారుఁడగు సుగ్రీవుఁడు మహాపర్వతంబు యొక్క కొంతభాగమును బడఁద్రోయునట్లు అమ్మహోదరుని నేలంబడ వైచి సూర్యుఁడు తన తేజస్సుచేఁ బ్రకాశించునట్లు జయలక్ష్మిచే నెంతయుం నొప్పెను. ౩౭

అంత యుద్ధంబున విజయంబు నొంది వెలుంగుచున్న మహాపరాక్రమ శాలియగు వానరేశ్వరు సుగ్రీవుని, ఆకాశంబునందలి దేవతలును యక్షులును సిద్ధులును భూమియందలి ప్రాణివర్గంబులును బరమసంతోషంబునం బ్రస్తుతించిరి. ౩౮

ఇది తొంబదితొమ్మిదవసర్గము.

## తొంబదితొమ్మిదవసర్గము.

సుగ్రీవునిచే మహోదరుఁడు హతుఁడగుటఁ జూచి మహాబలుఁ డగు మహాపార్శ్వుండు కోపంబునం గన్నులఁ గెంపు గదుర భయంకరమయిన యంగదుని సైన్యముఁ జొచ్చి బాణంబులచే నొప్పించెను. ౧

స వానరాణాం ముఖ్యానా ముత్తమాఙ్గాని సర్వశః. ౨
పాతయామాస కాయేభ్యః ఫలం వృన్తాదివానిలః,
కేషాం చి దిషుభి ర్బాహూన్ స్కన్ధాం శ్చిచ్ఛేద రాక్షసః. 3
వానరాణాం సుసఙ్క్రుద్ధః పార్శ్వం కేషాం వ్యదారయత్,

తేఽర్దితా బాణవర్షేణ మహాపార్శ్వేన వానరాః. ౪
విషాదవిముఖాః సర్వే బభూవు ర్గతచేతసః,
నిరీక్ష్య బల ముద్విగ్న మఙ్గదో రాక్షసార్దితమ్. ౫
వేగం చక్రే మహాబాహు స్సముద్ర ఇవ పర్వణి,

ఆయసం పరిఘం గృహ్య సూర్యరశ్మి సమప్రభమ్. ౬
సమరే వానరశ్రేష్ఠో మహాపార్శ్వే న్యపాతయత్,

స తు తేన ప్రహారేణ మహాపార్శ్వో విచేతనః. ౭
స సూత స్స్యన్దనా త్తస్మా ద్విసంజ్ఞః ప్రాపత ద్భువి,
స ఋక్షరాజ స్తేజస్వీ నీలాఞ్జనచయోపమః. ౮
నిష్పత్య సుమహావీర్య స్స్వా ద్యూథా న్మేఘసన్నిభాత్,
ప్రగృహ్య గిరిశృఙ్గాభాం క్రుద్ధ స్స విపులాం శిలామ్. ౯
అశ్వాఞ్జఘాన తరసా స్యన్దనం చ బభఞ్జ తమ్,

ముహూర్తా ల్లబ్ధసంజ్ఞస్తు మహాపార్శ్వో మహాబలః. ౧౦
అఙ్గదం బహుభి ర్బాణై ర్భూయ స్తం ప్రత్యవిధ్యత,

జామ్బవ న్తం త్రిభిర్బాణై రాజఘాన స్తనా న్తరే. ౧౧
ఋక్షరాజం గవాక్షం చ జఘాన బహుభి శ్శరైః,

ఆమహాపార్శ్వుఁడు వాయువు ఫలంబులను దొడిమలనుండి పడఁద్రోయు నట్లు మేటివానరవీరులతలలను మేనులనుండి బాణంబులచేఁ బడవైచెను. ౨

ఆమ్మహాపార్శ్వుండు పరమకుపితుఁడై కొందఱి వానరులయొక్క బాహువులను కొందఱి స్కంధములను కొందఱి డొక్కలను బాణంబులచే ఛేదించెను. ౩

ఆవానరులందఱు అట్లు మహాపార్శ్వునిచే బాణవర్షంబుల నొప్పింపఁ బడి యోర్వఁజాలక దుఃఖంబునంజేసి యుద్ధవిముఖులయి మూర్ఛితులయిరి. ౪

మహాబాహుండగు నంగదుఁడు తనసైన్యము విరూపాక్షునివలన నొచ్చి భయంబు నొందియుండుటంగని సముద్రము పర్వకాలంబున నుప్పొంగునట్లు మహావేగంబు గావించెను. ౫

వానరోత్తముండగు నంగదుఁడు యుద్ధంబున బంగారు కట్టు వేసి యుండుటంజేసి సూర్యకిరణంబులంబోలి వెలుంగుచున్న యినుపగుదియందీసి మహాపార్శ్వునిపయిం బడవైచెను. ౬

దురాత్ముండగు నమ్మహాపార్శ్వుండు ఆదెబ్బకు సారథి సహితంబుగా మూర్ఛితుఁడై యరదంబునుండి నేలంబడెను. ౭

మహాబలుఁడును కాటుకరాశివలె నల్లని మేనుగలవాఁడును మహాపరాక్రమశాలియునగు గవాక్షుఁడును జాంబవంతుఁడును మేఘంబువలె నల్లగానున్న తమ భల్లూకసైన్యమునుండి వెడలి క్రుద్ధులై పర్వతశిఖరసమానంబగు గొప్పశిలం జేసికొని వేగంబున మహాపార్శ్వుని గుఱ్ఱంబులను గూల్చి రథంబును నుగ్గుగావించిరి. ౮,౯

మహాబలశాలియగు మహాపార్శ్వుండు అంతఁ గొంతవడికి తెలివొంది యయ్యంగదునిపైఁ బెక్కుబాణములు ప్రయోగించి మిక్కిలియు నొప్పించెను. ౧౦

ఆమహాపార్శ్వుండు భల్లూకేశ్వరుఁడగు జాంబవంతుని వక్షంబునందు మూఁడుబాణంబులను గవాక్షునిఁ బెక్కుబాణంబులను నొప్పించెను. ౧౧

జామ్బవన్తం గవాక్షం చ స దృష్ట్వా శరపీడితౌ. ౧౨
జగ్రాహ పరిఘం ఘోర మఙ్గదః క్రోధమూర్ఛితః,

తస్యాఙ్గదః ప్రకుపితో రాక్షసస్య తమాయసమ్. ౧౩
దూరస్థితస్య పరిఘం రవిరశ్మిసమప్రభమ్,
ద్వాభ్యాం భుజాభ్యాం సఙ్గృహ్య భ్రామయిత్వా చ వేగవాన్.
మహాపార్శ్వస్య చిక్షేప వధార్థం వాలిన స్సుతః,
స తు క్షిప్తో బలవతా పరిఘ స్తస్య రక్షసః. ౧౫
ధనుశ్చ సశరం హస్తా చ్ఛిరస్త్రం చాప్యపాతయత్,

తం సమాసాద్య వేగేన వాలిపుత్త్రః ప్రతాపవాన్. ౧౬
తలే నాభ్యహన త్క్రుద్ధః కర్ణమూలే సకుణ్డలే,

స తు క్రుద్ధో మహావేగో మహాపార్శ్వో మహాద్యుతిః. ౧౭
కరేణైకేన జగ్రాహ సుమహాన్తం పరశ్వధమ్,

తం తైలధౌతం విపులం శైలసారమయం దృఢమ్. ౧౮
రాక్షసః పరమక్రుద్ధో వాలిపుత్త్రే న్యపాతయత్,

తేన వామాంసఫలకే భృశం ప్రత్యవపాదితమ్. ౧౯
అఙ్గదో మోక్షయామాస సరోష స్స పరశ్వధమ్,

సవీరో వజ్రసఙ్కాశ మఙ్గదో ముష్టి మాత్మనః. ౨౦
సంవర్తయత్సుసంక్రుద్ధః పితృతుల్యపరాక్రమః,

అట్లు జాంబవంతుఁడును గవాక్షుఁడును బాణములచే నొంపఁబడుటఁ జూచి యంగదుఁడు పరమకుపితుఁడై భయంకరాకారంబగు పరిఘంబు గ్రహించెను. ౧౨

వేగవంతుఁడగు వాలికుమారుఁ డంగదుఁడు కోపించి మహాపార్శ్వుని వధార్థమయి యతఁడు దూరంబుననున్నాఁడు కావున సూర్య కిరణంబులవలె బంగారుకట్లతోఁ బ్రకాశించుచున్న యాయినుపగుదియనుబట్టి రెండు చేతుల తోను గిరగిరం ద్రిప్పి యతనిపైఁ బడవైచెను. ౧౩,౧౪

బలవంతుఁడగు నంగదుని బాహువునుండి వెడలి యమ్మహాపరిఘము మహాపార్శ్వునిచేతి బాణసహితమైన ధనుస్సును అతని శిరస్సున నుండు బొమిడికమునుం బడవైచెను. ౧౫

అంత మహాపరాక్రమశాలియగు వాలికుమారుఁడైన యంగదుఁడు వేగంబున మహాపార్శ్వుని సమీపంబునకుఁబోయి కుండలాలంకృతంబగు నతని కర్ణమూలంబున నఱచేతం జఱచెను. ౧౬

అధికమయిన వేగముగలవాఁడును అధికమయిన కాంతిగలవాఁడునగు నమ్మహాపార్శ్వుఁడు కోపించి భయంకరమయిన గండ్రగొడ్డలిని చేతం గొనెను. ౧౭

అట్లు పరమకుపితుఁడై యమ్మహాపార్శ్వుండు ప్రతిదినమును నూనె పూయుచుండుటవలన నతి తీక్ష్ణంబై స్వచ్ఛంబై పర్వతసారమువలె నతి కఠిన మయి దృఢమయియున్న యా పరశ్వథము నంగదునిపై వేసెను. ౧౮

అమ్మహాపార్శ్వుఁడు అట్లు అంగదుని యెడమభుజశిఖరంబుమీఁద నప్పరశ్వథంబుఁ బూని వేగంబున వేయుటయు అంగదుఁడు కుపితుఁడై లాఘ వంబున వ్రేటు దప్పించుకొనెను. ౧౯

తన తండ్రియయినవాలితో సమానమయిన పరాక్రమంబుగల శూరుఁ డగు నయ్యంగదుఁడు కోపించి వజ్రాయుధమువంటి యతికఠినమయిన పిడికిలి యలవరించెను. ౨౦

రాక్షసస్య స్తనాభ్యాశే మర్మజ్ఞో హృదయం ప్రతి. ౨౧
ఇన్ద్రాశనిసమస్పర్శం స ముష్టిం విన్యపాతయత్,

తేన తస్య నిపాతేన రాక్షసస్య మహామృధే. ౨౨
పఫాల హృదయం చాశు స పపాత హతో భువి,
తస్మి న్నిపతితే భూమౌ తత్సైన్యం సంప్రచుక్షుభే. ౨౩
అభవచ్చ మహాన్క్రోధ స్సమరే రావణస్య తు,

వానరాణాం చ హృష్టానాం సింహనాద శ్చ పుష్కలః. ౨౪
స్ఫోటయ న్నివ శబ్దేన లఙ్కాం సాట్టాలగోపురామ్,
మహేన్ద్రేణేవ దేవానాం నాద స్సమభవ న్మహాన్. ౨౫

అథేన్ద్రశత్రు స్త్రిదివాలయానాం
వనౌకసాం చైవ మహాప్రణాదమ్,
శ్రుత్వా సరోషం యుధి రాక్షసేన్ద్రః
పునశ్చ యుద్ధాభిముఖోఽవతస్థే. ౨౬

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే ఏకోనశతతమస్సర్గః. ౯౯.

---

## శతతమస్సర్గః.

మహోదరమహాపార్శ్వౌ హతౌ దృష్ట్వా తు రాక్షసౌ,
తస్మింశ్చ నిహతే వీరే విరూపాక్షే మహాబలే. ౧
ఆవివేశ మహాన్క్రోధో రావణం తు మహామృధే,
సూతం సంచోదయామాస వాక్యం చేద మువాచ హ. ౨

నిహతానా మమాత్యానాం రుద్ధస్య నగరస్య చ,
దుఃఖ మేషోఽపనేష్యామి హత్వా తౌ రామలక్ష్మణౌ. ౩

ఆయ్యంగదుఁడు జీవస్థానంబులు చక్కఁగాఁ దెలిసినవాఁడు కావున మహాపార్శ్వుని వక్షస్స్థలంబున గుండెకాయకుసరిగా దేవేంద్రుని వజ్రాయుధముతో సమానమయిన పిడికిటం బొడిచెను. ౨౧

అమ్మహాయుద్ధంబున అ య్యంగదుని పిడికిటిపోటునకు మహాపార్శ్వుఁడు గుండెకాయ పగిలి ప్రాణంబులు వీడి నేలం గూలెను. ౨౨

ఆమహాపార్శ్వుఁడు నేలం గూలఁగానే యారాక్షససేన యంతయుం భయమునొందెను; అప్పుడు యుద్ధంబున రావణునకు మిక్కిలియుఁ గోపంబు గలిగెను. ౨౩

అప్పుడు వానరులు సంతుష్టులయి కోటబురుజులతోను బురద్వారంబులతోను లంకాపురంబంతయుఁ బగులునో యన్నట్లు మహాధ్వనిగా సింహనాదంబు గావించిరి; దేవేంద్రునితోఁగూడ దేవతలును సంతోషంబున మహానాదంబు గావించిరి. ౨౪,౨౫

దేవేంద్రశత్రువయిన రాక్షసేశ్వరుఁడు రావణుఁడు అట్లు దేవేంద్రసహితంబుగా దేవతలును వానరులును సంతోషంబునఁ గావించిన మహాధ్వని విని కోపించి మరల యుద్ధంబున కభిముఖుఁడై నిలిచెను. ౨౬

ఇది తొంబదితొమ్మిదవసర్గము.

---

## నూఱవసర్గము.

రావణుఁడు మహాబలశాలియగు వీరుఁ డవ్విరూపాక్షుఁడు హతుఁడగుటయు మహోదరుఁడును మహాపార్శ్వుఁడును బడుటయుం జూచి యమ్మహాయుద్ధంబునఁ బరమకుపితుఁడయ్యెను. ౧

ఆరావణుఁడు సారథిని రథముదోలుమనిచెప్పి యీ వచనముం బలికెను. ౨

ఇదిగో నేను ఇప్పుడు రామలక్ష్మణులను వధించి యిదివఱకు హతులయిన మిత్రులకును వానరసేనచే ముట్టడింపఁబడియున్న పట్టణంబునందలి

రామవృక్షం రణే హన్మి సీతాపుష్పఫలప్రదమ్,
ప్రశాఖా యస్య సుగ్రీవో జామ్బవాన్కుముదో నళః. ౪
మైన్దశ్చ ద్వివిద శ్చైవ హ్యఙ్గదో గన్ధమాదనః,
హనూమాం శ్చ సుషేణ శ్చ సర్వే చ హరియూథపాః. ౫
స దిశో దశ ఘోషేణ రథస్యాతిరథో మహాన్,
నాదయన్ ప్రయయౌ తూర్ణం రాఘవం చాభ్యవర్తత. ౬

పూరితా తేన శబ్దేన సనదీగిరికాననా,
సంచచాల మహీ సర్వా సవరాహమృగద్విపా. ౭

తామసం స మహాఘోరం చకారాస్త్రం సుదారుణమ్,
నిర్దదాహ కపీన్ సర్వాం స్తే ప్రపేతు స్సమన్తతః. ౮

ఉత్పపాత రజో ఘోరం తై ర్భగ్నై స్సంప్రధావితైః,
న హి త త్సహితుం శేకు ర్బ్రహ్మణా నిర్మితం స్వయమ్. ౯

తాన్యనీకాన్యనేకాని రావణస్య శరోత్తమైః,
దృష్ట్వా భగ్నాని శతశో రాఘవః పర్యవస్థితః. ౧౦

తతో రాక్షసశార్దూలో విద్రావ్య హరివాహినీమ్,
స దదర్శ తతో రామం తిష్ఠన్త మపరాజితమ్. ౧౧
లక్ష్మణేన సహ భ్రాత్రా విష్ణునా వాసవం యథా,
ఆలిఖన్త మివాకాశ మవష్టభ్య మహ ద్ధనుః. ౧౨
పద్మపత్త్రవిశాలాక్షం దీర్ఘబాహు మరిన్దమమ్,

జనులకును దుఃఖనివారణంబు గావించెదను. ౩

ఏవృక్షంబునకు సుగ్రీవుండు జాంబవంతుఁడు కుముదుండు నళుండు మైందద్వివిదులు అంగదుండు గంధమాదనుండు హనుమంతుఁడు సుషేణుఁడు మొదలగు వానరవీరులందఱు చిన్నశాఖలగుచున్నారో, అట్టి సీతయను పుష్ప ఫలంబుల నొసంగునట్టి రామవృక్షంబు నిపుడు యుద్ధంబున ఖండించెదను.

పెక్కువిలుకాండ్రతోఁ బోరునట్టి మహావీరులలో నుత్తముఁడగు నారావణుఁడు రథధ్వనిచే దశదిశలును ధ్వనింప శీఘ్రంబున రాముని మీఁదికిఁ బోయెను. ౬

అమ్మహాధ్వనిచేఁ బూరితమయి నదులతోను బర్వతంబులతోను అరణ్యంబులతోను వరాహంబులతోను జింకలతోను గజంబులతోనుం గూడిన భూమి యంతయుఁ జలనంబునొందెను. ౭

ఆరావణుఁడు మహాభయంకరంబును లోకనాశనంబునగు తామసాస్త్రంబు ప్రయోగించుటయు వానరులందఱు అయ్యస్త్రవేగంబుచే దగ్ధులై పడ నారంభించిరి. ౮

ఆ తామసాస్త్రము సాక్షాద్బ్రహ్మదేవుఁడు నిర్మించినది కావున వానరులు దాని సహింపఁ జాలక భయంబునొంది పరుగెత్తుటయు అందువలన నప్పుడు భయంకరముగాఁ బరాగంబు రేఁగెను. ౯

అట్లు వానరసైన్యములు అనేకములు లెక్కలేక రావణుని బాణంబులచే భంగము నొందుటం జూచి రాముండు యుద్ధమునకు సన్నద్ధుండయ్యెను. ౧౦

రావణుం డట్లు వానరసైన్యంబులఁ బాఱఁదోలి యంత ఎప్పుడును బరాజయము లేనివాఁడును దమ్ముఁడు లక్ష్మణునితోఁగూడ నిలుచుండి విష్ణుసహితుండగు దేవేంద్రునిభంగి నొప్పుచున్నవాఁడును అత్యున్నతంబగు ధనువు చేతం బూనినవాఁడగుటచే నాకాశంబు నొరయునట్లు చూపట్టుచున్నవాఁడును దామరపూఱేకులుంబోలె విశాలసుందరంబులగు నయనంబులవాఁడునుఁ

తతో రామో మహాతేజా స్సౌమిత్రిసహితో బలీ. ౧3
వానరాంశ్చ రణే భగ్నా నాపతన్తం చ రావణమ్,
సమీక్ష్య రాఘవో హృష్టో మధ్యే జగ్రాహ కార్ముకమ్. ౧౪

విస్ఫారయితు మారేభే తత స్స ధను రుత్తమమ్,
మహావేగం మహానాదం నిర్భిన్ద న్నివ మేదినీమ్. ౧౫
రావణస్య చ బాణౌఘై రామవిస్ఫారితేన చ,
శబ్దేన రాక్షసా స్తే తు పేతుశ్చ శతశ స్తదా. ౧౬

తయో శ్శరపథం ప్రాప్తో రావణో రాజపుత్త్రయోః,
స (బభౌచ)బభూవ యథా రాహు స్సమీపే శశిసూర్యయోః
త మిచ్ఛన్ప్రథమం యోద్ధుం లక్ష్మణో నిశితై శ్శరైః,
ముమోచ ధను రాయమ్య శరా నగ్నిశిఖోపమాన్. ౧౭

తా న్ముక్తమాత్రా నాకాశే లక్ష్మణేన ధనుష్మతా,
బాణా న్బాణై ర్మహాతేజా రావణః ప్రత్యవారయత్. ౧౮
ఏకమేకేన బాణేన త్రిభి స్త్రీన్ దశభి ర్దశ,
లక్ష్మణస్య ప్రచిచ్ఛేద దర్శయ న్పాణిలాఘవమ్. ౨౦

అభ్యతిక్రమ్య సౌమిత్రిం రావణ స్సమితింజయః,
ఆససాద తతో రామం స్థితం శైల మివాచలమ్. ౨౧
స సఙ్ఖ్యే రామ మాసాద్య క్రోధసంరక్తలోచనః,
వ్యసృజ చ్ఛరవర్షాణి రావణో రాఘవోపరి. ౨౨

మ్రోఁకాళ్లవఱకు వ్రేలుకాడు దీర్ఘబాహువులు గలవాఁడును శత్రుహంతయునగు రాముం గాంచెను. ౧౧,౧౨

అంత మహాతేజుండును బలవంతుఁడును లక్ష్మణసహితుండునగు రాముండు యుద్ధంబున వానరులు భయంబున నోడుటయుం రావణుఁడు తనయొద్దకు వచ్చుటయుం జూచి రావణునితోఁ బోరఁగలిగెనని సంతుష్టుండై ధనుస్సును నడుమంబట్టెను. ౧౩,౧౪

అంత రాముఁడు మహావేగంబగు నమ్మహాధనువు నారిసారించుటయు ఆమ్మహాధ్వని భూమిని భేదించునట్లు భయంకరంబయి యొప్పెను. ౧౫

అప్పుడు రావణుని బాణప్రయోగంబులవలనను రాముని ధనుర్విస్ఫారణంబువలనను బుట్టినధ్వనికే వానరులును రాక్షసులును బెక్కండ్రు గుంపులు గుంపులుగాఁ బడిరి. ౧౬

ఆరావణుఁడు రామలక్ష్మణులయెదుట నిలిచినప్పుడు అమావాస్యయందుఁ జంద్రసూర్యుల సమీపంబుననున్న రాహువువలెఁ బ్రకాశించెను ౧౭

లక్ష్మణుఁడు మొదటఁ దాను రావణునితోఁ గఱకుటమ్ములం బోరఁ గోరి ధనువు నాకర్షించి యతనిపై అగ్నిజ్వాలాసమానంబులగు బాణంబులం బ్రయోగించెను. ౧౮

లక్ష్మణుఁడు ప్రయోగించినంతనె యాబాణంబులను మహాపరాక్రమశాలియగు రావణుఁడు ఆకాశంబుననె బాణంబులచే నివారించెను. ౧౯

రావణుఁడు తనహస్తలాఘవంబుకలిమిఁ జూపుచు లక్ష్మణుని బాణంబుల ఒకబాణంబు నొకబాణంబునను మూఁటిని మూఁటను బదింటిని బదింటను ఇట్లెన్ని బాణంబుల కన్నిబాణంబులేసి ఖండించెను. ౨౦

అంత శత్రుసమూహంబుల జయించునట్టి రావణుఁడు లక్ష్మణునతిక్రమించి పర్వతంబువలె నిశ్చలుండై నిలుచున్నరామునిమీఁదికిఁ బోయెను. ౨౧

రావణుఁ డట్లు రామునిసమీపంబునొంది కోపంబునం గన్నుల నెఱ్ఱబడనంబుగదుర రామునిమీఁద బాణవర్షంబులు గురిసెను.

శరధారా స్తతో రామో రావణస్య ధనుశ్చ్యుతాః,
దృష్ట్వైవాపతత శ్శీఘ్రం భల్లాన్ జగ్రాహ సత్వరమ్. ౨౩

తాన్ శరౌఘాం స్తతో భల్లై స్తీక్ష్ణై శ్చిచ్ఛేద రాఘవః,
దీప్యమానా న్మహాఘోరా న్క్రుద్ధా నాశీవిషా నివ. ౨౪

రాఘవో రావణం తూర్ణం రావణో రాఘవం తదా,
అన్యోన్యం వివిధై స్తీక్ష్ణై శ్శరై రభివవర్షతుః. ౨౫

చేరతు శ్చ చిరం చిత్రం మణ్డలం సవ్యదక్షిణమ్,
బాణవేగా త్సముత్క్షిప్తా వన్యోన్య మపరాజితౌ. ౨౬

తయో ర్భూతాని విత్రేసు ర్యుగపత్సంప్రయుధ్యతోః,
రౌద్రయో స్సాయకముచో ర్యమా న్తకనికాశయోః. ౨౭

స న్తతం వివిధై ర్బాణై ర్బభూవ గగనం తదా,
ఘనై రివాతపాపాయే విద్యున్మాలా సమాకులైః. ౨౮
గవాక్షిత మివాకాశం బభూవ శరవృష్టిభిః,

మహావేగై స్సుతీక్ష్ణాగ్రై ర్గృధ్రపత్రై స్సువాజితైః. ౨౯
శరాన్ధకారం తౌ భీమం చక్రతు స్సమరం తదా,
గతే౽ స్తం తపనే చాపి మహామేఘావివోత్థితౌ. ౩౦

బభూవ తుములం యుద్ధ మన్యోన్యవధకాఙ్క్షిణోః,

అంత రావణునిచేఁ బ్రయోగింపఁబడి జలధారలవలె నిరంతరంబుగా వేగంబున వచ్చుచున్న బాణంబులంజూచి రాముఁడు శీఘ్రంబున నమ్ములపొదినుండి కత్తివాతిబాణంబులం దీసెను. ౨౩

అంత రాముఁడు దేదీప్యమానంబులయి కుపితంబులగు సర్పంబులవగిది మహాభయంకరంబులయిన యా బాణంబులను తీక్ష్ణంబులగు భల్లంబులచే ఖండించెను. ౨౪

అప్పుడు రాముఁడు రావణునిమీఁదను రావణుఁడు రామునిమీఁదను ఇట్లిర్వురు ఒకరిమీఁద నొకరు నానావిధములగు కఱకుటమ్ములను వేగంబున వర్షించిరి. ౨౫

అప్రతిహతులగు నారామరావణులు ఒకరిబాణంబుల నొకరు నివారించుచు బహుకాలమువఱకు చిత్రముగా సవ్యాపసవ్యమండలంబులు దిరుగుచుఁ బోరిరి. ౨౬

అట్లు రామరావణులు ప్రలయకాలమునందుఁ బ్రజలం బోరిగొను యములంబోలె భయంకరాకారులయి బాణంబులు ప్రయోగింపుచుఁ బోరుచుండుటంజూచి సమస్తభూతంబులును భయంబు నొందినవి. ౨౭

వర్షాకాలంబున మెఱపులతోఁ గూడిన మేఘంబులు నిండునట్లు ఆకాశంబున నపుడు నానావిధబాణంబులు నిండియుండినవి. ౨౮

ఆకాశంబున బాణంబులు నిండి నడుమ నడుమ నవకాశములుండుటచేఁ గిటికీలు నిర్మించినట్లుండెను.

సూర్యుఁ డస్తమించినవెనుక గొప్పమేఘంబులు ధారలుగా వర్షించి మఱియుఁ జీకటిగాఁ జేయునట్లు అప్పుడా రామరావణులు మహావేగంబులును మిక్కిలియుఁ దీక్ష్ణంబులును మంచి గద్దలఱెక్కలు గట్టినవియునగు బాణంబులు దట్టముగాఁ బ్రయోగించి యుద్ధంబంతయు గాఢాంధకారము గలిగి భయంకరమగునట్లు గావించిరి. ౨౯,౩౦

అపుడు రావణుఁడును రాముఁడును ఒకరినొకరు వధింపఁగోరి

అనాసాద్య మచిన్త్యం చ వృత్రవాసవయో రివ. 31

ఉభౌ హి పరమేష్వాసా వుభౌ శస్త్రవిశారదౌ,
ఉభావస్త్రవిదాం ముఖ్యా వుభౌ యుద్ధే విచేరతుః. 32

ఉభౌ హి యేన వ్రజత స్తేన తేన శరోర్మయః,
ఊర్మయో వాయునా విద్ధా జగ్ము స్సాగరయో రివ. 33

తత స్సంసక్తహస్త స్తు రావణో లోకరావణః,
నారాచమాలాం రామస్య లలాటే ప్రత్యముఞ్చత. 34
రౌద్రచాపప్రయుక్తాం తాం నీలోత్పలదళప్రభామ్,
శిరసా ధారయ న్రామో న వ్యథాం ప్రత్యపద్యత. 35

అథ మన్త్రా నభిజప న్రౌద్ర మస్త్ర ముదీరయన్,
శరా న్భూయ స్సమాదాయ రామః క్రోధసమన్వితః. 36
ముమోచ చ మహాతేజా శ్చాప మాయమ్య వీర్యవాన్,
తే మహామేఘసఙ్కాశే కవచే పతితా శ్శరాః. 37
అవధ్యే రాక్షసేన్ద్రస్య న వ్యథాం జనయం స్తదా,
పునరేవాథ తం రామో రథస్థం రాక్షసాధిపమ్. 38
లలాటే పరమాస్త్రేణ సర్వాస్త్రకుశలో రణే,

తే భిత్త్వా బాణరూపాణి పఞ్చశీర్షా ఇవోరగాః. 39
శ్వసన్తో వివిశు ర్భూమిం రావణప్రతికూలితాః,

నిహత్య రాఘవస్యాస్త్రం రావణః క్రోధమూర్ఛితః. 40

వృత్రుఁడును ఇంద్రుఁడునుంబోలె భయంకరంబుగాఁ బోరిరి. అయ్యుద్ధంబు ఎవ్వరికిని సమీపింప నలవిగానిదియుఁ నచింత్యంబు నయ్యె. ౩౧

ఆరామ రావణులు ఇద్దఱును గొప్ప విలుకాండ్రు. ఇద్దఱును సమస్తాయుధములందును సమర్థులు. ఇద్దఱును దివ్యాస్త్రములు తెలిసినవారిలో నుత్తములు కావున ఇద్దఱును యుద్ధంబున సమానముగా విహరించిరి. ౩౨

రామరావణు లిద్దఱును యేమండలగతులం దిరుగుదురో ఆయావైపున నుండి సముద్రంబుల వాయువేగంబుచేఁ దరంగంబులు లేచునట్లు బాణపరంపరలు వెడలుచుండినవి. ౩౩

అంత లోకంబుల నేడ్పించునట్టి రావణుఁడు బాణప్రయోగంబునందు లాఘవంబున రాముని లలాటమునందు బాణపఙ్క్తిని జొప్పించెను. ౩౪

రాముఁడు రావణునిచే భయంకరమయి మహాధనుస్సునం బ్రయోగింపఁబడిన నల్లగలువల రేకులం బోలియున్న యాబాణంబులు తనశిరస్సున నాటియున్నను ఎంతమాత్రము వ్యథనొందఁడయ్యెను. ౩౫

అంత మహాతేజుఁడును మహాపరాక్రమశాలియునగు రాముఁడు కుపితుఁడై రౌద్రాస్త్రమంత్రంబుల జపింపుచుఁ బెక్కుబాణంబులందీసి ధనువు నాకర్షించి రావణునిపయిం బ్రయోగించెను. ౩౬

ఆబాణంబులు మహామేఘసమానంబగు రావణుని యభేద్యకవచముం దాఁకి యతని కెంతమాత్రము బాధ కలిగింపవయ్యె. ౩౭

అంత యుద్ధంబున సమస్తాస్త్రంబులందును బండితుఁడగు రాముఁడు మరల రథగతుఁడగు రావణుని లలాటంబు నుద్దేశించి యుత్తమాస్త్రంబుచే నభిమంత్రించి బాణంబులం బ్రయోగించెను. ౩౮

ఆబాణములు రావణునిచే నివారింపఁబడినవై రావణప్రయుక్తంబులగు బాణంబుల భేదించి కుపితంబులయి యూర్పులు పుచ్చుచున్న యయిదుతలల పాములభంగి భూమిం జొచ్చినవి. ౩౯

రావణుఁడు రాముఁడు ప్రయోగించిన యస్త్రంబు నివారించి కుపి

ఆసురం సుమహాఘోర మస్త్రం ప్రాదుశ్చకార హ,
సింహవ్యాఘ్రముఖాం శ్చాన్యా న్కఙ్కకాకముఖా నపి. ౪౧
గృధ్రశ్యేనముఖాం శ్చాపి సృగాలవదనాం స్తథా,
ఈహామృగముఖాం శ్చాన్యా న్వ్యాదితాస్యా న్భయానకాన్.
పఞ్చాస్యా న్లేలిహానాంశ్చ ససర్జ నిశితాన్ శరాన్,

శరా న్ఖరముఖాం శ్చాన్యా న్వరాహముఖసంస్థితాన్. ౪౩
శ్వానకుక్కుటవక్త్రాం శ్చ మకరాశీవిషాననాన్,
ఏతానన్యాంశ్చ మాయావీ ససర్జ నిశితాన్ శరాన్. ౪౪
రామం ప్రతి మహాతేజాః క్రుద్ధ స్సర్ప ఇవ శ్వసన్,

ఆసురేణ సమావిష్ట స్సోఽస్త్రేణ రఘునన్దనః. ౪౫
ససర్జాస్త్రం మహోత్సాహః పావకం పావకోపమః,

అగ్నిదీప్తముఖా న్బాణాం స్తథా సూర్యముఖా నపి. ౪౬
చన్ద్రార్ధచన్ద్రవక్త్రాంశ్చ ధూమకేతుముఖా నపి,
గ్రహనక్షత్రవక్త్రాంశ్చ మహోల్కాముఖసంస్థితాన్. ౪౭
విద్యుజ్జిహ్వోపమాంశ్చాన్యాన్ ససర్జ నిశితాన్ శరాన్,

తే రావణశరా ఘోరా రాఘవాస్త్రసమాహతాః. ౪౮
విలయం జగ్ము రాకాశే జగ్ముశ్చైవ సహస్రశః,

తదస్త్రం నిహతం దృష్ట్వా రామేణాక్లిష్టకర్మణా. ౪౯

తుండై మహాభయంకరమయిన యాసురాస్త్రంబుం బ్రయోగించెను. ౪౦

అయ్యాసురాస్త్రంబు ప్రయోగించుటయు అందు సింహముఖంబులును వ్యాఘ్రముఖంబులును గంకాస్యంబులును కాకవక్త్రంబులును గృధ్రశ్యేన వదనంబులును నక్కముఖంబు గలవియు తోడేళ్ళ మొగంబు గలవియు నోరు దెఱచుకొని భయంకరంబులయిన యయిదుతలల యుగ్రసర్పంబుల యాకారము గలవియునగు ననేకంబులు తీక్ష్ణబాణంబులు వెడలినవి. ౪౧,౪౨

మహాపరాక్రమశాలియు మాయావియునగు రావణుండు క్రుద్ధుండై సర్పంబు వలె నూర్పులు నిగుడించుచు అయ్యాసురాస్త్ర ప్రభావంబునం జేసి గార్దభముఖంబులును వరాహవదనంబులును శునకవక్త్రంబులును గుక్కుట ముఖంబులును మకరాస్యంబులును సాధారణసర్పముల మోములు గలవియు నగు బాణంబులను మఱియు నితరములయిన పెక్కుకఱకుటమ్ములను రాముని పయిం బ్రయోగించెను. ౪౩,౪౪

అట్లయ్యాసురాస్త్రంబు మార్కొనుటయు అధికమయిన యుత్సాహము గలవాఁడును అగ్నితుల్యుండునగు రాముండు వెనుదీయక ఆగ్నేయాస్త్రంబుం బ్రయోగించెను. ౪౫

అయ్యాగ్నేయాస్త్రప్రభావంబున అగ్నిముఖంబులును సూర్యవదనంబులును చంద్రునియొక్కయు నర్ధచంద్రునియొక్కయు ముఖంబు గలవియు ధూమకేతువక్త్రంబులును గ్రహంబులయొక్కయు నక్షత్రంబులయొక్కయు ముఖములు గలవియు కొఱవికట్టెల మొగంబు గలవియు మెఱపులతో సమానంబులునగు బాణంబులును మఱియు నితరంబులగు తీక్ష్ణబాణంబులును వెడలినవి. ౪౬,౪౭

భయంకరంబులగు రావణప్రయుక్తంబులయిన యయ్యాసురాస్త్ర బాణంబులు రాముని యాగ్నేయాస్త్రంబుం దాఁకి యాకాశంబుననే వేయిపఱియలుగా భగ్నంబులయినవి. ౪౮

అపుడు ఎంతమాత్రము శ్రమమునొందక యొట్టి దుష్కరకార్యము

హృష్టా నేదు స్తత స్సర్వే కపయః కామరూపిణః,
సుగ్రీవ ప్రముఖా వీరాః పరివార్య తు రాఘవమ్. ౫౦
తత స్తదస్త్రం వినిహత్య రాఘవః
ప్రసహ్య త ద్రావణ బాహునిస్సృతమ్,
ముదాన్వితో దాశరథి ర్మహాహవే
వినేదు రుచ్చై ర్ముదితాః కపీశ్వరాః. ౫౧

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే - శతతమస్సర్గః. ౧౦౦.

## ఏ కో త్త ర శ త త మ స్స ర్గః.

తస్మిన్ప్రతిహతే౽స్త్రే తు రావణో రాక్షసాధిపః,
క్రోధం చ ద్విగుణం చక్రే క్రోధా చ్చాస్త్ర మనన్తరమ్. ౧

మయేన విహితం రౌద్ర మన్య దస్త్రం మహాద్యుతిః,
ఉత్స్రష్టుం రావణో ఘోరం రాఘవాయ ప్రచక్రమే. ౨
తత శ్శూలాని నిశ్చేరు ర్గదాశ్చ ముసలాని చ,
కార్ముకా ద్దీప్యమానాని వజ్రసారాణి సర్వశః. 3
ముద్గరాః కూటపాశా శ్చ దీప్తాశ్చాశనయ స్తథా,
నిష్పేతు ర్వివిధా స్తీక్ష్ణా వాతా ఇవ యుగక్షయే. ౪

తదస్త్రం రాఘవ శ్శ్రీమా నుత్తమాస్త్రవిదాం వరః,
జఘాన పరమాస్త్రేణ గాన్ధర్వేణ మహాద్యుతిః. ౫

తస్మి న్ప్రతిహతే౽స్త్రే తు రాఘవేణ మహాత్మనా,
రావణః క్రోధతామ్రాక్ష స్సౌర మస్త్ర ముదైరయత్. ౬
తత శ్చక్రాణి నిష్పేతు ర్భాస్వరాణి మహాన్తి చ,

చేసి గావించునట్టి రాముండు అయ్యాసురాస్త్రంబు నివారించుటంజూచి కామరూపులగు సుగ్రీవాది వానరవీరు లందఱు సంతోషంబున రాముం బరివేష్టించి నాదంబు గావించిరి. ౪౯, ౫౦

అమ్మహాయుద్ధంబున రాముఁడు రావణునిచేఁ బ్రయుక్తంబగు నయ్యాసురాస్త్రంబు ప్రతిహతము గావించి సంతోషంబు నొందెను. వానరోత్తములును బరమసంతుష్టులయి యుచ్చైర్నాదంబునఁ గోలాహలంబు గావించిరి.

ఇది నూఱవ సర్గము.

---

## నూటయొకటవసర్గము.

రక్కసుల ఱేఁడయిన రావణుఁడు ఆయస్త్రంబు ప్రతిహతం బగుటంజూచి యినుమడిగాఁ గోపంబునొంది మరల మఱియొక యస్త్రంబుఁ బ్రయోగించెను. ౧

ఆమహాతేజుండగు దశకంఠుఁడు మయుఁడు సంపాదించిన మఱియొక భయంకరమయిన రౌద్రాస్త్రంబును రామునిమీఁదఁ బ్రయోగించెను. ౨

అంత దేదీప్యమానంబులును వజ్రాయుధమునకుంబోలె సారంబుఁగలవియునగు శూలంబులును గదలును ముసలంబులును ధనువునుండి వెడలినవి. ౩

ప్రలయకాలంబున మహావాయువులు వెడలినట్లు నానావిధంబులును దీక్ష్ణంబులునగు గుదియలును కపటపాశంబులును వజ్రంబులును భయంకరంబుగా మహావేగంబున వెడలినవి. ౪

శ్రీమంతుఁడును మహాతేజుఁడును దివ్యాస్త్రంబులు నేర్చినవారిలో నుత్తముండునగు రాముఁడు గాంధర్వాస్త్రముచే నారౌద్రాస్త్రమును బ్రతిహతము గావించెను. ౫

మహానుభావుండగు రాముఁడు ఆరౌద్రాస్త్రంబును నివారించినంత రావణుఁడు కుపితుండై కన్నులం గెంపుదోఁప సౌరాస్త్రంబునఁ బ్రయోగించెను.

అంత భయంకరమయిన పరాక్రమముగలవాఁడును బుద్ధిమంతుఁడుఁ

కార్ముకా ద్భీమవేగస్య దశగ్రీవస్య ధీమతః. ౭

తై రాసీ ద్గగనం దీప్తం సంపతద్భి రితస్తతః,
పతద్భి శ్చ దిశో దీప్తా శ్చన్ద్రసూర్యగ్రహా రివ. ౮

తాని చిచ్ఛేద బాణౌఘై శ్చక్రాణి స తు రాఘవః,
ఆయుధాని విచిత్రాణి రావణస్య చమూముఖే. ౯

తదస్త్రం తు హతం దృష్ట్వా రావణో రాక్షసాధిపః,
వివ్యాథ దశభి ర్బాణైః రామం సర్వేషు మర్మసు. ౧౦

స విద్ధో దశభి ర్బాణై ర్మహాకార్ముకనిస్సృతైః,
రావణేన మహాతేజా న ప్రాకమ్పత రాఘవః. ౧౧

తతో వివ్యాథ గాత్రేషు సర్వేషు సమితింజయః,
రాఘవస్తు సుసంక్రుద్ధో రావణం బహుభి శ్శరైః. ౧౨

ఏతస్మి న్నన్తరే క్రుద్ధో రాఘవస్యానుజో బలీ,
లక్ష్మణ స్సాయకాన్ సప్త జగ్రాహ పరవీరహా. ౧౩

తై స్సాయకై ర్మహావేగై రావణస్య మహాద్యుతిః,
ధ్వజం మనుష్యశీర్షం తు తస్య చిచ్ఛేద నైకథా. ౧౪

సారథేశ్చాపి బాణేన శిరో జ్వలితకుణ్డలమ్,
జహార లక్ష్మణ శ్శ్రీమా నైరృతస్య మహాబలః. ౧౫

నగు రావణుని మహాధనుస్సునుండి దేదీప్యమానంబు లగు గొప్ప గొప్ప చక్రాయుధములు వెడలినవి. ౭

ఆ దేదీప్యమానములగు చక్రంబులచే అంతరిక్షంబునుండి పడుచున్న చంద్రసూర్యులచేతను గ్రహంబులచేతనుం బోలె ఆకాశంబులును దిశలును బ్రకాశించినవి. ౮

రాముఁడు సేనాముఖంబున రావణప్రయుక్తంబులగు నాచక్రంబులను మఱియుఁ జిత్రంబులగు నితరాయుధంబులను బాణసమూహంబుల ఖండించెను. ౯

రక్కసులకుఁ బ్రభువయిన రావణుఁడు ఆ సౌరాస్త్రంబుగూడఁ బ్రతిహతమగుటం జూచి, రాముని సమస్తమర్మస్థానములయందును బది బాణములు చొప్పించి నొప్పించెను. ౧౦

రావణుని మహాధనుస్సునుండి వేయఁబడిన యాపదిబాణంబులచే నొప్పింపఁబడినను రాముఁడు మహాప్రభావుఁడగుటం జేసి యెంతమాత్రము చలనము నొందఁడయ్యె. ౧౧

అంత శత్రుసమూహంబుల జయించునట్టి రాముఁడు పరమకుపితుఁడై రావణుని సమస్తావయవంబులందును పెక్కు బాణంబులం జొప్పించి నొప్పించెను. ౧౨

అట్లు రావణునిఁ బ్రహరించి రాముండు కొంత విశ్రమించియుండు నంతలో రామునితమ్ముండును శత్రువీరుల వధించువాఁడును బలవంతుండునగు లక్ష్మణుఁడు ఏడుబాణంబులం దీసెను. ౧౩

మహాతేజుండగు లక్ష్మణుండు మహావేగంబులయిన యాబాణంబులచే మనుష్యుని తలవ్రాసియున్న రావణుని ధ్వజంబును బెక్కు తునియలుగా ఖండించెను. ౧౪

కాంతిమంతుండును మహాబలశాలియునగు లక్ష్మణుం డంతనొక్క బాణంబున రావణుని సారథియొక్క కుండలాలంకృతంబగు శిరంబుఁ జెగవ్రేసెను.

తస్య బాణైశ్చ చిచ్ఛేద ధను ర్గజకరోపమమ్,
లక్ష్మణో రాక్షసేన్ద్రస్య షడ్భి ర్నిశితై శ్శరైః. ౧౬
నీలమేఘనిభాం శ్చాస్య సదశ్వా న్పర్వతోపమాన్,
జఘానాప్లుత్య గదయా రావణస్య విభీషణః. ౧౭

హతా(శ్వాత్)శ్వే వేగవా న్వేగా దవప్లుత్య మహారథాత్,
క్రోధ మాహారయ త్తీవ్రం భ్రాతరం ప్రతిరావణః. ౧౮

తత శ్శక్తిం మహాశక్తి ర్దీప్తాం దీప్తాశనీ మివ,
విభీషణాయ చిక్షేప రాక్షసేన్ద్రః ప్రతాపవాన్. ౧౯
అప్రాప్తా మేవ తాం బాణై స్త్రిభి శ్చిచ్ఛేద లక్ష్మణః,
అథోదతిష్ఠ త్సన్నాదో వానరాణాం తదా రణే. ౨౦

సా పపాత త్రిధా చ్ఛిన్నా శక్తిః కాఞ్చనమాలినీ,
సవిస్ఫులిఙ్గా జ్వలితా మహోల్కేవ దివ శ్చ్యుతా. ౨౧

తత స్సంభావితతరాం కాలేనాపి దురాసదామ్,
జగ్రాహ విపులాం శక్తిం దీప్యమానాం స్వతేజసా. ౨౨

సా వేగితా బలవతా రావణేన దురాసదా,
జజ్వాల సుమహాఘోరా శక్రాశనిసమప్రభా. ౨౩

ఏతస్మి న్నన్తరే వీరో లక్ష్మణ స్తం విభీషణమ్,
ప్రాణసంశయ మాపన్నం తూర్ణ మభ్యవపద్యత. ౨౪
తం విమోక్షయితుం వీరశ్చాప మాయమ్య లక్ష్మణః,

లక్ష్మణుండు అయిదు తీక్ష్ణబాణంబులచే రాక్షసనాథుండగు దశకంఠుని యొక్క ఏనుంగుతుండమువంటి మహాధనుస్సును దునియలు గావించెను. ౧౬

అంత లక్ష్మణుం డూరకుండుటయు విభీషణుండు మార్కొని నీలమేఘ సమానంబులును పర్వతాకారంబులునగు రావణుని యుత్తమాశ్వంబులను గదచే వధించెను. ౧౭

మహావేగుండగు రావణుండు గుఱ్ఱంబులు హతంబు లగుటయుం వేగంబున రథమునుండి నేలకు లంఘించి తమ్ముఁడగు విభీషణునిపై మహాక్రోధంబు వహించెను. ౧౮

అంత మహాబలుఁడును మహాతేజుండునగు రావణుఁడు దేదీప్యమానంబయి వజ్రాయుధమువలె వెలుంగుచున్న శక్తిని విభీషణునిపైఁ బడవైచెను. ౧౯

లక్ష్మణుండు ఆ శక్తి విభీషణునిమీఁదికి రాకమున్నే దానిమూఁడు బాణంబుల ఛేదించెను. అంత నప్పుడు యుద్ధంబున రాక్షసులు హాహాకారంబుల మహాధ్వని గావించిరి. ౨౦

కాంచనమాలాలంకృతంబగు నాశక్తి మూఁడు తునియలుగా ఛేదింపఁబడినదై మిణుంగుఱులు చెదర జ్వలింపుచు నాకాశంబునుండి పెద్దకొఱవి పడునట్లు నేలంబడెను. ౨౧

అంత నారావణుండు పూర్వశక్తికన్నను మఱియుఁ బూజ్యమానంబును యమునికిఁ గూడ సమీపింప నలవిగానిదియుం నిజతేజంబున వెలుంగుచున్నదియునగు మహాశక్తిని గ్రహించెను. ౨౨

ఎట్టివారికిని దేఱిచూడ నలవిగానిదియు దేవేంద్రుని వజ్రాయుధముతో సమానంబునగు నమ్మహాశక్తిని బలవంతుండగు రావణుండు గిరగిరం ద్రిప్పుటయుం నదిజ్వలింపుచు మహాభయంకరంబై చూపట్టెను. ౨౩

ఇంతలో వీరుండగు లక్ష్మణుండు విభీషణుం డిట్లు ప్రాణసందేహము నొందుటం గని శీఘ్రంబునం బోయి యతని కడ్డము నిలచెను. ౨౪

పరాక్రమవంతుండగు లక్ష్మణుండు విభీషణుని తప్పించుటకై ధనుస్సు

రావణం శక్తిహా స్తం వై శరవర్షై రవాకిరత్. ౨౭

కీర్యమాణ శ్శరౌఘేణ విసృష్టేన మహాత్మనా,
న ప్రహర్తుం మన శ్చక్రే విముఖీకృతవిక్రమః. ౨౮

మోక్షితం భ్రాతరం దృష్ట్వా లక్ష్మణేన స రావణః,
లక్ష్మణాభిముఖ స్తిష్ఠ న్నిదం వచన మబ్రవీత్. ౨౭

మోక్షిత స్తే బలశ్లాఘి! న్యస్మాదేవం విభీషణః,
విముచ్య రాక్షసం శక్తి స్త్వ యీయం వినిపాత్యతే. ౨౮

ఏషా తే హృదయం భిత్త్వా శక్తి ర్లోహితలక్షణా,
మద్బాహుపరిఘోత్సృష్టా ప్రాణా నాదాయ యాస్యతి ౨౯

ఇత్యేవ ముక్త్వా తాం శక్తి మష్టఘణ్టాం మహాస్వనామ్,
మయేన మాయావిహితా మమోఘాం శత్రుఘాతినీమ్. 3౦

లక్ష్మణాయ సముద్దిశ్య జ్వలన్తీ మివ తేజసా,
రావణః పరమక్రుద్ధ శ్చిక్షేప చ ననాద చ. 3౧

సా క్షిప్తా భీమవేగేన శక్రాశనిసమస్వనా,
శక్తి రభ్యపత ద్వేగా ల్లక్ష్మణం రణమూర్ధని. 3౨

తా మనువ్యాహర చ్ఛక్తి మాపతన్తీం స రాఘవః,
స్వస్త్యస్తు లక్ష్మణాయేతి మోఘా భవ హతోద్యమా. 33

రావణేన రణే శక్తిః క్రుద్ధేనాశీవిషోపమా,
ముక్తా శూరస్య భీతస్య లక్ష్మణస్య మమజ్జ సా. 3౪

సాకర్షించి శక్తిచేతం బూని యున్న రావణునిపై బాణవర్షంబులు గురిసెను.

మహాబలుండగు లక్ష్మణుండు రావణునిపై బాణవర్షంబులు గురియుట వలన రావణునకు విభీషణుని దెసం జేయిదూడించుట కవకాశము లేకపోవుట చేత విభీషణునిం బ్రహరింపం జాలండయ్యె. ౨౬

ఆ రావణుండు తనతమ్ముని విభీషణుని లక్ష్మణుండు దప్పించుటను జూచి లక్ష్మణున కభిముఖుండై నిలుచుండి యీ మాటం బలికెను. ౨౭

బలగర్వితుండవగు లక్ష్మణుండా! ఇట్లు నీవు విభీషణునిం దప్పించితివి కావున నింక విభీషణుని విడిచి యీశక్తిని నీమీందనె పడవైచెదను. ౨౮

ఈ మహాశక్తి యిసుపగుదియవంటి నా బాహువుచే వేయంబడినదై నీహృదయంబు భేదించి నెత్తురుచేం దడుపంబడినదై నీప్రాణంబులు గొని పోంగలదు. అని రావణుండు లక్ష్మణునితోం జెప్పెను. ౨౯

ఇవ్విధంబునం బలికి రావణుండు పరమకుపితుండై ఎనిమిదిఘంటలతో మహాధ్వనిగలుగునట్లు మ్రోంగుచున్నదియు మయునిచే మాయాబలంబున నిర్మింపంబడినదియుం ఏశత్రువుపై నెప్పుడు ప్రయోగించినను ఎంతమాత్రము వ్యర్థము గాక శత్రువధంబు సేయునదియు నిజతేజంబునం బ్రజ్వలించుచున్నదియు నగు నమ్మహాశక్తిని లక్ష్మణునిపైం బ్రయోగించి సింహనాదము గావించెను. ౩౦

అట్లు యుద్ధంబున భయంకరమయిన పరాక్రమంబుగల యా రావణుండు శక్తిని బ్రయోగించుటయు నది దేవేంద్రుని వజ్రాయుధముంబోలె మహాధ్వనితో వేగంబున లక్ష్మణునిమీంది కరిగెను. ౩౨

రాముండు అదిచూచి "లక్ష్మణునకు మంగళంబగుంగాక" యని మంగళానుశాసనంబు గావించి యా శక్తి నుద్దేశించి "లక్ష్మణవధరూపమయిన నీయుద్యోగంబు విఫలమయి నీవు వ్యర్థమవగుదువుగాక" యని పలికెను. ౩౩

సర్పసమానంబగు నాశక్తి యుద్ధంబున నట్లు కుపితుండగు రావణునిచేం బ్రయోగింపంబడినదై యెంతమాత్రము భయంబునొందక నిశ్చలుండై నిలుచున్న లక్ష్మణుని వక్షమును శీఘ్రంబునం జొచ్చెను. ౩౪

న్యపతత్సా మహావేగా లక్ష్మణస్య మహోరసి,
జిహ్వేవోరగరాజస్య దీప్యమానా మహాద్యుతిః. 35

తతో రావణవేగేన సుదూర మవగాఢయా,
శక్త్యా నిర్భిన్నహృదయః పపాత భువి లక్ష్మణః. 36
తదవస్థం సమీపస్థో లక్ష్మణం ప్రేక్ష్య రాఘవః,
భ్రాతృస్నేహా న్మహాతేజా విషణ్ణహృదయోఽభవత్. 37

స ముహూర్త మనుధ్యాయ బాష్పవ్యాకులలోచనః,
బభూవ సంరబ్ధతరో యుగాన్త ఇవ పావకః. 38

న విషాదస్య కాలోఽయ మితి సంచిన్త్య రాఘవః,
చక్రే సుతుములం యుద్ధం రావణస్య వధే ధృతః. 39
సర్వయత్నేన మహాత్మా లక్ష్మణం సన్నిరీక్ష్య చ,
స దదర్శ తతో రామ శ్శక్త్యా భిన్నం మహాహవే. 40
లక్ష్మణం రుధిరాదిగ్ధం సపన్నగ మివాచలమ్,
తామపి ప్రహితాం శక్తిం రావణేన బలీయసా. 41
యత్నత స్తే హరిశ్రేష్ఠా న శేకు రవమర్దితుమ్,
అర్దితా శ్చైవ బాణౌఘైః క్షిప్రహస్తేన రక్షసా. 42

సౌమిత్రిం సా వినిర్భిద్య ప్రవిష్టా ధరణీతలమ్,
తాం కరాభ్యాం పరామృశ్య రామశ్శక్తిం భయావహామ్. 43
బభఞ్జ సమరే క్రుద్ధో బలవా న్విచకర్ష చ,
తస్య నిష్కర్షత శ్శక్తిం రావణేన బలీయసా. 44

మహావేగంబునను మహాకాంతితో వెలుంగుచున్నదియునగు నాశక్తి సర్పరాజయిన యాదిశేషుని నాలుకవలె భయంకరాకారంబయి విశాలంబగు లక్ష్మణుని వక్షంబునం జొచ్చెను. ౩౪

అంతలక్ష్మణుండు రావణుని బాహువేగంబున నాశక్తి బహుదూరము నాటి వక్షంబు భేదించుటయు నేలంబడెను. ౩౫

అప్పుడు సమీపంబున నున్న మహాతేజుండగు రాముండు లక్ష్మణుం డట్టి యవస్థనొందుటం జూచి తమ్ముని యందలి స్నేహంబున దుఃఖితుం డయ్యెను. ౩౬

రాముండు కన్నులం గన్నీళ్లుగాఱం గొంతసేపు ఏమియుం దోంచక చింతనొంది యంతః ప్రలయకాలానలంబుకైవడి మహావేగంబు వహించెను. ౩౭

రాముండు "దుఃఖమునకిది సమయము గా"దని యాలోచించి రావణుని వధింప నిశ్చయించి లక్ష్మణుని సర్వప్రయత్నములఁ గనిపెట్టి చూచుచు రావణునితో మహాయుద్ధము గావించెను. ౩౯

అంత శక్తిచే భిన్నుండై నెత్తుటఁదోంగుచు సర్పంబుతోఁ గూడిన పర్వతంబువలెఁ జూడనగుచున్న లక్ష్మణుని రాముండు గాంచెను. ౪౦

ఆ వానరోత్తములు ఆశక్తియొక్క దార్ఢ్యమువలన మాత్రమెగాక అతివేగముగా బాణములు ప్రయోగించునట్టి రావణునిచే బాణసమూహంబుల నొప్పింపఁబడినవారలు నగుటవలన బలవంతుండగు నారావణుండుం ప్రయోగించిన యాశక్తిని ఎంతప్రయత్నించినను ఎంతమాత్రము విఱువ జాలరైరి. ౪౧, ౪౨

అమ్మహాశక్తి లక్ష్మణుని భేదించి భూమింబడినది.

బలవంతుండగు రాముండు యుద్ధంబునఁ గుపితుండై భయంకరాకారం బగు నమ్మహాశక్తిని రెండుచేతులంబట్టి వంచి విఱిచివైచెను. ౪౩

రాముండు ఆశక్తిని వంచుచుండఁగా మహాబలుండగు రావణుండు

శరా స్సర్వేషు గాత్రేషు పాతితా మర్మభేదినః,

అచిన్తయిత్వా తా న్బాణాన్ సమాశ్లిష్య చ లక్ష్మణమ్. ౪౫
అబ్రవీచ్చ హనూమన్తం సుగ్రీవం చైవ రాఘవః,

లక్ష్మణం పరివార్యేహ తిష్ఠధ్వం వానరోత్తమాః!. ౪౬

పరాక్రమస్య కాలోఽయం సంప్రాప్తో మే చిరేప్సితః,
పాపాత్మాఽయం దశగ్రీవో వధ్యతాం పాపనిశ్చయః. ౪౭
కాఙ్క్షిత స్తోకకస్యేవ ఘర్మాన్తే మేఘదర్శనమ్,

అస్మి న్ముహూర్తే న చిరా త్సత్యం ప్రతిశృణోమి వః. ౪౮
అరావణ మరామం వా జగద్ద్రక్ష్యథ వానరాః,!

రాజ్యనాశం వనే వాసం దణ్డకే పరిధావనమ్. ౪౯
వైదేహ్యా శ్చ పరామర్శం రక్షోభి శ్చ సమాగమమ్,
ప్రాప్తం దుఃఖం మహాఘోరం క్లేశం చ నిరయోపమమ్. ౫౦
అద్య సర్వ మహం త్యక్ష్యే నిహత్వా రావణం రణే,

యదర్థం వానరం సైన్యం సమానీత మిదం మయా. ౫౧
సుగ్రీవ శ్చ కృతో రాజ్యే నిహత్వా వాలినం రణే,
యదర్థం సాగరః క్రాన్త స్సేతు ర్బద్ధశ్చ సాగరే. ౫౨
సోఽయ మద్య రణే పాప శ్చక్షుర్విషయ మాగతః,

చక్షుర్విషయ మాగమ్య నాయం జీవితు మర్హతి. ౫౩

రాముని సమస్తావయవంబులందును మర్మస్థానంబులు ఛేదించునట్టి కఱకుట
మ్ములం బ్రయోగించెను. ౪౪

రాముఁడు ఆ రావణుఁడేయు బాణంబుల సరకుసేయక లక్ష్మణుని
గవుఁగిలించుకొని హనుమంతుని సుగ్రీవుని నితరవానరవీరులనుం జూచి యిట్లని
పలికెను. ౪౫

వానరోత్తములారా! ఇచట మీరు లక్ష్మణునిఁ బరివేష్టించి కాచి
యుండుఁడు. ౪౬

బహుకాలముగాఁ గోరుచున్న చాతకపక్షికి వర్షాకాలంబున మేఘ
మగపడినట్లు బహుకాలముగాఁ గోరుచుండిన నాకిప్పుడు పరాక్రమంబునకు
సమయము లబ్ధమయినది. కావునఁ బాపాత్ముఁడును బాపకార్యంబులు సేయు
వాఁడునగు రావణు నిప్పుడు తప్పక వధింపవలెను. ౪౭

వానరులారా! మీయెదుట సత్యముగాఁ బ్రతిజ్ఞ సేయుచున్నాను.
ఇఁక శీఘ్రంబుననె మీరు ప్రపంచంబున రావణుఁడుగాని రాముఁడుగాని
మాత్రుఁడగుటఁ జూడఁగలరు. ౪౮

రాజ్యభ్రంశంబును వనవాసంబును దండకారణ్యంబున నుండుటయుం
సీత యితరునిచే స్పృశింపఁబడి రాక్షసులచేతఁ జిక్కుటయుం జివి మొదలయిన
భయంకరమగు దుఃఖమును, లక్ష్మణునిఁ గొట్టుటవలన గలిగిన నరకసమానం
బగు క్లేశంబును సమస్తంబు నిపుడు యుద్ధంబున రావణుని వధించి వదలి
పెట్టెదను. ౪౯, ౫౦

ఎవనికిఁగా నేను యుద్ధంబున వాలిని వధించి సుగ్రీవుని వానరరాజు
గావించి యీవానరసైన్యము నిచటికిఁ దెచ్చినానో మఱియు నెవనికిఁగా
సముద్రంబున సేతువు నిర్మించి సముద్రంబు దాఁటి యిచటికి వచ్చినామో
అట్టి పాపిష్ఠుఁడు ఈ రావణుఁడు ఇపుడు యుద్ధంబున నాదృష్టిపథంబున
నున్నాఁడు. ౫౧, ౫౨

దృష్టియందు విషముగల సర్పముకంటం బడినవాఁడు జీవింపనట్లు,

దృష్టిం దృష్టివిషస్యేవ సర్పస్య మమ రావణః,
స్వస్థాః పశ్యత దుర్ధర్షా యుద్ధం వానరపుఙ్గవాః! ౫౪
ఆసీనాః పర్వతాగ్రేషు మమేదం రావణస్య చ,

అద్య రామస్య రామత్వం పశ్యన్తు మమ సంయుగే. ౫౫
త్రయో లోకా స్సగన్ధర్వా స్సదేవా స్సర్షిచారణాః,

అద్య కర్మ కరిష్యామి య ల్లోకా స్సచరాచరాః. ౫౬
సదేవాః కథయిష్యన్తి యావ ద్భూమి ర్ధరిష్యతి,
సమాగమ్య సదా లోకే యథా యుద్ధం ప్రవర్తితమ్. ౫౭

ఏవ ముక్త్వా శితై ర్బాణై స్తప్తకాఞ్చనభూషణైః,
ఆజఘాన దశగ్రీవం రణే రామ స్సమాహితః. ౫౮
అథ ప్రదీప్తై ర్నారాచై ర్ముసలై శ్చాపి రావణః,
అభ్యవర్ష త్తదా రామం ధారాభి రివ తోయదః. ౫౯

రామరావణముక్తానా మన్యోన్యమభినిఘ్నతామ్,
శరాణాం చ శరాణాం చ బభూవ తుముల స్స్వనః. ౬౦
తే భిన్నాశ్చ వికీర్ణాశ్చ రామరావణయో శ్శరాః,
అన్తరిక్షా త్ప్రదీప్తాగ్రా నిపేతు ర్ధరణీతలే. ౬౧

తయో ర్జ్యాతలనిర్ఘోషో రామరావణయో ర్మహాన్,
త్రాసన స్సర్వభూతానాం స బభూవాద్భుతోపమః. ౬౨
స కీర్యమాణ శ్శరజాలవృష్టిభి
ర్మహాత్మనా దీప్తధనుష్మ తార్దితః,

నాదృష్టిపథంబునంబడిన యీ రావణుఁడు జీవింపఁజాలఁడు. ౫౩

ధర్షింప నలవిగాని వానరోత్తములారా! మీరలు పర్వతాగ్రంబులం గూర్చుండి స్వస్థముగా నాకును రావణునకును జరగఁబోవు యుద్ధమును జూచుచుండుఁడు. ౫౪

దేవర్షి గంధర్వచారణులును మూఁడు లోకంబులందున్న వారలును ఇప్పుడు యుద్ధంబున రాముఁడను నేను ఎంతటివాఁడనో చూతురుగాక. (లేక నేను రాముఁడనని తెలిసికొందురుగాక.) ౫౫

జంగమస్థావరంబులతోఁగూడిన దేవతలు మొదలగు సమస్తజనులును గుంపుగాఁజేరి యిప్పుడు యుద్ధంబు జరగిన విధంబున భూమియుండు దనుకఁ జెప్పుకొనుచుండులాగున నిప్పుడు యుద్ధము గావించెదను. అని రాముఁడు వానరులతోఁ జెప్పెను. ౫౬, ౫౭

ఇవ్విధంబునంబలికి రాముండు యుద్ధాభిముఖుండై కాంచన పుంఖంబులగు కఱకుటమ్ముల రావణుని నొప్పించెను. ౫౮

అంత మేఘము జలధారలు గురియునట్లు, రావణుఁడు రామునిపై దేదీప్యమానంబులగు బాణంబులు ముసలంబులు మొదలగు ననేకాయుధములం గురిసెను. ౫౯

రాముఁడును రావణుఁడును ఒండొరులపై బాణములఁ బ్రయోగింపఁగా నాబాణములు నాబాణములం దాఁకు ధ్వని యధికంబై చెలంగెను.

కొనలందు దేదీప్యమానంబులయి యున్న యారామరావణ బాణంబులు ఒకటిచే నొకటి ఖండితములయి విచ్చలవిడిగా నాకాశమునుండి నేలంబడినవి. ౬౧

రామరావణుల జ్యాతలధ్వని సమస్తభూతంబులకును భయంకరమై యాశ్చర్యావహమయి నింగిముట్టి చెలంగెను. ౬౨

అంత నారావణుఁడు అట్లు మహాధనుర్ధరుఁడును మహాబలశాలియు నగు రాముని బాణవర్షంబులకు నొచ్చి పరమపీడితుఁడై వాయుహతంబగు

భయా త్పరిదుద్రావ సమేత్య రావణో
యథాఽనిలేనాభిహతో వలాహకః. ౬౩

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే-ఏకోత్తరశతతమస్సర్గః. ౧౦౧.

---

## ద్వ్యుత్తరశతతమస్సర్గః.

శక్త్యా వినిహతం దృష్ట్వా రావణేన బలీయసా,
లక్ష్మణం సమరే శూరం రుధిరౌఘపరిప్లుతమ్. ౧
స దత్త్వా తుములం యుద్ధం రావణస్య దురాత్మనః,
విసృజన్నేవ బాణౌఘాన్ సుషేణం వాక్య మబ్రవీత్. ౨
ఏష రావణవీర్యేణ లక్ష్మణః పతితః క్షితౌ,
సర్పవద్వేష్టతే వీరో మమ శోక ముదీరయన్. 3

శోణితార్ద్రమిమం వీరం ప్రాణై రిష్టతరం మమ,
పశ్యతో మమ కా శక్తి ర్యోద్ధుం పర్యాకులాత్మనః. ౪

అయం స సమరశ్లాఘీ భ్రాతా మే శుభలక్షణః,
యది పఞ్చత్వ మాపన్నః ప్రాణై ర్మే కిం సుఖేన చ. ౫

లజ్జతీవ హి వీర్యం మే భ్రశ్యతీవ కరా ద్ధనుః,
సాయకా వ్యవసీదన్తి దృష్టి ర్బాష్పవశం గతా. ౬

అవసీదన్తి గాత్రాణి స్వప్నయానే నృణా మివ,
చిన్తా మే వర్ధతే తీవ్రా ముమూర్షా చోపజాయతే. ౭
భ్రాతరం నిహతం దృష్ట్వా రావణేన దురాత్మనా,

మేఘంబుకైవడి భయంబునఁ బరుగెత్తెను. ౬౩

ఇది నూటయొకటవసర్గము.

## నూటరెండవసర్గము.

అట్లు బలవంతుఁడగు రావణునిచే యుద్ధంబున శక్తిచేఁ బ్రహరింపఁ బడి నెత్తురు వెల్లువలచేఁ దడిసియున్న శూరుండగు లక్ష్మణుఁజూచి రాముండు దురాత్ముండగు రావణునితో గొప్పయుద్ధంబు గావించి బాణంబులు విడుచుచునే సుషేణుంజూచి యీ మాటం బలికెను. ౧, ౨

పరాక్రమవంతుఁడగు నీ లక్ష్మణుండు రావణునిచేఁ గొట్టఁబడి భూమిం బడితుఁడై సర్పమువలెఁ బొరలుచుండుటచే నాకు మిక్కిలియు దుఃఖము గలుగుచున్నది. ౩

నాకుఁ బ్రాణంబులకన్నను బ్రియుఁడగు వీరుఁడు లక్ష్మణుండిట్లు నెత్తుటం దడిసియుండుటను జూచుచు విహ్వలంబగు మనంబుతో నే నెట్లు యుద్ధము గావింతును? ౪

యుద్ధంబునఁ గీర్తివహించినవాఁడును మంగళలక్షణములు గలవాఁడును అట్టి సద్గుణ నిధియునగు నా తమ్ముం డితఁడు ఒకవేళ మృతుండగునేని నాకుఁ బ్రాణంబు లేల? సుఖ మేల? ౫

నాయెదుటనె నాతమ్ముఁడు హతుఁడయ్యెనని నాపరాక్రమము సిగ్గు పడినట్లు వెనుదీయుచున్నది. ధనుస్సు చేతనుండి క్రిందఁబడునట్లున్నది. బాణంబులు బలహీనంబులయినవి. కన్నుల నీళ్లు నిండుటవలన నేమియుం గనపడదు. ౬

దురాత్ముఁడగు రావణునిచే హతుఁడగు లక్ష్మణుంజూడ స్వప్నములందు నడచునప్పుడు కాళ్లు వెనుకకు లాగునట్లు నాకు అవయవములు దుర్బలంబు లయి చేయఁదలంచిన పని చేయఁజాలకున్నవి. అధికముగా చింతగలుగు చున్నది. ప్రాణంబులపై నాశవదలినది. అని రాముఁడు సుషేణునితోఁ జెప్పెను.

వినిశ్వసన్తం(ష్టనన్తం)శ్వసన్తం దుఃఖార్తం మర్మణ్యభిహతం భృశమ్. ౮
రాఘవో భ్రాతరం దృష్ట్వా ప్రియం ప్రాణం బహిశ్చరమ్,
దుఃఖేన మహతాఽఽవిష్టో ధ్యానశోకపరాయణః. ౯
పరం విషాద మాపన్నో విలలాపాకులేన్ద్రియః,

న హి యుద్ధేన మే కార్యం నైవ ప్రాణై ర్న సీతయా. ౧౦
భ్రాతరం నిహతం దృష్ట్వా లక్ష్మణం రణపాంసుషు,

కిం మే రాజ్యేన కిం ప్రాణై ర్యుద్ధే కార్యం న విద్యతే. ౧౧
యత్రాయం నిహతశ్శేతే రణమూర్ధని లక్ష్మణః,
దేశేదేశే కళత్రాణి దేశేదేశే చ బాన్ధవాః. ౧౨
తం తు దేశం న పశ్యామి యత్ర భ్రాతా సహోదరః,

ఇత్యేవం విలపన్తం తం శోకవిహ్వలితేన్ద్రియమ్. ౧౩
వివేష్టమానం కరుణ ముచ్ఛ్వసన్తం పునఃపునః,
రామ మాశ్వాసయ న్వీర స్సుషేణో వాక్య మబ్రవీత్. ౧౪

నమృతోఽయం మహాబాహో! లక్ష్మణో లక్ష్మివర్ధనః,
న చాస్య వికృతం వక్త్రం నాపి శ్యామం న నిష్ప్రభమ్. ౧౫

సుప్రభం చ ప్రసన్నం చ ముఖ మస్యాభిలక్ష్యతే,
పద్మరక్తతలౌ హస్తౌ సుప్రసన్నే చ లోచనే. ౧౬

ఏవం న విద్యతే రూపం గతాసూనాం విశాంపతే!,
దీర్ఘాయుషస్తు యే మర్త్యా స్తేషాం తు ముఖ మీదృశమ్. ౧౭

దురాత్ముఁడగు రావణునిచే మర్మస్థానంబునఁ జక్కఁగా గొట్టఁబడి పీడితుఁడై నిట్టూర్పులు పుచ్చుచున్న తమ్ముని లక్ష్మణుంజూచి రాముఁడు పరమ దుఃఖితుఁడై యేమియుఁదోఁచక మనోవ్యధ నొందెను. ౯,౯

ఆ రాముఁడు అట్లు మిక్కిలియుఁ దుఃఖము నొంది యింద్రియముల స్వాధీనత దప్పి యిట్లని విలపించెను.

నాతమ్ముండు లక్ష్మణుఁడు ఇట్లుయుద్ధంబున హతుండై దుమ్ముమీఁదఁ బడియున్నాఁడే ఇంక నాకుయుద్ధంబు చేతగాని ప్రాణంబులచేఁగాని సీతచేఁగాని యేమి ప్రయోజనము ? ౧౦

లక్ష్మణుఁడు యుద్ధంబుననిహతుండైపడియున్నాఁడే! నాకు రాజ్యంబు వలదు. ప్రాణంబులతోనుంబనిలేదు, యుద్ధంబుతోను నాకేమియుఁ బనిలేదు.

ప్రతిదేశమునందునుగావలసిన భార్యలుదొరకుదురు. ప్రతిదేశమునం దునుకావలసినమిత్రులును దొరకుదురు కూడఁబుట్టినవాఁడు దొరకునట్టి దేశము మాత్రము ఏదియుఁలేదు. అని రాముఁడు విలపించెను. ౧౨

ఇట్లు విలపించుచు దుఃఖాతిశయంబున నింద్రియంబులస్వాధీనతదప్పి చూచువారలను దుంఖమునొంద నేలంబొరలుచు మాటిమాటికి నిట్టూర్పులు నిగుడించుచున్నరాముని వీరుండగు సుషేణుండు ఉచితవాక్యంబుల నాశ్వా సింపుచు నిట్లని పలికెను. ౧౩,౧౪

మహాబాహుండవగు రాముఁడా! లక్ష్మీవర్ధనుఁడగు నీలక్ష్మణుఁడు మృతుండుకాఁడు. ఏలయనఁగా ఈతనిముఖంబు వికృతముగాని వివర్ణముగాని కాంతిహీనముగాని కాదు. ౧౫

ఈలక్ష్మణుని ముఖముచూచి ఱంతిగలిగి ప్రసన్నముగానున్నది. అఱ చేతులు ఎఱ్ఱదామరపూవువలె నెఱ్ఱగానున్నవి. నేత్రంబులును ప్రసన్నంబులయి యున్నవి. ౧౬

రాజా! మృతులయినవారలకు ఇట్టిరూపముండదు. ఇట్టి లక్షణములు గలముఖము దీర్ఘాయుష్కులుగానుండువారలకుమాత్రమె కలిగియుండును. ౧౭

నాయం ప్రేతత్వ మాపన్నో లక్ష్మణో లక్ష్మీవర్ధనః,
మావిషాదం కృథా వీర! సప్రాణోఽయ మరిన్దమః. ౧౮
ఆఖ్యాస్యతే ప్రసుప్తస్య స్రస్తగాత్రస్య భూతలే,
సోచ్ఛ్వాసం హృదయం వీర! కమ్పమానం ముహుర్ముహుః. ౧౯

ఏవ ముక్త్వా తు వాక్యజ్ఞ స్సుషేణో రాఘవం వచః,
హనుమన్త మువాచేదం హనుమన్త మభిత్వరన్. ౨౦

సౌమ్య! శీఘ్ర మితో గత్వా శైల మోషధిపర్వతమ్,
పూర్వం తే కథితో యోఽసౌ వీర! జామ్బవతా శుభః. ౨౧
దక్షిణే శిఖరే తస్య జాతా మోషధి మానయ,
విశల్యకరణీం నామ విశల్యకరణీం శుభామ్. ౨౨
సవర్ణకరణీం చాపి తథా సంజీవనీ మపి,
సన్ధానకరణీం చాపి గత్వా శీఘ్ర మిహాఽనయ. ౨౩
సంజీవనార్థం వీరస్య లక్ష్మణస్య మహాత్మనః,

ఇత్యేవ ముక్తో హనూమాన్గత్వా చౌషధిపర్వతమ్. ౨౪
చిన్తా మభ్యగమ చ్ఛ్రీమా నజానంస్తాం మహౌషధీమ్,
తస్య బుద్ధి స్సముత్పన్నా మారుతే రమితౌజసః. ౨౫

ఇదమేవ గమిష్యామి గృహీత్వా శిఖరం గిరేః,
అస్మి న్హి శిఖరే జాతా మోషధిం తాం సుఖావహామ్. ౨౬
ప్రతర్కా దవగచ్ఛామి సుషేణో(ప్యేవము)మాం యథాబ్రవీత్,

వీరుఁడవగురాముఁడా! లక్ష్మీవర్ధనుఁడగునీలక్ష్మణుఁడుమృతుండుకాఁడు. శత్రువుల వధించినట్టి యీతఁడు బ్రతికియున్నాఁడు. నీవుదుఃఖింపవలదు. ౧౮

పరాక్రమశాలివగు రాముఁడా! మూర్ఛితుఁడై నేలంబడియున్న యీలక్ష్మణుఁడు బ్రతికియున్నవాఁడని మాటిమాటికి గదలుచున్న యతని హృదయంబువలనఁ దెలియుచున్నది అని సుషేణుండు రామునితోఁ జెప్పెను. ౧౯

చక్కఁగాఁ మాటలాడుటకుఁ దెలిసినవాఁడగు సుషేణుడు రామునితో నిట్లుపలికి యంత శీఘ్రంబునఁ బ్రశస్తములయిన చెక్కిలిమీఁదిభాగములుగల (జ్ఞానవంతుఁడగు) హనుమంతుని జూచి యిట్లని పలికెను. ౨౦

సౌమ్యుఁడవు శూరుఁడవగుహనుమంతుఁడా! నీవుమున్ను జాంబవంతుఁడు చెప్పిన మంగళకరంబగు నోషధిపర్వతంబునకు నీవిచటనుండిపోయి దాని దక్షిణ శిఖరంబునంబుట్టిన దివ్యౌషధిం దీసి కొనిరమ్ము ౨౧

నీవు మహావీరుండును మహాత్ముండునగు లక్ష్మణుని బ్రతికించుటకొఱకు శీఘ్రంబునంబోయి బాణములు నాటఁగా మేనంగ్రుచ్చుకొన్న యలుంగుల వీడఁదీయునట్టి శుభమయిన విశల్యకరణి సువర్ణకరణి సంజీవకరణి సంధానకరణియను ననుమూలికలఁగొనిరమ్ము అని సుషేణుఁడు హనుమంతునకుఁ జెప్పెను. ౨౨-౨౩

శ్రీమంతుఁడగు హనుమంతుఁడు యయ్యోషధిపర్వతంబుఁ జేరి యమ్మహౌషధిస్వరూపము తెలియనందునఁ గొంత చింతనొందెను. ౨౪

కొలదిలేని పరాక్రమంబుగల వాయుపుత్త్రుండగు హనుమంతుఁడు ఆపిమ్మట నివ్విధంబున నాలోచించెను. ౨౫

ఈపర్వతముయొక్క శిఖరము నే తీసికొనిపోయెదను.

సుషేణుఁడు నాతోఁ జెప్పిన విధంబుఁబట్టి యూహింపఁగా లక్ష్మణునకు సుఖము గలిగించునట్టి యమ్మహౌషధియీశిఖరమునందే పుట్టియున్నదని తెలియ వచ్చుచున్నది. ౨౬

అగృహ్య యది గచ్ఛామి విశల్యకరణీం మహామ్. ౨౭
కాలాత్యయేన దోష స్స్యా ద్వైక్లబ్యంచ మహ ద్భవేత్,

ఇతి సంచిన్త్య హనూమాన్క్షిప్రం గత్వా మహాబలః. ౨౮
ఆసాద్య పర్వతశ్రేష్ఠం త్రిః ప్రకమ్ప్య గిరే శ్శిరః,
ఫుల్లనానాతరుగణం సముత్పాట్య మహాబలః. ౨౯
గృహీత్వా హరిశార్దూలో హస్తాభ్యాం సమతోలయత్,
స నీల మివ జీమూతం తోయపూర్ణం నభస్స్థలాత్. ౩౦
ఆపపాత గృహీత్వా తు హనుమాన్ శిఖరం గిరేః,

సమాగమ్య మహావేగ స్సన్న్యస్య శిఖరం గిరేః. ౩౧
విశ్రమ్య కించి ద్ధనుమాన్ సుషేణ మిద మబ్రవీత్,

ఓషధిం నావగచ్ఛామి తా మహం హరిపుఙ్గవ!. ౩౨
త దిదం శిఖరం కృత్స్నం గిరే స్తస్యాహృతం మయా,

ఏవం కథయమానం తం ప్రశస్య పవనాత్మజమ్. ౩౩
సుషేణో వానరశ్రేష్ఠో జగ్రాహోత్పాట్య చౌషధీమ్,
విస్మితా స్తు బభూవు స్తే రణే వానరరాక్షసాః. ౩౪
దృష్ట్వా హనుమతః కర్మ సురైరపి సుదుష్కరమ్,
తత స్సంక్షోదయిత్వా తా మోషధీం వానరోత్తమః. ౩౫
లక్ష్మణస్య దదౌ నస్త స్సుషేణ స్సుమహాద్యుతిః,

నేను నాకువిశల్యకరణి యేదో తెలియలేదని యమ్మహౌషధిం దీసికొనక యే పోవుదునేని పోయి తెలిసికొని మఱలవచ్చి తీసికొనిపోవునంతలోఁ గాలాత్యయమయి లక్ష్మణుని బ్రతికించుట తప్పిపోయి మహాహానిసంభవించును. అది హనుమంతుం డాలోచించెను. ౨౭

మహాబలశాలియగు వానరశ్రేష్ఠుడు హనుమంతుఁడు ఇవ్విధంబున నాలోచించి శీఘ్రముగంబోయియప్పర్వతంబుఁజేరి దానిశిఖరంబును మున్మూఁడు కదలించి వికసితపుష్పంబులగువృక్షములతోఁగూడఁ బెకలించి చేతులతో నెత్తుకొనెను. ౨౮-౨౯

ఆకాశంబున జలపూర్ణమయిన మేఘమును వాయువు దీసికొని వచ్చునట్లు ఆహనుమంతుఁడు ఆపర్వతశిఖరమును దీసికొని యాకాశమార్గంబున వచ్చెను. ౩౦

ఆహనుమంతుఁడట్లు మహావేగంబున రాముదులయొద్దకు వచ్చి యచటఁబర్వత శిఖరంబుంచి కొంత విశ్రమించి సుషేణుంజూచి యిట్లని పలికెను. ౩౧

వానరోత్తముండవగు సుషేణుఁడా! నీవుచెప్పిన మూలికయేదో నాకుఁ గుఱుతు తెలియలేదు. కావున నేను ఓషధిపర్వతమునందలి యీ దక్షిణ శిఖరమునంతయుఁ దెచ్చినాను. అని హనుమంతుఁడు సుషేణునితోఁ జెప్పెను. ౩౨

వానరోత్తముఁడగు సుషేణుఁడు ఇవ్విధంబునఁ జెప్పుచున్న హనుమంతుఁ బ్రశంసించి యమ్మహౌషధిం బెల్లగించి యెత్తెను. ౩౩

యుద్ధభూమి నున్నవానరులును రాక్షసులును దేవతలకైనను జేయ నలవిగాని హనుమంతుని కార్యమును జూచి యందఱు నాశ్చర్యపడిరి. ౩౪

అంత వానర శ్రేష్ఠుండగు సుషేణుఁడు అమ్మహౌషధిననలిపి మహాతేజుఁడగు లక్ష్మణుని ముక్కునం బిడిచెను. ౩౫

సశల్యస్తాం సమాఘ్రాయ లక్ష్మణః పరవీరహా. 36
విశల్యో విరుజ శ్శీఘ్ర ముదతిష్ఠ న్మహీతలాత్,

త ముత్థితం తే హరయో భూతలా త్ప్రేక్ష్య లక్ష్మణమ్. 37
సాధుసాధ్వితి సుప్రీతా స్సుషేణం ప్రత్యపూజయన్,
ఏహ్యేహీ త్యబ్రవీ ద్రామో లక్ష్మణం పరవీరహా. 38
సస్వజే స్నేహగాఢం చ బాష్పపర్యాకులేక్షణః,

అబ్రవీచ్చ పరిష్వజ్య సౌమిత్రిం రాఘవ స్తదా. 39
దిష్ట్యా త్వాం వీర! పశ్యామి మరణా త్పునరాగతమ్,

న హి మే జీవితేనార్థ స్సీతయా చాపి లక్ష్మణ!. 40
కో హి మే విజయేనార్థ స్త్వయి పఞ్చత్వ మాగతే,

ఇత్యేవం వదత స్తస్య రాఘవస్య మహాత్మనః. 41
ఖిన్న శ్శిథిలయా వాచా లక్ష్మణో వాక్య మబ్రవీత్,
తాం ప్రతిజ్ఞాం ప్రతిజ్ఞాయ పురా సత్యపరాక్రమ!. 42
లఘుః కశ్చి దివాసత్త్వో నైవం వక్తుమిహార్హసి,

న హి ప్రతిజ్ఞాం కుర్వన్తి వితథాం సాధవోఽనఘ!. 43
లక్షణం హి మహత్త్వస్య ప్రతిజ్ఞా పరిపాలనమ్,

నైరాశ్య ముపగన్తుం తే తదలం మత్కృతేఽనఘ!. 44
వధేన రావణస్యాద్య ప్రతిజ్ఞా మనుపాలయ,

ఆయుంధము నలుఁగు గ్రుచ్చుకొని బాధపడుచుండిన శత్రువీరహంత యగు లక్ష్మణుఁడు అమూలిక నాఘ్రాణించి నంతనె అలుఁగువీడి యెంత మాత్రము బాధలేనివాఁడై శీఘ్రంబున నేలపైనుండి లేచెను. ౩౬

మృతుఁడయి మఱల భూమినుండి లేచిన లక్ష్మణుఁజూచి యవ్వానరులు సుషేణుని సాధువాక్యంబులం బ్రశంసించిరి. ౩౭

శత్రువీరుల వధించునట్టి రాముఁడు లక్ష్మణుని గారవమ్మని పిలిచి కన్నులు నిండ సానంద బాష్పంబులతో స్నేహాతిశయంబునఁజేసి గాఢముగాఁ గవుఁగిలించుకొనెను. ౩౮

రాముండట్లు కౌఁగిటంజేర్చి లక్ష్మణునితో నిట్లుపలికెను. ౩౯

వీరుఁడవగు లక్ష్మణుఁడా! నీవు మృతుఁడవయ్యు భాగ్యవశంబున మఱల బ్రతుకం గంటిని.

లక్ష్మణుఁడా! నీవు మృతుఁడవే యయినయెడ నా ప్రాణంబులు, సీత, యివే నాకుఁ బనిలేనవ్వాను. ఇఁక నాకు యుద్ధంబున నీవిజయం బేల? అని రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పెను. ౪౦

మహాత్ముఁడగు రాముఁడు ఇట్లు చెప్పుచుండఁగా లక్ష్మణుఁడు దుఃఖితుండై నోరు తొట్రుపడ రామునితో నీమాటఁ జెప్పెను. ౪౧

ఎట్టికాలమునందును వ్యర్థముకాని పరాక్రమముగల రాముఁడా! నీవప్పుడు రావణునివధించి విభీషణునకు లంకారాజ్యం బొసంగెదనని ప్రతిజ్ఞ చేసి యిప్పుడు బలహీనుఁడైన యల్పునియట్లు నీవివ్విధంబునఁ జెప్పవలదు. ౪౨

పాపరహితుఁడవగు రాముఁడా! సత్పురుషులు తాము గావించిన ప్రతిజ్ఞను వ్యర్థము గావింతురా? చేసిన ప్రతిజ్ఞ దప్పక నెఱవేర్చుట గదా గొప్పతనమునకు లక్షణము. ౪౩

పాపరహితుఁడవగు రాముఁడా! నానిమిత్తమయి నీవు దుఃఖముచే నిరాశపడుట చాలును. ఇఁక నివుడు రావణుని వధించి నీప్రతిజ్ఞను నెఱవేర్పుము. ౪౪

న జీవన్నాస్య తే శత్రు స్తవ బాణపథం గతః. ౭౫
నర్దత స్తీక్ష్ణదంష్ట్రస్య సింహస్యేవ మహాగజః,

అహం తు వధ మిచ్ఛామి శీఘ్ర మస్య దురాత్మనః. ౭౬
యావ దస్తం న యాత్యేష కృతకర్మా దివాకరః,

యది వధ మిచ్ఛసి రావణస్య సఙ్ఖ్యే
యది చ కృతాం త్వమి హేచ్ఛసి ప్రతిజ్ఞామ్. ౭౭
యది తవ రాజవరాత్మజాభిలాషః
కురు చ వచో మమ శీఘ్రమద్య వీర!.

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే-ద్వ్యుత్తరశతతమస్సర్గః. ౧౦౨.

---

## త్ర్యుత్తరశతతమస్సర్గః.

లక్ష్మణేన తు తద్వాక్య ముక్తం శ్రుత్వా స రాఘవః,
సందధే పరవీరఘ్నో ధనురాదాయ వీర్యవాన్. ౧
రావణాయ శరా న్ఘోరా న్విససర్జ చమూముఖే,

అథాన్యం రథ మారుహ్య రావణో రాక్షసాధిపః. ౨
అభ్యద్రవత కాకుత్స్థం స్వర్భాను రివ భాస్కరమ్,
దశగ్రీవో రథస్థ స్తు రామం వజ్రోపమైశ్శరైః. 3
ఆజఘాన మహాఘోరై ర్ధారాభి రివ తోయదః,

దీప్తపావకసఙ్కాశై శ్శరైః కాఞ్చనభూషణైః. ౪
నిర్బిభేద రణే రామో దశగ్రీవం సమాహి(తమ్)తః,

కలుషం గోఱలతో గర్జించుచున్న సింహము కంటంబడిన మదపు టేనుంగు జీవింపఁజాలనట్లు నీబాణమునకు గుఱియయిన శత్రు వెంతమాత్రము జీవించి పోఁజాలఁడు. ౪౫

నేనుమాత్రము సూర్యుఁడు సంచారము ముగించి యస్తమించు నంతలో దురాత్ముఁడగు నీరావణుఁడు శీఘ్రముగా హతుఁడు గావలెనని కోరుచున్నాను. ౪౬

వీరుఁడవగు రాముఁడా! నీవు రావణుని యుద్ధంబున వధింపఁ గోరుదువేని నీవు విభీషణునకుఁ గావించిన ప్రతిజ్ఞ నెఱవేర్పఁ దలంతువేని రాజశ్రేష్ఠుఁడగు జనకమహారాజుకూఁతురయిన సీతను బొందుటయు నీకిష్టమగునేని నేను జెప్పినమాటను శీఘ్రముగఁగావింపుము. అనిలక్ష్మణుఁడు రామునితోఁ జెప్పెను. ౪౭

ఇది నూటరెండవసర్గము.

## నూటమూఁడవసర్గము.

మహాపరాక్రమశాలియుం శత్రువీరులవధించువాఁడునగు రాముఁడు లక్ష్మణుఁడు చెప్పినమాటనువిని ధనువునెత్తి సంధించెను. ౧

ఆరాముఁడు సేనాముఖంబునరావణునిపై భయంకరంబులగు బాణంబులం బ్రయోగించెను.

ఇంతలో రాక్షసేశ్వరుఁడు రావణుఁడు మఱియొకరథమారోహించి రాహువుసూర్యునిమీఁదికడరునట్లు రామునిమీఁదికిఁ బోయెను. ౨

రథగతుండైయున్న రావణుఁడు మేఘము జలధారలు కురియునట్లు రామునిపై మిక్కిలియు భయంకరములయిన వజ్రసారములగుబాణంబులం బ్రయోగించి నొప్పించెను. ౩

రాముఁడు యుద్ధంబునసమర్థుండఁగురావణునిపై మండుచున్న నిప్పువంటి కాంచనపుంఖంబులగు బాణంబుల నేసి నొప్పించెను. ౪

భూమిష్ఠ స్థితస్య రామస్య రథస్థస్య చ రక్షసః. ౫
న సమం యుద్ధ మిత్యాహు ర్దేవగన్ధర్వదానవాః,
తతః కాఞ్చన చిత్రాఙ్గః కిఙ్కిణీశతభూషితః. ౬
తరుణాదిత్యసఙ్కాశో వైడూర్యమయకూబరః,
సదశ్వై ర్కాఞ్చనాపీడై ర్యుక్త శ్శ్వేతప్రకీర్ణకైః. ౭
హరిభి స్సూర్యసఙ్కాశై ర్హేమజాలవిభూషితైః,
రుక్మవేణుధ్వజ శ్శ్రీమా న్దేవరాజరథో వరః. ౮
దేవరాజేన సన్దిష్టో రథ మారుహ్య మాతలిః,
అభ్యవర్తత కాకుత్స్థ మవతీర్య త్రివిష్టపాత్. ౯

అబ్రవీచ్చ తదా రామం సప్రతోదో రథే స్థితః,
ప్రాఞ్జలి ర్మాతలి ర్వాక్యం సహస్రాక్షస్య సారథిః. ౧౦
సహస్రాక్షేణ కాకుత్స్థ! రథోఽయం విజయాయ తే,
దత్త స్తవ మహాసత్త్వ! శ్రీమన్! శత్రునిబర్హణ!. ౧౧
ఇద మైన్ద్రం మహచ్చాపం కవచం చాగ్నిసన్నిభమ్,
శరాశ్చాదిత్యసంకాశా శ్శక్తిశ్చ విమలా శితా. ౧౨

ఆరుహ్యేమం రథం వీర! రాక్షసం జహి రావణమ్,
మయా సారథినా రాజ! న్మహేన్ద్ర ఇవ దానవాన్. ౧౩

ఇత్యుక్త స్సంపరిక్రమ్య రథం సమభివాద్య చ,
ఆరురోహ తదా రామో లోకా న్లక్ష్మ్యా విరాజయన్. ౧౪

త ద్బభూవాద్భుతం యుద్ధం తుములం రోమహర్షణమ్,

రాముఁడు భూమిపైనుండియుం రావణుండు రథగతుండయ్యు యుద్ధము సేయుటసరి కాదని దేవతలును గంధర్వులును దానవులును వచించిరి.

అంత దేవేంద్రుని సారథియగు మాతలి దేవేంద్రుని పచుపున బంగారము చేఁజిత్రితంబును అనేకములయిన ఘంటలచే నలంకృతమును బాలసూర్యునివలె వెలుంగుచున్నదియు వైడూర్య మణితోఁ జేయఁబడిన నొగ గలదియుం శిరస్సునఁ గాంచనాలంకారములు గలవియుం దేహమంతయుఁ గాంచనాభరణములచే నలంకృతములును జెల్లని వింజారములతోఁ గూడినవియుం హారితవర్ణంబులయిన యుత్తమాశ్వంబులు పూన్చినదియుం సువర్ణ దండధ్వజంబును శ్రీమంతంబునగు దేవేంద్రరథము నారోహించి దానిం దీసికొని స్వర్గమునుండి డిగ్గి రాముని యొద్దకు వచ్చెను. ౯

అంత దేవేంద్రుని సారథియగు మాతలి మునికోలఁ జేకొని రథంబుననున్న వాఁడై చేమోడ్పు గీలించి రామునితో నిట్లని పలికెను. ౧౦

మహాబలుఁడవు శ్రీమంతుఁడవు శత్రువులవధించువాఁడవగు రాముఁడా! నీకు విజయంబు గలుగుటకై దేవేంద్రుండు ఈరథంబును నీకొసంగెను. ౧౧

మఱియు గొప్పదగు నీయైంద్రధనుస్సును నిప్పువంటి యీకవచంబును సూర్యసమానంబులగు బాణంబులను నిర్మలంబును దీక్ష్ణంబునగు శక్తిని ఇంద్రుండు నీకొసంగెను. ౧౨

మరాక్రమశాలివగు రాముఁడా! మున్ను దేవేంద్రుఁడు ఈరథము నారోహించి నేను సారథినై యుండఁగా దానవులను వధించినట్లు నీవిపుడు నేను సారథినై యుండఁగా నీయరదము నారోహించి రావణుని వధింపుము. అని మాతలి రామునితోఁ జెప్పెను. ౧౩

అప్పుడు రాముఁడు మాతలివాక్యము విని ఆమ్మహారథమునకుఁ బ్రదక్షిణ నమస్కారంబు గావించి తన దేహకాంతిచే లోకంబుల వెలుంగఁ జేయుచు నారథము నారోహించెను. ౧౪

అంత మహాబాహుండగు రామునకును రావణునకును జూపరులకు ఆశ్చ-

రామస్య చ మహాబాహో రావణస్య చ రక్షసః. ౧౫
స గాన్ధర్వేణ గాన్ధర్వం దైవం దైవేన రాఘవః,
అస్త్రం రాక్షసరాజస్య జఘాన పరమాస్త్రవిత్. ౧౬

అస్త్రం తు పరమం ఘోరం రాక్షసం రాక్షసాధిపః,
ససర్జ పరమక్రుద్ధః పునరేవ నిశాచరః. ౧౭
తే రావణధనుర్ముక్తాశ్శరాః కాఞ్చనభూషణాః,
అభ్యవర్తన్త కాకుత్స్థం సర్పా భూత్వా మహావిషాః. ౧౮
తే దీప్తవదనా దీప్తం వమన్తో జ్వలనం ముఖైః,
రామమేవాభ్యవర్తన్త వ్యాదితాస్యా భయానకాః. ౧౯
తైర్వాసుకిసమస్పర్శైర్దీప్తభోగైర్మహావిషైః,
దిశశ్చ సంతతాస్సర్వాః ప్రదిశశ్చ సమావృతాః. ౨౦
తాన్దృష్ట్వా పన్నగాన్రామస్సమాపతత ఆహవే,
అస్త్రం గారుత్మతం ఘోరం ప్రాదుశ్చక్రే భయావహమ్. ౨౧
తే రాఘవశరా ముక్తా రుక్మపుఙ్ఖాశ్శిఖిప్రభాః,
సుపర్ణాః కాఞ్చనా భూత్వా విచేరుస్సర్పశత్రవః. ౨౨

తే తాన్ సర్వాన్ శరాఞ్జఘ్నుస్సర్పరూపాన్మహాజవాన్,
సుపర్ణరూపా రామస్య విశిఖాః కామరూపిణః. ౨౩

అస్త్రే ప్రతిహతే క్రుద్ధో రావణో రాక్షసాధిపః,
అభ్యవర్షత్తదా రామం ఘోరాభిశ్శరవృష్టిభిః. ౨౪
తతశ్శరసహస్రేణ రామమక్లిష్టకారిణమ్,
అర్దయిత్వా శరౌఘేణ మాతలిం ప్రత్యవిధ్యత. ౨౫

ర్యకరంబును గగుర్పాటుగలిగించునదియు నగు మహాయుద్ధంబయ్యె. ౧౫

సమస్తములయిన దివ్యాస్త్రంబులం దెలిసినట్టి యా రాముండు రావణుండు ప్రయోగించిన గాంధర్వాస్త్రమును గాంధర్వాస్త్రముచేతను దైవాస్త్రమును దైవాస్త్రముచేతను నివారించెను. ౧౬

రాక్షసరాజయిన రావణుండు పరమకుపితుండై మఱలం బరమభయంకరమయిన రాక్షసాస్త్రమును బ్రయోగించెను. ౧౭

కాంచనపుంఖంబులగు నాబాణంబులు రావణునిధనుస్సునుండి వెడలి తీక్ష్ణమయినవిషముగల సర్పములయి రామునిమీఁదికడరినవి. ౧౮

ఆసర్పములు మండుచున్న నోళ్ళతో నోరు దెఱచుకొని నోళ్ళనుండి మంటలు వెడలభయంకరాకారంబులయి రామునిమీఁదికే వచ్చినవి. ౧౯

వాసుకితో సమానంబులును జ్వలించుచున్న పడగలుగలవియుం మహావిషములునగు నాసర్పములు దిక్కులను విదిక్కులను వ్యాపించిచెలంగినవి. ౨౦

యుద్ధంబున రాముండు తనమీఁదికి వచ్చుచున్న యమ్మహాసర్పంబులం జూచి తీక్ష్ణంబును భయంకరంబునగు గారుడాస్త్రంబును బ్రయోగించెను. ౨౧

కాంచనపుంఖంబులును అగ్నిసమానంబులునగు నా రామబాణంబులు ధనుర్ముక్తంబులయి సర్పశత్రువులయిన కాంచనవర్ణంబులగు గరుడపక్షులయి విహరించినవి. ౨౨

గరుడరూపధరంబులైన కామరూపంబులగు నారామబాణంబులు సర్పరూపంబులయిన మహావేగంబులగు నారావణబాణంబులనన్నింటిని సంహరించెను. ౨౩

రాక్షసరాజయిన రావణుండు తనయస్త్రంబు ప్రతిహతమగుటంజూచి కుపితుండై భయంకరములయిన బాణవర్షంబులు రామునిపయిఁగురిసెను. ౨౪

అంత నా రావణుండు శ్రమములేకయె యెంతటికార్యము నేని చేయునట్టి రాముని వేయిబాణంబుల నొప్పించి పెక్కుబాణంబుల మాతలిం బ్రహరించెను. ౨౫

చిచ్ఛేద కేతు ముద్దిశ్య శరేణైకేన రావణః,
పాతయిత్వా రథోపస్థే రథాత్కేతుం చ కాఞ్చనమ్. ౨౬
ఐన్ద్రా నపి జఘానాశ్వాన్ శరజాలేన రావణః.
తద్దృష్ట్వా సుమహ త్కర్మ రావణస్య దురాత్మనః. ౨౭
విషేదు ర్దేవగన్ధర్వా దానవా శ్చారణై స్సహ,
రామ మార్తం తదా దృష్ట్వా సిద్ధా శ్చ పరమర్షయః. ౨౮
వ్యథితా వానరేన్ద్రాశ్చ బభూవు స్సవిభీషణాః,
రామచన్ద్రమసం దృష్ట్వా గ్రస్తం రావణరాహుణా. ౨౯
ప్రాజాపత్యం చ నక్షత్రం రోహిణీం శశినః ప్రియామ్,
సమాక్రమ్య బుధ స్తస్థౌ ప్రజానా మశుభావహః. ౩౦
స ధూమపరివృత్తోర్మి ర్ప్రజ్వల న్నివ సాగరః,
ఉత్పపాత తదా క్రుద్ధ స్స్పృశ న్నివ దివాకరమ్. ౩౧

శస్త్రవర్ణ స్సుపరుషో మన్దరశ్మి ర్దివాకరః,
అదృశ్యత కబన్ధాఙ్క స్సంసక్తో ధూమకేతునా. ౩౨
కోసలానాం చ నక్షత్రం వ్యక్త మిన్ద్రాగ్నిదైవతమ్,
ఆక్రమ్యాఙ్గారక స్తస్థౌ విశాఖా మపి చామ్బరే. ౩౩
దశాస్యో వింశతిభుజః ప్రగృహీతశరాసనః,
అదృశ్యత దశగ్రీవో మైనాక ఇవ పర్వతః. ౩౪
నిరస్యమానో రామస్తు దశగ్రీవేణ రక్షసా,
నాశక్నో దభిసంధాతుం సాయకా న్రణమూర్ధని. ౩౫

స కృత్వా భ్రుకుటీం క్రుద్ధః కించిత్సంరక్తలోచనః,

అంత దశకంఠుఁడు ఇంద్రరథము యొక్క ధ్వజము మీఁద నొక బాణము వేసి దానిం బడఁద్రోసెను.

దశగ్రీవుఁడు ఇట్లు ధ్వజమును రథముమీఁదఁ బడవేసి యంతఁ బెక్కు బాణములచే నింద్రుని గుఱ్ఱములను నొప్పించెను. ౨౬

దేవతలును గంధర్వులును దానవులును చారణులు దురాత్ముఁడగు దశగ్రీవుఁడు గావించిన యీగొప్పకార్యము చూచి విషణ్ణులైరి. ౨౭

సిద్ధులును మహర్షులును విభీషణ సహితంబుగా వానరవీరులును రాముండార్తుండగుటను జూచి యందఱును దుఃఖమునొందిరి. ౨౮

బుధుఁడు రోహిణీనక్షత్రము నొందినపుడు జగత్పీడ గలుగునని జ్యోతిశ్శాస్త్రప్రసిద్ధము. ౨౯,౩౦

ఆరావణుఁడు అప్పుడు క్రుద్ధుఁడై ధూమసహితంబుగా జ్వలించుచున్న సముద్రమువలె భయంకరాకారుఁడై సూర్యునివలెను వ్యాపించువాఁడువలెఁ జూపట్టెను. ౩౧

సూర్యుఁడును గాంతిహీనుఁడై కత్తివలె శ్యామలవర్ణుఁడై కబంధాకారమయిన ధూమకేతువుఁ గూడినవాఁడై నాతిక్రూరుఁడై కనఁబడెను. ౩౨

ఆకాశంబున ఇక్ష్వాకువంశపురాజుల నక్షత్రమయిన ఇంద్రాగ్నిదైవత్యంబగు విశాఖానక్షత్రంబును అంగారకుఁ డాక్రమించెను. ౩౩

రావణుఁడు పదితలలతోను ఇరువదిభుజంబులతోను ధనుర్ధరుండై మైనాకపర్వతముంబోలెఁ జూడనొప్పెను. ౩౪

యుద్ధంబున రావణుఁడు అత్యుగ్రుఁడై యిరువదిచేతులతోను బాణంబులఁ బ్రయోగించి విజృంభించుటయు రామునకు వింట బాణంబులు సంధించుటకైనను అవకాశంబు లేక చేతులాడవయ్యె. ౩౫

మొదలే కుపితుఁడై యున్న రాముఁడు ముఖంబున బొమముడి యొప్పఁ

జగామ సుమహాక్రోధం నిర్దహన్నివ చక్షుషా. 36

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే - త్ర్యుత్తరశతతమస్సర్గః. ౧౦3.

---

చతురుత్తరశతతమస్సర్గః.

తస్య క్రుద్ధస్య వదనం దృష్ట్వా రామస్య ధీమతః,
సర్వభూతాని విత్రేసుః ప్రాకమ్పత చ మేదినీ. ౧
సింహశార్దూలవాన్ శైల స్సంచచాల చలద్ద్రుమః,
బభూవచాతిక్షుభిత స్సముద్ర స్సరితాం పతిః. ౨
ఖ(గా)రాశ్చ ఖరనిర్ఘోషా గగనే పరుషా ఘనాః,
ఔత్పాతికాని నర్దన్త స్సమన్తా త్పరిచక్రముః, 3

రామం దృష్ట్వా సుసంక్రుద్ధముత్పాతాంశ్చ సుదారుణాన్,
విత్రేసుస్సర్వభూతాని రావణస్యాభవద్భయమ్. ౪

విమానస్థా స్తదా దేవా గన్ధర్వా శ్చ మహోరగాః,
ఋషిదానవదైత్యాశ్చ గరుత్మన్త శ్చ ఖేచరాః. ౫
దదృశు స్తే మహాయుద్ధం లోకసంవర్తసంస్థితమ్,
నానాప్రహరణై ర్భీమై శ్శూరయో స్సంప్రయుధ్యతోః. ౬
ఊచు స్సురాసురాస్సర్వే తదా విగ్రహ మాగతాః,
ప్రేక్షమాణా మహా ద్యుద్ధం వాక్యం భక్త్యా ప్రహృష్టవత్. ౭

దశగ్రీవం జయేత్యాహు రసురా స్సమవస్థితాః,

దేవా రామ మథోచు స్తే త్వం జయేతి పునఃపునః. ౮

గన్నులనెఱ్ఱఁదనంబు గదురఁ జూపులఁ బ్రపంచమును దహించువాఁడువలె నత్యుగ్రుఁడై మహాకోపంబు వహించెను. ౩౬

ఇది నూటమూఁడవసర్గము.

## నూటనాలుగవసర్గము.

కుపితుండయిన బుద్ధిమంతుఁడగు నారాముని ముఖంబుఁజూచి సమస్త భూతములును భయమునొందినవి. భూమియుఁ గంపమునొందెను. ౧

సింహములతోను బులులతోనుఁగూడిన పర్వతము, వృక్షంబులు కదలఁ జలనమునొందెను. నదీపతియగు సముద్రమును క్షోభంబునొందెను ౨

ఆకాశంబున ఘోరమయిన ధ్వనిగల పక్షులును బరుషములగు మేఘంబులును మహోత్పాత సూచకములయిన ధ్వనులఁ జేయుచు నంతటను విహరించినవి. ౩

రాముఁడు పరమక్రుద్ధుఁ డగుటయు భయంకరములగు నుత్పాతములు పొడముటయుఁజూచి, సమస్తభూతంబులును భయంబునొందినవి; రావణుఁడును భయపడెను. ౪

అపుడు శూరులగు నారామరావణులు నానావిధ భయంకరాయుధములఁ జిత్రంబుగాఁ బోరుటయు లోకప్రళయ భీకరంబయిన యమ్మహాయుద్ధమును దేవతలును గంధర్వులును మహోరగులును మహర్షులును దానవులును దైత్యులును విమానగతులయి యాకాశంబుననుండి చూచుచుండిరి. ౫ ౬

అప్పుడు సురలును అసురులును మిక్కిలియు నపేక్షతో నమ్మహాయుద్ధంబుఁజూచుచు దేవతలు రామపక్షపాతమునను అసురులు రావణపక్షపాతమునను ఒకరితో నొకరు కలహించి సంతోషంబున నీమాటఁ బలికిరి. ౭

అసురులు, రావణునిపైఁ బక్షపాతముగలవారలయి రావణునకు జయంబు గలుగుఁగాక యని పలికిరి.

అంత నాదేవతలును నీకు జయంబు గలుగుఁగాక యని పలుమాఱు

ఏతస్మి న్నన్తరే క్రోధా ద్రాఘవస్య స రావణః,
ప్రహర్తుకామో దుష్టాత్మా స్పృశ న్ప్రహరణం మహత్. ౯

వజ్రసారం మహానాదం సర్వశత్రునిబర్హణమ్,
శైలశృఙ్గనిభైః కూటై శ్చితం దృష్టిభయావహమ్. ౧౦
సధూమ మివ తీక్ష్ణాగ్రం యుగాన్తాగ్ని చయోపమమ్,
అతిరౌద్ర మనాసాద్యం కాలేనాపి దురాసదమ్. ౧౧
త్రాసనం సర్వభూతానాం దారణం భేదనం తథా,
ప్రదీప్త మివ రోషేణ శూలం జగ్రాహ రావణః. ౧౨

తచ్ఛూలం పరమక్రుద్ధో మధ్యే జగ్రాహ వీర్యవాన్,
అనేకై స్సమరే శూరై రాక్షసైః పరివారితః. ౧౩

సముద్యమ్య మహాకాయో ననాద యుధి భైరవమ్,
సంరక్తనయనో రోషా త్స్వసైన్య మభిహర్షయన్. ౧౪

పృథివీం చాన్తరిక్షం చ దిశశ్చ ప్రదిశ స్తథా,
ప్రాకమ్పయ త్తదా శబ్దో రాక్షసేన్ద్రస్య దారుణః. ౧౫

అతినాదస్య నాదేన తేన తస్య దురాత్మనః,
సర్వభూతాని విత్రేసు స్సాగరశ్చ ప్రచుక్షుభే. ౧౬

స గృహీత్వా మహావీర్య శ్శూలం త ద్రావణో మహత్,

రాముం జూచి వచించిరి. ౮

ఈనడుమ దురాత్ముఁడగు రావణుఁడు రామునిపైఁ గ్రోధంబున రాముని బ్రహరింపఁగోరినవాఁడై మహాభయంకరమయిన యాయుధంబు నొకటి దీసెను. ౯

రావణుఁడు రోషావేశంబున మండిపడుచు వజ్రాయుధంబునకుఁ బోలె సారంబుగలదియు మహాధ్వనితోఁ గూడినదియు సమస్తశత్రువుల సంహరించు నదియు పర్వతశిఖరాకారములయిన శిఖరములు గలదియుఁ జూపరులకు భయంకరంబును గొంచెము శ్యామలవర్ణముతోఁగలసి ప్రకాశముగలుగుటచే ధూమసహితం బగు నగ్నివలె నున్నదియుఁ బ్రళయకాలాగ్ని సమూహంబుంబోలె మహాభయంకరంబును ఎట్టివారికిని అప్రధృష్యమును యమునికైనను జెనక నలవిగానిదియు సమస్తభూతంబులను భయంకరంబును ఆంపమువలెఁ జీల్చునదియు గొడ్డలివలె ఛేదించునదియు నగు మహాశూలంబును గ్రహించెను

అట్లు పరమకుపితుండయి మహాపరాక్రమశాలియగు నారావణుఁడు యుద్ధంబున శూరులు పెక్కండ్రు రాక్షసులు దన్నుపరివేష్టించి కొలువ నమ్మహాశూలంబును నడుమంబట్టెను ౧౩

మహాకాయుఁడగు దశగ్రీవుఁడు యుద్ధంబునందు రోషావేశమునఁ గన్నులం గెంజాయగదుర నమ్మహాశూలంబునెత్తి తనసైన్యంబాతనియం సంతోషించునట్లు భయంకరముగా సింహనాదంబు గావించెను. ౧౪

అప్పుడు నిశాచరేంద్రుఁడగు దశగ్రీవునియొక్క భయంకరమయిన సింహనాదధ్వనికి భూమియు నంతరిక్షంబును దిక్కులును విదిక్కులును అదరెను. ౧౫

గొప్పకంఠధ్వనిగల దురాత్ముఁడగు నాదశగ్రీవుని సింహనాదమునకు సమస్తభూతంబులును భయంబు నొందినది; సముద్రంబును సంక్షోభంబు నొందెను ౧౬

మహాపరాక్రమశాలియగు నాదశగ్రీవుఁడు ఇట్లు అమ్మహాశూలంబు

వినద్య సుమహానాదం రామం పరుష మబ్రవీత్. ౧౭

శూలోఽయం వజ్రసార స్తే రామ! రోషా న్మయోద్యతః,
తవ భ్రాతృసహాయస్య సద్యః ప్రాణా న్హరిష్యతి. ౧౮
రక్షసా మద్య శూరాణాం నిహతానాం చమూముఖే,
త్వాం నిహత్య రణశ్లాఘి! న్కరోమి తరసా సమమ్. ౧౯
తిష్ఠేదానీం నిహన్మి త్వామేష శూలేన రాఘవ!,

ఏవ ముక్త్వా స చిక్షేప తచ్ఛూలం రాక్షసాధిపః. ౨౦

తద్రావణకరా న్ముక్తం విద్యుజ్జ్వాలాసమాకులమ్,
అష్టఘణ్టం మహానాదం వియద్గతమశోభత. ౨౧

తచ్ఛూలం రాఘవో దృష్ట్వా జ్వలన్తం ఘోరదర్శనమ్,
ససర్జ విశిఖా న్రామ శ్చాప మాయమ్య వీర్యవాన్. ౨౨

ఆపతన్తం శరౌఘేణ వారయామాస రాఘవః,
ఉత్పతన్తం యుగాన్తాగ్నిం బలౌఘై రివ వాసవః. ౨౩

నిర్దదాహ స తా న్బాణా న్రామకార్ముకనిస్సృతాన్,
రావణస్య మహాశూలః పతఙ్గానివ పావకః. ౨౪
తా న్దృష్ట్వా భస్మసాద్భూతాన్ శూలసంస్పర్శచూర్ణితాన్,
సాయకా నన్తరిక్షస్థా న్రాఘవః క్రోధ మాహరత్. ౨౫
స తాం మాతలినా నీతాం శక్తిం వాసవనిర్మితామ్,
జగ్రాహ పరమక్రుద్ధో రాఘవో రఘునన్దనః. ౨౬

గ్రహించి మహాధ్వని గలుగునట్లు సింహనాదము గావించి రామునిఁజూచి పరుషముగా నిట్లని పలికెను. ౧౮

రాముఁడా! నీకొఱకై నే నిప్పుడు రోషంబున నెత్తిన వజ్రసారం బగు నీశూలంబు నీ క్షణంబుననె నిన్ను నీతమ్ముని వధింపఁగలదు. ౧౯

యుద్ధగర్వితుఁడవగు రాముఁడా! నిన్ను ఇప్పుడు శీఘ్రంబున వధించి ఇదివఱకు మా సేనలో హతులయిన శూరులగు రాక్షసులతోఁ జేర్చివేసెదను.

రాముఁడా! కొంచెము నిలువుము. ఇప్పుడే శూలంబున నిన్ను వధించి పుచ్చెదను. అని రావణుండు రామునితోఁ జెప్పెను.

నిశాచరనాథుఁడగు దశగ్రీవుండు ఇవ్విధంబునం జెప్పి యాశూలంబుఁ బ్రయోగించెను. ౨౦

ఆ శూలము రావణుని హస్తంబునుండి వెడలినదై మెఱపులతోను జ్వాలలతోఁగూడి ఎనిమిదిఘంటలతో మహాధ్వనిగలదై యాకాశంబున నెంతయుఁ బ్రకాశించెను. ౨౧

పరాక్రమవంతుఁడగు రాముఁడు జ్వలించుచు భయంకరాకారంబై వచ్చుచున్న యమ్మహాశూలంబుఁజూచి ధనుస్సు నాకర్షించి బాణంబులం బ్రయోగించెను. ౨౨

ప్రళయకాలమునందుఁ బ్రజ్వలించుచున్న యగ్నిని ఇంద్రుడు జల ప్రవాహంబులచే వారించునట్లు రాముఁడు తనపైకి వచ్చుచున్న యా శూలమును బాణసమూహములచే వారించెను. ౨౩

రాముఁడు ప్రయోగించిన బాణంబులు రావణుని యమ్మహాశూలంబుపైఁబడి యగ్నింబడిన శలభంబుల గతి దగ్ధములయ్యె. ౨౪

రాముఁడు తనబాణంబులు అంతరిక్షంబుననే శూలంబు దాఁకి చూర్ణితంబులయి దగ్ధములగుటంజూచి మిక్కిలియుఁ గోపము నొందెను. ౨౫

రఘువంశమునం బుట్టినవారి సంతోషపఱచునట్టి యారాముండు అట్లు పరమకుపితుఁడై తనకు మాతలి దెచ్చియిచ్చి దేవేంద్ర నిర్మితంబయిన మహా

సా తోలితా బలవతా శక్తిర్ఘణ్టాకృతస్వనా,
నభగ ప్రజ్వాలయామాస యుగాన్తోల్కేవ సప్రభా. ౨౭

సా క్షిప్తా రాక్షసేన్ద్రస్య తస్మిన్ శూలే పపాత హ,
భిన్న శ్శక్త్యా మహాన్ శూలో నిపపాత హతద్యుతిః. ౨౮
నిర్బిభేద తతో బాణై ర్హయా నస్య మహాజవాన్,
రామ స్తీక్ష్ణై ర్మహావేగై ర్వజ్రకల్పై శ్శితై శ్శరైః. ౨౯

నిర్బిభేదోరసి తతో రావణం నిశితై శ్శరైః,
రాఘవః పరమాయత్తో లలాటే పత్త్రిభి స్త్రిభిః. ౩౦

స శరై ర్భిన్నసర్వాఙ్గో గాత్రప్రస్రుతశోణితః,
రాక్షసేన్ద్ర స్సమూహస్థః ఫుల్లాశోక ఇవాబభౌ. ౩౧

స రామబాణై రభివిద్ధగాత్రో
నిశాచరేన్ద్రః క్షతజార్ద్రగాత్రః,
జగామ ఖేదం చ సమాజమధ్యే
క్రోధం చ చక్రే సుభృశం తదానీమ్. ౩౨
ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే-చతురుత్తరశతతమస్సర్గః.

షణ్ణోత్తరశతతమస్సర్గః.

స తేన తు తథా క్రోధాత్కాకుత్స్థేనార్దితో రణే,
రావణ స్సమరశ్లాఘీ మహాక్రోధ ముపాగమత్. ౧

శక్తిని ఎత్తెను. ౨౬

అమ్మహాశక్తిని బలవంతుఁడగు రాముఁడెత్తి గిరగిరం ద్రిప్పుటయు అది ఘంటలచే మ్రోఁగుచు దేదీప్యమానంబై ప్రలయకాలమందలి కొఱవివలె యాకాశంబునంతయుఁ బ్రకాశింపఁజేసెను. ౨౭

అమ్మహాశక్తి ప్రయోగింపఁబడినదై రావణుని శూలంబు దాఁకుటయు నమ్మహాశూలంబు విఱిగి కాంతిహీనంబయి నేలంగూలెను. ౨౮

అంత రాముఁడు, క్రూరంబులును మహావేగంబులును వజ్రసారంబులు నగు శబ్దాయమానంబులైన (నానావిధములయిన) కఱకుబాణంబులం బ్రయోగించి మహావేగంబులగు నాదశగ్రీవునశ్వంబుల నొప్పించెను. ౨౯

అంత రాముఁడు తనబాణప్రయోగలాఘవం బేర్పడ రావణుని ఱొమ్మునం బెక్కు కఱకుటమ్ములను లలాటంబున మూఁడుబాణంబులం బ్రయోగించి నొప్పించెను. ౩౦

యుద్ధమధ్యంబున రావణుని దేహ మంతయు బాణంబులఁ భేదింపఁబడి నెత్తురు కాఱుటం జొత్తిల్లుటయు నయ్యాతుధానేంద్రుండు వికసించిన యశోకవృక్షమువలెఁ జూడ నొప్పెను. ౩౧

అప్పుడు యుద్ధమధ్యంబున, నిశాచరేంద్రుఁడగు నాదశముఖుఁడు రామబాణంబులచేఁ దద్దయు నభిహతుఁడై దేహమంతయు నెత్తురు దడియఁ గొంతఖిన్నుండయ్యు నంతలో మహాక్రోధంబు వహించెను. ౩౨

ఇది నూటనాలుగవ సర్గము.

## నూటయైదవ సర్గము.

యుద్ధగర్వితుఁడగు నారావణుఁడు అట్లు రాముఁడు యుద్ధమునందుఁ గోపంబునఁ దన్ను బాణంబుల నొప్పించుటయుఁ బరమక్రుద్ధుఁడయ్యెను. ౧

స దీప్తనయనో రోషా చ్చాప మాయమ్య వీర్యవాన్,
అభ్యర్దయ త్సుసఙ్క్రుద్ధో రాఘవం పరమాహవే. ౨

బాణధారాసహస్రై స్తై స్సతోయద ఇవామ్బరాత్,
రాఘవం రావణో బాణై స్తటాక మివ పూరయత్. 3

పూరిత శ్శరజాలేన ధనుర్ముక్తేన సంయుగే,
మహాగిరిరివాకమ్ప్యః కాకుత్స్థో న ప్రకమ్పతే. ౪
స శరై శ్శరజాలాని వారయ న్సమరే స్థితః
గభస్తీనివ సూర్యస్య ప్రతిజగ్రాహ వీర్యవాన్. ౫

తత శ్శరసహస్రాణి క్షిప్రహస్తో నిశాచరః,
నిజఘానోరసి క్రుద్ధో రాఘవస్య మహాత్మనః. ౬
స శోణితసమాదిగ్ధ స్సమరే లక్ష్మణాగ్రజః,
దృష్టః ఫుల్ల ఇవారణ్యే సుమహా న్కింశుకద్రుమః. ౭

శరాభిఘాతసంరబ్ధ స్సోఽపి జగ్రాహ సాయకాన్,
కాకుత్స్థ స్సుమహాతేజాః యుగాంతాదిత్యతేజసః. ౮

తతోఽన్యోన్యం సుసంరబ్ధా వుభౌ తౌ రామరావణౌ,
శరాన్ధకారే సమరే నోపాలక్షయతాం తదా. ౯

తతః క్రోధసమావిష్టో రామో దశరథాత్మజః,
ఉవాచ రావణం వీరః ప్రహస్య పరుషం వచః. ౧౦
మమ భార్యా జనస్థానా దజ్ఞానా ద్రాక్షసాధమ!,

అట్లు పరమకుపితుఁడై పరాక్రమశాలియగు నాదశముఖుఁడు కోపంబున నేత్రంబులు జ్వలింప నమ్మహాయుద్ధంబున ధనుస్సు నాకర్షించి బాణంబులేసి రాము నొప్పించెను. ౨

ఆకాశమునుండి మేఘము చెఱువునిండునట్లు ధారలుగా నధికవర్షము గురియువిధంబున, ఆ రావణుఁడు రాముని దేహాంబాతమును నిండునట్లు పెక్కుబాణంబులఁ బ్రయోగించెను. ౩

రాముఁడు అట్లు యుద్ధంబున బాణవర్షంబుల నొప్పింపఁబడియు నిశ్చలంబగు మహాపర్వతంబువలె నెంతమాత్రము చలనము నొందఁడయ్యె. ౪

పరాక్రమశాలియగు రాముఁడు యుద్ధంబున బాణంబులచే బాణసమూహంబులను వారించుచు నిలిచినవాఁడై రావణబాణంబులను సూర్యకిరణంబులనుంబోలె సహించెను. ౫

అంత నిశాచరేంద్రుఁడు కుపితుఁడై తనహస్తలాఘవం బేర్పడ, మహాపరాక్రమశాలియగు రామునిఱొమ్మునఁ బెక్కువేలబాణంబులు గుప్పించెను.

అప్పుడు యుద్ధంబున లక్ష్మణుని యన్న యగు రాముఁడు దేహమంతయు నెత్తుటం దడిసియుండుటం జేసి యరణ్యంబున వికసించిన గొప్పపలాశవృక్షమువలెఁ జూడ నొప్పెను. ౭

మహాతేజుఁడగు నారాముఁడును, రావణుఁడు బాణంబులచే నొప్పించుటకుఁ గుపితుఁడై ప్రళయకాలసూర్యులంబోలె నత్యుగ్రములయిన బాణంబుల నెత్తెను. ౮

అంత రామరావణులిద్దరును మహావేగంబున నొండొరులపై బాణంబుల నేయుటయు బాణంబులచే సూర్యరశ్మి దెలియక యంధకారంబు గలుగ నయ్యుద్ధంబున వార లొకరికొకరు కనఁబడరైరి. ౯

అంతఁ బరాక్రమవంతుఁ డగు దశరథపుత్త్రుఁడు రాముఁడు కుపితుఁడై రావణుంజూచి నవ్వి పరుషంబుగా నిట్లని పలికెను. ౧౦

రక్కసులలో నధముఁడ వగు దశముఖుఁడా! నీవు జనస్థానంబునఁ

హృతా తే వివశా యస్మా త్తస్మా త్త్వం నాసి వీర్యవాన్. ౧౧

మయా విరహితాం దీనాం వర్తమానాం మహావనే,
వైదేహీం ప్రసభం హృత్వా శూరోఽహ మితి మన్యసే. ౧౨

స్త్రీషు శూర! వినాథాసు పరదారాభిమర్శక!,
కృత్వా కాపురుషం కర్మ శూరోఽహ మితి మన్యసే. ౧౩

భిన్నమర్యాద! నిర్లజ్జ! చారిత్రే ష్వనవస్థిత!,
దర్పా న్మృత్యు ముపాదాయ శూరోఽహ మితి మన్యసే. ౧౪

శూరేణ ధనదభ్రాత్రా బలై స్సముదితేన చ,
శ్లాఘనీయం యశస్యం చ కృతం కర్మ మహ త్త్వయా. ౧౫

ఉత్సేకే నాభిపన్నస్య గర్హితస్యాహితస్య చ,
కర్మణః ప్రాప్నుహీదానీం తస్యాద్య సుమహత్ఫలమ్. ౧౬
శూరోఽహ మితి చాత్మాన మవగచ్ఛసి దుర్మతే!,
నైవ లజ్జాస్తి తే సీతాం చోరవ ద్వ్యపకర్షతః. ౧౭

యది మత్సన్నిధౌ సీతా ధర్షితా స్యా త్త్వయా బలాత్,
భ్రాతరం తు ఖరం పశ్యే స్తదా మత్సాయకై ర్హతః. ౧౮

దిష్ట్యాసి మమ దుష్టాత్మన్! చక్షుర్విషయ మాగతః,
అద్య త్వాం సాయకై స్తీక్ష్ణై ర్నయామి యమసాదనమ్. ౧౯

పెనిమిటి సమీపంబున లేకపోవుటవలన వివశురాలగు నాభార్యను నాకుఁ దెలియనట్లు రహస్యముగా హరించినావు కావున నీవు పరాక్రమవంతుఁడవు గావు. ౧౧

నన్ను ఎడఁబాసి దీనురాలై మహారణ్యమధ్యంబున నున్న సీతను నీవు బలాత్కారంబున నపహరించి "నేను శూరుఁడ" నని వృథా గర్వించి యున్నావు. ౧౨

పిఱికివాఁడా! పరస్త్రీలం జేపట్టువాఁడా! నీవు నాథుల నెడఁబాసిన స్త్రీలవిషయమయి దుర్మార్గులు నీచులు చేయఁదగిన కార్యము గావించి మరల "నేను వీరుఁడ" నని వృథాగర్వము వహించి యున్నావు. ౧౩

శాస్త్రమర్యాద నతిక్రమించినవాఁడా! సిగ్గు విడిచినవాఁడా! సదాచారములను వదలినట్టి దుర్మార్గుఁడా! గర్వమువలన నీవే నీకు మృత్యువు పుచ్చుకొంటివి; ఇంకను "నేను శూరుఁడ" నని వృథా గర్వము వదలకున్నావు. ౧౪

శూరుఁడవు కుబేరునితమ్ముఁడవు తపోబలము మొదలగు సమస్తబలముల చేతను సమృద్ధుఁడవు నీవు సీతాపహారము గావించుటచే సత్పురుషులచే శ్లాఘనీయంబును యశస్కరంబునగు గొప్పకార్యము చేసినవాఁడవైతివి! ౧౫

నీవు గర్వాతిరేకముచేఁ గావించిన నిందితంబును కీడు గలిగించునదియు నగు కాలముయొక్క మహాఫలమును ఇప్పు డనుభవింపుము. ౧౬

దుర్బుద్ధీ! నేను శూరుఁడనని నిన్ను నీవు మెచ్చుకొనుచున్నావే; అప్పుడు సీతను నేను లేని సమయముఁ జూచి దొంగవలె నపహరించునపుడు నీకు సిగ్గే గలుగలేదు గదా! ౧౭

నీవు నాయెదుటనే యట్లు సీతను బలాత్కారంబునం గొని పోఁజూతువేని యప్పుడె నీవు నాబాణంబులచే హతుఁడవై నీతమ్ముఁడు ఖరునితోఁ జేరియుందువు. ౧౮

దురాత్ముఁడవగు రావణుఁడా! భాగ్యవశంబున నీవిపుడు నాకంటి యెదుటం బడితివి; ఇఁక నిన్నుఁ దీక్ష్ణబాణంబుల యమపురి కనిచెదను. ౧౯

అద్య తే మచ్ఛరైశ్ఛిన్నం శిరో జ్వలితకుణ్డలమ్,
క్రవ్యాదా వ్యపకర్షన్తు వికీర్ణం రణపాంసుషు. ౨౦

నిపత్యోరసి గృధ్రాస్తే క్షితౌ క్షిప్తస్య రావణ!,
పిబన్తు రుధిరం తర్షాద్బాణశల్యాన్తరోత్థితమ్. ౨౧

అద్య మద్బాణభిన్నస్య గతాసోః పతితస్య తే,
కర్షన్త్వన్త్రాణి పతగా గరుత్మన్త ఇవోరగాన్. ౨౨

ఇత్యేవం సంవదన్వీరో రామశ్శత్రునిబర్హణః,
రాక్షసేన్ద్రం సమీపస్థం శరవర్షైరవాకిరత్. ౨3

బభూవ ద్విగుణం వీర్యం బలం హర్షశ్చ సంయుగే,
రామస్యాస్త్రబలం చైవ శత్రోర్నిధనకాఙ్క్షిణః. ౨౪

ప్రాదుర్బభూవురస్త్రాణి సర్వాణి విదితాత్మనః,
ప్రహర్షాచ్చ మహాతేజాః శీఘ్రహస్తతరోఽభవత్. ౨౫
శుభాన్యేతాని చిహ్నాని విజ్ఞాయాత్మగతాని సః,
భూయ ఏవార్దయద్రామో రావణం రాక్షసాన్తకృత్. ౨౬

హరీణాం చాశ్మనికరైశ్శరవర్షైశ్చ రాఘవాత్,
హన్యమానో దశగ్రీవో విఘూర్ణహృదయోఽభవత్. ౨౭

యదా చ శస్త్రం నాలే(రే)భే నవ్యకర్షచ్ఛరాసనమ్,
నాస్య ప్రత్యకరోద్వీర్యం విక్లబేనాన్తరాత్మనా. ౨౮

ఇప్పుడు నాబాణములచే ఖండితమయి యుద్ధభూమియందు దుమ్ముపైంబడిన దీప్తకుండల సహితంబగు నీ శిరస్సును నక్కలు మొదలగునవి యీడ్చుకొని పోవుంగాక. ౨౦

రావణుండా! నీవు హతుండవై నేలంబడినపిమ్మట గద్దలు నీఱొమ్ముపై వ్రాలి బాణముల యలుంగులు దూఱుటవలనం గలిగిన రంధ్రంబులనుండి స్రవించురక్తమును దప్పిదీఱం ద్రావుచుంగాక. ౨౧

ఇప్పుడు నీవు నాబాణంబులచే ఖండింపంబడి మృతుండవై నేలం బడంగానే గరుడపక్షులు సర్పంబుల నాకర్షించునట్లు గద్దలు నీ పేవుల నాకర్షించుంగాక. అని రాముండు రావణునితోం జెప్పెను. ౨౨

పరాక్రమవంతుండును శత్రువుల వధించువాండునగు రాముండు ఇవ్విధంబునం జెప్పుచుం దనసమీపంబున నున్న నిశాచరేంద్రునిమీంద బాణవర్షంబులు గురిసెను. ౨౩

శత్రువధంబుఁగోరి యుద్ధంబుసేయుచున్న యారామునకు అప్పుడు వీర్యంబును బలంబును ఉత్సాహమును దివ్యాస్త్రబలంబును రెండింతలుగా నతిశయించెను. ౨౪

ఆత్మవేత్తయగు రామునకప్పుడు సమస్తములయిన దివ్యాస్త్రంబులును ప్రత్యక్షంబునం బ్రాదుర్భవించెను; అంత మహాతేజుండగురాముండు ఉత్సాహాతిశయంబునం జేసి మఱియు హస్తలాఘవంబు నెఱపెను. ౨౫

రాక్షసులరూపుమాపునట్టి రాముండు ఇట్లు శుభచిహ్నములు గలుగుటను మిక్కిలియుం నుత్సాహంబు నొంది రావణుని మఱియు నొప్పించెను.

వానరులు ప్రయోగించు శిలావర్షంబులచేతను రామునిబాణవర్షంబులచేతను నొప్పింపంబడినవాండై రావణుండు ఏమియుం దోంచక భ్రాంతచిత్తుం డయ్యెను. ౨౭

రావణుండు అట్లు భ్రాంతచిత్తుండై మనసు స్వాధీనత దప్పి ఆయుధంబులు ప్రయోగింపక ధనుస్సు నాకర్షింపక రాముం డేయుబాణంబులకు

క్షిప్తా శ్చాపి శరా స్తేన శస్త్రాణి వివిధాని చ,
రావణా న్నరణార్థాయ వర్తన్తే మృత్యుకాలేఽభివర్తతః. ౨౯
సూత స్తు రథనేతాఽస్య తదవస్థం సమీక్ష్యతమ్,
శనై ర్యుద్ధా దసంభ్రాన్తో రథం తస్యాపవాహయత్. ౩౦

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే - పఞ్చోత్తరశతతమస్సర్గః. ౧౦౫.

---

## షడుత్తరశతతమస్సర్గః.

స తు మోహా త్సుసంక్రుద్ధః కృతాన్తబలచోదితః,
క్రోధసంరక్తనయనో రావణ స్సూత మబ్రవీత్. ౧

హీనవీర్య మివాశక్తం పౌరుషేణ వివర్జితమ్,
భీరుం లఘుమివాసత్త్వం విహీన మివ తేజసా. ౨
విముక్త మివ మాయాభి రస్త్రై రివ బహిష్కృతమ్,
మా మవజ్ఞాయ దుర్బుద్ధే! స్వయా బుద్ధ్యా విచేష్టసే. ౩
కిమర్థం మా మవజ్ఞాయ మచ్ఛన్ద మనవేక్ష్య చ,
త్వయా శత్రో స్సమక్షం మే రథోఽయ మపవాహితః. ౪
త్వయాఽద్య హి మమానార్య! చిరకాలసమార్జితమ్,
యశో వీర్యం చ తేజశ్చ ప్రత్యయశ్చ వినాశితః. ౫

శత్రోః ప్రఖ్యాతవీర్యస్య రఞ్జనీయస్య విక్రమైః,
పశ్యతో యుద్ధలుబ్ధోఽహం కృతః కాపురుష స్త్వయా. ౬

య స్త్వం రథ మిమం మోహా న్నచోద్వహసి దుర్మతే!,
సత్యోఽయం ప్రతితర్కో మే పరేణ త్వ ముపస్కృతః. ౭

బడలేయకుండుటయు రామప్రయుక్తములగు బాణంబులును ఇతరాయుధములును రావణుని నొప్పించుటయు రావణుఁడు ఏమియుఁ జేయఁజాలక మరణంబు నొందునట్లుండుటయుఁ జూచి, రావణుఁడు ఇట్టియవస్థనొందుట వలన నతని రథంబుఁ బోలఁగొట్టి సారథి సార్థ్యంబు నొందక యుద్ధభూమినుండి రథమును మెల్లఁగాఁ దొలఁగఁ దోలుకొని పోయెను. ౨౮-౩౦

ఇది నూటయైదవసర్గము.

## నూటయాఱవసర్గము.

అంత రావణుఁడు మృత్యుప్రేరితుండగుటవలన అజ్ఞానంబునఁ గుపితుఁడై కోపంబునఁ గనుల నెఱ్ఱఁదనంబు దోఁప సారథింజూచి యిట్లని పలికెను. ౧

ఓరి దుర్బుద్ధీ! బలహీనుఁడనియుం నశక్తుండనియుఁ బౌరుషము లేనివాఁడనియుఁ బిఱికియనియు నల్పుఁడనియు ధైర్యము లేనివాఁడనియుం బరాక్రమము లేనివాఁడనియుం మాయలు దెలియనివాఁడనియుం దివ్యాస్త్రంబులు నేర్వనివాఁడనియుం నన్ను లక్ష్యముసేయక నీవు నీకుఁదోఁచినట్లాడుచున్నావు. ౨,౩

నా యభిప్రాయంబుఁ జూడక నన్నలక్ష్యముచేసి శత్రువు సమక్షమున సారథమును నీవేల తొలఁగఁ దోలుకొనివచ్చితివి? ౪

దుర్మార్గుఁడా! నేను బహుకాలముగా సంపాదించిన నాయశస్సును బలమును బరాక్రమంబును రావణుఁడు యుద్ధమున వెనుదీయుఁడను జనుల నమ్మకంబును ఇప్పుడు నీవు పోఁగొట్టితివి. ౫

పరాక్రమముచే మెప్పించఁదగినవాఁడును బ్రసిద్ధమయిన పరాక్రమము గలవాఁడునగు శత్రువు చూచుచుండఁగా నీవు యుద్ధప్రియుండనగు నన్నుఁ బిఱికివానిఁగాఁ జేసితివి. ౬

దుష్టబుద్ధీ! నీవు రథమును శత్రువున కెదురుగాఁ దోలకుండుటను జూడఁగా శత్రువులు నీకే మోయిచ్చి నిన్ను వశీకరించినట్లు నాకు సత్య

న హ్యేత ద్విద్యతే కర్మ సుహృదో హితకాఙ్క్షిణః,
రిపూణాం సదృశం చైతన్న త్వయైత త్స్వనుష్ఠితమ్. ౮

నివర్తయ రథం శీఘ్రం యావ న్నోపైతి మే రిపుః,
యదివాఽధ్యుషితో వాసి స్మర్యన్తే యదివా గుణాః. ౯

ఏవం పరుష ముక్తస్తు హితబుద్ధి రబుద్ధినా,
అబ్రవీ ద్రావణం సూతో హితం సానునయం వచః. ౧౦

న భీతోఽస్మి న మూఢోఽస్మి నోపజప్తోఽస్మి శత్రుభిః,
న ప్రమత్తో న నిస్స్నేహో విస్మృతా న చ సత్క్రియా. ౧౧

మయా తు హితకామేన యశశ్చ పరిరక్షితా,
స్నేహప్రస్కన్నమనసా ప్రియ మిత్యప్రియం కృతమ్. ౧౨

నాస్మి న్నర్థే మహారాజ! త్వం మాం ప్రియహితే రతమ్,
కశ్చి ల్లఘురివానార్యో దోషతో గన్తు మర్హసి. ౧౩

శ్రూయతాం త్వభిధాస్యామి యన్నిమిత్తం మయా రథః,
నదీవేగ ఇవామ్భోభి స్సంయుగే వినివర్తితః. ౧౪

శ్రమం తవావగచ్ఛామి మహతా రణకర్మణా,

మయిన యూహాగలుగుచున్నది. ౭

ఇది శత్రువులు చేయఁదగినపనేగాని నా మేలు గోరునట్టి మిత్రుఁడు చేయఁదగినపనిగాదు; నీవిట్లు ఈకార్యముసేయుట యెంతమాత్రము యుక్తము గాదు. ౮

నీవు నాయొద్ద బహుకాలము న్నావనునది నీమనసులో నున్నను నేను నీకుఁ గావించిన యుపకారములతలంపు నీకుఁ గలిగియున్నను శత్రువు నన్ను వెదకికొని రాకమునుపె శీఘ్రింబున రథమును మఱలించి శత్రువున కభిముఖముగాఁ దోలుము; అని రావణుఁడు సారథితోఁ జెప్పెను. ౯

రావణుని మేలుగోరునట్టి సారథిబుద్ధిహీనుండగు రావణుఁడు చెప్పిన పరుషవచనంబులు విని రావణునిం జూచి అతని నాశ్వాసింపుచు హితకరంబగు నీవచనముఁ బల్కెను. ౧౦

నేను భయము నొందినవాఁడను గాని మూఢుఁడను గాని శత్రువుల వలన లంచముఁ దీసికొని వారలతోఁ జేరినవాఁడను గాని యేమఱుపాటు నొందినవాఁడను గాని నీయందు స్నేహములేనివాఁడను గాని నీవు నాకుఁ గావించిన సత్కారములు మఱచినవాఁడను గాని కాను. ౧౧

మఱియేమన్నను, నేను నీహితముఁగోరి నీకీర్తి సురక్షితముగా నుండుటకై నీయందలి స్నేహంబున నిర్మలమయిన మనస్సుతో నీకుఁ బ్రియముగా నుండునని హితము గావించితిని; అది నీ కిపు డప్రియమయినది. ౧౨

మహారాజా! మహానుభావుఁడవగు నీవు అయోగ్యుఁడు నల్పుఁడునగు వానివిధంబున నీసంతోషంబును నీహితంబునే కోరునట్టి నాయందు ఈ విషయమయి దోషంబు తలంపవలదు. ౧౩

చంద్రోదయముచేఁ బొంగిన సముద్రజలములు నదీవేగమును మఱలించునట్లు నేను యుద్ధమునుండి రథమును మఱలించినందుకుఁ గారణముఁ జెప్పెదను వినుము. ౧౪

వీరుఁడవగు రావణుఁడా! నీవు అప్పుడు చాలసేపు మహాయుద్ధంబు చేసి

న హి తే వీర! సౌముఖ్యం ప్రహర్షం వోపధారయే. ౧౫

రథోద్వహనఖిన్నాశ్చ త ఇమే రథవాజినః,
దీనా ఘర్మపరిశ్రాన్తాః గావో వర్షహతా ఇవ. ౧౬

నిమిత్తాని చ భూయిష్ఠం యాని ప్రాదుర్భవన్తి నః,
తేషు తేష్వభిపన్నేషు లక్షయామ్యప్రదక్షిణమ్. ౧౭
దేశకాలౌ చ విజ్ఞేయౌ లక్షణానీఙ్గితాని చ,
దైన్యం ఖేదశ్చ హర్షశ్చ రథినశ్చ బలాబలమ్. ౧౮
స్థలనిమ్నాని భూమేశ్చ సమాని విషమాణి చ,
యుద్ధకాలశ్చ విజ్ఞేయః పరస్యాన్తరదర్శనమ్. ౧౯
ఉపయానాపయానే చ స్థానం ప్రత్యపసర్పణమ్,
సర్వమేతద్రథస్థేన జ్ఞేయం రథకుటుమ్బినా. ౨౦

తవ విశ్రమహేతోశ్చ తథైషాం రథవాజినామ్,
రౌద్రం వర్జయతా ఖేదం క్షమం కృత మిదం మయా. ౨౧
న మయా స్వేచ్ఛయా వీర! రథోఽయ మపవాహితః,

భర్తృస్నేహపరీతేన మయేదం యత్కృతం ప్రభో!. ౨౨

ఆజ్ఞాపయ యథా తత్త్వం వక్ష్యస్యరినిషూదన!,
తత్కరిష్యామ్యహం వీర! గతానృణ్యేన చేతసా. ౨౩

యలసట నొందితివి; నీయందు యుద్ధము విషయమయి సౌముఖ్యము గాని యుత్సాహముగాని లేకపోయినది. ౧౫

ఈ రథాశ్వంబులు రథము లాగిలాగి యలసి దీనంబులయి యెండ తాఁకినకు మిక్కిలి చెమట పట్టుటవలన మంచివర్షంబునం దడిసిన గోవు లంబోలె నుండినవి. ౧౬

మన సేనలలో నేయేనిమిత్తంబు లధికముగాఁ గలుగునో అవన్నియుం మనకుఁ బ్రతికూలముగానే గలుగుచుండినవి. ౧౭

సారథియగువాఁడు దేశకాలంబులును శుభాశుభనిమిత్తంబులును తన రథికునియొక్కయుఁ నెదిరియొక్కయు అభిప్రాయంబులును తన రథికుని యొక్క యుత్సాహానుత్సాహంబులును అలసటయుం బలాబలంబులును భూమియొక్క మిట్టపల్లములు సమప్రదేశంబులు విషమప్రదేశంబులును యుద్ధంబునకు సమయాసమయంబులును ఎదిరియొక్క ఛిద్రంబులును మఱీ యుఁ రథము నెదిరికి సమీపముగాఁ దోలుటయుం బార్శ్వమునకుఁ దోలుట యుం స్థిరంబుగా నిలుపుటయు ఎదిరి కభిముఖముగానే వెనుకకుఁ దిగుచుటయుం ఇవన్నియుఁ జక్కఁగాఁ దెలిసి రథంబు నడపవలెను. ౧౯, ౨౦

శూరుఁడవగు రావణుఁడా! నీకును ఈరథము గుఱ్ఱంబులకును విశ్రాంతి గలుగుటకయ్యును గొప్ప అపాయ మేమియుం గలుగకుండుటకై యును యుక్తముగాఁ దలంచి యిట్లు రథము తొలఁగఁదోలితినే గాని నిమిత్తము లేకయే నాస్వేచ్ఛగాఁ జేసినవాఁడను గాను. ౨౧

రాజా! నేనేమి గావించితినో అది స్వామివైన నీయందలి స్నేహము చేతనే చేసితిని గాని వేఱుగాదు. ౨౨

శత్రువుల వధించునట్టి వీరుండవగు రావణుఁడా! ఇప్పు డాజ్ఞాపింపుము; నీవెట్లు ఆజ్ఞాపించెదవో అదేప్రకారమున నెంతమాత్రము జవ దాఁటక నీయాజ్ఞను మనసార నెఱవేర్చి నీఋణంబు దీర్చుకొనెదను. అని సారథి రావణునితోఁ జెప్పెను. ౨౩

సంతుష్ట స్తేన వాక్యేన రావణ స్తస్య సారథేః,
ప్రశ స్యైనం బహువిధం యుద్ధలుబ్ధోఽబ్రవీదిదమ్. ౨౪

రథం శీఘ్రమిమం సూత! రాఘవాభిముఖం కురు,
నాహత్వా సమరే శత్రూ న్నివర్తిష్యతి రావణః. ౨౫

ఏవ ముక్త్వా తత స్తుష్టో రావణో రాక్షసేశ్వరః,
దదౌ తస్మై శుభం హ్యేకం హస్తాభరణ ముత్తమమ్. ౨౬

శ్రుత్వా రావణవాక్యం తు సారథి స్సన్న్యవర్తత,

తతో ద్రుతం రావణవాక్యచోదితః
ప్రచోదయామాస హయాన్ స సారథిః. ౨౭
స రాక్షసేన్ద్రస్య తతో మహారథః
క్షణేన రామస్య రణాగ్రతోఽభవత్.

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే-షడుత్తరశతతమస్సర్గః. ౧౦౬.

---

సప్తోత్తరశతతమస్సర్గః.

తతో యుద్ధపరిశ్రాన్తం సమరే చిన్తయా స్థితమ్,
రావణం చాగ్రతో దృష్ట్వా యుద్ధాయ సముపస్థితమ్. ౧
దైవతైశ్చ సమాగమ్య ద్రష్టు మభ్యాగతో రణమ్,
ఉపాగమ్యాబ్రవీ ద్రామ మగస్త్యో భగవా నృషిః. ౨
రామ! రామ! మహాబాహో! శృణు గుహ్యం సనాతనమ్,
యేన సర్వానరీన్వత్స! సమరే విజయిష్యసి. 3
ఆదిత్యహృదయం పుణ్యం సర్వశత్రువినాశనమ్,

రావణుఁడు సారథిచెప్పిన మాటకు సంతుష్టుఁడై యాసారథిని అనేక విధములుగాఁ బ్రశంసించి యుద్ధంబుసేయ నాశగదలుకొన నతనితో నిట్లని పలికెను. ౨౪

సారథీ! ఈ రథమును శీఘ్రమున రామున కభిముఖముగాఁ దోలుము. రావణుఁ డెప్పుడైనను యుద్ధంబున శత్రువుల వధింపక మఱలిరాఁడు. అని రావణుండు సారథితోఁ జెప్పెను. ౨౫

రాక్షసనాథుఁడగు రావణుఁడు సారథితో నివ్విధంబునం బలికి సారథి విషయంబున సంతుష్టుఁడై యతనికి సుందరమయిన యుత్తమమగు నొక హస్తాభరణము నొసంగెను. ౨౬

సారథియు రావణుని వచనంబువిని యతని యాజ్ఞచొప్పున రథమును మఱలించి యుద్ధాభిముఖముగాఁ దోలుకొనిపోయెను.

అంత నాసారథి రావణు నాజ్ఞచొప్పున శీఘ్రముగా గుఱ్ఱంబులఁ దోలుటయు నమ్మహారథంబు క్షణంబునకు యుద్ధంబున రామున కభిముఖంబుగా నిలిచెను. ౨౭

ఇది నూటయాఱవసర్గము.

---

## నూటయేడవసర్గము.

అంత యుద్ధంబుఁజూచుటకై దేవతలతోఁగూడ వచ్చియున్న భగవంతుఁడును త్రికాలజ్ఞుండునగు నగస్త్యమహర్షి రాముఁడు యుద్ధంబున నలసట నొంది మరల యుద్ధంబునకువచ్చి తనముందట నిలుచున్న రావణుం గని చింతనొంది యుండుటం జూచి రామునియొద్దకువచ్చి యిట్లని పలికెను. ౧-౨

రామా! రామా! మహాబాహుఁడా! నాయనా! నీవే స్తోత్రమున సమస్తశత్రువులను యుద్ధంబున జయింపఁగలవో అట్టి పరమరహస్యంబును సనాతనంబును బవిత్రంబును సమస్తశత్రువుల నశింపఁజేయునదియు జయప్రదంబును

జయావహం జపే న్నిత్య మక్షయ్యం పరమం శివమ్. ౪
సర్వమఙ్గళమఙ్గళ్యం సర్వపాపప్రణాశనమ్,
చిన్తాశోకప్రశమన మాయుర్వర్ధన ముత్తమమ్. ౫

రశ్మిమన్తం సముద్యన్తం దేవాసురనమస్కృతమ్,
పూజయస్వ వివస్వన్తం భాస్కరం భువనేశ్వరమ్. ౬

సర్వదేవాత్మకో హ్యేష తేజస్వీ రశ్మిభావనః,
ఏష దేవాసురగణా న్లోకా న్పాతి గభస్తిభిః. ౭

ఏష బ్రహ్మా చ విష్ణు శ్చ శివ స్స్కన్దః ప్రజాపతిః,
మహేన్ద్రో ధనదః కాలో యమ స్సోమో హ్యపాంపతిః. ౮

పితరో వసవ స్సాధ్యా హ్యశ్వినౌ మరుతో మనుః,
వాయు ర్వహ్నిః ప్రజాప్రాణ ఋతుకర్తా ప్రభాకరః.

నిత్యంబును అక్షయమయిన ఫలముగలదియు పరమమంగళప్రదంబును సమస్త మంగళంబులకును మంగళంబును సమస్తపాపనాశనంబును ఆధివ్యాధిహరంబును ఆయుర్వృద్ధికరంబును సర్వస్తోత్రంబులలోను ఉత్తమంబునగు పరబ్రహ్మ ప్రతిపాదకమయిన ఆదిత్యహృదయంబను స్తోత్రము నీకుపదేశించెదను వినుము. 3, 4

నీవు సువర్ణవర్ణుండగుటచే ప్రశస్తకిరణములు గలవాడును (అంతరంగభక్తులచే నుపాసింపఁబడువాడును) ఉదయమును బొందుచున్నవాడును దేవాసురులచే నమస్కృతుండును ఇతర దేజస్సుల నన్నిటిని పరిభవించునట్టి మహాతేజస్సుగలవాడును జంద్రసూర్యప్రభృతులకును తేజమునొసంగువాడునగు సమస్తలోకనియామకునిఁ బరమాత్మను ఇమ్మహాస్తోత్రముచే నారాధింపుము. 6

ఆదిత్యమండలాంతర్వర్తియగు నీపురుషుండు సమస్తదేవతలకు నాత్మభూతుండు తన తేజస్సుచే సమస్తతేజస్సులను దిరస్కరించువాడు; కిరణంబుల సమస్తలోకంబులకు ఉత్పత్తిస్థితిసంహారంబులఁ జేయువాడు (భక్తులకు మోక్షంబు నొసంగువాడు) ఈతండె కిరణంబులచే వర్షాదులుగల్గించి దేవాసుర ప్రభృతిసమస్తలోకంబులను రక్షించుచు. 7

ఈతఁడే సమస్తదేవతలును శరీరముగాఁగలవాఁడు. ఇతఁడు బ్రహ్మ. ఇతఁడె విష్ణువు. ఇతఁడే శివుఁడు. ఇతఁడే కుమారుఁడు. ఇతఁడే నవప్రజాపతులును. ఇతఁడె దేవేంద్రుండును. ఇతఁడె కుబేరుండును. ఇతఁడే మృత్యువు. ఇతఁడె యముఁడు. ఇతఁడె చంద్రుఁడు. ఇతఁడె వరుణుఁడు. 8

ఈతఁడె పితృదేవతలు. ఇతండె అష్టవసువులు. ఇతఁడె సాధ్యులు. ఇతఁడె యశ్వినీదేవతలు. ఇతఁడె మరుత్తులు. ఇతఁడె మనువు. ఇతఁడే వాయువు. ఇతఁడె యగ్ని. ఇతఁడె ప్రాణము. ఇతఁడె వసంతాదిఋతువులకుఁ గారణమయిన సూర్యుఁడు (సమస్తభక్తులచేతను బొందఁబడువాఁడు, సమస్తకార్యములకును బ్రేరకుఁడు సూర్యుఁడు). 9

ఆదిత్యస్సవితా సూర్యః ఖగః పూషా గభస్తిమాన్,
సువర్ణసదృశో భాను ర్హిరణ్యరేతా దివాకరః. ౧౦

హరిదశ్వ స్సహస్రార్చి స్సప్తసప్తి ర్మరీచిమాన్,
తిమిరోన్మథన శ్శమ్భు స్త్వష్టా మార్తాణ్డ అంశుమాన్. ౧౧

హిరణ్యగర్భ శ్శిశిర స్తపనో భాస్కరో రవిః,
అగ్నిగర్భోఽదితేః పుత్త్ర శ్శఙ్ఖ శ్శిశిరనాశనః. ౧౨

వ్యోమనాథ స్తమోభేదీ ఋగ్యజుస్సామపారగః,
ఘనవృష్టి రపాం మిత్రో విన్ధ్యవీథీ ప్లవఙ్గమః. ౧౩

ఆతపీ మణ్డలీ మృత్యుః పిఙ్గళ స్సర్వతాపనః,
కవి ర్విశ్వో మహాతేజా రక్త స్సర్వభవోద్భవః. ౧౪

నీవు అదితియొక్క పుత్త్రుఁడవు. జగత్తును గలిగించువాఁడవు. ఆకాశ మునఁ దిరుగువాఁడవు. జగత్తును బోషించువాఁడవు. ప్రశస్తములయిన కిరణములు గలవాఁడవు మంచిపర్ణములు అనఁగా ఱెక్కలుగలవాఁడవు. తపింపఁ జేయువాఁడవు. బంగారముతో సమానుఁడవు. ప్రకాశించువాఁడవు. బంగారువికారమయిన రేతస్సుగలవాఁడవు. పగటిని జేయువాఁడవు. ౧౦

నీవు ఆకుపచ్చనివన్నెగల గుఱ్ఱములు గలవాఁడవు. వేయికిరణములు గలవాఁడవు. సప్తయను గుఱ్ఱముగలవాఁడవు. ప్రశస్తకిరణములు గలవాఁడవు. చీఁకటిని బోఁగొట్టువాఁడవు. సుఖము గలిగించువాఁడవు సమస్తనామరూపములను సంహరించువాఁడవు. బ్రహ్మాండము మృతముకాఁగాఁ బుట్టినవాఁడవు. ప్రకృష్టకిరణములు గలవాఁడవు. ౧౧

నీవు బంగారువికారమైన అండము గర్భమందుఁగలవాఁడవు చల్లనివాఁడవు తపింపఁజేయువాఁడవు. ప్రకాశము సేయువాఁడవు శబ్దించువాఁడవు. పగటియందు అగ్నిగర్భుఁడుఁ గలవాఁడవు. అదితిదేవియొక్క కొడుకవు. ప్రళయకాలంబున నిర్వ్యాపారముగా శాంతుఁడవగువాఁడవు. మంచును బోఁగొట్టువాఁడవు. ౧౨

నీవు ఆకాశమునకుఁ బ్రభుఁడవు. చీఁకటిని బోఁగొట్టువాఁడవు. (రాహువును భేదించువాఁడవు) ఋగ్వేదము యజుర్వేదము సామవేదము అను వేదములయొక్క పారమును బొందినవాఁడవు. అధికమయిన వర్షముగలవాఁడవు. జలములకు స్నేహితుఁడవు. వింధ్యపర్వతముయొక్క మార్గమునందు అనఁగా ఆకాశమార్గమునందు శీఘ్రముగాఁ బోవువాఁడవు. ౧౩

నీవు ఎండగలవాఁడవు. గుండ్రమైన ఆకారముగలవాఁడవు శత్రులను జంపువాఁడవు (ఉదయకాలమందు) గోరోజనపు వన్నెగలవాఁడవు. (మధ్యాహ్నమునందు) సమస్తమును తపింపఁజేయువాఁడవు. వ్యాకరణము మొదలయిన సమస్తశాస్త్రములను ప్రవర్తింపఁ జేసినవాఁడవు. సమస్తమును నిర్వహించువాఁడవు అధికములైన కాంతులుగలవాఁడవు. భక్తులయం దనురాగముగలవాఁడవు. సమస్తములైన కార్యములకు కారణభూతుఁడవు. ౧౪

నక్షత్రగ్రహతారాణా మధిపో విశ్వభావనః,
తేజసామప్రితితేజస్వీ ద్వాదశాత్మ న్నమోఽస్తు తే. ౧౫

నమః పూర్వాయ గిరయే పశ్చిమే గిరయే నమః,
జ్యోతిర్గణానాం పతయే దినాధిపతయే నమః. ౧౬

జయాయ జయభద్రాయ హర్యశ్వాయ నమో నమః,
నమో నమ స్సహస్రాంశో! ఆదిత్యాయ నమో నమః. ౧౭

నమ ఉగ్రాయ వీరాయ సారఙ్గాయ నమో నమః,
నమః పద్మప్రబోధాయ మార్తాణ్డాయ నమో నమః. ౧౮

నీవు అశ్విన్యాది నక్షత్రములకు గ్రహములకు సాధారణ నక్షత్రములకును. నాథుఁడవు. ప్రపంచము నిలుపువాఁడవు. తేజస్సులలో అధిక తేజస్సు గలవాఁడవు నగు పండ్రెండుమూర్తులు గలవాఁడా! నీకొఱకు నమస్కారము. అగుఁగాక. ౧౫

తూర్పుకొండపైనున్న నీకునమస్కారము. పడమటికొండపైనున్న నీకు నమస్కారము. (తూర్పుపడమటి కొండలయందు అంతర్యామివైన నీకు నమస్కారము) జ్యోతిర్గణములకు నాథుఁడవగు నీకు నమస్కారము. ముక్తులగు వారలకుఁ బ్రాప్యస్థానమవగు నీకు నమస్కారము దినమును జేయునట్టినీకునమస్కారము (సూర్యమండలాంతర్యామివగు నీకు నమస్కారము). ౧౬

అప్రతిహతమయిన పరాక్రమముగలవాఁడవగు నీకునమస్కారము గావించెదను (భక్తులకు సంసారజయంబుగల్గించువాఁడవైన నీకు నమస్కారము చేసెదను) జయంబును మంగళంబును ఒసఁగువాఁడవైన నీకువందనము గావించెదను. హరితవర్ణమగు గుఱ్ఱములుగలసూర్యునియం దంతర్యామివైన నీకుఁబ్రణతి యొనర్చెదను (మనోహరములగు గరుడవృషభాది వాహనములుఁగలనీకు మ్రొక్కెదను) వేయికిరణంబులుగల సూర్యునియం దంతర్యామివైనవాఁడా! (మితిలేనిమహాతేజముగలవాఁడా! నీయంశములయిన సమస్తజీవులకు నాధారభూతుఁడా!) నీకుఁ బ్రణామంబుగావించెదను ఆదిత్యమండలంబున యోగులచేఁ జూడఁబడునట్టి నీ కభినందనముచేసెదను. ౧౭

ఉపాసకులు కానివారలకు భయంకరుఁడవైన నీకు నమస్కారము. సర్వప్రాణులనుతత్తత్పూర్వకర్మానురూపంబుగాఁ గర్మయందుఁ బ్రేరించువాఁడవైన నీకునమస్కారము. శీఘ్రముగా నడచువాఁడవైన (సారమును గ్రహించువాఁడవైన ఓంకార ప్రతిపాద్యుఁడవైన హంసావతారరూపుఁడవైన) నీకు నమస్కారము. కమలములను వికసింపఁజేయువాఁడవైన (భక్తులహృదయకమలమును సదావికసింపఁజేయువాఁడవైన) నీకునమస్కారము బ్రహ్మాండముప్రలయము నొందినపుడు మరల సృజించుటకై యున్నవాఁడవైన నీకు నమస్కారము. ౧౮

బ్రహ్మేశానాచ్యుతేశాయ సూర్యాయాదిత్యవర్చసే,
భాస్వతే సర్వభక్షాయ రౌద్రాయ వపుషే నమః. ౧౯

తమోఘ్నాయ హిమఘ్నాయ శత్రుఘ్నాయామితాత్మనే,
కృతఘ్నఘ్నాయ దేవాయ జ్యోతిషాం పతయే నమః. ౨౦

తప్తచామీకరాభాయ వహ్నయే విశ్వకర్మణే,
నమస్తమోభినిఘ్నాయ రుచయే లోకసాక్షిణే. ౨౧

నాశయత్యేష వై భూతం తదేవ సృజతి ప్రభుః,

బ్రహ్మ విష్ణు శివులకును నియామకుఁడవయి పరబ్రహ్మరూపుఁడవయిన నీకునమస్కారము. సమస్తప్రాణులను అర్థ్యోకర్మంబులందుఁ బ్రేరించువాఁడ వైన నీకు నమస్కారము. సూర్యమండలమునందుఁ దేజోరూపుఁడవయిన నీకు నమస్కారము. సమస్తతేజస్సులకును గారణమయిన మహాతేజస్సుగలవాఁడ వయిన నీకు నమస్కారము. ప్రళయకాలమున సమస్తమును సంహరించువాఁడ వయిన నీకు నమస్కారము. అప్పుడు భయంకరమయిన యాకారముగలవాఁడ వయిన నీకు నమస్కారము. ౧౯

అంధకారమును బోఁగొట్టువాఁడవయిన (అజ్ఞానమునుబోఁగొట్టువాఁడ వయిన) నీకు నమస్కారము. భక్తులకు శీతోష్ణాదిద్వంద్వములసహించుసామ ర్థ్యమునొసంగువాఁడవయిన నీకునమస్కారము. ఆశ్రితులశత్రువులను వధించు వాఁడవైన (శత్రువులయిన యింద్రియములను జయించుశక్తిని భక్తులకుఁ బ్రసాదించువాఁడవయిన) నీకు నమస్కారము. దేశవస్తుకృత త్రివిధపరిచ్ఛేద శూన్యుఁడవయిన (అపరిమితమహిమగలవాఁడవయిన) నీకు నమస్కారము. సమస్త పాపులను విశేషించి కృతఘ్నులను శిక్షించువాఁడవయిన నీకు నమ స్కారము. సృష్టిస్థితిసంహారముల చేఁగ్రీడించువాఁడవైన (స్వయంప్రకాశుఁడ వయిన) నీకు నమస్కారము. చంద్రసూర్యాది సమస్త జ్యోతిర్వర్గమునకును బ్రకాశము నొసంగుటచే సాధుఁడవయిన నీకు నమస్కారము. ౨౦

మేలిబంగారువంటి మేనుగలవాఁడవైననీకు నమస్కారము. అగ్నిరూ పుఁడవైన (సమస్తలోకములకును ఆధారభూతుఁడవైన) నీకు నమస్కారము. అంధకారమును నశింపఁజేయువాఁడవైన (అజ్ఞానమును నశింపఁజేయువాఁడ వైన) నీకు నమస్కారము. సమస్తమునందును బ్రకాశరూపుఁడవైన (స్వయం ప్రకాశరూపుఁడవైన) నీకు నమస్కారము. లోకులు చేయు సమస్తకర్మము లకును సాక్షిభూతుఁడవైన నీకు నమస్కారము. ౨౧

సర్వలోకనియామకుఁడయిన యీదేవుండే సమస్తప్రపంచమును ప్రలయ

పాయత్యేష తపత్యేష వర్షత్యేష గభస్తిభిః ౨౨

ఏష సుప్తేషు జాగర్తి భూతేషు పరినిష్ఠితః,
ఏష చైవాగ్నిహోత్రం చ ఫలం చైవాగ్నిహోత్రిణామ్. ౨౩
వేదాశ్చ క్రతవశ్చైవ క్రతూనాం ఫలమేవ చ,
యాని కృత్యాని లోకేషు సర్వ ఏష రవిః ప్రభుః. ౨౪

ఏన మాపత్సు కృచ్ఛ్రేషు కాన్తారేషు భయేషు చ,
కీర్తయ న్పురుషః కశ్చి న్నావసీదతి రాఘవ!. ౨౫

పూజయ స్వైన మేకాగ్రో దేవదేవం జగత్పతిమ్,
ఏతత్త్రిగుణితం జప్త్వా యుద్ధేషు విజయిష్యసి. ౨౬

అస్మిన్ క్షణే మహాబాహో! రావణం త్వం వధిష్యసి,

౨౭ తదాఽగస్త్యో జగామ చ యథాగతమ్. ౨౮

కాలంబున సంహరించుచు. మరల నాప్రపంచమును సృజియించుచు. ఈతఁడే కిరణములచేఁ దాపము కల్గించి శోషిల్లం జేయును. వర్షంబును గురియించును. ౨౨

భూతంబులు నిద్రించియున్నప్పుడును ఇతఁడు ఆభూతంబుల యన్నిటియందును అంతర్యామిత్వంబున వ్యాపించినవాఁడై మేలుకొనియుండును.

అగ్నిహోత్రమును అగ్నిహోత్రముయొక్క ఫలమును ఈమహాపురుషుఁడే. ౨౩

ఇతఁడే వేదములు. ఇతఁడే యజ్ఞములు. యజ్ఞములచేఁ బొందఁదగిన ఫలమును ఇతఁడే.

మఱియు లోకంబుననేయేకర్మములు చేయఁబడుచున్నవో వానికన్నిటికిని సర్వాత్మకుఁడయిన సూర్యమండలాంతర్వర్తియగు నీహిరణ్మయపురుషుఁడు నియామకుఁడును ఫలప్రదాతయు. ౨౪

రాముఁడా! ఇందువర్ణాశ్రమాద్యధికారినియమము లేదు. ఎవ్వఁడైనను ఆపదలుగలిగినపుడు గాని కష్టమువచ్చినపుడుగాని అడవిమార్గంబులం గాని యితరభయంబులు గల్గినపుడు గాని యీ యాదిత్యహృదయస్తోత్రమును బఠించినచో నతఁడు ఆపదలం బాసి నిర్భయుండై సుఖము నొందగలఁడు.

నీవు మనసునిశ్చలముగానిలిపి దేవతలకును దేవుండును జగన్నాథుండు నగునీదేవుని యియ్యాదిత్యహృదయస్తోత్రంబునం బూజింపుము. ఈయాదిత్యహృదయస్తోత్రమును మూఁడుమాఱులు జపించుతేని యుద్ధంబులందు జయము నొందఁగలవు. ౨౬

మహాబాహుఁడవగు రాముఁడా! నీ వీయాదిత్యహృదయమును జపింపుము. ఈక్షణముననె రావణునివధింపఁగలవు. అని యగస్త్యుఁడు రామునకుఁ జెప్పెను.

అంత నగస్త్యమహర్షి యివ్విధంబునఁ బల్కి తా వచ్చినదారింబోయెను. ౨౭

ఏతచ్ఛ్రుత్వా మహాతేజా నష్టశోకోఽభవ త్తదా,
ధారయామాస సుప్రీతో రాఘవః ప్రయతాత్మవాన్. ౨౮

ఆదిత్యం ప్రేక్ష్య జప్త్వా తు పరం హర్ష మవాప్తవాన్,
త్రిరాచమ్య శుచి ర్భూత్వా ధనురాదాయ వీర్యవాన్. ౨౯

రావణం ప్రేక్ష్య హృష్టాత్మా యుద్ధాయ సముపాగమత్,
సర్వయత్నేన మహతా వధే తస్య ధృతోఽభవత్. ౩౦
అథ రవిరవదన్నిరీక్ష్య రామం
ముదితమనాః పరమం ప్రహృష్యమాణః,
నిశిచరపతిసంక్షయం విదిత్వా
సురగణమధ్యగతో వచ స్త్వరేతి. ౩౧

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే - సప్తోత్తరశతతమస్సర్గః. ౧౦౭.

---

అష్టోత్తరశతతమస్సర్గః.

స రథం సారథి ర్హృష్టః పరసైన్యప్రధర్షణమ్,
గన్ధర్వనగరాకారం సముచ్ఛ్రితపతాకినమ్. ౧
యుక్తం పరమసంపన్నై ర్వాజిభి ర్హేమమాలిభిః,
యుద్ధోపకరణైః పూర్ణం పతాకాధ్వజమాలినమ్. ౨
గ్రసన్త మివ చాకాశం నాదయన్తం వసున్ధరామ్,
ప్రణాశం పరసైన్యానాం స్వసైన్యానాం ప్రహర్షణమ్. ౩
రావణస్య రథం క్షిప్రం చోదయామాస సారథిః,

తమాపతన్తం సహసా స్వనవన్తం మహాస్వనమ్. ౪

అప్పుడు మహాతేజుఁడగు రాముఁడు ఇమ్మహాస్తోత్రమును విన్నంతనె మనసునందలి చింతవదలి పరమసంతుష్టుఁడై పరిశుద్ధమయినమనస్సుతో అదిత్యహృదయప్రతిపాద్యుఁడగు దేవదేవుని ధ్యానించెను. ౨౮

రాముఁడు ఆచమనముచేసి శుచి యయి సూర్యునిఁజూచుచు (ఆదిత్యమండలాంతర్వర్తి పరమాత్మను ధ్యానముచేయుచు) ముమ్మాఱు ఆదిత్యహృదయస్తోత్రమునుజపించి యినుమడియయినపరాక్రమంబుగలవాఁడై పరమహర్షంబు నొంది ధనుస్సు చేతం బట్టెను.

రాముఁడు అంత రావణుంజూచి సంతుష్టుఁడై సమస్తప్రయత్నంబుల వానినివధింప నిశ్చయించి యుద్ధంబు సేయుటకై సమీపించెను. ౩౦

అంత సూర్యమండలాంతర్గతుఁడయిన హిరణ్మయుండగు నమ్మహాపురుషుఁడు తన్నుదేవతాసమూహంబు పరివేష్టించి కొలువ పరమసంతుష్టుఁడై పులకితదేహుండై రామునకుం బొడసూపి రామునింజూచి "రాక్షసరాజయినరావణుండు నాశమునొందఁగలఁడని యెఱుంగుము. త్వరపడుము" అనిపలికెను.

నూటయేడవ సర్గము.

## నూటయెనిమిదవసర్గము.

అంత నాసారథి సంతుష్టుఁడై శత్రుసైన్యంబులం గలఁచి నశింపఁజేయునదియుఁ స్వసైన్యంబులకు సంతోషంబుగల్గించునదియుఁ గంధర్వనగరము వలె నాశ్చర్యావహంబును ఉన్నతములయిన పెక్కుధ్వజములు గలదియుఁ మిక్కిలియుఁ వేగవంతంబులయిన కాంచనభూషితంబులగు గుఱ్ఱంబులతోఁ గూడినదియుఁ యుద్ధసాధనములయిన యాయుధములతో నిండినదియుఁ అత్యున్నతంబగుటవలన నాకాశంబును గ్రహించునట్లు చూపట్టునదియుఁ భూమియంతయుఁ ధ్వనించునట్లు మహాధ్వని గలదియునగు రావణునిమహారథమును శీఘ్రముగాఁ దోలెను. ౧,౨,౩

నరేంద్రుఁడగు రామచంద్రుఁడు అట్లు రాక్షసేంద్రుఁడగురావణుని

రథం రాక్షసరాజస్య నరరాజో దదర్శ హ,

కృష్ణవాజిసమాయుక్తం యుక్తం రౌద్రేణ వర్చసా. ౫
తటిత్పతాకాగహనం దర్శితేన్ద్రాయుధాయుధమ్,
శరధారా విముఞ్చన్తం ధారాసార మివామ్బుదమ్. ౬
తం దృష్ట్వా మేఘసంకాశ మాపతన్తం రథం రిపోః,
గిరే ర్వజ్రాభిమృష్టస్య దీర్యత స్సదృశస్వనమ్. ౭
విస్ఫారయన్వై వేగేన బాలచన్ద్రనతం ధనుః,
ఉవాచ మాతలిం రామ స్సహస్రాక్షస్య సారథిమ్. ౮
మాతలే! పశ్య సంరబ్ధ మాపతన్తం రథం రిపోః,
యథాఽపసవ్యం పతతా వేగేన మహతా పునః. ౯
సమరే హన్తు మాత్మానం తథా తేన కృతా మతిః,

తదప్రమాద మాతిష్ఠన్ ప్రత్యుద్గచ్ఛ రథం రిపోః. ౧౦
విధ్వంసయితు మిచ్ఛామి వాయుర్మేఘ మివోత్థితమ్,

అవిక్లబ మసంభ్రాన్త మవ్యగ్రహృదయేక్షణమ్. ౧౧
రశ్మిసంచారనియతం ప్రచోదయ రథం ద్రుతమ్,

కామం న త్వం సమాధేయః పురందరరథోచితః. ౧౨
యుయుత్సురహ మేకాగ్రః స్మారయే త్వాం న శిక్షయే,

పరితుష్టస్స రామస్య తేన వాక్యేన మాతలిః. ౧౩
ప్రచోదయామాస రథం సురసారథిసత్తమః,

మహారథంబు ఘంటలుమొదలగువానిచే మ్రోయుచు మహాధ్వనితో వచ్చుటం
జూచెను. ౪

నల్లనిగుఱ్ఱములు పూన్చినదియు రౌద్రాకారంబున వెలుంగుచున్నదియుం
మెఱుపులవంటి ధ్వజంబులును ఇంద్రధనుస్సువంటి మహాధనుస్సును గలిగి
బాణంబులు వరఁగించుచు మహావర్షంబు గురియుమేఘంబువలె నున్నదియుం
నగు రావణుని మహారథంబు వచ్చుటంజూచి రాముండు వజ్రాయుధాభి
ఘాతంబయి పగులునట్టి పర్వతంబుశబ్దించు మహాధ్వనివంటి ధ్వనిగల్గునట్టు
మండలాకారమయిన ధనుస్సును శబ్దింపఁజేయుచు దేవేంద్రసారథియయిన
మాతలింజూచి యిట్లనిపలికెను. ౫-౭

మాతలీ! శత్రువుయొక్కరథము వేగముగా వచ్చుచున్నది చూడుము.

ఈ రావణుండు ఇప్పుడు మరల వచ్చునపుడు వేగంబున నప్రదక్షిణం
బుగా వచ్చుచున్నాఁడు కావున నితఁడు యుద్ధంబున హతుఁడగుట నిశ్చ
యము. ౮

ఇట్లువుటంజేసి నీవు ఏమఱుపాటునొందక క్రమంబుగా రావణురథ
మ్మున కభిముఖంబుగా మనయరదంబు దోలుము; వాయువు ఆకాశంబునం
గ్రమ్మిన మేఘముం బాఱఁదోలునట్లు నే నితని వధించిపుచ్చెదను. ౧౦

నీవు భయంబునొందక ప్రమత్తుఁడవుగాక మనస్సునంగాని దృష్టి
యందుగాని కలఁతనొందక పగ్గంబులఁ గ్రమంబుగాలాగుచు రథంబు
శీఘ్రంబుగా నడపుము. ౧౧

నీవు దేవేంద్రునంతటివానిరథమునకు సారథ్యముసేయువాఁడవు కావున
నీకు ఈవిషయ మంతగాఁ జెప్పవలసినదిలేదు. వాస్తవమే. అయినను నేను
యుద్ధముసేయుసమయంబు కావున జాగరూకుండనై నీకు జ్ఞాపకపఱచెదను
గాని ఉపదేశించువాఁడనుగాను. అని రాముండు మాతలితోఁజెప్పెను. ౧౨

దేవసారథిశ్రేష్ఠుండగు నమ్మాతలిరాముని మాటనువిని పరమసంతుష్టుండై
రథంబు దోలెను. ౧౩

అపసవ్యం తతః కుర్వ న్రావణస్య మహారథమ్. ౧౪
చక్రోత్క్షిప్తేన రజసా రావణం వ్యవధూనయత్,

తతః క్రుద్ధో దశగ్రీవ స్తామ్రవిస్ఫారితేక్షణః. ౧౫
రథప్రతిముఖం రామం సాయకై రవధూనయత్,
ధర్షణామర్షితో రామో ధైర్యం రోషేణ లఙ్ఘయన్. ౧౬
జగ్రాహ సుమహావేగ మైన్ద్రం యుధి శరాసనమ్,
శరాంశ్చ సుమహాతేజా స్సూర్యరశ్మిసమప్రభాన్. ౧౭

తదోపోఢం మహద్యుద్ధ మన్యోన్యవధకాఙ్క్షిణోః,
పరస్పరాభిముఖయో ర్దృప్తయో రివ సింహయోః. ౧౮

తతో దేవా స్సగన్ధర్వా స్సిద్ధా శ్చ పరమర్షయః,
సమేయు ర్ద్వైరథం ద్రష్టుం రావణక్షయకాఙ్క్షిణః. ౧౯

సముత్పేతు రథోత్పాతా దారుణా రోమహర్షణాః,
రావణస్య వినాశాయ రాఘవస్య జయాయ చ. ౨౦

వవర్ష రుధిరం దేవో రావణస్య రథోపరి,
వాతా మణ్డలిన స్తీక్ష్ణా హ్యపసవ్యం ప్రచక్రముః. ౨౧
మహ ద్గృధ్రకులం చాస్య భ్రమమాణం నభస్థలే,
యేన యేన రథో యాతి తేన తేన ప్రధావతి. ౨౨
సంధ్యయా చావృతా లఙ్కా జపాపుష్పనికాశయా,
దృశ్యతే సంప్రదీప్తేవ దివసేఽపి వసుంధరా. ౨౩
సనిర్ఘాతా మహోల్కాశ్చ సంప్రచేరు ర్మహాస్వనాః,
విషాదయం స్తే రక్షాంసి రావణస్య తదాఽహితాః. ౨౪

అంత నమ్మాతలి రావణుని రథంబు నప్రదక్షిణంబుగాఁ జేయుచుఁ దనయరదంబుఁ బ్రదక్షిణంబుగాఁ బఱపి చక్రోద్ధతికి రేఁగిసదుమ్ముచే రావణుని చలించునట్లు చేసెను. ౧౪

అంత రావణుండు కుపితుఁడై కన్నులం గెంజాయగదుర నుఱిమి చూచుచు తనరథంబున కభిముఖుండైనిలిచినరాముని బాణంబులఁ బ్రహారించెను.

మహాపరాక్రమశాలియగు రాముఁడు అట్లు ధర్షించుటకుఁ గుపితుండై రోషావేశంబున ధైర్యం బినుమడింప యుద్ధంబున మాతలి దెచ్చియిచ్చిన మహావేగంబగు నైంద్రధనుస్సును సూర్యకిరణ సమానములయిన తీక్ష్ణబాణములను గ్రహించెను ౧౬,౧౭

అంతఁ బరస్పరాభిముఖములయి యొకదానినొకటి వధింపఁగోరి చెల రేఁగినమత్తంబులగు సింహములకైవడి ఆరామరావణులు యుద్ధముసేయ నారంభించిరి. ౧౮

అంత దేవతలును గంధర్వులును సిద్ధులును మహర్షులును రావణునివినాశంబుఁ గోరినవారలుకావున ఆరామరావణులయుద్ధంబుఁ జూడవచ్చిరి. ౧౯

అంత రావణుని మరణంబును రాముని జయంబును సూచించునట్టి భయంకరములును గగుర్పాటు గలిగించునవియునగు మహోత్పాతంబులు చూపట్టినవి. ౨౦

రావణునియరదముమీఁద మేఘము నెత్తురు వర్షించెను. భయంకరములయిన సుడిగాడ్పులు అప్రదక్షిణముగాఁ జుట్టినవి. ౨౧

గద్దలనేకంబులు ఆకాశంబున గుంపుగా రావణునిరథము ఏయేమార్గంబునం బోవునో ఆయామార్గంబున వెంబడించి తిరిగెను. ౨౨

పగటియందుఁగూడ లంకాపురియంతయుం సంధ్యారాగంబు క్రమ్ముట వలన లంకాభూమియంతయు మండుచున్నట్లు గానంబడెను. ౨౩

పిడుగులును పెద్దకొఱవులును మహాధ్వనులతోఁ బడినవి. అవి రావణునివినాశంబు సూచించుటంజేసి రాక్షసులు దిగులొందిరి. ౨౪

రావణశ్చ యత స్తత్ర సంచచాల వసుంధరా,
రక్షసాం చ ప్రహరతాం గృహీతా ఇవ బాహవః. ౨౫

తామ్రాః పీతా స్సితా శ్శ్వేతాః పతితా స్సూర్యరశ్మయః,
దృశ్యన్తే రావణస్యాఙ్గే పర్వతస్యేవ ధాతవః. ౨౬

గృధ్రై రనుగతా శ్చాస్య వమన్త్యో జ్వలనం ముఖైః,
ప్రణేదు ర్ముఖ మీక్షన్త్య స్సంరబ్ధ మశివం శివాః. ౨౭
ప్రతికూలం వవౌ వాయూ రణే పాంసూన్ సమాకిరన్,
తస్య రాక్షసరాజస్య కుర్వన్ దృష్టివిలోపనమ్. ౨౮
నిపేతు రిన్ద్రాశనయ స్సైన్యే చాస్య సమన్తతః,
దుర్విషహ్యస్వనా ఘోరా వినా జలధరస్వనమ్. ౨౯

దిశశ్చ ప్రదిశ స్సర్వాః బభూవు స్తిమిరావృతాః,
పాంసువర్షేణ మహతా దుర్దర్శం చ నభోఽభవత్. 3౦
కుర్వన్త్యః కలహం ఘోరం శారికా స్తద్రథం ప్రతి,
నిపేతు శ్శతశ స్తత్ర దారుణం దారుణారుతాః. 3౧
జఘనేభ్య స్స్ఫులిఙ్గాంశ్చ నేత్రేభ్యోఽశ్రూణి సన్తతమ్,
ముముచు స్తస్య తురగా స్తుల్య మగ్నిం చ వారి చ. 3౨
ఏవం ప్రకారా బహవ స్సముత్పాతా భయావహాః,
రావణస్య వినాశాయ దారుణా స్సంప్రజజ్ఞిరే. 3౩
రామస్యాపి నిమిత్తాని సౌమ్యాని చ శుభాని చ,
బభూవు ర్జయశంసీని ప్రాదుర్భూతాని సర్వశః. 3౪
నిమిత్తాని చ సౌమ్యాని రాఘవస్య జయాయ చ,
దృష్ట్వా పరమసంహృష్టో హతం మేనే చ రావణమ్. 3౫

రావణుఁ డున్న వైపున భూమి చలనంబునొందెను.

రాక్షసులు యుద్ధంబునఁ బ్రహరించునపుడు వారిచేతులు పట్టుకొని పోయినట్టుండెను. ౨౫

సూర్యకిరణంబులు తెల్లగాను నల్లగాను ఎఱ్ఱగాను బీతవర్ణంబుగాను రావణునిదేహంబునం బ్రసరించి పర్వతంబుపైనుండు గైరికధాతువులంబోలెఁ బ్రకాశించినవి. ౨౬

నక్కలు గద్దలతోఁగూడినవై నోళ్ళ నిప్పుగ్రక్కుచు రావణుని మొగంబుఁజూచి భయంకరముగా నఱచుచు నమంగళంబు సూచించినవి. ౨౭

యుద్ధంబునఁ బెనుగాలిరేఁగి రాక్షసరాజయిన రావణునికిఁ గన్నులగపడకుండునట్లు దుమ్ముచల్లుచుఁ బ్రతికూలంబుగా వీచెను. ౨౮

ఎంతమాత్రము మేఘములేకయె రావణుసైన్యంబుననంతటను భయంకరాకారంబులును సహింపఁగూడని మహాధ్వని గలవియునగు కొఱవులును బిడుగులును బడినవి. ౨౯

దిశలును విదిశలును అంతటను జీఁకట్లుక్రమ్మినవి. పరాగములు వర్షించుటచేత నాకాశంబునఁ గన్నెత్తిచూడ నలవికాదయ్యె. ౩౦

ఆయుద్ధమున గోరింకలు భయంకరముగా యుద్ధంబుసేయుచు భయంకరముగాఁ గూయుచు నారథముమీఁదచూడ్కులకు వ్రేఁగై వ్రాలినవి. ౩౧

రావణుని గుఱ్ఱములు జఘనంబులనుండి అగ్నికణములను నేత్రంబులనుండి కన్నీళ్ళను ఇట్లు అగ్నిని జలమును సమముగా నెడతెగక వదలినవి. ౩౨

ఇట్లు భయంకరంబులును వినాశసూచకంబులునగు పెక్కు దుర్నిమిత్తములు సంజాతంబులయి రావణవినాశంబుసూచించినవి. ౩౩

మఱియు నట్లు రామునకు విజయసూచకములును భయనాశనంబులును మంగళకరములు నగు ననేకశుభనిమిత్తంబులును అంతటం గానంబడెను. ౩౪

రాముఁడు తనకుజయసూచకములగు శుభనిమిత్తంబులు దోఁచుటయుం రావణునకు వినాశసూచకములగు దుర్నిమిత్తములు దోఁచుటయుంజూచి

తతో నిరీక్ష్యాత్మగతాని రాఘవో
రణే నిమిత్తాని నిమిత్తకోవిదః,
జగామ హర్షం చ పరాం చ నిర్వృతిం
చకార యుద్ధే హ్యధికం చ విక్రమమ్. ३౬

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డేఽష్టోత్తరశతతమస్సర్గః. ౧౦౮.

---

## నవోత్తరశతతమస్సర్గః.

తతః ప్రవృత్తం సుక్రూరం రామరావణయోస్తదా,
సుమహద్ద్వైరథం యుద్ధం సర్వలోకభయావహమ్. ౧

తతో రాక్షససైన్యం చ హరీణాం చ మహద్బలమ్,
ప్రగృహీతప్రహరణం నిశ్చేష్టం సమతిష్ఠత. ౨

సంప్రయుద్ధౌ తతో దృష్ట్వా బలవన్నరరాక్షసౌ,
వ్యాక్షిప్తహృదయాస్సర్వే పరం విస్మయమాగతాః. ౩

నానాప్రహరణై ర్వ్యగ్రై ర్భుజై ర్విస్మితబుద్ధయః,
తస్థుః ప్రేక్ష్య చ సంగ్రామం నాభిజఘ్నుః పరస్పరమ్. ౪

రక్షసాం రావణం చాపి వానరాణాం చ రాఘవమ్,
పశ్యతాం విస్మితాక్షాణాం సైన్యం చిత్రమివాబభౌ. ౫

తౌ తు తత్ర నిమిత్తాని దృష్ట్వా రావణరాఘవౌ,
కృతబుద్ధీ స్థిరామర్షౌ యుయుధాతే హ్యభీతవత్. ౬

జేతవ్యమితి కాకుత్స్థో మర్తవ్యమితి రావణః,

పరమసంతోషంబునొంది రావణుఁడు హతుఁడయ్యె ననియుం సీత లభించె
ననియుం దలంచెను. ౩౫

అంత శకునంబుల గుణాగుణంబులు చక్కఁగా నెఱింగినట్టి యా
రాముఁడు తనవిజయంబు సూచించునట్టి శుభనిమిత్తంబులం జూచి పరమ
సంతుష్టుండై పులకితశరీరుండై యుద్ధంబున నధికముగాఁ బరాక్రమించెను. ౩౬

ఇది నూటయెనిమిదవసర్గము.

---

## నూటతొమ్మిదవసర్గము.

అంత రామరావణులకు మిక్కిలియుఁ దీక్ష్ణంబును సమస్తలోకంబుల
కును భయంకరంబునగు ఘోరద్వంద్వయుద్ధమయ్యె. ౧

అంత ఆయుధముల ధరించి యుద్ధసన్నద్ధములయిన వానరరాక్షససేనలు
రామరావణయుద్ధంబుఁ జూచుచు యుద్ధంబువదలి నిశ్చేష్టముగా నుండెను. ౨

అప్పుడు రాముండును రావణుండును ఘోరంబుగా యుద్ధముసేయ
నారంభించుటయు నిరువాఁగువారలును చేయునది విడిచి అత్యద్భుతంబుఁ
జూచుచుండిరి. ౩

ఆ సైనికులు అట్లద్భుతాకారమైన యుద్ధంబును జూచి యాశ్చర్యము
నొంది ప్రహరింప సాయుధంబులఁ బైకెత్తినచేతులతోనే యొకరి నొక
రెదిరింపక చూచుచుండిరి. ౪

రాక్షసులు రావణుని జూచుచును వానరులు రామునిఁజూచుచును
అద్భుతరసమగ్నులయి తెప్పపాటు మఱచి నిశ్చలులయి యుండుటవలన
నయ్యిరువాఁగును చిత్తరువున వ్రాయఁబడినదివలె నొప్పెను. ౫

రామరావణులును ఆ శకునంబు లన్నియుం జూచి నిశ్చయముతో
స్థిరమయిన కోపం బెసఁగ నిర్భయంబుగాఁ బోరిరి. ౬

అప్పుడు రాముండు జయము తప్పక కలుగుననియుం రావణుండు తప్పక

ధృతౌ స్వవీర్యసర్వస్వం యుద్ధేఽదర్శయతాం తదా. ౭

తతః క్రుద్ధో దశగ్రీవ శ్శరాన్ సంధాయ వీర్యవాన్,
ముమోచ ధ్వజ ముద్దిశ్య రాఘవస్య రథే స్థితమ్. ౮
తే శరా స్త మనాసాద్య పురందర రథధ్వజమ్,
రథశ క్తిం పరామృశ్య నిపేతు ర్ధరణీతలే. ౯
తతో రామోఽపి సంక్రుద్ధ శ్చాప మాయమ్య వీర్యవాన్,
కృతప్రతికృతం కర్తుం మనసా సంప్రచక్రమే. ౧౦
రావణధ్వజ ముద్దిశ్య ముమోచ నిశితం శరమ్,
మహాసర్ప మివాసహ్యం జ్వలన్తం స్వేన తేజసా. ౧౧

జగామ స మహీం ఛిత్త్వా దశగ్రీవధ్వజం శరః,
స నికృత్తోఽపతద్భూమౌ రావణస్య రథధ్వజః. ౧౨
ధ్వజస్యోన్మథనం దృష్ట్వా రావణస్సుమహాబలః,
సంప్రదీప్తోఽభవత్క్రోధా దమర్షా త్ప్రదహ న్నివ. ౧౩
స రోషవశ మాపన్న శ్శరవర్షం మహ ద్వమన్,
రామస్య తురగాన్ దీప్తై శ్శరై ర్వివ్యాథ రావణః. ౧౪
తే విద్ధా హరయ స్తత్ర నాస్ఖల న్నాపి బభ్రముః,
బభూవు స్స్వస్థహృదయాః పద్మనాళై రివాహతాః. ౧౫

తేషా మసమ్భ్రమం దృష్ట్వా వాజినాం రావణ స్తదా,
భూయఏవ సుసంక్రుద్ధ శ్శరవర్షం ముమోచహ. ౧౬
గదాశ్చ పరిఘాంశ్చైవ చక్రాణి ముసలాని చ,
గిరిశృఙ్గాణి వృక్షాంశ్చ తథా శూలపరశ్వథాన్. ౧౭

మరణంబు గలుగుననియుం ఉభయులును నిశ్చయించి తమ పరాక్రమం బంతయుం యుద్ధంబునం జూపిరి. ౭

అంతఁ బరాక్రమశాలియగు రావణుండు బాణంబుల వింటఁ సంధించి రాముని రథంబున నున్న ధ్వజముపయిఁ బ్రయోగించెను. ౮

ఆ బాణంబులు దృఢమయిన దేవేంద్రుని యరదంబు దాఁకి ధ్వజముఁ దాఁకకయే వ్యర్థంబులయి నేలంబడినవి. ౯

అంతఁ పరాక్రమవంతుఁడగు రాముండు పరమకుపితుఁడై ధనువు సాకర్షించి రావణునిచేతకుఁ బదులు గావింప మనంబునం దలంచెను. ౧౦

రాముఁడు మహాసర్పమువలె నతితీక్ష్ణమును దుస్సహంబును తేజస్సుచే జ్వలించుచున్నదియునగు నొక్క దివ్యబాణంబును రావణుని ధ్వజముపైఁ బ్రయోగించెను. ౧౧

ఆ బాణము రావణునిధ్వజమును ఖండించి భూమిం బ్రవేశించెను; రావణుని రథధ్వజము అట్లు ఖండితమయి నేలంగూలెను. ౧౨

మహాబలశాలియగు రావణుండు అట్లు తనధ్వజమును ఖండించుటను జూచి రాముని యాటోపంబునసహింపక కోపించి యగ్నివలె మండిపడెను. ౧౩

ఆ రావణుఁడు అట్లు కుపితుఁడై గొప్ప బాణవర్షంబు గురియుచు రాముని యశ్వముల మేనులందుఁ దీక్ష్ణబాణంబులఁ గుప్పించెను. ౧౪

అట్లు ఆ గుఱ్ఱంబులు బాణంబుల నొప్పింపఁబడియుం నెంతమాత్రమును జలనముగాని తడఁబాటుగాని పొందవయ్యెఁ; తామరతూండ్లం గొట్టఁబడినవి వలె స్వస్థములయి యుండినవి. ౧౫

అపుడు రావణుఁడు తనబాణప్రహారంబులకు అయ్యుత్తమాశ్వంబులు తలంగకుండుటంచూచి మఱియుఁ గుపితుఁడై మరల బాణవర్షంబు గురిసెను.

ఆ రావణుఁడు గదలను ఇనుపగుదియలను చక్రములను ముసలంబులను పర్వతశిఖరంబులను వృక్షములను శూలంబులను గండగొడ్డళ్లను అనేకంబుల రాముని రథముపయిం బ్రయోగించెను. ౧౭

మాయావిహిత మేత త్తు శస్త్రవర్ష మపాతయత్,
తుములం త్రాసజననం భీమం భీమప్రతిస్వనమ్. ౧౮

తద్వర్ష మభవ దృద్ధే నైకశస్త్రమయం మహత్,
విముచ్య రాఘవరథం సమన్తా ద్వానరే బలే. ౧౯
సాయకై ర న్తరిక్షం చ చకారాశు నిరంతరమ్,
సహస్రశ స్తతో బాణా నశ్రా న్తహృదయోద్యమః. ౨౦
ముమోచచ దశగ్రీవో నిస్సఙ్గేనా న్తరాత్మనా,
వ్యాయచ్ఛమానం తం దృష్ట్వా సత్వరం రావణం రణే. ౨౧
ప్రహసన్నివ కాకుత్స్థ స్సందధే సాయకాన్ శితాన్,

స ముమోచ తతో బాణా న్రణే శతసహస్రశః. ౨౨
తా న్దృష్ట్వా రావణ శ్చక్రే స్వశరైగ ఖం నిర న్తరమ్,

తత స్తాభ్యాం ప్రము క్తేన శరవర్షేణ భాస్వతా. ౨౩
శరబద్ధ మివాభాతి ద్వితీయం భాస్వదమ్బరమ్,

నానిమిత్తోఽభవ ద్బాణో నాతిభేత్తా న నిష్ఫలః. ౨౪

అన్యోన్య మభిసంహత్య నిపేతు ర్ధరణీతలే,
తథా విసృజతో ర్బాణా న్రామరావణయో ర్మృధే. ౨౫
ప్రాయుధ్యతామవిచ్ఛిన్నా వస్యన్తౌ సవ్యదక్షిణమ్,
చక్రతు స్తు శరౌఘై స్తౌ నిరుచ్ఛ్వాస మివామ్బరమ్. ౨౬

ఆ రావణుం డట్లు మాయాబలంబునం జేసి భయంకరం బయినదియుం భయంకరమయిన ప్రతిధ్వని గలదియునగు నానావిధాయుధవర్షము గురి పించెను. ౧౮

యుద్ధమునందు బహువిధశస్త్రమయమైన యమ్మహావర్షము రామ బాణనివారిత మగుటం జేసి రామరథంబు వదలి వానరసైన్యముపయింబడెను.

అంత రావణుండు ఎడతెగని యుత్సాహములోం గూడినవాండై మనంబున నొండుదలంపక వేనవేలుగ బాణంబులం బ్రయోగించి ఆకాశ మంతయు ఎంతమాత్రము సందులేక బాణములచే నిండినదిగాం గావించెను.

రావణుండు యుద్ధంబున నత్యాసక్తితో మహోత్సాహంబున బాణ ములు ప్రయోగించుటంజూచి రాముండు నవ్వుచుం దీక్ష్ణబాణంబుల ధనుస్సున సంధించెను. ౨౧

అంత రాముండు యుద్ధంబున లక్షలులక్షలుగా బాణంబులేయుటయుం రావణుం డవిచూచి ఆకాశంబంతయు ఎంతమాత్రము సందులేక తన బాణ ములచే నిండునట్లు పెక్కుబాణంబు లడరించెను. ౨౨

అంత నారామరావణులు ప్రయోగించిన దేదీప్యమానంబగు బాణ వర్షముచే నిండి యొప్పినదై యాకాశము బాణమయంబగు మఱియొక యాకాశము పగిదిం జూడనయ్యె. ౨౩

ఒక బాణముంగాని లక్ష్యములేక వేయంబడినదిగాని లక్ష్యము నతి క్రమించి యొండుస్థలము భేదించునది గాని నిష్ప్రయోజనమయినది గాని గలుగదయ్యె. ౨౪

అట్లు అద్భుతంబుగా యుద్ధంబుల బాణంబు లేయుచున్న యారామ రావణుల బాణంబులు ఒండొంటిందాంకి నేలంబడినవి. ౨౫

ఆ రామరావణులు సవ్యాపసవ్యక్రమంబుల నవిచ్ఛిన్నంబుగా బాణ ములు పరంగించి యాకాశంబంతయు నూర్పువిడుచుటకేని యవకాశము లేనట్లు బాణముల నిండించిరి. ౨౬

రావణస్య హయా న్రామో హయా న్రామస్య రావణః,
జఘ్నతు స్తౌ తథాఽన్యోన్యం కృతానుకృతకారిణౌ. ౨౭

ఏవం తౌ తు సుసంక్రుద్ధౌ చక్రతు ర్యుద్ధ మద్భుతమ్,
ముహూర్త మభవ ద్యుద్ధం తుములం రోమహర్షణమ్. ౨౮

యుధ్యమానౌ సమరే మహాబలౌ
శితై శ్శరై రావణలక్ష్మణాగ్రజౌ,
ధ్వజావపాతేన స రాక్షసాధిపో
భృశం ప్రచుక్రోధ తదా రఘూత్తమే. ౨౯

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే - నవోత్తరశతతమస్సర్గః. ౧౦౯.

## దశోత్తరశతతమస్సర్గః.

తౌ తదా యుధ్యమానౌ తు సమరే రామరావణౌ,
దదృశు స్సర్వభూతాని విస్మితేనాన్తరాత్మనా. ౧
అర్దయన్తౌ తు సమరే తయో స్తు స్యన్దనోత్తమౌ,
పరస్పర మభిక్రుద్ధౌ పరస్పర మభిద్రుతౌ. ౨
పరస్పరవధే యుక్తౌ ఘోరరూపౌ బభూవతుః,
మణ్డలాని చ వీథీశ్చ గతప్రత్యాగతాని చ. 3
దర్శయన్తౌ బహువిధాం సూతసారథ్యజాం గతిమ్,
అర్దయ న్రావణం రామో రాఘవం చాపి రావణః. ౪
గతివేగం సమాపన్నౌ ప్రవర్తననివర్తనే,

క్షిపతో శ్శరజాలాని తయో స్తౌ స్యన్దనోత్తమౌ. ౫
చేరతు స్సంయుగమహీం సాసారౌ జలదౌ యథా,

రాముఁడు రావణునశ్వంబులం బ్రహరించుటయుం రావణుండు రాముని హయంబుల నొప్పించెను. అట్లు ఇరువురు ఒకరు చేసినందుకు మఱియొకరు బదులు చేయుచు ఒండొరులను నొప్పించిరి. ౨౭

ఇవ్విధంబున నారామరావణులు పరమకుపితులయి యద్భుతముగా యుద్ధముగావించి రప్పుడు ముహూర్త కాలము నానావిధంబును రోమహర్షణంబునగు యుద్ధమయ్యె. ౨౮

అట్లు రామరావణులు ఒండొరులపయిం గఱకుటమ్ము లడరించుచుఁ బోరుచుండునప్పుడు రాక్షసరాజయిన రావణుండు తనధ్వజంబు పడఁద్రోసినందుకు రామునిపయి మిక్కిలియుం గినుకవహించెను. ౨౯

ఇది నూటతొమ్మిదవసర్గము.

## నూటపదియవసర్గము.

అయ్యుద్ధంబున నట్లద్భుతాకారంబుగాఁ బోరుచున్న యారామరావణులను సమస్తభూతంబులును వెఱఁగుపడి చూచుచుండెను. ౧

రథస్థులగు నారామరావణులు అట్లు ఒండొరులపైఁ గోపించి యొకరినొకరు వధింపంబూని యొండొరుల నొప్పించుచుండుటయు నాయుత్తమ రథంబులు ఒకదానినొకటి యెదుర్కొని సారథులచాతుర్యంబునం జేసి మండలాకారంబులు వీథులు గతప్రత్యాగతంబులు మొదలగు నానావిధగతులం జూపుచు భయంకరాకారంబులయి పొలిచెను. ౨, ౩

రాముఁడు రావణుని నొప్పించుచు రావణుండు రాముని నొప్పించుచు ఇరువురును బాణప్రయోగమునందును బాణముల మఱలించుటయందును మహావేగంబుఁ జూపిరి. ౪

ఆ రామరావణుల ట్లవిచ్ఛిన్నముగా బాణపరంపరలు వరఁగించుచుఁ జెలంగుటయుఁ వారల రథములురెండును యుద్ధభూమియందు జలధారలం

దర్శయిత్వా తథా తౌ తు గతిం బహువిధాం రణే. ౬
పరస్పరస్యాభిముఖౌ పునరేవావతస్థతుః,
ధురం ధురేణ రథయో ర్వక్త్రం వక్త్రేణ వాజినామ్. ౭
పతాకాశ్చ పతాకాభి స్సమేయుః స్థితయో స్తదా,

రావణస్య తతో రామో ధనుర్ముక్తై శ్శితై శ్శరైః. ౮
చతుర్భి శ్చతురో దీప్తై ర్హయా న్ప్రత్యపసర్పయత్,

స క్రోధవశమాపన్నో హయానా మపసర్పణే. ౯
ముమోచ నిశితా న్బాణా న్రాఘవాయ నిశాచరః,
సోఽతివిద్ధో బలవతా దశగ్రీవేణ రాఘవః. ౧౦
జగామ న వికారం చ నచాపి వ్యథితోఽభవత్,

చిక్షేప చ పున ర్బాణా న్వజ్రపాతసమస్వనాన్. ౧౧
సారథిం వజ్రహ స్తస్య సముద్దిశ్య నిశాచరః,
మాతలే స్తు మహావేగా శ్శరీరే పతితా శ్శరాః. ౧౨
న సూక్ష్మ మపి సమ్మోహం వ్యథాం వా ప్రదదు ర్యుధి,
తయా ధర్షణయా క్రుద్ధో మాతలే ర్న తథాఽఽత్మనః. ౧౩
చకార శరజాలేన రాఘవో విముఖం రిపుమ్,

వింశతం త్రింశతం షష్టిం శతశోఽథ సహస్రశః. ౧౪
ముమోచ రాఘవో వీర స్సాయకాన్ స్యన్దనే రిపోః,

గురియుచున్న మేఘంబులకై వడిఁ జూడనొప్పెను. ౫

ఆ రథంబు లట్లు యుద్ధంబున నానావిధగతులం జూపి మరల నొం డొంటి కభిముఖముగా నిలిచినవి. ౬

అప్పుడు ఆ రథములు పరస్పరము కాఁడికాఁడితోను ధ్వజములు ధ్వజ ములతోను గుఱ్ఱములముఖములు ముఖములతోను గదిసియుండునట్లు నిలిచి పొలిచెను. ౭

అంత రాముఁడు ధనువు నాకర్షించి దేదీప్యమానంబులగు నాలుగు వాఁడి బాణములేసి శనరథాశ్వముల కడ్డముగా నిలిచిన రావణు నశ్వంబుల నాల్గింటిని ఆవలికిఁ దోలెను. ౮

ఆ రావణుఁడు తనగుఱ్ఱంబుల నావలికిఁ దోలగించుటకుఁ గుపితుఁడై రామునిపయిఁ గఱకుటమ్ములం బఱపెను. ౯

రాముఁడు అట్లు బలవంతుఁడగు రావణునిచే మిక్కిలియు నొప్పింపఁ బడినను బాధను గాని అంతర్వేదనవలనఁ గలుగు నంగవికారముఁ గాని యెంత మాత్రముఁ బొందఁడయ్యె. ౧౦

అంత రావణుఁడు దేవేంద్రుని సారథియగు మాతలిపై పిడుగుపడి నంతటి మహాధ్వనిగల బాణంబులం బ్రయోగించెను. ౧౧

మాతలికి యుద్ధంబున మహావేగంబులగు నాబాణంబులు దేహంబుపై, బడినను కొంచెమైనను కలఁతగాని నొప్పిగాని కలుగదయ్యె. ౧౨

రాముఁడు రావణుఁడు తన్ను నొప్పించుట కంతగాఁ గోపము నొంద లేదుగాని మాతలిని నొప్పించినందుకు మాత్రము పరమకుపితుఁడై పెక్కు బాణములు పరఁగించి యుద్ధంబున రావణునిఁ దనయెదుట నిలువలేక కొంత తొలఁగునట్లు కావించెను. ౧౩

పరాక్రమవంతుఁడగు రాముఁడు అంత నిరువదియమ్ములను ముప్పది బాణంబులను అఱువదితూపులను నూఱు నూఱు శరంబులను వేయివేయి సాయకంబులను ఇట్లు నానావిధంబుగా నసంఖ్యబాణంబుల రావణుని యర దంబుపైఁ బ్రయోగించెను. ౧౪

రావణోఽపి తతః క్రుద్ధో రథస్థో రాక్షసేశ్వరః. ౧౫
గదాముసలవర్షేణ రామం ప్రత్యర్దయ ద్రణే,
తత్ప్రవృత్తం మహాద్యుద్ధం తుములం రోమహర్షణమ్. ౧౬

గదానాం ముసలానాం చ పరిఘాణాం చ నిస్వనైః,
శరాణాం పుఙ్ఖపాతైశ్చ క్షుభితా స్సప్తసాగరాః. ౧౭

క్షుబ్ధానాం సాగరాణాం చ పాతాళతలవాసినః,
వ్యథితాః పన్నగా స్సర్వే దానవాశ్చ సహస్రశః. ౧౮
చకమ్పే మేదినీ కృత్స్నా సశైలవనకాననా,
భాస్కరో నిష్ప్రభ శ్చాసీ న్నవవౌ చాపి మారుతః. ౧౯
తతో దేవా స్సగన్ధర్వా స్సిద్ధా శ్చ పరమర్షయః,
చిన్తా మాపేదిరే సర్వే సకిన్నరమహోరగాః. ౨౦
స్వస్తి గోబ్రాహ్మణేభ్యోఽస్తు లోకా స్తిష్ఠన్తు శాశ్వతాః,
జయతాం రాఘవ స్సఙ్ఖ్యే రావణం రాక్షసేశ్వరమ్. ౨౧

ఏవం శ(జ)పన్తోఽపశ్యం స్తే దేవా స్సర్షిగణా స్తదా,
రామరావణయో ర్యుద్ధం సుఘోరం రోమహర్షణమ్. ౨౨
గన్ధర్వాప్సరసాం సంఙ్ఘా దృష్ట్వా యుద్ధ మనూపమమ్,
గగనం గగనాకారం సాగర స్సాగరోపమః. ౨౩
రామరావణయో ర్యుద్ధం రామరావణయో రివ,
ఏవం బ్రువన్తో దదృశు స్తద్యుద్ధం రామరావణమ్. ౨౪
తతః క్రుద్ధో మహాబాహూ రఘూణాం కీర్తివర్ధనః,
సంధాయ ధనుషా రామః క్షురమాశీవిషోపమమ్. ౨౫
రావణస్య శిర శ్ఛిన్ద చ్ఛ్రీమజ్జ్వలితకుణ్డలమ్,

అంత రాక్షసరాజు రావణుఁడు స్థిరంబుగా రథంబున నున్నవాఁడై కోపించి గదలను ముసలంబులను వర్షించి రామునిఁ నొప్పించెను. ౧౫

అంత నయ్యుద్ధంబు తుములంబై చూపరులకు గగుర్పాటు గలిగించునదై భయంకరంబై యొప్పెను. ౧౬

రావణుఁడేయునట్టి గదలు ముసలంబులు పరిఘంబులు మొదలగు నాయుధములయొక్క వేగధ్వనికిని బాణపుంఖముల పాటునకును సప్తసాగరంబులును ఘూర్ణిల్లెను. ౧౭

అట్లు మహాసముద్రంబులు క్షోభిల్లుటయుఁ బాతాళవాసులగు నురగంబులు దానవులును వేలకొలందులవారలు అందఱును దిగులొందిరి. ౧౮

పర్వతంబులతోను వనంబులతోనుం గూడ భూమియంతయుఁ జలనంబు నొందెను; సూర్యుఁడు కాంతిహీనుండయ్యె; వాయువు వీవఁడయ్యె. ౧౯

అంత దేవతలును గంధర్వులును సిద్ధులును కిన్నరులును మహోరగంబులును పరమర్షులును అందఱును భయమునొందిరి. ౨౦

గోవులకును బ్రాహ్మణులకును క్షేమంబగుఁగాక; లోకములు శాశ్వతముగా నుండుఁగాక; రాముఁడు యుద్ధంబుని రాక్షసరాజును రావణుని జయించుఁ గాక. అని దేవతలును ఋషులును జపము గావించిరి. ౨౧

అప్పుడు దేవతలును మహర్షులును ఇవ్విధంబున జపంబు సేయుచు మహాభయంకరమును రోమహర్షణంబునగు రామరావణ యుద్ధంబుఁ జూచిరి.

గంధర్వులును అప్సరసలును అసదృశంబగు రామరావణుల యమ్మహాయుద్ధంబుఁ జూచి "ఆకాశమువంటిది ఆకాశమే, సముద్రమువంటిది సముద్రమే, అట్లు రామరావణయుద్ధమువంటిది రామరావణ యుద్ధమేగాని వేఱే గానము." అని యాశ్చర్యమునొంది పలికిరి. ౨౩, ౨౪

అంత మహాబాహుఁడును రఘువంశపు రాజుల యశస్సును వృద్ధినొందించువాఁడునగు రాముఁడు కుపితుఁడై సర్పమువలె నతి తీక్ష్ణమయిన బాణంబును వింటసంధించి కుండలములతో నొప్పుచున్న శ్రీమంతంబగు రావణుని

తచ్ఛిరః పతితం భూమౌ దృష్టం లోకై స్త్రిభి స్తదా. ౨౬
తస్యైవ సదృశం చాన్య ద్రావణ స్యోత్థితం శిరః,
తత్క్షిప్రం క్షిప్రహస్తేన రామేణ క్షిప్రకారిణా. ౨౭
ద్వితీయం రావణశిర శ్ఛిన్నం సంయతి సాయకైః,

ఛిన్నమాత్రం తు తచ్ఛీర్షం పున రన్యత్ స్మ దృశ్యతే. ౨౮
తదప్యశనిసఙ్కాశై శ్ఛిన్నం రామేణ సాయకైః,

ఏవమేకశతం ఛిన్నం శిరసాం తుల్యవర్చసామ్. ౨౯
నచైవ రావణ స్యాన్తో దృశ్యతే జీవితక్షయే,
తత స్సర్వాస్త్రవిద్వీరః కౌసల్యానన్దవర్ధనః. 3౦
మార్గణై ర్బహుభి ర్యుక్త శ్చిన్తయామాస రాఘవః,

మారీచో నిహతో యైస్తు ఖరో యైస్తు సదూషణః. 3౧
క్రౌఞ్చారణ్యే విరాధ స్తు కబన్ధో దణ్డకావనే,
త ఇమే సాయకా స్సర్వే యుద్ధే ప్రత్యాయికా మమ. 3౨
కిన్ను తత్కారణం యేన రావణే మన్దతేజసః,

ఇతి చిన్తాపర శ్చాసీ దప్రమత్తశ్చ సంయుగే. 33
వవర్ష శరవర్షాణి రాఘవో రావణోరసి,
రావణోఽపి తతః క్రుద్ధో రథస్థో రాక్షసేశ్వరః. 3౪
గదాముసలవర్షేణ రామం ప్రత్యర్దయ ద్రణే,
తత్ప్రవృత్తం మహద్యుద్ధం తుములం రోమహర్షణమ్. 3౫

శిరముం ద్రుంచెను. ౨౫

అప్పుడు భూమింబడిన యాశిరస్సును ముల్లోకంబులును జూచినవి.

ఆ శిరస్సువంటిదే మఱియొక శిరస్సు రావణునకు మొలిచెను.

ఆ రావణుని మరలఁబుట్టిన శిరస్సును గూడ యుద్ధంబున శీఘ్రముగాఁ బనిచేయఁ జేతులు గలవాఁడును శీఘ్రముగాఁ జేయువాఁడునగు రాముండు శీఘ్రముగా బాణంబుల ఛేదించెను. ౨౬

ఆ శిరస్సును ఖండించులోపల నె మఱియొక శిరస్సు కనఁబడినది. ౨౭

రాముఁడు ఆ శిరస్సును గూడ వజ్రసమానంబు లగు బాణముల ఖండించెను.

ఇట్లు రావణుని శిరస్సులను నూటయొక్కమాఱు రాముఁడు ఛేదించి నను రావణుండేమో మరణము నొందనేలేదు. ౨౯

అంత సమస్తాస్త్రంబులు దెలిసినవాఁడును అనేక దివ్యబాణంబులు గల వాఁడును వీరుండునగు కౌసల్యాపుత్త్రుఁడు రాముఁడు ఇవ్విధంబున మనం బునం జింతించెను. ౩౦

మున్ను ఏబాణంబుల మారీచుం జంపితినో ఏశరంబుల ఖరదూషణుల వధియించితినో మఱియుం దండకారణ్యంబున విరాధునిఁ గ్రౌంచారణ్యం బున గబంధుని ఏబాణంబులఁ బొరిపుచ్చితినో, అట్టి ఎప్పుడును వ్యర్థములు కాక యుద్ధంబుని విశ్వసనీయములయిన యీ నాబాణంబులన్నియుఁ నిప్పుడు రావణునందు వ్యర్థము లయినందుకుఁ గారణ మేమి? అని రాముండు చింతించెను. ౩౧.౩౨

రాముం డిట్లు చింతనొందినను యుద్ధంబున నెంతమాత్రమే మఱకఁ రావణుని వక్షంబుపయి బాణవర్షంబులు గురిసెను. ౩౩

అంత రథగతుండయిన రాక్షసరాజు రావణుండును గోపించి యుద్ధం బున రామునిపయి గదలను ముసలంబులను వర్షించి నొప్పించెను. ౩౪

అట్లు రామరావణులు అగ్రహావశంబున రథసహితంబుగా నాకాశం

అ న్తరిక్షేచ భూమౌచ పునశ్చ గిరిమూర్ధని,

దేవదానవయక్షాణాం పిశాచోరగరక్షసామ్. ౩౬
పశ్యతాం తన్మహ ద్యుద్ధం సర్వరాత్ర మవ ర్తత,
"స ప్తరాత్ర మవ ర్తత" ఇతి పాఠాంతరమ్.

నైవ రాత్రం నదివసం నముహూ ర్తం నచక్షణమ్. ౩౭
రామరావణయో ర్యుద్ధం విరామ ముపగచ్ఛతి,

దశరథసుత రాక్షసేన్ద్రయో
ర్జయ మనవేక్ష్య రణే స రాఘవస్య. ౩౮
సురవరరథసారథి ర్మహాన్
రణగత మేన మువాచ వాక్య మాశు.

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే-దశో త్తరశతతమస్సర్గః. ౧౧౦.

ఏ కా ద శో త్త ర శ త త మ స్స ర్గః.

అథ సంస్మారయామాస రాఘవం మాతలి స్తదా,

అజానన్నివ కిం వీర! త్వమేన మనువ ర్తసే. ౧

విసృ జాస్మై వధాయ త్వ మస్త్రం పైతామహం ప్రభో!,
వినాశకాలః కథితో య స్సురైః సోఽద్య వ ర్తతే. ౨

బున కెగసియుం నేలకుడిగ్గియుం ద్రికూటశిఖరంబునకు దాఁటియు ననేక భంగులం బోరుటయు నయ్యుద్ధంబు భయంకరంబై చూపరులకు గగుర్పు గలిగించునదై యొప్పెను. 35

దేవతలును దానవులును యక్షులును బిశాచులు నురగంబులును రాక్షసులును జూచుచుండఁగా నమ్మహాయుద్ధము జేయుం బవలును ఘోరంబై వర్తించెను. (పాఠాంతరపక్షమందు) అమ్మహాయుద్ధము ఆరంభము మొదలు కడపటికు ఏడు రాత్రులు వర్తిల్లెను. 36

రాత్రియందుఁగాని పగటియందుఁగాని యొక ముహూర్తమాత్రము గాని క్షణకాలముగాని విరామము లేక రామరావణులు ఘోరంబుగా యుద్ధము గావించిరి. 37

మహామద్దిగల దేవేంద్రసారథియగు నమ్మాతలి రామరావణులు యుద్ధంబు సేయుచుండుటయు రామునకు జయంబు గలుగకుండుటయుం జూచి యుద్ధంబు సేయుచున్న రామునితో శీఘ్రంబున నిట్లు పలికెను. 38

ఇది నూటపదవసర్గము.

## నూటపదునొకండవసర్గము.

అంత నప్పుడు మాతలి రామునకు రావణవధసమయంబు దెలియ జ్ఞాపకముసేయుచు నిట్టని పలికెను.

వీరుఁడా! నీవుగూడ నేమియుఁ దెలియనట్లు ఈ రావణునిఁ దెగఁ జూడక యితని నుపేక్షించుచున్నావేమి? ౧

సమర్థుఁడవగు రాముఁడా! ఈ రావణుండు ఎప్పుడు నశించునని దేవతలు చెప్పిరో, ఆసమయం బిపుడువచ్చినది కావున నీతఁడు హతుఁడగునట్లు ఇతనిపయి నిప్పుడు బ్రహ్మాస్త్రంబుఁ బ్రయోగింపుము. అని మాతలి రామునకుఁ జెప్పెను. ౨

తత స్సంస్మారితో రామ స్తేన వాక్యేన మాతలేః,
జగ్రాహ స శరం దీప్తం నిశ్వస న్త మివోరగమ్. ౩
యమస్మై ప్రథమం ప్రాదా దగస్త్యో భగవా నృషిః,
బ్రహ్మదత్తం మహాబాణ మమోఘం యుధి వీర్యవాన్. ౪
బ్రహ్మణా నిర్మితం పూర్వ మిన్ద్రార్థ మమితౌజసా,
దత్తం సురపతేః పూర్వం త్రిలోకజయకాఙ్క్షిణః. ౫
యస్య వాజేషు పవనః ఫలే పావకభాస్కరౌ,
శరీర మాకాశమయం గౌరవే మేరుమన్దరౌ. ౬
జాజ్వల్యమానం వపుషా సుపుఙ్ఖం హేమభూషితమ్,
తేజసా సర్వభూతానాం కృతం భాస్కరవర్చసమ్. ౭
సధూమ మివ కాలాగ్నిం దీప్త మాశీవిషం యథా,
పరనాగాశ్వబృన్దానాం భేదనం క్షిప్రకారిణమ్. ౮
ద్వారాణాం పరిఘాణాం చ గిరీణా మపి భేదనమ్,
నానారుధిరసిక్తాఙ్గం మేదోదిగ్ధం సుదారుణమ్. ౯
వజ్రసారం మహానాదం నానాసమితిదారణమ్,
సర్వవిత్రాసనం భీమం శ్వసన్త మివ పన్నగమ్. ౧౦
కఙ్కగృధ్రబలానాం చ గోమాయుగణరక్షసామ్,
నిత్యం భక్ష్యప్రదం యుద్ధే యమరూపం భయావహమ్. ౧౧
నన్దనం వానరేన్ద్రాణాం రక్షసామవసాదనమ్,
వాజితం వివిధై ర్వాజై శ్చారుచిత్రై ర్గరుత్మతః. ౧౨
త ముత్తమేషుం లోకానా మిక్ష్వాకుభయనాశనమ్,
ద్విషతాం కీర్తిహరణం ప్రహర్షకర మాత్మనః. ౧౩

అభిమన్త్ర్య తతో రామ స్తం మహేషుం మహాబలః,
వేదప్రోక్తేన విధినా సన్దధే కార్ముకే బలీ. ౧౪

అంత రాముఁడు మాతలిచే బోధితుఁడై దేదీప్యమానంబును నిట్టూర్పులు పుచ్చుచున్న యుగ్రసర్పంబువలె నున్నదియు మున్ను ముల్లోకంబుల జయింపఁగోరిన దేవేంద్రునకు మహాప్రభావుండగు బ్రహ్మదేవునిచే నిర్మించి యొసంగఁబడినదియుం వాయువునకుంబోలె వేగంబును అగ్నిసూర్యులకుంబోలె వాఁడిమియుం ఆకాశంబునకుంబోలె వ్యాపకత్వంబును మేరుమందర పర్వతంబులకుంబోలె గురుత్వంబునుంగలదియుఁ బ్రజ్వరిల్లుచున్న యాకారంబు గలదియుఁ గాంచనమయంబగు పుంఖంబుగలదియు సమస్త భూతంబుల సారాంశములు గ్రహించి నిర్మింపఁబడినదియు సూర్యనిభంగి భాసిల్లుచున్నదియు ఱెక్కలతోఁ గూడియుండుటం జేసి ధూమసహితంబగు ప్రలయకాలానలంబువలెఁ జూపట్టుచున్నదియు నతిశీఘ్రంబున శత్రువుల గజంబులను గుఱ్ఱంబులను వధించునదియుఁ బురద్వారంబులను పరిఘలను బర్వతంబులను భేదించునదియు నానావిధమయిన యసురులరుధిరంబు చవిచూచినదియు మేదోదిగ్ధంబును వజ్రంబునకుంబోలె దార్ఢ్యంబుగలదియు మహానాదంబును నానావిధములయిన కపటయుద్ధంబులనుగూడ రూపడంచునదియు సమస్త భూతంబులకును భయంకరంబును గంకపక్షులకును గృధ్రంబులకును నక్కలకును పిశాచరక్షోగణంబులకును నిత్యంబు నాహారంబొసంగునదియు యుద్ధంబున యమునికైవడి సర్వలోక భయంకరంబును వానరవీరులకు సంతోషంబును రాక్షసులకు వినాశంబును గల్గించునదియు సుందరములును జిత్రవర్ణంబులునగు గరుత్మంతుని పక్షములు గట్టినదియు సమస్తలోకంబులలో నుత్తమమయిన బాణంబును ఇక్ష్వాకువంశభవులగు రాజులభయంబు నశింపఁజేయునదియు మున్ను తనకు (రామునకు) భగవంతుఁడగు నగస్త్యమహర్షి బ్రహ్మదేవునిచే నింద్రున కొసంగఁబడినదియు యుద్ధంబున నమోఘంబునగు నెద్దాని నొసంగె నట్టి మహాబాణంబును శత్రువుల యశంబు హరించి తనకుఁ బ్రహర్షంబు నొసంగునదియునగు దివ్యశరంబును గ్రహించెను. ౩, ౧౩

అంత మహాబలశాలియగు రాముఁడు వేదచోదితంబగు విధానంబున నద్దివ్యబాణము నభిమంత్రించి ధనువున సంధించెను. ౧౪

తస్మిన్ సన్ధీయమానే తు రాఘవేణ శరో త్తమే,
సర్వభూతాని విత్రేసు శ్చచాల చ వసున్ధరా. ౧౪
స రావణాయ సంక్రుద్ధో భృశ మాయమ్య కార్ముకమ్,
చిక్షేప పరమాయ త్తః స్తం శరం మర్మఘాతినమ్. ౧౬

స వజ్ర ఇవ దుర్ధర్షో వజ్రబాహువిసర్జితః,
కృతా న్త ఇవ చావార్యో న్యపత ద్రావణోరసి. ౧౭
స విసృష్టో మహావేగ శ్శరీరా న్తకర శ్శరః,
బిభేద హృదయం తస్య రావణస్య దురాత్మనః. ౧౮
రుధిరా క్త స్స వేగేన జీవితా న్తకర శ్శరః,
రావణస్య హర న్ప్రాణా న్వివేశ ధరణీతలమ్. ౧౯

స శరో రావణం హత్వా రుధిరార్ద్రీకృతచ్ఛవిః,
కృతకర్మా నిభృతవ త్స్వతూణీం పునరాగమత్. ౨౦

తస్య హస్తా ద్ధతస్యాశు కార్ముకం తత్ర సాయకమ్,
నిపపాత సహ ప్రాణై ర్భ్రశ్యమానస్య జీవితాత్. ౨౧
గతాసు ర్భీమవేగస్తు నైరృతేన్ద్రో మహాద్యుతిః,
పపాత స్యన్దనా ద్భూమౌ వృత్రో వజ్రహతో యథా. ౨౨

తం దృష్ట్వా పతితం భూమౌ హతశేషా నిశాచరాః,
హతనాథా భయత్రస్తా స్సర్వత స్సంప్రదుద్రువుః. ౨౩
నర్ద న్త శ్చాభిపేతు స్తా న్వానరా ద్రుమయోధినః,

దశగ్రీవవధం దృష్ట్వా విజయం రాఘవస్య చ. ౨౪

రాముఁ డమ్మహాబాణంబు సంధింపఁగానే సమస్తభూతంబులును భయము నొందినవి. భూమివడంకెను. ౧౫

రాముఁడు పరమకుపితుండై బలంబుఁగొలందిని ధనుస్సును జెవివఱకు నాకర్షించి మర్మభేదనంబగు నమ్మహాబాణమును రావణునిపయిఁ బ్రయోగించెను. ౧౬

అమ్మహాశరంబు దేవేంద్రుఁడు ప్రయోగించిన వజ్రాయుధంబు పగిదిఁ గల్పాంతయమునికైవడి దుర్ధర్షంబై రావణుని వక్షంబుఁ జొచ్చెను. ౧౭

మహావేగంబును శత్రువుల ప్రాణంబులు గొనునదియునగు నబ్బాణంబు దుర్బుద్ధియగు రావణుని వక్షంబు దాఁకి వీఁపున నుచ్చిపోయెను. ౧౮

ప్రాణనాశకరంబగు నబ్బాణంబు రావణునిఁబ్రొమ్ముఁదూఱి వేగంబున నతని ప్రాణంబులు హరించి నెత్తుటందడిసినదై వెలువడి భూమిం బ్రవేశించెను. ౧౯

అమ్మహాబాణము రావణుం బొరిగొని నెత్తురుచే నెఱ్ఱనై ఉద్దిష్టమయిన కార్యమును నెఱవేర్చిన దగుటంజేసి నిశ్చలముగా నుండునట్టు మరల నమ్ములపొదిం జొచ్చెను. ౨౦

అట్లు రావణుఁడు హతుఁడై విగతజీవితుం డగుటయు నతనిచేత నున్న ధనుస్సు పట్టువదలి బాణసహితంబుగా నేలంబడెను. ౨౧

భయంకరమయిన పరాక్రమముగలవాఁడును మహాతేజుఁడునగు రాక్షస రాజు రావణుఁడు ప్రాణములు వెడలినంతనె వజ్రాయుధముచే హతుఁడైన వృత్రుఁడుంబోలె నరదంబునుండి నేలంగూలెను. ౨౨

అంత హతశేషులగు రాక్షసులు రావణుఁడు పడుటంజూచి తమ నాథుఁడు హతుఁడగుటవలన వెఱచి దిక్కులకుం బాఱిరి. ౨౩

వానరులును వృక్షహస్తులయి సింహనాదంబులు సేయుచు నా రాక్షసులం దఱిమిరి.

ఆ హతశేషులగు రాక్షసులు రావణుఁడు హతుఁడగుటయుం రాముఁడు-

అర్దితా వానరై ర్హృష్టై ర్లఙ్కా మభ్యపత న్భయాత్,
గతాశ్రయత్వా త్కరుణై ర్బాష్పప్రస్రవణై ర్ముఖైః. ౨౫
తతో వినేదు స్సంహృష్టా వానరా జితకాశినః,
వదన్తో రాఘవజయం రావణస్య చ తద్వధమ్. ౨౬

అథాన్తరిక్షే వ్యనద త్సౌమ్య స్త్రిదశదున్దుభిః,
దివ్యగన్ధవహ స్తత్ర మారుత స్సుసుఖం వవౌ. ౨౭
నిపపాతాన్తరిక్షాచ్చ పుష్పవృష్టి స్తదా భువి,
కిర న్తీ రాఘవరథం దురవాపా మనోరమా. ౨౮
రాఘవ స్తవసంయుక్తా గగనేఽపి చ శుశ్రువే,
సాధుసాధ్వితి వాగగ్ర్యా దేవతానాం మహాత్మనామ్. ౨౯

ఆవివేశ మహాహర్షో దేవానాం చారణై స్సహ,
రావణే నిహతే రౌద్రే సర్వలోకభయఙ్కరే. ౩౦
తత స్స కామం సుగ్రీవ మఙ్గదం చ మహాబలమ్,
చకార రాఘవః ప్రీతో హత్వా రాక్షసపుఙ్గవమ్. ౩౧

తతః ప్రజగ్ముః ప్రశమం మరుద్గణాః
దిశః ప్రసేదు ర్విమలం నభోఽభవత్,
మహీ చకమ్పే న చ మారుతో వవౌ
స్థిరప్రభ శ్చాప్యభవ ద్దివాకరః. ౩౨
తతస్తు సుగ్రీవవిభీషణాదయ
స్సుహృద్విశేషా స్సహలక్ష్మణా స్తదా,

విజయంబు నొందుటయుం జూచి వానరులు ప్రహర్షోత్సాహంబులు గదుర వెనుదగిలి నొప్పించుటయుం నాథుండు లేని వారలగుటం జేసి ముఖంబులం గన్నీరొలుక వెఱచఱచి లంకాభిముఖములయి పాఱిరి. ౨౪, ౨౫

అట్లు రాక్షసులు పాఱుటయు జయంబు నొందిన వానరులు పరమ సంతోషంబు నొందినవారలయి రామునిజయంబు రావణవధంబు నుగ్గడించుచు సింహనాదంబులు గావించిరి. ౨౬

అంత నంతరిక్షంబున మంగళసూచకంబగు దేవదుందుభిమ్రోసెను. దివ్యగంధము గుబాళింప వాయువు సుఖంబుగా వీచెను. ౨౭

అప్పుడు అంతరిక్షమునుండి రాముని రథము నంతయుం బుష్పములచే నించుచు దుర్లభంబయిన పుష్పవృష్టి యద్భుతంబుగాఁ గురిసెను. ౨౮

భూమియందు వానరులు గావించు ప్రశంసలు మాత్రమె గాక ఆకాశంబునందును మహానుభావులగు దేవతలు రాముని నానావిధంబులం బ్రస్తుతింపుచు సాధువాక్యంబులం బ్రశంసించిరి. ఆ వాక్యంబులును భూమి యందు వినంబడెను. ౨౯

క్రూరుఁడు సమస్తలోకంబులకును హింసకుండైన రావణుఁడు హతుండగుటవలన దేవతలును జారణులును బరమసంతోషంబు నొందిరి. ౩౦

అంత రాముఁడు రాక్షసేంద్రుని వధించి తానును సంతుష్టుఁడై సుగ్రీవునియొక్కయు మహాబలుఁడగు నంగదునియొక్కయుం గోర్కులు నెఱవేర్చుటం జేసి వారలను సంతోషపఱచెను. ౩౧

అంత దేవతలకష్టము తొలంగెను. దిశలు ప్రసన్నంబు లయ్యెను. ఆకాశము నిర్మలంబయ్యెను. రామరావణయుద్ధ మప్పుడు కలుగుచుండిన భూకంపము నిలిచెను. వాయువు వీచఁదొడంగెను. సూర్యుండును నిర్మలుఁడై వెలింగెను. ౩౨

అంత నపుడు సుగ్రీవుఁడును విభీషణుఁడును మఱియుం నితరులయిన మిత్రులును లక్ష్మణసహితంబుగా యుద్ధంబున రాముఁడు జయంబు నొందు

సమేత్య హృష్టా విజయేన రాఘవం
రణేఽభిరామం విధినాఽభ్యపూజయన్. 33
స తు నిహతరిపుః స్థిరప్రతిజ్ఞః
స్వజనబలాభివృతో రణే రరాజ,
రఘుకులనృపనన్దనో మహౌజా
స్త్రిదశగణై రభిసంవృతో యథేన్ద్రః. 3౪

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే-ఏకాదశోత్తరశతతమస్సర్గః.

---

## ద్వాదశోత్తరశతతమస్సర్గః.

భ్రాతరం నిహతం దృష్ట్వా శయానం రామనిర్జితమ్,
శోకవేగపరీతాత్మా విలలాప విభీషణః. ౧
వీర! విక్రాన్త! విఖ్యాత! వినీత! నయకోవిద!,
మహార్హశయనోపేత! కిం శేషేఽద్య హతో భువి. ౨
విక్షిప్య దీర్ఘౌ నిశ్చేష్టౌ భుజా వఙ్గదభూషితౌ,
ముకుటేనాపవృత్తేన భాస్కరాకారవర్చసా. 3

తదిదం వీర! సంప్రాప్తం మయా పూర్వం సమీరితమ్,
కామమోహపరీతస్య యత్తే న రుచితం వచః. ౪

యన్న దర్పాత్ప్రహస్తో వా నేన్ద్రజిన్నాపరే జనాః,
న కుమ్భకర్ణోఽతిరథో నాతికాయో నరాన్తకః. ౫
న స్వయం త్వ మమన్యేథా స్తస్యోదర్కోఽయ మాగతః,

గత స్సేతు స్సునీతానాం గతో ధర్మస్య విగ్రహః. ౬

టికిఁ బరమసంతుష్టులయి యందఱును జయంబు నొంది ప్రియదర్శనుఁడై యున్న రాముం జేరి వారివారియోగ్యతకుం దగునట్లు ప్రశంసించిరి. ౩౩

మహాతేజుఁడగు రాముఁడును యుద్ధంబున శత్రువును వధించి ప్రతిజ్ఞ నెఱవేర్చి మిత్రులచేతను వానరసేనలచేతను బరివేష్టితుఁడై దేవగణంబులచేఁ బరివేష్టితుఁడగు దేవేంద్రునిపగిదిం బ్రకాశించెను. ౩౪

ఇది నూటపదునొకండవసర్గము.

## నూటపండ్రెండవసర్గము.

రామునిచే నిహతుఁడై యుద్ధభూమింబడియున్న యన్నను జూచి విభీషణుండు పరమదుఃఖితుఁడై యిట్లని విలపించెను. ౧

రావణుఁడా! నీవు శూరుఁడవు; పరాక్రమంబున వినుతికెక్కిన వాఁడవు; సమస్తశాస్త్రంబుల నేర్చినవాఁడవు; రాజనీతియందుఁ బండితుఁడవు; లోకోత్తరంబగు శయనంబునఁ బవ్వళింపఁ దగినవాఁడవే; ఇట్లు హతుఁడవై బాహుపురులచే భూషితంబులగు దీర్ఘంబులయిన భుజంబులను నిశ్చలంబుగాఁ జాఁచి రథంబునుండి పడుటవలనఁ గొంచెముకదలిన సూర్యతేజంబగు కిరీటంబుతో భూమిం బడియున్నావేమి? ౨, ౩

వీరుఁడా! ఈ విధంబుగాఁ బరిణమించునని నేను మున్నే నీకుఁ జెప్పితిని. మన్మథమోహితుఁడవగుటంజేసి యది నీవు వినవైతివి. నేను చెప్పిన విధంబుననే యిపు డాఫలం బనుభవించితివి. ౪

సీతాహరణమంతటి మహాపాపకర్మము గావించి ప్రహస్తుఁడుగాని యింద్రజిత్తుఁడుగాని యితరరాక్షసులుగాని కుంభకర్ణుఁడుగాని యతికాయుఁడుగాని నరాంతకుఁడుగాని నీవుగాని గర్వంబువలన నెంతమాత్రము సరకుసేయరైతిరి, ఆ ఫల మిపుడు ప్రాప్తమయినది. ౫

సమస్తనీతులును దెలిసినవాఁడు గతించెను, ధర్మముయొక్క ఆకారమే

గత స్సత్త్వస్య సంక్షేపః ప్రస్తావానాం గతి ర్గతా,

ఆదిత్యః పతితో భూమౌ మగ్న స్తమసి చన్ద్రమాః. ౭
చిత్రభానుః ప్రశాన్తార్చి ర్వ్యవసాయో నిరుద్యమః,
అస్మి న్నిపతితే భూమౌ వీరే శస్త్రభృతాం వరే. ౮

కిం శేష మివ లోకస్య హతవీరస్య సాంప్రతమ్,
రణే రాక్షసశార్దూలే ప్రసుప్త ఇవ పాంసుషు. ౯

ధృతిప్రవాళః ప్రసహాగ్ర్యపుష్ప
స్తపోబల శ్శౌర్యనిబద్ధమూలః,
రణే మహా న్రాక్షసరాజవృక్ష
స్సమ్మర్దితో రాఘవమారుతేన. ౧౦
తేజోవిషాణః కులవంశవంశః
కోపప్రసాదాపరగాత్రహస్తః,
ఇక్ష్వాకుసింహావగృహీతదేహ
స్సుప్తః క్షితౌ రావణగన్ధహస్తీ. ౧౧
పరాక్రమోత్సాహవిజృమ్భితార్చి
ర్నిశ్వాసధూమ స్స్వబలప్రతాపః,
ప్రతాపవాన్ సంయతి రాక్షసాగ్ని
ర్నిర్వాపితో రామపయోధరేణ. ౧౨
సింహర్క్షలాఙ్గూలకకుద్విషాణః
పరాభిజి ద్గన్ధనగన్ధహస్తీ,
రక్షోవృష శ్చాపలకర్ణచక్షుః

యనందగినవాఁడు నశించెను. సమస్తలోకములందును అందఱికన్నను బలవంతుఁడనంబడినవాఁడు మృతిఁబొందెను. అందఱికిని స్తోత్రపాత్రమైనవాఁడు పడెను. ౬

ఆయుధము ధరించినవారిలో నుత్తముఁడైన వీరుఁడు ఈ రావణుఁడు నేలంబడుటవలన సూర్యుఁడు భూమింబడినట్లయ్యె చంద్రుఁడు అంధకారములో మునిఁగినట్లయినది. అగ్ని చల్లాఱినట్లయినది. ఇఁక నింకటివాఁడు లేనందున నుత్సాహశక్తియు ఆశ్రయము లేనిదయ్యె. ౭, ౮

రాక్షసశ్రేష్ఠుఁడగు రావణుఁడు యుద్ధంబున హతుఁడై పరాగంబులఁబడియుండునపుడు ఇట్టి మహావీరుం గోలుపోయిన ప్రపంచంబునందు ఇఁకనేమి మిగిలియున్నది? సమస్తము శూన్యముగానే తోఁచుచున్నది. ౯

స్థైర్యమె చిగురుగాను సహనమె పుష్పముగాను తపస్సె దార్ఢ్యముగాను శౌర్యమె దృఢమయిన వేఱుగాను గల గొప్పదైన రావణుఁడను వృక్షమును యుద్ధంబున రాముఁడను పెనుగాలి విఱిచివైచెను. ౧౦

పరాక్రమమె విషాణములుగాను బితృపితామహాదివర్గమె వీపుగాను కోపమె శరీరము పశ్చాద్భాగముగాను అనుగ్రహమె పూర్వభాగముగానుగల రావణుండను మత్తగజము రాముఁడను సింహముచే హతమయి నేలంగూలినది. ౧౧

పరాక్రమోత్సాహంబులు జ్వాలలుగా నిట్టూర్పుధూమంబుగా నిజబలంబె వేఁడిమిగా మహాతేజంబుగలిగి యొప్పుచున్న రావణుండను నగ్నిని యుద్ధంబున రాముఁడను మేఘము చల్లార్చెను. ౧౨

రాక్షసులు తోఁకయుం మూపురమును గొమ్ములునుగాఁ గలిగి శత్రుల వధించునదియు గర్వంబున మదపుటేనుంగువంటిదియుం విషయచాపలమె చెవులును గన్నులునుగాఁ గలదియునగు రావణుండగు నాఁబోతును రాముఁ

క్షితీశ్వరవ్యాఘ్రహతో౽వసన్నః. ౧౩

వదన్తం హేతుమద్వాక్యం పరిమృష్టార్థనిశ్చయమ్,
రామ శ్శోకసమావిష్ట మిత్యువాచ విభీషణమ్. ౧౪
నాయం వినష్టో నిశ్చేష్ట స్సమరే చణ్డవిక్రమః,
అత్యున్నతమహోత్సాహః పతితో౽య మశఙ్కితః. ౧౫

నైవం వినష్టా శ్శోచ్యన్తే క్షత్త్రధర్మ మవస్థితాః,
వృద్ధి మాశంసమానా యే నిపతన్తి రణాజిరే. ౧౬
యేన సేన్ద్రాస్త్రయో లోకా స్త్రాసితా యుధి ధీమతా,
తస్మి న్కాలసమాయుక్తే నకాలః పరిశోచితుమ్. ౧౭

నైకాన్తవిజయో యుద్ధే భూతపూర్వః కదాచన,
పరై ర్వా హన్యతే వీరః పరాన్వా హన్తి సంయుగే. ౧౮

ఇయం హి పూర్వై స్సన్దిష్టా గతిః క్షత్త్రియసమ్మతా,
క్షత్త్రియో నిహత స్సఙ్ఖ్యే న శోచ్య ఇతి నిశ్చయః. ౧౯

తదేవం నిశ్చయం దృష్ట్వా తత్త్వ మాస్థాయ విజ్వరః,
యదిహానన్తరం కార్యం కల్ప్యం తదనుచిన్తయ. ౨౦

త ముక్తవాక్యం విక్రాన్తం రాజపుత్త్రం విభీషణః,
ఉవాచ శోకసన్తప్తో భ్రాతుర్హిత మనన్తరమ్. ౨౧

యో౽యం విమర్దేషు న భగ్నపూర్వ

జేను వ్యాఘ్రము వధించిపుచ్చెను. అని విభీషణుఁడు విలపించెను. ౧౩

ఇట్లు పరమదుఃఖితుఁడై యుక్తియుక్తంబుగాఁ బలుకుచున్న యుక్తా యుక్తంబులు తెలిసిన విభీషణుం జూచి రాముం డిట్లని పలికెను. ౧౪

ఈ రావణుఁడు పరాక్రమింపక పిఱికివలె నశింపలేదు. యుద్ధంబున భయంకరమయిన పరాక్రమంబుతో మహోత్సాహంబునంబోరి నిర్భయం బుగా హతుఁడయ్యెను. ౧౫

పరలోకసుఖంబు గోరి శూరధర్మము నవలంబించి యిట్లు యుద్ధంబున నిర్భయులయి హతులయిన మహాపురుషులను గుఱించి దుఃఖింపరాదు. ౧౬

యుద్ధంబున దేవేంద్రసహితంబుగా ముల్లోకంబులును ఎవ్వనికి వెఱచునో అట్టి మహాపరాక్రమశాలి యశస్సంపన్నుండగు రావణుఁడు కాలధర్మము నొందినపుడు దుఃఖించుట యుక్తము గాదు. ౧౭

యుద్ధమునందు జయమే గలుగునను నిశ్చయము ఒకప్పుడును లేదు శూరుఁడగువాఁడు యుద్ధంబున శత్రువులనైనను వధించును. తానైనను వారలచే హతుఁడగును. అతనికి రెండును సమానములే. ౧౮

ఇట్లు యుద్ధంబున మృతిఁబొంది వీరస్వర్గమునొందుట ప్రాచీనులచే నుపదేశింపఁబడిన శూరసమ్మతమయినమార్గము. యుద్ధంబున హతుఁడైనశూరుని గుఱించి అతఁడు వీరస్వర్గము నొందినవాఁడు కావున నెంతమాత్రము దుఃఖింపరాదని శాస్త్రనిర్ణయము. ౧౯

అట్లవుటం జేసి నీ వీసిద్ధాంతంబు దెలిసి పుట్టినవానికి మరణంబు దప్ప దను పరమార్థముం దలఁచి యిఁక నిపుడు చేయవలసినకార్యంబులనుగుఱించి యాలోచింపుము. అని రాముఁడు విభీషణునితోఁ జెప్పెను. ౨౦

అట్లు పరాక్రమవంతుఁడగు రాజకుమారుఁడు రాముఁడు పలుకుటయు నవ్విభీషణుఁడు దుఃఖితుఁడై యన్నకు శీఘ్రంబుగా నప్పుడు చేయవలసిన హితంబు సేయఁగోరి రామునితో నిట్లని చెప్పెను. ౨౧

సముద్రంబు చెలియలికట్టను దాఁకి భగ్నంబగునట్లు ఇపుడు యుద్ధంబున

సురై స్సమేతై స్సహ వాసవేన,
భవన్త మాసాద్య రణే విభగ్నో
వేలాం సమాసాద్య యథా సముద్రః. ౨౨
అనేన దత్తాని సుపూజితాని
భుక్తాశ్చ భోగా నిభృతాశ్చ భృత్యాః,
ధనాని మిత్రేషు సమర్పితావి
వైరాణ్యమిత్రేషు చ యాపితాని. ౨౩

ఏషో ఽఽహితాగ్నిశ్చ మహాతపాశ్చ
వేదాన్తగః కర్మసు చాగ్ర్యవీర్యః,
ఏతస్య యత్ప్రేతగతస్య కృత్యం
తత్కర్తు మిచ్ఛామి తవ ప్రసాదాత్. ౨౪

స తస్య వాక్యైః కరుణై ర్మహాత్మా
సంబోధిత స్సాధు విభీషణేన,
ఆజ్ఞాపయామాస నరేన్ద్రసూను
స్స్వర్గీయ మాధాన మదీనసత్త్వః. ౨౫
మరణాన్తాని వైరాణి నిర్వృత్తం నః ప్రయోజనమ్,
క్రియతా మస్య సంస్కారో మమాప్యేష యథా తవ. ౨౬

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే-ద్వాదశోత్తరశతతమస్సర్గః.

---

చిన్నదాఁకి పరాజితుఁడై హతుఁడయిన యీరావణుఁడు మున్ను దేవేంద్ర సహితంబుగా దేవతలెత్తివచ్చినను యుద్ధంబులం బరాజయంబెఱుంగఁడు. ౨౨

ఈరావణుఁడు పెక్కుదానంబులు గావించినవాఁడు. గురుదేవతాదులం జక్కఁగాఁ బూజించినవాఁడు. సమస్తభోగంబుల ననుభవించినవాఁడు భృత్యులఁ జక్కఁగాఁ బోషించినవాఁడు. మిత్రులకు యథేష్టంబుగా ధనము లొసంగిన వాఁడు. శత్రువులయందు విరోధంబు సాధించి వారల రూపడంచిన వాఁడు. ౨౩

ఈ రావణుఁడు ఆహితాగ్ని యయి యగ్నిహోత్రము తప్పక సేయుచుండినవాఁడు మహాతపస్సంపన్నుఁడు సమస్తవేదముల నధ్యయనించినవాఁడు. మిక్కిలియుఁ గర్మఠుఁడు కావునఁ బ్రేతత్వమునొందిన యితనికిఁ బ్రేతత్వ విముక్తికై చేయవలసిన యౌర్ధ్వదైహికమును నీయనుగ్రహము నొంది చేయఁగోరుచున్నాను. అని విభీషణుఁడు రామునితోఁ జెప్పెను. ౨౪

ఇట్లు విభీషణుఁడు దుఃఖితుఁడై, పెక్కువిధంబుల బోధించుటయుం మహానుభావుఁడును మహాబలుఁడునగు రాజపుత్త్రుఁడు రాముండు, రావణునకు స్వర్గప్రదంబగు నిత్యకర్మంబు గావింప నియోగించెను. ౨౫

మరణముపఱకే వైరము ప్రవర్తించును. ఆపిమ్మట వైరముతో నేమి ప్రయోజనము? మనకార్యంబును నెఱవేఱినది. ఇఁక నీతనికి సంస్కారము గావింపుము. ఇతఁడు నీకెట్లు బంధువో ఇఁక నాకును అట్లు బంధువేగాని వేఱుగాఁడు. అని రాముఁడు విభీషణునితోఁ జెప్పెను. ౨౬

ఇది నూటపండ్రెండవసర్గము.

---

## త్రయోదశోత్తరశతతమస్సర్గః.

రావణం నిహతం శ్రుత్వా రాఘవేణ మహాత్మనా,
అన్తఃపురా ద్వినిష్పేతూ రాక్షస్య శ్శోకకర్శితాః. ౧
వార్యమాణా స్సుబహుశో వేష్టన్త్యః క్షితిపాంసుషు,
విముక్తకేశ్య దుఃఖార్తా గావో వత్సహతా ఇవ. ౨
ఉత్తరేణ వినిష్క్రమ్య ద్వారేణ సహ రాక్షసైః,
ప్రవిశ్యాయోధనం ఘోరం విచిన్వన్త్యో హతం పతిమ్. ౩
ఆర్యపుత్త్రేతి వాదిన్యో హానాథేతి చ సర్వశః,
పరిపేతుః కబన్ధాఙ్కాం మహీం శోణితకర్దమామ్. ౪

తా బాష్పపరిపూర్ణాభ్యో భర్తృశోకపరాజితాః,
కరేణ్వ ఇవ నర్దన్త్యో వినేదు ర్హతయూథపాః. ౫
దదృశు స్తం మహావీర్యం మహాకాయం మహాద్యుతిమ్,
రావణం నిహతం భూమౌ నీలాఞ్జనచయోపమమ్. ౬

తాః పతిం సహసా దృష్ట్వా శయానం రణపాంసుషు,
నిపేతు స్తస్య గాత్రేషు ఛిన్నా వనలతా ఇవ. ౭

బహుమానా త్పరిష్వజ్య కాచిదేనం రురోద హ,
చరణౌ కాచిదాలిఙ్గ్య కాచిత్కణ్ఠేఽవలమ్బ్య చ. ౮

ఉద్ధృత్య చ భుజౌ కాచి ద్భూమౌ స్మ పరివర్తతే,
హతస్య వదనం దృష్ట్వా కాచి న్మోహ ముపాగమత్. ౯
కాచి దఙ్కే శిరః కృత్వా రురోద ముఖ మీక్షతీ,
స్నాపయన్తీ ముఖం బాష్పై స్తుషారై రివ పఙ్కజమ్. ౧౦

## నూటపదుమూఁడవసర్గము.

మహాపరాక్రమశాలియగు రామునిచే రావణుఁడు హతుఁడయ్యెనని విని రావణభార్యలైన రాక్షసకాంతలు పరమదుఃఖితలయి యెంత వారించి నను నిలుపక భూమింబొరలుచు వెండ్రుకలు విరియంబోసికొని దూడలం బాసిన గోవులపగిది దుఃఖంబునం బొక్కుచు నంతఃపురమునుండి వెడలివచ్చిరి.

ఆరాక్షసస్త్రీలు రాక్షసనహితంబుగా నుత్తరద్వారంబున వెడలి భయంకరంబగు యుద్ధభూమిం బ్రవేశించి హతుఁడగు నాథుం గలయవెదకుచు "రాజపుత్త్రుఁడా" యని రాముని, "నాఁథుఁడా" యని రావణునిం బేర్కొని విలపించుచుఁ గబంధంబులచే భయంకరంబై నెత్తురుబురదలతోఁ గూడి యున్న యుద్ధభూమినంతటం దిరిగిరి. 3,౪

ఆరావణభార్యలు భర్తృమరణంబునఁ బరమదుఃఖితలయి కన్నీ రొలుక రోదనంబు సేయుచు యూథపతింబాసిన యాఁడేనుఁగులపగిది నఱచిరి.

ఆరాక్షసస్త్రీలు మహాపరాక్రమశాలియు మహాకాయుఁడును మహాతేజుఁడును నల్లనికాటుకరాశివలె నొప్పుచు హతుఁడై భూమింబడియున్న వాఁడునగు పెనిమిటిని రావణుం జూచిరి. ౬

అంత రావణభార్యలు యుద్ధభూమియందుఁ బరాగంబులం బడియున్న పెనిమిటింజూచి వివశలయి తెగిన వనలతలకైవడి నతని దేహము పయింబడిరి. ౭

ఒకానొకవనిత ప్రేమాతిశయంబునఁ బెనిమిటిశరీరముఁ గౌఁగిటంజేర్చి రోదనము గావించెను. మఱియొకతె పాదములం గవుఁగిలించుకొని యేడ్చెను. మఱియొకర్తు కంఠాలింగనము గాలించి విలపించెను. ౮

ఒకకాంత పెనిమిటి భుజంబుల నెత్తికొని భూమిం బొరలాడెను. మఱియొకమానిని హతుండగు పెనిమిటి మొగంబుఁజూచి మూర్ఛనొందెను. ౯

ఒకానొకయాఁడుది, తనప్రియుఁడగు రావణునిశిరస్సును అంకంబునం జేర్చి యతనిముఖంబుఁ జూచుచు, హిమజలంబునుంబోలెఁ గన్నీళ్ల నతని ముఖంబుఁ దడుపుచు రోదనంబు చేసెను. ౧౦

ఏవ మార్తాః పతిం దృష్ట్వా రావణం నిహతం భువి,
చుక్రుశు ర్బహుధా శోకా ద్భూయ స్తాః పర్యదేవయన్. ౧౧

యేన విత్రాసిత శ్శక్రో యేన విత్రాసితో యమః,
యేన వైశ్రవణో రాజా పుష్పకేణ వియోజితః. ౧౨
గన్ధర్వాణా మృషీణాం చ సురాణాం చ మహాత్మనామ్,
భయం యేన మహద్దత్తం సోఽయం శేతే రణే హతః. ౧౩
అసురేభ్య స్సురేభ్యో వా పన్నగేభ్యోఽపి వా తథా,
న భయం యో విజానాతి తస్యేదం మానుషా ద్భయమ్. ౧౪

అవధ్యో దేవతానాం య స్తథా దానవరక్షసామ్,
హత స్సోఽయం రణే శేతే మానుషేణ పదాతినా. ౧౫

యో న శక్య స్సురై ర్హన్తుం న యక్షై ర్నాసురై స్తథా,
సోఽయం కశ్చిదివాసత్త్వో మృత్యుం మర్త్యేన లమ్భితః. ౧౬

ఏవం వదన్త్యో బహుధా రురుదు స్తస్య తాః స్త్రియః,
భూయ ఏవ చ దుఃఖార్తా విలేపు శ్చ పునఃపునః. ౧౭
అశృణ్వతా చ సుహృదాం సతతం హితవాదినామ్,
మరణాయాహృతా సీతా ఘాతితాశ్చ నిశాచరాః. ౧౮

ఏతా స్సమ మిదానీం తే వయ మాత్మా చ పాతితాః,

బ్రువాణోఽపి హితం వాక్య మిష్టో భ్రాతా విభీషణః. ౧౯
ధృష్టం పరుషితో మోహా త్త్వయాఽఽత్మవధకాఙ్క్షిణా,

ఆ రావణభార్యలు నిహతుండై భూమిం బడియున్న తమపెనిమిటిని రావణుంజూచి దుఃఖితలయి రోదనము గావించిరి; మఱియు వారలు అంత కంతకు శోకం బగ్గలంబగుడుఁ బరవశలయి యాక్రందించిరి. ౧౧

ఎవ్వనికి దేవేంద్రుండు వెఱచు నెవ్వనికి యముఁడు భయపడు నెవ్వండు కుబేరుజయించి పుష్పకవిమానంబు హరించె మఱియు నెవ్వనివలన గంధర్వులు మహర్షులు మహాప్రభావులగు వేల్పులు భయంబునొంది రట్టిమహావీరుఁడు రావణుం డిపుడు పోరంగూలి నేలంబడియున్నాఁడు. ౧౨,౧౩

అసురులవలనఁగాని సురలవలనఁగాని యురగులవలనఁగాని యెవ్వం డెంతమాత్రము భయం బెఱుంగఁడో, అట్టిశూరుం డిపుడు మనుష్యునివలన భయము నొందెను! ౧౪

ఎవ్వండు దేవతలను దానవులను రాక్షసులను సరకుసేయఁడో. అట్టి యీరావణుం డిపుడు యుద్ధంబున రథాదివాహనములు లేక కాలినడకతో వచ్చిన మనుష్యునిచేఁ జచ్చి పడియున్నాఁడు! ౧౫

దేవతలుగాని యక్షులుగాని యసురులుగాని యెవ్వనివధింపఁజాలరైరో, అట్టివీరుం డీరావణుండు ఒకానొకబలహీనునియట్లు, మనుష్యమాత్రునిచే హతుండయ్యెను! అని రావణభార్యలు రోదనముగావించిరి. ౧౬

ఆరావణభార్యలు ఇట్లు రావణునివిక్రమంబు లుగ్గడింపుచు రోదనంబు చేసి మరల దుఃఖంబగ్గలంబుగా మాటిమాటికి విలపించిరి. ౧౭

నీవు ఎప్పుడును నీహితము నేకోరునట్టి మిత్రులు ఎంతచెప్పినను వినక సీతం దెచ్చితివి. దానంజేసి నీవును హతుండవైతివి. రాక్షసులును హతులయిరి. ౧౮

ఇపుడు, మేమును రాక్షసులును నీవును మనమందఱము నేకకాలంబున హతులమయితిమి.

నీయందుఁ బ్రీతిగలవాఁడును నీతమ్ముఁడునగు విభీషణుండు,నీకు హితంబు బోధించినను, నీవు కాలవశంగతుండవై యజ్ఞానంబున నతనిఁ బరుషవచనంబులు

యది నిర్యాతితా తే స్యాత్ సీతా రామాయ మైథిలీ. ౨౦
న నస్స్యాద్వ్యసనం ఘోర మిదం మూలహరం మహత్,
వృత్తకామో భవే ద్భ్రాతా రామో మిత్రకులం భవేత్. ౨౧
వయం చావిధవా స్సర్వా స్సకామా న చ శత్రవః,

త్వయా పున ర్నృశంసేన సీతాం సంరున్ధతా బలాత్. ౨౨
రాక్షసా వయ మాత్మా చ త్రయం తుల్యం నిపాతితమ్,

న కామకారగ కామం వా తవ రాక్షసపుఙ్గవ. ౨౩
దైవం చేష్టయతే సర్వం హతం దైవేన హన్యతే,

వానరాణాం వినాశోఽయం రక్షసాం చ మహాహవే. ౨౪
తవ చైవ మహాబాహో! దైవయోగా దుపాగతః,

నైవార్థేన న కామేన విక్రమేణ నచాజ్ఞయా. ౨౫
శక్యా దైవగతి ర్లోకే నివర్తయితు ముద్యతా,

విలేపురేవం దీనా స్తా రాక్షసాధిపయోషితః. ౨౬
కురర్య ఇవ దుఃఖార్తా బాష్పపర్యాకులేక్షణాః.

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే-త్రయోదశోత్తరశతతమస్సర్గః.

---

చతుర్దశోత్తరశతతమస్సర్గః.

తాసాం విలపమానానాం తదా రాక్షసయోషితామ్,
జ్యేష్ఠా పత్నీ ప్రియా దీనా భర్తారం సముదైక్షత. ౧

పలికి యవమానించితివి. ౧౯

నీవు రామునకు సీత నొసంగివేసియుండువేని, మాకు నీతోఁగూడ సర్వము నశింపఁ జేయునట్టి భయంకరమయిన యీ వ్యసనంబు గలుగకుండును. సీతమ్ముఁడైన విభీషణుని కోరికయుఁ గావించినట్లగును. రాముండు మనయింటికిఁ గూరిమిమిత్రుండగును. మేమందఱమును విధవలము గాకుందుము. మనశత్రువులకోర్కియుఁ ఫలింపకుండును. ౨౦,౨౧

నీ వట్లు గావింపక క్రూరబుద్ధితో బలాత్కారంబున సీతం జెఱఁ బెట్టుటం జేసి, యీ రాక్షసజనము నీవు మేము ముప్వుర మేకకాలంబున వధింపఁబడితిమి. ౨౨

రాక్షసోత్తముఁడా! లేక, నీవే స్వేచ్ఛచే నంతయుఁ గావించినావనుట యుక్తముగాదు. దైవప్రేరణమున నే సమస్తంబును చేయఁబడును; దైవముచే హతుఁడైనవాఁడే శత్రువుచే హతుఁడగుంగాని యితరుఁడు గాఁడు. ౨౩

మహాబాహుండవగు రావణుఁడా! వానరులకును రాక్షసులకును నీకును ఇమ్మహాయుద్ధంబున వినాశంబు దైవ సంకల్పంబున నె గలిగినదిగాని వేఱు కారణమునఁగాదు. ౨౪

లోకంబున దైవము సంకల్పించునపిదప, అర్థబలంబునఁగాని స్వేచ్ఛచేతంగాని పరాక్రమంబునంగాని రాజాజ్ఞచేఁగాని యది యెంతమాత్రము త్రిప్ప నలవిగాదు. అని, యారావణభార్యలు విలపించిరి. ౨౫

ఇవ్విధంబున నా రావణుని భార్యలు దీనలయి, దుఃఖపీడితలయి కన్నీళ్లుగార్చుచుఁ, గ్రౌంచపక్షులుంబోలె రోదనంబు గావించిరి. ౨౬

ఇది నూటపదుమూఁడవసర్గము.

---

## నూటపదునాలుగవసర్గము.

ఆరాక్షసస్త్రీలందఱు నవ్విధంబున విలపించుచుండఁగా, వారిలో రావణున కత్యంతప్రియురాలును జ్యేష్ఠభార్యయునగు మండోదరి దైన్యంబు

దశగ్రీవం హతం దృష్ట్వా రామేణాచిన్త్యకర్మణా,
పతిం మన్డోదరీ తత్ర కృపణా పర్యదేవయత్. ౨
నను నామ మహాభాగ తవ వైశ్రవణానుజ,
క్రుద్ధస్య ప్రముఖే స్థాతుం త్రస్యత్యపి పురన్దరః. ౩
ఋషయశ్చ మహీదేవా గన్ధర్వాశ్చ యశస్వినః,
నను నామ తవోద్వేగా చ్చారణాశ్చ దిశో గతాః. ౪
స త్వం మానుషమాత్రేణ రామేణ యుధి నిర్జితః,
న వ్యపత్రపసే రాజ న్కిమిదం రాక్షసర్షభ. ౫

కథం త్రైలోక్య మాక్రమ్య శ్రియా వీర్యేణ చాన్వితమ్,
అవిషహ్యం జఘాన త్వాం మానుషో వనగోచరః. ౬

మానుషాణా మవిషయే చరతః కామరూపిణః,
వినాశ స్తవ రామేణ సంయుగే నోపపద్యతే. ౭

న చైత త్కర్మ రామస్య శ్రద్దధామి చమూముఖే,
సర్వత స్సముపేతస్య తవ తేనాభిమర్శనమ్. ౮

యదైవ చ జనస్థానే రాక్షసై ర్బహుభి ర్వృతః,
ఖర స్తవ హతో భ్రాతా తదైవాసౌ న మానుషః. ౯

యదైవ నగరీం లఙ్కాం దుష్ప్రవేశాం సురై రపి,
ప్రవిష్టో హనుమా న్వీర్యా త్తదైవ వ్యథితా వయమ్. ౧౦

నొంది పెనిమిటింజూచెను. ౧

మండోదరి, యచట మహాప్రభావుండగు రాముని చేత హతుండై పడి యున్న భర్తను రావణుంజూచి దీనురాలయి విలపించెను. ౨

అయ్యా! మహాభాగుఁడా! కుబేరుని తమ్ముఁడా! నీవు కోపమునొంది నపుడు నీయెదుట నిలుచుటకు దేవేంద్రుఁడేనియుం భయంబు నొందునుగదా! ౩

అయ్యా! నీకు భయపడి మహర్షులును బ్రాహ్మణులును మహాయశులగు గంధర్వులును జారణులును దిక్కులకుం బాఱిరిగదా! ౪

రాక్షసోత్తముఁడవయిన దశగ్రీవుఁడా! అట్టి త్రిలోకంబుల జయించి నట్టి నిన్ను మనుష్యమాత్రుఁడు రాముఁడు యుద్ధంబున జయించెనే! ఇందుకు లజ్జ నొందకున్నావేమి? ౫

పరాక్రమంబున ముల్లోకంబుల జయించి త్రైలోక్య రాజ్యలక్ష్మిచే నెంతయుఁ దేజరిల్లుచు దేవేంద్రాదులకేని యోర్వరాని మగఁటిమిగల నిన్ను అడవిమనుష్యుఁడు యుద్ధంబున నెట్లు వధించెనో ఆశ్చర్యముగా నున్నది. ౬

మనుష్యులకుఁ బొంద నలవిగానిదేశమున నుండువాఁడవు కామరూపి వగు నీవు యుద్ధంబున రామునిచే హతుఁడవైతివనుట యెంతమాత్రము నమ్మఁదగినది గాదు. ౭

బలపరాక్రమంబులతోను సహాయవర్గంబులతోను సంపన్నుండవైన నిన్ను యుద్ధంబున వధించుట మనుష్యమాత్రుఁడైన రాముని కార్యముగా నాకుఁ దోఁచలేదు. ౮

జనస్థానంబున ననేకరాక్షసులతోఁ గూడిన నీతమ్ముని ఖరుని వధించుటవలననె యీ రాముఁడు మనుష్యమాత్రుఁడు గాఁడని స్పష్టముగాఁ దెలిసినది. ౯

దేవతలకుఁగూడ ప్రవేశింప నలవిగాని యీ లంకానగరము లోపలికి హనుమంతుఁడు వీర్యంబు పెంపున వచ్చినప్పుడె మేము రాముఁడు మనుష్య మాత్రుఁడుగా నుండఁడని తెలిసి దిగులొందితిమి. ౧౦

యదైవ వానరై ర్ఘోరై ర్బద్ధ స్సేతు ర్మహార్ణవే,
తదైవ హృదయేనాహం శఙ్కే రామ మమానుషమ్. ౧౧
అథవా రామరూపేణ కృతాన్త స్స్వయ మాగతః,
మాయాం తవ వినాశాయ విధాయాప్రతితర్కితామ్. ౧౨
అథవా వాసవేన త్వం ధర్షితోఽసి మహాబల,
వాసవస్య కుత శ్శక్తి స్త్వాం ద్రష్టు మపి సంయుగే. ౧౩

వ్యక్త మేష మహాయోగీ పరమాత్మా సనాతనః,
అనాదిమధ్యనిధనో మహతః పరమో మహాన్. ౧౪
తమసః పరమో ధాతా శఙ్ఖచక్రగదాధరః,
శ్రీవత్సవక్షా నిత్యశ్రీ రజయ్య శ్శాశ్వతో ధ్రువః. ౧౫

మానుషం వపు రాస్థాయ విష్ణు స్సత్యపరాక్రమః,
సర్వైః పరివృతో దేవై ర్వానరత్వ ముపాగతైః. ౧౬
సర్వలోకేశ్వర స్సాక్షా ల్లోకానాం హితకామ్యయా,
సరాక్షసపరీవారం హతవాం స్త్వాం మహాద్యుతిః. ౧౭

ఇన్ద్రియాణి పురా జిత్వా జితం త్రిభువనం త్వయా,
స్మరద్భి రివ తద్వైర మిన్ద్రియై రేవ నిర్జితః. ౧౮

క్రియతా మవిరోధశ్చ రాఘవేణేతి య న్మయా,

భయంకరాకారులగు వానరులు ఇమ్మహాసముద్రంబునకు సేతువుకట్టి నపుడె నేను రాముఁడు మనుష్యమాత్రుఁడు కాఁడని మనస్సునం దలఁచితిని.

అటుగాదేని యముఁడే నిన్ను వధించుటకై యచింత్యమయిన మాయచే రామరూపంబుదాల్చి నీమీఁదికి వచ్చియుండును. ౧౨

మహాబలశాలివగు రావణుఁడా! లేక దేవేంద్రుండు వచ్చి నిన్నువధించి యుండును; అదిసరిగాదు. యముఁడుగాని యింద్రుఁడుగాని యుద్ధంబున నీయెదుట నిలుచుటకైనను సమర్థులుకారు. ౧౩

ఈ రాముండు మనుష్యుఁడు గాఁడు. ఇతఁడు లోకరక్షణపరుండగు పరమాత్మ. ఎల్లప్పుడు నుండువాఁడు. జన్మవృద్ధి నాశములు లేనివాఁడు. తఱుగుటయు మాఱుటయుం లేనివాఁడు. బ్రహ్మేంద్రాదులకన్ననధికుఁడు. ప్రకృతి నతిక్రమించినవాఁడు. సమస్తప్రపంచమును సృజించువాఁడు (పోషించువాఁడు) శంఖచక్రగదలను ధరించియుండువాఁడు. దక్షిణవక్షంబున శ్రీవత్సంబను రక్తవర్ణమత్స్యాకారమయిన చిహ్నముగలవాఁడు. నిత్యానపాయిని యగు లక్ష్మీదేవితోఁ గూడినవాఁడు గావున ఎట్టివారికిని జయింప నలవిగానివాఁడు. అని స్పష్టముగాఁ దెలియుచున్నది. ౧౪,౧౫

మహాతేజుఁడును ఎట్టి కాలమునందును ధర్షింప నలవిగాని పరాక్రమంబు గలవాఁడునగు విష్ణువు, సమస్తలోకంబులకును నాథుఁడు గావున లోకంబులకు హితంబు గలుగుటకై తాను మనుష్యరూపంబున నవతరించి వానర రూపంబున నవతరించిన సమస్తదేవతలతోను గూడినవాఁడైవచ్చి నిన్ను సర్వరాక్షససహితంబుగా వధించెను గాని వేఱుగాదు. ౧౬,౧౭

నీవు మున్న ఇంద్రియములను జయించి ముల్లోకంబులను జయించితివి. ఇప్పుడు ఆయింద్రియములవైరంబు దలఁచి నిన్నుజయించినవో అన్నట్లుగా నీవు ఇంద్రియములకు లోఁబడినవాఁడవగుటవలన శత్రువుచే హతుఁడవైతివి. ౧౮

"రామునితోటి పగవలదు, అతనితో సంధికావింపుము" అని నేనెన్ని

ఉచ్యమానో న గృహ్ణాసి తస్యేయం వ్యుష్టి రాగతా. ౧౯
అకస్మా చ్చాభికామోఽసి సీతాం రాక్షసపుఙ్గవ,
ఐశ్వర్యస్య వినాశాయ దేహస్య స్వజనస్య చ. ౨౦

అరున్ధత్యా విశిష్టాం తాం రోహిణ్యాశ్చాపి దుర్మతే,
సీతాం ధర్షయతా మాన్యాం త్వయా హ్యసదృశం కృతమ్ ౨౧

వసుధాయా శ్చ వసుధాం శ్రియః శ్రీం భర్తృవత్సలామ్,
సీతాం సర్వానవద్యాఙ్గీ మరణ్యే విజనే శుభామ్. ౨౨
ఆనయిత్వా తు తాం దీనాం ఛద్మనాఽత్మస్వదూషణ,
అప్రాప్య చైవ తం కామం మైథిలీ సఙ్గమే కృతమ్. ౨౩
పతివ్రతాయా స్తపసా నూనం దగ్ధోఽసి మే ప్రభో,

తదైవ య న్న దగ్ధ స్త్వం ధర్షయం స్తనుమధ్యమామ్. ౨౪
దేవా బిభ్యతి తే సర్వే సేన్ద్రా స్సాగ్నిపురోగమాః,

అవశ్యమేవ లభతే ఫలం పాపస్య కర్మణః. ౨౫
ఘోరం పర్యాగతే కాలే కర్తా నా స్త్యత్ర సంశయః,

శుభకృచ్ఛుభ మాప్నోతి పాపకృత్పాప మశ్నుతే. ౨౬
విభీషణ స్సుఖం ప్రాప్త స్త్వం ప్రాప్తస్ పాప మీదృశమ్,

స న్త్యన్యాస్ ప్రమదా స్తుభ్యం రూపేణాభ్యధికా స్తతః. ౨౭

మూర్ఖ చెప్పినను నీవు వినవైతివే, దానిఫల మిపుడు అనుభవమునకు వచ్చినది.

రాక్షసోత్తముఁడా! నీవు వికారణమును లేకయె సీతయం దింత మోహము వహించితివి; దానం జేసి నీయైశ్వర్యంబును నీబంధువులును నశించుటయగాక నీవును నాశంబు నొందితివి. ౨౦

దురాత్ముఁడా! అరుంధతీదేవికన్నను రోహిణీదేవికన్నను బాతివ్రత్యంబున నధికురాలు పూజనీయయునగు సీతాదేవిం జెఱపట్టితివే యది యెంత మాత్రము యుక్తమవునా? ౨౧

నాదు నాథుఁడా! నీభార్యలమయిన మమ్ము సౌందర్యములేనివారలనుగాఁ దలంచినవాఁడా. నీవు భూదేవికన్నను అధికముగా నోరిమిగలదియు లక్ష్మీదేవికన్న నధికముగా సంపదగలదియు మహాపతివ్రతయు సర్వాంగసుందరియుఁ గల్యాణస్వరూపిణియు దీనురాలునగు నా సీతాదేవిని నిర్జనంబగు నరణ్యంబునుండి కపటోపాయంబునం గొనివచ్చి సీతాసంగమంబందు నీకుంగల కోరికి దీరకమున్నె పతివ్రతయగు నా సీతాదేవి తపఃప్రభావంబుచే దహింపఁబడితివి; ఇది నిశ్చయము. ౨౨, ౨౩

నీవు మహాపతివ్రతయగు సీతాదేవిని స్పృశించినపుడు ఆక్షణంబుననె దగ్ధుఁడవు కావైతివి కావున నీయా ప్రభావంబునకు ఇంద్రాగ్ని సహితంబుగా దేవత లందఱు వెఱఁగందుచున్నారు. ౨౪

పాపకర్మము గావించినవాఁడు సమయము ప్రాప్తించినపుడు తాను గావించిన కర్మముయొక్క ఘోరమయినఫలమును దప్పక యనుభవించుననువిషయమందు ఎంతమాత్రము సందియములేదు. ౨౫

సుకృతము చేసినవానికి సుఖము గలుగును; పాపము గావించినవానికి దుఃఖము సంభవించును, విభీషణుఁడు రామాశ్రయణరూపమయిన మంచి గావించినాఁడు కావున సుఖము నొందెను; నీవో పాపము గావించితివి కావున కష్టము నొందితివి. ౨౬

ఆ సీతకన్నను అధికమయిన సౌందర్యముగల స్త్రీలు నీకుఁ బెక్కండ్రు

అనర్గవశ మాపన్న స్త్వం తు మోహా న్న బుధ్యసే,

న కులేన న రూపేణ న దాక్షిణ్యేన మైథిలీ. ౨౮
మయాఽధికా వా తుల్యా వా త్వం తు మోహా న్న బుధ్యసే,

సర్వథా సర్వభూతానాం నా స్తి మృత్యు రలక్షణః. ౨౯
తవ తావదయం మృత్యు ర్మైథిలీ కృతలక్షణః,
సీతానిమిత్తజో మృత్యు స్త్వయా దూరా దుపాహృతః. 30

మైథిలీ సహ రామేణ విశోకా విహరిష్యతి,
అల్పపుణ్యా త్వహం ఘోరే పతితా శోకసాగరే. 3౧
కైలాసే మన్దరే మేరౌ తథా చైత్రరథే వనే,
దేవోద్యానేషు సర్వేషు విహృత్య సహితా త్వయా. 3౨
విమానేనానురూపేణ యాయామ్యతులయా శ్రియా,
పశ్యన్తీ వివిధా న్దేశాం స్తాంస్తాం శ్చిత్రస్రగమ్బరా. 33
భ్రంశితా కామభోగేభ్య స్సాఽస్మి వీర! వధా త్తవ,

సైవాన్యేవాస్మి సంవృత్తా ధిగ్రాజ్ఞాం చఞ్చలాః శ్రియః. 3౪

హా రాజన్ సుకుమారం తే సుభ్రు సుత్వక్సమున్నసమ్,
కీర్తి (కాన్తి) శ్రీద్యుతిభి స్తుల్య మిన్దుపద్మదివాకరైః. 3౫
కిరీటకూటోజ్జ్వలితం తామ్రాస్యం దీప్తకుణ్డలమ్,
మదవ్యాకులలోలాక్షం భూత్వా యత్పానభూమిషు. 3౬

గలరు, అయినను నీవు సీతవిషయమయి మన్మథవశుండవై మోహితుండవైతివి కావున నీకుఁ దోఁచలేదు. ౨౭

కులంబునందును సౌందర్యంబునందును చాతుర్యంబునందును సీత నాకన్న నధికురాలు గాని లేక నాకు సమానురాలు గాని యెంతమాత్రముగాదు, నీవు మోహితుండ వగుటవలన ఇది నీకుఁ దోఁచలేదు. ౨౮

ఎచ్చటను ఏప్రాణికిని నిమిత్తములేక మరణము గలుగదు, అట్లు నీకును సీతాదేవిని దెచ్చుట కారణముగా నీమరణము గలిగెను. ౨౯

నీవు సీత నపహరించి తెచ్చుటచే దూరముననుండి మృత్యువును సీతామూలంబునఁ గొని తెచ్చుకొంటివి. ౩౦

సీత దుఃఖముఁబాసి రామునితోఁగూడ సుఖంబున విహరింపఁగలదు. మందభాగ్యనగు నేనుమాత్రము ఇట్లు తుదలేని దుఃఖసముద్రములోఁ బడితిని.

వీరుఁడా! నేను సుందరము లయిన మాల్యంబులను వస్త్రంబులను ధరించి నీతోఁగూడ ననదృశయగు లక్ష్మితో నొప్పుచు నుత్తమంబగు విమానంబు నారోహించి కైలాసపర్వతంబునందును సుందరశైలమునందును మేరుమహీధరమునందును చైత్రరథవనంబునందును దేవతల యుద్యానంబుల యన్నిటియందును యథేష్టంబుగా విహరించి నానావిధంబులయిన యా యా దేశంబులఁ జూచుచు సుఖముగా సంచరించుచుందునే అట్టి నాకు ఇప్పుడు నీవు హతుఁడవగుటవలనఁ గామోపభోగంబు లన్నియు నశించెను. ౩౨ ౩౩

అట్టి సమస్తభోగంబు లనుభవించుచుండిన నే నిపుడు సాధారణ యయిన యితరస్త్రీవలె ఎంతమాత్రమును భోగము లేనిదాన నైతిని గావున ఇంత చంచలములయిన రాజసంపదలు దహింపఁబడుఁగాక. ౩౪

రాక్షసరాజా! నాదునాథుఁడా! సుకుమారంబును సుందరములయిన కనుబొమలుగలదియు స్నిగ్ధమయిన చర్మముగలదియు ఉన్నతమయిన ముక్కుగలదియుఁ బ్రసన్నతయందు చంద్రునితోను సౌందర్యంబునఁ గమలముతోను తేజంబున సూర్యునితోను సమానమయినదియు గిరీటాలంకృతంబును

వివిధస్రగ్ధరం చారు వల్గుస్మితకథం శుభమ్,
తదేవాద్య తవేదం హి వక్త్రం న భ్రాజతే ప్రభో. ౩౭
రామసాయకనిర్భిన్నం సిక్తం రుధిరవిస్రవైః,
విశీర్ణమేదో మస్తిష్కం రూక్షం స్యన్దనరేణుభిః. ౩౮

హా పశ్చిమా మే సంప్రాప్తా దశా వైధవ్యకారిణీ,
యా మయాఽఽసీన్న సంబుద్ధా కదాచి దపి మన్దయా. ౩౯
పితా దానవరాజో మే భర్తా మే రాక్షసేశ్వరః,
పుత్త్రో మే శక్రనిర్జేతా ఇత్యేవం గర్వితా భృశమ్. ౪౦

దృప్తారిమర్దనాశ్శూరాః ప్రఖ్యాతబలపౌరుషాః,
అకుతశ్చిద్భయా నాథా మమేత్యాసీన్మతి ర్దృఢా. ౪౧

తేషా మేవం ప్రభావానాం యుష్మాకం రాక్షసర్షభ,
కథం భయ మసంబుద్ధం మానుషా దిద మాగతమ్. ౪౨

స్నిగ్ధేన్ద్రనీలనీలం తు ప్రాంశుశైలోపమం మహత్,
కేయూరాఙ్గదవైడూర్యముక్తాదామస్రగుజ్జ్వలమ్. ౪౩
కాన్తం విహారే ష్వధికం దీప్తం సఙ్గ్రామభూమిషు,
భాత్యాభరణభాభిర్య ద్విద్యుద్భి రివ తోయదః. ౪౪
తదేవాద్య శరీరం తే తీక్ష్ణైర్నైకైశ్శరైశ్చితమ్,

ఎఱ్ఱని పెదవులుగలదియు కుండలంబులతో నొప్పుచున్నదియు నగు నీముఖము మున్ను పానభూములందుఁ గైపుచే ఘూర్ణితములయిన కన్నులతో నొప్పుచు నానావిధములయిన మాల్యంబులు ధరించి సుందరమయి మధురమయిన చిఱునగవుముందుగా మాటలాడుచు మంగళకరంబై ప్రకాశించుచు గదా! అట్టి నీముఖంబిపుడు రామబాణంబుచే భేదింపఁబడినదగుటం జేసి నెత్తుటం దడిసి మేదస్సుచేతను మెదడుమాంసంబుచేతను వ్యాకీర్ణంబై రథపరాగంబులచేఁ గప్పఁబడి యెంతమాత్రము ప్రకాశము లేకున్నది.

అయ్యో! నీవు మృతుఁడవైతివి, నేను విధవనైతిని, ఇట్టి యవస్థ వచ్చునని మూఢురాలనగు నా కెప్పుడును దోఁచినది కాదు. ౩౯

"నా తండ్రి మయుఁడు, దానవరాజు నాభర్త రాక్షసరాజు, నా కొడుకు యింద్రజితుఁడు దేవేంద్రుని జయించిన మేటి" యని నే నధికముగా గర్వించియుంటిని. ౪౦

"నన్ను రక్షింపవలసిన నాతండ్రి పెనిమిటి కొడుకులు బలగర్వితులగు శత్రువుల వధించువారలు. శూరులు. బహుయుద్ధంబుల జయించి బలపరాక్రంబుల వినుతి కెక్కినవారలు. ఎవ్వని వలనను ఎందును భయము లేనివారలు" అని నేను గట్టిగాఁ దలఁచియుంటిని. ౪౧

రాక్షసోత్తముఁడా! అట్టి ప్రసిద్ధులరు మహాప్రతాపులరగు మీకు, స్వప్నమునందైనను దలంచియుండని యింతటికష్టము ఒకమనుష్యమాత్రుని వలన నెట్లు సంభవించెనో ఆశ్చర్యముగా నున్నది. ౪౨

నీ శరీరము ఇంద్రనీలమణివలె స్నిగ్ధనీలవర్ణంబుగా ఉన్నతపర్వతంబంతటిదై బంగారుబాహుపురులతోను వైడూర్యఖచితంబులగు బాహాపురులతోను ముక్తాహారంబులతోను మాల్యంబులతోనుం గూడినదై విహారసమయంబుల నతిరమణీయంబయి యుద్ధభూములందు వీరోద్రేకంబున భాసమానంబయి మెఱుపులచే మేఘంబుకరణి నాభరణకాంతులచే నెంతయుం భాసిల్లుచుండును. అదే ఇపుడు తీక్ష్ణబాణంబుల నిండియుండుటం జేసి నృశం

పునర్దుర్లభసంస్పర్శం పరిష్వక్తుం న శక్యతే. ౪౫
శ్వావిధ శ్శలలై ర్యద్వ ద్బాణై ర్లగ్నైశ్చ నిరన్తరమ్,
స్వర్పితై ర్మర్మసు భృశం సంఛిన్నస్నాయుబన్ధనమ్. ౪౬
క్షితౌ నిపతితం రాజన్ శ్యావం రుధిరసచ్ఛవి,
వజ్రప్రహారాభిహతో వికీర్ణ ఇవ పర్వతః. ౪౭
హా స్వప్న స్సత్య మేవేదం త్వం రామేణ కథం హతః,
త్వం మృత్యో రపి మృత్యు స్స్యాః కథం మృత్యువశం గతః. ౪౮

త్రైలోక్యవసుభోక్తారం త్రైలోక్యోద్వేగదం మహత్,
జేతారం లోకపాలానాం క్షేప్తారం శంకరస్య చ. ౪౯
దృప్తానాం నిగృహీతార మావిష్కృతపరాక్రమమ్,
లోకక్షోభయితారం చ నాదై ర్భూతవిరావిణమ్. ౫౦
ఓజసా దృప్తవాక్యానాం వక్తారం రిపుసన్నిధౌ,
స్వయూథభృత్యవర్గాణాం గోప్తారం భీమకర్మణామ్. ౫౧
హన్తారం దానవేన్ద్రాణాం యక్షాణాం చ సహస్రశః,
నివాతకవచానాం చ సంగ్రహీతార మీశ్వరమ్. ౫౨
నైకయజ్ఞవిలోప్తారం త్రాతారం స్వజనస్య చ,
ధర్మవ్యవస్థాభేత్తారం మాయాస్రష్టార మాహవే. ౫౩
దేవాసురనృకన్యానా మాహర్తారం తత స్తతః,
శత్రుస్త్రీశోకదాతారం నేతారం స్వజనస్య చ. ౫౪
లఙ్కాద్వీపస్య గోప్తారం కర్తారం భీమకర్మణామ్,
అస్మాకం కామభోగానాం దాతారం రథినాం వరమ్. ౫౫
ఏవం ప్రభావం భర్తారం దృష్ట్వా రామేణ పాతితమ్,
స్థిరాఽస్మి యా దేహ మిమం ధారయామి హతప్రియా. ౫౬

చుటకేనియుం నశక్యంబయి యెంతమాత్రము కవుఁగిలింప నలవిగాకున్నది.

రాక్షసరాజా! అట్టి నీశరీరము ఇప్పుడు ఏదుపంది మేన శలలంబు లుండునట్లు మర్మస్థానంబులఁ బ్రయోగింపఁబడిన తీక్ష్ణబాణంబులచే నిరంతరముగా వ్యాప్తంబయి నరకుల ముల్లు తెగి నెత్తుటందడిసి కపిశవర్ణంబయి నేలం బడి వజ్రాయుధప్రహారంబునకు నేలంగూలిన పర్వతంబువలె నున్నది.

అయ్యో! నీవు మృతిఁబొందుట స్వప్నమయి యుండునా? స్వప్నము గాదు ఇది సత్యముగానే యున్నది. అయితే నిన్ను రాముఁ డెట్లు వధింపఁ జాలెను? నీవు మృత్యువును గూడ వధింపఁజాలినవాఁడవే, నీవు మృత్యువున కెట్లు లోఁబడితివి? ౪౮

ముల్లోకంబులందలి రత్నంబులన్నియుం ననుభవించువాఁడు ముల్లోకంబులకును మహాభయంబు గలిగించినవాఁడు సమస్త లోకపాలుర జయించినవాఁడు కైలాసాచలంబు నెత్తినవాఁడు బలగర్వితుల శిక్షించినవాఁడు యుద్ధంబులఁ బరాక్రమించినవాఁడు లోకంబు లన్నియుఁ జీకాకుపఱచినవాఁడు సమస్తభూతంబుల నణఁపించినవాఁడు శత్రువుల సరకుసేయక వీర్యంబు పెంపున గర్వోక్తులు పలుకువాఁడు లోకములకు భయంబు గలిగించునట్టి తన సైనికులను భృత్యులను ఆపదలు పొరయకుండ రక్షించువాఁడు వేనవేలుగా దానవులను యక్షులను వధించినవాఁడు నివాతకవచులను నసురులును భయపడి తన సఖ్యంబు గోరునట్లు గావించినవాఁడు ముల్లోకములకును నియామకుఁడు పెక్కుయజ్ఞంబులకు విఘ్నంబు గావించినవాఁడు స్వజనమునకుఁ గష్టంబులఁ దొలఁగించి యిష్టంబుల నొసంగి కాపాడినవాఁడు ధర్మమర్యాద నతిక్రమించినవాఁడు యుద్ధంబునఁ బెక్కుమాయలు పన్నువాఁడు అయ్యైస్థలములనుండి దేవకన్యల నసురకన్యల రాజకన్యల మనుష్యకన్యల బలిమిఁగొని వచ్చినవాఁడు శత్రువుల వధించి వారి స్త్రీలకు దుఃఖము గలిగించినవాఁడు లంకాద్వీపనాథుఁడు శివప్రీత్యర్థమయి తన శిరస్సుల నగ్నియందు వ్రేల్చుట మున్నగు భయంకరములయిన కర్మంబులఁ గావించిన

శయనేషు మహార్హేషు శయిత్వా రాక్షసేశ్వర!,
ఇహ కస్మా త్ప్రసుప్తోఽసి ధరణ్యాం రేణుపాటలః. ౫౭

యదా మే తనయ శ్శస్త్రో లక్ష్మణేనేన్ద్రజి ద్యుధి,
తదా స్మ్యభిహతా తీవ్ర మద్య త్వస్మి న్నిపాతితా. ౫౮

నాహం బన్ధుజనై ర్హీనా హీనా నాథేన తు త్వయా,
విహీనా కామభోగై శ్చ శోచిష్యే శాశ్వతీ స్సమాః. ౫౯

ప్రపన్నో దీర్ఘ మధ్వానం రాజ న్నద్యాసి దుర్గమమ్,
నయ మామపి దుఃఖార్తాం న జీవిష్యే త్వయా వినా. ౬౦

కస్మా త్త్వం మాం విహాయేహ కృపణాం గన్తు మిచ్ఛసి,
దీనాం విలపితై ర్మన్దాం కిం వా మాం నాభిభాషసే. ౬౧

దృష్ట్వా న ఖల్వసి క్రుద్ధో మా మిహానవకుణ్ఠితామ్,
నిర్గతాం నగరద్వారా త్పద్భ్యా మేవాగతాం ప్రభో. ౬౨
పశ్యేష్టదార దారాం స్తే భ్రష్టలజ్జావకుణ్ఠితాన్,
బహిర్నిష్పతితాన్ సర్వా న్కథం దృష్ట్వా న కుప్యసి. ౬3

వాఁడు మాకందఱకుఁ గామితభోగంబుల నొందినవాఁడు సర్వరథికులలో నుత్తముఁడు. ఇట్టి మహాప్రభావముగల భర్తరామునిచే హతుడై పడియుండుటంజూచియు నేను బెనిమిటిం బాసి యింకను జీవించియున్నాను గావున నేను వజ్రశిలనుగాని వేఱుగాను. ౫౫, ౫౬

రాక్షసరాజా ! నీవు ఉత్తమములగు శయనంబులఁ బరుండియుండుదువే, ఇప్పుడిచట దేహమంతయుఁ బరాగముదగిలి యెఱ్ఱయగునట్లు నేలపైఁ బరుండియున్నావేమి ? ౫౭

నా కొడుకును ఇంద్రజిత్తును యుద్ధంబున లక్ష్మణుఁడు వధించినపుడే నామనసు మిక్కిలియుం దుఃఖంబునఁ గ్రుంగినది; ఇప్పుడును ఇఁక నీవు హతుఁడ వగుటను నాప్రాణంబులే పోఁగలవు. ౫౮

నీవు జీవించియుండినచో నాబంధువులు హతులయినని నాకు దుఃఖము లేదు; నానాథుఁడవు నీవు నన్ను విడిచిపోతివి కావుననే యింక ననేక సంవత్సరములు కామోపభోగములు వదలి అపారమగు దుఃఖము ననుభవించుచుండఁగలను. ౫౯

రాజా ! ఎవ్వరికిని బొందనలవిగాని బహుదూరమయిన స్థానమునకు (వీరస్వర్గమునకు)ఁ బోఁదలఁచినావు, దుఃఖితనగు నన్నుఁగూడఁ గొనిపొమ్ము, నిన్ను వదలి నే నెంతమాత్రము జీవింపఁజాలను. ౬౦

నీవు ఇట్లు పరమదుఃఖితనై విలపించుచున్న దీనను భాగ్యహీనను నన్ను ఒంటిమెయి విడిచి పోయెదవేల ? మఱియును నాకు బదులయినను బలుక వేమి ? ౬౧

నాథుఁడా ! ముసుఁగుగూడ లేక పట్టణద్వారంబు వెలుబడి యిచటికి నడచి వచ్చిన నన్నుఁ జూచి నీవు కోపపడ వేమి ? ౬౨

భార్యలందు మిక్కిలియుఁ బ్రీతిగలవాఁడా ! నీభార్య లందఱు ముసుఁగులు వదలి యతఃపురంబు విడిచి యిచటికివచ్చి యున్నారు చూడుము. వారలమీఁదఁ గోపపడ వేల ? ౬౩

అయం క్రీడాసహాయ స్తే (ఽనాథో) నాథ! లాలప్యతే జనః,
నచైన మాశ్వాసయసే కింవా న బహుమన్యసే. ౬౪

యాః స్త్వయా విధవా రాజ! న్కృతా నైకాః కులస్త్రియః,
పతివ్రతా ధర్మపరాః గురుశుశ్రూషణే రతాః. ౬౫
తాభి శ్శోకాభితప్తాభి శ్శప్తః పరవశం గతః,

త్వయా విప్రకృతాభి ర్య త్తదా శప్తం తదా గతమ్. ౬౬

ప్రవాద స్సత్యఏవాయం త్వాం ప్రతి ప్రాయశో నృప,
పతివ్రతానాం నాకస్మా త్పత న్త్యశ్రూణి భూతలే. ౬౭

కథం చ నామ తే రాజ! న్లోకా నాక్రమ్య తేజసా,
నారీచౌర్య మిదం క్షుద్రం కృతం శౌణ్డీర్యమానినా. ౬౮
అపనీయాశ్రమా ద్రామం యన్మృగచ్ఛద్మనా త్వయా,
ఆనీతా రామపత్నీ సా త త్తే కాతర్యలక్షణమ్. ౬౯

కాతర్యం చ న తే యుద్ధే కదాచి త్సంస్మరామ్యహమ్,
తత్తు భాగ్యవిపర్యాసా న్నూనం తే పక్వలక్షణమ్. ౭౦
అతీతానాగతార్థజ్ఞో వ ర్తమానవిచక్షణః,
మైథిలీ మాహృతాం దృష్ట్వా ధ్యాత్వా నిశ్వస్య చాయతమ్.
సత్యవాక్స మహాభాగో దేవరో మే యదబ్రవీత్,
సోఽయం రాక్షసముఖ్యానాం వినాశః పర్యుపస్థితః. ౭౧
కామక్రోధసముత్థేన వ్యసనేన ప్రసఙ్గినా,

నీకు సమస్తక్రీడాసుఖములయందును సహాయముగా నుండిన నీభార్య లందఱు నిట్లు అనాథలై విలపించుచున్నారే, నీవు వీరల నాశ్వాసించుటగాని యాదరించుటగాని గావింపకున్నా వేమి? ౧౪

రాక్షసనాథుఁడా! నీవు మున్ను పతివ్రతలును ధర్మపరాయణలును గురుశుశ్రూషాపరులు నగు కులస్త్రీలం బెక్కండ్రను వారిభర్తలవధించి విధవలంజేసితావే, వారలు దుఃఖితలయి నిన్ను శపియించుటం జేసి నీవిట్లు శత్రువశంబునం జిక్కితివి. ౧౫

పతివ్రతలగు సాధుల వనిత లప్పుడు నీచే దుఃఖితలయి గావించిన శాపముయొక్క ఫలము ఇపుడు ప్రాప్తమయినది. ౧౬

రాజా! "పతివ్రతలు దుఃఖించి కన్నీళ్లువిడుచుట వ్యర్థముగాదు. ఆ దుఃఖమునకు నిమిత్తమయిన వానికిం జేటుగలిగించును" అను నీలోకము నందుం దఱచుగా వాడఁబడునానుడి నీవిషయమయి తప్పక సత్యమయినది.

రాజా! పరాక్రమంబున ముల్లోకంబులను జయించిన శూరాగ్రేసరుఁడ వయిన నీవు నీచమయిన యీస్త్రీచౌర్యమును ఎట్లు గావించితివి? ౧౮

నీవు కపటోపాయంబున మాయాకల్పితమయిన మృగంబుచే రాముని ఆశ్రమంబువదలి దూరముపోవునట్లు గావించి రాముని భార్యయగు నాసీతం గొనివచ్చితివే, అందువలన నీవు పిఱికివైతివని తెలియుచున్నది. ౧౯

నీ వెప్పుడును యుద్ధంబున భయపడినది లేదు. కావున నిపుడు సీతం దెచ్చుటయందు భయపడుట నీవినాశకాలము లక్షణమెగాని వేఱుగాదు. ౨౦

భూత భవిష్యదర్థంబులు దెలిసినవాఁడును వర్తమానమయిన యర్థ మునుం బరిశీలింప సమర్థుఁడును సత్యవాదియు మహాభాగుండునగు నాపిన్న వాఁడగు విభీషణుఁడు నీవు సీతం దెచ్చుటను జూచి కొంతసేపు చింతించి యిట్టూర్పునిగుడించి చెప్పినవిధంబున నె యిప్పుడు నీదు కామక్రోధంబులం బ్రసక్తమయిన వ్యసనంబునం జేసి సమస్త రాక్షసవీరులకును వినాశంబు వాటిల్లినది. ౨౧, ౨౨

నిర్వృత్తస్త్వత్కృతేఽనర్థస్సోఽయం మూలహరో మహాన్. ౭౩
త్వయా కృత మిదం సర్వ మనాథం రక్షసాం కులమ్,
న హి త్వం శోచితవ్యో మే ప్రఖ్యాతబలపౌరుషః. ౭౪
స్త్రీస్వభావా త్తు మే బుద్ధిః కారుణ్యే పరివర్తతే,

సుకృతం దుష్కృతం చ త్వం గృహీత్వా స్వాం గతిం గతః. ౭౫
ఆత్మానమనుశోచామి త్వద్వియోగేన దుఃఖితా,

సుహృదాం హితకామానాం న శ్రుతం వచనం త్వయా. ౭౬
భ్రాతౄణాం చాపి కార్త్స్న్యేన హిత ముక్తం త్వయాఽనఘ!,
హేత్వర్థయుక్తం విధివచ్ఛ్రేయస్కర మదారుణమ్. ౭౭
విభీషణేనాభిహితం న కృతం హేతుమత్త్వయా,

మారీచకుమ్భకర్ణాభ్యాం వాక్యం మమ పితు స్తదా. ౭౮
న శ్రుతం వీర్యమత్తేన తస్యేదం ఫల మీదృశమ్,
నీలజీమూతసఙ్కాశ! పీతామ్బర శుభాఙ్గద!. ౭౯
స్వగాత్రాణి వినిక్షిప్య కిం శేషే రుధిరాప్లుతః,
ప్రసుప్త ఇవ శోకార్తాం కిం మాం న ప్రతిభాషసే. ౮౦

మహావీర్యస్య దక్షస్య సంయుగేష్వపలాయినః,
యాతుధానస్య దౌహిత్రీం కించ మాం నాభ్యుదీక్షసే. ౮౧

ఉత్తిష్ఠోత్తిష్ఠ కిం శేషే ప్రాప్తే పరిభవే నవే,
అద్య వై నిర్భయా(ం) లఙ్కాం ప్రవిష్టా సూర్యరశ్మయః. ౮౨

సర్వమును వేఱులోఁగూడ నశింపఁజేయఁనట్టి యిమ్మహానర్థము నీవలన వచ్చినది. ఈ రాక్షసకులమునంతయుఁ నీవు అనాథముగాఁ గావించితివి. ౭౩

బలపరాక్రమంబుల వినుతి కెక్కిన శూరుండవయిన నీవు యుద్ధంబున హతుఁడవగుటకు నేను దుఃఖింపవలసినదిలేదు. అయితే ఆఁడుదాన నగుటంజేసి యిట్లు మనసు నిల్వలేక దుఃఖపడుచున్నాను. ౭౪

నీదు పుణ్యపాపంబులం దీసికొని నీవు నీస్థానంబుఁజేరితివి. కావున నెనిన్నుఁగుఱించి దుఃఖింపఁబనిలేదు. నీవంటి సాధునిఁ బాసితిని కావున నన్నుగుఱించియే దుఃఖించుచున్నాను. ౭౫

పాపరహితుఁడా! నీవు నీహితముగోరినట్టి మిత్రులు చెప్పిన మాటను వినవైతివి. నీతమ్ములు చెప్పిన హితవచనములు గూడ వినవైతివి. ౭౬

విభీషణుఁడు స్వహితముగోరి యథాశాస్త్రంబుగా యుక్తియుక్తంబుగా సర్థవంతంబుగా సామవచనంబుల నెంతచెప్పినను అతనివాక్యంబును గ్రహింపక వ్యర్థము గావించితివి. ౭౭

అప్పుడు మారీచుండును గుంభకర్ణుఁడును నాతండ్రియుఁ జెప్పిన వచనంబులను నీవు వీర్యగర్వంబున వినవైతివి. దానిఫలమిట్లు ప్రాప్తమయ్యె.

నీలమేఘవర్ణుఁడా! కనకపుపుట్టంబు దాల్చినవాఁడా! సుందరములగు బాహుపురులచే నొప్పుచున్నవాఁడా! ఇట్లు నెత్తుటందోఁగుచు చేతులుం గాళ్లుఁ జాఁచుకొని నిద్రించినట్లు పడియున్నావేమి? నే నింత దుఃఖించుచున్నను మాఱుపలుక వేమి? ౭౮, ౮౦

మహాపరాక్రమశాలి సమర్థుఁడు యుద్ధంబున వెన్నుఁ జూపనివాఁడు నగు మాల్యవంతుని (లేక సుమాలి) దౌహిత్రినైన నన్నుఁ గన్నెత్తిచూడ వేమి? ౮౧

నీవు పడుటంజేసి భయము లేదని యిపుడు సూర్యకిరణములు నిర్భయముగా లంకం బ్రవేశించినవి. ఇట్టి నూతనమయిన యవమానము వచ్చినపుడు పరుండియుండనగునా? లెము లెము. ౮౨

యేన సూదయసే శత్రూన్ సమరే సూర్యవర్చసా,
వజ్రో వజ్రధరస్యేవ సోఽయం తే సతతార్చితః. ౧౩
రణే శత్రుప్రహరణో హేమజాలపరిష్కృతః,
పరిఘో వ్యవకీర్ణ స్తే బాణై శ్ఛిన్న స్సహస్రధా. ౧౪

ప్రియామివోపగూహ్య త్వం శేషే సమర మేదినీమ్,
అప్రియా మివ కస్మాచ్చ మాం నేచ్ఛస్యభిభాషితుమ్. ౧౫

ధిగస్తు హృదయం యస్యా మమేదం న సహస్రధా,
త్వయి పఞ్చత్వ మాపన్నే ఫలతే శోకపీడితమ్. ౧౬

ఇత్యేవం విలపన్త్యేవ బాష్పవ్యాకులలోచనా,
స్నేహావస్కన్నహృదయా దేవీ మోహ ముపాగమత్. ౧౭

కశ్మలాభిహతా సన్నా బభౌ సా రావణోరసి,
సంధ్యానురక్తజలదే దీప్తా విద్యుదివాసితే. ౧౮

తథాగతాం సముత్పత్య సపత్న్య స్తా భృశాతురాః,
పర్యవస్థాపయామాసుః రుదన్త్యో రుదతీం భృశమ్. ౧౯

న తే సువిదితా దేవి! లోకానాం స్థితి రధ్రువా,
దశావిభాగపర్యాయే రాజ్ఞాం చఞ్చలయా శ్రియా. ౨౦

యుద్ధంబున నీకు శత్రుసంహారంబునకు ముఖ్యసాధనమును సూర్యుని వలె వెలుంగునదియు దేవేంద్రుని వజ్రాయుధంబువంటిదియు నీచే నిత్యమును బూజింపఁబడినదియుఁ బోరంబగు తురఁగ గూల్చునదియుఁ గాంచనాలంకృతంబునగు నీపరిఘము రామబాణంబులచే వేయిపలియలుగా ఖండింపఁబడినదై నేలంబడియున్నది. ౨౩, ౨౪

నీవు ప్రియురాలినిం బోలె యుద్ధభూమిని గౌఁగిలించి పరుండి యున్నావే. ఆప్రియనువలె నన్ను మాత్రము విడిచి నాతోఁ బలుక కున్నావేమి? ౨౫

నీవు మరణము నొందినపిమ్మటఁ గూడ నాహృదయము దుఃఖాతిశయమున వేయిపలియలుగాఁ బగులకున్నదే, ఇట్టి పాపాత్మురాలను నేను సకలలోకములందును నిందనీయనయితిని. అని మండోదరి విలపించెను. ౨౬

రాణియగు మండోదరి ఇవ్విధంబునఁ గన్నీళ్లొలుక రోదనంబు సేయుచునే స్నేహాతిశయంబున మఱియు దుఃఖంబు దుస్సహంబగుటయుఁ మూర్ఛనొందెను. ౨౭

దుఃఖముచేఁ గృశించి మూర్ఛితమయిన యామండోదరి నెత్తురుచే నెఱ్ఱనైన నీలవర్ణమయిన రావణుని వక్షంబునం బడినదై సంధ్యారాగంబుచే నెఱ్ఱనైన నీలమేఘంబునందు వెలుంగు మెఱపుదీఁగవలె నొప్పెను. ౨౮

అట్లు మండోదరి రోదనంబు సేయుచు మూర్ఛిలి మృతుండగు ప్రియునివక్షంబుపైఁ బడుటయు ఆమెసవతులు మిక్కిలియుఁ దొందరగా వచ్చి రోదనంబు సేయుచు నాబిడను లేవనెత్తి యాశ్వాసించిరి. ౨౯

దేవీ! ప్రాణులశరీరములు బాల్యము కౌమారము యౌవనము వార్ధకము మరణము అను నవస్థలుగలిగి మాఱుచుండునేకాని స్థిరములు కావనియుఁ రాజులయొక్క సంపదలు నశ్వరములనియుఁ నీకుఁ జక్కఁగాఁ దెలిసియే యున్నదే, ఇందుకు వగవనేల? అని సవతులు మండోదరి నాశ్వాసించిరి. ౩౦

ఇత్యేవ ముచ్యమానా సా సశబ్దం ప్రరురోద హ,
స్నాపయన్తీ త్వభిముఖా స్తనావస్రామ్బువిస్రవైః. ౯౧
ఏతస్మి న్నన్తరే రామో విభీషణ మువాచహ,

సంస్కారః క్రియతాం భ్రాతుః స్త్రియ శ్చైతా నివర్తయ. ౯౨

తం ప్రశ్రిత స్తతో రామం శ్రుతవాక్యో విభీషణః,
విమృశ్య బుద్ధ్యా ధర్మజ్ఞో ధర్మార్థసహితం వచః. ౯౩
రామ స్యైవానువృత్త్యర్థ ముత్తరం ప్రత్యభాషత,

త్యక్తధర్మవ్రతం క్రూరం నృశంస మనృతం తథా. ౯౪
నాహ మర్హోఽస్మి సంస్కర్తుం పరదారాభిమర్శినమ్,

భ్రాతృరూపో హి మే శత్రు రేష సర్వాహితే రతః. ౯౫
రావణో నార్హతే పూజాం పూజ్యోఽపి గురుగౌరవాత్,

నృశంస ఇతి మాం కామం వక్ష్యన్తి మనుజా భువి. ౯౬
శ్రుత్వా తస్య గుణా న్సర్వే వక్ష్యన్తి సుకృతం పునః,

ఇట్లు చపలతులాఱడించుటకుం దమ్మండోదరి నున్నతంబులగు స్తనం
బులపై నశ్రుజలధారలు గురియుచు మహాధ్వనితో రోదనంబు చేసెను. ౯౧

ఇట్లు రావణభార్యలు రోదనము సేయుచుండఁగా రాముఁడు విభీష
ణుంజూచి యిట్లనియెను.

ఈ స్త్రీల నందఱఁ బురంబునకుఁ బంపి నీవు అన్నకు ఉత్తరక్రియలు
గావింపుము. అని రాముఁడు విభీషణునితోఁ జెప్పెను. ౯౨

అంత ధర్మజ్ఞుండును వినయసంపన్నుండునగు విభీషణుండు రాముని
వాక్యంబువిని యందలి ధర్మంబును ఔచిత్యంబును బుద్ధితో విమర్శించి
మున్ను తానె యే రామునితో రావణునకు సంస్కారము గావించెదనని
చెప్పినవాఁడు కావునఁ దన యభిప్రాయంబు ననుసరించియొ రాముఁ డిట్లు
వచించెనో యే మోయని సంశయించి రామునభిప్రాయంబుఁ జక్కఁగాఁ
దెలిసికొని దానినే యనువర్తింప నిశ్చయించినవాఁడై రామునింజూచి యిట్లని
యుత్తరముఁ జెప్పెను. ౯౩

ఈ రావణుఁడు ధర్మమును వ్రతంబులను వదలినవాఁడు, క్రూరుఁడు,
ప్రాణిహింసకుఁడు, సత్యహీనుఁడు, మఱియుఁ బరస్త్రీగమనముచేసినవాఁడు,
ఇట్టివానికి సంస్కారము గావింప నేనర్హుండఁగాను. ౯౪

ఈరావణుఁడు నాకు అన్నరూపము వహించిన శత్రువే గాని వేఱు
గాఁడు; మఱియు సమస్తప్రాణులకును కీడుచేయువాఁడు; కావున ఇతఁడు
నాకు జ్యేష్ఠుఁడగుటచే పూజింపవలసినవాఁడయినను ఈదురాచారముఁను
బట్టి యెంతమాత్రము పూజార్హుండు కాఁడు. ౯౫

నేను జ్యేష్ఠునకు సంస్కారము గావింపకుండుటకు భూమియందలి
మహాజనులు నన్ను దుర్మార్గుండని నిందింతురు; అయితే ఈతఁడు గావించిన
లోకపీడలను ఇతనిదుర్గుణంబులను విందురేని "విభీషణుండు రావణునికి
సంస్కారము చేయకుండుట యుక్తమె" యని నన్నుశ్లాఘింపఁగలరు. అని
విభీషణుండు రామునితోఁ జెప్పెను. ౯౬

తచ్ఛ్రుత్వా పరమప్రీతో రామో ధర్మభృతాం వరః. ౯౭
విభీషణ మువాచేదం వాక్యజ్ఞో వాక్యకోవిదమ్,

తవాపి మే ప్రియం కార్యం త్వత్ప్రభావాచ్చ మే జితమ్. ౯౮
అవశ్యం తు క్షమం వాచ్యో మయా త్వం రాక్షసేశ్వర,

అధర్మానృతసంయుక్తః కామం త్వేష నిశాచరః. ౯౯
తేజస్వీ బలవాన్ శూర స్సంయుగేషు చ నిత్యశః,

శతక్రతుముఖై ర్దేవై శ్శ్రూయతే న పరాజితః. ౧౦౦
మహాత్మా బలసంపన్నో రావణో లోకరావణః,

మరణాన్తాని వైరాణి నిర్వృత్తం నః ప్రయోజనమ్. ౧౦౧
క్రియతా మస్య సంస్కారో మమాప్యేష యథా తవ,

త్వత్సకాశా ద్దశగ్రీవ స్సంస్కారం విధిపూర్వకమ్. ౧౦౨
ప్రాప్తు మర్హతి ధర్మజ్ఞ! త్వం యశోభాగ్భవిష్యసి,

రాఘవస్య వచ శ్శ్రుత్వా త్వరమాణో విభీషణః. ౧౦౩
సంస్కారేణానురూపేణ యోజయామాస రావణమ్,

చితాం చన్దనకాష్ఠానాం పద్మకోశీరసంవృతామ్. ౧౦౪
బ్రాహ్మ్యా సంవేశయాం చక్రూ రాఙ్కవాస్తరణావృతామ్,

మాటలు చెప్పుటయందు సమర్థుఁడును ధర్మమును రక్షించువారిలలో నుత్తముఁడు (ధనుర్ధరులలో నుత్తముఁడు) నగురాముఁడు విభీషణుని మాటను విని పరమసంతుష్టుఁడై మాటలాడుటయందు సమర్థుఁడగు నావిభీషణుం జూచి యిట్లని పలికెను. ౯౭

రాక్షసనాథుఁడా! నీవును నాకుఁ బ్రియముఁ జేయవలసినవాఁడవు, నీసాహాయ్యమువలననె నాకీవిజయము గలిగినది కావున నేనును నీకు హితమయినమాటనే చెప్పవలసినవాఁడను. ౯౮

ఈరావణుఁడు అధర్మంబును అసత్యంబును అవలంబించినవాఁడు వాస్తవమె, అయితే మహాపరాక్రమశాలియు బలవంతుఁడును యుద్ధంబులం బరాజయంబెఱుంగని మహావీరుఁడునుగా నున్నాఁడు. ౯౯

ఈతఁడు దేవేంద్రుఁడు మున్నగు దేవతలవలనను బరాజయం బెఱుంగఁడని వినుచున్నాము మహాప్రభావుండు బలవంతుఁడు సమస్తలోకంబులకును భయము గలిగించినవాఁడు. ౧౦౦

చచ్చినపిమ్మట వైరము వహింపరాదు. ఇదిగాక మనపనియుం నెఱవేఱినది. కావున నితని కుత్తరక్రియ గావింపుము. ఇఁక నీకితం డెట్లుబంధువో నాకు నట్లుబంధువేగాని వేఱుగాఁడు. నాకే బంధువగునప్పుడు నీకు బంధువని చెప్పనేల? ౧౦౧

ధర్మముఁ దెలిసినవాఁడా! అట్లగుటంజేసి యీరావణుఁడు నీచేతనుండి శాస్త్రచోదితమయిన యథార్థ్వదైహికమును బొందుటకుఁ దగినవాఁడే, అట్లు ఇతనికి సంస్కారము గావించుటవలన నీవును గీర్తి నొందఁగలవు. అని రాముఁడు విభీషణునకుఁ జెప్పెను. ౧౦౨

రాముఁడట్లు పలికినంతనె విభీషణుండు వేగిరపడి, రావణునకు యథాయోగ్యంబు సంస్కారంబు గావించెను. ౧౦౩

అంత ఋత్విజులు పద్మకము వెట్టివేళ్లు మొదలగు గంధద్రవ్యంబులతోఁ గూడఁ జందనకాష్ఠంబులచేఁ జితినిబేర్చి దానిపైఁ జల్లనివెండ్రుకలుగల జింకచర్మమును గప్పిరి. ౧౦౪

వర్తతే వేదవిహితో రాజ్ఞో వై పశ్చిమః క్రతుః. ౧౦౫
ప్రచక్రూ రాక్షసేన్ద్రస్య పితృమేధ మనుక్రమమ్,
వేదిం చ దక్షిణప్రాచ్యాం యథాస్థానం చ పావకమ్. ౧౦౬
పృషదాజ్యేన సంపూర్ణాం స్రువం సర్వే ప్రచిక్షిపుః,

పాదయో శ్శకటం ప్రాదు రన్త రూర్వో రులూఖలమ్. ౧౦౭

దారుపాత్రాణి సర్వాణి అరణిం చోత్తరారణిమ్,
దత్త్వా తు ముసలం చాన్య ద్యథాస్థానం విచక్షణాః. ౧౦౮
శాస్త్రదృష్టేన విధినా మహర్షివిహితేన చ,
తత్ర మేధ్యం పశుం హత్వా రాక్షసేన్ద్రస్య రాక్షసాః. ౧౦౯
పరిస్తరణికాం రాజ్ఞో ఘృతాక్తాం సమవేశయన్,
గన్ధై ర్మాల్యై రలంకృత్య రావణం దీనమానసాః. ౧౧౦
విభీషణసహాయా స్తే వస్త్రైశ్చ వివిధై రపి,
లాజై శ్చావకిర న్తి స్మ బాష్పపూర్ణముఖా స్తదా. ౧౧౧
దదౌ చ పావకం తస్య విధియుక్తం విభీషణః,

స్నాత్వా చైవార్ద్రవస్త్రేణ తిలాన్దూర్వాభిమిశ్రితాన్. ౧౧౨
ఉదకేన చ సంమిశ్రా న్ప్రదాయ విధిపూర్వకమ్,
ప్రదాయ చోదకం తస్మై మూర్ధ్నా చైనం నమస్య చ. ౧౧౩
తాః స్త్రియోఽనునయామాస సాన్త్వ ముక్త్వా పునఃపునః,
గమ్యతా మితి తా స్సర్వా వివిశు ర్నగరీం తదా. ౧౧౪
ప్రవిష్టాసు చ సర్వాసు రాక్షసీషు విభీషణః,
రామపార్శ్వ ముపాగమ్య తదాఽతిష్ఠ ద్వినీతవత్. ౧౧౫

అంత రావణునికి వేదవిహితమయిన యంత్యేష్టినిగావించి యథా శాస్త్రముగాఁ బితృమేధసంస్కారము నెఱవేర్చిరి. ౧౦౫

ఋత్విజులు చితకుఆగ్నేయదిశయందు వేదినిగల్పించి యా వేదియందుఁ బడమర గార్హపత్యంబును దూర్పున నాహవనీయమును దక్షిణాగ్ని నిట్లు యథాస్థానంబులఁ ద్రేతాగ్నులనుస్థాపించిరి; అంత పెరుగుతోఁగలిసినయాజ్యముతో నిండిన హోమపాత్రమునుంచిరి. ౧౦౬

ఆఋత్విజులు, రావణునిపాదంబులపై సోమలతను బెచ్చి శకటంబును తొడలనడుమ యజ్ఞార్థము పద్ధుదంచు రోలును ఉంచిరి. ౧౦౭

పండితులయిన ఋత్విజులు సమస్తములయిన దారుపాత్రములను అరణిని ఉత్తరారణిని రోఁకలిని ఇతరపాత్రలను ఆయాస్థానములనుంచి వేదములయందును స్మృతులయందును జోదితమయిన విధానంబునఁ బవిత్రం బగు కృష్ణవర్ణమైనగోవునువధించి హోమముగావించి దానిచర్మము నేతిలోఁ దడిపి రాక్షసరాజయిన రావణునకుఁ గప్పిరి. ౧౦౮ ౧౦౯

అప్పుడు, ఆరాక్షసులు విభీషణసహితులై రావణుని గంధమాల్యంబుల చేతను నానావిధవస్త్రంబులచేతను అలంకరించి దుఃఖమున ముఖమునిండఁ గన్నీళ్లు గార్చుచు చితపైఁ బేలాలుచల్లిరి. ౧౧౦,౧౧౧

అంత విభీషణుఁడు రావణునకు మంత్రయుక్తంబుగా నగ్ని నొసంగెను.

అవ్విభీషణుండు స్నానము గావించి తడివస్త్రంబుతో భూమియందు దూర్వలును నువ్వులును నీళ్లునుంచి యందుఁ బ్రేతావాహనము చేసి రావణు నకు ఉదకదానంబు గావించి సాష్టాంగముగా నమస్కరించి రావణభార్యల నాశ్వాసించి "నగరంబునకుఁ బొం" డని పలుమాఱు సాంత్వవాక్యంబున నొప్పుటయుఁ నంత వారలందఱు లంకానగరంబునకుఁ బోయిరి. ౧౧౨-౧౧౪

ఆ రాక్షసస్త్రీలందఱు పట్టణమునకుఁ బోయినపిదప, విభీషణుఁడు రాముని యొద్దకువచ్చి యతనిపార్శ్వంబున సవినయముగా నిలిచెను. ౧౧౫

రామోఽపి సహ సైన్యేన ససుగ్రీవ స్సలక్ష్మణః,
హర్షం లేభే రిపుం హత్వా యథా వృత్రం శతక్రతుః. ౧౧౯

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే-చతుర్దశోత్తరశతతమస్సర్గః. ౧౧౪.

## పఞ్చదశోత్తరశతతమస్సర్గః.

తే రావణవధం దృష్ట్వా దేవగన్ధర్వదానవాః,
జగ్ము స్సైః స్సై ర్విమానై స్తే కథయన్త శ్శుభాః కథాః. ౧

రావణస్య వధం ఘోరం రాఘవస్య పరాక్రమమ్,
సుయుద్ధం వానరాణాం చ సుగ్రీవస్య చ మన్త్రితమ్. ౨
అనురాగం చ వీర్యం చ సౌమిత్రే ర్లక్ష్మణస్య చ,
కథయన్తో మహాభాగా జగ్ము ర్హృష్టా యథాగతమ్. ౩

రాఘవస్తు రథం దివ్య మిన్ద్రదత్తం శిఖిప్రభమ్,
అనుజ్ఞాయ మహాభాగో మాతలిం ప్రత్యపూజయత్. ౪

రాఘవేణాభ్యనుజ్ఞాతో మాతలి శ్శక్రసారథిః,
దివ్యం తం రథమాస్థాయ దివమేవారురోహ సః. ౫
తస్మిం స్తు దివ మారూఢే సురసారథిసత్తమే,
రాఘవః పరమప్రీత స్సుగ్రీవం పరిషస్వజే. ౬

పరిష్వజ్య చ సుగ్రీవం లక్ష్మణేన ప్రచోదితః,
పూజ్యమానో హరిశ్రేష్ఠై రాజగామ బలాలయమ్. ౭

రాముండును అట్లు శత్రువధంబు గావించి వృత్రాసురుని వధించిన దేవేంద్రునియట్లు సకలసైన్యసమేతుండై సుగ్రీవలక్ష్మణ సహితంబుగాం బరమసంతోషంబు నొందెను. ౧౧౮

ఇది నూటపదునాలుగవసర్గము.

## నూటపదునైదవసర్గము.

అంత యుద్ధంబుం జూడవచ్చిన దేవతలును గంధర్వులును దానవులును రావణుండు హతుండగుటం జూచి తమతమవిమానంబుల నారోహించి సంతోషంబున నయ్యె మంచిమాటలం జెప్పుకొనుచుం దమనెలవులకుం బోయిరి.

మహాత్ములగు నా దేవదానవగంధర్వులు సంతుష్టులయి భయంకరమయిన రావణవధంబును రామునిపరాక్రమాతిశయంబును వానరులు గావించిన మహాయుద్ధంబును సుగ్రీవుని మంత్రంబును లక్ష్మణునకు రామునందుం గలస్నేహంబును మఱియు నతనిపరాక్రమంబును నట్టి సుపుత్రుం బడసిన సుమిత్రాదేవిభాగ్యంబును బ్రశంసించి చెప్పుకొనుచుం దమతమ నెలవులకుం బోయిరి. ౨, ౩

మహానుభావుండగు రాముండు మాతలిని గౌరవించి యగ్నివలె దేదీప్యమానంబగు దేవేంద్రుండు పంపిన దివ్యమయిన రథమును గొనిపొమ్మని సెలవిచ్చెను. ౪

దేవేంద్రసారథియగు నమ్మాతలి రామునయనుజ్ఞ నొంది, ఆదివ్యరథముం దీసికొని స్వర్గంబునకుం బోయెను. ౫

ఆదేవేంద్రసారథియయిన మాతలిస్వర్గమునకుం బోయినపిదప రాముండు ఇంతజయంబును సుగ్రీవునిసాహాయ్యంబునం గలిగినది కావునం బరమ సంతోషంబున సుగ్రీవునిం గౌంగిలించుకొనెను. ౬

రాముండు అట్లు సుగ్రీవుని గాఢాలింగనంబున గౌరవించి లక్ష్మణుండు శిబిరమునకుం బోదమని ప్రేరింప వానరోత్తములచేం బూజింపంబడుచు శిబిరంబునకుం బోయెను. ౭

అబ్రవీచ్చ తదా రామ స్సమీపపరివర్తినమ్,
సౌమిత్రిం సత్త్వసంపన్నం లక్ష్మణం దీప్తతేజసమ్. ౮
విభీషణ మిమం సౌమ్య! లఙ్కాయా మభిషేచయ,
అనురక్తం చ భక్తం చ మమ చైవోపకారిణమ్. ౯

ఏష మే పరమః కామో యదీమం రావణానుజమ్,
లఙ్కాయాం సౌమ్య! పశ్యేయ మభిషిక్తం విభీషణమ్. ౧౦

ఏవ ముక్తస్తు సౌమిత్రీ రాఘవేణ మహాత్మనా,
తథే త్యుక్త్వా తు సంహృష్ట స్సౌవర్ణం ఘట మాదదే. ౧౧
తం ఘటం వానరేన్ద్రాణాం హస్తే దత్వా మనోజవాన్,
ఆదిదేశ మహాసత్త్వాన్ సముద్రసలిలానయే. ౧౨

ఇతి శీఘ్రం తతో గత్వా వానరాస్తే మహాబలాః,
ఆగతా స్తజ్జలం గృహ్య సముద్రా ద్వానరోత్తమాః. ౧౩
తత స్త్వేకం ఘటం గృహ్య సంస్థాప్య పరమాసనే,
ఘటేన తేన సౌమిత్రి రభ్యషిఞ్చ ద్విభీషణమ్. ౧౪
లఙ్కాయాం రక్షసాం మధ్యే రాజానం రామశాసనాత్,
విధినా మన్త్రదృష్టేన సుహృద్గణ సమావృతమ్. ౧౫
అభ్యషిఞ్చ త్స ధర్మాత్మా శుద్ధాత్మానం విభీషణమ్,
తస్యామాత్యా జహృషిరే భక్తా యే చాస్య రాక్షసాః. ౧౬
దృష్ట్వాఽభిషిక్తం లఙ్కాయాం రాక్షసేన్ద్రం విభీషణమ్,
స తద్రాజ్యం మహాత్ప్రాప్య రామదత్తం విభీషణః. ౧౭
ప్రకృతీ స్సాన్త్వయిత్వా చ తతో రామ ముపాగమత్,

అంత రాముండు తనసమీపంబున నిజతేజస్సుచే జ్వలించుచున్న సత్త్వవాదియగు సుమిత్రాపుత్త్రు లక్ష్మణుంజూచి యిట్లనిపలికెను. ౮

సౌమ్యుఁడా! నాయందు స్నేహంబుగలవాఁడును భక్తిగలవాఁడును నాకుపకారంబు గావించినవాఁడునగు నీవిభీషణునకు ముందు లంకారాజ్యంబు నతనిఁ బట్టాభిషేకంబు గావింపుము. ౯

సౌమ్యుఁడా! రావణునితమ్ముఁడగు నీవిభీషణుఁడు లంకారాజ్యంబునకుఁ బట్టాభిషిక్తుఁడగుట నెప్పుడెప్పుడు జూడంగల ననియున్నాను, ఇదినాదు ముఖ్యమయినకోరిక. అని రాముండు లక్ష్మణునితోఁ జెప్పెను. ౧౦

అట్లు మహాత్ముఁడగు రామునివచనంబువిని లక్ష్మణుఁడు అట్లేయని పలికి పరమసంతోషంబున బంగారు కలశంబుల రావించెను. ౧౧

లక్ష్మణుఁడు సువర్ణకలశంబులను వానరవీరుల వశమునసిచ్చి సముద్రజలంబులు దెచ్చుటకు మనస్సునకుంబోలె మహావేగంబుగలవారలును మహాబలశాలులునగు వానరుల నియోగించెను. ౧౨

అట్లు లక్ష్మణుం డాజ్ఞాపించుటం జేసి మహాబలశాలులగు వవ్వానరోత్తములు పోయి శీఘ్రంబున సముద్రమునుండి యుదకంబు గొనివచ్చిరి.

అంత లక్ష్మణుండు విభీషణుని సింహాసనంబునఁ గూర్చుండఁబెట్టి ఒక కలశంబెత్తి దానితో నతని కభిషేకము గావించెను. ౧౪

ధర్మాత్ముఁడగు నాలక్ష్మణుఁడు రామునాజ్ఞ చొప్పున లంకానగరమునందు మిత్త్రులచేఁ బరివేష్టితుండయిన విభీషణునకు సమస్తరాక్షసమధ్యంబునఁ బట్టాభిషేకంబు గావించెను. ౧౫

విభీషణుఁడు పట్టాభిషిక్తుఁడై రాక్షసరాజగుటంజూచి విభీషణుని మంత్త్రులును విభీషణునకుభక్తులయినరాక్షసులును సంతోషించిరి. ౧౬

విభీషణుఁడు అట్లు రాము ననుగ్రహంబునం జేసి యమ్మహారాజ్యంబు నొంది ప్రజలనందఱ సాంత్వవాక్యంబుల నలరించి యంత మరల రాముని యొద్దకు వచ్చెను. ౧౭

అక్షతా న్మోదకా న్లాజా న్దివ్యా స్సుమనస స్తదా. ౧౮
ఆజహ్రు రథ సంహృష్టాః పౌరా స్తస్మై నిశాచరాః,

స తా న్గృహీత్వా దుర్ధర్షో రాఘవాయ న్యవేదయత్. ౧౯
మఙ్గల్యం మఙ్గళం సర్వం లక్ష్మణాయ చ వీర్యవాన్,

కృతకార్యం సమృద్ధార్థం దృష్ట్వా రామో విభీషణమ్. ౨౦
ప్రతిజగ్రాహ తత్సర్వం తస్యైవ ప్రియకామ్యయా,

తత శ్శైలోపమం వీరం ప్రాఞ్జలిం పార్శ్వతః స్థితమ్. ౨౧
అబ్రవీ ద్రాఘవో వాక్యం హనుమన్తం ప్లవఙ్గమమ్,
అనుమాన్య మహారాజ మిమం సౌమ్య! విభీషణమ్. ౨౨
గచ్ఛ సౌమ్య! పురీం లఙ్కా మనుజ్ఞాప్య యథావిధి,
ప్రవిశ్య రావణగృహం విజయేనాభినన్ద్య చ. ౨౩
వైదేహ్యై మాం కుశలినం ససుగ్రీవం సలక్ష్మణమ్,
ఆచక్ష్వ జయతాం శ్రేష్ఠ! రావణం చ మయా హతమ్. ౨౪

ప్రియమేత దుదాహృత్య మైథిల్యా స్త్వం హరీశ్వర!,
ప్రతిగృహ్య చ సందేశముపావ ర్తితు మర్హసి. ౨౫
ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే-పఞ్చదశోత్తరశతతమస్సర్గః. ౧౧౫.

---

## షోడశోత్తరశతతమస్సర్గః.

ఇతి ప్రతిసమాదిష్టో హనూమా న్మారుతాత్మజః,
ప్రవివేశ పురీం లఙ్కాం పూజ్యమానో నిశాచరైః. ౧
ప్రవిశ్య చ మహాతేజా రావణస్య నివేశనమ్,

అంత నపుడు పౌరులగు రాక్షసులు అక్షతలును మోదకంబులును పేలాలును దివ్యములగు పుష్పంబులును మంగళార్థమయి అవ్విభీషణునకు సమర్పించిరి. ౧౮

పరాక్రమశాలియుం జెదిరింప నలవిగానివాఁడునగు నవ్విభీషణుఁడు పౌరులుదెచ్చిన వస్తువులన్నింటిని బరిగ్రహించి తానురామునకును లక్ష్మణునకును మంగళప్రదములయిన దివ్యవస్తువులను సమర్పించెను. ౧౯

రాముఁడు అట్లు కృతార్థుఁడై పూర్ణమనోరథుఁడై వచ్చిన విభీషణుంజూచి తనకు భోగేచ్ఛ లేక పోయినను విభీషణునికి సంతోషము గలుఁగుటకై యే ఆవస్తువుల నన్నింటినిం బ్రతిగ్రహించెను. ౨౦

అంతఁ దనపార్శ్వభాగంబునఁ జేతులు మోడ్చి నిలుచున్న పర్వతాకారుఁడు మహాపరాక్రమశాలి హనుమంతునింజూచి యిట్లనిపలికెను. ౨౧

సౌమ్యుఁడవగు హనుమంతుఁడా! నీవు రాక్షసమహారాజగు నీ విభీషణుని యనుమతినొంది లంకాపురంబునకుఁ బొమ్ము. ౨౨

శత్రువుల జయించువారలలో నుత్తముఁడయిన హనుమంతుఁడా! నీవు రావణుని గృహమునకుఁబోయి "విజయముగలుగుఁగాక" యని సీతఁ బినందించి నేను సుగ్రీవలక్ష్మణసహితంబుగా నున్నవాఁడననియుం రావణుఁడు నాచే నిహతుఁడయ్యె ననియు నాబిడకుం జెప్పుము. ౨౩,౨౪

వానరోత్తముఁడా! నీవు సీతకు ఈ ప్రియవచనంబుఁ జెప్పి యామె వద్దనుండి సమాచారమడిగి తెలిసికొని మరలిరమ్ము. ౨౫

ఇది నూటపదునైదవసర్గము.

---

## నూటపదునాఱవసర్గము.

రాముఁడిట్లు ఆజ్ఞాపింప వాయుపుత్త్రుఁడు హనుమంతుఁడు రాక్షసులచేఁ బూజింపఁబడుచు లంకానగరంబుఁ బ్రవేశించెను. ౧

మహాపరాక్రమశాలియగు నాహనుమంతుఁడు రావణగృహమునకుం

దదర్శ మృజయా హీనాం సాతఙ్కా మివ రోహిణీమ్. ౨
వృక్షమూలే నిరానన్దాం రాక్షసీభి స్సమావృతామ్,

నిభృతః ప్రణతః ప్రహ్వ స్సోఽభిగమ్యాభివాద్య చ. ౩

దృష్ట్వా తమాగతం దేవీ హనూమన్తం మహాబలమ్,
తూష్ణీ మాస్త తదా దృష్ట్వా స్మృత్వా ప్రముదితాఽభవత్. ౪

సౌమ్యం దృష్ట్వా ముఖం తస్యాః హనుమాన్ ప్లవగోత్తమః,
రామస్య వచనం సర్వ మాఖ్యాతు ముపచక్రమే. ౫

వైదేహి! కుశలీ రామ స్సహ సుగ్రీవలక్ష్మణః,
విభీషణసహాయశ్చ హరీణాం సహితో బలైః. ౬
కుశలం చాహ సిద్ధార్థో హతశత్రు రరిందమః,

విభీషణసహాయేన రామేణ హరిభిస్సహ. ౭
నిహతో రావణో దేవి! లక్ష్మణస్య నయేన చ,
పృష్ట్వా (తు) చ కుశలం రామో వీర స్త్వాం రఘునన్దనః. ౮
అబ్రవీ త్పరమప్రీతః కృతార్థేనా న్తరాత్మనా,
ప్రియ మాఖ్యామి తే దేవి! త్వాం తు భూయ స్సభాజయే. ౯

దిష్ట్యా జీవసి ధర్మజ్ఞే! జయేన మమ సంయుగే,
లబ్ధో నో విజయ స్సీతే! స్వస్థా భవ గతవ్యథా. ౧౦

రావణశ్చ హత శ్శత్రు ర్లఙ్కా చేయం వశే స్థితా.

బోయి యచ్చట నొకచెట్టు క్రింద రాక్షసస్త్రీపరివృతయయి సంతోషహీన యయి దేహసంస్కారమువదలి క్రూరగ్రహపీడితయగు రోహిణివలె నున్న సీతాదేవిం జూచెను. ౨

హనుమంతుఁడు సీతాదేవి సమీపంబునకుఁ బోయి తనపేరుఁ గీర్తించుచు నమస్కారము గావించి నిశ్చలుఁడై వినయనమ్రుఁడై నిలిచియుండెను.

అట్లు వచ్చిన మహాబలుఁడగు హనుమంతుం జూచి సీతాదేవి మొదట గుఱుతుపెట్టఁజాలక యూరకుండెను గాని పిమ్మటఁ జక్కఁగాఁజూచి మున్ను వచ్చిపోయిన హనుమంతుఁడని తెలిసి సంతోషంబు నొందెను. ౪

వానరోత్తముఁడగు హనుమంతుఁడు తన్నుఁజూచి సీతాదేవి ప్రసన్న యగుటంగని రాముండు చెప్పిపంపిన వాక్యము నంతయుఁ జెప్ప నారంభించెను. ౫

సీతాదేవీ! రాముఁడు సుగ్రీవునితోను విభీషణునితోను గూడిన వాఁడై వానరసేనాసహితంబుగా క్షేమమున నున్నవాఁడు. ౬

శత్రువుల వధించునట్టి రాముఁడు ఇప్పుడు శత్రువును గీటడంచి కృతకృత్యుఁడై తనక్షేమమును నీతోఁ జెప్పు మనెను.

దేవీ! విభీషణుని తోడ్పాటునకు వానరవీరుల సాహాయ్యంబునను లక్ష్మణుని నీతిబలంబునను రాముఁడు రావణుని వధించెను. ౭

పరాక్రమవంతుఁడగు రఘువీరుఁడు శత్రువును వధించినవాఁడగుటం జేసి పరమసంతుష్టుఁడై కృతార్థుఁడై నీక్షేమంబడిగి నీతో నిట్లు చెప్పు మనెను.

నాదుదేవీ! నీకుఁ బ్రియవార్తం జెప్పెదను, నీకు మిక్కిలియు సంతోషము గలిగించెదను. ౯

పాతివ్రత్యధర్మము దెలిసినట్టి సీతా! నాభాగ్యవశంబున జీవించి యున్నావు. నా పరాక్రమమువలన యుద్ధమున మనకు విజయంబు గలిగినది నీవింక దుఃఖమువదలి స్వస్థముగా నుండుము. ౧౦

శత్రువయిన రావణుఁడును హతుఁడయ్యె. ఈ లంకానగరము మన వశ

మయా హ్యలబ్ధనిద్రేణ ధృతేన తవ నిగ్రహే. ౧౧
ప్రతిజ్ఞైషా సు(వి)నిస్తీర్ణా బద్ధ్వా సేతుం మహోదధౌ,

సంభ్రమశ్చ న గన్తవ్యో వర్తన్త్యా రావణాలయే. ౧౨
విభీషణవిధేయం హి లఙ్కైశ్వర్య మిదం కృతమ్,
తదాశ్వసిహి విశ్వస్తా స్వగృహే పరివర్తసే. ౧౩
అయం చాభ్యేతి సంహృష్ట స్త్వద్దర్శనసముత్సుకః,

ఏవ ముక్తా సముత్పత్య సీతా శశినిభాననా. ౧౪
ప్రహర్షేణావరుద్ధా సా వ్యాజహార న కించన,

అబ్రవీచ్చ హరిశ్రేష్ఠ స్సీతా మప్రతిజల్పతీమ్. ౧౫
కింను చిన్తయసే దేవి! కిం ను మాం నాభిభాషసే,

ఏవ ముక్తా హనుమతా సీతా ధర్మే వ్యవస్థితా. ౧౬
అబ్రవీ త్పరమప్రీతా హర్ష గద్గదయా గిరా,
ప్రియ మేత దుపశ్రుత్య భర్తు ర్విజయసంశ్రితమ్. ౧౭
ప్రహర్షవశమాపన్నా నిర్వాక్యాఽస్మి క్షణాన్తరమ్,
న హి పశ్యామి సదృశం చిన్తయన్తీ ప్లవఙ్గమ!. ౧౮
మత్ప్రియాఖ్యానకస్యేహ తవ ప్రత్యభినన్దనమ్,

మయినది.

నేను నిన్ను శత్రుహస్తంబునుండి విడిపించుటకై దృఢచిత్తుండనై నిద్దురయయినను బొందక సముద్రంబునకు సేతువుగట్టి రావణుని వధింపవలె నన్న యీ ప్రతిజ్ఞను నెఱవేర్చితిని. ౧౧

ఈ లంకానగరమంతయుం నిపుడు విభీషణుని యధీనమయినది కావున నీవు రావణునియింట నున్నావని యెంతమాత్రము భయపడవలదు. ౧౨

నీవు స్వగృహంబుననె యున్నావుగాని వేఱుగాదు కావున భయంబు వదలి స్వస్థముగా నుండుము ఈ విభీషణుండును నిన్నుంజూడంగోరినవాఁడై సంతోషంబున నిదిగో రాఁగలఁడు. అని రాముఁడు తాను జెప్పినట్లు నీతోఁ జెప్పు మనెను. ౧౩

చంద్రబింబమునుంబోలు ముఖంబుగల యాసీతాదేవి ఈవాక్యంబు విని సంతోషంబున లేచి యానందంబు మఱియుం నతిశయించుటవలన నేమియుం బలుకఁజాలక యూరకుండెను. ౧౪

అట్లు సీత తనతో మాఱుపలుకకుండుటఁజూచి వానరవీరుఁడగు హనుమంతుఁడు "దేవీ! ఏమి యాలోచించెదవు; నాతో బదులుపలుక వేమి?" యని యడిగెను. ౧౫

మహాపతివ్రతయగు సీతాదేవి హనుమంతునిమాట నాలకించి పరమసంతోషంబు నొంది సంతోషాతిశయంబునఁజేసి డగ్గుత్తికతో నిట్లని పలికెను. ౧౬

నేను నాభర్తవిజయము నొందెనను నీప్రియవచనమును విన్నంతనె యధికసంతోషంబు నొందుటవలన క్షణకాలము మాటలాడఁ జాలనైతిని.

వానరుఁడా! నాకు ఇట్టి ప్రియవార్తను జెప్పినందుకు నిన్ను అందుకుఁ దగునట్లుగాఁ బ్రశంసించుటకై యెంతయాలోచించినను ఈ లోకమం దంతటను సరియయిన, అందుకు సదృశమయినవాక్యమె యగపడలేదు. ఏ విధముగాఁ బ్రశంసించినను, నీవు చెప్పిన ప్రియవచనమునకుఁ దక్కువగానే తోఁచుచున్నది. ౨౧

న (హి) చ పశ్యామి తత్సౌమ్య! పృథివ్యా మపి వానర! ౧౯
సదృశం మత్ప్రియాఖ్యానే తవ దాతుం భవే త్సమమ్,

హిరణ్యం వా సువర్ణం వా రత్నాని వివిధాని చ. ౨౦
రాజ్యం వా త్రిషు లోకేషు నైత దర్హతి భాషితుమ్,

ఏవ ముక్తస్తు వై దేహ్యా ప్రత్యువాచ ప్లవఙ్గమః. ౨౧
గృహీతప్రాఞ్జలి ర్వాక్యం సీతాయాః ప్రముఖే స్థితః,
భర్తుః ప్రియహితే యుక్తే! భర్తు ర్విజయకాఙ్క్షిణి!. ౨౨
స్నిగ్ధ మేవం విధం వాక్యం త్వమేవార్హసి భాషితుమ్,

తవైతద్వచనం సౌమ్యే! సారవత్స్నిగ్ధమేవ చ. ౨౩
రత్నౌఘా ద్వివిధాచ్చాపి దేవరాజ్యా ద్విశిష్యతే,

అర్థతశ్చ మయా ప్రాప్తాః దేవరాజ్యాదయో గుణాః. ౨౪
హతశత్రుం విజయినం రామం పశ్యామి సుస్థితమ్,

తస్య తద్వచనం శ్రుత్వా మైథిలీ జనకాత్మజా. ౨౫
తత శ్శుభతరం వాక్య మువాచ పవనాత్మజమ్,
అతిలక్షణసమ్పన్నం మాధుర్యగుణ భూషితమ్. ౨౬
బుద్ధ్యా హ్యష్టాఙ్గయా యుక్తం త్వమేవార్హసి భాషితుమ్,

శ్లాఘనీయోఽనిలస్య త్వం పుత్త్రః పరమధార్మికః. ౨౭

బలం శౌర్యం శ్రుతం సత్త్వం విక్రమో దాక్ష్య ముత్తమమ్,

సౌమ్యుఁడా! ఇంతేగాదు. నీకిచ్చెడిన సమూల్యవస్తువు నిచ్చినయైనను సంతోషపఱచుటకును వీలులేదు. నీవు చెప్పిన ప్రియవచనమునకుఁ దగినట్లుగా నీ కివ్వఁదగినవస్తువు ముల్లోకంబులందును గానంబడదు. ౧౯

వెండి బంగారు నానావిధరత్నంబులునుగాని త్రైలోక్యాధిపత్యము గాని నీవు చెప్పిన ప్రియవచనమునకుఁ దగినదని యెంతమాత్రము చెప్పఁ దగినదికాదు. అని సీత హనుమంతునితోఁ జెప్పెను. ౨౦

హనుమంతుఁడు సీతాదేవి వచనముఁ విని, సీతాదేవి సమ్ముఖమున నిలుచుండి చేతులు చక్కఁగా మోడ్చి యిట్లని యుత్తరముఁ జెప్పెను. ౨౧

పెనిమిటియొక్క ప్రియమును హితమును జయమును గోరుదానా! ఆట్టి ప్రీతియుక్తమయిన వచనముఁ బలుకుట నీకేతగును గాని యొకరికి సాధ్యము కాదు. ౨౨

సౌమ్యురాలా! మహాతాత్పర్యము గలదియుఁ బ్రీతితోఁ జెప్పఁబడినదియునగు నీవాక్యమె నాకు నానావిధములగు మణిసమూహములకన్నను మాత్రమెగాదు దేవేంద్రపదవికన్నను అధికము. ౨౩

శత్రువును వధించి విజయమునొంది తేజరిల్లుచున్న రాముం జూచి నానే; ఇందువలననె నాకుఁ బరమార్థముగా దేవరాజ్యాదిసంపదలు సమస్తములును గలిగినవి అని హనుమంతుఁడు సీతాదేవితోఁ జెప్పెను. ౨౪

జనకమహారాజు కొమారితయగు సీతాదేవి హనుమంతుని వాక్యంబు విని యతనింజూచి మిక్కిలియుం మధురమగు మాటం బలికెను ౨౫

ఇట్లు సమస్తలక్షణములు గలిగి విన్నంతనె శ్రవణానందము గలుగునట్లు మధురముగా గ్రహణధారణాది సమర్థమయిన బుద్ధితో మాటలాడుటకు నీవె సమర్థుఁడవుగాని మఱియొకఁడు కాఁడు. ౨౬

నీవు ధార్మికులలో నుత్తముఁడవు. నీయట్టివానిఁ బుత్రుఁగాబడసిన వాయువు మిక్కిలియు భాగ్యవంతుఁడు. ౨౭

బలము యుద్ధోత్సాహము శాస్త్రపరిజ్ఞానము దేహదార్ఢ్యము పరాక్ర

తేజః క్షమా ధృతిః స్థైర్యం వినీతత్వం న సంశయః. ౨౮
ఏతే చాన్యే చ బహవో గుణా స్త్వయ్యేవ శోభనాః,

అథోవాచ పునస్సీతా మసమ్భ్రాన్తో వినీతవత్. ౨౯
ప్రగృహీతాఞ్జలి ర్హర్షా త్సీతాయాః ప్రముఖే స్థితః,

ఇమాస్తు ఖలు రాక్షస్యో యది త్వ మనుమన్యసే. ౩౦
హన్తు మిచ్ఛామ్యహం సర్వా యాభి స్త్వం తర్జితా పురా,

క్లిశ్యన్తీం పతిదేవాం త్వా మశోకవనికాం గతామ్. ౩౧
ఘోరరూపసమాచారాః క్రూరాః క్రూరతరేక్షణాః,
రాక్షస్యో దారుణకథా వర మేతత్ప్రయచ్ఛ మే. ౩౨

ముష్టిభిః పాణిభి స్సర్వా శ్చరణై శ్చైవ శోభనే!,
ఇచ్ఛామి వివిధై ర్ఘోరై ర్హన్తు మేతా స్సుదారుణాః. ౩౩
ఘోరై ర్జానుప్రహారైశ్చ దశనానాం చ పాతనైః,
భక్షణైః కర్ణనాసానాం కేశానాం లుఞ్ఛనై స్తథా. ౩౪
నఖై శ్శుష్కముఖీభిశ్చ దారణై ర్లఙ్ఘనై ర్హతైః,
నిపాత్య హన్తు మిచ్ఛామి తవ విప్రియకారిణీః. ౩౫
ఏవం ప్రకారై ర్బహుభి ర్విప్రకారై ర్యశస్విని!,
హన్తు మిచ్ఛామ్యహం దేవి! తవేమాః కృతకిల్బిషాః. ౩౬

మము చతురత ఇతరులకుఁ దిరస్కరింప నలవిగాకుండు సామర్థ్యము అక్షరాధసమానము ప్రభావము కారణ మున్నపుడును కలంత పడకుండుట వినయంబు ఇవి మొదలగు నుత్తమములైన మంగళగుణములన్నియుం నీయందు ఒప్పుచున్నవి; ఇందుకు సందేహములేదు. నేను లేనిగుణముల నారోపించి స్తోత్రము సేయుచుండువాఁడను గాను. అని సీత హనుమంతునితోఁ జెప్పెను. ౨౭

అంత నాహనుమంతుఁడు పరమసంతుష్టుఁడై సంభ్రమంబునొందక చేమోడ్పుగీలించి సవినయంబుగా సీతాదేవియెదుట నిలిచి సీతాదేవింజూచి సంతోషంబున మరల నిట్లనిపలికెను. ౨౮

నీ వనుజ్ఞ యొసంగుదువేని నిన్ను మున్ను క్రూరవాక్యంబులం దర్జించిన యీరాక్షసస్త్రీల నందఱను వధింపవలెనని యీ కోరిక మాత్రము నాకుఁ గలదు. ౩౦

పతివ్రతవగు నీవు! పెనిమిటిని బాసిన దుఃఖంబుతో నశోకవనంబునఁ గృశించుచుండఁగా భయంకరాకారలునుభయంకరములయిన నడతలుగలవారలును దయాహీనలును గ్రూరంబులయిన చూపులు గలవారలునగు నీ రాక్షసస్త్రీలు నిన్నుఁజూచి దారుణములయినమాటలు పలికినారు; కావున వీరల వధింపవలెనని యున్నది; నాకీవర మొసఁగుము. ౩౧,౩౨

మంగళస్వరూపిణివగు సీతా! నీకప్రియము గావించిన భయంకరాకారలగు నీరాక్షసస్త్రీలను బిడికిళ్లం బొడిచియుఁ జేతులం జఱచియుఁ బాదములం దన్నియుం బ్రోఁకాళ్ల మోదియుఁ బండ్లురాలఁ గొట్టియుఁ జెవులు ముక్కులు గొఱికియుం వెండ్రుకలం బెఱికియుఁ దీక్ష్ణములైన నఖంబులం జీల్చియు నెగిరి మీఁద దుమికియుఁ బడఁద్రోసి కొట్టియుం నానావిధ ప్రహారంబుల వధింపఁగోరెదను. ౩౩,౩౪

కీర్తిసంపన్నురాలవగు సీతాదేవీ! నీ కపకారముగావించిన యీరాక్షసవనితలను ఈవిధముగా నానావిధముగఁ బ్రహరించి వధింపఁగోరుచున్నాను. అని హనుమంతుఁడు సీతతోఁ జెప్పెను. ౩౬

ఏవ ముక్తా హనుమతా వై దేహీ జనకాత్మజా,
ఉవాచ ధర్మసహితం హనూమన్తం యశస్వినీ. ౩౮
రాజసంశ్రయవశ్యానాం కుర్వన్తీనాం పరాజ్ఞయా,
విధేయానాం చ దాసీనాం కః కుప్యేద్వానరోత్తమ!. ౩౯

భాగ్యవైషమ్యయోగేన పురా దుశ్చరితేన చ,
మయైతత్ప్రాప్యతె సర్వం స్వకృతం హ్యుపభుజ్యతే. ౩౯

ప్రాప్తవ్యం తు దశాయోగా న్మయైత దితి నిశ్చితమ్,
దాసీనాం రావణస్యాహం మర్షయామీహ దుర్బలా. ౪౦

ఆజ్ఞప్తా రావణే నైతా రాక్షస్యో మా మతర్జయన్,
హతే తస్మిన్న కుర్యుర్హి తర్జనం వానరోత్తమ!. ౪౧
అయం వ్యాఘ్రసమీపే తు పురాణో ధర్మసంస్థితః,
ఋక్షేణ గీతః శ్లోకో మే తం నిబోధ ప్లవంగమ! ౪౨

న పరః పాప మాదత్తే పరేషాం పాపకర్మణామ్,
సమయో రక్షితవ్య స్తు సన్త శ్చారిత్రభూషణాః. ౪౩

పాపానాం వా శుభానాం వా వధార్హాణాం ప్లవంగమ!,

యశస్సంపన్నురాలును జనకమహారాజపుత్త్రియునగు సీతాదేవి ఆంజనేయుని వచనంబువిని యతనింజూచి ధర్మంబుగా నిట్లనిపలికెను. ౩౭

ఈరాక్షసస్త్రీలు రావణునిదాసీజనము, రాజసేవ నాశ్రయించి జీవించువారలు కావున రావణునాజ్ఞ చొప్పున గావించినారు. అట్లుచేయకున్న దండింపఁబడుదురు. వీరలయెడఁ గోపపడుట యెంతమాత్రము యుక్తము కాదు. ౩౮

నాయొక్క భాగ్యవైపరీత్యమువలనను నేను మున్ను గావించిన పాపవిశేషమువలనను నాకీకష్టమంతయు వచ్చినదికాని వేఱుగాదు. మున్ను చేసిన కర్మముయొక్క ఫలము ఇప్పుడు అనుభవింపక తప్పునా? ౩౯

పూర్వము గావించిన కర్మముయొక్క ఫలమును ననుభవింపవలసిన సమయమువచ్చుటంజేసి యీకష్టమంతయు నే ననుభవింపవలసివచ్చెనని నా నిశ్చయము. కావుననె రావణదాసులయిన ఈరాక్షసస్త్రీలయందు శిక్షించుటకు ఏదోషమును లేకుండుటవలన నేను వీరితర్జనాదుల క్షమించుచున్నాను.

రావణుఁడు ఆజ్ఞాపించుటంజేసి యీరాక్షసవనితలు నన్ను అట్లుబాధించిరి. అతఁడు హతుఁడైనపిదప నిఁక నన్ను ఏమియుఁ జేయగదా! ౪౧

వానరుఁడా! ఈరాక్షసస్త్రీలు స్వతంత్రించియే ననుబాధించియున్నను దానికై వారలకుఁ బ్రత్యుపకారము గావించుట యుక్తముగాదు. ఈ విషయమై ఒకభల్లూకము పురాతనమును ధర్మయుక్తంబునగు నీశ్లోకమును ఒక వ్యాఘ్రమునకుఁ జెప్పెను. దానిం జెప్పెద వినుము. ౪౨

ప్రాజ్ఞుఁడగువాఁడు తనకపకారము చేసినవాని కెంతమాత్రము ప్రత్యపకారముచేయఁడు; అపకారము చేసినవానికిఁగూడ నుపకారమె చేయవలెను గాని ప్రత్యపకారమనె తమాత్రము చేయరాదనుట సత్పురుషుల యాచారము; అది యవలంబింపవలెను. చరిత్రమె సత్పురుషులకు భూషణము. అని భల్లూకము వ్యాఘ్రముతోఁ జెప్పెను. ౪౩

హనుమంతుఁడా! పాపులయినను సరె, సాధువులయినను సరె; అపరాధము

కార్యం కరుణ మార్యేణ న కశ్చిన్నాపరాధ్యతి. ౪౪

లోకహింసావిహారాణాం రక్షసాం కామరూపిణామ్,
కుర్వతామపి పాపాని నైవ కార్యమశోభనమ్. ౪౫

ఏవ ముక్తస్తు హనుమాన్ సీతయా వాక్యకోవిదః,
ప్రత్యువాచ తత స్సీతాం రామపత్నీం యశస్వినీమ్. ౪౬

యుక్తా రామస్య భవతీ ధర్మపత్నీ యశస్వినీ,
ప్రతిసందిశ మాం దేవి! గమిష్యే యత్ర రాఘవః. ౪౭

ఏవముక్తా హనుమతా వైదేహీ జనకాత్మజా,
అబ్రవీ ద్ద్రష్టు మిచ్ఛామి భర్తారం వానరోత్తమ! ౪౮
తస్యా స్తద్వచనం శ్రుత్వా హనూమా న్పవనాత్మజః,
హర్షయ న్మైథిలీం వాక్య మువాచేదం మహాద్యుతిః, ౪౯
పూర్ణచన్ద్రాననం రామం ద్రక్ష్యస్యార్యే! సలక్ష్మణమ్,
స్థిరమిత్రం హతామిత్రం శచీవ త్రిదశేశ్వరమ్. ౫౦

తామేవ ముక్త్వా రాజన్తీం సీతాం సాక్షా దివ శ్రియమ్,

గావించి వధార్హులయినపుడు సత్పురుషుఁడైనవాఁడు వారియెడఁ గారుణ్యమె గావింపవలయును. ఇది నామతము. వారి శిక్షించుట నాకు సమ్మతముగాదు. అపరాధము గావించినవారిని దండింపవలెనేయందువేమో, లోకంబున నపరాధము సేయనివాఁ డెవ్వఁడు ? ౪౪

రాక్షసులు తమజాతిస్వభావంబునం జేసి కామరూపులయి లోకహింసరయి వినోదముగాఁగలవారలయి నానావిధముగాఁ బాపములు సేయుంవారలేయయినను వారికి బాధగలిగించుట నాకు సమ్మతముగాదు. అని సీతాదేవి హనుమంతునితోఁ బలికెను. ౪౫

మాటలుచెప్పుటయందుఁ బండితుం డగు హనుమంతుఁడు సీతాదేవి యానతిచ్చిన వచనంబువిని యంత రామునిభార్యయు యశస్వినియు నగు నా సీతాదేవింజూచి యిట్లని బదులు పలికెను. ౪౬

నీవు రాముఁకుఁ దగినధర్మపత్నివి దయ పాతివ్రత్యము మొదలగు సద్గుణములం గీర్తివహించిన దానవు. నాకు బదులు సమాచారము చెప్పి పంపుము. నేను రాముఁ డున్నస్థలమునకుఁ బోయెదను. అని హనుమంతుఁడు సీతాదేవితోఁ జెప్పెను. ౪౭

జనకమహారాజు కొమార్తెయగు సీతాదేవి ఇట్లు పలికిన హనుమంతుని వచనంబువిని యతనింజూచి "నా నాథుని రామునింజూడఁ గోరెదను"అని పలికెను.

సీతాదేవి పలికిని వచనంబువిని మహాతేజుండగు వాయుకుమారుండు హనుమంతుఁడు సీతాదేవికి సంతోషంబు గలుగునట్లు ఈమాటం జెప్పెను.

పూజనీయురాలవగు సీతా ! శచీదేవి యసురుల జయించివచ్చిన దేవేంద్రుం జూచినట్లు సమస్తశత్రువులను వధించి క్షేమంబుగ నున్న మిత్రులతోను గూరిమితమ్ముఁడు లక్ష్మణునితోనుం గూడినవాఁడై నిండుచందురుంబోలి వెలుఁగుచున్న ముఖంబుచే శోభితుఁడగు రాముని అవశ్యము చూడఁగలవు. అని హనుమంతుండు సీతాదేవితోఁ బలికెను. ౫౦

సాక్షాన్మహాలక్ష్మివలె వెలుంగుచున్న యాసీతాదేవితో నివ్విధంబునం

ఆజగామ మహావేగో హనూమానత్ర రాఘవః. ౫౧

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే - షోడశోత్తరశతతమస్సర్గః. ౧౧౬.

## సప్తదశోత్తరశతతమస్సర్గః.

స ఉవాచ మహాప్రాజ్ఞ మభిగమ్య ప్లవంగమః,
రామం వచన మర్థజ్ఞో వరం సర్వధనుష్మతామ్. ౧

యన్నిమిత్తోఽయ మారమ్భః కర్మణాం చ ఫలోదయః,
తాం దేవీం శోకసంతప్తాం మైథిలీం ద్రష్టు మర్హసి. ౨

సా హి శోకసమావిష్టా బాష్పపర్యాకులేక్షణా,
మైథిలీ విజయం శ్రుత్వా తవ హర్ష ముపాగమత్. 3
పూర్వకాత్ప్రత్యయా చ్చాహ ముక్తో విశ్వస్తయా తయా,
భర్తారం ద్రష్టు మిచ్ఛామి కృతార్థం సహలక్ష్మణమ్. ౪

ఏవముక్తో హనుమతా రామో ధర్మభృతాం వరః,
అగచ్ఛత్సహసా ధ్యాన మాపద్బాష్పపరిప్లుతః. ౫

దీర్ఘముష్ణం వినిశ్వస్య మేదినీ మవలోకయన్,
ఉవాచ మేఘసఙ్కాశం విభీషణ ముపస్థితమ్. ౬

బలికి హనుమంతుఁడు రాముఁడున్న ప్రదేశంబునకు మహావేగంబున నేఁగు దెంచెను. ౫౧

ఇది నూటపదునాఱవసర్గము.

---

## నూటపదునేడవసర్గము.

కార్యంబుసాధించు నుపాయంబు లెఱింగిన యాహనుమంతుఁడు, మహా పండితుఁడును సమస్తధనుర్ధరులలో నుత్తముఁడునగు రామునొద్దకుఁబోయి యీ వచనంబుఁ జెప్పెను. ౧

ఎవ్వతెనిమిత్తము ఈప్రయత్నమంతయుఁ గావింపఁబడెనో ఎవ్వతె కై సేతుబంధము మొదలగుకార్యములు ఫలపర్యంతము చేయఁబడెనో అట్టి సీతాదేవిని బరమదుఃఖితమయియున్న దానిం జూడుము. ౨

దుఃఖితయయి కన్నుల నీళ్లు గార్చుచున్న యాసీతాదేవి నీవు జయంబు నొందితి వన్నసమాచారంబు విన్నంతనె సంతోషంబు నొందెను. 3

ఆబిడ పూర్వము నన్నుఁ దెలిసియున్న కారణంబున నాయందు నమ్మకంబుగలిగి, నాతో "రావణుని వధించి విజయంబునొంది కృతార్థుండయిన రాముని లక్ష్మణసహితంబుగాఁ జూడఁగోరెదను" అని చెప్పెను. అని హనుమంతుఁడు రామునితోఁ జెప్పెను. ౪

ధార్మికులలో నెల్ల నుత్తముఁడగు రాముఁడు హనుమంతుని వచనంబు విని దటాలునఁ గొంచెము గన్నీరొలుక "బహుకాలము రావణు నింటనుండిన సీతను బరిగ్రహించినయెడ లోకాపవాదంబుగలుగు; నిర్దోషియగు నాబిడను బరిత్యజించిని దోషంబు వాటిల్లు. ఏమి సేయవచ్చును?" అని చింత నొందెను. ౫

అంత రాముఁడు వేఁడినిట్టూర్పులు నిగుడించి భూమిం జూచుచు సమీపంబున మేఘంబువలె నల్లని మేనుతో నున్న విభీషణునిం జూచి యిట్లని పలికెను. ౬

దివ్యాఙ్గరాగాం వైదేహీం దివ్యాభరణభూషితామ్,
ఇహ సీతాం శిరస్స్నాతా ముపస్థాపయ మాచిరమ్. ౭

ఏవ ముక్తస్తు రామేణ త్వరమాణో విభీషణః,
ప్రవిశ్యాన్తఃపురం సీతాం స్త్రీభి స్స్వాభి రచోదయత్. ౮

దివ్యాఙ్గరాగా వైదేహీ! దివ్యాభరణభూషితా,
యాన మారోహ భద్రం తే భర్తా త్వాం ద్రష్టు మిచ్ఛతి. ౯

ఏవ ముక్తా తు వైదేహీ ప్రత్యువాచ విభీషణమ్,
అస్నాతా ద్రష్టు మిచ్ఛామి భర్తారం రాక్షసాధిప! ౧౦

తస్యా స్తద్వచనం శ్రుత్వా ప్రత్యువాచ విభీషణః,
యదాహ రాజా భర్తా తే త త్తథా కర్తు మర్హసి. ౧౧

తస్య తద్వచనం శ్రుత్వా మైథిలీ పతి(భర్తృ) దేవతా,
భర్తృభక్తివ్రతా సాధ్వీ తథేతి ప్రత్యభాషత. ౧౨

తత స్సీతాం శిరస్స్నాతాం యువతీభి రలంకృతామ్,
మహార్హాభరణోపేతాం మహార్హామ్బరధారిణీమ్. ౧౩
ఆరోప్య శిబికాం దీప్తాం పరార్ధ్యామ్బరసంవృతామ్,
రక్షోభి ర్బహుభి ర్గుప్తా మాజహార విభీషణః. ౧౪

నీవు సీతను అభ్యంగస్నానముచేయించి మంచిమైపూఁతచేతను ఉత్తమంబులగు భూషణంబులచేతను అలంకృతంగావించి యిచ్చటికి శీఘ్రంబుగాఁ దోడ్కొనిరము. ౭

విభీషణుం డంత రాము నాజ్ఞను శిరసావహించి త్వరపడినవాఁడై లంకం బ్రవేశించి యంతఃపురమునకుఁబోయి తన స్త్రీలచే సీతాదేవి కిట్లని చెప్పించెను. ౮

సీతాదేవీ! నీవు చక్కఁగా స్నానము గావించి దివ్యమయిన యంగరాగంబులఁదుకొని ఉత్తమములయిన యాభరణంబులు దాల్చి వాహనంబారోహింపుము. నీకు మంగళంబగుఁగాక. నీ పెనిమిటి నిన్నుఁ జూడఁగోరుచున్నాఁడు. అని విభీషణుఁడు దన స్త్రీలముఖంబున సీతతోఁ జెప్పెను. ౯

విభీషణుఁడు స్త్రీముఖంబునం జెప్పినమాటను విని సీతాదేవి యతనిం జూచి "రాక్షసరాజా! నేను ఇదివఱకున్నట్లు స్నానము సేయకయె నాభర్తను జూడఁగోరెదను" అని పలికెను. ౧౦

విభీషణుండు సీత చెప్పినమాటను విని "అట్లుగారాదు, నీభర్తయు రాజును గావున రాముఁడెట్లు చెప్పిపంచినాఁడో నీవది యట్లే గావింపుము" అని స్త్రీముఖంబున బదులు చెప్పెను. ౧౧

ఆవ్విభీషణుని వచనంబు విని పెనిమిటినె దేవునిగా భావించినదియుఁ బతిభక్తియె ముఖ్యమయిన వ్రతముగాఁగలదియు నుత్తమగుణసంపన్నయు నగు సీతాదేవి "యట్లులగావించెదను" అని విభీషణునకుఁ బ్రత్యుత్తరం బొసంగెను. ౧౨

అంత విభీషణుండు సీదాదేవికి శిరస్స్నానముసేయించి స్త్రీలచే నంగరాగకుసుమాదులచే నలంకారము సేయించి యుత్తమమయిన యాభరణంబులు దొడిగించి దివ్యమయిన వస్త్రముకట్టించి యామెను శ్రేష్ఠమయిన వస్త్రముచేఁ గప్పఁబడి దేదీప్యమానమై పెక్కండ్రు రాక్షసులచే రక్షింపఁబడుచున్న పల్లకీయందుఁ గూర్చుండఁబెట్టి రామునియొద్దకుఁ దోడుకొనివచ్చెను. ౧౩, ౧౪

సోఽభిగమ్య మహాత్మానం జ్ఞాత్వాపి ధ్యాన మాస్థితమ్,
ప్రణతశ్చ ప్రహృష్టశ్చ ప్రాప్తాం సీతాం న్యవేదయత్. ౧౪

తా మాగతాముపశ్రుత్య రక్షోగృహచిరోషితామ్,
హర్షో దైన్యం చ రోషశ్చ త్రయం రాఘవ మావిశత్. ౧౫

తతః పార్శ్వగతం దృష్ట్వా సవిమర్శం విచారయన్,
విభీషణ మిదం వాక్య మహ్రుష్టం రాఘవోఽబ్రవీత్. ౧౬

రాక్షసాధిపతే! సౌమ్య! నిత్యం మద్విజయే రత!,
వైదేహీ సన్నికర్షం మే శీఘ్రం సముపగచ్ఛతు. ౧౭

స తద్వచన మాజ్ఞాయ రాఘవస్య విభీషణః,
తూర్ణ ముత్సారణే యత్నం కారయామాస సర్వతః. ౧౮
కఞ్చుకోష్ణీషిణ స్తత్ర వేత్రజర్ఝరపాణయః,
ఉత్సారయ న్తః పురుషా స్సమన్తా త్పరిచక్రముః. ౨౦

ఋక్షాణాం వానరాణాం చ రాక్షసానాం చ సర్వశః,
బృన్దాన్యుత్సార్యమాణాని దూర ముత్ససృజు స్తదా. ౨౧

తేషా ముత్సార్యమాణానాం సర్వేషాం ధ్వనిరుత్థితః,
వాయు నోద్వర్తమానస్య సాగరస్యేవ నిస్వనః. ౨౨

విభీషణుండు సీతతో వచ్చుటం దెలిసియుం జింతంగూరియున్న మహానుభావుండగు రామునొద్దకుం బోయి విభీషణుండు "సీతం దోడ్కొనివచ్చితి" నని విన్నవించెను. ౧౫

అట్లు రాక్షసునింటం జిరకాలముండినసీతాదేవి వచ్చినదని విన్నంతనె రామునకు "ఎట్టకేలకు సీతాదేవినిం జూడంగలిగెఁగదా" యని సంతోషంబును ఈబిడ నెట్లు విడువనగునని దైన్యమును ఇట్లు చిరకాలము రాక్షసు నింట నుండి వచ్చినదాని నెట్లు పరిగ్రహింప వచ్చునని కోపమును ఈమూఁడును గలిగెను. ౧౬

అంత రాముఁడు కొంతతడవు మనంబున నాలోచించి తనపార్శ్వ భాగంబున నున్నవానిఁ దనయాకారభేదంబుఁ గని సంతోషహీనుండైయున్న వాని విభీషణుం జూచి యీమాటంబలికెను. ౧౭

రాక్షసరాజా! సౌమ్యుఁడా! ఎల్లప్పుడును నావిజయమునే గోరు వాఁడా! శీఘ్రంబున సీతను నాసమీపంబునకుఁ దోడుకొనిరమ్ము. అని రాముఁడు విభీషణునితోఁ బలికెను. ౧౮

అవ్విభీషణుండు రామునభిప్రాయంబుఁ దెలిసి శీఘ్రంబున నచ్చటిజనుల నందఱ దూరముఁ ద్రోయుటకుఁ దగినపురుషుల నియమించెను. ౧౯

చొక్కాయలును శిరోవేష్టనములునుదాల్చినవారలును ఎల్లప్పుడును బెత్తముఁబట్టుటచేఁబరుషమయిన హస్తతలముగలవారలునగు పురుషులు వేత్రహస్తులయి జనుల నచటినుండితఱుముచు నాస్థలంబంతటనుం దిరిగిరి. ౨౦

అప్పుడు పురుషు లట్లు బెత్తములచేఁ దొలఁగఁ ద్రోలుటయుఁ భల్లూక వీరులును వానరులును రాక్షసులును గుంపులు గుంపులుగా నావలికిఁ దొలంగి చనిరి. ౨౧

అచటివారల నందఱను దొలఁగించునపుడు పుట్టినధ్వని వాయువేగంబునకు క్షోభిల్లుచున్న సముద్రముయొక్క ధ్వనివలె భయంకరంబై వినఁబడెను. ౨౨

ఉత్సార్యమాణాం స్తా న్దృష్ట్వా సమన్తా జ్జాతసమ్భ్రమాన్,
దాక్షిణ్యా త్తదమర్షాచ్చ వారయామాస రాఘవః. ౨౩

సంరబ్ధశ్చాబ్రవీ ద్రామ శ్చక్షుషా ప్రదహన్నివ,
విభీషణం మహాప్రాజ్ఞం సోపాలమ్భ మిదం వచః. ౨౪

కిమర్థం మామనాదృత్య క్లిశ్యతేఽయం త్వయా జనః,
నివర్తయైన ముద్యోగం జనోఽయం స్వజనో మమ. ౨౫

న గృహాణి న వస్త్రాణి న ప్రాకారా స్తిరస్క్రియాః,
నేదృశా రాజసత్కారా వృత్త మావరణం స్త్రియాః. ౨౬

వ్యసనేషు న కృచ్ఛ్రేషు న యుద్ధేషు స్వయంవరే,
న క్రతౌ న వివాహే చ దర్శనం దుష్యతి స్త్రియాః. ౨౭

సైషా యుద్ధగతా చైవ కృచ్ఛ్రే చ మహతి స్థితా,
దర్శనేఽస్యా న దోష స్స్యా న్మత్సమీపే విశేషతః. ౨౮

తదానయ సమీపం మే శీఘ్ర మేనాం విభీషణ!,
సీతా పశ్యతు మామేషా సుహృద్గణవృతం స్థితమ్. ౨౯

ఏవ ముక్తస్తు రామేణ సవిమర్శో విభీషణః,

అప్పటి వానరులు మున్నగువారందఱు రాజపురుషులు తఱుమఁట వలనఁ దొలఁగిపోవుటకు వేగిరపాటుతో శ్రమపడుచుండుటంజూచి రాముఁడు వానరులందరి దాక్షిణ్యంబునం జేసి సహింపక "త్రోయవలదు" అని నివారించెను. ౨౩

రాముఁడు కోపంబున వేగిరపాటుగదురఁ గన్నుల నిప్పులురాల మహాపండితుఁడగు విభీషణుం జూచి తిరస్కారపూర్వకముగా నిట్లని పలికెను. ౨౪

నీవు నన్నుఁగూడ నలక్ష్యముచేసి యీజనమునంతయుం నెందుకిట్లు శ్రమపెట్టెదవు! వీరలఁ దొలఁగించు ప్రయత్నము నిలుపుము, ఈజనమంతయుం నాస్వజనముకాని వేఱుకాదు. ౨౫

స్త్రీకిసదాచారమే యావరణముగాని గృహంబులు వస్త్రంబులు ప్రాకారంబులు తెరలు మఱియు నిట్టిరాజమర్యాదలు ఎంతమాత్రము ఆవరణములు కాఁజాలవు. ౨౬

బంధువులు మృతిఁబొందుట మొదలయిన దుఃఖసమయములయందును రాజ్యక్షోభము మొదలయిన యాపదలయందును యుద్ధభూములయందును స్వయంవరమునందును యజ్ఞమునందును వివాహమునందును స్త్రీ పరపురుషుల కగపడుట దోషము గాదు. ౨౭

ఈసీత యిప్పుడు యుద్ధభూమి నుండుటవలనను బ్రియవియోగము మొదలయిన మహాకష్టమునొందిన దగుటకువలనను ఈబిడనుచూచుట దోషము గాదు. విశేషించి నేను సమీపంబున నుండునపుడు ఈబిడనుచూచుట దోషమే కాదు ౨౮

విభీషణుఁడా ! అట్లగుటంజేసి యీసీతను శీఘ్రముగా నా సమీపంబునకుఁ దెమ్ము. మిత్రసమూహములచేఁ బరివేష్టితుండనైయున్న నన్ను ఈబిడ చూచునుగాక. అని రాముండు విభీషణునితోఁ జెప్పెను. ౨౯

విభీషణుఁడు రామవాక్యంబువిని విచారంబుగూరిన మనంబుతో విన

రామస్యోపానయ త్వేతాం సన్నికర్షం వినీతవత్. ౩౦
తతో లక్ష్మణ సుగ్రీవౌ హనూమాంశ్చ ప్లవఙ్గమః,
నిశమ్య వాక్యం రామస్య బభూవు ర్వ్యథితా భృశమ్. ౩౧

కళత్రనిరపేక్షైశ్చ ఇఙ్గితై రస్య దారుణైః,
అప్రీత మివ సీతాయాం తర్కయన్తి స్మ రాఘవమ్. ౩౨

లజ్జయా త్వవలీయన్తీ స్వేషు గాత్రేషు మైథిలీ,
విభీషణేనానుగతా భర్తారం సాఽభ్యవర్తత. ౩౩
సా వస్త్రసంరుద్ధముఖీ లజ్జయా జనసంసది,
రురోదాసాద్య భర్తార మార్యపుత్త్రేతి భాషిణీ. ౩౪

విస్మయాచ్చ ప్రహర్షాచ్చ స్నేహాచ్చ పతిదేవతా,
ఉదైక్షత ముఖం భర్తు స్సౌమ్యం సౌమ్యతరాననా. ౩౫

అథ సముపనుదన్మనఃక్లమం సా
సుచిర మదృష్ట ముదీక్ష్య వై ప్రియస్య,
వదన ముదితపూర్ణచన్ద్రకాన్తం
విమలశశాఙ్కనిభాననా తదానీమ్. ౩౬

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే - సప్తదశోత్తరశతతమస్సర్గః. ౧౧౭.

---

## అష్టాదశోత్తరశతతమస్సర్గః.

తాం తు పార్శ్వస్థితాం ప్రహ్వాం రామ స్సంప్రేక్ష్య మైథిలీమ్.

యంబున సీతాదేవి రాముని సమీపంబునకుఁ దోడ్తెచ్చెను. ౩౦

అంత లక్ష్మణుఁడును సుగ్రీవుండును హనుమంతుఁడును అట్లు రాముని మాటలయందు సీతపై ననురాగరసము గనఁబడకుండుటను గనిపించి మిక్కిలియు దుఃఖితులయిరి. ౩౧

ఎందుకనఁగా లక్ష్మణసుగ్రీవహనుమంతులు భార్యయం దపేక్షలేమిం దెలుపుచున్న భయంకరంబులయిన రామునింగితంబులు గనుంగొని రామునకు సీతయందు. బ్రీతిదప్పినట్లు లూహించిరి. ౩౨

ఆసీతాదేవి విభీషణుఁడు వెంబడింప లజ్జచేఁ దనయవయవంబుల సంకోచపఱచుకొని పెనిమిటియెదుటికిఁ బోయెను. ౩౩

ఆబిడ సమీపంబునకుఁబోయి భర్తం గాంచి జనసమూహమధ్యంబున నున్నది కావున లజ్జచే వస్త్రంబున మోముగప్పుకొని ఆర్యపుత్ర యని పలుకుచు రోదనంబు గావించెను. ౩౪

పెనిమిటియె దేవతగాఁగల యాసీతాదేవి మఱియుం బ్రసన్నమగు ముఖముతోఁ గూడినదై ప్రసన్నంబగు పెనిమిటిముఖంబును 'అట్టిదానను బ్రియుని చూడఁగంటినే' యని యాశ్చర్యంబునను 'బహుకాలము చూడని ప్రియునిం జూచుచున్నానుగదా' యని సంతోషంబునను బ్రియునందు స్వభావంబునం గల స్నేహంబునను చూచెను. ౩౫

అంత నపుడు స్వచ్ఛమయిన చంద్రబింబమువంటి మోముగల యాసీతాదేవి ఉదయించిన నిండుచందురునువలెఁ గమనీయమయిన బహుకాలము చూడకున్న ప్రియముఖంబు చూచి తనమనస్సునందలి మహాదుఃఖంబు విడిచి సంతోషంబు నొందెను. ౩౬

ఇది నూటపదునేడవసర్గము.

## నూటపదునెనిమిదవసర్గము.

రాముఁడు తనపార్శ్వంబున లజ్జచే నమ్రయయియున్నసీతంజూచి

హృదయాన్తర్గతక్రోధో వ్యాహర్తు ముపచక్రమే. ౧

ఏషాసి నిర్జితా భద్రే! శత్రుం జిత్వా మయా రణే,
పౌరుషాద్య దనుష్ఠేయం తదేత దుపపాదితమ్. ౨

గతోఽస్మ్యన్త మమర్షస్య ధర్షణా సంప్రమార్జితా,
అవమానశ్చ శత్రుశ్చ మయా యుగప దుద్ధృతౌ. 3

అద్య మే పౌరుషం దృష్ట మద్య మే సఫలః శ్రమః,
అద్య తీర్ణప్రతిజ్ఞత్వా త్ప్రభవామీహ చాత్మనః. ४

యా త్వం విరహితా నీతా చలచిత్తేన రక్షసా,
దైవసంపాదితో దోషో మానుషేణ మయాజితః. ౫

సమ్ప్రాప్త మవమానం య స్తేజసా న ప్రమార్జతి,
క స్తస్య పురుషార్థోఽస్తి పురుషస్యాల్పతేజసః. ౬
లఙ్ఘనం చ సముద్రస్య లఙ్కాయాశ్చావమర్దనమ్,
సఫలం తస్య తచ్ఛ్లాఘ్యం మహత్కర్మ హనూమతః. ౭

యుద్ధే విక్రమత శ్చైవ హితం మన్త్రయతశ్చ మే,
సుగ్రీవస్య ససైన్యస్య సఫలోఽద్య పరిశ్రమః. ౮

నిర్గుణం భ్రాతరం త్యక్త్వా యో మాం స్వయ ముపస్థితః,
విభీషణస్య భక్తస్య సఫలోఽద్య పరిశ్రమః. ౯

సంతసె హృదయంబున కోపంబు జ్వలింప నివ్విధంబునం బలుక నారంభించెను. ౧

మంగళరూపిణివగు సీతా! ఇదిగో నిన్ను యుద్ధంబున శత్రువును వధించి సాధించితిని. పౌరుషంబువలనఁ జేయఁదగినదేమో యది చక్కఁగాఁ జేయఁబడినది. ౨

కోపయొక్క ఫలము నొందితిని. శత్రువుచేసిన తిరస్కారమునకు బదులు గావించితిని. నేను అవమానంబును దానిఁగావించిన శత్రువుఁగూడ నొక్కపెట్ట నిర్మూలము గావించితిని; ౩

ఇపుడు నాపౌరుషంబు గనఁగొంటివి. నాశ్రమం బిపుడు సఫలమయ్యె. ప్రతిజ్ఞను నెఱవేర్చినవాఁడనైతిఁ గావున నిప్పుడు నాకు నేను స్వతంత్రుఁడనైతిని. ౪

నేను లేనప్పుడు చపలచిత్తుఁడగు రావణుఁడు నిన్నపహరించిన కారణంబున దైవముచేఁ బ్రాప్తించిన యవమానమును నేను ఇపుడు పురుష ప్రయత్నంబునఁ బోఁగొట్టితిని. ౫

అవమానము వచ్చినప్పుడు ఎవ్వఁడు దానిఁ బౌరుషంబునఁ బోఁగొట్టఁడో, అట్టి తేజోహీనుండగు పురుషునకు నేపురుషార్థంబునుం గలుగదు. ౬

హనుమంతుఁడు సముద్రంబు లఘించుటయుం లంకాపురి దహించుటయు శ్లాఘనీయములయిన యీ యతని కర్మములన్నియు నిప్పుడు సఫలము లయినవి. ౭

యుద్ధంబునఁ బరాక్రమంబు సూపుచు నాహితంబు నారయుచు వానరసేనాసహితంబుగా నాకు సాహాయ్యంబు గావించిన సుగ్రీవుని ప్రయాసంబును ఇపుడు సఫలమయ్యె. ౮

గుణహీనుండయిన యన్నను వదలి తదనంతం దాను నాయొద్దకు వచ్చి చేరినభక్తుఁడు విభీషణుని ప్రయాసంబును ఇప్పుడు సఫలం బయ్యె. అని రాముఁడు సీతంజూచి పలికెను. ౯

ఇత్యేవం బ్రువత స్తస్య సీతా రామస్య తద్వచః,
మృగీవోత్ఫుల్లనయనా బభూవాశ్రుపరిప్లుతా. ౧౦

పశ్యత స్తాం తు రామస్య భూయః క్రోధో వ్యవర్ధత,
ప్రభూతాజ్యావసిక్తస్య పావకస్యేవ దీప్యతః. ౧౧

స బద్ధ్వా భ్రుకుటిం వక్త్రే తిర్యక్ప్రేక్షితలోచనః,
అబ్రవీ త్పరుషం సీతాం మధ్యే వానరరక్షసామ్. ౧౨

యత్కర్తవ్యం మనుష్యేణ ధర్షణాం పరిమార్జితా,
తత్కృతం సకలం సీతే!
శత్రుహస్తా దమర్షణాత్. ౧౩

నిర్జితా జీవలోకస్య తపసా భావితాత్మనా,
అగస్త్యేన దురాధర్షా మునినా దక్షిణేవ దిక్. ౧౪

విదిత శ్చాస్తు తే భద్రే! యోఽయం రణపరిశ్రమః,
స తీర్ణ స్సుహృదాం వీర్యా న్న త్వదర్థం మయా కృతః. ౧౫

రక్షతా తు మయా వృత్త మపవాదం చ సర్వశః,
ప్రఖ్యాతస్యాత్మవంశస్య న్యఙ్గం చ పరిరక్షితా. ౧౬

ప్రాప్తచారిత్రసందేహా మమ ప్రతిముఖే స్థితా,
దీపో నేత్రాతురస్యేవ ప్రతికూలాసి మే దృఢమ్. ౧౭

అట్లు రాముఁడు అతికఠినంబుగాఁ దనయం దెంతమాత్రము ప్రీతిలేని మాటలు పలుకుటను విని లేడివలె వికసితంబులగు నేత్రంబులు గల్గి ప్రియ ముఖంబుఁ జూచుచుండిన సీతాదేవి పరమాకులితయయి కన్నుల జలధారలు స్రవించెను. ౧౦

మొదలె మండుచున్న నిప్పునందు అధికముగా నేయిపోసిన నది మఱియుజ్వలించునట్లు మొదలె కుపితుఁడగు రాముని దుఃఖితయగు సీతం జూడఁగానే మఱియుఁ గోపము వృద్ధిఁబొందెను. ౧౧

ఆ రాముం డట్లు పరమక్రుద్ధుఁడై మోమున బొమముడిఘటించి తిర్యగ్వీక్షణంబులఁ జురచురం జూచుచు వానరరాసులయందఱి నడుమ సీతం జూచి యిట్లని పరుషవచనంబు లాడెను. ౧౨

సీతా! ప్రాప్తమయిన యవమానమును బోఁగొట్టుకొనఁగోరిన పురుషుఁడు ఏమిసేయవలయునో అదంతయుఁ గావించినాను.

తపోబలంబున నాత్మజ్ఞాన సంపన్నుండగు నగస్త్యమహర్షి వాతాపీల్వలులచే నాక్రాంతమయి ప్రాణిలోకమునకు దురాసదమయిన దక్షిణదిక్కును ఆవాతాపీల్వలుల సంహరించి జయించిన విధంబున నేను రావణుఁ డపహరించిన నిన్ను కోపంబు పెంపున రావణుని వధించి సాధించితిని. ౧౪

భాగ్యవతీ! నే నిపుడు స్నేహితుల పరాక్రమంబు తోడ్పాటున యుద్ధంబు గావించి జయము నొందితినే, ఇదంతయు నీకొఱకుఁ జేయలేదని యెఱింగి యుండుము. ౧౫

సదాచారమును రక్షించుటకును లోకాపవాదంబును బ్రసిద్ధమయిన నావంశంబునకుఁ గలిగిన యపకీర్తిని బరిహరించుటకై యును నేనింత దూరము యుద్ధముగావించి విజయంబు నొందితినిగాని వేఱుకారణమునఁ గాదు. ౧౬

సదాచార సంవృత్తివిషయమయిన సందేహము గలిగియుండునపుడు కూడ నాకట్టెదుట నిలిచియున్న నీవు నేత్రరోగము గలవానికి దీపమువలె నాకెంతయుఁ బ్రతికూలవై యున్నావు. ౧౭

తద్గచ్ఛ హ్యనుజ్ఞాతా యథేష్టం జనకాత్మజే!,
ఏతా దశ దిశో భద్రే కార్యమస్తి న మే త్వయా. ౧౮
కః పుమాన్ హి కులే జాతః స్త్రియం పరగృహోషితామ్,
తేజస్వీ పునరాదద్యా త్సుహృల్లేఖ్యేన చేతసా. ౧౯

రావణాఙ్కపరిభ్రష్టాం దృష్టాం దుష్టేన చక్షుషా,
కథం త్వాం పునరాదద్యాం కులం వ్యపదిశన్ మహత్. ౨౦

తదర్థం నిర్జితా మే త్వం యశః ప్రత్యాహృతం మయా,
నాస్తి మే త్వయ్యభిష్వఙ్గో యథేష్టం గమ్యతా మితః. ౨౧

ఇతి ప్రవ్యాహృతం భద్రే! మయైతత్కృతబుద్ధినా,
లక్ష్మణే భరతే వా త్వం కురు బుద్ధిం యథాసుఖమ్. ౨౨

సుగ్రీవే వానరేన్ద్రే వా రాక్షసేన్ద్రే విభీషణే,
నివేశయ మనస్సీతే! యథావా సుఖ మాత్మనః. ౨౩

న హి త్వాం రావణో దృష్ట్వా దివ్యరూపాం మనోరమామ్,
మర్షయేత చిరం సీతే! స్వగృహే పరివర్తినీమ్. ౨౪

భాగ్యవతియగు జనకపుత్త్రీ; అట్లగుటం జేసి అనుజ్ఞనొసంగితిని; ఈదశ దిశలందును నీయిష్టమయిన స్థలంబునకుఁ బొమ్ము, నాకు నీతోఁ బనిలేదు.

బహుకాలము పరునియింట నివసించినభార్యను సత్కులంబునఁ బుట్టిన వాఁడు అందుఁ బరాక్రమవంతుఁడునగు పురుషుఁడు ఎవ్వఁడు అధిక ప్రీతితో గ్రహించును ? ౧౯

ఇంతకాలము రావణు నంకముననుండి యిప్పుడు దిగివచ్చినదానవు. రావణునిచే మన్మథాతురంబగు దృష్టిం జూడఁబడినదానవు (లేక సమస్తజనుల చేతను చెడినదానవు' అని తలంపఁబడిన దానవు) నగు నిన్ను గొప్పకులంబునఁ బుట్టినవాఁడను అకులంబునకుఁ గీర్తి దేవలసినవాఁడనగు నేను మరల నెట్లు గ్రహింపవచ్చును ? ౨౦

అవమానమును బోఁగొట్టుకొనుట కొఱకు నిన్ను మరల జయించి నాను గాని వేఱుకారణమునఁగాదు; పోయిన కీర్తిని మరల సంపాదించితిని; నాకు నీయం దాసక్తి యెంతమాత్రము లేదు, నీ యిష్టము వచ్చుచోటికిఁ బొమ్ము. ౨౧

భాగ్యవంతులారా ! నేనీమాటను జక్కఁగా నాలోచించియే చెప్పుచున్నానుగాని వేఱుగాఁ దలఁపవలదు.

నీవు నీకెట్లుసుఖమో అట్లు నీయాత్మపోషణార్థమయి లక్ష్మణునియొద్దఁ గాని భరతునియొద్దఁగాని యుండి జీవింపుము. ౨౨

సీతా! లేక వానరరాజయిన సుగ్రీవునియొద్దఁగాని రాక్షసరాజయిన విభీషణునియొద్దఁ గాని లేక నీకెచట సుఖమని తోఁచునో అచటఁగాని యుండి యాత్మపోషణంబుఁ గావించుకొనుము. ౨౩

సీతా ! దివ్యమయిన రూపముగలదానవు. మనోహరాంగివి, గత్యంతరములేక తనయింటనే యున్న దానవునగు నిన్నుఁ జూచుచుఁ జపలుండగు రావణుఁడు ఇంతకాలము మన్మథబాధ సహించి యూరకయుండియుండునా? నాకుఁదోఁచలేదు. అని రాముఁడు సీతతోఁ బరుషవచనములు పలికెను. ౨౪

తతః ప్రియార్హశ్రవణా తదప్రియం
ప్రియాదుపశ్రుత్య చిరస్య మైథిలీ,
ముమోచ బాష్పం సుభృశం ప్రవేపితా
గజేన్ద్రహస్తాభిహతేవ సల్లకీ. ౨౫

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డేఽష్టాదశోత్తరశతతమస్సర్గః. ౧౧౮.

---

## ఏకోనవింశత్యుత్తరశతతమస్సర్గః.

ఏవ ముక్తా తు వైదేహీ పరుషం రోమహర్షణమ్,
రాఘవేణ సరోషేణ భృశం ప్రవ్యథితాఽభవత్. ౧

సా తదశ్రుతపూర్వం హి జనే మహతి మైథిలీ,
శ్రుత్వా భర్తృవచో రూక్షం లజ్జయా వ్రీళితాఽభవత్. ౨

ప్రవిశన్తీవ గాత్రాణి స్వాన్యేవ జనకాత్మజా,
వాక్శల్యైస్తైస్సశల్యేవ భృశ మశ్రూణ్యవర్తయత్. 3

తతో బాష్పపరిక్లిష్టం ప్రమార్జన్తీ స్వమాననమ్,
శనైర్గద్గదయా వాచా భర్తార మిద మబ్రవీత్. ౪
కిం మా మసదృశం వాక్య మీదృశం శ్రోత్రదారుణమ్,
రూక్షం శ్రావయసే వీర! ప్రాకృతః ప్రాకృతామివ. ౫

న తథాస్మి మహాబాహో! యథా త్వ మవగచ్ఛసి,
ప్రత్యయం గచ్ఛ మే యేన చారిత్రేణైవ తే శపే. ౬

అప్పుడు ఎల్లప్పుడును ఎల్లజనులవలనను బ్రియవచనంబులే వినఁదగినట్టి పరమసాధ్వియగుసీతాదేవి బహుకాలము ప్రియవియోగంబున నానావిధ కష్టంబు లనుభవించి కృశించి తుదకుఁ బ్రియసమాగమంబునఁ బ్రియవచనామృతంబు వీనులంగ్రోలఁ దమకించుచుండ నట్టిప్రియుని ముఖంబుననుండి యట్టి యప్రియవార్తలువిని మదగజంబు కరంబువ్రేటునకుఁ గంపించు నల్లికీలతకైవడి గడగడవడంకుచు అశ్రుధారలు విడిచెను. ౨౫

ఇది నూటపదునెనిమిదవ సర్గము.

## నూటపందొమ్మిదవసర్గము.

ఇవ్విధంబున రాముఁడు కుపితుఁడై వినువారికి నితరులకుఁగూడ భయంబునఁబులకలు గల్గించునట్టి పరుషభాషణంబులు పలుకుటయు సీతాదేవి పరమదుఃఖితయయ్యెను. ౧

ఇదివఱకెన్నఁడును విని యెఱుంగని పరుషవచనము భర్తవలన మహాజనమధ్యంబున విని సీతాదేవి లజ్జచే మొదలే వంచినతలను మఱియు వంచుకొనెను. ౨

జనకమహారాజు కూఁతురయిన సీతాదేవి లజ్జచే నవయవంబులను సంకోచపఱచుకొని శల్యంబులవంటి యారాముని పరుషభాషణంబులచేఁ బీడితయయి మిక్కిలియుఁ గన్నీరు స్రవించెను. ౩

అంత సద్దేవి కన్నీటందడిసిన ముఖమును దుడుచుకొనుచుఁ బెనిమిటిం జూచి డగ్గుత్తికగూరిన యెలుంగున మెల్లఁగా నిట్లనిపలికెను. ౪

వీరుఁడా! తెలియనివాఁడు తెలియనిదానిఁ బలికినవిధంబున నీవు చెప్పుటకును నేను వినుటకును యోగ్యము గానిదియుఁ బరుషంబును శ్రవణకటువునగు నిట్టివాక్యంబు నన్నేల పలికెదవు? ౫

మహాబాహుఁడవగు రాముఁడా! నీవునన్నుఁ దలఁచునట్లు నేను ఏదోషంబు నొందలేదు. ఏమైననొక ప్రమాణంబుచే నమ్ముము. నీకు నమ్మకము గలుగుటకై నాసచ్చరిత్రముపై నానఁబెట్టి చెప్పుచున్నాను. ౬

పృథక్స్త్రీణాం ప్రచారేణ జాతిం తాం పరిశఙ్కసే,
పరిత్యజేమాం శఙ్కాం తు యది తేఽహం పరీక్షితా. ౭

యద్యహం గాత్రసంస్పర్శం గతాస్మి వివశా ప్రభో!,
కామకారో న మే తత్ర దైవం తత్రాపరాధ్యతి. ౮

మదధీనం తు యత్తన్మే హృదయం త్వయి వర్తతే,
పరాధీనేషు గాత్రేషు కిం కరిష్యామ్యనీశ్వరా. ౯

సహ సంవృద్ధభావాచ్చ సంసర్గేణ చ మానద!,
యద్యహం తే న విజ్ఞాతా హతా తేనాస్మి శాశ్వతమ్. ౧౦

ప్రేషితస్తే యదా వీరో హనుమానవలోకకః,
లఙ్కాస్థాఽహం త్వయా వీర! కిం తదా న విసర్జితా. ౧౧
ప్రత్యక్షం వానరేన్ద్రస్య త్వద్వాక్యసమనన్తరమ్,
త్వయా సంత్యక్తయా వీర! త్యక్తం స్యాజ్జీవితం మయా. ౧౨

న వృథా తే శ్రమోఽయం స్యాత్సంశయే న్యస్య జీవితమ్,
సుహృజ్జనపరిక్లేశో న చాయం నిష్ఫలస్తవ. ౧౩

త్వయా తు నరశార్దూల! క్రోధమేవానువర్తతా,
లఘునేవ మనుష్యేణ స్త్రీత్వమేవ పురస్కృతమ్. ౧౪

దుష్టలగు స్త్రీలు కొందఱు దుర్వృత్తిఁ గావింతురని స్త్రీజాతినంతయు నట్టిదిగాఁ దలంచెదవు. నీవు నాస్వభావమును జక్కఁగా నెఱుంగుదువేని నావిషయమయి యీసందేహంబు విడువుము. ౭

నాథుఁడా! రావణుఁడు నన్నపహరించునపుడు అతనిదేహస్పర్శము నాకుఁగలిగెనని యనెదువేమో అప్పుడు నేను బరాధీనురాలను నేనాదేహస్పర్శము నొల్లకయయుంటిని గావున ఆతప్పు దైవమునదేగాని నాదిగాదు. ౮

ఇతరులకు గ్రహింప నశక్యమయి నాయధీనమయిన నామనస్సు మాత్రము నీయందయుండినది. అస్వతంత్రురాలనై యున్నపుడు బలాత్కారమున ఇతరులకు గ్రహింప నశక్యములయిన యంగకంబుల విషయమయి నేనేమి సేయఁగలను? ౯

మానదుఁడా! ఇద్దఱము ఒకరితో నొకరుకూడఁబెరిఁగి యంతకాలము నొకరినొకరెడఁబాయక యుండుటవలననె నీకు నాస్వభావము దెలియకపోయినపక్షమున ఇఁకదేనిచేతనుం దెలియదు. కావున నేను మిక్కిలియుం హతనైతిని. ౧౦

వీరుఁడా! నీవు నన్ను వెదకుటకై వీరుండగు హనుమంతుంబంపితివే. అప్పుడె నేను లంకలోను; నీవచటను నుండునప్పుడె నన్నేల విడువనైతివి.

వీరుఁడా! నీవప్పుడె నన్ను విడిచియుందువేని ఆసమాచారమును హనుమంతునివలన విన్నవెంటనె నేను నీచే విడువఁబడిన దానననిదెలిసి వానరోత్తముఁడగు హనుమంతుని సమక్షముననె ప్రాణంబులు విడిచియుందును.

అట్లయియుందునేని ప్రాణసందేహము గల్గించునట్టి (నాప్రాణమును సంశయములోనుంచి) యింత యుద్ధము వ్యర్థముగాఁ జేయవలసినదే నీకు లేకపోవును, నీమిత్రులకును ఇంతదూరము నిష్ఫ్రయోజనముగా శ్రమపడవలసినదే లేక పోవును. ౧౩

పురుషోత్తముఁడా! నీవు అల్పపురుషునియట్లు నీకోపమునే యనుసరించితివి, యుక్తాయుక్తంబులు వివేకింపక స్త్రీజాతినంతయు నొకటిగానే భావించి పలికితివికాని నాశీలంబు దలంపవైతివి. ౧౪

అపదేశేన జనకా న్నోత్పత్తి ర్వసుధాతలాత్,
మమ వృత్తం చ వృత్తజ్ఞ! బహు తేన పురస్కృతమ్. ౧౫

న ప్రమాణీకృతః పాణి ర్బాల్యే బాలేన పీడితః,
మమ భక్తిశ్చ శీలం చ సర్వం తే పృష్ఠతః కృతమ్. ౧౬

ఏవం బ్రువాణా రుదతీ బాష్పగద్గదభాషిణీ,
అబ్రవీ ల్లక్ష్మణం సీతా దీనం ధ్యానపరం స్థితమ్. ౧౭

చితాం మే కురు సౌమిత్రే! వ్యసనస్యాస్య భేషజమ్,
మిథ్యోపఘాతోపహతా నాహం జీవితు ముత్సహే. ౧౮

అప్రీతస్య గుణై ర్భర్తు స్త్యక్తాయా జనసంసది,
యా క్షమా మే గతి ర్గన్తుం ప్రవేక్ష్యే హవ్యవాహనమ్. ౧౯

ఏవ ముక్తస్తు వైదేహ్యా లక్ష్మణః పరవీరహా,
అమర్షవశ మాపన్నో రాఘవానన మైక్షత ౨౦
స విజ్ఞాయ తత శ్ఛన్దం రామస్యాకారసూచితమ్,
చితాం చకార సౌమిత్రి ర్మతే రామస్య వీర్యవాన్. ౨౧

అధోముఖం తదా రామం శనైః కృత్వా ప్రదక్షిణమ్,
ఉపాసర్పత వైదేహీ దీప్యమానం హుతాశనమ్. ౨౨

ప్రణమ్య దేవతాభ్యశ్చ బ్రాహ్మణేభ్యశ్చ మైథిలీ,

సదాచారముఁ దెలిసినవాఁడా! నేను జనకునకుఁబుట్టినట్లు వ్యాజము కాని వాస్తవముగా భూమిం బుట్టుటయు నాదు యుక్తమయిన సదాచారము కూడ నీవు ఆలోచింపవైతివి. ౧౫

నీవు చిన్నవాఁడవై యుండునపుడు నాచిన్నతనంబున నన్నగ్నిసాక్షికముగా వివాహమాడియుండుటకూడ నీ కిపుడు ప్రమాణముగాదయ్యె. నాకు నీయందుంగల భక్తి నాసచ్చరిత్రము అంతయుఁ నీకిపుడు అప్రమాణమయ్యె. అని సీతాదేవి రామునితోఁ జెప్పెను. ౧౬

సీతాదేవి రామునితో నివ్విధంబునం బలికి రోదనంబు సేయుచు డగ్గుత్తికయఁడరువెలుంగున నచట దీనుండై చింతాపరుండై నిలుచున్న లక్ష్మణుం జూచి యిట్లని పలికెను. ౧౭

లక్ష్మణా! ఈ వ్యసనమునకు ఔషధప్రాయమయిన ఔచితిఁబేర్చుము. దానింజొచ్చి ప్రాణంబులు విడిచెదను. ఇట్లు ప్రియునివలన మిథ్యాపవాదంబు నొంది యిఁక జీవింపనొల్లను. ౧౮

నాదుపాలి ప్రత్యాదిగుణంబులకు బ్రీతినొందక పెనిమిటినన్ను మహాజనసభామధ్యమునందుఁ బరిత్యజించినపుడు నాకు అగ్నింజొచ్చుటకన్న మఱి వేఱుగతి యేమియున్నది? అని సీతాదేవి లక్ష్మణునితోఁ జెప్పెను. ౧౯

శత్రువీరుల వధించునట్టి లక్ష్మణుండు సీతాదేవివచనంబువిని పరమదైన్యంబు నొందినవాఁడై రాముని మొగంబుచాయఁ జూచెను. ౨౦

అంత మహాపరాక్రమశాలియగు లక్ష్మణుండు, రాముని యాకారంబువలన నది రామునకు నభిమతంబని తెలిసికొని రాముని యంగీకారంబు మీఁది చితం బేర్చెను. ౨౧

అప్పుడు సీతాదేవి తలవంచుకొని యున్న రామునకు మెల్లగాఁ బ్రదక్షిణంబు గావించి జాజ్వల్యమానమై యున్న యగ్నిహోత్రము నొద్దకు వచ్చెను. ౨౨

సీతాదేవి దేవతలకును బ్రాహ్మణులకును నమస్కరించి యగ్నిసమీ

బద్ధాఞ్జలిపుటా చేద మువాచాగ్నిసమీపతః. ౨౩
యథా మే హృదయం నిత్యం నాపసర్పతి రాఘవాత్,
తథా లోకస్య సాక్షీ మాం సర్వతః పాతు పావకః. ౨౪

యథా మాం శుద్ధచారిత్రాం దుష్టాం జానాతి రాఘవః,
తథా లోకస్య సాక్షీ మాం సర్వతః పాతు పావకః. ౨౫

కర్మణా మనసా వాచా యథా నాతిచరామ్యహమ్,
రాఘవం సర్వధర్మజ్ఞం తథా మాం పాతు పావకః. ౨౬

ఆదిత్యో భగవా న్వాయు ర్దిశ శ్చన్ద్ర స్తథైవచ,
అహశ్చాపి తథా సన్ధ్యే రాత్రిశ్చ పృథివీ తథా. ౨౭
యథాఽన్యేపి విజానన్తి తథా చారిత్రసంయుతామ్,

ఏవ ముక్త్వా తు వైదేహీ పరిక్రమ్య హుతాశనమ్. ౨౮
వివేశ జ్వలనం దీప్తం నిస్సఙ్గేనాన్తరాత్మనా,

జన స్స సుమహాం స్త్రస్తో బాలవృద్ధసమాకులః. ౨౯
దదర్శ మైథిలీం తత్ర ప్రవిశన్తీం హుతాశనమ్,
సా తప్తనవహేమాభా తప్తకాఞ్చనభూషణా. ౩౦
పపాత జ్వలనం దీప్తం సర్వలోకస్య సన్నిధౌ,

దదృశు స్తాం మహాభాగాం ప్రవిశన్తీం హుతాశనమ్. ౩౧
సీతాం కృత్స్నాస్త్రయో లోకాః పుణ్యామాజ్యాహుతీ మివ,

కంబుఁజేరి చేమోడ్పుగీలించి యీమాటంబలికెను. ౨౩

నామనస్సు ఒకానొకప్పుడును రామునిఁదక్క మఱి యితరపురుషు నందుఁ జలింపదనుట వాస్తవమయగునేని లోకమునకంతయు సాక్షిభూతుఁడైన యీ యగ్నిహోత్రుఁడు నన్నన్నివిధంబుల రక్షించుఁగాక. ౨౪

నేను బరిశుద్ధమయిన నడవడిగలదాననేయయి నాయందు రామునకుం దోఁచినదోషము అవాస్తవమే యయినయెడ సమస్తలోకంబులును గావించు పుణ్యపాపంబులకు సాక్షిభూతుండగు నగ్నిహోత్రుండు నన్నన్ని విధంబుల రక్షించుఁగాక. ౨౫

నేను మనసునను గర్మంబునను వాక్కునను రాముని నతిక్రమింపకయుం నొండుపురుషులంజూడకయుం నుందునేని సమస్తలోకసాక్షియగు నీయగ్నిహోత్రుఁడు నన్ను రక్షించుఁగాక. ౨౬

భగవంతుఁడు సూర్యుండును వాయువును దిశలును జంద్రుండును బవలు రాత్రియుఁ బ్రాతస్సాయంసంధ్యలును భూమియు మఱియు నితరదేవతలును నన్నుఁ బాతివ్రత్యముగలదానిఁగా నంగీకరింతురేని యీయగ్నిహోత్రుఁడు నన్ను రక్షించుఁగాక. అని సీతాదేవి పలికెను. ౨౭

సీతాదేవి యివ్విధంబునం బలికి యయ్యగ్నిహోత్రమునకుఁ బ్రదక్షిణంబు గావించి శరీరమందొంతమాత్రమాసక్తిలేనిదై మండుచున్నయగ్నిలోఁ బ్రవేశించెను. ౨౮

బాలవృద్ధులతోఁ గూడిన యచ్చటనుండు మహాజన సమూహమంతయుం భయాకులితంబయి సీతాదేవి యగ్నిం బ్రవేశించుటను జూచెను. ౨౯

తప్తకాంచనవర్ణయగు బంగారుభూషణంబులను ధరించినదియునగు సీతాదేవి సమస్తలోకంబులు సూచుచుండ జ్వలించుచున్న యగ్నిహోత్రంబునం బడెను. ౩౦

మహాభాగ్యసంపన్నయగు సీతాదేవి పావనమయిన యాజ్యాహుతియట్లు అగ్నింబడునపుడు మూఁడులోకంబులుం జూచినవి. ౩౧

ప్రచుక్రుశుః స్త్రియ స్సర్వా స్తాం దృష్ట్వా హవ్యవాహనే. ౩౨
పతన్తీం సంస్కృతాం మన్త్రై ర్వసోర్ధారామివాధ్వరే,

దదృశు స్తాం త్రయో లోకా దేవగన్ధర్వదానవాః. ౩౩
శప్తాం పతన్తీం నిరయే త్రిదివా ద్దేవతా మివ,

తస్యా మగ్నిం విశన్త్యాం తు హాహేతి విపులః స్వనః. ౩౪
రక్షసాం వానరాణాం చ సంబభూవాద్భుతోపమః.

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే - ఏకోనవింశత్యుత్తరశతతమస్సర్గః.

---

## వింశత్యుత్తరశతతమస్సర్గః.

తతో హి దుర్మనా రామః శ్రుత్వైవ వదతాం గిరః,
దధ్యౌ ముహూర్తం ధర్మాత్మా బాష్పవ్యాకులలోచనః. ౧

తతో వైశ్రవణో రాజా యమ శ్చామిత్రకర్శనః,
సహస్రాక్షో మహేన్ద్రశ్చ వరుణశ్చ పరంతపః. ౨
షడర్ధనయన శ్శ్రీమా న్మహాదేవో వృషధ్వజః,
కర్తా సర్వస్య లోకస్య బ్రహ్మా బ్రహ్మవిదాం వరః. ౩
ఏతే సర్వే సమాగమ్య విమానై స్సూర్యసన్నిభైః,
ఆగమ్య నగరీం లఙ్కా మభిజగ్ముశ్చ రాఘవమ్. ౪
తత స్సహస్తాభరణాన్ ప్రగృహ్య విపులా న్భుజాన్,
అబ్రువం స్త్రిదశశ్రేష్ఠా ప్రాఞ్జలిం రాఘవం స్థితమ్. ౫

కర్తా సర్వస్య లోకస్య శ్రేష్ఠో జ్ఞానవతాం వరః,
ఉపేక్షసే కథం సీతాం పతన్తీం హవ్యవాహనే. ౬

స్త్రీలందఱు యజ్ఞంబున మంత్రపూర్వకముగా వ్రేల్వఁబడు నిరంత రాజ్యధారవలె యా సీత పెనుమంటలతో మండుచున్న యగ్నిం బడుటను జూచి యాక్రందనంబు గావించిరి. ३౨

స్వర్గమునందును భూలోకంబునందును పాతాళంబునందు నుండునట్టి దేవతలును గంధర్వులును దానవులును మహర్షి శాపంబున స్వర్గంబునుండి భూమింబడు దేవతవోలె నగ్నియందుఁ బడుచున్న యాసీతాదేవిం జూచిరి.

సీత యగ్నిప్రవేశము సేయునప్పుడు రాక్షసులును వానరులును ఆశ్చర్యంబు గలుగునట్లు మహాధ్వనిచే హాహాకారంబులు గావించిరి. ३४

ఇది నూటపందొమ్మిదవసర్గము.

---

## నూటయిరువదవసర్గము.

అంత ధర్మాత్ముఁడగు రాముఁడు సమస్తజనుల హాహాకారంబులు వినుచును దుఃఖితుఁడై కన్నులనిండ నీళ్లుగాఱఁ గొంతసేపు చింతాక్రాంతుఁడై యుండెను. ౧

అంత రాజరాజు కుబేరుండును శత్రుసంహర్తయగు యముండును సహస్రాక్షుండగు దేవేంద్రుఁడును శత్రువుల వధించునట్టి వరుణుండును శ్రీమంతుండును వృషధ్వజుండునగు ముక్కంటియయిన యీశ్వరుండును సమస్తలోకంబులను సృజించువాఁడును బ్రహ్మవేత్తలలో శ్రేష్ఠుండు నగు బ్రహ్మదేవుండును వీర లందఱు సూర్యసమానంబులగు విమానంబులచే లంకాపురికిఁ జేరి రాముని యొద్దకు వచ్చిరి. ౨, ४

అంత నా బ్రహ్మాదిదేవతలు తమయెదుటఁ జేతులు మోడ్చి నిలుచున్న రాముం జూచి కంకణాద్యాభరణంబులతో నొప్పునట్టి తమదీర్ఘ బాహువులం బైకెత్తి యిట్లని పలికిరి. ౫

నీవు సమస్తలోకంబులకును గర్తవు. సర్వోత్తముఁడవు. జ్ఞానవంతులలో నెల్ల మేటియయినవాఁడవు. ఇట్టి నీవు సీత యగ్నిలోఁ బడుచుండఁగా నెట్లుపేక్షించుచుంటివి? ౬

కథం దేవగణశ్రేష్ఠ మాత్మానం నావబుధ్యసే,

ఋతధామా వసుః పూర్వం వసూనాం త్వం ప్రజాపతిః. ౭

త్రయాణాం త్వం హి లోకానా మాదికర్తా స్వయంప్రభుః,
రుద్రాణా మష్టమో రుద్ర స్సాధ్యానా మపి పఞ్చమః. ౮

అశ్వినౌ చాపి తే కర్ణౌ చన్ద్రసూర్యౌ చ చక్షుషీ,
అన్తే చాదౌ చ లోకానాం దృశ్యసే త్వం పరంతప!. ౯

ఉపేక్షసే చ వైదేహీం మానుషః ప్రాకృతో యథా,

ఇత్యుక్తో లోకపాలైస్తై స్స్వామీ లోకస్య రాఘవః. ౧౦
అబ్రవీ త్త్రిదశశ్రేష్ఠా న్రామో ధర్మభృతాం వరః,

ఆత్మానం మానుషం మన్యే రామం దశరథాత్మజమ్. ౧౧
యోఽహం యస్య యత శ్చాహం భగవాం స్తద్బ్రవీతు మే,

ఇతిబ్రు(వ న్తం)వాణం కాకుత్స్థం బ్రహ్మా బ్రహ్మవిదాం వరః. ౧౨
అబ్రవీ చ్ఛృణు మే రామ! సత్యం సత్యపరాక్రమ,

భవాన్నారాయణో దేవశ్శ్రీమాం శ్చక్రాయుధో విభుః. ౧౩
ఏకశృఙ్గో వరాహ స్త్వం భూతభవ్యసపత్నజిత్,

సమస్తదేవతలలోను నీవ యుత్తముఁడ వన్నసంగతి నీకే యెట్లు తెలియకపోయెను ?

నీవు మున్ను అష్టవసువులలో ప్రజాపతియగు ఋతధామయను పేరు గల వసువుగా నుంటివి. ౭

నీవే గదా ముల్లోకములకు నాదికర్తవు. పరమస్వతంత్రుఁడవు. సర్వనియామకుఁడవు. అష్టరుద్రమూర్తులలో నెనిమిదవమూర్తియయిన మహాదేవుఁడవు. సాధ్యులలో వీర్యవంతుఁడనంబడు నైదవవాఁడవు. ౮

శత్రువులం దపింపఁజేయునట్టి రామఁడా ! నీకు అశ్వినిదేవతలు చెవులును, ఇంద్రసూర్యులు నేత్రములునై యుందురు. లోకముల సృష్టికి ముందును నాశమునకుఁ బిమ్మటను నివొక్కఁడవె గానంబడుదువు. ౯

అట్టి సర్వేశ్వరుఁడవు సర్వశక్తివి సర్వజ్ఞుఁడవు నీవు ఏమియుం దెలియని మనుష్యుని యట్లు సీతాదేవి యగ్నిలోఁ బడుచుండఁగా నెట్లుపాకర యుంటివి ? అని బ్రహ్మదేవుఁడు మున్నగువారలు రామునితోఁ జెప్పిరి.

లోకనాథుఁడును ఎల్లధార్మికులలో నుత్తముండును (ఎల్లధర్మధరులలో నుత్తముఁడు) నగు రఘువీరుఁడు రాముండు ఆ లోకపాలురవచనంబు విని సర్వజీవోత్తములగు వారలంజూచి యిట్లని చెప్పెను. ౧౦

నేను దశరథకుమారుఁ డగు రాముఁడననియె తలంచుచున్నాను; నేను బరమార్థంబున నెవ్వఁడను, ఏ సంబంధంబున ఎందుకొఱకు ఇచటఁ బుట్టితినో ఆవివరమునంతయు నాకు భగవంతుఁడగు బ్రహ్మదేవుండు చెప్పవలయును. అని రాముండు పలికెను. ౧౧

ఇట్లు రాముఁడు అడుగుటయుం బ్రహ్మవేత్తలలో నగ్రగణ్యుండగు బ్రహ్మదేవుఁడు అతనింజూచి యిట్లనియె; సత్యపరాక్రముఁడవగు రాముఁడా ! నేను యథార్థంబుఁ జెప్పెదను వినుము. ౧౨

నీవు సాక్షాన్నారాయణుఁడవు, స్వయంప్రకాశస్వరూపుఁడవు (సృష్టిస్థితిసంహారములు లీలగాఁగలవాఁడవు) ఎల్లప్పుడును లక్ష్మితోఁగూడియుండు వాఁడవు (సర్వాధికుండవు), సుదర్శనచంక్రం బాయుధముగాఁ దాల్చియుం

అక్షరం బ్రహ్మ సత్యం చ మధ్యే చాన్తే చ రాఘవ!. ౧౪
లోకానాం త్వం పరో ధర్మో విష్వక్సేన శ్చతుర్భుజః,

శార్ఙ్గధన్వా హృషీకేశః పురుషః పురుషోత్తమః. ౧౫
అజితః ఖడ్గధృద్విష్ణుః కృష్ణ శ్చైవ బృహద్బలః,

సేనానీ ర్గ్రామణీ శ్చ త్వం బుద్ధి స్సత్త్వం క్షమా దమః. ౧౬
ప్రభవశ్చాప్యయశ్చ త్వముపేన్ద్రో మధుసూదనః,

ఇన్ద్రకర్మా మహేన్ద్ర స్త్వం పద్మనాభో రణాన్తకృత్. ౧౭
శరణ్యం శరణం చ త్వా మాహు ర్దివ్యా మహర్షయః,

సహస్రశృఙ్గో వేదాత్మా శతజిహ్వో మహర్షభః. ౧౮
త్వం త్రయాణాం హి లోకానా మాదికర్తా స్వయంప్రభుః,

సిద్ధానా మపి సాధ్యానా మాశ్రయ శ్చాసి పూర్వజః. ౧౯

మవు, సర్వలోకవ్యాపకుఁడవు, ఒకకొమ్ముగల ఆదివరాహమూర్తివి. లోక కంటకులగువారలను ఇదివఱకుండినవారిని ఇఁక రాఁబోవు వారిని సంహరించు వాఁడవు (కాలాత్మకుఁడవు, లోకకంటకుల సంహరించువాఁడవు). ౧౩

రాముఁడా ! నీవు నాశములేనిదియుం సర్వవ్యాపకమును ప్రణవ వాచ్యమును సత్యమును నిత్యమునగు బ్రహ్మమవు, లోకములకంతయుఁ బరమ ప్రాప్యుఁడవు, సర్వలోకస్వామివి, నాలుగుచేతులుగలవాఁడవు. ౧౪

నీవు శార్ఙ్గమను ధనువు దాల్చువాఁడవు, సమస్తేంద్రియములకు నియంతవు పురుషుఁడవు, పురుషోత్తముఁడవు. ఎవ్వరును బరాజయం బెఱుంగని వాఁడవు, నందకంబను ఖడ్గంబు ధరించువాఁడవు, వ్యాపనశీలుండవు, భూమికి భారంబుఁబాపి యూఱట గల్గించువాఁడవు. మహాబలంబుగలవాఁడవు. ౧౫

నీవు దేవసేనల నడపించి దేవకార్యముల నిర్వహించువాఁడవు. ప్రాణి వర్గంబునకుఁ దత్తత్కర్మానుగుణ ఫలంబుల నొసంగువాఁడవు, బుద్ధి చిత్తశుద్ధి శమ యింద్రియనిగ్రహము వీటిని గల్గించువాఁడవు, ప్రపంచము నీయంద పుట్టును. నీయందలయము నొందును. నీవ యింద్రునితమ్ముఁడవు. నీవ మధువను నసుర వధించినవాఁడవు. ౧౬

నీవు ఐశ్వర్యముగలవాఁడవు, ఈశ్వరులకును ఈశ్వరుఁడవు, నాభి యందు నాయుత్పత్తిస్థానమయిన కమలముగలవాఁడవు, యుద్ధంబున శత్రువుల సంహరించువాఁడవు నీవ శరణంబొంద నర్హుండవనియుం రక్షకుండవనియుం దివ్యులగు సనకాదిమహర్షులు వచించెదరు. ౧౭

అనంతములయిన శాఖలను శిఖరములు గలదియు అనేకములయిన విధులను నాలుకలుగలదియుం బూజనీయంబును సమస్తకర్మజాలబోధకంబు నగు వేదము నీవే, నీవే ముల్లోకంబులను మొదలు సమష్టిగా సృజించినవాఁడవు. నీవ సమస్తప్రాణులను ప్రేరింతువుగాని నీవు వేఱే మఱియొకఁడు ప్రేరకుఁడు లేఁడు. ౧౮

ఆరాధింపఁదగిన సమస్తదేవతలును నీయందయుండురు. ముక్తులు నిన్నే

త్వం యజ్ఞ స్త్వం వషట్కార స్త్వ మోంకారః పరంతపః,
ప్రభవం నిధనం వా తే న విదుః కో భవా నితి. ౨౦

దృశ్యసే సర్వభూతేషు బ్రాహ్మణేషు చ గోషు చ,
దిక్షు సర్వాసు గగనే పర్వతేషు వనేషు చ. ౨౧

సహస్రచరణ శ్శ్రీమాన్ శతశీర్ష స్సహస్రదృక్,
త్వం ధారయసి భూతాని వసుధాం చ సపర్వతామ్. ౨౨

అన్తే పృథివ్యా స్సలిలే దృశ్యసే త్వం మహోరగః,
త్రీ న్లోకా న్ధారయ న్రామ! దేవగన్ధర్వదానవాన్. ౨౩

అహం తే హృదయం రామ! జిహ్వా దేవీ సరస్వతీ,
దేవా గాత్రేషు రోమాణి స్థితా స్తే బ్రహ్మణః ప్రభో!. ౨౪

నిమేష స్తే భవే ద్రాత్రి రున్మేష స్తే భవే ద్దివా,
సంస్కారా స్తేఽభవన్వేదా న తద స్తి త్వయా వినా. ౨౫
జగత్సర్వం శరీరం తే స్థైర్యం తే వసుధాతలమ్,
అగ్నిః కోపః ప్రసాద స్తే సోమ శ్శ్రీవత్సలక్షణః. ౨౬
త్వయా లోకా స్త్రయః క్రాన్తాః పురాణే విక్రమై స్త్రిభిః,

పొందుదురు. సృష్టికి ముందును ఉన్నవాఁడవు నీ వొకఁడవే. ౧౯

నీవు యజ్ఞరూపుఁడవు, నీవు "వషట్, ఆశ్రావయ, అస్తుశ్రౌషట్, యజ యేయజామహే" అను వానిచే నారాధ్యుఁడవు, నీవ ప్రణవశబ్దవాచ్యుఁడవు, మహాతపస్సు గావించిన వారుమాత్రము నిన్నెఱుంగుదురు. నీవు ఉత్పత్తి నాశములు లేనివాఁడవు, నీ వెవ్వఁడవో వేదములు గూడ నెఱుంగవు.

నిన్ను యోగులు సమస్తభూతంబులయందును విశేషించి గోబ్రాహ్మణులయందును సమస్తదిశలయందును ఆకాశమునందును బర్వతంబులయందును వనంబులయందును జూతురు. నీవు లేని దేదియు లేదు. ౨౧

నీవు లెక్కలేని పాదములును, లెక్కలేని శిరస్సులును, లెక్కలేని కన్నులును గలిగి యంతటను అన్నిరూపములతో వ్యాపించి యన్నిటిని సాక్షిగాఁ జూచుచున్నవాఁడవు, నీవ పర్వతసహితంబగు నీభూమిని ఇతర మహాభూతంబులను మోయుచున్నవాఁడవు. ౨౨

రామా! దైనందిన ప్రళయమునందు జలమధ్యంబున నాదిశేషశాయివై దేవతలుగంధర్వులు దానవులు నివసించు లోకంబులను స్వర్గభూమిపాతాళంబుల మూఁడింటిని ఉదరంబున ధరించుచున్న మార్కండేయాదులు కనుంగొనుదురు. ౨౩

సర్వలోక నాథుఁడవగు రాముఁడా! విరాడ్రూపుఁడవగు నీకు బ్రహ్మదేవుఁడను నేను హృదయముగాను సరస్వతీదేవి నాలుకగాను దేవత లందఱు నీ దేహమునందు రోమములుగాను అగుదుము. ౨౪

నీవు ఱెప్పమూసిన రాత్రియగును. నీవు కన్నుదెఱచినం బవలగును; నీ యూర్పులె వేదములయినవి. నీవు లేనిది ఏదియు లేదు. ౨౫

ఈ జగత్తంతయు నీకు శరీరమగును. ఎట్లనఁగా నీ కాఠిన్యాంశమె భూమి. నీ కోపమె యగ్ని. నీ ప్రసన్నతయె లక్ష్మీకరమయిన గుఱుతుగల చంద్రుఁడు. ౨౬

నీవు పూర్వము త్రివిక్రమావతారంబునొంది మూఁడడుగులచే ముల్లో

మహేన్ద్రశ్చ కృతో రాజా బలిం బద్ధ్వా మహాసురమ్. ౨౭

సీతా లక్ష్మీ ర్భవా న్విష్ణు ర్దేవః కృష్ణః ప్రజాపతిః,
వధార్థం రావణస్యేహ ప్రవిష్టో మానుషీం తనుమ్. ౨౮

తదిదం నః కృతం కార్యం త్వయా ధర్మభృతాం వర!,
నిహతో రావణో రామ! ప్రహృష్టో దివ మాక్రమ. ౨౯

అమోఘం బలవీర్యం తే అమోఘ స్తే పరాక్రమః,
అమోఘం దర్శనం రామ నచ మోఘ స్తవ స్తవ. 3౦

అమోఘా స్తే భవిష్యన్తి భక్తిమన్తశ్చ యే నరాః,

యే త్వాం దేవం ధ్రువం భక్తాః పురాణం పురుషోత్తమమ్. 3౧
ప్రాప్నువన్తి సదా కామా నిహ లోకే పరత్ర చ,

ఇమ మార్షం స్తవం నిత్య మితిహాసం పురాతనమ్. 3౨
యే నరాః కీర్తయిష్యన్తి నాస్తి తేషాం పరాభవః,

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే-వింశత్యుత్తరశతతమస్సర్గః. ౧౨౦.

కంబుల నాక్రమించి యసురరాజయిన మహాబలినిబంధించి దేవేంద్రుని దేవ లోకంబునకు రాజు గావించితివి. ౨౭

సీత సాక్షాల్లక్ష్మీదేవి, నీవు సృష్టిస్థితిలయకారణుండును భూనిర్వృతి ప్రదుండును సర్వలోకనాథుండునగు విష్ణుఁడవు. రావణుని వధించుటకై భూలోకంబున మనుష్యశరీరంబున నవతరించితివి. ౨౮

ఎల్లధార్మికులలో నుత్తముఁడవగు (సమస్త ధనుర్ధరులలో నుత్తముఁడ వగు) రామఁడా! నీవు ఎందుకుఁగా నవతరించితివో ఆ కార్యమే మా గావించితివి. రావణుని వధించినావు. ఇఁక సంతుష్టుండవై వైకుంఠమునకు రమ్ము. ౨౯

రాముఁడా! నీ బలంబును బరాక్రమంబును అమోఘములు. నీ దర్శ నంబు గావించినవారు సమస్తకర్మంబులు నశించి మోక్షంబు నొందుదురు. నిన్నుఁ గీర్తించుటయు స్తుతించుటయు మహాఫలప్రదములు. 30

నీయందు నిరంతరము భక్తిగల మనుష్యులు ఎంతమాత్రము అడ్డి లేక తమతమ యభిమతంబుల నొందఁగలరు.

పురాతనుండవు పురుషోత్తముఁడవునగు నీయందు నిశ్చలముగా భక్తి యుంచినవారలు, ఈ లోకంబున నవిచ్ఛిన్నముగా సమస్తభోగంబుల ననుభ వించుచుండి దేహావసానంబునఁ బరలోకంబునందు దివ్యభోగంబులం బొందఁ గలరు. ౩౧

వేదసిద్ధంబును బురాతనంబునగు నితిహాసరూపమయిన యీ స్తోత్ర మును ఎవ్వరు నిత్యంబుఁ గీర్తింతురో వారలకు ఎప్పుడును బరాభవంబు గలుగదు. అని బ్రహ్మదేవుండు రామునితోఁ బలికెను. ౩౨

ఇది నూటయిరువదవసర్గము.

ఏకవింశత్యుత్తరశతతమ స్సర్గః.

ఏతచ్ఛ్రుత్వా శుభం వాక్యం పితామహసమీరితమ్,
అఙ్కేనాదాయ వైదేహీ ముత్పపాత విభావసుః. ౧
స విధూయ చితాం తాం తు వైదేహీం హవ్యవాహనః,
ఉత్తస్థౌ మూర్తిమా నాశు గృహీత్వా జనకాత్మజామ్. ౨

తరుణాదిత్యసఙ్కాశాం తప్తకాఞ్చనభూషణామ్,
రక్తామ్బరధరాం బాలాం నీలకుఞ్చితమూర్ధజామ్. ౩
అక్లిష్టమాల్యాభరణాం తథారూపాం మనస్వినీమ్,
దదౌ రామాయ వైదేహీ మఙ్కే కృత్వా విభావసుః. ౪

అబ్రవీచ్చ తదా రామం సాక్షీ లోకస్య పావకః,

ఏషా తే రామ! వైదేహీ పాపమస్యా న విద్యతే. ౫

నైవ వాచా న మనసా నానుధ్యానా న్నచక్షుషా,
సువృత్తా వృత్తశౌణ్డీర! న త్వా మతిచచారహ. ౬

రావణేనాపనీతైషా వీర్యోత్సిక్తేన రక్షసా,
త్వయా విరహితా దీనా వివశా నిర్జనా ద్వనాత్. ౭

## నూటయిరువదియొకటవసర్గము.

బ్రహ్మదేవుండు రామునితోఁ బలికిన శుభంబగు నీ మాటను విని అగ్ని
హోత్రుండు సీతాదేవి నంకంబున నెత్తుకొని చితినుండి లేచివచ్చెను. ౧

ఆయ్యగ్నిహోత్రుఁడు చితిని జెల్లాచెదరు గావించి మానుషాకారంబు
నొంది జనకమహారాజపుత్త్రియగు సీతం దీసికొని శీఘ్రంబున నావిర్భ
వించెను. ౨

బాలసూర్యునివలె వెలుంగుచున్నదియు మంచిబంగారు భూషణంబులు
ధరించినదియు ఎఱ్ఱనిచీరఁ గట్టినదియు మందటికన్న యౌవనంబు నొంది
నట్లున్నదియు నల్లనికుటిలములయిన కేశములు గలదియు ఎంతమాత్రము
కందువోందని పూలమాలికతో నొప్పుచున్నదియు నగ్నిప్రవేశంబునకు మున్ను
ధరించి యుండిన యవ్విధంబునసె యెంతమాత్రము సెడకున్న మాల్యాభరణ
వస్త్రాంగరాగాదులచే వెలుంగుచున్నదియుఁ బ్రసన్నమయిన మనస్సుగలదియు
నగు సీదాదేవిని దనయంకంబున నుంచికొని యగ్నిహోత్రుండు రామున
కొసంగెను. ౪

అప్పుడు లోకములు గావించు సమస్త శుభాశుభ కర్మంబులను
సాక్షియై చూచుచుండునట్టి యగ్నిహోత్రుండు రాముం జూచి యిట్లని
పలికెను.

రాముఁడా! ఇదిగో నీపత్నియగు సీత; ఈబిడయెంతమాత్రము పాప
మెఱుఁగదు. ౫

సదాచారవంతుఁడను పేరునకుఁ గొఱఁత గలుగఁగూడదని ప్రియు
రాలిచేతను గూడ నగ్ని ప్రవేశము సేయించినట్టి సర్వోత్తముఁడా! ఈ సీత
వాక్కుచేఁగాని మనసుచేఁగాని సంకల్పముచేఁగాని కంటిచేఁగాని నిన్నుఁ
దప్ప మఱి యొండుపురుషు నెంతమాత్రము దలఁచినది కాదు. ౬

నీవు లేనప్పుడు ఈ బిడ దీనయయి పరవశయయి యుండఁగాఁ బరా
క్రమగర్వితుండగు రాక్షసుఁడు రావణుఁడు నిర్జనంబగు వనంబునుండి యీసీత

రుద్ధా చాన్తఃపురే గుప్తా త్వచ్చిత్తా త్వత్పరాయణా,
రక్షితా రాక్షసీసఙ్ఘై ర్వికృతై ర్ఘోరదర్శనైః. ౮

ప్రలోభ్యమానా వివిధం భర్త్స్యమానా చ మైథిలీ,
నాచిన్తయత తద్రక్ష స్త్వద్గతే నాన్తరాత్మనా. ౯

విశుద్ధభావాం నిష్పాపాం ప్రతిగృహ్ణీష్వ రాఘవ!,
న కిఞ్చి దభిధాతవ్యా మహ మాజ్ఞాపయామి తే. ౧౦

తతః ప్రీతమనా రామ శ్శ్రుత్వైత ద్వదతాం వరః,
దధ్యౌ ముహూర్తం ధర్మాత్మా బాష్పవ్యాకులలోచనః. ౧౧

ఏవ ముక్తో మహాతేజా ధృతిమా న్దృఢవిక్రమః,
అబ్రవీ త్త్రిదశశ్రేష్ఠం రామో ధర్మభృతాం వరః. ౧౨

అవశ్యం త్రిషు లోకేషు న సీతా పాప మర్హతి,
దీర్ఘకాలోషితా హీయం రావణాన్తఃపురే శుభా. ౧౩
బాలిశఃఖలు కామాత్మా రామో దశరథాత్మజః,
ఇతి వక్ష్యన్తి మాం సన్తో జానకీ మవిశోధ్య హి. ౧౪

అనన్యహృదయాం భక్తాం మచ్చిత్తపరివర్తినీమ్,
అహ మప్యవగచ్ఛామి మైథిలీం జనకాత్మజామ్. ౧౫

నపహారించెను. ౭

రావణుండు ఈసీతను అంతఃపురంబునునుంచి వికృతాంగులును జూపరులకు భయంబు గలిగించువారలునగు రాక్షసస్త్రీలఁ బెక్కండ్ర నీబిడకుఁ గావలియుంచి యెంతనిర్బంధించినను ఈబిడ నిన్నేపరమగతిగా భావించి నీయందె మనస్సునుంచి యుండెను. ౮

రావణుండు ధనకనకవస్తువాహనరాజ్యాదు లిచ్చెదనని యెంత ప్రలోభించినను నిన్ను చంపెదనని మొదలుగా నెంతబెదరించినను ఈసీత మనస్సున నిన్నె ధ్యానించుచుండెంగాని రావణు నెంతమాత్రము తలంచినది కాదు. ౯

రాముఁడా! పరిశుద్ధమయిన హృదయముగలది పాపరహితయగు నీ సీతం బ్రతిగ్రహింపుము. నామాటకు బదులుచెప్పఁగూడదు. నేను నీ కాజ్ఞాపించెదను. అని యగ్నిదేవుఁడు రామునితోఁ జెప్పెను. ౧౦

అంత ధర్మాత్ముఁడును మాటలుచెప్పుటయందు సమర్థుండునగు రాముండు అగ్నివచనంబు విని తనభార్య నిర్దోషురాలని వక్కాణించుటకుఁ బరమప్రీతుండై యట్టి దానను ఇన్నిమాటలాడి యగ్నిప్రవేశంబు సేయునట్లు గావించితిఁగదా యని కన్నుల నీళ్లుగాఱఁ గొంతసేపు చింతించుచుండెను. ౧౧

మహాప్రభావుండును గాంతిమంతుండును దృఢమయిన పరాక్రమంబు గలవాఁడును బరమధార్మికుండునగు రాముండు అగ్నివచనంబు విని దేవశ్రేష్ఠుండగు నగ్నింజూచి (బ్రహ్మదేవుంజూచి) యిట్లని పలికెను. ౧౨

మూఁడులోకంబులందును సీత పాపము లేని దనుట వాస్తవమె. అయితే సదాచారసంపన్న యగు నీబిడ రావణునింట బహుకాల ముండినది. ౧౩

నేను సీతను బరిశోధింపకయ గ్రహించియుందునేని పెద్దలు నన్ను "దశరథమహారాజంతటివానికిఁ బుట్టి రాముండు మూఢుఁడును గాముకుఁడునే గాని యెంతమాత్రము ధర్మచింతగలవాఁడు కాఁడయ్యె" అని నిందింతురు.

జనకమహారాజునకుఁ గుమార్తెయయిన దానికిఁగూడ ఆచారము మఱియొకరు చెప్పవలెనా? సీత నాయందె మనస్సుంచినదనియు నాయందు

ప్రత్యయార్థం తు లోకానాం త్రయాణాం సత్యసంశ్రయః,
ఉపేక్షే చాపి వైదేహీం ప్రవిశన్తీం హుతాశనమ్. ౧౬

ఇమా మపి విశాలాక్షీం రక్షితాం స్వేన తేజసా,
రావణో నాతివర్తేత వేలామివ మహోదధిః. ౧౭

న హి శక్తస్సదుష్టాత్మా మనసాపి హి మైథిలీమ్,
ప్రధర్షయితు మప్రాప్తాం దీప్తా మగ్నిశిఖా మివ. ౧౮

నేయ మర్హతి చైశ్వర్యం రావణాన్తఃపురే శుభా,
అనన్యా హి మయా సీతా భాస్కరేణ ప్రభా యథా. ౧౯

విశుద్ధా త్రిషు లోకేషు మైథిలీ జనకాత్మజా,
న హి హాతుమియం శక్యా కీర్తి రాత్మవతా యథా. ౨౦

అవశ్యం తు మయా కార్యం సర్వేషాం వో వచశ్శుభమ్,
స్నిగ్ధానాం లోకమాన్యానా మేవం చ బ్రువతాం హితమ్. ౨౧

ఇతీద ముక్త్వా విదితం మహాబలైః
ప్రశస్యమాన స్స్వకృతేన కర్మణా,
సమేత్య రామః ప్రియయా మహాబల
స్సుఖం సుఖార్హోఽనుబభూవ రాఘవః. ౨౨

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే ఏకవింశత్యుత్తరశతతమస్సర్గః. ౧౨౧.

మిక్కిలియుం భక్తిగల దనియును నామనస్సు ననుసరించునదియే కాని యెంత మాత్రము స్వతంత్రవ్యాపారము లేదనియును నాకునుం దెలియును. ౧౫

అయితే నేను సత్యమునే యవలంబించినవాఁడను గావున సత్యము చక్కఁగా బయలుపడుటకైయును ముల్లోకంబులవారికిని నమ్మకము గల్గుటకై యును సీత యగ్నిం బ్రవేశించుచుండఁగా నుపేక్షించుచుంటిని. ౧౬

నిజప్రభావంబుచేతనె సురక్షితయయి యున్న విశాలాక్షియగు నీ సీతను గూడ రావణుండు అతిక్రమింపఁజాలునా, సముద్రంబు చెలియలికట్ట నతిక్రమింపఁజాలనట్లు ఎంతమాత్రము అతిక్రమింపఁజాలఁడు. ౧౭

చెనకుటకేని యలవిగాని యీ సీతను దురాత్ముండగు రావణుండు మనస్సుచేనైనను అతిక్రమింపఁ జాలఁడు. మండుచున్న యగ్నిజ్వాలను ఎవ్వఁడు స్పృశించును? ౧౮

సర్వమంగళగుణములఁగల సీత రావణాంతఃపురమునందలి యైశ్వర్యము నెంతమాత్రము కోరదు. ఏలయనఁగా సూర్యునికంటెఁ గాంతిభిన్న కానట్లు సీత నాకన్న నెంతమాత్రము భిన్నగాదు. ౧౯

ముల్లోకంబులయందును అందఱికన్నఁ బరిశుద్ధురాలగు జనకమహా రాజపుత్త్రి యీసీతను బరిత్యజించుటకు బుద్ధిమంతునకు కీర్తిని విడువ శక్యము గానట్లు నాకెంతమాత్ర మశక్యముగాదు. ౨౦

మీరు లోకపూజ్యులరు. నాయందు స్నేహముగలవారలు. నాకు ఇట్లు హితం బుపదేశించుచున్నవారలు. అట్టి మీయందఱి వచనంబు నాకు క్షేమకరము గావున నే నవశ్యము అట్లు లాచరింపవలెను. అని రాముఁడు పలికెను.

మహాబలశాలియు సుఖము ననుభవింపనే దగినవాఁడునగు రాముఁడు ఇవ్విధంబున శాస్త్రీయంబగు వచనంబుఁబలికి మహాబలసంపన్నులగు నా బ్రహ్మాదులు దాను గావించిన కార్యంబునకుఁ దన్నుఁ బ్రస్తుతింపఁ బ్రియురాలిం గూడి సుఖంబు నొందెను. ౨౧

ఇది నూటయిరువదియొకటవసర్గము.

## ద్వావింశత్యుత్తరశతతమ స్సర్గః.

ఏతచ్ఛ్రుత్వా శుభం వాక్యం రాఘవేణ సుభాషితమ్,
ఇదం శుభతరం వాక్యం వ్యాజహార మహేశ్వరః. ౧
పుష్కరాక్ష! మహాబాహో! మహావక్షః! పరంతప!,
దిష్ట్యా కృత మిదం కర్మ త్వయా శస్త్రభృతాం వర!. ౨

దిష్ట్యా సర్వస్య లోకస్య ప్రవృద్ధం దారుణం తమః,
అపావృత్తం త్వయా సంఖ్యే రామ రావణజం భయమ్. ౩

ఆశ్వాస్య భరతం దీనం కౌసల్యాం చ యశస్వినీమ్,
కైకేయీం చ సుమిత్రాం చ దృష్ట్వా లక్ష్మణమాతరమ్. ౪
ప్రాప్య రాజ్య మయోధ్యాయాం నన్దయిత్వా సుహృజ్జనమ్,
ఇక్ష్వాకూణాం కులే వంశం స్థాపయిత్వా మహాబల!. ౫
ఇష్ట్వా తురగమేధేన ప్రాప్య చానుత్తమం యశః,
బ్రాహ్మణేభ్యో ధనం దత్త్వా త్రిదివం గన్తు మర్హసి. ౬

ఏష రాజా విమానస్థః పితా దశరథ స్తవ,
కాకుత్స! మానుషే లోకే గురు స్తవ మహాయశాః. ౭

ఇన్ద్రలోకం గత శ్శ్రీమాం స్త్వయా పుత్త్రేణ తారితః,
లక్ష్మణేన సహ భ్రాత్రా త్వమేన మభివాదయ. ౮

మహాదేవవచశ్శ్రుత్వా కాకుత్స్థ స్సహలక్ష్మణః,
విమానశిఖరస్థస్య ప్రణామ మకరో త్పితుః. ౯

## నూటయిరువదిరెండవసర్గము.

రాముఁడు పలికిన యాశుభవాక్యంబువిని శివుఁడు రామునింజూచి యింతకన్న శుభంబగు నీమాటంబలికెను. ౧

కమలంబులవంటి కన్నులు గలవాఁడా! ఆజానుబాహుఁడా! విశాలంబగు వక్షంబుగలవాఁడా! శత్రువుల వధించువాఁడా! ఆయుద్ధంబు పట్టినవారిలో నెల్ల నుత్తముఁడా! భాగ్యవశంబున నీవీరావణుని వధించితివి. ౨

రాముఁడా! సమస్తలోకంబులకును గల్గిన రావణభయంబను గాఢాంధకారంబును నీవిప్పుడు భాగ్యవశంబునం జేసి యుద్ధంబున రావణునివధించి పోఁగొట్టితివి.

మహాబలుఁడవగు రాముఁడా! నీవు అయోధ్యకుఁబోయి దుఃఖితుఁడై నీరాకకెదురు సూచుచున్న భరతునాశ్వాసించి యశస్వినియగు కౌసల్యను గైకేయిని లక్ష్మణమాతయగు సుమిత్రను సందర్శించి రాజ్యంబునం బట్టాభిషిక్తుండవై బంధువులనెల్ల సంతోషపఱిచి యిక్ష్వాకుకులంబునకు సంతానంబు గలిగించి పుత్త్రవంతుఁడవై యశ్వమేధంబున సురల సంతృప్తులంజేసి స్థిరంబగు కీర్తినొంది బ్రాహ్మణులకుఁ గావలసిన ధనంబొసంగి యంత వైకుంఠంబు నొందుము. ౪-౬

రాముఁడా! మనుష్యలోకంబున నీకుఁ దండ్రియయినవాఁడును మహాయశస్సంపన్నుఁడునగు దశరథమహారాజు ఇదిగో స్వర్గంబునుండి విమానారూఢుండై వచ్చియున్నాఁడు చూడుము. ౭

శ్రీమంతుఁడగు నీ దశరథమహారాజు, కుమారుఁడవగు నీచే నసత్యదోషంబు పొరయకుండునట్లు చేయఁబడినవాఁడై యింద్రలోకంబునొందెను. నీవును నీతమ్ముఁడు లక్ష్మణుఁడును ఇతనికి నమస్కారము గావింపుఁడు. అని శివుఁడు రామునితోఁ జెప్పెను. ౮

శివుఁడు వచించినదివిని రాముఁడును లక్ష్మణుఁడును విమానశిఖరంబుననున్న తండ్రి దశరథమహారాజునకు నమస్కారంబు గావించిరి. ౯

దీప్యమానం స్వయా లక్ష్మ్యా విరజోమ్బరధారిణమ్,
లక్ష్మణేన సహ భ్రాత్రా దదర్శ పితరం విభుః. ౧౦

హర్షేణ మహతాఽఽవిష్టో విమానస్థో మహీపతిః,
ప్రాణైః ప్రియతరం దృష్ట్వా పుత్త్రం దశరథ స్తదా. ౧౧
ఆరోప్యాఙ్కం మహాబాహు ర్వరాసనగతః ప్రభుః,
బాహుభ్యాం సంపరిష్వజ్య తతో వాక్యం సమాదదే. ౧౨
న మే స్వర్గో బహుమత స్సంమానశ్చ సురర్షిభిః,
త్వయా రామ! విహీనస్య సత్యం ప్రతిశృణోమి తే. ౧౩

అద్య త్వాం నిహతామిత్రం దృష్ట్వా సంపూర్ణమానసమ్,
నిస్తీర్ణవనవాసం చ ప్రీతి రాసీ త్పరా మమ. ౧౪

కైకేయ్యా యాని చోక్తాని వాక్యాని వదతాం వర!,
తవ ప్రవ్రాజనార్థాని స్థితాని హృదయే మమ. ౧౫

త్వాం తు దృష్ట్వా కుశలినం పరిష్వజ్య సలక్ష్మణమ్,
అద్య దుఃఖా ద్విముక్తోఽస్మి నీహారా దివ భాస్కరః. ౧౬

తారితోఽహం త్వయా పుత్త్ర! సుపుత్త్రేణ మహాత్మనా,
అష్టావక్రేణ ధర్మాత్మా తారితో బ్రాహ్మణో యథా. ౧౭

ఇదానీం తు విజానామి యథా సౌమ్య! సురేశ్వరైః,
వధార్థం రావణస్యేదం విహితం పురుషోత్తమ!. ౧౮

లోకనాథుఁడగు రాముఁడును లక్ష్మణుఁడును దన దివ్యదేహలక్ష్మిచే వెలుంగుచు దివ్యములయిన వస్త్రంబుల ధరించియున్న తండ్రినిదశరథుని సందర్శించిరి ౧౦

అప్పుడు విమానంబునం దుత్తమాసనంబునఁ గూర్చుండియున్న మహాబాహుండగు దశరథమహారాజు తనకు ప్రాణంబులకన్నఁ బ్రియుండయిన కొడుకును రామునింజూచి తన యంకంబునం జేర్చి రెండుచేతులంగ్రుచ్చి కవుఁగిలించి యంత నీమాటంబలికెను. ౧౧,౧౨

రాముఁడా! నిన్నువిడిచియుండుటవలన నాకు ఈస్వర్గసౌఖ్యములు గాని యీదేవర్షులు గావించు గౌరవముగాని యొంకమాత్రము సంతోషము గలిగింపకున్నవి. ఇదిసత్యము నీకుఁ బ్రతిజ్ఞచేఁ జెప్పుచున్నాను. ౧౩

ఇప్పుడు శత్రువుల వధించి వనవాసప్రతిజ్ఞ సంపూర్ణముగా నెఱవేర్చి పరమసంతుష్టుండవైన నిన్నుఁజూడఁగా నాకుఁ బరమప్రీతియగుచున్నది. ౧౪

మాటలు చెప్పువారిలో నుత్తముఁడా! నిన్ను అడవికిఁ బంపుమని కైకేయి యేయేమాటలు చెప్పినదో అవియన్నియు నింక నామనసుననుండి నన్ను బాధించుచునే యున్నవి. ౧౫

లక్ష్మణసహితంబుగా క్షేమంబున నున్న నిన్నుఁజూచి కౌఁగిలించుకొన్న పిమ్మట ఇప్పుడు అదుఃఖమునుండి మంచుచుండి సూర్యుఁడు విడువఁబడునట్లు విడువఁబడితిని. ౧౬

పుత్త్రుఁడా! మున్ను అష్టావక్రుఁడు తనతండ్రియగు నేకపాదుని జనకసభయందు వరుణపుత్త్రుండగు వందిచే వాదంబునఁ బరాజితుఁడై యున్న వానిని దాను వాదంబున వందినిజయించి తరింపఁజేసినట్లు మహాత్ముఁడగు నీవు సత్యపాశబద్ధుండనగు నన్నుఁ దరింపఁజేసితివి. ౧౭

సౌమ్యుఁడవు పురుషోత్తముఁడవగు రాముఁడా! దేవతలె రావణవధంబు గావలెనని యప్పుడు నీపట్టాభిషేకమునకు విఘ్నము మొదలయినవి గావించిరని నాకిప్పుడు తెలిసినది. ౧౮

సిద్ధార్థా ఖలు కౌసల్యా యా త్వాం రామ! గృహాగతమ్,
వనాన్నివృత్తం సంహృష్టా ద్రక్ష్యత్యరినిషూదన!. ౧౯

సిద్ధార్థాః ఖలు తే రామ! నరా యే త్వాం పురీం గతమ్,
జలార్ద్ర మభిషిక్తం చ ద్రక్ష్యన్తి వసుధాధిపమ్. ౨౦

అనురక్తేన బలినా శుచినా ధర్మచారిణా,
ఇచ్ఛామి త్వా మహం ద్రష్టుం భరతేన సమాగతమ్. ౨౧
చతుర్దశసమాస్సౌమ్య! వనే నిర్యాపితా స్త్వయా,
వసతా సీతయా సార్ధం లక్ష్మణేన చ ధీమతా. ౨౨
నివృత్తవనవాసోఽపి ప్రతిజ్ఞా సఫలా కృతా,
రావణం చ రణే హత్వా దేవా స్తే పరితోషితాః. ౨౩
కృతం కర్మ యశ శ్లాఘ్యం ప్రాప్తం తే శత్రుసూదన!,
భ్రాతృభి స్సహ రాజ్యస్థో దీర్ఘ మాయు రవాప్నుహి. ౨౪

ఇతి బ్రువాణం రాజానం రామః ప్రాఞ్జలి రబ్రవీత్,

కురు ప్రసాదం ధర్మజ్ఞ! కైకేయ్యా భరతస్య చ. ౨౫
సపుత్త్రాం త్వాం త్యజామీతి యదుక్తా కైకయీ త్వయా,

స శాపః కైకయీం ఘోర స్సపుత్త్రాం న స్పృశే త్ప్రభో!. ౨౬

శత్రువుల వధించునట్టి రామునఁడా! కౌసల్య వనంబుననుండి గృహంబున కు వచ్చిన నిన్నుఁజూచి సంతోషంబు నొందఁగలదు కావున ఆబిడ కృతార్థు రాలు. ౧౯

రాముఁడా! వనంబునుండి పురమునకుఁబోయి పట్టాభిషిక్తుండయి యభిషేకజలంబుల తడితో నప్పుడ భూనాథుండవై యలరుచున్ననిన్నుఁ జూడఁగలమనుష్యులందఱు కృతార్థులు. ౨౦

నీయందు భక్తిగలవాఁడు బలవంతుండు పరిశుద్ధుఁడు ధార్మికుఁడునగు భరతునితో సమాగతుండవైన నిన్నుఁ జూడఁగోరెదను. ౨౧

సౌమ్యుఁడా! నీవు సీతతోను బుద్ధిమంతుండగు లక్ష్మణునితోనుంగూడ నరణ్యంబున వాసము సేయుచుఁ బదునాలుగేండ్లునుంగడిపితివి. ౨౨

నీవు వనవాసంబు నెఱవేర్చితివి నీప్రతిజ్ఞను సఫలము గావించుకొంటివి. యుద్ధంబున రావణునివధించి దేవతలనందఱ సంతోషపఱచితివి. ౨౩

శత్రువుల వధించునట్టి రామునఁడా! చేయవలసినకార్యము చేసితివి. శ్లాఘనీయమయిన కీర్తిఁబొందితివి. ఇఁక రాజ్యంబునందుఁ బట్టాభిషిక్తుండవై దీర్ఘాయుస్సు నొంది తమ్ములతోఁగూడ సుఖముగానుండుము. అని దశరథుండు రామునకుఁజెప్పెను. ౨౪

దశరథమహారాజు ఇవ్విధంబున నానతిచ్చుటయు రాముండు చేమోడ్పుగీలించి యతనితో నిట్లనియెను

సమస్తధర్మంబులను దెలిసినవాఁడా! నీవు "రామునివనవాసంబునకుఁ బంపుమన్న పక్షమునకు నిన్ను నీకొడుకును గూడఁ బరిత్యజించెదను" అని కైకేయితో శపథము చేసితివే, ఇప్పుడు కైకేయియందును భరతునియందును అనుగ్రహము సేయుము. ౨౫

రాజా! భయంకరమయిన యాశాపము, కైకేయిని ఆమెకొడుకు భరతుని ధ్వంకకుండునట్లు అనుగ్రహింపుము. అని రాముఁడు తండ్రితోఁబలికెను. ౨౬

స తథేతి మహారాజో రామ ముక్త్వా కృతాఞ్జలిమ్,
లక్ష్మణం చ పరిష్వజ్య పునర్వాక్య మువాచ హ. ౨౭

రామం శుశ్రూషతా భక్త్యా వైదేహ్యా సహ సీతయా,
కృతా మమ మహాప్రీతిః ప్రాప్తం ధర్మఫలం చ తే. ౨౮
ధర్మం ప్రాప్స్యసి ధర్మజ్ఞ యశశ్చ విపులం భువి,
రామే ప్రసన్నే స్వర్గం చ మహిమానం తథైవ చ. ౨౯

రామం శుశ్రూష భద్రం తే సుమిత్రానన్దవర్ధన!,
రామ స్సర్వస్య లోకస్య శుభే ష్వభిరత స్సదా. ౩౦

ఏతే సేన్ద్రా స్త్రయో లోకా స్సిద్ధాశ్చ పరమర్షయః,
అభిగమ్య మహాత్మాన మర్చన్తి పురుషోత్తమమ్. ౩౧

ఏతత్తదుక్తమవ్యక్త మక్షరం బ్రహ్మనిర్మితమ్,
వేదానాం హృదయం సౌమ్య! గుహ్యం రామః పరన్తపః. ౩౨

అవాప్తం ధర్మచరణం యశశ్చ విపులం త్వయా,
రామం శుశ్రూషతా భక్త్యా వైదేహ్యా సహ సీతయా. ౩౩

స తథోక్త్వా మహాబాహు ర్లక్ష్మణం ప్రాఞ్జలిం స్థితమ్,
ఉవాచ రాజా ధర్మాత్మా వైదేహీం వచనం శుభమ్. ౩౪

కర్తవ్యో నతు వైదేహి! మన్యు స్త్యాగ మిమం ప్రతి,

ఆదశరథమహారాజు తనయెదుటఁ జేతులు మోడ్చియున్న రాముంజూచి యట్లెయగుఁగాక' యని యంగీకరించి లక్ష్మణునిఁ గౌఁగిటంజేర్చి మరల నిట్లనివచించెను. ౨౭

నీవు సీతకును రామునకును శుశ్రూషచేయుటవలన నాకుఁ బరమ సంతోషంబు గావించినవాఁడ వైతివి. నీవును గొప్పపురుషార్థము నొందితివి.

ధర్మముఁ దెలిసినవాఁడా! రాముఁడు ప్రసన్నుండగునేని ధర్మంబును భూమియందు విశాలమయినకీర్తియు స్వర్గంబును(సుఖమును)గొప్పతనంబును నీకుఁ గలుగును. ౨౯

సుమిత్రాపుత్త్రుఁడా! నీవు రామునకు శుశ్రూషగావించుచుండుము. దాన నీకు మంగళంబుగలుగును. రాముఁడు సమస్తలోకంబులకును ఎల్లప్పుడును హితంబు సేయువాఁడు. ౩౦

ఈదేవేంద్రుండును మున్నగు మూఁల్లోకంబులవారును సిద్ధులును మహర్షులును మహానుభావుండును బురుషోత్తముండు నగు రాముని సేవించి పూజించుచున్నారు. ౩౧

సౌమ్యుఁడా! చిత్తశుద్ధిలేనివారలకుఁ దెలియరానిదియు నాశరహితమును వేదముల ముఖ్యతాత్పర్య భూతంబును (సమస్త దేవతలయందును అంతర్యామియై యున్నదియు) రహస్యంబు నగు బ్రహ్మమె యీ రామరూపంబున నవతరించినది. ఈయర్థము బ్రహ్మాదులు వచియించిరిగదా; ౩౨

నీవు రామునికిని సీతకును భక్తితో శుశ్రూష చేయుటవలన గొప్ప ధర్మంబునుం బొందితివి. దిగంత విశ్రాంతమయిన కీర్తినిం జెందితివి. అని దశరథుండు లక్ష్మణునితోఁ జెప్పెను. ౩౩

మహాబాహుండును ధర్మాత్ముండునునగు నాదశరథుఁడు తనముందటఁ జేతులు మోడ్చికొని నిలువఁబడియున్న లక్ష్మణున కివ్విధంబునం జెప్పి యంత సీతాదేవింజూచి యిట్లు శుభంబగువచనముం బలికెను. ౩౪

సీతా! రాముండిప్పుడు నిన్ను నిందించి "పరిత్యజించినా" నని చెప్పి

రామేణ త్వద్విశుద్ధ్యర్థం కృత మేత ద్ధితైషిణా. 3౫

న త్వం సుభ్రు! సమాధేయా పతిశుశ్రూషణం ప్రతి,
అవశ్యం తు మయా వాచ్య మేష తే దైవతం పరమ్. 3౬

ఇతి ప్రతిసమాదిశ్య పుత్త్రౌ సీతాం తథా స్నుషామ్,
ఇన్ద్రలోకం విమానేన యయౌ దశరథో జ్వలన్. 3౭

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే-ద్వావింశత్యుత్తరశతతమస్సర్గః.

---

త్రయోవింశత్యుత్తరశతతమస్సర్గః.

ప్రతిప్రయాతే తు కాకుత్స్థే మహేన్ద్రః పాకశాసనః,
అబ్రవీ త్పరమప్రీతో రాఘవం ప్రాఞ్జలిం స్థితమ్. ౧

అమోఘం దర్శనం రామ! తవాస్మాకం పరంతప!,
ప్రీతియుక్తాః స్మ తేన త్వం బ్రూహి యన్మనసేచ్ఛసి. ౨

ఏవ ముక్తస్తు కాకుత్స్థః ప్రత్యువాచ కృతాఞ్జలిః,
లక్ష్మణేన సహా భ్రాత్రా సీతయా సహ భార్యయా. 3

ఘందుకై నీవు కోపముసేయఁదగదు; చారిత్రము పరిశుద్ధముగా నుండుటకై నీ మేలు గోరియె రాముండు నీపారిశుద్ధ్యము వెల్లడియగుటకు ఇట్లు గావించి నాఁడుగాని వేఱుగాదు. ౩౫

సుందరములయిన కనుబొమలు గలసీతా! పెనిమిటికి శుశ్రూష సేయ వలెనని నీకొకరు చెప్పవలసినదిలేదు. అయినను నేను మాఁవను జెప్పవలసిన వాఁడను గావునఁ జెప్పెదను. ఈరాముఁడె నీకుఁ బరదేవత అని దశరథుఁడు సీతతోఁ జెప్పెను. ౩౬

దశరథుండు ఇవ్విధంబునఁ గొడుకులగు రామలక్ష్మణులకును గోడ లయిన సీతకును జెప్పి విమానంబుతోఁ దేజరిల్లుచు నింద్రలోకంబునకుఁ బోయెను. ౩౭

ఇది నూటయిరువదిరెండవసర్గము.

## నూటయిరువదిమూఁడవసర్గము.

దశరథుఁడు మఱలి స్వర్గమునకుఁ బోయినపిమ్మటఁ బాకాసురుని వధించినట్టి దేవేంద్రుండు పరమసంతుష్టుండై తనమ్రోల బద్ధాంజలిపుటుండై నిలుచున్న రాముంజూచి యిట్లనియెను. ౧

శత్రువులవధించునట్టి రాముఁడా! దశరథుని పుత్త్రకామేష్టికాలము నందు మేమునిన్ను సందర్శించుట, నీవు రావణుని వధించుటవలన సఫల మయినది (నీదర్శనము మాకు వ్యర్థముగాదు; మహాఫలప్రదము) (అర్థాంతర పక్షమునందు; నీవు ఇప్పుడు మమ్ముఁజూచుట వ్యర్థముకారాదు) మేము సంతోషించినాము. అందువలన నీవు మనసునఁ గోరుదానిం జెప్పుము. అని యింద్రుండు రామునితోఁ జెప్పెను. ౨

రాముండు దేవేంద్రుని మాటవిని తమ్ముఁడు లక్ష్మణునితోను భార్య యగు సీతతోనుంగూడినవాఁడై చేతులు మోడ్చి దేవేంద్రునితో నిట్లని బదులు పలికెను. ౩

యది ప్రీతి స్సముత్పన్నా మయి సర్వసురేశ్వర!,
వక్ష్యామి కురు తే సత్యం వచనం వదతాం వర!. ౪

మమ హేతోః పరాక్రాన్తా యే గతా యమసాదనమ్,
తే సర్వే జీవితం ప్రాప్య సము త్తిష్ఠన్తు వానరాః. ౫
మత్కృతే విప్రయుక్తా యే పుత్త్రై ర్దారైశ్చ వానరాః,
మత్ప్రియేష్వభియుక్తాశ్చ న మృత్యుం గణయ న్తి చ. ౬
త్వత్ప్రసాదా త్సమేయు స్తే వర మేత దహం వృణే,

నీరుజో నిర్వ్రణాం శ్చైవ సంపన్నబలపౌరుషాన్. ౭
గోలాఙ్గూలాం స్తథై వర్క్షా న్ద్రష్టు మిచ్ఛామి మానద!,

అకాలే చాపి ముఖ్యాని మూలాని చ ఫలాని చ. ౮
నద్యశ్చ విమలా స్తత్ర తిష్ఠేయు ర్యత్ర వానరాః,

శ్రుత్వా తు వచనం తస్య రాఘవస్య మహాత్మనః. ౯
మహేన్ద్రః ప్రత్యువాచేదం వచనం ప్రీతిలక్షణమ్,
మహా నయం వర స్తాత! త్వయోక్తో రఘునన్దన!. ౧౦
ద్వి ర్మయా నో క్తపూర్వం హి తస్మా దేత ద్భవిష్యతి,

సముత్థాస్య న్తి హరయో యే హతా యుధి రాక్షసైః. ౧౧
ఋక్షాశ్చ సహగోపుచ్ఛా నికృత్తాననబాహవః,

సమస్తదేవతలకును రాజా! మాటలాడువారలలో నుత్తముఁడా! నీకు నాయందుఁ బ్రీతిగలిగినయెడ నాయిష్టముఁ జెప్పెదను. నీవాప్రకారంబునం జేసి నీమాటను సత్యంబు గావించుకొనుము. ౪

నానిమిత్తమయి పరాక్రమించి యుద్ధంబున మృతిఁబొందిన వానరు లందఱును మరల బ్రతికి లేచునట్లు గావింపుము. ౫

ఎవ్వరు మరణము నేని సరకుసేయక నాకుఁ బ్రియములైనకార్యములు చేసి కొడుకులను భార్యలనుబాసి మృతులయిరో, వారలందఱు మఱల నుజ్జీవితులయి వారిభార్యాపుత్త్రులతోఁ జేరునట్లు అనుగ్రహింపుము. ఈ వరము నేను గోరుచున్నాను. ౬

ఆశ్రితులకు సమ్మానము గలిగించునట్టివాఁడా! వానరపీగులను భల్లూక వీరులను బ్రాణంబులతో లేచి ఎంతమాత్రము బాధలేక గాయములు లేనివార లయి యెప్పటియట్ల బలపరాక్రమ సంపన్నులయి యుండం జూడఁగోరు చున్నాను. ౭

వానరులు నివసించు స్థలంబులందుఁ గాలంబు గానియప్పుడుగూడ ఉత్తమములయిన ఫలమూలంబులు గలుగవలెను నదులు నిర్మలమయిన జలము గలిగి యుండవలెను. అని రాముఁడు ఇంద్రునితోఁ బలికెను. ౮

మహానుభావుండగు రాముండు పలికిన వచనంబువిని దేవేంద్రుండు సంతుష్టుండై యిట్లని బదులుపలికెను. ౯

నాయనా! రఘువంశమువారినెల్ల సంతోషింపఁ జేయునట్టివాఁడా! కాళ్ళు జేతులు మొదలగు నవయవంబులు నుఱిగి లోకాంతరగతులయిన వానరుల మరల బ్రతికింపవలెను గావున నీవడిగినవరము మిక్కిలియును గొప్పదిఁ అయినను నేనెప్పుడును జెప్పినమాటఁదప్పినది లేదు. కావున నీవడిగినట్లు కాగలదు. ౧౦

రాక్షసులచే యుద్ధంబునఁ గాళ్లుం జేతులు తలలుఁ దెగి హతులయిన గోలాంగూలంబులును భల్లూకంబులును వానరులును మరల బ్రతికి లేవఁగలరు

నీరుజో నిర్వ్రణా శ్చైవ సంపన్నబలపౌరుషాః. ౧౨
సముత్థాస్యన్తి హరయ స్సుప్తా నిద్రాక్షయే యథా,
సుహృద్భి ర్బాన్ధవై శ్చైవ జ్ఞాతిభి స్స్వజనై రపి. ౧౩
సర్వ ఏవ సమేష్యన్తి సంయుక్తాః పరయా ముదా,
అకాలే పుష్పశబలాః ఫలవన్తశ్చ పాదపాః. ౧౪
భవిష్యన్తి మహేష్వాస నద్యశ్చ సలిలాయుతాః,

సప్రాణై రి ప్రథమం గాత్రై స్సంవృత్తై ర్నిర్వ్రణైః పునః. ౧౫
తత స్సముత్థితా స్సర్వే సుప్త్వేవ హరిపుఙ్గవాః,

బభూవు ర్వానరా స్సర్వే కిమేత దితి విస్మితాః. ౧౬

తే సర్వే వానరా స్తస్మై రాఘవాయాభ్యవాదయన్,

కాకుత్స్థం పరిపూర్ణార్థం దృష్ట్వా సర్వే సురోత్తమాః. ౧౭
ఊచుస్తే ప్రథమం స్తుత్వా స్తవార్హం సహలక్ష్మణమ్,

గచ్ఛాయోధ్యా మితో వీర! విసర్జయ చ వానరాన్!. ౧౮
మైథిలీం సాన్త్వయ స్వైనా మనురక్తాం తపస్వినీమ్,

శత్రుఘ్నం చ మహాత్మానం మాతౄః సర్వాః పరంతప!. ౧౯
భ్రాతరం పశ్య భరతం త్వచ్ఛోకా ద్వ్రతధారిణమ్,

అభిషేచయ చాత్మానం పౌరాన్గత్వా ప్రహర్షయ. ౨౦

వానరులందఱు గాయము లేనివారలయి యెంతమాత్రము బాధలేక నిదురించినవారలు మేలుకొని లేచునట్లు లేవఁగలరు. ౧౩

వానరవీరులందఱును బరమసంతుష్టులయి తమస్నేహితులతోను బంధువులతోను దాయాదులతోను స్వజనంబులతోను జేరి సుఖముగా నుండఁగలరు.

మహాధనుర్ధరుఁడవగు రామునఁడా! ఈవానరులున్న స్థలమునందు అకాలమునందుఁగూడ వృక్షములు పూలును మంచిపండ్లునుం గలిగి యుండఁగలవు. నదులు నిర్మలమయిన జలము గలిగియుండగలవు. అని యింద్రుఁడు రామునితోఁ జెప్పెను. ౧౪

అంత ఇంద్రుఁడు వరమిచ్చుటకుమున్ను గాయములతోఁ జచ్చిపడి యుండిన వానరవీరులందఱు గాయములువాసిన శరీరములతోఁ గూడినవారలయి నిదురించి లేచునట్లు ప్రాణంబులతో లేచిరి. ౧౫

మృతిఁబొందకయే యుండిన వానరులందఱు చచ్చినవారలు మరల లేచుటంజూచి యిదియేమి! యని యాశ్చర్యము నొందిరి. ౧౬

మరల జీవించిన వానరులందఱు లేచివచ్చి రామచంద్రునకు నమస్కారంబు గావించిరి.

ఆదేవోత్తములందఱు అట్లు రాముఁడు సమస్తాభీష్టంబులఁ బొంది యలరుటంగాంచి మొదట నానావిధంబుగాఁ బ్రస్తుతించి లక్ష్మణసహితుఁడగు స్తోత్రార్హుండైన యతనింజూచి పలికిరి. ౧౭

వీరుఁడా! నీ విచ్చటనుండి యయోధ్యకుఁబోయి యీవానరుల వారివారి నెలవులకుఁ బోనెల వొసంగుము. నీయం దనురక్తురాలును దుఃఖసంపన్నయు (శోచనీయయు) నగు నీ సీతాదేవి నాశ్వాసింపుము. ౧౮

శత్రువుల వధించునట్టి రాముఁడా! నీ తల్లులనందఱును మహాత్ముఁడగు శత్రుఘ్నుని నిన్నుఁబాసిన దుఃఖముచేఁ దాపసవ్రతము దాల్చియున్న నీతమ్ముని భరతునిఁజూచి యాశ్వాసింపుము. ౧౯

అయోధ్యకుఁబోయి పట్టాభిషేకంబు గావించుకొని పట్టణమునందలి

ఏవ ముక్త్వా తమామన్త్ర్య రామం సౌమిత్రిణా సహ,
విమానై స్సూర్యసఙ్కాశై ర్హృష్టా జగ్ము స్సురా దివమ్. ౨౧

అభివాద్య చ కాకుత్స్థ స్సర్వాం స్తాం స్త్రిదశేశ్వరాన్,
లక్ష్మణేన సహ భ్రాత్రా వాస మాజ్ఞాపయ త్తదా. ౨౨
తతస్తు సా లక్ష్మణ రామపాలితా
మహాచమూ ర్హృష్టజనా యశస్వినీ,
శ్రియా జ్వలన్తీ విరరాజ సర్వతో
నిశా ప్రణీతేవ హి శీతరశ్మినా. ౨3

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే త్రయోవింశత్యుత్తరశతతమస్సర్గః.

---

## చతుర్వింశత్యుత్తరశతతమస్సర్గః.

తాం రాత్రి ముషితం రామం సుఖోత్థిత మరిందమమ్,
అబ్రవీ త్ప్రాఞ్జలి ర్వాక్యం జయం పృష్ట్వా విభీషణః. ౧

స్నానాని చాఙ్గరాగాణి వస్త్రాణ్యాభరణాని చ,
చన్దనాని చ దివ్యాని మాల్యాని వివిధాని చ. ౨
అలఙ్కారవిద శ్చేమా నార్యః పద్మనిభేక్షణాః,
ఉపస్థితా స్త్వాం విధివ త్స్నాపయిష్యన్తి రాఘవ!. 3
ప్రతిగృహ్ణీష్వ తత్సర్వం మదనుగ్రహకామ్యయా,

ఏవ ముక్త స్తు కాకుత్స్థః ప్రత్యువాచ విభీషణమ్. ౪

ప్రజల సంతోషపెట్టుము. అని దేవతలు రామునితోఁ బలికిరి. ౨౦

ఇవ్విధ్యంబునంబలికి దేవతలు రామలక్ష్మణులయొద్ద సెలవొంది సంతుష్టులయి సూర్యప్రకాశమానములగు విమానముల నారోహించి స్వర్గమునకుఁ బోయిరి. ౨౧

రాముఁడు, లక్ష్మణుఁడునుం దానును ఆదేవోత్తములకందఱకును నమస్కరించి వానరులనందఱ విశ్రమింపుఁడని యాజ్ఞాపించెను. ౨౨

అంత విజయంబునొంది సంతుష్టులగు సైనికులతో నొప్పుచున్న యమ్మహావానరసేన రామలక్ష్మణ పాలితంబయి తేజరిల్లుచుఁ జద్రునిచేఁ బ్రకాశితంబగు శుక్ల పక్షరాత్రిచందంబున నెంతయు నొప్పెను. ౨౩

ఇది నూటయిరువదిమూఁడవసర్గము.

## నూటయిరువదినాలుగవసర్గము.

అంత బ్రహ్మాదులు పోయినపిమ్మట నారాత్రియంతయు సుఖముగా విదురించి మేలుకొన్నవాఁడును శత్రువుల నడఁగఁ ద్రొక్కునట్టివాఁడునగు రాముంజూచి విభీషణుఁడు చేతులుమోడ్చి మొదల జయంబడిగి యిట్లని పలికెను. ౧

రాముఁడా! స్నానయోగ్యంబులగు జలంబులు మైపూఁతలు వస్త్రంబులు భూషణంబులు దివ్యగంధంబులు నానావిధ మాల్యంబులునుం దెచ్చియున్నాను. చక్కఁగా నలంకరిపనేర్చినవారలును గమలంబులవంటి కన్నులుగలవారలునగు ఈకాంతలునీకుఁ జక్కఁగా స్నానము సేయింతురు. ౨,౩

వీనినంతయు!నంగీకరించి న నన్నుగ్రహింపుము. అని విభీషణుండు రామునితోఁ బలికెను.

రాముఁడు విభీషణుని వాక్యంబువిని యతనింజూచి యిట్లని బదులు చెప్పెను. ౪

హారీన్ సుగ్రీవముఖ్యాం స్త్వం స్నానేనాభినిమన్త్రయ,
సతు తామ్యతి ధర్మాత్మా మమ హేతోః స్సుఖోచితః. ౫
సుకుమారో మహాబాహుః కుమార స్సత్యసంశ్రవః,

తం వినా కైకయాపుత్రం భరతం ధర్మచారిణమ్. ౬
న మే స్నానం బహుమతం వస్త్రాణ్యాభరణాని చ,
ఇత ఏవ పథా క్షిప్రం ప్రతిగచ్ఛామి తాం పురీమ్. ౭
అయోధ్యామాగతో హ్యేష పన్థాః పరమదుర్గమః,

ఏవ ముక్తస్తు కాకుత్స్థం ప్రత్యువాచ విభీషణః. ౮
అహ్నా త్వాం ప్రాపయిష్యామి తాం పురీం పార్థివాత్మజ,

పుష్పకం నామ భద్రం తే విమానం సూర్యసన్నిభమ్. ౯
మమ భ్రాతుః కుబేరస్య రావణేనాహృతం బలాత్,

హృతం నిర్జిత్య సఙ్గ్రామే కామగం దివ్యముత్తమమ్. ౧౦
త్వదర్థే పాలితం చైత త్తిష్ఠ త్యతులవిక్రమ!,

తదిదం మేఘసఙ్కాశం విమాన మిహ తిష్ఠతి. ౧౧

సుగ్రీవుఁడు మొదలగు వానరవీరులనే నీవు స్నానార్థముగాఁ బిలువుము.

విలయనఁగా ధర్మాత్ముఁడును ఆజానుబాహుఁడును సుకుమారశరీరుండును సుఖం బనుభవించుటకు మాత్రమె తగినవాఁడునగు కుమారుఁడయిన యాభరతునియందె నామనస్సున్నది. ఆతఁడు "పదునాలుగేండ్లు నిండిన పిమ్మట మఱునాఁడు నేను నిన్నుఁ జూడకుందునేని అగ్నిఁజొత్తును" అని ప్రతిజ్ఞ గావించినవాఁడు. ప్రతిజ్ఞ దప్పనివాఁడు. నారాకకై యెదురు చూచుచుఁ బరితపించుచున్నాఁడు. ౫

ధార్మికుఁడగు కైకేయీకొడుకైన యట్టిభరతుని విడిచియున్నప్పుడు నాకు స్నానమేల? వస్త్రాభరణాదులేల? ౬

అతిదూరమగుటచే దుర్గమంబైన యయోధ్యకుఁ బోవునట్టి యీ మార్గంబునే యవలంబించి నేనిప్పుడె యయ్యయోధ్యకుఁ బోయెదను. అని రాముండు విభీషణునితోఁ బలికెను. ౭

రాముని వచనంబు విని విభీషణుం డతనితో మరల నిట్లని పలికెను. ౮

రాచకొమరుఁడా! ఒకదినములోపల నిన్ను అయోధ్యానగరంబునకుఁ జేర్చెదను.

నీకు మంగళమగుఁగాక; నాయన్నయగు కుబేరునిదైన సూర్యసమానంబగు పుష్పకంబను విమానంబును రావణుండు బలాత్కారంబున నపహరించి తెచ్చెను. ౯

అసదృశమయిన పరాక్రమముగల రాముఁడా! రావణుండు యుద్ధంబునఁ గుబేరుని జయించి ఇచ్ఛకువచ్చిన స్థలంబులకెల్లఁ బోఁగలదియు స్వర్గంబున నిర్మితంబయినదియు నుత్తమంబునగు నీ పుష్పకంబును దీసికొనివచ్చెను; ఇయ్యది యిప్పుడు కుబేరుఁడు వచ్చినను అతని కియ్యక నీ నిమిత్తమయి నిలిపి యుంచియున్నాను. ౧౦

*మేఘంబువలె నాకాశమునందు మహావేగంబున సంచరించునదైన

తేన యాస్యసి యానేన త్వ మయోధ్యాం గతజ్వరః,
అహం తే యద్యనుగ్రాహ్యో యది స్మరసి మే గుణాన్. ౧౨
వస తావ దిహ ప్రాజ్ఞ! యద్యస్తి మయి సౌహృదమ్,
లక్ష్మణేన సహ భ్రాత్రా వైదేహ్యాచాపి భార్యయా. ౧౩
అర్చిత స్సర్వకామై స్త్వం తతో రామ! గమిష్యసి,
ప్రీతియుక్తస్య మే రామ! ససైన్య స్ససుహృద్గణః. ౧౪
సత్క్రియాం విహితాం తావ ద్గృహాణ త్వం మయోద్యతామ్,
ప్రణయా ద్బహుమానాచ్చ సౌహృదేన చ రాఘవ!. ౧౫
ప్రసాదయామి ప్రేష్యోఽహం నఖల్వాజ్ఞాపయామి తే,

ఏవ ముక్త స్తతో రామః ప్రత్యువాచ విభీషణమ్. ౧౬
రక్షసాం వానరాణాం చ సర్వేషాం చోపశృణ్వతామ్,
పూజితోఽహం త్వయా సౌమ్య! సాచివ్యేన పరంతప!. ౧౭
సర్వాత్మనా చ చేష్టాభి స్సౌహృదేనోత్తమేన చ,
నఖల్వేతన్న కుర్యాం తే వచనం రాక్షసేశ్వర. ౧౮
తం తు మే భ్రాతరం ద్రష్టుం భరతం త్వరతే మనః,
మాం నివర్తయితుం యోఽసౌ చిత్రకూట ముపాగతః. ౧౯
శిరసా యాచతో యస్య వచనం న కృతం మయా,

చూ యీ పుష్పకవిమానం బిచటనున్నది; నీవీవిమానంబు నారోహించి శీఘ్రంబున నయోధ్యాపురిం జేరఁగలరు; పరితాపపడకుము. ౧౧

పండితుఁడా! నీకుఁ దెలియని దేమియున్నది? నేను నీకు అనుగ్రహింపఁదగినవాఁడనగుదునేని, నాదుభక్త్యాదిగుణంబులు నీమనసునకుఁ దెలిసియున్నయెడ నాయందు నీకు స్నేహముగలదేని నీవిచట నిలువవలెను. ౧౨

రాముఁడా! నీవు నీతమ్ముఁడగు లక్ష్మణుని నీభార్యయగు సీతనుంగూడి నేను గావించు భూషణాంబరదానాది సమస్తపూజలం గైకొని యటుపిమ్మటం బొమ్ము. ౧౩

రాముఁడా! నేను ప్రీతిపూర్వకముగాఁ జేయునదియు మున్నే యత్నించి యున్నదియునగు నా సత్కారమును నీవు సైన్యంబులతోను మిత్రసమూహంబులతోనుం గూడినవాఁడవై యంగీకరింపవలెను. ౧౪

రాముఁడా! నాయందలి ప్రేమవలన నాప్రార్థనను నీవు అంగీకరింతువనియు నీవు నాకుఁ గావించు లాలనంబువలనను నీయందలి భక్తివలనను స్థైర్యముగా నిన్ను నీభృత్యమాత్రుఁడనైన నేను వేఁడుకొనుచున్నాను గాని యాజ్ఞాపించువాఁడను గాను. అని విభీషణుండు రామునితోఁ జెప్పెను. ౧౫

విభీషణుండు చెప్పినమాటను విని రాముండు రాక్షసులును వానరులును ఎల్లవారు వినుచుండఁగా విభీషణునితో నిట్లని పలికెను. ౧౬

శత్రువుల వధించువాఁడా! సౌమ్యుఁడా! నీవు గావించిన సాహాయ్యము యుద్ధంబున నీవుచేసిన పరాక్రమములు ని యుక్తమయిన భక్తి వీనిచేతనే నేను నీచేఁ బూజితుఁడనైతిని. ౧౭

రాక్షసరాజా! నీమాటను నేనెప్పుడైనను జేయకుందునా? అయితే నన్ను వనవాసంబునుండి మఱలించి యయోధ్యకుఁ దోడ్కొనిపోవుటకై యెవ్వఁడు చిత్రకూటపర్వతమునకు వచ్చినాఁడో, ఎవ్వండు అయోధ్యకువచ్చి రాజ్యంబు నంగీకరింపుమని నన్ను ఎంతదూరము సాష్టాంగపాతపూర్వకముగా యాచించినను నే నంగీకరింపనైతినో, అట్టి పరమభక్తుండు నాతమ్ముండగు భరతునిం జూడవలెనని నామనస్సు పరితపించుచున్నది. ౧౮, ౧౯

కౌసల్యాం చ సుమిత్రాం చ కైకేయీం చ యశస్వినీమ్. ౨౦
గురూంశ్చ సుహృదశ్చైవ పౌరాంశ్చ తనయైః సహ,

ఉపస్థాపయ మే క్షిప్రం విమానం రాక్షసేశ్వర!. ౨౧
కృతకార్యస్య మే వాసః కథంస్వి దిహ సమ్మతః,

అనుజానీహి మాం సౌమ్య! పూజితోఽస్మి విభీషణ!. ౨౨
మన్యు ర్న ఖలు కర్తవ్య స్త్వరితం త్వాఽనుమానయే,

రాఘవస్య వచః శ్రుత్వా రాక్షసేన్ద్రో విభీషణః. ౨౩
తం విమానం సమాదాయ తూర్ణం ప్రతి నివర్తత,
తతః కాఞ్చనచిత్రాఙ్గం వైడూర్యమయవేదికమ్. ౨౪
కూటాగారైః పరిక్షిప్తం సర్వతో రజతప్రభమ్,
పాణ్డురాభిః పతాకాభి ర్ధ్వజైశ్చ సమలంకృతమ్. ౨౫
శోభితం కాఞ్చనై ర్హర్మ్యై ర్హేమపద్మవిభూషితమ్,
ప్రకీర్ణం కిఙ్కిణీజాలై ర్ముక్తామణిగవాక్షితమ్. ౨౬
ఘణ్టాజాలైః పరిక్షిప్తం సర్వతో మధురస్వనమ్,

యన్మేరుశిఖరాకారం నిర్మితం విశ్వకర్మణా. ౨౭
బహుభి ర్భూషితం రమ్యై ర్ముక్తారజతసన్నిభైః,
తలైః స్ఫాటికచిత్రాంగై ర్వైడూర్యైశ్చ వరాసనైః. ౨౮
మహార్హాస్తరణోపేతై రుపపన్నం మహాధనైః,
ఉపస్థిత మనాధృష్యం తద్విమానం మనోజవమ్. ౨౯

ఇంతియగాదు, కౌసల్యను సుమిత్రను కీర్తిమతి యగు కైకేయిని వసిష్ఠాది గురువులను స్నేహితులను బిడ్డలతోఁగూడిన పట్టణవాసిజనులను జూడవలె ననియు నామనస్సు పరితపించుచున్నది. ౨౦

రాక్షసరాజా! నా కొఱకు శీఘ్రముగా నా పుష్పకవిమానంబు రావింపుము; పదునాలుగేండ్ల వనవాసంబును గావించి యయినపిదప భరతుం డట్లు ప్రతిన చేసియుండునపుడు నే నిచట నెట్లుండవచ్చును? ౨౧

సౌమ్యుఁడవగు విభీషణుఁడా! నా కనుజ్ఞ యొసంగుము; ఈ పుష్పక విమానంబుచేత నే పూజితుండనైతిని; నీవుకోపపడవలదు (నీవు దుఃఖపడవలదు), నాకు శీఘ్రముగాఁ బోవ ననుమతి యొసంగుము. అని రాముండు విభీషణు నితోఁ బలికెను. ౨౨

అంత రామవాక్యంబు విని రాక్షసేశ్వరుండగు విభీషణుండు బంగారముతోఁ జేయఁబడిన చిత్రములయిన భాగములుగలదియు వైడూర్యమణితోఁ జేయఁబడిన తిన్నెలుగలదియు మంటపంబులతో నొప్పుచున్నదియు సంతత స్వచ్ఛమయినకాంతిచేఁ దేజరిల్లుచున్నదియును తెల్లని పట్టి ధ్వజముల చేతను జిత్తరువులు వ్రాసిన ధ్వజంబులచేతను అలంకరింపఁబడినదియు బంగారు మేడలతోఁ గూడినదియు వ్రేలాడుచున్న బంగారు కమలంబులచే నలంకృతంబును నాలుగుప్రక్కలం గింకిణీజాలంబులతోను నాలుగుమూలల ఘంటాజాలంబులతోనుంగూడియుండుటంజేసి మనోహరముగా ధ్వనించుచున్నదియు ముక్తామణులతోఁ జేయఁబడిన కిటికీలుగలదియునగు నాపుష్పకవిమానముం దీసికొని శీఘ్రముగా రాము నొద్దకువచ్చెను, ౨౩, ౨౬

విశ్వకర్మనిర్మితంబును మేరుశిఖరంబంతటి యాకారంబుగలదియు ముత్తెములంబోలె రజతంబువలె నిర్మలప్రభింబులగు పెక్కు హర్మ్యంబులతో నొప్పుచున్నదియు స్ఫటికవికారము లయిన చిత్రములగు స్థలంబులుగలదియు నుత్తమములగు నాస్తరణములతోఁ గూడినవై యధికమయిన విలువగలవయిన వైడూర్యవికారంబులగు నుత్తమాసనంబులతోఁ గూడినదియు ఎదురు

నివేదయిత్వా రామాయ తస్థౌ తత్ర విభీషణః.

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే-చతుర్వింశత్యుత్తరశతతమస్సర్గః.

---

## పఞ్చవింశత్యుత్తరశతతమస్సర్గః.

ఉపస్థితం తు తం దృష్ట్వా పుష్పకం పుష్పభూషితమ్,
అవిదూరస్థితో రామం ప్రత్యువాచ విభీషణః. ౧

సతు బద్ధాఞ్జలిః ప్రహ్వో వినీతో రాక్షసేశ్వరః,
అబ్రవీ త్త్వరయోపేతః కిం కరోమీతి రాఘవమ్. ౨

తమబ్రవీ న్మహాతేజా లక్ష్మణస్యోపశృణ్వతః,
విమృశ్య రాఘవో వాక్య మిదం స్నేహపురస్కృతమ్. 3

కృతప్రయత్నకర్మాణో విభీషణవనౌకసః,
రత్నై రర్థైశ్చ వివిధై ర్భూషణైశ్చాపి పూజయ. ४

సహైభి రజితా లఙ్కా నిర్జితా రాక్షసేశ్వర,
హృష్టైః ప్రాణభయం త్యక్త్వా సఙ్గ్రామే ష్వనివర్తిభిః. ౫

త ఇమే కృతకర్మాణః పూజ్యన్తాం సర్వవానరాః,
ధనరత్నప్రదానేన కర్మైషాం సఫలం కురు. ౬

లేని గమనంబు గలదియు మనసునకుంబోలె వేగంబుగలదియునగు నా పుష్పక విమానంబును విభీషణుండు తెచ్చి శ్రీరామునకు సమర్పించి యచ్చో నిలుచుండెను. ౫౪

ఇది నూటయిరువది నాలుగవసర్గము.

## నూటయిరువదియైదవసర్గము.

పుష్పమాల్యములచే నలంకృతంబగు నా పుష్పకవిమానంబు రామునకుం జూపి విభీషణుండు రామునిసమీపంబున నిలుచుండి యతనితో నిట్లని పలికెను. ౧

అంత రాక్షసేశ్వరుండగు నవ్విభీషణుండు చేతులుమోడ్చి వినయనమ్రోత్తమాంగుండై యాదరాతిశయంబునంజేసి వేగిరపాటుగదుర రామునిం జూచి "ఇంక నేనేమి సేయవలెను" అని యడిగెను. ౨

మహాపరాక్రమశాలి యగు రాముండు ఆలోచించి లక్ష్మణుండు మాత్రము సమీపంబున వినుచుండఁగా నివ్విభీషణుం జూచి స్నేహపూర్వకంబుగా నిట్లని పలికెను. ౩

విభీషణుఁడా! ఈ కార్యము నంతయుంఁ దగిన ప్రయత్నముచేసి సాధించినవారలు వానరులు. కావున నీవు వీరలను రత్నంబులను వస్త్రాదులను ఆభరణంబులను ఒసంగి సంతోషపఱుపుము. ౪

రాక్షసరాజా! ఇదివఱకు సురలకుఁగూడ జయింప నలవిగాకుండిన యీలంకాపురిని యుద్ధంబున వెనుదీయని మహాశూరులగు నీవానరులు ప్రాణభయంబునుం బరిత్యజించి యుత్సాహంబుతో యుద్ధంబు సేయుటవలన మనము జయింపఁగలిగినాము గాని వేఱుగాదు. ౫

అట్లు కార్యమును సాధించినట్టి యీ వానరు లందఱను బూజింపుము, ధనమును రత్నముల నొసంగి వీరలు పడిన ప్రయాసమును సఫలము గావింపుము. ౬

ఏవం సమ్మానితాశ్చేమే మానార్హా మానద! త్వయా,
భవిష్యన్తి కృతజ్ఞేన నిర్వృతా హరియూథపాః. ౭

త్యాగినం సంగ్రహీతారం సానుక్రోశం యశస్వినమ్,
సర్వే త్వా మవగచ్ఛన్తి తత స్సంబోధయామ్యహమ్. ౮

హీనం రతిగుణై స్సర్వై రభిహన్తార మాహవే,
త్యజన్తి నృపతిం సైన్యా స్సంవిగ్నా స్తం నరేశ్వరమ్. ౯

ఏవ ముక్తస్తు రామేణ వానరాం స్తా న్విభీషణః,
రత్నార్థై స్సంవిభాగేన సర్వానేవాభ్యపూజయత్. ౧౦

తత స్తా న్పూజితా న్దృష్ట్వా రత్నై రర్థైశ్చ యూథపాన్,
ఆరురోహ తతో రామ స్తద్విమాన మనుత్తమమ్. ౧౧
అఙ్కే నాదాయ వైదేహీం లజ్జమానాం యశస్వినీమ్,
లక్ష్మణేన సహ భ్రాత్రా విక్రాన్తేన ధనుష్మతా. ౧౨
అబ్రవీచ్చ విమానస్థః పూజయన్ సర్వవానరాన్,
సుగ్రీవం చ మహావీర్యం కాకుత్స్థ స్సవిభీషణమ్. ౧౩

మిత్రకార్యం కృత మిదం భవద్భి ర్వానరోత్తమాః,
అనుజ్ఞాతా మయా సర్వే యథేష్టం ప్రతిగచ్ఛత. ౧౪

యత్తు కార్యం వయస్యేన సుహృదా వా పరంతప!,

ఆశ్రితులకు గౌరవము నొసంగునట్టి విభీషణుండా! నీవు కృతజ్ఞత గలిగి పూజార్హులగు నీవానరుల నిట్లు పూజింతువేని వీర లందఱు నీవిషయ మయి సంతోషంబు నొందుదురు. ౭

అట్లు గావింతువేని నీవు దాతవనియు దానాదులచే జనుల వశపఱచు కొనువాఁడవనియు దయావంతుఁడ వనియు యశస్సంపన్నుఁడవనియు నిన్ను అందఱును దలంతురు; కావున నేను ఇంతదూరము నీకు బోధించు చున్నాను. ౮

రాజయినను క్రోధముచే యవలంబించి హింసించుచుఁ బ్రీతికరము లయిన యౌదార్యాది ప్రసాదగుణములే లేనివాఁడయిన పక్షమున సైనికులు విసుగునంజేసి యుద్ధకాలంబున నతనిఁ బరిత్యజింతురు. అని రాముండు విభీషణునితోఁ జెప్పెను. ౯

ఇట్లు రాముండు పలుకుటను విని విభీషణుండు అవ్వానరవీరుల కందఱకు యథాయోగ్యముగా మణుల ధనంబుల నొసంగి సమ్మానంబు గావించెను. ౧౦

అంత నవ్వానరు లందఱు మణిధనవస్త్రాదులచే సమ్మానితులవుటం జూచి రాముండు అంత లజ్జించుచున్న యశస్సంపన్న యగు సీత నంకంబునం జేకొని, పరాక్రమవంతుండగు తమ్ముఁడు లక్ష్మణుండు ధనుర్ధరుండై వెనువెంట నారోహింప సర్వోత్తమంబగు నా పుష్పకవిమానంబు నారోహించెను. ౧౧, ౧౨

రాముఁడు అట్లు విమానంబు నారోహించిన వెంటనె సమస్తవానరులను మహాపరాక్రమశాలియగు సుగ్రీవుని విభీషణునిం జూచి వారలసమ్మానించుచు నిట్లని పలికెను. ౧౩

వానరశ్రేష్ఠులారా! మీరలు మిత్రుఁడనగు నాకార్యమును గావించి నారలు, మీ కనుమతి యొసంగితిని; మీయిష్టము చొప్పున మీమీస్థలంబులకు బొండు. ౧౪

శత్రువులఁ దపింపఁజేయునట్టి సుగ్రీవుఁడా! మిత్రుఁడును బంధువు

కృతం సుగ్రీవ! తత్సర్వం భవతాఽధర్మభీరుణా. ౧౫

కిష్కిన్ధాం ప్రతియాహ్యాశు స్వసైన్యేనాభిసంవృతః,

స్వరాజ్యే వస లఙ్కాయాం మయా దత్తే విభీషణ!. ౧౬
న త్వాం ధర్షయితుం శక్తాః సేన్ద్రా అపి దివౌకసః,

అయోధ్యాం ప్రతియాస్యామి రాజధానీం పితుర్మమ. ౧౭
అభ్యనుజ్ఞాతు మిచ్ఛామి సర్వాంశ్చామన్త్రయామి వః,

ఏవ ముక్తా స్తు రామేణ వానరా స్తే మహాబలాః. ౧౮
ఊచుః ప్రాఞ్జలయో రామం రాక్షస శ్చ విభీషణః,
అయోధ్యాం గన్తుమిచ్ఛామః సర్వా న్నయతు నో భవాన్. ౧౯
ఉద్యుక్తా విచరిష్యామో వనాని నగరాణి చ,

దృష్ట్వా త్వా మభిషేకార్ద్రం కౌసల్యా మభివాద్య చ. ౨౦
అచిరేణాగమిష్యామ స్స్వా న్గృహా న్నృపతే సుత!,

ఏవ ముక్తస్తు ధర్మాత్మా వానరై స్సవిభీషణైః. ౨౧
అబ్రవీ ద్రాఘవః శ్రీమాన్ ససుగ్రీవవిభీషణాన్,

ప్రియా త్ప్రియతరం లబ్ధం యదహం ససుహృజ్జనః. ౨౨
సర్వై ర్భవద్భి స్సహితః ప్రీతిం లప్స్యే పురీం గతః,

నైనవాఁడు ఏమిచేయవలెనో నీవు అధర్మమునకు వెఱచి అదియంతయుఁ గావించినావు. ౧౫

నీవు నీసేనలతోఁగూడ శీఘ్రముగఁ గిష్కింధకుఁబోయి సుఖముగా నుండుము.

విభీషణుఁడా! నీవు నేనొసంగిన రాక్షసరాజ్యంబు ననుభవింపుచు లంకానగరంబున సుఖముగా నుండుము. దేవేంద్రసహితముగా వచ్చిన దేవతలకైనను నిన్నెదిరింప నలవిగాదు. ౧౬

నే నిఁక నాతండ్రి రాజధానియగు నయోధ్యకుఁ బోయెదను. మీరు నా కనుమతి యొసంగవలెను. మిమ్మందఱను వీడ్కొనుచున్నాను అని రాముఁడు వానర సుగ్రీవ విభీషణులతోఁ బలికెను. ౧౭

మహాబలశాలు లగు నాసుగ్రీవాదివానరులును విభీషణుండును రాముని వచనంబు విని చేతులు మోడ్చినవారలయి రామునిఁజూచి యిట్లని పలికిరి. ౧౮

మేమును అయోధ్యకు రాఁగోరుచున్నాము. నీవు మమ్మందఱను దోడ్కొనిపోవలెను. అచ్చటి జనుల కెంతమాత్రము బాధలేకుండునట్లు వనంబులందును నగరములందును ఎచ్చరికతో సంచరించెదము. ౧౯

దశరథమహారాజ కుమారుఁడా! మేము నీవు పట్టాభిషిక్తుండవగుటను జూచి యిట్లని కౌసల్యాదేవికి నమస్కరించి శీఘ్రముగనే మాయిండ్లకుఁ జేరెదము. అని వానరులును విభీషణుండును రామునితోఁ బలికిరి. ౨౦

అట్లు విభీషణుండును సుగ్రీవుఁడును వానరు లందఱును బ్రార్థించుటయుఁ ధర్మాత్ముఁడును శ్రీమంతుఁడునగు రాముఁడు వారల నందఱిఁ జూచి యిట్లని పలికెను. ౨౧

నేను అయోధ్యకుఁబోయి యచట నాభరతాది బంధువులతోఁ గూడినవాఁడనై మీయందఱితోడనుంగూడి సంతోషంబు నొందఁగలను గావున మఱిమఱి పరమసంతోషము గలిగినది. ఎట్లనఁగా సీతాసమాగమమున సంతోషము, భరతదర్శనంబున నంతకన్న సంతోషము, మిమ్ము అందఱింగూడి యయోధ్యకుఁ బోవుటవలన మఱియుఁ సంతోషము కలిగినది. ౨౨

క్షిప్ర మారోహ సుగ్రీవ! విమానం వానరై స్సహ. ౨౩
త్వ మథ్యారోహ సామాత్యో రాక్షసేన్ద్ర! విభీషణ!,

తత స్తత్పుష్పకం దివ్యం సుగ్రీవ స్సహ సేనయా. ౨౪
అధ్యారోహ త్త్వరన్ శీఘ్రం సామాత్యశ్చ విభీషణః,

తేష్వారూఢేషు సర్వేషు కౌబేరం పరమాసనమ్. ౨౫
రాఘవేణాభ్యనుజ్ఞాత ముత్పపాత విహాయసమ్,

యయౌ తేన విమానేన హంసయుక్తేన భాస్వతా. ౨౬
ప్రహృష్టశ్చ ప్రతీతశ్చ బభౌ రామః కుబేరవత్,

తే సర్వే వానరా హృష్టా రాక్షసాశ్చ మహాబలాః. ౨౭
యథాసుఖ మసమ్బాధం దివ్యే తస్మి న్నుపావిశన్,

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే-పఞ్చవింశత్యుత్తరశతతమస్సర్గః.

---

షడ్వింశత్యుత్తరశతతమస్సర్గః.

అనుజ్ఞాతం తు రామేణ తద్విమాన మనుత్తమమ్,
ఉత్పపాత మహామేఘ శ్శ్వసనేనోద్ధతో యథా. ౧

పాతయిత్వా తత శ్చక్షు స్సర్వతో రఘునన్దనః,
అబ్రవీ న్మైథిలీం సీతాం రామ శ్శశినిభాననామ్. ౨

సుగ్రీవుఁడా! నీవును వానరులును శీఘ్రముగాఁ బుష్పకము నారోహింపుఁడు. రాక్షసరాజవయిన విభీషణుఁడా! నీవు నీమంత్రులతోఁ శీఘ్రంబున నారోహింపుము. అని రాముండు సుగ్రీవ విభీషణ వానరులతోఁ జెప్పెను. ౨౩

అంత సుగ్రీవుఁడును వానరసైనికులును శీఘ్రింబుగాఁ బోవునదియుం దివ్యంబునగు నాపుష్పకవిమానంబును శీఘ్రంబున నారోహించిరి. విభీషణుఁడు అతని మంత్రులును ఆరోహించిరి. ౨౪

ఆ వానరులును సుగ్రీవుఁడును విభీషణుండును ఆరోహించిన వెనుక కుబేరునిదగు పుష్పకవిమానంబు రామునిచే ననుజ్ఞాతంబై యాకాశంబున కెగసెను. ౨౫

రాముండు, హంసప్రతిమలతోఁ గూడి ప్రకాశించుచున్న యాపుష్పకవిమానంబునం బోవుచు సంతుష్టుండై దేవగంధర్వాదులచేఁ బ్రస్తుతింపఁబడుచున్నవాఁడునై కుబేరుని యట్లు చూడనొప్పెను. ౨౬

దివ్యమగు నాపుష్పకము అపేక్షించినంత యవకాశముగలది గావున మహాబలశాలులగు నా వానరులును రాక్షసులును సంతుష్టులయి యవ్విమానంబున నెంతమాత్రము ఇఱుకులేక యొకరినొకరు స్పృశింపకుండ సుఖముగాఁ గూర్చుండియుండిరి. ౨౭

ఇది నూటయిరువదియైదవసర్గము.

## నూటయిరువదియాఱవసర్గము.

సర్వోత్తమమయిన యా పుష్పకవిమానము రాము ననుమతి యయినంతనె వాయువేగంబునను మహామేఘంబు పోవునట్లు ఆకాశంబున నతివేగంబునం బోయెను. ౧

అంత రఘువంశంబునఁ బుట్టినవారినెల్ల సంతోషింపఁజేయునట్టి రాముండు అన్నివైపులం జూపులు పఱఁగించి చంద్రబింబమువంటి మోముతో

కైలాసశిఖరాకారే త్రికూటశిఖరే స్థితామ్,
లఙ్కా మీక్షస్వ వైదేహి! నిర్మితాం విశ్వకర్మణా. 3
ఏతదాయోధనం పశ్య మాంసశోణితకర్దమమ్,
హరీణాం రాక్షసానాం చ సీతే! విశసనం మహత్. ४
అత్ర దత్తవర శ్శేతే ప్రమాథీ రాక్షసేశ్వరః,
తవ హేతో ర్విశాలాక్షి! రావణో నిహతో మయా. ౫

కుమ్భకర్ణోఽత్ర నిహతః ప్రహస్తశ్చ నిశాచరః,
ధూమ్రాక్షశ్చాత్ర నిహతో వానరేణ హనూమతా. ౬

విద్యున్మాలీ హతశ్చాత్ర సుషేణేన మహాత్మనా.

లక్ష్మణేనేన్ద్రజి చ్చాత్ర రావణి ర్నిహతో రణే. ౭
అఙ్గదేనాత్ర నిహతో వికటో నామ రాక్షసః,

విరూపాక్షశ్చ దుర్ధర్షో మహాపార్శ్వ మహోదరౌ. ౮
అకమ్పనశ్చ నిహతో బలినోఽన్యే చ రాక్షసాః,

అత్ర మన్దోదరీ నామ భార్యా తం పర్యదేవయత్. ౯
సపత్నీనాం సహస్రేణ సాగ్రేణ పరివారితా,

ఏతత్తు దృశ్యతే తీర్థం సముద్రస్య వరాననే. ౧౦
యత్ర సాగర ముత్తీర్య తాం రాత్రి ముషితా వయమ్,

నొప్పుచున్న జనకమహారాజపుత్త్రియగు సీతంజూచి యిట్లని పలికెను. ౨

సీతా! లంకాపురి కైలాసశిఖర సమానంబగు త్రికూటశిఖరంబుపై నున్నది చూడుము. దీని విశ్వకర్మ నిర్మించెను. ३

సీతా! మాంసముచేతను రక్తముచేతను బురదగానుండు నీ యంద్ధభూమింజూడుము. వానరులును రాక్షసులును బెక్కండ్రిందు హతులయిరి. ర

విశాలంబులగు నేత్రంబులుగలదానా! బ్రహ్మవలన వరంబునొందిన వాఁడును లోకహింసకుండునగు రాక్షసరాజయిన రావణుఁడు నీ నిమిత్తమయి నాచే నిహతుఁడై యిచట బూడిదయయి పడియున్నాఁడు చూడుము. ౫

ఈ స్థలంబునఁ గుంభకర్ణుఁడు నాచే హతుఁడయ్యె. ఇచటఁ బ్రహస్తుఁడను రాక్షసుఁడు నీలునిచేఁ జంపఁబడెను. ఇచట హనుమంతునిచే ధూమ్రాక్షుఁడు వధింపఁబడెను. నిరూపించి చూడుము. ౬

మహాపరాక్రమశాలియగు సుషేణుఁడు విద్యున్మాలిని వధించినస్థలం బిది చూడుము.

ఈ స్థలంబున లక్ష్మణుండు రావణునికొడుకయిన యింద్రజిత్తుని వధించెను, ఈ స్థలంబున నంగదుండు వికటుండను రాక్షసుని వధించెను.

ఇచట మహాపరాక్రమశాలియగు విరూపాక్షుఁడు హతుఁడయ్యె. ఇచట మహాపార్శ్వుఁడును మహోదరుఁడును హతులయిరి. ఈ స్థలంబున నకంపనుఁడు వధింపఁబడియె. ఈయెడ బలవంతులగు రాక్షసులు ఇతరులం కొందఱు వధింపఁబడిరి. ౮

రావణుని భార్యయగు మండోదరి రోదనంబు సేయుచున్న వేయి మందిసవతులతోఁ గూడినదై రావణుఁడు మృతుఁడగుటకు రోదనంబు గావించిన స్థలం బిది. ౯

సుందరమగు ముఖముగలదానా! ఇదిగో ఈసముద్రతీరంబుఁజూడుము. ఇచట మేము సముద్రముదాఁటి యారాత్రియంతయు నివసించితిమి. ౧౦

ఏష సేతు ర్మయా బద్ధ స్సాగరే సలిలార్ణవే. ౧౧
తవ హేతో ర్విశాలాక్షి! నళసేతు స్సుదుష్కరః,

పశ్య సాగర మక్షోభ్యం వైదేహి! వరుణాలయమ్. ౧౨
అపార మభిగర్జన్తం శఙ్ఖశుక్తినిషేవితమ్,

హిరణ్యనాభం శైలేన్ద్రం కాఞ్చనం పశ్య మైథిలి!. ౧౩
విశ్రమార్థం హనుమతో భిత్త్వా సాగర ముత్థితమ్,

ఏత త్కుక్షౌ సముద్రస్య స్కన్ధావారనివేశనమ్. ౧౪

ఏతత్తు దృశ్యతే తీర్థం సాగరస్య మహాత్మనః,
సేతుబన్ధఇతి ఖ్యాతం త్రైలోక్యేనాభిపూజితమ్. ౧౫
ఏతత్పవిత్రం పరమం మహాపాతకనాశనమ్,

అత్ర పూర్వం మహాదేవః ప్రసాద మకరో త్ప్రభుః. ౧౬

అత్ర రాక్షసరాజో౽య మాజగామ విభీషణః,

ఏషా సా దృశ్యతే సీతే! కిష్కిన్ధా చిత్రకాననా. ౧౭
సుగ్రీవస్య పురీ రమ్యా యత్ర వాలీ మయా హతః,

అథ దృష్ట్వా పురీం సీతా కిష్కిన్ధాం వాలిపాలితామ్. ౧౮
అబ్రవీ త్ప్రశ్రితం వాక్యం రామం ప్రణయసాధ్వసా,

విశాలంబులగు నయనంబులు గలదానా! సగరచక్రవర్తిచేఁ ద్రవ్వింపఁ బడిన సముద్రమునందు నీ నిమిత్తమయి నేనునలునిచేఁ గట్టించిన దుష్కరంబగు సేతు విదిగో చూడుము. ౧౧

సీతా! కలఁచుటకు అలవిగానిదియుఁ బారము లేనిదియు వరుణుని స్థానంబును శంఖశుక్తులతో నొప్పుచున్నదియునై గర్జిల్లుచున్న యిమ్మహాసముద్రముం జూడుము. ౧౨

సీతా! హనుమంతుఁడు సముద్రంబు దాఁటునపుడు అతఁడు విశ్రమించుటకై సముద్రంబు భేదించు లేచిన కాంచనమయంబగు నీమైనాకపర్వతంబుఁ జూడుము. ౧౩

సముద్రమధ్యంబున సేతువుపయి ఈస్థలంబున వానరసేనయంతయుఁ విడిసియుండినది. ౧౪

మహానుభావుఁడగు సముద్రునందు సేతుబంధమను నీతీర్థముఁ జూడుము ఇది ముల్లోకంబులచేతనుం బూజితమయినది. ౧౫

ఇమ్మహాతీర్థము పవిత్రమయినది, సమస్తతీర్థములలో నుత్తమమయినది. ఇందు స్నానముచేసినయెడ మహాపాతకములు నశించును.

ఇచట సేతుబంధము సేయుటకుమున్ను లోకనాథుండగు మహేశ్వరుండు నాకుఁ గార్యసిద్ధి యగునట్లు అనుగ్రహించెను. ౧౬

ఈస్థలంబుననె రాక్షసరాజయిన యీ విభీషణుఁడు నాయొద్దకు వచ్చెను.

సీతా! ఇదిగో చిత్రములయిన యుడవులుగలదియుఁ సుందరమయినదియుఁ నగు సుగ్రీవుని రాజధాని కిష్కింధాపురి కానఁబడుచున్నది. చూడుము. ఇది నేను వాలినివధించినస్థలము. అని రాముఁడు సీతతోఁ జెప్పెను. ౧౭

అంతసీతాదేవి పూర్వము వాలిచేఁ బాలితమయియుండిన కిష్కింధానగరముఁ బొడగాంచి రామునిఁజూచి ప్రేమయుఁ భయంబునుంగదుర సవినయంబుగా నిట్లనిపలికెను. ౧౮

సుగ్రీవప్రియభార్యాభి స్తారా ప్రముఖతో నృప. ౧౯
అన్యేషాం వానరేన్ద్రాణాం స్త్రీభిః పరివృతా హ్యహమ్,
గన్తు మిచ్ఛే సహాయోధ్యాం రాజధానీం త్వయానఘ!. ౨౦

ఏవముక్తోఽథ వైదేహ్యా రాఘవః ప్రత్యువాచ తామ్,
ఏవ మస్త్వితి కిష్కిన్ధాం ప్రాప్య సంస్థాప్య రాఘవః. ౨౧
విమానం ప్రేక్ష్య సుగ్రీవం వాక్యమేత దువాచ హ,
బ్రూహి వానరశార్దూల! సర్వా న్వానరపుఙ్గవాన్. ౨౨
స్వదారసహితా స్సర్వే హ్యయోధ్యాం యాన్తు సీతయా,

తథా త్వమపి సర్వాభిః స్త్రీభి స్సహ మహాబల!. ౨౩
అభిత్వరస్వ సుగ్రీవ! గచ్ఛామః ప్లవగేశ్వర!,

ఏవ ముక్తస్తు సుగ్రీవో రామేణామితతేజసా. ౨౪
వానరాధిపతి శ్శ్రీమాం స్తైశ్చ సర్వై స్సమావృతః,
ప్రవిశ్యాన్తఃపురం శీఘ్రం తారా ముద్వీక్ష్య భాషత. ౨౫

ప్రియే! త్వం సహ నారీభిర్వానరాణాం మహాత్మనామ్,
రాఘవేణాభ్యనుజ్ఞాతా మైథిలీ ప్రియకామ్యయా. ౨౬

త్వర త్వ మభిగచ్ఛామో గృహ్య వానరయోషితః,
అయోధ్యాం దర్శయిష్యామ స్సర్వా దశరథస్త్రియః. ౨౭

సుగ్రీవస్య వచ శ్శ్రుత్వా తారా సర్వాఙ్గశోభనా,
ఆహూయ చాబ్రవీ త్సర్వా వానరాణాం తు యోషితః. ౨౮

పాపరహితుఁడవగు రాజా! తారమొదలయిన సుగ్రీవుని ప్రియభార్యలతోను ఇతరులగువానరోత్తముల యందఱిభార్యలతోనుఁ గూడినదాననై నేను నీతో రాజధానియగు నయోధ్యం బ్రవేశింపవలెనని కోరుచున్నాను. అని సీతాదేవి రాముఁనితోఁ జెప్పెను. ౧౯,౨౦

అంత రాముఁడు సీతావాక్యంబువిని యాబిడంజూచి "నీయిష్టప్రకారమగుఁగాక" యనిపలికి కిష్కింధం జేరఁగానే పుష్పకంబు నిలిపి సుగ్రీవుం జూచి యీమాటం జెప్పెను. ౨౧

వానరోత్తముఁడవగు సుగ్రీవుఁడా! వానరులందఱుఁ దమతమ భార్యలతోఁ గూడినవారలయి యయోధ్యకు రావలెనని సీత కోరుచున్నది కావున నవ్విధంబు గావింపుఁడని వానరవీరులకందఱకుం జెప్పుము. ౨౨

మహాబలుఁడవు వానరేశ్వరుండవగు సుగ్రీవుఁడా! అట్లు నీవు భార్యలనందఱిం దీసికొనిరమ్ము. జాగు సేయకుము. శీఘ్రముగాఁ బోవలెను. అని రాముఁడు సుగ్రీవునితోఁ జెప్పెను. ౨౩

శ్రీమంతుఁడు సమస్తవానరవీరులచేఁ బరివృతుండునగు వానరరాజు సుగ్రీవుఁడు కొలఁదికిమీఱిన పరాక్రమంబుగల రామునివచనంబువిని శీఘ్రంబునఁ గిష్కింధకుఁ బోయి యంతఃపురంబుఁజొచ్చి యచటఁ దారం జూచి యిట్లనిపలికెను. ౨౪,౨౫

ప్రియురాలా! నీవును మహాపరాక్రమశాలులగు నితరవానరుల భార్యలును తనతోఁగూడ నయోధ్యకు రావలెనని సీతాదేవికోరెను గావున రాముండాప్రకారముసేయుటకై యాజ్ఞాపించెను. ౨౬

నీవు జాగుసేయవలదు. వానరభార్యలనందఱిం బిలుచుకొనిపోవుదము. ఆ అయోధ్యానగరముజూచి దశరథభార్యలనందఱను సందర్శించి నత్తము. అని సుగ్రీవుఁడు తారతోఁ జెప్పెను. ౨౭

తార సుగ్రీవువచనంబువిని సమస్తావయవంబులందును అలంకరించుకొని వానరభార్యలనందఱిం బిలిచి యిట్లని పలికెను. ౨౮

సుగ్రీవేణాభ్యనుజ్ఞాతా గన్తుం సర్వైశ్చ వానరైః,
మమ చాపి ప్రియం కార్య మయోధ్యాదర్శనేన చ. ౨౯
ప్రవేశం చాపి రామస్య పౌరజానపదైస్సహ,
విభూతిం చైవ సర్వాసాం స్త్రీణాం దశరథస్య చ. ౩౦

తారయా చాభ్యనుజ్ఞాతాస్సర్వా వానరయోషితః,
నైపథ్యం విధిపూర్వేణ కృత్వాచాపి ప్రదక్షిణమ్. ౩౧
అధ్యారోహ న్విమానం తత్సీతాదర్శనకాఙ్క్షయా,

తాభి స్సహోత్థితం శీఘ్రం విమానం ప్రేక్ష్య రాఘవః. ౩౨
ఋశ్యమూకసమీపే తు వైదేహీం పునరబ్రవీత్,

దృశ్యతేఽసౌ మహాన్ సీతే! సవిద్యుదివ తోయదః. ౩౩
ఋశ్యమూకో గిరిశ్రేష్ఠః కాఞ్చనై ర్ధాతుభి ర్వృతః,

అత్రాహం వానరేన్ద్రేణ సుగ్రీవేణ సమాగతః. ౩౪
సమయశ్చ కృత స్సీతే! వధార్థం వాలినో మయా,

ఏషా సా దృశ్యతే పమ్పా నళినీ చిత్రకాననా. ౩౫
త్వయా విహీనో యత్రాహం విలలాప సుదుఃఖితః,
అస్యా స్తీరే మయా దృష్టా శబరీ ధర్మచారిణీ. ౩౬
అత్ర యోజనబాహుశ్చ కబన్ధో నిహతో మయా,

దృశ్యతే చ జనస్థానే సీతే! శ్రీమా న్వనస్పతిః. ౩౭

మీరలు మీమీభర్తలతో నయోధ్యకు రావలెనని సుగ్రీవుం డానతిచ్చెను. మీరలు నాతోఁగూడ నయోధ్యకు వచ్చి యందలివిశేషములం జూచి నాకును సంతోషంబుగావింపవలెను. పౌరులును జానపదులును నెదుర్కొన రాముఁడు పేరోలగంబున నయోధ్యాపురిం బ్రవేశించుటను దశరథభార్యల యందఱియైశ్వర్యంబును గన్నులారం జూచివత్తము. అని తార వానరస్త్రీలకుఁ జెప్పెను. ౨౯, ౩౦

అంత వానరభార్యలందఱు తారయనుమతి యయినంతనె యథావిధి మంగళాచరణపూర్వకంబుగా నలంకారంబు గావించుకొని సీతాదేవింజూచు కోరికి మనంబున ముప్పిరిగొన నవ్విమానంబునకు బ్రదక్షిణంబగునట్లుగాఁ బోయి తారాసహితంబుగా నారోహించిరి. ౩౧

రాముఁడు, తార మున్నగు వానరస్త్రీలు ఆరోహించినవెనుక నవ్విమానంబు శీఘ్రముగా నాకాశమున కెగసిపోవుటంజూచి ఋశ్యమూకసమీపంబుఁ జేరఁగానే సీతంజూచి యిట్లనపలికెను. ౩౨

సీతా! పర్వతోత్తమంబగు నీఋశ్యమూకగిరి కాంచనధాతువులచేఁ బరివృతమయి యుండుటవలన మెఱపులతోఁగూడిన మేఘమువలె నొప్పుచున్నది చూడుము. ౩౩

సీతా! ఈపర్వతంబునందే నాకును వానరరాజయిన సుగ్రీవునకును సమాగమంబు గలిగెను, ఇచటనే నేను వాలినివధించుటకై ప్రతిజ్ఞ గావించితిని. ౩౪

ఇదిగో సుందరములయిన యడవులుగల పంపాసరస్సున్నది చూడుము. ఇచట నేను నిన్నుఁ బాసియున్నందునఁ బరమదుఃఖితుఁడనై విలపించితిని. ౩౫

ఈపంపాసరస్సుతీరంబున నేను దాపసియయిన శబరింజూచితిని ౩౬

ఈస్థలంబున నేను యోజనదీర్ఘంబులయిన బాహువులుగల కబంధుఁ డనువానిం జంపితిని.

అధికమయిన విలాసముగలసీతా! ఏవృక్షము సమీపంబున హింసకుం

యత్ర యుద్ధం మహద్వృత్తం తవ హేతో ర్విలాసిని!,
రావణస్య నృశంసస్య జటాయోశ్చ మహాత్మనః. ౩౮

ఖరశ్చ నిహతో యత్ర దూషణశ్చ నిపాతితః,
త్రిశిరాశ్చ మహావీర్యో మయా బాణై రజిహ్మగైః. ౩౯
ఏతత్తదాశ్రమపద మస్మాకం వరవర్ణిని!,
పర్ణశాలా తథా చిత్రా దృశ్యతే శుభదర్శనా. ౪౦
యత్ర త్వం రాక్షసేన్ద్రేణ రావణేన హృతా బలాత్,

ఏషా గోదావరీ రమ్యా ప్రసన్నసలిలా శివా. ౪౧
అగస్త్యస్యాశ్రమో హ్యేష దృశ్యతే పశ్య మైథిలి!,

దీప్తశ్చైవాశ్రమో హ్యేష సుతీక్ష్ణస్య మహాత్మనః. ౪౨

వైదేహి! దృశ్యతే చాత్ర శరభఙ్గాశ్రమో మహాన్,
ఉపయాత స్సహస్రాక్షో యత్ర శక్రః పురందరః. ౪౩

అస్మి న్దేశే మహాకాయో విరాధో నిహతో మయా,
ఏతే హి తాపసావాసా దృశ్యన్తే తనుమధ్యమే!. ౪౪
అత్రిః కులపతి ర్యత్ర సూర్యవైశ్వానరప్రభః,

అత్ర సీతే! త్వయా దృష్టా తాపసీ ధర్మచారిణీ. ౪౫
అసౌ సుతను! శైలేన్ద్ర శ్చిత్రకూటః ప్రకాశతే,
యత్ర మాం కైకయీపుత్రః ప్రసాదయితు మాగతః. ౪౬

డగు రావణునకును మహాత్ముండగు జటాయువునకును మహాయుద్ధంబు జరిగెనో, జటాయువునకును వాసస్థానమయిన యుత్తమంబగు ఆవటవృక్షంబు జనస్థానంబునఁ గానఁబడుచున్నది చూడుము. ౩౭,౩౮

ఉత్తమవనితవగు సీతా! నేనుఖరుని దూషణుని మహాపరాక్రముఁడగు త్రిశిరుని గుఱిదప్పనిబాణముల నేస్థలంబున వధించితినో, అట్టిమనయాశ్రమపదం బిదిగో కానఁబడుచున్నది చూడుము. ౩౯

ఇదిగో సుందరంబును మంగళకరంబునగు మనపర్ణశాలంజూడుము. ఇచటనే రాక్షసేంద్రుఁడగు రావణుండు బలాత్కారంబున నిన్నపహరించెను. ౪౦

సీతా! రమణీయంబును నిర్మలమయిన జలముగలదియు మంగళకరియు నగు నీగోదావరినదిం జూడుము. ఇదిగో ఆగస్త్యమహర్షియాశ్రమము కానఁబడుచున్నది. ౪౧

మహానుభావుండగు సుతీక్ష్ణునియాశ్రమము నిదిగో దేదీప్యమానంబయి యున్నది చూడుము. ౪౨

సీతా! వేయికన్నులు గలవాఁడును, శత్రుపురంబుల భేదించినవాఁడు నగు దేవేంద్రుండెచటికి వచ్చినాఁడో అట్టిమహనీయంబగు శరభంగాశ్రమము ఇచటఁ గానఁబడుచున్నది చూడుము. ౪౩

ఈస్థలంబుననె మహాకాయుండగు విరాధుండు నాచేఁజచ్చెను.

సన్నని కౌనుగలదానా! సూర్యాగ్నులువలె మహాతేజుండగు నత్రిమహర్షి యెచటనున్నాఁడో, ఆఋష్యాశ్రమములు ఇవిగో యగపడుచున్నవి. ౪౪

సీతా! ఇచటనె నీవు పరమధార్మికయగునసూయాదేవిం జూచితివి.

సుందరమయిన మేనుగలదానా! ఇదిగో పర్వతశ్రేష్ఠంబగు చిత్రకూటంబు ప్రకాశించుచున్నది చూడుము నన్ను రాజ్యంబంగీకరింపుమని వేఁడుటకై కైకేయీకుమారుండగు భరతుం డిచటికే వచ్చినాఁడు. ౪౬

ఏషా సా యమునా దూరా ద్దృశ్యతే చిత్రకాననా,
భరద్వాజాశ్రమో యత్ర శ్రీమానేష ప్రకాశతే. ४८

ఏషా త్రిపథగా గఙ్గా దృశ్యతే వరవర్ణిని,
నానాద్విజగణాకీర్ణా సంప్రపుష్పితకాననా. ४౯

శృఙ్గిబేరపురం చైత ద్గుహో యత్ర సమాగతః,
ఏషా సా దృశ్యతే సీతే! సరయూ ర్యూపమాలినీ. ४౯
నానాతరుశతాకీర్ణా సంప్రపుష్పితకాననా,

ఏషా సా దృశ్యతేఽయోధ్యా రాజధానీ పితు ర్మమ. ౫౦
అయోధ్యాం కురు వైదేహి! ప్రణామం పునరాగతా,

తత స్తే వానరా స్సర్వే రాక్షసశ్చ విభీషణః. ౫౧
ఉత్పత్యోత్పత్య దదృశు స్తాం పురీం శుభదర్శనామ్,
తత స్తు తాం పాణ్డురహర్మ్యమాలినీం
విశాలకక్ష్యాం గజవాజిసంకులామ్. ౫౨
పురీ మయోధ్యాం దదృశుః ప్లవఙ్గమాః
పురీం మహేన్ద్రస్య యథాఽమరావతీమ్.

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే షడ్వింశత్యుత్తరశతతమస్సర్గః.

అల్లదిగో యమునానది సుందరములైన యడవులతో దూరంబునం గనఁబడుచున్నది.

భరద్వాజమహర్షి యాశ్రమంబున శ్రీమంతంబగు ప్రదేశ మిదిగో భాసిల్లుచున్నది. ४२

వనితారత్నమా! నానావిధపక్షిసమూహముచే సేవితంబయి తీరంబులం జక్కఁగాఁ బూచినయడవులతో నొప్పుచున్న యాకాశభూపాతాళంబులం బొందుటచేఁద్రిపథగ యనంబడు గంగానది యిదిగో కానఁబడుచున్నది.

ఇదిగో శృంగిబేరపురము, ఇచటనే గుహుఁడు మనయొద్దకు వచ్చెను.

సీతా! తీరంబులందుఁ జక్కఁగాఁ బుష్పించిన నానావిధములగు పెక్కువృక్షములతో నొప్పుచున్నదియుఁ దీరప్రదేశంబుల ననేకయజ్ఞంబులు సేయఁబడి యుండుటవలనఁ బెక్కు యూపస్తంభములతోఁ గూడినదియు నగు మన మయోధ్యసమీపంబున నున్న సరయూనది యిదిగో కనఁబడుచున్నది. ४९

మా నాయనగారి రాజధానియైన యీ యయోధ్యానగరియుఁ గానఁబడుచున్నది చూడుము. సీతా! అయోధ్యకు మరల సుఖంబున వచ్చినావు కావున ఈనగరికి నమస్కరింపుము. అని రాముండు సీతతోఁ బలికెను. ५०

అంత వానరులు రాక్షసుఁడు విభీషణుండు అందఱును లేచి చూచు వారలకు మంగళకరమయిన యయ్యయోధ్యానగరిం జూచిరి. ५१

అంత స్వచ్ఛములయిన మేడలతోను విశాలములయిన తొట్టికట్లుగల గృహంబులతోనుం గూడినదియు గుఱ్ఱంబులును ఏనుంగులును అధికముగాఁ గలదియునగు నయ్యయోధ్యాపురిని వానరులు సందర్శించిరి. ५२

ఇది నూటయిరువదియాఱవసర్గము.

సప్తవింశత్యుత్తరశతతమస్సర్గః.

పూర్ణే చతుర్దశే వర్షే పఞ్చమ్యాం లక్ష్మణాగ్రజః,
భరద్వాజాశ్రమం ప్రాప్య వవన్దే నియతో మునిమ్. ౧

సోఽపృచ్ఛ దభివాద్యైనం భరద్వాజం తపోధనమ్,

శృణోషి కచ్చి ద్భగవన్! సుభిక్షానామయం పురే. ౨
కచ్చిచ్చ యుక్తో భరతో జీవ న్త్యపి చ మాతరః,

ఏవ ముక్తస్తు రామేణ భరద్వాజో మహామునిః. ౩
ప్రత్యువాచ రఘుశ్రేష్ఠం స్మితపూర్వం ప్రహృష్టవత్,

పఙ్కదిగ్ధస్తు భరతో జటిల స్త్వాం ప్రతీక్షతే. ౪
పాదుకే తే పురస్కృత్య సర్వం చ కుశలం గృహే,

త్వాం పురా చీరవసనం ప్రవిశ న్తం మహావనమ్. ౫
స్త్రీతృతీయం చ్యుతం రాజ్యా ద్ధర్మకామం చ కేవలమ్,
పదాతిం త్యక్తసర్వస్వం పితుర్వచన కారిణమ్. ౬
సర్వభోగైః పరిత్యక్తం స్వర్గచ్యుత మివామరమ్,
దృష్ట్వా తు కరుణాపూర్వం మమాఽసీ త్సమితింజయ!. ౭
కైకేయీవచనే యుక్తం వన్యమూలఫలాశినమ్,

## నూటయిరువదియేడవసర్గము.

చైత్రశుద్ధ పంచమియందు రాముండు వనవాసంబునకై యయోధ్య విడిచినవాఁడు కావున మరల నాచైత్రశుద్ధచతుర్థికి బదునాలుగేండ్లు నిండిన పిమ్మట శుద్ధపంచమియందు లక్ష్మణాగ్రజుండగు రాముండు భరద్వాజాశ్రమంబుఁ జేరి భక్తితో నమ్మహామునికి నమస్కారము గావించెను. ౧

రాముండు తపమే ధనముగాఁగల భరద్వాజమహర్షికి నమస్కరించి యాతనినివ్విధంబున నడిగెను.

భగవంతుఁడా! అయోధ్యానగరంబున సుభిక్షమును ఆరోగ్యముగా నున్నసంగతిని వింటివాయేమి? భరతుండు చక్కఁగాఁ బ్రజాపాలనంబు సేయుచున్నాఁడా? మాతల్లులందఱును సుఖముగ నున్నారాయేమి? అని రాముండు భరద్వాజు నడిగెను. ౨

ఇట్లు రాముండడుగఁగానే భరద్వాజమహర్షి రాముని మరలం జూడఁ గలుగుటకు సంతుష్టుండై రఘువంశమునఁ బుట్టినవారిలోనెల్ల నుత్తముఁడగు రాముంజూచి "ఇతండు సర్వజ్ఞుండై యుండినన్నడుగుచున్నాఁడు" అనిచిఱునగవు మోమునందెలంగ నిట్లనిపలికెను. ౩

భరతుఁడో దేహసంస్కారము లేకపోవుటవలన మలినితోఁగూడిన దేహముతోజటాధారియయి నీపాదుకల పాందిడికొని ప్రజాపాలనము సేయుచు నీరాక కెదురుచూచుచున్నాఁడు; గృహమున సమస్తమును క్షేమముగానున్నది. ౪

శత్రుసమూహంబుల జయించునట్టి రాముఁడా! నీవు మున్ను తండ్రియాజ్ఞను బాలించువాఁడవై కైకేయి వచనంబు శిరసావహించి సీతాలక్ష్మణసహితుండవై పురాతనములైన నారచీరలను ధరించి రాజ్యంబుఁబాసి ధర్మంబు మాత్రమె యవలంబించి సర్వస్వంబును విడిచి సమస్తభోగంబులనుం బరిత్యజించి అడవియందుఁబుట్టిన ఫలమూలంబులె యాహారంబుగాఁ గొనుచుఁ గాలినడక నడిచి మహారణ్యంబుఁ బ్రవేశింపవచ్చినప్పుడు నిన్నుఁజూడఁగానే నాకు మిక్కిలియు దుఃఖమయ్యెను. ౫-౭

సాంప్రతం సుమృద్ధార్థం సమిత్రగణబాన్ధవమ్. ౮
సమీక్ష్య విజితారిం త్వాం మమ ప్రీతిరనుత్తమా,

సర్వం చ సుఖదుఃఖం తే విదితం మమ రాఘవ!. ౯

యత్త్వయా విపులం ప్రాప్తం జనస్థానవధాదికమ్,
బ్రాహ్మణార్థే నియుక్తస్య రక్షితుస్సర్వతాపసాన్. ౧౦
రావణేన హృతా భార్యా బభూవేయ మనిన్దితా,
మారీచదర్శనం చైవ సీతోన్మథనమేవ చ. ౧౧
కబన్ధదర్శనం చైవ పమ్పాభిగమనం తథా,
సుగ్రీవేణ చ తే సఖ్యం యచ్చ వాలీ హత స్త్వయా. ౧౨
మార్గణం చైవ వైదేహ్యాః కర్మ వాతాత్మజస్య చ,
విదితాయాం చ వైదేహ్యాం నళసేతు ర్యథా కృతః. ౧౩
యథా వా దీపితా లఙ్కా ప్రహృష్టై ర్హరియూథపైః,
సపుత్రబాన్ధవామాత్యస్సబలస్సహవాహనః. ౧౪
యథా వినిహత స్సఙ్ఖ్యే రావణో దేవకణ్టకః,
సమాగమశ్చ త్రిదశై ర్యథా దత్తశ్చ తే వరః. ౧౫
సర్వం మమైత ద్విదితం తపసా ధర్మవత్సల,
అహమప్యత్ర తే దద్మి వరం శస్త్రభృతాం వర!. ౧౬
అర్ఘ్యమద్య గృహాణేదమయోధ్యాం శ్వో గమిష్యసి,

తస్య తచ్ఛిరసా వాక్యం ప్రతిగృహ్య నృపాత్మజః. ౧౭
బాఢ మిత్యేవ సంహృష్టో ధీమా న్వర మయాచత,
అకాలే ఫలినో వృక్షా స్సర్వే చాపి మధుస్రవాః. ౧౮

ఇప్పుడో కార్యసిద్ధినొంది శత్రువులజయించి స్నేహితులను బంధువులనుంగూడి క్షేమంబుగా వచ్చిన నిన్నుంజూడంగా నాకుఁ బరమసంతోషంబు గలుగుచున్నది. ౮

రాముఁడా! నీవు వనవాసకాలంబునంగలిగిన సుఖదుఃఖమంతయును నాకుఁ దెలిసియున్నది. ౯

ధర్మమునం దధికప్రీతిగల రాముఁడా! నీవు జనస్థానంబున ఖరాది రాక్షసుల వధించుటయు మహర్షులు యాచించుటవలన నీవిట్లు రాక్షసులవధించి సమస్తమునుల రక్షించుచుండఁగా అనిందిత యయిననీభార్యను రావణుం డప హరింపఁ దలంచుటయు మారీచుండు జింకరూపంబున వచ్చుటయు రావణుండు సీత నపహరించుటయు నీవుకబంధుంజూచి వధించుటయు పంపా సరస్సునకుఁ బోవుటయు సుగ్రీవునితో సఖ్యంబు గావించుటయు వాలిని వధించుటయు వానరులు సీతాదేవిని వెదకుటయు హనుమంతుఁడు సముద్రంబు దాఁటి లంకయందుఁ బెక్కురాక్షసులవధించి సీతం గాంచుటయు సీతావృత్తాంతము దెలిసినమీఁద నలునిచే సముద్రమునకు సేతువుకట్టం బడుటయు వానరవీరు లుత్సాహమునొంది లంకను దహించుటయు దేవకంటకుండగు రావణుండు పుత్రమిత్రబంధుసహితంబుగా సైన్యసమేతంబుగా యుద్ధంబున నీచే వధింపఁబడుటయు బ్రహ్మాదులు నీయొద్దకు వచ్చుటయు నీకు ఇంద్రుండు వరంబొసంగుటయు నీవృత్తాంతములంతయు నేను దపోబలంబున నెఱింగితిని. ౧౦-౧౫

ఆయుధంబు ధరించినవారిలో నుత్తముఁడా! నేనును ఇచటనీకు వరం బొసంగెదను అడుగుము. ఇప్పుడు నాకావించుపూజంగైకొని రేపు అయోధ్యకుఁబొమ్ము. అని భరద్వాజుండు రామునితోఁజెప్పెను. ౧౬

బుద్ధిమంతుండగు రాచకొమరుండు రాముండు భరద్వాజమహర్షి వచనంబును శిరసావహించి అట్లె యనిపలికి యీవరము నడిగెను. ౧౭

భగవంతుఁడవగు భరద్వాజుఁడా! నే నయోధ్యకుఁ బోవుమార్గంబున

ఫలాన్యమృతకల్పాని బహూని వివిధాని చ,
భవన్తు మార్గే భగవ! న్నయోధ్యాం ప్రతిగచ్ఛతః. ౧౯

తథేతి చ ప్రతిజ్ఞాతే వచనా త్స మనన్తరమ్,
అభవ న్పాదపా స్తత్ర స్వర్గపాదపసన్నిభాః. ౨౦

నిష్ఫలాః ఫలిన శ్చాస న్విపుష్పాః పుష్పశాలినః,

శుష్కా స్సమగ్రపత్రా స్తే నగా శ్చైవ మధుస్రవాః. ౨౧
సర్వతో యోజనా త్రీణి గచ్ఛతా మభవం స్తదా,

తతః ప్రహృష్టాః ప్లవగర్షభా స్తే
బహూని దివ్యాని ఫలాని చైవ. ౨౨
కామా దుపాశ్నన్తి సహస్రశ స్తే
ముదాన్వితాస్స్వర్గజితో యథైవ,

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే-సప్తవింశత్యుత్తరశతతమస్సర్గః.

---

## అష్టావింశత్యుత్తరశతతమస్సర్గః.

అయోధ్యాం తు సమాలోక్య చిన్తయామాస రాఘవః,

చిన్తయిత్వా హనూమన్త మువాచ ప్లవగోత్తమమ్. ౧

జానీహి కచ్చి త్కుశలీ జనో నృపతిమన్దిరే,

వృక్షము లన్నియుం గాలముగానియప్పుడు గూడ ఫలవంతంబులయి మధువు స్రవించుచుండవలెను. ఫలంబు లమృతంబువంటి రుచిగలిగి యనేకంబులు గాను నానావిధంబులుగా నుండవలెను. అని రాముండు భరద్వాజమహర్షి ని వరంబడిగెను. ౧౮,౧౯

అమ్మహర్షి యట్లైయని ప్రతిజ్ఞ సేయుటయుం ఆయునయామాటల చెప్పి నంతనె యచటివృక్షములన్నియుం స్వర్గమునందలి కల్పవృక్షములవలె సర్వకామ సమృద్ధంబులై యొప్పినవి. ౨౦

అంతకుమున్ను ఫలింపకుండిన వృక్షంబులు ఫలవంతంబు లయినవి. పుష్పింపనివి పుష్పించినవి

అప్పుడు ఆవానరులయోధ్యకుం బోవునప్పుడు మార్గంబున నెటుచూచినను మూడామడలవఱకు ఎండిపోయుండిన వృక్షములన్నియుం బత్రంబులతో నిండినవై తేనియ స్రవింపసాగినవి. ౨౧

అంత నవ్వానరోత్తములు మేనంబులకలంకరింపఁ బరమసంతోషంబు నొంది దివ్యంబులగు నాఫలంబులను యథేష్టంబుగా వేలకొలంది భక్షించుచు స్వర్గంబుననుండు వారలుంబోలె నానందంబు నొందిరి. ౨౨

ఇది నూటయిరువదియేడవసర్గము.

---

## నూటయిరువదియెనిమిదవసర్గము.

రాముండు అయోధ్యం దలంచుకొని మనంబునఁ గొంతదడ వాలోచించెను.

రాముండు అట్లాలోచించి వానరోత్తముండగు హనుమంతుం బిలిచి యిట్లని పలికెను. ౧

అయోధ్యలో రాజుగారి నగరిలో మాతల్లులు మొదలగువారలందఱు క్షేమముగా నున్నసంగతిం దెలిసికొనుము.

శృఙ్గిబేరపురం ప్రాప్య గుహం గహనగోచరమ్. ౨
నిషాదాధిపతిం బ్రూహి కుశలం వచనా న్మమ,

శ్రుత్వా తు మాం కుశలినమరోగం విగతజ్వరమ్. ౩
భవిష్యతి గుహః ప్రీత స్సమమాత్మసమ స్సఖా,

అయోధ్యాయాశ్చ తే మార్గం ప్రవృత్తిం భరతస్య చ. ౪
నివేదయిష్యతి ప్రీతో నిషాదాధిపతి ర్గుహః,
భరతస్తు త్వయా వాచ్యః కుశలం వచనా న్మమ. ౫
సిద్ధార్థం శంస మాం తస్మై సభార్యం సహలక్ష్మణమ్,

హరణం చాపి వైదేహ్యా రావణేన బలీయసా. ౬
సుగ్రీవేణ చ సంసర్గం వాలినశ్చ వధం రణే,
మైథిల్యన్వేషణం చైవ యథా చాధిగతా త్వయా. ౭
లఙ్ఘయిత్వా మహాతోయ మాపగాపతి మవ్యయమ్,
ఉపయానం సముద్రస్య సాగరస్య చ దర్శనమ్. ౮
యథా చ కారిత స్సేతూ రావణశ్చ యథా హతః,
వరదానం మహేన్ద్రేణ బ్రహ్మణా వరుణేన చ. ౯
మహాదేవ ప్రసాదాచ్చ పిత్రా మమ సమాగమమ్,
ఉపయాతం చ మాం సౌమ్య! భరతస్య నివేదయ. ౧౦
సహ రాక్షసరాజేన హరీణాం ప్రవరేణ చ,
ఏతచ్ఛ్రుత్వా య మాకారం భజతే భరత స్తదా. ౧౧
స చ తే వేదితవ్యస్స్యా త్సర్వం యచ్చాపి మాం ప్రతి,
జిత్వా శత్రుగణా న్రామః ప్రాప్య చానుత్తమం యశః. ౧౨

నీవు నామాటప్రకారమున శృంగిబేరపురమునకుఁ బోయి యచట వనచరుండును నిషాదరాజునగు గుహుం జూచి యతనికి నా క్షేమంబుఁ జెప్పుము. ౨

నేను రోగమేమియుం లేక శత్రువుల జయించి క్షేమముగ వచ్చినానని విన్నంతనె గుహుండు మిక్కిలియుం సంతోషంబు నొందఁగలఁడు. అతఁడు నాకు ఎంతమాత్రము భేదములేని (నాహృదయమువంటి) నాప్రాణమువంటి) స్నేహితుఁడు. 3

బోయల రాజయిన గుహుండు అయోధ్యకుఁ బోవు మార్గంబును భరతుని వృత్తాంతమును నీకు సంతోషంబునం జెప్పఁగలఁడు. ౪

నావచనంబువలన భరతునకును నా క్షేమంబుఁ జెప్పుము. నేను వనవాసవ్రతంబు నెఱవేర్చి సీతాలక్ష్మణసహితంబుగా క్షేమంబున వచ్చినాననియుఁ నతనికిఁ జెప్పుము. ౫

సౌమ్యుఁడవగు హనుమంతుఁడా! సీతను బలవంతుఁడగు రావణుం డపహరించుటయుం నేను సుగ్రీవునితో సఖ్యంబు గావించుటయుం యుద్ధంబున వాలిని వధించుటయుం వానరులు సీతను వెదకుటయుం నీవు అంతములేని జలము గలదియుం నదీపతియుఁనగు సముద్రంబు దాఁటి సీతం గాంచుటయుం అందఱును సముద్రమునొద్దకుఁ బోవుటయుం సముద్రుండు నాకు దర్శనం బొసంగుటయుం సముద్రంబున సేతువు నిర్మించుటయుం నేను రావణుని వధించుటయుం బ్రహ్మవరుణానుమతుండై దేవేంద్రుఁడు నాకు వరంబొసంగుటయు నాకు మహేశ్వరానుగ్రహంబునం జేసి నా తండ్రిసమాగమంబు గల్గుటయుం నేను రాక్షసరాజయిన విభీషణునితోను వానరరాజయిన సుగ్రీవునితోను వచ్చుటయు భరతునకుఁ జెప్పుము. ౬. ౧౧

ఈ వృత్తాంత మంతయుం వినినప్పుడు భరతునిముఖంబున నేమి యాకారంబు దోఁచునో నావిషయమయి యేమియింగితంబు బయలుఁపడునో దాని నంతయుం నీవు జాగ్రత్తతో గ్రహింపవలెను. ౧౨

* రాముండు శత్రువుల నందఱం జయించి యుత్తమంబగు కీర్తినొంది

ఉపయాతి సమృద్ధార్థ స్సహ మిత్రై ర్మహాబలైః,
జ్ఞేయాస్సర్వే చ వృత్తాన్తా భరతస్యేఙ్గితాని చ. ౧౩
తత్త్వేన ముఖవర్ణేన దృష్ట్యా వ్యాభాషణేన చ,
సర్వకామసమృద్ధం హి హ స్త్యశ్వరథసంకులమ్. ౧౪
పితృపైతామహం రాజ్యం కస్య నావర్తయే న్మనః,
సంగత్యా భరత శ్శ్రీమా న్రాజ్యార్థీ చే త్స్వయం భవేత్. ౧౫
ప్రశాస్తు వసుధాం కృత్స్నా మఖిలాం రఘునన్దనః,
తస్య బుద్ధిం చ విజ్ఞాయ వ్యవసాయం చ వానర!. ౧౬
యావన్న దూరం యాతాః స్మ క్షిప్ర మాగన్తుమర్హసి,
ఇతి ప్రతిసమాదిష్టో హనుమా న్మారుతాత్మజః. ౧౭
మానుషం ధారయ న్రూప మయోధ్యాం త్వరితో యయౌ,
అథోత్పపాత వేగేన హనుమా న్మారుతాత్మజః. ౧౮
గరుత్మానివ వేగేన జిఘృక్షన్భుజగోత్తమమ్,
లఙ్ఘయిత్వా పితృపథం భుజగేన్ద్రాలయం శుభమ్. ౧౯
గఙ్గాయమునయో ర్మధ్యం సన్నిపాత మతీత్య చ,
శృఙ్గిబేరపురం ప్రాప్య గుహ మాసాద్య వీర్యవాన్. ౨౦
స వాచా శుభయా హృష్టో హనూమా నిద మబ్రవీత్,

సమస్తార్థంబుల నొందినవాఁడై మహాబలశాలు లగు స్నేహితులతోఁ గూడ వచ్చుచున్నాఁడు. అని భరతునితోఁ జెప్పుము. ౧౨

ఈ వచనముఁ జెప్పి భరతుని ముఖవర్ణంబువలనను దృష్టివలనను మాట వలనను ఏమి యూహింపవగునో ఆ వృత్తాంతములు ఇంగితములు అన్నియుం యథార్థముగాఁ దెలిసికొని రమ్ము. ౧౩

సమస్తకాలంబులను సమృద్ధంబును ఏనుఁగులు గుఱ్ఱములు రథములు సమృద్ధముగాఁగలదియుఁ గులక్రమాగతంబునగు రాజ్యంబును అనుభవించు చుండునప్పుడు ఎంతధార్మికుఁడైనను దాని విడుచుట కష్టము. ౧౪

శ్రీమంతుండును రఘువంశమునందుఁ బుట్టినవారికి సంతోషంబు గలి గించువాఁడునగు భరతుఁడు బహుకాల మనుభవించుచుండినందునఁ దానే రాజ్యంబు నపేక్షించునేని ఎంతమాత్రము శంకలేక సర్వసమృద్ధంబైన సమస్తభూమిని అతఁడే పాలించుచుండుఁగాక. ౧౫

హనుమంతుఁడా! నీవు భరతుని యభిప్రాయంబును నిశ్చయంబును దెలిసికొని యతఁడు రాజ్యంబు నపేక్షించునేని మేము దూరము వచ్చుటకు మున్నే మాయొద్దకు రమ్ము. అని రాముఁడు హనుమంతునితోఁ జెప్పెను. ౧౬

వాయుపుత్త్రుండయిన హనుమంతుఁడు ఇవ్విధంబున రాము నాజ్ఞను గ్రహించి మనుష్యరూపంబు నొందినవాఁడై వేగంబున నయోధ్యాపురికిఁ బోవ నుద్యోగించెను. ౧౭

అంత గరుత్మంతుఁడు మంచిసర్పముపైకి వేగంబున నెగసిపోవునట్లు వాయుకుమారుండగు హనుమంతుఁడు వేగంబున నాకాశమున కెగసిపోయెను.

పరాక్రమవంతుఁడగు నా హనుమంతుఁడు అట్లు తన తండ్రి మార్గం బయిన యాకాశమునకు లంఘించి నానా విధ మహాసర్పములకు నివాసస్థాన మయిన మంగళకరంబగు గంగా యమునా సంగమంబు నతిక్రమించి శృంగి బేరపురంబునకుఁ బోయి గుహునిం జూచి సంతుష్టుండై శుభంబగు వచనం బున నిట్లని పలికెను. ౧౮, ౨౦

సఖా తు తవ కాకుత్స్థో రామస్సత్యపరాక్రమః. ౨౧
సహసీతస్స సౌమిత్రిస్స త్వాం కుశల మబ్రవీత్,
షఞ్చమీమద్య రజనీముషిత్వా వచనా న్మునేః. ౨౨
భరద్వాజాభ్యనుజ్ఞాతం ద్రక్ష్యస్యద్యైవ రాఘవమ్,

ఏవ ముక్త్వా మహాతేజా స్సంప్రహృష్టతనూరుహః. ౨౩
ఉత్పపాత మహావేగో వేగవా నవిచారయన్,

సోఽపశ్య ద్రామతీర్థం చ నదీం వాలుకినీం తథా. ౨౪

గోమతీం తాం చ సోఽపశ్య ద్భీమం సాలవనం తథా,
ప్రజాశ్చ బహుసాహస్రాః స్ఫీతాఞ్జనపదానపి. ౨౫

స గత్వా దూరమధ్వానం త్వరితగి కపికుఞ్జరః,
ఆససాద ద్రుమాన్ఫుల్లా న్నన్దిగ్రామసమీపగాన్. ౨౬
స్త్రీభి స్సపుత్త్రైః ర్వృద్ధైశ్చ రమమాణైస్స్వలంకృతాన్,
సురాధిపస్యోపవనే యథా చైత్రరథే ద్రుమాన్. ౨౭

క్రోశమాత్రే త్వయోధ్యాయా శ్చీరకృష్ణాజినామ్బరమ్,
దదర్శ భరతం దీనం కృశమాశ్రమవాసినమ్. ౨౮
జటిలం మలదిగ్ధాఙ్గం భ్రాతృవ్యసనకర్శితమ్,
ఫలమూలాశినం దాన్తం తాపసం ధర్మచారిణమ్. ౨౯

నీ సఖుఁడు సత్యపరాక్రముఁడగు రాముఁడు సీతాలక్ష్మణసహితుఁడై నన్ను నీకుఁ దనక్షేమంబు సెప్పుఁబంచెను. ౧౧

రాముఁడు భరద్వాజమహర్షి పరుపునం జేసి యీపంచమీతిథి రాత్రి భరద్వాజాశ్రమంబునఁ గడపి యెల్లి సూర్యోదయంబున నమ్మహర్షి యనుజ్ఞ నొంది బయలుదేఱి రాఁగలఁడు; శీఘ్రంబున నె యతనిఁ జూడఁగలవు. అని హనుమంతుఁడు గుహునకుఁ జెప్పెను.

మహాపరాక్రమశాలియు నధికమయిన వేగముగలవాఁడునగు హనుమంతుఁడు సకలలోకానందము గలిగించునట్టి రామాగమన వృత్తాంతమును భరతునితోఁ దనకుఁ జెప్పఁగలిగెనని సంతోషంబునం బులకాంకిత శరీరుండై మహావేగంబు నవలంబించి మార్గశ్రమంబు సరకుసేయక (మార్గమునందల వనగిరినదీపురసౌందర్యాదులు గణింపక) యాకాశమార్గంబునం బోయెను. ౧౩

ఆ హనుమంతుఁడు మార్గంబునం బరశురామతీర్థంబును వాలుకినీనదినిం గాంచెను. ౧౪

ఆ హనుమంతుఁడు గోమతీనదిని భయంకరంబగు సాలవృక్షవనంబును బెక్కువేల సంఖ్యగలజనంబులను నానావిధ సస్యంబులచే సమృద్ధములయిన గ్రామములనుం గాంచెను. ౧౫

నా వానరోత్తముండగు హనుమంతుండు వేగంబున బహుదూరంబు పోయి క్రీడించుచున్న స్త్రీబాలవృద్ధజనులచే నలంకృతంబులయి దేవేంద్రుని నందనోద్యానంబునఁ గుబేరుని చైత్రరథంబుననుండు వృక్షంబులవలె సర్వసమృద్ధంబులయి యొప్పుచున్నవియుఁ జక్కఁగాఁ బుష్పించినవియునగు నందిగ్రామప్రాంతవృక్షంబుల సమీపంబునకుఁ బోయెను. ౧౬, ౧౭

అయోధ్యానగరంబునకు రెండుగడియల దూరంబున నాశ్రమంబునందు నివసించుచున్నవాఁడును వల్కలంబులను గృష్ణాజినంబులను గట్టువస్త్రంబుగా నుత్తరీయంబుగాఁ దాల్చినవాఁడును బదునాలుగు సంవత్సరములు పూర్ణములయ్యె నింక రాముఁడు రాలేదేయని దీనుఁడై యున్నవాఁడును

సమున్నతజటాభారం వల్కలాజినవాససమ్,
నియతం భావితాత్మానం బ్రహ్మర్షిసమతేజసమ్. 30
పాదుకే తే పురస్కృత్య శాసన్తం వై వసున్ధరామ్,
చాతుర్వర్ణ్యస్య లోకస్య త్రాతారం సర్వతో భయాత్. 31
ఉపస్థితమమాత్యైశ్చ శుచిభిశ్చ పురోహితైః,
బలముఖ్యైశ్చ యుక్తైశ్చ కాషాయామ్బరధారిభిః. 32

న హి తే రాజపుత్రం తం చీరకృష్ణాజినామ్బరమ్,
పరిభోక్తుం వ్యవస్యన్తి పౌరా వై ధర్మవత్సలాః. 33

తం ధర్మమివ ధర్మజ్ఞం దేహవన్తమివాపరమ్,
ఉవాచ ప్రాఞ్జలిర్వాక్యం హనూమాన్మారుతాత్మజః. 34

వసన్తం దణ్డకారణ్యే యం త్వం చీరజటాధరమ్,
అనుశోచసి కాకుత్స్థం స త్వాం కుశలమబ్రవీత్. 35

ప్రియమాఖ్యామి తే దేవ! శోకం త్యక్ష్యసి దారుణమ్,
అస్మిన్ముహూర్తే భ్రాత్రా త్వం రామేణ సహ సఙ్గతః. 36

నిహత్య రావణం రామః ప్రతిలభ్య చ మైథిలీమ్,
ఉపయాతి సమృద్ధార్థః సహ మిత్రైర్మహాబలైః. 37

భ్రాతృదుఃఖంబునఁ గృశించినవాఁడును ఉన్నతమయిన జటాభారంబు వహించియున్నవాఁడును దేహసంస్కారము లేమిం జేసి దేహమంతయుం మఱికి కితోఁగూడినదిగా నున్నవాఁడును ఫలమూలంబులే యాహారంబుగాఁ గొను చున్నవాఁడును జితేంద్రియుండును దపస్సంపన్నుండును బరమధార్మికుండును నియమయుక్తుండును ఆత్మానుసంధానపరాయణుఁడును బ్రహ్మర్షియుంబోలెఁ దేజస్సంపన్నుండును రాముం డొసఁగిన యాపాదుకలం బురస్కరించుకొని భూమిం బాలించుచున్నవాఁడును జతుర్వర్ణంబులకును విభయంబును బొరయ కుండ సంరక్షణము సేయుచున్నవాఁడును గాషాయవస్త్రంబులు దాలిచి యుపహితులయి పరిశుద్ధులయియున్న మంత్రులుం బురోహితులు సేనాధ్య క్షులుంగొలువఁ బేరోలగంబున నున్నవాఁడునగు భరతుని హనుమంతుఁడు చూచెను. ౨౮, ౩౨

మంత్రులు మున్నగు వారలును గాషాయవస్త్రము ధరించుట కేమి కారణ మనఁగా రాజపుత్త్రుండగు భరతుఁడు నారచీరయుఁ గృష్ణాజినంబును ధరించి యుండఁగాఁ బరమధార్మికులగు మంత్రి ప్రభృతిపౌరులు ఆ భరతుని విడిచి మంచివస్త్రములు మొదలయిన భోగముల ననుభవింప నొల్లరైరి. ౩౩

వాయుకుమారుఁడగు హనుమంతుఁడు సమస్తధర్మంబులుం దెలిసిన వాఁడును మూర్తివహించిన రెండవధర్మదేవతయనం దగియున్నవాఁడు నగు నా భరతుం జూచి చేతులు మోడ్చి యిట్లని పలికెను. ౩౪

దండకారణ్యంబున వల్కలంబులను గట్టుకొని జటాధారియయి యున్న యెవ్వని గుఱించి నీ విట్లు దుఃఖించుచున్నావో ఆ రాముఁడు తన క్షేమమును నీకుఁ జెప్పుటకై నన్నుఁ బంపెను. ౩౫

రాజా! నీకుఁ బ్రియవార్తఁ జెప్పెదను నీ యీ భయంకరమయిన దుఃఖ మంతయు నాశమునొందఁగలదు. ఈ ముహూర్తంబునందే నీవు నీయన్నయగు రామునింగూడి సుఖంబు నొందఁగలవు. ౩౬

రాముండు రావణుని వధించి సీతాదేవిని మరలనొంది సమస్తార్థంబులుం బొందినవాఁడై మహాబలశాలులగు మిత్త్రులతో వచ్చుచున్నాఁడు. ౩౭

లక్ష్మణశ్చ మహాతేజా వైదేహీ చ యశస్వినీ,
సీతా సమగ్రా రామేణ మహేన్ద్రేణ యథా శచీ. ౩౮

ఏవముక్తో హనుమతా భరతో భ్రాతృవత్సలః,
పపాత సహసా హృష్టో హర్షాన్మోహం జగామ హ. ౩౯

తతో ముహూర్తా దుత్థాయ ప్రత్యాశ్వస్య చ రాఘవః,
హనూమన్త మువాచేదం భరతః ప్రియవాదినమ్. ౪౦
అశోకజైః ప్రీతిమయైః కపి మాలిఙ్గ్య సంభ్రమాత్,
సిషేచ భరత శ్శ్రీమా న్విపులై రాస్రబిన్దుభిః. ౪౧

దేవో వా మానుషో వా త్వ మనుక్రోశా దిహాగతః,
ప్రియాఖ్యానస్య తే సౌమ్య! దదామి బ్రువతః ప్రియమ్. ౪౨
గవాం శతసహస్రం చ గ్రామాణాం చ శతం పరమ్,
సుకుణ్డలా శ్శుభాచారా భార్యాః కన్యాశ్చ షోడశ. ౪౩
హేమవర్ణా స్సునాసోరూ శ్శశిసౌమ్యాననాః స్త్రియః,
సర్వాభరణసంపన్నా స్సంపన్నాః కులజాతిభిః. ౪౪

నిశమ్య రామాగమనం నృపాత్మజః
కపిప్రవీరస్య తదద్భుతోపమమ్,
ప్రహర్షితో రామదిదృక్షయాఽభవ
త్పునశ్చ హర్షాదిద మబ్రవీ ద్వచః. ౪౫
ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే - అష్టావింశత్యుత్తరశతతమస్సర్గః.

దేవేంద్రసహితయగు శచీదేవివలె రామసహితయును సమృద్ధార్థయయిన సీతాదేవియును మహాతేజుండగు లక్ష్మణుండును వచ్చుచున్నారు. అని హనుమంతుఁడు భరతునితోఁ జెప్పెను. ౩౮

రామునందు అధికప్రీతిగల భరతుఁడు హనుమంతునివలన రామాగమన వృత్తాంతమును విన్నంతనె తటాలున మహాసంతోషాతిశయంబు వలన మూర్ఛిలి నేలంబడెను. ఆశ్చర్యము! ఇఁక రాముఁడే తటాలున వచ్చినచో నేమవునో! ౩౯

అంతఁ గొంతవడికిఁ దెలివొంది లేచి భరతుఁడు ప్రియవార్తం జెప్పిన హనుమంతుంజూచి యిట్లని పలికెను. ౪౦

శ్రీమంతుఁడగు భరతుఁడు అతిసంభ్రమంబున హనుమంతుం గౌఁగిలించుకొని వెల్లువలయి స్రవించుచున్న యానందబాష్పంబుల నతని దేహమంతయుం దడిపెను. ౩౧

సౌమ్యుఁడా! నీవు నాపై దయగలిగి యిచటిఁ బ్రియవార్తను జెప్పుటకు వచ్చిన దేవతవో లేక మనుష్యుఁడవో తెలియు లేదు. నీవు ఇట్టి పరమప్రియముఁ జెప్పినవాఁడవైతివి కావున నీకు లక్షగోవులను నూఱు ఉత్తమములయిన గ్రామంబులను కుండలాది సమస్తాభరణాలంకృతలు మంచి సదాచారము గలవారలును బంగారమువంటి మేనుగలవారలును సుందరములయిన నాసికము తొడలును మొదలయిన యవయవములుగలవారలు చంద్రునివంటి మోముగలవారలు సత్కులంబున బుట్టినవారలు మంచిజాతియందు జన్మించినవారలు వివాహమాడఁ దగినవారలునగు పదునాఱుగురుఁ గన్యకలను ఒసఁగెదను. అని భరతుఁడు హనుమంతునితోఁ జెప్పెను. ౪౨, ౪౩

రాజపుత్త్రుఁడగు భరతుఁడు హనుమంతునివలన నాశ్చర్యకరంబగు రామాగమనవృత్తాంతమును విని "రామునిఁ జూడఁ గలిగెఁగదా" యని పరమసంతుష్టుఁడై మరల హర్షాతిశయంబున హనుమంతునితో నిట్లని పలికెను,

ఇది నూటయిరువదియెనిమివ సర్గము.

---

## ఏకోనత్రింశదుత్తరశతతమస్సర్గః.

బహూని నామ వర్షాణి గతస్య సుమహద్వనమ్,
శృణోమ్యహం ప్రీతికరం మమ నాథస్య కీర్తనమ్. ౧

కల్యాణీ బత గాథేయం లౌకికీ ప్రతిభాతి మే,
ఏతి జీవన్త మానన్దో నరం వర్షశతాదపి. ౨

రాఘవస్య హరీణాం చ కథమాసీత్సమాగమః,
కస్మి న్దేశే కిమాశ్రిత్య తత్త్వ మాఖ్యాహి పృచ్ఛతః. ౩

స పృష్టో రాజపుత్త్రేణ బృస్యాం సముపవేశితః,
ఆచచక్షే తతస్సర్వం రామస్య చరితం వనే. ౪
యథా ప్రవ్రాజితో రామో మాతుర్దత్తో వర స్తవ,

యథా చ పుత్త్రశోకేన రాజా దశరథో మృతః. ౫
యథా దూతై స్త్వ మానీత స్తూర్ణం రాజగృహా త్ప్రభో!,
త్వయాఽయోధ్యాం ప్రవిష్టేన యథా రాజ్యం నచేప్సితమ్. ౬
చిత్రకూటం గిరిం గత్వా రాజ్యేనామిత్రకర్శనః,
నిమన్త్రిత స్త్వయా భ్రాతా ధర్మ మాచరతా సతామ్. ౭
స్థితేన రాజ్ఞో వచనే యథా రాజ్యం విసర్జితమ్,
ఆర్యస్య పాదుకే గృహ్య యథాఽసి పునరాగతః. ౮
సర్వమేత న్మహాబాహో! యథావ ద్విదితం తవ,
త్వయి ప్రతిప్రయాతే తు యద్వృత్తం తన్నిబోధ మే. ౯

## నూటయిరువదితొమ్మిదవసర్గము.

పెక్కు సంవత్సరంబులు మహారణ్యంబున నివాసము సేయుచుండిన నానాథుఁడు రాముఁడు వచ్చుచున్నాఁడన్న సంతోషకరమయిన వార్తను ఇప్పటికి వినఁగంటిని గదా ! ౧

ఇందువలన "మనుష్యుఁడు బ్రతికియున్నయెడ నూఱుసంవత్సరములకైనను తప్పక యానందంబు నొందును" అను నీ జనవార్త యథార్థమనియె నాకుఁ దోఁచుచున్నది. ౨

రామునకును వానరులకును సమాగమ మెట్లు గలిగినది? ఎచటఁగలిగినది? ఎందుకొఱకుఁ గలిగినది ? అడిగెదను గావున యథార్థముగాఁ జెప్పుము. అని భరతుండు హనుమంతునితోఁ జెప్పెను. ౩

ఇట్లు భరతుండు అడిగి ఒక బుష్యాసనంబుపై హనుమంతుం గూర్చుండఁ బెట్టుటయు నంత హనుమంతుండు అరణ్యంబున జరగిన రామునిచరిత్రము నంతయు భరతునకుఁ జెప్పెను. ౪

మహాబాహుఁడవు శత్రువుల వధించువాఁడవగు భరతుఁడా ! నీ తల్లి కైకేయికి దశరథుండు వరం బొసంగుటయు రాముండు వనంబునకుఁ బంపఁబడుటయుఁ బుత్రశోకంబున దశరథుతుండు మృతుండగుటయు దూతలు నిన్ను రాజగృహంబుననుండి అయోధ్యకుఁ దోడ్కొనివచ్చుటయు నీవు అయోధ్యకు వచ్చి రాజ్యం బంగీకరింపమియు సత్పురుషుల యాచారము నవలంబించి నీవు చిత్రకూటపర్వతమునకుఁ బోయి రాజ్యంబు వహింపుమని రాముం బ్రార్థించుటయు రాముండు దండ్రి యాజ్ఞనుబట్టి రాజ్యంబు నొల్లమియు నీవు రాముని పాదుకలు గ్రహించి మరలివచ్చుటయు ఈ సమాచారమంతయు నీకుఁ జక్కగాఁ దెలిసియున్నది. ౫, ౬

నీవు పాదుకలఁ దీసికొని తిరిగివచ్చిన తరువాత జరిగిన వృత్తాంతముఁ జెప్పెదను. వినుము.

అపయాతే త్వయి తదా సముద్భ్రాన్తమృగద్విజమ్,
పరిద్యూనమివాత్యర్థం తద్వనం సమపద్యత. ౧౦

తద్ధస్తిమృదితం ఘోరం సింహవ్యాఘ్రమృగాయుతమ్,
ప్రవివేశాథ విజనం సుమహద్దణ్డకావనమ్. ౧౧

తేషాం పురస్తాద్బలవాన్గచ్ఛతాం గహనే వనే,
వినదన్ సుమహానాదం విరాధః ప్రత్యదృశ్యత. ౧౨

తముత్క్షిప్య మహానాదమూర్ధ్వబాహు మధోముఖమ్,
నిఖాతే ప్రక్షిపన్తి స్మ నదన్తమివ కుఞ్జరమ్. ౧౩

తత్కృత్వా దుష్కరం కర్మ భ్రాతరౌ రామలక్ష్మణౌ,
సాయాహ్నే శరభఙ్గస్య రమ్య మాశ్రమ మీయతుః. ౧౪

శరభఙ్గే దివం ప్రాప్తే రామస్సత్యపరాక్రమః,
అభివాద్య మునీన్ సర్వా ఞ్జనస్థాన ముపాగమత్. ౧౫

తతః పశ్చాచ్ఛూర్పణఖా రామపార్శ్వ ముపాగతా,

తతో రామేణ సందిష్టో లక్ష్మణ స్సహసోత్థితః. ౧౬
ప్రగృహ్య ఖడ్గం చిచ్ఛేద కర్ణనాసం మహాబలః,
చతుర్దశ సహస్రాణి రక్షసాం భీమకర్మణామ్. ౨౧
హతాని వసతా తత్ర రాఘవేణ మహాత్మనా,

నీవు పాదుకలు తీసికొనిపోయి పిమ్మట నీసైన్యముఁజూచుటచే మృగం
బులును బక్షులును భయంబునొంది కలఁకపడియుండుటవలన నవ్వనంబు
పరితాపము నొందినట్లుండెను. ౧౦

అంత రాముండు అడవి యేనుంగులచేఁ ద్రొక్కఁబడిన సీఁగెలు మొద
లగువానితో నొప్పినదియుఁ సింహంబులు పులులు మృగంబులు గలిగి భయం
కరం బయినదియు విజనంబును అతి విస్తీర్ణంబు నగు దండకారణ్యంబునకుఁ
బోయెను. ౧౧

ఆ సీతారామలక్ష్మణులు విజనంబగు నరణ్యంబునఁ బోవునప్పుడు బల
వంతుండగు విరాధుండను రాక్షసుఁడు మహాధ్వనిగా నఱచుచు వారి కడ్డ
పడెను. ౧౨

వారలు అట్లు అఱచుచు వచ్చిన యావిరాధుని చేతులు ఊర్ధ్వముగా
నుండునట్లు చేతులం గాళ్లుపట్టి తలక్రిందుగా నెత్తి గర్జించుచున్న మదగజ
మును బూడ్చునట్లు పల్లములోఁ బడవైచి పూడ్చిరి. ౧౩

అంతం దోఁబుట్టువులయిన యారామలక్ష్మణులు అట్లు దేవతలకును
అజేయుఁడైన విరాధునిం బూడ్చివైచి నాటిదినము సాయంకాలమునందు
రమణీయమయిన శరభంగమహాముని యాశ్రమంబునకుఁ బోయిరి. ౧౪

శరభంగమహర్షి శరీరమును వదలినపిమ్మట సత్యపరాక్రముఁడగు
రాముఁడు అచ్చటికి వచ్చిన మహర్షుల కందఱకుం బ్రణమిల్లి జనస్థానంబుఁ
జేరెను. ౧౫

అంతఁ గొంతకాలమునకు శూర్పణఖయను రాక్షసి రాముని సమీపం
బునకు వచ్చెను.

అంత రాముఁ డాజ్ఞాపింప మహాబలుండగు లక్ష్మణుండు శీఘ్రింబున
లేచి ఖడ్గంబుదీసి ముక్కుఁజెవుల ఛేదించి వైచెను. ౧౬

మహాప్రభావుండగు రాముండు జనస్థానంబున నుండునపుడు లోక
భయంకరులగు రక్కసులఁ బదునాలుగువేలమందిని వధించెను. ౪౭

ఏకేన సహ సంగమ్య రణే రామేణ సంగతాః. ౧౮
అహ్నశ్చతుర్థభాగేన నిశ్శేషా రాక్షసాః కృతాః,

మహాబలా మహావీర్యా స్తపసో విఘ్నకారిణః. ౧౯
నిహతా రాఘవేణాజౌ దణ్డకారణ్యవాసినః,
రాక్షసాశ్చ వినిష్పిష్టాః ఖరశ్చ నిహతో రణే. ౨౦

తత స్తేనార్దితా బాలా రావణం సముపాగతా,

రావణానుచరో ఘోరో మారీచో నామ రాక్షసః. ౨౧
లోభయామాస వైదేహీం భూత్వా రత్నమయో మృగః,

అథైనమబ్రవీద్రామం వైదేహీ గృహ్యతామయమ్. ౨౨
అహో మనోహరః కాన్త! ఆశ్రమో నో భవిష్యతి,

తతో రామో ధనుష్పాణి ర్ధావన్త మనుధావతి. ౨౩
స తం జఘాన ధావన్తం శరేణ నతపర్వణా,

అథ సౌమ్య! దశగ్రీవో మృగం యాతే తు రాఘవే. ౨౪
లక్ష్మణే చాపి నిష్క్రాన్తే ప్రవివేశాశ్రమం తదా,

జగ్రాహ తరసా సీతాం గ్రహః ఖే రోహిణీ మివ. ౨౫

ఆ పదునాలుగువేల రాక్షసులును ఒకటిగాఁజేరి రామునిపైకి వచ్చిరి. రాముం డొక్కఁడె వారల నెదుర్కొని యుద్ధముచేసి మూఁడుగడియలలో వారల నందఱ నిశ్శేషముగా రూపుమాపెను. ౧౮

తపోవిఘ్నంబు గావించుచు దండకారణ్యంబుననున్న మహాబలశాలులు మహావీర్యులగు నారాక్షసుల నందఱ రాముండు యుద్ధంబున వధించెను. ౧౯

రాముఁడు యుద్ధంబున నాపదునాలుగువేల రాక్షసులను రూపుమాపి వారలకు నాయకుండగు ఖరునిం జంపెను. ౨౦

అట్లు రామునిచే విరూపగావింపఁబడిన మూర్ఖయగు నాశూర్పణఖ ఖరాదులు హతులగుటం జూచి యంత రావణునియొద్దకుఁ బోయి చెప్పుకొనెను.

రావణుని యనుచరుఁడు భయంకరాకారుఁడైన మారీచుండను రాక్షసుఁడు రత్నమయమయిన మృగముయొక్క రూపము ధరించి సీతాదేవి ముంగల సంచరించి యామెకు నాశపుట్టించెను. ౨౧

అంత సీతాదేవి రాముని జూచి ఈ మృగంబును బట్టి తెమ్ము. ఇది మన యాశ్రమంబున నుండినయెడ మన యాశ్రమం బెంతయు రమణీయమై చూపరులమనము నాకర్షించుచుండును. ౨౨

అంత రాముండు ధనుర్ధరుండై యమ్మాయామృగంబు వెంటఁదఱుముకొనిపోయెను. అంత నది చిక్కక పరుగెత్తుటంజూచి యది రాక్షసమాయ యని తలఁచి చక్కఁగా చెక్కంబడిన వగుటచే నున్నగా నున్న గణుపులుగల బాణముచే దాని వధించెను. ౨౩

సౌమ్యుఁడవగు భరతుఁడా! అంత రాముండు జింకవెంటఁ బోవుటయుఁ గొంతదడవునకు లక్ష్మణుండును ఆతనియొద్దకుఁ బోవుటయు నప్పుడు రావణుండు సమయంబుజూచి రాము నాశ్రమంబుఁ బ్రవేశించెను. ౨౪

ఆ రావణుండు అంగారకగ్రహ మాకాశమున రోహిణిని బట్టునట్లు బలాత్కారంబున సీతాదేవిం బట్టుకొనెను. ౨౫

త్రాతుకామం తతో యుద్ధే హత్వా గృధ్రం జటాయుషమ్,
ప్రగృహ్య సీతాం సహసా జగామాశు స రావణః. ౨౬
తత స్త్వద్భుతసఙ్కాశాః స్థితాః పర్వతమూర్ధని,
సీతాం గృహీత్వా గచ్ఛన్తం వానరాః పర్వతోపమాః. ౨౭
దదృశు ర్విస్మితా స్తత్ర రావణం రాక్షసాధిపమ్,
ప్రవివేశ తతో లఙ్కాం రావణో లోకరావణః. ౨౮

తాం సువర్ణపరిక్రాన్తే శుభే మహతి వేశ్మని,
ప్రవిశ్య మైథిలీం వాక్యై స్సాన్త్వయామాస రావణః. ౨౯
తృణవద్భాషితం తస్య తం చ నైరృతపుఙ్గవమ్,
అచిన్తయన్తీ వైదేహీ అశోకవనికాం గతా. ౩౦
న్యవర్తత తతో రామో మృగం హత్వా మహావనే,
నివర్తమానః కాకుత్స్థో దృష్ట్వా గృధ్రం ప్రవివ్యథే. ౩౧

గృధ్రం హతం తదా దగ్ధ్వా రామః ప్రియసఖం పితుః,
మార్గమాణ స్తు వైదేహీం రాఘవ స్సహలక్ష్మణః. ౩౨
గోదావరీ మన్వచర న్వనోద్దేశాంశ్చ పుష్పితాన్,
ఆసేదతు ర్మహారణ్యే కబన్ధం నామ రాక్షసమ్. ౩౩

తతః కబన్ధవచనా ద్రామ స్సత్యపరాక్రమః,
ఋశ్యమూకం గిరిం గత్వా సుగ్రీవేణ సమాగతః. ౩౪
తయో స్సమాగమా త్పూర్వం ప్రీత్యా హార్దో వ్యజాయత,
భ్రాత్రా నిరస్తః క్రుద్ధేన సుగ్రీవో వాలినా పురా. ౩౫

ఆ రావణుండు సీతను రక్షించుటకై యడ్డపడిన జటాయువును గృధ్రరాజును బోరంజంపి బలాత్కారంబున సీతం జేకొని వేగంబునంబోయెను. ౨౬

అంతఁ బర్వతాకారులు ససమానులునగు వానరులు ఋశ్యమూకపర్వతంబుపైనుండి సీత నపహరించుకొనిపోవుచున్న రాక్షసనాథుఁడగు రావణుని ఆశ్చర్యపడి చూచిరి. ౨౭

అంత లోకములకన్నింటిని బాధించి యేఁడిపించునట్టి రావణుఁడు సీతతో లంకాపురిం బ్రవేశించెను. ౨౮

రావణుఁడు సీతను బంగారపు ప్రాఁతగల సుందరమయిన విశాలమందిరంబున నునిచి మంచిమాటల నాశ్వాసించెను. ౨౯

సీతాదేవి యారావణునిమాటలు తృణంబుగాఁ దలఁచి యతని వరకు నేయకపోవుటయుం రావణుం డామెను అశోకవనంబున నుంచెను. ౩౦

అంత రాముం డమ్మహారణ్యంబున నాకాంచనమృగంబును వధించి యాశ్రమంబునకు వచ్చెను.

రాముండాశ్రమంబునకువచ్చి సీతంగానక హతుఁడైన జటాయువుం జూచి దుఃఖము నొందెను. ౩౧

రాముఁడు లక్ష్మణసహితుఁడై తనతండ్రికిఁ గూరిమి చెలికాఁడగు జటాయువునకు సంస్కారంబు గావించి సీతాదేవిని వెదకుచు గోదావరీనదీతీరంబునందును ఋష్యాశ్రమంబులగు వనప్రదేశంబులందును సంచరించెను. ౩౨

ఆరామలక్ష్మణులు మహారణ్యంబునఁ బోవుచుఁ గబంధుండను రాక్షసుంగాంచిరి. ౩౩

అంత సత్యపరాక్రముఁడగు రాముఁడు కబంధునివచనంబున ఋశ్యమూకపర్వతంబునకుఁబోయి యచట సుగ్రీవునితో సమాగమంబు నొందెను.

ఆరామ సుగ్రీవులు పరస్పరము సమాగమ మొందుటకు మున్నె ఒకరిమీఁద నొకరికి స్నేహముగలిగి మనంబున సఖ్యంబు నపేక్షించియుండిరి. ౩౪

మున్ను అన్నయగువాలి క్రుద్ధుండై సుగ్రీవుని రాజ్యంబు వెడలఁగొట్టినాఁడు. ౩౫

ఇతరేతరసంవాదా త్ప్రగాఢః ప్రణయ స్తయోః,
రామస్య బాహువీర్యేణ స్వరాజ్యం ప్రత్యపాదయత్. ౩౬

వాలినం సమరే హత్వా మహాకాయం మహాబలమ్,
సుగ్రీవ స్స్థాపితో రాజ్యే సహిత స్సర్వవానరైః. ౩౭

రామాయ ప్రతిజానీతే రాజపుత్ర్యాశ్చ మార్గణమ్,
ఆదిష్టా వానరేన్ద్రేణ సుగ్రీవేణ మహాత్మనా. ౩౮
దశకోట్యః ప్లవఙ్గానాం సర్వాః ప్రస్థాపితా దిశః,
తేషాం నో విప్రకృష్టానాం విన్ధ్యే పర్వతసత్తమే. ౩౯
భృశం శోకాభితప్తానాం మహాన్కాలోఽత్యవర్తత,

భ్రాతా తు గృధ్రరాజస్య సంపాతిర్నామ వీర్యవాన్. ౪౦
సమాఖ్యాతి స్మ వసతిం సీతాయా రావణాలయే,
సోఽహం శోకపరీతానాం దుఃఖం తజ్జ్ఞాతినాం నుదన్. ౪౧

ఆత్మవీర్యం సమాస్థాయ యోజనానాం శతం ప్లుతః,
తత్రాహ మేకా మద్రాక్ష మశోకవనికాం గతామ్. ౪౨
కౌశేయవస్త్రాం మలినాం నిరానన్దాం దృఢవ్రతామ్,

తయా సమేత్య విధివ త్పృష్ట్వా సర్వ మనిన్దితామ్. ౪౩
అభిజ్ఞానం చ మే దత్త మర్చిష్మాన్ స మహామణిః,

ఆరామసుగ్రీవులు పరస్పరము సంభాషింప వారిస్నేహము అంతకంతకు అతిశయించినది.

రాముని భుజపరాక్రమంబు పెంపున సుగ్రీవుఁడు మరలం దన రాజ్యంబునొందెను. ౩౬

రాముఁడు మహాకాయుఁడును మహాబలశాలియునగు వాలిని యుద్ధంబున వధించి సుగ్రీవుని సమస్తవానరసమేతుం గావించి వానరరాజ్యంబున కధిపతిం జేసెను. ౩౭

అంత సుగ్రీవుండు సీతాదేవిని వెదకించెదనని రామునితోఁ బ్రతిజ్ఞ గావించెను.

మహాపరాక్రమశాలియగు వానరేంద్రుఁడు సుగ్రీవుఁడు సీతాదేవిని వెదకుటకై పదికోట్లవానరవీరుల నాజ్ఞాపించి నాలుగుదిక్కులకుం బంపెను.

అట్లు సీతాదేవిని వెదకుటకై పంపఁబడినహరిలోమేము పర్వతోత్తమంబగు వింధ్యంబునందె బహుదూరముపోయి దారి తెలియక పరమదుఃఖితులమయియుండఁగా మాకుఁ బెద్దకాలము అతిక్రమించినది. ౩౯

జటాయువుయొక్క అన్నయయిన పరాక్రమవంతుఁడగు సంపాతి సీతాదేవి లంకయందు రావణునింట నున్నదని మాకుఁజెప్పెను. ౪౦

అప్పుడు నేను బంధువులగు వానరులందఱు పరమదుఃఖితులయి యుండుటంజూచి వారిదుఃఖంబు నివారించుటకై నాబలంబు నవలంబించి నూఱుయోజనంబుల వైశాల్యముగల సముద్రంబు దాఁటితిని. ౪౧

ఆరావణునిగృహంబున అశోకవనంబను వనంబునందు మున్ను గట్టిన పట్టుపుట్టంబుతో మలినాంగియై సంతోషంబు దక్కి పాతివ్రత్యవ్రతమును మాత్రము దృఢముగా నవలంబించినదై యొక్కతె యయియున్న సీతాదేవిం జూచితిని. ౪౨

నేను యథావిధిగా నాసీతాదేవిని సందర్శించి యనిందితురాలగునామెను సమస్తవృత్తాంతము నడిగి తెలిసికొని గుఱుతుకై నాచేత రాముఁడిచ్చి

అభిజ్ఞానం మణిం లబ్ధ్వా చరితార్థోఽహ మాగతః. ౪౪

మయాచ పున రాగమ్య రామస్యాక్లిష్టకర్మణః,
అభిజ్ఞానం మయా దత్త మర్చిష్మాన్ స మహామణిః. ౪౫

శ్రుత్వా తు మైథిలీం హృష్ట స్త్వాశశంసే చ జీవితమ్,
జీవితాన్త మనుప్రాప్తః పీత్వాఽమృత మివాతురః. ౪౬

ఉద్యోజయిష్య న్నుద్యోగం దధ్రే కామం వధే మనః,
జిఘాంసు రివ లోకాన్తే సర్వాన్ లోకా న్విభావసుః. ౪౭

తత స్సముద్ర మాసాద్య నళం సేతు మకారయత్,
అతరత్కపివీరాణాం వాహినీ తేన సేతునా. ౪౮

ప్రహస్త మవధీ న్నీలః కుమ్భకర్ణం తు రాఘవః,
లక్ష్మణో రావణసుతం స్వయం రామస్తు రావణమ్. ౪౯

స శక్రేణ సమాగమ్య యమేన వరుణేన చ,
మహేశ్వరస్వయమ్భూభ్యాం తథా దశరథేన చ. ౫౦
తైశ్చ దత్తవరః శ్రీమా నృషిభి శ్చ సమాగతః,
సురర్షిభి శ్చ కాకుత్ స్థో వరాన్లేభే పరన్తపః. ౫౧
స తు దత్తవరః ప్రీత్యా వానరైశ్చ సమాగతః,
పుష్పకేణ విమానేన కిష్కిన్ధా మభ్యుపాగమత్. ౫౨

ఖంపిన కాంతిమంతంబగు మహామణితోఁ గూడిన యంగుళీయకమును ఆమెకు ఒసంగితిని. ౪౩

నేను మరల సీతాదేవికొద్దను గూడ గుఱుతుకై యొకరత్నముం దీసికొని కృతార్థుఁడనై వచ్చితిని ౪౪

నేను మరల వచ్చి ఎవ్వరికిని ఎంతమాత్రము దుఃఖము గలిగింపని రాముని సందర్శించి యాయనకు గుఱుతుగా సీతాదేవియొసంగిన కాంతిమంతంబగు నమ్మహనీయరత్నము నిచ్చితిని. ౪౫

రోగంబుపైకొని ప్రాణంబులు వెడలఁ బోవునప్పుడు అమృతపానంబునం జేసి రోగి మరల జీవించునట్లు రాముండు సీతాక్షేమంబువిని సంతుష్టుఁడై జీవితంబుపయి నాశవహించెను. ౪౬

రాముం డంత లంకాగమన ప్రయత్నంబుచేసి మనంబున రావణుని వధించుతమకంబు ముప్పిరిగొనఁ బరిమ్రుక్కుండై ముల్లోకంబుల దహించుటకై చెలరేఁగిన ప్రలయకాలాగ్నివలె నయ్యెను. ౪౭

అంత రఘువీరుఁడు సముద్రంబుఁజేరి నళునిచే సముద్రముతో సేతువు కట్టించెను. ఆ సేతువుమీఁదనె వానరసైన్య మంతయుం సముద్రమును దాఁటెను. ౪౮

రాక్షస సేనానాయకుఁడయిన ప్రహస్తుని నీలుఁడు వధించెను. కుంభకర్ణుని రాముఁడు పరిమార్చెను. ఇంద్రజిత్తును లక్ష్మణుఁడు పరిమార్చెను. రావణుని రాముండె వధించెను. ౪౯

అంత దేవేంద్రుండును యముండును వరుణుండును శివుండును బ్రహ్మయుం స్వర్గస్థుండగు దశరథుండును శత్రువుల వధించినవాఁడును శ్రీమంతుండునగు రామునొద్దకు వచ్చి యతని వరము లొసంగిరి. ఋషులును దేవర్షులును వచ్చి రామునకు వరము లిచ్చిరి. ౫౦, ౫౧

రాముఁ డట్లు దేవతలవలన వరములు పడసి వానిచే యుద్ధమున మృతులయిన వానరుల మరల బ్రతికించి వారలతోనుం గూడినవాఁడై సంతుష్టుండై పుష్పకవిమానం బారోహించి కిష్కింధాపురికి వచ్చెను. ౫౨

తం గఙ్గాం పున రాసాద్య వసన్తం మునిసన్నిధౌ,
అవిఘ్నం పుష్యయోగేన శ్వో రామం ద్రష్టు మర్హసి. ౫౩

తత స్తు సత్యం హనుమద్వచో మహా
న్నిశమ్య హృష్టో భరతః కృతాఞ్జలిః.
ఉవాచ వాణీం మనసః ప్రహర్షిణీం
చిరస్య పూర్ణః ఖలు మే మనోరథః. ౫౪

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే-ఏకోనత్రింశదుత్తరశతతమ స్సర్గః.

---

## త్రి ం శ దు త్త ర శ త త మ స్స ర్గః.

శ్రుత్వా తు పరమానన్దం భరత స్సత్యవిక్రమః,
హృష్ట మాజ్ఞాపయామాస శత్రుఘ్నం పరవీరహా. ౧

దైవతాని చ సర్వాణి చైత్యాని నగరస్య చ,
సుగన్ధమాల్యై ర్వాదిత్రై రర్చన్తు శుచయో నరాః. ౨

సూతాః స్తుతిపురాణజ్ఞా స్సర్వే వైతాళికా స్తథా,
సర్వే వాదిత్రకుశలా గణికాశ్చాపి సఙ్ఘశః. ౩
అభినిర్యాన్తు రామస్య ద్రష్టుం శశినిభం ముఖమ్,

భరతస్య వచః శ్రుత్వా శత్రుఘ్నః పరవీరహా. ౪
విష్టీ రనేకసాహస్రా శ్చోదయామాస వీర్యవాన్,

సమీకురుత నిమ్నాని విషమాణి సమాని చ. ౫

ఆ రాముండు ఇప్పుడు మరల గంగాతీరంబునొంది భరద్వాజాశ్రమంబునందు భరద్వాజ సన్నిధానంబున నున్నాఁడు. రేపు పుష్యనక్షత్రంబున నీవతని నిర్విఘ్నుంబుగాఁ జూడఁగలవు. అని హనుమంతుఁడు భరతునితోఁ జెప్పెను. ౫౩

అంత భరతుండు సత్యంబును మహార్థంబునగు హనుమంతు వచనంబు విని పరమసంతుష్టుఁడై చేమోడ్పుగావించి "బహుకాలంబునకు నా మనోరథం బీడేఱెను" అని సంతోషకరంబగు వచనంబు పలికెను. ౫౪

ఇది నూటయిరువదితొమ్మిదవసర్గము.

## నూటముప్పదవసర్గము.

సత్యపరాక్రముఁడును శత్రువీరుల వధించువాఁడునగు భరతుఁడు పరమానందకంబగు హనుమంతు వచనంబు విని సంతోషంబున (సంతుష్టుండగు) శత్రుఘ్నుంజూచి యిట్లని యాజ్ఞాపించెను. ౧

స్నానాదులం బరిశుద్ధులయి పురుషులు సమస్తదేవతలను బట్టణమందలి చతుష్పథమంటపములను మంచివాసనగల గంధములచేతను పుష్పమాలికల చేతను వాద్యములచేతనుం బూజింతురు గాక. ౨

స్తోత్రములందును బురాణకథలందును బండితులయిన స్తుతిపాఠకులును పురంబుననుండు వైతాళికు లందఱును వాద్యంబులు వాయించుటయందు నేర్పుగలవార లందఱును గుంపులు గుంపులుగా వేశ్యలును చంద్రసుందరంబగు రాముని ముఖంబుఁ జూచుటకు బయలుదేఱుదురుగాక. అని భరతుఁడు శత్రుఘ్నున కాజ్ఞాపించెను. ౩

భరతు నాజ్ఞ విని శత్రువీరుల వధించువాఁడును మహాపరాక్రమశాలియునగు శత్రుఘ్నుఁడు కూలివాండ్రను బెక్కువేలమందిని బిలిపించి యిట్లని యాజ్ఞాపించెను. ౪

నందిగ్రామమునుండి యయోధ్యవఱకు పల్లములందు మట్టివోసియుం

స్థలాని చ నిరస్యన్తాం నన్దిగ్రామా దితః పరమ్,

సిఞ్చన్తు పృథివీం కృత్స్నాం హిమశీతేన వారిణా. ౬
తతోఽభ్యవకిర న్త్వన్యే లాజైః పుష్పైశ్చ సర్వశః,
సముచ్ఛ్రితపతాకాస్తు రథ్యాః పురవరోత్తమే. ౭
శోభయన్తు చ వేశ్మాని సూర్యస్యోదయనం ప్రతి,

స్రగ్దామభి ర్ముక్తపుష్పై స్సుగన్ధైః పఞ్చవర్ణకైః. ౮
రాజమార్గ మసమ్బాధం కిరన్తు శతశో నరాః,

రాజదారా స్తథాఽమాత్యా స్సైన్యా స్సేనాగణాఙ్గనాః. ౯
బ్రాహ్మణాశ్చ సరాజన్యాః శ్రేణీముఖ్యా స్తథా గణాః,

ధృష్టి ర్జయన్తో విజయ స్సిద్ధార్థో హ్యర్థసాధకః. ౧౦
అశోకో మన్త్రపాలశ్చ సుమన్త్రశ్చాపి నిర్యయుః,
మత్తై ర్నాగసహస్రైశ్చ శాతకుమ్భవిభూషితైః. ౧౧

అపరే హేమకక్ష్యాభి స్సగజాభిః కరేణుభిః,
నిర్యయు స్తురగాక్రాన్తై రథైశ్చ సుమహారథాః. ౧౨

శక్త(్ృ)ష్టిప్రాసహస్తానాం సధ్వజానాం పతాకినామ్,
తురగాణాం సహస్రైశ్చ ముఖ్యై ర్ముఖ్యనరాన్వితైః. ౧౩
పదాతీనాం సహస్రైశ్చ వీరాః పరివృతా యయుః,

మిట్టపల్లములను సరిచేసియుం మిట్టలను త్రవ్వి యెత్తివేసియుం భూమి యంతయు సమముగాఁ జేయవలెను. ౫

మఱికొందఱు భూమినంతటను మంచువంటి చల్లనినీళ్ళచేఁ దడిపి యంత నంతటను పేలాలును బూవులును జల్లుదురు గాక. ౬

సూర్యోదయమగు నంతలోపల సర్వనగరంబులలోను ఉత్తమమయిన యయోధ్యాపురంబునందు మార్గంబులను ధ్వజంబులచే నలంకరింతురు గాక. గృహంబులకును జక్కఁగా నలంకారము సేయుదురు గాక. ౭

అనేకులు మనుష్యులుచేరి విశాలంబగు రాజమార్గంబున నంతటను పుష్పతోరణములు గట్టియు విడిపూలు చల్లియు సుగంధంబులు చిలికియుం అయిదువన్నెలుగల చూర్ణములచే ముగ్గులు పెట్టియు నలంకారము గావింపవలెను. అని శత్రుఘ్నుండు పనివాండ్ర కాజ్ఞాపించెను. ౮

రాజభార్యలును మంత్రులును సైనికులును సైనికులభార్యలును బ్రాహ్మణులును క్షత్రియులును సమూహములుగా నుత్తములైన వారలును ఆ సమూహములవారును రామదర్శనంబు కై వెడలిరి. ౯

ధృష్టియు జయంతుఁడును విజయుండును సిద్ధార్థుండును అర్థసాధకుఁడును అశోకుఁడును మంత్రపాలుఁడును సుమంత్రుఁడును కాంచనాభరణాలంకృతంబులయిన మత్తగజంబులు నుత్తమాశ్వంబులు వేనవేలుగా ముందును వెనుకను అలంకరింప బయలుదేఱిరి. ౧౦, ౧౧

కొందఱు రాజబంధువులు నడుమునకు బంగారపు మొలఁగట్టినవియుం మగయేనుంగులతోఁ గూడినవియునగు నాఁడేనుంగుల నారోహించి వెడలిరి. మఱికొందఱు మహారథులు మంచిగుఱ్ఱములు పూన్చిన రథముల నారోహించి బయలుదేఱిరి. ౧౨

శక్తులను అష్టులను ప్రాసములను జేతులందాల్చిన పదాతులు పెక్కువేలమందియు ధ్వజాద్యలంకృతములగు నుత్తమాశ్వముల నారోహించిన గుఱ్ఱపుజోదులలో నుత్తములయినవారలు పెక్కువేలమందియుఁ బరివేష్టింప వీరులు నడచిరి. ౧౩

తతో యానాన్యుపారూఢా స్సర్వా దశరథస్త్రియః. ౧౪
కౌసల్యాం ప్రముఖే కృత్వా సుమిత్రాం చాపి నిర్యయుః,
కైకేయ్యా సహితా స్సర్వా నన్దిగ్రామ ముపాగమన్. ౧౫

కృత్స్నం చ నగరం తత్తు నన్దిగ్రామ ముపాగమత్,

అశ్వానాం ఖురశబ్దేన రథనేమిస్వనేన చ. ౧౬
శఙ్ఖదున్దుభినాదేన సఞ్చచాలేవ మేదినీ,

ద్విజాతిముఖ్యై ర్ధర్మాత్మా శ్రేణీముఖ్యై స్సనైగమైః. ౧౭
మాల్యమోదకహస్తైశ్చ మన్త్రిభి ర్భరతో వృతః,
శఙ్ఖభేరీనినాదైశ్చ వన్దిభిశ్చాభివన్దితః. ౧౮
ఆర్యపాదౌ గృహీత్వా తౌ శిరసా ధర్మకోవిదః,
పాణ్డురం ఛత్త్ర మాదాయ శుక్లమాల్యోపశోభితమ్. ౧౯
శుక్లే చ వాలవ్యజనే రాజార్హే హేమభూషితే,
ఉపవాసకృశో దీన శ్చీరకృష్ణాజినామ్బరః. ౨౦
భ్రాతు రాగమనం శ్రుత్వా తత్పూర్వం హర్ష మాగతః,
ప్రత్యుద్యయౌ తతో రామం మహాత్మా సచివై స్సహ. ౨౧

సమీక్ష్య భరతో వాక్య మువాచ పవనాత్మజమ్,
కచ్చి న్నఖలు కాపేయీ సేవ్యతే చలచిత్తతా. ౨౨

అంత దశరథునిభార్య లందఱు పల్లకీల నారోహించి కౌసల్యను సుమిత్రను ముందిడికొని బయలువెడలిరి. ౧౪

కైకేయీసహితంబుగా దశరథుని భార్య లందఱు నందిగ్రామంబునకు వచ్చిరి. ౧౫

అయ్యయోధ్యానగరములో నుండు సమస్తప్రజలును అపుడు నందిగ్రామమునకు వచ్చిరి.

అంతఁ జతురంగసైన్యంబులు నడచునప్పుడు గుఱ్ఱంబుల ఖురధ్వనులును రథనేమిధ్వనులును శంఖభేరీనినాదంబులును భూమిం బెకలించునో యన్నట్లు చెలరేఁగినవి. ౧౬

అంతఁ బరమధార్మికుండును సమస్తధర్మంబులుం దెలిసినవాఁడును మహానుభావుండును ఉపవాసంబులు సేయుటచేఁ గృశించియున్నవాఁడును నారచీరలును కృష్ణాజినంబులును ధరించియున్నవాఁడును ఎల్లప్పుడును దుఃఖితుండై యే యున్నవాఁడును అంతకుమున్ను రామునాగమనంబు హనుమంతువలన విని సంతోషంబు చూచినవాఁడునగు భరతుండు, బ్రాహ్మణోత్తములును వర్తకులును అయ్యోసమూహంబులఁ దలమనుష్యులయిన వారలును బరివేష్టించి నడువ, మంత్రులు మాల్యంబులును గుడుములును జేకొని వెంబడింప శంఖభేరీధ్వనులు బోరుకలఁగ స్తుతిపాఠకులు గావించు స్తోత్రధ్వనులతిశయిల్ల రామపాదుకలు దలమీఁదనుంచికొని తెల్లనిమాల్యములచే నలంకృతంబగు శ్వేతచ్ఛత్రంబును కాంచనదండములతో నొప్పుచున్న రాజార్హంబులగు ధవళచామరంబులును దీసికొని మంత్రిసహితంబుగా రాము నెదుర్కొనఁ బోయెను. ౧౭, ౨౧

భరతుఁడు కొంతదడవు నిరీక్షించి వాయుపుత్త్రుండగు హనుమంతుం జూచి యిట్లని పలికెను.

నీవు వానరులకు సాధారణమయిన చిత్తచాపలమునొంది రాముఁడు వచ్చుచున్నాఁడని చెప్పితివా యేమి ? ౨౨

నహి పశ్యామి కాకుత్స్థం రామ మార్యం పరంతపమ్,
కచ్చిన్న ఖలు దృశ్యన్తే వానరాః కామరూపిణః. ౨౩

అథైవ ముక్తే వచనే హనుమానిద మబ్రవీత్,
అర్థం విజ్ఞాపయన్నేవ భరతం సత్యవిక్రమమ్. ౨౪

సదా ఫలా న్కుసుమితాన్ వృక్షాన్ ప్రాప్య మధుస్రవాన్,
భరద్వాజప్రసాదేన మత్తభ్రమరనాదితాన్. ౨౫

తస్య చైష వరో దత్తో వాసవేన పరంతప!,
ససైన్యస్య తథాఽఽతిథ్యం కృతం సర్వగుణాన్వితమ్. ౨౬

నిస్వన శ్శ్రూయతే భీమః ప్రహృష్టానాం వనౌకసామ్,
మన్యే వానరసేనా సా నదీం తరతి గోమతీమ్. ౨౭

రజోవర్షం సముద్భూతం పశ్య వాలుకినీం ప్రతి,

మన్యే సాలవనం రమ్యం లోలయన్తి ప్లవంగమాః. ౨౮

తదేత ద్దృశ్యతే దూరా ద్విమలం చన్ద్రసన్నిభమ్,

విలయనఁగా కకుత్స్థవంశమునఁ బుట్టినవాఁడును బూజనీయుండును శత్రువుల వధించువాఁడునగు రాముం డింకను అగపడలేదే! కామరూపులగు వానరులును ఇంకను రాలేదే యేమి? అని భరతుండు హనుమంతునితోఁ జెప్పెను. ౨౩

అంత భరతునివాక్యంబు విని హనుమంతుఁడు సత్యపరాక్రముఁ డగు భరతునకు రాముండును వానరులును వచ్చుటకు ఆలస్యమగుటకుఁ గారణమును దెలుపుచు నిట్లని పలికెను. ౨౪

భరద్వాజు ననుగ్రహంబునం జేసి వృక్షంబులన్నియుం నెల్లప్పుడు ఫలములు గలవై పుష్పించినవై తుమ్మెదలు మదించి నాదంబులు సేయం దేనియలు స్రవించుచుండుటవలన వానరు లందఱు పరమానందంబు నొంది యున్నారు. ౨౫

శత్రువులఁ దపింపఁ జేయునట్టి భరతుఁడా! వానరు లున్నచోట వృక్షంబు లన్నియుం నకాలంబునను ఫలించియుండునట్లు దేవేంద్రుండును రామునకు వర మొసంగెను. అట్లు భరద్వాజమహర్షియుం వృక్షంబు లన్నియుం నిపుడు పుష్పించియుఁ ఫలించియుఁ జేనియలు గాఱుచుండునట్లు అనుగ్రహించి, రామునకును సమస్తవానరసైన్యములకును సర్వసమృద్ధమయిన విందు గావించెను. ౨౬

వానరులు సంతోషంబునం గావించు భయంకరమయిన కోలాహల ధ్వనియల్లదె వినంబడుచున్నది. అవ్వానరసేన యిప్పుడు గోమతీనదిని దాఁటుచుండునని తలంచెను. ౨౭

వాలుకినీనదియందు దుమ్ము రేఁగినది చూడుము. వానరులు వాలుకినీ నది దాఁటుచుందురని తలఁచెదను.

వానరులు ఇప్పుడు రమణీయమగు సాలవనంబున వృక్షంబులు కదలించుచు విహారము సేయుచుందురని తలంచెదను. ౨౯

నిర్మలంబును చంద్రునివలె వెలుంగుచున్నదియుం బ్రహ్మదేవునిచే మన

విమానం పుష్పకం దివ్యం మనసా బ్రహ్మనిర్మితమ్. ౨౯
రావణం బాన్ధవై స్సార్ధం హత్వా లబ్ధం మహాత్మనా,

తరుణాదిత్యసంకాశం విమానం రామవాహనమ్. ౩౦
ధనదస్య ప్రసాదేన దివ్య మేత న్మనోజవమ్,

ఏతస్మి న్భ్రాతరౌ వీరౌ వైదేహ్యా సహ రాఘవౌ. ౩౧
సుగ్రీవశ్చ మహాతేజా రాక్షసశ్చ విభీషణః,

తతో హర్షసముద్భూతో నిస్వనో దివ మస్పృశత్. ౩౨
స్త్రీబాలయువవృద్ధానాం రామోఽయ మితి కీర్తితే,

రథకుఞ్జరవాజిభ్య స్తేఽవతీర్య మహీం గతాః. ౩౩
దదృశు స్తం విమానస్థం నరా స్సోమ మివామ్బరే,

ప్రాఞ్జలి ర్భరతో భూత్వా ప్రహృష్టో రాఘవోన్ముఖః. ౩౪
స్వాగతేన యథార్థేన తతో రామమపూజయత్,

మనసా బ్రహ్మణా సృష్టే విమానే భరతాగ్రజః. ౩౫
రరాజ పృథుదీర్ఘాక్షో వజ్రపాణిరివాపరః,

తతో విమానాగ్రగతం భరతో భ్రాతరం తదా. ౩౬
వవన్దే ప్రయతో రామం మేరుస్థ మివ భాస్కరమ్,

తతో రామాభ్యనుజ్ఞాతం తద్విమాన మనుత్తమమ్. ౩౭

స్సంకల్పమాత్రంబున నిర్మింపఁబడినదియు రాముఁడు రావణుని బంధుసహితం బుగా వధించి సంపాదించినదియునగు నాదివ్యమయిన పుష్పకవిమానం బదిగో దూరంబునఁ గానఁబడుచున్నది. ౨౯

ఇప్పుడు రామునకు వాహనమయిన బాలసూర్య ప్రకాశంబును దివ్యం బును మనోవేగంబునగు నీపుష్పకవిమానము బ్రహ్మదేవు ననుగ్రహంబునఁ గుబేరునకు లభించెను. ౩౦

సీతాదేవియు శూరులగు రామలక్ష్మణులును మహాపరాక్రమశాలియగు సుగ్రీవుండును రాక్షసరాజు విభీషణుండును ఇవ్విమానంబునం గూర్చుండి యున్నారు. అనిహనుమంతుండు భరతునితోఁ జెప్పెను. ౩౧

అంత "ఇదిగో రాముండు వచ్చినాఁడు" అని మాటపుట్టినంత నా స్త్రీలు బాలురు యౌవనవంతులు వృద్ధులు సంతోషంబునం గావించు కోలాహలధ్వని నింగిముట్టి చెలంగెను. ౩౨

ఆ మనుజు లందఱు రథములు ఏనుంగులు గుఱ్ఱములు మున్నగు వాహనములనుండి డిగ్గి నేలపై నిలుచుండి ఆకాశంబునఁ జంద్రుండు శోభిల్లునట్లు పుష్పకవిమానంబునం దేజరిల్లుచున్న రాముం జూచిరి. ౩౩

అంత భరతుఁడు పరమసంతోషంబున రామున కెదురుగా నిలిచి చేతులు మోడ్చి "ప్రతిజ్ఞదప్పక మాకందఱకు శుభంబుగలుగునట్లు విజయం చేసితివి" అని రాముని గొనియాడి పూజించెను. ౩౪

భరతాగ్రజుండగు రాముండు విశాలములును దీర్ఘములును నేత్రంబులతోఁ గూడినవాఁడై బ్రహ్మమానససృష్ట మయిన యద్దివ్యవిమానంబునం గూర్చుండి రెండవ దేవేంద్రునిపగిది శోభిల్లెను. ౩౫

అంత నప్పుడు భరతుండు మేరుపర్వతంబుపైనుండు సూర్యుని నమస్కరించునట్లు పుష్పకవిమాన శిఖరంబున నున్న రామునిఁ బరిశుద్ధమయిన హృదయంబుతో నమస్కరించెను. ౩౬

అంత హంసప్రతిమలతోఁ గూడినదియు మహావేగంబును ఉత్తమంబు

హంసయుక్తం మహావేగం నిష్పపాత మహీతలే,
ఆరోపితో విమానం తద్భరత స్సత్యవిక్రమః. ౩౮
రామ మాసాద్య ముదితః పునరేవాభ్యవాదయత్,

తం సముత్థాప్య కాకుత్స్థ శ్చిరస్యాక్షిపథం గతమ్. ౩౯
అఙ్కే భరత మారోప్య ముదితః పరిషస్వజే,

తతో లక్ష్మణ మాసాద్య వైదేహీం చాభ్యవాదయత్. ౪౦
అభివాద్య తతః ప్రీతో భరతో నామ చాబ్రవీత్,
సుగ్రీవం కైకయీపుత్రో జామ్బవన్తం తథాఽఙ్గదమ్. ౪౧
మైన్దం చ ద్వివిదం నీల మృషభం పరిషస్వజే,
సుషేణం చ నళం చైవ గవాక్షం గన్ధమాదనమ్. ౪౨
శరభం పనసం చైవ భరతః పరిషస్వజే,
తే కృత్వా మానుషం రూపం వానరాః కామరూపిణః. ౪౩
కుశలం పర్యపృచ్ఛం స్తే ప్రహృష్టా భరతం తదా,

అథాబ్రవీ ద్రాజపుత్త్ర స్సుగ్రీవం వానరర్షభమ్. ౪౪
పరిష్వజ్య మహాతేజాః భరతో ధర్మిణాం వరః,

త్వమస్మాకం చతుర్ణాం తు భ్రాతా సుగ్రీవ! పఞ్చమః. ౪౫
సౌహృదా జ్జాయతే మిత్ర మపకారోఽరిలక్షణమ్,

విభీషణం చ భరత స్సాన్త్వం వాక్య మథాబ్రవీత్. ౪౬

దిష్ట్యా త్వయా సహాయేన కృతం కర్మ సుదుష్కరమ్,

నగు నవ్విమానంబు రామ నసుమతి మీఁద నేలకు వ్రాలెను. ౩౭

సత్యపరాక్రముఁ డగు భరతుని రాముండు పుష్పకవిమానంబుపై నెక్కించుటయు నతండు రాముని సమీపంబునొంది సంతుష్టుండై మరల రామునకు నమస్కారంబు గావించెను. ౩౮

రాముండు బహుకాలమునకుఁ గన్నులకుఁ బండువుగా సందృష్టుఁడైన తమ్ముని భరతుని ఎత్తి తనతొడపైఁ గూర్చుండఁ బెట్టుకొని పరమానందంబునఁ గవుఁగిలించుకొనెను. ౩౯

అంత భరతుండు లక్ష్మణుని సంభావించి సీతాదేవికి నమస్కరించి సంతోషంబునం దన నామధేయంబుగూడ వచించెను. ౪౦

భరతుండు సుగ్రీవుని జాంబవంతుని అంగదుని మైందద్వివిదులను నలుని ఋషభుని గౌఁగిలించుకొని సంభావించెను. ౪౧

భరతుండు సుషేణుని నలుని గవాక్షుని గంధమాదనుని శరభుని బనసుని గౌఁగిటం జేర్చి యాదరించెను. ౪౨

కామరూపులగు వానరు లందఱు భరతసమాగమంబునకు మున్నె మనుష్య రూపంబు ధరించియుండిరి గావున భరతునింజూచి వారలు పరమసంతుష్టులయి క్షేమంబడిగిరి. ౪౩

అంత మహాతేజుండును ధార్మికులలో నెల్లను త్తముండును రాఘవకుమారుండు నగుభరతుఁడు వానరోత్తముని సుగ్రీవుని మరలఁ గౌఁగిలించుకొని యతనితో నిట్లని పలికెను. ౪౪

సుగ్రీవా ! నీవు మాకు నలువురకును అయిదవతోడంబుట్టు వైతివి; లోకంబున నుపకారము గావించినవాఁడు మిత్రుఁడగును; అపకారముచేసిన వాఁడు శత్రువగును. అని భరతుఁడు సుగ్రీవునితోఁ బలికెను. ౪౫

అంత భరతుండు విభీషణునిం జూచి సామవచనంబున నిట్లని పలికెను. ౪౬

మా భాగ్యవశంబున నీవు రామునకు సహాయుండవై గొప్పకార్యము

శత్రుఘ్నశ్చ తదా రామ మభివాద్య సలక్ష్మణమ్. ౪౭
సీతాయాశ్చరణౌ పశ్చాద్వినయాదభ్యవాదయత్,
రామో మాతర మాసాద్య విషణ్ణాం శోకకర్శితామ్. ౪౮
జగ్రాహ ప్రణతః పాదౌ మనో మాతుః ప్రసాదయన్,

అభివాద్య సుమిత్రాం చ కైకేయీం చ యశస్వినీమ్. ౪౯
స మాతౄశ్చ తత స్సర్వాః పురోహిత ముపాగమత్,

స్వాగతం తే మహాబాహో! కౌసల్యానన్దవర్ధన!. ౫౦
ఇతి ప్రాఞ్జలయ స్సర్వే నాగరా రామ మబ్రువన్,

తాన్యఞ్జలిసహస్రాణి ప్రగృహీతాని నాగరైః. ౫౧
ఆకోశానీవ పద్మాని దదర్శ భరతాగ్రజః,
పాదుకే తే తు రామస్య గృహీత్వా భరత స్స్వయమ్. ౫౨
చరణాభ్యాం నరేన్ద్రస్య యోజయామాస ధర్మవిత్,

అబ్రవీచ్చ తదా రామం భరత స్స కృతాఞ్జలిః. ౫౩

ఏతత్తే రక్షితం రాజ న్రాజ్యం నిర్యాతితం మయా,

అద్య జన్మ కృతార్థం మే సంవృత్తశ్చ మనోరథః. ౫౪
యత్త్వాం పశ్యామి రాజాన మయోధ్యాం పునరాగతమ్,

గావించితివి. అని భరతుండు విభీషణునితోఁ బలికెను.

అప్పుడు శత్రుఘ్నుండును రామునకును లక్ష్మణునకును నమస్కారము గావించి పిమ్మట సీతాదేవి పాదములకు సవినయంబుగాఁ బ్రణమిల్లెను. ౪౭

రాముండు పరమదుఃఖితురాలును దుఃఖంబుచేఁ గృశించియున్నదియు నగు తన తల్లి కౌసల్యయొద్దకుఁబోయి మున్నామె పోవలదన్నను వినక తా నరణ్యమునకుఁ బోయెంగావున నిపు డామె మనసునకుఁ బ్రసాదంబు గలుగునట్లు నామె పాదంబులువట్టి నమస్కారము గావించెను. ౪౮

రాముండు సుమిత్రకును కీర్తిశాలినియగు కైకేయికిని దక్కిన తల్లుల కందఱకును నమస్కరించి యంతఁ బురోహితుండగు వసిష్ఠమహర్షికి నమస్కారంబు గావించెను. ౪౯

పౌరు లందఱు రాముంజూచి చేతులు మోడ్చి "మహానుభావుఁడా! కౌసల్యాదేవి యానందంబును వృద్ధిఁబొందించునట్టి సుపుత్త్రుఁడా! నీకు స్వాగత మగుఁ గాక" అని పలికిరి. ౫౦

తామరమొగ్గలవలెనున్న యా పౌరులుగావించిన పెక్కువేల చేమోడ్పులను రాముండు చూచి యాదరించెను. ౫౧

సమస్తధర్మములు దెలిసిన భరతుండు మున్ను తనయొద్ద రాముం డొసంగిన పాదుకలను దీసి మనుజనాథుం డగు రాముని పాదంబులకుఁ దానే తగిలించెను. ౫౨

అప్పుడు భరతుండు అంజలిబంధంబు గావించి రామునితో నిట్లని పలికెను. ౫౩

రాజా! నేను ఇల్లడగా రక్షించుచుండిన నీరాజ్యమును ఇదిగో నీ కప్పగించినాను.

నీవు మరల నయోధ్యకు వచ్చి రాజుగా నుండుటను జూచుచున్నాను గావున ఇపుడు నా జన్మము కృతార్థమయినది. ఇపుడు నా కోర్కులం తెల్ల నీడేఱినవి. ౫౪

అవేక్షతాం భవా న్కోశం కోష్ఠాగారం పురం బలమ్. ౫౫
భవత స్తేజసా సర్వం కృతం దశగుణం మయా,

తథా బ్రువాణం భరతం దృష్ట్వా తం భ్రాతృవత్సలమ్. ౫౬
ముముచు ర్వానరా బాష్పం రాక్షసశ్చ విభీషణః,

తతః ప్రహర్షా ద్భరత మఙ్క మారోప్య రాఘవః. ౫౭
యయౌ తేన విమానేన ససైన్యో భరతాశ్రమమ్,

భరతాశ్రమ మాసాద్య ససైన్యో రాఘవ స్తదా. ౫౮
అవతీర్య విమానాగ్రా దవతస్థే మహీతలే,
అబ్రవీ త్తు తదా రామ స్తద్విమాన మనుత్తమమ్. ౫౯

వహ వైశ్రవణం దేవ మనుజానామి గమ్యతామ్,

తతో రామాభ్యనుజ్ఞాతం తద్విమాన మనుత్తమమ్. ౬౦
ఉత్తరాం దిశ మాగమ్య జగామ ధనదాలయమ్,
పురోహితస్యాత్మసమస్య రాఘవో
బృహస్పతే శ్శక్ర ఇవామరాధిపః. ౬౧
నిపీడ్య పాదౌ పృథగాసనే శుభే
సహైవ తేనోపవివేశ రాఘవః.

ఇతి శ్రీమద్యుద్ధకాణ్డే త్రింశదుత్తరశతతమస్సర్గః.

నీవు కోశసంబును ధాన్యశాలను బట్టణంబును సైన్యమును జూచు కొనుము; నీప్రభావంబున సమస్తమును నీవు పోయినప్పటికిఁ బదంతలుగా వృద్ధిఁబొందియున్నవి. అని భరతుండు రామునితోఁ జెప్పెను. ౫౫

భరతుండు అన్నయందుఁ బరమభక్తితో నట్లు పలుకుటంజూచి వానరు లందఱు కన్నీరు విడిచిరి. రాక్షసుఁడయిన విభీషణుండు కూడ కన్నీరు విడిచెను. ౫౬

అంత రాముండు సంతోషంబున భరతునంకంబునఁ గూర్చుండఁబెట్టుకొని సకలసేనాసమేతంబుగా నా పుష్పకవిమానంబుతోనె నందిగ్రామంబునకుఁ బోయెను. ౫౭

రాముండు నందిగ్రామంబుఁ జేరినపిదప సేనాసమేతంబుగాఁ బుష్పక విమానంబుపయినుండి భూమికి దిగెను. ౫౮

రాముం డప్పుడు సర్వోత్తమంబగు నప్పుష్పకవిమానంబును జూచి యిట్లని పలికెను. ౫౯

నీ విఁకఁ గుబేరునకు వాహనముగా నుండుము. నీ కనుజ్ఞ నొసంగెదను పొమ్ము. అని రాముండు పుష్పకముతోఁ బలికెను.

అంత సర్వవిమానోత్తమంబగు నాపుష్పకవిమానము రాము ననుజ్ఞ నొంది ఉత్తరదిశాభిముఖంబయి పోయి కుబేరు భవనంబుఁ జేరెను. ౬౦

దేవేంద్రుండు బృహస్పతి చరణంబులకుఁ బ్రణమిల్లునట్లు రాముండు తన కనురూపుండయిన పురోహితుఁడు వసిష్ఠుని పాదంబులకు నమస్కరించి యతఁడునుం దానును సుందరములయిన వేఱువేఱాసనంబుల నేకకాలంబునం గూర్చుండిరి. ౬౧

ఇది నూటముప్పదవ సర్గము.

---

## ఏకత్రింశదుత్తరశతతమస్సర్గః.

శిరస్యఞ్జలి మాధాయ కైకేయ్యానన్దవర్ధనః,
బభాషే భరతో జ్యేష్ఠం రామం సత్యపరాక్రమమ్. ౧

పూజితా మామికా మాతా దత్తం రాజ్య మిదం మమ,
తద్దదామి పునస్తుభ్యం యథా త్వ మదదా మమ. ౨

ధుర మేకాకినా న్యస్తా మృషభేణ బలీయసా,
కిశోరీవ గురుం భారం న వోఢుమహముత్సహే. ౩

వారివేగేన మహతా భిన్న స్సేతురివ క్షరన్,
దుర్బన్ధన మిదం మన్యే రాజ్యచ్ఛిద్ర మసంవృతమ్. ౪

గతిం ఖర ఇవాశ్వస్య హంసస్యేవ చ వాయసః,
నాన్వేతు ముత్సహే రామ! తవ మార్గ మరిన్దమ!. ౫

యథా చారోపితో వృక్షో జాత శ్చాన్తర్నివేశనే,
మహాంశ్చ సుదురారోహో మహాస్కన్ధప్రశాఖవాన్. ౬
శీర్యేత పుష్పితో భూత్వా న ఫలాని ప్రదర్శయన్,
తస్య నానుభవే దర్థం యస్య హేతోస్స రోప్యతే. ౭
ఏషోపమా మహాబాహో! త్వమర్థం వేత్తు మర్హసి,

## నూటముప్పదియొకటవసర్గము.

భరతుండు శిరస్సునం జేమోడ్పు ఘటించి కైకేయియుఁ బరమానందంబున నొప్పుచుండ అన్నయయుం సత్యపరాక్రముఁడునగు రాముంజూచి యిట్లని పలికెను. ౧

నీవు రాజ్యంబు పరిత్యజించి వనవాసంబు నంగీకరించుటచే నాతల్లిని సంతోషపఱిచితివి. నాకును ఈ రాజ్యంబు నొసంగితివి. నీవేవిధంబున నావద్ద నిల్లడగా రాజ్యంబునుంచితివో అదేప్రకారమున ఆరాజ్యంబును మరల నీకొసంగి నాభారమును నివారించుకొనుచున్నాను. ౨

నీవు నాయొద్దనుంచిన న్యాసమును నీవు కోరినప్పు డియ్యవచ్చునందువేమో, బలిష్ఠంబగు నొకగొప్పయెద్దు తాను మోయంబరువును దూడపై వేసినయెడ నాదూడ మోయఁజాలనట్లు, మహాతేజుండవగు నీవు వహింపఁదగిన యీ రాజ్యభారమును నాపయినుంచితే నాకు వహింప శక్తిలేదు. ౩

జలప్రవాహమునకుఁ జెగి కాఱుచున్న నీటికట్ట గడ్డిమోకు మండెలు వేసి యడ్డగింపనిచో నిలువనట్లు, బహుచ్ఛిద్రంబులుగల రాజ్యము గుప్త మంత్రాది సాధనములచే రక్షింపనియెడ నిలువఁజాలదు. అంతటి కార్యమునకు నేను జాలుదునా? ౪

శత్రువుల రూపుమాపునట్టి రాముఁడా! ఉత్తమాశ్వమువలె గర్దభము పరుగెత్తఁజాలనట్లు హంసవలెఁ గాకి యెగురఁజాలనట్లు నీవలెఁ రాజ్యభారము వహింప నేను సమర్థుండనుగాను. ౫

మహాబాహుండవగు రాముఁడా! ఇంటిలోపల నొకవృక్షమునాటితే అది పెద్దదై దొంగల కారోహింపంనలవిగానిదిగా గొప్ప స్కంధమును గొమ్మలును గలిగి పుష్పించినదై ఫలింపకయె నశించినయెడ నా వృక్షము ఎందుకు నాటఁబడినదో, ఆఫలము నాటినవానికిఁ గలుగకయెపోవునుగదా! దశరథమహారాజు మహాతపస్సుచేసి పుత్రకామేష్ట్యాదులచే నిన్నుఁ బొందఁగా నీవు పెద్ద పెరిఁగి మహాపరాక్రమశాలివై శత్రువులకజేయుఁడవై బంధుమిత్రాది సంపన్నుఁ

యదర్థస్త్వ న్మనుజేన్ద్ర! త్వం భక్తాన్భృత్యా న్నశాధి హి. ౮

జగదద్యాభిషిక్తం త్వా మనుపశ్యతు సర్వతః,
ప్రతపన్త మివాదిత్యం మధ్యాహ్నే దీప్తతేజసమ్. ౯
తూర్యసఙ్ఘాతనిర్ఘోషైః కాఞ్చీనూపురనిస్వనైః,
మధురై ర్గీతశబ్దైశ్చ ప్రతిబుధ్యస్వ రాఘవ!. ౧౦

యావదావర్తతే చక్రం యావతీ చ వసున్ధరా,
తావ త్త్వ మిహ సర్వస్య స్వామిత్వ మనువర్తయ. ౧౧

భరతస్య వచః శ్రుత్వా రామః పరపురఞ్జయః,
తథేతి ప్రతిజగ్రాహ నిషసాదాసనే శుభే. ౧౨

తత శ్శత్రుఘ్నవచనా న్నిపుణాః శ్మశ్రువర్ధకాః,
సుఖహస్తా స్సుశీఘ్రాశ్చ రాఘవం పర్యుపాసత. ౧౩

పూర్వం తు భరతే స్నాతే లక్ష్మణే చ మహాబలే,
సుగ్రీవే వానరేన్ద్రే చ రాక్షసేన్ద్రే విభీషణే. ౧౪
విశోధితజట స్స్నాత శ్చిత్రమాల్యానులేపనః,
మహార్హవసనో రామ స్తస్థౌ తత్ర శ్రియా జ్వలన్. ౧౫

డవై సమస్తకల్యాణగుణంబులం గలిగి యలరారుచున్నావు అట్టి నీవు కుల క్రమాగతమయిన రాజ్యపరిపాలనము చేసి భక్తులయి భృత్యులమగు మమ్ముం గాపాడవేని మున్ను దాహరించిన వృక్షము చందమగును. ఈయభిప్రాయమును నీవ యెఱుంగుదు. ౬, ౮

ఇప్పుడు పట్టాభిషిక్తుండవై మధ్యాహ్నసూర్యునిపగిది మహాతేజః ప్రతాపములతో వెలుఁగుచున్న నిన్ను లోకమంతయుం జూచుచుగాక. ౯

రాముఁడా! నానావిధవాద్యధ్వనులును నర్తనము గావించు స్త్రీల యొక్క కాంచీనూపురధ్వనులును నృత్తధ్వనులును రమణీయంబులగు గీతాధ్వనులును వీనులకు విందుసేయు మేలుకొనుము. ౧౦

జ్యోతిశ్చక్ర మెంతకాలము తిరుగుచుండునో భూమియెంతవఱకు ఉండగలదో నీవు అంతకాలము ఇచట సమస్తరాజ్యమును బాలింపుచుండుము. అని భరతుఁడు రామునితోఁ జెప్పెను. ౧౧

శత్రుపట్టణంబుల జయించునట్టి రాముండు భరతుని వచనంబు విని అంగీకరించెను. ఆదివఱకు నిలుచుండియుండిన భరతుండును అంతశుభమయిన యాసనముపం గూర్చుండెను. ౧౨

అంత శత్రుఘ్నుని పనుపునం జేసి నపుర్తులును సుఖముగాఁ బట్టాభిషేక ముహూర్తము అతిక్రమింపకుండ శీఘ్రముగాఁ జేయఁగలిగినవారలు నగు గడ్డము మీసములను కత్తిరించి సంస్కరించునట్టి క్షౌరకులు రామునకును భరతునకును లక్ష్మణునకును శత్రుఘ్నులను కత్తిరించి సంస్కరించిరి. ౧౩

మొదట భరతుఁడు స్నానముచేసెను అంత మహాబలుండగు లక్ష్మణుఁడు స్నానముగావించెను. అంత వానరరాజు సుగ్రీవుండును రాక్షసరాజు విభీషణుండును మంగళస్నానము నొందినపిదప, రాముండు జటలు విడదీసి పరిచేయఁబడిన తనవెండ్రుకలుగలవాఁడై స్నానంబు గావించి నానావిధ పుష్పమాలికలచేతను సుగంధికర్పూర కస్తూరీ కుంకుమాది మిళితమయిన చందనముచేతను అలంకృతుఁడై ఉత్తమమయిన పీతాంబరములు ధరించి మహాతేజస్సుచే జ్వలించుచు సింహాసనముపయిఁ గూర్చుండెను. ౧౪, ౧౫

ప్రతికర్మ చ రామస్య కారయామాస వీర్యవాన్,
లక్ష్మణస్య చ లక్ష్మీవా నిక్ష్వాకు కులవర్ధనః. ౧౬

ప్రతికర్మ చ సీతాయా స్సర్వా దశరథస్త్రియః,
ఆత్మనైవ తదా చక్రు ర్మనస్విన్యో మనోహరమ్. ౧౭
తతో వానరపత్నీనాం సర్వాసామేవ శోభనమ్,
చకార యత్నాత్కౌసల్యా ప్రహృష్టా పుత్రలాలసా. ౧౮

తత శ్శత్రుఘ్నవచనా త్సుమన్త్రో నామ సారథిః,
యోజయిత్వాఽభిచక్రామ రథం సర్వాఙ్గశోభనమ్. ౧౯

అర్కమణ్డలసఙ్కాశం దివ్యం దృష్ట్వా రథోత్తమమ్,
ఆరురోహ మహాబాహూ రామ స్సత్యపరాక్రమః. ౨౦

సుగ్రీవో హనుమాం శ్చైవ మహేన్ద్రసదృశద్యుతీ,
స్నాతౌ దివ్యనిభై ర్వస్త్రై ర్జగ్మతు శ్శుభకుణ్డలౌ. ౨౧

వరాభరణసంపన్నా యయు స్తా శ్శుభకుణ్డలాః,
సుగ్రీవపత్న్య స్సీతా చ ద్రష్టుం నగరముత్సుకాః. ౨౨

అయోధ్యాయాం తు సచివా రాజ్ఞో దశరథస్య యే,
పురోహితం పురస్కృత్య మన్త్రయామాసు రర్థవత్. ౨౩

అశోకో విజయ శ్చైవ సుమన్త్ర శ్చైవ సఙ్గతాః,
మన్త్రయ న్రామవృద్ధ్యర్థ మృద్ధ్యర్థం నగరస్య చ. ౨౪

మహాపరాక్రమశాలియు శ్రీమంతుఁడును ఇక్ష్వాకువంశమును వృద్ధిఁ బొందించువాఁడునగు శత్రుఘ్నుఁడు అంత రామునకును లక్ష్మణునకును భరతునకును హారకేయూరాద్యాభరణములు దొడిగించి యలంకారము సేయించెను.

అంత నప్పుడు సీతాదేవికి మంచి మనస్సుగల దశరథభార్యలు అందఱును జేరి తామే చేతులులార మనోహరమయిన యలంకారము గావించిరి.

అంతఁ గౌసల్యాదేవి కొడుకునం దధికప్రీతిగలది కావునఁ బరమసంతోషంబున రామమిత్రులయిన వానరుల భార్యల కందఱకును బ్రయత్నపూర్వకముగా మనోహరమయిన యలంకారము గావించెను. ౧౮

అంత శత్రుఘ్ను నాజ్ఞవలన సుమంత్రుఁడను సారథి యన్నియంగములును రమణీయములుగాఁగల యుత్తమమయిన రథమును ఉత్తమాశ్వంబులు పూన్చి తెచ్చెను. ౧౯

ఆజానుబాహుండును ఎట్టికాలమునందును వ్యర్థముకాని పరాక్రమముగలవాఁడునగు రాముఁడు సూర్యమండలమువలె దేదీప్యమానమయి యుత్తమ రథంబువచ్చినం జూచి దాని నారోహించెను. ౨౦

సుగ్రీవుండును హనుమంతుండును స్నానముచేసి స్వర్గమునందలి వస్త్రములతో సమానములయిన వస్త్రములు ధరించి సుందరములయిన కుండలములతో దేవేంద్రునివగిది భాసిల్లుచు అయోధ్యాభిముఖులయి పోయిరి. ౨౧

సుగ్రీవుని భార్యలును సీతాదేవియు, నుత్తమాభరణభూషితలయి సుందరములయిన కుండలంబులు దాల్చినవారలయి యయోధ్యానగరంబుఁ జూచు వేడుకతోఁ బోయిరి. ౨౨

దశరథునిమంత్రులు ముందె యయోధ్యకుఁ బోయి పురోహితుఁడగు వసిష్ఠునితో శ్రీరామపట్టాభిషేకమునకుఁ గావలసిన వస్తువులం గుఱించి యాలోచించిరి. ౨౩

అశోకుఁడును విజయుండును సుమంత్రుండునుం జేరి ఏ విధముగాఁ బట్టాభిషేకము చేసిన యెడ రామునకును నగరమునకును వృద్ధికరముగ నుండునో ఆ విధమును గుఱించి వసిష్ఠునితో నాలోచించిరి. ౨౪

సర్వమేవాభిషేకార్థం జయార్హస్య మహాత్మనః,
కర్తుమర్హథ రామస్య యద్యన్మఙ్గళపూర్వకమ్. ౨౬

ఇతి తే మన్త్రిణస్సర్వే సన్దిశ్య తు పురోహితమ్,
నగరాన్నిర్యయుస్తూర్ణం రామదర్శనబుద్ధయః. ౨౭
హరియుక్తం సహస్రాక్షో రథమిన్ద్ర ఇవానఘః,
ప్రయయౌ రథమాస్థాయ రామో నగరముత్తమమ్. ౨౮

జగ్రాహ భరతో రశ్మీన్ శత్రుఘ్నశ్ఛత్రమాదదే,
లక్ష్మణో వ్యజనం తస్య మూర్ధ్ని సమ్పర్యవీజయత్. ౨౯
శ్వేతం చ వాలవ్యజనం జగ్రాహ పురతః స్థితః,
అపరం చన్ద్రసఙ్కాశం రాక్షసేన్ద్రో విభీషణః. ౨౯
ఋషిసఙ్ఘైస్తదాకాశే దేవైశ్చ సమరుద్గణైః,
స్తూయమానస్య రామస్య శుశ్రువే మధురధ్వనిః. ౩౦

తతశ్శత్రుంజయం నామ కుఞ్జరం పర్వతోపమమ్,
ఆరురోహ మహాతేజాస్సుగ్రీవః ప్లవగర్షభః. ౩౧
నవనాగసహస్రాణి యయురాస్థాయ వానరాః,
మానుషం విగ్రహం కృత్వా సర్వాభరణభూషితాః. ౩౨
శఙ్ఖశబ్దప్రణాదైశ్చ దున్దుభీనాం చ నిస్వనైః,
ప్రయయౌ పురుషవ్యాఘ్రస్తాం పురీం హర్మ్యమాలినీమ్. ౩౩

దదృశుస్తే సమాయాన్తం రాఘవం సపురస్సరమ్,
విరాజమానం వపుషా రథేనాతిరథం తదా. ౩౪

మహాత్ముండగు రామునకుఁ బట్టాభిషేకము గావించుటకై మంగళకరములు జయప్రదములు నైనవాని నన్నిటిని మీరు చక్కఁగాఁ గావింపుఁడు అని మంత్రులు వసిష్ఠునకుఁ జెప్పిరి. ౨౬

ఆ మంత్రు లందఱు వసిష్ఠమహర్షి కివ్విధంబునం జెప్పి యంత రామునిం జూడఁగోరినవారలయి మరల రామున కెదురుగాఁ బోయిరి. ౨౭

పచ్చని గుఱ్ఱములతోఁ గూడిన రథము నారోహించి వేయికన్నులుకల దేవేంద్రుండు పోవునట్లు రాముఁడు ఉత్తమమయిన రథము నారోహించి యయోధ్యానగరాభిముఖుఁడై పోయెను. ౨౮

పట్టాభిషేకము చేసినయెడ రామునకును నగరమునకును వృద్ధికరముగ నుండునో ఆ విధమును గణించి వసిష్ఠునితో నాలోచించిరి. ౨౯

రామునకు భరతుఁడు పగ్గంబులుపట్టి సారథ్యంబు గావించెను. శత్రుఘ్నుఁడు ఛత్రంబుఁ బట్టెను. లక్ష్మణుఁడు ముందట నిలుచుండి రాముని శిరస్సుపయి విసనకఱ్ఱతో విసరుచుఁ దెల్లనివింజామరను బట్టెను. రాక్షసరాజు విభీషణుఁడు చంద్రబింబ సమానంబగు మఱియొక తెల్లవింజామరం బట్టెను.

అప్పుడు ఆకాశంబున ఋషులును వారి గణంబులును దేవతలును రాముఁడు గావించిన రావణవధాది కర్మములం బ్రస్తుతింప నాధ్వని మధురంబై వినంబడినది. ౩౦

అంత మహాతేజుఁడును వానరోత్తముండు నగు సుగ్రీవుండు పర్వతాకారమయిన శత్రుంజయమను మదగజము నారోహించిపోయెను. ౩౧

వానరవీరులు మనుష్యరూపమును దాల్చినవారలయి నానావిధాభరణములచే నలంకృతులయి తొమ్మిదివేల యేనుంగుల నారోహించి పోయిరి.

పురుషోత్తముఁడగు రాముఁడు శంఖధ్వనులును జనులు ప్రహర్షంబునం గావించు కోలాహలధ్వనులును భేరీభాంకారంబులును బోరుకొన హర్మ్యపఙ్క్తులతో నొప్పుచున్న యయోధ్యాపురికిఁ బోయెను. ౩౩

అంత నప్పుడు అయోధ్యకుఁ బోయియుండి మరల రాము నెదుర్కొన వచ్చిన సుమంత్రాదిమంత్రులు పరివార సమేతంబుగా రథముపయి వచ్చుచున్నవాని నిజదేహకాంతిచే దేదీప్యమానుండగువాని సర్వరథికశ్రేష్ఠుని రామునిం గాంచిరి. ౩౪

తే వర్ధయిత్వా కాకుత్స్థం రామేణ ప్రతినన్దితాః,
అనుజగ్ముర్మహాత్మానం భ్రాతృభిః పరివారితమ్. ౩౫

అమాత్యై ర్బ్రాహ్మణై శ్చైవ తథా ప్రకృతిభి ర్వృతః,
శ్రియా విరురుచే రామో నక్షత్రై రివ చన్ద్రమాః. ౩౬

స పురోగామిభి స్తూర్యై స్తాళస్వస్తికపాణిభిః,
ప్రవ్యాహరద్భి ర్ముదితై ర్మఙ్గళాని యయౌ వృతః. ౩౭

అక్షతం జాతరూపం చ గావః కన్యా స్తథా ద్విజాః,
నరా మోదకహస్తాశ్చ రామస్య పురతో యయుః. ౩౮

సఖ్యం చ రామ స్సుగ్రీవే ప్రభావం చానిలాత్మజే,
వానరాణాం చ తత్కర్మ రాక్షసానాం చ తద్బలమ్. ౩౯
విభీషణస్య సంయోగ మాచచక్షే చ మన్త్రిణామ్,

శ్రుత్వా తు విస్మయం జగ్ము రయోధ్యాపురవాసినః. ౪౦

ద్యుతిమానేతదాఖ్యాయ రామో వానరసంవృతః,
హృష్టపుష్టజనాకీర్ణా మయోధ్యాం ప్రవివేశ హ. ౪౧

తతో హ్యభ్యుచ్ఛ్రియ న్పౌరాః పతాకాస్తే గృహే గృహే,

ఐక్ష్వాకాధ్యుషితం రమ్య మాససాద పితు ర్గృహమ్. ౪౨

ఆ మంత్రులు రాముని జయశబ్దంబున నాశీర్వదించి రాముఁడు పరమ సంతోషంబున నాదరింపఁ బెమ్ములచేఁ బరివేష్టితుండగు సమ్మహాత్ముని వెంటం బోయిరి. ౩౫

మంత్రులచేతను బ్రాహ్మణులచేతను ప్రజలచేతను బరివేష్టింపఁబడినవాఁడై రాముఁడు నక్షత్రపరివృతుండగు చంద్రునికై వడిఁ దేజోతిశయంబునం బ్రకాశించెను. ౩౬

ఆ రాముండు పురుషులు సంతుష్టులయి మంగళంబులు పఠింపుచుఁ దాళంబులు వేయుచు స్వస్తికంబులు మొదలగు మంగళవాద్యంబులు వాయింపుచు ముందు నడువ మహోత్సవంబునం బోయెను. ౩౭

పసపుపూసిన యక్షతలు దీసికొనిపోవు మనుష్యులును గోవులును కన్యకలును బ్రాహ్మణులును కుడుములు చేతులం బట్టుకొన్న పురుషులును రామునకు ముందు నడిచిరి. ౩౮

రాముఁడు సుగ్రీవునకుఁ దనయందుంగల స్నేహంబును వాయుపుత్త్రుండగు హనుమంతుని ప్రభావంబును యుద్ధంబున వానరులు గావించిన పరాక్రమంబును రాక్షసుల బలవిశేషంబును విభీషణుఁడు తనయొద్దకువచ్చి శరణాగతుఁడగుటను మంత్రులకుఁ జెప్పెను. ౩౯

అయోధ్యాపురజను లందఱును అవృత్తాంతము విని యాశ్చర్యంబు నొందిరి. ౪౦

మహాతేజుండగు రాముఁ డీవృత్తాంతములు చెప్పుచుఁ బరమసంతుష్టులయి ధ్వజాదులచేఁ బుష్టులయియున్న జనముచేనిండిన యయోధ్యానగరమును వానరసమేతంబుగాఁ బ్రవేశించెను. ౪౧

రాముం డయోధ్యానగరముఁ బ్రవేశింపఁగానే పౌరు లందఱు ప్రతిగృహంబునను ఉన్నతంబుగా ధ్వజంబులు లేవనెత్తిరి.

అంత రాముఁడు ఇక్ష్వాకువంశపురాజులు నివాసము సేయునట్టి రమణీయమయిన తన తండ్రిగృహంబును సమీపించెను. ౪౨

అథాబ్రవీద్రాజసుతో భరతం ధర్మిణాం వరమ్,
అర్థోపహితయా వాచా మధురం రఘునన్దనః. ౪౩
పితుర్భవన మాసాద్య ప్రవిశ్య చ మహాత్మనః,
కౌసల్యాం చ సుమిత్రాం చ కైకేయీ మభివాద్య చ. ౪౪
యచ్చ మద్భవనం శ్రేష్ఠం సాశోకవనికం మహత్,
ముక్తావైడూర్యసంకీర్ణం సుగ్రీవాయ నివేదయ. ౪౫

తస్య తద్వచనం శ్రుత్వా భరత స్సత్యవిక్రమః,
పాణౌ గృహీత్వా సుగ్రీవం ప్రవివేశ తమాలయమ్. ౪౬
తత స్తైలప్రదీపాంశ్చ పర్యఙ్కా స్తరణాని చ,
గృహీత్వా వివిశుః క్షిప్రం శత్రుఘ్నేన ప్రచోదితాః. ౪౭
ఉవాచ చ మహాతేజా స్సుగ్రీవం రాఘవానుజః,
అభిషేకాయ రామస్య దూతా నాజ్ఞాపయ ప్రభో!. ౪౮

సౌవర్ణా న్వానరేన్ద్రాణాం చతుర్ణాం చతురో ఘటాన్,
దదౌ క్షిప్రం స సుగ్రీవ స్సర్వరత్నవిభూషితాన్. ౪౯
యథా ప్రత్యూషసమయే చతుర్ణాం సాగరామ్భసామ్,
పూర్ణైర్ఘటైః ప్రతీక్షధ్వం తథా కురుత వానరాః. ౫౦

ఏవ ముక్తా మహాత్మానో వానరా వారణోపమాః,
ఉత్పేతు ర్గగనం శీఘ్రం గరుడా ఇవ శీఘ్రగాః. ౫౧

జామ్బవాంశ్చ హనూమాంశ్చ వేగదర్శీ చ వానరః,
ఋషభ శ్చైవ కలశా ఞ్జలపూర్ణా నథానయన్. ౫౨

అంత రాచకొమరుండగు రాముండు మహాత్ముండగు తండ్రిగృహంబుc బ్రవేశించి, కౌసల్యకును సుమిత్రకును కైకేయికిని నమస్కరించి ధార్మికోత్తముండగు భరతుంజూచి మహార్థయుక్తంబగు మధురవచనంబున నిట్లని పలికెను. ౪౩,౪౪

ముక్తావైదూర్య ఖచితంబగు నాదు ఉత్తమమయిన గృహమును అంతఃపురోద్యాన సహితముగా, సుగ్రీవునకు విడిదిగాc జూపుము. అని రాముండు భరతునితోc జెప్పెను. ౪౫

సత్యపరాక్రముండగు భరతుండు రాముని వచనంబు విని సుగ్రీవునిc జేయిc బట్టుకొని యా రామగృహంబునకుc దీసికొనిపోయెను. ౪౬

అంత శత్రుఘ్నుని పనుపునకుc బరిజనులు తైలదీపములను మంచములను ఆస్తరణంబులను దీసికొని శీఘ్రంబున నాగృహంబుc బ్రవేశించిరి.

సుగ్రీవుండు విడిదిలో సుఖముగాc బ్రవేశించిన పిదప మహాపరాక్రమశాలియగు భరతుండు సుగ్రీవునిం జూచి "సమర్థుండా! రాముని పట్టాభిషేకమునకై దూతలం బంపుము" అని చెప్పెను. ౪౮

అంత సుగ్రీవుండు శీఘ్రంబుగా నానారత్న ఖచితంబులగు నాలుగు సువర్ణకలశములను నలువురి వానరోత్తముల చేతికి ఒసంగెను. ౪౯

వానరులారా! మీరు రేపు వేకువను నాలుగు సముద్రంబుల జలంబులతో నిండిన కలశంబులతో నిచటికి వచ్చి మమ్మెదురుచూచుచుండవలెను. అవ్విధంబున శీఘ్రముగా రండు. అని సుగ్రీవుండు ఆవానరుల కాజ్ఞాపించెను. ౫౦

మహాపరాక్రమశాలులును ఏనుంగులవంటి మేనులుగలవారలును గరుత్మంతునకుంబోలె మహావేగంబు గలవారలు నగు నవ్వానరులు సుగ్రీవుని మాటనువిని శీఘ్రముగా నాకాశంబున కెగసిపోయిరి. ౫౧

అంత జాంబవంతుండును హనుమంతుండును వేగదర్శియను వానరుండును ఋషభుండును జలములతో నిండిన కలశంబులం దెచ్చిరి. ౫౨

నదీశతానాం పఞ్చానాం జలం కుమ్భేషు చాహరన్,

పూర్వాత్సముద్రాత్కలశం జలపూర్ణమథాఽనయత్. ౫౩
సుషేణస్సత్త్వసంపన్నస్సర్వరత్నవిభూషితమ్,
ఋషభో దక్షిణాత్తూర్ణం సముద్రాజ్జల మాహరత్. ౫౪
రక్తచన్దనశాఖాభి స్సంవృతం కాఞ్చనం ఘటమ్,
గవయః పశ్చిమాత్తోయ మాజహార మహార్ణవాత్. ౫౫
రత్నకుమ్భేన మహతా శీతం మారుతవిక్రమః,
ఉత్తరాచ్చ జలం శీఘ్రం గరుడానిలవిక్రమః. ౫౬
ఆజహార స ధర్మాత్మా నల స్సర్వగుణాన్వితః,

తత స్తై ర్వానరశ్రేష్ఠైరానీతం ప్రేక్ష్య తజ్జలమ్. ౫౭

అభిషేకాయ రామస్య శత్రుఘ్నస్సచివై స్సహ,
పురోహితాయ శ్రేష్ఠాయ సుహృద్భ్యశ్చ న్యవేదయత్. ౫౮

శ్రీరామపట్టాభిషేకఘట్టః.

తత స్స ప్రయతో వృద్ధో వసిష్ఠో బ్రాహ్మణై స్సహ,
రామం రత్నమయే పీఠే సహసీతం న్యవేశయత్. ౫౯

వసిష్ఠో వామదేవశ్చ జాబాలి రథ కాశ్యపః,
కాత్యాయన స్సుయజ్ఞశ్చ గౌతమో విజయ స్తథా. ౬౦
అభ్యషిఞ్చ న్నరవ్యాఘ్రం ప్రసన్నేన సుగన్ధినా,
సలిలేన సహస్రాక్షం వసవో వాసవం యథా. ౬౧

ఋత్విగ్భి ర్బ్రాహ్మణైః పూర్వం కన్యాభి ర్మన్త్రిభి స్తథా,
యోధై శ్చైవాభ్యషిఞ్చం స్తే సంప్రహృష్టా స్సనైగమైః.

జాంబవంతుఁడు మొదలయినవానరులు నలువురు అయిదువందల నదులనుండి జలము కలశములం బట్టి తెచ్చిరి.

అంత బలవంతుండగు సుషేణుండు తూర్పుసముద్రమునుండి జలము రత్నఖచితకాంచనకలశంబునం దెచ్చెను. ౪౩

ఋషభుండు దక్షిణసముద్రంబునుండి కాంచనకలశంబునిండ జలంబుఁబట్టి యచ్చటి రక్తచందనశాఖలచేఁ గప్పి శీఘ్రింబునం దెచ్చెను. ౫౪

వాయువునకుంబోలె వేగంబుగల గవయుండు పశ్చిమసముద్రమునుండి చల్లనిజలంబును గొప్ప రత్నకలశంబునం దీసికొనివచ్చెను. ౫౫

సమస్తగుణసంపన్నుండును గరుత్మంతునకును వాయువునకునుంబోలె వేగంబుగలవాఁడును ధర్మాత్ముండునగు నానలుండు ఉత్తరసముద్రంబునుండి జలముఁదెచ్చెను. ౫౬

అంత శత్రుఘ్నుండు అన్యానరోత్తములుదెచ్చిన జలముంజూచి రామునిపట్టాభిషేకమునకై యుత్తముండగు పురోహితుఁడయిన వసిష్ఠమహర్షికిని బంధువులకును సముద్రాదిజలంములు వచ్చినసంగతిందెలిపెను. ౫౭, ౫౮

శ్రీరామపట్టాభిషేక ఘట్టము

అంతఁ బరిశుద్ధుఁడును వృద్ధుండునగు వసిష్ఠమహర్షి బ్రాహ్మణబృందముతోఁ గూడినవాఁడై రాముని సీతాసమేతంబుగా రత్నమయపీఠంబునం గూర్చుండఁ బెట్టెను. ౫౯

అంత అష్టవసువులు దేవేంద్రునకు నభిషేకము గావించినట్లు వసిష్ఠుండును వాసుదేవుఁడును జాబాలియుఁ గాశ్యపుఁడును గాత్యాయనుఁడును సుయజ్ఞుఁడును గౌతముఁడును విజయుఁడునను నీయెనమండ్రు మహర్షులు నిర్మలంబును సుగంధియునగు జలముచేఁ బురుషశ్రేష్ఠుఁడగు రామున కభిషేకము చేసిరి; ౬౦,౬౧

అంత వసిష్ఠాదులు తా మభిషేకము చేసినపిమ్మట మొదట ఋత్విజులచేతను బ్రాహ్మణులచేతను అంతఁ గన్యకలచేతను మంత్రులచేతను బౌరుల

సర్వౌషధిరసై ర్దివ్యై ర్దైవతైర్నభసి స్థితైః,
చతుర్భి ర్లోకపాలైశ్చ సర్వై ర్దేవైశ్చ సంగతైః. ౬౩

ఛత్త్రం తు తస్య జగ్రాహ శత్రుఘ్నః పాణ్డురం శుభమ్,
శ్వేతం చ వాలవ్యజనం సుగ్రీవో వానరేశ్వరః. ౬౪
అపరం చన్ద్రసంకాశం రాక్షసేన్ద్రో విభీషణః,

మాలాం జ్వలన్తీం వపుషా కాఞ్చనీం శతపుష్కరామ్. ౬౫
రాఘవాయ దదౌ వాయు ర్వాసవేన ప్రచోదితః,

సర్వరత్న సమాయుక్తం మణిరత్నవిభూషితమ్. ౬౬
ముక్తాహారం నరేన్ద్రాయ దదౌ శక్రప్రచోదితః,

ప్రజగు ర్దేవగన్ధర్వా ననృతు శ్చాప్సరోగణాః. ౬౭
అభిషేకే తదర్హస్య తదా రామస్య ధీమతః,

భూమి స్సస్యవతీ చైవ ఫలవన్తశ్చ పాదపాః. ౬౮
గన్ధవన్తి చ పుష్పాణి బభూవూ రాఘవోత్సవే,

సహస్రశత మశ్వానాం ధేనూనాం చ గవాం తథా. ౬౯
దదౌ శతం వృషా న్పూర్వం ద్విజేభ్యో మనుజర్షభః,
త్రింశత్కోటీ ర్హిరణ్యస్య బ్రాహ్మణేభ్యో దదౌ పునః. ౭౦
నానాభరణవస్త్రాణి మహార్హాణి చ రాఘవః,
అర్కరశ్మిప్రతీకాశాం కాఞ్చనీం మణివిగ్రహామ్. ౭౧

చేతను యోధులచేతను రాముని కభిషేకము చేయించిరి. ౬౨

అంత వసిష్ఠాదులచే నాహూతులయి లోకపాలురు నలువురును ఇతరులయిన సమస్తదేవతలును ఒకటిగాఁ జేరి యాకాశమునుండి దివ్యములయిన సమస్తౌషధుల రసములచే రాముని నభిషేకించిరి. ౬౩

అప్పుడు రామునకు శత్రుఘ్నుండు సుందరమయిన శ్వేతచ్ఛత్రంబు పట్టెను. వానరరాజు సుగ్రీవుఁడు తెల్లనివింజామర వీచెను. రాక్షసేశ్వరుం డగు విభీషణుండు చంద్రప్రకాశంబగు మఱియొక ధవళచామరంబునుపట్టి వీచెను. ౬౪

వాయుదేవుఁడు దేవేంద్రునిపనుపున కాంతిచే దేదీప్యమానంబయి నూఱుకమలములతో నొప్పుచున్న బంగారుహారమును దెచ్చి రామునకొసంగెను. ౬౫

మరల వాయుదేవుండు దేవేంద్రునిచేఁ బ్రేరితుఁడై సమస్తరత్నములతోఁ గూడినదియు మణిశ్రేష్ఠమయిన యమూల్యమగు నాయకమణితో నొప్పుచున్నదియు నగు ముక్తాహారమును రామునకిచ్చెను. ౬౬

అప్పుడు పట్టాభిషేకార్హుండగు బుద్ధిమంతుఁడయిన యారాముని పట్టాభిషేకసమయమున సంతోషంబున దేవగంధర్వులు పాడిరి. అచ్చరమిన్నలు నర్తనము గావించిరి. ౬౭

రాముని పట్టాభిషేకోత్సవసమయంబున భూమియందు మంచిపైరులు పండెను. వృక్షములు మంచిఫలములచే సమృద్ధంబులయి యొప్పెను. పుష్పములు సుగంధంబు గుబాళించుచుండెను. ౬౮

పురుషశ్రేష్ఠుఁడగు రాముఁడు మొదట లక్షగుఱ్ఱంబులను క్రొత్తగా దూడవేసిన లక్షయావులను నూఱు ఆఁబోతులను బ్రాహ్మణుల కొసంగెను.

రాముఁడు మరల ముప్పదికోట్ల బంగారు నాణెములను మఱియు నుత్తమములగు భూషణములను వస్త్రములను బ్రాహ్మణుల కొసంగెను, ౭౦

పురుషోత్తముఁడగు రాముఁడు సూర్యకిరణంబులుంబోలెఁ బ్రకాశించు

సుగ్రీవాయ స్రజం దివ్యాం ప్రాయచ్ఛ న్మనుజర్షభః,

వైడూర్యమణిచిత్రే చ వజ్రరత్నవిభూషితే. ౭౨
వాలిపుత్త్రాయ ధృతిమా నఙ్గదాయాఙ్గదే దదౌ,

మణిప్రవరజుష్టం చ ముక్తాహార మనుత్తమమ్. ౭౩
సీతాయై ప్రదదౌ రామ శ్చన్ద్రరశ్మిసమప్రభమ్,
అరజే వాససీ దివ్యే శుభాన్యాభరణాని చ. ౭౪
అవేక్షమాణా వైదేహీ ప్రదదౌ వాయుసూనవే,

అవముచ్యాత్మనః కణ్ఠా ద్ధారం జనకనన్దినీ ౭౫
అవైక్షత హరీన్ సర్వా న్భర్తారం చ ముహుర్ముహుః,

తామిఙ్గితజ్ఞ స్సంప్రేక్ష్య బభాషే జనకాత్మజామ్. ౭౬

ప్రదేహి సుభగే! హారం యస్య తుష్టాసి భామిని!,
పౌరుషం విక్రమో బుద్ధి ర్యస్మి న్నేతాని సర్వశః. ౭౭

దదౌ సా వాయుపుత్త్రాయ తం హార మసితేక్షణా,

హనూమాం స్తేన హారేణ శుశుభే వానరర్షభః. ౭౮
చన్ద్రాంశుచయగౌరేణ శ్వేతాభ్రేణ యథాఽచలః,

చున్నదియును రత్నము లధికముగాఁ గట్టియున్నదియునగు నుత్తమమయిన కాంచనమాలను సుగ్రీవున కొసంగెను. ౭౧

రాముఁడు పరమప్రీతిగలవాఁడై వాలికుమారుండగు నంగదునకువైడూర్యమణులును వజ్రములును బొదిగియుండుటచే సుందరములయిన బంగారు బాహుపురుల నొసంగెను. ౭౨

రాముఁడు సీతాదేవికి మంచిరత్నములతోఁ గూడినదై చంద్రకిరణంబులవలె భాసిల్లుచున్న సర్వోత్తమమయిన ముక్తాహారము నొసంగెను. ౭౩

అంత సీతాదేవి భర్తంజూచుచు ఆయన యనుమతించుటం దెలిసినదై నిర్మలంబులు దివ్యంబులునగు రెండువస్త్రంబులును సుందరంబులయిన యాభరణంబులును వాయుపుత్త్రుండగు హనుమంతున కిచ్చెను. ౭౪

మఱియును సీతాదేవి రాముఁడు తనకొసంగిన ముక్తాహారముగూడ ఎవ్వరికో తనచేతిమీఁదుగా బారితోషికముగ నిచ్చుటకైయే యివ్వఁబడినదని రామునభిప్రాయం బూహించినదై వానరులలో నెవ్వరికొసంగుటరామునభిప్రాయమో తెలియంగోరి యావానరులనందఱను భర్తను మాటిమాటికిఁ జూచెను. ౭౫

అంత నింగితజ్ఞుఁడగు రాముఁడు సీతాదేవి మనోగతంబుదెలిసి యాబిడం జూచి యిట్లని పలికెను. ౭౬

మనోహరమగు శారీరత్నమా! బలము పరాక్రమము బుద్ధిఇవన్నియుంగలిగి యెవ్వఁడు నీకు సంతోషము గావించినాఁడో ఈహారమును అట్టివీరున కొసంగుము. అని రాముఁడు సీతకుఁ జెప్పెను. ౭౭

అంత నల్లని కడకన్నులుగల యాసీతాదేవి యాముక్తాహారమును హనుమంతున కిచ్చెను.

తెల్లని మేఘముతోఁగూడిన పర్వతము వెలుఁగునట్లు చంద్రకిరణసమూహమువలె నతిధవళమయిన యా హారమును దాల్చినవాఁడై హనుమంతుఁడు ప్రకాశించెను. ౭౮

తతో ద్వివిదమైన్దాభ్యాం నీలాయ చ పరంతపః. ౭౯
సర్వాన్కామగుణా న్వీక్ష్య ప్రదదౌ వసుధాధిపః,

సర్వవానరవృద్ధాశ్చ యే చాన్యే వానరేశ్వరాః. ౮౦
వాసోభి ర్భూషణై శ్చైవ యథార్హం ప్రతిపూజితాః,

విభీషణోఽథ సుగ్రీవో హనూమా ఞ్జామ్బవాం స్తథా. ౮౧
సర్వవానరముఖ్యాశ్చ రామేణాక్లిష్టకర్మణా,
యథార్హం పూజితా స్సర్వైః కామై రత్నైశ్చ పుష్కలైః
ప్రహృష్టమనస స్సర్వే జగ్మురేవ యథాగతమ్,

దృష్ట్వా సర్వే మహాత్మానం తత స్తే ప్లవగర్షభాః. ౮౩
విసృష్టాః పార్థివేన్ద్రేణ కిష్కిన్ధా మభ్యుపాగమన్,

సుగ్రీవో వానరశ్రేష్ఠో దృష్ట్వా రామాభిషేచనమ్. ౮౪

లబ్ధ్వా కులధనం రాజా లఙ్కాం ప్రాయా ద్విభీషణః,

స రాజ్యమఖిలం శాస న్నిహతారి ర్మహాయశాః. ౮౫
రాఘవః పరమోదార శ్శశాస పరయా ముదా,

ఉవాచ లక్ష్మణం రామో ధర్మజ్ఞం ధర్మవత్సలః. ౮౬

అంత శత్రువుల వధించునట్టి భూనాథుఁడగు రాముండు ద్వివిదునకును మైందునకును నీలునకును వారివారి కోరికల నన్నింటిని దెలిసి బహుమతుల నొసంగెను. ౭౯

సమస్త వానరులలోను వృద్ధులగు వారలకు మఱియు నితరులగు వానర వీరులకును రాముండు వారివారి యోగ్యతకుఁ దగినట్లు వస్త్రంబులు భూషణంబులు ఇచ్చి బహుమానము గావించెను. ౮౦

అంత విభీషణుఁడును సుగ్రీవుఁడును హనుమంతుఁడును జాంబవంతుఁడును మఱియు నితరులను సమస్తవానరోత్తములును ఎవ్వరికిని ఎంతమాత్రమును దుఃఖము గలిగింపని రాముని చే వారివారి యోగ్యతకుఁ దగినట్లు సమృద్ధములగు రత్నములు మొదలయిన కామితంబులఁబొంది యందఱును సంతుష్టులయి తమతమ నెలవులకుఁ బోయిరి. ౮౧,౮౨

అంత వానరోత్తములందఱును మహాత్ముఁడగు రాముని పట్టాభిషేక మహోత్సవంబుఁ జూచి రాజశ్రేష్ఠుడగు రాముని యనుమతింబొంది కిష్కింధా నగరమునకుఁ బోయిరి. ౮౩

వానరోత్తముఁడగు సుగ్రీవుఁడును రాముని పట్టాభిషేకోత్సవమును జూచి కిష్కింధకుఁ బోయెను. ౮౪

రాక్షసరాజయిన విభీషణుఁడు రామునివలన నిక్ష్వాకుకుల దైవతమైన శ్రీరంగవిమానంబునొంది లంకకుఁ బోయెను.

ఆరాముఁడు శత్రువులనందఱును వధించి మహాయశస్సంపన్నుఁడై సర్వాతిశాయియయి దుష్టులశిక్షించుచు సమస్తరాజ్యంబును బరమసంతోషంబునం బాలించెను. ౮౬

రాముఁడు దశరథుఁడు పూర్వము తనకుఁ బట్టాభిషేక ప్రయత్నము చేసినపుడు భరతుని యసన్నిధానంబునం దాను "లక్ష్మణేమాంమయాసార్థం ప్రశాధిత్వం వసుంధరాం" (లక్ష్మణుఁడా! నీవు నాతోఁగూడ ఈభూమిం బాలింపుము) అని లక్ష్మణునకుఁ జెప్పియుండుటవలన ధర్మవత్సలుండు గావున

ఆతిష్ఠ ధర్మజ్ఞ! మయా సహేమాం
గాం పూర్వరాజాధ్యుషితాం బలేన,
తుల్యం మయా త్వం పితృభి ర్ధృతా యా
తాం యౌవరాజ్యే ధుర ముద్వహస్వ. ౮౭

సర్వాత్మనా పర్యనునీయమానో
యదా న సౌమిత్రి రుపైతి యోగమ్,
నియుజ్యమానోఽపిచ యౌవరాజ్యే
తతోఽభ్యషిఞ్చద్భరతం మహాత్మా. ౮౮
పౌణ్డరీకాశ్వమేధాభ్యాం వాజపేయేన చాసకృత్,
అన్యైశ్చ వివిధై ర్యజ్ఞై రయజత్పార్థివర్షభః. ౮౯

రాజ్యం దశసహస్రాణి ప్రాప్య వర్షాణి రాఘవః,
శతాశ్వమేధా నాజహ్రే సదశ్వా న్భూరిదక్షిణాన్. ౯౦

ఆజానులమ్బబాహు స్స మహాస్కన్ధః ప్రతాపవాన్,
లక్ష్మణానుచరో రామః పృథివీ మన్వపాలయత్. ౯౧
రాఘవశ్చాపి ధర్మాత్మా ప్రాప్య రాజ్య మనుత్తమమ్,
ఈజే బహువిధై ర్యజ్ఞై స్ససుహృజ్జ్ఞాతిబాన్ధవః. ౯౨

న పర్యదేవన్విధవా న చ వ్యాళకృతం భయమ్,
న వ్యాధిజం భయం వాపి రామే రాజ్యం ప్రశాసతి. ౯౩

ఆమాటను గాపాడువాఁడై లక్ష్మణునికన్న జ్యేష్ఠుఁడు భరతుఁడున్నను లక్ష్మణునితో నిట్లనిపల్కెను. ౯౬

సమస్తధర్మములు దెలిసినవాఁడా! మనుప్రభృతులగు మునుపటిరాజులం బలవిశేషంబునం బాలింపుచుండిన యీభూమిని నీవు నాతోఁగూడఁ బరిపాలింపుము. మనపితృపితామహ ప్రపితామహులు వహించుచుండిన యీరాజ్యభారమును నీవు యౌవరాజ్యము నవలంబించి నాతో సమానముగా వహింపుము. అని రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పెను. ౯౭

రాముఁడు యౌవరాజ్యము నంగీకరింపుమని నియోగపూర్వకముగాఁ జెప్పినను అనునయవచనంబుల నడిగినను లక్ష్మణుఁడు జ్యేష్ఠుఁడు భరతుఁడుండుటవలన నెంతమాత్రము నంగీకరింపఁడయ్యె. అంత మహాత్ముఁడగు రాముఁడు యౌవరాజ్యమునందు భరతున కభిషేకము గావించెను. ౯౮

పార్థివశ్రేష్ఠుఁడగు రాముఁడు పౌండరీకంబును అశ్వమేధంబును వాజపేయంబును మఱియుం నితరములయిన నానావిధయజ్ఞంబులును పలుమాఱు గావించెను. ౯౯

రాముఁడు పదివేలసంవత్సరంబులు రాజ్యంబుగావించి యుత్తమాశ్వంబులతోను అధికదక్షిణలతోనుంగూడిన నూఱశ్వమేధయాగంబులు గావించెను. ౧౦౦

మోఁకాలువఱకు వ్రేలాడు దీర్ఘబాహువులు గలవాఁడును ఉత్తమంబులగుమూఁపులుం గలవాఁడును మహాపరాక్రమశాలియుం లక్ష్మణసహాయుండునగు రాముఁడు భూమిం బాలించెను. ఆప్రజలభాగ్యమేమిచెప్పవచ్చును? ౧౦౧

ధర్మాత్ముఁడగు రాముండును సర్వోత్తమంబగు రాజ్యంబునొంది మిత్రులను దాయాదులను బంధువులను దనియించుచు బహువిధయజ్ఞంబులు గావించెను. ౧౦౨

రాముఁడు రాజ్యముఁ బాలించుచుండునపుడు స్త్రీలు వైధవ్యదుఃఖమేయెఱుఁగరైరి. దుష్టమృగములవలనిభయంబుగాని రోగభయంబుగాని యెంత

నిర్దస్యు రభవ ల్లోకో నానర్థః కంచి దస్పృశత్,
న చ స్మ వృద్ధా బాలానాం ప్రేతకార్యాణి కుర్వతే. ౯౪
సర్వం ముదిత మేవాసీ త్సర్వో ధర్మపరోఽభవత్,
రామమేవానుపశ్యన్తో నాభ్యహింస న్పరస్పరమ్. ౯౫

ఆస న్వర్షసహస్రాణి తథా పుత్రసహస్రిణః,
నిరామయా విశోకాశ్చ రామే రాజ్యం ప్రశాసతి. ౯౬

రామో రామో రామ ఇతి ప్రజానా మభవన్ కథాః,
రామభూతం జగదభూ ద్రామే రాజ్యం ప్రశాసతి. ౯౭

నిత్యపుష్పా నిత్యఫలా స్తరవ స్స్కన్ధవిస్తృతాః,
కాలే వర్షీ చ పర్జన్య స్సుఖస్పర్శశ్చ మారుతః. ౯౮

బ్రాహ్మణాః క్షత్రియా వైశ్యా శ్శూద్రా లోభవివర్జితాః,
స్వకర్మసు ప్రవర్తన్తే తుష్టాస్సైస్స్వైరేవ కర్మభిః. ౯౯

ఆస న్ప్రజా ధర్మరతా రామే శాసతి నానృతాః
సర్వే లక్షణసంపన్నాస్సర్వే ధర్మపరాయణాః. ౧౦౦
దశవర్ష సహస్రాణి దశవర్ష శతాని చ,
భ్రాతృభి స్సహితః శ్రీమాన్రామో రాజ్య మకారయత్. ౧౦౧

మాత్రము గలుగదయ్యె.		౯౩

లోకమునందు దొంగలే లేకపోయిరి. ఎవ్వరికిని ఎంతమాత్రము ఆపద గలుగదయ్యె. వృద్ధులకునుండు బాలురు మృతిఁబొందుటలేదు.		౯౪

సమస్తప్రాణికోటియుం నెప్పుడును సంతోషంబు నొందియుండెను. సమస్తజనులు ధార్మికులై యుండిరి. ఒకరిపైనొకరు వైరము వహించుటకుఁ దగిన కారణము గలిగినప్పుడుగూడ రామునిఁదలఁచి యొకరినొకరు హింసించుకొనక వైరంబు వదలియుండిరి.		౯౫

రాముఁడు రాజ్యముఁ బరిపాలించునపుడు జనులు వేయిగొడుకులు గలవారలయి యరోగదృఢగాత్రులయి పరమసంతుష్టులయి పెక్కువేలసంవత్సరంబులు జీవించిరి.		౯౬

రాముఁడు ప్రభుత్వము సేయుచునపుడు జనులు "రాముఁడు రాముఁడు రాముఁడు" అని సర్వము రామవిషయమయిన మాటలే చెప్పుచుందురు. అట్లు లోకంబున నెచ్చటఁ జూచినను సమస్తవ్యవహారంబును రామమయముగానే యుండెను.		౯౭

రాముఁడు రాజ్యపరిపాలనము సేయుచునపుడు వృక్షములు ఎల్లప్పుడును పుష్పించుచు ఎల్లప్పుడును ఫలించుచు విస్తీర్ణములయిన స్కంధములు గలిగి యుండినవి మేఘుంబులు కాలంబుదప్పక వర్షించుచుండెను. వాయువు సుఖముగా వీచుచుండెను.		౯౮

బ్రాహ్మణులు క్షత్రియులు వైశ్యులు శూద్రులు ఎంతమాత్రము లోభములేనివారలయి తమకు విహితములయిన కర్మలయందె సంతృప్తులయిన తమతమ కర్మములఁ దప్పక యనుష్ఠించుచుండిరి.		౯౯

రాముఁడు పాలించుచుండఁగా జనులు అందఱు పరమధార్మికులయి అందఱును సత్యవాదులయి అందఱును శుభలక్షణసంపన్నులయి యుండిరి.

రాముఁడు తమ్ములతోఁగూడ సమస్తైశ్వర్యసంపన్నుఁడై పదునొకండువేల సంవత్సరంబులు దొరతనము గావించెను.		౧౦౧

ధన్యం యశస్య మాయుష్యం రాజ్ఞాం చ విజయావహమ్,
ఆదికావ్య మిదం త్వార్షం పురా వాల్మీకినా కృతమ్. ౧౦౨
యః పఠే చ్ఛృణుయా ల్లోకే నరః పాపా ద్విముచ్యతే,

పుత్త్రకామస్తు పుత్త్రాన్వై ధనకామో ధనాని చ. ౧౦౩
లభతే మనుజో లోకే శ్రుత్వా రామాభిషేచనమ్,
మహీం విజయతే రాజా రిపూంశ్చాప్యధితిష్ఠతి. ౧౦౪
రాఘవేణ యథా మాతా సుమిత్రా లక్ష్మణేన చ,
భరతేనేవ కైకేయీ జీవపుత్త్రా స్తథా స్త్రియః. ౧౦౫

శ్రుత్వా రామాయణ మిదం దీర్ఘమాయుశ్చ విన్దతి,
రామస్య విజయం చైవ సర్వ మక్లిష్టకర్మణః. ౧౦౬

శృణోతి య ఇదం కావ్య మార్షం వాల్మీకినా కృతమ్,
శ్రద్దధానో జితక్రోధో దుర్గా ణ్యతితరత్యసౌ. ౧౦౭
సమాగమం ప్రవాసాన్తే లభతే చాపి బాన్ధవైః,
ప్రార్థితాంశ్చ వరాన్ సర్వా న్ప్రాప్నుయా దిహ రాఘవాత్.

శ్రవణేన సురా స్సర్వే ప్రీయన్తే సంప్రశృణ్వతామ్,
వినాయకాశ్చ శామ్యన్తి గృహే తిష్ఠన్తి యస్య వై. ౧౦౮

విజయేత మహీం రాజా ప్రవాసీ స్వస్తి మా న్వ్రజేత్,
స్త్రియో రజస్వలాః శ్రుత్వా పుత్త్రా న్సూయు రనుత్తమాన్.

పూజయంశ్చ పఠంశ్చేమ మితిహాసం పురాతనమ్,

ధనప్రదంబును యశస్కరంబును ఆయుర్వృద్ధికరంబును రాజులకు ప్రదంబును సమస్తకావ్యంబుల కన్నను ముందు వాల్మీకిమహర్షిచేఁ జేయఁబడినదియుఁ వేదార్థప్రకాశకంబును ఆదికావ్యమునైన యీరామాయణమును జదివినను విన్నను సమస్తపాపములును నశించును. ౧౦౬

శ్రీరామ పట్టాభిషేకమువఱకు ఈగ్రంథమును వినునేని కొడుకులు గోరినవానికి సత్పుత్త్రులు గలుగుదురు. ధనము గోరినవానికి ధనముగలుగును. క్షత్రియుండు వినునేని శత్రువులను జయించి భూమిం బాలించును. స్త్రీలువిందురేని రామునిం గౌసల్యయుఁ లక్ష్మణుని సుమిత్రయుఁ భరతుం గైకేయియుఁ గన్నవిధంబున దీర్ఘాయువులు గుణవంతులునగు పుత్త్రులంబడసి సుఖింతురు. ౧౦౭

ఎవ్వరికిని క్లేశము గలుగకుండునట్లు కార్యములు చేయునట్టి రాముని విజయమును బ్రతిపాదించునట్టి యీరామాయణమును విన్నవాఁడు దీర్ఘాయువుం బొందును. ౧౦౮

వాల్మీకిమహర్షిచే రచియింపఁబడిన వేదోపబృంహణంబగు నియ్యాదికావ్యంబును ఎవ్వఁడు శ్రద్ధాయుక్తుఁడై కామక్రోధంబులు వర్జించివినునో అతండు దారిద్ర్యాది సమస్తకష్టంబుల విముక్తుఁడగును. మఱియు విదేశమునకుఁ బోయిన యిష్టబంధువులతో సమాగమంబునొందును. ఈలోకంబున నె రామానుగ్రహంబునం జేసి కోరినవరముల నన్నింటినిం బ్రాపించును.

ఈరామాయణముఁ జక్కఁగావిందురేని దీనిచే సమస్తదేవతలును సంప్రీతులవుదురు. మఱియుఁ గృహంబుననుండు విఘ్నకారిభూతములును శాంతమునగును. ౧౦౯

ఈరామాయణమును విన్నయెడ రాజు భూమండలమంతయుఁ జయించును. విదేశమునొందినవాఁడు క్షేమముగా స్వస్థానముఁ జేరును. పుష్పవతులగు స్త్రీలు సర్వోత్తములగు పుత్త్రులం బడయుదురు. ౧౧౦

మనుష్యులు మొట్టమొదటఁ జేయఁబడిన యీ యితిహాసమును

సర్వపాపా త్ప్రముచ్యేత దీర్ఘ మాయు రవాప్నుయాత్. ౧౧౧

ప్రణమ్య శిరసా నిత్యం శ్రోతవ్యం క్షత్రియై ర్ద్విజాత్,
ఐశ్వర్యం పుత్రలాభశ్చ భవిష్యతి న సంశయః. ౧౧౨

రామాయణ మిదం కృత్స్నం శృణ్వతః పఠత స్సదా,
ప్రీయతే సతతం రామ స్సహి విష్ణు స్సనాతనః. ౧౧౩
ఆదిదేవో మహాబాహు ర్హరి ర్నారాయణః ప్రభుః,

కుటుమ్బవృద్ధిం ధనధాన్యవృద్ధిం
స్త్రియశ్చ ముఖ్యా స్సుఖ ముత్తమం చ. ౧౧౪
శ్రుత్వా శుభం కావ్య మిదం మహార్థం
ప్రాప్నోతి సర్వాం భువి చార్థసిద్ధిమ్,

ఆయుష్య మారోగ్యకరం యశస్యం
సౌభ్రాత్రికం బుద్ధికరం సుఖం చ. ౧౧౫
శ్రోతవ్య మేత న్నియమేన సద్భి
రాఖ్యాన మోజస్కర మృద్ధికామైః,

ఏవమేత త్పురా వృత్త మాఖ్యానం భద్రమస్తు వః. ౧౧౬
ప్రవ్యాహరత విస్రబ్ధం బలం విష్ణోః ప్రవర్ధతామ్,

దేవాశ్చ సర్వే తుష్యన్తి శ్రవణా ద్గ్రహణా త్తథా. ౧౧౭
రామాయణస్య శ్రవణా త్తుష్యన్తి పితర స్తథా,

...గించినను జదివినను వారినమస్తపాపంబులును నశించును. దీర్ఘమయిన
యాయుస్సును గలుగును. ౧౧౧

ఈ రామాయణమును క్షత్రియులు ఎల్లప్పుడు సాష్టాంగముగ
నమస్కరించి బ్రాహ్మణునివలన వినవలెను. వారలు ఐశ్వర్యంబును పుత్త్రులను
బడయుదురు. ౧౧౨

ఈ రామాయణమునంతయు నెల్లప్పుడును విన్నను జదివినను రాముండు
ప్రీతుండగును ఆ రాముండే సనాతనుండును ఆదిదేవుండును ఆజానుబాహుం
డును హరియు నారాయణుండును సర్వేశ్వరుండునగు విష్ణువే గావున నతండు
సంతోషింపఁగా నిఁక నేమి కొఱఁత? ౧౧౩

మనుజుండు మహనీయమయిన యర్థముగల శుభంబగు నిమ్మహాకావ్య
మును విను నేని యతనికి కుటుంబవృద్ధి ధనధాన్యవృద్ధి కలుగును ఉత్తమస్త్రీలు
కలుగుదురు. ఉత్తమమయిన సౌఖ్యము కలుగును. కోరినకార్యము సిద్ధించును.
భూమియందలి సమస్త విభవములుం గలుగును. ౧౧౪

ఆయుష్కరంబును ఆరోగ్యకరంబును యశస్కరంబును తోఁబుట్టు
వులకు స్నేహము వృద్ధిఁబొందించునదియుం బుద్ధిని వృద్ధిఁబొందించునదియుం
సుఖకరంబును దేజస్కరంబునగు నీపుణ్యచరిత్రమును సంపదను గోరునట్టి
సత్పురుషులు బ్రహ్మచర్యాదినియమముతో నవశ్యము వినవలెను. ౧౧౫

జనులారా! ఇట్లు ఇది ముందు జరిగిన చరిత్రము. మీకు మంగళ
మగుఁగాక దీని శ్రద్ధతోఁ బఠింపుఁడు. విష్ణువుయొక్క మాహాత్మ్యము
వృద్ధిఁ బొందుఁగాక. ౧౧౬

రామాయణంబు విన్నను దానియర్థము గ్రహించినను సమస్తదేవత
లును సంతోషింతురు. రామాయణంబును వినుటవలనఁ బితృదేవతలును
దృప్తిఁ బొందుదురు. ౧౧౭

భక్త్యా రామస్య యే చేమాం సంహితా మృషిణా కృతామ్.
లేఖయ న్తీహ చ నరా స్తేషాం వాస స్త్రివిష్టపే,

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే
వాల్మీకీయే చతుర్వింశత్సహస్రికాయాం సంహితాయాం
శ్రీయుద్ధకాణ్డే శ్రీరామపట్టాభిషేకో నామ
ఏకత్రింశదుత్తరశతతమస్సర్గః.

---

శ్రీరామచన్ద్రశ్శ్రితపారిజాతః సమస్తకల్యాణగుణాభిరామః,
సీతాముఖామ్భోరుహచఞ్చరీకో నిరన్తరం మఙ్గళమాతనోతు.

మఱియు నెవరు వాల్మీకిమహర్షి విరచితమయిన శ్రీరామదివ్యచరిత్ర ప్రతిపాదకమైన యీసంహితను భక్తితో నితరులచే వ్రాయింతురో తామును వ్రాయుదురో వారలు ఈలోకంబున సమస్తైశ్వర్య సంపన్నులయి సర్వపూజితులయి సర్వభోగంబుల ననుభవించి తుదను స్వర్గలోకంబున (వైకుంఠంబున) పునరావృత్తిరహితముగా నివసింపుచుందురు. ౧౧౮

ఇది నూటముప్పదియొకటవసర్గము.

యుద్ధకాండము సమాప్తము.

---

చెన్నపురి: 'శ్రీరామప్రెస్సు'న ముద్రితము.—1960.

# వచన గ్రంథములు

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| ఆంధ్రవచన భాగవతము, ద్వాదశస్కంధములు, శ్రీ శతఘంటము వేంకటరంగశాస్త్రికృతము, ఒకటే సంపుటము ... | 9 | 0 |
| డిటో మూడుసంపుటములు ... | 10 | 8 |
| ఆంధ్రవాఙ్మయచరిత్ర సంగ్రహము ... | 4 | 0 |
| ఆంధ్రకవిజీవితములు, శ్రీ గురుజాడ శ్రీరామమూర్తిగారిది ... | 6 | 0 |
| అరేబియన్ నైట్సుకథలు ... | 2 | 0 |
| వక్కమపూర్వకథలు ... | 2 | 8 |
| ఆంధ్రవచనభారతము, శ్రీ ఆకుండి వేంకటశాస్త్రికృతము | | |
| ,, ఆదిసభాపర్వములు ... | 5 | 0 |
| ,, అరణ్యపర్వము ... | 5 | 0 |
| ,, విరాటోద్యోగపర్వములు ... | 5 | 8 |
| ,, భీష్మద్రోణపర్వములు ... | 7 | 8 |
| ,, కర్ణశల్యసౌప్తికస్త్రీపర్వములు ... | 5 | 8 |
| ,, శాంతిపర్వము ... | 7 | 8 |
| ,, అనుశాసనికము మొదలు స్వర్గారోహణపర్వమువరకు | 7 | 8 |
| భోజకాళిదాసకథలు, I భాగము ... | 1 | 4 |
| II ,, ... | 1 | 8 |
| శ్రీమహాభక్తవిజయము, శ్రీ పాదసుబ్రహ్మణ్యశాస్త్రిగారిది ... | 12 | 0 |
| తులసీదాసురామాయణము, వచనము, శ్రీ వ. శ్రీనివాసరావు | 15 | 0 |
| ద్వాదశోపనిషత్తులు, తెనుగువచనము ... | 5 | 0 |
| తెనాలిరామలింగనికథలు, జీవితము గురుజాడ శ్రీరామమూర్తి | 0 | 8 |
| ,, A. S. P. అయ్యరుగారిది ... | 0 | 8 |
| సంగ్రహభాగవతము | 2 | 8 |
| డిటో (విద్యార్థులకై సంగ్రహింపబడినది) | 1 | 0 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

పోస్టుబాక్సు 1372, 292, ఎస్ప్లనేడ్. చెన్నపురి 1.